## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

నన్ను "నేను" చేరుకోవటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120035819

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
| --- | --- | --- | --- |
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!



మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఓజసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# శ్రీ విష్ణుధర్మోత్తర మహాపురాణం

( ప్రథమ ఖండము )

## ఆంధ్రానువాదసహితము

అనువాదకులు :

గురుశిష్యు శ్రీ కల్లూరి వేంకట సుబ్రహ్మణ్య దీక్షితులు

పరిష్కర్త :

విద్వాన్ శ్రీ జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి

వ్యాకరణ విద్యా ప్రవీణ, సాహిత్య విద్యా ప్రవీణ, వేదాంత విశారద

ఓమ్.

శ్రీ చంద్రమౌళీశ్వరాయనమః.

# శ్రీ కాంచీకామకోటి పీఠాధిపతి జగద్గురు శ్రీ శంకరాచార్యస్వామి మఠః

కాంచీపురం 631-502

## శ్రీ శ్రీ కామకోటి పీఠాధీశ్వర శ్రీ జగద్గురు శ్రీమజ్జయేంద్రసరస్వతీ శ్రీ పాదైః అనుగృహీతం శ్రీముఖమ్.

సువిదిత మేతత్ యదస్మాకం భారతీయసనాతనధర్మస్య ముఖ్యం ప్రమాణం వేదా ఇతి। వేదానామర్థం తాత్పర్యంచ సర్వేషాం కృతే ప్రతిపాదయితుం ప్రవృత్తాని ఇతిహాసపురాణాని। ఏతేషు చాస్మాకం వైదికోధర్మః అనాదిరితి ప్రతిపాద్యతే। చరిత్రసంబంధినో విషయాః బహవః ప్రతిపాదితాః పురాణేషు। ఇమే విషయాః అస్మత్పూర్వతనానాం ఆచార్యాణాం ఋషీణాంచ కౌశలం దీర్ఘదృష్టితాంచ జ్ఞాపయంతి ఇత్యత్ర న విమతిః.

అష్టాదశసంఖ్యాకాని పురాణానీత్యప్యస్తి ప్రసిద్ధిః। తేషా మేషాం పఠనేన తథా తదర్థబోధేనచ అత్రత్యా విషయాః సమ్యక్ జ్ఞాయంతే ఇత్యేవ న అపితు అస్మదీయపాతకానా మప్యున్మూలనం చ భవతీతి నిశ్చ్రపచమ్।ఏతేషాం పురాణానాం సర్వజన సాధారణతయా బోధాయ ప్రవచనం తథాఆదనీయమూలశ్లోకానాం ప్రాదేశికలిప్యాం లలితలలితసామాన్యభాషాయాం అనువాదేనసహ ప్రకటీకరణంచర్వేషామపిశ్రేయసే కలయతే। ఏతాదృశ ముత్తమోత్తమం ధార్మికం కార్యం భాగ్యనగర (హైదరాబాదు)నివాసీ భక్తాగ్రేసరః శ్రీమాన్ పి. వెంకటేశ్వర్లు **మహోదయః** స్వకీయ మనల్పం ధనం వ్యయీకృత్య కరోతీ త్యేతస్మిన్ కార్యే శ్రీకల్లూరి వెంకట సుబ్రహ్మణ్యదీక్షితాః శ్రీజంధ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రిణః ఇత్యాదయః పండితాః భాగం వహంతీతిచ జ్ఞాత్వా అతీవ మోదామహే వయమ్.

ఏవమేవాయం వెంకటేశ్వర్లు మహాభాగః ఇతరాణ్యపి మహాపురాణాని అచిరేణకాలేన ప్రకటీకృత్య శ్రేయోభాగ్భవతు. తథా ఏతేషాం పురాణానాం పఠనేన తదర్థపరిజ్ఞానేనచ సర్వేఽప్యాంధ్రమహాజనాః కృతకృత్యాః పుణ్యభాజశ్చ భవేయు రిత్యాశాస్మహే.

ఇతి నారాయణస్మృతిః.

శ్రీః

# శ్రీ విష్ణుధర్మోత్తరమహాపురాణ సమర్పణ పంచరత్నమ్

శ్రీమదిత్యాదిబిరుదావళీ విరాజమాన శ్రీకామాక్షీసమేత శ్రీమదేకామ్రనాథ శ్రీకాంచీక్షేత్రే
శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య శ్రీజగద్గురు శ్రీమచ్ఛఙ్కరభగవత్పాదాచార్యాణాం
అధిష్ఠానే సింహాసనాభిషిక్త శ్రీమచ్చంద్రశేఖరేన్ద్రసరస్వతీసంయమీన్ద్రాణాం శ్రీకరకమలసంజాత
శ్రీజయేన్ద్రసరస్వతీ శ్రీపాదానాం శ్రీకరకమల సంజాత శ్రీశ్రీశ్రీ శంకర విజయేంద్రసరస్వతీ
శ్రీచరణానాం కర కమలయోః సాష్టాంగప్రణామపూర్వకం సమర్ప్యతే
శ్రీవిష్ణుధర్మోత్తరమహాపురాణసంస్కృతమూలాస్మదాంధ్రానువాదగ్రంథరూపోఽయంపూజారత్నపుష్పోపహారః.

శ్రీ శంకర విజయేంద్ర శ్రీ చరణేభ్యః సమర్ప్యతే భక్త్యా
విష్ణుపురాణం ధర్మోత్తర మిద మాంధ్ర్యా మనూదితం మూలేన.

శ్రీ కాంచీ కామకోటి పీఠమునధిష్ఠించి యున్న శ్రీ శంకరవిజయేంద్రసరస్వతీ శ్రీ చరణుల కీ విష్ణుపురాణ ధర్మోత్తరఖండ మాంధ్రీకరింపబడి, సంస్కృత మూలముతో సమర్పింప బడుచున్నది.

శ్రీ మచ్చంద్ర కిశోరశేఖరయతీంద్రాజ్ఞాప్రసాదశ్రియా
సాక్షాత్ శ్రీశుకతాతపాదమధురోక్తి స్ఫూర్తి సౌందర్యయా
వాణ్యా మాతు రనూదితం మమ పున ర్ముద్రాపితం కేనచి
ద్ధన్యేనాపి పురాణ సత్రయజనే దృష్టం సదస్యై రపి ॥

శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ జగద్గురుదేవుల ఆజ్ఞాప్రసాద సంపదగొని శ్రీ శుకాచార్యులంగన్న తండ్రి వ్యాసభగవానుల మధుర భాషణ స్ఫూర్తిచే సొంపుగులుకు మా తల్లిబాస తెలుగులోని కనువదింపబడినది. ఒకానొక ధన్య మూర్తిచే ముద్రింపబడినది అష్టాదశ మహా పురాణాంధ్రీ కరణ ప్రచురణరూపమైన యీ సత్రయాగమందలి సదస్యులచే దిలకింపబడినది యీ మహాగ్రంధము.

శ్రీ చంద్రశేఖరేంద్రైః పరమాచార్యై స్తథా నిజాచార్యైః
శ్రీమద్విశ్వ జయేంద్రై రిద మాలక్షిత మహో! శ్రియా జయతి

మీ పరమాచార్యులు శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ జగద్గురు దేవుల చేతను మీ యాచార్యులు శ్రీ జయేంద్ర సరస్వతీ శ్రీ చరణులచేతను ఈ కృతి చక్కగా నాలోకింపబడి పరమ శోభతో సర్వోన్నతమై యలరుచున్నది.

కైశోరే వయసి స్ఫురత్ శ్రుతిమహామాత్రా ముహుశ్చుంబనాత్
విస్మేరద్యుతిసుందర స్మితమధుస్యందాత్ శుకస్యేవ యత్
ఆచార్యైః పరమైః కరే సరసిజే సంలాలితం వోముఖం
దృష్ట్వా వత్సలితం తరంగిత మభూత్ శ్రీవ్యాసవాణ్యా మనః ॥

లేతవయస్సున శ్రుతిమాత మఱి మఱి ముద్దు వెట్టుకొనుట వలన విరజిమ్మ తళుకులచే సొంపు గులుకు చిఱునవ్వులను తేనెలంజిందించుచు శ్రీ శుకముఖ మట్లలరుచున్నదియు పరమాచార్యులకరకమలములందు పలాలిత మగుచున్నదియునగు మీముఖముంగని వ్యాసభారతిమనసు వాత్సల్య రసోత్తరంగితమైనది.

తాదృక్ తే ముఖ మాదిశంకరగురుశ్రీమన్ముఖం జ్ఞాపయ
త్యానీతం, తవ సమ్ముఖే తత ఇదం భాష్యే ప్రమాణీకృతమ్
ప్రాధాన్యేన; కృతం త్వదంకిత మహో! విష్ణోః పురాణం ప్రభో!
హస్తే స్వీకురు నః కృతాం ప్రణతిమ ప్యంబాపదేఽలంకురు!

అటువంటి మీ ముఖము ఆది శంకర భగవత్పూజ్య పాదుల కేవల బ్రహ్మ తేజస్సును జిందు నెమ్మోమును మాకు జ్ఞాపకము సేయుచున్నది. కావున వారిచే భాష్యమందు ప్రధానముగా ప్రమాణముగా గైకొనబడిన యీ విష్ణు పురాణము గొనివచ్చి మీకంకిత మొసర్చుచున్నాము. ఈకృతి తామందుకొని దీనిని, మాయొనర్చుప్రణతి నింగూడ జగజ్జనని శ్రీ చంద్రమౌళీశ్వరులదేవి శ్రీమత్త్రిపురసుందరీదేవి పదమునం దలంకరింపుడు! శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

క్రోధన-శ్రావణపూర్ణిమా శుక్రవారే 23-8-1985

ఇతి గురుశిశుః కల్లూరి వేంకటసుబ్రహ్మణ్య దీక్షితః

శ్రీః

# ధర్మము - వేదము - పురాణము

ధర్మో విశ్వస్య జగతః ప్రతిష్ఠాహేతురుచ్యతే । ధర్మ ఏవ. హతో హన్తి ధర్మోరక్షతి రక్షితః ॥

సమస్త జగత్తునకు స్థితిహేతువు ధర్మము. ధర్మమును పాటించిన వాని నది కవచము వలె రక్షించును. ఉల్లంఘించిన వానిని నశింపజేయును. కావున ధర్మరక్షణ ద్వారా జగద్రక్షణము కావించుకొనుట మానవధర్మము. ధరింప బడినదై మనలను ధరించు (కాపాడు) దానికేధర్మమని పేరు సార్థకము. అట్టి ధర్మము వేదైకసమధిగమ్యము. వేదము శబ్ద రూపము.సమస్త వాఙ్మయ ప్రపంచమునకు మూల మదియే.

ఇద మంధం జగత్ సర్వం జాయేత భువనత్రయం । యది శబ్దాహ్వయం జ్యోతిః ఆసంసారం నవర్తతే ॥

శబ్ద రూపమగు ఆ జ్యోతి సృష్టికి పూర్వము నుండియు లేనిచో ఈ ప్రపంచమంతయు అంధప్రాయమై యుండెడిదని దండి మహాకవి చెప్పినాడు.

యో బ్రహ్మాణం విదధాతి పూర్వం, యోవై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై ॥

అను శ్వేతాశ్వతరోపనిషద్వాక్యము వలన— నిత్యసిద్ధములైన వేదములను పరమేశ్వరుడు బ్రహ్మకు నుపదేశించినట్లు తెలియుచున్నది.

" అనాది నిధనా నిత్యా వాగుత్సృష్టా స్వయంభువా । అదౌ వేదమయీ దివ్యా యతస్సర్వాః ప్రవృత్తయః ॥ "

అను స్మృతి వాక్యము వలన, సమస్త వాఙ్మయోత్పత్తికి కారణమైనదియు ఆద్యంత శూన్యమును నిత్యమును వేదరూపమునునగు దివ్యవాక్కును సృష్టికి ఆదియందు స్వయంభువ బ్రహ్మఆవిష్కరించెను. ఆతడు వేదములకు కర్త మాత్రము కాడు అని తెలియుచున్నది.

"ఋగ్యజు స్సామాథర్వాఖ్యాన్ వేదాదీన్ ముఖతో ఽ సృజత్ ।

శాస్త్ర మిజ్యాం స్తుతిస్తోమం ప్రాయశ్చిత్తం వ్యధాత్ క్రమాత్ ॥

ఆయుర్వేదం ధనుర్వేదం గాంధర్వం వేద మాత్మనః । స్థాపత్యం చా ఽ సృజద్వేదం క్రమాత్ పూర్వాదిభి ర్ముఖైః ॥

ఇతిహాస పురాణాని పంచమం వేద మీశ్వరః । సర్వేభ్య ఏవ వక్త్రేభ్యః ససృజే సర్వదర్శనః ॥

అను శ్రీమద్భాగవత తృతీయస్కంధ గత వచనము వలన గూడ వేదా విర్భావము ఆబ్రహ్మనుండియే జరిగినట్లు తెల్లమగుచున్నది.

"అస్య మహతో భూతస్య నిశ్వసిత మేతత్ యత్ ఋగ్వేదో యజుర్వే దస్సామవేదః" అను శ్రుతియు పై విషయమునే బలపరచుచున్నది.

## వేదము

విశ్వనిశ్శ్రేయస కారణమును ఇతర ప్రమాణవేద్యముకానిదియునగు ధర్మమును బోధించు అపౌరుషేయ వాక్యమునకు వేదమని పేరు. ఆ వేదము మంత్రబ్రాహ్మణభేదమున రెండు భాగములుగానున్నది. అందు మంత్ర భాగము, అనుష్ఠాన సాధనములగు ద్రవ్యములను, దేవతలను బోధించును.

వేదము, ఋగ్వేదము యజుర్వేదము, సామవేదము, అధర్వణ వేదము అని నాలుగు విధములు. ఆ వేదముల పరిమితి పతంజలి భగవానునిచే వ్యాకరణ మహా భాష్యము నందు ఇట్లు చెప్పబడినది.

"ఏకశత మధ్వర్యు (యజుః) శాఖాః, సహస్రవర్త్మా సామ వేదః, ఏక వింశతిధా బాహ్వృచ్యమ్(ఋగ్వేదః) నవధా ఆధర్వణో వేదః ।" 'అని, కాని యిపుడీ శాఖలలోకొన్నిలుప్త ప్రాయములు.

బ్రాహ్మణము అష్టవిధములు — "ఇతిహాసః, పురాణం, విద్యా, ఉపనిషదః, శ్లోకాః, సూత్రాణి, వ్యాఖ్యానాని, అను వ్యాఖ్యానాని అస్యైవనిశ్వసితాని" అని బృహదారణ్యక శ్రుతి తెలుపు చున్నది.

## పు రా ణ ము

బ్రాహ్మణాంతర్గతముగ వక్కాణింపబడిన పురాణము, ప్రపంచము యొక్క పూర్వా ఒ వస్థా ప్రతి పాదకము, వేదార్థ నిరూపకమును నై కరుణాపయోనిధియు సాక్షాన్నారాయణ రూపుడును నగు వేదవ్యాస భగవానునిచే ప్రణీతము నునై పంచ లక్షణ శాస్త్రముగను దశలక్షణ శాస్త్రముగను పేరొందినది.

" యస్మాత్ పురాహ్యనక్తీదం పురాణం తేన తత్ స్మృతమ్ "

అని బ్రహ్మాండ పురాణము నందు ప్రక్రియా పాదమునందు పురాణ శబ్ద నిర్వచనము గలదు.

సహోవాచ ఋగ్వేదం భగవో ఒ ధ్యేమి యజుర్వేదం । సామ వేద మాధర్వణం చతుర్థ, మితిహాస పురాణం పంచమం దేవానాం వేదమితి" అను ఛాందోగ్యశ్రుతిననుసరించి పురాణములు వేదాత్మకములనుటకు సంశయము లేదు.

"ప్రవృత్తి స్సర్వశాస్త్రాణాం పురాణా దభవ త్తతః । కాలేనాఒగ్రహణం దృష్ట్వా పురాణస్య మహామతిః ।
హరి ర్వ్యాస స్వరూపేణ జాయతేచ యుగే యుగే । చతుర్లక్ష ప్రమాణేన ద్వాపరే ద్వాపరే సదా ।
త దష్టాదశధా కృత్వా భూతలే నిర్దిశత్యపి ॥

అను బృహన్నారదీయోక్తి వలన ఏకరూపముననున్న పురాణమునే సాక్షాన్నారాయణుడు వేద వ్యాసరూపమున ఆవిర్భవించి పదునెనిమిది పదునెనిమిది గా విభజించెననియు అందువలన మహా పురాణములు 18,ఉప పురాణములు 18 యేర్పడెననియు తెలియుచున్నది. ఇందు కొన్ని మాత్రమే ఉప లబ్ధము లగుచున్నవి.

## విష్ణు పురాణము

అష్టాదశ మహా పురాణములలో విష్ణుపురాణము మహోత్కృష్టమైనది. ఇది షడంశాత్మకముగనలరారుచున్నది.ఇందు 6412శ్లోకములుగలవు. విష్ణుపారమ్య మిందు వర్ణితము ఇది ఆంధ్రభాషలోనికి అనూదితమై మూలతాత్పర్యములతో ముద్రితమైశ్రీ కాంచీకామకోటి జగద్గురు శంకరాచార్య స్వామి చరణుల కరకమలములందంచితమై భాగ్యనగరస్థ శ్రీవేంకటేశ్వర ఆర్షభారతీ సంస్థచే ఆంధ్ర జనలోకమునకు నిదివరలోనే నందజేయ బడినది.

## విష్ణు ధర్మోత్తర మహా పురాణము

విష్ణు పురాణమే విష్ణుధర్మోత్తర మహా పురాణమను పేరునమరిఖండత్రయ రూపమున నున్నది. అందీ ఖండము ప్రథమము. ఈ ఖండమునందు 269 అధ్యాయములు ద్వితీయఖండమున 183 అధ్యాయములు తృతీయ ఖండమున 355 అధ్యాయములు కలవు.

ప్రథమ ఖండమునందు సృష్టికి ప్రారంభ మందలిబ్రహ్మ యొక్క జననము మొదలుకొని అనేక వంశములు, వ్రతాదులు గాయత్రి మహా మంత్ర ప్రభావము, ఉపాఖ్యానములు, శంకర గీత, నారాయణ కవచము మునులచే నిత్యాను సంధేయ విషయములు మిక్కుటముగ గలవు.

ఈ పురాణమును గురించి నారదీయ మహా పురాణము నందు

**అతః పరస్తు** సూతేన శౌనకాదిభి రాదరాత్ । పృష్టేన చోదితాః శశ్వ ద్విష్ణు ధర్మోత్త రాహ్వయాః ।

నానాధర్మ కథాః పుణ్యాః వ్రతాని నియమా యమాః । ధర్మశాస్త్రం చార్థశాస్త్రం వేదాంతం జ్యోతిషం తథా ।
వంశాఖ్యానం ప్రకరణాః స్తోత్రాణి మనవస్తథా । నానా విద్యాశ్రయాః ప్రోక్తాః సర్వలోకోపకారకాః ।
ఏత ద్విష్ణు పురాణంవై సర్వ శాస్త్రార్థ సంగ్రహమ్॥

అనిప్రశంస గలదు. అనగా శౌనకాది మునులు ఆదరముతో నడుగగా సూత మహర్షి విష్ణు ధర్మోత్తరములను పేరుగల అనేక ధర్మబోధకములగు కథలు పవిత్రములైన కథలు, వ్రతములు, నియమములు, యమములు, ధర్మశాస్త్రము, అర్థ శాస్త్రము, వేదాంతము, జ్యోతిషము, వంశముల కీర్తించుట, ప్రకరణములు, స్తోత్రములు, మనువుల చరిత్ర అనేక విద్యలకు సంబంధించినవి, సర్వలోకములకు ఉపకరించునట్టి విషయములననేకములను చెప్పెను. ఈవిష్ణుపురాణము సర్వ శాస్త్రార్థ సంగ్రహరూపమైనది.

ధర్మ ప్రధానమగు నిట్టి శ్రీ విష్ణుధర్మోత్తర మహాపురాణమును శ్రీ కాంచీపట్టణ విరాజమాన శ్రీ కామకోటి పీఠాధిప శ్రీ శ్రీ శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ మహాస్వామి కరకమల సంజాత శ్రీ శ్రీ శ్రీ జయేంద్ర సరస్వతీ స్వామి హస్త పద్మసంజాత శ్రీ శ్రీ శ్రీ శంకర విజయేంద్ర సరస్వతీ నవ్య శ్రీ చరణ కరకమలములందు సప్రశ్రయముగను సాంజలి బంధముగను సమర్పించు మహాభాగ్యము శ్రీ సద్గురుదేవుల గురు కృపవలన చేకూరి నందులకు నెంతయు సంతసించు చున్నాము.

శ్రీ కాంచీ కామకోటి పీఠ జగద్గురువుల యొక్కయు శ్రీ శృంగేరీ శారదా పీఠ జగద్గురువుల యొక్కయు అమోఘాశీస్సులతో భాగ్యనగరమున శ్రీ పల్లెంపాటి వేంకటేశ్వర్లు గారిచే వ్యవస్థాపితమైన శ్రీ వేంకటేశ్వర ఆర్షభారతీ ట్రస్టు వారు ఇట్టి మహోత్కృష్ట గ్రంథములను ఆంధ్ర సోదరుల కరకమలములకు అందింప గల్గినందులకు లోకకళ్యాణ మిక్కిలిఆనందించుచున్నారు. ప్రతి ఆంధ్రుడును వీనిని చదివి దానివలనకలిగిన విజ్ఞానమును ఆచరణలో నుంచుకొని సంధాయకులగుచు మా కృషిని సార్థకము చేయుదురుగాక !

ఇతిశమ్
బుధ విధేయః

విద్వాన్ జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి
వ్యాకరణ విద్యా ప్రవీణః, సాహిత్య విద్యాప్రవీణః, వేదాంత విశారదః

# నక్షత్ర స్వరూప శాంతి, హోమ,

| నక్షత్రములు. | లింగములు. | రాసులు. | మహాదశలు. | సవ్యాపసవ్యములు | త్యాజ్యములు | బాలారిష్టములు. | నక్షత్రాధిపతులు. | గుణితులు. | గణములు. | నక్షత్రశాంతికి స్నానద్రవ్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అశ్వి | పు | మే 4 | కే | స | 50 | అశ్వి | అశ్వనీ దేవతలు | గుఱ్ఱపు మొగము 3. | దేవ | తేనె నాగగన్నేరు మదయంతి (మల్లి) అశ్వగంధ |
| భ | స్త్రీ | మే 4 | శు | స | 24 | భ | యమ | యోని 3. | మనుష్య | సురాహ్వకాష్టము దేవదారువస పసుపు |
| కృ | ,, | మే1; వృ3. | ర | స | 30. | కృ | అగ్ని | మంగలికత్తి 6. | రాక్షస | మర్రిరావి తిరిశినఆకులు నువ్వులు |
| రో | ,, | వృ 4 | చం | అ | 40 | రో | బ్రహ్మ | రథము 5. | మ | నవధాన్యములు |
| మృ | న | వృ 2; మి 4 | కు | అ | 14 | మృ | చంద్ర | మృగము తల 3. | దేవ | నవరత్నములు |
| ఆర్ద్ర | స్త్రీ | మి 4 | రా | అ | 21 | .... | శివ | పగడాకారము 1. | మ | మంగళాగురు(గంధ)తెల్ల గరిక కాడ |
| పున | పు | మి 3; క 1 | గు | స | 30 | .... | అదితి | ధనురాకారము 5. | దేవ | గోశాలలోని మన్ను |
| పుష్య | పు | క 4 | శ | స | 20 | పుష్య | బృహ | పువ్వు 3. | దేవ | ఔషధులు (మూలికలు) పంచగవ్యము |
| ఆశ్లే | స్త్రీ | క 4 | బు | స | 32 | .... | సర్ప | సర్పము 6. | రా | పుట్ట మన్ను |
| మఘ | ,, | సిం 4 | కే | అ | 30 | మ | పితృ | పాలకి 5. | రా | నువ్వులు దేప నిర్మాల్యము |
| పుబ్బ | ,, | సిం 4 | శు | అ | 20 | .... | భగుడు | | మ | శ్యాద్వలము పచ్చగడ్డి ఉప్పు నెయి |
| ఉత్త | ,, | సిం 1; క 3 | ర | అ | 18 | ఉ | అర్యముడు | మంచపు కోళ్ళు 4. | మ | కొర్రలు ప్రియంగువు |
| హ | పు | క 4 | చం | స | 21 | హ | రవి | అఱచేయి 5. | దేవ | కొండమీదనున్న సరస్సులోని మన్ను |
| చిత్త | స్త్రీ | క 2; తు 2 | కు | స | 20 | చి | ఇంద్ర | చేప 1. | రా | దేవనిర్మాల్యము |
| స్వా | ,, | తు 4 | రా | స | 14 | .... | వాయువు | మాణిక్యం 1. | దేవ | సీటిలోనిపూవులు తామరపూవు మొ॥ |
| విశాఖ | ,, | తు 3; వృ 1 | గు | అ | 14 | వి | ఇంద్రాగ్నులు | కుమ్మరసారె 5. | రా | రౌద్రము (రుద్రజడ) చందనము |
| అనూ | పు | వృ 4 | శ | అ | 10 | అ | మిత్రుడు | కామవలె 3, గొడు | దేవ | నదికి రెండువైపులనున్న మన్ను |
| జ్యేష్ఠ | స్త్రీ | వృ 4 | బు | అ | 14 | జ్యే | దేవేంద్రుడు | గువలె 3. | రా | బంగారము |
| మూల | న | ధ 4 | కే | స | 56 | మూ | రాక్షసుడు | అంకుశము 6. | రా | అన్నిరకముల దుంపలు |
| పూ | స్త్రీ | ధ 4 | శు | స | 24 | .... | గంగ | విరిగిన మంచు | మ | ముత్యాలు |
| ఉ | ,, | ధ 1; మ 3 | ర | స | 20 | ఉషా | విశ్వేదేవులు | కోళ్ళు 4. | | మంచిగంధము చెంగల్వకోష్ఠు వట్టివేళ్ళు |
| అభి | పు | మ 4 | చం | అ | 10 | .... | విష్ణు | వేణునాదము 3. | మ | నదీసంగమ జలము |
| శ్ర | స్త్రీ | మ 2; కుం 2 | కు | అ | 10 | ధ | అష్టవసులు | మద్దెల 4. | దేవ | |
| ధ | న | కుం 4 | రా | అ | 18 | శ | వరుణ | పట్టణప్రాకారము | రా | నదులలో దిగుడుబావులలో నీరు |
| శత | | | | | | | | 100 | రా | శ్రీవాసకము అనగా సరళదేవదారు |
| పూ | పు | కుం 3; మీ 1 | గు | స | 16 | .... | అజైకపాద | | మ | కొడిశపాల పురుహూంతము |
| ఉ | పు | మీ 4 | శ | స | 24 | ఉ | అహిర్బుధ్న్యుడు | విరియైన మంచపు కోళ్ళు 4 | మ | చెంగల్వకోష్ఠు వట్టివేళ్ళు చందనము- దర్భమూలములతోడిసీరు మ్రానిపసుపు |
| రే | స్త్రీ | మీ 4 | బు | స | 30 | .... | పూషుడు | చేప 3 (32) | దేవ | కస్తూరిపసుపు |

# నైవేద్య, దక్షిణాది వివరణ పథకము

| హోమద్రవ్యాలు 101 అధ్యాయము 102అధ్యా. | దక్షిణలు 103 అధ్యాయము. | పానీయములు | శాంతిమంత్రములు |
|---|---|---|---|
| పాలుగల చెట్ల సమిథలు | గుజ్జము | మేకపాలు | ప్రయాదమ్ |
| తేనెకలిపిన నువ్వులు | ధేనువు | మాంస రసము | యమోదాధార పృథివీమ్ |
| ఆవునెయ్యి | బంగారము | గంధోదకము | అగ్నిర్మూర్ధా |
| నవధాన్యాలు | నవధాన్యములు | సౌవీరము | ప్రజాపతే నత్వదేతా- |
| పాయసము | పాలిచ్చేఆవు | పాలు | మధువాతా |
| తేనె | ఎద్దు | ఖర్జూ రానవము | మృడానోరుద్ర |
| బియ్యము | శుభ్రవస్త్రము | బెల్లపుకల్లు (గౌడము) | సుత్రామాణం |
| పాయసము | బంగారము నెయ్యి | పాలు | తపస్త్రుం శ్రియా |
| ఔషధులు | బంగారు కొమ్ములతోకూడిన ఎద్దు | పాలు | నమో అస్తుసర్పేభ్యో |
| నువ్వులు బియ్యం | నువ్వులు | పాలు | అహం పితౄన్ |
| కొర్రలు | అష్టగంములు | గంధోదకము | సదాసుగ |
| పెరుగు | బంగారము | గంధోదకము | ఏతేఅర్యమన్ |
| పాయసము | బంగారము ఏనుగు | గంధోదకము | శాంతిమంత్రములు |
| నేతితోకూడిన అక్షతలు | ఎద్దు | పాలు | సావిత్రీ |
| యావకము | చిమ్మరము | ద్రాక్షరసము | య ఇ మే |
| అలచందలు (మసూరములు) | ఎద్దు | కాంజికము (పులికడుగు) | వాయురగ్నే |
| శెనగలు | వస్త్రములు | మజ్జిగ | ఇంద్రాగ్నే రోచనా |
| ఔషధులు | బంగారము | పెరుగు | మిత్రోజనాన్ ఇంద్రసత్రామా |
| శాలి అనగా తెల్లధాన్యము | దుంపలు పండ్లు | కొబ్బరి నీళ్ళు | యంతేదేవీనిర్ ఋతిమ్ |
| పాలు పాయసము | పెరుగు కుండలు | మధూదకము (తేనెనీళ్ళు) | శంనో అపః |
| మణులు బియ్యంకలిపి | బండి మేక | ఖర్జూర రసము | విశ్వేదేవ బ్రహ్మజజ్ఞానం |
| మర్రి మేడిపండ్లు | అన్నము | మామిడిపండ్ల రసము | వషత్రేవిష్ణో |
| నీళ్ల పువ్వులు అక్షతలు | బండి | నేరేడుపండ్ల రసము | ఆమే గ్రహో భవతి |
| నెయ్యి తేనె పెరుగు కుంకుమపువ్వు | చందనపు కర్ర | ఇప్పకల్లు (మధూదకము) | ఇమంమే వరుణ |
| పచ్చకర్పూరం | మేక | రసము | ఉపప్రాగా |
| వ్రీహి ధాన్యములు | | | |
| పండ్లు అఖండలు | అన్నము | రసము | ఆహరివేతి |
| | గోవు ఈ దక్షిణ దవ్యములు లభింపనిచో ప్రతినిధిగా దూడలతో కంచుపాత్రలతోగోవునీవలెను. | మేకపాలు | |

# విషయానుక్రమణిక

శ్రీరస్తు

శ్రీ గణేశాయనమః     శ్రీ మాత్రేనమః     శ్రీ గురుభ్యోన

# శ్రీ విష్ణుధర్మోత్తర మహాపురాణము

## ఒకటవ అధ్యాయము

## మార్కండేయ వజ్ర సంవాదము

నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమమ్ । దేవీం సరస్వతీం వ్యాసం తతో జయముదీరయేత్ ॥ 1

కృతవర్మా తథా భోజః శ్వేతో మాహిష్మతీ పతిః । కులిన్ద స్సర్వదమనో మాలవి శ్చంద్ర వర్ధనః ॥ 2

వత్స నాథశ్చ బాణశ్చ నందీశో దరసత్పతిః । ప్రతిసార శ్చిత్రధను స్సర్వో వాయురథ స్తథా ॥ 3

ద్రవిడః కుసుమాపీడ ఔత్రశ్చ సమరప్రియః । శంభుః కిరాతరాజశ్చ ఔరసోనందివర్ధనః ॥ 4

పటుమూలశ్చ తూనేశ శ్శాల్వశ్చ జనమేజయః । సుహ్మరాజో దధికర్ణో బాహ్లీకో దమన స్తథా ॥ 5

హిరణ్యనాభః కౌసల్యో దాశార్హో విజయ స్తథా । ఏతే చాన్యేచ రాజాన శ్శతశో బహుదక్షిణాః ॥ 6

సంపూర్ణ చంద్రవదనా గజరాజ కరోరవః । ఉపాసాంచక్రిరే వజ్రం సింహాసనగతా నృపాః ॥ 7

బహుభిర్భూమిపాలైశ్చ తథా వజ్రేణ ధీమతా । యుధిష్ఠిరేణచ సదా శోభితా శుశుభే సభా ॥ 8

రాజాన స్తే తతో దృష్ట్వా ఋషీన్ దుర్లభ దర్శనాన్ । బ్రహ్మలోకస్థ మాత్మాన మమన్యంత యశోభృతః ॥ 9

ఊచు స్తే ప్రణయా ద్వాక్యం వజ్రం భూరి సహస్రదమ్ ।
యథా త్రేతాయుగే రాజన్ ! ద్వాపరే చ యథా నృపాః ॥ 10

అస్మిన్ తిష్యే చ సంప్రాప్తే తవ రాజన్ ! ప్రసాదతః । రాజన్ ! కృష్ణసగోత్రోఽసి తేనేయం తే సభా నృప! 11

ఉపాస్యతే మహాభాగైః బ్రహ్మర్షిభి స్తపోధనైః । స తథా వీర్య నిర్జితా ॥ 12

భుక్తా యథా తు తస్యైవ కృష్ణస్యామిత తేజసః । తేన కృష్ణేన తే చక్రుః వ్యతీతాః పూర్వపార్థివాః ॥ 13

వర్తతా తేన కృష్ణేన తే రాజన్ ! మోక్ష మాప్నుయుః । అయం తిష్యయుగః ప్రాప్తో ఘోరః పరమ దారుణః ॥ 14

దుర్లభం దర్శనం యత్ర నృప సంఘే మహాత్మనామ్ ॥ 15
తస్మాత్త్వం రాజశార్దూల ! ప్రష్టుమర్హో ద్విజోత్తమాన్ ।
వైష్ణవాన్ వివిధాన్ ధర్మాన్ సరహస్యాన్ ససంగ్రహాన్ ॥ 16

ఇత్యేవ ముక్తో వజ్రస్తైః త్యక్త్వా సింహాసనం తదా । వజ్రంతు ప్రాంజలిం దృష్ట్వా సర్వ ఏవ నరాధిపాః ॥ 17
వరాసనాన్ విహాయాశు తస్థుః ప్రాంజలయ స్తదా ॥

వజ్ర ఉవాచ :

భవద్భిః నృపశార్దూలాః ప్రార్థితా యే ద్విజాః శ్రితాః ॥ 18

అనుగ్రహార్థం భూపానాం జగతో హితకామ్యయా । భవంతో వక్తు మర్హన్తి విష్ణుధర్మాన్ సనాతనాన్ ॥ 19

వజ్ర ఉవాచ :

ఆచక్ష్వ మహ్యం భృగువంశ చంద్ర ! సముద్భవం త్వం జగతో యథావత్ ।

శృణ్వంత్వి మే బ్రాహ్మణసంఘముఖ్యాః నరేంద్ర ముఖ్యాశ్చ వచ స్త్వదీయమ్ ॥ 28

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే కథాప్రస్తావనా నామ ప్రథమోఽధ్యాయః.

రాజా ! నీ యాసనము నీవలంకరింపుము. మేమును నావిషయము శ్రవణముసేయగోరుచున్నాము. నీ సంశయము లన్నిటిని నీమహాముని వారింపగలడు. అని వారు మార్కండేయ మహర్షినిగని 'లోకముల పాపములను హరించు వివిధ వైష్ణవ ధర్మములను ఈరాజునకు నీరాజసంఘమునకును ఆనతిచ్చి వీరి సంశయనివారణము సేయుమన మార్కండేయుడిట్లు తెలుపదొడంగెను: ఓ వజ్రేశ్వరా! నీవు బ్రహ్మణ్యుడవు-సత్యసంధుడవు-ధన్యుడవు-సర్వశత్రు సంహర్తవు. కావున నీవేదియడిగెద వది నిస్సంశయముగ నేను జెప్పెదను. నీ సింహాసన మీవధిష్ఠింపుము. ఈరాజులందరును సుఖోపవిష్టులగుదురుగాక ! నీ సందేహములడుగు మన యదుముఖ్యుడైన వజ్రుడు ఆ భృగుప్రవరునికి ప్రణామములు గావించి రత్నసింహాసనముపై కూర్చుండెను. రాజులును ఆసనముల నలంకరించిరి. ఆ విప్రముఖ్యుని వచనములాలింప వారు ప్రవణులైరి. అప్పుడు వజ్రుడు ఓ భృగువంశచంద్రా! ఈజగత్తు ఎట్లు పుట్టినదో దెలుపుము. ఈ బ్రాహ్మణసంఘము రాజసమాజము నీవచనము లాలింతురు. అనియె.

ఇది విష్ణుధర్మోత్తరమహాపురాణము-ప్రథమఖండమునందు మార్కండేయ వజ్రసంవాదమందు కథాప్రస్తావనము ప్రథమాధ్యాయము

# రెండవ అధ్యాయము

## హిరణ్య గర్భోత్పత్తి

మార్కండేయ ఉవాచ :

నారాయణం నమస్కృత్య సర్వభూత పరాయణమ్ । లక్ష్మీసహాయం వరదం శేషపర్యంక శాయినమ్ ॥ 1

జగతోఽస్య సముత్పత్తి స్థితి నాశైక కారణమ్ । జ్ఞాన జ్ఞేయం జ్ఞాన గమ్యం హృది సర్వస్య సంస్థితమ్ ॥ 2

వక్ష్యామి జగతాం రాజన్ ! సముత్పత్తిం నిబోధ తామ్ । సర్వపాప ప్రశమనీ మాయుష్యాం స్వర్గదాంశివామ్ ॥ 3

నారాయణోఽస్య జగతః సృష్టిసంహార పాలనమ్ । కరోతి జగతీపాల ! యస్య సర్వమిదం మహాన్ ॥ 4

వేదేషు గీయతే యోఽసౌ పురుషః పంచవింశకః । అనాదినిధనో ధాతా త్వనంతః పురుషోత్తమః ॥ 5

యస్యోన్మేష స్తుదివసో బ్రహ్మణః పరమేష్ఠినః । నిమేష స్తు తథా రాత్రిః తచ్చ కల్పం ప్రకీర్తితమ్ ॥ 6

పురుషత్వే త్వనంతస్య నరూపం నృప ! విద్యతే । నచశబ్దో నచ ఘ్రాణః స్పర్శోవా పృథివీపతే ! 7

నతస్యపరిమాణంవా నచాదిర్నిధనం కుతః । సర్వతః పాణిపాదాంతః సర్వతోఽక్షి శిరోముఖః ॥ 8

సర్వతశ్శ్రుతిమాన్లోకే సర్వమావృత్యతిష్ఠతి । సర్వేంద్రియ గుణాభాసం సర్వేంద్రియ వివర్జితమ్ ॥ 9

అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృచ । తం చప్రాప్య భవన్తీహ యే ముక్తాః పురుషోత్తమాః ॥ 10

సుగతిర్యోగ సిద్ధానాం తస్మాత్సర్వస్య సంభవః । తస్మాద్భవతి చావ్యక్త స్తస్మాదాత్మాపి జాయతే ॥ 11

తస్మాద్బుద్ధిర్మన స్తస్మాత్ తతఃఖంపవన స్తతః । తస్మాత్తేజ స్తత స్త్వాప స్తేభ్యోఽణ్ణమభవత్కిల ! 12

అండోహిరణ్మయో రాజన్ ! తస్యాంత స్స్వయమేవహి । శరీర గ్రహణం పూర్వం సృష్ట్యర్థంకురుతే ప్రభుః ॥ 13
బ్రహ్మ చతుర్ముఖోదేవో రజో మాత్రాధికస్సదా । శరీర గ్రహణం కృత్వా సృజతీదం చరాచరమ్ ॥ 14
అండస్యాంతర్జగత్సర్వం సదేవాసుర మానుషమ్ । సప్తలోకాన్ సపాతాళాన్ సప్తద్వీపార్ణవాం మహీమ్ ॥ 15
సృష్టిం కృత్వా సభగవాన్ సాత్వికీ మాస్థిత స్తనూమ్ । క్షీరోదే కేశవో భూత్వా శేషభోగమయఃప్రభుః 16
లక్ష్మీసహాయో లోకాం స్తు సర్వాన్ పాలయతేసదా । యోగనిద్రాం సమాస్థాయ సర్వసత్త్వ శరీరగః ॥ 17
శుభాశుభాని కర్మాణి సర్వేషాం సహి పశ్యతి । అంతకాలే హరో భూత్వాజగత్ సంహరతేపునః ॥ 18
తామసీం తనుమాస్థాయ లీలయైవ మహాయశాః । బ్రహ్మతో సృష్టికాలేతు జలమధ్య గతాం మహీమ్ ।
దృష్ట్వోద్ధరతి యజ్ఞాత్మావారాహీ మాస్థిత స్తనూమ్ ॥ 19
బ్రహ్మస్యసర్గే పరిపాలనేచ విష్ణుర్మహాత్మా భవతీహనిత్యమ్ ।
సంహారకాలేచ హరత్వమేతి త్రైధం విధత్తేస త్రికాలయోగాత్ ॥ 20

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమ ఖండే మార్కండేయ వజ్రసంవాదే హిరణ్యగర్భోత్పత్తి
కథనం నామ ద్వితీయోఽధ్యాయః

మార్కండేయుడనియె : సర్వభూతాశ్రయుడు లక్ష్మీసమేతుండు వరదుడు శేషతల్పశాయి ఈ జగత్తుయొక్క సృష్టికి స్థితికి లయమునకు నేకైక కారణము జ్ఞానముచే నెఱుగదగువాడు పొందదగువాడును సర్వ హృదయములందుడువాడునగు నారాయణునికి నమస్కరించి జగమ్ముల పుట్టుక నెఱింగించెద. సర్వ పాపప్రశమనము ఆయురారోగ్యప్రదము స్వర్గప్రదము మంగళము నైన యీ జగదుత్పత్తింగూర్చి వినుము. ఈ జగత్తుయొక్క సృష్టిని పాలనమును సంహారమును నారాయణుడు సేయును. ఈయన పంచవింశకుడైన పురుషుడని వేదములు కీర్తించును. ఈతడు ఆదియు అంతములేని పురుషోత్తముడు. ఈయన కనువిప్పు బ్రహ్మకు పగలు. కనుమూత రాత్రి. దానినే కల్పమందురు. అయ్యనంతుడు పురుషుడైన తఱి రూపములేదు. శబ్దస్పర్శాదులు లేవు. కాలు సేతులు కన్నులు తల ముఖము చెవియులేవు. సర్వము నావరించియున్నది. సర్వేంద్రియ గుణములను భాసింపచేయును. అయినను సర్వేంద్రియ రహితుడు అసక్తుడై సర్వము భరించును. అగుణుడై గుణానుభవము పొందును. అట్టి పురుషునిం బొందినవారు ముక్తులగుదురు. సర్వసిద్ధ పురుషులకును అతడు పరమగతి. అతనివలన సర్వము సంభవించును. ఆ పురుషునినుండి అవ్యక్తము దానినుండి ఆత్మ దానినుండి (హిరణ్యగర్భరూపము) బుద్ధి దానినుండి మనస్సు దానినుండి ఆకాశము (ఖము) దానినుండి వాయువు దానినుండి తేజస్సు దానినుండి జలములు అందుండి అండముం బుట్టినవి. ఆయండము హిరణ్మయము (సువర్ణమయము). ఆప్రభువు దానియందు దనకుదాను సృష్టికొరకు శరీర గ్రహణముసేయును. అట్లుచేసి బ్రహ్మ చతుర్ముఖుడు ననుపేర రజోగుణమాత్రాధికుడై యీ చరాచరమును సృజించును. ఈ అండములోపల దేవాసుర మానుష సహితమైన సర్వప్రపంచమున్నది. సప్త పాతాళములతో సప్తలోకముల సప్తద్వీపసముద్రములతోడి భూమిని సృజించి యా భగవంతుడు (సాత్త్వికి) సత్వగుణ ప్రధానమైన శరీరముం దాల్చి పాలసముద్రమందలి కేశవుడై (          ) శేషుని పడగలందు లక్ష్మీసహాయుడై యుండి యెల్లలోకముల బాలించును. యోగనిద్రంగొని సర్వజంతు శరీరములందుండి యందఱు చేయు శుభాశుభ కర్మములను జూచుచుండును. అంతసమయమున హరుడై తమోగుణ మయమైన యుపాధింబూని లీలామాత్రముగ జగత్సంహారము చేయును. సృష్టికాలమందు ఈ పరబ్రహ్మ మూర్తి జలమధ్యమందున్న భూమిని యజ్ఞవరాహ మూర్తియై యుద్ధరించును. సృష్టియందు బ్రహ్మ-పరిపాలనమందు విష్ణువు-లయమందు హరుడునై త్రికాలములందు త్రేధా స్వరూపమును ధరించును.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తరమహాపురాణము-ప్రథమఖండమున హిరణ్యగర్భోత్పత్తియను రెండవ యధ్యాయము.

# మూడవ అధ్యాయము

## యజ్ఞవరాహప్రాదుర్భావము

మార్కండేయ ఉవాచ :

బ్రహ్మరాత్ర్యాం వ్యతీతాయాం విబుద్ధే పద్మసంభవే । విష్ణుస్సిసృక్షు ర్భూతానాం జ్ఞాత్వాభూమిం జలాంతగామ్ 1
జలక్రీడారుచి శుభం కల్పాదిషు యథాపురా । వారాహ మా శ్రితో రూప ముజ్జహార వసుంధరామ్ ॥ 2
వేదపా ద్యూప దంష్ట్రశ్చ చతుర్వక్త్ర శ్చతుర్ముఖః । అగ్నిజిహ్వో దర్భరోమా బ్రహ్మశీర్షో మహాతపాః ॥ 3
అహోరాత్రేక్షణోదివ్యో వేదాంగశ్రుతిభూషణః । ఆజ్యనాస స్స్రువతుండ స్సామఘోష స్వనోమహాన్ ॥ 4
ధర్మస్సత్యమహాః శ్రీమాన్ కర్మవిక్రమ సత్కృతః । ప్రాయశ్చిత్తమయోధీరః ప్రాంశుజాను ర్మహాయశాః।
ఉద్గాత్రాంత్రో హోమలింగః ఫలబీజ మహౌషధిః ॥ 5
వాయ్వంతరాత్మా మంత్రాస్థి ర్వికటస్సోమశోణితః । వేదస్కంధో హవిర్గంధోహవ్య కవ్యాతివేగవాన్ ॥ 6
ప్రాగ్వంశ కాయో ద్యుతిమాన్ నానాదీక్షాభి రన్వితః । దక్షిణా హృదయో యోగీ మహాక్రతు మయోమహాన్ ॥ 7
ఉపాకర్మేష్టిరుచిరః ప్రవర్గ్యావ ర్తభూషణః । ఛాయా పత్నీ సహాయోవై మహాశృంగఇవోదితామ్ ॥ 8
మహీం సాగర పర్యంతాం సశైలవనకాననామ్ । ఏకార్ణవజలభ్రష్టా మేకార్ణవ గతః ప్రభుః 9
దంష్ట్రాగ్రేణ సముద్ధృత్య లోకానాం హిత కామ్యయా । ఆది దేవో మహాయోగీ చకారజగతీం పునః ॥ 10
ఏవంజ్ఞాత్వా వరాహేణ భూత్వాభూత హితార్థినా । ఉద్ధృతా పృథివీదేవీ జలమధ్యగతాపురా ॥ 11
ఉద్ధృత్య భూమిం సవిభుర్మహాత్మా వరాహరూపేణ జలాంతరస్థామ్ ।
చక్రే విభాగం జగత స్తదీశో యథాయథా తచ్ఛృణు రాజసింహ ! 12

ఇతి శ్రీవిష్ణు ధర్మోత్తరే ప్రథమ ఖండే మార్కండేయ వజ్ర సంవాదే వరాహప్రాదుర్భావోనామ
తృతీయోఽధ్యాయః.

మార్కండేయుడనియె : బ్రహ్మకు రాత్రిగడువ నాతడుమేల్కొనస విష్ణువు భూతసృష్టిగావింప నీటనున్న భూమినుద్ధరించుట కింతముందట్లు కల్పాదియందు జలక్రీడారతుడై వారాహ రూపముధరించి యాధరణి నుద్ధరించెను. అత్తఱి నాతని పాదములునాల్గు నాల్గువేదములు. యూపస్తంభములు కోరలు. నాల్గుముఖములు నలుమోములవాడు (బ్రహ్మ). అగ్నినాలుక. రోమములు దర్భలు. మహాతపస్వి బ్రహ్మశిరస్సు. అహోరాత్రములు నేత్రములు. వేదాంగములు కర్ణభూషణములు. ఆజ్యము (నెయ్యి). ముక్కు. స్రువము తుండము (ముట్టె). సామఘోషము స్వనము (ధ్వని). ఘర్మము (చెమట) సత్యతేజస్సు. కర్మ విక్రమము (అడుగులు పెట్టుట-నడకయన్నమాట) ప్రాయశ్చిత్తమయుడు ఉన్నతజానువులు గలవాడు (జానువు = మోకాళ్లు) ఉద్గాత ప్రేవులు హోమము లింగము. ఓషధులు ఫలబీజములు (వృషణములు) : అంతరాత్మ వాయువు మంత్రములు అస్థులు. సోమము రక్తము వేదములు మూపులు హవిస్సు గంధము (వాసన) హవ్యకవ్యములు వేగములు. ప్రాగ్వంశము నానావిధదీక్షా సహితమయి తేజరిల్లు శరీరము. దక్షిణ హృదయము. యజ్ఞస్వరూపుడైన యోగి యీవరాహమూర్తి. ఉపాకర్మ- ఇష్టి యాయనతళుకులు. ప్రవర్గ్యే నుడులు. ఛాయ పత్ని. పెద్దకొమ్మున నో యుదయించిన భూమిని పర్వతములతో వనములతో నున్న దానిని లోకహితముగోరి యే కార్ణవ జలములందు మునిగిన దానినెత్తి అయ్యాదిదేవుడు మహాయోగి యీ జగతిని రూపొందించెను. భూతహితార్థియై యిట్లెత్తి యీభూమిని విభాగమొనరించెను. ఆయొనరించిన తీరువినుము.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తరమహాపురాణము-ప్రథమ ఖండమున యజ్ఞవరాహప్రాదుర్భావమనుమూడవ యధ్యాయము.

# నాల్గవ అధ్యాయము

## పాతాళ వర్ణనము

మార్కండేయ ఉవాచ :

జాలాంతరగతే భానౌ యత్ సూక్ష్మం దృశ్యతే రజః। ప్రథమంతత్ ప్రమాణానాం త్రసరేణుం ప్రచక్షతే ॥ 1
త్రసరేణవోఽష్టౌ విజ్ఞేయా లిక్షికా పరిమాణతః । తా రాజసర్షపా స్తిస్రస్తా స్త్రయో గౌరసర్షపాః ॥ 2
సర్షపాః షడ్యవో మధ్యే అంగుళం చ తదష్టకమ్। ద్వాదశాంగుళక శ్శంకు స్తద్ద్వయం హస్త ఉచ్యతే ॥ 3
తచ్చతుష్కంధనుః ప్రోక్తం క్రోశోధనుస్సహస్రికా । క్రోశద్వయంచ గవ్యూతిః యోజనం తచ్చతుష్టయమ్॥ 4
యోజనానాం ప్రమాణేన చాయుతానాం శతత్రయమ్। అయుతానాం చ పంచాశ చ్ఛేషస్థానం మనోహరమ్ ॥ 5
స ఏవలోకే వారాహః కథితశ్చ స్వయం ప్రభుః । వారాహరూపీ భగవాన్ శతరూప ధర స్తథా ॥ 6
తత్రాఽఽస్తే భగవాన్ విష్ణు ర్భక్తైస్సహ మహాత్మభిః ।
లోకోఽయ మండ సంలగ్న శ్ఛత్రాకారః ప్రకీర్తితః ॥ 7
స్వయం ప్రభుర్వీతరజా స్సర్వ దుఃఖ వివర్జితః । ఏకాన్తభావో పగతా స్తం ప్రయాన్తి హరింజనాః ॥ 8
సర్వాధస్తా దయంలోకః కథిత స్తే మనోహరః । తస్యోపరిష్టా దవర స్తావదేవ ప్రమాణతః ॥ 9
కాలాగ్నిరుద్రలోక స్తు కథ్యతేఽగ్ని సమావృతః । ఏక ఏవ స తత్రాస్తే స్వప్రభా భాస్వరాత్మకః ॥ 10
తస్మాత్ సముత్థితో వహ్నిర్జగత్ప్రాప్తే దినక్షయే । భస్మసాత్ కురుతే సర్వం యచ్చేంగం యచ్చ నేంగతే॥ 11
తస్యోపరిష్టాదపర స్తావదేవ ప్రమాణతః । పాతాళనామా పాతాలః ప్రథమః పరికీర్తితః ॥ 12
యోగమాయాం సమాస్థాయ ద్వితీయా మాస్థిత స్తనుమ్। సర్వతో భగవానాస్తే శేషమూర్తి ర్జనార్దనః ॥ 13
రుక్మభౌమ స్స పాతాలో ధృతో రుద్రస్య తేజసా । తస్మిన్ స భగవానాస్తే శేష పర్యంక మాస్థితః ॥ 14
నిత్యం తాలధ్వజో వాగ్మీ వనమాలా విభూషితః। ధారయన్ శిరసానిత్యం రత్నచిత్రాం ఫణావళీమ్ ॥ 15
లాంగలీ ముసలీ ఖడ్గీనీలాంబర విభూషితః । స్తూయమాన స్స గంధర్వై ర్వాగ్మైర్ ఋషివరై స్తథా ॥ 16

మార్కండేయుడనియె :- సూర్యుడు కిటికీరంధ్రమునుండి ప్రకాశించునపుడు సుసూక్ష్మమైన రజస్సు (పరాగము) కనిపించును. ఆపరాగలేశము త్రసరేణువు. అది కొలతలకు మొదటిది. 8 త్రసరేణువులు = ఒక లిక్ష. 3 లిక్షలు = ఒక రాజ సర్షపము, 3 రాజసర్షపములు = ఒక గౌర సర్షపము. 6 గౌరసర్షపములు = ఒక యవ, 8 యవలు = ఒక అంగుళము, 12 అంగుళములు = శంకువు. 2 శంకులు = ఒక హస్తము (మూర), 4 హస్తములు = ధనుస్సు, వేయి ధనుస్సులు = ఒక క్రోశము, 2 క్రోశములు = 1 గవ్యూతి, 4 గవ్యూతులు = ఒక యోజనము, 800వేల యోజనములు = శేషస్థానము. అది చాల రమ్యమైనది. ఆ శేషస్థానమునకే వారాహమని లోకవ్యవహారము. ఆ వరాహమూర్తి భగవంతుడు నూరురూపముల దాల్చి భక్త మహాశయులగూడి యా పాతాళమందున్నాడు. ఈలోకము అండముతోగూడి గొడుగున్నట్లున్నది. అక్కడ రజోగుణరహితుడు సర్వదుఃఖహరుడు హరి ఏకాంతభావమును బొంది స్వయముగా ప్రభువై వసించుచున్నాడు. ఆ ప్రభువు దగ్గరకు జనులేగుదురు. ఈలోకము సర్వలోకముల కడుగున నున్నది. చాల సుందరమైనది. నీకిది యెరింగించితిని. దానికిమీద యదే కొలతలో మరియొక లోకము గలదు. కాలాగ్నిరుద్రలోకమని యది పిలువబడును. అది అగ్నిచే నావరింపబడును. అక్కడ స్వప్రభలచే వెలుంగుచు నొక్కడే (యగ్ని) యున్నాడు. ఆయన నుండి లేచిన యగ్ని దినక్షయమందు (బ్రహ్మకల్పమందు) చరాచర

జగత్తును భస్మము సేయును. అది జంగమము (కదలిక) చైతన్యము (అది తాను జంగమునందదు) తాను దేనికిని కదలదు యన్ని టిని గదలించును. ఆ అగ్నికి మీద యదే ప్రమాణమున పాతాళమను పేర ప్రథమ పాతాళమున్నది. అక్కడనే యోగమాయ నాధారము సేసికొని భగవంతుడు విష్ణువు ద్వితీయ శరీరముగొని శేషమూర్తియై యున్నాడు. ఆ పాతాళము స్వర్ణభూమి. రుద్ర తేజముచే నది ధరింపబడును. దానియందు భగవంతుడు శేషపర్యంకమందున్నాడు. ఆయన తాళధ్వజుడు (తాడి చెట్టు జెండా గుర్తు గలవాడు) మంచి పక్త. పద్మమాల ధరించును. రత్నాలచే రంగురంగులీను పడగలను తలందాల్చును. ఆయన చేతిలో నాగలి రోకలి కత్తియు నుండును. అతడు నీలాంబరధారి. గంధర్వులు నాగులు ఋషీశ్వరులు నాయనను స్తుతించుచుందురు.

తస్యోపరిష్టాదపర స్తావదేవ ప్రమాణతః । సుతల సంజ్ఞః పాతాల శ్శిలాభాస స్సమంతతః ॥ 17
బలి స్తు భగవాన్ తత్ర బహి స్తిష్ఠతి సంయతః । రమ్యం పురవరం తస్య విష్ణునా నిర్మితం స్వయమ్ ॥ 18
నివాసం దేవరాజస్య విశిష్టం తత్పురోత్తమమ్ । సా వైష్ణవీ కలా ప్రోక్తా యయేదం ధార్యతే జగత్ ॥ 19
ఫణేషు తస్య విశ్రాంతా మిలితా చ శుభాఽశుభా । తత్రాస్తే స మహాభాగ శ్శ్రియా పరమయాయుతః ॥ 20
తముపాసన్తి సతతం గంధర్వాప్సరసాంగణాః । తత్రాస్తే దేవదేవస్య మూర్తిః కృష్ణస్య చాపరా ॥ 21
తస్యోపరిష్టా దపర స్తావదేవ ప్రమాణతః । ఆభాసతల ఇత్యేవ పాతాలో నీలమృత్తికః ॥ 22
తృతీయ స్సతు విఖ్యాత స్సురభిర్యత్ర తిష్ఠతి । దిగ్ధేనవ స్తథా తత్ర చతస్రశ్చ తథా స్థితాః॥ 23
సుభద్రా వహ్ని రూపాచ విశ్వరూపా తథైవచ । రోహిణీ చ మహాభాగా యాభిర్వ్యాప్త మిదం జగత్ ॥ 24
తాసాం క్షీరేణ సర్వాసాం వృతః క్షీరార్ణవః ప్రభో । పాతాల మధ్యే తస్మింస్తు పురం విష్ణోర్మనోరమమ్ ॥ 25
యత్రాస్తే భగవాన్ విష్ణుః శేషపర్యంకగ స్సదా । అగ్నిజ్వాలా పరిక్షిప్త స్సహాలక్ష్మ్యా పరంతప ॥ 26
తస్యోపరిష్టాదపర స్తావదేవ ప్రమాణతః । పీత భౌమ శ్చతుర్థస్తు గభస్తితల సంజ్ఞితః ॥ 27
తత్రాస్తే భగవాన్ విష్ణుర్దేవో హయ శిరోధరః । శశాంక శత సంకాశ శ్శాతకుంభ విభూషణః ॥ 28
పురంతత్రైవ విఖ్యాతం గరుడస్య మహాత్మనః (ప్రహ్లాద స్యాసురేంద్రస్య బాష్కలేశ్చ మహాత్మనః ॥) 29
తస్యోపరిష్టాదపర స్తావదేవ ప్రమాణతః । మహాతలేతి విఖ్యాతో రక్త భౌమస్తు పంచమః ॥ 30
సరోవరం తస్యమధ్యే యోజనానాం దశాయుతం । జంగమా జంగమై స్సర్వై ర్జలజైశ్చ వివర్జితమ్ ॥ 31
తత్రా రూపేణ వసతి కూర్మరూపధరో హరిః । తస్యోపరిష్టాదపర స్తావదేవ ప్రమాణతః ॥ 32
షష్ఠశ్చైవ మహారాజ ! నామ్నా శ్రీమతలస్తుసః । తత్రాపి సరసీ దివ్యా యోజనానాం శతం గతా ॥
తస్యాం చ వసతే దేవో మత్స్యరూప ధరో హరిః ॥ 33
సప్తమః కృష్ణభౌమస్తునామ్నాశ్రీమతలస్తుసః । తత్రాస్తే కపిలో దేవః వాసుదేవస్స్వయంప్రభుః ॥ 34
తత్రాశ్మనగరం నామవరుణస్యపురం స్మృతమ్ । తథాదానవవీరాణాంనగరాణి పృథక్ పృథక్ ॥ 35
విరోచనస్య కుంభస్య నికుంభస్య హరస్యచ । శంబరస్య కరాలస్య నరకస్య హయస్యచ ॥ 36
హయగ్రీవస్య సుందస్య ఘనస్య ప్రఘనస్యచ । బలేఃపురవరం చాత్రయోగీశస్య తథాపరమ్ ॥ 37
యత్రస్థమేనం దదృశే రావణో లోకరావణః । తథాపురవరం తత్రవిష్ణో రమిత తేజసః ॥ 38

ఆయనకుమీద యదేప్రమాణములో సుతలమను పాతాళమున్నది. అది యంతట శిలారూపము. దాని వెలుపల భగవంతుడు బలి నియమితుడై వసించును. ఆయన రాజధానినక్కడ విష్ణువు స్వయముగ నిర్మించెను. ఆ పురము చాలగొప్పది. ఆయన నివాసము. ఈజగత్తు ధరించు నాశక్తి వైష్ణవీకళయే. ఆ కళ యా శేషుని పడగలమీద విశ్రమించియున్నది. అది శుభాశుభ మిలితము. అక్కడ శ్రీ శక్తితో నామహానుభావుడు విష్ణువున్నాడు. గంధర్వాప్సరోగణము లాతనిని నిరంతర

ముపాసించుచుందురు. అక్కడ దేవదేవుడగు కృష్ణునియొక్క మరియొక మూర్తి యున్నది. దానికిమీద నదే ప్రమాణములో ఆభాసతలమను పాతాళలోకము నల్లని మృత్తికతో నున్నది. అక్కడ సురభి (కామధేనువు) ఉన్నది. అది మూడవ పాతాళము. అక్కడ నాల్గు దిగ్ధేనువులు (నాల్గు దిశలందు నాల్గావులు) గలవు అవి సుభద్ర వహా రూప విశ్వరూప రోహిణి యను పేరుగలవి. వానితో జగమెల్లయా[illegible]పబడి యున్నది. వాని పాదచే[illegible] లపమున్నమే[illegible]ది. [illegible] పాతాళము నడుమ విష్ణుపురము చాల చక్కనిదున్నది శేషపర్యంకమందక్కడ విష్ణువున్నాడు. ఆయన అగ్నిజ్వాలలచే నావరింపబడియుండును. లక్ష్మి యాయనతో నుండును. దానికిమీద నదే ప్రమాణమున పసుపుపచ్చని రంగుతో భూమియున్నది. అది నాల్గవ పాతాళము. గభస్తితలమని దానికి పేరు. అక్కడ విష్ణుభగవానుడు హయగ్రీవమూర్తియై యున్నాడు. నూరు చంద్రబింబములట్లు దీపించును. మేలిమి బంగారు భూషణముల ధరించును. అక్కడనే గరుడుని పురము ప్రసిద్ధమైయున్నది. (అసురేంద్రుడు బాష్కలి యను నామాంతరముగ) మహానుభావుడు ప్రహ్లాదుని యొక్క రాజధాని యచి. దానికిమీద నదే ప్రమాణములో మహాతలమను ప్రసిద్ధిగల ఎఱ్ఱని ప్రదేశమున్నది. అది యైదవ పాతాళము. దాని నడుమను నూఱువేల యోజనముల వైశాల్యముగల సరోవరమున్నది. స్థావరజంగమభూతము లక్కడ లేవు. అందు తామరపూవులుండవు. అక్కడ కూర్మమూర్తి హరి రూపము లేకుండ వసించును. దానికిమీద నదే ప్రమాణమున శ్రీమతలమను నాఱవ పాతాళమున్నది. అక్కడగూడ దివ్య సరస్సు నూరు యోజనముల వైశాల్యమున నున్నది. అందులో మత్స్యమూర్తియై హరి యున్నాడు. అది నల్లని భూమితో శ్రీమతలము అను నేడవ పాతాళము. అందు కపిలావతారమూర్తి వాసుదేవుడున్నాడు. అక్కడ వరుణుని రాజధాని యశ్మనగరమను పేర నున్నది. అక్కడ దానవీరుల నగరములు వేరవేరనున్నవి. ఆ వీరులు విరోచనుడు కుంభుడు నికుంభుడు మురుడు శంబరుడు కరాలుడు నరకుడు హయుడు హయగ్రీవుడు సుందుడు ఘనుడు ప్రఘసుడు నమవాడు. యోగీశ్వరుడగు బలియొక్క నగరమిక్కడ నున్నది. లోకరావణుడు (లోకముల నేడిపించినవాడు) రావణుడిక్కడనున్న బలిని దర్శించెను.

లక్ష్మీసహాయో యత్రాస్తే చాగ్న్యేయాంబర సంవృతః ।
తిస్రః కోట్యస్తు యత్రాస్య భక్తానాం సుమహాత్మనామ్ ॥ 39
శంఖచక్ర గదా పద్మ ధారిణాం పీతవాససామ్ ॥ 40
నీలోత్పల సువర్ణానాం విష్ణోస్సదృశ తేజసామ్ । విష్ణో స్సుతానాం దృష్టానాం సతతం భూరి వర్చసామ్ ॥ 41
తత్రస్థో దృష్టవాన్ దేవో పౌలస్త్యో రావణః పురా । పురీ భోగవతీ తత్ర తథా వాసుకి పాలితా ॥ 42
నాగానాంచ పురాణ్యత్ర తథైవచ పృథక్ పృథక్ । పద్మస్య ధృతరాష్ట్రస్య విరక్తస్య కురోస్తథా ॥ 43
తక్షకస్యైల పుత్రస్య తథా కర్కోటకస్యచ । ధనంజయస్య శంఖస్య తథైవాశ్వతరస్యచ ॥ 44
కందలస్య సురాసస్య సుముఖస్య గయస్యచ । దిశాం గజానాంచ తథా తత్రస్థానం పృథక్ పృథక్ ॥ 45
యేషాం స్కంధగతా భూమిః సశైల వనకాననా । విరూపాక్షస్య నాగస్య మహాపద్మస్య చాప్యథ ॥ 46
తథా సుమనస శ్చాత్ర రుద్రస్యచ మహాత్మనః । పంచాయుత పరీమాణా భూమి స్సర్వేషు పార్థివ ! ॥ 47
పాతాలేషు వినిర్దిష్టా పతితాంతర వర్తినీ । అండస్యార్ధ మిదం ప్రోక్తం అధస్తాత్తు ప్రమాణతః ॥ 48
తిస్రః కోట్యస్తు రాజేంద్ర ! నియుతాని తథా దశ । పంచాన్యాని మహీపాల ! భూమి పృష్ఠ్యా మహానఘ ! 49
పంచాయుత పరీమాణాః పుష్టిర్భూమేః ప్రకీర్తితా । భూమే రధోపరిష్టాచ్చ అండస్యార్ధ మథాపరమ్ ॥
ఏతావ దేవ నిర్దిష్టా భూమిపాల ! ప్రమాణతః । 50
చంద్రార్కభాసారహితం నృవీర ! స్వయం ప్రభేదం కథితం మయైతత్ ।
పాతాలపూగం వివిధ సురమ్యం। శృణుష్వలోకాః గదతో మమాన్యాః ॥ 51

ఇతి శ్రీవిష్ణు ధర్మోత్తరే-ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే పాతాళవర్ణనం నామ చతుర్థోఽధ్యాయః.

అక్కడ లక్ష్మీసమేతుడైన విష్ణువుయొక్క పురమున్నది. అది యగ్నిమయమైన యాకాశముచే నావరింపబడియున్నది. మహానుభావులు మూడుకోట్లమంది విష్ణుభక్తులు (వైష్ణవులు) శంఖచక్రగదాపద్మధారులు పీతాంబరులు విష్ణువువలె నీలోత్పలశరీరులు విష్ణువు కుమారులు మహావర్చస్వులు అక్కడ నెల్లపుడు వసింతురు. పులస్త్యబ్రహ్మకుమారుడు రావణు డక్కడ గనబడినాడు. వాసుకి పాలనలోనున్న భోగవతి యను పురమక్కడనున్నది. పద్ముడు ధృతరాష్ట్రుడు విరక్తుడు కురుపు తక్షకుడు ఏలపుత్రుడు కర్కోటకుడు ధనంజయుడు శంఖుడు అశ్వతరుడు కంబలుడు సురానుడు సుముఖుడు గయుడు ననువారి స్థానములు వేర్వేర నక్కడ గలవు. దిగ్గజములకు వేర్వేర నక్కడ స్థానములున్నవి. విరూపాక్షుడు నాగుడు మహాపద్ముడు సుమనుడు రుద్రుడునను వారి మూపులందు సశైలవనకాననయైన భూమియున్నది. అది యేబదివేల యోజనముల విశాలమైన మహాభూమి. బ్రహ్మాండ కటాహముయొక్క క్రింది సగభాగమిది మూడుకోట్లపదునైదు నియుతముల ప్రమాణముగలది. అక్కడ సూర్యచంద్రుల కాంతి ప్రసారముండదు. ఇది పాతాళముల యొక్క వివిధమయి సురమ్యమైన ప్రదేశము తెల్పితిని. ఇకమీద నితర లోకములంగూర్చి చెప్పెద నాలింపుము.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తరమహాపురాణమున ప్రథమ ఖండమున పాతాళవర్ణనము అను నాల్గవ యధ్యాయము.

# ఐదవ అధ్యాయము

## లోకవర్ణనము

మార్కండేయ ఉవాచ :

భూలోకః ప్రథమో రాజన్! శృణుష్వగదతో మమ। పాతాలేనతు తత్తుల్యమూర్ధ్వతః పరికీర్తితః ॥ 1
వాయుస్కంధా వినిర్దిష్టాస్తేతు సప్తమహాత్మభిః। ఏకైకం నియుతాః పంచ యోజనానాం ప్రకీర్తితమ్ ॥ 2
పశవః పక్షిణః కీటాః మనుష్యాః కిన్నరా స్తథా। యక్షరాక్షస గంధర్వాః పిశాచాః భూమిగోచరాః ॥ 3
సర్వ ఏతే వినిర్దిష్టాః అన్నాదా భూమిగోచరాః। విద్యాధరాణాం ప్రథమం వాయుమార్గః ప్రకీర్తితః ॥ 4
ద్వితీయః సిద్ధ విద్యానాం తృతీయస్తు గరుత్మతామ్। చతుర్థో వాయుమార్గస్తు గంధర్వాణాం ప్రకీర్తితః ॥ 5
వినాయకాః పంచమగాః షష్ఠేచ కరిణాం గణాః। యేషాం శీకర తోయేన చావశ్యాయః ప్రకీర్తితః ॥ 6
సప్తమేచ మహాభాగ! సిద్ధాస్తిష్ఠన్తి యాదవ!। తస్యోపరిష్టాదపరః తావదేవ ప్రమాణతః ॥ 7
భువర్లోక ఇతి ఖ్యాతో యత్ర తిష్ఠన్తి దేవతాః। మన్వంతరాధికారేషు యే భవిష్యా మహీపతే! ॥ 8
తస్యోపరిష్టా దపర స్తావదేవ ప్రమాణతః। స్వర్లోకో వసతిర్యత్ర ప్రాయశః పుణ్యకర్మణాం ॥ 9
సోమపానాంచ దేవానాం శక్రాదీనాం మహీపతే। మహర్లోకః స్థితిర్యత్ర దేవతానాం మహాత్మనామ్ ॥ 10

మార్కండేయుడనియె : భూలోకము మొదటిది. అది పాతాళమునకు పైన అదే ప్రమాణములో నున్నది. ఈలోకమునకు వాయుస్కంధములు (అరలు) ఏడు గలవని మహాత్ములు చెప్పినారు. ఒక్కొక్కదాని ప్రమాణము పదిలక్షల యోజనములు. ఇందు గనిపించు జీవులు పశువులు పక్షులు కీటకములు మనుష్యులు కిన్నరులు యక్షులు రక్కసులు గంధర్వులు పిశాచులు ఈ భూతములన్నియు నన్నాదములు. (అన్నముందినునవి). మొదటి వాయుమార్గము విద్యాధరులది. రెండవయర సిద్ధవిద్యులది. మూడవది గరుత్మంతులది. నాల్గవది గంధర్వులది. అయిదవది వినాయకులది. ఆరవది గజగణములది. ఆ ఏనుగుల తొండము నుండి వెడలు తుంపురులే మంచు అని పిలువబడును. ఏడవది సిద్ధులది. ఆ భూలోకమునకు మీద యదే కొలతలో భువర్లోక

మున్నది. అందు దేవతలున్నారు. వారు మన్వంతరాధికారులు కాబోవుదురు. దానికిమీద యదే ప్రమాణములో స్వర్లోకమున్నది. ఇందు తరచుగ పుణ్యకర్ములు నివసింతురు. సోమపీథులు ఇంద్రాదిదేవతలు తమ తమ అధికార సమాప్తియందు సిద్ధులై మహర్లోకమందుందురు.

వినివృత్తాధికారాణాం సిద్ధానాం నృప సత్తమ ! । తస్యోపరిష్టాదపరస్తావదేవ ప్రమాణతః ॥ 11
జనలోకస్థితిర్యత్ర గవాం పార్థివ సత్తమ । తిష్ఠన్తి బ్రహ్మణో రాత్ర్యాం యత్ర జీవాస్సమంతతః ॥ 12
తస్యోపరిష్టాదపర స్తావదేవ ప్రమాణతః । తపోలోకః స్థితిర్యత్ర ప్రాణేశానాం మహాత్మనాం ॥ 13
తస్యోపరిష్టాదపర స్తావదేవ ప్రమాణతః । సత్యలోకః స్థితిర్యత్ర బ్రహ్మణః పరమేష్ఠినః ॥ 14
ఇత్యేతే కథితాః సప్తవలోకా మహాత్మనాం । ఏతావానేవ సవితు ర్విచరన్తి మరీచయః ॥ 15
ఏతేషులోక సంజ్ఞోక్తా తస్మాదేవ మనీషిభిః । తస్యోపరిష్టాదపర స్తావదేవ ప్రమాణతః ॥ 16
స్థానం రుద్రస్య కథితం రుద్రతేజో విరాజితమ్ । బ్రహ్మలోకో పరిష్టాత్తు రుద్రలోకో మహత్తమః ॥ 17
యోజనానాం సహస్రాణి పంచభిర్విస్తృతం మతమ్ । ఆదిత్య మందిరం ప్రోక్తం యదేతద్దివి దృశ్యతే ॥ 18
యదేత ద్దృశ్యతే నీలం తమస్తత్ పృథివీపతే ! । తమసస్తు పరేపారే రుద్రలోక స్స్వయం ప్రభో ! ॥ 19
రుద్రత్వం సమనుప్రాప్తై స్తత్రభక్తైర్మహీనఘ ! । క్రీడన్నాస్తే మహాదేవః సపత్నీకో వృషధ్వజః ॥ 20
తస్యోపరిష్టాదపర స్తావదేవ ప్రమాణతః । అగమ్య స్సర్వదేవానాం విష్ణులోకః ప్రకీర్తితః ॥ 21
తస్యో పరిష్టాత్ బ్రహ్మాండః కాంచనో దీప్తి సంయుతః । భువర్లోకేతు వసతి ర్మహర్లోకే ప్రకీర్తితా ॥ 22
స్వర్లోకే వసతిర్విష్ణో ర్వైకుంఠస్య మహాత్మనః । నృవరాహస్య వసతి ర్మహర్లోకే ప్రకీర్తితా ॥ 23

ఆమహర్లోకము మీద నదేప్రమాణమున జనలోకమున్నది' అది గోవులుండు స్థానము. బ్రహ్మ యొక్క రాత్రియందక్కడ జీవులుందురు. దానిమీద యదే ప్రమాణములో తపోలోకముగలదు. అక్కడ మహాత్ములు ప్రాణాధీశ్వరులుందురు. ఆమీదిది సత్యలోకము. పరమేష్ఠియగు బ్రహ్మ యక్కడనుండును. ఈ యేడులోకములు నూర్ధ్వలోకములు. ఇంతవరకు సూర్యరశ్మి ప్రసారముండును. అందువలననే వీనికి లోకములను పేరువచ్చినది, ఆమీద నదే కొలతలో రుద్రలోకమున్నది. అది రుద్రతేజోమయము. బ్రహ్మలోకమునకది పైది. అది యైదువేల యోజనముల విరివిగలది. ఆదిత్యమందిరమను పేర గనిపించు నీలవర్ణమైన చీకటిప్రదేశమది. ఆచీకటికవ్వల రుద్రలోకమున్నది. రుద్రసారూప్యమందిన భక్తులక్కడనుందురు. వారితో మహాదేవుడు వృషధ్వజుడు రుద్రుడు పత్నితో విహరించుచుండును. దానిమీద నదేప్రమాణములో నెల్లదేవతలకుం జొరరాని విష్ణులోకమున్నది. దానికిమీద బ్రహ్మాండము కాంచనము (బంగారపుది) దీప్తిమంతమైనదికలదు. భువర్లోకమందు వామనమూర్తి యున్నాడు. స్వర్లోకమందు వైకుంఠుడు విష్ణువున్నాడు. మహర్లోకము నృవరాహస్థానము. జనలోకము నృసింహస్థానము.

నృసింహస్య తథాప్రోక్తా జనలోకే మహాత్మనః । త్రివిక్రమస్య వసతి స్తపోలోకే ప్రకీర్తితా ॥ 24
లోకా స్సంతానకా నామ సత్య లోకే ప్రకీర్తితాః । ఏతేషు దేవం పశ్యన్తి దేవాస్సేంద్ర పురోగమాః ॥ 25
తపసా మహతా రాజన్ ! భక్త్యాశ్చ సతతం ప్రభుమ్ । రుద్రస్థానో పరిష్టాత్తు విష్ణోస్స్థానం మయోదితం ॥ 26
న కశ్చిదేనం శక్నోతి ద్రష్టుం దేవవరం హరిం । న తత్ర సూర్య స్తపతి చంద్రమా న విరాజతే ॥ 27
తేజసా తస్య దేవస్య సతుదేశో విరాజతే । తస్యో పరిష్టా దారభ్య యావదన్తం మహీపతే ! 28
ప్రోక్తం వరాహ స్థానస్య తత్రమానం నిబోధమే । యోజనానాంచ షట్కోట్యః త్రింశచ్చ నియుతాన్యథ ॥ 29
ఏతావచ్చైవ భూతానాం వసతిః పరికీర్తితా । ఏతావదేవ చంద్రస్య తలముక్తం సమంతతః ॥ 30

ఏతేషు దేవం పశ్యన్తి దేవాస్సేంద్ర పురోగమాః । తపసా మహతా రాజన్ ! భక్త్యాశ్చ సతతం ప్రభుం ॥ 31
దాహ్యతేఽండం దశగుణం త్వద్భిస్తు పరివారితమ్ । ఆపో దశగుణేనైవ బాహ్యత స్తేజసా వృతాః ॥ 32
తేజో దశగుణేనైవ బాహ్యతః పవనేనచ । వాయుర్దశ గుణేనైవ గగనేన తథావృతః ॥ 33
ఆకాశంచ దశఘ్నేన మనసా బాహ్యతో వృతమ్ ః మనశ్చ బుద్ధ్యా సకలం వృతం రాజన్! దశఘ్నయా॥ 34
ఆత్మనా చావృతాబుద్ధి ర్దశఘ్నేన సమన్తతః ॥ అవ్యక్తేన తథైవాత్మా దశఘ్నేనైవ చావృతః ॥ 35
అవ్యక్తః పురుషేణాథ త్వనన్తే నావృతోఽనఘ !। ఏవం విధానా మండానా మవ్యక్తః పురుషోత్తమః ॥ 36
తిర్య గూర్ధ్వమధ స్సంఖ్యా వక్తుం రాజన్ ! నశక్యతే । అనన్తత్వాత్ ప్రధానస్య పురుషస్య మహాత్మనః ॥ 37
ఏకరూపా స్తథైవాండా స్సర్వ ఏవ నరాధిప ! తుల్యదేశ విభాగశ్చ తుల్యా జంతవ ఏవ చ ॥ 38
దేశే దేశే సమానాయే అండేషు నృపసత్తమ ! సుఖదుఃఖే సమేతేషాం జీవితం మరణం తథా ॥ 39
సర్వాండానాం సమాజ్ఞేయా కాలసంఖ్యా నరాధిప ! పౌరుషస్య దినస్యాన్తే సర్వే హ్యండ నివాసినః ॥ 40
ఏకోఽప్యనన్తో రాజేంద్ర ! నాన్తరేవ ప్రకీర్తితః ।
అయం మయోక్తోన్నృప ! సన్నివేశః సంక్షేప మాత్రేణ చరా చరస్య ।
వ్యాసేనచైవం పరికీర్త్యమానః సమాప్యతే నైవ కదా చిదేవ ॥ 41

ఇతి శ్రీవిష్ణు ధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్ర సంవాదే లోకవర్ణనం నామ పంచమోఽధ్యాయః.

తపోలోకము త్రివిక్రమస్థానము. సత్యలోకమునందు సంతానకములను లోకములు గలవు. ఇంద్రాదిదేవతలు తపస్సు చేసి భక్తులై పరమేశ్వరు నిందు దర్శింతురు. రుద్రస్థానమునకుమీద విష్ణుస్థానమున్నది. ఈ హరి నెవ్వడుగాని దర్శింపజాలడు. అక్కడ సూర్యుడు తపింపడు. చంద్రుడు విరాజిల్లడు. ఆయన తేజస్సుచేతనే యా ప్రదేశము దీపించును. ఆదిమొదలుకొని తుది దాక గల ప్రదేశము పరాహస్థానము. దాని ప్రమాణము ఆరుకోట్ల ముప్పదిలక్షల యోజనములు. ఇంతవరకే భూతములుండు ప్రదేశము. ఇంతవరకే యిది చంద్రతలమనంబడును. వీనిలో నింద్రాదిదేవతలు మహాతపస్సుచే భక్తులును దేవుని దర్శింతురు. ఈ బ్రహ్మాండము వెలుపల పదిరెట్లు నీటితో చుట్టుకొన్నది. ఆ జలములు దానికి పదిరెట్లు తేజస్సుచే నావరింపబడినవి. తేజస్సునకు పదిరెట్లు వాయువుచేతను, వాయువునకు పదిరెట్లయిన యాకాశముచేతను నావృతమయియున్నది. ఆకాశమునకు బదిరెట్లు వెలుపల మనస్సుచేత నావరింపబడినది. దానికి పదిరెట్ల వెలుపల బుద్ధిచే నావృతము. దానికి పదిరెట్లమీద ఆత్మచే నావరింపబడినది. దానికి మీద పదిరెట్లు అవ్యక్తమావరించియున్నది. ఆ అవ్యక్తము అనంతపురుషునిచేత ఆవృతము. ఈలాటి యండములకు మీద అవ్యక్తుడు పురుషోత్తముడనబడు పరమాత్మ అడ్డము నిలువు క్రిందు సంఖ్య చెప్పవశముగాదు. ప్రధానుడు మహాత్ముడునైన పురుషుడనంతుడు. ఆయనయొక్క యొకేరూపములు సర్వబ్రహ్మాండములు. ఇందు దేశవిభాగము సమానము. జంతువులు సమానమే. ఆయా దేశదేశములందు బ్రహ్మాండములందున్నవారి సుఖ దుఃఖములు వారి జీవితము మరణము సమానమే. సర్వాండముల కాల గణనము సమానమే. పౌరుష దినము చివర (పురుషుని పగటి చివర) సందరు నయ్యండమున వసింతురు. ఆపురుషుడనంతుడు. ఒక్కడేయైనను ననేకముగా గీర్తింపబడుచున్నాడు. ఈ బ్రహ్మాండసన్నివేశము నేను సంక్షేపించి చెప్పితిని. వ్యాసభగవానులు దీనిని గీర్తించిరి. ఇది యెన్నడునేని ముగియదు.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణమున ప్రథమ ఖండమున లోకవర్ణనము అను ఐదవ అధ్యాయము

# ఆరవ అధ్యాయము

## ద్వీపవిభాగము

వజ్ర ఉవాచ :

భూమండలస్య కృత్స్నస్య సంస్థానేన చ భార్గవ ! వద ః ప్రమాణం కృత్స్నంతత్ తత్రమే సంశయో మహాన్॥ 1

మార్కండేయ ఉవాచ

భూమండలస్య రాజేంద్ర ! మధ్యే మేరు ర్మహాగిరిః । యోజనానాం సహస్రాణి తస్యమధ్యే సమున్నతః ॥ 2

జంబూ ద్వీపస్తు పంచాశత్ప్రమాణేన ప్రకీర్తితః । యోజనానాంతు నియుతం తస్యపాదం మహీపతే ॥ 3

లవణేన సముద్రేణ తేనాసౌ పరివేష్టితః లవణ ద్విగుణేనాపి శాకద్వీపేన లావణః ॥ 4

వేష్టిత శ్చ మహారాజ ! శాకద్వీపో నసంశయః క్షీరోదేన స్వతుల్యేన క్షీరోదోఽపిచ వేష్టితః ॥ 5

క్షీరోదద్వి గుణేనాపి కుశద్వీపేన యోజనైః ఆజ్యోదేన కుశద్వీపః స్వతుల్యేన చవేష్టితః ॥ 6

క్రౌంచద్వీపేన చాజ్యోదో ద్విగుణేన చ వేష్టితః । క్రౌంచద్వీపః స్వతుల్యేన దధిమండోదకేన చ ॥ 7

ద్వీపేన శాల్మలేనాథ ద్విగుణేనచ వేష్టితః । సురోదో ద్విగుణేనాథ గోమదేన చ వేష్టితః ॥ 8

పుష్కరద్వీప మధ్యేతు ద్వీపసంస్థాన మండపః పర్వత స్సుమహాన్లోకే విఖ్యాతో మానసోత్తరః ॥ 9

నియుతార్ధం యోజనానాం ప్రమాణేన ప్రకీర్తితః । నానా ప్రకారశిఖర స్తావదేవ సముచ్ఛ్రితః ॥ 10

మేరోస్తు పూర్వదిగ్భాగే మానసోత్తర మూర్ధని । పురీ శక్రస్య విఖ్యాతా నామత స్త్వమరావతీ ॥ 11

పూర్వదక్షిణ దిగ్భాగే తథా వహ్నేః ప్రభావతీ । యమస్య దక్షిణేభాగే నామ్నా సంయమనీ పురీ ॥ 12

విరూపాక్షస్య విక్రాన్తా భాగే దక్షిణ పశ్చిమే । పశ్చిమే చ తథాభాగే వరుణస్య సుఖప్రభా ॥ 13

శివానామ పురీ వాయో ర్భాగేపై పశ్చిమోత్తరే । విభావరీసోమ పురీఉత్తరేణ ప్రకీర్తితా ॥ 14

వజ్రుడు సర్వభూమండలము యొక్క సంస్థానము (కూర్పు) సమగ్రప్రమాణ మానతిమ్మన మార్కండేయుండిట్లనియె. రాజేంద్రా! భూమండలమునకు నడుమ మేరుపర్వతమున్నది. జంబూద్వీపము దాని చుట్టు నేబది యోజనముల వైశాల్యము గలదియై యున్నది. దాని యొడ్డు లక్ష (నియుత) యోజనములు ఉప్పుసముద్రమావరించియున్నది. లవణ సముద్రమునకు రెట్టింపగు శాక ద్వీపముచే నది యావరింపబడియున్నది. శాకద్వీపము తనతో సమానప్రమాణముగల పాలసముద్రముచే చుట్టబడినది. పాలసముద్రము తనకు రెట్టింపగు కుశద్వీపముచే వేష్టితము. కుశద్వీపము క్రౌంచద్వీపముచే నావృతమైనది. నేతిసముద్రము రెట్టింపుప్రమాణము గల క్రౌంచద్వీపము తనతో సమాన ప్రమాణముగల మీగడ సముద్రముచే నావరింపబడినది. రెట్టింపు పరిమాణముగల శాల్మల ద్వీపముచే సురాసముద్రమావరింపబడెను. సురాసముద్రము తనకు రెట్టింపైన గోమేధముచే నావరింపబడెను. పుష్కర ద్వీప మధ్యమందు ద్వీప సంస్థానమండపమట్లు మానసోత్తర మహాపర్వతమున్నది. దాని ప్రమాణము అర్ధనియుత యోజనములు. అనేక విధములయిన శిఖరములతో నంతేప్రమాణమెత్తుగల్గియున్నది. మేరువు తూర్పువైపు మానసోత్తరపర్వతము మూర్ధమందు ఇంద్ర రాజధాని అమరావతి యున్నది. ఆగ్నేయమూల అగ్ని రాజధాని ప్రభావతి. దక్షిణమందు యముని సంయమనీపురి యున్నది నిర్‌ఋతి మూల విరూపాక్షుని నగరము విక్రాంతమున్నది. పడమటి దెస వరుణరాజధాని సుఖప్రభగలదు. వాయవ్య మూల వాయువు రాజధాని శివ యను పురమున్నది. ఉత్తర దిశ సోమునిపురము విభావరి గలదు. ఈశాన్యమూల శివుని శర్మదాపురి యున్నది.

శర్మదాచపురీ శైపీ భాగేపూర్వోత్తరే స్మృతా । పుష్కరశ్చస్య తుల్యేన వృతః స్వాదూదకేనచ ॥ 15
స్వాదూదకాత్పరంక్షోణీ కార్తస్వరమయీ శుభా । యోజనానాం ప్రమాణేన సహస్రాణితు వింశతిః ॥ 16
దశచాన్యాని రాజేంద్ర ! పంచ పంచప్రకీర్తితా । సమంతతస్త్వేకశిలా సేవోద్యానేమహీ శుభా ॥ 17
స్థితస్తాం పరివార్యోర్వీంలోకాలోకో మహీధరః । అయుతం యోజనానాంతు విస్తరేణోచ్ఛ్రయేనచ ॥ 18
లోకా లోకే మహీపాల ! లోకపాలాస్త్వ మీస్మృతాః । ప్రాచ్యాదిషుమహావీర్యాః కల్ప స్థాయిన ఏవతే ॥ 19
సుదామా శేషపాదశ్చ కేతుమాన్సు మహాబలః । హిరణ్య రోమాచ తథా విజ్ఞే యాశ్చ దిగీశ్వరాః ॥ 20
అర్వాక్త స్యమహీధ్రస్య చంద్రార్క గ్రహతారకాః । ప్రపతన్తి మహారాజ ! నతుపారే కదాచన ॥ 21
దర్భోదక సముద్రస్తు లోకా లోకం సమన్తతః । పరివార్య స్థితో రాజన్నంధకారే మహార్ణవః ॥ 22
ఏకషష్టి ప్రమాణేన నియుతాని సమంతతః । తస్యపారే తతో రాజన్ బ్రహ్మాండస్తు సమంతతః ॥ 23
ఊర్ధ్వే నాథశ్చ విష్కంభో యావానండస్య కీర్తితః । తావదేవ ప్రమాణేన తిర్యక్షు పరివారితః ॥ 24
మేరు మధ్యాత్స ముద్రస్య పారం గర్భోదకస్యతు । కోటిత్రయం యోజనానాం నియుతాని తథాదశ ॥ 25
పంచాన్యాని చ రాజేంద్ర ! ప్రమాణం పరికీర్తితమ్ । తస్యరాజ ............బ్రహ్మాండస్తు సమంతతః ॥ 26
................తదధ్యర్ధం ద్వితీయస్య తథాదశ । ఏత దేవతు నిర్దిష్టం ప్రమాణం తత్త్వ చింతకైః ॥ 27

పుష్కర ద్వీపము తన ప్రమాణముగల స్వాదూదక సముద్రముచే నావరింపబడినది. ఆ మంచినీటి సముద్రమునకవ్వల సువర్ణభూమి యున్నది. దానివైశాల్యము యిరువదివేల యోజనములు. అదియంతయు నేకశిలామయము. అది దేవతలు విహరించు నుద్యానము. ఆ భూమిని చుట్టుకొని లోకాలోకమను పర్వతమున్నది. దాని వైశాల్యము ఎత్తును పదివేల (అయుత) యోజనములు. లోకాలోకపర్వతమందు ప్రాచ్యాదిదిక్కులందు ఈలోకపాలురున్నారు. వారు మహావీరులు. కల్పాంతజీవులు. సుదాముడు శేషపాదుడు కేతుమంతుడు (మహాబలశాలి) హిరణ్యరోముడు ననువారు. ఆ పర్వతమునకు క్రిందుగా సూర్య చంద్ర గ్రహ తారకలు పడుచుండును. వారా పర్వతము యొక్క పారము నందుకోరు. ఆపర్వతమునకు జుట్టును గర్భోదకమను సముద్రమున్నది. అది యంధకారబంధురము. దాని ప్రమాణమరువదియొక్క లక్ష (నియుతముల) యోజనములు. దాని అవలిప్రక్క (సరిహద్దున) చుట్టును బ్రహ్మాండమున్నది. దానిపైనుంచి యడుగునకుగల విష్కంభమెంతగలదో అంతే దాని యడ్డుకొలతయును. మేరు మధ్యమునుండి గర్భోదక సముద్రము యొక్క ఆవలి యొడ్డు 3 కోట్ల పదునేను నియుతములు యోజనములు. తత్త్వవేత్త లింత వరకే యీ కొలతల నిర్దేశించినారు.

మేరోస్తు పూర్వ దిగ్భాగే మధ్యేతు లవణో దధేః । విష్ణులోకో మహాన్‌ప్రోక్తః సలిలాన్తర సంశ్రితమ్ ॥ 28
స్వభాసయాత్ర దేవస్య సతతం నృపః ! రాజితమ్ । తత్ర స్వపితి ఘర్మాంతే దేవదేవో జనార్ధనః ॥ 29
లక్ష్మీసహాయః సతతం శేషపర్యం కమాశ్రితః । ఏకాదశ్యా మాషాఢస్య శుక్లపక్షే జనార్దనమ్ ॥ 30
దేవాశ్చఋషయశ్చైవ గంధర్వా ప్సరసాంగణాః । అభిష్టువంతి తేగత్వా సతతం దినపఞ్చకమ్ ॥ 31
ఉత్సవంచైవకుర్వన్తి గీతనృత్యసమాకులమ్ । తతస్తుచతురో మాసాన్‌యోగ విద్రాముపా సతే ॥ 32
సుప్తంచతముపాసతే ఋషయో బ్రహ్మవిత్త మాః । సశరీరాణి శాస్త్రాణి భక్తాస్తం దేవ మానవాః ॥ 33
కార్తికస్యసితే పక్షేత దేవదిన పంచకమ్ । విబోధయన్తిదివేశం గత్వా సేంద్రా దివౌకసః ॥ 34
దేవాస్తథైవకుర్వంతి తదాపిచ మహోత్సవమ్ । మేరోస్తు పూర్వదిగ్భాగే మధ్యేక్షీరార్ణ వస్యతు ॥ 35
క్షీరాంబు మధ్యగాశుభ్రా దేవస్యాన్యా తథా పురీ । లక్ష్మీసహాయ స్తత్రాస్తే శేషాసనగతః ప్రభుః॥ 36

తత్రాపిచతురోమాసాన్ సుప్తస్తిష్ఠతి వార్షికాన్ అన్యైః సకేవలైస్తత్ర దృశ్యతేశాశ్వతః ప్రభుః ॥ 37
తస్మింస్తథైవదిగ్భాగే మధ్యేక్షీరార్ణవస్యతు । యోజనానాం సహస్రాణి మండలః పంచవింశతిః ॥ 38
శ్వేతద్వీపస్తు విఖ్యాతో ద్వీపః పరమశోభనః । నరాః సూర్యప్రభాస్తత్ర శీతాంశుసమ దర్శనాః ॥ 39
తేజసాదుర్నిరీక్ష్యాశ్చ దేవానామపియాదవ ! పంచకాల విధానజ్ఞాః పూజయంతి జనార్దనమ్ ॥ 40
పూజాంతు తేషాంశిరసా సతుదేవః ప్రయచ్ఛతి । ఇహస్థైశ్చ కృతాం పూజాం పాదతశ్చ ప్రయచ్ఛతి ॥ 41

మేరువు యొక్క తూర్పు దెసన ఉప్పుసముద్ర మధ్యమందు విష్ణులోకము నీళ్ళలో నున్నది. అది విష్ణు తేజస్సుచే ప్రకాశించును. దేవదేవుడు జనార్దనుడు లక్ష్మిసహాయుడై శేషపర్యంకమందు ఘర్మాంతమున (వర్షాకాలమున) నెదురించును. ఆషాఢ శుక్లైకాదశినాడు మొదలయిదు రోజులాదేవుని దేవతలు ఋషులు గంధర్వాప్సరోగణము నటకేగి స్తుతింతురు. గీతనృత్యాదుల నుత్సవము గూడ నెరపుదురు. ఆమీద నాల్గు మాసములావిష్ణువు యోగనిద్రంగొనును. బ్రహ్మ సమ్మితులు (లేదా బ్రహ్మతుల్యులు) ఋషులు నిద్రనున్న యాయన నుపాసింతురు. శరీరముదాల్చి శాస్త్రములు భక్తులైన దేవమానవులు నా స్వామిని సేవింతురు. కార్తికశుక్లైకాదశి నుండి యైదురోజులాయన నింద్రాదులు మేల్కొలుపుదురు. దేవతలుకూడ మహోత్సవముసేయుదురు. మేరువు తూర్పు దెస క్షీరాబ్ధి నడుమ క్షీరోదకమునడుమ నచ్చపు తెల్లనిదా దేవుని రాజధాని యున్నది. లక్ష్మితో శ్రీహరి యక్కడ శేష తల్పమందుండును. అక్కడగూడ నాల్గు వార్షికమాసములు (వర్షఋతువంతయు) స్వామి నిదురబోవుచుండును. ఆతడు కేవల మస్త్రములతో దర్శనమిచ్చును. అదేదిక్కున పాల్కడలి నడుమ నిరువదియైదువేల యోజనముల వైశాల్యముగల మండలమున్నది. అది శ్వేతద్వీపమను విఖ్యాతినందినది. పరమశోభనము. అచటి నరులు సూర్యవర్చస్కులు చంద్ర సమదర్శనులు. వేల్పులకేని తేరిపారజూడ వశముగాని తేజస్వులు. పంచకాల పూజావిధాన మెరింగి విష్ణువును బూజించుచుందురు. ఆదేవుడుగూడ వారికి శిరస్సుచే పూజనొసంగును. అనగా వారి పూజను ప్రతిగ్రహించునన్నమాట. ఈలోకమందున్న వారి పూజను పాదములచేత స్వీకరించును. నరులక్కడనున్న హరి నేకాంతభావమున బొందుదురు. అనన్యభావులై సేవించి యాహరి సాయుజ్యమందుదురన్నమాట.

ఏకాంతభావోపగతాస్తత్ర యాంతిహరిం నరాః । తత్ర గత్వా నశోచంతి నివర్తంతేన చాప్యథ ॥ 42
పూజయిత్వా చిరంకాలం దేవదేవం జనార్దనమ్ । ఆదిత్యమండలం భిత్త్వా బ్రహ్మాణం ప్రవిశంతితే ॥ 43
తతోఽనిరుద్ధం దేవేశం ప్రద్యుమ్నం చాప్యనంతరమ్ । తతః సంకర్షణం దేవం వాసుదేవం తతః పరమ్ ॥ 44
వాసుదేవంచ సంప్రాప్య ముచ్యంతే సర్వవర్తనైః । శ్వేతద్వీప గతాస్తస్మాన్న నివర్తన్తి కర్హిచిత్ ॥ 45
పూర్వోత్తరేతు దిగ్భాగే మధ్యే క్షీరార్ణవస్యతు । వైజయంత ఇతిఖ్యాతః పర్వతః సర్వకాంచనః ॥ 46
యోజనానాం సహస్రాణి ప్రమాణేన దశస్మృతః । ఆయామ విస్తరోచ్ఛ్రాయైః ప్రమాణంతస్య కీర్తితమ్ ॥ 47
యోజనానాం సహస్రాణి పర్వతస్య గుహాస్మృతా । ఉచ్ఛ్రిత యోజన శతం తావదేవచ విస్తృతా ॥ 48
తిమిరేణావృతాద్వారి యోజనానాం తథా శతమ్ । స్వప్రభాభరణా దివ్యా తతః పరతరం హిసా ॥ 49
నామ్నాచలోకే విఖ్యాతా ఋషిభిస్తిమిరావతీ । తస్యాం దేవవరో విష్ణుః స్వపన్నాస్తే జనార్దనః ॥ 50
తత్రైనముపతిష్ఠన్తి దేవ్యస్తిస్రో మహీపతే । నిద్రాచ కాలరాత్రిశ్చ లక్ష్మీశ్చ వరవర్ణినీ ॥ 51
ఉపాసతే చ తందేవం భృగ్వాద్యాః పరమర్షయః । శరీర ధారిభిశ్చాన్యైస్త థాతత్రచ సేవ్యతే ॥ 52
తస్యసుప్తస్యవైనాన్నిః శ్వాసోచ్ఛ్వాసతః క్రమాత్ । ప్రజానాంపంక్తయోహ్యుచ్చైర్నిపతంతి పతతించ ॥ 53
తస్యోచ్ఛ్వాసశ్చ జంతూనాం సంభవః కథితోనృప । నిఃశ్వాసకాలేచ తథా జంతూనాం మరణం స్మృతమ్ ॥ 54

ఆ విష్ణువుం బొందినవారు శోకింపరు. పునరావృత్తి నందరు. చిరకాలమాజనార్దనునిం బూజించి ఆదిత్యమండలమును భేదించుకొని (అనగా ఆదిత్యమండలమునకు తక్కిన జ్యోతిర్మండలములకు నడిమిదారిని) బ్రహ్మలో బ్రవేశింతురు. అవ్వల ననిరుద్ధుని ప్రద్యుమ్నుని అతర్వాత సంకర్షణుని అటుపై వాసుదేవునిం బొందుదురు. వాసుదేవునిం బొంది సర్వ (వర్తనముల) ప్రవృత్తుల నుండి ముక్తులగుదురు. నైష్కర్మ్యమందుదురన్నమాట. అదే ముక్తి. శ్వేతద్వీపమునకేగినవారటనుండి యెన్నడును దిరిగిరారు. క్షీరసముద్ర మధ్యమున పూర్వోత్తర దిగ్భాగమందు (ఈశాన్యమూల) సర్వసువర్ణమయిన వైజయంతమను పర్వత మున్నది. దాని ప్రమాణము పదివేల యోజనములు. దాని పొడవు ఎత్తు వైశాల్యము గూడ నిదే ప్రమాణములో నుండును. దానిలో గుహ యైదువేల యోజనముల విరివిగలది గలదు. దాని ఎత్తు నూరుయోజనములు. దాని వైశాల్యముగూడ యంతే. ద్వారమందు నూరు యోజనముల చీకటి గ్రమ్మియుండును. ఆమీది ప్రదేశము తన దివ్యప్రభలచే వెలుగొందుచుండును. ఋషులచేనది తిమిరావలి యనుపేర ప్రఖ్యాతిగన్నది. దానియందు దేవేశుడు విష్ణువు నిదురించుచుండును. ఈయన నక్కడ ముగ్గురు దేవతలు, నిద్ర కాలరాత్రి పరపర్ణినియైన లక్ష్మియును ననువారు సన్నిధిసేసియుందురు. భృగ్వాది మహర్షు లీయన నుపాసించుచుందురు. శాస్త్రములు శరీరధారులై యీయన నట సేవించును. నిద్రలోనున్న యీయన ఉచ్ఛ్వాస నిశ్వాసములనుండి క్రమముగ ప్రజల పరుసలు మీదికెగిరి క్రిందికిపడుచుండును. ఆతని యుచ్ఛ్వాసమే జంతువుల పుట్టుక యనబడును. ఆయననిశ్వాసకాలమం దదేజీవుల మరణమనబడును.

మధ్యేఘృత సముద్రస్యమేరోః పశ్చిమ తస్తథా । యోజనానాంతు నియుతం ద్వీపస్తు పరిమండలః ॥ 55
తత్ర గోవర్ధనస్యోక్తా వసతిః సుమహాత్మనః । దివ్యానాంతత్రధేనూనాం వసతిశ్చ తథాస్మృతా ॥ 56
సతతం కామరూపేణ భాభిః స రమతే హరిః । మధ్యేదధి సముద్రస్య ద్వీపస్తావత్ప్రమాణతః ॥ 57
హేమరూపధరో యత్ర నిత్యం వసతి కేశవః । తత్రస్థమేనం పశ్యంతి ఋషయో భూరితేజసః ॥ 58
సురాసముద్ర మధ్యేతు ద్వీపః పరమ విస్తృతః । తత్ర సంకర్షణోదేవో విభురాస్తే సురాసురాః ॥ 59
ఉపతిష్ఠంతి తత్రైనం దివ్యాస్తిస్రో మనోరమాః । కాంతిశ్చమదిరాచైవ తథాదేవీ కరీషిణీ ।
తత్రస్థమేనం పశ్యంతి ప్రజానాం పతయః సదా ॥ 61
క్ష్మామండలం కృత్స్నమిదం తవోక్తమ్ క్ష్మాపాల బృందాంబర పూర్ణచంద్ర ।
సమాసతో వ్యాసగిరా మశక్యం వక్తుం మహేంద్రోపి నవర్షపూగైః ॥ 62

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే ద్వీపవిభాగ వర్ణనంనామ షష్ఠోఽధ్యాయః.

ఘృతసముద్రము నడుమ మేరువునకు బడమట నియుత (లక్ష) యోజన పరిమాణమైన ద్వీపము (పరిమండలము)వర్తులమైనది. గలదు. అందు గోవర్ధనము యొక్క యునికి యున్నది. అది దివ్యధేనువుల కావాసము. అట నెల్లప్పుడు హరి కామ రూపుడై తన దీప్తులతో విలసిల్లును. దధి సముద్రము నడుమ ఆ సముద్రప్రమాణమున నీట ద్వీపమున్నది. విష్ణువక్కడ స్వర్ణ రూపధారియై వసించును. మహాతేజస్వులైన ఋషు లక్కడనున్న యీతనిం జూచెదరు. సురాసముద్రమధ్యమందు (సురా = కల్లు) బహువిశాలమైన ద్వీపమున్నది. అక్కడ సంకర్షణుడనుపేర విష్ణుదేవుడు ప్రభువున్నాడు. ఆతనిని సురాసురు లుపస్థానము చేయుదురు. ముగ్గురు దేవతలు కాంతి మదిర కరీషిణి యను పేరుగలవారు పరమసుందరు లాయన సన్నిధిని వసింతురు. అట నున్న యీ స్వామిని ప్రజాపతులు చూచెదరు. సర్వభూమండలమును నరేంద్ర బృందాంబరమునం బూర్ణబింబమవైన నీకు వ్యాస వచనము సమన్వయము సేసి తెలిపితిని. దేవేంద్రుడేని యనేక సంవత్సర సముదాయముననేని వర్ణింపరానిదిది.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తరమహాపురాణమున ప్రథమ ఖండమున ద్వీపవిభాగవర్ణనము అను నారవ యధ్యాయము.

# ఏడవ అధ్యాయము

## జంబూద్వీపవర్ణనము

వజ్ర ఉవాచ :

జంబూద్వీపస్య సంస్థానం విస్తరేణ మహామునే ! త్వత్తోఽహం శ్రోతు మిచ్ఛామి యత్ర జాతోఽసి భార్గవ! 1

మార్కండేయ ఉవాచ :

అవగాఢా వుభయత స్సముద్రౌ పూర్వ పశ్చిమౌ । జంబూద్వీపే మహారాజ ! షడిమే కుల పర్వతాః ॥
హిమవాన్ హేమకూటశ్చ నిషధోనీల ఏవ చ । మేరుశ్చ శృంగవాం శ్చైవ సర్వే రత్నాకరాశ్శుభాః ॥ 2
మధ్యేతు మండల శ్శైలః నీలస్య నిషధస్య చ । సౌవర్ణః కథ్యతే మేరుః ప్రమాణం తస్య మే శృణు ; 3
చతు రాశీతిసాహస్రాః కథిత శ్చోచ్ఛ్రయేణ చ । అధస్తాత్ షోడశై వోక్తః షోడశైవ తు విస్తృతః ॥ 4
విస్తారో ద్విగుణశ్చాస్య భూంగోన్మండలః స్మృతః। బృందపుష్ప నిభశ్చోర్ధ్వం ద్వాత్రింశచ్చైవవిస్తృతః॥ 5
విస్తారో ద్విగుణశ్చాస్య తత్రాఽధిక విధిస్స్మృతః । మేరుస్తు నవతిఃప్రోక్త స్సహస్రః పూర్వతో గిరిః ॥ 6
యోజనానాం సహస్రంతు మాల్యవాన్ నామ నామతః । ఆనీలం నిషధం యావ త్పశ్చిమేన తు తావతా ॥ 7
తావత్ప్రమాణో నిర్దిష్టః పూర్వతో గంధమాదనః । మేరోస్తూత్తరత శ్శ్వేతః పూర్వతోఽ నన్త ఉచ్యతే ॥ 8
దక్షిణేచ తథా పీతః కృష్ణః పశ్చిమత స్స్మృతః । అన్తరేణ స్మృతో విప్రః పూర్వతః క్షత్రియ స్స్మృతః॥ 9
దక్షిణేన తథా వైశ్యః శూద్రః పశ్చిమతః స్మృతః । తస్మా దుదీచీ విప్రాణాం ప్రాచీస్యాత్ క్షత్ర జన్మనామ్॥ 10
దక్షిణా వైశ్యజాతీనాం శూద్రాణాం పశ్చిమా స్మృతా । ప్రాచ్యాం మహేంద్రస్య పురీ మేరుపృష్ఠేఽమరావతీ॥ 11
వహ్నేః ప్రదక్షిణేనోక్తా పురీనామ్నా సభావతీ । యమస్య దక్షిణేనోక్తా నామ్నా సంయమనీ పురీ ॥ 12
ప్రోక్తా వైనైరృతీ భాగే పురీ పశ్చిమ దక్షిణే । పశ్చిమేన తథారమ్యా, సుముఖా వరుణస్య చ ॥ 13
అనంతరం శివానామ పురీ వాయోః ప్రకీర్తితా । ఉత్తరేణ పురీ రమ్యా సోమస్యోక్తా విభావరీ ॥ 14
అనన్తరం శివస్యోక్తా నగరీ శాంకరీ శివా । మేరుపృష్ఠే యథా దేవాః సంశ్రితాస్తు యథాదిశమ్॥ 15
విజ్ఞేయాస్తేతు దిక్పాలాః తస్యాం తస్యాం తథాదిశి । దేవస్స్వాం నగరీం ముఖ్యం మానసోత్తర మూర్ధని ॥ 16
మేరుంతు పశ్యతి విభుస్తత్స్థో మేరుగతాం పురీమ్ । ఉదక్ శృంగవతోఽర్ధేతు యామ్యేన కురుసంజ్ఞితమ్ ॥ 17
వర్షంతు కథితం దివ్యం సర్వోపద్రవ వర్జితమ్ । శృంగవచ్ఛ్వేతయో ర్మధ్యే వర్షం జ్ఞేయం హిరణ్మయమ్ ॥ 18
రమ్యంతు వర్షం విజ్ఞేయం మధ్యతః శ్వేతనీలయోః । మధ్యే నిషధ నీలాభ్యాం పశ్చార్ధే గంధమాదనః ॥ 19
కేతుమాలః స్మృతో వర్షస్త్వతీవ సుమనోహరః । మధ్యే నిషధనీలాభ్యాం పూర్వే మాల్యవతో గిరేః ॥ 20
వర్షో రుద్రముఖో నామ నిత్యం ముదిత మానవః । మేరోశ్చతుర్దిశం నామ్నా వర్షో రాజన్! ఇలావృతః॥ 21
తస్యాపి భేదా శ్చత్వారో నామతస్తాన్నిబోధమే । భద్రాశ్వో జంబుమాలశ్చ కేతుమాన్ కురవస్తథా ॥ 22
జంబువృక్షస్తు విఖ్యాతో జంబుమాలేతు యాదవ! యోజనానాం సహస్రంతు తత్పూర్వం తస్య కీర్తితమ్ ॥ 23
24

వజ్రుడిట్లనియె : భృగువంశీయమునీ ! నీ జన్మస్థానమగు జంబుద్వీపము యొక్క సన్నివేశము యొక్క యథార్థమును నీ నుండి వినగోరెద.నన మార్కండేయమహర్షి యిట్లు సెప్పదొడంగె. జంబూద్వీపమం దిరువైపుల పూర్వ పశ్చిమ సముద్రములు

చొచ్చుకొనియున్నవి. ఇందు కులపర్వతములారున్నవి. హిమవంతము, హేమకూటము, నిషధము, నీలము, మేరువు, శృంగవంతము ననునవి రత్ననిధులు. శుభప్రదములు. నీల నిషధ పర్వతముల నడుమనున్న మండలము వర్తులాకార ప్రదేశము సువర్ణమయము మేరువని పిలువబడును దాని ప్రమాణము ఎనుబదినాల్గు వేల యోజనములు. క్రింద మరి పదునారు వేలు దాని విస్తారము. దీనికి రెట్టింపుభాగము భూమిలోపలనున్నది. మీది భాగము ముప్పదిరెండువేల యోజనముల విరివి గలది. అది బృందపుష్పమట్లున్నది. దీని వైశాల్యము దీనికి రెట్టింపుమించియున్నది. మేరువు యొక్క విస్తారము (వైశాల్యము) తొంబదివేల యోజనములు. దానికి తూర్పున మాల్యవంతమను పర్వతము వేయి యోజనముల వైశాల్యముగలది. నీలపర్వతమునుండి నిషధ పర్వతమువరకు పశ్చిమముగా నెంత పొడవున్నదో యంత పొడవున దీనికి తూర్పున గంధమాదనమున్నది. మేరువునకుత్తరముగ శ్వేతపర్వతము, తూర్పున అనంతపర్వతమని పిలుపబడును. దక్షిణదిశ పీతపర్వతము(పసుపుపచ్చనిది) పడమట కృష్ణపర్వతమును గలవు. నడుమ నున్న పర్వతము విప్రుడు. తూర్పున క్షత్రియమనబడును. దక్షిణ పర్వతము వైశ్యము. పశ్చిమగిరి శూద్రము. కావున నుత్తర పర్వతము విప్రులది. తూర్పు పర్వతము క్షత్రియులది. దక్షిణము వైశ్యజాతులది. పశ్చిమము శూద్రులది. ప్రాగ్దిక్కున నింద్రునిపురమమరావతి మేరువుమీద నున్నది. ఈవిషయము లోగడనే తెలుపబడినది. మేరుపృష్ఠమందాయా దిక్కులందు దేవతలున్నారు. వారు దిక్పాలురు. విష్ణువు మానసోత్తర పర్వతమందలి తన నగరిని మేరువును జూచుచుండును. ఉత్తర దిక్కునగల శిఖరమునకు దక్షిణపునగము కురువర్ష మనబడును. అది దివ్యము. ఏ యుపద్రవములు లేనిది. శృంగవంతము శ్వేతగిరికి నడుమ హిరణ్మయవర్షమున్నది. శ్వేత నీల పర్వతముల నడిమిది రమ్యకవర్షము. నిషధ నీల పర్వతముల నడుమ పడమట గంధమాదనమున్నది. నిషధ నీలముల నడుమ కేతుమాల వర్షము చాల రమ్యమైనది గలదు. నిషధ నీలముల నడుమ మాల్యవంతమను గిరికి తూర్పుగ రుద్రముఖమను వర్షమున్నది. అందెల్లవేళల మానవులానందభరితులై యుందురు. మేరువునకు నలుదెసల నిలావృతవర్షమున్నది. అందు నాల్గు విభాగములు గలవు. భద్రాశ్వము జంబుమాలము కేతుమంతము కురవమునసునవి వానిపేర్లు. ఓ యాదవ ! వజ్రభూపతీ ! జంబుమాలమందు జంబూవృక్షము రేడుబెట్టు విఖ్యాతమైనది. దాని విరివి వేయి యోజనములు.

తత్ఫలేభ్యః ప్రభవతి రమ్యా జాంబూనదీ శుభా । మేరోః ప్రదక్షిణం కృత్వా స్వమూలే సా చ నశ్యతి ॥ 25
వృక్షరాజేన తేనేదం జంబూద్వీపం ప్రచక్షతే । ఇలావృతస్తు ప్రభయా మేరో ర్నిత్యం ప్రకాశతే ॥ 26
న తత్ర భ్రాజతే సూర్యో న చంద్రో న చ తారకాః । మేరోశ్శరావ సంస్థత్వా న్నిత్యమేవ తిరోహితః ॥ 27
హేమకూటా దుత్తరతో హరి వర్షం ప్రచక్షతే । హేమకూటా ద్దక్షిణత స్తథా కింపురుషం స్మృతమ్ ॥ 28
హిమాచలా ద్దక్షిణతో వర్షం యాదవ ! భారతమ్ । కర్మభూమి ర్మహీపాల ! యత్ర వర్తామహే వయమ్ ॥ 29
భారతేఽస్మిన్ యుగావస్థా కేశవేన వినిర్మితా । వర్షే ద్వే చాథ సంస్థానే విజ్ఞేయే దక్షిణోత్తరే ॥ 30

దాని పండ్లనుండి జంబూనది పుట్టును. అది మేరుగిరికి ప్రదక్షిణమునేసి తన మూలమందు (పుట్టినచోట) అంతరించును. ఆ వృక్షరాజముచేత నిది జంబూద్వీపమనబడుచున్నది

ఇలావృత వర్షము మేరుపర్వత కాంతిచే నిత్యము దీపించుచుండును. అక్కడ సూర్యుడు వెలుగడు. చంద్రుడు తారకలు వెలుగవు. మేరువు శరావమువలె (మూకుడువలె) నుండుటచే తత్కాంతికి జ్యోతిర్మండలము ప్రకాశ మడగియుండుననుమాట. హేమకూటమున కుత్తరము హరివర్షమనబడును దానికి దక్షిణము కింపురుషవర్షము-హిమాద్రికిదక్షిణమున భారతవర్షము. అది కర్మభూమి. మనమున్నదా వదియే. ఈ భారతమందు యుగవిభాగము విష్ణువు సేసినది. దీనియందు దక్షిణమున నుత్తరమున రెండు సంస్థానములు (ఖండములు) గలవు.

* వి.ధ.పు-౩

వర్షత్రయంతు విజ్ఞేయం చతురస్రంతు మధ్యమమ్ । దీర్ఘంతథైవ విజ్ఞేయం వర్షాణాంచ చతుష్టయమ్ ॥ 31
వర్షాణాం నవ సాహస్రో విష్కంభః కథితో నృప ! । యోజనానాం ప్రమాణేన కథితస్తత్త్వ దర్శిభిః ॥ 32
విష్కంభః పర్వతానాంతు సహస్ర ద్వితయం స్మృతమ్ । మేరో ర్యోజన సాహస్రో విష్కంభః కథిత స్తథా ॥ 33
యోజనానాంతు నియుతం జంబుద్వీపః ప్రకీర్తితః । యామ్యోత్తరేణ తస్యేదం ప్రమాణంతే మయోదితమ్ ॥ 34
పూర్వాపరేణ తస్యాపి ప్రమాణం శృణు పార్థివ ! । యోజనానాం సహస్రాణి ద్వాత్రింశచ్చ శతానిచ ॥ 35
భద్రాశ్వకేతు మాలౌ ద్వౌ ప్రత్యేకం పార్థివోత్తమ ! యోజనానాం సహస్రేణ శతసహస్ర కానిచ ॥ 36
నవమేరు స్తథా ప్రోక్తో గంధ మాదన మానతః । మేరోర్నవ సహస్రాణి మాల్యవాంశ్చ నిగద్యతే ॥ 37
మేరోర్యోజన సాహస్రో విష్కంభః కథిత స్తథా । ఏవమప్యేష నియుతః జంబూద్వీపః ప్రకీర్తితః ॥ 38

హిమాచలే యక్షవరా నివిష్టా దైత్య ప్రధానాః ఖలు హేమకూటే ।
గంధర్వ ముఖ్యా నిషధే చశైలే నాగానివిష్టాశ్చ తథైవ నీలే ॥ 39
శ్వేతే పితౄణాంచ గతిర్నివిష్టా సిద్ధా స్తథా శృంగవతశ్చ పృష్ఠే ।
సేంద్రా స్తథా దేవగణాశ్చ మేరౌ క్రీడావిహారేణ సదా వసన్తి ॥ 40

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే జంబూద్వీప వర్ణనంనామ సప్తమోఽధ్యాయః.

సడుమ చతురస్రముగ మూడు వర్షములున్నవి. ఈవర్షముం విష్కంభము తొమ్మిదివేల యోజనములు. పర్వతముల విష్కంభము రెండువేల యోజనములు. మేరువు యొక్క విష్కంభము వేయి యోజనములు. దీని ఉత్తర దక్షిణపు కొలతలు నీకు నేను చెప్పితిని. రాజా ! దాని తూర్పు పడమరల ప్రమాణము చెప్పెదను. వినుము. అదినూటముప్పది రెండువేల యోజనములు. జంబూద్వీప ప్రమాణము నియుత (లక్ష) యోజనములు. ఓ రాజోత్తమా ! భద్రాశ్వ కేతుమాలములు ప్రత్యేకముగ పదికోట్ల యోజనముల పరిమాణము కలవి.నవ మేరువు కూడ గంధమాదనమంత పరిమాణమే కలది. మాల్యవత్ పర్వతము మేరువునకు తొమ్మిదివేల రెట్ల పరిమాణము కలది. ఇట్లు జంబూద్వీపము నియుత ప్రమాణము. హిమాలయమందు యక్షవరులు హేమకూటమందు దైత్య ముఖ్యులు నిషధమందు గంధర్వముఖ్యులు నీలగిరియందు నాగులు నున్నారు. శ్వేతపర్వతములో పితృదేవతలమార్గమున్నది. శృంగ వంతమున సిద్ధులు చరింతురు. మేరువునం దింద్రాది దేవగణము లున్నవి. అందందు వారు క్రీడావిహారము సేయుచుందురు.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణమున ప్రథమ ఖండమున జంబూద్వీపవర్ణనమను సప్తమాధ్యాయము

# ఎనిమిదవ అధ్యాయము

## భారతవర్ష వర్ణనము

వజ్ర ఉవాచ :

భగవన్ ! భారతం వర్షం శ్రోతుమిచ్ఛామి తత్త్వతః । కర్మభూమిషు మర్త్యానాం వర్షం భార్గవ ! భారతం ॥ 1

మార్కండేయ ఉవాచ :

భారతస్యాస్య వర్షస్య నవభేదాః ప్రకీర్తితాః । అష్టభి ర్గిరిభిశ్ఛన్నాః యేత్వ గమ్యాః పరస్పరమ్ ॥ 2
హిమాచలా దా సముద్రం గిరయ స్తే వ్యవస్థితాః । యామ్యోత్తరేణ రాజేంద్ర ! నామతస్తాన్ నిబోధమే ॥ 3

స్వమాలీ హేమమాలీచ శంభుః కార్తస్వరావరః । వైడూర్య పర్వతశ్చైవ రాజతో మణిమాన్ భవః ॥ 4
ఇంద్రద్యుమ్నః కశేతశ్చ తామ్రవర్ణో గభస్తిమాన్ । రాగద్వేషస్తథైవాన్యో గాంధర్వ స్త్వథవారుణః ॥ 5
తేషాంతు నవమోమధ్యే ద్వీపోనామ్నాతు మధ్యమః । అస్మిన్ మన్వంతరే క్షిప్తః సాగరైశ్చ చతుర్దిశమ్ ॥ 6
వైడూర్య పర్వతః పూర్వముత్తరేణ హిమాచలాత్ । పశ్చార్ధే కాంచనగిరే రుదగేవచ లావణాత్ ॥ 7
వేష్టిత స్సాగర స్సర్వో నానా సత్వాశ్రయో నృప ! । హిమాలయ స్సాగరైస్తు కృతోదేశ ద్వయస్తథా ॥ 8
లవణస్యోత్తరే పార్శ్వే సాగరస్య చ దక్షిణే । పురీలంకా సన్నివిష్టా యస్యాం వై రావణో హతః ॥ 9

వజ్రుండడుగ మార్కండేయుండు మానవుల కర్మభూములలోనిదగు భారతవర్షముంగూర్చి యిట్లనియె : ఈభారతవర్షము తొమ్మిది భాగములుగ నున్నది. వాని నెనిమిది గిరులు కప్పియున్నవి. అవి అగమ్యములు. హిమాచలము మొదలు సముద్ర పర్యంతము దక్షిణోత్తరములుగ నవి యున్నవి. అవి స్వమాలి, హేమమాలి, శంభువు, సువర్ణనిధి, వైడూర్యగిరి, రాజతగిరి (వెండికొండ), మణిమంతము, ఇంద్రద్యుమ్నము వేదేతము తామ్రవర్ణము, గభస్తిమంతము, రాగద్వేషము. గాంధర్వము వారుణము అని. వానిలో తొమ్మిదవ ద్వీపము మధ్యమమనుపేర నున్నది. ఈమన్వంతరమందు నలుదెసలకు సాగరులచే విమ్మివేయబడినది. హిమాలయమున కుత్తరముగ వైడూర్యపర్వతము కాంచనగిరికి పడమటి నగమందు లవణ సముద్రమున కుత్తరమున నున్నది. దీనికి నానాసత్వసమాశ్రయమను సాగరము చుట్టునున్నది. హిమాలయమును సాగరులు రెండుదేశములుగ విభజించిరి. ఉప్పు సముద్రము యొక్క ఉత్తరప్రక్క సాగరమునకు దక్షిణమున లంకాపురిగలదు. రావణుడందు నిహతుడయ్యెను.

లవణేనతు సంపృక్తః సముద్రో లవణోయతః । హిమాచలస్య యోభాగో వర్షేఽస్మిన్ నృప ! భారతే ॥ 10
తత్రాస్తిశైల ప్రవరో ద్వితీయో గంధమాదనః । శ్వేతశ్చ పర్వత శ్రేష్ఠో మందరశ్చ మహాగిరిః ॥ 11
ఏతేశైలవరా దృష్టాః పాండవైశ్చ మహాత్మభిః । హిమాచలస్యమధ్యేతు కైలాసోనామ పర్వతః ॥ 12
హిమవత్యేవ విఖ్యాతో నరనారాయణాశ్రమః యస్యసా బదరీ రమ్యా నానాశకుని సేవితా ॥ 13
ఉష్ణతోయ వహా గంగా శ్వేతతోయ వహా పరా । సువర్ణ సికతా రాజన్ ! తాపసై రుపశోభితా ॥ 14
ఇత్యేతే కథితా ద్వీపాః ప్రాధాన్యేన తవా నఘ ! ఏతేషామంతరే ద్వీపాః శతశోథ సహస్రశః ॥ 15
నతే వర్ణయితుం శక్యాః వర్షాణాంతు శతైరపి । వివర్జయిత్వా భరతస్య వర్షం, వర్షేషు సర్వేషు నరేంద్రసింహ !
నిరామయావీత భయా మనుష్యాః వర్ణేషు సర్వేషు తథైవచోక్తాః ॥ 16
ఆయుఃప్రమాణం లభతేహ రాజన్ ! ద్వీపేషు సర్వేషు నరోమయోక్తమ్ ।
కృత్వాశుభం కర్మతు భారతేఽస్మిన్ ద్వీపేషు సర్వేషు నరాః ప్రయాన్తి ॥ 17
వృక్షేషు తేషాంప్రభవన్తికామాః స్త్రియశ్చ తేషామపి రూపవత్యః ।
దండశ్చ తేషాంచ న దాండికోఽస్తి సన్మార్గగాస్తేపి తథాచ రాజన్ ॥ 18

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే - మార్కండేయ వజ్రసంవాదే భారత వర్షవర్ణనంనామ అష్టమోఽధ్యాయః.

ఈ భారతవర్షమందు హిమాలయము భాగమున సముద్రము ఉప్పుతో గూడినందున లవణ సముద్రమయ్యెను. అందుగూడ రెండవ పర్వత శ్రేష్ఠము గంధమాదనము శ్వేతము మందరమహాగిరియుంగలవు. వీనిని మహానుభావులు పాండవులు చూచిరి. హిమాచలము నడుమ కైలాసపర్వతముగలదు. హిమగిరిపైనే నరనారాయణాశ్రమము బదరియను పేర రమ్యమైన ప్రదేశమున్నది. అక్కడ గంగ వేడినీటితో అచ్చపు తెల్లని నీటితో నుండును. అందలి యిసుక సువర్ణమయము. తపస్వులచే నలంకరింపబడినట్టిది. ఇది

ప్రధాన ద్వీపముల విషయము. వీనిలో అంతర్ద్వీపములు వేలకొలది యున్నవి. వానిని వర్ణింప నూరేండ్లైన శక్యముగాదు. భరత వర్షమును విడిచి మరియుంగల వర్షములందలి మనుజులు నిరామయులు (రోగరహితులు) భయరహితులు ననంబరగుదురు. భారత వర్షమందు శుభాశుభకర్మమాచరించి నరులు పురుషాయుర్దాయము బడయుదురు. ఆయావర్షములందు జనింతురు. వృక్షము లభి మతార్థముల నొసంగును. రూపవతులు స్త్రీలను నందుడయింతురు. అక్కడ జనులు సన్మార్గగాములగుటచే వందనముగాని వండితుడుగాని వారికి లేరు. భారతవర్షము కర్మభూమి తక్కిన వర్షములు భోగభూములు (కర్మఫలానుభవము నిచ్చునవి) అన్నమాట.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున భారతవర్షవర్ణనమను నెనిమిదవ యధ్యాయము.

# తొమ్మిదవ అధ్యాయము

## జనపద వర్ణనము

వజ్ర ఉవాచ -

శ్రోతుంజనా నిహేచ్ఛామి సాగరద్వీపవాసినః । ప్రాధాన్యేన భృగుశ్రేష్ఠ ! విస్తరాద్విస్తరోయతః ॥ 1

మార్కండేయ ఉవాచ :

పాంచాలాః కురవో మత్స్యా యౌధేయా స్సవటశ్చరాః । కుంతయ శ్శూరసేనాశ్చ మధ్యదేశజనాస్స్మృతాః ॥ 2

వృషధ్వజాంజనాః పన్నాః సుహ్మా మాగధ చేదయః । కాశయశ్చ విదేహాశ్చ పూర్వస్యాం కోశలా స్తథా ॥ 3

కలింగ వంగ పుండ్రాంగ వైదర్భా మూలకా స్తథా । వింధ్యాన్తనిలయాః ప్రోక్తాః పూర్వదక్షిణతః స్మృతాః ॥ 4

పుళిందాశ్మక జీమూత నరరాష్ట్రనివాసినః । కర్ణాటకాః భోజకటా దక్షిణా పథవాసినః ॥ 5

అంబష్ఠా ద్రవిడా నాగా కాంబోజాః స్త్రీముఖా శ్శకాః । ఆనర్త వాసిన శ్చైవ జ్ఞేయా దక్షిణ పశ్చిమే ॥ 6

స్త్రీరాజ్యం సైంధవా మ్లేచ్ఛా నాస్తిక్యా యవనా స్తథా । పశ్చిమేన చ విజ్ఞేయాః పటుమానౌషధైః సహ ॥ 7

మాండవ్యా శ్చ తుషారాశ్చ మూలికాశ్చ ముఖాః ఖశాః । సుహాకేశా మహానాసా వేశాస్తూత్తర పశ్చిమే॥ 8

లంపగా స్తాలనాగాశ్చ మరుగాంధార జాహూతాః । హిమవన్నిలయా మ్లేచ్ఛా హ్యుదీచీం దిశమాశ్రితాః ॥ 9

త్రిగర్త మీన కౌలూతా బ్రహ్మపుత్రా స్సతీగణాః । అభిసారాశ్చ కాశ్మీరా శ్చోదక్పూర్వేణ కీర్తితాః ॥ 10

రాజేంద్ర సాగరద్వీపాః ప్రధానా వసుధాధిపాః । భవతేఽహం ప్రవక్ష్యామి దిగ్దేశేన నిబోధ తత్ ॥ 11

పంచాలనాథో మగధాధిపశ్చ కళింగరాట్ భోజ కటేశ్వర శ్చ।

అనంతక స్సైంధవక స్తుషారో మద్రేశ్వర శ్చాథ కుజాతనాథః । 12

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే జనపద వర్ణనంనామ నవమోఽధ్యాయః.

వజ్రుడు సముద్రద్వీపములం దిక్కడవసించు జనులంగూర్చి సవిస్తరముగ వినవలతునన మార్కండేయుండిట్లనియె. పాంచాల కురువులు మత్స్యులు యౌధేయులు వటశ్చరులు కుంతులు శూరసేనులు ననువారు మధ్యదేశ జనులు. వృషధ్వజులు అంజనులు పన్నులు సుహ్మలు మాగధులు చేదిదేశమువారు కాశులు విదేహులు కోసలులు తూర్పుదేశమువారు. కలింగులు వంగులు పుండ్రులు అంగులు వైదర్భులు మూలకులు వింధ్య పర్వతముచివర ఆగ్నేయదిశయందు నుండురు. పులిందులు అశ్మకులు

జీమూతులు సరరాష్ట్రవాసులు కర్ణాటకులు భోజకటులు దక్షిణాపథవాసులు. అంబష్ఠులు ద్రావిడులు నాగులు కాంభోజులు స్త్రీముఖులు శకులు అసంతవాసులు ననువారు దక్షిణ పశ్చిమ నిరృతి మూలనుండువారు. స్త్రీరాజ్యము సైంధవులు మ్లేచ్ఛులు నాస్తికులు యవనులు పటుములు నైషధులు పడమటి దిసనివసించువారు. మాండవ్యులు తుషారులు మూలికులు ముఖులు ఖశలు మహాకోశలు మహావాసులు ఉత్తర పశ్చిమ (వాయవ్యమూల) వాసులు. లంపకలు తాళులు నాగులు మరుగాంధార జాహూతులు హిమన్నివాసులు. మ్లేచ్ఛులుత్తరదేశమునాశ్రయించిరి. త్రిగర్త మీన కౌలూతులు బ్రహ్మపుత్రులు సతీగణులు అభిసారులు కాశ్మీరులు ఈశాన్యవాసులు. సాగరము, ద్వీపములు ప్రధానముగా గలరాజుల నెఱింగించెద వినుము; పాంచాలరాజు మగధాధిపుడు కలింగరాజు భోజకట ప్రభువు అసంతకుడు సైంధవకుడు తుషారుడు మద్రేశ్వరుడు లూతరాజు ననువారు వీరు.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున జనపదవర్ణనమను తొమ్మిదవయధ్యాయము.

# పదవ యధ్యాయము

## సప్తగిరులందు పుట్టిన నదుల వర్ణనము

వజ్ర ఉవాచ :

నివిష్టాన్ సాగరే ద్వీపే సప్తాహం కుల పర్వతాన్ । నామతశ్శ్రోతు మిచ్ఛామి తత్ప్రసూతాశ్చ నిమ్నగాః ॥ 1

మార్కండేయ ఉవాచ –

మహేంద్రో మలయ స్సహ్య శ్శుక్తిమా నృక్షపర్వతః । వింధ్యశ్చ పారియాత్రశ్చ సప్తాఽస్మిన్ కులపర్వతాః॥ 2

త్రిసామా ఋషికుల్యా శ్చ ఇక్షుగా త్రిదివాలయా లాంగూలినీ వంశధరా స్స్యృస్తే్వతా మహేంద్రజాః ॥ 3

కృతమాలా తామ్రపర్ణీ పుష్పజా చోత్పలావతీ । శీతోదకా గిరివహా నద్యో మలయ సంభవాః ॥ 4

తుంగభద్రా సుప్రకారా వాహ్యా కావేరికా తథా । దక్షిణా పథమధ్య స్థా సహ్యాపాద వినిస్సృతాః ॥ 5

ఋషికా సుకుమారీ చ మందగా మందవాసనీ । నృపమాలా శిరీచైవ శుక్తిమ త్పాద నిస్సృతాః ॥ 5

మందాకినీ దశార్ణాచ శోణోదేవీచ నర్మదా । తమసా పిప్పలా చేతి ఋక్షవత్పాద నిస్సృతాః ॥ 7

వేణా వైతరణీ చైవ నర్మదా చ కుముద్వతీ । తోయా సేతు శిలాచైవ వింధ్య పాదవిని స్సృతాః ॥ 8

పారా చర్మణ్వతీ పాదా విదిశా వేణు వత్యపి । సిప్రా హ్యవంతీ కుంతీ చ పారియాత్ర వినిస్సృతాః ॥ 9

నద్యః ప్రధానాః కథితాః తవైతాః పుణ్యాః పవిత్రా ఋషిసేవితాశ్చ ।
సన్తీహ నద్యశ్చ సహస్రశో న్యా వక్తుం నశక్యా యదు బృ చనాథ ॥ 10

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే-ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే సప్తగిర్యుద్భవ నదీవర్ణనంనామ దశమోఽధ్యాయః

సాగరమందు ద్వీపమునందు చొచ్చుకొనిపోయిన కులపర్వతములను నేడింటిని అందుపుట్టిన నదులనుగూర్చి వినగోరెదనన మార్కండేయుడిట్లనియె. మహేంద్రము మలయము సహ్యము శక్తిమంతము ఋక్షము వింధ్యము పారియాత్రము ననునవీభారతమందు కుల పర్వతములు. త్రిసామ ఋషికుల్య ఇక్షుగ త్రిదివాలయ లాంగూలి వంశధర యనునదులు మహేంద్రపర్వతమునందు

బుట్టినవి. కృతమాల తామ్రపర్ణి పుష్పజ ఉత్పలావతి శీతోదక గిరివహాయనునవి మలయపర్వతమందు జనించినసదులు. తుంగభద్ర ప్రకార వాహ్యా కావేరి దక్షిణాపథ మధ్యస్థము లయిన నదులు. ఇవి సహ్య పర్వత ప్రత్యంతపర్వత జాతములు. ఋషిక సుకుమారి మందగ మందవాసిని నృపమాల శీరి, శుక్తిమత్పర్వతపాదమున బుట్టినవి. మందాకిని దశార్ణ శోణ దేవి నర్మద తమస పిప్పలయనునవి ఋక్షవత్పర్వతపాదమున వెడలినవి. వేణ వైతరణి నర్మద కుముద్వతి తోయ, సేతుశిల యనునవి వింధ్య పాదోద్భవములు. పారా, చర్మణ్వతి, పాదపదిశ వేణువతి సిప్రా అవంతి కుంతియు పారియాత్రపాదమునుండి జాలువారినవి. ఋషి సేవితములయి పవిత్రములైన ప్రధాన పుణ్యనదులం దెల్పితిని. ఓ యదునందన ! ఇంకను వేలకొలది నదులున్నవి. చెప్పుటకు శక్యముగాదు.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున మార్కండేయ వజ్రసంవాదమున సప్తగిరి సంజాత నదీ వర్ణనమను పదియవయధ్యాయము

# పదునొకండవ అధ్యాయము

## హిమవన్నదీ వర్ణనము

వజ్ర ఉవాచ :

హిమవత్పాద సంభూతాః పుణ్యాః బ్రహ్మన్ విశేషతః ప్రాధాన్యేన సమాచక్ష్వ ! నద్యః పాపభయావహాః ॥ 1

మార్కండేయ ఉవాచ :

కౌశేయ వర్ణసలిలా కుశేశయ విమిశ్రితా । కౌశికస్య ప్రియా నిత్యం కౌశికీ నిమ్నగోత్తమా ॥ 2

నిమజ్జత్పాపసంఘౌఘ నిర్మలీ కరణే శుభా । నిశ్చరా నిమ్నగా శ్రేష్ఠా నిత్యం మునిజన ప్రియా ॥ 3

గజేంద్ర భిన్న కూలాతు గంగాతుల్యాచ పుణ్యతః । గంధర్వ గణ గీతా చ గండకీ గోకులా కులా ॥ 4

లోకానాం పావనాయాలం లోక నాథేన నిర్మితా । లోకదృష్టి మనోహారీ లోహిత్య శ్చ మహానదః ॥ 5

దివస్సేవ్యా సదావిప్రైర్దివి దేవగణైర్యథా । దృషద్వతీ సమాకీర్ణా దర్శనీయోదకా తథా ॥ 6

బహుదా బహుసత్త్వాథ మేనాచ ప్రలయక్షమా । అనవచ్ఛిన్నవాహాతు లిఖితస్యచబాహుదా ॥ 7

ధర్మప్రదాసేవకానాం ధూతపాపా మహానదీ । గోమతీ గోకులా కీర్ణా గజేంద్ర గణశోభితా ॥ 8

గంధర్వగీతగంభీరా గణయక్షగుణైర్యుతా । మహాకదంబ కాదంబ కేకారవ వినాదితా ॥ 9

కుముదోత్పల కల్హార కుసుమైరాకులోదకా । దేవదేవస్య యాదేవీ దయితా శంకరస్యచ ॥ 10

దేవికా సా పురారాజన్ ! దేవలోక గతిప్రదా । విస్తారిత మహామాలా విషమద్వీప వీజితా ॥ 11

విష్ణులోక ప్రదాదేవీ వితస్తాఽఘ వినాశినీ । చంద్ర భాగాచ చంద్రాంశ చారుశీత జలావిలా ॥ 12

చంద్రలోక ప్రదాస్నానే చాఽమరత్వ ప్రదాయినీ । సరోజాకుల తీర్థాచ సరయూ స్సరితాంవరా ॥ 13

సతతం సేవితా సద్భిః సోమలోక మభీప్సుభిః । ఇంద్రేభ సేవిత తటా ఇంద్రలోక ప్రదాయినీ ॥ 14

ఇందీవరా కుల జలా తథాదేవీ ఇరావతీ । విశిష్ట పాశ విచ్ఛేదే విపాశా కుశలా తథా ॥ 15

తథైవ సర్వపాపానాం విపాక కారిణీ నృణామ్ । వశిష్ఠ విద్రుతాదేవ శతద్రుర్ద్రుత గామినీ ॥ 16

రౌద్రానామపి సత్వానాం రుద్రలోక ప్రదాశివా । కృష్ణేన కృష్ణతో యాచబాల్యే పీతపయోధరా ॥ 17
యమస్వసాచ యమునా యామ్య దుఃఖ వినాశనీ । సప్రకారాచ నదీ తచ దేవీ సరస్వతీ ॥ 18
తస్యా స్సప్తసుభాగేషు నామాని శృణుమేనృప ! । సుప్రభా కాతరాక్షీచ విశాలా మానసహ్రదా ॥ 19
సరస్వత్యోఘనాదాచ సువేణు ర్విమలోదకా । పుష్కరేనై మిశే చైవ గయాయాం కోశలేషుచ ॥ 20

కురుక్షేత్రేక్రమాద్జ్ఞేయా గంగాద్వారే హిమాచలే ।
నద్యస్త థైతా హిమవత్ప్రసూతా ప్రధానభూతాకథితా నృవీర ।
ఉక్తాశ్చ నద్యశ్చ సహస్రశోఽన్యాః సర్వాః పవిత్రాః ఋషివర్య జుష్టాః ॥ 21
వర్షస్య తస్యాపి తథాన్తరేఽస్మిన్ సప్తప్రకారాచ త్రిమార్గగాపి ।
ద్వీపం ప్రవిష్టా భరతస్య రాజన్ ! భగీరథా రాధిత పద్మజోప్తాః ॥ 22

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే హిమవన్నదీ వర్ణనం నామ ఏకాదశోఽధ్యాయః.

వజ్రుడు పలికెను - హిమవత్పాదమున బుట్టిన పుణ్యనదులను ముఖ్యముగ నానతిమ్మన 'మార్కండేయుడిట్లనియె. తెలిపట్టు రంగు నీరుగలది తామరపూలతో నిండినది నిత్యము కౌశికునకుప్రియమైనదియనగు కౌశికీ నది ఉత్తమమైనది. తనలో స్నానము సేసిన వారిపాపములను నాశనముచేయుటలో శుభమూర్తియైన నిశ్చరయనునది శ్రేష్ఠమైనది. మునిజనప్రియ ఏనుగులవప్రక్రీడచే నౌరయు నొడ్డులంగూడినది. పవిత్రతలో గంగానదీ తుల్యమైనది గంధర్వగణగీతయునైన గండకీనది గోకులసంకుల లోకపావని. లోకనాథుడేర్పరచినది లోకదృష్టి మనోహారియగు లౌహిత్యమను మహానదము పుణ్యప్రదము స్వర్గసేవ్యము విప్రదేవగణ సేవ్యము దృషద్వతి దర్శనీయోదకముగలది. బహుదము బహుసత్త్వయునగు మేన, ప్రలయక్షమ ఎడతెగని ప్రవాహము గలది. లిఖితునికి బాహువుల నిచ్చినది బాహుద పుణ్యనది. సేవకులకు ధర్మమొసగునది ధూతపాపయునైనది మహానది. గోకులాకీర్ణ గోమతి గజరాజములవగాహించునది. గంధర్వగీత గంభీర గణ యక్షగణసంయత కోకిలల కూతలు నెమిళులయొక్కయు కేకారవములం బ్రతిధ్వనించునది తెలినల్లగలువలు ఎర్ర తెలిదామర పువ్వులతో నిండిన నీట గుల్కునది దేవదేవుని దేవి శంకరుని ప్రియురాలు. దేవికా నది దేవ లోక గతి నిచ్చునది. విస్తరించిన యొడ్డులతో ఎగుడుదిగుడు ద్వీపములతో గూడి విష్ణులోకమిచ్చు దేవి వితస్తానది పాపనాశిని. చంద్రకిరణ రమణీయ శీతల సలిలావిల చంద్రభాగ స్నానముచే అమరత్వమిచ్చునది. అశేష పాశవిచ్ఛేద కుశల విపాశ సరోజాకుల సరయూ నిరంతరసేవనముచే సోమలోకమిచ్చునది. ఇంద్రగజమగు ఐరావతము సేవించు తీరములుగలది ఇంద్రలోకప్రద ఇందీవర సుందరజల యిరావతి.వశిష్ఠులు ప్రవహింపజేసినది వేగముగ గమనించునది శతద్రు నది. రౌద్రములయిన సత్వములకు గూడ రుద్రలోకము నిచ్చు శివానది కృష్ణతోయ (నల్లని నీరు గలది)యై బాలకృష్ణ పీతపయోధర యమునిచెల్లెలునగు యమున యమలోక దుఃఖ వినాశిని. సప్తప్రకార (ఏడుపాయలైన) సరస్వతీనది. ఆమె యేడు భాగముల పేరులు వినుము. సుప్రభ, కాతరాక్షి, విశాల, మానసహ్రద, సరస్వతి, భీమనాద, సువేణువు. పుష్కరక్షేత్రమందు నైమిశమందు గయలోను కోసలదేశముల కురుక్షేత్రమున గంగాద్వారమున హిమాచలముననున్న యీ నదులు హిమవద్గిరిం బుట్టినవి ప్రధానములు. ఎన్నోవేల నదులు పవిత్రములు ఋషివరులు సేవించినది తెల్పితిని. ఈ భారతవర్షమందు త్రిమార్గయై భరత ద్వీపమున బ్రవేశించినది భగీరథుడారాధించిన బ్రహ్మచే తెలుపబడినది భాగీరథి పుణ్యనది.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము-ప్రథమఖండమున మార్కండేయ వజ్రసంవాదమున హిమవన్నదీవర్ణనమను పదునొకండవ అధ్యాయము.

# పంద్రెండవ అధ్యాయము

## కోసల వర్ణనము

వజ్ర ఉవాచ :

భారతస్యాస్య వర్షస్య భేదేఽస్మిన్నవమే ప్రభో! । కిమర్థం సాగరః ఖాతః స కృతస్సగరైస్తథా ॥ 1

మార్కండేయ ఉవాచ :

భారతస్యాస్య వర్షస్య భేదేఽస్మిన్నవమే నృప! । నవమే చ దిశాం భాగే పూర్వస్యాం దిశి యాదవ! 2
కోసలోనామ విషయః ప్రభూత ధనధాన్యవాన్ । స్ఫీతగ్రామ గుణాఽఽఢ్యోఽస్తి నిత్యం ముదితమానవః ॥ 3
పయస్విన్యః పయస్విన్యో యత్ర సస్యధరా ధరా । మనోభిరామా రామాశ్చ పురుషాః పౌరుషాగ్రగాః ॥ 4
విదగ్ధ జనభూయిష్ఠా సర్వపుణ్య సమాకులా । నగరైర్న విశిష్యన్తే యత్రగ్రామా మనోహరాః ॥ 5
గవాంప్రవేశే సాయాహ్నే యత్రగ్రామేషు భాస్కరః । ధూళిపుంజ పరిక్షిప్తో వనసాను విరాజితః ॥ 6
పశ్చిమేప్రథమేచైవ యత్రయామే విరాజితః । రాత్రౌబ్రహ్మ ధ్వనిస్తత్ర తిష్ఠతీవ నభస్తలమ్ ॥ 7
ఫలావనత శాఖాఢ్యా శ్ఛాయాద్రుమ సమాకులాః । ప్రపాకూప తడాగాఢ్యాః పంథానో యత్రయాదవ! 8
వ్యాధితస్కర దుర్భిక్ష పరరాష్ట్ర భయానిచ । జనాయత్ర న జానన్తి నాఽకాల మరణం తథా ॥ 9
యూపచిహ్నా మహీయత్ర దేవ వేశ్మాప తంసివా । యత్రోత్సవ సమాకీర్ణ వరవాపీ విభూషితా ॥ 10
ఉద్యానేషు సదాయత్ర వేణుగాంధర్వ నిస్వనం । శిలీముఖరవైర్మిశ్రం? యాత్యసం బాధతాం గుణైః ॥ 11
యస్మిన్న కశ్చిత్ చ్యవతే నృధర్మాత్ దీనోజనో యత్రనచాస్తికశ్చిత్ ।
ననేత్రహీనో దికలేంద్రియోవా వసుంధరా యత్రయథార్థనామా ॥ 12

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే-ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే కోసలవర్ణనం నామ ద్వాదశోఽధ్యాయః.

వజ్రుడు-ఈ భారతవర్ష యొక్క తొమ్మిదవభాగమందు సగరు లెందులకు సాగరము త్రవ్విరని యడుగ మార్కండేయుడిట్లనియె: ఈ భారతవర్షముయొక్క నవమభాగము నందు నవమ దిగ్భాగమందు తూర్పుదిక్కున కోసలమను దేశమున్నది. అది ధనధాన్య సమృద్ధము. నిండైన గ్రామములతో నిత్యము నానందభరితులగు ప్రజలతో గూడినదిపయస్వియనులు. పయస్వినులు అనగా నదులు జలసమృద్ధములు. లేక గోవులు సమృద్ధ క్షీర సంయుతములు. ధర సస్యధర (పంటలతో గూడినది) రామలు (స్త్రీలు) మనోభిరాములు (సుందరులు) పురుషులు పౌరుషమందగ్రగాములు. మంచి నేరిమిగల జనులు గలది సర్వ పుణ్యానిలయము. గ్రామములు మనోహరములు. నగరములు వాని నే విషయమునందును మించవు గ్రామములందు సాయంకాలమందు ఆవులమందలు ప్రవేశించునపుడు (గోధూళి లగ్నమందన్నమాట) సూర్యుడు గోధూళిధూసరితుడై వనములందు కొండచరియలందు సాయంకాల ప్రథమ యామమందస్త సమయమున అరుణారుణప్రభలతో విరాజిల్లుచుండును. అట రాత్రులందు స్వాధ్యాయధ్వని వినిపించుచుండును. ఫలభారమున నవనత శాఖములైన ఫలవృక్షములతో చల్లని నీడ నొసంగు ఛాయావృక్షములతో చలివెందలులు నూతులు చెరువులతో నిండుగులుకు మార్గములతో నా గ్రామములు చక్కగ విలసిల్లుచుండును. వ్యాధులు దొంగలు కరవు శత్రుభయము మొదలగు నీతిబాధలను అకాలమరణములను నక్కడి జన మెరుంగరు. ఆ గ్రామములందలి యుద్యానములందెల్లవేళల వేణునాదము తుమ్మెదల గానముతో కలిసిపోయి గుణములచే నెట్టి వైరుధ్యముపొందక శ్రవణసుభగమగుచుండును. అందేయొక్కండును దన

భయము నుండి కాచువాడు. దీనుడైనవా డొక్కడును లేడు. గ్రుడ్డివాడు నింద్రియవైకల్యముగలవా డక్కడ లేనేలేడు. వసుంధరయను పేరక్కడ భూమికి సార్థకము. అనగా వసు = ధనమును ధర = ధరించునది. అనుమాట సార్థకముగా నా గ్రామ భూములైశ్వర్యసమృద్ధములై విలసిల్లుచుండుననుమాట.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున మార్కండేయ వజ్రసంవాదమున కోసలవర్ణనమను పండ్రెండవ యధ్యాయము

# పదుమూడవ అధ్యాయము

## అయోధ్యా వర్ణనము

మార్కండేయ ఉవాచ :

కోసలేవిషయే స్ఫీతే తస్మిన్ మను జపుంగవ ! దేవానా మప్యయోధ్యాస్తి త్వయోధ్యానామతఃపురీ ॥ 1

ప్రాకార పరిఘోపేతా సరయూతీర శోభితా । శోభితా భవనై ర్ముఖ్యైః సువిభక్త మహాపథా ॥ 2

నిత్యప్రసన్నై ర్నిర్మాతంగై రంజనాచల సన్నిభైః దేవనాగకులోత్పన్నైః శతసంఖ్యై ర్విరాజితా ॥ 3

నిర్మాంసవక్త్రై స్తురగైః సువర్ణైశ్చ మనోజవైః దీర్ఘగ్రీవాక్ష కూటైశ్చ మహోరు జఘనై ర్వృతా ॥ 4

పద్మగర్భ సవర్ణాంగ్యః పూర్ణచంద్ర నిభాననాః సల్లాపోల్లా సకుశలాః యత్రవేశ్యాస్సహస్రశః ॥ 5

నతత్పుణ్యం నసా విద్యా నతచ్ఛిల్పం నసా క్రియా అయోధ్యాం ప్రాప్య యస్యార్థీ నిరాశః ప్రతిగచ్ఛతి ॥ 6

ఉద్యాన శత సంబాధా సమాజోత్సవ శాలినీ । అరోగ వీరపురుషా సర్వతర్క వివర్జితా ॥ 7

వీణావేణు మృదంగానాం శబ్దై స్సతతనాదితా సదా ప్రహృష్టమనుజా బహురత్నైః శోభితా ॥ 8

బ్రహ్మఘోష మహాఘోషా ద్విజ బృందోపశోభితా । సాధ్యధూమోద్గమాఢ్యేన వాయునా నష్టకిల్బిషా ॥ 9

సుగంధి ధూప విక్షేప సురభీకృత మారుతా । సుగంధి మసుణాకీర్ణా నిత్యమాపణ వీథిషు ॥ 10

యత్ర దీనోజనో నాస్తి మలినః కృశితోఽపివా । వేదనిందాపరః క్షుద్రో భిన్నసేతు ర్ననాస్తికః ॥ 11

విస్తీర్ణా దశ మధ్యేచ యోజనానాం మహాపురీ । సరయూతీర మాశ్రిత్య యోజనత్రయ మాయతా ॥ 12

మన్వంతరేఽస్మిన్ పునరేవరాజ్ఞా వినిర్మితా సా మనునా నృవీర ।
మన్వంతరం యేన జగత్సమగ్రం పాల్యంయథావద్ యదు బృందనాథ ॥ 13

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే అయోధ్యావర్ణనం నామ త్రయోదశోఽధ్యాయః

మార్కండేయుడనియె : సర్వసమృద్ధమగు కోసలదేశమందు అయోధ్యాపురమున్నది. అది దేవతలకేని యుద్ధముచేసి జయింపనలవిగానిది. (అదిగాక దేవతల యొక్క అయోధ్యయైన స్వర్గమే యిక్కడ అయోధ్య పేర విలసిల్లుచున్నదని భావము. దేవానాం పూరయోధ్యా అని శ్రుతిపఠనము) ప్రాకారములు కందకములతో నది సరయూతీరమందు తీర్చిన వీథులతో మహాభవనము లతో శోభించుచు అటుకకొండలట్లున్న సాధువులైన యేన్గులతో విరాజిల్లుచున్నది. ఆ యేనుగులు దేవతల యేనుగుల కులమందు బుట్టినవి. మాంసపుష్టిలేని ముఖములు చక్కని చెవులు పొడవైన మెడలు అక్షకూటములు పెద్ద తొడలు జఘనములు గల్గిన గుఱ్ఱము

లతో విరాజిల్లుచుండును. పద్మగర్భముతో సమానమైన అరుణవర్ణములయిన శరీరములు పూర్ణచంద్రుని కీడగు ముఖములుగల తరుణులు సంభాషణచతురలైన వేలకొలది వేశ్యలందు విలసిల్లుచుందురు. అయోధ్యం జేరి తాను కోరిన యా పుణ్యమును ఆ విద్యను ఆ శిల్ప చాతుర్యమును ఆ కార్యదక్షతను బడయక నిరాశుడై తిరిగిపోయిన మానవు డొక్కడేని యుండడు. వందలకొలది యుద్యానములతో నొత్తిడికొని ప్రజలు సమాజములుగా నేర్పడి సేసికొను నుత్సవములతో ఆరోగ్యవంతులయిన వీరులతో ద్విజబృందములతో ఆజ్యధూమపరిమళభరిత వాయువుచే పాపములు వోయి (పవిత్రమై) దశాంగాది సుగంధిధూప వ్యాప్తిచే సువాసితములైన వాయువులతో బజారులందెల్లపుడు ఘనసార (పచ్చకప్పురము) కుంకుమ (కుంకుమపువ్వు) కస్తూరి సుగంధ (మంచిగంధము) సురభిళ-సుకుమార సుందర శరీరులగు జనులతో సమ్మర్దముగొని దీనుడు మలినుడు బక్కచిక్కినవాడు వేదనిందకుడు నీచుడు భిన్నసేతువు (ధర్మము నీతియొక్క హద్దుమీరినవాడు) నాస్తికుడునైన మానవుడు మచ్చునకైననందు గానబడడు. సరయూనది యొడ్డున మూడు యోజనముల వెడవు పది యోజనముల నగరమధ్యవైశాల్యమునుంగల్గి మన్వంతరమున మనువుచే నిది నిర్మింపబడినది. ఆ మనువు యథాశాస్త్రముగ నొక్క మన్వంతర మీ సర్వజగమ్ము బాలించినాడు.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమ ఖండమున అయోధ్యాపురవర్ణనమను పదుమూడవ యధ్యాయము.

# పదునాల్గవయధ్యాయము

## ఇక్ష్వాకుకుల వర్ణనము

మార్కండేయ ఉవాచ :

వైవస్వతేనమనునా యేన సానిర్మితాపురీ సతుకృత్వా చిరం రాజ్యమిక్ష్వాకు మభిషిచ్య చ ॥ 1
పుత్రేభారం సమావేశ్యస శరీరో దివంగతః తతస్థః పాలయన్నాస్తే త్రైలోక్యం సచరా చరమ్ ॥ 2
తేనమన్వంతరం సర్వం పాలనీయ మిదం జగత్ । ఇక్ష్వాకు స్తస్యతనయః పాలయామాస మేదినీమ్ ॥ 3
ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ సత్యవాదీ జితేంద్రియః సుదర్శ స్సర్వ భూతానాం నయాపనయ కోవిదః ॥ 4
బ్రహ్మణ్యశ్చ శరణ్యశ్చ దీనానాథాను కంపనః । దైవమంత్ర ప్రభూత్సాహ శక్తిభిశ్చ సమన్వితః ॥ 5
షాడ్గుణ్యవిస్మయోత్సాహః స్మితపూర్వాభి భాషణః । యుక్తదండోన నిర్దండో నచదండరతి స్తథా ॥ 6
వేద వేదాంగ తత్వజ్ఞో యజ్ఞయాజీ తపోరతిః । అక్షుద్ర లీలోఽభిమతః సర్వసత్త్వే న హింసకః ॥ 7
మాన్యోమానయతాం శక్యః సుఖఃపూజ్య ప్రపూజకః కామః క్రోధో మదోమానో లోభోహర్ష స్తథైవచ ॥ 8
నిత్యం శరీర ప్రభవా రిపవ స్తేన షడ్జితాః । సర్వత్ర విధినా దృశ్యః సుభగః ప్రియదర్శనః ॥ 9
బహుధాన్యో బహుధనో బహు నాగాశ్వపూరుషః । అయోధ్యానిలయో నిత్యం దేవారిగణ దర్పహా ॥ 10
స తదా పాలయామాస పుత్రవత్ సకలాః ప్రజాః । నాఽధర్మః కశ్చిదప్యాసీత్ తస్మిన్‌రాజని మానవః ॥ 11
దీనోవా వ్యాధితోవాపి స్వల్పాయుర్వాచ దుఃఖితః । మూర్ఖో వా మంద రూపోవా దుర్భగోవా నిరాకృతిః ॥ 12
ఏకత్రదేహే సకలం గుణౌఘం ద్రష్టా హ మిత్యేవ విశిష్ట బుద్ధిః ।
ససర్జతం రాజవరం మహాత్మాప్రజాపతిః సర్వజగత్ప్రధానః ॥ 13

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే - ప్రథమఖండే - మార్కండేయ వజ్రసంవాదే ఇక్ష్వాకు కుల వర్ణనం నామ చతుర్దశోఽధ్యాయః

మార్కండేయుడనియె : వైవస్వతమనువా యయోధ్యాపుర నిర్మాణము సేసినవాడు. అతడు చిరకాలము పాలించి తన కుమారు నిక్ష్వాకువునకు బట్టాభిషేకము గావించి సశరీర స్వర్గమొందెను. అతడక్కడనుండి చరాచరమైన ముల్లోకము నేలుచున్నాడు. ఎల్ల మన్వంతర మతని యేలుబడిలో నిజగముండును. ఇక్ష్వాకువాతని పుత్రుడు ధర్మజ్ఞుడు కృతజ్ఞుడు సత్యవాది జితేంద్రియుడు సర్వభూతములకు దర్శనీయుడు నయానయ విచక్షణుడు బ్రహ్మణ్యుడు శరణ్యుడు దీనజనదయాళువు దేవ మంత్ర ప్రభు ఉత్సాహశక్తులు గలవాడు (సాధారణముగా ప్రభుమంత్రోత్సాహ శక్తులు గూడే పేర్కొనబడుచుండును. ఇక్కడ దేవశక్తి నాల్గవదిగా వ్యాసులు పేర్కొనుట విశేషము) సంధివిగ్రహాది రాజనీతి ప్రసిద్ధ షాడ్గుణ్యము చక్కగనెరిగినవాడు నిరుపద్రవ ముందుగ బలుకరించువాడు యుక్తదండుడు (నేరమునకు శాస్త్రము విధించిన దండనము సేయుచు నేరములేనివానిని శాస్త్రవిధి ననుసరించి విడచుట యుక్తదండనము) నిర్దండుడు గాడు (అందరిని దండించు రాజునకు పైని అతని శాసించునది ధర్మదండమున్నది అనగా రాజు స్వతంత్రముగా దండింపరాదు. ధర్మశాస్త్రమునకు లోబడి యా పని చేయవలయును. భారత భూమిలో వ్యక్తిపరిపాలన సంఘపరిపాలన నిషిద్ధమన్నమాట) దండరతియుంగాడు. రాజస తామస ప్రవృత్తులకు లోబడి దండించుట యనునది యొక వినోదముగా భావించువాడుగాడన్నమాట. వేదవేదాంగరహస్యములు దెలిసినవాడు. యజ్ఞయాజి. తపోనిరతుడు. క్షుద్రవిలాసపరుడుగాడు సర్వసత్త్వుడు. అహింసానిరతుడు. మానవంతులగువారికి (అభిమానధనులకు) మాననీయుడు. శక్యుడు. ప్రజల కష్టములం జెప్పుకొనుటకు సులభుడు సుఖుడు. సుఖస్వరూపుడు. పూజ్యులం బూజించువాడు. జీవుల శరీరమందు నిత్యముంటొందముచుండు కామ క్రోధమదమానలోభహర్షములను శత్రువు లారింటి నాతడు జయించెను. ఎటనేని విధి ననుసరించి శాస్త్రమున దనువుగ దృశ్యుడు (దర్శనము సేయదగినవాడు) సుభగుడు (సుందరుడు) ప్రియదర్శనుడు ప్రజలకు నానందముచ్చువాడు. బహుధాన్యుడు బహుధనుడు (రాష్ట్రములో ప్రజల జాతకము ధనధాన్య సమృద్ధిలో ఈతిబాధలు లేనివారగుటలో పరిపాలకుని జాతకముంబట్టి యుండునన్నమాట) చతురంగబల సమగ్రుడు అయోధ్య రాజధానిగ నిత్యము దేవశత్రువుల దుడముట్టించువాడు. ఆ మహానుభావుడు ప్రజల నందరను కన్నబిడ్డలట్లు పరిపాలించెను. ఇతడు రాజైనతరి అధర్మమనునది పేరునకైన లేకుండును. దీనుడు వ్యాధిగ్రస్తుడు అల్పాయువు దుఃఖితుడు మూర్ఖుడు మందరూపుడు (దిగులుపడువాడు) దుర్భగుడు (దౌర్భాగ్యవశుడు) నిరాకృతి (నామరూపములు లేనివాడు) నతని రాజ్యమున లేరు. సర్వజగత్ప్రధానుడైన ప్రజాపతి మహాత్ముడు ఒక్క శరీరమందు సర్వగుణసముదాయమును నేను జూచెదగాకయని ముచ్చటపడి యీ యిక్ష్వాకు మహారాజును సృజించెను.

ఇది శ్రీ విష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున ఇక్ష్వాకుకులవర్ణనమను పదునాల్గవ యధ్యాయము.

# పదునైదవ అధ్యాయము

## మధుకైటభవధ

మార్కండేయ ఉవాచ :

ఇక్ష్వాకో రభవత్పుత్రో వికుక్షిర్నామ ధార్మికః । కకుత్థ్స స్తనయ స్తస్య చానేనా స్తస్య చాత్మజః ॥ 1

తస్య పుత్రః పృథు శ్శ్రీమాన్ విశ్వదాస స్తదాత్మజః తస్య శ్రావ స్తకో నామ శ్రావ స్తీ యేన నిర్మితా ॥ 2

బృహదశ్వః సుత స్తస్యకువలాశ్వ స్తదాత్మజః। కువలాశ్వోమహాతేజాఃధుంధుమారత్వ మాగతః ॥

ధుంధుం హత్వా మహాకాయ ముదకే జలరాక్షసమ్ ॥ 3

వజ్ర ఉవాచ :

కథం ధుంధు ర్మహాతేజాః కువలాశ్వేన ఘాతితః । కశ్చాయం ధుంధు రిత్యేష విశ్రుతో జల రాక్షసః ॥ 5

మార్కండేయ ఉవాచ :

ఏకార్ణవే పురాలోకే నష్టే స్థావర జంగమే ॥

నష్ట చంద్రార్క పవనే వినష్ట గ్రహతారకే । శేషపర్యంక మాసాద్య-సుప్తో దేవో జనార్దనః ॥ 6

నాభౌ తస్య సముత్పన్నం దేవస్య కమలం శుభమ్ । తత్రజజ్ఞే స్వయం బ్రహ్మా, దేవః శుభ చతుర్ముఖః ॥ 7

తత్రాఽఽస్తే సోఽభ్యసన్వేదాన్ సుప్తేదేవే జనార్దనే । ఉపాసాం చక్రిరే తస్యవేదాః దేహభృత స్తథా ॥ 8

వేదాభ్యాస రతేతత్ర స్వేదబిందు రజాయత । స పద్మపత్ర మాసాద్య ద్విధా భూతోఽభవన్నృప ! 9

రజస్తమోమయౌ తస్మాజ్జాతౌ దైత్యౌ బలోత్కటౌ మధుకైటభ నామానౌ మహాబల పరాక్రమౌ ॥ 10

తతస్తౌ జహ్రతు ర్వేదాన్ బ్రహ్మణః పాపనిశ్చయౌ । స శరీరేషు వేదేషు హృతేష్వథ పితామహః ॥ 11

బోధయామాస దేవేశం పద్మనాభం సచానఘః । సంబుద్ధ స్తదాదేవః కృత్వా హాయ శిరోధరమ్ ॥ 12

శశాంక శత సంకాశం నానాభరణ శోభితమ్ ద్వితీయేన శరీరేణ రసాతల తలం గతః ॥ 13

తేనాశ్వశిరసా గత్వా వేదా నాదాయ శాశ్వతాన్ పితామహాయ ప్రదదౌ భూయ ఏవ జగద్గురుః 14

తతో హయ శిరోధారీ గతోఽన్తర్ధాన మీశ్వరః । ఆజగ్మతు స్తతో దేశం దానవౌ మధుకైటభౌ ॥ 15

విష్ణుశ్చకార దేహౌ ద్వౌ విష్ణుర్జిష్ణు రితిస్మృతౌ । మధునా యుయుధే జిష్ణుర్విష్ణు ర్వైకైటభేన చ ॥ 16

తతస్తయో స్సుయుద్ధేన తుష్టో దేవో జనార్దనః । ఉవాచ తౌ మహాకాయౌ దానవౌ మధుకైటభౌ ॥ 17

వరం వరయతాం శ్రేష్ఠం భవన్తావపరాజితౌ । తావబ్రూతాం తతోదేవం విష్ణుం కమలలోచనమ్ ॥ 18

పుత్రోఽస్మాకం భవే ద్దేవ మహాబల పరాక్రమః । పుత్రే జాతేత్రు యౌ తౌ ద్వౌ విష్ణునా జిష్ణునాపురా ॥ 19

నిహతౌచ తదా వీరౌ హ్యుదకం చ సమాశ్రితౌ । మేదో ముముచతు స్తత్ర వ్యాప్తా యేనాఽభవన్మహీ ॥ 20

మేదినీతి తతఃఖ్యాతా లోకేస్మిన్ తత్త్వచింతకైః । వరాహ రూపేణ తదా చోద్ధృతా వసుధా తతః ॥ 21

తేనైవ దేవ దేవేన పూర్వస్థానే నివేశితా । సర్గంచక్రే తతో బ్రహ్మా దేవ దేవస్య శాసనాత్ ॥ 22

ఏవంతదా దేవవరస్య యుద్ధే నిపాతితౌ మధుకైటభాఖ్యౌ ।
దేవస్యవిష్ణోః సదనం ప్రయాతౌక్షీరార్ణవే తస్య సమీపగౌచ ॥ 23

ఇతి శ్రీవిష్ణు ధర్మోత్తరే ప్రథమఖండే - మార్కండేయ వజ్రసంవాదే మధుకైటభ వధోపాఖ్యానం నామ పంచదశోఽధ్యాయః

మార్కండేయుడనియె : ఇక్ష్వాకువు వికుక్షి కకుత్స్థుడు అనేనుడు పృథువు విశ్వదాసుడు (శ్రీమంతుడు) శ్రావస్తుడు (శ్రావస్తి యను నగర నిర్మాత) బృహదశ్వుడు-ఇతడే ధుంధుమారుడయ్యెను- ధుంధువను మహా శరీరుని జలరాక్షసుం జంపి యీ పేరందెను. ఆన విశిష్ఠుండు — ధుంధువును గువలాశ్వుండు చంపిన కథ తెలుపుమన మార్కండేయుం డిట్లనియె : స్థావర జంగమ ప్రపంచము నశించి లోకమేక సముద్రమైనపుడు సూర్యచంద్ర గ్రహతారకలు నష్టమైన తఱి శేషపర్యంక మందు జనార్దన దేవుడు సుప్తుడయ్యెను. ఆయన నాభియందు శుభప్రదమైన కమలము పుట్టినది. అందు స్వయంభువు బ్రహ్మ శుభదము లయిన నాల్గు మోములతో నుదయించెను. విష్ణువు నిద్రవోవ నా సమయ వేదాభ్యాసము సేయుచుండెను. వేదములు శరీరధారులై యాతని నుపాసించినవి. వేదాభ్యాస రతుడై యున్నతఱి నాతనిమేన చెమట బిందువు పొడమెను. ఆ చెమట చుక్క తామరాకునబడి రెండయ్యెను. వానినుండి రజోగుణ తమోగుణమయు లిద్దరు దైత్యులు మధుకైటభులను వారు మదోత్కటులు మహాబలపరాక్రములు పుట్టిరి. పాపబుద్ధు లా యిద్దరు నవ్వల బ్రహ్మయొక్క వేదములను హరించిరి. మూర్తి ధరించిన వేదము లట్లు నష్టమయినంతట

పితామహుడు పద్మనాభుని దేవేశుని విష్ణువును మేల్కొలిపెను. ఆ దేవుడు లేచి హయగ్రీవుని శతచంద్ర సంకాశ ప్రకాశుని నానాభరణ భూషితుని తన రెండవ శరీరముగ నొనరించి రసాతలమున కేగెను. అట్లేగి శాశ్వతములయిన వేదములంగొని వచ్చి యా జగద్గురువు చతుర్ముఖుని కిచ్చెను. ఆమీదట నయ్యీశ్వరు డంతర్ధానముం జెందెను. అటుపై మధుకైటభులను దానవు లచ్చోటి కేతెంచిరి. విష్ణువపుడు విష్ణువు జిష్ణువు నను పేర రెండు శరీరములం బొనరించెను. జిష్ణువు మధువుతోను విష్ణువు కైటభునితోను పోరెను. అటుపై వారి యుద్ధమునకు హరి సంతుష్టుడై అపరాజితులైన మీరు వరము వేడుగుతనియె. వారు కమలలోచను హరిని జూచి మహా బల పరాక్రమయుతుడైన పుత్రుడు గలుగుగాక! యనిరి. వారికట్లు సుతుడుదయింప వారిద్దరిని విష్ణువు గూల్చి వారు వరమం దునికి గొనిరి. వారందు మేదస్సును విడిచిరి. భూమిని దానమేదిని యని తత్త్వ విదులు పేర్కొనిరి. అయ్యెడ వరాహరూపియగు హరిచే నది మీది కుద్ధరింపబడెను. ఆయన దానిని యథాస్థానమునందుంచెను. ఆ దేవదేవు నాజ్ఞచే బ్రహ్మ యవ్వల సృష్టి ప్రారంభించెను. ఈ విధముగ హరిచేత గూలిన మధుకైటభులు విష్ణు లోకమును బొంది క్షీరసముద్రమున దాయన సాన్నిధ్యమును బడసిరి.

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణమున ప్రథమఖండమున మధుకైటభవధోపాఖ్యానమను పదునైదవ అధ్యాయము.

# పదునాఱవ యధ్యాయము

## ధుంధుమారోపాఖ్యానము

మార్కండేయ ఉవాచ :

భారతస్యాస్య వర్షస్య భాగేఽస్మిన్నవమే నృప! । సముద్రో వాలుకాపూర్ణ ఉజ్జానక ఇతిశ్రుతిః ॥ 1
తస్మిన్సమధ్యే సముద్రస్య ధుంధు ర్వసతి తేస్సదా । సంవత్సరస్య సోఽన్తేషు మహోచ్ఛ్వాసం ప్రముంచతి ॥ 2
యదా తదా భూశ్చలతి సశైల వనకాననా ప్రాణినో యేఽల్ప సత్వాశ్చ తేయాన్తి యమ సాదనమ్ ॥ 3
యదా విబుద్ధో భవతి కించిచ్ఛేషా మహీతదా ఆహారార్థం కరోత్యుగ్రః పాపాత్మా జలరాశిగః ॥ 4
ఏతస్మిన్నేవ కాలేతు చోత్తంక స్తప్యతే తపః । తపసోఽన్తే మహాత్మానం దదర్శ మధుసూదనమ్ ॥ 5
తమువాచ హరిర్దేవో వరం వరయ భార్గవ । ఉత్తంకః ప్రాంజలి ర్భూత్వా తుష్టావ మధుసూదనమ్ ॥ 6
ఉవాచ వరదం దేవ మేష ఏవ వరోమమ । యదహం దేవదేవస్య దృష్టవాంశ్చరణాంబుజౌ ॥ 7
శ్రీభగవాన్ ఉవాచ :
అవశ్యంతే వరోదేయః మయాభృగు కులోద్భవ । అజరశ్చామర శ్చైవ మత్ప్రసాదా ద్భవిష్యసి ॥ 8
యత్రేచ్ఛసి జలం తత్ర భవిష్యతి తథాతవ । దేవతానాం మహత్కార్యం తథైవచ కరిష్యసి ॥ 9
ఆశ్రమస్యాస్య తేబాధాం యఃకరోతి సదానఘ । కువలాశ్వేన తంగత్వా ధుంధుం ఘాతయ! మాచిరమ్ ॥ 10
అహంచాస్య ప్రవేక్ష్యామి కువలాశ్వస్య విగ్రహమ్ । తేజసా సముదీర్ణేన ధుంధుమాజౌ హనిష్యతి ॥ 11
నహ్యల్ప తేజసా హన్తుం ధుంధుశ్శక్యో భృగూత్తమ ।

మార్కండేయు డిట్లు పలికెను : వజ్రమహారాజా! ఈ భారతవర్షము యొక్క తొమ్మిదవ భాగమునందు ఇసుకతో నిండి యున్న సముద్రముగలదు. దానికి ఉజ్జానకమని వాడుక. ఆ సముద్రమధ్యమున ధుంధువు సంవత్సరాంతమునందు పెద్ద నిట్టూర్పువిడువగా పర్వతములు అరణ్యములతో భూమి తొట్రుపాటుచెందును. అల్పజీవములన్నియు యమపురికేగును. అతడు

మేల్కొనగానే భూమి కొంచెము మిగిలియుండును. పాపస్వభావుడును, భయంకరుడు నగు నీజల రాక్షసుడు ఆహారము నిమిత్తమై యత్నించెను. ఇంతలో నుత్తంకుడు తపసుచేయుచు మహాత్ముడగు మధుసూదనుని చూచెను. మధుసూదనుడు వరము కోరుకొమ్మనెను. ఉత్తంకుడు దోసిలి ఒగ్గి మధుసూదనుని నుతించెను. వరదుడగు మధుసూదనునితో "దేవదేవుని పాదపద్మముల దర్శించితిని. ఇదియే నాకు కావలసిన వరము"న భగవంతు డిట్లనెను. భృగువంశీయుడా ! నీకు తప్పక వరమీయవలసి యున్నది. నీవు నా అనుగ్రహమున జరామరణ రహితుడవగుదువు. నీ కెచట జలము కావలెనందువో అచట నది సిద్ధించును. దేవతల మహాకార్యము నట్లే చేయగలవు. నీ యీ యాశ్రమమునకు నెవడు బాధ నెపుడు కలుగజేయునో అట్టి ధుంధుని అలస్యముచేయక శీఘ్రముగ కువలాశ్వుని (బృహదశ్వుని కుమారుని)తో నేగి సంహరింపుము. నేను కువలాశ్వుని విగ్రహమును ప్రవేశింతును. ఆ కువలాశ్వుడు నా తేజస్సుచే ధుంధుని యుద్ధమునందు చంపగలడు భృగూత్తమా ! అల్పతేజస్సుతో ధుంధుని చంపుట శక్యముగాదు.

మార్కండేయ ఉవాచ :

ఏతావదుక్త్వా భగవాన్ గతోంతర్ధాన మీశ్వరః ॥ 12
జగామచ తథాయోధ్యా ముత్తంకోఽపి మహాతపాః । పూజితో బృహదశ్వేన బృహదశ్వ మభాషత ॥ 13

ఉత్తంక ఉవాచ :

కథం నిద్రాసి రాజేంద్ర ! సుఖం పర్యంక మాస్థితః । ధుంధో శ్చరిత మాలోక్య బద్ధ కక్షో భవాఽధునా ॥ 14
వచనా న్మమ రాజేంద్ర ! ధుంధుం హంతుం తవా స్తి భోః । శక్తిః, కిముద్యమాద్రాజ్ఞాం దుష్కరం తేపునః కథమ్॥
జహి ధుంధుం మహాకాయం నృపతే ! ద్విజ బాధకమ్। శ్రుత్వాముని వచో రాజా కువలాశ్వ మభాషత ॥ 16
అహం వనప్రవృత్తస్తు త్యక్తదండ స్తథైవచ జహితందానవ శ్రేష్ఠం త్వముత్తంకేనపాలితః ॥ 17
ఏవముక్తః పరిష్వక్తః పిత్రా ప్రకృతి వత్సలః । ఉత్తంక సహితో గత్వా యుద్ధాయోదక రాక్షసం ॥ 18
యుయుధే తంచ ధర్మాత్మా ధుంధుం తేనైవకేశవః । ఉత్తంకానుమతే పశ్చాద్బ్రహ్మాస్త్రేణ జఘానతమ్ ॥ 19
హత్వాతం రాక్షసం లేభే త్రిదశేభ్య స్తదావరాన్ । కృష్ణేభక్తిం స్థితిం ధర్మేవాసం స్వర్గే తథాక్షయమ్ ॥ 20
మధుకైటభయోః పుత్రం ఘాతయిత్వానరాధిపః । ధుంధుమారత్వ మగమ దశోభత తథాపురీమ్ ॥ 21
తస్మిన్హతే దైత్యవరే ప్రసన్నాః దిశోబభూవు ర్ముదితాశ్చ దేవాః ।
విష్ణు విష్ణుంచ జగత్ తదా స రాజాచక్రిత్వం పరమా మవాప ॥ 22

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే ధుంధుమారోపాఖ్యానం నామ షోడశోఽధ్యాయః.

మార్కండేయ డిట్లనెను : ఇంతవరకు చెప్పి భగవంతుడగు మధుసూదనుడు అంతర్ధానమందెను. మహాతపస్వియగు ! నుత్తంకుడు అయోధ్యకుచేరి బృహదశ్వునిచే పూజితుడై యిట్లనెను. "రాజేంద్రా ! శయ్యనుచేరి యెట్లు నిద్రించుచున్నావు ! ధుంధుని చరిత్రను చూచి, యిపుడు బద్ధకక్షుడవగుము ! రాజేంద్రా ! నా మాట బట్టి ధుంధుని చంపుటకు నీకు శక్తి గలదు. రాజులకు ప్రయత్నమువలన నేది దుష్కరమెట్లగును ? ఓ రాజా! ద్విజులను బాధించునట్టి మహాశరీరుడగు ధుంధుని చంపుము. ఉత్తంక ముని వాక్యమును విని బృహదశ్వమహారాజు కువలాశ్వునితో పలికెను. నేను వనమందున్నవాడనై దండమును వదలితిని. కావున నీవు ఉత్తంకునిచే పాలితుడవై దానవశ్రేష్ఠుడగు నా ధుందుని చంపుము. ఇట్లు తండ్రియగు బృహదశ్వునిచే పలుకబడి ప్రజల యందు వాత్సల్యముగల కువలాశ్వుడు ఆలింగితుడై ఉత్తంక సహితుడై యుద్ధార్థమై ఉదకరాక్షసుడగు ధుంధుని చేరి యుద్ధము చేసెను. ఉత్తంకుని యనుమతితో బ్రహ్మాస్త్రముతో కేశవుడు, కువలాశ్వునిచే ధుంధుని చంపించెను. అట్లు ఆ రాక్షసుని చంపి దేవతల

వలన కృష్ణభక్తి, ధర్మమున నిబ్బరము, స్వర్గమునందు అక్షయనివాసము కువలాశ్వుడు వరములుగ పొందెను. ఓ రాజా! మధు కైటభుల పుత్రుని సంహరించి ధుంధు మారుడను పేరును సంపాదించి ప్రకాశించెను. ఆ రాక్షసవరుడు చంపబడగా దిక్కులు ప్రసన్నములాయెను. దేవతలానందించిరి. జగత్తు విఘ్నశూన్యమాయెను. రాజు గొప్ప కీర్తిని పొందెను.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణమున ప్రథమఖండమున మార్కండేయ వజ్ర సంవాదమున ధుంధుమారోపాఖ్యానమను పదునారవ అధ్యాయము.

# పదునేడవ అధ్యాయము

## సగరోపాఖ్యానము

**మార్కండేయ ఉవాచ :**

ధుంధుమారాద్దృఢాశ్వస్తు హర్యశ్వస్తస్యచాత్మజః । నికుంభ స్తస్యతనయః సుహితశ్చ తదాత్మజః ॥ 1
కృశాశ్వ స్తనయ స్తస్య మాంధాతా తస్యచాత్మజః । దైవేన విధినా రాజా జాత స్తస్యైవ చోదరాత్ ॥ 2
పురుకుత్స స్సుత స్తస్య త్రసద్దస్యు స్తదాత్మజః । శంభు స్తస్యాత్మజః శ్రీమాన్ అనరణ్యేతి విశ్రుతః ॥ 3
రావణేన హతో యోఽసౌ త్రిలోక విజయీపురా । పృశదశ్వః సుత స్తస్య తస్మా ద్వసుమనా నృపః ॥ 4
తస్య పుత్రస్త్రిధన్వాఖ్యః తస్మా త్త్రియ్యారణి స్స్మృతః । తస్య సత్య వ్రతః పుత్రః త్రిశంకుం యం ప్రచక్షతే ॥ 5
హరిశ్చంద్ర స్సుత స్తస్య రోహితాశ్వ స్తదాత్మజః । హరిత స్తత్సుతో రాజా చంచు ర్హారిత ఉచ్యతే ॥ 6
విజయ స్తస్య తనయశ్చాలర్క స్తస్య చాత్మజః । అలర్కస్య వృకః పుత్ర స్తస్మాద్బాహు స్తు జజ్ఞివాన్ ॥ 7
పానస్త్రీ మృగయాఽక్షేషు సబహు వ్యసనాన్వితః । వ్యసనే తస్యస క్తస్య నరేంద్రస్యారిభి స్తదా ॥ 8
హైహయై స్తాలజంఘైస్చ సర్వమ్లేచ్ఛ గణావృతైః । ఛలేనా పహృతం రాజ్యం హతరాజ్యో వనంగతః ॥ 9
పద్భ్యామనుయయౌ తస్యవనం భార్యా గుణాన్వితా । గుర్విణీ ప్రాగ్దదౌయస్యా స్సపత్నీతు గరంకిల ॥ 10
తతస్సా సగరం పుత్రం సుషావ వనగా శుభా । జాతపుత్రో నరపతిః సంయుక్తః కాలకర్మణా ॥ 11
అన్వారురోహ తంరాజ్ఞీ యాదవీ ధర్మ వత్సలా । సంస్కృత స్సర్వ సంస్కారైః సగరశ్చ్యవనేన చ ॥ 12
శాస్త్రగ్రామే ధనుర్వేదే నీతఃపారం తథాపరమ్ । సయౌవన మనుప్రాప్య ఏక ఏవ నరాధిపః ॥ 13
పదాతిర్బద్ధ నిస్త్రింశః చ్యవనస్య ప్రసాదతః । హైహయాన్ తాల జంఘాంశ్చ నిజఘాన పరంతపః ॥ 14
తత స్త్వయోధ్యాం సంప్రాప్యలేభే రాజ్యమకంటకమ్ । సగరో రాజ్యమాసాద్య బలేన చతురంగిణా ॥ 15
విజిత్య సకలాన్ మ్లేచ్ఛాన్ వశంచక్రే చ పార్థివాన్ । విజిత్య పృథివీం కృత్స్నాం ప్రాప్యరాజ్య మకంటకమ్ ॥ 16
చ్యవనం పూజయామాస సత్కారేణ పునః పునః । చ్యవనే నాభ్యనుజ్ఞాతః సచక్రేదార సంగ్రహమ్ ॥ 17
ఆసీద్భార్యా ద్వయం తస్య సగరస్య మహాత్మనః । సతాభ్యాం సహితోరాజా పుత్రార్థంత స్తపవాన్తపః ॥ 18
తపసోఽన్తే హరః ప్రాహ రాజానం తపసాకృశమ్ । ఏకం వంశకరం పుత్రమేకా తేజనయిష్యతి ॥ 19
షష్టిఃపుత్ర సహస్రాణి ద్వితీయా జనయిష్యతి । ఏవం లబ్ధవరో రాజా సభార్యః స్వపురం గతః ॥ 20
పుత్రం పుత్రాంశ్చ ధర్మాత్మా జనయామాస వీర్యవాన్ । కర్మణాచైవ నామ్నాచ రాజపుత్రోఽసమంజసః ॥ 21

పిత్రా నిరాసితో రాజ్యాత్ పౌరాణా మహితేరతః ।
తస్య పుత్రోంశుమాన్నామ సర్వైస్సముదితో గుణైః తోషయామాస పితరం పితుః పృథ్వీపతించ సః ॥ 22
పౌత్రేణతేనా నఘః సేవ్యమానః షష్టై ర్మహావీర్య పరాక్రమైశ్చ ।
సరంజయన్ రాజవరో జితారిః శశాస పృథ్వీం సకలాం మహాత్మా ॥ 23

ఇతిశ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే సగరోపాఖ్యానంనామ సప్తదశోఽధ్యాయః.

మార్కండేయు డిట్లు పలుకదొడంగెను : ధుంధుమారుని వలన దృఢాశ్వుడు, వానివలన హర్యశ్వుడు, వానివలన నికుంభుడు, వానివలన సుహితుడు, వానికి కృశాశ్వుడు, వానికి మాంధాతయు, వానికి దైవవిధిచే పురుకుత్సుడు, వానికి సదశ్వుడు, వానికి శంఖుడు కుమారుడై అనరణ్యుడని ప్రసిద్ధుడాయెను. త్రిలోక విజయి యగు నాతడు రావణునిచే నిహతుడాయెను. వానికి దృషదశ్వుడు వానికి వసుమనస్కుడను రాజు కలిగెను. వాని కుమారుడు త్రైధన్వుడు. వానినుండి త్రయ్యారుణియు, వాని పుత్రుడు సత్యవ్రతుడు వానినే త్రిశంకువందురు. వాని పుత్రుడు హరిశ్చంద్రుడు, వాని కుమారుడు రోహితాశ్వుడు. వాని పుత్రుడు హరితుడు వానికి చంచుడు, వానికి విజయుడు అతనికి రురుకుడు, వాని పుత్రుడు వృకుడు, వానికి బాహువు పుట్టిరి. అతడు త్రాగుడు, స్త్రీ, వేట, జూదములలో మిక్కిలి వ్యసనముగలవాడు. ఇట్టి వ్యసనాసక్తుడగు వాని రాజ్యమును శత్రువులగు హైహయులు, తాలజంఘులు మ్లేచ్ఛగణములతో గూడి మోసముతో అపహరించిరి. రాజ్యము కోల్పోయి బాహూరాజు అడవి చేరెను. గుణవతి యగు నాతని భార్య పాతివ్రత్యచారిణియై భర్తననుసరించెను. ఆమె సవతి ఆమెకు వెనుక విషము (గరళము) నిచ్చుటచే అరణ్యస్థురాలగు నామె సగరుడను పుత్రునిబడసెను. అక్కడ రాజు కాలగతినందెను. ధర్మపత్నియగు నాతని భార్య వానిననుగమించెను. సగరుని సర్వసంస్కారములతో చ్యవనుడు సంస్కరించెను. అతడు శస్త్రవిద్యయందు అస్త్రవిద్యయందు పారంగతుడయ్యెను. యౌవనగతుడై యేకఛత్రాధిపతియై సగరుడు చ్యవనుని అనుగ్రహమువలన ఖడ్గము ధరించి హైహయులను, తాళజంఘులను చంపి అయోధ్యను చేరి నిష్కంటకమగు రాజ్యము నందెను. చ్యవనుని మాటను ఆదరముతో పూజించెను సగరుడు రాజ్యమును పొంది చతురంగ బలములతో మ్లేచ్ఛులనెల్ల జయించి రాజులను వశముచేసికొనెను. చ్యవనుని అనుజ్ఞతో వివాహముచేసికొనెను మహాబాహువగు సగర చక్రవర్తికి ఇద్దరు భార్యలుండిరి వారితోకలిసి పుత్రప్రాప్తికై అతడుతపస్సుచేసెను తపస్సు ముగియగనే తపస్సుచే సంతోషించిన సగరచక్రవర్తితో శివు డిట్లు పలికెను : "నీ భార్య యొక్కతె వంశకరుడైన పుత్రు నొక్కని కనును. రెండవ భార్య యరువదివేల పుత్రులను కనగలదు." సగరుడిట్లు వరములనుబడసి భార్యలతోగూడ తన పట్టణముచేరుకొనెను. ధర్మాత్ముడు వీర్యవంతుడునగు సగరుడట్లు పుత్రులను గనెను. పుత్రుడు కర్మచేతను పేరుచేతనుగూడ అసమంజసుడే. పౌరుల యహితమునందాసక్తిగల యాతడు తండ్రిచే రాజ్యమునుండి తొలగించబడెను. వానిపుత్రుడంశుమంతుడు, అతడు సద్గుణపుంజుడు పితామహుని, రాజగు తండ్రిని సంతోషపెట్టెను. పౌత్రునిచే సేవింపబడుచు, మహాత్ముడగు నంశుమంతుడు శత్రువుల జయించి భూమినెల్లరంజింపజేయుచు పాలించెను.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణమున ప్రథమ ఖండమున మార్కండేయ వజ్రసంవాదమున సగరోపాఖ్యానమను పదునేడవ అధ్యాయము

# పదునెనిమిదవ అధ్యాయము

## సగరోపాఖ్యానము

మార్కండేయ ఉవాచ :

సగరస్యతు తే పుత్రాః సంహతా వీర్యసంయుతాః । సంజాతా దైవయోగేన దేవబ్రాహ్మణ కంటకాః ॥ 1
తేషాంతు కర్మణోద్విగ్నాః దేవాస్సర్వే పితామహం । అబ్రువన్ సాగరైస్సర్వైః దేవ! బాధ్యామ సంహతైః ॥ 2

ఏవముక్త స్తథా బ్రహ్మా సర్వలోక పితామహః । ఉవాచ దేవాన్ సకలాన్ సాగరైః ప్రత్యమర్షితాన్ ॥ 3
య స్త్వస్య జగతో నాథః పరమాత్మా సనాతనః । వాసుదేవస్స కపిల స్సురాంస్తాన్ ఘాత యిష్యతి ॥ 4
ఏవముక్తా స్సురా స్తేన యయుస్సర్వే త్రివిష్టపమ్ । ఏతస్మిన్నేవ కాలేతు సగరస్స మహీపతిః ॥ 5
దీక్షితో వాజిమేధాయ విధివద్వేద పారగైః । తురంగం చారయామాసు ర్యజ్ఞియం తనయా మహీమ్ ॥ 6
తేషాం చారయతాం సోఽశ్వః కపిలేనతథా హృతః । కపిలేన హృతం నాశ్వం తేజానన్తి విమోహితాః ॥ 7
అన్వేషన్తోఽపి యత్నేన నాపు స్తే తురగం యతః । పిత్రే నివేద్యతే సర్వే నిచఖ్నుః పృథివీతలమ్ ॥ 8
భారతస్యాస్య వర్షస్య భేదేఽస్మి న్నవమే నృప! । సమన్తత స్తతశ్చక్రుః ఖాతకర్మ బలాన్వితాః ॥ 9
విస్తరా ద్యోజన శతం పాతాల తల గామినమ్ । వైడూర్య పర్వతా త్పూర్వ ముత్తరేణ హిమాచలాత్ ॥ 10
పశ్చార్ధే కాంచనగిరే ర్దక్షిణేవచ లావణాత్ । హిమాచలశ్చ తద్విరై రాజన్ దేశద్వయే క్షతః ॥ 11
హిమాచలస్య ఖండశ్చ ఖాతస్యాన్తః ప్రవేశితః । ఉత్తర స్సాగర స్తస్మా ద్ధిమశైలేన దుర్గమః ॥ 12
ఏవం విధేన ఖాతేనతే ప్రవిశ్య పృథక్ పృథక్ । ఏకీకృతా దైవయోగాత్ కపిలో యత్ర వైస్థితః ॥ 13
కపిలస్యసమీపస్థం దదృశు స్తే తురంగమమ్ । తురంగ సహితం దృష్ట్వా కపిలంతే త్వమర్షితాః ॥ 14
కుద్దాల లేపికా హస్తా స్తస్య జగ్ముర్వధేప్సయా । తాన్ బాధమానాన్ దుర్బుద్ధీన్ సందదర్శ తదా ఋషిః ॥ 15
చక్షుషా దృష్టమాత్రా స్తే భస్మీభూతాస్తు సాగరాః । నరకంచగతా స్సర్వే దేవ బ్రాహ్మణ కంటకాః ॥ 16

మార్కండేయు డిట్లనెను : — సగరుని పుత్రులు వీర్యవంతులు, కలసియుండెడివారు, దేవ బ్రాహ్మణ బాధకులై దైవయోగమున పుట్టిరి. వారి చర్యలు రావేగపడినవారై దేవతలు అందరు బ్రహ్మదేవునితో దేవా! సగరపుత్రులందరు మమ్ము బాధించుచున్నారు. అని మొరపెట్టుకొనిరి. సర్వలోక పితామహుండగు బ్రహ్మ ఆ విధముగ సగర పుత్రులతో ద్వేషమూనిన దేవతలందరితో నిట్లనెను. జగన్నాథుండగు వాసుదేవుడు కపిల మహర్షియై వారి నందరిని చంపగలడు. ఇట్లు పలుకబడినవారై దేవతలందరు బ్రహ్మతో కలసి స్వర్గమునకేగిరి. ఇంతలో సగర చక్రవర్తి అశ్వమేధ యాగార్థమై వేదవిధులతో దీక్ష బూనెను. సగర పుత్రులు యాగాశ్వమును భూమియందు త్రిప్పుచుండిరి. అట్టియెడ ఆ యాగాశ్వము కపిలునిచే అపహరింపబడెను. సాగరు లెంత ప్రయత్నించినను అశ్వము లభ్యము కాకపోవుటచే తండ్రికి నివేదించి భారతవర్ష నవమఖండమందు భూతలమును త్రవ్విరి. నూరుయోజనముల విస్తృతితో పాతాలము చేరువరకు వైడూర్య పర్వతమునకు తూర్పుగ హిమాలయమునకు నుత్తరముగ మేరు పర్వతమునకు పశ్చిమార్ధమున లవణ సముద్రమునకు నుత్తరముగ హిమాచలమును ఖండించి ఆఖండమును అగస్త్య మధ్యమున చేర్చిరి. ఆ కారణమున నుత్తర సముద్రము హిమాద్రిచే దుర్గమమయ్యెను. ఆ ఖండమునుండి ఒక్కొక్కరు ప్రవేశించి కపిలుడున్న ప్రదేశమును సమీపించినవారై దైవయోగమున కపిలుని సమీపమున యాగాశ్వమును చూచిరి. కపిలుని అశ్వముతో కలసియున్న వానిని చూడగనే ఆగ్రహముతో వానిని చంపుటకై త్రవ్వు సాధనములను చేతబూని వానిపైకి వెళ్ళిరి. దుర్బుద్ధిగలవారై బాధించుచున్న సాగరులు కపిలుని చూడగనే భస్మీభూతులైరి. దేవ బ్రాహ్మణ కంటకులగు వారందరు నరకము చేరిరి.

విజ్ఞాయ తనయాన్నష్టాన్నారదా త్సగరో నృపః । ప్రేషయా మాస సతరమంశుమన్తం సధార్మికమ్ ॥ 17
అంశుమానపి సంప్రాప్య కపిలం మునిసత్తమమ్ । అభివాద్య మహాతేజాః తుష్టావ యదునన్దన ॥ 18
తస్యతుష్టోఽథ తురగం దత్తవాన్ కపిలో మునిః । అంశుమన్తం తదోవాచ పితౄణాం సలిలార్థినామ్ ॥ 19
పౌత్ర స్తే భవితా రాజన్! తపసా తస్యతోషితా । ఆగమిష్యతి సాదేవీ గంగా గగనమేఖలా ॥ 20
తయాక్లిన్నమిదం భస్మ సాగరాణాం దురాత్మనామ్ ॥ 21

* వి. ధ పు-5

యదా భవిష్యతి తదా సాగరా స్స్వర్గ గామినః । అన్యస్యాపి యదా త్వస్థి గంగాతోయే పతిష్యతి ॥ 22
తస్యాపి స్వర్లోక గతి ర్భవిష్యతి న సంశయః । ఏవ ముక్తోంశుమాన్ శీఘ్రం చాభివాద్య జగద్గురుమ్ ॥ 23
ఆగమ్య యోజయామాస తురగేణ పితామహమ్ । యజ్ఞం సమాపయామాస సగరోఽపి మహీపతిః ॥ 24
ఏనంహి సాగరై ర్మత్తైః ఖాతకో నృపసత్తమ ! । యేన క్లప్త మయం ద్వీపః సాగరో నృప ! కథ్యతే ॥ 25
లవణోదాత్స ముద్రాచ్చ తోయేన నృప ! సాగరః । యదాపూర్ణ స్తదా జాతో లవణోదో నరాధిప॥ 26
కృత్స్నం య ఏవం జయతి సమ్రా డితి కీర్త్యతే । తతోగత స్సధర్మాత్మా కాలేన మహతా దివమ్ ॥ 27
దిలీపే భార మాసజ్య, జగామ తనయే స్వకే । దిలీపోఽపి సమాధాయ రాజ్యే పుత్రం భగీరథమ్ ॥ 28
జగామ త్రిదివం రాజా వనే తప్త్వా మహత్తపః ।
ఆసాద్య రాజ్యంస భగీరథోఽపి ఆనీయగంగాం తపసా చ భూమిమ్ ॥ 29
సంప్లావయామాసజలేన భస్మ తత్సాగరాణాం యదు బృన్ద నాథ ।
సంప్లావితే భస్మని రాజపుత్రాః గంగా జలౌఘేన దివం ప్రయాతాః ॥ 30
స్వర్లోక మాసాద్య తథాఽక్షయం తే వసన్తి హృష్టా స్త్రిదశై స్సమేతాః ॥ 31

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే సగరోపాఖ్యానంనామ-అష్టాదశోఽధ్యాయః.

సగరచక్రవర్తి తనపుత్రులు నష్టమైన వృత్తాంతమును నారదముని వలన నెరింగి, ధార్మికుడగు అంశుమంతుని నచటికి పంప కపిలునిచేరి నమస్కరించె. దానికి సంతసించి కపిల ముని యా తురంగము నాతనికినొసంగెను. మరియుఅతనితోనిట్లనెను. నీపౌత్రుడు సలిలార్థులైన నీ పితరులను తపస్సుతో సంతోషపెట్టగలడు. గంగానది యేతెంచి దురాత్ములగు సాగరుల భస్మమును తడుపగా సగర పుత్రులు స్వర్గము చేరుదురు. ఇంతియేకాక ఎవ్వరి యెముకయైనను గంగాజలమునందు పడినయెడల వానికి స్వర్గలోక నివాసము కలుగును. సందేహము లేదు. అంశుమంతుడు జగద్గురువగు కపిల మహర్షికి నమస్కరించి శీఘ్రముగ నిల్లుచేరి యాగాశ్వమును పితామహుడగు సగర చక్రవర్తికి నివేదింపగా నాతడు అశ్వమేధ యాగమును ముగించెను. ఇట్లు మదించిన సగర పుత్రులచే త్రవ్వబడుటచే నీ ద్వీపమునకు సాగరద్వీపమని పేరు లవణ జల సముద్రపు నీటితో నింపబడి లవణ సముద్ర మేర్పడెను. దిని నంతను జయించినవాడు సమ్రాట్ అని చెప్పబడును. ధర్మాత్ముడగు సగరుడు తన పుత్రుడగు దిలీపుని యందు రాజ్యభారము నుంచి కొంతకాలమునకు స్వర్గతి నొందెను. దిలీపుడు తన పుత్రుడగు భగీరథునకు రాజ్య మప్పగించి వనమునందు మహా తప మొనరించి స్వర్గము చేరెను. భగీరథుడు రాజ్యమునంది మహా తపస్సుచే గంగను భూమికి చేర్చి గంగోదకముతో సగరపుత్రుల భస్మమును ముంచి సగర పుత్రులనెల్ల అక్షయ స్వర్గ గతిని పొందించెను. వారచట దేవతలతో చేరి ఆనందముగ నివసించు చున్నారు.

ఇది శ్రీవిష్ణు ధర్మోత్తర మహా పురాణమున - ప్రథమ ఖండమున - మార్కండేయ వజ్ర సంవాదమున సగరోపాఖ్యాన మను పదునెనిమిదవ అధ్యాయము.

# పందొమ్మిదవ అధ్యాయము

## గంగావతరణము

**మార్కండేయ ఉవాచ :**

రాజ్యం ప్రాప్య మహాతేజాః దిలీపతనయోనృపః । నరకస్థాన్ పితౄన్ శ్రుత్వా రాజ్యంన్యస్యాశు వృద్ధయే ॥ 1

గంగా మారాధ యామాస తపసా మహతా తదా । యమైశ్చ నియమై రాజన్నపర్ణాశనకై స్తథా ॥ 2

దశవర్ష సహస్రాణి తప స్తేపే భృశం నృపః అథగంగా మహాదేవీ ప్రసన్నాఽభూద్గత క్లమా ॥ 3

భగీరథోఽపి ధర్మాత్మా వరంలేభే కుతూహలీ । తతో లేఖనదీదేవీ ప్రావోచ త్తం భగీరథమ్ ॥ 4

పతంత్యా గగనా త్సోఢుం మమవేగం వసుంధరా ॥ 5

నసమర్థా యదా తస్మాత్తోషయస్వాశు శంకరమ్ । సహిశ క్తః పత న్త్యామే వేగం సోఢుం నరేశ్వర ॥ 5

ఏవము క్త్వా యయౌదేవీ తదా న్తర్ధాన మీశ్వరీ । భగీరథోఽపి ధర్మాత్మా తప స్తేపే సుదారుణమ్ ॥ 7

ఆరాధనార్థం దేవస్య శంకరస్య మహాత్మనః । తపసోఽ న్తే మహాతేజా దృష్టవాన్ జగదీశ్వరమ్ ॥ 8

దేవ దేవ ఉవాచ :

తపసోగ్రేణ తేరాజన్ ! ప్రసన్నోఽస్మియథేప్సితమ్ దదామితే యతోభ క్తిం పితౄణాం, చాక్షయం యశః ॥ 9

మార్కండేయ ఉవాచ :

ఏవము క్తస్తు దేవేన పూజయిత్వా మహేశ్వరమ్ । జగామ గంగా మనసాం రాజా పూర్ణమనోరథః ॥ 10

శంకరాధిష్ఠితం జ్ఞాత్వా నృపతేశ్చ చికీర్షితమ్ । పపాత గగనా ద్గంగా తదా రాజీవలోచన ॥ 11

గంగాయాః పతనం జ్ఞాత్వాబ్రహ్మా తందేశమాగతః । యమేంద్ర వరుణాన్ దేవాన్పురస్కృత్య అమితౌజసః ॥ 12

ఋషయో నాగ గంధర్వ విద్యాధర మహోరగాః । సువర్ణ కింనర గణా స్తథైవాప్సరసాం గణాః ॥ 13

విమానశత సంబాధం తద్బభూవ నభ స్తలమ్ । ప్రకీర్యమాణ కుసుమైర్దేవ నాగ విరాజితమ్ ।

సురప్రభా దుర్నిరీక్ష్యం తదాభరణ భాసురమ్ ॥ 14

సుగంధి చారుపవనం సురతూర్య నినాదితమ్ । నభస స్తస్య మధ్యేన పపాత గగనాన్నదీ ॥ 15

విశామి భిత్త్వాపాతాలం స్రోతసాగృహ్య శంకరమ్ । ఇత్యేవం దుష్టభావాసా పపాత హర మూర్ధని ॥ 16

మార్కండేయుడిట్లు పలికెను :— మహాతేజస్వియు దిలీప పుత్రుడునగు భగీరథుడు రాజ్యము నంది తండ్రులను నరకస్థులనుగ నెరింగి రాజ్య భారము నితరుల యందుంచి వృద్ధ్యర్థమై గొప్ప తపస్సుతో గంగానది నారాధించెను. దయా శౌచాదియమములతోను, ఆకులు మున్నగువానిని గూడ తినకుండుట మొదలగు నియమములతోను పదివేల సంవత్సరములు భగీరథ చక్రవర్తి గొప్ప తపస్సు గావించెను. అంత గంగా మహాదేవి ప్రసన్నురాలై క్లేశమును తీర్చెను. ధర్మాత్ముడు ఉత్సాహవంతుడు నగు భగీరథుడు వరమందెను. దేవనది వానికిట్లనెను. ఆ కసమునుండి పడుచున్న నాయొక్క వేగమును భూమి సహించలేదు. అందువలన శంకరుని శీఘ్రముగ సంతోషపెట్టుము. ఆతడు నా వేగము సహింప సమర్థుడు. అని పలికి గంగ యంతర్ధాన మందెను. మహాత్ముడగు శంకరుని ఆరాధించుటకై ధర్మాత్ముడగు భగీరథుడు ఘోర తప మాచరించెను. తపస్సు ముగించగా జగదీశ్వరుడగు శంకరుని దర్శించెను. పరమేశ్వరు డిట్లనెను : "ఓ రాజా ! నీ తీవ్ర తపమునకు సంతోషించితిని. నీ యభీప్సిత మిచ్చెద నీకు తండ్రులయెడ అక్షయ భక్తియు, అఖండ కీర్తియు నొసంగెద. అని శంకరునిచే పలుకబడినవాడై శంకరుని పూజించి, రాజు పరిపూర్ణములైన కోరికలు గలవాడై మనసుతో గంగను సంస్మరించెను. భగీరథుని కర్తవ్యము శంకరుని యధీనమై యున్నదని గంగ తెలిసికొని యాకాశమునుండి పడెను. ఆసంగతి తెలిసి బ్రహ్మ ఆ ప్రదేశమున కేతెంచెను. యముడు, ఇంద్రుడు, వరుణుడు, మున్నగు దేవతలను పురస్కరించుకొని మహాతేజస్సంపన్నులగు ఋషులు నాగ గంధర్వ విద్యాధర, మహోరగులు, సుపర్ణులు, కిన్నరులు అప్సరోగణములు దయచేసిరి. అచటి ఆకాశమంతయు ననేక విమానములతో సంకటమాయెను. పుష్పములు చిమ్మబడినవి దేవ నాగులతో ప్రకాశమానమై, దేవతల కాంతులచేతను వారి యాభరణ కాంతులచేతను ఆకాశము మిరుమిట్లు గొల్పు చుండెను. వాయువు పరిమళవంతమై దేవవాద్య ఘోషలచే ప్రతిధ్వనించుచుండెను. ఆ యాకాశమధ్యమునుండి గంగానది పడెను. ప్రవాహముతోగూడ శంకరుని తీసికొని భేదించుకొని పాతాళము చేరెదనను దుష్టభావముతో నా గంగ శివుని శిరమున పడెను.

జ్ఞాత్వా క్రూరమభిప్రాయం దేవ్యాః దేవః పినాకభృత్ । జటాకలాపే తాందేవీం దిరశ్చక్రే చతుర్ముఖే ॥ 17
బభ్రామ సాతిరోభూత్వా తత్రైవ త్వచిరం నదీ । తస్యాః పతంత్యా యే కేచిత్ బిందవః క్షితిమాగతాః ॥ 18
తైః కృతం పృథివీపాల తదాబిందుసరః శుభమ్ । దేవోఽపి దృష్ట్వారాజానం క్షుధయా వ్యాకులేంద్రియమ్ ॥ 19
తత్యాజ తాం తదాశీఘ్రం జటాగ్రేణ మహేశ్వరః ॥ 20
ధృతగంగో జగామాథ తతోఽన్తర్ధాన మీశ్వరః । మహేశ్వర శిరోభ్రష్టా ప్రవిష్టాచ సరశ్శుభమ్ ॥ 21
తస్మాద్వినిస్సృతా భూయః సప్తధా దేవ నిమ్నగా । హ్లాదినీ హ్రాదిని చైవప్లావినీ చేతి ప్రాచ్యగాః ॥ 22
సీతా వక్త్రిశ్చ సింధుశ్చ ప్రతీచ్యభిముఖా గతాః । దక్షిణేన తథా గంగా భగీరథ పథానుగా ।
క్వచిద్వేగేన మహతా క్వచిన్మందవిసర్పిణీ ॥ 23
క్వచిత్ఫేనాకుల జలా క్వచిదావర్త మాలినీ । క్వచిద్గంభీర శబ్దాఢ్యా నిశ్శబ్దాచ తథా క్వచిత్ ॥ 24
క్వచిద్ధంస వరోద్దామా చక్రవాకయుగా క్వచిత్ । ఊర్మిమాలా కుల జలా కుసుమోత్కర మండితా ॥ 25
జలసత్త్వ శతాకీర్ణా సురసిద్ధ సుఖప్రదా । అమృతస్వాదు సలిలా హర సంసర్గ నిర్మలా ॥ 26
విష్ణుపాద ప్రహారోత్థా సర్వపాతక నాశినీ । ఏవం సంప్రాప్య సా వింధ్యం ప్రవిష్టా పూర్వ సాగరమ్ ॥ 27
సాగరేణ సమాసాద్య పాతాలం భీమ దర్శనమ్ । ప్లావయామాస తద్భస్మ సాగరాణాం మహాత్మనామ్ ॥ 28
భస్మని ప్లావితే సర్వే గతాస్తే సాగరా దివమ్ ॥ 29
ఏవంధరాందేవ నదీప్రయాతా సుపుణ్యతోయా ఋషివర్య జుష్టా ।
మహానుభావా నృప ! జహ్నుకన్యా నిశ్శ్రేణి భూతాత్రిదివ ప్రయాణే ॥ 30

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే గంగావతరణం నామ ఏకోనవింశోఽధ్యాయః.

గంగాదేవియొక్క దురభిప్రాయమును నెరింగి పరమేశ్వరుడు ఆ గంగను తన జటాజూటమున నిరోధించెను. ఆ నది అచటనే చిరకాలము తిగారుడజొచ్చెను. అట్లు పడుచున్న గంగానది బిందువులుగల నేల బిందు సరస్సు అను పవిత్ర స్థలమాయెను. శివుడు ఆకలిచే వ్యాకులమైన భగీరథ చక్రవర్తిని చూచి తన జటాగ్రమునుండి గంగను వదలెను. అంత గంగాధరుడంతర్ధాన మందెను. మహేశ్వరుని శిరమునుండి జారినదై బిందు సరస్సును ప్రవేశించి, అందుండి బయలువెడలి దేవనది యేడుగా ప్రవహించెను. హ్లాదిని, హ్రాదిని, ప్లావిని అని తూర్పుగ ప్రవహించును. సీతవక్త్రిము, సింధువు, పడమటగ పోవు నదులు. దక్షిణముగ భాగీరథియనునది ప్రవహించును. ఈ గంగ ఒక్కచో గొప్ప వేగముతోను, మరియొకచో మెల్లమెల్లగ ప్రవహించును. ఒక్కచో నురుగుతో వ్యాకులమైన జలముగలదిగను, ఒక్కచో సుడులు గలదిగను, ఒక్కచో గంభీరధ్వని గలదిగను, ఒక్కచో నిశ్శబ్దము గను, ఒక్కచో హంసధ్వనులతో సుత్కటముగను ఒక్కచో చక్రవాకపక్షి జంటలతోను, తరంగ మాలలతో వ్యాకులమగు జలము గలదిగ నొక్కచోటను, మరియొకచో పుష్ప సముదాయ శోభితముగను, నీటి జంతు సముదాయముతో వ్యాప్తమై యొకచోటను దేవతలకు, సిద్ధులకు సుఖప్రదమై యొక్కయెడను. అమృతమువలె రుచియైన నీరుగలదై, శివ సంపర్కముచే నిర్మలమై విష్ణుపాద ప్రహారముచే నుత్థితమై, సర్వపాతక నివారకమై గంగ యొప్పుచుండెను. ఇట్లు గంగానది వింధ్యాదినిచేరి, పూర్వ సముద్రమును ప్రవేశించి భయంకరమగు పాతాళము చేరి, మహాత్ములగు సగర పుత్రుల భస్మను ఆప్లావితము చేసెను. అట్లు భస్మ మాప్లావితము కాగా సగర పుత్రులందరు స్వర్గమును చేరిరి. ఇవ్విధంబుగ దేవనది భూలోకమును చేరి, పవిత్రోదకయై ఋషి రత్న సేవితయై మహా ప్రభావయుతయై, జహ్నుముని కన్యయై స్వర్లోక గమనమునకు నిశ్శ్రేణిక (నిచ్చెన) యైనది.

ఇది శ్రీ విష్ణుధర్మోత్తరమున మహాపురాణమున ప్రథమ ఖండమున మార్కండేయ వజ్ర సంవాదంబున గంగావతరణమను పందొమ్మిదవ యధ్యాయము.

# ఇరువదియవ అధ్యాయము

## గంగ జాహ్నవియగుట

వజ్ర ఉవాచ :

భాగీరథీత్వం గంగాత్వం దేవనద్యా మయాశ్రుతమ్ । కిమర్థం జాహ్నవీ లోకే కథ్యతే సాగరం గమా ॥ 1

మార్కండేయ ఉవాచ :

పంచాలాఖ్యోఽస్తి విషయో మధ్యదేశే మహీపతే ! । స్వధర్మ కర్మ నిరతైర్యుతో వర్ణాశ్రమైస్సదా ॥ 2

మహోదయం పురం తత్ర కుశస్తంభేన నిర్మితమ్ । సర్వరత్న సమాకీర్ణం కాన్యకుబ్జేతి విశ్రుతమ్ ॥ 3

తస్మిన్ బభూవ భూపాలో జహ్నుః పరమధార్మికః । యస్యకీర్తిమతః కీర్తిః బ్రహ్మాండం వ్యాప్య తిష్ఠతి ॥ 4

స కదాచి న్మహీపాలో హయమేధ ముపాహరత్ । దీక్షితస్య నరేంద్రస్య యజ్ఞవాటంతు నిమ్నగా ॥ 5

ప్లావయామాస వేగేన జలౌఘై ర్యదుసత్తమ । ప్లావితే యజ్ఞవాటేతు రాజా గంగాం తదాబ్రవీత్ ॥ 6

అస్యగంగే ! ఉవలేపస్య సద్యః ఫలమవాప్నుహి ! । పిబామి సకలం తోయం తవ సాగరవల్లభే ! 7

ఏవముక్త్వా పపౌరాజా సర్వం భాగీరథీ జలమ్ । తపసా మహతా రాజన్ ! తథా యోగ బలేన చ ॥ 8

దృష్ట్వైవ గంగాం నిస్తోయాం దీనై ర్మని జనై స్తతః । ప్రసాదితస్తు గంగార్థే తత్యాజ శ్రవణేనతామ్ ॥ 9

దుహితృత్వేచ జగ్రాహ రాజా భాగీరథీం తదా । తేజసా కథితా లోకే జాహ్నవీ యదునన్దన ! ॥ 10

అతీవ దర్పితో రాజా గంగాయా స్స్వయదాన్నప ! । యశోఽర్థం ప్లావయామాస యజ్ఞవాటం తదాఽనఘ ! 11

ఏవం త్రిలోకే నృప ! జహ్నుకన్యా ప్రోక్త్వా బుధై ర్విష్ణు పదీ పవిత్రా ।
హిమాచలస్యాద్రిపతే స్తనూజా సముద్రపత్నీ వరదా విశోకా ॥ 12

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే జహ్నుకన్యో పాఖ్యానం నామ వింశతి తమోఽధ్యాయః.

మార్కండేయు డిట్లనియె :— రాజా ! భారత మధ్య దేశమందు పాంచాల రాజ్యమున్నది అది వర్ణాశ్రమాచార స్వధర్మ నిరతులయిన ప్రజల కావాసము, కుశస్తంభుడు నిర్మించిన మహోదయమను పుర మందున్నది. దానినే కాన్య కుబ్జ మందురు (కనూజ్ అని నేటి వాడుక) దాని రాజు జహ్నువు. పరమ ధార్మికుడు. ఆతని కీర్తి బ్రహ్మాండమెల్ల వ్యాపించినది. ఆతడొకప్పు డశ్వమేధము సేయగా నాతని యజ్ఞవాటమును గంగ ముంచివేసెను, అతడప్పుడు గంగనుద్దేశించి ఓ గంగా ! గర్వము గొని నా యజ్ఞశాలను ముంచితివి. దీనిఫలమనుభవింతువులెమ్మని యా సాగరవల్లభ జలములం ద్రావివైచెను. అతని తపోబలము యోగబలమట్టిది గావున భాగీరథి నంతను ద్రావినంతట మహామునులతిదీనులయి వేడుకొన అతడు ప్రసన్నుడై చెవినుండి యామెను వదలెను. మరియు నా భాగీరథిని తన కూతురట్లు గైకొనెను. దాన నా పుణ్యనది జాహ్నవి యను పేరందెను. తన యజ్ఞవాటము నాతడా జాహ్నవిచే నింపి కీర్తిశాలి యయ్యెను. విష్ణుపదియననైన పవిత్ర నది యిట్లు హిమాద్రిం జనించి సముద్రు నిల్లాలై జాహ్నవి భాగీరథియునై సర్వశోకాపహారిణియు వరదయునై విలసిల్లుచున్నది.

ఇది శ్రీవిష్ణు ధర్మోత్తర మహాపురాణమున ప్రథమ ఖండమున గంగ జాహ్నవి యగుట అను ఇరువదవ యధ్యాయము.

# ఇరువదియొకటవ అధ్యాయము

## గంగ విష్ణుపదియైన కథ

వజ్ర ఉవాచ :

గంగా విష్ణుపదీ లోకే కిమర్థం కథితాబుధైః । తన్మమాచక్ష్వ తత్త్వేన భృగువంశ వివర్ధన ! ॥ 1

మార్కండేయ ఉవాచ :

స్వాయం భువేంతరే పూర్వం చత్వారో దేవతా గణాః । జయాఖ్యా శ్చాజితాఖ్యాశ్చశుక్రాఖ్యాశ్చ ప్రకీర్తితాః ॥ 2

తేషాం బభూవ దేవేంద్రో విశ్వభుక్ లోకపూజితః । ఆసంస్తస్యాసురా ఘోరాస్తదా దాయాద బాంధవాః ॥ 3

బభూవ రాజా తేషాంచ బాష్కలిర్నామ నామతః । యేన విక్రమ్య శక్రస్య హృతం రాజ్యం తదా బలాత్ ॥ 4

హృత రాజ్యస్తు దేవేంద్రో బ్రహ్మాణం శరణం గతః । బ్రహ్మాపి శక్రమాదాయ జగామ శరణం హరిమ్ ॥ 5

నివేదయామాస తదా దేవదేవాయ శార్ఙ్గిణే । బాష్కలే ర్విజయం సర్వం బ్రహ్మాశుభ చతుర్ముఖః ॥ 6

శ్రీ భగవానువాచ :

బ్రహ్మన్ ప్రత్యాహరిష్యామి రాజ్యమస్య శతక్రతోః । దివి దేవేషు ధర్మాత్మన్ ! నివృత్తో భవ మాచిరమ్ ॥ 7

అహం వామన రూపేణ ప్రయాస్యే బాష్కలిం నృపమ్ ।

మాందృష్ట్వా విస్మితం తంతు గత్వా యాచతు దేవరాట్ ॥ 8

లోకత్రయం మమ హృతం త్వయా విక్రమ్య బాష్కలే । తత్రాగ్ని శరణార్థాయ దీయతాంమే క్రమత్రయం ॥ 9

అతీవ హ్రస్వ గాత్రస్య వామనస్యాస్య మాచిరమ్ । ఏవ ముక్తస్తు శక్రేణ తదా దాతా క్రమత్రయమ్ ॥ 10

మార్కండేయ ఉవాచ :

ఇత్యేవముక్తో దేవేన బ్రహ్మ స్వభవనం గతః । దేవోఽపి వామనో భూత్వా ప్రయాతో యత్ర బాష్కలిః ॥ 11

బాష్కలి ర్వామనం దృష్ట్వా విస్మయోత్ఫుల్ల లోచనః । నిరీక్ష్యతం యథాకామ మసురై ర్బహుభిర్వృతః ॥ 12

ఏతస్మిన్నేవ కాలేతు శక్రస్తందేశ మాయయౌ । పాద్యార్ఘ్యా చమనీయోద్యైః శక్రంసంపూజ్య బాష్కలిః ॥ 13

కిమాగమన కార్యంతే తమువాచ ప్రహృష్టవాన్ । అత్యాశ్చర్య మిదం మన్యే తవాగమన కారణమ్ ॥ 14

శక్ర ఉవాచ :

లోక త్రయంమేఽపహృతం విక్రమేణతు బాష్కలే । తత్రాగ్ని శరణార్థాయ దీయతాం మే క్రమత్రయమ్ ॥ 15

అతీవ హ్రస్వగాత్రస్య వామనస్యాస్య పార్థివ ! । భూమి భాగేతు పార్యక్యే వస్తుం న త్వహ ముత్సహే ॥ 16

బాష్కలిరువాచ :

క్రమత్రయం వామనకే దేవరాజకృతమ్ శుభం । తత్రాస్స్వ ముదితః ప్రాప్తః సుఖీ సురపతే ! భవ ! 17

మార్కండేయ ఉవాచ :

ఏవముక్తో బాష్కలినా త్యక్త్వా రూపంతు వామనం ॥ 18

హరి ర్విచక్రమే లోకాన్ దేవానాం హితకామ్యయా బ్రహ్మలోకం తతో గత్వా .........

దేవస్య వామశ్చరణో నివిష్టో దానవాలయే ॥ 19

తతః క్రమం స ప్రథమం దదౌ సూర్యే! జగత్పతిః । ద్వితీయంచ ధ్రువే దేవః తృతీయేనచ యాదవ! 20
బ్రహ్మాండం తాడయామాస హ్యాసం పూర్ణేన కేశవః । బ్రహ్మాండ స్తాడిత స్తేన ఛిద్రతా మగమత్ ప్రభో! 21
బ్రహ్మాండ బాహ్యతోయేన శతఘ్నేనాం ఖసావృతమ్ । తేనచ్ఛిద్రేణ తత్తోయం వివేశాండం మహీపతే ॥ 22
అంగుష్ఠాక్షతా దండావ్యత్ ప్రవిష్టం జలం శుచి । ప్రాప్తా దేవ నదీత్వంతు సాతు విష్ణుపదీ నదీ! 23
దేవనద్యా తయావ్యాప్తం బ్రహ్మాండం సకలం నృప! । విభూతిభిర్మహాభాగ! సర్వాను గ్రహకామ్యయా ॥ 24
వామనేన సమాక్రాంతా సర్వేలోకాః యదానఘ । అసురై స్తే తదాత్యక్తా దేవానాం సత్యబాంధవైః ॥ 25
పాతాలంచ యదాతేన నాక్రాంతం హరిమేధసా । అసురై స్తై స్తదాఘోరై రుష్యతే యదునందన! ॥ 26
దేవోఽపి హత్వా త్రైలోక్యం జగామాఽదర్శనం తదా । పాతాల నిలయశ్చాపి సుఖమాస్తే స బాష్కలిః ॥ 27
శక్రోఽపి పాలయామాస విపశ్చిద్భువనం తదా । ఇమం త్రివిక్రమం నామ ప్రాదుర్భావం జగద్గురోః ॥ 28
గంగా సంభవ సంయుక్తిం సర్వ కిల్బిష నాశనమ్ ॥ 29
తేనైవ దేవదేవేన ప్రాప్తేవైవస్వతేంఽతరే । భూయో లోకాస్త్రయః క్రాంతాః పదాసంయమినో నృప! 30
అనేన కారణేనోక్తా గంగా విష్ణుపదీ నృప! । యయా సర్వమిదం వ్యాప్తం త్రైలోక్యం సచరాచరమ్ ॥ 31
గంగా సముత్పత్తి రియం మయోక్తా శ్రుత్వైవ యాంముంచతి సర్వపాపమ్ ।
పాపైర్విశిష్టోఽపినరో నృవీర! సాధు వ్రతస్తు త్రిదివం ప్రయాతి ॥ 32

ఇతి శ్రీవిష్ణు ధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే త్రివిక్రమోపాఖ్యానంనామ
ఏకవింశతి తమోఽధ్యాయః.

గంగానది లోకమున విష్ణుపదియని యేల చెప్పబడుచున్నదని వజ్రుడడుగ మార్కండేయు డిట్లనియె: స్వాయంభువ మన్వంతరమందు నాల్గు దేవతాగణములుండెను. జయము, అజితము, శుక్రముననునవి. [నాల్గవ పేరు మూలములో లేదు] గణము లకు ప్రభువుదేవేంద్రుడు, అతని దాయాదు లసురులు. అసురులకు రాజు బాష్కలి. విక్రమించి యింద్రరాజ్యమును హరించెను. ఇంద్రుడు బ్రహ్మను శరణందెను. ఆయన యేగి చక్రహస్తునకు విన్నవించెను. విని విష్ణువు త్వరలో నే నీ యింద్రుని రాజ్యమును పునరుద్ధరింతునని వామనావతారమెత్తి బాష్కలి దరికేగెను. అతడా మూర్తింగని యచ్చెరువంది యసురులతో నానందించు సమయమున నింద్రుండచ్చటికేతెంచెను అతనింగూడ బాష్కలి పాద్యాదులచే బూజించి నీ రాకకు గారణమేమన శక్రుడు(ఇంద్రుడు) నా త్రిలోకసామ్రాజ్యమపహరింపబడినది. అగ్నిశాలకై మూడడుగుల భూమి కావలయును మిక్కిలి పొట్టివాడీవామనుడు పరస్థు మందుండుట నాకిష్టముగాదన బాష్కలియు వామనమూర్తికి శుభదమైన మూడడుగుల మేర యేర్పరుపబడియేయున్నది. నీవు సుఖ సంతోషములతో నుండుమన వామనమూర్తి యా రూపమును విడిచి సాక్షాద్విష్ణువుగావున దేవహిత మొనరింప విక్రమించెను. దేవ దేవుని తొలి యడుగు దేవలోకమునను ఎడమ పాదము దానవాలయమున నుంచబడెను. రెండవ యడుగు ధ్రువు నందు నిలుపబడెను. మూడవయడుగున హరి బ్రహ్మాండము గొట్టెను. దాన నది పగిలి రంధ్రమేర్పడి బ్రహ్మాండమువ్వలనున్న యుదకము శతఘ్నిసోత్రనై యావరింప నారంధ్రమునుండి యది లోనికిం జొచ్చెను. కాలి బొటనవ్రేలి తాకునం దూటువడి లోనం బ్రవేశించిన యాపవిత్రోదక మున దేవనది విష్ణుపది యనంబడెను. ఆ దేవనదిచే సర్వ బ్రహ్మాండము వ్యాప్తమైనది. విష్ణువు యొక్క యణిమాది విభూతి వైభవమే యీ వింతకు గారణము. ఇది సర్వలోకానుగ్రహకారణమైనది. ఇట్లు వామనునిచే సర్వలోకములాక్రమింపబడి దేవతల సహజబంధువులగు నసురులచే బరిత్యక్తములై సురలపాలైనవి. హరిమేధసుడైన వామనునిచే పాతాళము నాక్రమింపబడినందున నందు ఘోరులగు నసురులు నివసింపనేగిరి. ఇట్లు విష్ణువు ముల్లోకములంగొని యంతర్ధానమొందెను.

భాష్కలి పాతాళమందు సుఖముగా వసించుచున్నాడు ఇంద్రుడును భువనపాలనము నొనరించుచున్నాడు. ఈ త్రివిక్రమాకారము జగద్గురువగు విష్ణువది. గంగావతరణము సర్వకిల్బిషహరము. ఆవిష్ణువుచేతనే వైవస్వత మన్వంతరమందు మరల ముల్లోకము లాక్రమింపబడినవి. ఇందుచే గంగ విష్ణుపది యనంబడినది. ఆమెచే ముల్లోకములు వ్యాప్తములయినవి. ఈ గంగావతరణవృత్తాంతమును విన్నవాడు సర్వపాపవిముక్తుడై సాధువ్రతుడై త్రిదివమును (స్వర్గమును) బొందును.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణమున ప్రథమఖండమున గంగావతరణమను నిరువదియొకటవ యధ్యాయము.

## ఇరువదిరెండవ యధ్యాయము - గంగా వ్యాప్తి

వజ్ర ఉవాచ :

బ్రహ్మన్! విష్ణుపదీ గంగా త్రైలోక్యం వ్యాప్య తిష్ఠతి । యథాతథా భృగుశ్రేష్ఠ! సర్వమేవ ప్రకీర్తయ ॥ 1

మార్కండేయ ఉవాచ :

ప్రవిశ్య దేవీ బ్రహ్మాండం విష్ణులోక ముపాగతా । బ్రాహ్మీం సభాం ప్లావయిత్వా తపోలోక ముపాగతా ॥ 2
జనలోకం గతా తస్మా న్మహర్లోకం తతోగతా । స్వర్గలోకం సమాసాద్య ప్రవిష్టా చంద్రమండలమ్ ॥ 3
చంద్రమండల విభ్రష్టా భువర్లోక ముపాగతా । ఆకాశగంగా కథితా తత్రసారతి వర్ధినీ ॥ 4
తస్యాస్తు దృశ్యతే పన్థాః సతతం వ్యోమ్ని నిర్మలే । ఆకాశగంగా మధ్యేసా మేరేనిపతితా గిరా ॥ 5
మేరుమధ్యా ద్దృశ్యన్తీ దృశ్యన్తీ చ తథా క్వచిత్ । ప్రయాతా సర్వవర్షాణి ద్వీపానిచ మహామతే! ॥ 6
సాతుదేవీ జయానామ మనువర్షే హ్రదాస్తుతే । తేభ్యశ్శాన్తా చ సాధ్వీచ ద్విధా గంగా వినిస్సృతా ॥ 7
జ్యోత్స్నా చ మృగమందాచ స్మృతా హైరణ్వతీ శుభా । పుండరీకా పయోదాచ రమ్యే వర్షే నిగద్యతే ॥ 8
భద్రాచ కథితా చైవ గాంధర్వీచ మనోజవా । ఇలావృతే తథా సైవప్రోక్తా జాంబవతీశుభా ॥ 9
తస్యాస్త్రీరభవం మూర్ధ్ని కంధార్యతే సురైః । కేతుమాలే చ కథితా నిర్మలా నద్వలా తథా ॥ 10
మనస్విన జ్యోతిష్మతీ హరివర్షే నిగద్యతే । తథా కింపురు షాఖ్యేంతు రంభా చంద్రవతీ శుభా ॥ 11
ఇంద్రద్యుమ్న పయోదా సా కాశైరా మతిపావనీ । మనోజవా తామ్రపర్ణీ గభస్తి మతి మాలినీ ॥ 12
నాగద్వీపే నాగవతీ సౌమ్యే సోమప్రభా తథా । రుద్రలోకం తతః ప్రాప్తా బ్రహ్మలోకం తతో గతా ॥ 13
గాంధర్వీ చైవ గంధర్వీ వారుణే వరుణ ప్రభా । హ్రాదినీ హ్లాదినీ చైవ పుణ్యతోయా చ వర్షిణీ ॥ 14
సీతా చక్షుశ్చ సింధశ్చ గంగా తాస్మిన్ ప్రకీర్తితా । అమరాన్ నిషధా న్సర్వాన్ద్విసరా నృషికాం స్తథా ॥ 15
ఉష్ట్రప్రావరణాన్ సౌమ్యాన్ కర్ణ ప్రావరణాం స్తథా । కాలోదరాన్ వికీర్ణాంశ్చ హ్రాదినీ తు నిషేవతే ॥ 16
ఇంద్ర ద్యుమ్నసరః పుణ్య ముపచారా దజాయత । తథా ఖరపదాన్ దేశాన్ వేత్ర శంకుపదా నపి ॥ 17
తంజానకామతం చైవ హ్లాదినీ తు నిషేవతే । దరదాన్ జహుడాం శ్చైవ కాశ్మీరాన్ నైరసాన్ కురూన్ ॥ 18
గాంధారాన్ దరదా భీరాన్ కుపర్వాన్ భీమరౌరవాన్ । శివపర్వా నింద్రపర్వాన్ సింధు తీరాన్ నిషేవతే ॥ 19

దేవాన్ దైత్యాన్ కాలకేయాన్ గంధర్వాన్ కిన్నరాం స్తథా ।
విద్యాధరాన్ తథా నాగాన్ సు పర్వా న్సుమనో హరాన్ ॥ 20

కలాపగ్రామకాం శ్చైవ నరనారాయణా శ్రీమమ్ । కిరాతాంశ్చ పుళిందాంశ్చ మయస్య నగరీం తథా ॥ 21

కుతూ న్సభారతాం శ్చైవ పుళిందాం శ్చైవ భాగశః ।
పాంచాలాన్ కాశయాన్ వత్సాన్ మాగధాం స్తామ్ర విప్తకాన్ ॥ 22

సహోత్తరాంశ్చ వంగాంశ్చ తథా శ్రావస్తి వాసినః । అంగాన్ వంగాన్ సపుండ్రాంశ్చ గంగా భావయతే శుభా ॥
హ్రాదినీ హ్లాదినీ చైవ పావనీ జాహ్నవీ తథా । ప్రవిష్టా సాగరం పూర్వం ద్వీపేఽస్మిన్ నృప సత్తమ ॥ 24
సీతా చక్షుశ్చ సింధుశ్చ పశ్చిమం నృప ! సాగరమ్ । గంగా వ్యాప్తి స్తవ ప్రోక్తా జంబూద్వీపే మయాఽనఘ॥ 25
లోకేషుచ తథా రాజన్ ! ద్వీపే ష్వన్యేషు మే శృణు ।

గంగ విష్ణుపది (విష్ణుపాదమునం బుట్టినది) ముల్లోకములను వ్యాపించియున్నది. ఆ వ్యాపించిన విధమును తెలుపుమని వజ్రుడడుగగా మార్కండేయుండిట్లు చెప్పదొడంగె: గంగాదేవి తొలుత బ్రహ్మాండమునుఁ బ్రవేశించి విష్ణులోకముం జొచ్చి బ్రహ్మ సభను వడిపి తపోలోకమును జనలోకమును మహర్లోకమును స్వర్గలోకమును జేరి చంద్రమండలముం బ్రవేశించెను. అట నుండి జారి భువర్లోకమునకువచ్చి ఆకాశగంగ యను పేర సుల్లాసమును బెంపొందించుచున్నది. నిర్మలమైన యాకాశమందా నదీమ తల్లి మార్గము కనబడుచున్నది. ఆమె భూమండల మధ్యమందున్న మేరుపర్వతము మీద బడినది. మేరు మధ్యమందుండి కొన్ని చోట్ల కనబడక యు కొన్ని యెడల కనబడుచును నెల్లవర్షములను సర్వద్వీపములనుగూర్చి యేగినది. కురువర్షమునందు ఆమె జయ యనుపేరం బ్రవహించినది. ఆ జయ యను గంగలో మడుగులు శాంత సాధ్వి అని రెండు. జ్యోత్స్న, మృదంగ హిరణ్య వర్షమున-పుండరీక పయోద అనునవి రమ్యకవర్షమున-మడుగులు. భద్ర గాంధర్వి మనోనుగ జాంబవతి యని యిలావృత వర్షమందు గంగానదీ హ్రదములు (మడుపులు) గలవు. ఆ జాంబవతి తీరమందుపుట్టిన కనకమును (బంగారము జాంబూనదము) దేవతలు ధరింతురు. కేతుమాలవర్షమందు నిర్మల నద్వల యను పేర నున్నది. మనస్విని జ్యోతిష్మతి యనుపేర హరివర్షమునను-కింపురుష వర్షమున రంభ చంద్రవతియని ఇంద్రద్యుమ్న పయోద కోశైకమతి పావని మనోజవ తామ్రపర్ణి గభస్తిమతి మాలిని నాగపతి యన నాగద్వీపమందు-సోమప్రభయనుపేర సౌమ్యద్వీపమందును-గంగానది వివిధశాఖలుగా రూపొందినది. అటుపైని రుద్రలోకమును బ్రహ్మలోకమును జొచ్చినది. గంధర్వలోకమందు గాంధర్వి, వరుణలోకమందు వరుణప్రహవయు ననబడును. హ్రాదిని హ్లాదిని వర్షిణి సితచక్షుస్సు సింధువు అను పేర గంగ ఈ భారతవర్షమున రూపొందినది. అమర, నిషధ, ధీవర, ఋషిక ఉష్ణప్రావరణ, కర్ణప్రావరణ, లోదర, వికర్ణములనెడి దేశములందు హ్రాదిని యనుపేర గంగ ప్రవహించుచున్నది. అటుపై ఇంద్రద్యుమ్న మను సరస్సు పేర గంగయే ఔపచారికముగ పిలువబడుచున్నది. ఖర పథములు వేత్ర శంకుపథములు తంజాన కాపుతము నను ప్రదేశములను హ్లాదిని యను గంగ ప్రవహించినది. అవ్వల దరదములు జహుడములు కాశ్మీరములు నైలనములు మేరువులు గాంధారములు దరదాభీరములు కువర్వములు భీమ కారవములు శివపర్వములు ఇంద్రపర్వములు సింధుతీరములను జొచ్చినది. దేవతలు దైత్యులు కాలకేయులు గంధర్వులు కిన్నరులు విద్యాధరులు నాగులు సువర్వులు కలాపగ్రామములను నరనారాయణాశ్రమమును (బదరి) కిరాత పులింద దేశములను మయనగరమును కులు భా తదేశములను పులింద దములో కొంత భాగమును పాంచాల కాశయ వత్స మాగధ తామ్రలిప్తకములను సహ్యపర్వతోత్తర ప్రదేశములను వంగదేశమువారిని శ్రావస్తినివాసులను అంగులను వంగులను పుండ్రులను గంగానది సంభావించుచున్నది. ఈ జంబూద్వీపమునందు హ్రాదిని హ్లాదిని పావని జాహ్నవియనునవి తూర్పు సాగరముం బ్రవేశించినవి. సిత చక్షుస్సు సింధు పడమటి సాగరముంజొచ్చినవి. ఇంతవరకు జంబూద్వీపమునందు గంగయొక్క వ్యాప్తి నీకేను దెల్పితిని. మరియితర లోకములందు ద్వీపములందున్నది వినుము.

సుకుమారీ కుమారీచ సుకృతా సేవినీ తథా॥ 26
ఇక్షుశ్చ వేణుకా నందా శాకద్వీపే చ సప్తధా । శాల్మలే త్వథ గోమేదే ద్వీపే పుష్కర సంజ్ఞకే ॥ 27
నదీత్వం సా సముత్సృజ్య చోదధిత్వ ముపాగతా । తస్మిన్ ద్వీపత్రయే నద్యో న సన్తి యదు నన్దన ॥ 28
ఉదకా న్యుద్భిదాన్యేవ తేషు సన్తి సహస్రశః ఏవం భూమితలం ప్లావ్య పాతాళం కృష్ణమృత్తికమ్ ॥ 29
ఏకీభూతా ప్రవిష్టా సా భోగ వత్యాః సమీపతః । శ్వేత భౌమంగతా తస్మాత్ రక్త భౌమం తతోగతా ॥ 30
శిలా భౌమం గతా తస్మాత్ రుక్మభౌమం తతోగతా । రుక్మభౌమా దపిగతా రౌద్రం తేజ స్సుదారుణమ్ ॥ 31

తతోఽపి విలయం గత్వా వారాహం లోక మాగతా । వారాహలోకాద్బ్రహ్మాండం తదర్థం భిన్నవాహినీ ॥ 32
ఛిద్రేణ తేనసా దేవీ స్వాంయోనింపున రాగతా ॥ 33

ఏవం నరేంద్రేశ ! జగత్సమగ్ర మాక్రమ్య గంగా సతతం స్థితా యా ।
తస్యాః ప్రభావ శ్రవణా దశేషం పాపంనరాణాం సముపైతి శాంతిమ్ ॥ 34

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్ర సంవాదే గంగా వ్యాప్తిర్నామ ద్వావింశతి తమోఽధ్యాయః

సుకుమారి, కుమారి, సుకృత, సేవిని, ఇక్షువు, వేణుక, నంద యను పేర శాకద్వీపమునం దపరనది యేడు విధము లయినది. శాల్మల, గోమేద, పుష్కర ద్వీపములందు గంగ నదీభావమును వదలి యుదధి (సముద్ర) భావముం బొందినది. ఆ మూడు ద్వీపములందు నదులు లేవు. ఉదకములు ఉద్భిదములు మాత్రమే వేలకొలది యటనున్నవి. ఇట్లు భూతలము దడిపి నల్లని మృత్తికతోనుండు పాతాళముంజొచ్చి ఏకీభూతయై (అన్ని పాయలు నొక్కటియై) భోగవతి సమీపమందు శ్వేత భౌమమును (తెల్లని మట్టిగల ప్రదేశమును) రక్తభౌమమును (ఎర్రనిమట్టిగల ప్రదేశము) శిలాభౌమమును (రాతినేలను) రుక్మభౌమమును (స్వర్ణభూమిని) క్రమముగా బొందినది. స్వర్ణభూమినుండి కూడ సుదారుణమైన రుద్రతేజస్సును బొందినది. ఆమీద విలయమంది వారాహలోకమున కేతెంచినది. అటనుండి బ్రహ్మాండమును దానిలో సగభాగము రెండుగా ప్రవహించి లోగడ చెప్పిన ఛిద్రము (రంధ్రము) నుండి తనజన్మస్థానమునకు దిరిగివచ్చినది. ఇట్లు గంగాదేవి యెల్లజగమాక్రమించి నిత్యస్థాయి నొందినది. ఆమె ప్రభావమాలించిన నరుల పాపము శమించును.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున గంగావ్యాప్తియను నిరువది రెండవ యధ్యాయము.

## ఇరువదిమూడవ యధ్యాయము - అర్జునోపాఖ్యానము

వజ్ర ఉవాచ :

భగీరథస్య రాజర్షే ర్వంశ ముత్తమ పూరుష ! త్వత్తోఽహం శ్రోతు మిచ్ఛామి గంగా యేనావతారితా ॥ 1

మార్కండేయ ఉవాచ :

భగీరథసుత శ్శ్రీమాన్ విశ్రుతో నామ ధార్మికః । విశ్రుతస్యాత్మజ శ్శ్రీమాన్ నాభాగ ఇతి విశ్రుతః ॥ 2
అంబరీష స్తు నాభాగి రయుతారి స్త దాత్మజః తత్సుతో ఋతు పర్ణశ్చ రాజా నలసఖో బలీ ॥ 3
శర్వకామ స్సుత స్తస్య సుదాస స్తస్య చాత్మజః । తస్య మిత్రసహః పుత్రః తస్య పుత్రోఽశ్మకో నృప ! 4
మూలక స్తత్సుతో రాజా మహాబుద్ధి ర్నరేశ్వరః । క్షత్రియాణాం వధే ఘోరే రామేణ వినిపాతితః ॥ 5
పురా పితృవధా మర్షాద్రామో భార్గవ నందనః । త్రి స్సప్తకృత్వః పృథివీం చక్రే నిఃక్షత్రియా మిమామ్ ॥ 6
భగీరథ కులోత్పన్నం మూలకం నామ జఘ్నివాన్ ।

వజ్ర ఉవాచ :

కథం రామేణ వసుధా పురా నిః క్షత్రియా కృతా । కి మర్థంచ మహాభాగ ! త న్మమాచక్ష్వ పృచ్ఛతః ॥ 7

గంగనవతరింపజేసిన రాజర్షియగు భగీరథుని తరువాతి వంశవృత్తాంతమును తెలియగోరెదనని వజ్రుడడుగ మార్కండేయు డిట్లనియె : భగీరథుని పుత్రుడు శ్రీమంతుడు ధార్మికుడు నగు విశ్రుతుడు. నాభాగుడు అంబరీషుడు నాభాగి అయుతారి ఋతు

పర్జుపు (నలుని స్నేహితుడు) శర్వకాముడు సుదాముడు మిత్రసహుడు అశ్మకుడు మూలకుడు దాక తండ్రికొడుకుల వరుస యిది. మూలకుని పరశురాముడు సంహరించెను. పరశురాముడిరువదియొక్కమారు దండెత్తి యీ పృథివిని నిఃక్షత్రియముం గావించెను పరశురాముడెందులకీ దండయాత్రసేసెను దెల్పుమన మార్కండేయుడిట్లనియె :

మార్కండేయ ఉవాచ :
సోమవంశ సముత్పన్నో యయాతి ర్నామ పార్థివః । తస్యాపి సంహతః పుత్రో బభూవ పృథివీ పతిః ॥ 8
సహస్ర జిత్ సుత స్తస్య నభజి త్తస్య చాత్మజః । తస్యాఽపి హైహయః పుత్రః కుంతి స్తస్యాపి చాత్మజః ॥ 9
తస్యాఽపి సంహతః పుత్రో మహిష్మాన్ తస్యచాత్మజః । మాహిష్మతీ కృతా యేన నగరీ సుమనోహరా ॥ 10
భద్రశ్రేణ్య స్సుత స్తస్య దుర్మద స్తస్య చాత్మజః । కనక స్తత్సుతో రాజా కృతవీర్య స్తదాత్మజః ॥ 11
అర్జున స్తనయ స్తస్య స ప్తద్వీపేశ్వరోఽభవత్ । దత్తాత్రేయోఽథ భగవాన్ విష్ణురూపాసు రూపధృక్ ॥ 12
ఆరాధ్య తపసాయేన ప్రాప్తం రాజ్యం సుదుర్లభమ్ । తథా బాహూ సహస్రంచ మతిం ధర్మే తథోత్తమామ్ ॥ 13
అధర్మే వర్తమానస్య మరణం చ జనార్దనాత్ । యుద్ధేన పృథివీం జిత్వా ధర్మేణైవానురంజయన్ ॥ 14
తేనేయం పృథివీ సర్వా స ప్తద్వీపా సపత్తనా । సప్తోదధి పరిక్షిప్తా క్షాత్రేన విధినా జితా ॥ 15
పాతాల నగరే శైలే వసుధాయాం రసాతలే । తస్య పార్థివ సింహస్య చక్రం నప్రతిహన్యతే ॥ 16
ద్వీపేషు సహి సర్వేషు ఖాతం ఖాతమథాఽకరోత్ । యూపచిహ్నాని చ తథా ఖడ్గీ శతశనీ రథీ ॥ 17
దేశా నను చరన్ యోగాత్ సదా పశ్యతి తస్కరాన్ । స ఏవ పశుపాలోఽభూత్ క్షేత్రపాల స్స ఏవచ ॥ 18
స ఏవ వృష్ట్యా పర్జన్యో యోగిత్వా దర్జునోఽభవత్ । సతు బాహూ సహస్రేణ జ్యాఘాత కఠిన త్వచా ॥ 19
భాతి రశ్మి సహస్రేణ శారదేనేవ భాస్కరః । రాక్షసా నిర్జితా స్తేన తేన బద్ధస్య రావణః ॥ 20
జిత్వా భోగవతీ తేన కర్కోటక సుతా హృతా । తస్య బాహూ సహస్రేణ క్షోభ్యమాణే మహోదధౌ ।
భవన్తిలీనా నిశ్చేష్టాః పాతాలస్థాః మహాసురాః ॥ 21
మందర క్షోభ చకితాః అమృతోత్పాద శంకితాః । నత నిశ్చల మూర్ధానో భవంతిచ మహోరగాః ॥ 22
దశయజ్ఞ సహస్రాణి తేనేష్టాని మహీక్షితా । ద్వీపే ద్వీపే మహారాజ! ధర్మజ్ఞేన మహాత్మనా ॥ 23
సర్వే యజ్ఞా మహారాజ! తస్యాసన్ భూరి దక్షిణాః । సర్వే కాంచన వేదికాః సర్వే యూపైశ్చ కాంచనైః ॥ 24
ద్విజానాం పరివేష్టారః తస్య యజ్ఞేషు దేవతాః । స్వయ మాసన్ మహారాజ! స్వయం భాగహరా స్తథా ॥ 25
తస్య యజ్ఞే జగౌ గాథా నారద స్సుమహాతపాః । న నూనం కార్తవీర్యస్య గతిం యాస్యన్తి పార్థివాః ॥ 26
యజ్ఞైర్దానై స్తపోభిర్వా విక్రమేణ శ్రుతేన వా ॥ 27
పంచాశీతి సహస్రాణి వర్షాణాం స మహీపతిః । స ప్తద్వీపేశ్వరః సమ్రాట్ చక్రవర్తీ బభూవ హ ॥ 28
తస్య రాజ్ఞస్తు వసుధా బహూ పార్థివ సంకులా । భారాక్రాన్తా విలులితా బభూవ పృథివీపతే! ॥ 29
తస్యరాజ్ఞో గతాతంకై ర్బహుపుత్రై ర్నరోత్తమ! । తేజోయుక్తై స్సమాకీర్ణా వసుధా వసుధాధిప! ॥ 30
బహూనాగాఽశ్వ సంకీర్ణా బహు గోకుల సంకులా । న శక్తా నృపతే! సోఢుం తేజ స్తదతి మానుషమ్ ॥ 31
జ్వాలావళి వపుః శ్రాన్తా ఖిన్నా నాశ ముపాగతా ॥ 32
ఏవం ప్రభావే నరదేవ నాథే పృథ్వీం సముద్రాం పరిపాల్యమానే ।
భారేణ సన్నా పృథివీ జగామ మహేన్ద్రలోకం మునిదేవ జుష్టమ్ ॥ 33

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే అర్జునోపాఖ్యానం నామ
త్రయోవింశోఽధ్యాయః

చంద్రవంశమందు యయాతి, సంహతుడు, సహస్రజిత్తు, నభజిత్తు, హైహయుడు, కుంతి, సంహతుడు, మహిష్మంతుడు దాక తండ్రికొడుకులైరి. మహిష్మంతుడు మాహిష్మతి నగర నిర్మాత. అతని కొడుకు భద్రశ్రేణ్యుడు. అటనుండి ధర్మతుడు కనకుడు కృతవీర్యుడు అర్జునుడు దాక తండ్రికొడుకులయిరి. అర్జునుడు సప్తద్వీప సార్వభౌముడయ్యెను. విష్ణ్వవతారమైన దత్తాత్రేయుల నతడారాధించి రాజ్యమును వేయి బాహువులను బడసెను. ధర్మబుద్ధిని యుద్ధమంద ధర్మవర్తనుండు తన రాజ్యములో చనిపోవలెనని వరముం బడసి యవనినెల్ల యుద్ధమున గెలిచి ధర్మముచే ప్రజారంజనముగ పరిపాలించెను. అన్ని ద్వీపములందాతడు యూపస్తంభములను నెలకొల్పెను. అనగా పెక్కు యజ్ఞములు సేసెనని తాత్పర్యము. సప్తసముద్రావృతమయిన మేదిని కతడేక ఛత్రాధిపతియైయుండెను. మహాయోగియై కత్తులు శరశతముం గొని రథమెక్కి దిగ్విజయముసేసి పాతాల నగరమందు శైలమందు నేలపై యాతడు రథముతో సంచరించెను. అతని చక్రమెక్కడను కుంటువడలేదు. అతడు యోగశక్తిచేత దొంగలను గనిపెట్టి నాడు. అతడే పశుపాలకుడు క్షేత్రపాలకుడు నయ్యెను. తానే వర్షము గురిపించి పర్జన్యుడయ్యెను. యోగి యగుటచే నర్జునుండను పేరొందెను. వేయుబాహువులతో నతడు వేయికిరణములతోడి శరదృతు భాస్కరుడట్లు వెలింగెను. అతడు రాక్షసుల నెల్లర గెలిచెను. రావణుని బందీగా నొనరించెను. కర్కోటకు సుతులు హరించిన భోగపతిని (పాతాళ ప్రధాననగరము) ఆతడు జయించెను. ఆతని వేయిబాహువులచే సముద్రము సంక్షోభింప పాతాళగతులయిన మహాసురులు దాగి దాగి మందరగిరి నమృతమథనమందుట, మందరగిరి క్షోభమునందట్లు నిశ్చేష్టులయిరి. మహాసర్పములు తలలువాంచి కదలకుండ నిలిచినవి. ఆతడు ప్రతి ద్వీపమునందు పదివేల యజ్ఞములు సేసెను. భూరిదక్షిణలు బంగారువేదికలు బంగారు యూపములతో అనంత బ్రాహ్మణ సమారాధన మందు దేవతలు స్వయముగ వడ్డనలు గావించిరి. స్వయముగా హవిర్భాగములను నందుకొనిరి. ఆతని యజ్ఞమందు మహాతపస్వి నారదు డిట్లు గాథల గానము సేసెను. రాజులు యజ్ఞములచే దానములచే దపస్సులచే పరాక్రమముచే పాండిత్యముచే కార్తవీర్యార్జునుదేగిన దారి బోజాలరు. ఆమహాప్రభు డెనుబదియైదు వేల యేండ్లు సప్తద్వీపములకు సమ్రాట్టు చక్రవర్తియునైయుండెను. అనేకమంది పార్థివులతో సమ్మర్దముగొన్న వసుధ భారాక్రాంతయై విశ్లథయైయుండెను. ఆరాజుయొక్క అనేకమందిపుత్రులు ఆతంకరహితులు (నిరాతంకవిక్రమవిహారులన్నమాట) ప్రతాపశీలురగువారితో అనేక నాగాశ్వగోకులముతో నివ్వసుధ యలముకొనియుండెను. మానవాతీతమైన యాతని తేజస్సునకు (ప్రతాపమునకు) బరువెక్కి ధరణి యలసిబిట్టూగి విన్నవోయి నాకమునకేగెను. ఇటువంటి ప్రభావముతో నానరనాథదేవుడు పరిపాలన సేయుచుండ బరువెత్తి మునిబృంద సంసేవ్యమైనదు హేంద్రలోకమునకుం జనెను.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున అర్జునోపాఖ్యానమను నిరువదిమూడవ యధ్యాయము.

## ఇరువదినాల్గవ యధ్యాయము - వృత్రాసురవధ

వజ్ర ఉవాచ :

దేవకార్యం వినా విష్ణుర్నోత్పత్స్యతి మహీతలే । కస్మిన్ కార్యే బభూవాఽసౌ దత్తాత్రేయ ఇతిశ్రుతః ॥ 1

మార్కండేయ ఉవాచ :

శక్రేణచ యదా వృత్రో హతో వీర్యోప బృంహితః ॥ 2

తస్మిన్ హతేఽసురే త్వష్టా విశ్వరూప మవాసృజత్ । తపస్యన్తం చ తం గత్వా జఘానచ శచీపతిః ॥ 3

తస్మిన్ హతే బ్రహ్మహత్యా జగామ బల సూదనమ్ । బ్రహ్మ హత్యాఽభిభూతస్తు రాజ్యంత్యక్త్వా త్రివిష్టపే ॥ 4

మానసే బిసతంతుస్థో బభూవ స పురందరః । రాజాకృతః శక్రహీనైః దేవైస్తు నహుషస్తదా ॥ 5

సోఽకామయత పౌలోమీం శక్రస్య మహిషీం ప్రియామ్ । కాలా లాభపరా ప్రాహ శక్రం దేవీ తథా శచీ ॥ 6

అపూర్వేణ విధానేన సమీపం మే సురేశ్వర ! । ఋషిభి శ్శిబికాం యుక్త్వా స జగామ తదన్తికమ్ ॥ 7
శిబికాం వహమానం తు మందం మందం ద్విజోత్తమమ్ । పాదేన తాడయామాస సోఽగస్త్యం పాపనిశ్చయః ॥ 8
అగస్త్యేన తథా శప్తోభవ సర్పో మహీపతే ! । యుధిష్ఠిరేణ సంగమ్య శాపమోక్ష మవాప్స్యసి ॥ 9
ఏవ ముక్తేతు మునినా సర్పత్వం స జగామ వై । నష్టే శక్రేచ పతితే నహుషే పాపనిశ్చయే ॥ 10
రజస్తమోభ్యా మాక్రాన్తా బభూవుస్త్రిదశాలయాః । తతః ప్రవృత్తా లోకేఽస్మిన్ ఽనావృష్టి స్సుదారుణా ॥ 11
దుర్భిక్ష మరకా చోభౌ విషణ్ణా స్త్రిదశాలయాః । నష్టోత్సవ మహాయజ్ఞం నిర్వషట్కార మంగళమ్ ॥ 12
అనావృష్టి హతం సర్వం బభూవ వసుధాతలమ్ । క్షుత్క్షామ మానుషప్రాయం వినష్ట పశు సంచయమ్ ॥ 13
కపాలాస్థి సమాకీర్ణం కేశశైవాల సంకులం । స్నాయుభగ్న ద్విజగణైః క్రవ్యాదై రతి సంకులమ్ ॥ 14
నిర్గంధి కుణపాకీర్ణం శూన్యప్రాయం విభీషణమ్ । క్షుత్క్షామ భూత సంఘాభ్యాం వినివృత్త వణిక్ పథమ్ ॥ 15
ప్రనష్టకృషి వార్తంచ దాతృభి శ్చ వివర్జితమ్ । నరకేఽపి మహాఘోరే నిరాక్రన్దైః జనై ర్యుతైః ॥ 16
దుర్లభాన్నం నిరానందం స్కంధాసక్త కుమారకైః । ఇత శ్చేతశ్చ యాస్యద్భిర్దానవై రతిసంకులమ్ ॥ 17
శుష్కతోయాశయం భీమం నామశేష మహాపగమ్ । తస్మిన్కాలే మహాఘోరే చోత్సృష్ట నియమాద్విజాః ॥ 18
ఆర్యావర్తం పరిత్యజ్య మ్లేచ్ఛదేశ ముపాశ్రితాః । భక్ష్యా భక్ష్యం పరిత్యజ్య కుర్వాణాః ప్రాణధారణమ్ ॥ 19
ప్రాణధారణ సక్తానాం క్షుధా వ్యాకుల చేతసామ్ । తేషాం బ్రహ్మ తదా నష్టం ధావతాం చ ఇతస్తతః ॥ 20
తదానష్టేషు దేవేషు మ్లేచ్ఛీభూత మిదం జగత్ । మ్లేచ్ఛీభూతే జగత్యస్మిన్ స్వధా స్వాహా వివర్జితాః ॥ 21
యథా మర్త్యా స్తథా జాతాః సర్వేతే దేవతాగణాః । క్షుత్ క్షామ కంఠై స్త్రిదశైః ప్రార్థితశ్చ జనార్దనః ॥ 22
శక్రార్థం త్రిదశాః గత్వా త్రైలోక్య హిత కామ్యయా ॥ 23
తానువాచ హరిర్దేవ స్సర్వే గచ్ఛన్తు మానసమ్ । బిస తంతుగతం శక్రం తస్మాల్లప్స్యథ మా చిరమ్॥ 24
యజతాం సోఽశ్వమేధేన మామేవ సురసత్తమాః । అహ మేవ కరిష్యామి విపాప్మానం బిడౌజసమ్ ॥ 25
తత్కృతాం బ్రహ్మ హత్యాంతు చతుర్ధా స కరిష్యతి ॥ 26
అమేధ్య క్షేపకే వహ్నౌ పాదేనైకేన యాస్యతి । తథా చైకేన పాదేన హ్యశుచిక్షేపకే జలే ॥ 27
పాదేనైకేన చ తథా సర్వకాలే ద్రుమచ్ఛిదమ్ । రజస్వలాంగం పాదేన తథా చైకేన యాస్యతి ॥ 28
అహ మంశేన యాస్యామి భూతలం సురకారణాత్ । నష్టేచ భూతలే ధర్మం స్థాపయిష్యామ్యహం పునః ॥ 29
ఏతత్సర్వం యథోద్దిష్టం దేవదేవేన శార్ఙ్గిణా । చక్రు స్సురగణా స్సర్వే రాజ్యం చావాప వృత్రహా ॥ 30

శక్రేణ నిత్యం బిసతంతుగేనధ్యాతో మహాత్మా హరిరప్రమేయః ।
హత్వాఽపి కామేన సవిప్రముఖ్యం లేభే త్రిలోకం పునరేవ తస్మాత్ ॥ 31

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే వృత్ర వధోపాఖ్యానం నామ
చతుర్వింశతి తమోఽధ్యాయః

వజ్రుడు, శ్రీమహావిష్ణువు దేవకార్యముకొఱకు గాని యవని నవతరింపడుగదా ! అట్టి తఱిం దత్తాత్రేయరూపమున సత దేవిపనిపై నవతరించెనో తెల్పుమన మార్కండేయుడిట్లనియె. ఇంద్రుడు మహాపరాక్రముని వృత్రునివధించిన తరువాత త్వష్ట ప్రజాపతి విశ్వరూపుని సృజించెను. శక్రుడేగి తపస్సులోనున్న యాతనిం జంపెను. దాన నాతని బ్రహ్మహత్యాపాపము వెంటాడెను. దాననతడు స్వర్గరాజ్యమును విడిని మానససరోవరమందొక తామరతూడులో దాగియుండెను. ఇంద్రుడులేని స్వర్గరాజ్యమునకు దేవతలు నహుషునిం బ్రభువుంగావించిరి. అతడు శక్రుని పట్టమహిషియగు శచీదేవిం గామించెను. ఆమెకాలము కలిసిరాని స్థితిలో

నుండి నహుషునింగని అపూర్వమైన వాహనముపై నాదగ్గర కీవు రావలయుననియె. అతడు ఋషులుమోయు శిబిక (పాలకి) నెక్కి-యామె సన్నిధికేగుచు ఆపాలకిని వహించి మెలమెల్లన నడుచు బ్రాహ్మణోత్తము నగస్త్యు నాపాపి కాలితో దన్నెను. సర్పసర్ప=నడునడువుమని యమ్మునిం దొందరపెట్టెను. దాన మహర్షి కినిసి సర్పసర్పయని ప్రేలినావుగాన నీవు సర్పమగుమని శపించె. యుధిష్ఠిరునితో నీవు సమావేశమందినపుడే శాపమునుండి ముక్తుడగుదువనియు ననుగ్రహించెను. నహుషుడాక్షణమేపాముయ్యెను. ఇంద్రుడు వోవ నహుషుడు పతనమందె. స్వర్గవాసులు రజోగుణతమోగుణవశులైరి. దాన నీ భూలోకమందు దారుణమైన యనావృష్టి యేర్పడెను. వేల్పులు కఱవునకు మరకము మహామారికి)గురియై దుఃఖవశులైరి. సర్వవసుధాతలము యజ్ఞోత్సవశూన్యమై వషట్కార మంగళరహితమైయాకలింబక్కచిక్కిన మనుష్యులతో పశువుమందలు నశించిప్రేలు నెముకలు నెడనెడ వెంట్రుకలనాచునెడనెడజిమ్మి కొనప్రేవులు తెగినవిప్రులతో రక్కసులతో మిగులసంకులమై కుణపములతో(పీనుగులతో)ఆకలిచే కృశించినభూతములతో వాణిజ్యము చెడి, కృషి (వ్యవహారము) చెడిదాతలు లేక ఆకలిచే కఱవుచే బాధపడుచు శూన్యప్రాయమై మహాఘోరనరకమందు గూడ అన్నముదొరకక యానందములేక బుజములపై బిడ్డలనెక్కించుకొని యిట్టటు దిరుగు మానవులతో సంకులమై చెఱువులెండి నామమాత్రావశిష్టములైన మహానదులతో భయంకరమై భూమండలమున్న తఱి బ్రాహ్మణులు నియమములను విడచి యార్యావర్తమును విడిచి మ్లేచ్ఛదేశము నాశ్రయించిరి. అక్కడ భక్ష్యాభక్ష్య విమర్శలేక యెట్లో ప్రాణధారణ మొనరించుకొను చిట్టటు పరువులెత్తు వారి బ్రహ్మ (వేదము) నష్టమైపోయెను. దానితోబాటు దేవతలును నష్టపడగ జగత్తు మ్లేచ్ఛమయమయ్యెను. అందుచే స్వాహాస్వధాకారములు వినిపింపక మానవులు కర్మభ్రష్టులైనంత దేవతాగణ మాకలికలమటించుచు జనార్ధనునితో మొఱపెట్టుకొనిరి. అప్పుడు హరి మీరందఱు మానస సరస్సునకుం జనుడు. అందొక తామరతూడునందున్న యింద్రునిం బొందుడు. నన్నుద్దేశించి యతడశ్వమేధయాగముం జేయుంగాక ! దాన నేనే యాతనింబాపరహితునిం గావించెద. అతడొనరించిన బ్రహ్మహత్యను నాల్గు భాగములుగ నతడు గావించును. అమేధ్యద్రవ్యమును (హవిస్సును) హోమముంజేసిన యగ్నియందొకవంతు అశుచిపదార్థములం బడవేసిన నీట నొకవంతు చెట్లు నఱకువానియందొక భాగము నాల్గవభాగము ముట్టిన దాని శరీరమందు నా బ్రహ్మహత్య నిలుపొందును. ఆటుపై నేను సురలకొఱకంశావతార మెత్తి ధర్మస్థాపనము మరలయొనర్తును. దేవదేవుడుద్దేశించిన యీకార్యక్రమమెల్ల వేల్పులు నిర్వహించిరి. వృత్రారియు (ఇంద్రుడు) రాజ్యముం బడసెను. తామరతూడునందున్నంత కాలము నమ్మహాత్ము డింద్రుం డప్రమేయుడగు హరిని ధ్యానించుచుండెను. కోరి విప్రముఖ్యుని వృత్రుని వధించియు నాతడు హరివలననే తిరిగి త్రిలోకసామ్రాజ్యలక్ష్మిని బొందెను.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున వృత్రాసురవధయను యిరువదినాల్గవయధ్యాయము

## ఇరువదిఐదవ యధ్యాయము - దత్తాత్రేయోపాఖ్యానము

మార్కండేయ ఉవాచ :

బ్రహ్మణోఽత్రిస్సుతః శ్రీమాన్ ప్రభావాద్బ్రహ్మణా సమః। ప్రభాకరస్తస్య సుతః పితామహసమో గుణైః॥ 1
స్వర్భానునా హతే సూర్యే పతమానే దివో మహీమ్। తమోఽభిభూతే తపసా ప్రభాయేన వివరితా॥ 2
స్వస్త్యస్త్వితి సహోవాచ పతమానం దివాకరమ్। వచనాత్తస్య బ్రహ్మర్షేః న పపాత దివో మహీమ్॥ 3
అత్రిశ్రేష్ఠాని గోత్రాణి యశ్చకార మహాయశాః। యజ్ఞేష్వత్రి వనం యశ్చ సురైర్యస్య ప్రకీర్తితమ్॥ 4
తస్య పుత్రత్వమాపన్నౌ జనార్దనమహేశ్వరౌ। దత్తాత్రేయోఽథ దుర్వాసాః లోకఖ్యాతిముపాగతౌ॥ 5
దత్తాత్రేయత్వమాసాద్య భగవాన్ మధుసూదనః। వేదానధ్యాపయామాస బ్రాహ్మణాన్ చరితవ్రతాన్॥ 6
తేషు నష్టేషు వేదేషు క్రియాసు చ మఖేషు చ। చాతుర్వర్ణ్యే సమాకీర్ణే ధర్మే శిథిలతాం గతే॥ 7

అభివర్ధతి చాధర్మే సత్యే నష్టేఽనృతే స్థితే । ప్రజాసు శీర్యమాణాసు ధర్మే చామలతాం గతే ॥ 8
సయజ్ఞా స్సక్రియా వేదాః ప్రత్యానీతా హి తేనవై । చాతుర్వర్ణ్య మసంకీర్ణం కృతం తేన మహాత్మనా ॥ 9
దుర్భిక్ష మరకౌనష్టౌ తస్మిన్ జాతే మహీతలే । ప్రవవర్షచ దేవేంద్రః సహస్ర నయనః క్షితౌ ॥ 10
భూయ ఏవ జగద్వృత్తం యథాపూర్వం జగత్పతే । ప్రణష్టకలుషే లోకే సన్మార్గస్థేషు రాజసు ॥ 11
యజత్సు విప్రముఖ్యేషు తపస్యాఽభిరతేషు చ । వార్తా సక్తేషు వైశ్యేషు శుశ్రూషు ష్వన్త్యజేషు చ ॥ 12
ముదితేషు చలోకేషు త్రైలోక్యే దేవ సాద్గతే । విష్ణోర్భాగే క్షితిగతే కార్తవీర్యార్జున స్తదా ॥ 13
దశవర్ష సహస్రాణి కృతవాన్ దుశ్చరం తపః । ప్రయాగవన మాసాద్య దత్తాత్రే యాశ్రమం ప్రతి ॥ 14
ఆరాధయామాస తదా దత్తం శుశ్రూషయా నృప । తేన దత్తవర శ్చక్రే సరాజ్యం హత కంటకం ॥ 15
ఆర్యావర్తేషు నిర్మ్లేచ్ఛా కృతా తేన వసుంధరా । తస్మిన్ రాజని ధర్మజ్ఞే దైత్యై ర్దేవ నిపాతితైః ॥ 16
సంప్రాప్తైః భూమిపాలత్వం వసుధా భారపీడితా । నాకపృష్ఠం యయౌ శీఘ్రం శక్రదర్శన లాలసా ॥ 17

వజ్ర ఉవాచ :

ఆసాద్యలోకం త్రిదివేశ్వరస్య భారేణ ఖిన్నా వసుధా నరేంద్రైః ।
కిం తత్ర చక్రే వద ! తన్మమాద్య దృష్ట్వా క్షితిం యచ్చ చకార శక్రః ॥ 18

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే దత్తాత్రేయోపాఖ్యానం నామ
పంచ షష్ఠితమోఽధ్యాయః

మార్కండేయుడనియె. బ్రహ్మకు బ్రహ్మతో సమానప్రభావముగల కుమారు డత్రిజనించెను. ఆయన కుమారుడు ప్రభాకరుడు (సూర్యుడు) పితామహునితో సమములగు గుణములు గలవాడు. రాహువుచే సూర్యుడు నిహతుడై యంతరిక్షము నుండి భూమిపై బడుచుండ జీకటి ఝంపుకొన్నతఱి లోకము తమోమయమైన లోకమునందు తపఃప్రభావముచే నాతడు కాంతిని బ్రసరింపజేసెను. క్రిందబడుచున్న సూర్యునుద్దేశించి యయ్యత్రిమహర్షి స్వస్త్యస్తు = మంగళమగుగాక - అనిదినకరుని దీవించెను. ఆబ్రహ్మర్షి వచనమున సూర్యుడు దివమ్మునుండి క్రిందబడడయ్యె. అత్రిశ్రేష్ఠములయిన గోత్రములకు వంశములకు నమ్మహర్షి కర్త మూలపురుషుడు. దేవతలాతని గోత్రము వారిని యజ్ఞములందు అత్రివనమని పేర్కొనిరి (ప్రశంసించిరి). ఆయత్రికి హరి హరులు కుమారులైరి. వారు దత్తాత్రేయులు దుర్వాసులను పేరజగత్ప్రఖ్యాతినందినవారు. విష్ణువు దత్తాత్రేయుడై బ్రహ్మచర్య వ్రతనిష్ఠుల వేదాయధ్యయనము సేయించెను. వేదములు వేదోక్తకర్మములు యజ్ఞములు నష్టమైనతఱి చాతుర్వర్ణ్యవ్యవస్థ తారుమారైనయెడ ధర్మము శిథిలమై యధర్మము ప్రకోపించిన సమయమున సత్యముపోయి యనృతము నిలుకడగన్నవేళ ప్రజలు శిథిలప్రాయులుకాగా యజ్ఞములతో కర్మానుష్ఠానములతో వేదముల నాదత్తాత్రేయావతారము పునరుద్ధరించెను. అమ్మహానుభావునిచే చాతుర్వర్ణ్యము పునర్వ్యవస్థనందెను. ఆయన యవతరించినంతట దుర్భిక్షము (కఱవు) మరకము (మహామారి) నశించినవి. సహస్రాక్షుడు దేవేంద్రుడు భూమిపై సువృష్టి గురిపించెను. తిరిగి జగత్తు యథాపూర్వస్థితికి వచ్చెను. ప్రజలు లోకము కలుషము వాయ రాజులు సన్మార్గమున నుండ విప్రవరులు యజ్ఞములు సేయుచుండ తపోభిరతులునుంగాగ వైశ్యులు వార్తయందు (వర్తకమందు) ఆదరముగొన శూద్రులు (అంత్యజులు)ను శుశ్రూషాపరులైయుండ లోకములానంద భరితములుగాగ ముల్లోకము దేవతలవశముగాగ విష్ణువు నంశమైన దత్తాత్రేయులవని నున్నయత్తఱి కార్తవీర్యార్జునుండు పదివేలేండ్లు దుష్కరమైన తపమాచరించెను. అతడు దత్తాత్రేయాశ్రమమనబడు ప్రయాగవనమున కేగి దత్తుని శుశ్రూషజేసి యారాధించెను. అయన వరమీయ నిష్కంటకముగ రాజ్యపాలనముసేసెను. ఆర్యావర్తదేశములందు మ్లేచ్ఛులులేకుండ జేసినవాడాతడు. ఆధర్మజ్ఞుడు రాజైనతఱి దేవతలచే నోడిన దైత్యులు భూపతులయి నంతట నీవసుంధర భారపీడితయై యింద్రునిదర్శింప స్వర్గమునకుంజనెను. అని మార్కండేయుడు

సెప్పు వజ్రభూపాలు డట్లమరలోకమేగిన భూదేవి యటనేమి సేసెను ? ఆభూమిని జూచి యింద్రుడేమిసేసెను ? అనతిప్మని యడిగెను.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున దత్తాత్రేయాఖ్యానమను నిరువదియైదవయధ్యాయము

## ఇరువదిఆరవ యధ్యాయము - భూదేవి యింద్రలోకమునకేగుట

**మార్కండేయ ఉవాచ :**

నాకపృష్ఠా గతాభూమి ర్దదర్శ మధుసూదనమ్ । రత్నాసన గతం వీరంశ్రియా పరమయా యుతమ్ ॥ 1
ఉపాస్యమానం త్రిదశైర్భాసయంతం సభాం శుభామ్ । ఆదిత్యై ర్వసుభి స్సాధ్యై ర్విశ్వేదేవై ర్మరుద్గణైః ॥ 2
రుద్రై ర్భృగ్వంగిరోభి శ్చ నాసత్యై శ్చ మహాత్మభిః । ఋషిభి స్సూర్య సంకాశై స్తపసా ద్యోతితప్రభైః ॥ 3
గంధర్వై రప్సరోభి శ్చ స్తూయమానం సహస్రశః । కిరీటోత్తమ సంఛన్నం, హారకేయూర భూషితమ్ ॥ 4
రత్నాంగద కృతోద్యోతం రత్నగర్భ సమప్రభమ్ । హరిచందన దిగ్ధాంగం నీలాంబరధరం హరిమ్ ॥ 5
తిర్యగ్లలాటకేనాఽక్ష్ణా తృతీయేన విరాజితమ్ । పశ్యంతం సర్వలోకస్య సతతం ధర్మ కర్మణీ ॥ 6
విష్ణో రచింత్య మంగం తత్ త్రైలోక్య స్యైవకారణమ్ । గోబ్రాహ్మణ హితాసక్తం దదర్శ వసుధా తదా ॥ 7
సంధ్యా సహ సమాసీనం శ్రియా చైవ జనార్దనమ్ । తం వవందే వసుమతీ దైత్య భార భరార్దితా ॥ 8
పాద్యార్ఘ్యా చమనీయాద్యై శ్శక్రోఽపి వసుధాం తదా । పూజయిత్వా సుఖాసీనాం పప్రచ్ఛాగమన క్రియామ్ ॥ 9
పృష్టా శక్రేణ సాదేవీ వక్తుం సముప చక్రమే ॥ 10

మార్కండేయుడనియె. భూదేవి నాకపృష్ఠమునకుం జని రత్నాసనమందు మహాలక్ష్మితో గూడి దేవతలచే నుపాసింపబడుచు శుభలక్షణలక్షితమైన దేవసభను ప్రకాశవంతము నొనర్చుచు వసురుద్రాదిత్య సిద్ధసాధ్య విశ్వదేవమరుద్గణములు అంగిరసులు భృగువులు అశ్వినీదేవతలు సూర్యసట్లు తపోదీప్తిచేకలుగు బ్రహ్మర్షులు సేవింపం గంధర్వాప్సరోవరులు వేవేలుగుల స్తుతింప సువర్ణమణికిరీటము దాల్చి కేయూరాంగదరత్న హారము లుద్యోతింప హరిచందనము పూసికొని ఇంద్రనీల రత్నగర్భ ప్రభాభాసమానుడై నీలాంబరధారియై లలాటమందడ్డముగ మూడవకన్ను దీపింప సర్వలోకముం ధర్మమును నిరంతరముందిలకించుచు ముల్లోకములకు కారణమై గోబ్రాహ్మణ హితాసక్తుడై యున్న విష్ణువుయొక్క అచింత్యమైన యామూర్తినింద్రుని వసుంధరదర్శించెను. సంధ్యాదేవి శ్రీదేవి యిరువైపుల వసింప నిండొందు విష్ణ్వంశమునకు దైత్యభారమున నలసిన యవ్వసుంధర వందనమాచరించెను. ఇంద్రుడాదేవినర్ఘ్య పాద్యాచమనాద్యుపచారములచే బూజించి సుఖాసీనయైన తఱి నవ్వసుమతి రాకకు కారణమడిగెను. ఆమెయిట్లు తెలుపనుపక్రమించెను

**పృథివ్యువాచ :**

అన్తరిక్షం దివం యచ్చ తథైవాహం జగత్పతే ! తవాఽఽయత్తా మహాభాగ ! త్వంహి దేవేశ్వరో విభుః ॥ 11
త్వయిభారం సమాసజ్య వేదాభ్యసన తత్పరః । సుఖమాస్తే ప్రశాన్తాత్మా బ్రహ్మా శుభ చతుర్ముఖః ॥ 12
త్వయిభారం సమాసజ్య దేవదేవోఽపి శంకరః । ఆస్తే తప స్యభిరతః కైలాసే పర్వతోత్తమే ॥ 13
త్వయి భారం సమాసజ్య సుఖం స్వపితి కేశవః । క్షీరోదశయనే నిత్యం శేష పర్యంక మాస్థితః ॥ 14
పితామహస్య యత్తేజః కేశవస్య శివస్యచ । స్థితం తత్సకలం తుభ్యం త్వం సర్వమయోఽరిహా ॥ 15

త్వయా వినిహతో వృత్రో బలశ్చాపి నిషూదితః । త్వయాచ నాశితః పాకః త్వయా దైత్యా నిషూదితాః ॥ 16
బ్రహ్మణ్య స్త్వం శరణ్య స్త్వం ప్రణతార్తి వినాశనః । సహస్రనయనః శ్రీమాన్ వజ్రపాణిః జగత్ప్రియః ॥ 17
తేజసా తపసా యజ్ఞైః శ్రుతేన చ దమేన చ । త్వత్తో విశిష్టం లోకేఽస్మిన్ న పశ్యామి శచీపతే ॥ 18
వేదేషు సరహస్యేషు గీయసేత్వం పునః పునః । వేదాః ప్రవృత్తాః యజ్ఞార్థం తదర్థం క్రతవ స్తథా ॥ 19
యే హతా దానవా యుద్ధే త్వయాశక్ర ! పునః పునః । త ఇమే నృషు సంభూతాః కార్తవీర్యం సమాశ్రితాః ॥ 20

తేఽద్య జాతా మమ విభో ! పీడయన్తి చ మాం భృశమ్ ।
సాఽహం భర సమాక్రాంతా త్వా మద్య శరణం గతా ॥ 21

శక్ర ఉవాచ :

జానామి భారఖిన్నాం త్వాందైత్యేభ్యో వరవర్ణిని ! ।
తేషాం గత్వా వధోపాయ మహం ద్రష్టాఽస్మి వేధసమ్ ॥ 22

మార్కండేయ ఉవాచ :

ఇత్యేవ ముక్త్వా త్రిదశ ప్రధానః పృథ్వీ సమేతో గురుణాచరాజన్ ।
యయౌ సభాందేవ వరస్య తస్య పితామహస్య ప్రతిమస్య వీరః ॥ 23

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే పృథ్వీ శక్రలోక గమనం నామ షడ్వింశతి తమోఽధ్యాయః.

వసుమతి యింద్రుని స్తుతించుట : భూలోకము (నేను) భువర్లోకము (అంతరిక్షము) స్వర్లోకమునను నీ త్రిభువనములు నీకధీనమైయున్నాము. మహానుభావ! నీవు దేవతాప్రభువవు. నీయందుభారముంచి చతుర్ముఖుడు ప్రశాంతమనస్కుడై వేదాభ్యాసతత్పరుడై సుఖముగానున్నాడు. నీయందే బరువునుంచి దేవదేవుడు శంకరుడును తపోనిరతుడై కైలాసపర్వతరాజమున నివసించుచున్నాడు. కేశవస్వామియు నీపై భారమువెట్టి క్షీరాబ్ధియందు శేషపర్యంకమున హాయిగ నిదురపోవుచున్నాడు. బ్రహ్మయొక్క విష్ణువుయొక్క శివునియొక్క తేజస్సది సకలము నీ కొనియున్నది. (నీయందున్నది) నీవు సర్వమయుడవు. శత్రుహరుడవు. నీచేత వృత్రుడు బలుడు పాకాసురుడు మొదలగు దైత్యులు గూలిరి. నీవు బ్రహ్మణ్యుడవు ప్రణతార్తిహరుడవు. సహస్ర నయనుడవు. వజ్రపాణివి జగత్ప్రియుడవు శచీపతీ! తేజస్సుచే (ప్రతాపముచే) తపస్సుచే యజ్ఞముచే శ్రుతముచే (పాండిత్యముచే) దమముచే (ఇంద్రియ నిగ్రహముచే నిన్ను మించినవాని నింకొకని నీ లోకమందేను గానను. సరహస్యములయిన వేదములందు మరల మరల నీవు కీర్తింపబడినాడవు. వేదములు యజ్ఞముకొరకు క్రతువులు వేదముల కొరకు ప్రవర్తించినవి. నీచే యుద్ధమున గూలిన దానవులు నేడు నరులందు బుట్టి కార్తవీర్యు నాశ్రయించి యున్నారు. వారు నన్ను మిక్కిలి బాధించుచున్నారు. ఆ బరువునం గ్రుంగి నేనిపుడు నిన్ను శరణందితిని. అనవిని శక్రుండిట్లనియె. ఓ సుందరీ! దేవతల వలన నీవు భారఖిన్నవైనట్లు విన్నాను. బ్రహ్మ కడకేగి వారి వధోపాయమడిగెదను అని పలికి త్రిదశపతి బృహస్పతితో వసుమతితో నప్రతిమ ప్రభావుడగు పితామహుని (బ్రహ్మ) యొక్క సభకేగెను

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణమున ప్రథమఖండమున భూదేవి యింద్రలోకమునకేగుట యను ఇరువదియారవ అధ్యాయము.

## ఇరువదియేడవ యధ్యాయము - ఇంద్రాదుల బ్రహ్మలోకగమనము

మార్కండేయ ఉవాచ :

తే సమేతా స్సమాసాద్య పితామహ సభాం శుభామ్ । పద్మాసన గతం తత్ర దదృశుః పద్మ సంభవమ్ ॥ 1

పద్మపత్ర సవర్ణాంగం పద్మబోధ సమప్రభమ్ । చతుర్వక్త్రం చతుర్వేదం చతురాశ్రమ పూజితమ్ ॥ 2
చాతుర్వర్ణ్యధరం దేవం చాతుర్హోత్ర ప్రవర్తకమ్ । కృష్ణాజిన ధరం శాంతం ప్రభుం ప్రభవతామపి ॥ 3
స్వయం భువ మచిన్త్యంచసర్గ సంహార కారకమ్ । తం సమాసాద్య జగతీ శక్రశ్చ గురుణాసహ ॥ 4
వవందుస్తే మహాభాగం తుష్టువుశ్చ జగత్ప్రభుమ్ ।

మార్కండేయు డనియె : ఇంద్రాదులు కలిసి బ్రహ్మసభకేగి యందు పద్మాసనమందున్న పద్మసంభవుని గనిరి. ఆతడు తామరరేకు రంగు కలిగి పద్మబోధుడైన సూర్యునట్లు వెలుంగుచు నాల్గుమోములు నాల్గువేదములుంగొని నాల్గాశమములచే బూజింపబడుచు చాతుర్వర్ణ్యధరుడై చాతుర్హోత్ర ప్రవర్తకుడై యుండి కృష్ణాజినముం ధరించి శాంతుడై సర్వజీవులకు ప్రభువై తేజరిల్లుచున్న స్వయంభువును అచింత్యుని సర్గసంహారకారణమైన యా సురజ్యేష్ఠునిం దరిసి భూదేవి శక్రుడును బృహస్పతితో గూడ నేగి యా మహానుభావునికి సమస్కరించి యా జగత్ప్రభువు నిట్లు స్తుతించిరి.

శక్రాదయ ఊచుః :

నమస్తే దేవదేవేశ ! సృష్టిసంహార కారణ ! । వేదమూర్తే ! తదాధార ! యజ్ఞ ! యజ్ఞాంగ ! యజ్ఞప ! 5
యజ్ఞయోనే ! జగద్యోనే ! సర్వ సత్త్వాభయప్రద ! । ప్రజాపతి పతే ! దేవ ! జగద్బీజ ! నమోఽస్తుతే ॥ 6
స్వయం భువే స్వయం కర్త్రే స్వయం భూతాంతరాత్మనే । సర్వభూత వరేణ్యాయ సర్వభూతేశ్వరాయ చ ॥ 7
అచిన్త్యాయా ప్రమేయాయ ప్రకాశాయ మహాత్మనే । త్వమస్య జగతోనాథస్త్వయి సర్వం ప్రతిష్ఠితమ్ ॥ 8
త్వయా వినాజగత్యస్మిన్ నాన్యత్ కించన విద్యతే । ఇంద్రియాణీంద్రియార్థాశ్చ తేభ్యః పరతరంచయత్ ॥ 9
వ్యక్తాఽవ్యక్తో జగన్నాథ ! త్వమేవైకః ప్రకీర్తితః । త్వం తపాంసి వరిష్ఠాని కృచ్ఛ్రాణి నియమాని చ ॥ 10
కలాః కాష్ఠా ముహూర్తాశ్చ కాలస్యావయవాశ్చయే । కాలచక్రం జగచ్చక్రం త్వమేవః పురుషోత్తమః ॥ 11
త్వమేవ వరదో దాతా దేవః శుభ చతుర్ముఖః । త్వత్తః ప్రసూతా లోకేఽస్మిన్ ధర్మరుద్రౌ జగత్పతీ ॥ 12
భృగ్వంగిరా మరీచిస్తు పులస్త్యః పులహః క్రతుః । అత్రిశ్చైవ వశిష్ఠశ్చ త్వయాసృష్టాజ గత్పతే ! ॥ 13
సనత్కుమారో భగవాన్ సనకశ్చ సనందనః । ఆకృతి శ్చ రుచి శ్శ్రద్ధా త్వయా దేవ ! వినిర్మితా ॥ 14
పూర్వాత్తే వదనాజ్జాత మృగ్వేద మమృత ప్రభమ్ । దక్షిణా ద్వదనా జ్జాతం యజుర్వేదం తథైవచ ॥ 15
పశ్చిమా ద్వదనా జ్జాతం సామవేదం తథా తవ । ఉత్తరాద్వదనా జ్జాత మథర్వాం గిరసం శుభమ్ ॥ 16
బ్రాహ్మణాస్తే ముఖా జ్జాతాః బాహుభ్యాం క్షత్రియాస్తథా ।
ఊరు ద్వయాత్తథావైశ్యాః పద్భ్యాం శూద్రాస్తథైవచ ॥ 18
విద్యుతోఽశని మేఘాశ్చ రోహితేంద్ర ధనూంషిచ । త్వత్తః ప్రభో ! ప్రసూతాని ప్రవిశన్తి తథాత్వయి ॥ 19
స్వయంభూర్భగవాన్ విష్ణుః దేవ దేవ స్సనాతనః । నామ మాత్ర విభేదేన మోహాయ స్యఖిలం జగత్ ॥ 20
త్వత్తేజసా మయాదైత్యాః యే యుద్ధే వినిపాతితాః । తే క్షితౌ క్షత్రియా జాతాః పీడయంతి తథా క్షమామ్ ॥ 21
తేషాం భారేణ ఖిన్నేయం త్వత్సకాశ ముపాగతా । వసుధా వసుధాపాల ! తాం త్రాయస్వ నమోఽస్తుతే ॥ 22
మార్కండేయ ఉవాచ :
ఏవం పితామహోదేవః స్తుత శ్శక్రేణధీమతా । గురుణాచ సమేతేన పూజయామాస తా వుభౌ ॥ 23
పూజయిత్వా చ వసుధాం శక్రం వచన మబ్రవీత్ । వ్రజధ్వం దేవదేవస్య శంకరస్య మహాత్మనః ॥ 23
భువ శ్చికీర్షితం సర్వం నివేదయత మాచిరమ్ । ఉపాయం క్షత్రియ వధే యుష్మాకం కథయిష్యతి ॥ 24

ఇత్యేవ ముక్తాస్తు పితామహేన జగ్ముస్తదా రుద్రసదః ప్రతీతాః ।
శక్రోఽథ దేవీచ వసుంధరాచ గురుస్సురాణాం చ సధర్మశీలః ॥ 25

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే - బ్రహ్మలోక గమనం నామ సప్తవింశతితమోఽధ్యాయః

### ఇంద్రాదులు బ్రహ్మను స్తుతించుట :

దేవదేవేశ ! సృష్టిసంహారములకు కారణమైన ఓ వేదమూర్తి ! వేదాధారా ! యజ్ఞ యజ్ఞాంగ యజ్ఞపాలక యజ్ఞకారణ జగత్కారణ సర్వభూతాభయప్రదా ! ప్రజాపతీ ! ఓ జగద్బీజమా ! నీకు నమస్కారము. స్వయంభువునకు స్వయంకర్తకు సర్వభూతాంతరాత్మకు అచింత్యున కప్రమేయునకు ప్రకాశరూపునకు మహాత్మునకు నీకు వందనము. ఈజగత్తునకు నీవు నాథుడవు. నీయందిదియెల్ల ప్రతిష్ఠితమైనది. నీవు లేక యీ జగత్తునందింకొకటి లేదు. ఇంద్రియములు నింద్రియార్థములు వానికంటె పైనుండునది వ్యక్తావ్యక్తమైనదెల్ల నీవొక్కడవేయని కీర్తింపబడినావు. శ్రేష్ఠములయిన తపస్సులు కృచ్ఛ్ర చాంద్రాయణాది వ్రతములు కళలు కాష్ఠలు ముహూర్తములు మొదలగు కాలావయవములు కాలచక్రము జగచ్చక్రము-తయు నీవొక్కడవే ; పురుషోత్తముడవై యున్నావు. నీవే వరదుడవు దాతవు శుభములగు నలు మోములు దాల్చినవాడవు నీవలన నీలోకమున ధర్ముడు (యముడు) రుద్రులు భృగ్వంగిరుడు మరీచి పులస్త్యుడు పులహుడు క్రతువు అత్రి వసిష్ఠాదులు నీవలన సృష్టింపబడిరి. భగవంతులు సనక సనందన సనత్కుమారులు ఆకృతి రుచి శ్రద్ధయు నీవలన నిర్మింపబడినారు. అమృతజ్యోతియైన ఋగ్వేదము నీ తూర్పువైపు ముఖమునుండి యజుర్వేదము దక్షిణముఖమునుండి సామవేదము నీ పశ్చిమముఖమునుండి అథర్వాంగిరసము (అథర్వవేదము) నీ ముఖమునుండి బ్రాహ్మణులు బాహువులనుండి క్షత్రియులు ఊరుద్వయమునుండి వైశ్యులు పాదములనుండి శూద్రులు జనించిరి. మెఱుపు పిడుగు మేఘములు రోహితేంద్ర (రోహితము = తిన్నని యింద్ర ధనుస్సు) ధనుస్సులు నీలోనుండి పుట్టినవి. నీలోనే ప్రవేశించుచున్నవి. స్వయంభువు భగవంతుడు విష్ణువు సనాతనుడు దేవదేవుడను పేరులమాత్రమున నొక్కడవేయైన నీవే జగత్తును మోహపెట్టుచున్నావు. నీ తేజస్సుచే నేడనిలో గూల్చిన దైత్యులు క్షితియందు క్షత్రియులైపుట్టి క్షమను (భూమిని) బాధించుచున్నారు వారి బరువుచే ఖేదవశయై యిదిగో వసుధ నీదరికి వచ్చినది. ఓ వసుధాపాలక ! సర్వంసహను నీవు గావుము. నీకు నమస్కారము. అని యిట్లు గురునితోగూడి దేవేంద్రుడు స్తుతింప వారినిద్దరిని విధాత పూజించి భూదేవిని శక్రునుద్దేశించి మీరిద్దరు నిటనుండి సత్వరము వెళ్ళుడు. దేవదేవుడగు శంకరునికి భూమికి జేయవలసినదెల్ల నివేదింపుడు. ఆ మహాత్ముడు క్షత్రియ సంహారమున కుపాయము మీకు దెలుపగలడు. అని బ్రహ్మ పలుక తనివినొంది శివసదనమునకు శక్రుడు వసుంధరాదేవి ధర్మశీలుడు సురగురువునుం గలిసి వెళ్ళిరి.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున యింద్రాదుల బ్రహ్మలోకగమనమను నిరువదియేడవ యధ్యాయము

## ఇరువదెనిమిదవ యధ్యాయము - హరదర్శనము

మార్కండేయ ఉవాచ :

రుద్రలోక మథాసాద్య దదృశు స్త్ర్యంబకం తదా । వహ్ని పుంజ ప్రకాశేన జటాభారేణ రాజితమ్ ॥ 1
సూర్యభాసా తృతీయేన నయనేన చ శోభితమ్ । బాల చంద్రేణ శుభ్రేణ జటా మండల శోభినా ॥ 2
వ్యాల యజ్ఞోప వీతంచ నాగేశ్వర కృతాంశుకమ్ । నీలకంఠం విశాలాక్షం ద న్తి చర్మోత్తర చ్ఛదమ్ ॥ 3

ఉమా సహాయం వరదం సర్వభూత భవోద్భవమ్ । నందినానుగతం వీరం ప్రమథైశ్చ సహస్రశః ॥ 4
నానా వక్త్రశిరోగ్రీవై ర్నానాయుధ విభూషణైః । తం దృష్ట్వా ప్రణతః ప్రాహ శక్రస్తు గురుణాసహ ॥ 5

మార్కండేయుడనియె : ఇంద్రాదులు రుద్రలోకమేగి త్రిలోచనుం దర్శించిరి. ఆయన అగ్నిపుంజమట్లు ప్రకాశించు జటాభారము సూర్యప్రభమైన మూడవ కన్ను నుదుట చంద్రుడు శుభ్రవర్ణమైన జటామండలము సర్పరూప యజ్ఞోపవీతము నాగేంద్రవసనముం దాల్చి గజచర్మముత్తరీయముగగొని విశాలనయనుడై నీలకంఠుడై యుమాదేవితో నందివాహనమున ప్రమథగణ పరివారుడై పెక్కు ముఖములతో శిరస్సులతో కంఠములతో నానాయుధభూషణములతో దర్శనమిచ్చినంత నవ్వరదుని కింద్రుడు బృహస్పతితోగూడ ప్రణతుడై యిట్లనియె.

శక్ర ఉవాచ :

నమోఽస్తు దేవదేవేశ ! ప్రణతార్తి వినాశన । నీలకంఠ ! మహాభాగ ! హ్యుమాభూషణ తత్పర ॥ 6
గంగా తరంగ నిర్ధౌత జటా మండల మండిత । శశాంక శత సంకాశ ! సూర్యకోటిసమ ప్రభ ॥ 7
వామనై ర్జటిలై ర్ముండైః ప్రమథై రీడ్యసే సదా । తైశ్చ సార్ధం మహాదేవ । రమసేఽమిత విక్రమ ॥ 8
ఘోరం హి బ్రహ్మచర్యం తే యథా నాన్యస్య కస్యచిత్ । తవ లింగార్చన రతాః పూయన్తే సర్వ కిల్బిషైః ॥ 9
స్మరంతి యే త్వాం సతతం తేహియాంతి పరాంగతిమ్ । విష్ణో రచింత్య భాగోఽసి ప్రజాసంహరణే కృతే ॥ 10
సర్వదేవమయో ధాతా సర్వదేవ మయోఽపిచ । సర్వదేవ వరేణ్య స్త్వం సర్వభూత విభావనః ॥ 11
సర్వామరగురు ర్దేవః సర్వభూతేశ్వరే శ్వరః । సర్వదేవో మహాయోగీ మహాజయో మహాబలః ॥ 12
మహాబుద్ధి ర్మహావీర్యో మహాతేజా మహాయశాః । చతుష్పా త్స కలోధర్మో వాహన స్తే మహావృషః ॥ 13
శ్మశానే వసతిర్నిత్యం చితాధూమ సమాకులే । నృత్య ద్భూతాకులే భూమే ర్భూతిశ్వేతా నులేపనః ॥ 14
భూఖార్క వర్చ స్సలిల యజమానేందు వాయవః । మూర్తయ స్తే స్మృతా దేవ! యాభి ర్వ్యాప్త మిదంజగత్॥ 15
త్వయావినా జగత్యస్మి న్నాన్యత్కించన విద్యతే । దైత్య భారాఽభి తప్తాంగాం పాలయస్వ ! నమోఽస్తుతే ॥ 16

మార్కండేయ ఉవాచ :

ఏవముక్తస్తు శక్రేణ దేవ శ్శక్ర మభాషత । కార్తవీర్య మహం త్వాజౌ కర్తా నిఃక్షత్రియాం మహీమ్ ॥ 17
నశక్త స్త్రిదశశ్రేష్ఠ యతః స్మర్తాఽస్మి తద్వధమ్ । విష్ణుదత్తవరో రాజా సోఽవధ్యో మమ వాసవ ॥ 18
తమేవ ప్రార్థయిష్యామి వధంతస్య మహాత్మనః । సర్వేయాత ! స్వకం స్థానం త్వహ మప్యమరేశ్వరమ్ ॥ 19
చంద్రమండల మధ్యస్థం యాస్యే వరద మీశ్వరమ్ । విష్ణుశ్చార్ధేన భాగేన దత్తాత్రేయోఽభవత్ క్షితౌ ॥ 20
తేన దత్తవరో రాజా పాలయ త్యఖిలాం మహీమ్ ॥ 21
ఇత్యేవ ముక్తస్త్రి దశేశ్వరస్తు దేవేన సాక్షాత్ త్రిపురాంతకేణ ।
జగామ శీఘ్రం స్వపురం ప్రవిష్టో మహీం సమాదాయ గురుంచ రాజన్ ॥ 22

ఇతి శ్రీవిష్ణు ధర్మోత్తరే - ప్రథమఖండే - మార్కండేయ వజ్రసంవాదే హర దర్శనం నామ
అష్టా వింశతి తమోఽధ్యాయః

## ఇంద్రకృత శివస్తుతి

దేవదేవేశ ! ప్రణతార్తిహర నీలగళ మహాభాగ ఉమాభూషణాదర ! గంగాతరంగ నిర్ధౌత జటామండలమండిత చంద్రశత సంకాశ కోటిసూర్యసమప్రభ ! నీవు మరుగుజ్జులు జటాధరులు తలబోడులు నైన ప్రమథులచే నిరంతరము స్తుతింపబడుచుందువు.

వారితోనే యెల్లవేళల వినోదింతువు. నీ బ్రహ్మచర్యవ్రతమతికఠోరము. ఇంకొకడాచరింప వలనుగానిది. నీ లింగము నర్చించు టందుదీక్షగలవారు సర్వపాపములందాయుదురు నిన్ను స్మరించువారు పరమగతినందుదురు. ప్రజాసంహరణ కృత్యమునందు విష్ణుదేవునంశమైయున్నావు సర్వదేవమయుడగు విధాతవు నీవు. సర్వదేవమయుడవు సర్వదేవవరేణ్యుడవు. సర్వభూతవిభావను డవు సర్వాసుర గురుడవు. సర్వభూతేశ్వరులకీశ్వరుడవు. సర్వదేవుడవు మహాయోగివి మహాజయుడవు మహాబలుడవు మహా బుద్ధివి మహావీర్యుడవు మహాతపస్వివి మహాయశస్వివి. చతుష్పాదమయిన సకలధర్మము నీ వృషభవాహనము చితాధూమసమా కులమైన భూతములు నృత్యముసేయు స్మశానము నీ నిత్యనివాసము. స్మశానవిభూతిం దెల్లగ బూసికొనువాడవు పంచభూతములు చంద్రసూర్యులు సోమయాజులు నను జగమెల్ల వ్యాపించిన యెనిమిది పదార్థములు నీ మూర్తులు. ఈజగమునందు నీకంటె నన్యు మించుకయేనిలేదు. దైత్యభారమున మిగుల తపించు నవనిం బాలింపుము. నీకు నమస్కారము. అని యిట్లు శంకరుడింద్రునిచే వినుతింపబడి క్షితిమండలము నిఃక్షత్రియముసేసినవాడనైనను యుద్ధమునందు నేను కార్తవీర్యార్జునుని వధింపజాలను. నన్నీవందు లకు స్మరించితివికాని యతడు విష్ణువలన వరముంబడసినవాడు. నాకతడవధ్యుడు. వాని వధ విషయములో నావిష్ణువునే ప్రార్థిం చెదను. మీరందరు స్వస్థానమునకేగుడు. నేనా దేవేశ్వరుని చంద్రమండలమధ్యస్థుని వరదుని దరిసెదను. విష్ణువు తన నగభాగ మున నత్త్రాత్రేయుడై యవని నవతరించెను. ఆతనివలన నారాజు వరములంబడసి సర్వమేదినిం బాలించుచున్నాడు. అని యిట్లు త్రిపురాంతకుడు పలుక నింద్రుడు వెంటనే తన పురమునకుం భూదేవితో బృహస్పతితోగూడ నేగెను.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున హరదర్శనమను నిరువదెనిమిదవ అధ్యాయము

## ఇరువది తొమ్మిదవ యధ్యాయము - చంద్రమండలదర్శనము

మార్కండేయ ఉవాచ :

గతే సురేశ్వరే దేవే శక్రే చ సపురోహితే । జగత్యాంచ ప్రయాతాయాం దేవదేవో మహేశ్వరః ॥ 1
అంగుష్ఠమాత్రకో భూత్వా గంగాతోయే న్యమజ్జత । సోఽవగాహ్య స్వలోకస్థాం గంగాం సర్వగతాం నదీమ్ ॥ 2
తయోహ్యమానః ప్రయయౌ విస్తీర్ణం చంద్రమండలమ్ । నవయోజన సాహస్రో విష్కంభో యస్యకీర్తితః ॥ 3
విస్తారా ద్ద్విగుణ శ్చైవ పరిణాహ స్సమన్తతః । తోయ సారమయం పిండ పితౄణాం ధామ మధ్యగమ్ ॥ 4
ప్రజానాం భావనం సర్వం చాధారం జగతా మపి । శరీరిణాం శరీరేషు రసం పంచాత్మకం స్మృతమ్ ॥ 5
ఆలంబకం క్లేదకం చ తథాచైవవా బోధకమ్ । సంఘాతకం తర్షకంచ దేహినాం దేహగోచరమ్ ॥ 6
మానస స్సర్వేంద్రియాణాంచ సర్వేషాం నాథకం తథా । ఓషధీశం జగద్యోని మమృతాధార మవ్యయమ్ ॥ 7
యం పిబన్తి సదా దేవాః పితర శ్చామృతార్థినః । య శ్చక్షు ర్దేవదేవస్య విష్ణోర్వా సః ప్రకీర్తితః ॥ 8
హవ్య కవ్యాశనో దేవో భూతాత్మా భూతభావనః । ప్రవిశ్య మండలం తస్య దేవదేవో మహేశ్వరః ॥ 9
తస్య యద్వ్యాపకం తేజః సూక్ష్మ మస్పర్శనం హి తమ్। అంగుష్ఠ మాత్రం పురుషం యంబుధాః కేశవంవిదుః॥ 10
చక్షుర్గోలక మధ్యస్థా దృక్శక్తి రివయస్థితః । చంద్ర గోలక మధ్యస్థః పురుష స్స పరః స్మృతః ॥ 11
కర్మసాక్షీ సలోకానాం సచాధారః పరః స్మృతః ఆదిత్య రశ్మయ శ్చంద్రే తమస్సంమూర్ఛితం క్షితౌ ॥ 12
క్షపయిష్యన్తి యన్నైశం శీతాంశు స్తస్యతేజసా । యస్యరూప మనిర్దేశ్యం యస్యతేజ స్సుదుస్సహమ్ ॥ 13

మార్కండేయుడనియె: ఇంద్రుడు బృహస్పతితో, భూదేవితో నేగిన తర్వాత మహేశ్వరుడు అంగుష్ఠ మాత్రుడై (బొటనవ్రేలంతయై) గంగాజలములందు మునిగెను. స్వర్గమందున్న యాగంగలో దిగి యామెచే వహింపబడి సువిశాలమైన చంద్ర మండలమునకుం జనెను. ఆ చంద్రమండలముయొక్క విష్కంభము అడ్డుకొలత తొమ్మిదివేల యోజనములు. పరిణాహము చుట్టు

క్రొలత విస్తీర్ణము పదునెన్మిది యోజనములు. అది జలసారమయము. పిండ పితరుల లోకము మధ్యమందుపడి యున్నది. అది ప్రజా భవనము. సర్వ జగదాధారముకూడ. శరీరధారుల శరీరమందు ఐదు రూపములయిన రస మదియే. 1 ఆలంబనము 2 క్లేదకము 3 అవబోధకము మేల్కొలుపునది 4 సంఘాతకము 5 తక్షకమునై దేహుల దేహములందది కానిపించును. మనస్సునకు తక్కిన యింద్రియములకు నది నాయకము. ఓషధులకు ప్రభువు జగత్కారణము అమృతాధారము. అవ్యయము. దానినే అమృతార్థులైన దేవతలు పితృదేవతలు పానముసేయుదురు. ఆమూర్తియే దేవదేవుడగు విష్ణువుయొక్క చక్షుస్సు (కన్ను) అని వేదము లందు కీర్తింపబడినది. —"చంద్రమా మనసో జాతః" "అగ్నీ షోమాత్మకం జగత్" అను నా యీ వచనములకు వివరణ మిది. భూతాత్మకుడు భూతభావనుడునైన దేవుడు (ఇక్కడ దేవ శబ్దము తేజస్సు అని జ్ఞాపకముసేయును) ఆ చంద్రమండలమందు ప్రవేశించి హవ్యములను (దేవతలకిచ్చు హవిస్సులను కవ్యములను పితృదేవతల నుద్దేశించు నాహారములను) భుజించును. అ చంద్రుని యొక్క వ్యాపకము సూక్ష్మమునైన యన్నరసమునే అంగుష్ఠమాత్రపురుషుడుగా శరీరములందున్న పురుషుడని జ్ఞానులు పేర్కొందురు. ఆయననే శివుడని యందురు. చంద్రమండలమధ్యస్థుడగు నాపురుషుడే జీవశరీరములందు, నేత్రగోళమందు దృక్ఛక్తిగా నున్నాడు. ఆ శక్తినే పరమపురుషుడని శ్రుతులు స్మృతులు పేర్కొనును. ఆపురుషుడు కర్మసాక్షి. అతడే పరమాధారభూతుడు. అదిత్యకిరణములు చంద్రునియందుండి భూమియందు గప్పికొన్న తమస్సును (చీకటిని) రాత్రియందలి చంద్రుని వెలుగుచే హరించుచుండును. ఆ ఆదిత్యుని రూపమిట్టిదని నిర్దేశింప వలనుపడనిది. అది సుదుస్సహము. ఆ చంద్రమండలాంతర్గతుడగు దేవశ్రేష్ఠుని జూచి త్రిపురాంతకుడు (మహేశ్వరుడు) ఇట్లు స్తుతించెను.

తంతు దేవవరం దృష్ట్వా తుష్టావ త్రిపురాన్తకః ।

ఈశ్వర ఉవాచ :

అగ్నిషోమ మయంచైత జ్జగదేత త్ప్రకీర్తితమ్ । అగ్నిషోమౌ జగన్నాథౌ దేవదేవో జనార్దనః ॥ 14
తస్యాగ్నేయీ తనుర్యాతుసోఽహం సచ దివాకరః । సౌమ్యా తుయా తనుస్తస్య స భవాన్స పితామహః ॥ 15
త్వయేదం ధార్యతే సర్వం నాన్య త్పశ్యామి కారణమ్ । త్వద్బింబే నిర్మలే పృథ్వీ సశైలవన కాననా ॥ 16
శశాకృతిస్సదా దృశ్యా శశలక్ష్మోఽసి చానఘ! । తేనైవ కారణేన త్వముచ్యసే మృగలాంఛనః ॥ 17
శశీ శశత్వ సంబంధాత్ సౌమ్యత్వాత్ సోమ ఉచ్యతే । శీతాంశుత్వాచ్ఛ శీతాంశుః నిశేశః త్వ ద్విరాజనాత్ ॥ 18
నక్షత్రనాథ స్త త్స్వామ్యా ద్రాజత్వా త్త్వం ద్విజేశ్వరః । వసన్తి తే పితృగణాః పితృనాథ స్తతో భవాన్ ॥ 19
బహ్వర్థ శ్చన్ద్ర ఇత్యేష ధాతురుక్తో మనీషిభిః । శుక్లత్వే హ్యమృతత్వేచ శీతత్వే హ్లాదనేఽపిచ ॥ 20
తేన తే చంద్రతా ఖ్యాతా సతతం ధర్మవత్సల! । సర్వే చాహ్లాద మాయాన్తి దృష్టేత్వయి మహాద్యుతే! 21
ప్రజాకార్యం త్వదాయత్తం తత్కురుష్వ జగత్ప్రభో! । దత్తాత్రేయత్వ మాసాద్య త్వయా దత్తవరో నృపః ॥ 22
కార్తవీర్యార్జునో నామ దానవాస్త ముపాశ్రితాః । సర్వేక్షత్రియతాం ప్రాప్య తద్వధే యత్నవాన్ భవ! ॥ 23
త్వయా దత్తవరం హన్తుం నాన్య శ్శక్నోతి కశ్చన । అవశ్యంచ త్వయా కార్యం దేవకార్యం సదా విభో! 24

ఈశ్వరకృతమైన సోమస్తుతి :

ఈ జగత్తు అగ్నీషోమమయము అగ్నీషోములు (సౌరశక్తి అగ్ని సోమశక్తి జగన్నాథులు. అనగా జగద్రూపులు. "అగ్నీషోమాత్మకం జగత్" అదే ఉష్ణవీర్యము. శీతవీర్యమని యాయుర్వేద పరిభాష. అవి యొకదానికొకటి వ్యతిరిక్తమయిన తేజస్సులు. వాని అనుకూల వ్యతిరేకశక్తియొక్క సమ్మేళమునునే సృష్టియందలి సర్వపదార్థములు పుట్టును. అట్టి అగ్నీ షోమాత్మకమైన శక్తియే జనార్దనుడు. ఆయన ఆగ్నేయ మూర్తి నేనును ఆ దివాకరుడును (సూర్యుడును) ఆయన సౌమ్యతనువు నీవును ఆ బ్రహ్మయును నీచే నీ చరాచర రూపమైన సర్వజగము ధరింపబడుచున్నది. మరియుక కారణము గానరు స్వచ్ఛమైన నీబింబము

సందు కొండలతో నదవులతోనున్న యీ పృథ్వి (భూమి) శశము (కుందేలు)రూపమున కనబడుచున్నది. అందుచే నీవు శశాంకుడ వైతివి. అందుచేతనే నీవు మృగ లాంఛను డనబడుచున్నావు. శశత్వ సంబ ధముచే శశివి. సౌమ్యత్వముచే సోముడవు. శీత = చల్లని అంశుత్వాత్ = కిరణములు గలవాడగుటచే శీతాంశుడవు. రాత్రి నీచే విరాజిల్లుటచే నిశేశుడవు. నక్షత్రములకునాథుడ గుటచే నక్షత్ర నాథుడవు ద్విజులకు రాజగుట ద్విజేశ్వరుడవు నీయందు పితృగణములుండుటచే పితృనాథుడవు. చంద్ర ధాతువు పెక్కర్థములు గలదని పండితు లనిరి తెలుపు వలన అమృతత్వముచే చలువచే హ్లాదనముచే (సంతోషపరచుటచే) నిన్ని విధముల చంద్రుడవునై ప్రఖ్యాతి నందితివి. ఓ ధర్మవత్సల ! నీవు కనబడినంత నందరు నన్నియు నానందమందుదురు. ఓ తేజోమూర్తీ ! జగత్ప్రభూ ! ప్రజల పని యంతయు నీ యధీనము అది నీవు చక్కబెట్టుము. దత్తాత్రేయాపతారమెత్తిన నీచే నా రాజు (కార్తవీర్యార్జునుడు) వరము లీయబడినాడు. కాని దానవులు భూమిపై క్షత్రియులై పుట్టి వాని యండ జేరినారు. వానిం జంప యత్నింపుము. నీవు వరములిచ్చినవాని నింకొకడు చంపలేడు. దేవకార్యమవశ్యము నీవు సేయదగినది.

మార్కండేయ ఉవాచ :

శంకరేణైవ ముక్తస్తు ప్రతిపూజ్యచ శంకరమ్ । ఉవాచ దేవదేవేశం ప్రణతార్తి హరం హరమ్ ॥ 25

చంద్ర ఉవాచ :

ఇయం శంకర ! సౌమ్యా మే తను స్సువిహితా తవ । తస్మా దర్కస్థితాంగచ్ఛ సాతేకామం కరిష్యతి ॥ 26

మార్కండేయ ఉవాచ :

ఇత్యేవ ముక్త స్త్రిపురాన్తకారీ సోమేన రాజ్ఞా పరమేశ్వరేణ ।
సంపూజ్య దేవం ప్రయయౌ స శీఘ్రం తేజోమయం మండల మాశురాజన్ ॥ 27

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే చంద్రమండల దర్శనం నామ ఏకోన త్రింశత్ తమోఽధ్యాయః.

అని యిట్లు చంద్రుండన నమృతాంశుపు శంకరుని ప్రతి పూజ గావించి ప్రణతార్తి హరుడగు హరునితో ఈ నా సౌమ్యతనువు నీకై కూర్పబడినది. సూర్యునందున్న యమ్మూర్తిం గూర్చి చనుము. ఆ మూర్తి నీ కోరినది సేయగలదు. అని యిట్లు పరమేశ్వరుడు సోమరాజు పలుక నా దేవునిం బూజించి రాజా ! అపుడు తేజోమయ మండలమా సూర్యదేవుం గూర్చియేగెను.

ఇది శ్రీ విష్ణుధర్మోత్తరమహాపురాణమందు ప్రథమఖండమున చంద్రమండల దర్శనమను నిరువది తొమ్మిదవ యధ్యాయము.

## ముప్పదవ యధ్యాయము - ఆదిత్య దర్శనము

మార్కండేయ ఉవాచ :

సదదర్శ తతోగత్వా విపులం సూర్యమండలమ్ । చంద్రమండల మానేన మానం యస్యచ సంస్కృతమ్ ॥ 1
యత్తత్ప్రజ్వలితం పిండం పిండితస్య విభావసోః । దేవదేవస్య యద్ధామ వాసుదేవస్య ధీమతః ॥ 2
తస్య ధర్మః పరం పిండం బ్రహ్మాండాంతర దీపనమ్ । ఆధారం సర్వభూతానాం జఠరస్థం హుతాశనమ్ ॥ 3
పంచధాఽవస్థితందేహే సర్వేషాం ప్రాణినాం స్మృతః । ఆలోచకః పాచకశ్చ రోచకో గంజక స్తథా ॥ 4
భ్రాజకశ్చ తథా దేవః సర్వేషాం ప్రాణినాం తథా । యన్మయం దేహినాం చక్షుర్యశ్చక్షు ర్దక్షిణ స్తథా ॥ 5
సవై దేవాదిదేవస్య వాసుదేవస్య కీర్తితః । అగ్నౌప్రాస్తాఽఽహూతి స్సమ్యక్ నిత్యం యత్రోప తిష్ఠతే ॥ 6
యస్యదత్తం సదా తేజః సర్వేషా మేవ తేజసా । యస్మా దంబు ధరోత్పత్తిః యస్మాద్వర్షణ సంభవః ॥ 7

యస్మాత్ప్రవర్తతే సర్వం కాలచక్రం తథైవ చ । ఓషధీనాం పరః పాకః పరం యస్మాన్న విద్యతే ॥ 8
తన్మండల మథాఽఽసాద్య కృత్వా రూపంతు తైజసమ్ । వివేశ మండలం భిత్వా తన్మధ్యం శంకర స్తదా ॥ 9
సోఽంగుష్ఠమాత్రం పురుషం దృక్శక్తి మివ వేష్టితమ్ । తైజసం దృష్టవాన్ రుద్ర స్తుష్టావ చ మహాద్యుతి ॥ 10

మార్కండేయుడనియె: ఈశ్వరుడేగి చంద్రమండలము యొక్క కొలత ననుసరించి చక్కగ కొలిచి సరిచూడబడిన సువిశాలమైన సూర్యమండలముం దర్శించెను. ముద్దగా చేయబడిన ప్రజ్వలించుచున్న యా బింబము దేవదేవుడగు వాసుదేవుడుండు ధామము ఇల్లు-తేజస్సు) ఆ భానువు యొక్క పిండము ముద్ద ధర్మము అది సర్వభూతముల కాధారమై జఠరమందున్న యగ్ని యది. (వైశ్వానరాగ్ని) సర్వప్రాణి శరీరములందది యైదువిధములుగనున్నది. అవి 1. ఆలోచకము( ) 2. పాచకము 3. రోచకము 4. గంజకము 5. భ్రాజకము దేహాల కన్ను(చూపు) అదే. అదే దేవతలకెల్ల దేవతయైన వాసుదేవుని కుడికన్నని వేదములు వర్ణించినవి. అగ్నియందుంచబడిన ఆహుతి సరిగా నిరంతర మేట కేగునో, ఎవ్వని వెలుగుచే నెల్లరకు వెలిగింపబడినదో, ఏనివలన వారిధర్మములు (మేఘములు) ఏర్పడునో, వేనివలన వర్షము కల్గునో ఎవ్వనివలన కాలచక్రమెల్ల త్రిప్పబడునో ఓషధుల పాక మెవ్వనివలన గాక కాదో అట్టి తేజోమూర్తిమండలము భేదించుకొని శంకరుడు అట్టి తేజోమూర్తియై ప్రవేశించెను. ఆతడచ్చట అంగుష్ఠమాత్రుడై జీవుల దృక్చక్తి యంతయు నొకచో ప్రోగుపడి నట్లున్న తైజసుడైన పురుషుం దర్శించి మహాద్యుతియైన రుద్రుడు స్తుతించెను.

త్వాం నమస్యామి దేవేశ ! తేజసాం తు పరం నిధిమ్ । ఆరాధ్య స్త్వం వరేణ్య స్త్వం సర్వభూత భవోద్భవః ॥ 11
స్వర్గద్వారం ప్రజాద్వారం మోక్షద్వారం తథా భవాన్ । అనంత శ్చాప్రమేయ స్త్వం సూక్ష్మాత్ సూక్ష్మతర స్తథా ॥ 12
మయా సమర్పితం తేజః సకలం త్వయి భాస్కర ! । మత్త స్త్వం నహి భిన్నోఽసి నచ దేవా జ్జనార్దనాత్ ॥ 13
అహం విష్ణుర్భవాన్ విష్ణుః బ్రహ్మవిష్ణుః ప్రభాకర ! అస్మాకం సకలం ధామ త్వయి తిష్ఠతి భాస్కర ! 14
దామకార్యం హ క్రియతే యేనాస్య జగతః సదా । ప్రజానాంతు ప్రసవనాత్ సవితేతి నిగద్యసే ॥ 15
రసానాంచ తథాఽఽదానాత్ రవి రిత్యభిధీయసే । ఆదిత్య స్త్వం తథా దానాత్ మిత్రత స్త్వం మైత్రభావతః ॥ 16
పుష్ణాసి సకలాన్ లోకాన్ తేన పూషా నిగద్యసే । ధారణా చ్చ తథా ధాతా యమనా దర్యమా తథా ॥ 17
అంశు స్త్వమంశుధారిత్వాత్ విసర్గా ద్వరుణ స్తథా । భగ స్సౌభాగ్యవాచ్యత్వాత్ త్వష్టా సర్వక్రియా కృతేః ॥ 18
సర్వజన్తు సమత్వాచ్చ వివస్వా న భిధీయతే । క్రమణాచ్చ తథా విష్ణురీశిత్వా దింద్ర ఉచ్యతే ॥ 19
తస్మాత్త్వయా ప్రజాకార్యం కర్తవ్యమవిచారితమ్ । స్థావరై ర్జంగమ స్థైర్వా భూమిర్భారాభిపీడితా ॥ 20
కదాచిజ్జంగమై ర్భూమిః సూర్య భారేణ పీడితా । కదాచిత్ స్థావరై రద్య భారద్వితయ పీడితా ॥ 21
అర్జునే నృపతౌ వృద్ధిః పరా భాస్కర ! శాఖినాం । దైత్యాః క్షత్రియతాం ప్రాప్య పీడయన్తి చ మేదినీమ్ ॥ 22

## రుద్రకృత సూర్యస్తుతి

దేవేశ ! తేజోనిధియైన పరముని నిన్ను మ్రొక్కెద. నీవారాధ్యుడవు వరేణ్యుడవు సర్వభూత సముద్భవ హేతువవు. తమరు స్వర్గద్వారము ప్రజాద్వారము మోక్షద్వారమును. అనంతుడవు అప్రమేయుడవు సూక్ష్మాతిసూక్ష్ముడవు. ఓ భాస్కరా ! నేనెల్లతేజస్సును నీయందర్పించితిని. నాకంటె జనార్దనునికంటె నీవన్యుడవుగావు నేను విష్ణువను నీవు విష్ణువవు బ్రహ్మావిష్ణువు ఓ ప్రభాకరా ! మా అందరి యంత వెలుగు నీయందున్నది -- జగత్తు యొక్క వెలుగు వలసి కావలసినవాని యెల్లవేళల జగత్తు యొక్క స్థితి నీచే నిర్వహింపబడుచున్నది. ప్రజల ప్రసూతికి కారణమగుటచే సవిత యని రసము వితరణము సేయుటచే రవియని దానము సేయుటచే ఆదిత్యుడని మైత్రభావమును సర్వప్రాణులయెడ పాటించుటచే మిత్రుడని సర్వలోకములం బోషించుటచే పూష యని ప్రపంచమును ధరించుటచే ధాత యని యమించుటచే (నియమములో హద్దులో నుంచుటచే) అర్యముడని అంశుధారివగుట

(కిరణములఁ ధరించువాఁడగుట) అంశువని విసర్గముచే (అవనిపై వానగా నీరును వదలుటచే) వరుణుడని సౌభాగ్య శబ్దముచే పిలువఁబడుటచే భగుడని సర్వక్రియాకర్తవగుటచే త్వష్టయని, సర్వజంతుసముడగుటచే వివస్వంతుడని జగదాక్రమణముచే విష్ణువని ఈశుఁడగుట (పాలకుడగుట) చే ఇంద్రుడని వ్యాపనముచే విష్ణువని పేర్కొనఁబడుదువు. కావున నీవేమియు నాలోచింపక ప్రజాకార్యమీవు సేయవలయును. భూమి స్థావరజంగమ భూతకోటి భారముచే పీడితయైనది. ఒకపుడు జంగములచేతను నొకపుడు స్థావరములచే, ఈనాడు రెండు బరువులచే సూర్యా ! పీడింపబడుచున్నది. కార్తవీర్యార్జునుడు రాజైన యిత్తరి చెట్లు తెగ పెరిగినవి. దైత్యులు క్షత్రియులై మేదినిం బీడించుచున్నారు. అన సూర్యుండిట్లనియె :

**సూర్య ఉవాచ :**

తవ దర్శన కామేన ప్రాగేవ నకృతా మయా । స్థావరై ర్జంగమైః సర్వా ప్రకృతిస్థా వసున్ధరా ॥ 23
యథాపూర్వం తథాఽద్యాహం కరిష్యామి మహేశ్వర ! ।
సాంప్రతం బ్రాహ్మణో భూత్వా చార్జునేనైవ పాదపాన్ ॥ 24

**రుద్ర ఉవాచ :**

సర్వాన్ వినాశయిష్యామి శాసనేన తథాఽర్జునమ్ । వసిష్ఠా ద్యోజయిష్యామి తతోఽంశేన వసుంధరామ్ ॥ 25
భృగు వంశే కరిష్యామి తతో నిఃక్షత్రియాం ప్రజామ్ ॥

**మార్కండేయ ఉవాచ :**

ఇత్యేవముక్త స్త్రిపురాంతకారీ సూర్యేణ సద్రశ్మి విరాజితేన ।
జగామ ధామ స్వమసౌ బిభేతి యత్సర్వలోకాన్ జగతాం ప్రధానః ॥ 26

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే - ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే ఆదిత్య దర్శనం నామ త్రింశత్తమోఽధ్యాయః

నీ దర్శనము కోరి యింతకుమున్న స్థావరజంగమ పీడనందిన వసుంధరను సహజస్థాయికిం దేనైతిని. ఇపుడింతకు మున్నున్న స్థితికిం దెచ్చెదను. ఇపుడు బ్రాహ్మణుడనై కార్తవీర్యార్జునునిచేతనే ఎల్ల చెట్లం గూల్పించెద. శాసించి వానిని వశిష్ఠునితో గలిపి మామీద నా యంశముచే (అంశావతారమెత్తి) వసుమతి భృగువంశమును వశమొనరించెద. ఆమీద ప్రజను నిఃక్షత్రియము గావింతును. అని ఉత్తమకిరణ విరాజితుడు సూర్యుండు పలుక సర్వజగత్ప్రధానుడు సర్వలోకభయంకరుడు (రుద్రుడు) నిజధామము (కైలాసమునకు) నకు ఏగెను.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున ఆదిత్యదర్శనమను ముప్పదియవ యధ్యాయము.

## ముప్పదవ యధ్యాయము - కార్తవీరుడు వనములను దహించుట

**మార్కండేయ ఉవాచ :**

ద్విజరూప మథాస్థాయ దేవదేవోఽపి భాస్కరః । మాహిష్మతీం యయౌ శీఘ్రం నగరీం రత్నమాలినీమ్ ॥ 1
సతత్ర దదృశే వీరం కార్తవీర్యార్జునం నృపం । యజమానం సుదోర్దండం కల్పవృక్ష మివాపరమ్ ॥ 2
పూజితః కార్తవీర్యేణ బ్రాహ్మణో నృప మబ్రవీత్ ॥ 3

**బ్రాహ్మణ ఉవాచ :**

మహాశనం మాంజానీహి బ్రాహ్మణం క్షుధయార్దితమ్ । ప్రయచ్ఛ తస్యమే తృప్తిం త్వమేకో హైహయోత్తమ॥ 4

అర్జున ఉవాచ :

కేనాన్నేన భవేత్తృప్తిః ; కిమన్నం విదధామితే । తన్మమాచక్ష్వ భగవన్ ! సుఛందేనైవ మాచిరమ్ ॥ 5

ఆదిత్యం మాం విజానీహి స్థావరాన్ భోక్తు ముద్యతమ్ । పప్రచ్ఛతాని సర్వాణి మమ పార్థివ పుంగవ ॥ 6

అర్జున ఉవాచ :

స్థావరం భూగతందాతుం శక్తిర్నాస్తి మమాఽనఘ । కథంహి స్థావరా దగ్ధుంశక్యా మానుష్య తేజసా ॥ 7

ఆదిత్య ఉవాచ :

రథస్థః స్థావరశ్రేష్ఠ ! శరాన్ముంచ ! యద్రృచ్ఛయా । తేష్వహం ప్రజ్వలన్ రాజన్! భక్షయిష్యామి పాదపాన్॥ 8

తావదేవ త్వయా కార్యం నృపతే ! శరమోక్షణమ్ । యావత్ నప్రజ్వలిష్యామి ముక్తేష్వపి శరేష్వహమ్ ॥ 9

మార్కండేయ ఉవాచ :

ఏవముక్త్వా గతేసూర్యే, కల్పయిత్వా రథోత్తమమ్ । చిక్షేప సశరాన్ రాజా యత్ర తత్ర ద్రుమోత్కరమ్ ॥ 10

తేక్షిప్త్వా హైహయేశేన శాతకౌంభోజ్వలా శరాః । జజ్వలన్ నృపశార్దూల ! జ్వలయంతో వనద్రుమాన్ ॥ 11

దుందుభి స్వన నిర్ఘోషో విస్ఫులింగ గణాకులః । ఆలోలార్చి ర్మహావేగః సర్వసత్వ భయంకరః ॥ 12

నిదిహన్ వృక్షపుంజాని తప్తకాంచన సుప్రభః । జ్వాలామాలీ తదా భాతి సర్వతః పావకః క్షితౌ ॥ 13

వనేషు దహ్యమానేషు తాపతృష్ణార్దితా మృగాః । జలాశయేషు చిత్రేషు గతచ్ఛాయాగ్నికేషుచ ॥ 14

దదాహాగ్ని స్తదా వృక్షాన్ యావదిభా జగత్పతేః । బభూవాఽథ ప్రశాంతార్చిః కృత్వా ల్వఘీం వసుంధరామ్॥ 15

న జ్వజ్వాల తథావహ్ని కృతవీర్య శర్వేష్వపి । కృతకార్యం తదాగత్వా కార్తవీర్యో దివాకరమ్ ॥ 16

వినివృత్య రథం పశ్చాత్ యావన్మాహిష్మతీం పురీమ్ । స గచ్ఛన్నేవ దదృశే వసిష్ఠం సర్వతేజసమ్ ॥ 17

తేనశప్తోవనే దగ్ధే స్వకీయే నృపపుంగవః । యస్మాత్త్వయా వనం దగ్ధం మమ పార్థివ శాసన ! ॥ 18

తస్మాచ్ఛేచ్ఛిద్యతే బాహూన్ బ్రాహ్మణ శ్శం సిత వ్రతః । తేన శాపేన విప్రస్య రామః క్షత్రియ నందనః ॥ 19

తస్య బాహువనం సర్వం చిచ్ఛేద భృగునందనః ॥ 20

వజ్ర ఉవాచ :

రామస్తు కస్మిన్ సబభూవ వంశే కథంచరాజ్ఞస్తు మహాబలస్య ।
చిఛేద దోర్దండవనం నృవీరః సర్వం సమాచక్ష్వ భృగు ప్రధాన ! ॥ 21

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే-ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే వనదాహోనామ ఏకత్రింశత్తమోఽధ్యాయః

మార్కండేయుడనియె : సూర్యుడు బ్రాహ్మణ రూపమున మాహిష్మతి నగరమునకేగెను. అక్కడ కార్తవీర్యార్జునుం జూచెను. అతడనేక యజ్ఞములాచరించినవాడు మహావీరుడు. రెండవ కల్పవృక్షమా యనునట్లు గొప్ప దాత. అతనిచే పూజితుడై బ్రాహ్మణుడిట్లనియె : నే నాకలిగొన్నాను. తిండిపుష్టికలవాడను. నీవొక్కడవ నాకు తృప్తిగ నన్నముపెట్టుము. అన విని యర్జునుడు మీకు తృప్తికలిగించు నన్నమేది తెలుపుమన నా విప్రుడు నేనాదిత్యుడను. స్థావరములను దిన నుద్యమించినాను. వానినాకొసంగుము. అన భూమియందలి స్థావరభూతము నిచ్చు శక్తి నాకు లేదు. మనుష్య తేజస్సుచేత గిరి వృక్షాది స్థావరములు దహింపనెట్లు శక్యమగును నావిని ఆదిత్యుండు— "ఓ పార్థివశ్రేష్ఠా ! నీవు రథమందు నిలిచి లీలామాత్రముగ బాణములను వదలుము. వానియందు నేను రగుల్కొని యా చెట్లందినివైతును. బాణముల వదలునంతవంకే నీ చేయవలసినది. ఆమీది పని నాది. అని పలికి సూర్యుడరుగ, నా రాజు రథమెక్కి నిలిచి చెట్లున్నచోట నెల్ల బాణములను విసరెను. మేలిమి బంగారమున దేజరిల్లు నయ్యమ్ములడవింగల వృక్షముల మండించి మంటలం జిమ్మ మొదలిడెను. అగ్నిజ్వాలలెగయ నలుదెసల నలముకొని నిప్పురవ్వ లెగయ

దుందుభి స్వన గంభీరఘోషమున నెల్లెడ గ్రమ్మి వనములం గాల్చినంత నీటిపట్టు నీడతలగి నిప్పులంబొరయ జగదీశ్వరుని యిచ్ఛ యెంతవరకో యంతదాక వృక్షములం గాల్చెను. మంటలు తగ్గ వసుంధరం జులకనచేసి యామీద కార్తవీర్యార్జునుని బాణములందు గూడ వెలుంగక యుపశమించి పోయెను. కార్తవీర్యుడట్లు తావచ్చిన పని చక్కబెట్టు సూర్యుని దరికేగి యాపై తేరు మరల్చికొని మాహిష్మతీ నగరమున కేగుచు సర్వతేజస్వియైన వశిష్ఠుని దర్శించెను. తనకోపమున వనము దగ్ధమగుటకా ముని కోపించి యో పార్థివ! నా యాశ్రమ ప్రాంతవనము నీవు కాల్చితివిగావున నీ బాహువులనొక వ్రతనిష్ఠుడు బ్రాహ్మణశ్రేష్ఠుడు కాల్చివేయును లెమ్మని శపించెను. ఆ బ్రాహ్మణశాపముచే క్షత్రియునికిం బుట్టిన వాడు పరశురాముడు భృగుమహర్షి కుమారుడు (భార్గవుడు) కార్తవీర్యార్జునుని బాహువనమును నరకెను. అనవిని వజ్రుండా రాముడేవంశమున బుట్టెను ? మహాబలుడైన కార్తవీర్యార్జునుని బాహువన మెట్లు నరకె, నది తెలుపుమన మార్కండేయుడు కథ నానతిచ్చెను.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున కార్తవీర్యార్జునకృతారణ్యదహనమను ముప్పదియొకటవ యధ్యాయము.

## ముప్పదిరెండవ యధ్యాయము - బడబాగ్ని యుత్పత్తి

మార్కండేయ ఉవాచ :

సర్వదేవాతిదేవస్య బ్రాహ్మణస్తనయో భృగుః । పౌలోమ్యాం జనయామాస చ్యవనం భగవాన్ భృగుః ॥ 1

యయాతి (శర్యాతి) జా సుకన్యాపి చ్యవనాత్ భృగునందనాత్ । ఆత్మవానందధీచంచ జనయామాస ధార్మికౌ ॥ 2

ఋషిపత్నీ మహాభాగా చాఽఽత్మవానస్య నాహుషీ । ఔర్వం సంజనయామాస ఋచీకాపర సంజ్ఞితమ్ ॥ 3

యేన క్రోధాభిభూతేన దృష్టోఽగ్నిర్బడబాముఖః । తస్య సత్యవతీ భార్యా కౌశికీ గాధిజా శుభా ॥ 4

తస్యాం సంజనయామాస పుత్రాణాం శత మూర్జితమ్ । జమదగ్నిశ్చ వత్సశ్చ తేషాం శ్రేష్ఠతమౌ పుభౌ ॥ 5

స్త్రీణాం చరు విపర్యాసాత్ జమదగ్నిరజాయత ॥ 6

వజ్ర ఉవాచ :

కథ్యతాంమే యతో బ్రహ్మన్ బాడబస్యచసంభవః । సంభవం జమదగ్నేశ్చ శ్రోతుమిచ్ఛామి తత్వతః ॥ 7

మార్కండేయుడనియె : బ్రహ్మ కుమారుడు భృగువు. ఆయనకు పౌలోమియందు చ్యవనుడు పుట్టె. శర్యాతి కుమార్తె సుకన్య చ్యవనుని వలన ఆత్మవానుడు దధీచుడు నను నిద్దరు ధర్మాత్ములగు బుత్రులం గాంచెను. ఆత్మవానుని భార్య నాహుషి (నహుషుని కూతురు) ఔర్వునిం గనెను. ఆతనికి ఋచీకుడను మరియొక పేరుగలదు. ఆయనకు కోపమువచ్చి చూచినంతట అగ్ని బడబా ముఖుం డయ్యెను. (బడబా = గుఱ్ఱము) ఆ ఋచీకుని భార్య సత్యవతి. కుశికవంశీయ. గాధి కూతురు. ఆమెయందు ఋచీకునికి నూరుగురు తనయులు గల్గిరి. వారిలో జమదగ్ని వత్సుడుననువారు శ్రేష్ఠులు. ఋచీక భార్యల చరువిపర్యాసమువలన జమదగ్ని జనించెను. అనవిని వజ్రుడు బాడబుని యొక్కయు జమదగ్ని యొక్కయు జన్మవృత్తాంతము సవిస్తరముగ నానతిమ్మన మార్కండేయుడిట్లనియె :

మార్కండేయ ఉవాచ :

భృగూణాం హైహయానాంచ వైరమాసీత్సుదారుణమ్ । ధనహేతో స్తదా పాపైః హైహయైర్భృగవో హతాః ॥ 8

యేఽపి గర్భగతాస్తేషాం తేఽపితైర్వినిషూదితాః । గర్భేషు హన్యమానేషు ఋషిః పరమ దుఃఖితః ॥ 9

అరుణంధారయామాస గర్భేష్టం దీప్తతేజసమ్ । పూర్ణేకాలే తదాబాల ఊరుంభిత్వా వ్యజాయత ॥ 10

జాతమాత్రస్తు చుకోపాథ దేవతానాం మహాతపాః । హైహయైర్హన్యమానానాం బంధూనాం సుమహాత్మనామ్ ॥ 11

భవద్భి ర్నకృతం త్రాణం తస్మాత్ సర్వాన్ శపామ్యహమ్ తం క్రుదం పితరో హంతుం వారయామాసు రోజసా॥ 12
క్రోధః పుత్ర ! న కర్తవ్యః సహి శత్రుః నృణాం సదా । వయం సర్వే జితక్రోధాః క్షత్రియై ర్విని పాతితాః ॥ 13
అస్మాకం న వధే శక్తాః క్షత్రియా హైహయాధిపాః । ఏవముక్తః పితృగణైః ఋచీకస్తాన థాఽబ్రవీత్॥ 14
నహిమే శామ్యతి క్రోధో యుష్మన్నిధనకారితః । తస్మాద్దేవ గణాన్ సర్వాంతే నిహనిష్యామి తేజసా ॥ 15
ఏతస్మిన్నేవ కాలేతు మహీ తోయ సమాకులా । జగామ శరణం విష్ణుః సర్వభూత భవోద్భవమ్ ॥ 16
శ్రీభగవాన్ ఉవాచ :
దేవాన్ప్రతిసముత్పన్నం క్రోధ మౌర్వస్య యచ్ఛుభమ్ । తం ప్రవిశ్య గ్రసిష్యామి తోయంసర్వం వసుంధరే ॥ 17
మార్కండేయ ఉవాచ :
ఇత్యేవ ముక్త్వా వసుధామౌర్వం క్రోధం సమావిశత్ । భూత్వాచ బడబావక్త్రః తచ్ఛరీరాత్ వినిః సృతః ॥ 18
నత్రాతారో భవిష్యన్తి పుత్ర ! సర్వే దివౌకసః । క్రోధ శ్చాయం తవ వృథా న భవిష్యతి పుత్రక ! 19
ఏవముక్తస్తు భృగుణా ఋచీకోఽగ్ని మభాషత । పూర్వోత్తరే సమాసాద్య సముద్రేవస ! పుత్రక ॥ 20
పిబన్తత్ర సదావేగ మంభసాం సుమహాద్యుతే ! అస్మాకం తు కులేభావీ క్షత్రధర్మా ద్విజోత్తమః 21
క్షత్రియాణాం సముచ్ఛేదం యఃకరిష్య త్యనేకశః । ఏవముక్తస్తు పిత్రావై పిబన్ మాసాష్టకం జలమ్ ॥ 22
చైత్రమాసం సమారభ్య నిత్యమాస్తే సుఖీజలే । పీతం మాసాష్టకం తోయం జఠరే భస్మసాద్గతమ్ ॥ 23
పూత్కృత్య మాసాన్ చతురః శిశిరాఖ్యే మహీతలే । నిత్యం హిమౌఘం సృజతి తస్మాదపి సమీరణః 24
హిమాచలే పాతయతి ప్రవాహో నామపార్థివ । ఏషాతోయా ద్ధిమోత్పత్తిః హిమర్తౌ యస్య సంభవః ॥ 25
వృద్ధిక్షయ విహీనస్య కథితం తవ ధార్మిక ॥ 26
ఉత్పత్తి రేషా తప బాడబాగ్నేః ప్రోక్తా మయాభూమిపతిప్రధాన ।
శ్రుత్వాపియాం ముంచతి మోహజాలం సంసార జాతేశ్చయథాప్రవృద్ధ ః॥ 27

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే - ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే బడబాగ్న్యుత్పత్తి ర్నామ ద్వాత్రింశోఽధ్యాయః.

భృగువులకు హైహయులకు దారుణవైరమేర్పడెను. ధననిమిత్తముగా పాపులు హైహయులు భృగువులను హతమొనర్చిరి. గర్భమందున్న శిశువులనుకూడ చంపిరి. అయ్యెడ భృగుమహర్షి దుఃఖించి మహాతేజస్వియగు ఋచీకుడను శిశువును తన గర్భమందు ధరించెను. ప్రసవసమయమయినంతట నాశిశువాయన తొడను ఛేదించుకొని పుట్టెను. పుట్టగానే యా మహాతపస్వి దేవతల యెడ కోపముగొని నావారిని హైహయులు చంపుచుండ మీరు రక్షణ యీయలేదు గావున మిమ్మిదుగో వధింతుననియె. అయ్యెడ నాతని పితరులు శపింపవలదని తమ యోపినంత చెప్పి వారించిరి. వారు నాయనా ! కోపముగొనవలదు. అది మానవులకు శత్రువు. క్షత్రియులచే గూల్చబడిన మేము కోపముం గెల్చినవారము. ఆ పాపులు మమ్ము సంహరింపగలవారు కారు. అని పితృగణములు దెలుప విని యా శిశువు ఋచీకుడు మిమ్ము సంహరించినాకన్న కారణమున గల్గిన యీ కోపము నాది చల్లారుటలేదు అందుచే నా ప్రతాపముచే నీదేవతలందరిని జంపెదననియె. ఈసమయమందే భూదేవి నీటిలో మునిగి సర్వభూతకర్తయగు విష్ణుని శరణు జొచ్చెను. అప్పుడు విష్ణుభగవానుడు ఔర్వునికి దేవతల యెడల గల్గిన కోపము శుభకరమైనది అందేను ప్రవేశించి సర్వజలమును ద్రావివైచెదనని యా కోపమునం జొచ్చినంత నతడు బడబాముఖుండై యాతని శరీరమునుండి వెలుపడెను. దేవతలు రక్షణ యీయరైరి. నీ యీ కోపమూ వృథాపోనిది. అని తండ్రి భృగుండన ఋచీకు డగ్నింగని పుత్రా ! నీవు పూర్వోత్తర సముద్రములందు వసించి యందు యుదక ప్రవాహమును ద్రావుము. మన కులమందు క్షత్రతేజస్వి బ్రాహ్మణోత్తముడుదయింపగలడు. అతడు సర్వక్షత్రియోచ్ఛేద మొనరించును. అని తండ్రి పలుక నాబాలుడు బాడబాగ్ని యను పేర చైత్రమాస మారంభించి యెనిమిదినెలలు.

సముద్రోదకముం ద్రావెను. ఆ ఉదకము త్రావగానే యాతని జఠరమున భస్మమైపోయెను. ఆ భస్మమును శిశిర ఋతువున నాల్గు మాసములు పూత్కరించి (పుక్కిలించి యుమిసి) నంతట నది గడ్డకట్టిన మంచుగ తయారగును. దానిని ప్రవాహమును వాయువు హిమాలయము మీదికి విసరివైచును హిమవత్పృతువున నీటినుండి మంచు పుట్టెడివిధ మిదియే. దీనికి వృద్ధిక్షయములు లేవు. ఓరాజ శ్రేష్ఠా! బాడబాగ్నియొక్క యుత్పత్తి యిది నీకు దెల్పితిని. జ్ఞాని సంసార మోహమునుండి ముక్తుడైనట్లిది విని మోహవిముక్తుడయ్యెదవు.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున బడబాగ్ని యుత్పత్తియను ముప్పది రెండవ యధ్యాయము

## ముప్పదిమూడవ యధ్యాయము - సత్యవతి చరువిపర్యాసము

మార్కండేయ ఉవాచ :

ఔర్వస్య భార్యా ధర్మజ్ఞా నామ్నా సత్యవతీ శుభా । వనే పర్యచరత్ భక్త్యా గాధిజా భృగునందనమ్ ॥ 1

తస్యాః పరమయా భక్త్యా భర్తా తోష ముపాగతః । ఉవాచతాం వరారోహాం ఋచీకో భృగునందనః ॥ 2

ఋచీక ఉవాచ :

వరం వరయ సుశ్రోణి! యత్తే మనసి వర్తతే । తోషితోఽహం త్వయా భద్రే! వనే శుశ్రూషయా వద! ॥ 3

సత్యవత్యువాచ :

మాతుః ప్రయచ్ఛ మేపుత్రం భగవన్! వీర్యవత్తరమ్ । పుత్రం మమచ ధర్మజ్ఞం, యుతం బ్రాహ్మణతేజసా ॥ 4

ఋచీక ఉవాచ :

చరుద్వయం కరిష్యామి మాతురర్థే తథా తవ । యస్య సంప్రాశనాత్, పుత్రంత్వచ్చైవ జనయిష్యసి ॥ 5

మార్కండేయ ఉవాచ :

ఏవముక్త్వా తదాచక్రే ఋచీకస్తు చరుద్వయమ్ । ఏకస్మిన్ సకలం క్షాత్రం తేజశ్చక్రే సవైష్ణవమ్ ॥ 6

శ్వశ్ర్వర్థే తంచరుం కృత్వా ద్వితీయే సన్యవేశయత్। బ్రాహ్మం రౌద్రంచ యత్తేజః పత్న్యర్థే కృతవాన్ చరుమ్ ॥ 7

ఋచీక ఉవాచ :

అయంప్రాశ్యస్త్వయా భద్రే! త్వయంమాత్రా చరుస్తవ । అశ్వత్థాఽఽలింగనం కార్యం మాత్రా తత్ర తదా శుభే ॥
తథైవౌదుంబరస్యాపి త్వయా రాజీవలోచనే ॥ 9

మార్కండేయ ఉవాచ :

ఏవముక్తా తతో గత్వా మాత్రే సర్వం న్యవేదయత్ ॥ 10

తతస్తాం మబ్రవీన్మాతా గాధేఃపత్నీ యశస్విని । ధ్రువం భగవతా పుత్రి స్తవ పుత్ర చికీర్షయా ॥ 11

శ్రేష్ఠేన తేజసా యుక్తశ్చరు రేష కృతః శుభే । తస్మాచ్చరు విపర్యాసం మదర్థేకురు మాచిరమ్ ॥ 12

ఆలింగనే విపర్యాసం ద్రుమయోః క్రియతాం తథా । సా మాతు ర్వచనం సర్వం చక్రే గౌరవ యంత్రితా ॥ 13

సగర్భా సగతే కాలే భర్తా వచన మబ్రవీత్ ॥ 14

ఋచీక ఉవాచ :

ధ్రువంచరు విపర్యాసో ద్రుమయోశ్చత్వయా కృతమ్ । యేన త్వమసితాపాంగి! యుక్తా క్షత్రియ తేజసా ॥ 15

బ్రాహ్మణ తేజసాయుక్తం కృతవానస్మి తే చరుమ్ । మాతుస్తే చారుసర్వాంగి తథా క్షత్రియ తేజసా ॥ 16

కృతంచరు విపర్యాసం సా విప్రం జనయిష్యతి । క్షత్ర ధర్మరతం పుత్రం విప్రం త్వం జనయిష్యసి ॥ 17

సత్యవత్యువాచ :

మాతుర్మతాత్కృతమిదం భగవన్! క్షంతు మర్హసి । క్షత్రధర్మ రతః పుత్రో నమే భవితు మర్హతి ॥ 18

ఋచీక ఉవాచ :

ఏవమస్తునతే పుత్రఃక్షత్ర ధర్మా భవిష్యతి । పౌత్ర స్త్వవశ్యం భవితా భావ్యర్థ విధి చోదితః ॥ 19

సత్యవత్యువాచ :

సర్వేశ్వర స్త్వం భగవన్! కిమర్థం! పౌత్రస్య మే క్షత్రియ భావముగ్రమ్ ।
నివర్తితుంనేచ్ఛసి మాతులేన వద త్వ తన్మే యదితేన గుహ్యమ్ ॥ 20

శ్రీ విష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే చరు విపర్యాసో నామ త్రయస్త్రింశత్తమోఽధ్యాయః.

మార్కండేయు డనియె : ఔర్వుని భార్య సత్యవతి. ఆమె గాధి కూతురు. భృగునందనుని తన భర్త నరణ్యమునం బరిచరించెను. ఆమె పరమ భక్తికి మెచ్చి భర్త ఋచీకుడు సుందరీ ! నీ మదింగల కోరిక కోరుకొనుము. కల్యాణి ! నీ సేపల కేను సంతుష్టుడనైతినన సత్యవతి మా అమ్మకు పరాక్రమశాలియగు తనయు ననుగ్రహింపుము. నాకు బ్రాహ్మణతేజస్సంపన్నుని బుత్రునిం దయసేయుము. అనవిని ఋచీకుడు రెండు చరువులనేర్పరచి యొకదానియందు వైష్ణవతేజస్సమన్విత క్షాత్రతేజస్సంతయు నించి అత్తగారికొరకిచ్చెను. రెండవ చరువునందు బ్రాహ్మతేజస్సు రౌద్రమును నించి భార్యకని యేర్పరచెను. ఏర్పరచి యిది నీవు యిది మీ యమ్మయు గైకొనుడు దీని ప్రాశించి మీయమ్మ రావిచెట్టుం (అశ్వత్థము) గౌగలించుకొనవలెను. నీవు ఉదుంబరమును (మేడిచెట్టును) కౌగలించుకొనవలెననియె. అది విని సత్యవతి తల్లిదరికేగి యది తెలిపెను. గాధి భార్య (సత్యవతి తల్లి) కూతురుంగని నిజమే భగవంతుడు నీ భర్త నీ పుత్రసంతతికై శ్రేష్ఠమైన తేజస్సు నింపి యీ చరువు నీకై యేర్పరచినాడు. కావున యీచరువుల విపర్యాసమును (తారుమారు) చేయుము. యాయా చెట్లను గౌగలించుటలోగూడ విపర్యాసము వెంటనే కానిమ్ము. అనవిని యావిడ తల్లియెడ గౌరవము ననుసరించి యామె చెప్పినది చెప్పినట్లు సేసెను. కాలము గడువ గర్భవతియైన యాబిడంగని భర్త (ఋచీకుడు) నీవు చరువుల మార్చితివి చెట్లం గౌగలింపులోగూడ మార్పుచేసితివి. ఇది నిక్కము దాన నీవు క్షత్రియ తేజస్సుతో గూడి కొన్నావు. నీకై నేను బ్రహ్మతేజస్సంపూర్ణమైన చరువుం జేసియిచ్చితిని. ఓ సర్వాంగసుందరి ! మీ తల్లికి క్షత్రియ తేజస్సు నించిన చరువు గల్పించితిని. చరువిపర్యాసము జరిగినది ఆమె బ్రాహ్మణుని గనును నీవు క్షత్రధర్ముడైన విప్రునిం గందువు అనెను. అంతట సత్యవతి మా అమ్మ ముచ్చటననుసరించి యిట్లు చేసితిని. భగవంతుడా ! క్షమింపనగును. క్షాత్రధర్ముండగు కొడుకు నాకు గలుగవలదు అన ఋచీకుడు ; ఇట్లే యగుగాక ! నీకు క్షాత్రధర్ముడు గలుగడు కాని విధిప్రేరణచే నీకు గలుగు పౌత్రుడు మాత్రము క్షత్రియ తేజస్వి కాగలడు అనియె. అదివిని సత్యవతి నీవు సర్వేశ్వరుడవు (సర్వసమర్థుడవు) గదా ! నా పౌత్రునికి (మనుమనికి) మాత్రము ఉగ్రమైన క్షత్రియధర్మము విధి చితివదిమాత్రమేల ? నీవు మేనమామవగుదువుగదా ? దీనిని నీవేల మరల్పదలవవు. ఇది రహస్యవిషయము గాదేని యానతిమ్మనియె.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున సత్యవతి చరువిపర్యాసమను ముప్పదిమూడవ యధ్యాయము.

## ముప్పదినాల్గవ యధ్యాయము - కుశిక వరప్రసాదము

ఋచీక ఉవాచ :

బ్రహ్మణోఽత్రి స్సుతః సౌమ్యః సుత స్తస్యాపి చంద్రమాః ।
సోమస్య తు బుధః పుత్రో బుధ పుత్రః పురూరవాః ॥ 1

శ్రుతాయు స్తనయ స్తస్య పుత్ర స్తస్యాపి నగ్నజిత్ । తస్యాపి కాంచనః పుత్రః సుహోత్ర స్తస్య చాత్మజః ॥ 2

తస్య జహ్నుః స్మృతః శ్రీమాన్ యేన గంగాతు జాహ్నవీ । సువ్రత స్తనయ స్తస్య చాలర్క స్తస్య చాత్మజః ॥ 3

తస్య పుత్రో బలాకశ్చ కుశిక స్తస్య చాత్మజః । మహోదయే పురవరే సతు నిత్యం కృతాలయః ॥ 4

ఏతస్మిన్నేవ కాలేతు శ్వశురః చ్యవన స్తవ । స్వ వంశసంకరం బుద్ధ్వా కుశికేభ్యో మహాయశాః ॥ 5

కుశికానాం సముచ్ఛిత్త్యైని కుశికం నృపతిం యయౌ । పూజితః కుశికేనాపి కుశికం వాక్య మబ్రవీత్ ॥ 6

రాజన్ ! వక్ష్యామి కార్య తే యది శుశ్రూష సేఽనఘ ! । స భార్యేణ చ కర్తవ్యం రాజన్ శుశ్రూషణం త్వయా ॥ 7

కుశిక ఉవాచ :

స్వమేవేదం తవగృహం యథేష్టం వస । భార్గవ ! । శక్తిత స్తవ శుశ్రూషాం కరిష్యే భార్యయా సహ ॥ 8

ఋచీక ఉవాచ :

గృహోషితం తం చ్యవనం శుశ్రూషు రనహం కృతః । పూజయామాస సతతం సర్వకామ సమృద్ధిభిః ॥ 9

బహు సంఖ్యాన్ దినగణాన్ చ్యవనో నావ బుద్ధ్యతి । నిరాహారః స భార్య స్తం పర్యుపాస్తే మహీపతిః ॥ 10

అకాలే ప్రాశయత్యన్నం కదాచిదపి దుర్లభం । కృత మిత్యేవ తద్రాజా నివేదయతి సత్వరమ్ ॥ 11

కదాచిద్బహు భుంక్తేఽన్నం న భుంక్తే దివసాన్ బహూన్ ।
ధనేనచ తదీయేన తర్పయామాసవై ద్విజాన్ ॥ 12

కదాచి ద్దీపయత్యేవ వహ్నిం తాత గృహోద్భవమ్ । కదాచి చ్చ రథేయుక్తం స భార్యో రాజపుంగవమ్ ॥ 13

రాజమార్గే ప్రతోదేన తు దన్యాతి యథేచ్ఛయా । తస్యాఽసౌ హితమేవేదం కర్మణా మనసా గిరా ॥ 14

సమాచరతి యత్నేన భార్గవ ప్రియ కామ్యయా । యదా న వృజినం కించిత్ దృష్టవాం స్తస్య భార్గవ ! 15
తదా తస్య వరం ప్రాదా ద్వరం యన్మనసేప్సితమ్ ॥ 16

చ్యవన ఉవాచ :

వరం వరయ ! భద్రంతే ప్రసన్నోఽహం తవానఘ ।
నిర్వ్యాజం తేఽనయా రాజన్ ! సేవయాఽనఘయా సదా ॥ 17

కుశిక ఉవాచ :

యదిమేత్వం ప్రసన్నోఽసి భృగూణాం వంశవర్ధన ! ।
వంశో బ్రాహ్మణతాం యాతు వరమేత ద్వృణోమ్యహమ్ ॥ 18

చ్యవన ఉవాచ :

ఏతదేవధ్రువం భావియన్మాం వరయసే నృప ! । అస్మ ద్వంశాను వంశస్య బ్రాహ్మణ్యంతే భవిష్యతి ॥ 19

తవ వంశకృతోఽస్మాకం క్షత్ర ధర్మో ద్విజోత్తమః । భవిష్యతి నరేంద్రేంద్ర ! చైతత్సు విదితం మమ ॥ 20

ఏతజ్ఞాత్వా సముత్సేకం చికీర్షుః స్వకులస్యతే । వికారైః క్రోధనార్థంతే గృహేఽహ మవసం చిరమ్ ॥ 21

వికారం న తతో దృష్టం మయా భావ్యర్థచోదితమ్ ।
తస్మా న్మాతు స్త్వయాప్రాప్తం వరమేతత్ సుదుర్లభమ్ ॥ 22

కుశాశ్వనామా పుత్ర స్తే భవితాఽతి స్వధార్మికః । తస్యాపి భవితాపుత్రో గాధి రిత్యేవ విశ్రుతః ॥ 23

విశ్వామిత్రః సుత స్తస్య బ్రాహ్మణ్య ముపలప్స్యతి । కృత్వా వైరం వసిష్ఠేన తపసా మహతా నృప ! 24

స్త్రీణాం చరు విపర్యాసా ద్విశ్వామిత్రస్య సంభవః । అస్మ ద్వంశానుభవితా నిర్వృత్తో భవ పార్థివ ! 25

యత్తే వినాశితం దగ్ధం భవితా తద్విశేషవత్ । భార్యయా సహితశ్చైవ జరాహీనో భవిష్యసి ॥ 26
ఏవముక్త్వా గతే విప్రే రాజా పూర్ణ మనోరథః । ఉవాచ సుముఖీం భద్రే ! జరాశోక వివర్జితామ్ ॥ 27
ఏతత్ సునేత్రే చ్యవనస్య వాక్యం కస్యాఽస్తి శక్తిర్భువి మానవస్య ।
కర్తుం మృషాతేన వరోరుమధ్యే ! పౌత్రస్తవోగ్రో భవితా నృలోకే ॥ 28

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే కుశిక వరప్రదానం నామ చతుస్త్రింశత్తమోఽధ్యాయః.

ఋచీకుండు భార్యతో సిద్ధినియు : బ్రహ్మకుమారుడు సౌము డగునట్టి అత్రి. అతని యొక్క కొడుకు చంద్రుడు. వానికొడుకు బుధుడు వాని కుమారుడు పురూరవుడు. వానికొడుకు శ్రుతాయువు. వానివాడు సర్వజిత్తు వానివాడు రాంహసుడు. వాని నతుడు సుహోత్రుడు. వానికొడుకు జహ్నువు. ఆతనిచేతనే గంగానది జలాహ్నవి యనబడెనది. జహ్నువు కుమారుడు అలర్కుడు. వానికొడుకు బలాకుడు వానికొమరుడు కుశికుడు. అతడు మహోదయపురనిత్యనివాసి. ఈ తరుణమందే నీమామగారుచ్యవనుడు కుశికులవలనే తనవంశసాంకర్య మగుట విని తద్వంశచ్ఛేద మొనరింప కుశికునిదరికేగెను. అతని పూజలందికొని యాయనతో రాజా ! నీవాలింపనెంతువేని యొకపని నీకు దెలిపెదను. నీవు నీభార్యయు గూడ నామాటవినవలసినది. అనవిని కుశికుడు ఇది నీస్వగృహమే - స్వేచ్ఛగనిందు వసింపుము. భార్యయు నేను నీకు శుశ్రూషయొనరింతుము (నీచెప్పినమాటవిందుము) అనియె. అట్లు భార్యతో తనయింట విడిదిసేసిన చ్యవనుని యెట్టియహంకారము గొనక సర్వకామసమృద్ధుల నా చ్యవనుని పరిచరించెను. బహు దినములటు గడచెను. కానియెంత కాలమయ్యెనో చ్యవను డది గుర్తింపనే గుర్తింపడయ్యె ఆరాజు భార్యతో నిరాహారియై యాఋషి నుపాసించెను. చ్యవనుడొకప్పుడకాలమున నన్నము దినవలెననును. రాజు సర్వము సిద్ధమనెను. ఒకప్పుడు ఋషి తెగదినును ఒకతరి పెక్కు దినములు తినకేతినడు. ఆ రాజిచ్చిన సొమ్ములచే బ్రాహ్మణ సంతర్పణములు సేయుచు తండ్రి యింట నున్న యగ్ని నొకప్పుడుద్దీపింపజేయును. ఒకప్పుడు భార్యతో రథమెక్కి రాజవీథి నారాజు రథము లాగుచుండ ముని కోలంగుచ్చి యాతనిం దోలుచు స్వేచ్ఛావిహారము సేయును. ఆ భార్గవుని ప్రియముగోరి యా తేడు త్రికరణశుద్ధిగ యత్నపరుడై యాతని హితము నాచరించుచుండెను. అప్పుడు చ్యవనుడా రాజునందేకొంచెమేని తప్పిద మెప్పుడు గానడయ్యెనో యప్పుడా నృపునిం గని చ్యవనుడు రాజా ! పుణ్యాత్ముడా ! వరము కోరుము శుభంబగుగాక. ఏమాత్రము కపటములేని యీ నీ సేవకు నీయెడ నేను ప్రసన్నుడనైతిని అన కుశికుడు ఓ భృగువంశవర్ధన ! నీవు నాయెడ ప్రసన్నుడవేని నా వంశము బ్రాహ్మణత్వమునందుగాక ! వర మిది నేను కోరుచున్నాను. అన చ్యవనుడు ఈవు కోరితివిగాన ఇదే తప్పక జరుగును మా వంశమునకనువంశమైనవారికి బ్రాహ్మణ్యము గలుగగలదు. నీ వంశమువాడు క్షత్రియధర్ముడై బ్రాహ్మణుడు మావంశోచ్ఛేదముసేయగలడని యెరింగి మొత్తము కుశికవంశమును చ్ఛేదము సేయవలెనని నేను వచ్చి నీ యింట పెక్కు వికారములతో నివసించితిని. భావ్యర్థచోదితమైన యొక్క యించుకేని వికృతి నీయింట గనబడలేదు. అందు మీయమ్మవడసిన యీ వరము మిక్కిలి దుర్లభమైనది. నీకు కుశాశ్వుడను కొడుకు గల్గును. అతడు పరమధార్మికుడగును. వానికి గాధి యుదయించును. వాని కుమారుడు విశ్వామిత్రుడు మహాతపస్సుచేత వశిష్ఠునితో వైరముపెట్టుకొని బ్రాహ్మణ్యముంబడయగలడు. స్త్రీల చరువిపర్యాసముచే విశ్వామిత్రుడు పుట్టును. మా వంశానుసారముగ నదిజరుగును. కావున యింటికి మరలుము. ని నష్టమైన దగ్ధమైనదెల్ల చక్కబడును. సవిశేషమగును. నీ భార్యయు నీవును ముదిమినందరు. అని యిట్లు పలికి విప్రుండరుగ నారాజు పూర్ణమనోరథుడై జరాశోకములులేని సుముఖియైన భార్యంగని కల్యాణి ! ఇది చ్యవన మహర్షి మాట. నీ మనుమడు (పౌత్రుడు) ఉగ్రమూర్తియగునన్న యా మాటను అబద్ధముగావించుటకి మానవలోకమున నేమానవునికి శక్తి యున్నది ?

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున కుశికవరప్రదానమను ముప్పదినాల్గవ యధ్యాయము

# ముప్పది ఐదవ యధ్యాయము - పరశురామావిర్భావము

మార్కండేయ ఉవాచ :

ఏవముక్త్వా సత్యవతీ కాలేపూర్ణే ద్విజోత్తమమ్ । జనయామాస ధర్మజ్ఞం జమదగ్నిం తపోధనమ్ ॥ 1
తతశ్చ జనయామాస వాత్స్యం భృగకులోద్వహమ్ ।
తతోఽష్టసవతిం పుత్రాన్ గోత్రాకారాన్ పృథక్ పృథక్ ॥ 2
గాధేరపి తదా భార్యా జనయామాస పుత్రకమ్ । విశ్వామిత్ర మితిఖ్యాతం యుతం బ్రాహ్మణ తేజసా ॥ 3
జితో యుద్ధే వసిష్ఠేన మన్యునా యస్స పార్థివః । బ్రాహ్మణ్యం తపసా లేభే ధర్మాత్మా సంశితవ్రతః ॥ 4
రాజా ప్రసేన జిన్నామ సుతాం తస్యాథ రేణుకామ్ । పత్న్యర్థే ప్రతి జగ్రాహ జమదగ్ని ర్మహా తపాః ॥ 5
సాతం వనగతం భర్త్యా నిత్యం పర్యచరత్ వనే । కదాచి దథ ఘర్మర్తౌ మధ్యం ప్రాప్తే దివాకరే ॥ 6
క్రీడార్థం ప్రాస్యతి చిరం జమదగ్ని ర్మహా తపాః । క్షిప్తాః క్షిప్తాః శరాస్తేన రేణుకా చారులోచనా ॥ 7
ఆనయామాస ధర్మజ్ఞా భర్తుర్వచన కారిణీ । అథార్కతాప సంతప్తా దహ్యమానాక్షి పంకజా ॥ 8
పుష్పితస్యచ వృక్షస్య ఛాయా మాసాద్య విష్టితా । విశ్రమ్యతుముహూర్తం సా భర్తుర్నిన్యే శరోత్తమమ్ ॥ 9
తాం ప్రాప్తాం కుపితో భర్తా జమదగ్ని రభాషత । క్రీడతో మే శరై ర్భద్రే ! విఘ్నం కిం కృతవత్యసి ॥ 10
న బిభేషి చ మాం భద్రే ! త్వథ వాప్యవ మన్యసే ॥ 11

రేణుకోవాచ :

అర్కాగ్నితాప సంతప్తా క్షణమాత్రం మహావ్రత ! । అపారయన్తీ విశ్రాన్తా తస్మాత్త్వం క్షంతు మర్హసి ॥ 12

మార్కండేయ ఉవాచ :

రేణుకాయా వచశ్శ్రుత్వా జమదగ్ని ర్మహాతపాః । జాతరోషస్తదా సూర్యే సాయకాన్ క్షేప్తు ముద్యతః ॥ 13
ఏతస్మిన్నేవ కాలేతు విప్రరూపో దివాకరః । శీఘ్ర మాగమ్య తేజస్వీ జమదగ్ని మభాషత ॥ 14

సూర్య ఉవాచ :

స్వభావ ఏషమే బ్రహ్మన్ ! యదహం దహనాత్మకః । వర్తతశ్చ స్వభావేన నమేత్వం క్రోద్ధు మర్హసి ॥ 15
పుత్రస్తేఽహం భవిష్యామి త్వస్యామేవ ద్విజోత్తమ ! । సురకార్యం కరిష్యామి లోకానాంచ హితం మహత్ ॥ 16
ఇయంచ పత్నీ ధర్మజ్ఞా రేణుకా తవ సాంప్రతమ్ । ఛత్రోపానహ మేతన్మే గృహ్ణాతు వరవర్ణినీ ॥ 17
తస్యానుకంపయా ఛత్రం తథా బ్రహ్మన్ ఉపానహౌ । మయా సృష్టౌ జగత్యస్మిన్ ! నిత్యమేవ భవిష్యతి॥ 18
ఛత్రోపానహయో ర్దానం లోకేశ్రేష్ఠం భవిష్యతి । ఛత్రోపానహ దానేన నర స్స్వర్గం గమిష్యతి ॥ 19
ఏవముక్తస్తు సూర్యేణ జమదగ్ని ర్మహాతపాః । సంపూజ్య సూర్యం జగ్రాహ సవితు స్సకలం వచః ॥ 20
తతస్సూర్యే గతేదేవీ సూర్య పుత్రాపురా సతీ । పుత్రం కనీయసం రామం జనయామాస రేణుకా ॥ 21
తమన్వావ సుషేణశ్చ వసు ర్విశ్వావసుస్తథా । తేషాం జఘన్యజో రామో విష్ణు ర్మానుష రూపధృక్ ॥ 22
అంశేన జాతేభువి దేవదేవే సునిర్వృతా భూమి రభో బభూవ ।
హృతాం చ మేనే దితిజ ప్రజాతాం పీడాం నృణాం స్వస్యచ సా ధరిత్రీ ॥ 23

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే రామోత్పత్తిర్నామ
పంచ త్రింశత్తమోఽధ్యాయః.

మార్కండేయుడనియె : సత్యవతి యీమాటలాలించి నెలలునిండ ధర్మజ్ఞుడు తపస్వియునైన జమదగ్నిం బ్రాహ్మణు గనెను. భృగుకులోద్ధారకుని వాత్స్యుని నాతరువాత ప్రసవించెను. అటుపైని గోత్ర ప్రవర్తకులయినవారిని తొంబదియెనిమిదిమందిని గనెను. గాధి భార్య బ్రాహ్మణతేజస్సంపన్నుడయిన యొక్కని విశ్వామిత్రుని బుత్రునింగనెను. వశిష్ఠునిచే నతడోడిపోయి దీక్షబూని తపస్సుచే బ్రాహ్మణ్యమును బొందెను. జమదగ్ని ప్రసేనజిత్తు కుమారిని రేణుకను బరిణయమాడెను. ఆయన క్రీడార్థము (ఆటగా) బాణములను విసరుచుండెను. వానిని రేణుక భర్త యానతిం దెచ్చి మరలమరల యందించుచుండెను. అట్లు కొంతపడి సన నామె సూర్యతాపమున దపించి పాదపద్మములుకాల నలసి యొక పుష్పించిన చెట్టునీడను నిలువబడెను. ఒకముహూర్తమట్లట విశ్రమించి భర్త విసరిన బాణమును గొనితెచ్చెను. అంత నతడు కుపితుడై బాణములతోనాడుకొనుచున్న నా యాటకు విఘ్నము సేసితివేల ? నేనన్న భయములేదా? లేక నన్నవమానింతువా ? యన రేణుక సూర్యువేడిమికుడికెత్తి యొక క్షణ మేమియుం జేయలేక విశ్రమించి, తిని. ఓ మహాతపస్వీ ! దానికి నన్ను క్షమింపదగుదువు. అనవిని జమదగ్ని రోషముగొని సూర్యునిపైకి బాణముల జిమ్మబూనెను. ఈసమయమందే సూర్యుడు బ్రాహ్మణరూపియై సత్వరమువచ్చి జమదగ్నితో నిట్లనెను. బ్రహ్మణ్యుడా ! అగ్నిస్వరూపుడనగుట నిది నా స్వభావము. నైజప్రవర్తనుడనైన నాయెడ నీవు కోపపడదగదు. ఈమెయందే నేను నీ పుత్రుడ నయ్యెదను. దేవతల కార్యమును లోకహితమును నొనరింపగలను. ఈమె నీ ధర్మపత్ని సుకుమారమూర్తి. ఇదిగో యీ గొడుగును పాదుకలను నీవె యిపుడు గైకొనుగాక ! ఆమెయెడల జాలిచే ఛత్రమును ఈ పాదుకలను నేను సృష్టించితిని. ఇప్పటినుండి యివి జగత్తునందుగూడ నుపయుక్తములు కాగలవు. గొడుగును ఉపానహములను (చెప్పులజోడును) దానముసేయుట చాల శ్రేష్ఠముకాగలదు. వానిం దాన మిచ్చి నరుడు స్వర్గముం బొందును. అనవిని మహాతపస్వి జమదగ్ని భాస్కరుని బూజించి యాయన మాటలనెల్ల గైకొనెను. (అంగీకరించెను) అప్పల భానుండు నన నా రేణుకాదేవి సూర్యుడు తన కుమారుడుగానైనదై (సూర్యతేజస్సు గర్భమునందు ప్రవేశించినదన్నమాట) రాముని (పరశురాముని) కడగొట్టుబిడ్డగా గనెను. అతనికి ముందు పుట్టినవారు సుషేణుడు వసువు విశ్వావసువు ననువారు. వారితరువాత పుట్టినవాడు రాముడు. సాక్షాద్విష్ణువే మానుషరూపము ధరించినాడు. మహావిష్ణువు తన యంశముతో నవని నవతరించినంతట భూదేవి మిక్కిలి సంతృప్తిని సంతోషమును బొందినది. రాక్షసముఖ్యులవలన నరులకుం దనకు గలుగు చున్న పీడ యింతతో విరగడయైనట్లు తలంచెను,

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున పరశురామావిర్భావమను ముప్పదియైదవ యధ్యాయము.

## ముప్పది ఆరవ యధ్యాయము - పరశురామునకీశ్వరాజ్ఞ

మార్కండేయ ఉవాచ :

అథ బాల్యం సముత్తీర్ణో రామో భృగు కులోద్భవః । శుశ్రూష మాణః పితరం నిత్యమాస్తే మహాయశాః ॥ 1
ఏతస్మిన్నేవ కాలేతు రామే వనగతే తదా । అజగామ మహాతేజాః రాజా చిత్రాంగదో వనమ్ ॥ 2
విహర్తుం సహ రామాభిర్దేవరాజ సమద్యుతిః । తం దృష్ట్వా రేణుకా చక్రే స్పృహాం భోగేషు భామినీ ॥ 3
జగామ మనసా తంసా రాజానం కామసన్నిభమ్ । తస్మిన్నేవ క్షణే సాతుభ్రష్టా బ్రాహ్మణ తేజసా ॥ 4
గతశ్రియంతు తాందృష్ట్వా జమదగ్ని ర్మహాతపాః । పుత్రా నువాచ తాన్ క్రోధా ద్ధన్యతాం జననీ స్వకా ॥ 5
తే విచార్య తతస్సర్వే మాతుర్గౌరవ ముత్తమమ్ । నైవ చక్రుః పితుర్వాక్యం తాన్ శశాప స భార్గవః ॥ 6
యూయం తిర్యక్సధర్మాణో నష్ట సంజ్ఞా భవిష్యథ । ఇధ్మభార ముపాదాయ రామోరతికరః పితుః ॥ 7
అథాశ్రమ మనుప్రాప్తః పితాతం సమచోదయత్ । జహీమాం మాతరం క్షుద్రాం రామ ! మా త్వంచిరం కృథాః ॥ 8
ఏవముక్తస్స పిత్రాతు తద్వాక్య సమనంతరమ్ । శిరశ్చిచ్ఛేద తీక్ష్ణేన రామః పరశునాతదా ॥ 9

తుతోషాథ పితా తస్య తతో ధర్మభృతాం వరః ॥ 10

జమదగ్ని రువాచ :

స్వచ్ఛందమరణం పుత్ర ! తుష్టేత్వంమయి లప్స్యసే ॥ యావచ్చ వైష్ణవం తేజస్త్వయి తిష్ఠతి పుత్రక ! 11
తావదేవ నతేయుద్దే కశ్చిజ్జేతా భవిష్యతి । భవిష్యతి చ ధర్మాత్మా రామో దశరథాత్మజః ।
రఘువంశే సముత్పన్నో విష్ణుర్మానుష రూపధృక్ ॥ 12
యదా సమేష్యతే తేన తదా వైష్ణవ తేజసా । కృతకర్మా విముక్త స్త్వంస చయుక్తో భవిష్యతి ॥ 13
తతఃపరం త్వయాపుత్ర ! నకార్యం శస్త్రధారణమ్ । ఆర్తత్రాణమృతే వీర ! స్త్రీ బ్రాహ్మణ కృతేఽథవా ॥
యథేప్సితం చాప్యపరం వరం వరయ ! పుత్రక ! 14

రామ ఉవాచ :

గురుశ్రేష్ఠ! సముత్థానం జనన్యాః కథయామ్యహమ్ । అస్మృతించ తథా తస్యాం భ్రాతౄణాంచ తథాఽస్మృతిమ్॥

జమదగ్నిరువాచ :

ఏవమస్తు మహాభాగ ! తపసా మహతా తథా । సమారాధయ దేవేశం శంకరం నీలలోహితమ్ ॥ 16

మార్కండేయ ఉవాచ :

ఏవముక్తే సముత్తస్థే రేణుకా చారుహాసినీ । రామస్య భ్రాతర స్సర్వే ముక్తశాపా స్తథైవతే ॥ 17
పిత్రా రామ స్తథోక్తస్తు హిమవత్యచలోత్తమే । తపస్తేపే మహాతేజా రుద్రారాధన కామ్యయా ॥ 18
ఏతస్మి న్నేవ కాలేతు దేవా స్సేంద్ర పురోగమాః । సైంహికేయ భయత్రస్తాః శంకరం శరణంగతాః ॥ 19

మార్కండేయు డనియె : భృగుకులోద్ధారకుడు రాముడు బాల్యదశను దాటి తండ్రిని నిత్యము శుశ్రూషించుచుండెను. అతడడవికేగినతరి చిత్రాంగదుడను రాజు వనమునకు వచ్చెను. అందత డింద్రునితో సమమయిన దీప్తితో దన సుందరీజనముతో విహరింప జూచి జూచి రేణుకాదేవి యా భోగానుభవమునకు ముచ్చటపడెను. మన్మథునట్లున్న యా రేని యెడ మనసుపడెను. దాన నాక్షణమ బ్రాహ్మణతేజస్సుచే విహీనయయ్యెను. మహాతపస్వి జమదగ్ని వెలవెలవోయిన యా యింతింగని కనుగొని యామెను జంపుడని కొడుకుల కానయిచ్చెను. వారు తల్లి గౌరవము నాలోచించి తండ్రిమాటను జరుపకయే పోయిరి. భార్గవుడు వారింగని మీరు పశుపక్ష్యాది లక్షణములొంది యూరుపేరులేకుండ బొండని శపించెను. అడవికేగి సమిధల మోపు గొని వచ్చిన రాముడు తండ్రికి చాల ప్రీతికరు డాశ్రమమున కేతెంచెను. తండ్రి యీ నీచురాలి నీ తల్లిని జంపుము, ఆలసింపకుమని నామాట విన్న యాక్షణమ గండ్రగొడ్డలింగొని యామె శిరస్సు నరికెను. అంతట తండ్రి ధార్మిక శ్రేష్ఠుండు సంతోషించెను. మరియు నాకొడుకుతో నేను సంతుష్టినందితిగాన నీవు స్వచ్ఛందమరణము గలవాడవయ్యెదవు. నీలో విష్ణుతేజస్సున్నంతదాక యుద్ధమందు నిన్నెవడు జయింపనేరడు. దశరథుని కొడుకై ధర్మాత్ముడు రాముడవతరించును. రఘువంశమందు సాక్షాద్విష్ణువు మానుషరూపధారియై వచ్చును. నీవాతనిం గలిసికొన్నతరి నాతడు వైష్ణవతేజస్సుతో గూడికొనును. నీవు వచ్చినపని సమాప్తియై నీవా విష్ణుతేజస్సుతో విడివడుదువు. ఆతరువాత నీవు శస్త్రముం బట్టవలదు. బాధలోనున్న వారిని రక్షించుటకుతప్ప నీ కామీదట నాయుధముపనిలేదు. ఇదిగాక యింకను నీవలచిన కోరికను నడుగుమన పరశురాముడు గురుశ్రేష్ఠా ! మా అమ్మయొక్క యుత్థానమును (లేచుట బ్రతుకుట) నే నడుగుచున్నాను. అట్లే నా సోదరులును లేవవలయును. మా అమ్మకుగాని వారికిగాని యీ జరిగిన విషయమేమాత్రము జ్ఞాపకముండనట్లు వరమర్థించెద నన తండ్రి ఇట్లేయగును. మహాభాగా ! నీవు మహాతపస్సుచేసి నీలలోహితుని శంకరుని దేవేశ్వరు నారాధింపుము అని యమ్మని యనిన యాక్షణమ రేణుక చక్కగ నల్లన నవ్వుచు లేచెను. రాముని భ్రాతలందరునట్లే శాపముక్తులైరి. తండ్రిచే నట్లానతీయబడి రాముడు హిమాలయ గిరిశ్రేష్ఠమునందు రుద్రు నారాధింపగోరి దపస్సు సేసెను. ఈసమయమందే ఇంద్రాది దేవతలు సైంహికేయుని వలన జడిసి శంకరుని శరణందిరి. వారిట్లు విన్నవించుకొనిరి.

దేవాః ఊచుః :

భగవాన్ ! దేవదేవేశ ! ప్రణతార్తి వినాశన ! సైంహికేయై ర్వయం సర్వైః స్థానేభ్య స్త్వవరోపితాః ॥ 20

సైంహికేయా సథాశ్రిత్య దైత్యా శ్శతసహస్రశః । సర్వే వసన్తి సతతం తేషాం యత్నం వధే కురు ! 21

మహాదేవ ఉవాచ :

శృణ్వన్తు దేవతా స్సర్వాః దానవా దేవకంటకాః । రామేణాహం వధిష్యామి నరబుద్ధ్యా యత స్తు తాన్ ॥ 22

మార్కండేయ ఉవాచ :

గతేషు దేవసంఘేషు దేవదేవః పినాకభృత్ । ఆహూయ భార్గవం రామ మిదం వచన మబ్రవీత్ ॥ 23

మహాదేవ ఉవాచ :

సైంహికేయాన్ దురాచారా నసురాన్ జహి పుత్రక !
సమర్థస్తాన్ భవాన్ హన్తుం నాఽన్యః కశ్చన విద్యతే ॥ 24

రామఉవాచ :

అస్త్రగ్రామం సమగ్రం మే ప్రయచ్ఛ భగసూదన ! । యేనతాన్‌సుదురాచారాన్ ఘాతయిష్యామి దానవాన్ ॥ 25

మహాదేవ ఉవాచ :

కింతవాస్త్రైః భృగుశ్రేష్ఠ ! విష్ణు స్త్వం నాఽసి మానుషః । వ్యస్త్రస్యాపిన తేశక్తా యోద్ధుం ప్రముఖత స్తవ ॥ 26

రామ ఉవాచ :

ఘాతయిష్యా మ్యహం సర్వాన్ సైంహికేయాన్ దురాసదాన్ ।
త్రిపురారే ! మహాభాగ ! త్వదాజ్ఞా పరిబృంహితః ॥ 27

మార్కండేయ ఉవాచ :

ఇత్యేవముక్త స్త్రిపురాంతకేన రామస్త్రినేత్రప్రతిమ ప్రభావః ॥
ఆదాయ తీక్ష్ణం పరశుం జగామ యత్రస్థితా స్తే చరిపు ప్రధానాః ॥ 28

ఇతి శ్రీ విష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్ర సంవాదే రామస్య మహేశ్వరాదేశో నామ షట్త్రింశత్తమోఽధ్యాయః.

భగవంతుడా ! దేవదేవా ! ప్రణతార్తిహర ! హర ! సైంహికేయులు (సింహిక - కశ్యపుని భార్య, ఆమె కొడుకులు రాక్షసులు) మమ్మందరం బదభ్రష్టులం జేసిరి. వేలకొలది రాక్షసులా సింహికా సంతానము నంటజేరియున్నారు. వారిని వధింప యత్నమొనరింపుమన మహాదేవుండు వినుడు—దానవులు దేవకంటకులు. వారల నేను రాముని సాధనముగాగొని నరుడనుతలంపున నటించి వారలంగూల్చెదను. నావిని దేవతలరుగ పినాకపాణి మహాదేవుడు రాముం బిలిచి నాయనా ! దురాచారులైన సైంహికేయులను నీవు సంహరింపుము. వారిం జంపుటకు నీవు సమర్థుడవు. ఇంకొకడులేడు. అనవిని ఓ భగసూదన ! సమగ్రమైన యస్త్ర గ్రామము నాకనుగ్రహింపుము. ఆ దుష్టదానవులం దాన హతమొనర్చెదననగా మహాదేవుడిట్లనెను—నీకు అస్త్రముతో పనియేమి ? నీవు మనుష్యుడవుగావు. విష్ణుదేవుడవు. అస్త్రరహితుడవైనను నీయెదుట నిలువబడి వీరు యుద్ధము చేయజాలరనగా—రాముడు ఓ త్రిపురారీ ! మహానుభావా ! నీ యాజ్ఞచే నుపబృంహితుడనై (పరాక్రమ ప్రభావములు పెంపొందినవాడనై) దురాసదులైన సైంహికేయులను హతమొనర్చెదను. ఇట్లు త్రిపురాంతకుడాసతీయ త్రినేత్రునితో సమమగు ప్రభావముగలవాడై పరశురాముడా శత్రు ముఖ్యు లెటనున్నారటకు పదునైన గండ్రగొడ్డలిం గొనియేగెను.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున పరశురామునికీశ్వరాజ్ఞయను ముప్పదియారవ యధ్యాయము.

# ముప్పదియేడవ యధ్యాయము - ఉత్పాత వర్ణనము

మార్కండేయ ఉవాచ :

ఏతస్మిన్నేవ కాలేతు కాష్ఠోదర్కాస్సుదారుణాః । బభూవు స్సుమహోత్పాతాః సైంహికేయ నివేశనే ॥ 1
చచాల శబ్దం కుర్వాణా మహీ సవన కాననా । పపాత మహతీ చోల్కా మధ్యే నాదిత్య మండలాత్ ॥ 2
అపర్వణి శశాంకార్కౌ సంఛన్నౌ తమసా తథా । ప్రవృష్టాశ్చ తథా రక్తం భూరి మేఘా భయా వహామ్ ॥ 3
శస్త్రాణిముముచుః ధూమ మసకృ దశ్రువాహనాః । ఇంద్రచాప సవర్ణేన పరివేషేణ భాస్కరః । 4
పరిష్టష్ట ఉభే సంధ్యే చంద్రశ్చ సకలాం నిశామ్ । సైంహికేయో విపత్యోఽపి సాల్వస్య సుమహాత్మనః ॥ 5
ఆక్రమ్య జన్మనక్షత్రం కేతు స్తస్థౌ మహాగ్రహః । వవుః తీక్ష్ణః మహావాతాః క్షోభయన్తో దిశోదశ ॥ 6
భాను శ్చాసీత్ కబంధాంకో మృగాశ్చాసన్ నస స్వనాః । న్యలీయన్త ధ్వజాగ్రేషు దానవానాం దురాత్మనామ్ ॥ 7
క్రవ్యాద పక్షీ సంఘాతాః హ్యాపసవ్యం భయానకాః । శుష్కేంధన సమృద్ధోఽపి న జజ్వాల హుతాశనః ॥ 8
వపూంషి దానవేంద్రాణాం నప్రాకాశన్త యాదవ ! ఉష్ణశీత విపర్యాసః ఋతూనా మప్యదృశ్యత ॥ 9
ప్రసుస్రువుః ద్రుమాః రక్తం వ్యశీర్యన్త చ భూషణాః । ఖరా గోషు వ్యజాయన్త మార్జారా మూషికాసు చ॥ 10
అకాలే పుష్పితా వృక్షాః అకాలే ఫలితా ద్రుమాః । వినా వర్షం మహానద్యః ప్రతీపం జగ్ముః రోజసా ॥ 11

భయానకాన్ జాత భయః సుఘోరానుత్పాత సంఘాన్ప్రసమీక్ష్య రాజా ।
సాల్వస్సమాహూయ భృగో స్తనూజం దైత్యైః స్సమేతోఽథ చకార మంత్రమ్ ॥ 12

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే ఔత్పాతికం నామ
సప్తత్రింశత్తమోఽధ్యాయః

మార్కండేయుడనియె : సైంహికేయగృహమునందలి దారుణములైన కాష్ఠోయుత్పాతము లిదేసమయమునందు గోచరించినవి (పర్వాణీ దిక్కులందు గోచరించిన) వనములతో (తోపులు) కాననములతో కొండలతో గూడిన భూమి పెటపెట ధ్వనిసేయుచు గంపించెను. ఆదిత్యమండలము నుండి పెద్ద కొఱవిపడెను. పూర్ణిమ అమావాస్యలందేకాక యితర సమయములందును సూర్య చంద్రుల చీకటులలుముకొనెను. మేఘములు భయంకరముగు రక్తమును ధారాపాతముగ వర్షించెను. శస్త్రములు పొగను జిమ్మెను. గుఱ్ఱములు (వాహనములు) నిరంతరము కన్నీళ్ళుగార్చినవి. సూర్యుడింద్రధనుస్సుంబోలిన పరివేషముచే నుభయసంధ్యలందు జుట్టుకొనెను. సూర్యుని జుట్టు గుడికట్టెనన్నమాట. చంద్రుడు రేయెల్ల పరివేషావృతుండయ్యెను. అప్పుడు రాజైయున్న సాల్వుని జన్మనక్షత్రమును సింహికా తనయుడగు నపతికొడుకయ్యు రాహువును కేతువు నతిక్రమించి యుండెను. పదిదెసలను క్షోభింపజేయుచు తీక్ష్ణములైన పెనుగాలులు వీచెను. సూర్యునందు మొండెముల గుర్తులు గోచరించెను మృగములు దుస్స్వనముల జేసెను. రాక్షసుల టెక్కెములందు క్రూరజంతువులు పక్షులు నపసవ్యముగ నెగిరి క్రమ్ముకొన్నవి. ఎండుకట్టెలు సమృద్ధముగ నున్నను యగ్ని జ్వలింపదయ్యెను. దానవపతుల శరీరములు ప్రకాశహీనములయ్యెను. ఋతువుల చలువవేడి స్వభావము తారుమారయ్యెను చెట్ల నుండి రక్తము స్రవించెను. భూషణములు తెగవిడిపోయినవి. గోవులకు గాడిదలు, ఎలుకలకు పిల్లులు పుట్టెను. చెట్లకాలమున పుష్పించెను. ఫలించెను. వర్షములేకయే నదు లెదురుగ పారినవి సాల్వరాజా విపరీతములు భయంకరములయిన యుత్పాతములం జూచి శుక్రాచార్యుల రావించి దైత్యులతో గూడియు నాలోచనమొనరించెను.

ఇది శ్రీ విష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున ఉత్పాతవర్ణనమను ముప్పదియేడవ యధ్యాయము.

## ముప్పది ఎనిమిదవ యధ్యాయము - శుక్రసాల్వసంవాదము

మార్కండేయ ఉవాచ :

రత్నచిత్రాం సువిపులాం సమాసాద్య సభాం తదా ! సింహికా తనయః సాల్వః శుక్రం వచన మబ్రవీత్ ॥ 1

సాల్వ ఉ. చ :

దృశ్యన్త ఏతే భగవ న్నుత్పాతాః ఘోర దర్శనాః । ఆచక్షణా మహాయుద్ధం వినాశమపిదారుణమ్ ॥ 2

రిపుం న చైవ పశ్యామో యేన యుద్ధం భవిష్యతి । సర్వజ్ఞత్వా ద్భవాన్వేత్తి తన్నః ప్రబ్రూహి పృచ్ఛతామ్॥ 3

శుక్ర ఉవాచ :

ఆరాధ్య దేవం బ్రహ్మాణం తపసా సింహికాపురా । త్రి దశేభ్యో హ్యవధ్యత్వం స్వసుతానా మలబ్ధ సా ॥ 4

వరదాన కృతోత్సాహైర్భవద్భి ర్విద్యయా మమ । నిర్జితా స్త్రి దశాస్సర్వే శంకరం శరణం గతాః ॥ 5

తేన యుష్మ ద్వధార్థాయ విష్ణుర్మానుషరూప ధృక్ । జమదగ్ని సుతో రామః ప్రేషితో రణకర్కశః ॥ 6

సదాదేవో మహాతేజాః మానుషం సతు సాంప్రతమ్ । మనుష్యాచ్చ భయం ఘోరం బుద్ధ్యస్వాఽసురస త్తమ! 7

సాల్వ ఉవాచ :

భగవన్ ! సర్వదేవానా మీశ్వరో మధుసూదనః । తస్మా త్పరతరం దేవం నాన్యం కంచన శుశ్రుమ ॥ 8

కిమర్థం స మహాతేజాః శంకరస్య మహాత్మనః । ఆజ్ఞాకారీ భృగుశ్రేష్ఠ ! సైంహికేయం జిఘాంసతి ॥ 9

శుక్ర ఉవాచ :

యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి దానవ ! । అభ్యుత్థాన మధర్మస్య తదాత్మనం సృజత్యసౌ ॥ 10

కదాచిద్దైత్య దేవేషు కదాచిన్మనుజేషుచ । కదాచి దథ తిర్యక్షు జ్ఞాత్వాకార్యబలాబలమ్ ॥ 11

యదా భవతి దేవేషు దేవవచ్చేష్టతే తదా । తిర్యక్షు చ యదా దేవ స్తిర్యగ్వ చ్చేష్టతే తదా ॥ 12

యదా భవతి మానుష్యే తదా భవతి మర్త్యవత్ । మానుష్యంరూప మాసాద్యతపసా త్రిపురాంతకమ్ ॥ 13

ఆరాధయామాస హరం స్వదేహే పరమం నృప ! । సతు దేవవరస్యాజ్ఞాం పురస్కృత్య మహాతపాః ॥ 14

యుష్మ ద్వధార్థమాయాతి రామేణ కృత లక్షణః । తస్మాచ్ఛుక్రేణ సంధానం భవతో మమ రోచతే ॥ 15

త్రివిష్టపంచ దేవానాం భవ త్వసురస త్తమ ! । పాతాలనిలయా యూయం నివసధ్వం గత జ్వరా ః ॥ 16

అహం నివారయిష్యామి శంకరేణ చ భార్గవమ్ । అన్యథా నివిశధ్వంచ మనుష్యేణ నిరాకృతాః ॥ 17

మార్కండేయ ఉవాచ :

ఏవముక్తాస్తు శుక్రేణ బుద్ధా దైతేయ దానవాః । ఊచు ర్వాక్యం సుసంరబ్ధా శ్శుక్రం భృగుకులోద్వహమ్ ॥ 18

మార్కండేయు డనియె : సింహికాపుత్రుడు సాల్వుడు రత్నచిత్రము సువిశాలమునైన సభకువచ్చి శుక్రునితో నిట్లనియె: భగవన్ ! ఇదుగో ఘోరములైన నుత్పాతములు ఘోరయుద్ధముయొక్క రాకడను ప్రాణులపోకడను సూచించు మహాదారుణములైన యుత్పాతములు కానవచ్చుచున్నవి. యుద్ధ మెవ్వరితో రానున్నదో యా శత్రువు కనిపించడు. తాము సర్వజ్ఞులు కావున మీరెరుంగుదురు అడుగుచున్నాము గావున మాకది యెఱింగింపవలయును. అన శుక్రాచార్యుండిట్లనియె మున్ను బ్రహ్మదేవుని ఆరాధించి సింహిక దేవతలవలన తన బిడ్డలు చావకుండునట్లు వరముం బొందెను. ఆవరదానమున మీరుత్సాహముగొని నేనిచ్చిన విద్యచే దేవతలను జయింప నాదేవతలు శంకరుని శరణొందిరి. అందుచే మిమ్ముంజంప విష్ణువు మానుషాకారముంగొని జమదగ్ని కుమారుడై పుట్టినాడు. అతడే పరశురాముడు. అతడు రణములందతి కర్కశుడు. శంకరుడే మీమీది కాతనిం బంపినాడు. ఆ దేవుడే

యిపుడు మానుషరూపమైయున్నాడు. ఓ అసురవరా ! వానివలన మీకిపుడు ఘోరభయమేర్పడినదని యెరుంగుము అన సాల్వుం డిట్లనియె. భగవంతుడా ! సర్వదేవతలకధీశ్వరుడు మధుసూదనుడు అతనికంటె మరి దైవమున్నాడని వినలేదు. అట్టి మహాతేజస్వి శంకరుని యాజ్ఞ శిరసావహించుట యెందులకు ? అతడు సైంహికేయునిం గూల్చుట యేమన శుక్రుండు ఎప్పుడెప్పుడు ధర్మమునకు గ్లాని = వాడుపాటు అధర్మమున కభ్యుత్థానము (దయ) వచ్చునో యప్పుడీశ్వరుడు తనను దానే సృజించుకొనును. అవతరించు నన్నమాట. ఒకతరి దైత్యులందు దేవతలందు ఒకప్పుడు మనుష్యులందు ఒకనాడు పశుపక్ష్యాదులందు కార్యముయొక్క బలాబలముల నెరింగి యీశ్వరుడు వచ్చుచుండును. దేవతలందవతరించినపుడు దేవుడట్లు తిర్యక్కులందు (పశుపక్ష్యాదులందు) యావిర్భవించి నపుడు తిర్యక్కులట్లు చేష్టించును మనుష్యులందవతరించినయెడ మనుష్యుడట్లు వర్తించును. మనుష్యరూపమంది తపస్సుచే త్రిపు రాంతకుని హరుని తన దేహమందే యారాధించెను. ఆ దేవేశుని వలన వరమునంది పరశురాముడుగా రూపొంది మిమ్ము వధింప నిపుడు రాబోవుచున్నాడు. కావున మీరిపుడింద్రునితో సంధిచేయుట నా కిష్టము. ఓ అసురేశ్వర ! త్రివిష్టపము (స్వర్గము) ఇపుడు దేవతలదేయగుంగాక ! మీరు పాతాళమునందు బాధలు లేకుండ సుఖముండుడు. నేను శంకరునితో భార్గవుని నివారించెద. నా మాట యిది కాదందురేని మనుష్యునిచేత నోడిపొండు. అనవిని దైతేయదానవవృద్ధులు మిక్కిలి సంరంభించి (ఉద్రిక్తులై) భృగు కులోద్ధారకుని (శుక్రుని), గూర్చి యిట్లనిరి.

దైత్యా ఊచుః :
ఏకత్రాధిష్ఠితం సర్వం జగత్ స్థావర జంగమమ్ । యద్యస్మాత్ప్రతియుద్ధ్యేత నభీస్తత్రాపి విద్యతే ॥ 19
తే వయం మానుషా ద్భీతాః నాకం త్యక్ష్యామ శత్రవే। శంకరం తం విజేష్యామో యే నాసౌ ప్రేషితో ద్విజః ॥ 20
శుక్ర ఉవాచ :
ఏకత్ర పిండితం సర్వం జగత్ స్థావర జంగమమ్ । ఏకత్ర భగవాన్ విష్ణుః జగతఃసోఽతిరిచ్యతే ॥ 21
న స శక్యో యుధాజేతుం నైవ దేవో మహేశ్వరః । తేయూయం ప్రాకృతీం బుద్ధిః త్యక్త్వా సర్వేమహాసురాః ।
సంధిం కురుత దేవేన శక్రేణామిత్ర ఘాతినా ॥ 22
శక్రకార్యే సదోద్యుక్తో దేవదేవో జనార్దనః । యేన దైత్యా వినిహతాః పూర్వే పూర్వతరాశ్చ యే ॥ 23
శంబరో నముచి శ్శంబుః కార్తవీర్యః కృతాగమః । హిరణ్యకశిపుః కేశీ హిరణ్యాక్షో మదోత్కటః ॥ 24
మధుశ్చ కైటభ శ్చైవ విటో ధూమ్రోఽతి కోపనః । హయగ్రీవో నిసుందశ్చ సుంద శ్చంద్రార్కలోచనః 25
చంద్రార్క మర్దనశ్చైవ చంద్రహర్తా రణప్రియః । సూర్య శత్రు ర్జితా మిత్రో యజ్ఞహా యజ్ఞతాపసః ॥ 26
మేఘనాదో మహారోమా మేఘవాదో భయానకః । దశగ్రీవః శతగ్రీవో మహాగ్రీవశ్చ దానవః ॥ 27
కాలః కాలకేయశ్చ కాలనేమిః సులోచనః । కాలశ్చ కాలకల్పశ్చ మకరాక్షో జనాన్తకః ॥ 28
అంతః కేశ మనో భీమో దేవాన్తక నరాన్తకౌ । క్రోధహా బహునేత్రశ్చ మహాకాలో జలాన్తకః ॥ 29
ఏకలవ్య స్స చాధారో దుర్ముఖో దుర్ధరో వడిః । ఇందు తాపన రంభౌచ రణచండ హరప్రియౌ ॥ 30
కిరీటీ గజవక్త్రశ్చ మహాసాలో విలోహితః । హ్రాదా నుహ్రాద ప్రహ్రాద వృత్రశర శర దారుణాః ॥ 31
శతభ శ్శలభశ్చైవ కూపనశ్చ మహాసురః । విప్రచిత్తి శ్శివ శ్శంకు రయ శ్శంకు స్తథైవ చ ॥ 32
అయశ్శిరా అశ్వశిరా భీమ దక్షో గుహాశయః । వేగవాన్ కేతు మా నుగ్రః సోగ్ర విగ్రో మహాసురః ॥ 33
పుష్కరః పుష్కల శ్చైవ సాల్వోఽశ్వపతి రేవచ । కుంభో నికుంభ శ్చతదా సంగ్రహో గగన ప్రియః ॥ 34
ఏతే చాన్యేచ విఖ్యాతాః దైతేయా స్సమరోద్ధతాః సర్వే లబ్ధవరా శ్శూరాః సర్వేచ గత మన్యవః ॥ 35
సర్వైః త్రిదశ రాజ్యాని కారితాని బలోద్ధతైః । తే హతాస్తేన దేవేన వాసవ ప్రియ కామ్యయా ॥ 36
కేచి న్మనుష్యరూపేణ తిర్యగ్రూపేణ చాపరే । కేచిచ్చ దేవరూపేణ విహతా భూరి తేజసా ॥ 37

ాదాచరజగమ్మెల్ల యొక్కచోట నధిష్ఠితమైయున్నది. ఏది యెవనితో ఢీకొనునో యది యట్లనే జరుగును. అక్కడ ఏనపనిలేదు. అట్టి మేము మనుష్యమాత్రుని కడలిపోయి నాకమును (స్వర్గమును) శత్రుని కెట్లు వదలెదము ? ఈ కివ్వనిచేత బంపబడెనో ఆ శంకరునే మేము గెల్చెదము అన విని శుక్రాచార్యుండు ఒకచో స్థావరజంగమాత్మక జగమైయున్నది ఇంకొకచో నావిష్ణువు భగవంతుడై జగత్తునకతీతుడె యున్నాడు. అతనిని మహేశ్వరదేవుడు గెలువనే ు మీరు ప్రాకృతబుద్ధిని విడిచి మహాసురులందరు నమిత్రఘ్నుడగు శక్రునితో సంధిసేసికొనుడు. ఇంద్రుని పనియందు నార్దనుడు నిరంతర ముద్యమించియుండును. మీ పూర్వులు పూర్వతరులెల్లరు నాతనిచే మడిసిరి. శంబరుడు నముచి ంచి యాగమవేత్త కార్తవీర్యుడు హిరణ్యకశిపుడు కేశి మదోద్ధతుడైన హిరణ్యాక్షుడు మధు కైటభులు విటుడు అ కోప ఁడు హయగ్రీవుడు విసుందుడు సుందుడు చంద్రార్కలోచనుడయిన చంద్రార్కమర్దనుడు రణప్రియుడగు చంద్రహర్త రు అమిత్రఘాతి యజ్ఞఘ్నుడు యజ్ఞతాపనుడు మేఘనాధుడు దశగ్రీవుడు శతగ్రీవుడు మహాగ్రీవుడు కాలకుడు కాలకేయుడు కోచనుడు కాలసముడు కాలుడు మకరాక్షుడు జనాంతకుడు అంతుడు కేశమనుడు భీముడు దేవాతర నరాంతకులు బహునేత్రుడు మహాకాలుడు జలాంతకుడు ఏకలవ్యుడు ఆధారుడు దుర్ముఖుడు దుర్ధరుడు వడి ఇందుతాపనుడు రంభుడు హరప్రియుడు కిరీటి గజపత్రుడు మహాసాలుడు విలోహితుడు హ్రాదుడు అనుహ్రాదుడు ప్రహ్రాదుడు వృషపర్వర దారు ండు శలభుడు కూపనుడు విప్రచిత్తి శివుడు శంకురయుడు శంకువు అయశ్శిరుడు అశ్వశిరుడు భీమదక్షుడు గుహా వంతుడు కేతుమంతుడు ఉగ్రుడు సోగ్రవిగ్రుడు పుష్కరుడు పుష్కలుడు సాల్వుడు అశ్వపతి కుంభుడు నికుంభుడు గ్రహుడు గగనప్రియుడు నను వీరు మరియితరులు ప్రఖ్యాతిగన్న దైతేయులు యద్ధోద్యతులు. వరలాభముగలవారు మన్యుదూరులు. వీరు దేవరాజ్యమేలిరి. వీరందరిని నింద్రుని ప్రియమొనరింప హరి సంహరించెను. కొందరు మున పశురూపమున కొందరు దేవరూపమున కొందరు మహాతేజస్వియగు హరిచే మడిసిరి.

ఉ :

్య మాహాత్మ్యం దేవదేవస్య శార్ఙ్గిణః । అహం స్వమరణం మత్వా తేన యో త్స్యామి భార్గవ ॥ 38

ణం శ్రేష్ఠం న హీనా ద్విజయో రణే । విష్ణోః కర వినష్టానాం భూయో రాజ్యం భవిష్యతి ॥ 39

య ఉవాచ :

ఇత్యేవముక్త స్త్వసురాధిపేన భృగుప్రధానో భగవాన్ స శుక్రః ।
జ్ఞాత్వా స దైత్యాన్ సకలాన్ వినష్టాన్ జగామ కాష్ఠామపరా మభీష్టమ్ ॥ 40

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే శుక్రసాల్వ సంవాదో నామ
అష్టత్రింశత్తమోఽధ్యాయః.

న విని సాల్వుడు-దేవదేవుడు శార్ఙ్గి (శార్ఙ్గ ధనుర్ధారి హరి) యొక్క మహిమ నేనెరుంగుదును. భార్గవ ! నేను నా చావు కో పోరనున్నాను. హీనునివలన గెలుపుకంటె విశిష్టుని (మహాశూరుని) వలని యుద్ధమరణము మేలు. విష్ణువు చేతిలో ి తిరిగి రాజ్యము వచ్చును. అనవిని శుక్రాచార్యుండా దైత్యులందరు వినష్టులైరనియే తెలిసి తనకు నచ్చిన మరియొక ను.

విష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున శుక్రసాల్వ సంభాషణమను ముప్పదియెనిమిదవ యధ్యాయము.

# ముప్పది తొమ్మిదవ యధ్యాయము - స్వప్నాధ్యాయము

మార్కండేయ ఉవాచ :

ఏవముక్త్వాగతే శుక్రే గవిష్ఠోవాక్య మబ్రవీత్ । రాజన్! శుక్రస్యవచనం క్రియతా మవిచారయన్ ॥ 1
స్వప్నాహి సుమహాఘోరా దృశ్యన్తే భయవర్ధనాః । భవతాం హి వినాశాయ రాత్ర్యన్తే సతతం విభో! 2
భవాన్ స్వప్నే మయాదృష్టో రక్తస్రగనులేపనః । ఉష్ట్రేణ శిశుమారేణ వరాహేణ తథా వ్రజన్! 3
తైలాక్తా శ్చాపరే దైత్యాః ఖరయాన ముపాశ్రితాః । పతన్తః పర్వతా దృష్టా రాజన్! తే భయకారణమ్ ॥ 4
కేచిత్ కృష్ణాంబరధరాః కేచిత్ కృసర భోజినః । కేచిత్ ప .కగతా దృష్టాః కేచిత్ భస్మశయా గతాః ॥ 5
కేచిత్ వివస్త్రయా నార్యా కృష్యన్తే దక్షిణాం దిశమ్ । కాచిద్రక్తాంబరా నారీ నీయతే దక్షిణాం దిశమ్ ॥ 6
కేచిన్నృత్యన్తి భూపాలాః హసన్తి చ తథాఽపరే । కేచిన్ముండాః మయా దృష్టా కేచిత్ కాషాయ వాససః ॥ 7
చండాల స్కంధగాః కేచిత్ కేచిత్ కంటకే సంస్థితాః । గజాశ్వ పత్తిసైన్యేన సర్వేణచ భవాన్యుతః ॥ 8
వాపీం సుకలుషాం ప్రాప్యనిమగ్నో గోమయే హ్రదే । రాజశ్రీశ్చ మయా దృష్టా శక్రాలింగన తత్పరా ॥ 9
తస్యమే రోచతే సంధి స్తవ శక్రేణ పార్థివ! । ప్రాణాన్ రక్షత! భో రాజన్! జీవన్ భద్రాణ్యుపాశ్నుతే ॥ 10

సాల్వ ఉవాచ :

యదైవ భగవాన్ విష్ణుః శ్రుత శ్శత్రు ర్మయాఽనఘ! ।
తదైవ దేవ! తచ్ఛ్రుత్వా రాజ్యం త్యక్తం తథా మయా ॥ 11
ఇష్టం యజ్ఞై స్తప స్తప్తం రాజ్యం కృత మకంటకమ్ । మూర్ధ్నిస్థిత మమిత్రాణాం సుహృదః పరిపాలితాః ॥ 12
ధృతో భృత్యజన స్సర్వః కృత కృత్యా స్తతో వయమ్ ।
గోవిందా న్మరణం ప్రాప్య భూయోరాజ్యం భవిష్యతి ॥ 13

మార్కండేయ ఉవాచ :

ఇత్యేవ వాక్యంతు నిశమ్య రాజ్ఞో మేనే తదాయుక్తతమం గవిష్ఠః ।
తూష్ణీం బభూవాథ సునిశ్చితాత్మా మేనే చ దైత్యాన్ సమరేవినష్టాన్ ॥ 14

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే స్వప్నాధ్యాయో నామ
ఏకోనచత్వారింశత్తమోఽధ్యాయః

మార్కండేయుడనియె : శుక్రుడు ఇట్లుపలికి చనగా గవిష్ఠుడనియె. "రాజా ! శుక్రుని మాట మరి విమర్శించకుండా కావింపుము. ఘోరమైన స్వప్నములు భయంకరములై కనిపించుచున్నవి. ఇవి వేకువ వేళ అగుటచే మీయొక్క వినాశము త్వరలో నున్నట్లు తెలియుచున్నది. నీవు ఎర్రని పూలమాలలను ధరించి గంధము పూసికొని ఒంటెమీద, మొసలిమీద, పందిమీద నెక్కి వెళ్లుచుంటివి. మరియు దైత్యులు నూనె పూసుకొని గాడిదల నెక్కినట్లు పర్వతములు క్రిందకు పడుసట్లు కనిపించినవి. ఇది నీకు భయమును సూచించుచున్నది. కొందరు నల్లని వస్త్రములు ధరించిరి. కొందరు బురదలో కొందరు బూడిదలో దించుకొని పోయిరి. కొందరు దిగంబర స్త్రీచే దక్షిణ దిశకు ఈడవబడుచున్నారు. ఎర్రని చీర కట్టుకొనిన ఒక యాడుది యమదిశకు గొంపోపుబడుచున్నది. కొందరు రాజులు గంతులు వేయుచు, కొందరు నవ్వుచు కనిపించిరి. కొందరు తలబోడులు కొందరు కాషాయ ధారులు. చండాలుర మూపునకెక్కినవారు కొందరు. మోదుగ చెట్లపైనున్నారు కొందరు. చతురంగ సైన్యముతో నీవు. ఆవుపేడతో నిండిన మడుగున కల్మషమైన నూతిలో మునిగినట్లు కనిపించినావు. నీ రాజ్యలక్ష్మి ఇంద్రుని కౌగలించుకొనుచు కనపడి

వాసుకే రథవస్ దైత్యా మథ్యమానే మహోదధౌ । ముఖంచ నాగరాజస్య కరేణ ధృతవాన్ స్వయమ్ ॥ 15
ఆకాశాభిముఖం కృత్వా దేవదేవో జనార్దనః । ముఖే నిశ్వాస వాతేన సవిషేణ హి భూపతే ! 16
అన్యథా దైత్య సంఘానాం వినాశ మభవిష్యత । హిమాచలాభాః కల్లోలాః క్షీరాబ్ధేః గగన స్పృశః ॥ 17
ఉత్పేతు ర్మథ్యమానస్య బలిభిర్దేవ దానవైః ॥ 18
శృంగాణి నిపతన్తి స్మ మందరస్య మహోదధౌ । రత్నచిత్రాణి రమ్యాణి శతశోఽథ సహస్రశః ॥ 19
ద్రుమాశ్చ శతశః పేతు ర్మృగాః పేతు స్సహస్రశః । త్రైలోక్యం పూరయ న్నాదై ర్రరాస పయసాం నిధిః ॥ 20
క్షీరకల్లోల వసనః శ్వేత మేఘ కృతాంశుకః । రాజతే మందరాద్రి స్స నానాధాతు విభూషితః ॥ 21
చలన్ మేఘాంశుకో ఘూర్ణన్నత్యర్థం వాయుపూరితైః । గుహాముఖై స్సప్రణతం గిరిర్మత్తై రివార్ణవః ॥ 22
నిర్ఝరాశ్రు ర్మహానాదః శృంగోచ్ఛ్రిత మహాభుజః । అనిశం స గిరిశ్రేష్ఠః స్థాన హాన్యేవ రోదితి ॥ 23
దేవోపభోగ్యాన్ సకలాన్ మహాంత ఇతి చింతయన్ । వాద్యత్సుదేవవాద్యేషు నృత్యతీవ సమందరః ॥ 24

మార్కండేయుడనియె. ఇదే సమయమందు సాల్వునకు అన్ని అవయవములు తల మాత్రమే మిగిలిన మొండెము కనిపించెను, రాహువను పేరనది ప్రసిద్ధమైనది. దానిని రాజు పూజించెను. రాహువనియె. సర్వప్రభువైన విష్ణునితో నాకు వైరమిష్టముగాదు. ఆయన కోపము చేతనే శత్రుసైన్యమర్దనుడనైన నేను అంగహీనుడనైతిని. ఆయన దయచేతనే నేను గ్రహము కూడనైతిని. ఇక నా హరిలీలను మఱియేమి వర్ణింపవలయును. అన సాల్వుడు స్వామీ! ఆ మహాత్మునిచే నీ వంగహీనుడ వెట్లయితివో గ్రహాధిపతి వెట్లయితివో వినగోరెదనన రాహువిట్లనియె. మున్నింద్రాది దేవతలమరులముగావలెనని కేశవునిట్లు స్తుతించి శరణొందిరి. భగవంతుడా ! దేవదేవేశ్వరా ! మర్త్యులకంటె (మరణబీలురైన నరులకంటె) మేమీవిషయమునఆతిశయము గలవారముగాము. కావున నీవు మాకు రక్షకుడవుగావలెనన శ్రీ విష్ణువు. పాలసముద్రమథన ప్రయత్నము సేయుడు. దానవులను గూడ యందు గూడగట్టుకొనుడు. దాన మీరు శ్రేయస్సునందగలరనియె. దేవతలిది విని దానవులతోగూడి సముద్రము మథించిరి. ఆ తఱచుటలోను విష్ణు సహాయము లేనిచో సురాసురులకడి శక్యముగానిపని. గావున ఆ హరి సంకర్షణునియంశమైన యనంతుడై మందర పర్వతమును బాహువుల పెల్లగించి పయోధిలో బడ వైచెను. అపైని గూడ కూర్మావతారుడై యా క్షీరసాగరమందురిగబడుచున్న మందరగిరిని పైకెత్తెను. తన తేజస్సుతో వాసుకి మహానాగమును తఱి త్రాడుగా గూర్చెను. అటుపై మహావేగమున దేవదానవులు సముద్రమును దఱచిరి. వాసుకి ముఖము వైపున నసురులు తోకవైపున సురలు పట్టిరి. హరి చేతితో వాసుకిముఖము వానినుండనాకాశాభిముఖముగా బట్టుకొనెను. ఆ సర్పరాజుముఖనిశ్వాసవిషవాయువుచేదైత్యులకునాశమగుననియేహరిఅట్లుచేసెనుఅతఱచుసమయమునమందరగిరిశిఖరములురమ్యములు రత్నవిచిత్రములైనవిసాగరమునబడిపోయెను.చెట్లువందలకొలదిమృగములు వేలకొలదియందుగూలెను. పయోధి నాదముచేముల్లోకములం బూరించుచు రాజిల్లెను. మందరగిరి పాలతరంగము లంబరములుగా తెల్లనిమేఘములుపైవలువగా నానాధాతు విభూషితుడై దీపించెను. మేఘములే యంశుకములుగా వాయుపూరితములైన కెరటములచే గుహాముఖముల హోరుమని మిక్కిలిగ ఘూర్ణిల్లెను కొండవాగు లశ్రువులుగా మహాధ్వనితో శిఖరములపేర బాహువులు పైకెత్తి యా గిరివరము స్థానహానికట్లు రోదించుచున్నట్లుండెను. సాగరమందలి దేవతోపభోగ్యములయిన పదార్థములు గొప్పవని దేవతలు మంగళవాద్యములను మ్రోయించుచుండ నా పర్వతము నృత్యము సేయుచున్నదా యన్నట్లుండెను.

ఏవం హి మథ్యమానస్య క్షీరాబ్ధేః సుమహాత్మనః । ప్రాదుర్భూతం విషం ఘోరం కాలానల సమప్రభమ్ ॥ 25
యేన ప్రోద్భూత మాత్రేణ విషణ్ణా దేవ దానవాః । తత్ పపౌ భగవాన్ శంభుః త్రైలోక్యహిత కామ్యయా ॥ 26
విషే కంఠ మనుప్రాప్తే నీలకంఠత్వ మాగతః । ధారయామాస తత్ కంఠే శోభార్థం సురవారితః ॥ 27
తతశ్చంద్ర కలాజాతా త్రైలోక్య స్యైవ సుందరీ । జటాజూటేన తాం చక్రే దేవదేవో మహేశ్వరః ॥ 28
రశ్మి జ్వాలా వలీ పుంజ విభాసిత జగత్త్రయమ్ । వైడూర్య కౌస్తుభం జాతం యం బభార హృదా హరిః ॥ 29

వాతరంహో మహాకాయ శ్శశాంక సదృశ చ్ఛవిః । ఉచ్చైః శ్రవాహయోజాత స్సచ దేవానుపాశ్రితః ॥ 30
తత స్సురా సముత్పన్నా సాచ పీతా మహాసురైః । తత స్త్వప్సరసో జాతాః దేవరామా మనోరమాః ॥ 31
దేవీ లక్ష్మీ స్తతో జాతా రూపేణాఽప్రతి మా శుభా ॥ 32
యస్యా శ్శుభౌ తామరస ప్రకాశౌ పాదాంబుజౌ స్పృష్టతలాంగుళీకౌ ।
జంఘే శుభే రోమ వివర్జితే చ గూఢాస్థికం జానుయుగం సురమ్యమ్ ॥ 33
సువర్ణదండ ప్రతిమౌ తథోరూ చాభోగ రమ్యం జఘనం ఘనంచ ।
మధ్యం సువృత్తం కులిశోదరాభం వళిత్రయం చారుశుభం దధానమ్ ॥ 34
ఉత్తుంగ మాభోగి సమంవిశాలం స్తనద్వయం చారు సువర్ణ వర్ణమ్ ।
బాహూ సువృత్తా వతి కోమలౌచ కరద్వయం పద్మదళాగ్రకాన్తి ॥ 35
కంఠశ్చ శంఖాగ్రనిభం సురమ్యం పృష్ఠంసమం చారు సిరా విహీనమ్ ।
కర్ణౌ శుభౌ చారు శుభ ప్రమాణౌ సంపూర్ణ చంద్రప్రతి మంచ వక్త్రమ్ ॥ 36
కుందేందు తుల్యా దశనా స్త థోష్ఠౌ ప్రవాళకానాం ప్రతిపక్షభూతౌ ।
స్పష్టా చ నాసా చిబుకంచరమ్యం కపోల యుగ్మం శశితుల్య కాంతి ॥ 37
ఉన్నిద్ర నీలోత్పల సన్నికాశం త్రివర్ణ మాకర్ణిక మక్షియుగ్మమ్ ।
శిరోరుహాః కుంచిత నీల దీర్ఘాః పికేవ వాణీ మధురా శుభాచ ॥ 38
వస్త్రే సుసూక్ష్మే విమలే దధానా చంద్రాంశు తుల్యేఽతి మనోఽభిరామే ।
శ్రోత్ర ద్వయేనా ప్యథ కుండలేచ సంతానకానాం శిరసాచ మాలామ్ ॥ 39
గంగా ప్రవాహ ప్రతిమంచ హారం కంఠేన శుభ్రం దధతీ సువృత్తమ్ ।
తథాంగదౌ రత్న సహస్ర చిత్రౌ హంస స్వనౌ చా ప్యథ నూపురౌ చ ॥ 40
కరేణ పద్మం భ్రమరోపగీతం వైడూర్యనాళంచ శుభం గృహీత్వా ।
స్వరూప మూఢేషు సురాసురేషు దృష్టిం దదౌ చారు మనోఽభిరామా ॥ 41
సా దేవ సంఘా ననురాంశ్చ దృష్ట్వా దదర్శ దేవం జగతాం ప్రధానమ్ ।
దేవా సురేభ్య స్త్వతిరిక్త రూపం సూర్యాయుతాభం భువనేష్వజేయమ్ ॥ 42
ఉన్నిద్ర నీలనలిన ద్యుతి చారువర్ణం సంత ప్తహాటక విభే వసనే వసానమ్ ।
దృష్ట్వైవ జాత పులకోద్గమ మాత్ర కంపా క్షీరాబ్ధిజా మదనబాణవశం జగామ ॥ 43

ఇతి శ్రీ విష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే సముద్ర మథనే లక్ష్మీసముద్భవోనామ చత్వారింశ త్తమోఽధ్యాయః.

ఇట్లు మధింపబడిన పాల్కడలినుండి ఘోరమయిన కాలాగ్ని సమప్రభమయి విషము పుట్టెను. అది పుట్టినంతనే దేవదానవులు విషాదగ్రస్తులయిరి. జగత్త్రియహిత మొనరింప శంభుడు దానిం ద్రావెను. ఆ కాలకూటము కంఠమున ఁగగానే యాస్వామి కాలకంఠుడయ్యెను. (ఆ విషాగ్నికి గమిరిలియాయయ్యె కంఠము నల్లబడినదన్నమాట) దేవతలది మ్రింగవలదని వారించినంత తన కుత్తుకంధరించెను. అది యొక్క వింతశోభ సమకూర్చెను. ఆ మీద చంద్రరేఖ త్రిలోకసుందరి యుదయించెను. దానిని మహేశ్వరుడు తన జటాజూటమందు సంతరించుకొనెను. రశ్మిపుంజములచే ముల్లోకముల నుద్దీపింపజేయు వైడూర్యమయి కౌస్తుభ ముదయించెను. దాని హరి యురమునం గైసేసికొనెను. వాయువేగముగలది చంద్ర సమకాంతి మహాకాయమునైన యుచ్చైశ్శ్రవ

మను గుజ్జము జనించెను. అది దేవతల వశమయ్యెను. అప్పల సుర(కల్లు) జనించెను. దాని సురలు ద్రావిరి. అటుమీద అప్సరసలు అను దేవతాసుందరు లుదయించిరి. అవ్వల అప్రతిమాన రూపవతి లక్ష్మీదేవి యవతరించెను. ఆమె పాదములు తామరపూల రంగు గలవి. అడుగుల వేళ్ళొకదానినొకటి యొత్తుకొనచుండెను. నేలనాని యుండెను. (ఇది ఉత్తమ సాముద్రిక లక్షణము.) చక్కని పిక్కలు రోమరహితములు. మోకాళ్ళు గూఢాస్థికములై మిక్కిలి చక్కగనుండెను. (మోకాళ్ళ యెముకలు బయటపడక నిండుగ నున్నవన్నమాట) తొడలు నిండుదనమువ సువర్ణదండములట్లుండెను. జఘనము (పిరిది భాగము) దృఢమును సువిశాలమునై యుండెను. నెన్నడుము వర్తులమై కులిశోదరమట్లు (ఇంద్రధనుస్సు నడిమి భాగమట్లు) విరసిల్లెను. స్తనద్వయమున్నతము నిండుదనమొంది సువిశాలమై సువర్ణ వర్ణమై యొప్పెను. బాహువులు మిగుల సుందరనై మిక్కిలి కోమలములునై యుండెను. కర యుగము తామరరేకు తుది యెఱుపున శోభించెను. కంఠము శంఖమువోలె నిండయి పరిపుష్టమై చెలువొందెను. వృష్ఠము సమమయి నరములు వెలిపడక యింపుగొల్పుచుండెను. శుభలక్షణ ప్రమాణములయిన వీనులు సంపూర్ణ చంద్ర సమమయి నెమ్మోము మొల్ల మొగ్గలట్లు జాబిల్లి యట్లచ్చపుకాంతి నిచ్చు పలువరసయు పవడములకు బ్రతిపక్షములయిన పెదవులు కోటేసినట్టి ముక్కు చక్కని చిబుకము (గడ్డము) చంద్రకాంతి గులుకు నిఱుచెక్కిళ్ళు, చక్కగ వికసించిన నల్లగలువలంబోలి ఎఱుపు తెలుపులం గలిసి మువ్వన్నెల గులుకుచు చెవిదాకన కనుగవయు, వంకరనై నల్లనై దీర్ఘములైన శిరోరుహములు వీణవలె మధురము శోభదమునైన వాణి యుంగలిగి, చంద్రకాంతి గొని అతి మనోహరములయిన అచ్చపుజిలుగు దువ్వలువలు దాల్చి, వీనులందు స్వర్ణ మహాకుండలములు మెఱయ కల్పసుమమాలం దలదాల్చి గంగాప్రవాహమట్లు వర్తులమైన హారముం గంఠమునందు గైసేసి సహస్ర రత్న స్థగితములైన బాజుబంధులును హంసధ్వనించు నందెలుందాల్చి తుమ్మెదలు రొదసేయు వైడూర్యమణి మయనాళముగల పద్మమును గరమ్మున గైకొని యతి మనోభిరామయై తమ్ముదామమరచిన సురాసురులవైపు చూపుం బ్రసరింపజేసెను. ఆ యింతి దేవదానవులం జగత్ప్రధానుడైన దేవుని (హరిని) దర్శించెను. అమ్మమహామహుడు దేవతలకంటె అసురులకంటె నతిశయించిన రూపుగొని పది వేలమంది సూర్యులట్లు దీపించుచుభువనముల కజేయుడై వికచోత్పల వర్ణసవర్ణుడై పుటములెట్టిన బంగారము తళుకు గులుకు వలువయుం బైవలువయుం దాల్చియున్న పరమసుందరుం జూచినదే తడవుగ నొడలు పులకించి కంపించి యా సుందరి క్షీరాబ్ధి కన్య మదనబాణ వశంవదయయ్యెను.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణమున సముద్రమథనమందు లక్ష్మీప్రాదుర్భావము అను నలుబదియవయధ్యాయము.

## నలుబది ఒకటవ యధ్యాయము - లక్ష్మీ స్థాన నిరూపణము

రాహు రువాచ :

సా కామబాణాభిహతా సమీక్ష్య మధుసూదనమ్ । స్వయం వృతవతీ నాథం భర్తార మపరాజితమ్ ॥ 1
ప్రకృతి స్సా వినిర్దిష్టా పురుషః పురుషోత్తమః । తయా వియుజ్యతే నాఽసౌ కదాచిదపి శత్రుహా ॥ 2
శంకరః పురుషః ప్రోక్తః ప్రకృతిః పార్వతీ స్మృతా । పురుషః పాకహా ప్రోక్తః ప్రకృతిశ్చ తథా శచీ ॥ 3
హుతాశన శ్చపురుషః స్వాహాచ ప్రకృతి స్స్మృతా ।
యమశ్చ పురుషః ప్రోక్తో ధూమ్రోర్ణా ప్రకృతి స్స్మృతా ॥ 4
విరూపాక్ష శ్చ పురుషః ప్రకృతి ర్నిరృత స్స్మృతా । వరుణః పురుషః ప్రోక్తో గౌరీచ ప్రకృతి స్తథా ॥ 5
వాయుశ్చ పురుషో జ్ఞేయః ప్రకృతి శ్చ తథా శివా । పురుషశ్చ ధర్మో వృక్షః తద్వీశ్వ ప్రకృతిః స్మృతా । 6
చంద్ర మా పురుషః ప్రోక్తో జ్యోత్స్నా చ ప్రకృతి స్తథా ॥ ధర్మ శ్చ పురుషః ప్రోక్తః ప్రకృతిశ్చ కరీషిణీ ॥
యజ్ఞశ్చ పురుషః ప్రోక్తో దక్షిణా ప్రకృతి స్తథా । దివసః పురుషః ప్రోక్తః ప్రకృతిశ్చ తథా నిశా । 8

ఆకాశః పురుషః ప్రోక్తో ప్రకృతిశ్చ తథా మహీ । ఓంకారః పురుషః ప్రోక్త స్సావిత్రీ ప్రకృతిః స్మృతా ॥ 9
ప్రకృతి స్సా శుభాలక్ష్మీః విష్ణుః పురుష ఉచ్యతే । సా సదేహా విదేహా సా సగుణా నిర్గుణా చ సా ॥ 10
తయా సర్వమిదం వ్యాప్తం త్రైలోక్యం సచరాచరమ్ ।
సా కాన్తి స్సా ధృతి స్సా శ్రీ స్సా ప్రభాచ సనాతనీ ॥ 11
సానిద్రా సా శుభా వాణీ సాచదేవీ సరస్వతీ । రతిః ప్రీతిః క్షితిః ద్యౌశ్చ సా గంగా సా సరస్వతీ ॥ 12
తుష్టిః పుష్టి ర్వపుః ప్రజ్ఞా స్వధా మేధా సరస్వతీ । సైవనద్యః శుభా సర్వాః సైవదేవీ వనస్పతీ ॥ 13
సావాస్తు దేవతా దీక్షా సా శక్తి ర్వైష్ణవీ స్మృతా । బుద్ధి ర్లజ్జా ధృతి శ్శాన్తిః సుధాశోభా జయా త్విరా ॥ 14
సినీవాలీ కుహూ రాకా త్వేవం చానుమతి శ్శుభా । కాత్యాయనీ భద్రకాళీ సుప్రభా విజయా తథా ॥ 15
అదితిర్దితిః దనుః కాలా స్సాయుః సింహికామునిః । కద్రూః క్రోధా త్విరా ప్రావా వినతా సురభిః ఖగా ॥ 16
కీర్తి ర్లక్ష్మీ ర్ధృతి ర్మేధా క్షమా శ్రద్ధా క్రియా రతిః । అనసూయా సతీ భూతిః విభూతి ర్వారుణీ తథా ॥ 17
అరుంధతీ వసుర్జామీ లోభా భాసు రరుంధతీ సంకల్పా చ ముహూర్తా చ సాధ్యా విశ్వా తథైవచ । 18
మృగా చ మృగమందాచ హరిభద్రా యువా త్విడా । భూతాచ కపిలా దంష్ట్రీ సురమా సరమా తథా । 19
రాజశ్రీః భూమి పాలానాం బ్రహ్మశ్రీ స్తద్విదాం శుభా । పుష్పశ్రీః కాననా నాం సా జయశ్రీ ర్జయినాం రణే ॥ 20
స్వర్గశ్రీః స్వర్గతానాం సా దీక్షా సా యజ్ఞ యాజినామ్ । బుద్ధి ర్బుద్ధి మతాం దేవీ క్షమా దేవీ క్షమావతామ్ ॥ 21
శిఖా వహ్నౌ ప్రభా సూర్యే జ్యోత్స్నా చంద్రే ప్రకీర్తితా ।
కాన్తిస్తారా గణస్యోక్తా సా సిద్ధిః సర్వకర్మణామ్ ॥ 22
సహస్ర నేత్రజా దృష్టిః సహస్ర నయనస్య సా । ఉపత్యకా పర్వతానాం ఫలశ్రీః సా చ శాఖినామ్ ॥ 23
మహోదధేశ్చ సా వేలా నక్షత్రాణాంచ కృత్తికా । ధనుర్లతాచ మంత్రాణాం హేతీనాం నాప్యసేర్లతా ॥ 24
గాంధారీ సర్వవిద్యానాం వృష్టి స్సా జగతీ తలే । కర్షకాణాం తథా సీతా సస్యశోభా మహీతలే 25
మదలేఖాచ నాగానాం భోగినాం చ ఫణావళీ । రత్నావళీ చ శేషస్య ధృతి ర్భూమండలస్య సా ॥ 26
సాస్థితా సతతం చంద్రే బిల్వే నీలోత్పలే వృషే । కుంజరే తురగే సింహే ఖడ్గేచ విమలే శుభే ॥ 27
చామరే వ్యజనే ఛత్రే భృంగారే గోమయే వనే । సహస్రకిరణే సూర్యే శక్రే వైశ్రవణేయమే ॥ 28
కమలే రజతే హేమ్ని శంఖే భద్రాసనే శుభే । గోమూత్రే సర్పిషి క్షీరే దధ్ని క్షీర ఫలేషు చ ॥ 29
వరుణే చ జలాధ్యక్షే సముద్రేషు జలేషు చ । కుసుమేషు చ శుక్లేషు ప్రాసాదేషు సితేషు చ ॥ 30
హుతాశనే ప్రజ్వలితే పార్థివే చారు శోభితే । రత్నేషు చ విచిత్రేషు తథై వాఽఽమలకేషు చ ॥ 31
యథా వ్యాప్తం జగ త్సర్వం దేవదేవేన శార్ఙ్గిణా । తథా వ్యాప్తం జగత్సర్వం రాజన్ ! క్షీరాబ్ధి కన్యయా ॥ 32

రాహువనియె : కామబాణవశయై యాలక్ష్మి మధుసూదనునిల గని ఎదురులేని యా స్వామిని దన స్వామింగా వరించెను. ఆ శ్రీదేవి ప్రకృతి = చిచ్ఛక్తి పురుషోత్తముడు (విష్ణువు) పురుషుడు (ఆత్మ, చిత్తు) ఆమెతో నెన్నడు నీ హరి యెడబడడు. వారి యవినాభావ సంబంధమట్టిది. శంకరుడు పురుషుడు పార్వతి ప్రకృతి, ఇంద్రుడు-శచి, అగ్ని-స్వాహాదేవి, యముడు-ధూమ్రోర్ణ, విరూపాక్షుడు-నిరృతి, వరుణుడు-గౌరి, వాయువు-శివ, ధర్మవృక్షము-విశ్వప్రకృతి, చంద్రుడు-జ్యోత్స్న(వెన్నెల), ధర్మడు-కరీషిణి, యజ్ఞము-దక్షిణ, దివసము-సిరి, ఆకాశము-మహి, ఓంకారము-సావిత్రి, విష్ణువు-లక్ష్మి,ఆమె సదేహ, విదేహ, సగుణ, నిర్గుణ ఈ విధముగ నీ చరాచర ప్రపంచమా ప్రకృతిచే వ్యాప్తమై యున్నది. ఆమెయే కాంతి ధృతి(ధైర్యము) శ్రీ ప్రభ(సనాతని) నిద్ర వాణి (శుభ) సరస్వతీదేవి. ప్రీతి క్షితి ద్యౌఃదివి = ఆకాశము గంగ సరస్వతీనది తుష్టి పుష్టి వపువు (శరీరము) ప్రజ్ఞ స్వధ మేధ సరస్వతి సర్వనదులు: వనస్పతి వాస్తుదేవత దీక్ష వైష్ణవి శక్తి బుద్ధి లజ్జ ధృతి శాంతి సుధ శోభ జయ ఇరా సినీవాలి కుహూ

చంద్రకళకానవచ్చెడి అమవాస్య. చంద్రకళకానరాని అమవాస్య రాక, (పూర్ణిమ) అనుమితి కాత్యాయిని భద్రకాళి సుప్రభ విజయ కశ్యపుని భార్యలగు అదితి దితి దనువు కాల, స్వాయువు, సింహిక, ముని, కద్రువు, క్రోధ, ఇర (కశ్యపుని యొకభార్య వృక్షలతాతృణ జాతింగన్నది) ప్రావ వినత సురభి ఖగ కీర్తి లక్ష్మి ధృతి మేధ క్షమ శ్రద్ధ క్రియ రతి అనసూయ సతి భూతి విభూతి వారుణి అరుంధతి వసువు శామి లోభ భానువు అరుంధతి సంకల్ప ముహూర్త సాధ్య విశ్వ మృగ మృగమంద హరిభద్ర యుప ఇడ భూత కపిల దంష్ట్రి సరమ సురమ రాజుల రాజ్యలక్ష్మి బ్రహ్మనేత్తల బ్రహ్మశ్రీ కాననముల కామె పుష్పశ్రీ జయశీలురకూ యుద్ధమందు జయశ్రీ స్వర్గవాసులకు స్వర్గశ్రీ యజ్ఞకర్తలకు దీక్ష బుద్ధిమంతులకు బుద్ధి క్షమావంతులకు క్షమ(ఓరిమి) అగ్నియందు శిఖ (జ్వాల) సూర్యునియందు ప్రభ చంద్రునందు జ్యోత్స్న తారాగణమునకు (నక్షత్ర పుంజమునకు) కాంతి. సర్వకర్మములకు సిద్ధి సహస్ర నయనునికి (ఇంద్రునికి) సహస్ర నయనములనుండి ప్రసరించు దృష్టి యామెయే. పర్వతములకు ఉపత్యక (పర్వతప్రాంత భూమి) వృక్షములకు ఫలశ్రీ మహాసముద్రమునకు వేల (చెలియలుగట్టు) నక్షత్రములకు కృత్తిక మంత్రములకు ధనుర్లత ఆయుధములకు ఖడ్గలత సర్వవిద్యలకు గాంధారి భూతలమందు వృష్టి(వర్షము) కర్షకులకు సీత(నాగలి చాలు)వసుంధర యందు సస్యశోభ వీస్తులకు మదరేఖ భోగులకు (సర్పములకు) ఫణావళి (పడగల వరుస) శేషునికి రత్నావళి భూమండలమునకు ధృతి (ధారణశక్తి) ఆమె చంద్రునందు బిల్వమందు (మారేడునందు) నల్లగలువయందు వృషభమందు ఏనుగునందు గుఱ్ఱమునందు స్వచ్ఛమై శుభకరమైన ఖడ్గమునందు చామరమందు విసనకఱ్ఱయందు గొడుగునందు భృంగారమందు గోమయమందు వనమందు సహస్ర కిరణుడైన సూర్యునందు శక్రునందు (ఇంద్రునందు) వైశ్రవణునందు (కుబేరునందు) యమునియందు నామెయున్నది. కమలమందు వెండియందు బంగారమందు శంఖమందు భద్రాసనమునందు (సింహాసనమందు) గోమూత్రమందు నేతియందు పాలయందు పెరుగునందు పాలపండ్లయందు జలములకధినేతయైన వరుణునియందు సముద్రములందు నీళ్ళలో తెల్లనిపువ్వులలో ప్రాసాదములయందు (సౌధములందు సున్నపు పూతచే తెల్లగనుండు మేడలందు) ప్రజ్వలించు నగ్నియందు చక్కని శుభలక్షణములచే రాణించు రాజునందు విచిత్రరత్నములందు ఉసిరికాయలందు (ఆమలకములందు) జగత్తు అంతయు విష్ణువుచే వ్యాప్తమైనట్లు ప్రపంచమంతయు క్షీరాబ్ధికన్యచే వ్యాప్తమైనది.

స్వాయంభువాన్తరే దేవీ భృగో స్సా దుహితా స్మృతా । స్వారోచిషే తథాజాతా సైవదేవీ హుతాశనాత్ ॥ 33
ఔత్తమస్యాంతరే జాతా సలిలా ద్విమలా చ్ఛుభా । తామస స్యాంతరే రాజన్ ! భూతలా త్సా సముత్థితా ॥ 34
బిల్వా త్సముత్థితా దేవీ రైవత స్యాంతరే తథా । ఉత్ఫుల్ల కమలోద్భూతా చాక్షుషేఽపి తథాంతరే ॥ 35
వైవస్వతేఽన్తరే జాతా తథైవామృత మంథనాత్ । క్షీరాబ్ధి జాతాం తాం ప్రాప్య హృదయేన జనార్దనః ॥ 36
దధార దుర్ధరాందేవీం త్రైలోక్యే త మృతే ప్రభుమ్ ।
ఆదాయ సాఽమృతం శుద్ధం శుభ మర్కా కమండలుమ్ ॥ 37
ఏతస్మి న్నంతరే జాతో వైద్యో ధన్వంతరి స్తథా । అమృతే జాత మాత్రేతు దైత్య సంఘాః సమాకులాః ॥ 38
ధన్వంతరి మథోన్మథ్య పరిభూయచ దేవతాః । అమృతం చ సమాదాయ జగ్ముర్దైత్యా నివేశనమ్ ॥ 39
హృతా మృతాన్ దేవగణాన్ విహానాశ్వాస్య దేవో భువనస్య గోప్తా । 40
స్థానే చ విన్యస్య గిరీంద్ర ముఖ్యం జగామ దేవోఽసురనాథ వేశ్మ ॥ 41

ఇతి శ్రీ విష్ణుధర్మోత్తరే మహాపురాణే-ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే అమృత మథనం నామ ఏకచత్వారింశ త్తమోఽధ్యాయః.

స్వాయంభువమన్వంతరమం దాలక్ష్మీదేవి భృగుకన్య యయ్యెను భార్గవియనం బేరొందెను . స్వారోచిషమన్వంతరమం దావిడ హుతాశనునినుండి (అగ్నినుండి) యుదయించెను. ఔత్తమమన్వంతరమందు స్వచ్ఛమైన సలిలమునుండి యవతరించెను. తామసమన్వంతరమందామె భూతలమునుండి యుద్భవించినది. రైవత మన్వంతరమున బిల్వమునుండి, చాక్షుష మన్వంతరమున

వికసించిన కమలమునుండి (వేయిరేకులుగల తామరపువ్వునుండి) ఆవిర్భవించినది. వైవస్వతమన్వంతరమందు అమృతమథనమున పాల్కడలినుండి యవతరించెను. క్షీరాబ్ధియందుదయించిన యామెను విష్ణువు హృదయముతోముల్లోకములందు ప్రభువుగాక ఇతరులకు దుర్ధర యగు (ధరింప వశముగాని) ఆ దేవిని ధరించెను. ఆమె ఈలోన సుధాపూర్ణమైన అర్కకమండలువుంగొనెను. వైద్యశేఖరుడు ధన్వంతరి యావిర్భవించెను. అమృతము పుట్టినదే తడవుగ దైత్యసంఘములాకులించి ధన్వంతరిం దొరించి దేవతలం బరాభవించి అమృతముంగొని యింటిమొగము పట్టిరి. అమృతముంగోల్పోయి అది త్రావక యట్టె చెగడొందు బృందారకులను భువన రక్షకుడగు హరి యోదార్చి మందరగిరినిదాని తావున నునిచి యసురపతి గృహమున కేగెను.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున అమృతప్రాప్తియను నలుబదియొకటవ యధ్యాయము

## నలుబది రెండవ యధ్యాయము - మోహిని అవతారము-అమృత విభాగము

రాహు రువాచ :

బభూవ నారీ కల్యాణీ సదేవో మధుసూదనః । అనిర్దేశ్య వయోరూపా సర్వ లక్షణ పూజితా ॥ 1
సమాంగుళితతా శ్లక్ష్ణే రక్తతుంగ నఖౌ శుభౌ । బిభృతే చరణౌ శుభ్రౌ గూఢ గుల్ఫౌ మనోహరౌ ॥ 2
జంఘే మనోహరే శుభ్రే స్పష్టే లోమ వివర్జితే । గూఢ సంధ్యస్థికే శ్లక్ష్ణే జానునీచ తథా శుభే ॥ 3
ఊరూ కరికరాకారౌ కదళీ దళ కోమలౌ । ఘన మా భోగి జఘనం మధ్యం కులిశ సన్నిభమ్ ॥ 4
త్రివళీ త్రిపథాధారి నాభీ పుష్కర మండితమ్ । గూఢ స్ఫికే సమే పార్శ్వే సమం పృష్ఠం మనోరమమ్ ॥ 5
సమౌ సుసంహితౌ పీనౌ కోమలౌ వగ్ర చూచుకౌ । ఆభోగినౌ మండలినౌ స్తనౌ కనక సన్నిభౌ ॥ 6
మృణాల సదృశౌ బాహూ కరౌ కోమల కోమలౌ । కంబుతుల్యం శుభం కంఠం చోన్నతా చ కృకాటికా ॥ 7
ముఖం పూర్ణేందు సంకాశం ద్విజాః కుందసమప్రభాః । అధరౌ విద్రుమాకారౌ నా సా స్పష్ట మనోరమా ॥ 8
మధూక పుష్ప సంకాశౌ కపోతౌ లలితా పుభౌ । భ్రూయుగ్మం కామ చాపాన్త సదృశం సుమనోహరమ్ ॥ 9
నాతి ప్రలంబౌ శ్రవణౌ నాత్య చారూ చ కుండలౌ । చిబుకం చ మనోహారి లలాటం శశి సుప్రభమ్ ॥ 10
కృష్ణమధ్యే సురక్తాన్తే నయనే శ్వేత భూమికే । నీలోత్పల దళాకారే దీర్ఘే చాతి మనోరమే ॥ 11
కోకిలాఽళి కులాకారం భిన్నాంజనచయ ప్రభమ్ । కేశపాశం తథా కించి ద్దధార కుటిలం శుభమ్ ॥ 12
చంద్రరశ్మి ప్రకాశేన వస్త్రయుగ్మేన భూషితా ॥ 13
రూపేణాఽప్రతిమా రాజన్ ! సర్వాలంకార భూషితా । యత్ర యత్ర పదన్యాసం కరోతి గజగామినీ॥ 14
తత్ర తత్రైవ వసుధా స పద్మైవోపలక్ష్యతే । యత్ర యత్రాఽతి మధురాం దృష్టింక్షిపతి భామినీ ॥ 15
సితాఽసితోత్పలై స్తత్ర కిరతీవ వసుంధరామ్ । యత్ర యత్ర స్థితా భాతి దేశే కనక వర్ణినీ ॥ 16
తత్ర తత్రైవ సౌవర్ణం సా కరోతి నభస్తలమ్ । తాం దృష్ట్వా చారు సర్వాంగీం మన్మథా విష్టచేతసః । 17
ప్రహ్లాద రహితా స్సర్వే బభూవు ర్దానవాస్తదా । పాదయోః పృథివీం తస్యా ధృతిం దేవీంచ జంఘయోః ॥ 18
జానుభ్యాం చ తథా క్షాన్తిం కాన్తి మూరుయుగే శుభే । ఆయతిం నియతిం లక్ష్మీం వేలాం తు జఘనే తథా ॥ 19
మధ్యే వాహాం సతీం పృష్ఠే, పార్శ్వమో శ్చ సుధాం ముఖే ।
రతిం ప్రీతిం కుచయుగే కంఠే వాణీం తథైవచ ॥ 20
జయాంచ విజయాంచైవ కరయోఃభుజయో స్తథా । శోభాంప్రభాం వక్షసి చ శ్రియం దేవీం మనోరమామ్ ॥21
అరుంధతీం చ చుబుకే జిహ్వాయాం చ సరస్వతీమ్ । జ్యోత్స్నాం కపోలయోర్దేవీం నిద్రాం నేత్రయుగే తథా॥ 22

కేశపాశే తథా రాత్రిం దిశః శ్రోత్ర యుగే తథా । భద్రకాళీం లలాటేచ నాసాయాం చ తథా శచీమ్ ॥ 23
సర్వాంగ సంధిగా నద్యో లోమస్వథ వనస్పతిమ్ । పార్శ్వయోః పర్వతా శ్చైవదై త్యేశః సర్వదేవతాః ॥ 24
దృష్టవాన్ స్త్రీతనుం తత్ర ప్రహ్లాదోఽరికులాంతకః ।
విశ్వరూపధరాం దృష్ట్వా ప్రహ్లాద స్తాంచయోషితమ్ ॥ 25
విష్ణుం మత్వా విశాలాక్షీం జ్ఞాత్వా చైవాఽమృతార్థినీమ్ ।
కామా ర్తదై త్యానుమతః ప్రహ్లాదో దై త్యస త్తమః॥ 26
ప్రదదా వమృతంతస్యై ప్రణిపత్య ప్రసాద్యచ । స్త్రీ రూప మాస్థితై ర్దేవై స్త్రైలోక్యం సచరాచరమ్ ॥ 27
స్త్రీ చేష్టమభవత్ సర్వం తస్మిన్ కాల ఉపస్థితే ।

రాహుపసియె : విష్ణుదేవుండు కల్యాణియగునొక స్త్రీ యయ్యెను. ఆమె వయస్సు రూపము నిట్టిదనరాదయ్యెను. సర్వ శుభలక్షణములచే నామె పూజనీయ యయ్యెను, ఆమె పాదముల వ్రేళ్లొండొంటినొత్తుకొనియుండెను. పాదతలము లపనితలము నత్తు కొని సున్నితములై యెరుపును యెగువునుగల నఖములు, బొద్దుగ చీలమండలుంగల్గి శుభలక్షణములు సుమనోహరములయియుండెను. జంఘలు (పిక్కలు) రోమములులేమి నచ్చపు కాంతి నతి స్పష్టములై పుష్టిగొనియుండెను. మోకాళ్ళు నునుపై నిగూఢ సంధ్యస్థిక ములై యింపునింపెను. ఊరువులు కరికరాకారములు అరటిబోదెలట్లతి మృదులములు. జఘనము(మొల)ఒత్తునుం విరివియు దటవుం గొనియుండెను. నడుమింద్రధనువట్లు వర్తులము సన్నమునయి యుండెను. త్రివళి(కడుపుమీది మూడు ముడుతలు)అనెడిత్రిపథయందు (గంగానదియందు) నాభి తామరపూవు సొంపుగొని యుండెను. స్ఫిక్కు (శ్రోణి = పిరుదులమీది భాగము) గూఢమయి (ఒత్తు గలిగినదయి) పార్శ్వములు సమములయి పృష్ఠము సమమయి మనోహరమయియుండెను, ఒండొకటి సమమయి యొత్తుకొని (ఎడ మీక) బలిసి కోమలములై మొనలుదేరి విశాలములు వర్తులములు బంగారముసొంపున నింపగులుకు కుచయుగమును తామరతూడట్లు మృదువైన బాహువులు మృదులాతిమృదులములయిన కరములు శంఖమువోలు కంఠము ఎత్తైన ముచ్చిలిగుంట (కృకాటిక) పెడతల (తల వెనుకభాగమందలి గుంట) నిండుచందురునిబోలు నెమ్మోము మొల్లమొగ్గలట్టి పలువరుస పవడమువోలు పెదవులు చక్కనిముక్కు ఇప్పపూవు వంటి చెక్కిళులు మన్మథుని విల్లువలె మనోహరాకారములయిన కనుబొమలు ఇంచుకగ వ్రేలుపీనులు మిక్కిలి చక్కని కుండలములు సుందరమగు చిబుకము (గడ్డము) చంద్రునట్లు తళుకొందు నెన్నుదురు నల్లని కనుపాపలు మిగుల నెర్రని కనుగొనలు తెల్లని భూమిక గల్గి నల్లగలువరేకులట్లు చక్కనైవెడదలైన కన్నులు కోకిలలు తుమ్మెదలు విరిసిన కాటుకకు నెనయైన వంకకొప్పు చంద్రకాంతి కెనయగు నచ్చపు తెలికట్టుచీరలుం దాల్చిసాటిలేని రూపమున సర్వాలంకారములుం గై సేసి యుయ్యంతి గజగమనయై యెటనెట నడుగులానించు నటనట నా వసుంధర యరవిందసుందరమై కానిపించెను. ఆ భామిని యెందతి మధురమగు చూపువిసరు నందందాభూమిని తెలుపునలుపుగలువ పూలం జిమ్మినట్లుండెను. ఎందెందా కనకాంగి నిలుచు నందందా గగనతలము కనకమయ మొనరించెను. ఆ సర్వాంగసుందరిని జగన్మోహినింగని ప్రహ్లాదుడొక్కడుగాక మరియెల్లరు దానవులు మదనవశులైరి. ఆమె పాదము లందు పృథివిని పిక్కలందు ధృతి దేవతను (ధైర్యాధిష్ఠానదేవతను) మోకాళ్ళయందు శాంతిని (ఓరిమిని) తొడలయందు కాంతిని జఘనమందు ఆయతిని = ప్రభావమునులక్ష్మిని వేలను చెలియలికట్ట), నెన్నడుమునందు వాహాదేవిని, పిరుదునం బార్శ్వములందును సతీదేవిని, ముఖమున అమృతమును కుచయుగమున రతిని ప్రీతిని, కంఠమందు వాణిని, చేతులందు జయను, విజయను, భుజము లందును శోభను, ప్రభను బొమ్మునందు పరమసుందరిని శ్రీదేవిని అరుంధతిని చిబుకము (గడ్డమందు) నాలుకపై సరస్వతిని చెక్కిళ్ళయందు వెన్నెలను కనుగవయందు నిద్రాదేవిని, కొప్పునందు రాత్రిని, వీనులందు దిశలను నెన్నుదుట భద్రకాళిని నాసిక యందు శచీదేవిని సర్వాంగసంధులందు నదులను లోమములందు వనస్పతిని, పార్శ్వములందు బర్వతములను, దైత్యరాజు సర్వ దేవతలుం దర్శించెను. అరి మర్దనుడైన ప్రహ్లాదు డయ్యెడ స్త్రీమూర్తిని జూచెను. చూడగనే విశ్వరూపము ధరించివచ్చిన యా దేవిని విష్ణువుగ నెరింగి యామే యమృతముం గోరుచున్నదెరింగి కామార్తులై దైత్యులనుమతింప దైత్యోత్తముడు ప్రహ్లాదు ఆమె కెఱిగి

ప్రసన్నురాలిం గావించికొని యమృత కుంభము నా సుందరిచేతి కందించెను. అత్తరి నెల్లవేల్పులు నాకు రూపుగలవారైరి. దాన చరాచర భువనత్రయమెల్ల స్త్రీ చేష్టమయ్యెను.

ఉవాచ సాస్త్రీ ప్రహ్లాదం దైత్యత్వ మమృతం వినా ॥ 28
బ్రాహ్మ మేక మహాఃసౌమ్య ! జీవితా న్న విమోక్ష్యసే । యోద్ధుమభ్యుదితా దైత్య! దేవై ర్దితి జ కారణాత్॥ 29
న ప్రబోధ్యా స్తమోయుక్తాః త్వయా దైత్య ! జనార్దనః ।
భక్తోఽసిమే సదావత్స ! సదైవ విజితేంద్రియః ॥ 30
తేన తే దర్శితా సౌమ్య ! ప్రకృతిర్యా పరా మమ । ఇత్యేవముక్త్వా ప్రహ్లాదం సోమ మాదాయ సత్వరా ॥ 31
కామార్తాన్ దితిజాన్ త్యక్త్వా జగామ సురమందిరమ్ ।
స్త్రీరూపం తత్ర సంత్యజ్య దేవరూప ముపాశ్రితః॥ 32
పాయయామాస తత్సర్వం సురాన్ సర్వాన్ సమాహితాన్ ।
మయాఽపి మధ్యే దేవానాం పీతం తత్ సూర్యరూపిణా ॥ 33
ఆదిత్యరూపే దైత్యోఽయం జ్ఞాతోఽహం శశిభాస్కరైః । నివేదిత శ్చ దేవాయ తేనాఽపిలఘు కారిణా ॥ 34
చక్రేణ పాతితం వత్స ! సభుజం మస్తకంమమ । అమృత ప్రాశనాత్ ప్రాణైర్నవిముక్తోఽస్మి దానవ ! 35
నమే కంఠా దధోభాగ మాగతం మమ చక్రిణా । శిరఃఛిన్నం మహరాజ ! తత్ర ప్రాణాస్తతః స్థితాః ॥ 36
శిరసఃఛేదనా ద్దీనం మాం దృష్ట్వా మధుసూదనః । జాతానుకంపో భగవానిదం వచన మబ్రవీత్ ॥ 37

అప్పుడా యొప్పులకుప్ప ప్రహ్లాదునితో సౌమ్యుడా ! నీవమృతములేకయే బ్రహ్మయొక్క యొక్కపగదు(బ్రహ్మకల్పము) జీవితము బాయకుండవు. దేవతలకొరకేను దైత్యులతో బోరుట కావిర్భవించితిని. జనఘాతుకులు తామసులునగు నీ రాక్షసుల మేల్కొలుపవలదు. వత్స ! నీవు నాభక్తుడవు. జితేంద్రియుడవు. అందుచే నా పరా ప్రకృతి (నైజరూపము) నీకు జూపితిని. అని పలికి జగన్మోహిని తొందరగ నా సోమమును (అమృతము) జేకొని కామార్తులయిన దైత్యులను విడిచి సురమందిరమునకేగెను. అందాడురూపు విడిచి దేవరూపముంగొని యట సమాహితులైన (పంక్తిదీరి కూర్చున్న) దేవతలను అమృతముంద్రావించెను. నేనును (రాహువన్నమాట) సూర్యునిరూపముంగొని అమరుల నడుమ నయ్యమృతముం ద్రావితిని. సూర్యచంద్రులాదిత్యరూపమున నున్న దైత్యుడని నన్ను గ్రహించిరి. విష్ణుదేవునకెరింగించిరికూడ. లఘుకారి (అవలీలగ నేపనినైన చేయగలవాడు) ఆగు హరి చక్రముచే నా భుజములతోగూడ తల నరికెను. అమృతప్రాశనము చేసితిని గావున ప్రాణములు వాయనైతిని. నాకంఠము క్రిందిభాగము నాతో రాలేదు. చక్రాయుధుడు నా తలను నరికెను. ప్రాణము లందు నిలిచెను. తల తెగి దీనుడనై (బిక్కమొగమువెట్టిన) నన్ను గని భగవంతుడు హరి కనికరించి యిట్లనియె :

పీతామృతస్య దైత్యస్య మరణం నాస్తి కర్హిచిత్ । మమ హస్తవినష్టానాంగతి ర్భవతి శోభనా ॥ 83
అమరత్వం త్వ మాసాద్య వరం వరయ కాంక్షితమ్ । తతో మయోక్తో భగవాన్ ప్రణమ్య మధుసూదనః ॥ 39
లభేయాతాం హి సోమార్కౌ మత్తో దేవ ! పరాభవమ్ ।
పూజాంచ ప్రార్థయే లోకాత్ గ్రహత్వంచ జనార్దన ! 40
ఏవముక్తస్స భగవాన్ మామువాచ తదాహరిః । గ్రహస్త్వం భవితా దైత్య! పూజాం చైవోపలప్స్యసే ॥ 41
పర్వకాలే చ సంప్రాప్తే చంద్రార్కౌ ఛాదయిష్యసి ॥ 42
తమో మూర్తి రదృశ్యశ్చ విపరీతం చరిష్యసి । భూమిచ్ఛాయా గతశ్చంద్రం, చంద్ర గోఽర్కంచ దానవః॥ 43
యస్యోదయిష్యసి యదా తదా భాగ మవాప్స్యసి । స్నానే జాప్యే తథా హోమే దానే శ్రాద్ధే సురార్చనే ॥ 44
పుణ్య స్సకాలో భవితా నిత్యమేవాఽసురేశ్వర । ఏవముక్త్వా స భగవాన్ తత్రై వాన్త రధీయత ॥ 45

పీత శేష మథాఽఽదాయ సోమం సురగణేశ్వర! । సురలోకే సన్నిహితం చకార బలవృత్రహా ॥ 46
మచ్ఛీర్ష పాతాభి వివృద్ధకోపా హృతామృతా దైత్యగణా స్సమస్తాః ।
వ్యర్థశ్రమా దేవగణా న్నిహన్తుం సన్నద్ధ సైన్యాః ప్రయయు స్తదానీమ్ ॥ 47

ఇతి శ్రీ విష్ణుధర్మోత్తరే-ప్రథమఖండే మార్కండేయ వజ్ర సంవాదే అమృత విభాగో నామ ద్విచత్వారింశత్తమోధ్యాయః.

అమృతముం ద్రావిన దైత్యుని కెవ్వడును మరణము రాదు. నాచేత హతులైనవారికి నుత్తమగతి కల్గును. నీవమరత్వమునంది వెలసిన వరుడవగుము. అను హరి పలుకు విని నేను భగవంతుని కెరగి దేవా ! నావలన సూర్యచంద్రులు పరాభవమందుదురుగాక ! లోకమందు గ్రహములలో నేనొకడనై పూజింపబడుదుముగాక ! అన విష్ణుభగవానుడు నాతో నిట్లనియె ఓ దైత్యుడ ! నీవు గ్రహ మగుదువు. పూజ్యుడవయ్యెదవు గాక ! పర్వ కాలము వచ్చినపుడు నీవు సూర్య చంద్రుల గప్పి వేయుదువు. తమోమూర్తివై (చీకటివై) ఏరికిం గానరాక విపరీతగతిం జరించుచుందువు. భూమి నీడయందుండి నీవు చంద్రుని, చంద్రునియందుండి సూర్యుని గప్పుచుందువు. ఎవని చెప్పుచుంటిని యప్పుడు ఆ భాగము నీవు పొందుదువు స్నానమందు జపమందు హోమమందు దానమందు శ్రాద్ధమందు దేవతార్చనమందు ఆ గ్రహణ సమయము పుణ్యకాలము కాగలదు. అనిపలికి భగవంతుడు హరి యటనే యంతర్ధానమయ్యెను. అంతట ద్రావగా మిగిలిన సోమము (అమృతముం) జేకొని సురపతి సురలోకమందు దానిం భద్రపరచెను. నా తల తరిగి పడగొట్టుట వలనను అమృతము గోల్పోవుటవలనను చెరిగినకోపముచే నెల్లదైత్యుల గుంపులును పడిన శ్రమయెల్ల వమ్మువోగా దేవగణముం జంప బలమ్ములం గూర్చికొని యప్పుడు దండెత్తిరి.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున అమృతవిభాగమను నలుబదిరెండవ యధ్యాయము.

# నలుబది మూడవ యధ్యాయము - దేవ దానవ యుద్ధము

రాహురువాచ :

బలిబాణ మహాకూర్మం శంబరావర్త భీషణమ్ । అసుహ్రాద మహాగ్రాహం కాలకేయ మహాజలమ్ ॥ 1
హిరణ్యాక్ష మహారత్నం ప్రహ్లాదాచల నిశ్చలమ్ । తథా నముచి కల్లోలం హ్రాద సంహ్రాద శబ్దవత్ ॥ 2
హిరణ్య కశిపూద్యోతం కాలనెమి బలాహకమ్ । అమృతా హరణ క్షుబ్ధం తదా దైత్య మహార్ణవమ్ ॥ 3
క్షుబ్ధం దైత్యార్ణవం శ్రుత్వా నిర్గతం సమరాయ చ । నిర్యయు స్త్రిదశాః సర్వే సన్నద్ధా యుద్ధకాంక్షిణః ॥ 4
తతః ప్రవర్తతే యుద్ధం ఘోరం భీరు భయంకరమ్ । దేవానాం దానవానాంచ పరస్పర వధైషిణామ్ ॥ 5
పాత్య మానేషు శస్త్రేషు కవచేషు మహాత్మనామ్ । దేవానాం దానవానాంచ హ్యుత్పేతు ర్జ్వలనార్చిషః ॥ 6
గజవాజి ఖురక్షుణ్ణ ముత్తస్థౌ సుమహద్రజః । యుగాన్తానల ధూమాభం త్రైలోక్యస్యేవ దహ్యతః ॥ 7
తస్మిన్ ప్రవృత్తే రజసి ఘోరే భీరు భయంకరే । నిర్మర్యాద మభూ ద్యుద్ధం దేవానాం దానవై స్సహ ॥ 8
తతో దైత్య సముత్థేన తథా దేవో ద్భవేన చ । రుధిరేణ మహీ వ్యాప్తా ప్రశాన్తంచ రజః క్షణాత్ ॥ 9
ధ్వజే ఛత్రే రథే నాగే చామరే వ్యజనే హయే । సర్వత్ర దృశ్యతే దైత్య రక్తం లాక్షారస ప్రభమ్ ॥ 10
తస్మిన్ యుద్ధే మహారౌద్రే దైత్య దానవ నాశనే । బభ్రముః కుంజరా మత్తాః మహామాత్ర ప్రచోదితాః ॥ 11
హతైర్వీరై స్తథైవాన్యైః కుంజరాః పర్వతోపమాః । కుర్వంతః స్వాన్యనీకాని దృశ్యన్తే శతశో రణే ॥ 12
ఛిన్న దన్తా భిన్న ధ్వజాః విహస్త చరణా స్తథా । శైలాభా పతితా స్తత్ర శోభయన్తో రణాజిరమ్ ॥ 13

బభ్రముః సాదిభిర్హీనాః హయాః సూర్యహయోపమాః । మృతాశ్చ శతశస్తత్ర దృశ్యన్తే వికృతాననాః ॥ 14
ఆగుల్ఫ మవసీదన్తి దైత్యాః శోణిత కర్దమే । రథిభిర్నిహతాః నాగాః నాగైశ్చ నిహతా రథాః ॥ 15
హయాశ్చ విద్ధా నాగైస్తు సాదిభిః కుంజరా హతాః । రథసాది గజారోహై ర్నిహతాశ్చ పదాతయః ॥ 16
పత్తినా మహతా సాదీ కుంజరో రథ ఏవచ । తతః ప్రావర్తత నదీ రుధి రౌఘ తరంగణీ ॥ 17
అస్త్రగ్రాహా ధనుర్మీనా చక్రకూర్మా మహాస్వరా । ఛత్రహంసా నాగవతీ కేశశైవల శాద్వలా ॥ 18
దైత్య శీర్షోపలా రౌద్రా తథా భీరు భయావహా । బాహుసర్పా మహావర్తా శూరాణాం హర్ష వర్ధినీ । 10
అపారగమ్యా పత్తీనాం ఫేనపుంజ సమాకులా । తస్మిన్ యుద్ధే మహాఘోరే తుములే లోమహర్షణే ॥ 20
ఆకీర్ణా వసుధా భాతి వదనైః కమలోపమైః । వివృత్తైశ్చ మహాదంష్ట్రై ర్దానవానాం మహాత్మనామ్ ॥ 21
బాహుభిశ్చాంగదైశ్చైవ రక్తచందన రూషితైః । హస్తిహస్తై ర్మహాప్రాసై రసిభిశ్చ మహాఘనైః । 22
తాలవృంతైస్తథా ఛత్రైశ్చామరై ర్యష్టిభిస్తథా । ముకుటైః కుండలైశ్చైవ శుశుభే భూ ర్విభూషితా ॥ 23

రాహువనియె: అయ్యెడ రాక్షససేన యొక మహాసముద్రమట్లేర్పడెను. అందులో బలి బాణాసురులుతాబేళ్ళు. శంబరుడొక పెనుసుడి. అనుహ్రాదుడొక పెద్దమొసలి. కాలకేయుడు నీరు. హిరణ్యాక్షుడు రత్నము. ప్రహ్లాదుడొక యచంచలమైన పర్వతము. నముచి కల్లోలము. (తరంగము) హ్లాదుడు సంహ్లాదుడునను వాండ్రు పెద్ద ధ్వని. హిరణ్యకశిపుడు వెలుగు. కాలనేమి కారుమబ్బు. తరచి యమృతము గైకొనుటచే నత్యంత క్షుబ్ధమైన దానవసముద్రము సంక్షుబ్ధమై యుద్ధమునకు బయలుదేరినట్లు విని వేల్పులెల్లరు యుద్ధకాంక్షగొని సన్నద్ధులై బయలుదేరిరి. అతి భయంకర సమరమారంభమై దేవదానవులొండొరులపై నాయుధములు విసరుకొనుచున్నంత నందుండి భీషణములయిన నిప్పురవ్వలు లేచినవి. ఏనుగుల గుఱ్ఱముల యడుగుల తాకిడిం బెనుధూళిలేచెను. ప్రళయకాలాగ్నిచే ముల్లోకములు తగలబడినంతగ పెద్ద పొగ గ్రమ్మెను. ఆ పెనుధూళి యతిభయంకరమై సంతట సంపయ్యుభయులకు నతి భీషణము హద్దుపద్దులేని యుద్ధమయ్యెను. అవ్వల దేవదానవులు తెగి తెరలిన రక్తమపనియెల్ల గ్రమ్ముకొన నా రేగిన ధూళి క్షణములో నడగిపోయెను. ధ్వజమందు (జెండాపై) గొడుగుపై రథముపై నేనుగుపై చామరముపై గుఱ్ఱముపై నెక్కడ జూచిన నక్కడ దైత్యరక్తము లత్తుకవోలె నత్తుకొనెను. దైత్యదానవు లిట్లు నమ్మహాసమరమున మావటింద్రదలింప నడలిపోయి మదపుటేనుగులు నలుదెసలకు బరువులెత్తెను. వీరలందరు నిహతులైనంత వందలువేలు దామేనుగులు మావటివానిచే చోదితములై గుంపులుగ నేర్పడి గాననయినవి. దంతములు విరిగినవి. ధ్వజభంగమయినవి తొండములుకాళ్ళుం దెగినవియునగునేనుగులారణాంగణమునకు నందముం గూర్చుచు గూలిపడెను. రౌతులు వోయిన గుఱ్ఱములు సూర్యరథాశ్వము లట్టట్లు వెఱ్ఱిపర్వులు వెట్టి వెట్టి గిట్టి మూరు మెడలు వైచి పడిపోయి కానంబడెను. ఆ రక్తపు రొంపిలో దైత్యులు మడమలదాక దిగబడి బెగడొందిరి. రథికులేన్గులను ఏన్గులు రథములం గూల్చెను. గుఱ్ఱము లేన్గులచే రౌతులచే నేన్గులుం గూల్చబడెను. గుఱ్ఱపు రౌతులచే మావటీంద్రచే కాల్బలములు గూల్పబడెను. పదాతిచే రౌతు నేనుంగు నరదముం గూల్పబడెను. రక్తప్రవాహము కెరటములుగొని యువ్వెత్తుగ నేరైపారెను. అందస్త్రములు పెనుమొసళ్ళు చాపములు చేపలు చక్రములు తాబేళ్ళు గొడుగులు హంసలు నాగపతి నాగములు (ఏనుగులు) (కొండలు)గలది. జుట్టుచే నాచు శాద్వలము (పచ్చికబైలు) గలది, దైత్యుల తలకాయలు రాతిబండలుగ బాహువులు పాములుగ నతి రౌద్రమై భయానకమై నయ్యుద్ధభూమి సుళ్ళుగలదై శూరుల కానందముం బెంచుచు పదాతి సైన్యముల కడుగుల నవ్వలికేగరానిదై నురుగుల గ్రమ్ముకొని యుండెను. మహాఘోరము తుములము నొడలు గగుర్పాటుగూర్చుచు నయ్యుద్ధము జరుగ యుద్ధభూమి దానవుల కమలములట్టి మొగములతో తెగిన దంతములతో ఎఱ్ఱచందనము పూసుకొన్న బాహువులతో బాహుపురులతో నేన్గుతొండములతో ప్రాసఖడ్గాదులతో (ప్రాసము = ఒకరకము కత్తి) కత్తులతో తాళవృంతములతో (విసనకఱ్ఱలతో) ఛత్రములతో చామరములతో కఱ్ఱలతో కిరీటములతో కుండలములతో సింగారించుకొని కాననయ్యెను.

తత స్తే దానవాః క్రుద్ధాః స్వయుద్దేన దివేప్సవః । అభిద్రవన్తి దేవేశం సహస్రాక్షం పురందరమ్ ॥ 24
దైత్యానాం పతతాం దృష్ట్వా ప్రహ్లాదం దేవ సూదనమ్ ।
ప్రత్యుద్యయౌ గజేనాఽఽజౌ దేవరాజో మహాబలః ॥ 25
హుతాశనోఽసి నముచి మనుహ్రాదం తథా శశీ । వరుణశ్చ తథా బాణం యమో దేవ స్తథా బలిమ్ ॥ 26
హిరణ్య కశిపుం రుద్రో వాయు ర్వృత్రా సురం రణే । విరూపాక్షం తథా శంభుః హిరణ్యాక్షం ధనేశ్వరః ॥ 27
అన్యేచ దైత్యాః శతశః సంయుక్తాః దేవతా గణైః । ద్వంద్వయుద్ధ సహస్రేషు తేష్వవర్తత దానవైః ॥ 28
ప్రాయశో విజితా దేవాః యయుర్భగ్నాః దిశోదశ । దానవాశ్చ జయంలబ్ధ్వా దేవా నను యయుర్బలాత్ ॥ 29
తే భగ్నాః త్రిదశాః సర్వే దానవైశ్చ వ్యభిద్రుతాః । త్రాణార్థమథ సంప్రాప్తాః నరనారాయణాశ్రమమ్ ॥ 30
దేవానా మభయం దత్వా నరనారాయణౌ తదా । శంఖ చక్రాయుధధరౌ యుద్ధాయ సమవస్థితౌ ॥ 31
నరనారాయణౌ దృష్ట్వా తత్ క్షుబ్దం దైత్యసాగరమ్ । సర్వాయుధ విసర్గేణ తయోర్యుద్ధం వ్యవస్థితమ్ ॥ 32
గజాఽభ్ర జాలసంఛన్నం శరధారౌఘ వర్షణమ్ । చలత్ ఖడ్గలతా విద్యుద్దైత్య దుర్దిన మా బభౌ ॥ 33

అవ్వల నాదానవులుడుకుమోతులై తమ పోరున స్వర్గమాక్రమింపగోరి వేయికన్నులవాని వేల్పు జేని పురందరు నెదిరింప పైబడిరి. అట్లు పైబడుచున్న వారింగని యింద్రుడైరావతమున బ్రహ్లాదుని కెదురేగెను. అగ్ని నముచిని చంద్రుడు అనుహ్లాదుని వరుణుడు బాణుని యముడు బలిని రుద్రుడు హిరణ్యకశిపుని వాయువు వృత్రాసురుని శంభువు విరూపాక్షుని ధనదుడు (కుబేరుడు) హిరణ్యాక్షుని మరియితర దైత్యు లితర దేవతలను వందలకొలదిగ దారసిల్లి ద్వంద్వయుద్ధమవిరామముగ గావించిరి. దేవత లించు మించందరు నోడి పదిదిక్కులకుం బారిరి. దానవులు గెలుపొంది వారిని వెన్నంటి తరిమిరి. దానంబెండువడి పారి వేల్పుదొరలు రక్షణకొరకు నరనారాయణాశ్రమముం జొచ్చిరి. నరనారాయణులు సురలకభయమిచ్చి శంఖచక్రాయుధములూని యుద్ధసన్నద్ధులైరి. వారినిగని దైత్యసమరసాగరము సంక్షుబ్ధమాయెను. సర్వాయుధ విక్షేపముగ వారలకు పోరుజరిగెను. అంతట నట దైత్యు దుర్దినము గోచరించెను. రాక్షసులకు పాడురోజు వచ్చినదని యొక యర్థము. వారి పాలిట మేఘచ్ఛన్నమయిన (మబ్బుగ్రమ్మిన) రోజట్లయ్యెనని రెండవ యర్థము. అందు ఏనుగులు మబ్బులుగను, బాణపరంపర వర్షము, చలించుచున్న ఖడ్గలతలు మెరుపులు.

తతశ్శరైః రుక్మవిభూషితాగ్రైస్సునేత్ర పుంఖైర్జ్వలనార్కవర్ణైః ।
బిభేద గాత్రాణి నరో రిపూణాం జహార శీర్షాణి సకుండలాని ॥ 34
నారాయణోఽప్యుత్తమ వీర్య తేజా శ్చక్రేణ చక్రం దితినందనానామ్ ।
విదారయామాస మహానుభావ స్తస్మిన్ రణే ఘోరతరే తదానీమ్ ॥ 35
వీర్యంతయో రప్రతిమం నిరీక్ష్యతేదానవా భగ్ననికృత్త యోధాః ।
హృతా మృతా జీవిత మాత్ర శేషాః వేగేన యాతా వరుణాధివాసమ్ ॥ 36
లబ్ధ్వా జయం దేవపతిర్మహాత్మా ప్రహ్లాద మాజౌ చ తథా విజిత్య ।
సంపూజయామాస మహానుభావౌ ధర్మాత్మజౌ తాపస సంఘముఖ్యౌ ॥ 37
సంపూజ్యతౌ ధర్మసుతౌ జితారిర్దైవైః ప్రహృష్టై రనుయాస్యమానః ।
జగామ నాకం త్రిదశ ప్రధానః సుఖీ బభూవాథ గతజ్వరశ్చ ॥ 38
ఏవం ప్రభావో భగవాన్ స విష్ణు ర్వైరం నమేరోచతి తేన నిత్యం ॥
సంధింకురుష్వాత్మ హితాయ రాజన్ ! శక్రేణ తేనారినిషూదనేన ॥ 39

ఇతి శ్రీ విష్ణుధర్మోత్తరే-ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే రాహువాక్యేన దేవదానవ యుద్ధవర్ణనం నామ త్రిచత్వారింశత్తమోఽధ్యాయః.

అప్పుల బంగారపు కొనలు అగ్ని సూర్యులట్లు దీపించు పుంఖములు (పుంఖము = బాణము క్రిందిచివర, పింజ) గల బాణములచే నరు డరుల మేనులం పగిలించి కుండలములతోడి తలలం గూల్చెను. నారాయణుడు నుత్తమ బలప్రతాపముల జక్రాయుధముచే నసురుల సముదాయము నా ఘోరసంగ్రామమునఁజీల్చెను దానవులాయుద్ధరి యప్రతమవీర్యముంగని యోధులుసూలితెగిపడి చావసమృతము హరింపబడి ప్రాణమాత్రావశిష్టులై వేగముగ పయణలోకమునకేగిరి.దేవేంద్రుడుగెలుపొంది ప్రహ్లాదు నయ్యుద్ధమంచట్లో డించి మహాసుఖావులు ధర్మాత్మజులు తాపసముఖ్యులునగు నానరనారాయణుల బూజించెను. అరులంగెల్చి అమరులతో వెంబడింపబడి యా త్రిదశప్రధానుడు బాధలందలింగి నాకమునసి సుఖముండెను. ఆ శ్రీమహావిష్ణువిట్టి ప్రభావముగలవాడు. అతనితో నెన్నడుసుం బగగొనుట నాకు రుచింపదు. ఆత్మహితముగోరి ఓ రాజా! నీవాతనితో నింద్రునితో సంధిసేసుకొనుము.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున దేవదానవయుద్ధవర్ణనమను నలుబదిమూడవ యధ్యాయము.

## నలుబది నాల్గవ యధ్యాయము - సాల్వుని ధర్మ ప్రసంగము

మార్కండేయ ఉవాచ :

ఏవముక్త స్తదా సాల్వో రాహుణా భీమవిక్రమః । జగాద భ్రాతరం వాక్యం సారభూత మహేతుమత్ ॥ 1

సాల్వ ఉవాచ :

అసారే గ్రహ!సంసారే నిత్యే సతత యాయిని । భవక్షయే మతిః కార్యా భవో పకరణేషువా ॥

జన్తవ స్త్రివిధా లోకే త్రిధా యేషాం విచేష్టితమ్ ॥ 2

తామసా రాజసా శ్చైవ సాత్వికాశ్చ గ్రహేశ్వర! । భవక్షయే యే విముఖాః భవోపకరణేషుచ ॥ 3

లోకద్వితయ విభ్రష్టా స్తామసా స్తే ప్రకీర్తితాః । భవక్షయ మతి భ్రష్టాః భవోపకరణే స్థితాః ॥ 4

రాజసా స్తే వినిర్దిష్టాః మధ్యస్థా స్సర్వ జన్తుషు । భవోపకరణే దైత్య!మతిర్యేషాం నవిద్యతే ॥ 5

భవక్షయే మతి ర్యేషాం సాత్వికా స్తే ప్రకీర్తితాః । తామసత్వా న్మయా దైత్య ! మతిః పూర్వం భవక్షయే ॥ 6

నకృతా; తేన తప్యామి రాజ్య తంత్ర మనుష్ఠితమ్ । మన్వంతరేఽపి సంపూర్ణే మృతిర్యేషాం గ్రహోత్తమ! ॥ 7

ఉద్విజ స్త్యేవ తే మృత్యో ర్మహ న్మృత్యు కృతం భయమ్ ।

అవశ్యం దైత్య ! మర్తవ్యం సర్వేణేహ శరీరిణా ॥ 8

సోఽహం మోక్ష పరిభ్రష్టః కామయే కేశవా ద్వధమ్ । ఇష్టం యజ్ఞైః తప స్తప్తం రిపూణాం మూర్ధని స్థితమ్ ॥ 9

మర్తవ్యే చ ధ్రువే రామాన్మరణం కామయామ్యహమ్ ।

సంప్రాప్య కేశవా న్మృత్యుం గతిం ప్రాప్స్యా మ్యనుత్తమామ్ ॥ 10

భూయో రాజ్య మవాప్స్యామి నాఽభ్రష్టో గ్రహోత్తమ! । విహాస్య వాసవం స్వర్గాత్ పరిభూయ పునఃపునః॥ 11

కథం సంధిం కరిష్యామి తేనాఽహం జీవితప్రియః । ప్రణామం దేవరాజస్య కేశవా స్మరణం వరమ్ ॥ 12

సమీక్ష్య సాధు పశ్యామి కేశవా న్మరణం రణే । శక్రేణ కృత సంధానం పాతాల నిలయంతథా ॥ 13

త్యక్ష్య న్తిమాం దైత్య గణాః వృద్ధంపతి మివాంగనాః । దివిభూమౌ తథా స్వర్గే పాతాలే గగనే జలే॥ 14

దేహినాం మృత్యు రభ్యేతి తస్య నాఽస్తి పలాయనమ్ । సర్వేక్షయా న్తాః నిచయాఃపతనా న్తాసముచ్ఛ్రయాః॥15

సంయోగా విప్రయోగా న్తాః మరణా న్తం హి జీవితమ్ । అవశ్య భావిన్యర్థేఽస్మిన్ సర్వేషాం గ్రహ! సర్వదా ॥ 16

పుణ్య భాజో హి మరణం సంగ్రామే యదిజాయతే । సోఽహం క్షత్రియ ధర్మేణ సంపూజ్య సమరే హరిమ్॥ 17

తస్మా న్మృత్యు మనుప్రాప్య గతింప్రాప్స్యామి శోభనామ్।నైవేద్యైః పుష్ప ధూపాద్యైః నతథాపూజితోహరిః॥

తోష మాయాతి దైత్యేంద్ర ! స్వధర్మేణ యథా నృణామ్ ।
భ్రాత్రా జ్యేష్ఠేన యద్వాచ్యం సుహృదా హిత మిచ్ఛతా ॥ 19
తదుక్తోఽస్మి త్వయా నాథ ! దైవాత్తన్మే నరోచతే । స త్వం గచ్ఛ మహాభాగ! దివి ద్రష్టాఽసి మాం పునః ॥
దేహాన్తరమను ప్రాప్తం గ్రహ ! దివ్యేన చక్షుషా ।

మార్కండేయ ఉవాచ :

ఇత్యేవ సాల్వస్య నిశమ్య వాక్యం కాలానురూపంచ తథా విదిత్వా ।
నకించి దుక్త్వైవ జగామ రాహు ర్దివం మహాత్మా జగతాం ప్రధానః ॥ 21

ఇతి శ్రీ విష్ణుధర్మోత్తరే-ప్రథమ ఖండే-మార్కండేయ వజ్రసంవాదే సాల్వవాక్యం నామ చతుశ్చత్వారింశత్తమోఽధ్యాయః ॥

మార్కండేయుడనియె: ఇట్లురాహువుతెలుప సాల్వుండుసోదరుని(అన్న)తో సారభూతముగ హేతువాదరహితముగనిట్లుపలికెను. ఓ గ్రహమా! సారహీనమయిన సంసారము నిత్యము జనన మరణ ప్రవాహ రూపము. సమ్యక్ సరతీతి సంసారః (ఎడతెగక పారునది యన్నమాట) కావున భవ క్షయము నెడ (పుట్టుకలేకుండు స్థితియెడల అనగా పుట్టినం జూవు నిక్కము గావున మరణము లేకుండుట యందు) మనసుంచ వలయును. లేదా సంసార సాధనములయిన విషయములందు మనసుంచ వలయును. జంతువులు మూడు విధములయిన చేష్టలను బట్టి తామసులు, రాజసులు, సాత్వికులుగా మూడు రకములయి యుండును. (1) భవ క్షయమునెడ (సంసార నాశనమునెడ) సంసార సాధనముల యెడ విముఖులయినవారు తామసులు. వారిహలోక పరలోకములు రెండింటి నుండి భ్రష్టులు. (2) సంసార క్షయమునెడ మనసుంచక సంసారోపకరణమందు (విషయ సుఖమందు) మనసుంచిన వారు రాజసులు. సర్వజీవులందు వారు నడిమి వారు. (3) సంసార సాధనమందు మనసులేక భవక్షయమందు దలంపుగల వారు సాత్త్వికులు. నా మనసు తామసమైనందున మున్ను సంసార క్షయమందు నిలుపబడలేదు. దాననే నుడికి పోవు చున్నాను. దాననే రాజ్యతంత్రానుష్ఠానమునం బడితిని. మన్వంతర కాలము బ్రదికియు మృత్యువునకు బెదరిపోవుదురు. చావు భయము చాల పెద్దది. శరీరియైన వాడు తప్పక చావవలసినదే. మోక్షభ్రష్టుడనైన యా నేను కేశవుని వలన జావుకోరుకొనుచున్నాను. యజ్ఞములుచేసినాను. తపస్సుగావించితిని. శత్రువుల నడినెత్తి నిలిచితిని. చావవలసినదే తప్పనప్పుడు ఆ చావు రాముని వలన గావలయునని కోరుచున్నాను. కేశవుని వలన జావొంది అత్యుత్తమ గతింబొందగలను. స్వర్గ భ్రష్టుడనై తిరిగి రాజ్యము పొందెదను. ఇంద్రుని స్వర్గము నుండి వెడలగొట్టి అవమానించి బ్రతుకగోరు నేను వానితో నెట్లుసంధిచేసుకోగలను ? దేవరాజునకు నమస్కారము. కేశవుని వలన మరణము మంచిది. లెస్సగ నాలోచించి చెప్పుచున్నాను. రణమందు కేశవుని వలన జావు మేలు. ఇంద్రునితో సంధి సేసికొని పాతాళమందుండు నన్ను అంగనలు ముదుసలి మగనిని వలె విడిచి లేచిపోవుదురు. అంతరిక్షమందు భూమియందు స్వర్గమందు పాతాళమందు గగనమందు నీటను ఎక్కడున్నను దేహధారులకు చావువచ్చును. దానికి పలాయనము లేదు. (అది పారిపోదన్నమాట) పెరుగుటలెల్ల విరుగుటకే. మిడిసిపాటెల్ల నడిచిపాటునకే. కలయికకు తుది యెడ నగుటయే. జీవితమునకు కడ మరణమే గదా! ఇది అందరకునవశ్యము కాగలదై యుండగా యుద్ధమందుమరణముకలిగినవారుపుణ్యాత్ములు గదా! ఆ నేను క్షత్రియ ధర్మముచే సమరమందు హరింబూజించి, యాతని వలన జావొంది శోభనగతిం బొందెదను. మానవుల స్వధర్మముచే సంతుష్టుడగునట్లు ధూపదీపాదులచే నైవేద్యములచే పూజింపబడి హరి యంతగా సంతోషింపడు. హితవుగోరిన సుహృత్తు (మంచి హృదయముగల మిత్రుడు) పెద్దన్నయునైన వానిచే నేది చెప్పవలసినదో యా మాటను నీవు నాకు జెప్పితివి. దైవవశమున నాకది రుచింపకున్నది. అట్టి నీవు మహానుభావుడవు చనుము. స్వర్గమందు దివ్యదేహమింకొకటి పొందిన నన్ను దివ్య దృష్టితో నీవు చూడగలవు. అన సాల్వుని మాట విని యది కాలాను రూపమనియు నెఱింగి యించుకేని పలుకకయే రాహువు మహానుభావుడు జగత్ప్రధానుడు దివమ్మున కేగెను

ఇది శ్రీవిష్ణుధర్మోత్తరమహాపురాణము ప్రథమఖండమున సాల్వుని ధర్మప్రసంగము నలుబదినాల్గవ యధ్యాయము.

# నలుబదియైదవ యధ్యాయము - సాల్వ నిర్యాణము

మార్కండేయ ఉవాచ :

రాహౌ దివ మసంప్రాప్తే సాల్వేరాజ్ఞి సభాంగతే । రామేణ ప్రేషితో దూతః సంప్రాప్త స్త్వకృత వ్రణః ॥ 1
స ప్రవిష్టః సభాంరమ్యాం సాల్వరాజ్ఞా చ పూజితః । పాద్యార్ఘ్యాచమనీయాద్యై ర్నిషణ్ణో వాక్య మబ్రవీత్ ॥ 2
అకృత వ్రణ ఉవాచ :

దూతోఽహం ప్రేషిత స్సాల్వ ! రామేణా క్లిష్ట కర్మణా ।
శ్రుత్వా రామస్య వచనం తతః కురు యథేప్సితమ్ ॥ 3
ఆహ త్వాం భార్గవో రామ స్త్ర్యంబకేణ విసర్జితః ।
త్వయా యుద్ధాయ దైత్యేంద్ర । సంగ్రామే క్రియతాం క్షణమ్ ॥ 4

వివాస్య వాసవం స్వర్గా ద్దేవాన్ జిత్వా సదాఽఽహవే । అనయస్యాఽస్య ఘోరస్య ఫలం ప్రాప్నుహి ! దుర్మతే ! 5
నాఽహం ప్రమత్తే విశ్వస్తే ప్రహరామి కదాచన । తేన తే ప్రేషితో దూత స్తస్మా ద్యుద్ధే స్థిరోభవ ! 6
మార్కండేయ ఉవాచ :

ఏవముక్త స్తదా సాల్వో బ్రాహ్మణం వాక్య మబ్రవీత్ । నాహం రామకృతే బ్రహ్మన్ ! సన్నహ్యామి కదాచన ॥ 7
కింతు సైన్యేన సర్వేణ సన్నద్ధేన వరూథినా । మహాదేవం విజేష్యామి యేన రామో విసర్జితః ॥ 8
సన్నద్ధ సైన్య సహితం మహాదేవజయైషిణమ్ । యది మాం యోత్స్యతే రామో హ న్తాఽస్మి తమహంమృధే ॥ 9
స త్వం గచ్ఛ ! యథాకామం రామాయ వినివేదయ ! ఏత ద్వచన మాదాయ సాల్వస్య స మహాత్మనః ॥ 10
జగామ రామం ధర్మజ్ఞం సాల్వ వాక్య నివేదితః । గత్వా శశంస రామాయ సైంహికేయ విచేష్టితమ్ ॥ 11
తేన వాక్యేన రామోఽపి రోషా ద్దైత్యపురం యయౌ । రామదూతే గతే తస్మిన్ దైత్యాన్ సాల్వః ప్రచోదయత్॥ 12
సన్నహ్యధ్వం విజేష్యామః సగణం భగ సూదనమ్ । తత స్తే దానవా స్సర్వే సాల్వవాక్యప్రచోదితాః ॥ 13
సన్నద్ధాః స్వగృహేభ్య స్తు రాజద్వార ముపాగతాః । కుంజరాణాం నినాదేన శంఖ భేరీ రవేణ చ ॥ 14

రాజద్వారే మహాన్ శబ్ద స్తుములః సమపద్యత ।
హుత్వా హుతాశనం స్నాతః సాల్వ స్సంపూజ్య చ ద్విజాన్ ॥ 15
ఆరురోహ గజం మత్తం శైలాగ్రం సవితా యథా ॥ 16
వినిర్గతం దైత్యపతిం సమీక్ష్య దైత్యేశ్వరాః కాల సమాన దర్పాః ॥
ఊచు స్తదా తం సమరేష్వజేయం జయస్వ ! శంభుం యుధి సంప్రగృహ్య ॥ 17

ఇతి శ్రీ విష్ణు ధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే శ్రీ భార్గవ రామయుద్ధే సాల్వనిర్యాణంనామ పంచ చత్వారింశ త్తమోఽధ్యాయః.

మార్కండేయుడనియె : రాహువింకను స్వర్గమున కేగనేలేదు. సాల్వుడు సభకేగెను. రాముడంపిన దూత అకృతవ్రణుడటకు రానేవచ్చెను. అతడు రమ్యమైన రాజు సభం బ్రవేశించి సాల్వరాజుచే పాద్యార్ఘ్యాచమనీయాసనాదులచే నర్చితుడై కూర్చుండి యిట్లనియె. సరళ స్వభావాచరణ శీలియైన రాముడంప వచ్చిన దూతను నేను. రాముని వచనమాలించి యాపై నేది వలతు వది సేయుము. భార్గవరాముడు, త్రిలోచనునిచే నీతో యుద్ధముసేయంబంపబడినాడు. కావుననో దైత్యేంద్ర! సంగ్రామోత్సవము నీవు సేయవలయును. ఓ దుర్మతీ! నీవెప్పుడును ఇంద్రుని స్వర్గము నుండి తరిమి దేవతలంగెల్చిన యీ ఘోరమైన యవినీతికి ఫల

మీవనుభవింపుము. నేను ప్రమత్తునిపై విశ్వసించిన వానిపై నెన్నడుం దెబ్బదీయను. అందుచేతనే దూతను బంపినాను. అందువలన నీవు యుద్ధమున సుస్థిరముగ నిలుపుము. అనని సాల్వుడు దూతగా వచ్చిన బ్రాహ్మణునితో నేను పరశురాముని కొరకుగా నెన్నడును యుద్ధసన్నాహము సేయను. కాని సర్వ సైన్యముతో బలములతో రామునింబంపిన మహాదేవునిం (శివుని) గెల్చెదను. సైన్య సన్నాహముతో శివుని జయింపగోరు నన్ను రాముడెదిరించునేని యాతనిని రణమందు గూల్చెదను. నీవు నీ యిచ్చంజని రామునికి నివేదింపుము. అన నా సాల్వుని మాటగైకొని అకృతవ్రణుండు సైంహికేయుని చర్య రామునికిం దెల్పెను. ఆ మాటచే రాముడును రోషముగొని దైత్యపురమున కేగెను. రామదూత యాతడరిగిన మీదట సాల్వుడు దైత్యులందఱింగని సన్నద్ధులుగండు. భగసూదనుని (శివుని) గణములతో మనము గెలుతుము గాక అన దానవులందరు సతని మాటచే ప్రేరితులై (సన్నద్ధులై) తమ యిండ్లనుండి రాజద్వారమున కేతెంచిరి. గజఘీంకారములచే శంఖభేరీ నినాదములచే రాజద్వారమందు పెద్ద సందడియయ్యెను. సాల్వుడు స్నానముసేసి యగ్నివేల్చి ద్విజుల పూజించి సూర్యుడు పొడుపుగొండనట్లు మదగజముపై నెక్కెను. అట్లు బయలుదేరిన దైత్యపతింగని కాలునితో నీడగు దైత్యపతులు దర్పమున సయ్యెడ సజేయుడగు సతనిని శంభునితో బోరి జయింపుమని జయ జయ ధ్వానములు గావించిరి.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తరమహాపురాణము ప్రథమఖండమున భార్గవరామయుద్ధమున సాల్వుని యుద్ధయాత్ర అను నలుబదియైదవ యధ్యాయము.

## నలుబది యాఱవ యధ్యాయము - సాల్వసేనా దుర్నిమిత్తదర్శనము

**మార్కండేయ ఉవాచ :**

వ్యస్పంద తాథ సాల్వస్య రాజన్ ! బాహు రదక్షిణః ।
హృదయంచ తథా పృష్ఠం నయనం చా ప్యదక్షిణమ్ ॥ 1
శూన్య చిత్తశ్చ విమనాః కంపతేచ ముహుర్ముహుః । పపాత నాయక శ్చాపి కిరీటా త్తారక ప్రభః ॥ 2
ఆక్రమన్తి గజాః పాదం తథా వామేన దక్షిణమ్ । కరేణ వేష్టయన్తి స్మ తథా దంత మదక్షిణమ్ ।
మదం త్యజన్తి యే మత్తాః తురగా శ్చ ముహుర్ముహుః ॥ 3
సంస్పృశన్తి తథా వామం పార్శ్వం ప్రోథేన వాఉమునా ।
వృకాః శృగాలా శ్శార్దూలాః బిడాలా గర్దభా శ్శశాః ॥ 4
వామీ భూత్వా దానవానాం యాన్తి దక్షిణత స్తతః । ఏణా వరహాః పృషతో యాన్తి తేషాంచ వామతః ॥ 5
దీప్తాయాం దిశి వాశన్తి మృగా స్తేషామపస్వనమ్ । తైల పంక గుడాంగార చర్మకేశ తృణాని చ ॥ 6
దానవానాం ప్రయాతానాం సంభవ న్త్యగ్రత స్తథా । ఏవం విధా దుర్నిమిత్తా జాతాః సాల్వస్య పశ్యతః ॥ 7
మతి స్సునిశ్చితై వాసీ న్మరణం ప్రతి యాదవ ! । సయయౌ సహ సైన్యేన మహతా చతురంగిణా ॥ 8
కైలాస పర్వతం యోద్ధుం మహాదేవేన శూలినా ॥ 9
యుద్ధోత్సుకేదైత్య పతౌ ప్రయాతే వ్యదృశ్య తాగ్రే చర చండవేగః ।
రామః ప్రవాలారుణ కోమలేన దీప్త ప్రతాపేన విరాజమానః ॥ 10

**ఇతి శ్రీ విష్ణు ధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే సాల్వసేనా దుర్నిమిత్త దర్శనం నామ షట్ చత్వారింశత్తమోఽధ్యాయః.**

మార్కండేయుడనియె : అంతట సాల్వుని యెడమబాహువదరెను. ఎడమహృదయము, వీపు ఎడమ కన్నుగూడ నదరెను. మనసుశూన్యమై కలతపడ మాటిమాటికి నతడు కంపించెను. నక్షత్ర కాంతిజిమ్ము నాయకమణి కిరీటమునుండి యూడివడెను.

ఏనుగు లెడమ పాదమున కుడిపాదము నాక్రమించెను. తొండముచే నెడమ దంతమును జుట్టినవి. ఊరక మదముం గార్చినవి. గుఱ్ఱములు మాటిమాటికి ఎడమ పార్శ్వమును నెడమ ముక్కుతో దాకుచుండెను. తోడేళ్ళు, నక్కలు, పులులు, పిల్లులు, గాడిదలు, శశములు (చెవుల పిల్లులు) దానవులకు దక్షిణమునుండి యెడమ వైపునకు బోవుచున్నవి. లేళ్ళు, పందులు, దుప్పులు వానికెడమవైపు వెలుగుగలదిక్కున మృగములు అరస్వపముగ నరచుచున్నవి. నూనె, బురద, బెల్లము, బొగ్గులు, చర్మము, వెంట్రుకలు, గడ్డి యుద్ధమున కేగు దానవుల ముందున్నవి. సాల్వుడు గనుచుండ నిట్టి యపశకునము లేర్పడినవి. మరణము తప్పదను నిశ్చయము వానికి గల్గెను. అతడు పెద్ద చతురంగ సైన్యముతో నెత్తి మహాదేవుడగు శూలితో బోర కైలాస పర్వతము గూర్చి యేగెను. దైత్యపతి యుద్ధోత్సుకుడై చన నెట్టెదుట ప్రచండ వేగుడైన రాముడు పవడపునెఱుపుచే మృదువైన యుద్దీప్త ప్రతాపముతో విరాజిల్లుచు నయ్యెడ గానవచ్చెను.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తరమహాపురాణము ప్రథమఖండమున సాల్వసేనకు దుర్నిమిత్తదర్శనమను నలుబది యారవయధ్యాయము.

## నలుబది యేడవ అధ్యాయము - భార్గవరామ దర్శనము

మార్కండేయ ఉవాచ :

వహ్ని జ్వాలా గ్రవర్ణేన జటాజూటేన రాజితమ్ । గగనార్ధ మివారూఢం నిదాఘే రవిమండలమ్ ॥ 1
ఆధారం సర్వదేవానాం తపసా ద్యోతిత ప్రభమ్ । సేవమాన మవసనం పీతగాత్ర మరిందమమ్ ॥ 2
ఏక మేకాకినం వీరం సహస్రశత మండితమ్ । పిండితం సకలం ధామ బ్రహ్మక్షత్రియ తేజసామ్ ॥ 3
కృష్ణాజినోత్తరా సంగ భ్రాజమానం బలోద్ధతమ్ । స్నిగ్ధయా రంజిత మివ ప్రాయేణ పార్వతీదృశా ॥ 4
విరాజమానం దోర్దండ రుక్మ దండేన భాస్వతా । పరశ్వథేన తీక్ష్ణేన విమలాకాశ వర్చసా ॥ 5
తపస్విన మనాధృశ్యం యమకాలాన్తకోపమమ్ । కంపమానం పదన్యాసై ర్వసుధాంసకలాం తథా ॥ 6
ముష్ణన్తం సర్వతేజాంసి ప్రభాతే రవిమండలమ్ । ప్రాంశుం కనక వర్ణాంగం సిత యజ్ఞోపవీతినమ్ । 7
గంగయాః ప్రవహేణేవ మేరుశృంగం విరాజితమ్ । తేజసా దహనాకారం ప్రజా సంహార కారకమ్ ॥ 8
విషమం ప్రమథేశస్య తృతీయమివలోచనమ్ । అప్రసహ్య మనావార్యం దుర్లంఘ్యంజీవిత ఛిదమ్ ॥ 9
కాశేనేవ భుజం సవ్యం దైత్యహేతోః ప్రసారితమ్ । రామే దృష్టి పథం ప్రాప్తే దానవానాం సమన్తతః ॥ 10
హాహా కారో మహా నాసీత్ తమేకం నిఘ్నతాం రణే । శస్త్ర ధారణ విభ్రష్ట బ్రాహ్మణ్యం స్వ పథా చ్చ్యుతమ్ ॥ 11
ఘాతయధ్వం దురాచార మేన మూచుః పరస్పరమ్ । ఏవమాద్రవతాం తేషాం బహూనా మాతతాయినామ్ ॥ 12
జగ్రాహ వేగం సర్వేషాం మరుతా మివ పర్వతః । సహన్య మానో నారాచైస్తోమరై ర్ముసలైస్తథా ॥ 13
గదాభి రసిభిః ప్రాశై ర్భుశుండీభి రయోగుడైః । పట్టిశై ర్భిందిపాలైశ్చ హుతైశ్శూలైః పరశ్వధైః ॥ 14
న వివ్యధే హ్యమేయాత్మా ధరాధర ఇవాఽనిలైః । 15
సంవేష్టితం సర్వత ఏవ సైన్యై రదృష్టయుద్ధోఽపి రణే మహాత్మా ।
దైత్యార్ణవం గోష్పద తుల్య మాత్ర మమన్యతా జౌ రణచండవేగః ॥

ఇతి శ్రీ విష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్ర సంవాదే యుద్ధే భార్గవ రామదర్శనం నామ సప్తచత్వారింశత్తమోధ్యాయః.

మార్కండేయు డనియె : అగ్నిజ్వాల కొన రంగుతో వెలుగొందు జటాజూటముతో మధ్యాహ్న సూర్యమండలమట్లు వెలుగుచు సర్వదేవతలకాధారమై తపస్సుచే నద్భుత ప్రభందాల్చి దేవతలచే పూజింపబడుచు దిగంబరియై పచ్చనిమేనితో నేకైక

వీరుపై నూరులు వేలును నైన యలంకారములుదాల్చి ఏకాకియై బ్రహ్మక్షత్రతేజస్సులన్నియు ముద్దగట్టినట్లుండి కృష్ణాజినము పైఁ గప్పుకొని యమితబలుడైన వీరుడై పార్వతియొక్క ప్రేమభరితమైన చూపున మిక్కిలి శోభించుచు స్వర్ణదండమట్టి బాహుదండముతో రాజిల్లుచు నచ్చమైన యాకాశమట్లు వెలుంగు తీక్ష్ణమైన పరశువును (గండ్రగొడ్డలిం) దాల్చి తేరిపారజూడ నలవిగాక యమ కాలాంతకులట్లు దీపించు తపశ్శాలిని పాదన్యాసముచే సర్వభూమిని గంపింపజేయువానిని సర్వతేజస్సుల నాహరించుకొని ప్రభాత కాల రవి మండలమట్లు బంగారు చాయ మేన సుస్పష్టుడై తెల్లని జందెముం దాల్చి గంగ పైనుండి పడుచున్న మేరుపర్వత శిఖరమట్లుండి తేజస్సున నగ్నిం బోలి ప్రజాసంహారకారకము (లయకారణము) విషమమునైన ప్రమథపతియొక్క (పరమశివునియొక్క) మూడవనేత్రమా అన్నట్లుండి యేరికేని సహింప వారింపను దాటను వశముగాక ప్రాణములదీయువానిని (సంహారకర్తయగువానిని దైత్యుల నిమిత్తము కాలుడు (యముడు) చాచిన యెడమ భుజమువలెనున్న వానిని సాల్వుడెట్టయెదుటం జూచెను. అట్లు రాముడ కంటబడినంత నతనినింగొట్టుటకు రేగిన దానవులలో నాలుగడల హాహాకారమయ్యెను. క్షత్రిపట్టి బ్రాహ్మణ్యమునుండి దిగజారిన దురాచారిని గొట్టుడు జంపుడని దానవు లొండొరులెచ్చరికలు సేసికొనిరి. ఇట్లు పెక్కుమంది యొక్కపై పైబడు నా రాక్షసులను ఆతతాయులందరి వేగమును వాయువుల వేగమును పర్వతమట్లు పరశురాముడు తట్టుకొని నిలుపబడెను. ఆతడు బాణములు బల్లెములు రోకళ్ళు గదలు కత్తులు పాశములు నిసుపసుదియలు పట్టిసములు (ఒకరకము కత్తి) పాశములు భుశుండులు బిందివాలములు హుతములు శూలములు పరశ్వథములు మున్నగు నాయుధములచే గొట్టబడియు నప్రమేయమూర్తి పెనుగాలులం జలింపని పర్వతమట్లుండి యించుకయుం బాధపడడయ్యెను. నలుమూలల సైన్యములు గ్రమ్ముకొన్నను నింతమున్నెన్నడునేని యుద్ధముం జూడని వాడయ్యు సమ్మహాత్ముడయ్యెడ రణమందు బ్రహ్మండ వేగముంగొని దానవ సముద్రమును గోష్పదమాత్రముగ (ఆ దూడ యడుగుగ) భావించెను.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున భార్గవరామదర్శనమను నలుబదియేడవ యధ్యాయము.

# నలుబది యెనిమిదవ యధ్యాయము - సాల్వసైన్య వధ

**మార్కండేయ ఉవాచ :**

సింహికాపుత్రిసైన్యేన హన్యమాన స్తదా రణే । గోచరాభ్యా గతాన్ సర్వాన్ రామో నిన్యే యమక్షయమ్ ॥ 1
తేన కృత్తాః పరశునా యథా పరశునా మృగాః । ఆలింగ్య శేరతే క్షోణీం దానవా స్తే మదోద్ధతాః । 2
తీక్ష్ణధారాగ్రి దుష్ప్రేక్ష్య కుఠార చ్ఛిన్న మస్తకైః ఆతతార తదా భూమిం కుశై ర్వేది మివాఽధ్వరే ॥ 3
పరశ్వధాగ్రి సంభిన్న దైత్య దేహ సముద్భవమ్ । ప్రిసుస్రావ తదా రక్తం యేనాసీత్కర్దమం మహత్ ॥ 4
తే హన్యమానాః రామేణ రామ మేవాభి దుద్రువుః । పరిపూర్ణే యథా కాలే శలభా జాతవేదసమ్ ॥ 5
రామస్య ప్రముఖే దైత్యా స్తదా తిష్ఠన్తి యే నృప ! । నిమేషాంతరమాత్రేణ తే ప్రియాన్తి యమక్షయమ్ ॥ 6
కుంజర స్తురగః పత్తి ర్నాజౌ యాదవ ! దృశ్యతే । ద్వితీయం ప్రిదదౌ యస్య ప్రిహారం భృగు నందనః ॥ 7
ఏక ప్రిహారాభిగతాన్ దానవాన్ పర్వతోపమాన్ । అపశ్యామ రణే తత్రి బ్రిహ్మణా సహితా వయమ్ ॥ 8
రామేణ హన్యమానానాం దానవానాం ముహుర్ముహుః । ఆరావ శ్రూయతే ఘోరో వనానా మివ దహ్యతామ్ ॥ 9
ఆక్రమ్య పద్భ్యాం తరసా రథస్థానా మథాఽఽహరత్ । శీర్షాణి తేన తీక్ష్ణేన తథా పరశునా రణే ॥ 10
రామేణాక్రమ్యమాణేషు రథేషు రథ యూథపాః । భూమౌ నివిష్ట మూర్ధానః తత్యజుర్జీవితం హయాః ॥ 11
నిష్పిపేష రథస్థానాం దారయన్ కుంజరాన్ రణే । బభ్రమే తత్ర తత్రైకః కాలోత్సృష్ట ఇవాన్తకః ॥ 12
విచ్ఛిందన్ యోధ శీర్షాణి రణే రామో రథా ద్రథమ్ । వ్రజన్ భాతి విశాలాక్షో వృక్షా ద్వృక్ష మివాండజః ॥ 13
స శరాంచిత సర్వాంగః శోణితేన సముక్షితః । రరాజ రామ స్సమరే రశ్మిమానివ భాస్కరః ॥ 14

దైత్య బాహు వినిర్ముక్తా నాయుధాన్ శతశః తధా । పరశ్వధాగ్రేణ రణే చిఛేద రణకర్కశః ॥ 15
తేషాం సంఛిద్యమానానాం ప్రాదు రాసీత్ హుతాశనః । యేన తానేవ తరసా క్షితౌ చక్రే స భస్మసాత్ ॥ 16
బహుత్వా ద్దైత్య యోధానాం రామ స్సంఛాదితో రణే । హేతి పుంజేన మహతా శైలాభేన న దృశ్యతే ॥ 17
హేతిపుంజం విధూయోగ్ర మభ్రపుంజం యధా రవిః । పునర్దర్శన మాయాతి సంహర్తా దైత్యతేజసామ్ ॥ 18
బ్రహ్మ సురగణై స్సార్థ మృషిభి శ్చ మహాత్మభిః ॥ పూజయామాస తద్యుద్ధం సాధువాదేన యాదవ ! 19
దృష్టవ న్తశ్చ ధనుషా యుద్ధాని చ ముహుర్ముహుః । తథైవాశ్చర్య భూతాని లోకానాం ఖడ్గ చర్మణా ॥ 20
అపూర్వ ఏష సంగ్రామో రామస్య బహుభి స్సహ । పరశ్వధాయుధ స్యోగ్ర ఇతి దేవా స్తధాబ్రువన్ ॥ 21
పూజ్యమాన స్స రామోఽపి దేవపుష్పోత్కరై స్తదా । చిచ్ఛేద యుధి దైత్యానాం శిరాంసి శతశో రణే ॥ 22
దైత్య శోణిత దిగ్ధాంగం భార్గవం లఘు విక్రమమ్ । అలాతచక్రప్రతిమం తదా పశ్యతి యాదవ ! 23
భ్రమతాఽనేన రౌద్రేణ రణే కాలాగ్ని వర్చసా । కృతాః సమరశౌండేన భీమా రుధిర నిమ్నగాః ॥ 24
పరశ్వధాగ్ర విక్షేప గత జీవిత కుంజరైః । పాదో పలైశ్చ సమరే ప్రతస్తార స భార్గవః ॥ 25
దన్తి దన్త పదన్యాసప్రాప్తం కుంజరమస్తకమ్ । వినిఘ్నన్ స గజారోహాన్ శ్యేన వత్ విచరన్ లఘు ॥ 26
ఆరుహ్య కుంజరం చైకం కుంజరాత్ కుంజరాంతరమ్ । అపశ్యామ రణే రామం విచరన్తం యథా సుఖమ్ ॥ 27
భూయో భూమిగతో రామః కుంజరాణాం పరశ్వధా । చకార కదనం ఘోరం ప్రళయాగ్ని రివోత్థితః ॥ 28
ఛిన్నాగ్రహస్తాన్ విరదాన్ ద్విరదాన్ శోణితోక్షితాన్ । క్షితౌ గతా నపశ్యామ శ్యామీకృత దిగన్తరాన్ ॥ 29
ఏవం హి యుద్ధ్యతా తేన రణే కాలాగ్ని వర్చసా । హతాని దానవేంద్రాణాం ప్రయుతా న్యర్బుదానిచ ॥ 30
యేషాం ప్రహారం సంసోఢుం నేయం శక్తా వసుంధరా । తేషాం ప్రహార భిన్నాంగో నైవ రామో వ్యకంపత ॥ 31
దృష్ట్వా ప్రహారవైక్లబ్యం నిహతాం శ్చ మహాసురాన్ । ప్రదుద్రువు ర్దైత్య గణా స్సాల్వం శరణ మాహవే ॥ 32

అల్పావశిష్టాన్ దితిజాన్ ప్రణష్టాన్ సంవీక్ష్య సాల్వః స్వహితే నివిష్టాన్ ।
రామం యయౌ తేన గజేన యుద్ధే రామాద్రణే యుద్ధ మభీప్సమానః ॥ 33

ఇతి శ్రీ విష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రి సంవాదే సాల్వసైన్య వధోనామ
అష్టా చత్వారింశత్తమోఽధ్యాయః

మార్కండేయుడనియె : పరశురాముడు యుద్ధమునందుసింహికాపుత్రుడగు రాహువు సైన్యముచే గొట్టబడుచు, నెదుట నున్నవారినందరినియమగృహమునకు నంపెను. గండ్రగొడ్డలితోనాతడు నఱుకగా గొడ్డలిందెగిన మృగములట్లసురు లవనింగౌగలించుకొని బడియుండిరి. మిగుల పదునైనయంచు తుదచే గనులు మిరుమిట్లు గొలుపు గొడ్డలిచే తెగినతలలు యజ్ఞవేదిం దర్భలలముకొనిన ట్లలుముకొనెను. పరశుధారందెగిన దైత్యుల మేనులందుండి రక్తము దొరగి యుద్ధరంగము పెనురొంపియయ్యెను. రామునిచేచావగొట్టబడుచుంగూడ యారాక్షసులు కాలనుపూర్తియైయగ్ని పైదుముకు మిడుతలట్లాతనిపైకిబరువులెత్తిరి. పరశురామునెదుట బడుటయే తడవుగ దానవులు నిమేషమాత్రమున యమక్షయమున కరుగుచుండిరి. అయ్యుద్ధమందతడు రెండవదెబ్బకొట్టిన యేనుగు, గుఱ్ఱము పదాతియుం గానరాడయ్యెను. (మొదటి దెబ్బకే యన్నియు గూలుచుండెనన్నమాట) ఒక్కదెబ్బలో గూలిన పర్వతములట్లున్న దానవుల నా రణమందేము బ్రహ్మతో నుండి కనుగొంటిమి. రామునిచే గూలుచున్న దానవుల యారావ మతిఘోరమై దావాగ్నింగాలి కూలు కారడవుల ఘోష మట్లు విననయ్యెను. అతడు కాలినడ వేగముచ నేగి రథమందున్న వారి (రథికుల) తలలను గొడ్డలిం బడవేసెను. రాముడు రథాక్రమణంబుసేసినంత రథయోధులగు గుఱ్ఱములవనికిం దలలు పడవేసి ప్రాణములం బాసెను. కాలమంపిన యంతకుడట్లతడు రథికులను ఏనుగులంజెండుచు నొక్కడైయా రణమందువిహరించెను. అరదమునుండి యరదమునకు యోధుల తలలు ద్రెంచుచు కనుగవ విప్పార చెట్టునుండి చెట్టుమీదికెగురు పక్షియట్లెగుర జొచ్చెను. మేనమ్ములు గ్రుచ్చుకొని రక్తమునందడిసి రాముడా సమరమందు తీక్ష్ణ కిరణుడగు భాస్కరునట్లు వెలింగెను. దైత్యుల బాహువులనుండి విసరబడు నాయుధ

ముల నూర్లకొలది యొక్కుమ్మడి పరశుధారచే ఛేదించెను. అట్లు భిన్నములయిన యాయుధములనుండి నిప్పు పుట్టెను. ఆ పుట్టిన నిప్పు రక్కసుల నప్పుడే భస్మము గానించెను. రాముడేకాకి యగుటచే రక్కసులు పెక్కుమంది యగుటచే పర్వతమట్లు గుట్టవడి యున్న యాయుధ పుంజముచే రణభూమియందుకప్పబడిరాముడేరికింగానరాడయ్యెను. మేఘపుంజమునురవియట్లుయాయుధపుంజమును జిమ్ముకొని దైత్య తేజస్సంహారమూర్తి రాముడు పునర్దర్శన మిచ్చుచుండెను. బ్రహ్మ సురగణముతో మహానుభావులగు ఋషులతో నయ్యుద్ధమును బాగుబాగని ప్రశంసించెను. ధనుర్యుద్ధములు చూచినాము. ఖడ్గచర్మములూని చేసిన రణములెన్నేని యెన్నో మారులు చూచినాము. కాని యీ రాముడొక్కడు పెక్కుమందితో గండ్రగొడ్డలి మాత్రముంగొని చేసిన సంగ్రామ మపూర్వమని వారనుకొనిరి. దేవతలు పూలు గురిపించి చేసిన పూజ నందుకొనుచు నతడు వందలకొలది యసురుల తలలు చెండాడెను. దైత్యుల రక్తముచే మేను తడిసి లఘువుగ (తేలికగ) నాక్రమించుచు నాతడు అలాతచక్రమట్లు (చక్రాకారమునదిరుగు కొరివివలె) గనబడెను. ప్రలయ కాలాగ్ని యట్లనిలో నిట్టట్టు దిరుగుచు నాతనిచే చేయబడిన రక్తనదు లతిభయంకరములయ్యెను. అతడుపరశ్వధధార(పరశువు వాదర) విసరుసంబ్రాణములు వాసిన యేన్గులచే, పాదముల రూపగు బండలచే రణభూమిం గప్పెను. అతడేన్గు దంతముమీద కాలిడి తలకెక్కి యా తలను ఖండించి గజారోహముల శీఘ్రముగ డేగవలె జేయుచుండెను. ఒక యేనుగుపైకెక్కి అందుండి మరియొక దానిపైకి దానిపైనుండి యింకొక దానిపైకి నవలీలగ నాతడు దూకుట చూచినాము. వెండియు నాతడు ప్రళయాగ్నివోలెరేగిగొడ్డలితో నేనుగులయుద్ధమును ఘోరముగగావించెను. తొండముతెగిదంతములూడిరక్తమునందడసి నలుమూలలవానినలుపుగ్రమ్ముకొనజేసియవని బడియున్న వానింగాంచితిమి. ఇట్లు ప్రళయాగ్నివలె దీపించు నా యోధునిచే దానవ సైన్యము లయుతములు అర్బుదములు గూలినవి. వాని తాకిడిని నీ వసుంధర సహింపజాలని దయ్యెను. ఆరాక్షసులదెబ్బ కొడలు తెగియు రాముడు చలింపడయ్యె. ఆయుధములు పమ్మగుట మహాసురులీల్గుటయుం గని దైత్యగణములు శరణుజొచ్చుటకైసాల్వుని దిక్కుకుపారినవి. తనమేలునకైజచ్చినవారిని చావగా మిగిలిన వారినింగని సాల్వరాజు రాముని యుద్ధమభిలషించి యేనుగునెక్కి రాముని చేరెను.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తరమహాపురాణము ప్రథమఖండమున సాల్వసైన్యవధయను నలుబది యెనిమిదవ యధ్యాయము.

## నలుబది తొమ్మిదవ యధ్యాయము – సాల్వవధ

మార్కండేయ ఉవాచ :

తతస్సాల్వో మహాతేజాః కుంజరేణ తపస్వినా । అర్పయామాస ధర్మజ్ఞ! రేణుకానందవర్ధనమ్ ॥ 1
స్తబ్ధకర్ణో వివృతాక్షః కృత్వా కుండలినం కరమ్ । గ్రీవాం సంచాలయ న్నాగో యయౌ గజమదోద్ధతమ్ ॥ 2
దృష్ట్వైవాఽఽపతత స్తస్య వేగం రామోఽపి తంగజమ్ । హుంకార మాత్రేణ రణే స్తంభయామాస వేగితమ్ ॥ 3
స్తంభయామాస నాగేంద్రం శైలేంద్ర శిఖరోపమమ్ । తస్థౌ స పురత స్తస్య సాల్వస్య సమరప్రియః ॥ 4
పరశుం రుధిరాఽఽక్తాంగం సకలంకమలం కరే । ధారయన్ విష్ణువద్యాతి సకలం కమలంకరే॥ 5
దంతినా దంతినః పృష్ఠం రామస్యారోఢు మిచ్ఛతః । జహార వేగవా న్వేగం శరై స్సన్నత పర్వభిః ॥ 6
సాల్వసాయక సంఘాత విముఖీకృత విక్రమమ్ । రామం రణే దైత్య గణా శ్ఛాదయన్తి వరాయుధైః॥ 7
మహతా సోఽస్త్రపుంజేన రామ స్సంఛాదితో రణే । నిమీలితాక్ష శ్చిక్షేప సాల్వాయ పరశుం తదా ॥ 8
ఆగచ్ఛన్తంచ వేగేన సాల్వ స్తం పరశుం రణే । ఆయుధై ర్వారయామాస నశశాక చ శత్రుహా ॥ 9
స సాల్వాయుధ సంఘాతం భంక్త్వా సర్వ మశేషతః । జహార శీర్షం సాల్వస్య ముకుటోత్తమ భూషితమ్ ॥ 10

రామోఽపి భూతలా త్ప్రాప్య గదాం హేమ విభూషితామ్ ।
ఆవిధ్య నిజఘానోగ్రం సాల్వం కుంజర సంస్థితమ్ ॥ 11

ద్వా వంకుశ ధరౌ శ్రేష్ఠౌ ద్వౌచ చర్మాసి ధారిణౌ । పతాకాధారిణం చైకం గజస్య జఘనే స్థితమ్ ॥ 12

దేహంచ తస్య సాల్వస్య పతాకాంచ మనోరమాం । ఏత దాదాయ సకలమాజగామ వసుంధరామ్ ॥ 13
సింహనాదేన రామస్య విత్రస్తో గజయూధపః । ఆర్తనాదం మహత్ కృత్వా ప్రదుద్రావ నరాధిప ! 14
రామకర్మణి వృత్తేతు భూతలా త్పరశుం రణే । జగ్రాహ వేగవాన్ వేగా ద్దానవా న్త చికీర్షయా ॥ 15
దృష్ట్వా సపరశుం రామం సాల్వంచ వినిపాతితం । హతశేషాస్తు తేదైత్యాః ప్రవిష్టా వరుణాలయమ్ ॥ 16
ఏతస్మిన్నేవ కాలేతు దేవాః సేంద్రపురోగమాః । ఆయోధన ముపాజగ్ముః పురస్కృత్య పితామహమ్ ॥ 17
ప్రణామ మకరో త్తేషాం రామో రతికరః పితుః । పూజయిత్వాతు తే రామం యయుర్దేవాః స్వమాలయమ్ ॥18
శక్రోఽపి లబ్ధ్వా త్రిదివం రామ బాహు ప్రసాధితమ్ । విజహార దివం రాజన్ ! పాలయానో జగత్త్రియమ్ ॥
రథేన సింహయుక్తేన మహాదేవోఽపి భార్గవమ్ । ఆదాయ ప్రయయౌ శీఘ్రం కైలాసం పర్వతోత్తమమ్॥ 20
స్నేహేన చాస్య గాత్రాణాం చక్రే సమ్మార్జనం హరః । యేనాసీ ద్బలవాన్ రామో నిర్వ్రణశ్చ మహాశయాః ॥ 21
గతవ్రణం శ్రియోపేతం జయం లబ్ధ్వా హ్యుపస్థితమ్ । రామం ప్రహరతాం శ్రేష్ఠం శంకరో వాక్య మబ్రవీత్ ॥ 22

శంకర ఉవాచ :

రామరామ! మహాభాగ ! త్వయాఽహం పరితోషితః । తస్మాత్తవాహం దాస్యామిచాస్త్రగ్రామం హ్యనుత్తమమ్॥
అస్త్రాణాం ధారణే శక్తస్త్వమేకో భువి భార్గవ ! । తవ ధైర్యమనౌపమ్యం తవ సత్త్వ మనుత్తమమ్ ॥ 24
అస్త్రయోగ మిహస్థ స్త్వం కృత్వా పుత్ర ! శనైశ్శనైః । సర్వాస్త్రవిత్తతో రామ గంతాసి పితరం స్వకమ్ ॥ 25
యశ్చైష పరశు ర్దివ్యః పిత్రా దత్తః తవాఽనఘ । అద్య ప్రభృతి తే క్షిప్తః కరం భూయః సమేష్యతి ॥ 26
ఉపలక్షణ మేతచ్చ తథా తవ భవిష్యతి । ఛేత్స్యామి తే సంశయాంశ్చ నిర్వృతోభవ! పుత్రక! ॥ 27

మార్కండేయ ఉవాచ :

ఇత్యేవ ముక్తః పరిపూర్ణకామో రామో మహాత్మాజిత సైన్య నావః ।
ఉవాస తత్ర ప్రమథైః సమేతః సర్వాణ్యథాస్త్రాణ్య నుశిక్షమాణః ॥ 28

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్ర సంవాదే సాల్వవధోనామ
ఏకోన పంచాశత్తమోఽధ్యాయః.

మార్కండేయుడనియె. మహాప్రతాపశాలి సాల్వుడంతట రేణుకానంద వర్ధనుని (రేణుకాదేవి కుమారుడైన పరశురామున్ని పైకి బహువేగియైన యేనుగునుసికొల్పెను. చెవులు నిక్కించి కన్నులు బాగతెరచి యా గజము తొండము గుండ్రముగ ద్రిపి) మెడ సాచుచు నన్నాగము నాగబలు రాముని పైకేగెను. పైబడుచున్న యా మదగజము వేగముగని హుమ్మని (హుంకారమాత్రమున, దానిని స్తంభింపజేసెను. (కదలకుండ కట్టుకట్టెను) సమరప్రియుడు గావున నా రాముడు సాల్వుని యెదుట నిలువబడెను. పరశురాముడు రక్తముచే దడిసినదియు సకలంకమును కలంకముతోగూడినదియునగు పరశువును(గొడ్డలి)అలం చక్కగా కరమందూని కళలతోగూడిన కమలమును ధరించు విష్ణువట్లు వానికెదుట నిలబడెను. ఏనుగుతో నేనుగు పిరుంచ నెక్కిందలచు రాముని వేగమును సాల్వుడు వాలుటమ్ములం హరించెను. సాల్వుని సాయక సంఘాతముచే పరాక్రమము పెడమొగమైన రాముని దైత్య సంఘము మంచి యాయుధములం గప్పిపైచిరి. గొప్ప యస్త్రపుంజమున గప్పబడి యాతడు కన్నులు మూసికొని సాల్వునిపైకి పరశువును విసరెను. వచ్చి పడుచున్న యా గొడ్డలిని సాల్వుడాయుధముచే వారించెను. గాని దానికి శక్తుడు గాడయ్యెను. పరశురాముడంతట సాల్వాయుధ సంఘాతమునెల్ల వమ్మొనరించి రత్నకిరీటభూషితమైన వానితలను డొల్లజేసెను. మఱియును భూతలమునుండి బంగారు నగిషీగల గదనుగైకొని విసరి ఉగ్రబలుడైన కంజరముపైనున్న సాల్వుని గొట్టెను. మఱియు ఇద్దరంకుశధారులను(మావటీంద్రను) చర్మము తాలునుంబూనినవారి నిద్దరిని గజముయొక్క జఘనమందున్న పతాకధారి నొక్కనిని గూడ యొక్క దెబ్బలో బడవేసెను. సాల్వుని శరీరమును, చక్కని పతాకను తీసుకొని నేలపైకివచ్చి రాముడు సింహగర్జనముసేయ గజరాజడలి పెద్ద ఆర్తనాదముసేసి

(ఘీంకారము సేసి) పారిపోయెను. తర్వాత రాముడు దానవుల సంతమొనరింప భూతలమునుండి పంశువుం గైకొనెను. పరశువుతోడి రాముని పడిపోయిన సాల్వునిం జూచి హతశేషులు దైత్యులు వరుణాలయముంజొచ్చిరి. ఈ సమయమందే యింద్రాది దేవతలు బ్రహ్మను ముందిడుకొని యుద్ధరంగముచ కేతెంచిరి. తండ్రికి మెచ్చుకూర్చువాడగు రాముడు వారికి నమస్క రించెను. వేల్పులును రాముని బూజించి తమ నెలవునకరిగిరి. రామునిబాహువులుప్రసాదించిన త్రిదివమును(స్వర్గమును)బడసిఇంద్రుడు త్రిభువనములం బాలించుచు సుఖముగ విహరించెను. సింహమును పూన్చిన రథమెక్కి మహాదేవుడు (శంకరుడు) వచ్చి పరశు రాముం జేకొని పర్వతరాజమగు కైలాసమున కేగెను. మరియుం బరమేశ్వరుడాతని మేనిని స్నేహముతో నిమురుటచే నాతడు వ్రణశూన్యుడై బలశాలియయ్యెను. యుద్ధము దెబ్బలు వ్రణములు మాని శ్రీసంపన్నుడై జయమొంది వచ్చిన రాముని యుద్ధ విశారదుని గని శంకరుడు రామా! రామా! మహానుభావా! నీ వలన నేను సంతసించితిని. కావున నీకు నుత్తమమైన యస్త్రగ్రామ మిచ్చెదను. ఈ పుడమియందు నీవొక్కడవ యద్యస్త్రములం దాల్ప సమర్థుడవు. నీ ధైర్యమసమానము, నీ సత్వము (సత్తువ) అనుత్తమము. (అంతకంటె నుత్తమమైన సత్తువింకొకటి లేదన్నమాట) నాయనా! అస్త్రయోగమీవిక్కడనే మఱి మఱి గావించి సర్వాస్త్రవేత్తవై యా మీద మీ తండ్రి దరికేగుదువు గాక! ఈ పరశువు దివ్యము. ఇది నీ తండ్రిచే నీకీయబడినది. నేడు మొదలు నీవిది విసరినంతనేగి తిరిగి నీచేతిలోనికి రాగలదు. ఆ విధముగానిది నీకుపలక్షణము కాగలదు (ఇది నీకు జిహ్నమగు నన్నమాట), నీ సంశయముల నేను వారించెదను. పుత్రా! ఇక సుఖముండుము. అని శివుడన రాముడుమహాత్ముడు పరిపూర్ణకాముడై (కోరిక పూర్తిగ నెరవేరినవాడై) సైన్యవౌకసు జయించి ప్రమథులతో సర్వాస్త్రాభ్యాసము గావించుచు నట వసించెను.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తరమహాపురాణము ప్రథమఖండమున సాల్వవధయను నలుబది తొమ్మిదవ యధ్యాయము.

## ఏబదియవ యధ్యాయము - అస్త్రోపదేశము

మార్కండేయ ఉవాచ :

బ్రహ్మాస్త్రం వైష్ణవం రౌద్రమాగ్నేయ మథవాసవం । అస్త్రంచ నైరృతం యామ్యం కౌబేర మథ వారుణమ్॥ 1
వాయవ్య మథ సౌమ్యంచ సౌరం పార్వత మేవచ । చక్రాస్త్ర మథ వజ్రాస్త్రం పాశాస్త్రం సార్పమేవచ॥ 2
గాంధర్వం స్వాపనం భౌతం తథా పాశుపతం శుభమ్ । ఏషీకం తర్జనం ప్రాసం భారుండం నర్తనంతథా ॥ 3
అస్త్రరోధన మాదిత్యం రైవతం మానవం తథా । అక్షి సంతర్జనం భీమం జృంభణం రోధనం తథా ॥ 4
సౌపర్ణమథ పార్జన్యం రాక్షసం మోహనం తథా । కాలాస్త్రం దానవాస్త్రంచ అస్త్రం బ్రహ్మ శిర స్తథా ॥ 5
ఏతా న్యస్త్రాని చాన్యాని రామో నివసనే తతః । సంప్రయోగ రహస్యాని ససంహారాణి చావ్యధ ॥ 6
ఆజహార మహాదేవాత్ ప్రసాద సుముఖా త్తతః । ఏవం హి వసతః కాలో యయౌ రామస్య ధీమతః ॥ 7
హర ప్రసాద సంజాత విస్రంభో భృగునందనః । ధ్యానాస క్తం హరందేవం కదాచి దథ దృష్టవాన్ ॥ 8
ధ్యానప్రసక్తం స హరం సమీక్ష్య రామ స్తు సంజాత కుతూహలేన ।
విసిష్మయె ధర్మ భృతాం వరిష్ఠః స చేతసా యాదవవంశచంద్ర ! ॥ 9

ఇతి శ్రీ విష్ణు ధర్మోత్తరే ప్రథమ ఖండే మార్కండేయ వజ్ర సంవాదే అస్త్ర ప్రదానం నామ
పంచాశ త్తమోఽధ్యాయః,

మార్కండేయుడనియె : బ్రహ్మాస్త్రము వైష్ణవము రౌద్రము ఆగ్నేయము ఐంద్రము (వాసవము) నైఋతము యామ్యము కౌబేరము వారుణము వాయవ్యము సౌమ్యము సౌరము పార్వతము చక్రాస్త్రము వజ్రాస్త్రము పాశాస్త్రము సార్పము (నాగాస్త్రము) గాంధర్వము స్వాపనము భౌతము పాశుపతము ఐషీకము తర్జనము ప్రాసము భారుండము నర్తనము అస్త్రరోధనము ఆదిత్యము

రైవతము మానవము అక్షిసంతర్జనము భీమము జృంభణము రోధనము సౌపర్ణము (గారుడము) పార్జన్యము (మేఘాస్త్రము) రాక్షసము మోహనము కాలాస్త్రము దానవాస్త్రము బ్రహ్మశిరము మఱియుం బెక్కిండిని ప్రయోగోప సంహార రహస్యములతో ప్రసాద సుముఖుడైన పరమేశ్వరునుండి గ్రహించెను, ఇట్లచ్చట నునికిసేయు పరశురామునికి పెద్ద కాలము గడచెను. హరప్రసాదమున గలిగిన విశ్వాసముతో భార్గవరాముడొకతఱి ధ్యాననిష్ఠుడైన యీశ్వరుని దర్శించెను. దర్శించి వేడుక పొడిమి యాధర్మిష్ఠ వరిష్ఠుడా ధ్యాననిష్ఠకాశ్చర్యపడెను.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తరమహాపురాణము ప్రథమఖండమున అస్త్రోపదేశమను నేబదియవ యధ్యాయము.

## ఏబదియొకటవ యధ్యాయము - శంకరగీతలందు పరశురామప్రశ్న

మార్కండేయ ఉవాచ :

కైలాసశిఖరే రమ్యే నానా ధాతు విచిత్రితే । నానా ద్రుమలతా కీర్ణే నానా పక్షి నినాదితే ॥ 1
గంగా నిర్ఝర సంజాతే సతతం నాద నిస్స్వనే । దేవదేవం మహాదేవం పర్యపృచ్ఛత భార్గవః ॥ 2
రామ ఉవాచ :
దేవదేవ ! మహాదేవ ! గంగాలులిత మూర్ధజ । శశాంక లేఖా సంయుక్త జటా భారాతి భాసుర ! ॥ 3
పార్వతీ దత్త దేహార్ధ ! కామకాలాంగ నాశన ! । భగనేత్రాంతకాఽచింత్య ! పూష్ణోదశన శాతన ! ॥ 4
త్వత్తః పరతరం దేవం నాన్యం పశ్యామి కంచన । పూజయన్తి సదా లింగం తత్ర దేవా స్సవాసవాః॥ 5
స్తువన్తి త్వా మృషిగణాః ధ్యాయన్తి చ ముహుర్ముహుః । పూజయన్తి తథా భక్త్యా వరదం పరమేశ్వర!॥ 6
జగతోఽస్య సముత్పత్తి స్థితి సంహార పాలనే । త్వామేకం కారణం మన్యే త్వయి సర్వం ప్రతిష్ఠితమ్ ॥ 7
కం త్వం ధ్యాయసి దేవేశ! తత్రమే సంశయో మహాన్ । ఆచక్ష్వ తన్మే భగవన్ ! యద్యనుగ్రాహ్యతా మయి॥
ప్రసాద సాంముఖ్య తయా మయ్యేతత్ విస్రంభమాసాద్య జగత్ప్రధాన ।
భవన్త మీద్యం ప్రణిపత్య మూర్ధ్నా పృచ్ఛామి సంజాత కుతూహలాత్మా ॥ 9

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే పరశురామోపాఖ్యానే శంకరగీతాసు రామ ప్రశ్నోనామ ఏకపంచాశత్తమోఽధ్యాయః.

మార్కండేయుడనియె : నానాధాతు చిత్రము రమ్యము నానాతరులతాకీర్ణమునానాపక్షినినాదితముగంగానదీ నిర్ఝర సంపాతమున జక్కగ ధ్వనించు కైలాసశిఖరమున పరశురాముడు మహాదేవునిట్లు ప్రశ్నించెను. దేవదేవా ! మహాదేవా ! గంగాలంకృత జటాజూట! చంద్రకలాకలిత జటాభార! అతిభాస్వర! పార్వతికి సామేనిచ్చిన మహానుభావ ; కాముని కాలుని గడతేర్చినవాడ ! భగనేత్రాంతకా ! అచింత్యా! పూషదంతముల రాల్చినవాడ! నిన్ను మించిన దైవమింకొకనిం గానను. ఇంద్రాది దేవతలు నీ లింగము నే వేళ నర్చింతురు. ఋషి గణములు నిన్ను స్తుతింతురు. మాట మాటికి వరదుడవైననిన్ను భక్తితో పూజింతురు. ఈ జగత్తుయొక్కపుట్టుట పెరుగుట గిట్టుటయు పాలించుట వీనికి నీవొక్కడవు కారణమని తలంతును. నీయందే సర్వము ప్రతిష్ఠితము. నీవెవ్వనిని ధ్యానించుచున్నావు? అందు నాకు పెద్ద సందేహమేర్పడినది. నేను అనుగ్రాహ్యుడనేని యది నాకు జెప్పుము. ప్రసాదసమ్ముఖుడవైనకతన విస్రంభముచే (చనవుచే) నేను తలవంచి నమస్కరించి కుతూహలము పొడమి భగవంతుడు పరమ స్తుత్యుడవగు నిన్నడుగుచున్నాను.

ఇది శ్రీ విష్ణుధర్మోత్తరమహాపురాణము ప్రథమఖండమున శంకరగీతలందు పరశురామప్రశ్నయను నేబదియొకటవయధ్యాయము.

# ఏబదిరెండవ యధ్యాయము - శంకరగీతలందు ధ్యేయనిర్దేశము

త్వదుక్తోఽయ మనుప్రశ్నో రామ ! రాజీవలోచన ! । త్వమేకః శ్రోతుమర్హోఽసి మత్తో భృగుకులోద్వహ ! ॥ 1
యత్తత్పరమకం ధామ మమ భార్గవనందన ! యత్తదక్షర మవ్యక్తం పరం యస్మాన్న విద్యతే ।
జ్ఞాన జ్ఞేయం జ్ఞాన గమ్యం హృది సర్వ స్యచాశ్రితమ్ ॥ 2
త్వా మహం పుండరీకాక్షం చిన్తయామి జనార్దనమ్ । ఏతద్రామ ! రహస్యంతే యథావత్ కథితం వచః ॥ 3
యే భక్తాస్తమజం దేవం న తే యాన్తి పరాభవమ్ । త మీశ మజ మవ్యక్తం సర్వభూత పరాయణమ్ ॥ 4
నారాయణ మనిర్దేశ్యం జగత్కారణ కారణమ్ । సర్వతః పాణిపాదం తత్ సర్వతోఽక్షి శిరోముఖమ్ ॥ 5
సర్వతః శ్రుతిమాన్‌లోకే సర్వ మావృత్య తిష్ఠతి । సర్వేంద్రియ గుణాభాసం సర్వేంద్రియ వివర్జితమ్ ॥ 6
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృచ ! బహిరన్తశ్చ భూతానాం అచరంచర ఏవచ ॥ 7
సూక్ష్మత్వా త్తదవిజ్ఞేయం దూరస్థం చాన్తికంచతత్ । అవిభక్తం విభక్తేషు విభక్త మివచ స్థితమ్ ॥ 8
భూతవర్తిచ తజ్జ్ఞేయం గ్రశిష్ణు ప్రభవిష్ణుచ । జ్యోతిషామపి తజ్జ్యోతిః తమసః పరముచ్యతే ॥ 9
అనాది మత్పరంబ్రహ్మ న సత్తన్నాసదుచ్యతే । ప్రకృతి ర్వికృతిర్యోఽసౌ జగతాం భూతభావనః ॥ 10
యస్మా త్పర తరం నాస్తి తం దేవం చిన్తయామ్యహమ్ ।
ఇచ్ఛామాత్ర మిదం సర్వం త్రైలోక్యం సచరాచరం ॥ 11
యస్య దేవాది దేవస్య తం దేవం చిన్తయామ్యహమ్ ।
యస్మిన్ సర్వం యతస్సర్వం యస్సర్వం సర్వతశ్చయః ॥ 12
యశ్చ సర్వమయో నిత్యః తం దేవం చిన్తయామ్యహమ్ ।
యోగీశ్వరం పద్మనాభం విష్ణుం జిష్ణుం జగత్పతిమ్ ॥ 13
జగన్నాథం విశాలాక్షం చింతయామి జగద్గురుమ్ । శుచిం శుచిపదం హంసం తత్పరం పరమేష్ఠినమ్ ॥ 14
యుక్త్వా సర్వాత్మనాత్మానం తం ప్రపద్యే ప్రజాపతిమ్ । యస్మిన్ విశ్వాని భూతాని తిష్ఠన్తి చ విశన్తి చ 15
గుణ భూతాని భూతేశే సూత్రే మణి గణా ఇవ । యస్మిన్నిత్యే తతే తన్తౌ దృష్టే స్రగివ తిష్ఠతి ॥ 16
సదసద్గ్రథితం విశ్వం విశ్వాంగే విశ్వకర్మణి । హరిం సహస్ర శిరసం సహస్ర చరణేక్షణం ॥ 17
ప్రాహు ర్నారాయణం దేవం యం విశ్వస్యపరాయణం । అణీయసా మణీయాంసం స్థవిష్ఠం చ స్థవీయసామ్ 18
గరీయసాం గరిష్ఠంచ శ్రేష్ఠంచ శ్రేయసామపి । వాకేష్వనువాకేషు నిషత్సూప నిషత్స్వపి ॥ 19
గృణన్తి సత్యకర్మాణం సత్యం సత్యేషు సామసు । చతుర్భి శ్చతురాత్మానం సత్త్వస్థం సాత్త్వతాం పతిమ్ ॥ 20
యం దివ్యై ర్దేవ మర్చన్తి గుహ్యైః పరమనామభిః । య మనన్యో వ్యపేతాశీ రాత్మానం వీత కల్మషమ్ 21
ఇష్ట్వా నన్త్యాయ గోవిందంపశ్య త్యాత్మ న్యవస్థితం । పురాణః పురుషః ప్రోక్తో బ్రహ్మ ప్రోక్తో యుగాదిషు ॥
క్షయే సంకర్షణః ప్రోక్తస్తముపాస్య ముపాస్మహే । య మేకం బహుధాత్మానం ప్రాదుర్భూత మధోక్షజమ్ ॥ 23
నాన్య భక్తాః క్రియావన్తో యజన్తే సర్వకామదమ్ !
య మాహు ర్జగతాం కోశం యస్మిన్ సన్నిహితాః ప్రజాః ॥ 24
యస్మిన్ లోకాః స్ఫురన్తీమే జాలే శకునయో యథా । ఋత మేకాక్షరం బ్రహ్మ యత్తత్ సదసతః పరమ్ ॥ 25
అనాది మధ్య పర్యన్తం నదేవా నర్షయో విదుః । యం సురాసుర గంధర్వా ససిద్ధర్షి మహోరగాః ॥ 26

ప్రయతా నిత్యమర్చన్తి పరమం దుఃఖ భేషజం । అనాది నిధనం దేవ మాత్మయోనిం సనాతనమ్ ॥ 27
అప్రతర్క్య మవిజ్ఞేయం హరిం నారాయణం ప్రభుం ।
అతి వాయ్వింద్ర కర్మాణం బాలసూర్యాగ్ని తేజసమ్ ॥ 28
అతి బుద్ధీంద్రియ గ్రామం తం ప్రపద్యే ప్రజాపతిమ్ । యం వై విశ్వస్య కర్తారం జగత స్తస్థుషాం పతిమ్ ॥
వదన్తి జగతోఽధ్యక్ష మక్షరం పరమం పదమ్ । యస్యాగ్ని రాస్యం ద్యౌ ర్మూర్ధా ఖం నాభి శ్చరణౌక్షితిః ॥
చంద్రాదిత్యౌ చ నయనే తం దేవం చిన్తయామ్యహమ్ ॥
యస్య త్రిలోకీ జఠరే యస్య కాష్ఠాశ్చ వాహనాః ॥ 31
యస్య శ్వాసశ్చ పవన స్తందేవం చింతయామ్యహం ।
విషయే వర్తమానానాం యం తం వై శేషికై ర్గుణైః ॥ 32
ప్రాహు ర్విషయ గోప్తారం తం దేవం చిన్తయామ్యహం ।
పరః కాలా త్పరో యజ్ఞాత్పర స్సదసతశ్చ యః ॥ 33
అనాది రాదిర్విశ్వస్య తం దేవం ఛింతయామ్యహమ్ ।
పద్భ్యాం యస్య క్షితి ర్జాతా శ్రోత్రాభ్యాంచ తథా దిశః ॥ 34
పూర్వభాగే దివం యస్య తందేవం చిన్తయామ్యహమ్ । నాభ్యాం యస్యాన్తరిక్షస్య నాసాభ్యాం పవనస్యచ ॥
ప్రస్వేదా దంభసాం జన్మ తం దేవం చింతయామ్యహమ్ ॥ 36
వరాహ శీర్షం నరసింహ రూపం దేవేశ్వరం వామనరూపరూపం ।
త్రైలోక్యనాథం వరదం వరేణ్యం తం రామ ! నిత్యం మనసాఽఽనతోఽస్మి ॥ 37
వక్త్రాద్యస్య బ్రాహ్మణా స్సంప్రసూతాః యద్వక్షసః క్షత్రియాస్సంప్రసూతాః ।
యస్యోరుయుగ్మాచ్చ తథైవవైశ్యాః పద్భ్యాం తథా యస్య శూద్రాః ప్రసూతాః ॥ 38
వ్యాప్తం తథా యేన జగత్సమగ్రం విభూతిభిః భూత భవోద్భవేన ।
దేవాధి నాథం వరదం వరేణ్యం తం రామ ! నిత్యం మనసా నతో ఽ స్మి ॥ 39

ఇతి శ్రీ విష్ణు ధర్మోత్తరే ప్రథమ ఖండే మార్కండేయ వజ్రసంవాదే శ్రీ భార్గవరామ ప్రశ్నే శంకర గీతాసు ధ్యేయ నిర్దేశోనామ ద్విపంచాశత్తమోధ్యాయః.

శంకరుడనియె : రామా ! రాజీవలోచనా ! నీవడిగిన ఈ ప్రశ్నముం గూర్చి నా సమాధానము నీవొక్కడవే వినదగ్గుదవు. నా పరమధామము (నివాసము లేదా తేజస్సు) అక్షరము అవ్యక్తము పరాత్పరము. జ్ఞానముచే దెలియదగినది జ్ఞానముచే బొందదగినది. అందరి హృదయనుందున్నది. అట్టి నిన్ను బుండరీకాక్షుడు హరిమునుంగా ధ్యానించుచున్నాను. ఈసత్యమునున్నదున్నట్లు నీకెఱింగించితిని. ఆ పరమదైవము నెడ భక్తిగలవారు పరాభవము పొందరు. ఆ ఈశ్వరుని పుట్టువులేనివాని అవ్యక్తుని సర్వభూతముల కందవలసిన పరమలక్ష్యమును అనిర్దేశ్యుని నారాయణుని జగత్కారణమునకు గారణమైనవానిని అంతట కాలుసేతులుగలవానిని అంతట కన్నులు శిరస్సు ముఖము గలవానిని అంతట చెవులున్న వానిని లోకమందంతట నావరించియున్న వానిని అన్నియింద్రియ గుణములందు (శబ్దాదులందు) తెలివియై భాసించుచు వానిని ఇంద్రియ వర్జితుని అసంగిని నిర్గుణుని గుణానుభవము గలవానిని భూతముల వెలిలోనున్న వానిని చరము అచరము నైనవానిని అతిసూక్ష్మమగుటనే నెరుగరాని వానిని దూరగుని సమీపగుని అవిభక్తుడయ్యు విభక్త పదార్థములందు విభక్తుడైనట్లుండు వానిని భూతములందు వర్తించువాని గ్రసించువాని ప్రభవించువానిని వెల్గులకెల్ల వెల్గయిన వానిని పెంజీకటులకెల్ల నవ్వల వెలుంగువానిని ఆదిలేని వానిని సత్తుగా అసత్తునని పేర్కొనరాని వానిని జగత్తుకు ప్రకృతి(మూలపదార్థము)అయినవానిని వికృతిగూడ తానేయైనివానిని భూతములతో (భూమ్యాదులతో ప్రాణులతో)

భావనగల వానిని తాదాత్మ్యము పొందినవానినిని తనకు మించి యింకొకటి లేనివానిని నా దేవుని నేను ధ్యానించుచున్నాను. ఈ చరాచర జగత్తు ఎవ్వని సంకల్పమాత్రమో యాదేవు నేను దలంచుచున్నాను. ఎవ్వనియందంతయు నున్నదో నెవ్వడంతయునో అంతటి నుండి యెవడగునో యెవడు సర్వమయుడో నిత్యుడో ఆ దేవునిధ్యానించెదను. యోగీశ్వరుడు పద్మనాభుడు విష్ణువు జిష్ణువు జగత్పతి జగన్నాథుడు విశాలాక్షుడు జగద్గురువు శుచి శుచిస్థానము పరమహంస పరమేష్ఠియునైన వానిం జింతచుచున్నాను. తనచే దన్ను సంయోజించికొని యా ప్రజాపతిని శరణందెద. గుణరూపములయిన విశ్వభూతములు (అన్ని ప్రాణులు) నిత్యుడై వ్యాపకుడైన యెవ్వనియందు దారమందు మణులవలె నుండును. సదరత్నులందు గ్రుచ్చబడి విశ్వ మే విశ్వాంగునియందు విశ్వకర్ముని యందున్నది. అట్టి హరి సహస్ర శిరస్కు సహస్రపాదుని సహస్రనయనుని విశ్వమునకు పరమావధియైన వానిని నారాయణుండన బడువానిని అణీయసములన్నిటంటె నణీయసుని (అణువుకంటె నణువును) స్థవీయసముల కంటె స్థవిష్టుని స్థూలమైన వానిని (మహత్పదార్థముల కంటె మహత్తైనవానిని) గరీయసములకంటె గరిష్ఠుని (బరువైనవానిని) శ్రేయసములకంటె శ్రేష్ఠుని వాకములందు (శ్రుతులందు) అనువాకములందు పేర్కొనబడు వానిని (అనువాకమనగా వేదములోని భాగములు) అష్టకము ప్రశ్న (పన్నము) అధ్యాయము (అనువాకము) అనుపేర వేదములందలి భాగములు పేర్కొనబడును. కొన్ని అనువాకములు గలిసి ప్రపాఠకమన బడును. సత్యకర్ముడు సత్యుడునని సత్యములయిన సామములందు గీర్తింపబడు వానిని నాల్గింట నాలుగు రూపులయిన వానిని సత్త్వగుణమందుండు వానిని సాత్త్వతులకు (విష్ణుభక్తులకు) అధినాథుడైనవానిని గుహ్యములు దివ్యములు పరమములు(ఉత్తమములు) నైన నామములచే నర్చింతురు. అనన్యుడై (మఱియొక దైవముని లేనివాడై) వ్యపేతాశిషుడై (ఏ వాంఛలు లేనివాడై) ఎవ్వని నాత్మరూపుని కల్మష రహితుని ఆనంత్యము కొఱకు (అనంతభావముకొఱకు ముక్తికొఱకు) గోవిందుని తనయందున్న వానిని జూతురో ఎవ్వడు పురాణుడు పురుషుడు యుగము నాదియందు (సృష్టిలో) బ్రహ్మగను క్షయమందు (లయయందు) సంకర్షణుడుగను పేర్కొందురట్టి పరము నుపాసింతుము. ఒక్కడైన యెవ్వని బహువిధాత్ముడుగా ప్రాదుర్భవించిన వానినిగా అధోక్షజుడని (సర్వేంద్రియములచే దెలిసికొనబడనివాడు. అధోక్షజుడు-అక్షముల కింద్రియముల కవ్వల బొదమువాడు గోచరించువాడన్నమాట) అనన్య భక్తులు (భావాద్వైతము క్రియాద్వైతము లేనివారు) క్రియావంతులు (కర్మఠులు) సర్వకామదుని యజింతురో ప్రజలందరు నెవ్వని జగత్కోశముగా పేర్కొందురు. (జగద్గర్భుడన్నమాట) ఎవ్వని యందీలోకములు వలలో పక్షులట్లు స్ఫురించును. అట్టి ఋతము ఏకాక్షరము (ఓంకారము) బ్రహ్మ అనాది మధ్యనిధనము ఆత్మ యోని సనాతనుని అప్రతర్క్యము (తర్కింపవలనుగాని) అవిజ్ఞేయమునైన హరిని నారాయణుని ప్రభువును దేవర్షులుగూడ నెఱుంగ జాలరెవ్వని సురాసుర గంధర్వ సిద్ధర్షి పన్నగులు శుద్ధులై దుఃఖౌషధముగ నిత్యమర్చింతురు. అట్టి బుద్ధికి నింద్రియ గ్రామమునకు నందని వానిని విశ్వకర్తను విశ్వహర్తను చరాచర జగత్పతిగా పేర్కొనబడు వానిని నే ధ్యానించుచున్నాను. ఎవని జఠరమందు ముల్లోకములున్నవి. యెవ్వనికి దిక్కులు వాహనములో ఎవ్వని శ్వాస వాయువో అట్టి దేవుని ధ్యానింతును. విషయమందు వర్తించుచున్న తటి వైషయికములైన గుణములంబట్టి విషయగోప్తగా నెవ్వని పేర్కొందురో అతని ధ్యానింతును. పరుడు కాలముకంటె పరుడు యజ్ఞముకంటె పరుడు అనాది విశ్వమున కాదియు నగు నా స్వామిని ధ్యానింతును. ఎవ్వని పాదములనుండి క్షితి జనించెను. వీనులనుండి దిక్కులు పుట్టినవి. యెవ్వనికి పూర్వభాగమున దివమున్నది యిట్టి దేవుని దలంచెద. ఎవని నాభినుండి యంతరిక్షము నాసికలనుండి వాయువు చెమటనుండి నీళ్ళు పుట్టినవో యా దేవుని భావించెదను. వరాహ నరసింహ వామన రూపుని వరదుని వరేణ్యుని త్రైలోక్యనాథుని నిత్యుని రామా! యాతని మనసుచే నమస్కరించెదను. ఎవ్వని వక్త్రమునుండి బ్రాహ్మణులు వక్షమునుండి క్షత్రియులు ఊరువులనుండి వైశ్యులు పాదముల నుండి శూద్రులు జనించిరో భవహేతువైన ఎవ్వని విభూతులచే సమగ్ర జగత్తు వ్యాప్తమో అట్టి దేవాధినాథుని వరేణ్యుని నిత్యము మనసార నతుడయ్యెదను.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తరమహాపురాణము ప్రథమఖండమున శంకరగీతలందు ధ్యేయనిర్దేశమను నేబదిరెండవ యధ్యాయము.

# ఏబది మూడవ యధ్యాయము - నరవరాహావతారము హిరణ్యాక్షవధ

రామ ఉవాచ :

వరాహం నరసింహంచ వామనం చ మహేశ్వర ! ।
త్వత్తోఽహం శ్రోతుమిచ్ఛామి ప్రాదుర్భావాన్ మహాత్మనః ॥ 1

శంకర ఉవాచ :

అదితిశ్చ దితిశ్చైవ ద్వేభార్యే కశ్యపస్యచ । అదితిర్జనయామాస దేవానింద్ర పురోగమాన్ ॥ 2
దితిశ్చజనయామాస ద్వౌపుత్రౌ భీమవిక్రమౌ । హిరణ్యాక్షం దురాధర్షం హిరణ్యకశిపుం తథా ॥ 3
తతోఽభిషిక్తవాన్ శక్రం దేవరాజ్యే ప్రజాపతిః । దానవానాం తథా రాజ్యే హిరణ్యాక్షం బలోత్కటమ్ ॥ 4
అభిషిచ్య తయోఃప్రాదాత్ స్వర్గం పాతాళమేవచ । పాతాళం శాసతి తథా హిరణ్యాక్షే మహాసురే ॥ 5
ధారాధరా ధరాం త్యక్త్వా ఖముత్పేతూ రయాత్పురా । పక్షవంతో మహాభాగ ! నూనం భావ్యర్థ చోదితాః ॥ 6
ధారాధర పరిత్యక్తా ధరా చలనిబంధనా । యదాతదా దైత్యపురం సకలం వ్యాప్త మంభసా ॥ 7
దృష్ట్వైవ స్వపురం వ్యాప్త మంభసా దితిజోత్తమః । సైన్యముద్యోజయామాస జాతశంకః సురాన్ప్రతి ॥ 8
ఉద్యుక్తేన స సైన్యేవ దైత్యానాం చతురంగిణా । విజిత్య త్రిదశాన్ జన్యే ఆజహార త్రివిష్టపమ్ ॥ 9
హృతాధికారా స్త్రిదశాః జగ్ముశ్శరణ మంజసా । దేవరాజం పురస్కృత్య వాసుదేవ మజం విభుమ్ ॥ 10
త్రిదశాన్ శరణం ప్రాప్తాన్ హిరణ్యాక్ష వివాసితాన్ । సంయోజ్యాభయ దానేన విససర్జ జనార్దనః ॥ 11
విసృజ్య త్రిదశాన్ సర్వాన్ చింతయామాసకేశవః । కిన్నురూప మహంకృత్వా ఘాతయిష్యే సురార్దనమ్ ॥ 12
తిర్యఙ్ మనుష్య దేవానాం అవధ్యస్సురాంతకః । బ్రహ్మణోవరదానేన తస్మాత్తస్య వధేప్సయా ॥ 13
నృవరాహో భవిష్యామి న దేవో నచ మానుషః । తిర్యగ్రూపేణ చైవాహం ఘాతయిష్యామి తం తతః ॥ 14
ఏతావదుక్త్వా సంగేన నృవరాహోఽభవత్ ప్రభుః । చూర్ణితాఽంజన శైలాభ స్తప్త జాంబూనదాంబరః ॥ 15
యమునావర్త కృష్ణాంగ స్తదావర్త తనూరుహః । తదోఘఇవ దుర్వార్య స్తత్ప్రతాతేజసా సమః ॥ 16
తత్ప్రవాహ ఇవాక్షోభ్య స్తత్ప్రవాహ ఇవౌఘవాన్ । తత్ప్రవాహామలతను స్తత్ప్రవాహ మనోహరః ॥ 17
సజలాంజన కృష్ణాంగః సజలాంబుద సచ్ఛవిః । పీతా వాసా స్తదా భాతి సవిద్యుదివ తోయదః ॥ 18
ఉరసాధారయన్ హారం శశాంక సదృశచ్ఛవిః । శుశుభే సర్వభూతాత్మా సబలాక ఇవాంబుదః ॥ 19
శశాంక లేఖా విమలే దంష్ట్రే తస్య విరేజతుః । మేఘాంతరిత బింబస్య ద్వౌ భాగౌ శశినో యథా ॥ 20
కరాభ్యాం ధారయన్ భాతి శంఖచక్రే జనార్దనః । చంద్రార్క సదృశే రామ ! పాదచారీవ పర్వతః ॥ 21
మహాజీమూత సంకాశో మహాజీమూత సన్నిభః । సహాజీమూత వద్వేగీ మహాబల పరాక్రమః ॥ 22
దానవేంద్ర వధాకాంక్షీ హిరణ్యాక్షసభాం యయౌ । హిరణ్యాక్షోఽపి తం దృష్ట్వా నృవరాహం జనార్దనమ్ ॥ 23

పరశురాముడు, భగవంతుని వరాహ నరసింహ వామనుల యవతారములం గూర్చి నీ వలన వినగోరెదనన శంకరుం డిట్లనియె. ఆదితి యింద్రాదులను దేవతలం గనెను. దితికి హిరణ్యాక్షుడు హిరణ్యకశిపుడు పుట్టిరి. బ్రహ్మ యింద్రుని దేవరాజ్యమందు దానవరాజ్యమందు హిరణ్యాక్షు నభిషేకించి స్వర్గరాజ్యమును పాతాళమును వారికిచ్చెను. ధరాధరములు ఱెక్కలుగొని ధరణిని విడిచి రయమున కాబోవు విధి ననుసరించి మీది కెగసినవి. పర్వతములు విడిచిపోవ భూమి పట్టువదలినంత దానవరాజ్యము జలమయమయ్యెను. హిరణ్యాక్షుడది చూచి సురలవలననిది జరిగెనని శంకించి వారిపై సేనలతో దండెత్తెను. చతురంగబలముచే

వేల్పులం గెలిచి స్వర్గరాజ్యముం గైకొనెను. అధికారము హరింపబడిన దేవతలింద్రునితో వాసుదేవుని శరణు వేఁడిరి. హిరణ్యాక్షునిచే వివాసితులయిన సురల నభయదానముచే సంఘటపరచి విష్ణువిపుడేమి రూపముదాల్చి యా రాక్షసుం జంపుదునని యాలోచన సేసెను. బ్రహ్మవరమున వాడు పశుపక్ష్యాదుల కవధ్యుడని తలంచి దేవుడుగాదు మానవుడుగాదు తిర్యగ్రూపముచేతనే వానిం జంపెదనని నృవరాహమయ్యెను. గుండగొట్టిన కాటుక కొండవలెనై బంగారురంగు వలువదాల్చి యమునానది సుడివలె నల్లనైన మేనొంది యదేనుడి రంగుగల రోమములతో నీటితోడి కాటుకకాంతిగొని పసుపుపచ్చని వస్త్రముందాల్చి మెరుపుతోడి మేఘమట్లుండెను. ఉరమున హారముందాల్చి చంద్రునికాంతి నెనసి బెగ్గురు పక్షులతోడి మేఘమట్లు సర్వభూతమయుడయిన హరిశోభించెను. సూర్య చంద్రులకీడయిన శంఖచక్రములను దాల్చి పాదచారియగు పర్వతమట్లు పెద్దమేఘమట్టి రూపము వేగము గలవాడై మహాబలపరాక్రమమున దానవేంద్రుని వధింపగోరి హిరణ్యాక్షుని సభకేగెను.

దానవాన్ చోదయామాస తిర్యగ్గాత్ర మపూర్వకమ్ । గృహ్యతాం వధ్యతాం చైవ క్రీడార్థం స్థాప్యతాం తథా ॥ 24
ఇత్యేవముక్త స్సంరబ్ధః పాశహస్తాంస్తు దానవాన్ । జిఘృక్షమాణాం శ్చక్రేణ జఘాన శతశో రణే ॥ 25
హన్యమానేషు దైత్యేషు హిరణ్యాక్షోఽథ దానవాన్ । చోదయామాస సంరబ్ధాన్ వరాహాధిక కారణాత్ ॥ 26
చోదితా దానవేంద్రేణ దానవాశ్శస్త్ర పాణయః । ప్రవవర్షు స్తథా దేవం శస్త్రవర్షేణ కేశవమ్ ॥ 27
దైత్యాశ్శస్త్రనిపాతేన దేవదేవస్య చక్రిణః । నైవశేకు ర్వ్యథాం కర్తుం యత్నవంతోఽపి నిర్భయాః ॥ 28
హన్యమానోఽపి దైత్యేంద్రై ర్దానవాన్ మధుసూదనః । జఘాన చక్రేణ తదా శతశోఽథ సహస్రశః ॥ 29
హన్యమానేషు సైన్యేషు హిరణ్యాక్ష స్స్వయం తతః । ఉత్థాయ ధనుషా దేవం ప్రవవర్ష సురోత్తమమ్ ॥ 30

హిరణ్యాక్షస్తు తాన్ దృష్ట్వా విఫలాంశ్చ శిలీముఖాన్ ।
శిలీముఖాన్ సంపశ్యన్ సమపశ్యత్ మహద్భయమ్ ॥ 31
తతోఽస్త్రై ర్యుయుధే తేన దేవదేవేన చక్రిణా ।
తాన్యస్య ఫల హీనాని చకార భగవాన్ స్వయమ్ ॥ 32
తతో గదాం కాంచన పట్టనద్ధాం విభూషితాం కింకిణిజాల సంఘైః ।
చిక్షేప దైత్యాధిపతి స్సుఘోరాం తాంచాపి దేవోవిఫలీచకార ॥ 33
శక్తింతతః పట్టపినద్ధమధ్యా ముల్కానలాభాం తపనీయ చిత్రామ్ ।
చిక్షేపదైత్య స్సవరాహకాయే హుంకార దగ్ధా నిపపాత సాచ ॥ 34
తతస్త్రిశూలం జ్వలితాగ్రశూలం సశీఘ్రం దేవగణస్య సంఖ్యే ।
దైత్యాధిపస్తస్య ససర్జ వేగా దవేక్షితః సోఽపిజగామ భూమిమ్ ॥ 35
శంఖస్వనేనాఽపి జనార్దనశ్చ విద్రావ్య దైత్యాన్సకలా న్మహాత్మా ।
సకుండలం దైత్యగణాధిపస్య చిచ్ఛేద చక్రేణ శిరః ప్రసహ్య ॥ 36
నిపాతితే దైత్యపతౌ స దేవ స్సంపూజిత శ్శక్ర పితామహాభ్యామ్ ।
మయాచ సర్వైస్త్రిదశై స్సమేతై ర్జగామ కాష్ఠాం మనసా త్వభీష్టామ్ ॥ 37
శక్రోఽపి లబ్ధ్వా త్రిదివం మహాత్మా చిచ్ఛేద పక్షాన్ ధరణీ ధరాణాం ।
రరక్షచేమాం సకలం త్రిలోకీం ధర్మేణ ధర్మజ్ఞభృతాం వరిష్ఠః ॥ 38

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే శంకరగీతాసు నృవరాహ ప్రాదుర్భావే హిరణ్యాక్షవధోనామ త్రిపంచాశత్తమోఽధ్యాయః.

హిరణ్యాక్షుడా నృవరాహమూర్తింగని కనివినియెరుఁగని యాజంతువుంబట్టుడు కొట్టుడనియు క్రీడార్థముగ నిలుపుడనియు ననిసంరంభించి పాశహస్తులైన దానవులం బ్రేరేపించెను. దానవేంద్రచోదితులై రాక్షసులు శస్త్రపాణులై హరిపై శస్త్రవర్షముం గురిపించిరి. కాని చక్రాయుధుని శస్త్రపాతము నమ్మోసరింప నేరరైరి. దైత్యులలచే గొట్టబడుచుండియు వెనుదివియక చక్రాయుధముచే వందలువేలుగ రాక్షసులం గొట్టెను. అంతట హిరణ్యాక్షుడు తనవారితో విజృంభించి విల్లుగొని యమ్ములను వర్షించెను. అవి యన్నియు విఫలములగుట గని తుమ్మెదలట్టివయి విఫలములగుటగని పెద్ద భయముగొని జవైతుండ నస్త్రములం బోరెను. భగవంతుడు వానిని విఫలము సేసెను. అప్పుల దైత్యుల బంగారు పట్టము చిఱుగంటలుం గల ఘోరమయిన గదగొని విసరెను. హరి దానిని నమ్మోసరించెను. నడుమ పట్టబద్ధమై ఉల్కాగ్నివలె జ్వలించు స్వర్ణచిత్రమయిన శక్తియను నాయుధము నావరాహము మేనిపై విసరెను. అదియును నావరాహము హుంకారమున దగ్ధమై పడిపోయెను. గగనమందు త్రిశూలమును శీఘ్రగమయిన దానిని దేవసైన్య మధ్యమున వదలెను. అదియు జూచిన మాత్రన భూమిందూరెను. విష్ణువు శంఖధ్వనిమాత్రమున సర్వదానవులం దరిమి యమ్మహాత్ముడు చక్రముచే దైత్యరాజు శిరమును నరకెను. దానవుడు కూలగానే యా విష్ణువు బ్రహ్మేంద్రులచే చక్కగ బూజింపబడి శంకరునితో నెల్లదేవతలతో తనయిచ్చవచ్చిన దెసకుం జనెను. ఇంద్రుడు త్రిదివ సామ్రాజ్యముం బొంది పర్వతముల రెక్కలనరకి ధర్మజ్ఞవరిష్ఠుడు గావున ధర్మముచే సర్వభువనత్రయమును రక్షించెను.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున శంకరగీతలందు నరవరాహావతారము
హిరణ్యాక్షవధయను నేబదిమూడవ యధ్యాయము.

## ఏబదినాల్గవ యధ్యాయము - శంకరగీతలందు నరసింహావతారము

హిరణ్యాక్షే హతే దైత్యే భ్రాతా తస్య మహాత్మనః । హిరణ్యకశిపు ర్నామ చకారోగ్రం మహత్తపః ॥ 1
దశవర్ష సహస్రాణి దశవర్ష శతానిచ । తపోపవాస నిరతః స్నానమౌనాశ్రిత వ్రతః ॥ 2
తపశ్శమదమాభ్యాంచ బ్రహ్మచర్యేణ చానఘ ! । బ్రహ్మప్రీతమనా స్తస్య స్వయమాగత్య భార్గవ ! 3
విమానే నార్క వర్ణేన హంసయుక్తేన భాస్వతా । ఆదిత్యైస్సహితః సాధ్యైఃసహితోమరుదశ్విభిః ॥ 4
రుద్రైర్విశ్వసహాయైశ్చ యక్షరాక్షస పన్నగైః । దిగ్భి ర్విదిగ్భిశ్చ తథా ఖేచరైశ్చ మహాగ్రహైః ॥ 5
నిమ్నగాభి స్సముద్రైశ్చ మాస ర్త్వయన సంధిభిః । నక్షత్రైశ్చ ముహూర్తైశ్చ కాలస్యా వయవై స్తథా ॥ 6
దేవర్షిభిః పుణ్యతమైః సిద్ధై స్సప్తర్షిభి స్తథా । రాజర్షిభిః పుణ్యతమై ర్గంధర్వై రప్సరోగణైః ॥ 7
చరాచరగురు శ్శ్రీమాన్ వృత స్సర్వైర్దివౌకసైః । బ్రహ్మ బ్రహ్మవిదాం శ్రేష్ఠో దైత్యం వచనమబ్రవీత్ ॥ 8
బ్రహ్మోవాచ :
ప్రీతోఽస్మి ! తవ భక్తస్య తపసాఽనేన సువ్రత !। వరం వరయ భద్రంతే యదేష్టం కామ మాప్నుహి ॥ 9
హిరణ్యకశిపురువాచ :
న దేవాసుర గంధర్వా న యక్షోరగ రాక్షసాః । నమానుషాః పిశాచావా హన్యు ర్మాం దేవసత్తమ ! ॥ 10
ఋషయోఽపి న మాం శాపం క్రుద్ధాలోక పితామహ ! ।
శపేయు స్తపసా యుక్తాః వర మేత ద్వృణోమ్యహమ్ ॥ 11
న శస్త్రేణ న చాస్త్రేణ గిరిణా పాదపేన చ । న శుష్కేణ న చార్ద్రేణ వధో మే స్యా త్కథంచన ॥ 12
భవేయ మహమేవార్కః సోమో వాయు ర్హుతాశనః । సలిలం చాంతరిక్షంచ నక్షత్రాణి దిశో దశ ॥ 13
అహం క్రోధశ్చ కామశ్చ వరుణో వాసవో యమః ॥ ధనదశ్చ తథాఽధ్యక్షో యక్షః కింపురుషాధిపః ॥ 14

బ్రహ్మోవాచ :

ఏతే దివ్య వరాస్తాత ! మయాదత్తా స్తవాద్భుతాః ।
సర్వాన్కామా నిమాం స్తస్మాత్ ప్రాప్యసి త్వం న సంశయః ॥ 15

శంకర ఉవాచ :

ఏవముక్త్వాస భగవాన్ జగామా కాశమేవహి । వైరాజం దేవ సదనం మహర్షిగణసేవితం ॥ 16
తతో దేవాశ్చ నాగాశ్చ గంధర్వా మునయ స్తథా । వరప్రదానం శ్రుత్త్వైవ పితామహ ముపస్థితాః 17

దేవా ఊచుః :

వరేణానేన భగవన్! వధిష్యతి సనోఽసురః । తన్నః ప్రసీద ! భగవన్ ! వధోఽప్యస్య విచిన్త్యతామ్ ॥ 18
భగవన్ సర్వభూతానాం స్వయంభూ రాదికృత్ ప్రభుః ।
స్రష్టాచ హవ్య కవ్యానాం చాఽవ్యక్తః ప్రకృతిర్ధ్రువః ॥ 19

శంకర ఉవాచ :

సర్వలోకహితం వాక్యం శ్రుత్వాదేవః ప్రజాపతిః । ప్రోవాచ వరదో వాక్యం సర్వాన్ దేవగణాం స్తతః ॥ 20

బ్రహ్మోవాచ :

అవశ్యం త్రిదశా స్తేన ప్రాప్తవ్యం తపసః ఫలమ్ । తత స్తస్య వధం విష్ణు స్తపసోఽన్తే కరిష్యతి ॥ 21

శంకరుడనియె: హిరణ్యాక్షు డీల్గిన తరువాత వాని సోదరుడు హిరణ్యకశిపుడు పదుకొండువేల యేండ్లుగ్రతపము చేసెను. ఉపవాసములుండి స్నానములుచేయుచు మౌనమూనిజపించుచు శమదమసంపన్నుడై బ్రహ్మచర్యమూని చేయునాతపమ్మునకు బ్రహ్మమెచ్చి హంసయుక్త విమానమున ఆదిత్యాది దేవగణములతో దిక్కులతో (ఇంద్రాది దిక్పాలురతో ననియర్థము) గ్రహములతో నదులతో సముద్రములతో మాస ర్త్వయన సంధులతో నక్షత్రములతో ముహూర్తములు మొదలగు కాలావయవములతో పుణ్యతములయిన దేవర్షులతో సిద్ధులతో సప్తర్షులతో రాజర్షులతో గంధర్వాప్సరోగణములతో నేతెంచి చరాచరగురుండును బ్రహ్మవిద్వరిష్ఠుడును నయిన బ్రహ్మ హిరణ్యకశిపునింగని, నీతపమ్మునకు ప్రీతినొందితిని. వరమడుగుము. నీకు శుభమగుగాక! యన హిరణ్యకశిపుడు దేవాసుర గంధర్వాదులందఱివలన నాకు చావు గలగకుండుగాక! ఋషుల శాపముగూడ నాకు దగలగూడదు. శస్త్రాస్త్రములచే తరుగిరులచే తడిసిన యెండిన దాన నెద్దానను నాకు మరణము రాకూడదు. నేనొక్కడనే సూర్యుడను జంద్రుడను వాయ్వాది భూతములు అంతరిక్షము నక్షత్రములు దిక్కులు పదియునగుదుంగాక! కామము క్రోధము యక్షకింపురుషాదులు నేనయ్యెదగాక! అనవిని యీ అద్భుత దివ్య వరములన్నియు నీకిచ్చితిని. సందియములేదు నీవీ యెల్లకోర్కెలంబడయుదువు. అని పలికి పితామహుడాకసమున వైరాజమను దేవసదనమునకుజనెను. అప్పల దేవతలు మొదలుగ నందఱు నావర ప్రదానమువిని చతురాననుని దరికేగి వీడు మమ్మందఱ గడదేర్పగలడు. కావున దయదేసి వీని చావుంగూర్చి యాలోచింపుము. నీవు సర్వభూత స్రష్టవు. స్వయంభువుడవు. హవ్యకవ్యములకు నీవు కర్తవు. అవ్యక్తుడవు. ప్రకృతివి. ధ్రువుడవు. సర్వలోక హితమైన ఆ మాట విని ప్రజాపతి ఓత్రిదశులార! అవశ్యమతడు తపః ఫలముం బొందవలయును. పలామభవ మయిన తుదను విష్ణువు వానిని వధించు ననియె.

శంకర ఉవాచ :

ఏవం శ్రుత్వా సురా స్సర్వే వాక్యం పంకజ జన్మనః । స్వాని స్థానాని దివ్యాని జగ్ముస్తే వై ముదాఽన్వితాః ॥ 22
లఘుమాత్రే వరే తస్మిన్ సర్వాన్సోఽబాధత ప్రజాః । హిరణ్యకశిపు ర్దైత్యో వరదానేవ దర్పితః ॥ 23
ఆశ్రమేషు మహాత్మనో మునీంద్రాన్ సంశితవ్రతాన్ । సత్యధర్మరతాన్ దాంతాన్ దురాధర్షో భవంస్తు సః ॥ 24

దేవాంస్త్రిభువనస్థాంశ్చ పరాజిత్య మహాసురః । త్రైలోక్యం వశమానీయ స్వర్గే వసతి దానవః ॥ 25
యదా వర మదోన్మత్తో హ్యావాసం కృతవాన్ దివి । యాజ్ఞియాన్ కృతవాన్ దైత్యా నయాజ్ఞియాశ్చ దేవతా॥ 26
ఆదిత్యా వసవో రుద్రా విశ్వేదేవా స్తథాశ్వినౌ । భృగవోంగిరస స్సాధ్యా మరుతశ్చ సవాసవాః ॥ 27
శరణ్యం శరణం విష్ణుముపతస్థు ర్మహా బలమ్ । దేవం బ్రహ్మమయం విష్ణుం బ్రహ్మభూతం సనాతనమ్ ॥ 28
భూతభవ్య భవిష్యస్య ప్రభుం లోకపరాయణమ్ । నారాయణం విభుం దేవాః శరణ్యం శరణం గతాః ॥ 29

దేవా ఊచు :

త్రాయస్వనోఽద్య దేవేశ ! హిరణ్యకశిపోర్వధాత్ । త్వంహినఃపరమో దేవోబ్రహ్మాదీనాం సురోత్తమ ! ॥ 30
ప్రోత్ఫుల్లామల పత్రాక్ష ! శత్రుపక్ష క్షయంకర ! । క్షయాయదితివంశస్య శరణం త్వం భవస్వ నః ॥ 31

శ్రీభగవానువాచ :

భయం త్యజధ్వ మమరాః అభయంవో దదామ్యహమ్ । తథైవ త్రిదివం దేవా ప్రతిపద్యత మాచిరమ్ ॥ 32
ఏషోఽముం సబలం దైత్యం వరదానేన దర్పితమ్ । అవధ్య మమరేంద్రాణాం దానవేంద్రంనిహన్మ్యహమ్॥ 33

శంకర ఉవాచ :

ఏవముక్త్వా స భగవాన్ విసృజ్య త్రిదివేశ్వరాన్ । నారసింహం వపుశ్చక్రే సహస్రాంశు సమప్రభమ్ ॥ 34
ప్రాంశుం కనక శైలాభం జ్వాలాపుంజ విభూషితం । దైత్య సైన్య మహాంభోధి బడబానల వర్చసమ్ ॥ 35
సంధ్యానురక్త మేఘాభం నీలవానస మచ్యుతమ్ । దేవాధారు వనచ్ఛన్నం యథా మేరుం మహాగిరిమ్ ॥ 36
సంపూర్ణవక్త్ర దశనైః శశాంక శకలోపమైః । పూర్ణం ముక్తాఫలై శ్శుభై స్సముద్రమివ కాంచనమ్॥ 37
నఖై ర్విద్రుమ సంకాశై ర్విరాజిత కరద్వయమ్ । దైత్యనాథ క్షయకరైః క్రోధస్యేవ యథాంకురైః ॥ 38
సటాభారం సకుటిలం వహ్నిజ్వాలాగ్ర పింగళం । ధారయన్ భాతి సర్వాత్మాదావానల మివాచలః ॥ 39
దృశ్యా దృశ్యముఖె తస్య జిహ్వాభ్యుదిత చంచలా । ప్రలయాన్తాంఽబు దస్యేవ చంచలాతు తడిల్లతా ॥ 40
ఆవర్తిభిర్లోమఘనై ర్వ్యాప్తం విగ్రహ మూర్జితమ్ । మహాకటి తటస్కంధ మలాత ప్రతిమేక్షణమ్ ॥ 41
కల్పాంత మేఘ నిర్ఘోష జ్వాలా నిశ్వాస మారుతమ్ । దుర్నిరీక్ష్యం దురాధర్షం వజ్రమధ్య విభీషణమ్ ॥ 42
కృత్వామూర్తిం నృసింహస్య దానవేంద్ర సభాంయయౌ । తాం బభంజతు వేగేన దైత్యానాం భయవర్ధనః॥ 43
భజ్యమానాం సభాం దృష్ట్వా నృసింహేన మహాత్మనా । హిరణ్యకశిపూ రాజా దానవాన్ సమచోదయత్ ॥ 44
సత్వజాత మిదం ఘోరం చాఽపూర్వం పున రాగతమ్ । ఘాతయధ్వం దురాధర్షం యేన మే నాశితా సభా ॥ 45
తస్య తద్వచనం శ్రుత్వా దైత్యా శ్శత సహస్రశః । అయుధై ర్వివిధై ర్జఘ్ను ర్దేవదేవం జనార్దనమ్ ॥ 46
నానాయుధ సహస్రాణి తస్య గాత్రేషు భార్గవ ! । విశీర్ణా న్యేవ దృశ్యన్తే మృల్లోష్టానీవ పర్వతే ॥ 47
దైత్యాయుధానాం వైఫల్యంకృత్వా హత్వాచ దానవాన్ । కరపాద ప్రహారైశ్చ శతశోఽథ సహస్రశః ॥ 48
జగ్రాహ వేగాద్దైతేయం హిరణ్యకశిపుం తతః । నృసింహహేతో ర్విక్రాన్త మస్త్రవర్ష మహాంబుదమ్ । 49
వేగే నోత్సంగమారోప్య కదళీదళ లీలయా । దారయామాస దైత్యేశం వక్షస్థల మహాగిరిమ్ ॥ 50
కృత్వా త మసుభి ర్హీనం దైత్యేశం కేశవ స్స్వయమ్ । ఆసురాణాం వినాశంచ క్రుద్ధో నరహరి ర్వ్యధాత్ 51
హత్వాఽసురం శోణిత బిందుచిత్రం సంపూజ్య దేవా స్సహవాసవేన ।
జగ్ముః స్వధిష్ణ్యాని ముదా సమేతా దేవోఽప్యథాంతర్హితమూర్తిరాసీత్ ॥ 52

ఇతి శ్రీ విష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే శంకరగీతాసు నరసింహ
ప్రాదుర్భావో నామ చతుష్పంచాశత్తమోఽధ్యాయః.

బ్రహ్మవచనము సురలువిని సంతోషముతో దమ నివాసముల కరిగిరి. వరమల్పమాత్రమైనను నయ్యసుర పొగరెక్కి ప్రజలను ఋష్యాశ్రమములందు సత్యధర్మరతులు దాంతులునైన మహర్షులను రుద్రాదిత్యులను ఇంద్రాదులను వసువులను బాధించి ముల్లోకముల వశముచేసికొని స్వర్గముచేరి దేవతలకు యజ్ఞభాగములు లేకుండ జేసెను. వారు విష్ణువుంగని చెప్పుకొనిరి. దితి వంశక్షయమునకు నిన్నేము శరణు సొచ్చితిమన భగవంతుడు నరసింహరూపము దాల్చెను. ఆమూర్తి సహస్ర సూర్యసమప్రభము మహోన్నతము కనకగిరి వంటిది జ్వాలామాలా విభూషితము దైత్యసైన్య సముద్రమునకు బాడబానలము మాదిరిది సంధ్యామేఘ మట్లెరుపుగొన్నది, నీలవసనము. దేవదారు వనమధ్యమందు మేరువట్లున్నది విప్పారిన నిండు మొగమునందు చంద్రవంకలట్లున్న కోరలతో తెల్లముత్యములతోడి బంగారుసముద్రమట్లున్నది. పవడములట్టి యెర్రని దైత్యరాజనాశనము నొనరింపనున్న క్రోధాంకురములో యన్నట్లున్న గోళ్లతోడి కరయుగముంగల్గి కుటిలమైన (వంకరలుదిరిగిన) వహ్నిజ్వాలాగ్రమట్లు పింగవర్ణమైన ( ఎరుపెక్కిన ) జటాభారము పర్వతమున దావానలనట్లుండెను. ఆ స్వామి కనపడీపడని యా ముఖమునందు యిట్టటు కదలునాలుక కల్పాంతమేఘమందు చలించు విద్యుల్లత పోలె నుండెను. సుతులు చెరుగు ఘనరోమరాజితో పరివ్యాప్తమై చక్రాకారమైన కారవివలెనున్న కన్నులతో కల్పాంతమేఘ నిర్ఘోషము జ్వాలలు నిశ్వాస వాయువులతో దుర్నిరీక్ష్యము దురాధర్షమునగు వజ్రాయుధము నడిమిభాగమట్లు భయంకరము నైన మూర్తిం దాల్చి యానృసింహస్వామి దానవేంద్ర సభకురికెను. ఉతుకుటేగాదు దైత్యుల కడలుపెంచుచు నాసభామంటపమును బ్రద్దలు గొట్టెను. ఈ జంతు వతిఘోరము నపూర్వమిదె వచ్చినది దీనింజంపుడని హిరణ్యకశిపు డరచెను. అది విని దైత్యులు వంచలు వేలుగరేగి యాయుధముల నా విష్ణువుంగొట్టిరి. ఆ నృసింహమూర్తిపై నాయధములు పర్వతముపై బడిన మట్టియుండలట్లు పొడిపొడి యయ్యెను. దానవాయుధములను విఫలమొనరించి కరచరణపాశములం దానవులజంపి వేగమ హిరణ్యకశిపునిం బట్టెను. తనపై విక్రమించి పెనుమేఘమట్లు శరవర్షము గురియించు నమ్మహా దైత్యునింబట్టి వేగమున తన తొడపై నెక్కించి యరటియాకు నట్లు వాని రొమ్ముచీల్చెను. ఆ రక్కసుం జీల్చి వైచెను. వానినివిగతప్రాణు నొనరించి కేశవుడు క్రుద్ధుడై స్వయముగ నసురనాశము సేసెను. రక్తబిందువులచే విచిత్రాకృతినున్న యా నృసింహస్వామి నింద్రునితోగూడ దేవతలు వచ్చి పూజించి సమ్మోదమున తమధామములకరిగిరి. దేవదేవుండు సంతృప్తమూర్తియయ్యె.

ఇది శంకరగీతలందు నరసింహావతారమను నేబదినాల్గవయధ్యాయము

## ఏబదిఐదవ యధ్యాయము - వామనావతారము

శంకర ఉవాచ :

హతే హిరణ్యకశిపౌ దానవే దేవకంటకే । హతశేషాస్తు దైతేయాః పాతాళతలమాశ్రితాః ॥ 1

పాతాళతల సంస్థేషు దానవేషు మహాయశాః । ప్రహ్లాద పౌత్రో ధర్మాత్మా విరోచనసుతో బలిః ॥ 2

ఆరాధ్య తపసోగ్రేణ వరంలేభే పితామహాత్ । అవధ్యత్వ మజేయత్వం సమరేషు సురాసురైః ॥ 3

వరలబ్ధం బలిం జ్ఞాత్వా పునశ్చక్రుర్దితే స్సుతాః । ప్రహృష్టా దైత్యరాజానం ప్రహ్లాదానుమతే ర్బలిమ్ ॥ 4

సంప్రాప్య దైత్యరాజ్యంతు బలేన చతురంగిణా । జిత్వా దేవేశ్వరం శక్ర మాజహారాఽమరావతీమ్ ॥ 5

స్థానభ్రష్టో మహేంద్రోఽపి కశ్యపం శరణం గతః । కశ్యపేన తదా సార్ధం బ్రహ్మాణం శరణంగతః ॥ 6

బ్రహ్మణాఽభిహితో దేవం జగామ శరణం హరిమ్ । అమృతా ధ్మాత మేఘాభం శంఖచక్రగదాధరమ్ ॥ 7

దేవోఽప్యభయదానేన సంయోజ్య బలసూదనమ్ । ఉవాచ వచనం కాలే మేఘ గంభీరయా గిరా ॥ 8

దేవకంటకుడగు హిరణ్యకశిపుడు హతుడైనంత హతశేషులగు దైతేయులు పాతాళతలముం జేరిరి. అయ్యెడ మహా కీర్తిశాలి ప్రహ్లాదుని మనుమడు విరోచనుని కొడుకు బలి యుగ్రతపమున సేవించి బ్రహ్మవలన నీరికిగాని యవధ్యుడు సురాసురుల కజయ్యుడుంగా వరముంబడసెను. అది తెలిసి దితిసంతానము (దైత్యులు) ప్రహర్షమొంది ప్రహ్లాదుననుమతిని బలిని దైత్య రాజుంగావించిరి. బలి బలిమియై చతురంగ బలమున నెత్తి చని దేవేశ్వరులం గెలిచి యమరావతిని స్వాధీన మొనరించికొనెను. ఇంద్రుడు స్థానభ్రష్టుడై కశ్యపుని శరణొందెను అతనితోగూడ బ్రహ్మను శరణుసొచ్చెకు,

బ్రహ్మతెలుప నమృతపూరిత మేఘమట్లున్న శంఖచక్రగదలను దాల్చియున్న హరిని శరణందెను. ఆ దేవుండును బలారికి నభయదానముచేసి కాలమేఘ గంభీరముగ నిట్లు పలికెను.

శ్రీ భగవానువాచ :

గచ్ఛ!శక్ర ! భవిష్యామి త్రాతాతే బలసూదన ! । దేవరూపధరో భూత్వా వంచయష్యామి తం బలిమ్ ॥ 9

శంకర ఉవాచ :

ఏవముక్తస్తదా శక్రః ప్రయయౌ కశ్యపాశ్రమమ్ । అదిదేశాదితేర్గర్భం చాంశేనా భచ సర్వధా ॥ 10

గర్భస్థ ఏవ తేజాంసి దానవేభ్యః స ఆదదే । తతః కాలేన సుషువే అదితి ర్వామనాకృతిమ్ ॥ 11

యస్మిన్ జాతే సురగణాః ప్రహర్షమతులం గతాః । ఋషయశ్చ మహాభాగా స్త్రైకాల్యామలదర్శినః ॥ 12

శక్రా ! నీ వేగుము. నీ కేను రక్షకుండనయ్యెదను. దేవరూపము ధరించి యాబలిని వంచించెదనని హరియన విని యింద్రుడు కశ్యపు నాశ్రమమున కేగెను. హరి స్వాంశమున నదితిగర్భముం జొచ్చి యందుండియే దానవులతేజస్సులనాచికొనెను. అవ్వల నదితి వామనమూర్తింగనెను. అత డవతరింప త్రైకాల్యవర్తనము స్పష్టముగ జూడగల సురగణముల మితానందమందిరి.

ఏతస్మిన్నేవ కాలేతు హయమేధాయ దీక్షితః । బలిర్దైత్యపతి శ్శ్రీమాన్ స్వాలిగ్రామముపాశ్రితః ॥ 13

వామస్కన్ధే తమాదాయ తస్య యజ్ఞే బృహస్పతిః ।
అనయద్భృగు శార్దూల ! నూనం తస్యైవ మాయయా ॥ 14
యజ్ఞవాటం స సంప్రాప్య యజ్ఞం తుష్టావ వామనః ।
ఆత్మాన మాత్మనా బ్రహ్మన్ ! భస్మచ్ఛన్న ఇవానలః ॥ 15

ప్రవేశయామాస చ తం బలి ర్ధర్మభృతాం వరః । దదర్శచ మహాభాగం వామనం సుమనోహరమ్ ॥ 16

సంయుక్త సర్వావయవైః పీనై స్సంశ్లిష్ట పర్వభిః । కృష్ణాజిన జటాదండ కమండలువిరాజితమ్ ॥ 17

విక్రమిష్యన్ యథా వ్యాఘ్రో లీయతిస్మ స్వవిగ్రహే ।
విక్రమిష్యన్ తథై వోర్వీం లీనగాత్రః స్వవిగ్రహే ॥ 18
తస్మాత్తు ప్రార్థయ ద్రాజన్ ! దేహి మహ్యం క్రమత్రయమ్ ॥ 19

ఇదే సమయమున బలి అశ్వమేధ దీక్షితుడయ్యెను, శ్రీమంతుడు బలి స్వాలిగ్రామమందుండి యజ్ఞారంభమొనరించెను. బృహస్పతి ఈచిన్నివడుగుం దనమూపుపై నెక్కించుకొని యావిష్ణుమాయనుంబట్టియే బలియొక్క యజ్ఞవాటమునకుం గొంపోయెను. వామనుడట జేరి నివురుగప్పిననిప్పట్లుండి యయ్యజ్ఞమును దనస్వరూపమయినదానిం దాన పొగడెను. ధర్మశీలురలో నుత్తము డగు బలి యా వడుగును లోనికిం బ్రవేశింపజేసెను. మఱియు నా మనోహరమూర్తి మహాభాగుని యన్నియవయవములు పుష్టి

కొని యొంటొంటి నొదుసుకొనియున్నవి. కృష్ణాజినము జడలు దండకమండలు వులుందాల్చియున్నాడు. విక్రమింపబోవు బెబ్బులియట్లు దన విగ్రహమును దాన కుంచించుకొని ఉర్వీమండలమెల్ల నాక్రమింపనుండియు తన విగ్రహమందు దానుదాగి యున్నాడు. అట్టి వామనునిం బలి దర్శించెను. వామనమూర్తి, ఓ రాజా ! నాకు మూడడుగుల మేర యిమ్మని బలిని ప్రార్థించెను.

ఏవ ముక్తస్తు దేవేన బలిర్దైత్యగణాధిపః । ప్రదదా వుదకం తస్య పావయస్వేతి చాబ్రవీత్ ॥ 20
అన్యచ్చ యదభీష్టస్తే తద్గృహాణ ద్విజోత్తమ ! । ప్రతి జగ్రాహచ జలం ప్రవాత్యేవ తదాహరిః ॥ 21
ఉదఙ్ముఖైర్దైత్యవరై రీక్ష్యమాణ ఇవాంబుదః । ఆక్రమంస్తు హరిర్లోకాన్ దానవా శ్శస్త్రపాణయః ॥ 22

అది విని బలిచక్రవర్తి యా వటువునకు పాద్యార్ఘ్యములిచ్చి. నన్నుపావనుంజేయుమనెను. మఱియేదేని కోరిక గలదేని యదియుం గైకొనుమనెను. వామనుడు సుడిగాలివోలె ఆ ప్రతిగ్రహ జలమును గ్రహించి లోకములను ఆక్రమించు చున్న మేఘమువలెనున్న యాహరిని నుదఙ్ముఖులయిన రాక్షసశ్రేష్ఠులు జూచుచుండిరి.

అభిద్రవన్తి వేగేన నానా శస్త్రశిరోధరాః । గరుడాననాః ఖడ్గముఖాః మయూర వదనాస్తథా ॥ 23
ఘోరా మకరవక్త్రాశ్చ క్రోష్టువక్త్రాశ్చ దానవాః । ఆఖు దర్దుర వక్త్రాశ్చ ఘోరా వృకముఖాస్తథా ॥ 24
మార్జారశశవక్త్రాశ్చ హంస కాకాననాస్తథా । గోధా శల్యక వక్త్రాశ్చ అజావి మహిషాననాః ॥ 25
సింహ వ్యాఘ్ర శృగాలానాం ద్వీపివానరపక్షిణామ్ ।
హస్త్యశ్వగోఖరోష్ట్రాణాం భుజగానాం సమాననాః ॥ 26
ప్రతిగ్రహజలం ప్రాప్య వ్యవర్ధత తదా హరిః । ఉదఙ్ముఖైర్దేవగణైరీక్ష్యమాణ ఇవాంబుదః ॥ 27
విక్రమన్తం హరిం లోకాన్ దానవాశ్శస్త్ర పాణయః । మత్స్య కచ్ఛప వక్త్రాణాం దర్దురాణాం సమాననాః ॥ 28
స్థూల దన్తా వివృతాక్షా లంబోష్ఠజఠరాస్తథా । పింగళాక్షాః వివృత్తాస్యాః నానా బాహు శిరోధరాః ॥ 29
స్థూలాగ్రనాసాశ్చిపిటా మహా హనుకపాలినః । చీనాంశుకోత్తరాసంగాః కేచిత్ కృష్ణాజినాఽంబరాః ॥ 30
భుజంగభూషణా శ్చాన్యే కేచిన్మకుట భూషితాః । సకుండలా స్సకటకా స్సశిరస్త్రాణమస్తకాః ॥ 31
ధనుర్బాణ ధరాశ్చాన్యే తథాతోమరపాణయః ! । ఖడ్గచర్మధరాశ్చాఽన్యే తథాతోమర పాణయః ॥ 32
శతఘ్నీచక్రహస్తాశ్చ గదా ముసలపాణయః । అశ్మయంత్రాయుధోపేతా భిండిపాలాయుధాస్తథా ॥ 33
శూలోలూఖల హస్తాశ్చపరశ్వధ ధరాస్తథా । మహావృక్ష ప్రవహణాః మహాపర్వత యోధినః ॥ 34
క్రమమాణం హృషీ కేశముపావర్తన్త సర్వశః । స తాన్ మమర్ద సర్వాత్మా తన్ముఖాన్ దేవదానవాన్ ॥ 35
సరసీవ మహాపద్మాన్ మహాహస్తీవ దానవాన్ । ప్రమథ్య సర్వాన్ దైతేయాన్ హస్తపాదతలైస్తతః ॥ 36
రూపం కృత్వా మహాభీమ మాజహారాశు మేదినీమ్ । తస్యవిక్రమతో భూమిం చంద్రాదిత్యౌ స్తనాంతరే ॥ 37
పరం ప్రక్రమమాణస్య నాభిదేశే వ్యవస్థితౌ । తతః ప్రక్రమమాణస్య జానుదేశే వ్యవస్థితౌ ॥ 38
తతోఽపి ప్రమమాణస్య పద్భ్యాందేవౌ వ్యవస్థితౌ । జిత్వాన మేదినీదికృత్స్నాం హత్వాచాసుర పుంగవాన్ ॥ 39
దదౌ శక్రాయ వసుధాం విష్ణుఃబృవతాం వరః । స్వంరూపంచ తథాఽఽసాద్య దానవేంద్ర మభాషత ॥ 40
శ్రీ భగవానువాచ :
యజ్ఞవాటే త్వదీయేఽస్మిన్ స్వాలిగ్రామే మహాసుర! । మయా నివిష్టపాదేన మాపితేయం వసుంధరా ॥ 41

చిత్రవిచిత్రముఖులయిన రాక్షసులు ఆయుధ పాణులై యెదుర్కొనిరి. ప్రతిగ్రహ జలమును స్వీకరించి వామనుడు పెంపొందెను. పెరుగుచున్న హృషీకేశుని వివిధాయుధ ధరులై రాక్షసులు చుట్టుముట్టడించిరి.

అయ్యెడ నతి వేగమున రాక్షసులు పరువులువారిరి. వారు నానా ముఖ నానాకంఠములవారు. గరుడముఖులు ఖడ్గముఖులు నెమలిముఖమువారు, నక్క ఎలుక కప్ప తోడేలు పిల్లి కుందేలు హంస కాకి ఉడుము శల్యకము (ఒకరకము ముత్యపు చిప్పవంటి ముండ్లతో గూడినది) మేక గొఱ్ఱె దున్నపోతు సింహ వ్యాఘ్ర = శృగాలములు (నక్క) ద్వీపి = చిరుత పులి కోతి పక్షులు ఏనుగు గుఱ్ఱము గోవు గాడిద ఒంటె పాములు అనువాని ముఖములుగలవా రయ్యెడకేగిరి. ప్రతిగ్రహజలము (దానధార) గైకొని హరి ఉత్తరాభిముఖులై దేవతలు చూచుచుండ మేఘమట్లు పెరుగనారంభించెను. లోకముల నాక్రమించు హరిఁగని దానవులాయుధహస్తులై చేవలు తాబేళ్ల కప్పలవంటి మొగములతో స్థూలదంతులై బాగాతెఱచుకొన్న కండ్లతో వ్రేలాడు పెదవులు కడుపులతో ఎఱ్ఱనిగ్రుడ్లతో నోర్లుతెఱచుకొని నానా బాహుశిరోధరాలై (శిరోధరము = మెడ) బొఱ్ఱముక్కులు నత్తిముక్కులు గొని పెద్ద దవడలు తల పుఱ్ఱెలు గలవారై చీనాంబరోత్తరీయులై కొందఱు కొందఱు కృష్ణాజినధారులై పాములంగైసేసి కిరీటకూడలములు పెట్టుకొని కడియములూని పాగలు దాల్చి విల్లమ్ములు తోమరములు = చిల్లకోలలు కత్తులు డాలులు లాటీలు శతఘ్ని (నాల్గుమూరల యినుపముండ్లకఱ్ఱ) చక్రములు గద ముసలము (రోకలి) అశ్మయంత్రము (ఇనుపయంత్రము) బండిపాలము (ఇనుప గుదియ) శూలము ఉలూఖలము పరశ్వధము = గండ్రగొడ్డలి మున్నగు నాయుధసామగ్రిని జేతబట్టుకొని పెనుమ్రాకులు కొండలు పూని మూడడుగులాక్రమించు హృషీకేశుని గ్రమ్ముకొనిరి. ఆతడాయందఱకు సరస్సు నందున్న పెద్దతామర పూలను గజమట్లు మర్దించెను. అరచేతులంబాదతలములం జాపగొట్టి మహాభయంకర రూపములగొని భూమింగైకొనెను. భూమి నాక్రమించునాతనికి చంద్రసూర్యులు స్తనాంతరమునకు వచ్చిరి. ఇరికను నెదుగ నాభికి వచ్చిరి ఇంక నింతింతయగు చున్నవటువునకు మోకాళ్లదరికివచ్చిరి. ఆపైనికూడ నంతంతగ చెరుగుచున్న యీ పొట్టివాని యడుగుల కడకువచ్చిరి. మేదిని నెల్లగెలిచి అసుర ప్రధానుల గూల్చి యీ విష్ణువు ఇంద్రునకు వసుధ నిచ్చెను. అట్లు నిజరూపము నొంది దానవేంద్రుని కడకుజని ఓమహాసురా! స్వాలిగ్రామమన నీయీ యజ్ఞవాటియందు నాయడుగునుంచి యీ భూమినెల్ల కొలచికొంటిని.

ప్రథమంతు పదంజాతం నౌర్భంధ శిఖరే మమ । ద్వితీయం మేరుశిఖరే తృతీయం నాఽభవత్ క్వచిత్ ॥ 42

తన్మేవరయ దైత్యేంద్ర యన్మయాఽఽప్తం ప్రతిగ్రహమ్ ।

బలిరువాచ : యావతీ వసుధాదేవ ! త్వయైవ పరినిర్మితా ॥ 43

తావతీతేన సంపూర్ణా దేవదేవ ! క్రమత్రయమ్ । నకృతం యత్త్వయా దేవ ! కుతస్తన్మే మహేశ్వర ! ॥ 44

నచ తద్విద్యతే దేవ ! తద్దై వాఽన్యస్య కన్యచిత్ ।

శ్రీభగవానువాచ : నమే త్వయా పూర్యతే మే దానవేంద్ర ! యథాశ్రుతమ్ ॥ 45

సుతలం నామ పాతాలం వస ! తత్ర సుసంయతః । మయైవ నిర్మితా తత్ర మనసా శోభనాపురీ ॥ 46

జ్ఞాతిభి స్సహ ధర్మిష్ఠై ర్వస తత్ర యథాసుఖమ్ । తత్రత్వం భోక్ష్యసే భోగాన్ విశిష్టాన్ బలసూదనాత్ ॥ 47

అవాప్స్యసి తథా భోగాన్ లోకా ద్విధి వివర్జితాన్ । ప్రాకామ్యయుక్తశ్చతథా లోకేషు విహరిష్యసి ॥ 48

మన్వంతరే ద్వితీయేచ మహేంద్రత్వం కరిష్యసి । తేజసా చ మదీయేన శక్రత్వే యోక్ష్యసే బలే ॥ 49

తవశత్రుగణాన్ సర్వాన్ ఘాతయిష్యా మ్యహం తదా ।

బ్రహ్మణ్య స్త్వం శరణ్య స్త్వం యజ్ఞశీలః ప్రియంవదః ॥ 50

తపస్వీ దానశీలశ్చ వేదవేదాంగ పారగః । తస్మా ద్యశోఽభివృద్ధ్యర్థం మయాత్వమభిసంధితః ॥ 51

దేవరాజాధికాన్ భోగాన్ పాతాలస్థోఽపి భోక్ష్యసే । సన్నిధానంచ తత్రాహం కరిష్యా మ్యసురాధిప ॥ 52

మయాచ రంస్యసే సార్ధం స్పృహణీయ స్సురైరపి । శక్రత్వంచ తథా కృత్వా భావ్యే సావర్ణి కేంతరే ॥ 53

సర్వసంధి వినిర్ముక్తో మయైవ సహ రంస్యసే ॥ 54

శంకర ఉవాచ :

ఇత్యేవ ముక్త్వా సజలాంబుదాభః ప్రతప్తచామీకరధౌతవస్త్రః ।
అదర్శనం దేవవరో జగామ శక్రశ్చ లేభే సకలాం త్రిలోకీమ్ ॥ 55

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయవజ్రసంవాదే శంకరగీతాము వామనప్రాదుర్భావోనామ పంచ పంచాశత్తమోధ్యాయః.

మొదటి యడుగు సౌర్బంధమగుశిఖరమునందుండినది. రెండవ యడుగు మేరవుశిఖరమందున్నది. మూడవయడు గుంచుటకు మేర కనిపింపదు. కావున నాకైకొన్న దానము పూర్తిచేయ వలయును. అది యెట్లు సేయవలయునో కోరుము. అన బలి దేవా! నీచేతనేయెంత వసుధ నిర్మింపబడెనదిది యంతయు, నీకు సరిపోలేదు. నీకు లభింపని కడమ భూమి నాకెక్కడిది? నాకులేదు సరిగదా వాడి యింకొయించుకమేర లేదు. అన విని భగవంతుడు వాగ్దానము చేసినది చేసినట్లు నీవునాకు చెల్లింపలేదు కావున నీవు సుతలమను పాతాళమున వసింపుము. నేనే యక్కడ శోభనమైన పురము మనస్సుచే నిర్మించితిని. నీజ్ఞాతులతో ధర్మిష్ఠులతో నీవచట సుఖముండుము. అక్కడ నీవు బలారికంటె నెక్కుడు భోగముల ననుభ వింతువు. విధి విహితములుగాని యపూర్వ భోగముల నటనొందెదవు. ప్రాకామ్యముతో (సర్వ వాంఛాసాఫల్య సమృద్ధితో) నీవు లోకములందు విహరింతువు. రెండవ మన్వంతరమందు నీ వింద్రత్వముంజేయుదువు. నీ యింద్రత్వమునందు నా తేజస్సు కూడ సంయోజింపబడును. నీ శత్రుగణములనందరి నేను తుదముట్టింతును. నీవు బ్రహ్మణ్యుడవు యజ్ఞశీలుడవు ప్రియంపదుడవు తపస్వివి దాతవు వేదవేదాంగపారగుడవు. అందుచే నీకెనలేని కీర్తి కలుగగోరి నేను నీతో సమావేశము చేసితిని. దేవేంద్రుని మించిన భోగముల నీవు పాతాళమున ననుభవింతువు. అచ్చట నేనును సన్నిధానమొనరింతును. నాతోగూడ దేవతలును మెచ్చటపడునట్లు రాబోవుసావర్ణికమన్వంతరమున నింద్రత్వమును నిర్వహింతువు. సర్వసంధిముక్తుడవై నాతోగూడ క్రీడింతువు. అని సజల జలద కాంతియు జాంబూనదసచ్ఛాయాంబరుడునగు విష్ణు వంతర్ధానమొందను. ఇంద్రుడును సకల త్రిలోక సామ్రాజ్యముం బొందెను.

ఇది వామనావతారమను నేబది యైదవ అధ్యాయము

## ఏబది ఆరవ అధ్యాయము - శంకరగీతలందు విభూతివర్ణనము

రామ ఉవాచ :

తస్యదేవాదిదేవస్య విష్ణో రమితతేజసః । త్వత్తోఽహం శ్రోతు మిచ్ఛామి దివ్యా ఆత్మవిభూతయః ॥ 1

శంకర ఉవాచ :

నశక్యా విస్తరా ద్వక్తుం దేవదేవస్య భూతయః । ప్రాధాన్యత స్తే వక్ష్యామి శృణుష్వైకమనా ద్విజ! ॥ 2

సర్గే బ్రహ్మా స్థితౌ విష్ణుః సంహారేచ తథా హరః । వరుణో వాయు రాకాశో జ్యోతిశ్చ పృథివీతథా ॥ 3

దిశశ్చ విదిశ శ్చాపి తథా యేచ దిగీశ్వరాః । ఆదిత్యా వసవో రుద్రా భృగవోఽంగిరస స్తథా ॥ 4

సాధ్యాశ్చ మరుతో దేవాః విశ్వేదేవా స్తథైవచ । అశ్వినౌ పురుహూతశ్చ గంధర్వాప్సరసాం గణాః ॥ 5

పర్వతోదధిపాతాలా లోకా ద్వీపాశ్చ భార్గవ । తిర్య గూర్ధ్వ మథశ్చైవ త్వింగితం యశ్చ నేంగతే ॥ 6

సచ్చాసచ్చ మహాభాగ! ప్రకృతి ర్వికృతిశ్చ యః । కృమికీటపతంగానాం వయసాం యోనయ స్తథా ॥ 7

విద్యాధరా స్తథా యక్షా నాగాస్సర్పా స్సకిన్నరాః । రాక్షసా శ్చ పిశాచాశ్చ పితరః కాలసంధయః ॥ 8

ధర్మార్థకామమోక్షాశ్చ ధర్మద్వారాణి యానిచ । యజ్ఞాంగానిచ సర్వాణి భూతగ్రామం చతుర్విధమ్ ॥ 9
జరాయుజా శ్చాండజాశ్చ సంస్వేదజ మథోద్భిజమ్ । ఏకజ్యోతిస్స మరుతాం వసూనాం సచపావకః ॥ 10
అహిర్బుధ్న్యశ్చ రుద్రాణాం నాసత్యా వాఽశ్వినయో స్తథా । నారాయణశ్చ సాధ్యానాం భృగూణాంచ తథాక్రతుః ॥ 11
ఆదిత్యానాం తథా విష్ణు రాయు రంగిరసాం తథా । విశ్వేషాం చైవదేవానాం రోచమానః సకీర్తితః ॥ 12
వాసవస్సర్వ దేవానాం జ్యోతిషాంచ హుతాశనః । యమ స్సంయమశీలానాం విరూపాక్షః క్షమాభృతామ్ ॥ 13
యాదసాం వరుణశ్చైవ పవనః ప్లవతాం తథా । ధనాధ్యక్షశ్చ యక్షాణాం రుద్రో రౌద్ర స్తథా పరః ॥ 14
అనన్త స్సర్వ నాగానాం సూర్య స్తేజస్వినాం తథా । గ్రహాణాంచ తథా చంద్రో నక్షత్రాణాంచ కృత్తికా ॥ 15
కాలః కలయతాం శ్రేష్ఠో యుగానాంచ కృతం యుగమ్ । కల్పం మన్వంతరేశాశ్చ మనవశ్చ చతుర్దశ ॥ 16
స ఏవ దేవ స్సర్వాత్మా యే చ దేవేశ్వరా స్తథా । సంవత్సర స్తు వర్షాణాం చాయనానాం తథోత్తరః ॥ 17
మార్గశీర్ష స్తు మాసానాం ఋతూనాం కుసుమాకరః । శుక్లపక్ష స్తు పక్షాణాం తిథీనాం పూర్ణిమా తిథిః ॥ 18
కారణానాం వధః ప్రోక్తో ముహూర్తానాం తథాఽభిజిత్ । పాతాలానాం సుతలశ్చ సముద్రాణాం పయోనిధిః ॥ 19
జంబూద్వీప శ్చ ద్వీపానాం లోకానాం సత్య ఉచ్యతే । మేరు శ్శైలోచ్ఛ్రయాణాంచ వర్షేష్వపిచ భారతమ్ ॥ 20
హిమాలయ స్థావరాణాం జాహ్నవీ సరితాం తథా । పుష్కరస్సర్వ తీర్థానాం గరుడః పక్షిణాం తథా ॥ 21
గంధర్వాణాం చిత్రరథః సిద్ధానాం కపిలో మునిః । ఋషీణాంచ భృగు ర్దేవో దేవర్షీణాంచ నారదః ॥ 22
తథా బ్రహ్మఋషీణాంచ అంగిరాః పరికీర్తితః । విద్యాధరాణాం సర్వేషాం దేవ శ్చిత్రాంగద స్తథా ॥ 23
కంబరః కిన్నరాణాంచ సర్పాణా మథ వాసుకిః । ప్రహ్లాద స్సర్వదైత్యానాం రంభా చాప్సరసాం తథా ॥ 24
ఉచ్చైశ్శ్రవా స్తథాశ్వానాం ధేనూనాంచైవ కామధుక్ । ఐరావతో గజేంద్రాణాం మృగాణాంచ మృగాధిపః ॥ 25
ఆయుధానాం తథావజ్రో నరాణాంచ నరాధిపః । క్షమా క్షమావతాం దేవో బుద్ధి ర్బుద్ధిమతామపి ॥ 26
ధర్మాఽవిరుద్ధః కామశ్చ తథా ధర్మభృతాం నృణామ్ । ధర్మోధర్మ భృతాం దేవ స్తపశ్చైవ తపస్వినామ్ ॥ 27
యజ్ఞానాం జపయజ్ఞశ్చ సత్య స్సత్యవతాం తథా । వేదానాం సామవేదశ్చ అంశూనాం జ్యోతిషాం పతిః ॥ 28
గాయత్రీ సర్వమంత్రాణాం వాచః ప్రవదతాం తథా । అక్షరాణా మకారశ్చ యన్త్రాణాంచ తథా ధనుః ॥ 29
అధ్యాత్మ విద్యావిద్యానాం కవీనా ముశనా కవిః । చేతనా సర్వభూతానా మింద్రియాణాం మన స్తథా ॥ 30
బ్రహ్మా బ్రహ్మవిదాం దేవోజ్ఞానం జ్ఞానవతాం తథా । కీర్తి శ్శ్రీర్వాక్చనారీణాం స్మృతిర్మేధా తథాక్షమా ॥ 31

ఆశ్రమాణాం చతుర్థశ్చ వర్ణానాం బ్రాహ్మణ స్తథా ।
స్కందః సేనాప్రణేతౄణాం సదయశ్చ దయావతామ్ ॥ 32

జయశ్చ వ్యవసాయశ్చ తథోత్సాహవతాం ప్రభుః । అశ్వత్థః సర్వవృక్షాణా మోషధీనాం తథా యవః ॥ 33
మృత్యు స్స ఏవ మ్రియతా ముద్భవశ్చ భవిష్యతామ్ । ఝషాణాం మకరశ్చైవ ద్యూతం ఛలయతాం తథా ॥ 34
మానశ్చ సర్వ గుహ్యానాం రత్నానాం కనకం తథా । ధృతి ర్భూమౌ రసశ్చాప్సు తేజశ్చైవ హుతాశనే ॥ 35
వాయు స్స్పర్శగుణానాంచ ఖంచ శబ్ద గుణః తథా । ఏవం విభూతిభి స్సర్వం వ్యాప్య తిష్ఠతి భార్గవ ! ॥ 36
ఏకాంశేన భృగుశ్రేష్ఠ ! తస్యాంశత్రితయం దివి । దేవాశ్చ ఋషయశ్చైవ బ్రహ్మా చాహంచ భార్గవ ! ॥ 37
చక్షుషా యన్నపశ్యన్తి వినా జ్ఞాన గతిం ద్విజ ! । జ్ఞాతా జ్ఞేయ స్తథా ధ్యాతా ధ్యేయ శ్చోక్తో జనార్దనః ॥ 38
యజ్ఞో యష్టాచ గోవిందః క్షేత్రం క్షేత్రజ్ఞ ఏవచ । అన్న మన్నాద ఏవోక్తః స ఏవచ గుణత్రయమ్ ॥ 39
గా మావిశ్యచ భూతాని ధారయ త్యోజసా విభుః । పుష్ణాతి చౌషధీ స్సర్వా స్సోమో భూత్వా రసాత్మకః ॥ 40

ప్రాణినాం జఠరస్థోఽగ్ని ర్భుక్త పాచీన భార్గవ ! । చేష్టాకృత్ప్రాణినాం బ్రహ్మన్! సచవాయుశ్శరీరగః ॥ 41
యథాదిత్యగతంతేజః జగద్భాసయతేఽఖిలమ్ । యచ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజ స్తత్ర కీర్తితమ్ ॥ 42
సర్వస్యచాసౌ హృది సన్నివిష్ట స్తస్మాత్తస్మృతిర్జ్ఞాన మపోహనంచ ।
సర్వైశ్చ దేవైశ్చ స ఏవ వంద్యో వేదాన్త కృద్వేదకృదేవచాఽసౌ ॥ 43

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే శంకరగీతాసు
విభూతివర్ణనంనామ షట్పంచాశత్తమోఽధ్యాయః.

పరశురాముండనియె : దేవాదిదేవుండగు విష్ణువు విభూతులను వినగోరెదనన శంకరుండిట్లనియె ఆ విభూతి వైభవ మును విస్తరించి పలుకుట శక్యముగాదు ప్రధానములయిన వానిని దెలిపెద సావధానుండవై వినుము. విష్ణువు సృష్టికార్యమందు బ్రహ్మ స్థితియందు విష్ణువు సంహారమందు(లయకార్యమందు) హరుడు నగును. వరుణుడు వాయువు ఆకాశము జ్యోతి వసుమతి దిక్కులు మూలలు దిక్పతులు ఆదిత్యులు వసువులు రుద్రులు భృగువులు అంగిరసులు సాధ్యులు మరుత్తులు విశ్వేదేవతలు అశ్వినులు పురుహూతుడు గంధర్వాప్సరోగణములు పర్వత పారావారపాతాళములు లోకములు ద్వీపములు క్రింద మీద నడ్డముగ కదలునది కదలనిది సత్తు ( సర్వాధారము ) అసత్తు లేనిది- ప్రకృతి వికృతి క్రిమి కీటక పతంగాదులకు పశులకు యోనులు (మూలకారణములు) విద్యాధర యక్ష నాగ సర్ప కిన్నరులు రాక్షస పితరులు కితరాలు కాలసంధులు ధర్మార్థకామ మోక్షములు ధర్మద్వారములు యజ్ఞాంగములు నలువిధములైన భూతసంఘము జరాయుజాండజస్వేదజోద్భిజ్జములు నతడే మరుత్తుల కతడు ఏకజ్యోతి. వసువులకు పావకుడు. రుద్రులు కహిర్బుధ్న్యుడు. అశ్వినులకు సాధ్యులకు నారాయణుడు భృగువులకు క్రతువు ఆదిత్యులకు విష్ణువు. అంగిరస్సులకు ఆయువు. విశ్వదేవులకు రోచమానుడు సర్వదేవతలకు వాసవుడు. జ్యోతిస్సులకు హుతాశనుడు (అగ్ని) సంయమశీలురకు యముడు. క్షమావంతులకు విరూపాక్షుడు,నీటిజంతువులకు వరుణుడు. ఎగిరేవాటికి వాయువు. యక్షులకు. ధనాధ్యక్షుడు (కుబేరుడు) ఏకాదశ రుద్రులలో నొకడగు రుద్రుడు నాగులందరలో ననంతుడు తేజస్సులకు సూర్యుడు. గ్రహములకు చంద్రుడు. నక్షత్రములకు కృత్తిక. జీవులకు కాలుడు యుగములలో కృతయుగము కల్పము మన్వంతరాధిపతులు మనువులు పదు నల్గురు నాతడే.సర్వాత్మకుడైన దేవుడు దేవేశ్వరుడాయన. వర్షములకు సంవత్సరము. అయనములలో ఉత్తరాయణము. మాసములలో మార్గశీర్షము ఋతువులలో కుసుమాకరము (వసంతము)తిథులకు పూర్ణిమ. కారములకు పథముహూర్తములకుఅభిజిత్తు.* పాతాళము లకు సుతలము. సముద్రములకు పయోధి. ద్వీపములకు జంబూద్వీపము, లోకములలోసత్యలోకము. శిలోచ్చయములలో పర్వతము, వర్షములలో భారతవర్షము. స్థావరములలో హిమాలయము. నదులలో జాహ్నవి సర్వతీర్థములలో పుష్కరము పక్షులలో గరుత్మంతుడు గంధర్వులలో చిత్రరథుడు సిద్ధులలో కపిలుడు ఋషులలో భృగువు దేవర్షులలో నారదుడు బ్రహ్మర్షులలో అంగిరస్సు విద్యాధరులలో చిత్రాంగదుడు కిన్నరులలో కంబరుడు సర్పములలో వాసుకి సర్వదైత్యులలో ప్రహ్లాదుడు అప్సరసలలో రంభ అశ్వములలో ఉచ్చైశ్శ్రవము ధేనువులలో కామధేనువు గజేంద్రములలో ఐరావతము మృగములలో మృగరాజు (సింహము) ఆయుధ ములలో వజ్రము నరులలో నరాధిపుడు (రాజు) క్షమావంతులలో క్షమ బుద్ధిమంతులలో బుద్ధి ధర్మాత్ములలో ధర్మా విరుద్ధమగు కామము ధర్మనిష్ఠులలో ధర్మము తపస్సులలో తపస్సు యజ్ఞములలో జపయజ్ఞము సత్యవంతులలోసత్యము వేదములందు సామవేదము అంశువులలో సూర్యుడు సర్వమంత్రములలో గాయత్రి ప్రవక్తలలో వాక్కులు అక్షరమాలలో నకారము యంత్రములలో ధనుస్సు విద్యలలో అధ్యాత్మవిద్య(వేదాంతము)బ్రహ్మవిద్యకవులలోఉశనుడు(శుక్రుడు)సర్వభూతములలోచేతనాశక్తి ఇంద్రియములలో మనస్సు వేదవేత్తలలోబ్రహ్మ జ్ఞానులలో జ్ఞానము నారీజనమందు(స్త్రీలలో)కీర్తిశ్రీవాక్కుస్మృతి మేధ క్షమ ఆశ్ర మములలో నాల్గవది (సన్న్యాసము) వర్ణములలో బ్రాహ్మణుడు సేనానాయకులలో స్కందుడు దయావంతులలో దయ ఉత్సాహ వంతులలో జయము వ్యవసాయము (ప్రయత్నము కృషి) సర్వ వృక్షములలో అశ్వత్థము(రావి) ఓషధులలో యవలు ఆమధాన్యము

* అభిజిత్తు = పగటి పదునాల్గు గడియల తరువాతి రెండు గడియల కాలము.

మరణించువారిలో మృత్యువు పుట్టువారిలో పుట్టువు ఝషములలో(మత్స్యజాతిలో) మకరము మొసలి జూదరులలో జూదము గుహ్యము లందు (రహస్యములందు) మౌనము గుట్టు రత్నములలో కనకము భూమిలో ధృతి (ధారణశక్తి) నీటిలో తేజస్సు. అగ్నియందు తేజస్సు (వెలుగు) స్పర్శగుణము కలవానిలో వాయువు శబ్దగుణమయిన ఆకాశము. ఇట్లు విభూతులచే సర్వము వ్యాపించియున్నాడు. ఒక్కయంశముచే నీజగత్తును మూడంశములచే దివమునాక్రమించి యా హరియున్నాడు. దేవతలు ఋషులు బ్రహ్మ నేను జ్ఞానగతి చేతగాక ఈకంటిచే యా ముక్తుని జూడనేరము. జ్ఞాత(తెలియువాడు) జ్ఞేయము (తెలియబడునది) ధ్యాత (ధ్యానించువాడు) ధ్యేయుడు (ధ్యానింపబడువాడు) నా విష్ణువే. యజ్ఞము యష్ట (యజ్ఞముసేయువాడు) గోవిందుడు. క్షేత్రము (శరీరము) క్షేత్రజ్ఞుడు (కూటస్థుడు) అన్నము అన్నాదుడు (అన్నముతినువాడు) నా హరియే. ఆవిభుడు భూమియందావేశించి ఓజశ్శక్తిచే భూతములను భరించు చున్నాడు. రసాత్మకుడగు సోముడై సర్వౌషధులను పోషించుచున్నాడు ప్రాణుల జఠరమందగ్నియై (వైశ్వానరాగ్ని = ఆకలిచిచ్చు యన్నమాట) భుక్తమయిన యాహారమును అన్నివిధాల పచనముచేయుచున్నాడు, శరీరమందున్న వాయువా విష్ణువే. ఆదిత్యు నందున్న ఏ తేజస్సు యెల్లజగమును భాసింపజేయుచున్నదో చంద్రునందు నగ్నియందునే తేజస్సున్నదో యది విష్ణుతేజస్సే. అందరి హృదయమునందీతడున్నాడు. జ్ఞప్తి జ్ఞానము మఱపు నాతని వలననే కల్గును. అందరిదేవతల కాతడు వంద్యుడు, వేదాంత కర్త వేదకర్తయు నావిష్ణువే.

ఇది శ్రీ విష్ణుధర్మోత్తరమహాపురాణమున ప్రథమఖండమునందు విభూతివర్ణన మను నేబదియారవ అధ్యాయము.

## ఏబదియేడవ అధ్యాయము-భక్తిఫలప్రదర్శనము

రామ ఉవాచ :

ఆరాధ్యతే స భగవాన్ కర్మణా యేన శంకర ! । తత్సమాచక్ష్వ ! భగవన్ ! సర్వసత్త్వసుఖప్రదమ్ ॥ 1

శంకర ఉవాచ :

సాధురామ ! మహాభాగ ! సాధుదానవనాశన ! । యన్మాం పృచ్ఛసి ధర్మజ్ఞ ! కేశవారాధనం ప్రతి ॥ 2

దివసం దివసార్ధంవా ముహూర్తం చైక మేవవా । నాశశ్చాశేష పాపస్య భక్తిర్భవతి కేశవే ॥ 3

అనేకజన్మ సాహస్రైర్నానా యోన్యన్తరేషుచ । జన్తోః కల్మషహీనస్య భక్తిర్భవతి కేశవే ॥ 4

నాఽధన్యః కేశవంస్తౌతి నాఽధన్యోఽర్చయతి ప్రభుమ్ । నమత్యధన్యశ్చ హరింనాఽధన్యోవేత్తి మాధవమ్ ॥ 5

మనశ్చ తద్ధి ధర్మజ్ఞ ! కేశవే యత్ప్రవర్తతే । సా బుద్ధి స్తద్వ్రతాయైవ సతతం ప్రతితిష్ఠతి ॥ 6

సావాణీ కేశవం దేవం యాస్తౌతి భృగునందన ! । శ్రవణౌతౌ శ్రుతా యాభ్యాం సతతం తత్కథా శ్శుభాః ॥ 7

అవేహి ! ధర్మజ్ఞ ! తథా తత్పూజాకరణా త్కరౌ । తదేవం సఫలం కర్మ కేశవార్థాయ యత్కృతమ్ ॥ 8

యతో ముఖ్యఫలాఽవాప్తౌ కరణం సప్రయోజనం । మనసాతేన కిం కార్యం యున్నతిష్ఠతి కేశవే ॥ 9

బుద్ధ్యావా భార్గవశ్రేష్ఠ ! తయానాస్తి ప్రయోజనమ్ । రోగస్సా రసనా వాఽపి యయానస్తూయతే హరిః ॥ 10

గర్తౌబ్రహ్మవృతౌ కర్ణౌ యాభ్యాంతత్కర్మ నశ్రుతమ్ । భారభూతైః కరైః కార్యం తస్యనృపశోర్ద్విజ ! ॥ 11

యైర్న సంపూజితో దేవః శంఖచక్ర గదా ధరః । పాదౌతౌ సఫలౌ రామ ! కేశవాలయగామినౌ ॥ 12

తే చ నేత్రే మహాభాగ ! యాభ్యాం సందృశ్యతేహరిః । కిం తస్య చరణైః కార్యం కృతస్య నిపుణైర్ద్విజ! ॥ 13

యాభ్యాం న వ్రజతే జన్తుః కేశవాలయ దర్శనే । జాత్యంధతుల్యం తం మన్యే పురుషం పురుషోత్తమ ! 14

యోన పశ్యతి ధర్మజ్ఞ ! కేశవార్చాం పునః పునః । క్లేశసంజననం కర్మ వృథా తద్భృగు నందన ! 15

కేశవం ప్రతి యద్రామ ! క్రియతేఽహని సర్వదా । పశ్య ! కేశవ మారాధ్య మోదమానం శచీపతిమ్ ॥ 16
యమంచ వరుణంచైవ తథా వైశ్రవణం ప్రభుం । దేవేంద్రత్వ మతి స్ఫీతం సర్వభూతి స్మితం పదమ్ ॥ 17
హరిభక్తి ద్రుమా త్పుష్పం రాజసాత్ సాత్వికం ఫలమ్ ।
అణిమా మహిమా ప్రాప్తిః ప్రాకామ్యం లఘిమా తథా ॥ 18
ఈశిత్వంచ వశిత్వంచ యత్ర కామావసాయితా । ఆరాధ్య కేశవం దేవం ప్రాప్యంతే నాత్ర సంశయః ॥ 19
హత ప్రత్యంగ మాతంగే రుధిరారుణ భూతలే । సంగ్రామే విజయం రామ ! ప్రాప్యతే తత్ప్రసాదతః ॥ 20
మహాకటితట శ్రోణ్యః పీనోన్నత పయోధరాః । అకలంక శశాంకాభ వదనా నీలమూర్ధజాః ॥ 21
రమయన్తి నరం స్వప్నే దేవరామా మనోహరాః । సకృద్యే నార్చితో దేవో హేలయా వా నమస్కృతః ॥ 22
వేదవేదాంగ వపుషాం మునీనాం భావితాత్మనాం । ఋషిత్వమపి ధర్మజ్ఞ ! విజ్ఞేయం తత్ప్రసాదజమ్ ॥ 23
రమన్తే సహ రామాభిః ప్రాప్య వైద్యాధరం పదం । అన్యభావతయా నామ్నః కీర్తనాదపి భార్గవ ! ॥ 24
రత్నపర్యంక శయితా మహాభోగాశ్చ భోగినః । వీజ్యన్తే సహరామాభిః కేశవ స్మరణాదపి ॥ 25
సౌగంధికే వనే రమ్యే కైలాసే పర్వతే ద్విజ ! యద్యక్షా విహరన్తి స్మ తత్ప్రాహుః కుసుమంనతేః ॥ 26
రత్నచిత్రాసు రమ్యాసు వందనోద్యాన భూమిషు । క్రీడన్తి చ సహస్త్రీభిః గంధర్వీభిః కథాశ్రితేః ॥ 27
చతుస్సముద్రవేలాయాం మేరు వింధ్య పయోధరాం । ధరాం యే భుంజతే భూపాః ప్రణిపాతస్య తత్ఫలమ్ ॥
తస్మాత్తవాహం వక్ష్యామి యద్యదా చరత స్సదా । పురుషస్యేహ భగవాన్ సుతోష స్తుష్యతే హరిః ॥ 29
పూజ్య స్స నిత్యం వరదో మహాత్మా స్తవ్యస్సనిత్యం జగదేక వంద్యః ।
ధ్యేయ స్సనిత్యం సకలాఘహర్తా చైతావదుక్తం తవ రామ! గుహ్యమ్ ॥ 30

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే శంకర గీతాసు
భక్తిఫల ప్రదర్శనం నామ సప్త పంచాశత్తమోఽధ్యాయః.

పరశురాముండు శంకరా! ఆభగవంతు డేకర్మముచే నారాధింపబడునో సత్వసుఖ ప్రదమైన మాయంశము తెలుపు మన శంకరుండిట్లనియె నీ ప్రశ్నమంచిది. రామా! కేశవు నారాధనముగూర్చి నీవడిగినది మహా బాగా! బాగున్నది అశేష పాపము బోవుటకు మానవునకు విష్ణువునందు ఒకేరోజు సగమురోజు లేదా ఒక్క ముహూర్తమయినను భక్తికలుగును. అనేక సహస్ర జన్మలలో అనేక యోగులందు జన్మించుటలో కల్మషహీతునికి (పాపస్పర్శలేనివానికి) హరియందు భక్తిగల్గును. ధన్యుడు కాని వాడు హరిని స్తుతింపడు అధన్యుడు ఆప్రభువు నర్చింపడు అధన్యుడు (అకృతార్థుడు) కేశవునికి నమస్కరింపడు. అధన్యుడు మాధవుం దెలియలేడు. హరియం దేమనస్సు ప్రవర్తించునో ఆ బుద్ధియే (నిశ్చయాత్మకమయినది) వ్రతనిష్ఠ మగును. భార్గవ శ్రీనాథువర్ణించు జిహ్వ జిహ్వ విష్ణునాకర్ణించు వీనులు వీనులు మధువైరిదవిలిన మనము మనము-హరినిస్తుతించు వాక్కే వాక్కు. హరిశుభకథాశ్రవణముసేయు చెవులే చెవులు, హరి పూజనము సేయు కరములే కరములు. విష్ణువు కొఱకు జేసిన చేతయే చేత. స్వప్రయోజనమైన ముఖ్యఫలము పొందుటకు సాధనమగు మనస్సు హరియందు స్థిరముగ నిలువదేని యట్టి మనస్సుచే నేమి ప్రయోజనము! ఆమనస్సు నిశ్చయాత్మకమయినను దానం బ్రయోజనము లేదు, హరినిస్తుతింపని నాలుక యిది నాలుక గాదు. రోగము. వేనిచే హరిలీలా విలాసము వినబడదా చెవులు బ్రహ్మతయారుచేసిన గంటలు-శంఖ చక్ర గదాధరుని విష్ణుదేవునర్చింపని నరపశువుయొక్క భార భూతములైన యాకరములున్ననేమి లేకున్ననేమి? విష్ణువాలయమునకు నడుచు నడుగులవియే యడుగులు. వేనం దామోదరుడు దర్శింపబడు నా నేత్రములే నేత్రములు. కేశవాలయ దర్శనమున కేగనివాడు నిపుణులచే చేయబడిన జంతువే యైనను వానియొక్క పాదముల వలన బ్రయోజనమేమి? శ్రీ నాథునర్చనము మరి మది యెవ్వడు

చూడడు వాడు జాత్యంధుని వంటివాడనుకొందును. హరి సర్చింపక చేయుకుకర్మమెల్ల క్లేశకారకము వృథాయని తలంతును. కేశవుని యారాధించి సమ్మోదించుచున్న శచీపతింగనుము. యముని వరుణుని కుబేరుని సర్వైశ్వర్య విలాసమై దేవేంద్ర పదవిం గనుము. హరిభక్తి తరువునుండి రజోగుణ సంపర్కమున బుట్టు పుష్పము సాత్విక ఫలమును ఫలించును. అణిమ మహిమ ప్రాప్తి ప్రాకామ్యము లఘిమ ఈశిత్వము వశిత్వము ననెడి అష్ట సిద్ధులు హరి యారాధన వలన సిద్ధించును. ఇంతియేకాదు కామము లన్నింటికి (కోరికలకు) పరమ పర్యవసానము (ముక్తి) గూడ హరిభక్తియొక్క పరమార్థము. చక్కని నెన్నడుములుతూగ మహోన్నత పయోధరువై అకలంక శశాంక వదనలై నీలవేణువైన దేవాంగనలొక్కమారు హేలగనేని (వినోదమునకేని) హరి నర్చించువానిని హరిమ్రొక్కువానిని జేరి రమింపజేయుదురు. వేద వేదాంగమూర్తులు ఆత్మభావనులు నైన ఋషులయొక్క ఋషిత్వము గూడ శ్రీహరి ప్రసాదమున సమకూరినదని తెలియనగును. ఇదరభావనచేనేని (హరిననుకొనకయేని) నారాయణ నామస్మరణ చేసినవారు విద్యాధరస్థానముంబొంది సుందరులతో క్రీడింతురు. అక్కడ రత్న తల్పములందు శయనించి మహాభోగము లనుభవింతురు. కేశవస్మరణ పుణ్యమున నభిరామస్త్రీజను వింజామరలువీవ నానందింతురు. కైలాసమందు సౌగంధికోద్యానమందు యక్షులు విహరింతురాసుఖము శ్రీవిష్ణు వినతి పుణ్యము పూచిన పూవు. రత్న చిత్రములు. రమ్యములు నయిన నందనోద్యానములందు గంధర్వాంగనలతో విహరించు భాగ్యము హరికథా శ్రవణమువలన కల్గును, చతుస్సముద్రవేలా ప్రదేశమందు మేరు పయోధరయైన వసుంధర తోడి భోగభావము హరికి ప్రణతులయిన భూపతులకు గలుగు మహాఫలము. కావున నీకు దెల్పుచున్నాను. మానవుడెప్పుడేమిసేయు నెంతసేయు నద్దాన నిత్యసంతుష్టుడగు హరి సంతుష్టుడగును ఆయన వరదుడు మహాత్ముడు నిత్యము పూజింపదగువాడు స్తుతింపదగువాడు, అతడు జగమ్ముల కేకైక వంద్యుడు ధ్యేయుడు సకల పాపహర్త. ఇది యింతవరకు రహస్యమయిన యంశము తెల్పితిని

ఇది శ్రీ విష్ణుధర్మోత్తరమహాపురాణమున ప్రథమఖండమున శంకరగీతలందు భక్తిఫల ప్రదర్శనమను నేబది యేడవ యధ్యాయము.

## ఏబదియెనిమిదవ అధ్యాయము - భక్తిలక్షణము

శంకర ఉవాచ :

అహింసా సత్యవచనం దయా భూతేష్వనుగ్రహః । యస్యైతాని సదారామ ! తస్య తుష్యతి కేశవః ॥ 1
మాతా పితృ గురూణాంచ య స్సమ్య గిహ వర్తతే । వర్జకో మధు మాంసస్య తస్య తుష్యతి కేశవః ॥ 2
వరాహమత్స్య మాంసాని యోనాత్తి భృగునందన ! । విరతో మద్యపానాచ్చ తస్య తుష్యతి కేశవః ॥ 3
న ధారయతి నిర్మాల్య మన్య దేవోద్ధృతం తు యః । భుంక్తే నచాన్య నైవేద్యం తస్య తుష్యతి కేశవః ॥ 4
అవైష్ణవే దేవధృతం నిర్మాల్యం యః ప్రయచ్ఛతి । నైవేద్యం వా మహాభాగ ! తస్య తుష్యతి కేశవః 5
బిభర్తి మూర్ధ్ని నిర్మాల్యం కేశవార్చాధృతం తు యః । అనివేద్య న చాశ్నాతి తస్య తుష్యతి కేశవః ॥ 6
పరపీడాకరం కర్మ యస్య నాఽస్తి మహాత్మనః । సంవిభాగీచ భూతానాం తస్య తుష్యతి కేశవః ॥ 7
శృణుతే సర్వధర్మాంశ్చ సర్వాన్ దేవాన్ నమస్యతి । అనసూయు ర్జితక్రోధ స్తస్య తుష్యతి కేశవః ॥ 8
తీర్థోపవాససేవీచ ద్విజాతిగణ సేవకః । పూజకో విష్ణు భక్తానాం తస్యతుష్యతి కేశవః 9
పంచరాత్ర విదో ముఖ్యావ్ యస్తు సంపూజయే త్సదా । దేవవద్భృగు శార్దూల ! తస్యతుష్యతి కేశవః ॥ 10
పితృ దేవార్చన రతః స్వదార నిరత స్సదా । ఋతుకాలాభిగామీచ తస్య తుష్యతి కేశవః ॥ 11
నామ్నాం సహస్రేణ తథా యశ్చగాయతి తన్మనాః । సతతం కల్య ముత్థాయ తస్యతుష్యతి కేశవః ॥ 12
పౌరుషేణ చ సూక్తేన జప్య హోమాదికం సదా । యః కరో త్యమిత ప్రజ్ఞ స్తస్య తుష్యతి కేశవః ॥ 13
మిత్రస్వామిగురుద్రోహో యస్య నాఽస్తి మహాత్మనః । పరదార ధనేచ్ఛాన తస్య తుష్యతి కేశవః ॥ 14

రాజా శాస్త్రోపదేశేన రాజ్యం యశ్చ ప్రశాసతి రాజధర్మరతి ర్నిత్యం తస్య తుష్యతి కేశవః ॥ 15
యాతు నారీ పతిప్రాణా పతిభక్తా పతివ్రతా । తస్యా స్సతోషో భగవాన్ తోష మాయాతి కేశవః ॥ 16
అగ్నిహోత్ర పరో విద్వాన్ యజ్ఞైర్నిత్య మతంద్రితః ॥ యస్తు తర్పయతే దేవాన్ తస్య తుష్యతి కేశవః ॥ 17
స్వవర్ణాశ్రమధర్మస్థః పూజయన్ మధుసూదనమ్ ।కాలం నయతి యో బ్రహ్మన్! తస్య తుష్యతి కేశవః ॥ 18
సోపవాసస్తు పక్షాన్తే ద్వాదశ్యాం వా భృగూత్తమ ! । బౌధేఽహ్ని శ్రవణర్క్షేవా తృతీయాయాంతు వాపునః ॥
సోపవాసోఽర్చయతి యస్తస్య తుష్యతి కేశవః ॥ 19
పుష్పం వినా హరిం ప్రాప్య ఫలీ రత్నం క్షమాంచనా । నివేదయతి యః కృష్ణే తస్య తుష్యతి కేపవః ॥ 20
కృష్ణే పశ్యతి యత్సర్వం కృష్ణం సర్వత్ర పశ్యతి । మహాత్మా బుద్ధి సంపన్న స్తస్య తుష్యతి కేశవః ॥ 21
తత్కథాయాంచ రమతే తత్కథాం యఃకరోతిచ । తన్మనా స్తద్గతప్రాణ స్తస్య తుష్యతి కేశవః ॥ 22
సర్వభూత హితే యుక్త సర్వభూతహితే రతః । సర్వ భూతాను కంపీచ తస్య తుష్యతి కేశవః ॥ 23
అప్రణమ్య క్రియాంకాంచి ద్యస్తునాఽఽరభతే హరిమ్ । అసంభిన్నార్థ మర్యాద స్తస్య తుష్యతి కేశవః ॥ 24
నామ సంకీర్తనం నిత్యం క్షుత ప్రస్ఖలనాదిషు । యః కరోతి మహాభాగ స్తస్య తుష్యతి కేశవః ॥ 25
నవం పత్రం ఫలం పుష్పం నివేద్య మధుసూదనే । పశ్చాద్భుంక్తే స్వయం యశ్చ తస్య తుష్యతి కేశవః ॥ 26
ఆపద్యపిచ కష్టాయాం దేవేశ శపథం నరః । న కరోతి హి యోబ్రహ్మన్! తస్య తుష్యతి కేశవః ॥ 27
దేవాదుద్ధృత్య నిర్మాల్యం ఛాయాం నాక్రమతేచయః । ధూపాఽగ్ని భస్మ చ తథా తస్య తుష్యతి కేశవః ॥ 28
దృష్ట్వా సంపూజితా మర్చాంయశ్చ భక్త్యాఽభినందతి । స్వయం సంపూజయే ద్యస్తు తస్య తుష్యతి కేశవః ॥ 29
నిత్యం సంపూజయే ద్యస్తు దేవదేవస్య భక్తితః । యథాశక్త్యా మహాభాగ ! తస్య తుష్యతి కేశవః ॥ 30
న రామ వివిధై ర్దానైః న రత్న ధన సంచయైః । తోష మాయాతి దేవేశో భక్త్యా తుష్యతి కేశవః ॥ 31
దానై ర్భృగుశ్రేష్ఠ ! బహుప్రకారై స్తీర్థోపవాస వ్రత దర్శనైశ్చ ।
తథా నతోషం భగవాన్ ప్రయాతి భక్త్యా యథా తద్గత మానసానామ్ ॥ 32
ఏతావదుక్తం తవ రామ ! గుహ్యం న దేయ మేతద్భువి మత్సరాణామ్ ।
న తర్క శాస్త్రాకుల మానసానాం నాఽవైష్ణవానాం నచ నాస్తికానామ్ ॥ 33

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయవజ్రసంవాదే భక్తిలక్షణోనామ
అష్ట పంచాశత్తమోఽధ్యాయః.

శంకరుడనియె : అహింస సత్యము దయ భూతములపై అనుగ్రహము గలవాడు మాతాపితృ గురువులయెడ మంచిగా వర్తించువాడు మధుమాంసముల వర్జించినవాడు వీరియెడ కేశవుడు తుష్టుడగును. పంది, చేపలమాంసము తిననివాడు కల్లుత్రాగనివాడు ఇతరదేవతానిర్మాల్యమును ఇతర దేవతానివేదితప్రసాదమును దీసికొననివాడు నగువారియెడ హరిప్రసన్నుడగును. విష్ణుభక్తుడుకానివానికి నిర్మాల్యమును ప్రసాదమునిచ్చినవానియెడ నారాయణుడు హర్షించును. హరికి నాహారమునివేదించి సేవించువానియెడ హరి సంతుష్టుడగును. ఏమహానుభావుడు పరులకు బాధకల్గించుపనిసేయడో భూతకోటికి తాను గైకొను నాహారాదులను గొంత విభజించియిచ్చు వానియెడ హరి తృప్తుడగును, సర్వధర్మములు వినుచు సర్వదేవతలకు నమస్కరించు నసూయలేని కోపములేని వానియెడ కేశవుడు సంతోషించును. తీర్థసేవసేయు వాడు ద్విజసమూహ సేవకుడు, విష్ణు భక్తపూజకుడు, పాంచరాత్రాగమము తెలిసిన యుత్తముల దేవునట్లు సంపూజించువాడు పితృదేవతార్చన సేయువాడు స్వదారనిరతుడు ఋతుకాలమందే భార్యంబొందువాడు నిరంతరము వేకువనులేచి విష్ణునామ సంకీర్తనసేయువాడు పురుషసూక్తము జపించి హోమము సేయువాడు మిత్ర గురు స్వామి ద్రోహము సేయనివాడు పరదార ధనాదులు గోరనివాడు శాస్త్రోపదేశానుసారము రాజ్యపాలన సేయువాడు రాజధర్మాసక్తుడు నైన

వాని యెడ విష్ణువు సంప్రీతుడగును. ఏ స్త్రీ పతియే ప్రాణమనుకొని పతిభక్తికలదై పతివ్రతయగునో యామెయెడ హరి సంతుష్టుడగును. ఎవడు విద్వాంసుడై (జ్ఞానియై) లేక కర్మాచరణ విధానము మంత్రార్థము దేవతా స్వరూపాదులు తెలిసినవాడై యజ్ఞములుసేసి నిత్యమును దొందరపాటులేక దేవతలకు తృప్తినొందించునో వానియెడ హరిసంతుష్టుడగును. తన వర్ణాశ్రమ ధర్మముల గావించుకొనుచు హరి పూజనముసేయుచు కాలము వెళ్లించునతనికి విష్ణువు సంతోషించును. ఏకాదశినాడు పక్షము చివర నుపవాసముండి ద్వాదశినాడు బుధవారం నాడు శ్రవణ నక్షత్రమందు తదియనాడు హరినర్చించిన వానియెడ మాధవుడు ప్రసన్నుడగును. పూవులేకుండ హరిసన్నిధికేగి ప్రియంగుపును కుహూం = అవిసెపువ్వును (కూరపండి) నివేదించిన వానియెడ హరి సంతోషించును. ఏసూనవుడు కృష్ణునియందు సర్వమును సర్వమునందు కృష్ణునింజూచునో ఆమహాత్మునియెడ బుద్ధిమంతుని యెడ హరి ప్రసన్నుడగును. హరియందు మనసుంచి హరియే తన ప్రాణమనుకొని హరికథలను విని యానందించుచు శ్రీపతి కథలను జెప్పునాతనియెడ నారాయణుడు సంతుష్టుడగును. సర్వ భూతహితాభిరతుడై సర్వభూతానుకంపియైన వానికి హరి సంతుష్టినెందును హరికి మ్రొక్కకుండ హరినుద్దేశించి హరిసమర్చనము మొదలుగ గృహకృత్యమేది కాని యెవ్వడారంభింపడో తానుజేయు కర్మాచరణ ముందువినియుక్తమగు మంత్రము యొక్కయర్థము దానికి క్రియకు గల సంబంధము దానివలన కలుగు ఫల స్వరూపము తెలిసి శాస్త్రమర్యాద దాటకుండ నెవ్వడాచరించునో యతనియెడ శ్రీపతి సంతుష్టుడగును. తుమ్ము మొదలయినవి జరిగిన తరి నిత్యము మంత్రము క్రియపొరబడినపుడు గోవింద గోవింద కృష్ణ కృష్ణయను నామ కీర్తనముసేయు మహానుభావునియెడ హరి సంతోసించును. నూతనమైన పత్రము (తులసి మొదలయిన పత్రి) పండుపువ్వు మధుసూదనునకు నివేదించి యావల నాస్వామి నుండి నిర్మాల్యముగ దానింగైకొని యెవ్వడు తాననుభవించునో వానియెడ కేశవుడానంద భరితుడగును. ఆదేవదేవునెడ భక్తితో యథాశక్తి నిత్యార్చనము సేయు నాతని యెడ హరి సంప్రీతుడగును. రామా! వివిధ దానములచేత రత్న ధనరాసులచేత దేవేశుడు సంతోషింపడు భక్తికి సంతోషించును ఓభృగువంశాభరణా! పలురీతులగు దానములు తీర్థాటనములు ఉపవాసములు వ్రతములు దర్శనములు చేయువానిచే తదేకాగ్ర మనస్కుల భక్తిచేత సంతోషించినంతగ సంతోషింపడు. గోప్యమైన విషయమిది యింతదాక రామా! నీకు తెల్పితిని. భువిలో దీనిని మాత్సర్యముగల వారికి తర్కశాస్త్రములచే వికలమైన మనస్సుగలవాండ్రకు విష్ణుభక్తులుకాని వాండ్రకు నాస్తికులకును నీ యుపదేశ మీయదగదు.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున శంకరగీతలందు
భక్తిలక్షణమను నేబది ఎనిమిదవయధ్యాయము

## ఏబదితొమ్మిదవ అధ్యాయము - ఉపవాసఫల నిరూపణము

శ్రీరామ ఉవాచ :

ఉపోషితేన యేనేహ యంయం కామం ప్రయచ్ఛతి । తదహం శ్రోతుమిచ్ఛామి గదతస్తే వృషధ్వజ ॥ 1

శంకర ఉవాచ :

పూజితః ప్రయత్నైః స్నానైః సోపవాసైర్దినే రవేః । సంవత్సరం మహాభాగ! దీర్ఘమాయుః ప్రయచ్ఛతి ॥ 2

సోమవారే మహాభాగ ! చారోగ్యం సంప్రయచ్ఛతి । తథాభౌమదినే రామ! వైశ్వర్యం సంప్రయచ్ఛతి ॥ 3

వాసదే సోమ పుత్రస్య సర్వాకామాన్ ప్రయచ్ఛతి । అభీష్టాంచ తథా విద్యా మాఖండల గురోర్దినే ॥ 4

సౌభాగ్య మతులం లోకే భార్గవాహ్ని ప్రయచ్ఛతి । తథా శనైశ్చర స్యాహ్ని రిపూన్సర్వాన్ వ్యపోహతి ॥ 5

కృత్తికాసు తథాఽభ్యర్చ్య యజ్ఞాన్ ప్రాప్నో త్యనుత్తమాన్ ।
ప్రాజాపత్యే తథా భ్యస్చ్య ప్రజాం ప్రాప్నోతి శోభనామ్ ॥ 6
విందతే బ్రహ్మవర్చస్యం మృగశీర్షేఽర్చయన్ హరిమ్ ।
రౌద్రకర్మత్వ మాప్నోతి సిద్ధింరౌద్రే సమర్చయన్ ॥ 7

చ్యుత స్థ్సాన మవాప్నోతి పూజయానః పునర్వసౌ । పుష్యే సంపూజితో దేవః పుష్టిమగ్ర్యాం ప్రయచ్ఛతి ॥
అశ్లేషాయాం తథాఽభ్యర్చ్య శ్రియం విన్దతి మానవః । పితృప్రసాదమాప్నోతి పిత్ర్యే సంపూజయన్ హరిమ్॥
సౌభాగ్యం మహదాప్నోతి ఫాల్గునీ ష్వర్చయన్ తథా । తథైవ చోత్తరా యోగే గతిం విందతి శోభనామ్ ॥ 10
హస్తే సంపూజయన్ దేవంగజాన్ ప్రాప్నోత్యనుత్తమాన్ ।
చిత్రాసుచ తథాఽభ్యర్చ్య వస్త్రాణ్యాప్నోతి మానవః ॥ 11
ఆప్యే సమర్చయన్ దేవం రత్నభాగీ భవేన్నరః । తథోత్తరాసు ఆషాఢాసు కీర్తిం ప్రాప్నోతి శాశ్వతీమ్ ॥ 12
సర్వాన్కామా నవాప్నోతి శ్రవణేఽభ్యర్చయన్ హరిం । ధనిష్ఠాసు తథా విత్త మారోగ్యం వారుణే తథా ॥ 13
అజే పశూనవాప్నోతి గావశ్చ తదనంతరమ్ । పౌష్ణే శీల మవాప్నోతి చాశ్వాన్ ప్రాప్నోతి చాశ్వినే ॥ 14
దీర్ఘం జీవిత మాప్నోతి భరణీషు మహాభుజ ! ప్రతిపద్యర్థ మాప్నోతి కుప్యం ప్రాప్నో త్యనుత్తమమ్ ॥ 15
సర్వాన్కామా నవాప్నోతి తృతీయాయాం సమర్చయన్ ।
పశూం శ్చతుర్థ్యా మాప్నోతి పంచమ్యాం శ్రియ ముత్తమామ్ ॥ 16
షష్ఠ్యాం ప్రాప్నో త్యథాఽఽరోగ్యం సప్తమ్యాం సుహృద స్తథా ।
అష్టమ్యాంచ తథా భృత్యాన్ నవమ్యాం చ తథా యశః ॥ 17

కర్మసిద్ధి మవాప్నోతి దశమ్యాం పూజయన్ హరిమ్ । ఏకాదశ్యాం పూజయానః శ్రీభాగీ స సదా భవేత్ ॥ 18
అభీష్టాం గతిమాప్నోతి ద్వాదశ్యాం పూజయన్ హరిమ్ ।
త్రయోదశ్యాం పూజయానః రూపం ప్రాప్నోత్య నుత్తమమ్ ॥ 19
న దుర్గతి మవాప్నోతి పూజయాన శ్చతుర్దశీం । సర్వాన్ కామాన వాప్నోతి పంచదశ్యాం మహామునే ! 20
ఇత్యేత దుక్తం తవ మానవానాం కామ్యం ఫలం సమ్యగుపోషితానామ్ ।
దేవేశ్వరం పూజయతాం యథావ త్పరంపురాణం పురుషం వరేణ్యమ్ ॥ 21

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే శ్రీశంకరగీత సు ఉపవాసఫలో నామ
ఏకోన షష్టితమోఽధ్యాయః.

ఉపవాసమున్న వారికేయే ఫలముల హరియిచ్చునది తెల్పుమన శంకరుండనియె : ఆదివారమునసనియమముగ స్నానములు ఉపవాసములు వ్రతాదులుసేసి యొక్కసంవత్సరము హరినిబూజించినవారికి హరిదీర్ఘాయువునొసగును. సోమవారమిట్లుసేసిన వారి కారోగ్యమిచ్చును. మంగవారమిదిసేసిన ఐశ్వర్యమనుగ్రహించును. బుధవారముగావించిన సర్వాభీష్టము లిచ్చును. గురువారము సేసిన కోరినవిద్య ననుగ్రహించును. శుక్రవారమునందు సౌభాగ్యమొసంగును. శనివారముసేసిన సర్వశత్రువుల దలగించును. కృత్తికానక్షత్రార్చనము మహాయజ్ఞఫల మిచ్చును. ప్రాజాపత్య (రోహిణి )నక్షత్రమందు విష్ణుపూజ సేసిన చక్కని ప్రజాలాభము (సంతానము) గల్గును. మృగశీర్ష బ్రహ్మవర్చస్సును ఆరుద్ర రౌద్ర కర్మ సంసిద్ధిని పునర్వసు పోయిన స్థానమును పుష్యమి నిండుపుష్టిని ఆశ్లేష సంపదను మఖ పితృదేవతానుగ్రహమును పూర్వఫాల్గుని మహా సౌభాగ్యమును ఉత్తర ఫాల్గుని శోభన గతిని హస్తగజ సమృద్ధిని చిత్ర వస్త్రసంపత్తిని స్వాతి (ఆప్యము) రత్నసంపదను ఉత్తరాషాఢ కీర్తిని శ్రవణము సర్వకామ సంపూర్తిని ధనిష్ఠ ధనము వారుణము (శతభిషము) ఆరోగ్యమును పూర్వాభాద్ర పశుసమృద్ధిని ఉత్తరాభాద్ర గోసంపదను పౌష్ణము చక్కని శీలము అశ్విని అశ్వలాభమును భరణి దీర్ఘాయును హరి పూజకు ఫలముగా నొసంగును. ప్రతిపత్తు (పాడ్యమి) సర్వార్థ సమృద్ధిని (విదియ) వెండిని తృతీయ (తదియ) సర్వాభీష్టములకు చతుర్థి పశువులను పంచమి ఉత్తమైశ్వర్యమును షష్ఠిఆరోగ్యమును

సప్తమి మిత్రులను అష్టమి భృత్యులను నవమి కీర్తిని దశమి ధర్మసిద్ధిని ఏకాదశి శ్రీలాభమును ద్వాదశి కోరిన ఉత్తమగతిని త్రయోదశి అత్యుత్తమరూపసంపదను నొసంగును. చతుర్దశినాడు విష్ణునర్చించినవాడు దుర్గతిపాలుగాడు పూర్ణిమ సర్వాభీష్టప్రదము లెస్సగనుపవసించి వారములు పురాణ పురుషుని పరేశ్వరుని హరిని పూజించు వారికిగల్గు కామ్యఫలమిది తెలిపితిని.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము నందు ప్రథమ ఖండమున శంకరగీతలందు ఉపవాసఫల నిరూపణమను ఏబది తొమ్మిదవ యధ్యాయము.

## అరువదవ యధ్యాయము - శంకరగీతలందు ఉపవాసవిధి

రామ ఉవాచ ;

ఉపవాసా సమర్థానాం కిం స్యాదేక ముపోషితమ్ ।
మహాఫలం మహాదేవ ! తత్సమాచక్ష్వ ! పృచ్ఛతః ॥ 1

శంకర ఉవాచ :

యా రామ! శ్రవణోపేతా ద్వాదశీ మహతీచసా । తస్యా ముపోషితః స్నాతః పూజయిత్వా జనార్దనమ్ ॥ 2
ప్రాప్నోత్యయత్నా ద్ధర్మజ్ఞ ! ద్వాదశద్వాదశీ ఫలమ్ । దధ్యోదనయుతం తస్యాం జలపూర్ణం ఘటం ద్విజే ॥
వస్త్ర సంవేష్టితం దత్వా ఛత్రోపానహ మేవచ । న దుర్గతి మవాప్నోతి గతి మన్యాంచ విందతి ॥ 4
అక్షయ్యం స్థాన మాప్నోతి నాత్ర కార్యా విచారణా । శ్రవణ ద్వాదశీయోగే బుధవారో భవేద్యది ॥ 5
అత్యన్తం మహతీ నామ ద్వాదశీ సా ప్రకీర్తితా । స్నానం జప్యం తథా దానం హోమం శ్రాద్ధం సురార్చనమ్ ॥
సర్వ మక్షయ్య మాప్నోతి తస్య భృగు కులోద్వహ ! । తస్మిన్దినే తథాస్నాతో యత్ర క్వచన సంగమే ॥ 7
స క్రతుస్నానజం పుణ్యం ఫల మాప్నో త్యసంశయం । శ్రవణే సంగమాస్సర్వే ఫలపుష్టి ప్రదా స్సదా ॥ 8
విశేషా ద్వాదశీయుక్తే బుధయుక్తే విశేషతః । యథైవ ద్వాదశీ ప్రోక్తా బుధ శ్రవణ సంయుతా ॥ 9
తృతీయాచ తథా జ్ఞేయా సర్వకామ సమన్వితా । యథా తృతీయా ధర్మజ్ఞ ! తథా పంచదశీ శుభా ॥ 10
త్ర్యహః స్పృశేఽపి దివసే చోపవాసే మహాఫలః । కేశవాఽభ్యర్చనే రామ ! దాన జప్యాది కేషుచ ॥ 11

ఉపవాసము సేయ నసమర్థులగువారి కేయొక్క యుపవాసము మహాఫల ప్రదమో తెలుపుమని రాముడడుగ శంకరు డిట్లనియె - శ్రవణా నక్షత్రముతోడి ద్వాదశి చాలా గొప్పది. అందుస్నానముచేసి యుపవసించి జనార్దను నర్చించిన యాపుణ్యుడు ద్వాదశ ద్వాదశీఫలమునందును. ఆనాడు దధ్యోదనముతోబాటు జలపూర్ణకుంభమును నూత్నవస్త్రముపైనగప్పి బ్రాహ్మణునకిచ్చిగొడుగు పాదుకలును గూడ దానముచేయునాతడు దుర్గతిపాలుగాడు. ఉత్తమగతినందును. మఱియు నక్షయ్య పుణ్యస్థానమందును. ఇందాలోచింపవలసినది లేదు. శ్రవణద్వాదశితో బాటు బుధవారము గూడ యోగించెనేని యది అత్యంత మహాద్వాదశి యనబడును. నాడు సేసిన స్నానము జప దాన హోమములు శ్రాద్ధము సురార్చనము నక్షయ్య మగును. ఆనాడేదోయొక నదీసంగమ తీర్థమందు స్నానము చేసిన యాతడు నిస్సంశయముగ క్రతుస్నాన పుణ్యము (అవభృథస్నాన కృతము) నందును. శ్రవణా నక్షత్రముతో గూడిన తిథులన్నియు ఫల పుష్టినిచ్చునవే. అందులో ద్వాదశి తదియ పూర్ణిమ బుధవారమును గలియుట విశేషము. ద్వాదశి బుధవారము శ్రవణనక్షత్రముతో గలిసిన సర్వకామదము ఒకతిథి త్రిద్యుస్పృక్కు (మూడురోజులు కలిసినది) యగునేని నాడుపవాసము మహాఫలదము కేశవార్చనము దానము జపము మొదలయినవాని కది అత్యుత్తమము.

రామ ఉవాచ :

త్ర్యహః స్పృగ్దివసః కీదృక్ కదాభవతి వా ప్రభో ! । తస్యమే సంశయం బ్రూహి ! దేవదేవ ! వృషధ్వజ ! ॥

శంకర ఉవాచ :

దివా వినిర్గతా యత్రి వ్యతీతాస్యాత్తిధి ర్ద్విజ ! రాత్రిశేషే తథావేశ్య భవిష్యా స్స్పృశతీ తిథిః ॥ 13

తిథి త్రితయ సంస్పర్శా దహోరాత్రే భృగూత్తమ ! । త్ర్యహ స్పృక్ స వినిర్దిష్టః పుణ్యః పరమపావనః ॥ 14

తత్రో పోష్య శిరస్స్నాతైః కర్తవ్యం దేవతార్చనమ్ ।
జపం హోమం తథా దానం కామయద్భిర్మహత్ఫలమ్ ॥ 15

కర్మణాం పరిశేషాణా మకర్మణ్యం హి తద్దినమ్ ।
భోజ్యం త్రిమధురం (పాలు, చక్కెర, తేనె) రామ ! బ్రాహ్మణాన్ తత్ర భోజయేత్ ॥ 16

అనవిని రాముడు త్ర్యహః స్పృక్కు అనగా నెట్టిది? అది యెప్పుడువచ్చును? ఈనాసంశయము వారింపుమన శంకరుం డనియె. గతరాత్రి శేషమందు ప్రవేశించిరాజోవురోజున తిథిని గూడ స్పృశించునేని అహోరాత్రములందది తిధిత్రయ సంస్పర్శము నందీ త్ర్యహః స్పృక్కు అని పిలుపబడును. అది పుణ్యము పరమ పావనము అట శిరస్స్నానముసేసి యుపవసించిదేవతార్చనము జపము హోమము దానము సేయవలయును, అది మహాఫలదము, చేయకుండ మిగిలిన కర్మముల కాతిథిత్రయ స్పృక్కు అకర్మ ణ్యము ఆకర్మములు చేయనక్కరలేకుండనే చేసినఫలమిచ్చునది యగు నన్నమాట ఆపుణ్య దినమున త్రిమధుర మును(పాలు పంచ దారతేనె) సేవింపనగును. బ్రాహ్మణ సంతర్పణముగూడ నాడు సేయవలెను.

మహత్పూర్ణా భవత్యేకా పౌర్ణమాసీ ద్విజోత్తమ । ప్రతి సంవత్సరం తస్యాం సోపవాసో జనార్దనమ్ ॥ 17

యః పూజయతి ధర్మజ్ఞ ! తేన సంవత్సరం హరిః । పూజితః పౌర్ణమాసీషు భవతీతిహి నిశ్చయః ॥ 18

తస్యాం దానం స్వల్పమపి మహద్భవతి భార్గవ !
దానం జప్యం తతో హోమో యచ్చాన్య త్సుకృతం భవేత్ ॥ 19

రామ ఉవాచ :

సంవత్సరే పౌర్ణమాసీ మహత్పూర్వా వృషధ్వజ ! కథం ! జ్ఞేయా జగన్నాధ! తన్మమాచక్ష్వ! పృచ్ఛతః ॥ 20

శంకర ఉవాచ :

యస్యాంపూర్ణేందునా యోగం యాయాజ్జీవో మహాబలః ।
పౌర్ణ మాసీతుసాజ్ఞేయా మహత్పూర్వా ద్విజోత్తమ ! ॥ 21

ఆదిత్య గ్రహణే రామా ! గ్రహణేవానిశాభృతః । 22
ఉపవాసా దవాప్నోతి సర్వకిల్బిష నాశనమ్ ॥

స్నానం దానం తథాజప్యం చాక్షయ్యం పరికీర్తితమ్ । శ్రాద్ధంచ భార్గవశ్రేష్ఠ ! వహ్ని సంపూజనం తథా ॥ 23

ప్రతిసంవత్సరము మహాపూర్ణిమ యగునొక పర్వము నెట్లు తెలిసికొన వలెనో స్వామీ! తెల్పుమన రామునకు శంకరు డిట్లనియె. ఏపూర్ణిమనాడు గురువు మహాబలుడు యోగించునో యది మహాపూర్ణిమ. జపదాన హోమాదులు మఱి మంచిపనులేవైన నానాడనంత ఫలదములు. సూర్యచంద్ర గ్రహణములందు ఉపవాసము సర్వపాపహరము. స్నాన దానజపాదు లక్షయ్య ఫలదములు శ్రాద్ధము అగ్నియుపాసనమును నట్టివె.

రామ ఉవాచ : నక్షత్రం దేవదేవేశ ! తిథించాత్ర వినిర్గతాం ।
దృష్ట్వా యధావత్కర్తవ్యం తిథిం శంకర ! జానతా ॥ 24

శంకర ఉవాచ :

సా తిథి స్తదహోరాత్రం యస్యా మేవోదితో రవిః । తయాకర్మాణి కుర్వీత హ్రాసవృద్ధి ర్నకారణమ్ ॥ 25

శుక్లపక్షే తిథిర్జ్ఞేయా యస్యా మభ్యుదితో రవిః । ఉపోషితవ్యం నక్షత్రం యేనాస్తం యాతి భాస్కరః ॥ 26

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే శంకరగీతాసు
ఉపవాస విధిర్నామ షష్టితమోఽధ్యాయః.

అని విని పరశురాముడు. ఇక్కడ నక్షత్రమును గడచిన తిథిని నెఱిగి యథావిధి నాచరింప వలయు నన శంకరుడు, ఏనాడు రవి యేతిథియందుదయించునో ఏది అహోరాత్రములుండునో దానితో నారోజు కర్మాచరణము సేయవలయును. ఆవిధియొక్క హ్రాసముతో (తగ్గుదలతో) వృద్ధితో పెరుగడంతో దానికి సంబంధములేదు. (తిథిరౌదయికీ గ్రాహ్యా = సూర్యోదయ సమయ తిథినే గ్రహింప వలయునన్నమాట) శుక్లపక్షమందు సూర్యోదయ తిథిని గ్రహింపవలయును. సూర్యుడెందస్తమించు నానక్షత్రము నుపవాసమునకు గ్రహింప వలెను. లేదా నడిరేయి యే నక్షత్రము చంద్రునితో నున్నదో యదియును నుపవాసమందు గ్రాహ్యము.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున శంకరగీతలందు ఉపవాసవిధియను నఱువదియవ యధ్యాయము

## అరువదియొకటవ యధ్యాయము - శంకరగీతలందు అభిగమనకాలనిరూపణము

రామ ఉవాచ :

తస్యమాయా శరీరస్య విష్ణోరమితి తేజసః । ప్రాప్నువన్తికథం స్థానం నిత్య మక్షయ్య మవ్యయమ్ ॥ 1

శంకర ఉవాచ :

అఖండకారిణోరామ ! విష్ణో రమిత తేజసః । ప్రాప్నువన్తి పరంస్థానం నిత్య మక్షయ్య మవ్యయమ్ ॥ 2

రామ ఉవాచ :

అఖండ కారీ భగవన్ ! కథం భవతి శంకర ! । ఏతన్మే సంశయం బ్రూహి ! దేవదేవ ! వృషధ్వజ ! ॥ 3

శంకర ఉవాచ :

పంచకాల విధానజ్ఞ స్తత్కర్మ కరణేరతః । అఖండకారీ భవతి రామ ! దానవ నాశన ! ॥ 4

రామ ఉవాచ :

భగవన్ ! పంచ కేకాలాః కథం తేషాం తథా విధిః । ఏతన్మే దేవదేవేశ ! కౌతూహల మపానుద ! 5

శంకర ఉవాచ :

రామాభిగమనం పూర్వ ముపాదాన మతః పరం । ఇజ్యా స్వాధ్యాయ కాలేచ యోగకాల స్తథైవచ ॥ 6

తేషాం ప్రత్యేకశో వక్ష్యే విధిం తే భృగు నందన ! తన్నిబోధ ! మహాభాగ ! ప్రయతే నాన్తరాత్మనా ॥ 7

రామ ! కల్యే సముత్థాయ దన్తధావన పూర్వకమ్ ।
స్నానం కృత్వా యథా శాస్త్రం స్వాచాన్తః సు సమాహితః ॥ 8
యశ్చేహ భగవన్ ! మన్త్రం పఠన్ దేవగృహం విశేత్ ।
ప్రవిన్ద్యాత్ రామ ! జానుభ్యాం పాణిభ్యాం శిరసా తథా ॥ 9

ఓంకారం స నమస్కారం ప్రయుజ్య సు సమాహితః । యోగకాలం తు సందధ్యా దుపాదధ్యా దనంతరమ్ ॥

రామాభిగమ కాలంతు తత్ర మంత్రం తథార్పయేత్ । భగవతో బలేనేతి వీర్యేణై తేన తేజసా ॥ 11

సుప్రకీర్తిత తో యేన వేదిం ప్రజ్వాలయేద్బుధః । సౌవర్ణీం రాజతీం తామ్రీం మృణ్మయీ మాయసీంతథా ॥ 12

శిలాం చందన జాంవాపి దేవదారు భవా మథ । శింశుపాక్షోట సరళ కదంబార్జున జా మథ ॥ 13

సాల్వాశ్వకర్ణజాం రామ! త్వాయామేన తథైవచ ।
వామప్రవాణాం ప్రక్షాల్య పూర్ణకుంభాన్నవాం స్తతః ॥ 14
కల్పనీయా స్తు కలశా శ్చత్వారో భృగునందన ! సౌవర్ణా రాజతా స్తామ్రా అథవాపిహరీతిజాః ॥ 15
పాద్యమాచమనీయంచ త్వర్ఘ్యం స్నానీయమేవచ । పాద్యాత్పాద్యం తు దాతవ్యం స్నానీయాత్ స్నానమేవచ ॥
తథా ప్యాచమనీయాఖ్యాద్దేయ మాచమనం భవేత్ । దానం ప్రణయనం ప్రీతి ర్విసర్గం వి స్తరం తథా ॥ 17
తర్పణం చార్హణంచైవ త్వర్ఘ్యాదేతాని కారయేత్ । ద్వాదశాక్షరకంమన్త్రం తతో జప్త్వా సమాహితః ॥ 18
తతః పవిత్ర మంత్రేణ వేసి మభ్యుక్షయే ద్ద్విజ । ఆత్మానం చ తథా భోగాన్ కుర్యాన్మార్గ త్రయం తతః ॥ 19
విద్యా జ్ఞానం తతః కర్మ బ్రహ్మచక్రం త థైవచ । మార్గత్రయం చ క ర్తవ్యం నామార్ఘ్య కలశాన్సదా ॥ 20
పాణిమార్గం కూర్చమార్గం మధుమార్గం త థైవచ । ఉశీరమూలజం కూర్చం జీవ న్నోపాల సంభవమ్ ॥ 21

పరశురాముండు మహాతేజస్వియు మాయామానుష మూ ర్తియునైన విష్ణువుయొక్క నిత్యము క్షయరహితము అవ్యయము నైన స్థానము పొందుటెట్లని యడిగిన, శ్రీశంకరుడు అఖండకారులది పొందుదురు. పంచకాల విధాన మెఱింగినవాడు నా పంచ కాలాచరణ మందాసక్తిగల వాడును అఖండకారి యనబడును. రాముడు పంచకాలములన నేవి వాని విధియేమన శంకరుడు తెల్పుచున్నాడు. 1. అభిగమనము 2. ఉపాదానము 3. ఇజ్య (యజ్ఞము) 4. స్వాధ్యాయము 5. యోగమనునవి పంచకాలములు. నిలుకడగొన్న మనసుతో నాలింపుము. ఉషఃకాలమున మేల్కొని దంతధావనము సేసికొని స్నానము యథాశాస్త్రముగా నొనరించి యాచమన మొనరించి సమాహితుడై (కుదురుకొని) భగవన్మంత్ర పఠనము సేయుచు దేవతార్చన గృహమందు ప్రవేశింపవలె-మోకాళ్లమీదవంగి శిరసువంచి ఓంకారమును నమస్కారమును (నమశ్శబ్దమును) జతసేసి యోగకాలమును సంధానముసేయవలెను. ఆమీదట అభిగమకాలమునను సంధించి అందు మంత్రము సమర్పింపవలెను. భగవతో బలేన అను మంత్రముతో వీర్యముతో తేజస్సుతో నభిమంత్రింపబడిన యుదకముతో వేదికను ప్రక్షాళింప వలయును. బంగారు వెండి రాగి మన్ను ఇనుము రాయి శిల గంధపుచెక్క దేవదారువు శింశప = ఇరుగుడు ఆక్షోటము-అక్రూట్టు సరళ కదంబ = కడిమి అర్జునములతో సాల అశ్వకర్ణములు పయోర్తైన వామప్రవాణ మయిన దానిని ఎడమవైపు వాలినదానిని విశాలవేదిక నేర్పరచి నాల్గు కలశలను పూర్ణకుంభములుగా నందుంపవలెను. ఆకుంభములు బంగారము వెండి యిత్తడి యనునేదోదాన జేయబడవలెను. ఆ నాల్గింట పాద్యము ఆచమనీయము అర్ఘ్యము స్నానీయమునను నాల్గు ఉదకములు నింపవలెను. దేవతకు పాద్యము పాద్యకలశమునుండి నాయాకలశములనుండి గ్రహించిన తీర్థముచే సమర్పింప వలెను. ఆచమనతీర్థకలశోదకముచే ఆచమనము స్నానతీర్థముచే స్నానముగావింప దానము ప్రణయనము = అగ్ని ప్రతివిసర్గము(ఉద్వాసన) వి స్తరము = పీఠము తర్పణము పూజ అనునవి అర్ఘ్యోదకముచేనిర్వ ర్తింపవలెను. ద్వాదశాక్షరమంత్రము జపించి పవిత్రమంత్రముచే వేదిని ప్రోక్షింపవలెను. తనను ప్రోక్షించుకొనవలెను. ఆమీదమార్గత్రయమును భోగములను నొనరింపవలెను. విద్య జ్ఞానము కర్మ బ్రహ్మచక్రము అనుమార్గత్రయమును అర్ఘ్యకలశములను ఏర్పరుపవలెను. మార్గములు మూడు. 1 పాణిమార్గము 2 కూర్చమార్గము 3 మధుమార్గము అనునవి. కూర్చ పట్టివేళ్లతో జేయవలెను.

జీవశ్చ మరణంచాపి క ర్తవ్యం భృగు నందన । ప్రతిస్నానం తతః కార్యం సమానానాం క్రమాద్భవేత్ ॥ 22
తథైవ పాదపీఠానాం ప్రభవేన మహాభుజ ! । ఆసనా న్యథ కార్యాణి రత్న చిత్రాణి భార్గవ ! 23
సౌవర్ణాన్యథ రౌప్యాణి తామ్రశైల మయానిచ । తత స్త్వావాహనం కార్యం తతోఽభిగమనం తతః ॥ 24
నమస్కార స్తతః కార్యః ప్రణీతేన తతః పునః । బ్రహ్మశ్వ క్రామనౌ మన్త్రం ప్రభవేనాపి యేనచ ॥ 25
తతో జప్త్వా మహాభాగ! ప్రణవేన నివేదయేత్ । ఆసనై రర్చయే ద్దేవం తతః ప్రయత మానసః ॥ 26
అర్ఘ్యాభి రద్భిశ్చ తతో భోగై స్సర్వై రన న్తరమ్ । పాద్య ప్రతిగ్రహేణాథ పాద్యాభి శ్చాప్యన న్తరమ్ ॥ 27
పాదుకాభి స్తతో రామ ! దేవదేవం సమర్చయేత్ । తత స్త్వాచమనీయార్థం దేవదేవ ప్రతిగ్రహం ॥ 28

*వి.ధ.పు 16

దేవ మాచమనీయంచ పాదపీఠాం స్తథైవచ । దన్త కాష్ఠం తతో దద్యా జ్జిహ్వా నిర్లేఖనం తతః ॥ 29
గండూషణం తతో దద్యాత్ ముఖప్రక్షాళనం తథా । భూయ స్త్వాచమనం దేయం తర్పణం చాప్యనంతరమ్ ॥ 30
పుష్పం దీప మలంకారం ధూప ప్రకర మేవచ । నివేద్య విధి వత్సర్వం తతః పశ్చా న్నివేదయేత్ ॥ 31
సేవ్యాని రామ బీజాని త్వర్హణీయం తతఃపునః । మధుపర్కం తతో దద్యా ద్దధి-సర్పి స్తథా మధు ॥ 32
దధ్య లాభే పయః కార్యం మధ్వలాభే తథాగుడమ్ । ఘృత ప్రతి నిధిర్నాస్తి తత్ప్రయత్నా త్సమర్చయేత్ ॥ 33
ఏకాంగోవా సమస్తోవా మధుపర్కో విధీయతే । వ్యంగం వర్జ్యం ప్రయత్నేన నిత్యమేవ విజానతా ॥ 34
దర్పణం తు తతో దద్యా త్తతో నిర్భ ర్త్సనం బుధః । తత స్త్వాచమనీయం చ విధివత్ సు సమాహితః ॥ 35
హ స్త నిష్పుంసనార్థాయ తతో దద్యాత్తు గంధకం । తతః పశుం బుధః కుర్యా ద్యథావ న్మధు పార్కికమ్ ॥
మాధుపార్కిక మశ్వత్థపత్రం వా వినివేదయేత్ । ఘృతావద్యం తతో దద్యాత్ తాంబూలం చాప్య న న్తరమ్ ॥
మాత్రాం చ దక్షిణార్థాయ బ్రాహ్మణాయ నివేదయేత్ । మంగళాని యథాశక్త్యా తతో దేవే నివేదయేత్ ॥ 38
తతోఽభిగమకాలంతు సందద్యాత్పురుషోత్తమే । ఉపాదాన మథోదద్యా త్కుర్యాచ్చైవ విసర్జనమ్ ॥ 39

తతోఽగ్ని శరణం గత్వా వహ్నిం సంతర్పయే ద్బుధః ।
బ్రాహ్మణానాం యథాశక్తి దానం దద్యా దనంతరమ్ ॥ 40
ఏతన్మయా తే కథితం సమగ్రం యథానుపూర్వ్యాభిగమస్య కాలమ్ ।
గచ్ఛేదుపాదాన కృత ప్రయత్న స్తతో యథావ ద్భృగువంశ చంద్ర ॥ 41

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే మహాపురాణే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే శంకరగీతాసు
అభిగమనకాలో నామ ఏకషష్టితమోఽధ్యాయః.

బంగారు వెండి రాగి రాయి యనువానితో రత్న చిత్రములైన ఆసనములు ఏర్పరచవలెను. ఆమీద దేవతాహ్వానము సేసి యభిగమనము సేయవలెను. అవ్వల ప్రణీతేన ప్రభవేన యనుయంత్రముతోను "బ్రహ్మేశ్వక్రామనౌ" అనుమంత్రముచేగాని ప్రభవేన అను దానిచే కాని నమస్కారము సేయవలెను. అటుపై జపించి ప్రణపముతో నివేదింపవలయును. అటుపై నిశ్చల మనస్కుడై ఆసనములు సమర్పించి అర్ఘ్యపాత్రలోని యర్ఘ్యమునిచ్చి పాద్యజలమున పాద్యార్ఘ్యనొసంగి సర్వభోగములచే సర్చన సేయవలెను. ఆమీద పాదుకలతో దేవేశు నర్చింపవలెను. అటుపై నాచమనమునకు దేవ దేవ ప్రతి గ్రహం దేవుని ఆచమనీయం పాదపీఠమును పూజింప వలెను. (ప్రతిగ్రహమనగానిచ్చట దేవదేవుని పత్ని యన్నమాట) అటుపై దంతకాష్ఠము జిహ్వానిర్లేఖనము = నాలుక బద్దయు నీయవలెను. అటుపై పుక్కిలించుటకుదకము (గండూషణము) ముఖప్రక్షాలనోదకమునీయవలెను. అటుపై నాచమన తర్పణము నొసంగవలెను. పుష్పము ధూపను దీపము అలంకారము ధూపమునిచ్చి తేనె నైవేద్యము పెట్టవలెను. సేవ్యాని రామ! బీజాని త్వర్హణీయం తతః పునః మధుపర్కమామీద నీయవలెను. (తేనె నీయవలెను) ఆవుపెరుగు నెయ్యి తేనె పెరుగు లేనిచో పాలుతేనె లేనిచో బెల్లము నివేదింపవలెను. ఆవునేతికి ప్రతినిధి ద్రవ్యము లేదుగాన ఆవునేతినే తప్పక సమర్పింపవలెను. మధుపర్కము ఏకాంగముకాని సమస్తమునుగాని సమర్పింపవలెను. తెలిసినవాడు వ్యంగముగా మధుపర్కము సమర్పింపరాదు అనగా మధుపర్కాంగములు తేనెతోపాటుగ ఆవునెయ్యి ఆవుపెరుగు ఆవుపాలు పంచదార (పంచామృతము) కలిపి సమర్పింప వలెను. ఆమీద దర్పణము చూపవలెను. అటుపై నిర్భర్త్సకము = అలక్తకమ్ ఇక్కడ లాక్షారాగము పారాణి అనవచ్చునేమో. ఆచమనము నీయవలెను. హస్త నిష్పుంసనము కొరకు గంధకమర్పింపవలెను. మాధుపార్కికముగా (మధుపర్కాంగముగ) పశు వునుగాని ప్రతినిధిగా రావియాకుగాని యీయవలెను. ఘృతావద్య మొసగినమీదట తాంబూలమీయవలెను. విప్రునికి దక్షిణగా చిల్లర డబ్బులు మాత్రమొసగవలెను. దేవునికి యథాశక్తి మంగళములు నివేదింపవలెను. మంగళనీరాజనాదులు మంత్రపుష్పాదు

లన్నమాట. అటుపై పురుషోత్తమునెడ అభిగమనకాలమును సమర్పింపవలెను. అటుపై ఉపాదానమునొసంగి విసర్జనముగావింప వలెను. (ఉద్వాసనమన్నమాట) అటుపైనింటికేగి అగ్నిని వేల్వపలయును యథాశక్తి బ్రాహ్మణులకు దాన మీయవలెను. ఇది యభిగమనకాలము' అను అర్చనావిధానమును ఆను పూర్విగా నీకు జెప్పితిని. అటుపై నుపాదానకాలమునుగూర్చి ప్రయత్నముపూని, యథావిధిగ నేగవలయును.

ఇది శ్రీ విష్ణుధర్మోత్తర మహాపురాణమున ప్రథమఖండమున శంకరగీతలందు అభిగమనకాలమను నరువదియొకటవ యధ్యాయము.

## అరువదిరెండవ అధ్యాయము - శంకరగీత-ఉపాదానకరణనిరూపణము

శంకర ఉవాచ :

భోగానా మర్జనం కార్యం తతో రామ ! స్వకర్మణా । స్థిరాణా మస్థిరాణాంచ యథావద్భృగు నందన ! 1
ఆసనాద్యాస్తు యే భోగా కాలేనాప్యవినాశినః । స్థిరా స్తే రామ ! నిర్దిష్టాః పరిశిష్టా స్తథా చరాః ॥ 2
పుష్పం పత్రం ఫలం మూలం తథా హరితకం శుభమ్ । ఉదకం చార్చనీయంస్యాత్ తస్మిన్నహని భార్గవ ! 3
ఉపాదానాయ నిష్క్రా స్తే కుటుంబిన్యథ సత్వరమ్ । కుటుంబినీ సంప్రయాతా ధౌతోపస్కర భాజనా ॥ 4
సాధ్యానాం నామ బీజానాం పశోశ్చ సుకృతస్యచ । శాకానాం వ్యంజనానాం చ స్వర్జితానాం గతేఽహని ॥ 5
శక్తిం కుర్యాత్సదా తస్య వహ్నినోపరమేన చ । దేశే శుచౌ సుప్రయాతా సుసహాయగుణాన్వితా ॥ 6
సర్వం ప్రక్షాళితం కార్యం కేశ కీటాది వర్జితమ్ । భూమా వనుప లిప్తాయాం స్థాప్యం రామ ! న కించన ॥ 7
సర్వం సాధ్య మథాన్నాద్యం గంధవర్ణ రసాన్వితమ్। నిత్యం పరిపచే ద్రామ! నా స్వాద్యం కేనచిత్ క్వచిత్॥ 8
ఉపాదాన మథాదాయ ప్రవిశ్య చ గృహీ గృహమ్ । శుచౌ ప్రక్షాళితం సర్వం చోపాదాన ముపన్యసేత్ ॥ 9
సుప్రక్షాళ్య తథా భాగం పవిత్రేణ సముత్ క్షిపేత్ । ఏవం కృత్వా హ్యుపాదానం స్నాయాత్తు విధినా తతః ॥ 10
ధౌత వాసాః సుప్రయతః స్వాచాంతః సుసమాహితః । ప్రవిశ్య దేవతా వేశ్మ ప్రాగ్వత్ భృగు కులోద్వహ ॥ 11
నమస్కారాదికం సర్వం ప్రయుంజీత సమాహితః । ఉపాదానానుసంధానం త్వాదానం చాప్యన న్తరమ్ ॥ 12
ఇజ్యా కాలస్య ధర్మజ్ఞ ! కుర్యాత్ ప్రయత మానసః ॥ 13
ఆసన్నభోగః ప్రయతా న్తరాత్మా కుర్యాదథే జ్యాం రణచండ వేగ ।
క్రోధం నియమ్యాత్మ హితే నివిష్ట స్తద్భావ భావోప హితశ్చ నిత్యమ్ ॥ 14

ఇతి శ్రీ విష్ణు ధర్మోత్తరే ప్రథమ ఖండే-మార్కండేయ వజ్ర సంవాదే శంకర గీతాసు ఉపాదానకరణోనామ ద్విషష్టితమోఽధ్యాయః.

శంకరుడనియె, భృగునందన ! స్వధర్మముచే యథావిధిగ స్థిరములు అస్థిరములు నైన భోగములను ఆర్జింపవలయును. శయనాసనాదులు (మంచములు కుర్చీలు) మొదలయినవి ఎంతకాలమునకును నశింపనివి స్థిర భోగములు కొన్నాళ్లకు చెడిపోవునవి చరభోగములు. పత్రము (పత్రి) పుష్పము ఫలము మూలము హరితకము ఉదకమును ఆనాదర్చింపవలయును. అటుపైన నుపాదానమునకు కుటుంబి బయలుదేవవలెను. ఆయన భార్యయు (కుటుంబిని) మడి గట్టుకొని గిన్నెలు చెంబులు కడిగికొని (శుద్ధిచేసి కొని) సాధ్యములయిన బీజములయొక్కయు (పంట కుపయోగించు కందులు పెసలు మొదలయినవానియొక్క) చక్కగా నమరుపబడిన పశువుయొక్క నిస్సనేకూర్చిన ఆకుకూరలకూరలు మొదలరగువానియొక్క పాకము అగ్నిచేత ఉపదమము చేత (దంపుట రుబ్బుట మొదలయిన విధముగా) శక్తినిగావింపవలయును. (శక్తి = పచనము) ఈ పంటప్రదేశము శుచి (మడి) గా నుండవలయును. ఆమె ఆచారవంతురాలై మంచి సహాయపడువానితో నీ వంటచేయవలెను. కేశములు పురుగులు లేకుండ నంతయు కడిగి

సిద్ధము చేయవలెను. అలకని యింటిలో నే కొంచెమునుంచరాదు. వండవలసిన పదార్థము అన్నాదులు సుగంధములు సువర్ణమునై యుండవలెను. దాని నెవ్వరు నెక్కడగాని వాసనయైన చూడకుండ మూతలుపెట్టి యుంచవలెను. ఆమీద నా గృహస్థు ఉపాదానమును (ఇంటింట తిరిగి సేకరించిన పదార్థమును) తీసికొనివచ్చి యింటిలో ప్రవేశించి యావస్తువులను బ్రక్షాళించి సరియైన చోట నుంచవలెను. అందులోభాగమును బాగుగ కడిగి పవిత్రముచే ప్రోక్షణసేయవలెను. ఉపాదానముగొనివచ్చి యథావిధి స్నానము చేసి మడిబట్టలు కట్టుకొని నియమవంతుడై నిశ్చలమతియై యాచమనముచేసి దేవతార్చన గృహముంజొచ్చి నమస్కారాద్యుపచారములు సేయవలెను. ఉపాదానమును సమకూర్చుట ఆ మీదదానిని దాను గైకొనుట ఇజ్యాకాలమునకు వినియోగపడుపవలెను. భోగములు సమకూర్చుకొన్నవాడై ప్రయతాత్ముడై యామీద ఇజ్యయనబడును.) ఆ ఆచరణముచేయునపుడు క్రోధమునదుపులో బెట్టుకొని ఆత్మహితవునకు ఆయా మంత్ర దేవతాత్మద్రవ్యాదులందు భావముంచి నిత్యమును ఇజ్యాచరణము, ఇజ్యాచరణమున బ్రవర్తింపవలెను. బ్రహ్మయజ్ఞాదులు పంచయజ్ఞములు గృహస్థునకు విహితములయినవిగావింపవలెనన్నమాట.

ఇది శ్రీ విష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున శంకరగీతలందు ఉపాదానకరణమను
అరువదిరెండవ అధ్యాయము.

## అరువదిమూడవ అధ్యాయము - ఇజ్యాకాలవిధి

శంకర ఉవాచ :

పాద పీఠాన్తకం కర్మ కృత్వా ప్రా గుక్త మంజసా । నివేద్య దర్పణం దేవ ! తతో మాత్రాం నివేదయేత్ ॥ 1
బీజై స్తు పరిధానార్థం ప్రయత స్సు సమాహితః । తైల ముద్వ ర్తనం చైవ చమసీం బాప్యన న్తరమ్ ॥ 2
తతో నిష్పంసనం కృత్వా దేయా న్యాచమనానిచ ।
రో(ప్రంకాలీయకం చైవ తథా వై బీజపూరకం ॥ 3
వర్ణకం తగరం చైవ ప్రియంగుం గౌర సర్షపాః । సర్వౌషధీ ర్వృక్షబీజం సర్గ గంధాంశ్చ భార్గవ ! 4
రత్నోదకంచ వివిధం స్నానీయ ముదకం తథా । స్నానీయంచ తతో రామ! సు సుగంధంచ దాపయేత్ ॥ 5
తతస్సుషర్మణార్థియాః కలశాః సుమనోహరాః ! స్వలంకృతాః ప్రదాతవ్యాః ఫలపల్లవ పూరితాః ॥ 6
పుష్పగంధయుతా రామ ! పవిత్రేణ పవిత్రితాః । శుభానాం తీర్థసరితాం రామ ! పుణ్యజలైః శుభైః ॥ 7
యథావిభవత స్తేషాం బహుత్వమపికారయేత్ । తస్మిన్కాలే తథాకార్యం క్ష్వేడితోత్కృష్టనిస్స్వనమ్ ॥ 8
జయశబ్దం విపులం శంఖభేరీవిమిశ్రితమ్ । ఉదక గ్రహణార్థియంతతో దద్యాచ్ఛాటకమ్ ॥ 9
తతోరామ ! ప్రదాతవ్యం ధౌతవాసోయుగం శుభమ్ । తత స్తుపూర్ణకలశ మాసనానాం ప్రదక్షిణమ్ ॥ 10
కృత్వారామ ! క్షిపే ద్వేద్యాం పుష్పపల్లవ శోభితమ్ । తతస్త్వాచమనీయంచ పూర్వవద్వినివేదయేత్ ॥ 11
మంగళానిచ ముఖ్యాని తతో దద్యా ద్విచక్షణః । సత్యాసనస్థందేవేశ మర్చయిష్యామ్యతఃపరమ్ ॥ 12
స్నానాసనాని త్యజ్యన్తా మిత్యేవం పరికీర్తయేత్ । మార్గత్రయాదథారభ్య పాదపీఠాంతకం పునః ॥ 13
కర్తవ్యం సకలం కర్మ త్వావాహన విసర్జనమ్ । తతోనులేపనం దద్యా ద్వ్యజనేన చ వీజయేత్ ॥ 14
తతశ్చపీటకం దద్యాత్తథా కూర్చ ప్రసాదనమ్ । వస్త్రం విభూషణంచైవ పుష్పాణి వివిధానిచ ॥ 15
వేష్టనంచస్రజంచైవ కంకణంచమనోహరమ్ । తథా రమ్యం ప్రతిసరం సుపిష్టంచ తథాంజనమ్ ॥ 16
దర్పణంచోపచారంచ ప్రదీపం ధూపమేవచ । తథైవాచమనీయంచ గీతవాద్యస్వనం తథా ॥ 17
పుణ్యాహ జయశబ్దంచ స్తోత్రోదీరణమేవచ । తథైవోపానహే దేయే ఛత్రం చామరమేవచ ॥ 18
యానంచ వాహనంచైవ పతాకాశ్చధ్వజానిచ । భోగానాం పూరణార్థియాం తతోమాత్రాం నివేదయేత్ ॥ 19

భోగానాం సర్జనం కృత్వా యథాశక్త్యా ద్విజోత్తమ । అవిద్యమానా యేభోగాః
మాత్రాస్వేవ ప్రకల్పయేత్ ॥ 20
ఏవ మభ్యర్చ్య దేవేశం సర్వభోగై స్సమాహితః । అర్చయేన్మధుపర్కేణ పశుయాగో నచేద్భవేత్ ॥ 21
పశుయాగాభి గమనే మధుపర్కో విధీయతే । అభ్యర్చ్య మధుపర్కేణ తతస్త్వన్యేన పూజయేత్ ॥ 22
అత్రాసనాన్యపీచ్ఛన్తి కేచిదప్యపరాణి తు । ఆదౌ స్థాలీచ తేనాథ ప్రదద్యా దర్ఘ్యణీం తతః ॥ 23
అన్నం హరితకోపేతం భక్ష్యం వ్యంజన సంయుతం ।
నివేద్య దర్పణం దద్యా త్తథా నిష్పంసనం తతః ॥ 24
కృత్వా త్వాచమనీయంతు మాత్రాంచ తదనన్తరమ్ । తతస్తు సంవిభాగార్థం దాతవ్యం త్వర్ఘ్యణం తతః ॥ 25
భూయో నివేదయే దన్నం పూర్వవత్సుసమాహితః ।
దర్పణంచ తతో దద్యాత్ పాద్యం నిష్పంసనం తతః ॥ 26
దత్వా చాచమనీయంచ శాటకంచ నివేదయేత్ । హస్త నిష్పంసనార్థాయ మాత్రాంచ తదనన్తరమ్ ॥ 27
నివేద్య పశ్చాత్తాంబూలం దేవం వహ్నౌసమర్చయేత్ ।
వహ్నిసంపూజనం కృత్వా కార్యకారి సమర్పణమ్ ॥ 28
అతిథీనాం తతఃకార్యం భర్తవ్యానాంచ భార్గవ । తతో ఽను యాగకాలేతు పవిత్రేణ సముత్క్షిపేత్॥ 29
ఆసనం భోజనం చైవ స్నానం ప్రయతమానసః । ఉపవిశ్య తతః పశ్చాత్ప్రభవే నాప్యయేనచ ॥ 30
ఇద మగ్నేతి మంత్రేణ ప్రాచ్యాంగ్రాసాష్టకం భవేత్ । తతస్తు ప్రయతో భూత్వా విశే ద్దేవగృహం తతః 31
ఇజ్యాకాలానుసంధానం తతః కుర్యా త్సమాహితః । కుర్యాత్స్వాధ్యాయ కాలస్య చోపాదాన మనన్తరమ్॥ 32
విసర్జనం తతః కుర్యా త్ప్రయతే నాన్తరాత్మనా। ఇజ్యాకాల విధిస్త్వేష మయాతే రామ కీర్తితః ॥ 33

శంకరుడు పలికె : ఇంతవున్ను తెలిపిన పాదపీఠముదనుకగల యర్చనమొనరించి దేవునికి దర్పణము (అద్దము) చూపి బీజములతో (నవధాన్యాలు) చిల్లరడబ్బులు దక్షిణతో నీయవలెను. తైలము ఉద్వర్తనము (పూయుట) చమసి నిష్పంసనమును జేసి యాచమనముల నొసంగవలెను. రోధ్రము కాలీయకము బీజపూరకము వర్ణకము తగరము ప్రియంగువు తెల్లావాలు సర్వౌషధులు వృషబీజములు సర్వగంధములు రత్నోదకము సుగంధభరితములు మూడురకాల స్నానీయోదకములను సమకూర్చవలెను. అవ్వల (సుషుమ్నణార్థియాః) చక్కని కలశాలను గంధపుష్పాదులతో పండ్లు పంచపల్లవములతో సలంకృతములయినవానిని పవిత్రముచే బవిత్రములయినవానిని నానావిధపుణ్యనదీతీర్థ పుణ్యజలములు నింపినవానిని యథావిభవవిస్తారముగ నెంత యెక్కువగా నిచ్చిన నీయవచ్చును. అటుపైశంఖభేరీప్రముఖ మంగళవాద్యములతో జయజయధ్వానము సేయవలెను. ఉదకముగ్రహించుట కనువుగ శాటకము — నీయవలెను. ఆపైని చక్కని వస్త్రయుగ్మమునొసంగవలెను. అటుపై పూర్ణకలశకు ఆసనములకు ప్రదక్షిణము సేసి పుష్పపల్లవ శోభితముగ నంజలింజేసి వేదికపైకి చల్లవలెను. ముందటివలె నాచమనీయమునుగూడ నివేదింపవలెను. ఆమీద శ్రేష్ఠములయిన మంగళములను నీరాజనాదులను నృత్యగీతాదులను సలుపవలెను. ఇటుపై సత్యాసనమధిష్ఠించియున్న దేవాధీశు నర్చింతునని స్నానపానాదులు మొదలుకొని విసర్జనముదాక సర్వోపచారముల నర్పింతునని సంకీర్తనముసేసి వాచనికోపచారముగూడ నివేదింపవలయును. మార్గత్రయముమొదలు పాదపీఠము తుదదాక ఆవాహన విసర్జనామలతో సకలపూజావిధానము నిర్వర్తించి యామీద సుగంధానులేపనము సేసి విసనకర్రతో వీవవలయును. అటుపై వీటకము (తాంబూలము)కూర్చా సంయోజనము సేసి సమర్పింపవలయును. వస్త్రములు భూషణములు వివిధపుష్పములు వేష్టనము (తలపాగ) పూలమాల చక్కని కంకణము రమ్యమైన ప్రతిసరము సుపిష్టమైన (మెత్తనిది) అంజనము కాటుక అద్దము దీపము ధూపము ఆచమనీయము గీతవాద్యములు అగ్నియందర్పింపవలెను. వహ్ని సంపూజనము చేసిననే సర్వసమర్పణము కార్యకారి యగును. (సఫలమగును) అటుపై నతిథు

లకు భర్తవ్యులయిన భృత్యపరివారాదులకు అన్నదానాదులను చేయవలెను. ఆమీద యాగకాలమునననుసరించి (తదంగమున) పవిత్రముచే ఆసనము అన్నపాత్రలు మొదలయినవానికి ప్రోక్షణముసేయవలెను. అటుపై కూర్చుండి, ప్రథప-అప్సాయ యని ప్రారంభమగు మంత్రములచే- ఇద మగ్నే అను మంత్రముచే తూర్పున నెనిమిది గ్రాసములు (అన్నపుముద్దలను) సమర్పింపవలెను. తరువాత దేవతార్చన గృహముం బ్రవేశించి ఇజ్యావేలాను సంధానము సేయవలెను. తనకు న్యాయమైన కాలమునను ఉపాదానమా మీదజేయవలెను. అటుపై నిశ్చలమైన యంతరాత్మతో విసర్జనము సేయవలెను. రామా! ఇజ్యాకాలవిధానమిది నీకు వర్ణించితిని.

భగవాన్ వాసుదేవస్తు దేవస్సంకర్షణ స్తతః । ప్రద్యుమ్న శ్చానిరుద్ధశ్చ ప్రభావోఽయ ముదాహృతః ॥ 34
సంకర్షణ స్తథాఽవ్యక్త ఆత్మా ప్రద్యుమ్న ఉచ్యతే। దేవ స్తత్వగత స్సర్వమనిరుద్ధో మహాయశాః ॥ 35
సనాథస్సర్వలోకానాం సృష్టిసంహారకారకః । పురుషోఽపి తథా సత్య అచ్యుతశ్చ ద్విజోత్తమ ! ॥ 36
భగవాన్ వాసుదేవశ్చ త్వవ్యయో ఽయ ముదా హృతః। చత్వార ఏతే ధర్మజ్ఞ ! వాసుదేవాః ప్రకీర్తితాః ॥ 37
భగవచ్ఛబ్ద వాచ్యాశ్చ సర్వభూత భవోద్భవాః । యః పరః పురుషో రామ! వాసుదేవః ప్రకీర్తితః ॥ 38
భగవచ్ఛబ్దవాచ్యశ్చ సర్వభూతభవోద్భవ ః । శేషతత్త్వంగత స్సర్వమనిరుద్ధో మహాయశాః ॥ 39
స నాథ స్సర్వలోకానాం సృష్టి సంహారకారణః । తదేత త్పఠ్యతే సూక్తే పౌరుషే ద్విజసత్తమ ! 40
పాదోఽస్య విశ్వాభూతాని త్రిపాదస్యామృతం దివి । ఘుజః ప్రీతి స్తథైవార్చిః ప్రాణ స్తర్పణమర్హణమ్ ॥ 41
నివేదనం చాచమన మష్టధా మంత్రనిర్ణయః । మంత్రేణ చార్హణా న్తేన ప్రదద్యా దర్హణం పునః ॥ 42
తథై వాచమనా న్తేన దేయ మాచమనం భవేత్ । ప్రాశనా న్తేన మంత్రేణ తర్పణం వినివేదయేత్ ॥ 43
ప్రతిగ్రహేషు మాత్రాసు పాదుకాసుచ దర్పణే । ఛత్రేచ వాలవ్యజనే తాలవృంతే తథైవచ ॥ 44
ఉపానత్సు తథాయానే వాహనేషు భృగూత్తమ ! అబ్ధి ధ్వజేషుచ తథా పతాకాసుచ కీర్తితాః ॥ 45
శేషాణాం కామభోగానాం నిత్యం సంకీర్తయేత్తుపై । సర్వత్రప్రీణనం కార్యమేతావాన్ మంత్ర నిర్ణయః ॥ 46

భగవంతుడు వాసుదేవుడుసంకర్షణుడు ప్రద్యుమ్నుడు అనిరుద్ధుడుగా(చతుర్వ్యూహముగా)విష్ణుప్రభావము ఉదాహరింపబడినది. సంకర్షణుడు అవ్యక్తము. ప్రద్యుమ్నుడు ఆత్మ సర్వతత్వములందున్న శక్తి అనిరుద్ధుడు. ఆయన సర్వలోకనాథుడు సృష్టి సంహారములు సేయువాడు పురుషుడని సత్యుడని అచ్యుతుడనియు నాతనినే పిలుతురు. వాసుదేవుడనియు యాయనయే యుదాహృతుడు. ఈ నల్గురు కూడ వాసుదేవులనియే కీర్తింపబడిరి. భగవచ్ఛబ్దవాచ్యులు వీరు. భగవంతుడను పేరు వీరికే సార్థకము. సర్వభూతప్రభవులు వీరు. పరమపురుషుడనబడు వాసుదేవుడు భగవచ్ఛబ్దవాచ్యుడు. శేషతత్త్వమంది అనిరుద్ధుడన బడును. పుణ్యాహవాచనము జయశబ్దము స్తోత్రపఠనము పాదుకలు ఛత్రము పట్టుట చామర వీజనము యానము వాహనము పతాకలు ధ్వజములు సమర్పించి సర్వభోగోపచార పూరణము నిమిత్తము దక్షిణగ మాత్రను (చిల్లరను) నివేదింపవలెను. యథాశక్తి సర్వభోగోపచారములుసమాప్తిసేసి లభింపని భోగముల మాత్రలముందే కల్పింపవలెను. పాదుకలో నున్న నాణెములను ఆనిమిత్తమ్ముగ నిలుపవలెనన్నమాట. ఇట్లు దేవాధీశుని విష్ణుని శ్రద్ధతో సర్వభోగములచేర్చించి పశుయాగము జరుపనియెడ తత్ప్రతినిధిగ మధుపర్కముచే హరినర్చింపవలెను. పశుయాగఫలాధిగమనమందు మధుపర్కము శాస్త్రవిహితమై యున్నది. మధుపర్కముచే నర్చించిన మీదటనే యన్యోపచారములు సేయవలెను. ఇక్కడ విశేషవినియోగమునకు ఆసనాదులు కూడ యీయవలెనని కొందరందురు. ముందుస్థాలిని (కలశను) దానితో నా మీద అర్హణిని హరితకముతో నన్నము వ్యంజనములతో భక్ష్యము నివేదించి అద్దము సూపి నిష్క్రంసనమామీద నీయవలెను. అటుపైని ఆచమించి మాత్రాసమర్పణముసేసి ఆమీద సంవిభాగార్థముగ? ( )
అర్హణమునొసంగవలెను. మఱల అన్నము ముందటియట్లు నివేదించి దర్పణమునూపి పాద్యము నిష్క్రంసనమిచ్చి యాచమనమిచ్చి శాటకముగూడ నివేదింపవలెను. హస్తనిష్క్రంసనముకొరకు మరల మాత్రను (నాణెమును) నివేదించి తాంబూలమిచ్చి ఆయన సర్వలోకనాథుడు సృష్టిసంహారములకు హేతువు ఈ ఈ యంశము పురుషసూక్తమునందు పఠింపబడుచున్నది. "పాదోస్య విశ్వా

భూతాని త్రిపాదస్యామృతం దివి" ఈయశేషభూతములును ఈయననొక్క పాదము. ఈయన త్రిపాద్విభూతి అమృతము. అది దివి యందున్నదని యీసూక్తముయొక్క యర్థము. భుజి (భోజనము) ప్రీతి అర్చిస్సు ప్రాణము తర్పణము అర్ఘణము నివేదనము ఆచమనమునని మంత్ర నిర్ణయమెనిమిదివిధములు, అర్ఘణాంతమైన మంత్రముచే అర్ఘణమీయవలెను. ఆచమనాంత మంత్రముచే నాచ మనమీయవలెను. ప్రాశనాంత మంత్రముచే తర్పణము నివేదింపవలెను. ప్రతి గ్రహములందు (దానముపట్టుసమయములందు) మాత్ర లందు పాదుకలయందు దర్పణోపచారమందు ఛత్ర మందు వాలవ్యజనమందు తాలవృంతము (విసనకర్రతో) వీచునపుడు పాదుకలందు యానమందు వాహనమందు అర్ధిధ్వజములందు? ( ) పతాకలందు మిగిలిన కామభోగోపచారములందు నిత్యము వాసుదేవ సంకీర్తనము సేయవలెను. ఈ విధముగ నెల్లయెడల భగవత్ప్రీణనము కర్తవ్యము. ఇది మంత్రనిర్ణయము.

దేవానాం పాదపీఠానాం కలశానాం తథైవచ । వహ్నౌ స్తథాసనానాంచ చతుష్టయం వినివర్తతే ॥ 47
కలశాసన వహ్నీనాం సంకరంతు నకారయేత్ తథైవ పాదపీఠానాం తేషాం చిహ్నం నకారయేత్ ॥ 48
ప్రాపణే మధుపర్కేచ మాత్రాసుచ భృగూత్తమ! సుమనస్సు సదారామ! యత్నః కార్య స్సమర్చనే ॥ 49
సౌమనస్యం పరంరామ! దేవదేవే నివేదితమ్ । యస్మాత్తువర్తతే తస్మాత్ప్రోక్తా స్సుమనస స్సదా ॥ 50
మాం త్రాస్యతి భయాద్ఘోరా త్తస్మాన్మాత్రా ప్రకీర్తితా । ప్రాపయిష్యతి చస్థానే నిత్యం దుఃఖ వివర్జితే ॥ 51
యస్మాత్తస్మాద్ద్విజశ్రేష్ఠ! ప్రోక్తం ప్రాపణికం సదా । పరమం యత్పదం రామ! మధుసంజ్ఞం తదుచ్యతే ॥ 52
తదాప్యతే యదాతేన మధుపర్క స్తదాస్మృతః । ఇజ్యావిధానోఽయ ముదీరిత స్తే సమాసతో భార్గవ వంశ చంద్ర!
అతఃపరం రామ! నిబోధ పుణ్యం స్వాధ్యాయ కాలం గదతో మమాద్య ॥ 53
ఇతి శ్రీ విష్ణు ధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్ర సంవాదే శంకర గీతాసు
ఇజ్యాకాల విధిర్నామ త్రిషష్టితమోఽధ్యాయః ॥

దేవతలకు పాదపీఠములకు కలశలకు అగ్నికి ఆసనములకు చతుష్టయము నివర్తించును. పాదపీఠకలశ-ఆసన అగ్ను లకు సాంకర్యము చేయరాదు. వానిని దారుమారుసేయరాదు. అందులకు వానిపై నొక చిహ్నము (గుర్తు) పెట్టవలెను. ప్రాపణ మందు ( ) మధుపర్కమందు మాత్రలందు సుమనస్సులందు (పువ్వులందు అర్చన యెడల నెల్లతరి యత్నముసేయ వలెను. అనగా వానిని నాణెమెరిగి సేకరించి పూజకుపయోగింపవలెనన్నమాట. దేవతార్చనమందు నివేదితమై సౌమనస్యమును (చక్కని మనఃప్రవృత్తిని) ఇచ్చునది కావున పువ్వులు సుమనస్సులనబడినవి. మాం = నన్ను ఘోరభయాత్ = ఘోర భయము నుండి త్రాస్యతి = రక్షించును కావున మాత్రా = అనబడినది. (చిల్లరిడబ్బు) దుఃఖ వివర్జితమయిన స్థానమునందు నన్ను ప్రాప యిష్యతి = పొందించునదికావున ప్రాపణకము అనబడినది. పరమమైన బ్రహ్మవస్తువు "మధువు" అను పేరున వేదములందు కీర్తింపబడినది. దాని నందించు ద్రవ్యముగాన తేనె దానిసర్పించుట (మధుపర్కమనబడినది) ఇజ్యావిధానమిది సంగ్రహముగ దెలిపి తిని. ఈమీద పరశురామా! స్వాధ్యాయకాలమును దెల్పెదవినుము.

ఇది శ్రీ విష్ణుధర్మోత్తర మహాపురాణము శంకరగీతలందు ఇజ్యాకాలవిధియను నరువది మూడవ యధ్యాయము.

## అరువదినాలుగవయధ్యాయము - స్వాధ్యాయ కాలకథనము

శంకర ఉవాచ—

ఆదౌదేశే తథారామ! ప్రయత స్సుసమాహితః । స్వాధ్యాయే నార్చయేద్దేవం ప్రయతే నాన్తరాత్మనా ॥ 1
తావత్కార్యం ద్విజశ్రేష్ఠ! స్వాధ్యాయం విధివత్సదా । యావద స్తంగతో రామ! సవితా దీప్తదీధితిః ॥ 2
తత స్త్వస్తం గతే సూర్యే స్వాచా న్తస్సుసమాహితః । ప్రవిశ్య దేవతావేశ్మ నైరాజ్యం కర్మ కారయేత్ ॥ 3

పాదపీఠాన్తకం కర్మ కృత్వాప్రాగుక్త మంజసా । అర్ఘ్యమాచమనీయంచ దత్వాపాద్యంచ భార్గవ ! ॥ 4
స్థాలీ పక్లిన్ననైవేద్యా దార భ్యాభిహితంతతః కర్తవ్య మనుయాగాన్తం ప్రయత స్సుసమాహితః ॥ 5
కృత్వాఽనుయాగం విధివత్ ప్రవిశ్య సురమందిరమ్ ।
స్వాధ్యాయస్యానుసంధానం తతః కుర్యా త్సమాహితః ॥ 6
యోగకాలముపాదాయ పశ్చాత్కుర్యా ద్విసర్జనమ్ । కృత్వా విసర్జనం యుక్తస్తిష్ఠే ద్యామ మతంద్రితః ॥ 7
యోగా దనన్తరం స్వప్యా దేవంయుక్తస్య భార్గవ ! స్వయంకాలోఽపిసతతం యోగమధ్యే ఽభిధీయతే ॥ 8
స్నానార్హకత్వం యదినాస్తితస్యయమే విబుద్ధస్తు తథాచతుర్థే ।
యుంజీత యోగం రిపుకాలభూతం యోగేన బుద్ధిస్సముపైతిసర్గం ॥ 9

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే మహాపురాణే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే శంకరగీతాసు
స్వాధ్యాయ కాలకథనం నామ చతుష్షష్టితమోఽధ్యాయః

శంకరుడనియె. తొలుతచక్కని ప్రదేశమందు ప్రయతుడై మనసు నిలిపి నిలుకడగల మనస్సుతో స్వాధ్యాయముచే హరి నర్చింప వలెను. తేజోదీప్తుడగు సూర్యుడస్తమించుదాక స్వాధ్యాయము యథా విధిగ జేయవలెను. సూర్యు డస్తమించినంత జక్కగ నాచమించి మడితో దేవతార్చన గృహముల ప్రవేశించి స్వామికి నీరాజన మీయవలెను. లోగడచెప్పిన పాద పీఠాంత మర్చనగావించి అర్ఘ్యము ఆచమనము పాద్యము మొదలయిన ఉపచారములు చేసి స్థాలీపక్లిన్న నైవేద్యమిత్యాదిగా తెల్పిన పూజావిధానము అనుయోగము తుదదాక నెఱపి అను యోగముగూడ చేసి (హోమమన్నమాట) ఆమీద స్వాధ్యాయమును సంధానము సేయవలెను. యోగకాలముండరిసి (తరువాత సేయవలసిన యోగకాలము వచ్చినది) దేవతా విసర్జన మొనరింపనగును. విసర్జనముచేసి మనసును సమాహితము సేసికొని తొట్రుపడక యొక్కజాము యోగముపూని యుండవలెను. యోగానంతరము పరుండవలయును. ఇట్లు యోగనిష్ఠుడైన వాని యోగమధ్యస్థితియందుకూడ యిది యోగకాలమనియే చెప్పబడును. రేయి కడపటి (నాల్గవ) జామున లేచిన యాతనికి స్నానముచేయు నర్హత లేనిచో రిపుకాలమందును యోగము నభ్యసింపవలెను. ఆయోగము వలన బుద్ధి సర్గముం బొందును. ఆవృత్తిముఖమన్నమాట.

ఇది శ్రీవిష్ణు ధర్మోత్తర మహాపురాణమున ప్రథమఖండమున శంకరగీతలందు స్వాధ్యాయకాల
కథనమను నరువది నాల్గవయధ్యాయము.

## అరువదియైదవ అధ్యాయము - బ్రహ్మోపదేశము

శంకర ఉవాచ :

జానుతుల్యం మృదుశుభం చైలాజిన కుశోత్తరమ్ । శుచౌ దేశే ప్రతిష్ఠాప్యస్థిరమాసన మాత్మనః ॥ 1
చతుర్ణా మాసనానాంచ బద్ధ్వాతత్రైవ మాసనమ్ । యోగం యుంజీత విధివత్ యథావ దనుపూర్వశః ॥ 2
రామ ఉవాచ :

యోగాసనాని చత్వారి భగవన్! కాని బ్రూహి మే । బాహుమేకమవస్థాయ యోగం యుంజీతమానవః ॥ 3
శంకర ఉవాచ :

స్వస్తికం సర్వతో భద్రం పర్యంకం కమలాసనం । యోగాసనానిచత్వారి తేషాంవక్ష్యామి లక్షణం ॥ 4

శంకరుడనియె : శుచియైనచోట మోకాళ్ళఎత్తునందు కదలనియాసనము (పీటవేసికొని) దానిపై దర్భాసనము చర్మము వస్త్రము నొకదానిపై నొకటి పరచుకొని దాని నాల్గు యోగాసనము లందేదో యొకదాని వేసికొని యథావిధిగా యోగమును బూనవలెను (యోగమనగా చిత్తవృత్తి నిరోధము. చిత్తవృత్తి యాగవలెనన్న ప్రాణవాయువాగవలయుననుట. ప్రాణవాయువే

మనస్సు. అదియాపినంతనే సంకల్ప వికల్పములాగిపోవును. మనస్సు సంకల్పాత్మకము గావున నది యాగుటయనగా ప్రాణ మాగుటయే. దానినే ప్రాణాయామమని యోగజ్ఞులు పలికినారు). యోగాసనములు నాల్గున్నాయకదా! అవియేవి? అందేదాన యోగము పూనవలెనన శంకరుదనియె. స్వస్తికము సర్వతోభద్రము పర్యంకము కమలాసనము (పద్మాసనము) అనునవి నాల్గాసనములు. వాని లక్షణము తెలిపెద.

ఆసన్నే జానునీ కృత్వా యథావత్ సు సమాహితః వామం కృత్వేతరే పాదే వామజంఘోరు పీడితమ్ ॥ 5
స్వస్తికం నామ తత్ప్రోక్తమాసనం ప్రథమం శుభమ్ । ఊరూచజానునీ జంఘే యత్రాసనగతః సమమ్ ॥ 6
ఆసనం సర్వతోభద్రం తద్విద్ధి మనుజోత్తమ ! పర్యంకే యోగపట్టేన బధ్నీయాత్ పృష్ఠయోగతః ॥ 7
ఆకుంచ్య జానునీ సమ్యక్పాదం కృత్వాచ బాహ్యతః । దక్షిణం వామజంఘాయాం పర్యంకా సనకారకమ్ ॥ 8
ఆసనే సర్వతోభద్రే యదా భవతి మానవః । ఊరుస్థోత్తాన చరణం తదాస్యాత్కమలాసనమ్ ॥ 9
ఆసనస్థస్య కరణం నిబోధ గదతో మమ । సమానీయోరుమూలేన హస్తౌభార్గవ ! తిర్యగౌ ॥ 10
కృత్వోత్తానౌ సమౌ విద్వాన్ వామస్యోపరి దక్షిణమ్ । అంగుళీచ్ఛాదకం విద్వానంగుళీనాంతు విన్యసేత్ ॥ 11
కించి దాకుంచితాంగుష్ఠౌ కర్తవ్యౌచ తథాకరౌ । ఉరశ్చోత్థాప్య వితతం కృత్వా రామ! పరిశ్లథమ్ ॥ 12
పృష్ఠమాకుంచయేత్ స్కంధేదేహమున్నామయేత్ సుధీః ॥
నిష్కంపాం సుదృఢామృజ్వీం నాతి స్తబ్ధాంన కుంచితామ్ ॥ 13
గ్రీవాం విధారయేత్ యత్నాత్ శిరఃకార్యం సమంసదా । సంపశ్యన్నాసికాగ్రం స్వం దిశశ్చానవలోకయన్ ॥ 14
కించిన్నిమీలితే నేత్రే దంతై ర్దంతాన్న సంస్పృశేత్ ।
తాలుమధ్య గతేనైవ జిహ్వాగ్రేణ సమాహితః ॥ 15
సబద్ధ కరణో విద్వానభ్యాసా త్పవనం జయేత్ ।
జిత్వావాయుం యథాశక్తి యోగం యుంజీత బుద్ధిమాన్॥ 16
ఆదౌతు చింతయేత్ స్థూలాం భూమింపంచ గుణాన్వితామ్ ॥
లబ్ధలక్షోమహాయోగీ భూమియోగం సముత్సృజేత్ ॥ 17
తతశ్చతుర్గుణం ధ్యానం కర్తవ్య ముదకే ద్విజ । లబ్ధలక్ష అపాంయోగీ జలయోగం సముత్సృజేత్ ॥ 18
తత స్తుయోగం యుంజీత త్రిగుణం ద్విజ తేజసి ! లబ్ధ లక్షశ్చ తత్రాపి వహ్నియోగం సముత్సృజేత్ ॥ 19
తత స్తుయోగం యుంజీత పవనే ద్విగుణం ద్విజ । లబ్ధ లక్షశ్చ తత్రాపి వాయుయోగం సముత్సృజేత్ ॥ 20
తత స్త్వేక గుణం యోగం యుంజీత గగనే బుధః । లబ్ధ లక్షశ్చతత్రాపి మనోయోగ గతిర్భవేత్ ॥ 21
మనసశ్చంద్రమాః ప్రోక్తః ప్రథమంచంద్రమండలే । ఊర్ధ్వలక్షం బుధఃకృత్వా చంద్రమండల మధ్యగే ! 22
అంగుష్ఠమాత్రే పురుషే లక్షబంధంతు కారయేత్ । శశాంకశత సంకాశే సర్వాలంకార భూషితే ॥ 23
లబ్ధలక్ష్యశ్చ తత్రాపి బుద్ధియోగగతిర్భవేత్ ॥ బుద్ధిశ్చ భగవాన్ సూర్యః ప్రథమం సూర్య మండలే ॥ 24
సమగ్రమేవ సంపశ్యేద్ధ్యానయోగేన బుద్ధిమాన్ । సూర్యమండల మధ్యస్థం శతసూర్య సమ ప్రభమ్ ॥ 25
అంగుష్ఠ మాత్రం పురుషం సర్వాభరణ భూషితం । చిన్తయేత్ ప్రయతో నామ తత్పరస్సు సమాహితః ॥ 26
లబ్ధలక్షశ్చతత్రాపి నిత్య మాత్మాన మాత్మనా । ఆత్మస్థ మేవ సంపశ్యే ద్ధ్యానయోగేన భార్గవ ! 27
అంగుష్ఠమాత్రం పురుషం సూర్యంబింబగతం యథా । ధ్యానయోగేన సంపశ్యే త్తథా పశ్యేత్ తథాత్మని ॥ 28

*వి.ధ.పు 17

అధోముఖే హృత్కమలే కర్ణికాయాం భృగూత్తమ! లబ్ధ లక్షశ్చ తత్రాపి అవ్యక్తం చింతయే త్పదమ్ ॥ 29
బహిరన్తశ్చ సర్వత్ర తేజసా తత్ర చింతయేత్ । నైవార్కేణ న చంద్రేణ సర్వం వ్యాప్త మశేషతః ॥ 30
లబ్ధ లక్షశ్చ తత్రాపి పురుషం చింతయేత్ పరమ్ । శూన్యంతు పురుషం ధ్యానం ప్రవదన్తి మనీషిణః ॥ 31
సాకారే బద్ధ లక్షస్తు శూన్యం శక్నోతి చిన్తితుమ్ । అన్యథా తు సు కష్టం స్యాత్ నిరాలంబస్య చింతనమ్ ॥ 32
చిత్తవృత్తి నిరోధోహి దుష్కరః ప్రతిభాతిమే । తత్ర యత్న స్సదా కార్యః విజయే పవనస్యచ ॥ 33
చిత్తవృత్తి నిరోధేన పవనస్య జయేనచ । ఉపాసనాయాం శూన్యస్య నిష్ఫలత్వం విధీయతే ॥ 34
అరూప గంధమనసం శబ్దస్పర్శ వివర్జితమ్ । సర్వేంద్రియ గుణం రామ! సర్వస్థం సర్వగం చ యత్ ॥
(తం ధ్యాయన్ పురుషం తస్య ధ్యానం శూన్యం ప్రకీర్తితమ్) । 35
తస్య స్వరూపం విజ్ఞాయ రామ! శూన్యముపాసతః ॥ 36
సర్వబంధనముక్తస్య నిష్ఫలత్వం విధీయతే । అఖండకారిణ స్త్వేవం నిత్యం భృగుకులోద్వహ ॥ 37
సంవత్సర శతే పూర్ణే సత్రిభాగే మహాభుజ! నిష్ఫలత్వం పరం స్థానం ధ్రువం భవతి భార్గవ! 38

రామ ఉవాచ :

సంవత్సర శతం పూర్ణం త్రిభాగసహితం విభో! అజీవతో నిష్ఫలత్వం కథం భవతి శంకర! 39

శంకర ఉవాచ :

అఖండకారీ భవతి యద్యేవ మపి జన్మని । జన్మక్రమా దవశ్యం హి రామ! జన్మని జన్మని ॥ 40
పూరణీయం సత్రిభాగం ధ్రువంతేన సమాశ్రితమ్ । అనేకజన్మ సంసిద్ధస్తతోయాతి పరాంగతిమ్ ॥ 41
అఖండకారిణోరామ! ప్రవృత్తస్య ద్విజన్మనః । అవశ్యమేవ తత్థ్సానం యద్విష్ణోః పరమం పదమ్ ॥ 42

రామ ఉవాచ :

అఖండకారితా ప్రోక్తా త్వయా దేవ! ద్విజన్మనామ్ । శూద్రోవా యది వా నారీ కథంస్థాన మవాప్నుయాత్ ॥

శంకర ఉవాచ :

అఖండకారిణీ పత్నీ ప్రాప్నోతి పరమం పదమ్ । శూద్రః స్వకర్మ నిరతః కేశవార్పిత మానసః ॥ 44
జాత్యన్తర మథాఽఽసాద్య భక్తియోగేన భావితః । అఖండకారీ భవతి తతః ప్రాప్నోతి తత్పదమ్ ॥ 45

మార్కండేయ ఉవాచ :

ఏతా వదుక్తందేవేన త్ర్యంబకేన మహాత్మనా । తదా తుష్టేన రామాయ రహస్య మృషిపూజితమ్ ॥ 46
ఏతత్భక్తివిహీనాయ నతువాచ్యం యదూత్తమ । న నాస్తికాయ మూర్ఖాయ తర్కదుష్టాయ వా తథా ॥ 47
ఏతత్తు శృణ్వతేవాచ్యం శిష్యాయచ సుతాయచ, యోవాదద్యా న్మహీం కృత్స్నాం సశైల వనకాననామ్ ॥ 48
ఏతద్గుహ్యం పరం పుణ్యం పవిత్రం పాపనాశనమ్ । ఆయుష్యంచ యశస్యంచ కలి దుఃస్వప్ననాశనమ్ ॥ 49
అద్వైతవ్యమిదం సమ్యక్ వచనం శంకరస్యచ । సర్వబంధ వినిర్ముక్తః ప్రాప్నోతి పరమం పదమ్ ॥ 50
ఏతావదుక్తం త్రిపురాన్తకేన తుష్టేన రామస్య మహాబలస్య ।
మయా తథా తేఽభిహితం నరేంద్ర! ధార్యంత్వయేదం సతతం యథావత్ ॥ 51

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే మహాపురాణే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
శంకరగీతా సమాప్తిర్నామ పంచషష్టితమోఽధ్యాయః

మోకాళ్ళు ముడుచుకొని కూర్చుండి ఎడమపాదము కుడి మోకాలుమీద తొడమీదను నానించునట్లు స్వస్తికాసనమనబడును. ఊరువులు మోకాళ్ళు పిక్కలు సమముగా జోర్లించి కూర్చుండుట సర్వతోభద్రమగును. మోకాళ్ళుముడిచి కుడిపాదమును మాత్రము ఎడమ పిక్కమీద వెలికినిలిపి కూర్చుండుట పర్యంకాసనమగును ఇందులో పృష్ఠమును ముందుపిక్కలనుగలిపి యోగపట్టము ధరింపవలసియుండును. యోగపట్టము = పటకా (బెల్ట్). సర్వతోభద్రాసనమువలెనే వేసి ఊరువులందు పాదములు ఉత్తానములు (అరకాళ్లు పైకి ఉండునట్లు) నిలుచుట పద్మాసనమనబడును. ఆసనమందున్న తరువాత చేయవలసినది (కారణము) చెప్పెదనిదె తెలియుము. చేతులొకదానికొకవైపు తొడమూలను తెరచియుంచి మోచెయ్యిక్రింద రెండు చేతుల వ్రేళ్లను కలిపి బొటనవ్రేళ్లమడిచి పట్టుకొని రొమ్ముబాగుగాలేపి మెడమీద పృష్ఠమును వంగునట్లు కదలికలేకుండ సూటిగా పిక్కలిస్తబ్ధముగాకుండ దేహమును ముందుకుచాచి మెడనుగట్టిగాకదలకుండధరించి తలనుసమముగానుంచి, ఒరుగకుండచేసి ముక్కుకొనచూచుచు ప్రాణాయామాభ్యాసము వలన వాయువును జయింపవలెను. బుద్ధిశాలియయినసాధకుడు వాయువుజయించి యథాశక్తి దినదినము యోగమునను సంధింపవలె. (యథాశక్తియనుటవలన తొందరపాటు ఎక్కువ శ్రమపడుటయు యోగభంగకరములని తెలియవలెను) దిక్కులపంక చూడరాదు. (చూపుప్రక్కలకు పోరాదన్నమాట) కన్నులరమోడ్పుగ పెట్టవలెను. నాసికాగ్రమందు చూపునిలుపవలెననుటలోనే యిది స్వభావముచేతనే యేర్పడును. దంతములొక దానితో నొకటి తాకిం పరాదు- నాలుకకొన రెండు తాలువుల (దవడలనడుమ) నుండవలెను. ఈవిధముగా బద్ధాసనుడైన యోగి వాయుపుంజయించును. సమాధిలో మొదట స్థూలభూమిని ఐదుగుణములు గలదానిని ధ్యానింపవలెను. దానియందు గురికుదిరినమీద భూమి యోగమువిడిచినాల్గు గుణములుగల యుదకమును గురిసేసి నిలుపవలె. అటుపైని మూడు గుణములుగల తేజస్సునందు ఆమీద రెండుగుణములుగల వాయువునందు ఆమీద శబ్దయికగుణమైన ఆకాశమునందు గురినిల్పి అక్కడగురి కుదిరినతర్వాత మనస్సునందు నిలుపవలెను. మనసునుండి చంద్రమండలమునందు ఊర్ధ్వలక్ష్యము (పైకి గురిచేసి) చంద్రమండలమధ్యమందున్న అంగుష్ఠమాత్రుడైన పురుషునందు లక్షబంధముసేయవలెను. ఆ పురుషుని స్వరూపము వందమంది చంద్రులవంటి ప్రకాశము సర్వాలంకారభూషితమునై యున్నట్లు ధ్యానించిమనస్సునిలుపవలెను. అందుకూడ గురికుదిరిన తర్వాత బుద్ధియోగమందు గమనింపవలెను. బుద్ధియనగా సూర్యభగవానుడే. కావున తొలుత సూర్యమండలమందు ధ్యానయోగముచే సమగ్రస్వరూపుని సూర్యమండలమధ్యస్థుని నూరుగురు సూర్యులట్లు ప్రకాశించువానిని అంగుష్ఠమాత్రుని పురుషుని సర్వాభరణ భూషితుని నియతుడై ధ్యానింపవలెను. బుద్ధిఏమాత్రము చెదరకూడదు. అక్కడకూడగురి కుదిరినతర్వాత నిరంతరము ఆత్మచేత ఆత్మను ఆత్మయందున్న వానినిగా ధ్యానయోగముచే చూడవలెను. సూర్యబింబమందంగుష్ఠమాత్ర పురుషుని నెట్లుచూచుచున్నావో అట్లే అధోముఖమైయున్న హృదయ కమలమందు నడిదుద్దులో (కర్ణికయందు) ఆ పురుషుని దర్శింపవలయును.

అక్కడగూడ గురికుదిరినమీదట అవ్యక్తమును ధ్యానింపవలెను. అక్కడ వెలుపల లోపల నెల్లయెడలకేవలతేజస్సును (అవ్యక్తరూపమున) ధ్యానింపవలెను. అక్కడ సూర్యుడులేడు చంద్రుడు లేడు. సర్వము కేవలము తేజోమయము. అక్కడ గూడ లక్ష్యము సిద్ధించినమీదట పురుషుని ధ్యానింపవలెను. పురుషుని గూర్చిన ధ్యానమును శూన్యధ్యానమని జ్ఞానులందురు. సాకార ధ్యానమందు గురికుదిరినవాడు శూన్యమును ధ్యానింపగలుగును. సాకారధ్యానము సరిగా కుదరక నిరాలంబధ్యానము చాల కష్టమగును. చిత్తవృత్తులను సంకల్ప వికల్పములు నిలుపుట దుష్కరమని నాకు తోచుచున్నది. అక్కడ వాయుజయమున కెల్లప్పుడు గట్టిప్రయత్నముచేయవలెను. చిత్తవృత్తి నిరోధముచే వాయుజయము చేతను శూన్యముయొక్క ఉపాసన వలన నిష్ఫలత్వము సిద్ధించును. అరూపగంధమనస్కము శబ్దస్పర్శ వివర్జితమునైనది శూన్యోపాసన వలన గల్గు నిష్ఫలత్వసిద్ధి. అది సర్వేంద్రియగుణము గలది సర్వమందుండునది సర్వమును వ్యాపించినదియగు అఖండమునగు వస్తుధ్యానము శూన్యమని చెప్పబడినది. ఆ శూన్యరూపము తెలిసి దానిని ఉపాసించు సర్వబంధన ముక్తుడునగువానికే నిష్ఫలత్వము సిద్ధించును. ఈవిధముగ నిత్యము అఖండకారికి నుపాసన అఖండోపాసనచేయు ద్విజునికి నూరేండ్లు ఆపైని మూపోవంతు నయిన మీదట (133 ఏండ్ల కన్నమాట) నిష్ఫలత్వము స్థానము

సిద్ధించును. అనవిని పరశురాముండు నూటముప్పదిమూడేండ్లొకవేళ జీవింపడనుకొనుడు అట్టివానికి నిష్ఫలత్వము కలుగుట యెట్లన శంకరుడిట్లనియె :- ఒక్క జన్మమందు అఖండకారియగునేని యా మానవుడు జన్మక్రమమున ప్రతి జన్మమందును అవశ్యముగ అఖండకారియయితీరును. ఆవిధముగ ననేక జన్మ సంలబ్ధమయిన యోగసంస్కారముచే నూటముప్పదిమూడేండ్ల చిల్లర తప్పక పూరింపబడవలసినదే అది పూర్ణముకాగానే యాతడు పరమగతిని మోక్షమునందితీరును. అఖండకారియైనవానికి అందు ప్రవృత్తుడైనవానికి ఆవిష్ణువు యొక్క స్థానము పరమపదము అవశ్యము లభించితీరును.

అనినవిని రాముడు అఖండకారిత్వమును ద్విజులకు నీవు చెప్పితివి. శూద్రుడుకాని స్త్రీ కాని యాస్థానము నెట్లు పొందునని యడిగిన శంకరుడిట్లనియె :

అఖండకారిణియైన ధర్మపత్నికూడ యాపరమపద మందును. స్వకర్మనిరతుడై విష్ణునందు మనస్సర్పించిన శూద్రుడు గూడ అవ్వల జాత్యంతరముంబొంది భక్తియోగముచే భావితుడై యఖండకారియగును. అవ్వల నావిష్ణుపదమందును.

అని పరమేశ్వరుడు మహాత్ముడు రామునియెడ సంతుష్టుడై పలికిన రహస్యము ఋషులు పూజితమైన యీయంశము భక్తిహీనునికి చెప్పరాదు నాస్తికునికి మూర్ఖునకు తర్కదుష్టునికి (కుతార్కికునకు) నిది తెలుపరాదు. ఇది శుశ్రూషాపరుడైన (వినగోరువాడన్నమాట) శిష్యునకు కొడుకునకుం దెలుపనగును. ఇది పరమగుహ్యము పుణ్యము పవిత్రము పాపనాశనము ఆయుష్యము యశస్యము కలిహరము దుఃస్వప్ననాశనము. అందులోగూడ సాక్షాచ్ఛంకరుల వచనమిది చక్కగా అధ్యయనము సేయవలసినది. దీనిచే సర్వబంధవినిర్ముక్తుడై పరమపదమందును. ఇంతవరకు త్రిపురాంతకుడు సంతుష్టుడై పరశురామునకు ఉపదేశించినాడు. రాజేంద్ర ! నేను నీకు దెల్పితిని యధాతధముగా నీవిది యెల్లపుడు ధారణసేయవలసినది.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున శంకరగీతాసమాప్తి బ్రహ్మోపదేశమను అరువదియైదవ యధ్యాయము.

## అరువదిఆరవ అధ్యాయము- పరశురామునిగూర్చి శంకరునిఅనుశాసనము

మార్కండేయ ఉవాచ:

కైలాస శిఖరే రమ్యే రామస్య రమత స్తదా ఆజగామ హరం ద్రష్టుం దేవదేవః పురందరః ॥ 1

స సమాసాద్య దేవేశం ప్రణమ్య వృషభ ధ్వజమ్ । ఉవాచ వచనం సమ్యక్ ముదా రామస్య సన్నిధౌ ॥ 2

శక్ర ఉవాచ :

త్వత్ప్రసాదేన దేవేశ ! మయాప్రాప్తం త్రివిష్టపమ్ । రామేణ ఘాతితా స్సర్వేయధామే దేవ శత్రవః ॥ 3

అవధ్యాస్త్రిదశానాంయే వరదాన బలోద్ధతాః । నరవధ్యాః కృతా స్తేహి బ్రహ్మణా సుమహాత్మనా ॥ 4

పాతాల నిలయా దేవ ! అవధ్యా దేవతాగణైః । బాధన్తే నరవధ్యామే లోకానాంచ జగత్పతే ॥ 5

తాంశ్చ ఘాతయ దేవేశ ! రామేణా క్లిష్టకర్మణా ॥ 6

మార్కండేయ ఉవాచ :

ఏవం కరిష్యతీ త్యుక్త్వా విసృజ్య త్రిదశేశ్వరం ఉవాచ వచనం రామం భార్గవం పురత స్థితమ్ ॥

శంకర ఉవాచ :

గచ్ఛ ! భార్గవ ! పాతాలం పాతాల నిలయాన్ జహి ॥ 7

శక్రశత్రూన్ దురాచారాన్ నరవధ్యాన్ మహాసురాన్ । వైష్ణవం చాపరత్నంతే మయాన్యస్తం పితుఃకరే ॥ 8

తదాదాయ శరై స్తీక్ష్ణైః జహి ! తాన్ రామ ! దానవాన్ । అక్షయం తూణ మాదాయ శరపూర్ణమిదం త్వయా ॥ 9

మార్కండేయ ఉవాచ :

ఏవ ముక్త్వా దదౌచాస్య తూణ మక్షయ సాయకం । దత్త్వాచ భగవా నాహ రామం పరబలార్దనమ్ ॥ 10

శంకర ఉవాచ :

తూణమేతత్ ప్రదాతవ్యం త్వయాఽగస్త్యాయ భార్గవ ! । చాపరత్నంచరామాయ కృతే కర్మణి సువ్రత ! 11
అగస్త్యోపి మహాతేజాస్తూణ మక్షయ సాయకం ।రాఘవాయాతి యశసే రామాయైవ ప్రదాస్యతి ॥ 12
రామ సందర్శనాదూర్ధ్వం మా కృథాః శస్త్రధారణమ్ । రామ సందర్శనే రామ ! తవ తేజోహి వైష్ణవం॥ 13
రామం ప్రవేక్ష్యతి తదా సురకార్యార్థ మూర్జితమ్ । యావత్త్వం తేజసాయుక్తో వైష్ణవేన పరంతప ॥ 14
తావచ్ఛత్రుగణాన్ సర్వాన్ సమరేషు విజేష్యసి ।
స్థాతుం న శక్తా స్తవదైత్యసేనా అస్త్రాయుధస్య ప్రముఖే ద్విజేంద్ర !
ఆదాయ చాపం యుధి వైష్ణవం తత్ తూణం తథేమంజహిదేవశత్రూన్ ॥ 15

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే మహాపురాణే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే రామం ప్రతి శంకరానుశాసనే షట్షష్టితమోఽధ్యాయః.

మార్కండేయుడనియె : రమ్యమైన కైలాసశిఖరమందు పరశురాము డానందించుతరి నింద్రు డేతెంచి శంకరుని నమస్కరించి రాముడు వినుచుండనిట్లనియె : దేవేశ్వర ! నీ యనుగ్రహముచే నేను స్వర్గముం బొందితిని. రాముడు రాక్షసులం బరిమార్చెను. దేవతల కవధ్యులయినవాండ్రుగూడ వరదానదర్పితులు దానవులు బ్రహ్మచే నరునిచేత వధ్యులుగా జేయబడిరి. ఆ యందరు పాతాళమందిపుడు నివసించుచు బాధించుచున్నారు. రామునిచే నా దైత్యులంగూడ చంపింపుము. అనవిని శంకరుండట్లు సేయుదునని యింద్రునిం బంపి తనముందున్న భార్గవరామునితో భార్గవ నీవు పాతాళమునకుం జని యటనున్న వారినింద్రశత్రువులం దైత్యులను సంహరింపుము. మీ తండ్రి హస్తమునందు వైష్ణవ ధనుస్సును న్యాసముసేసియున్నాను. అది గొని యేగి యాదురాచారులను వరదర్పితులైనవారిం గూల్చుము. ఈ అక్షయతూణీరముంగూడ గైకొని యేగుమని యిచ్చెను. నీ చేయవలసిన పని యైన తరువాత నీ యమ్ములపొదిని యీ ధనుస్సును నగస్త్యునికిమ్ము. అగస్త్యుడును యీ ధనుస్సును అక్షయతూణీరమును రామునికి (దశరథకుమారునికి) ఒసంగును. రామ సందర్శనమైన తరువాత నీవు శస్త్రము పట్టవలదు. దశరథరాముని దర్శనమైనతరువాత నీవైష్ణవతేజసాతనియందు బ్రవేశించును. అది సురకార్యము నిర్వహించును. నీవు వైష్ణవతేజస్సుతో నున్నంతకాలము శత్రుగణము లన్నింటిని జెండాడగలవు. దైత్యసేనలాయుధప్రయోగము సేయుచున్నంతదాక నీముందు నిలువలేరు. ఈ వైష్ణవచాపమును తూణీరమును జేకొని యుద్ధమందు దేవశత్రువుల గూల్పుము.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున పరశురాముని గూర్చి శంకరుని యనుశాసనమను నరువదియారవ యధ్యాయము.

## అరువదియేడవ అధ్యాయము - వైష్ణవధనుఃప్రాదుర్భావము

రామ ఉవాచ :

వైష్ణవం చాపరత్నంతత్ కిమర్థం భవతా కరే । న్యస్తంచ తన్మే భగవన్ ! చాపరత్నంచ కీదృశమ్ ॥ 1

శంకర ఉవాచ :

మాయాహి వైష్ణవీ రామ ! యయా సంమోహితాః పురా । దేవాశ్చ ఋషయశ్చైవ గత్వాంతః ప్రణతాః స్థితాః ॥
యజతాం పరమాధారం దేవం కమల సంభవమ్ । భూతభవ్యభవిష్యస్య ప్రభుం లోక సమస్కృతమ్ ॥ 3

దేవా ఊచుః :

వాసుదేవస్య దేవస్య మహాదేవస్య చాప్యథ । అంతరం జ్ఞాతు మిచ్ఛామః కః కస్మా దతిరిచ్యతే ॥ 4

శంకర ఉవాచ :

ఏవముక్తే స్సురైః సర్వై ఋషిభిశ్చ పితామహైః । విహస్యోవాచ తాన్ సర్వాంస్తయో ర్గత్వా పరస్పరమ్ ॥ 5

బ్రహ్మోవాచ :

జనయధ్వం సురాస్సర్వే విరోధ మృషిభిస్సహ । విరోధేతు సముత్పన్నే తయోర్యుద్ధ ఉపస్థితే ॥ 6
జ్ఞాస్యధ్వ మంతరం దేవా స్తయో ర్నాస్త్యత్ర సంశయః ।

శంకర ఉవాచ :

ఏవ ముక్తా స్సురా స్సర్వే సార్ధ మృషిగణై స్తదా ॥ 7
ఆవయోర్జనయామాసు ర్విరోధం భృగునందన! । విష్ణోరాధిక్యమన్విచ్ఛన్ తస్య మాయా విమోహితాః ॥ 8
కృతవానస్మి దేవేన దేవవాక్యేన విగ్రహమ్ । ప్రభావదర్శనార్థాయ త్వావయోర్విగ్రహే తదా ॥ 9
ఆసన్న మభవద్యుద్ధం సర్వ సత్వ భయంకరమ్ । ఆవయోర్భృగుశార్దూల! తదా యుద్ధే ఉపస్థితే ॥ 10
ఆజగామాథ తందేశం బ్రహ్మ లోక చతుర్ముఖః । దేవా బ్రహ్మర్షయశ్చైవ తథా రాజర్షయోఽమలాః ॥ 11
సర్వేషాం సమవేతానామావయో ర్యుద్ధ సంగరే । ఉవాచ వచనం బ్రహ్మ సర్వలోక నమస్కృతః ॥ 12

పరశురాముడు స్వామీ! వైష్ణవ చాపరత్నమును నీవు మా తండ్రి హస్తమందెందుకుంచితివి? ఆ ధనూరత్నమేలాటిదని యడుగ శంకరుండనియె: వైష్ణవీమాయకు (విష్ణుమాయ) మునుపు దేవతలు ఋషులుగూడ మోహితులై ప్రజలకు బరమాధారమైన కమలసంభవుని భూతభవ్యభవిష్యములకు బ్రభువైనవాని లోకనమస్కృతు దరికేగి ప్రణతులై నిలిచి, వాసుదేవునికి (విష్ణువునకు) మహాదేవునికి (శివునికి) గల యంతరమేమో తెలియగోరుచున్నాము. ఇందెవ్వడెవ్వనికంటె గొప్పవాడు? అని యడుగ శంకరుండల్లన నవ్వి బ్రహ్మ యిట్లనియె: ఓ దేవతలార! మీరందరు ఋషులతో గలిసి వారిద్దరకు వైరము వెట్టుడు. దాన వారిద్దరకు యుద్ధము జరుగును. అప్పుడు వారి యంతరము మీరు దెలిసికొందురు. అని పలుక సురలందరు ఋషులతోగూడి విష్ణువు యొక్క యాధిక్యమాశించి విష్ణుమాయావశులై మాయిద్దరకు విరోధము గల్పించిరి. దేవతల మాట విని నేను విష్ణుదేవునితో తగవుపెట్టుకొంటిని. మాయిద్దరి ప్రభావము చూపుటకు ప్రవృత్తమైన యా తగవులో సర్వసత్త్వ భయంకరమైన యుద్ధము తటస్థించినది. ఆసమయమున బ్రహ్మ యచటికేతెంచెను. దేవతలు బ్రహ్మర్షులు రాజర్షులందరిముందు మాకు యుద్ధము జరుగుచుండ సర్వలోకవంద్యుడగు బ్రహ్మ యిట్లనియె:

బ్రహ్మోవాచ :

న కర్తవ్యం జగన్నాథౌ యుద్ధం పరమదారుణం । యుష్మద్యుద్ధేన సకలం నశ్యతీదం జగత్త్రియమ్ ॥ 13
గృహీతం చాపరత్నం యత్ స్వయం దేవేన చక్రిణా । తదారోపయతాం శూలీ శూలి చాపం జనార్దనః ॥ 14
జ్ఞాస్యామి చాంతరం దేవౌ చాపారోపణ కర్మణా ।

శంకర ఉవాచ :

ఏవముక్తే మమ కరాత్ ధనుర్జగ్రాహ కేశవః ॥ 15
ఆరోపితుం న మే శక్తిః సర్వయత్నేన చాభవత్ ।
తతశ్చ గతమోహేన మయాజ్ఞాతో మహేశ్వరః ।
జ్ఞాత్వా విస్పష్టచాపేన స్తుతశ్చ భగవాంస్తదా ॥ 16

జగన్నాథులు మీరిద్దరును బరమదారుణ మీయుద్ధము సేయవలదు. మీయిద్దరి పోరాటముచే నీముల్లోకములు నశించును. చక్రాయుధుడు చేపట్టిన చాపరత్నమును శూలి (శంకరుడు) ఎక్కుడుంగాక! ఆయన ధనుస్సును విష్ణు వెక్కువెట్టుగాక! అప్పుడు వీరి యంతరము నేను తెలిసికొందునని బ్రహ్మయన నా చేతినుంచి విల్లును హరి గైకొనెను. విష్ణువది చేకొని దీని నెక్కిడుట కేను

చాలననియె. అంతలో విష్ణువు మోహము సడలి నా కీశ్వరుడెవ్వఁడో తెలిసినదని యా ధనుస్సును వదలి విష్ణుని పరమేశ్వరు డిట్లు స్తుతించెను.

నమోఽస్తుతే దేవ వరా ప్రమేయ! నమోఽస్తుతే సర్వగుణాన్తరాయ ।
నమోఽస్తుతే దేవగణార్చితాయ నమోఽస్తుతే సర్వగుణోత్తరాయ ॥ 17
ఉన్మేషమాత్రేణ తవ అప్రమేయ ! దినం సమగ్రం ప్రపితామహస్య ।
నిమేషమాత్రేణ నిశా ప్రదిష్టా యస్యాం సమాదాయ జగత్సశేతే ॥ 18
న కారణం వేద్మి తవేశ సృష్టౌ సంహార కార్యంచ తథా న వేద్మి ।
ఆద్యం న మధ్యం న తథైవ చాన్తం త్వమేవ ఈశః పురుషః పురాణః ॥ 19
సర్వేషు భూతేషు తథా స్థిత స్త్వం సర్వాణి భూతాని తథా తవేశ ! ।
భూతాంతరస్థోఽపి నభూతసంస్థ ఆశ్చర్యమేత న్మమ దేవ దేవ ! 20
భూతాంతరస్థోఽపి న భూతనాథః భూతార్జితైః కర్మభి రాప్యసే త్వం ।
కర్మాణి సర్వాణి జగత్త్రియస్య ధర్మే సదా యన్మహదద్భుతం తత్ । 21
గంధః పృథివ్యాంచ రసోఽస్తు దేవ! వాయౌ యథా స్పర్శగుణస్త్వదీయః ।
రూపం తథాగ్నౌ గగనేచ శబ్దో గుణా స్సమగ్రా స్తవ భూత సంఘే ॥ 22
మనోగత స్త్వంచ తథా వితర్కో బుద్ధౌగత స్త్వంచ వినిశ్చయోఽత్ర ।
చిద్రూప మాత్మన్యథ దేవదేవ! అవ్యక్త సంస్థస్య గుణత్రయ స్త్వమ్ ॥ 23
త్వమేవ భూతానిచ తద్గుణాశ్చ మూర్తేర్విభిన్నోఽసి న భూత భిన్నః ।
తత్త్వాని సర్వాణిచ తద్వ్యతీతః త్వమేవ దేవః పురుషః ప్రదిష్టః ॥ 24
తవేచ్ఛయాస్యాత్ సకలాత్రిలోకీ తవేచ్ఛయా దేవ! తథా వినశ్యేత్ ।
ఇత్థం విధస్యానఘ! కర్మణస్తే స్తుతిః కథం స్యాత్ పరమస్య ధామ్నః ॥ 25
ఏవం స్తుతో దేవ వరో మయాఽసా వువాచ మాం దేవగణస్య మధ్యే ।
యోఽహం స దేవః పరమేశ్వర స్త్వం యోఽహం సదేవః ప్రపితామహశ్చ ॥ 26

వందనమయ్య దేవ వర ! వందన మీశ గుణాంతరాయ ! పౌ
రందర లోకవందిత ! పరాత్పర సర్వగుణోత్తరా ! జగ
ద్బృందము సృష్టి యేల యొనరింతువొ దాని లయింపజేయుటి
వెందులకో యెఱుంగఁదఁది యీవ మొద ల్నడుమేని యింతకున్
నీకనువిచ్చినంతనది నీరజగర్భునకున్ దినమ్ము స్వా
మీకనుమూతువేని యదియేకద రేయి యటన్‌శయించునీ
లోకమశేష మీవొకడ లోవెలినుంటివి భూతకోటికిన్
గాకట నంటియుండ విది నాకు మహాద్భుత మీశ్వరేశ్వరా !
భూతములందు నుండియు భూతములన్ మతిరక్షసేయుదా
యాతొలిజన్మ కర్మమున నయ్యవిపొందు ఫలమ్మునీవయీ
భూతజగత్తు కర్మములఁబొందుఫలమ్మది ధర్మరూప, మీ

రీతియిటుండ చిత్రమగరే! నినుగర్తవటంచుయేనియున్
నేలనుగంధ మారసము నీటను స్పర్శగుణమ్ము గాలిలోన్
గ్రాలెడు రూపమగ్ని గగనంబున శబ్దగుణమ్ము పెక్కుచం
దాల మనస్సునందగు వితర్కము బుద్ధిఁదనర్చు నిశ్చయ
మ్మోలిని దెల్వియాత్మగల దొక్కడవీవె గుణత్రయమ్మునున్
భూతములీవ దానిగుణముల్ మఱినీవ విభిన్నమూర్తివై
తోతువు నీవు భూతములతో నెడమొందవు సర్వతత్త్వముల్
నీతెరగయిన వానిపయినిన్ బురుషుండనిచెప్పబడ్డదే
దో తొలివస్తువయ్యదియు నోపరమేశ్వర! నీవయీశ్వరా!
నీయిచ్ఛన్ గలుగన్ జగత్త్రియమహో! నిశ్శేషమైపోవనం
తాయీలాటి విచిత్రచర్యని బరంధామున్ స్తుతింపంగనా
నేయన్నంతన నన్నుఁ జూచియనెనయ్యీశుండు మందస్మిత
శ్రీయుంపొంద నిలింపబృందమువినన్ శ్రీవిష్ణువానందియై.

ఆశ్రిత్య మూర్తిత్రితయం మయేదం కర్మత్రయం శంకర! సాధ్యతేవై ।
ఉత్పత్తి నాశౌ పరిపాలనంచ కాలత్రయే శంకర! దేవ కార్యాత్ ॥ 27
మూర్తిర్మమోగ్రా జగతాం తవేయం సంహార కార్యార్థ ముదీర్ణ దర్పా।
ప్రభుర్భవః కారణకారణానాం పూజ్యశ్చ సర్వేశ్వర! సర్వదేవైః ॥ 28
యే త్వాం నమస్యంతి జగత్ప్రధానం భక్తిం పరం యేచ వహన్తి తుభ్యమ్ ।
భక్త్యా చ నిత్యం తవ పూజయన్తి స్థానం హి తేషాం సులభం మదీయమ్ ॥ 29
మదీయ మేతద్భువి చాపరత్నం ప్రదీయతాం భార్గవ నందనాయ ।
ఋచీక పుత్రాయ గుణాధికాయ తస్మాత్సమా దాస్యతి తస్య పుత్రః ॥ 30
సతేన చాపేన నిహత్య శత్రూన్ కృత్వా చ లక్ష్మీం వసుధాం సురేశ! ।
తచ్చాపరత్నం భువి రాఘవాయ ప్రదాస్యతే రామ ఇతి శ్రుతాయ ॥ 31
కృత్వా స రామోఽపి హి తేన కర్మ ప్రదాస్యతే తద్వరుణాయ చాపం ।
తస్మాత్సమా దాస్యతి ఫాల్గునోఽపి దేవార్థ కార్యైక రతి ర్మహాత్మా ॥ 32
స్వం చాపరత్నం జనకాయ దేహి! నిమీతి నామ్నా భువి శబ్దితాయ ।
తేనాపిచాపేన స తత్ప్రసూతో రాజా మహత్కర్మ కరిష్యతీతి ॥ 33
ఏతావ దుక్త్వా భగవాన్ మహాత్మా జగామ కాష్ఠాం మనసస్త్వభీష్టామ్ ॥
మయా తథాతే భువి చాపరత్నే ద్విజప్రధాన క్షితిపేషు దత్తే ॥ 34
యద్వైష్ణవం చాపవరం పితుస్తే న్యస్తంకరే వాసుకి తుల్యరూపం ।
తద్వైవ కార్యేణ వినా న శక్యం కేనా ప్యధిజ్యం యుధిరామ కర్తుమ్ ॥ 35
అజ్ఞాత వస్తుదురితం సురకార్యదక్షం గోవింద బాహువిటపాశ్రయలబ్ధమానమ్ ।
న్యస్తం పురా పితృకరే తవ యుద్ధశౌండ! చేత్థం మయా హరివచః ప్రసమీక్ష్య రామ! 36

ఇతి శ్రీ విష్ణు ధర్మోత్తరే మహాపురాణే ప్రథమఖండే-మార్కండేయ వజ్ర సంవాదే
వైష్ణవధనుః ప్రాదుర్భావోనామ సప్తషష్టితమోఽధ్యాయః.

పరమేశ్వరుడనంబడు దేవుడనేను ప్రపితామహుండనంబడు నీవును నేనే. శంకరా ! మూడు రూపములాశ్రయించి మూడు రకముల కర్మములను సాధించుచున్న దొక్కడే. దేవతలపనికై ఉత్పత్తినాశములు పాలనమునను మూడు పనులు మూడుకాలములందు నాచే జరుపబడుచుండను. జగముల సంహార కార్యమున విజృంభించు నీయొక్క యాఉగ్రమూర్తి నాదే. కారణములకు గారణములయిన వానికి ప్రభువు భవుడు (భవంతి జగంత్యస్మాదితిభవః = జగత్తులేయననుండి ప్రభవించును. గాన భవుడనినిర్వచనము) సర్వదేవతలకు బూజ్యుడగుటచే సర్వేశ్వరుడనబడును. జగత్ప్రియవానులగు నీకెవ్వరు మ్రొక్కుదురు నీ యెడపరమ భక్తిపూనుదురు భక్తితో నీస్థానమును (క్షేత్రమును) పూజింతురు వారికి నాస్థానము సులభము. ఇదిగో యీనా చాప రత్నమును భార్గవనందనునకిమ్ము. అతడు ఋచీకకుమారుడు గుణాధికుడు. అతనికుమారుడాతనినుండి దానింగైకొనును. దానితో నతడు శత్రుసంహారముసేసి వసుంధరా భారమును హరించును. ఆధనుఃశ్రేష్ఠము రాముడని వినబడు నతనికీయబడును. ఆ రాముడును దానిచే భూభారముహరించి వరుణునకీయగలడు. అతనినుండి ఫాల్గునుడును (అర్జునుడును) దానింబడసి దేవకార్యైక నిష్ఠ డగును. శంకరా ! నీచాపమును నిమియను పేర నవనింబిలువబడు జనకునకిమ్ము. అతని కొడుకుదానితో నద్భుతకార్యము సేయ గలడు అని యింతదాక పలికి భగవంతుడు తనకభీష్టమైన దెసకుంజనెను. నేనారెండు ధనుస్సుల రాజులకిచ్చితిని. వైష్ణవధనువు మీతండ్రి హస్తమునందు న్యాసముసేసితిని. (జాగ్రత్తపరుపుమని దాచనికిచ్చితినన్నమాట) పరశురామా! విష్ణువచనము ననుసరించి యేదోయొక తెలియని పదార్థముచేగూర్చబడినది సురకార్య నిర్వహణసమర్థమైనది గోవింద బాహుశాఖాలంబన మొందుటచే నద్భుతగౌరవముంగొన్నదియునునగు నీవైష్ణవచాపము నీతండ్రిచేతిలో నుంచబడినది.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున వైష్ణవధనుఃప్రాదుర్భావమను నరువదియేడవయధ్యాయము.

## అరువది యెనిమిదవ అధ్యాయము-అశ్మనగర దర్శనము

మార్కండేయ ఉవాచ :

ఏవముక్త స్తదా రామో దేవదేవేన శంభునా । ప్రణమ్య శిరసాదేవం పార్వతీం వరదాం తథా ॥ 1
ప్రమథైశ్చ పరిష్వక్తః సోత్కంఠేనాంతరాత్మనా । జగామాశ్రమ ముద్దిశ్య పితుః పర బలార్దనః ॥ 2
సోఽచిరేణైవ సంప్రాప్య దదర్శాశ్రమమండలే । వయోవృద్ధం తపోవృద్ధం పితరం దీప్త తేజసమ్ ॥ 3
సోఽభివాద్య పితుః పాదౌ మాతుశ్చ పరవీరహా । భ్రాతౄణా మాను పూర్వ్యేణ ధర్మనిత్యో జితేంద్రియః ॥ 4
తైశ్చ మూర్ధ్న్యుపాఘ్రాతః సాంత్వితస్స మహాతపాః । స మత్ప్రసాదం పృష్టశ్చేత్యుక్త్వా సర్వమశేషతః ॥ 5
ఆఖ్యాతవాన్ తతః పశ్చాత్ పాతాలగమనం తదా । ఆసన్నం దేవకార్యంచ చాపరత్నంచ వైష్ణవం ॥ 6
జమదగ్నిర్మహాతేజాః శ్రుత్వా రామవచ స్తదా । చాపరత్నం చ రామాయ ప్రదదౌ దేవ పూజితం ॥ 7
దత్త్వోవాచ స తం రామం హుతాశన సమప్రభం । పశ్చిమేన సముద్రేణ ప్రవిశ్య వరుణాలయం ॥ 8
సంపూజ్య వరుణం రామ ! తస్యైవానుమతే తదా । శక్రశత్రూన్ దురాచారాన్ పాతాలనిలయాన్ జహి ॥ 9
అనేన చాపరత్నేన వైష్ణవేన మహాబల ! । దైతేయాన్ సమరే హత్వా గత్వాచ వరుణాలయమ్ ॥ 10
ప్రష్టవ్యో వరుణో దేవ స్త్వయా ధర్మాన్ సనాతనాన్ । స పుత్ర ! వరుణాద్ధర్మాన్ శ్రుత్వా రామ యథావిధి ॥ 11
ఆగచ్ఛేథా యథాకాలం మత్సమీపం మహాభుజ! । ఏవముక్త స్తదా రామః పిత్రా ధర్మభృతాం వరః ॥ 12
పితరం మాతరం భ్రాతౄ నభివాద్య యథావిధి । జగామ వరుణావాసం రామో వైశ్వానర ద్యుతిః ॥ 13
స ప్రవిశ్య సముద్రేణ మహాదేవప్రసాదతః । తతోఽశ్మ నగరం రామో దదర్శ పుర ముత్తమమ్ ॥ 14

మనోఽభిరామం స్ఫటికాశ్మచిత్రం తురంగ నాగేంద్ర కులాఽఽకులంచ ।
విభూషితం పన్నగ దైత్యనాథై రుద్యానవాపీశత సంకులంచ ॥ 15

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే రామస్యాఽఽశ్మనగరదర్శనంనామ
అష్టషష్టితమోఽధ్యాయః

మార్కండేయుడనియె. శంకరుడిట్లు పలుక పరశురాముడు మహాదేవునకు పరప్రదాత్రియగు పార్వతికిని తలవంచి మ్రొక్కి ప్రమథగణములు గౌగలించుకొన నమితవేడుకతో దండ్రియాశ్రమునకుజనియెను. సత్వరమటయటజేరి యా యాశ్రమ మండలమున వయోవృద్ధుడుతపోవృద్ధుడై బ్రహ్మతేజస్సుతోదీపించుచున్న యాయననుచూచెను. తల్లిదండ్రుల పాదములపైప్రణతుడై యన్నలకును నమస్కరించి వారును శిరమ్మువూర్కొని సుఖముగా వచ్చితివాయని బుజ్జగింప నీకు గలిగిన శివానుగ్రహ విశేషమే మని యడుగ నదియును ఆపై పాతాళగమనమును సిద్ధమైన దేవకార్యమును విష్ణుధనుస్సు వృత్తాంతమును వారికెరింగించెను. జమదగ్ని రాముని పలుకాలించి దేవతలుపూజింపు విష్ణుధనుస్సు రామునకిచ్చెను. మరియు నగ్నివలె దీపించుచున్న యాతనింగని పశ్చిమసముద్రమార్గముననేగి వరుణలోకమునకేగి వరుణుని బూజించి యాతని యభిమతమ్మనుసరించి పాతాళమందలి యింద్ర శత్రువుల దురాచారుల సంహరింపుము. ఈ చాపరత్నముచే నయ్యందరుదైత్యులంగూల్చి తిరిగి వరుణాలయమున కరిగి వరుణదేవుని సనాతనధర్మము లానుతిమ్మని ప్రార్థించి యథావిధిగవిని సమయానుకూలముగ తిరిగి నాయొద్దకు రమ్ము. ధార్మికశ్రేష్ఠుడిట్లు తండ్రిచే దెలుపబడి తల్లిదండ్రులకు భ్రాతలకును నభివాదనముసేసి పరశురాముడు వైశ్వానరుడట్లు దహించుచు వరుణావాసమున కేగెను. సముద్రముదారింజని మహాదేవప్రసాదమున బ్రవేశించి నీట సామాన్యులకు దర్శింపరాని పరమసుందరము స్ఫటికశిలాచిత్రము గజేంద్రకులాకులము పన్నగదైత్యదానవరాజాలంకృతమైన యశ్మనగరమనెడి నగరరాజమును దర్శించెను.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణమునందు ప్రథమ ఖండమున యశ్మనగరదర్శనమను నరువదియెనిమిదవ అధ్యాయము

## అరువది తొమ్మిదవఅధ్యాయము - రామకృతవరుణాది సందర్శనము

మార్కండేయ ఉవాచ :

తస్మిన్పురవరే రమ్యే రత్నచిత్ర సభాగతం । రత్నాసన గతం వీరం చారుకుండల లోచనమ్ ॥ 1
స్నిగ్ధ వైడూర్య సంకాశం శుక్లాంబర విభూషితం । హారభారార్పిత తనుం చారుకేయూర ధారిణం ॥ 2
ప్రవాళమణి ముక్తాఢ్యం గంభీరం భుజగాశ్రయమ్ । కిరీటోత్తంస సంఛన్నం యాదోగణ సమాశ్రయం ॥ 3
ఆదిత్య ముదకావాస మంభసాం పతి మూర్జితం । లోకనాథం మహాద్భూతం భక్తానా మభయప్రదమ్ ॥ 4
విష్ణోర్భాగం విశాలాంసం విశాలాక్షం మహాభుజం । సేవ్యమానం మహాభాగై స్త్రిదశై ర్బ్రాహ్మణై స్తథా ॥ 5
దైతేయైశ్చ మహాభాగై ర్భీమై ర్భీమపరాక్రమైః । సుందోప సుంద శక్రాక్ష శంబ రామర కంటకైః ॥ 6
హయగ్రీవ మహాగ్రీవ దశగ్రీవ సురాంతకైః । భీమ భీమాక్ష నరక వికటోత్కట మారణైః ॥ 7
అతికాయ మహాకాయ భీమకాయ బలోద్ధతైః । నాగైశ్చ సుమహాకాయై మహాభోగై ర్జగద్ధితైః ॥ 8
నాగరాజ్ఞా వాసుకినా శంఖేనకురుణా తథా । (మహా పద్మేన పద్మేన కర్కోటక ధనంజయైః ॥ 9
ఐరావతేన నాగేన తక్షకేణ బలేన చ । కంబలా శ్వతరాభ్యాంచ హ్యార్యకేణ మహాత్మనా) ॥ 10
వాలవ్యజన హస్తా స్త ముపవీజన్తి నిమ్నగాః । గంగా చ సరయూ రాజన్! వితస్తా యమునా తథా ॥ 11
ఇరావతీ చంద్రభాగా నర్మదాచ మహానదీ । పయోష్ణీ బ్రాహ్మణీ గౌరీ విపాశా దేవికా తథా ॥ 12

శతద్రుః కంపనా వంధు స్తథా చాన్యా స్సహస్రశః । సేవ్యమాన స్తథా కూపై స్తడాగైశ్చ సవిగ్రహైః ॥ 13
సరోవరై స్సాగరైశ్చ సముద్రైశ్చ యదూత్తమ! ।

మార్కండేయుడనియె. పరశురాముడట్లు వరుణనగరముం బ్రవేశించియందు రత్నచిత్ర సభామండపమునందు, రత్నాసనమలంకరించి కుండలరత్నకాంతుల నుద్దీపించు నయనములతో స్నిగ్ధవైడూర్య మణిప్రభాభరితమైనమేన తెలిపట్టుపుట్టములందాల్చి రతనాలహారములుతూగ భుజకీర్తులద్భుతస్ఫూర్తినింప పవడములు మణులు ముత్యములు నిండమెఱయ గంభీరుడై నాగులగొలువకిరీట సంఛన్నుడై తిమింగిలాది నానావిధజలజంతుసమాశ్రయుడై జలములందున్న యాదిత్యుడాయన్నట్లు జలములన్నిటికేలికయగుటయేకాదు లోకములకు నదినాథుడైన భూతపంచక ప్రధానాధినేత భక్తాభయప్రదుడు విష్ణువుయొక్క యంశమూర్తి వెడదయైన మూపును లోచనములు బాహువులుంగలవాడు మహానుభావులైన నాగులచే త్రిదశులచే (వేల్పులచే) బ్రాహ్మణులచే భయంకరరూపము పరాక్రముంగల సుందోప సుంద శక్రాక్ష శంబరాదులగు సమరకంటకులచే హయగ్రీవ మహాగ్రీవ దశగ్రీవ దేవాంతకులచే భీమ భీమాక్ష నరక వికటోత్కట మారణులచే అతికాయ మహాకాయ భీమకాయ బలోద్ధతులచే మహాకాయులు మహాభోగులు (పెద్దపడగలుగల) జగత్తునకు హితముసేయు నాగులచే నాగరాజు వాసుకి శంఖుడు కురువు పద్మడు మహాపద్ముడు కర్కోటకుడు ధనంజయుడునను నాగులచే ఐరావతనాగుడు తక్షకుడు బలుడు కంబలుడు అశ్వతరుడు ఆర్యకుడునను నాగులచే సేవింపబడువాడు నగు వరుణుని రాముడు దర్శించెను. నాలుకలల్లార్చుచున్న వానిని జూచిరి. నదాధినేతను వాలవ్యజనములుపూని యిరువంకల నిలిచి వీచుచు గంగ సరయు వితస్త యమున ఇరావతి చంద్రభాగ నర్మద మహానది పయోష్ణి బ్రాహ్మణీగౌరి విపాశ దేవిక శతద్రువు కంపనసింధువు మున్నగు మరిపెక్కునదులు దేవతామూర్తులంధరించి గొలుచుచుండెను. చెరువులు కూపములు సరోవరములు సాగరములు సముద్రములు మున్నగు సర్వజలాశయములు విగ్రహధారులై (మూర్తిగొని) యాపశ్చిమ దిశాధినాథుని గొలుచుచుండెను.

తం దృష్ట్వా వరుణం రాజన్! స వ వందే భృగూత్తమః ॥ 14
పూజయామాసచ తథా వరుణోఽపి భృగూత్తమమ్ । పాద్యార్ఘ్యాచమనీయాద్యైరాసనే నోదకేనచ ॥ 15
ఆశీనశ్చ తదా రామో దైతేయానాంచ వధేవృతః । మహాదేవ వచ స్సర్వం వరుణాయ న్యవేదయత్ ॥ 16
స చ తేనాఽభ్యనుజ్ఞాతో యయౌ దైత్యపురం మహత్ । వరుణోఽపి మహాతేజాః రామ వాక్యేన యాదవ! 17
సంవాదయామాస తదా రామం రణకృత క్షణమ్ । తదా వరుణ దూతేభ్యో దైతేయా శ్రుత విస్తరాః ॥ 18
నిష్క్రమ్య నగరా ద్రాజన్! చతురంగ బలాన్వితాః । సుసన్నద్ధాః ప్రతీక్షన్తో రామ మద్భుత విక్రమమ్ ॥ 19
దదృశు శ్చ మహాభాగం వరచాప ధరం తదా । మృత్యో ర్భుజ మివోదగ్రం లోకాకర్షణ తేజసమ్ ॥ 20
దీప్తాంశు జాలం రణచండ వేగం ధనుర్ధరం కాల భుజ ప్రకాశమ్ ।
మహానుభావం సమరేష్వజేయం తేలిహ్యమానం భుజగేంద్రబాహుం ॥ 21

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే వరుణాది దర్శనం నామ
ఏకోన సప్తతితమోఽధ్యాయః

యాదవేశ్వరా వినుము భృగూత్తముడు (పరశురాముడు) ఆవరుణునికి వందనముగావించెను. అతడును పాద్యార్ఘ్యాచమనీయాద్యుపచారముల బరశురామునర్చించెను. మరియు నాతడుంచిన యాసనమందు గూరుచుండి దైతేయులవధ విషయమున దాను గోరబడినట్లును పరమేశ్వరుడందులకు బలికిన పలుకులను వరుణునకు నివేదించెను. అతని యనుమతమొంది దైత్యపురమునకేగెను. రాముడు యుద్ధము వేడుకగొని వచ్చినాడని వరుణుడు దూతలచే చాటింపజేసెను. దైత్యులును చతురంగబలముతో యుద్ధసన్నద్ధులై నగరువెడలి యద్భుత విక్రముండగు రాముని యెదురుచూచుచుండిరి. అద్భుతధనుర్ధారినాతనిని మృత్యుదేవతయెత్తినహస్తమట్లున్న వానిని లోకసంహారతత్పరుని రణచండవేగుని మిఱుమిట్లుగొల్పువానిని కాలదేవత భుజమన్నట్లున్న ధనువుందాల్చిన మహానుభావుని అజయ్యుని నాలుకనల్లార్చుచున్నవానిని జూచిరి.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమునందు రామకృత వరుణాదిసందర్శనమను అరువదితొమ్మిదవ అధ్యాయము.

# డెబ్బదవ అధ్యాయము - అయశ్శంకు వధ

**మార్కండేయ ఉవాచ :**

సన్నద్ధం దానవగణం పతాకాశతసంకులం । నానాప్రకారవాదిత్రం సింహనాద బలోద్ధతం ॥ 1
దృష్ట్వా రామో మహాతేజాః సజ్జం చక్రే మహద్ధనుః । శరై స్సంచదయామాస దైత్యసైన్యం మహాబలమ్ ॥ 2
అఛ్ఛాద్యైవ సంజజ్ఞే రామ ముక్తై శ్శిలీ ముఖైః । తిర్యగూర్ధ్వ మధశ్చైవ శరైర్వ్యాప్తం సమంతతః ॥ 3
చాపమండల మధ్యస్థః పరివేషీవ భాస్కరః । దృష్టమాత్రేణ సైన్యానాం చక్షూం ష్యపహర ద్రణే ॥ 4
శరాంధకారే మగ్నా స్తే దానవా దుష్టచేతసః । రామ సందర్శనా దేవ దృష్ట్వేఽర్కే కౌశికా యథా ॥ 5
స దానవానాం వ్యసృజన్ రామో భాతి శిలీముఖాన్ । సదా నవానాం మధువత్ కుసుమానాం శిలీముఖః ॥ 6

శరాంధకారే మహతి మగ్నో మతిమతాం వరః ।
మాయాం కృత్వా తదాగ్నేయీం తం దదాహ శరోత్కరమ్ ॥ 7

శరాంధకార గహనా న్నిష్క్రాంతా స్తే దితే స్సుతాః । భార్గవం కోష్టకీ కృత్య రణే బిభిదు రంజసా ॥ 8
ప్రచండై దర్ధనారాచై ర్వత్సదంతై స్సచూచుకైః । వరాహ కర్ణై ర్భల్లైశ్చ క్షురప్రైశ్చటకాననైః ॥ 9
తోమరై ర్భిండి పాలైశ్చ పాషాణై ర్లగుడై శ్శుభైః । ఖడ్గైః ప్రాసై స్తథా చక్రై ర్గదా ముసల కంపనైః ॥ 10
పరిఘై రాయసై స్త్రిశూలై స్త్రిశూలై శ్శక్తిభి స్తథా । స బాధ్యమానోఽపిరణే దైత్య నాథాయుధోత్కరైః ॥ 11
న వివ్యధే మహాతేజాః హుతాహుతి రివానలః । యదాశస్త్ర ప్రహారై స్తం న శేకు స్సమరే ద్విజమ్ ॥ 12

హంతుం దైత్యవరా యుద్ధే చక్రు రస్త్రం తదా మహత్ ।
అయ శ్శంకు ర్మహా తేజా రాజా దైత్యగణస్య యః ॥ 13

సమేతై ర్దానవై స్సార్ధం రామం రణ కృతక్షణమ్ । శరై స్సంఛాదయామాస దివ్యాస్త్ర ప్రతిమంత్రితైః ॥ 14
అస్త్రై రస్త్రాణి సంవార్య దానవేంద్రస్య భార్గవః । చిచ్ఛేద సశరం చాపం రుక్మదండం తథా ధ్వజమ్ ॥ 15
సారథేశ్చ శిరః కాయాత్ శిరస్త్రాణ విభూషితమ్ । ఏతత్కృత్వా రణే కర్మ దక్షిణేన స పాణినా ॥ 16
జగ్రాహ పరశుం తీక్ష్ణం దైత్యకాయ విదా రణమ్ । పద్భ్యామాక్రమ్య వేగేన సమరే రథకూ బరమ్ ॥ 17
నిర్జీవాన్ పాద వేగేన కృత్వా తురగ సత్తమాన్ । గదయాచ రథస్థస్య దానవేంద్రస్య సంయేగే ॥ 18
జహార సశిరస్త్రాణం శిరో జ్వలిత కుండలమ్ । అయ శ్శంకౌ హతే దైత్యే భార్గవం సమరే తదా ॥ 91

సర్వే దైత్యగణాః క్రుద్ధాః ఛాదయామాసు రంజసా ।
అస్త్ర పుంజం రణే ఛిత్వా తేషాం భృగుకులోద్భవః ॥ 20

రణే చిఛేద గాత్రాణి శిరాంసి చ మహా తపాః । క్షణ మాత్రేణ రామోఽపి దైత్యదేహ సమాకులాం ॥ 21
శోణితౌఘ నదీం చక్రే కేశశైవాల శాద్వలామ్ । బాణ మీనాం చాప నక్రాం ఛత్ర హంసావళీం తథా ॥ 22
ప్రేత లోకార్ణవ గమాం భీరు కల్మష వర్ధినీం । హ స్తిశీర్షోపలాం రౌద్రాం చారు తత్పుచ్ఛ పన్నగామ్ ॥ 23

మార్కండేయుడనియె. దానవసైన్యములు పతాకలెత్తి నానాప్రకార సమర వాద్యములు మ్రోయించుచు సన్నద్ధములగుట గని రాముడు విల్లెక్కిడి బాణవర్షముచే నరిసేనలంగప్పివైచెను. అంతట నిండిన యమ్ములుగులచే క్రిందమీద నలుదెసల మబ్బు

గ్రమ్మినట్లయ్యెను. చుట్టుగుడికట్టిన సూర్యుడట్లు ధనుర్మధ్యమందు రాముడుతేజరిల్లుచుండెను. రామబాణాంధకార నిమగ్నులై దానవులు రామదర్శనమయినంతన సూర్యదర్శనమున గుడ్లగూబలట్లుండరు నంధులైరి. ఆరాక్షసులకై బాణములజిమ్ముచున్న యా పరశురాముడు నూతనకుసుమములకై తుమ్మెదలను సృజించుచున్న వసంతునివలెనొప్పెను.

ఆ బుద్ధిమద్వరుడు గాఢబాణాంధకారమున మునిగి అగ్నిసంబంధ మయిన మాయను కల్పించి శరజాలమును దహించెను. దైత్యులంతట శరాంధకారమునుండివెలుపడి నలుమూలలగ్రమ్మి రణమందు రాముని నొక మూలకోణమున నిరికించి ప్రచండములయిన అర్ధనారాచములు చూచుకములతోడి వత్సదంతములు వరాహకర్ణములు భల్లములు = బల్లెములు క్షురప్రములు తోమరములు లగుడములు బిండిపాలములు కత్తులు కంపనములు చటకాననములు = పాషాణములు ప్రాసములు = గుదియలు చక్రములు గదా ముసల కంపనములు పరిఘలు ఇనుపశూలములు త్రిశూలములు శక్తులు ననునాయుధములచే గ్రుచ్చిరి పొడిచిరి చీల్చిరి కోసిరి క్రుమ్మిరి రొప్పిరి. దైత్యనాథుల యాయుధముల బాధకెంతగురియయినమహా తేజస్వి యాహుతులు వ్రేల్చినకొలది మంటలెగయు ననలమట్లుప్పొంగ ప్రజ్వలింపమొదలిడెను. సమరమందాద్విజుని శస్త్రప్రహారములచే జంపనేరక పోయి యప్పుడాతనిం హతముసేయునొక మారణాస్త్రము దయారుచేసిరి. దైత్యగణాధిపుడు. ఆయశ్శంకుడనుపేరివాడు విజృంభించు సమంత్రకమయిన దివ్యాస్త్రములచే రణోత్సవమహోత్సాహియై రాముని గప్పివైచెను. వాని యస్త్రములను ప్రత్యస్త్రములచే వారించి వాని సారథియొక్క బంగారు వందమును జెండాను ఖండించెను. శిరస్త్రాణముతోడి శిరస్సును నరకివైచెను. ఇట్లు మహాద్భుత రణప్రక్రియ జరిపి కుఠచేత దైత్యశరీరవిదారణమైన పదునెక్కిన పరశువుంగైకొని పాదముల సమరమందతి వేగమునదూకి రథకూబరమాక్రమించి పాదవేగముచే నుత్తమాశ్వములను నిర్జీవములంగావించి రథమందున్న దానవేంద్రుని శిరస్సును శిరస్త్రాణముతో జ్వలితకుండలములతోడి దానిం దెగనేసెను. అయశ్శంకుడు హతుడుగాగానే దైత్యగణములు క్రుద్ధులైయొక్కుమ్మడి నారామునినస్త్రపుంజములంగప్పివైచిరి. భృగుకులోద్వహుడదియెల్లజించి చెండాడి వారిదేహములనుతలలందొల్లనేనెను. అమ్మహావీరుడు క్షణమాత్రములో కేశశైవాల శాద్వలయు (కూలినరాక్షసులజుట్టునాచుగడ్డిగ గ్రమ్ముకొన్నదియు) బాణములను మీనములు ఛత్రములు (వెలిగొడుగులు) అనుహంసలును తెగిన యేనుగుల కుంభస్థలములను పెనురాతిబండలను వానితోకలను పన్నగములను బహురౌద్రమై భీరులకు కల్మషమును (చిత్తకాలుష్యము) బెంచునదియగు ప్రేతలోకమనెడి సముద్రములో వెళ్లిపడు నదియునైన ఘనదైత్య దేహసమాకులితయైన శోణితౌఘమహానదింబొనరించి క్షణమాత్రలోధరణియెల్ల ముంచెత్తెను.

ఏవం విధేఽపి సంవృత్తే రణే కర్మణి దానవాః । తం రామ మక్షతం దృష్ట్వా హత శేషాః ప్రదుద్రువుః ॥ 24
మయ తార ప్రభృతయః పురంచ వివిశు స్తదా । పలాయమానాన్ సమరే న జఘాన స భార్గవః ॥ 25
కించిచ్ఛేషు దైత్యేషు వినివృత్త స్తదా రణాత్ । హత దైత్యాయుత గణోరామో ఽశ్మనగరం యయౌ ॥
రామ ప్రవేశే నగరం వరుణస్యాజ్ఞయా తదా । పతాకా ధ్వజ సంబాధం కృతం దేవై ర్విశేషవత్ ॥ 27
నాగైశ్చ దానవైశ్చైవ సిక్తం చందన వారిణా । ధూప పుంజ సముత్క్షిప్తం కుసుమోత్కర మండితం ॥ 28
తతశ్చ సుమహా తేజా వరుణ స్తు వినిర్గతః । పుత్రపౌత్రైః పరివృతో రామ ప్రగ్రహ కారణాత్ ॥ 29
సంపూజ్యమానం వరుణోరథ మారోప్యచ స్వకమ్ । ప్రవేశయామాస పురం బహు తూర్య పురస్కృతమ్ ॥
రామ ప్రవేశే చ తదా నృత్యంతో ఽప్సరసాంగణాః । గంధర్వ ముఖ్యా గాయన్తి సంస్తువంతి చ వందినః ॥
స ప్రవిశ్యాథ నగరం వరుణస్య తథా గృహమ్ । ఉవాస తత్ర ధర్మాత్మా వరుణేన సుపూజితః ॥ 32
ధర్మాణా మాగమం కృత్వా వరుణా త్స సుతా త్తదా ॥ 33
ఏవం స రామః పరవీరఘాతీ సంప్రాప్య యాదోగణ నాధ వేశ్మ ।

ఉవాస పుత్రైః ర్వరుణస్య సార్ధం సంపూజిత స్తైః జలేశ్వరేణ ॥ 34

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే మహాపురాణే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే అయశ్శంకవధోనామ సప్తతితమోఽధ్యాయః

ధారుణముగ నారణము నడచిన నతండక్షతుడై యుండుటగని హతశేషులగుదానవులు మరియు తారును మొదలగువా పారిపోయిరి. పురమందుజొచ్చిరి. అతడా పారుచున్నవారిం జంపకుండెను. అత్యల్పసంఖ్యలో దైత్యులు మిగుల నపుడు రణ నుండి మరలి యశ్మనగరమునకు విజయము సేసెను. అక్కడ వరుణునాతినానగరమున రామ ప్రవేశమహోత్సవము పదా ధ్వజశోభనముగ నిర్వర్తింపపడెను. నాగులు దానవులుంగూడనందు బాల్గొనిరి. చందనోదకములం రాజమార్గములు దడిపి పూ మాలలలంకరించిరి. ధూప వ్రజముల ఘుమఘుమలునించిరి. అంతటనమ్మహాతేజస్వి వరుణుడు పుత్రపౌత్రులతోగూడ బయలుదే రామునికి స్వాగతమిచ్చి స్వీకరింపనెదురేగి తన రథము పైనెక్కించికొని నానా మంగళతూర్యములు మొరయ తన పురమం బ్రవేశింపజేసెను. రాముని నగరప్రవేశపమహోత్సవమందు అప్సరోగణమాడాడిరి గంధర్వవరులు పాటపాడిరి వందిమాగధు పొగడిరి అతడు వరుణుని నగరమున అతనిగృహముం బ్రవేశించి కొడుకుంతోడి యాతని పూజగొని సపుత్రకుడగువరుణునికు ధర్మముల యాగమును గావించి యటనసించెను సర్వజలాధిపతి వరుణుని కొడుకులు పూజింప నుండెను.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణమున ప్రథమ ఖండమందు అయశ్శంకవధయను డెబ్బదియవ అధ్యాయము.

## డెబ్బది యొకటవ అధ్యాయము - పరశురామకృతవరుణస్తోత్రము

వజ్ర ఉవాచ :

యత్స శుశ్రావ ధర్మాత్మా వరుణాత్ భృగునందన! । తన్మమాచక్ష్వ తత్త్వేన పరం కౌతూహలం హి మే ॥ 1

మార్కండేయ ఉవాచ :

జమదగ్ని సుతోరామో వరుణస్య గృహోషితః । కదాచి ద్వరుణం దేవ మిదం వచన మబ్రవీత్ ॥ 2

రామ ఉవాచ :

నమస్తే దేవదేవేశ ! సురాసుర గణార్చిత ! । గోబ్రాహ్మణ హితాసక్త ! యాదోగణ జలేశ్వర ! ॥ 3

త్వం తస్య దేవదేవస్య విష్ణో రమిత తేజసః । అయన మృషిభి ర్యేన విష్ణుర్నారాయణః స్మృతః ॥ 4

త్వమేవేదం జగత్సర్వం స్థావరం జంగమంచ యత్ । బ్రహ్మా విష్ణుశ్చ రుద్రశ్చ త్వచ్ఛరీరే సమాశ్రితాః ॥

త్వ మింద్ర స్త్వంచ ధనదః త్వ మీశః త్వం సమీరణః ।
త్వ మగ్ని స్త్వం యమశ్చైవ స్వాధార స్త్వమచ్యుతః ॥ 6

దేవానా మీశ్వరశ్చైవ నాగానా మీశ్వర స్తథా । సాగరాణాంచ సరసాం సరితాంచ మహాభుజ! 7

కూప వాపీ తటాకానాం శౌచస్య పరమస్య చ । విష్ణో ర్వామస్య నేత్రస్య శశాంకస్య మహాత్మనః ॥ 8

త్వన్మయం మండలం దేవ! త్వన్మయా స్సర్వతారకాః ।
త్వమేవ సరితాం నాథ స్సముద్రో యాదసాంపతిః ॥ 9

ఆధార స్సర్వరత్నానాం విద్యానాంచ జగత్పతే! । త్వ న్మయో దేహినాం ప్రాణో జీవో రుధిర సంజ్ఞితః ॥

రామ స్త్వం ప్రాణినాం దేవ! సర్వదేవ మయో విభుః ।

భవతా సంయతాః పాశై ర్దానవాః దేవ! దారుణైః ॥ 11
పాతాళద్వార మాశ్రిత్య భవాం స్తిష్ఠతి నిర్భయః । మేరు పృష్ఠేచ భగవన్! పురీతే దేవ నిర్మితా ॥ 12
తృతీయాచ మహాభాగ! మానసో త్తర మూర్ధని । పురత్రయే త్వం వససి ప్రాకామ్యేన జలేశ్వర! ॥ 13
సర్వత్ర పూజ్యసే దేవై స్సర్వభూత భవోద్భవ! । ఆధార స్త్వం హి తపసాం శౌచానాం భువనస్యచ ॥ 14
త్రైలోక్యం సకలం దేవ! ప్రకృతి ర్వికృతి శ్చ తే । మమాఽపి సుమహాభాగ! ప్రసాద సుముఖోహ్యసి ॥ 15
తస్మాన్మే భగవన్ ఛిన్ధి సంశయాన్మనసేసి వస్థితాన్ ।

వరుణ ఉవాచ :

యత్రా స్తి తే సంశయ మస్త్రధారిన్! ఛేత్తాస్మితే తత్రనసం శయోఽత్ర ।
యథా మమేశ స్త్రిపురా న్తకోఽసౌ తథాభవాన్ మేరణ చండవేగః ॥ 16

ఇతి శ్రీవిష్ణుధర్మో త్తరే-ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే శ్రీ పరశురామ వరుణ కృతస్తోత్రోనామ ఏకస ప్తతి తమోధ్యాయః.

ధర్మాత్ముడు భృగునందనుండప్పుడు వరుణునివలన విన్నదేమో యానతిమ్మది వినగుతూహలమగుచున్నదన మార్కండేయుండిట్లనియె. వరుణగృహమందట్లువసించునొకనాడు పరుశురాముడు వరుణునింగూర్చి యిట్లనియె. నమస్కారము. సురాసుర గణార్చిత! గోబ్రాహ్మణహితాసక్త! యాదోగణనాథ! విష్ణువును ఋషులు నారాయణుండనిరి. విష్ణువునకు గమ్యస్థానమునీవని దాని భావము. నారాః = ఉదకములు అయనముగ గలవాడు అనగా ఉదకములందు ప్రళయమందుండువాడు. ఉదకముల కధీశుడవునీవేగావున నీవావిష్ణువునకు గమ్యస్థానమని అర్థము. స్థావరజంగమాత్మక ప్రపంచమంతయు నీవే. త్రిమూర్తులు నీశరీర మందున్నారు. నీవుఇంద్రాదిదిక్పాలురెల్లరును. సర్వాధారుడచ్యుతుడు దేవాధీశుడింద్రుడు నాగులకధీశ్వరుడు. సాగరాదిసకల జలమూర్తులకు పరశౌచమునకు (శుచిత్వమునకు) నీ వీశ్వరుడవు. విష్ణువు నెడ మక స్సు చంద్రుడు. అతని బింబము (మండలము) త్వన్మయము. సర్వతారకలు త్వన్మయములు సరిత్తులకు నాథుడవు నీవు. జలజంతువులకు రాజవీవు. రుధిరమను పేరి జీవుడవు నీవే సర్వ దేవమయుడవు సర్వప్రాణిలోక ప్రభువునగు రాముడవు నీవు. నీ దారుణ పాశములచే దానవులు బద్ధులైనారు. పాతాళద్వారమందీవు నిర్భయుడవై యున్నావు. సర్వరత్ననిధివి నీవు. సర్వవిద్యాధారుడవు నీవు మేరువు మీద నీ రెండవ పురము దేవనిర్మితమై యున్నది. నీ మూడవయావాసము మానసోత్తర శిఖరమందు. ప్రాకామ్యముతో సర్వకామ సమృద్ధులనియెడి అణిమాది సిద్ధులలో నొకటియగు సిద్ధితో నీవీ మూడు పురములందును వసింతువు. సర్వభూతభవోద్భవుడైన నీ వెల్లవేల్పులచే నెల్లెడ పూజింపబడుదువు. తపస్సులకు నెల్ల శౌచాచారములకు భువనమునకు నీవాధారము. త్రైలోక్యమెల్ల నీ ప్రకృతి వికృతియును. నాయెడగూడ నీవు ప్రసాదసుముఖుడవైతివి. కావున నా మనసునందుగల సందియముల వారింపుమన వరుణుండనియె: శస్త్రధారీ! నీకెచట సంశయముగల దక్కడ నే ఛేదించెద. సందియము వలదు. నాకీ త్రిపురాంతకుడెట్లో నీవు నట్లే.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణమున శ్రీపరశురామకృత వరుణస్తోత్రము డెబ్బదియొకటవ యధ్యాయము.

## డెబ్బది రెండవ అధ్యాయము - సూర్యాధిమాస వర్ణనము

రామ ఉవాచ :

స్నిగ్ధవైడూర్య సంకాశ! యాదోగణ జలేశ్వర! । త్వత్తోఽహం శ్రోతుమిచ్ఛామి కాలసంస్థాం మహాభుజ! ॥ 1

వరుణ ఉవాచ :

అనాది నిధనః కాలోరుద్ర స్సంకర్షణ స్స్మృతః । సర్వభూత సమత్వాచ్చ సతురుద్రః ప్రకీర్తితః ॥ 2
అనాది నిధనత్వేన స మహాన్ పరమేశ్వరః । నిమేషావపి సూక్ష్మత్వాత్ సూక్ష్మ సూక్ష్మతరోహ్యతి ॥ 3
తస్య సూక్ష్మాతి సూక్ష్మస్య కాలస్య పరమేష్ఠినః । దుర్విభావ్యా మహాభాగ! యోగినామపి సూక్ష్మతా ॥ 4
పద్మపత్ర సహస్రంతు సూచ్యావై భిద్యతే యదా । సమకాలంతు తద్భిన్నమబుధో మన్యతే జనః ॥ 5
కాలక్రమేణ తద్భిన్నం సాతస్య ద్విజ! సూక్ష్మతా । తస్య సూక్ష్మాతి సూక్ష్మస్య నచాతి సహతే ద్విజ! ॥ 6
నామ సంఖ్యా బుద్ధైర్జ్ఞేయా గ్రహగత్యను సారతః । తత్రతారాగ్రహాః పంచద్వౌచ జ్ఞేయౌ మహాగ్రహౌ ॥ 7
ఉపగ్రహౌచ ద్వౌజ్ఞేయౌ ఏవంప్రోక్తా నవగ్రహాః । భౌమ జ్ఞజీవ భృగుజ సౌరా స్తారాగ్రహా స్స్మృతాః ॥ 8
చంద్రాదిత్యౌ తథారామ! విజ్ఞేయౌ ద్వౌమహాగ్రహౌ । ఉపగ్రహౌచ ద్వౌజ్ఞేయౌ రాహుః కేతుశ్చ భార్గవ! ॥ 9
చండార్కగత్యా కాలస్య పరిచ్ఛేద ముఖో యదా । తదా తయోః ప్రవక్ష్యామి గతిమాశ్రిత్య భార్గవ! ॥ 10

స్నిగ్ధవైడూర్యమణిప్రభా! ఓ వరుణదేవా! కాలసంస్థను గూర్చి నీవలన దెలియగోరెద తెలుపుమన పరుణుడిట్లానతీయం దొడంగె. పరశురామా! కాలము అంతము లేనిది, రుద్రుడు సంకర్షణుడని పేర్కొనబడినది. సర్వభూతముల యెడ సముడుగావున రుద్రుడనబడెను. అనాదినాథుడగుట మహాపరమేశ్వరుఁడచ్యుతుడు. నిమేషముకంటెను మిక్కిలి సూక్ష్మము గావున నతి సూక్ష్మ సూక్ష్మతరుడు. అట్టి కాలరూప బ్రహ్మయొక్క సూక్ష్మభావము యోగులకెని భావింపతరముగానిది. తామరరేకులు వేయింట నొక్క సూదిమొన గ్రుచ్చునపుడుగల భేదమును అపండితుడు గ్రహింపజాలడు. దానిలోకూడగల కాలముయొక్క సూక్ష్మభావము అతి సూక్ష్మ మగుటచే సామాన్య మానవుడు గణింపజాలడు. గ్రహములగతి ననుసరించి కాలము యొక్క నామము సంఖ్యామానమును పండితులు తెలియవలెను. అ గ్రహములలో తారాగ్రహములైదు, మహాగ్రహములు రెండు. ఉపగ్రహములు రెండు. మొత్త మివి నవ (తొమ్మిది) గ్రహములు. కుజ-బుధ-గురు-శుక్ర-సౌరి (శని) గ్రహములు. తారా గ్రహములు. సూర్యచంద్రులు రెండు మహాగ్రహములు. రాహుకేతువులు రెండునుపగ్రహములు. చంద్ర సూర్యుల గతి ననుస రించి కాలమానము చెప్పబడును. ఇదే వినుము.

భగణేన సమగ్రేణ జ్ఞేయా ద్వాదశ రాశయః । త్రింశాంశ్చ తథా రాశే ర్భాగ ఇత్యభిధీయతే ॥ 11
ఆదిత్యాత్ విప్రకృష్టస్తు భాగే ద్వాదశకే తథా । చంద్రమాస్స్యా త్తదారామ! మాసార్ధేన న సంశయః ॥ 12
భాగ ద్వాదశకేనైవ తిథ్యాం తిథ్యాం క్రమేణతు । చంద్రమాః కృష్ణ పక్షాన్తే సూర్యేణ సహ యుజ్యతే ॥ 13
సన్నికర్షా దథారభ్య సన్నికర్షా మథాపరమ్ । చండార్కయో ర్బుధై ర్మాసః చాంద్ర ఇత్య భిధీయతే॥ 14
సావనేచ తథామాసి త్రింశత్సూర్యోదయాః స్మృతాః । ఆదిత్యరాశి భోగేన సౌరోమాసః ప్రకీర్తితః ॥ 15
సర్వర్క్ష పరివర్తైశ్చ నాక్షత్రో మాస ఉచ్యతే । తిథినైకేన దివసః చాంద్రమానే ప్రకీర్తితః ॥ 16
అహోరాత్రేణ చైకేన సావనో దివస స్స్మృతః । ఆదిత్య భాగ భోగేన సౌరో దివస ఉచ్యతే ॥ 17
చంద్ర నక్షత్ర భోగేన నాక్షత్రో దివస స్స్మృతః । మానే మాసస్తు నాక్షత్రః స ప్తవింశతి భిర్దినైః ॥ 18
పరిశేషేషు మానేషు మాసస్త్రింశద్దినః స్మృతః । సౌరేణాబ్దస్తు మానేన యథాభవతి భార్గవ! ॥ 19
సావనేన మానేన దివసం కేన పూర్యతే । ఊనరాత్రాశ్చ తేరామ! ప్రోక్తా సంవత్సరేణ షట్ ॥ 20
సౌరసంవత్సర స్యాన్తే మానేన శశిజేనతు । ఏకాదశాతి రిచ్యన్తే దినాని భృగునందన ॥ 21
సమాద్వయే సాష్టమాసే దినషోడశికాన్వితే । నాడీచతుష్టయాన్తే తు తస్మాన్మాసోఽతిరిచ్యతే ॥ 22
స చాధి మాసకః ప్రోక్తః కామ్యకర్మసు గర్హితః । యదా చాన్ద్రేణ మానేన పూర్ణస్సంవత్సరో భవేత్ ॥ 23

తదా నాక్షత్ర మానేన సమాస్తో వార్షికో భవేత్ । ఏవం కాలస్య సూక్ష్మస్య ప్రోక్తం మాస చతుష్టయమ్ ॥ 24

యేన యేనచ మానేన యద్యత్కార్యం విబోధ తత్ ॥ 25

అబ్దాయనం గ్రహచార కర్మ సౌరేణ మానేన సదా వ్యవస్యేత్ ।

సత్రాణ్యుపాస్యా న్యథ సావనేన లోకేచ యత్స్యా ద్వ్యవహార కర్మ ॥ 26

స్యాత్పూర్వ కాలక్షయ పూరణాభ్యాం చాంద్రేన మానేన యుగంచ రాహోః ।

నక్షత్ర సత్రాణ్యయనాని చేందోః మానేన కుర్యాద్భగణాత్మకేన ॥ 27

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే మహాపురాణే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
వరుణం ప్రతి పరశురామ ప్రశ్నేఽర్కాది మాస వర్ణనం నామ ద్విసప్తతి తమోఽధ్యాయః.

సమగ్ర భగణము (27 నక్షత్రములు) పండ్రెండు రాశులుగా విభక్తము. ఆ రాశిలో ముప్పదవయంశము రాశి యొక్క భాగము. సూర్యునినుండి పండ్రెండవయంశమున చంద్రుడు నెలసగముచే (15 రోజులకు) ఉండును. ప్రతి తిథియందు క్రమముగా బండ్రెండవ యంశమునందాతడు సంచరించి కృష్ణపక్షము చివర సూర్యునితో సంగమించును. ఆ మహాగ్రహములు రెండింటి సన్నికర్షమును (సంగమమును) ఆరంభించి క్రమముగామరియొక సన్నికర్షము వరకునగు మాసము చాంద్ర మాసమని పిలువబడును. అట్లే సావనమాసమునందు సూర్యోదయములు ముప్పదియుండును. రాశిభోగమునననుసరించి సౌరమాసమని పిలువబడును. సర్వనక్షత్ర పరివర్తనము ననుసరించి యగు మాసము నాక్షత్రము. చాంద్ర మాసమందు ఒకే తిథి ననుసరించిన దినము సావనమున ఒక అహోరాత్రము ననుసరించిన దినము ఆదిత్య భాగ భుక్తి ననుసరించి సౌరదివసమనియు, చంద్ర నక్షత్ర భోగము ననుసరించి నాక్షత్ర దివసమనియు పేర్కొనుట జరుగును. నాక్షత్రమాస మిరువది యేడు రోజులకు పూర్తియగును. ఇతర మాసములందు నెలకు ముప్పది రోజులు. సౌర మాసముల ననుసరించి యబ్దము (ఒక్క సంవత్సరము) అగుసరికి సావనమాస ముచే దిన సంఖ్య దేనిచే బూర్తియగును ? అన్నచో అట్లు ఊనములయిన (తక్కువ వచ్చిన) రాత్రులు సంవత్సరమునను ఆరు రాత్రులు వచ్చును. అవి ఊన రాత్రములని పిలువబడును. చాంద్రమానముంబట్టి యవి సౌర సంవత్సరము పూర్తియగుసరికి బందునొక్కడ ద్రెండింటికి మించియుండును. రెండు సంవత్సరముల యెనిమిది మాసాల పదునారు రోజుల నాలుగు నాడులు (నాడీ = ఘటిక) అగుసరికి యొక్క మాస మధికమాసమగును. (అదే అధికమాసమని చాంద్రమాసమని పిలువబడును . అది కామ్యకర్మ నిషిద్ధము. చాంద్ర మానముననుసరించి సంవత్సరము పూర్తియగుసరి నాక్షత్రమానము ననుసరించి యది వార్షికమగును.

ఇట్లు సూక్ష్మకాలము యొక్క నాల్గుమాసముల యేర్పాటు దెల్పితిని. ఏ మాసముంబట్టి యే యే కార్యము సేయనగునో యిదె తెలియుము. అబ్దము యొక్క లెక్క గ్రహచారకర్మ సౌరమాసము ననుసరించి చేయవలెను. సావన మాసముచే సత్రములు (యాగములు) ఉపాసింపవలసినది. చంద్ర క్షయ వృద్ధుల ననుసరించి లోకవ్యవహార కర్మలు యావత్తు రాహుయుగము గూడ చేయనగునను. క్షత్ర సత్రాదులు భగణాత్మకమైన చాంద్రమానము ననుసరించియే చేయనగును.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున సూర్యాదిమాసవర్ణనము అను డెబ్బదిరెండవ యధ్యాయము.

# డెబ్బదిమూడవ అధ్యాయము - కాలసంఖ్యావర్ణనము

వరుణ ఉవాచ :

లఘ్వక్షర సమామాత్రా నిమేషః పరికీర్తితః । అతస్సూక్ష్మతరః కాలో నోపలభ్యో భృగూత్తమ ! ॥ 1
నోపలభ్యంయథాద్రవ్యం సుసూక్ష్మం పరమాణుతః । ద్వానిమేషాత్రుటిః జ్ఞేయాప్రాణోదశ త్రుటిస్స్మృతః ॥ 2
వినాడికాతు షట్ ప్రాణాః తాష్షష్టిర్నాడికా మతా । అహోరాత్రంచ తాష్షష్ట్యా నిత్యమేతైః ప్రకీర్తితమ్ ॥ 3
త్రింశన్ముహూర్తాశ్చ తథా అహోరాత్రేణ కీర్తితాః । తత్ర పంచదశ ప్రోక్తా రామ ! నిత్యం దివాచరాః ॥ 4
ఉత్తరాంతు యదా కాష్ఠాం క్రమాదాక్రమతే రవిః । తదా తథా భవేద్వృద్ధి ర్దివసస్య మహాభుజ! ॥ 5
దివసశ్చ యథా రామ ! వృద్ధిం సమధి గచ్ఛతి । తదాశ్రిత ముహూర్తానాం జ్ఞేయా వృద్ధిస్తదా తథా ॥ 6
దక్షిణాంచ యదా కాష్ఠాంక్రమా దాక్రమతే రవిః । దివసస్య తదా హానిఃజ్ఞాతవ్యా నిత్యమేవతు ॥ 7
క్షీయన్తే దినహానౌతు తన్ముహూర్తాస్తథైవచ । రాత్ర్యాశ్రితాశ్చ వర్ధన్తే రాత్రివృద్ధౌ తథా తథా ॥ 8
యదా మేషం సహస్రాంశు స్తులాంచ ప్రతిపద్యతే । సమరాత్రి దినః కాలో విషువచ్ఛబ్ద వాచకః ॥ 9
తత్రదానం స్వల్పమతి మహద్భవపి భార్గవ ! । శ్రాద్ధం జప్యం హుతందత్తం యచ్చాన్యత్సుకృతం భవేత్ ॥ 10
సూర్య సంక్రమణ స్యాన్తే సౌరమాస స్సమాప్యతే । సౌరమాస ద్వయం రామ ! ఋతురిత్యభిధీయతే ॥ 11
ఋతుత్రయం చాయనం స్యాత్ తద్ద్వయంచ సమాస్మృతా । దేవతానా మహోరాత్రం సచరామ! ప్రకీర్తితః ॥ 12
మేషాది షట్కగే సూర్యే తేషాం దివస ఉచ్యతే । తులాది షట్కగే సూర్యే తేషాం రాత్రిః ప్రకీర్తితా ॥ 13
పితౄణాం చాంద్ర మానేన అహోరాత్రోఽభిధీయతే । కృష్ణపక్షాష్టమీ మధ్యే తేషాం రాత్ర్యుదయ స్స్మృతః ॥ 14
శుక్లపక్షాష్టమీ మధ్యేతేషా మస్త మయస్తథా । అర్ధరాత్రః పౌర్ణమాస్యాం పితౄణాం సముదాహృతః ॥ 15
కృష్ణపక్షావసానేచ తేషాం మధ్యాహ్న ఉచ్యతే । కృష్ణపక్షక్షయే తస్మాత్తేషాం శ్రాద్ధం ప్రదీయతే ।
కృష్ణపక్షక్షయే శ్రాద్ధం యశ్చ నిత్యం కరిష్యతి । సతతం తర్పితాస్తేన భవన్తి పితరోఽవ్యయాః । 16
సమాశతైర్ద్వాదశభిః దివ్యైః తిష్యయుగం స్మృతం । ద్విగుణం ద్వాపరం జ్ఞేయంత్రేతా త్రిగుణముచ్యతే ॥ 17

చతుర్గుణం కృతం ప్రోక్తం పిండితం చాంద్ర సఖ్యయా ।
చతుర్యుగం సహస్రాణి రామ ! ద్వాదశ కీర్తితమ్ ॥ 18

అతః పరం యుగావస్థాం నిబోధ గదతో మమ । చతుష్పాత్సకలో ధర్మస్తథా బ్రహ్మోత్తరం జగత్ ॥ 19
శ్వేతవర్ణో హరిర్దేవో జ్ఞాన నిత్యాశ్చమానవాః । చత్వార్యబ్ద సహస్రాణి తేషామాయుః ప్రకీర్తితమ్ ॥ 20
సమాన వీర్యాశ్చ నరాస్తత్ర నాస్త్య ధరోత్తరమ్ । త్రిపాద విగ్రహోధర్మో రామ ! త్రేతాయుగే తదా ॥ 21
కేశవే రక్తతాం యాతే నరా దశ శతాయుషః । యజ్ఞేశుభే ప్రవర్తన్తే నిత్యం హింసాత్మ కేషుచ ॥ 22
జగత్ క్షత్రోత్తరం చైవ తదాభవతి భార్గవ ! । ద్విపాద విగ్రహోధర్మః పీతతాముచ్యతే గతే ॥ 23
సమాశ్శతాని చత్వారి తదా జీవన్తి మానవాః । యుద్ధశౌండా మహోత్సాహా లోకా వైశ్యోత్తరాస్తదా ॥ 24
జాయన్తే శాస్త్ర భేదాశ్చ మతిభేదాస్తథైవచ । స్వల్పమాయుర్నృణాం బుద్ధ్వా విష్ణుర్మానుష రూపధృక్ ॥ 25
ఏకమేవ యజుర్వేదల చతుర్ధా వ్యభజత్ పునః । తస్య శిష్య ప్రశిష్యాశ్చ వేదమేకం పునః పునః ॥ 26
శాఖాభేద సహస్రేణ విభజన్తి ద్విజోత్తమాః । ఏకపాద స్థితే ధర్మే కృష్ణతాం కేశవే గతే ॥ 27

ధర్మభేదే సముత్పన్నే దేవతానా మనిశ్చయే । నవిద్యతే తదా రామ ! ఆయుషస్తు వినిశ్చయం ॥ 28
గర్భస్థాశ్చ మ్రియన్తేఽత్ర బాల్య యౌవనగా స్తథా । శూద్రోత్తర స్తదా లోక స్త్రిష్యేభవతి భార్గవ ! ॥ 29
సురప్రతిష్ఠా ధర్మశ్చ తథా భవతి భూతలే । పాపిష్ఠో వర్ధతే రామ ! ధర్మిష్ఠః క్షీయతే తదా ॥ 30
రాజానః శూద్ర భూయిష్ఠాః చౌరా శ్చార్థోప జీవినః । బ్రాహ్మణా స్సర్వభక్ష్యాశ్చ భవన్తి భృగునందన ! ॥ 31
ధర్మనిష్ఠశ్చిరం రాజా న తదారామ ! జీవతి । తస్మిన్ కాలే సుకృతినాం భక్తిర్భవతి కేశవే ॥ 32
తేషా మల్పేన కాలేన తోష మాయాతి కేశవః । ధన్యాః కలియుగే రామ ! తప స్తప్స్యన్తి మానవాః ॥ 33
తపసాఽల్పేన తే సిద్ధిం ప్రాప్స్యన్తీతిచ నిశ్చయః । చతుర్యుగైక సప్తత్యా మన్వన్తర మిహోచ్యతే ॥ 34
కల్పస్తురామ విజ్ఞేయో మనవస్తు చతుర్దశ । ఆది మధ్యాంతరాలేషు మనూనాం భృగుసత్తమ ! ॥ 35
కృతమాన ప్రమాణేన సంధిర్భవతి మానద ! । చతుర్యుగ సహస్రంతు కల్పమాహు ర్మనీషిణః ॥ 36
కల్పశ్చ దివసః ప్రోక్తో బ్రహ్మణః పరమేష్ఠినః । తావతీ చ నిశా తస్య యస్యాం శేతే స భార్గవ ! ॥ 37
ఏవం విధై రహోరాత్రైర్దిన మాసాది సంఖ్యయా । పూర్ణం వర్షశతం సర్వం బ్రహ్మా భార్గవ జీవతి ॥ 38
బ్రహ్మాఽఽయుషా పరిచ్ఛిన్నః పౌరుషో దివస స్స్మృతః । తావతీచనిశా తస్యయస్యేదం సకలం జగత్ ॥ 39
ఎవం విధా యేదివసా వ్యతీతా న చాగతా యేచ మహానుభావ !
అనాది సత్వా త్పరమేశ్వరస్య హ్యానంత్య భావాశ్చ తథా త్వసంఖ్యాః ॥ 40

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే వరుణ రామ సంభాషణే
కాల సంఖ్యా వర్ణనం నామ త్రిసప్తతితమోధ్యాయః.

వరుణుడిట్లనియె : లఘ్వక్షరోచ్చారణకాలము (ఒక మాత్రకాలము) నిమేషము. దీనికంటె సూక్ష్మతరమైన కాలము పరమాణువుకంటె సుసూక్ష్మమయిన ద్రవ్యముపలె లెక్కకుదొరకదు. రెండు నిమేషములు త్రుటి. పది త్రుటులు ప్రాణము. ఆరు ప్రాణములు వినాడిక. అరువది వినాడికలు నాడిక. అరువది నాడికలు అహోరాత్రము. అహోరాత్ర మొక్కదాని యందు ముహూర్తములు ముప్పది. అందు పదునైదు పగటిముహూర్తములు మరి పదునైదు రాత్రిముహూర్తములు. రవి యుత్తర దిశకు నడచినకొలది పగలు పెరుగును. పగలు పెరిగినకొలది యా పగటి ననుసరించిన ముహూర్తములు పెరుగును. సూర్యుడు దక్షిణదిశకు నడచినకొలది పగలు తరిగి రాత్రి పెరుగును. పగలు తరగినకొలది రాత్రి ముహూర్తములు పెరుగును. సూర్యుడు మేషరాశినిగాని తులారాశినిగాని చేరినపుడు రేయింబవళ్లు సమానమున నుండును. ఆ సమరాత్రిందివమైన కాలము విషువత్తు అనుపేర పుణ్యకాలమగును. అప్పుడు దానమత్యల్పముగ నిచ్చినను మహత్పుణ్యమగును. శ్రాద్ధము జప్యము హుతము మరి యే సుకృతమేని యత్యధిక ఫలప్రదాయకమగును. సూర్య సంక్రమణముచివర సౌర మాసము సమాప్తిచెందును. రెండు సౌర మాసము లొక ఋతువు. మూడు ఋతువు లొక అయనము. రెండయనము లొక సంవత్సరము. మేషాదిరాసు లారింట సూర్యుడున్న యాకాలము (ఉత్తరాయణము). దేవతలకుదివసము (పగలు). తులాదిషడ్రాసులందు సూర్యుడున్నకాలము వారికిరాత్రి. మన చాంద్రమానమననైన నెల పితృదేవతలకొక్క అహోరాత్రము. కృష్ణపక్షమునందష్టమీ తిథి నడుమ వారికిరాత్రి యారంభమగును. శుక్లపక్షాష్టమీ తిథి మధ్య యందు వారి కస్తమయకాలము. పౌర్ణమాసి పితృదేవతలకు అర్ధరాత్రము. కృష్ణపక్షము చివర వారికి మధ్యాహ్నకాలము. అందువలననే కృష్ణపక్ష క్షయ(అమావాస్య) మందు వారికిశ్రాద్ధము పెట్టనగును. ఆ సమయమం దెవ్వడు వారికి శ్రాద్ధము తప్పకపెట్టునో వాని నాతని పితృదేవతలు నిత్యమును తృప్తిసందంపబడినవారు కాగలరు. పండ్రెండు వందల దివ్యవర్షములు కలియుగము. (తిష్యయుగము) దానికి రెట్టింపు ద్వాపరము. మూడు రెట్లు త్రేతాయుగము. నాలుగురెట్లు కృతయుగము. పండ్రెండు వేలదివ్యసంవత్సరములు చతుర్యుగము (నాల్గుయుగముల కాలము మహాయుగమన్న మాట).

ఇటుపై కృతాదియుగ వ్యవస్థ తెలిపెదవినుము : కృతయుగమందు ధర్మము నాల్గుపాదములతో సమృద్ధముగ నడచును. జగత్తంతయు బ్రహ్మోత్తరము. బ్రాహ్మణ పురస్సరముగానుండును. (వేదైకప్రమాణమని కూడ చెప్పవచ్చును). విష్ణువు శ్వేతవర్ణుడై యుండును. మానవులు జ్ఞాననిత్యులు. నాల్గువేల సంవత్సరములు వారి యాయుష్కాలము. నరులందరు సమానబలశాలురు. హెచ్చుతగ్గులులడవు, త్రేతాయుగమున ధర్మము త్రిపాద స్వరూపము. విష్ణువు రక్తవర్ణుడు. నరులు వేయేండ్లాయువు గలవారు. హింసాత్మకమయిన శుభమైనయజ్ఞములాచరింతురు. ఆయుగమందు జగత్తు క్షత్రోత్తరము (క్షత్రియ డగ్రగామిగా గలది). ద్వాపర యుగము ద్విపాదధర్మలక్షణము. పీతవర్ణముతో విష్ణువుండును. నాల్గువందలేండ్లు పరమాయుర్దాయము. మానవులు యుద్ధశౌండులు మహోత్సాహులు. వైశ్యలగ్రగాములు. శాస్త్రభేదమతిభేదము లీయుగములం దెచ్చుగా నుండును. ఆయుషు స్వల్పమని గమనించి విష్ణువు మానుషరూపధారియై (వ్యాసుడై) యవతరించి ఒకటియైయున్న యజుర్వేదమును నాలుగు భాగము లొనరించేను. ఆయన శిష్యులు ప్రశిష్యులు వేదమునొక్కదానిని సహస్రశాఖాభేదములగావింతురు. హరి నల్లనిరూ పొందిన కలియుగమైన ఆసమయమందు ధర్మ మొక్కపాదమునుండి ధర్మభేద మేర్పడి దేవతానిశయము నశించును. ఆయుర్దాయ మింతయని నిశ్చయింప పలనుగాదు. గర్భము లోనే శిశువులు మరణింతురు. బాల్య యౌవనములందు మరణములు సరేసరి. శూద్రోత్తరముగా మానవులు నడతురు. దేవతా ప్రతిష్ఠలు చేయుటయే ధర్మముగా సాగును. (గుడులు గోపురములు కట్టుటయే పరమధర్మమగును) పాపిష్ఠుడు వృద్ధిలో నుండును. ధర్మిష్ఠుడు తరుగులో నుండును. పాలకులు శూద్రభూయిష్ఠులు దొంగలు అర్థమాత్రోపజీవులు. బ్రాహ్మణులు సర్వభక్షకులు. పరిపాలకుడు ధర్మనిష్ఠుడైనచో నత డెక్కువకాలము బ్రతుకడు. అట్టి కలియుగమందు సుకృతులకు (పుణ్యకర్ములకు) విష్ణుభక్తి యేర్పడును. అట్టి భక్తులయెడ విష్ణువు స్వల్పకాలముననే సంతుష్టుడగును. పరశురామ ! కలియుగములో దపస్సుచేయువారెవ్వరో ధన్యులు కొంచరుమాత్రమే. వారందరల్పమాత్రముచే సిద్ధిని నందుదురు. ఇది నిశ్చయమైన విషయము. డెబ్బదియొక్క చతుర్యుగములు (మహాయుగములు) ఒక్క మన్వంతరము ఒక కల్పము. ఇందు మనువులు పదునల్గురు. ఈమనువుల మొదట మధ్యమందు చివర సంధికాలముండును. నాల్గువేల యుగములు కల్పము. అది బ్రహ్మకొక పగలు. అంతే కాల మాయనకు రాత్రి. అందాయన శయించును. ఈవిధముగ నూరేండ్లు బ్రహ్మ జీవించును. బ్రహ్మయొక్క యాయుర్దాయము ఒక పౌరుష దివసము. రాత్రియును. ఇక్కడ పురుషుడనగా పరమేశ్వరుడు. విష్ణువు పరబ్రహ్మయని చెప్పవలెను. ఇట్టివెన్ని రేయింబవళ్ళు గడచెనో గడచునో ఆయనకు పరమేశ్వరునకు లెక్కింపవలనుపడవు.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున కాలసంఖ్యావర్ణనమను డెబ్బదిమూడవ యధ్యాయము.

## డెబ్బది నాలుగవ అధ్యాయము - యుగాంతవర్ణనము

వజ్ర ఉవాచ :

యదేత దుక్తం రామస్య వరుణేన మహాత్మనా । ఏతచ్ఛ్రుత్వాతు మేజాత స్సంశయో భృగునందన ! ॥ 1

అస్మింస్తు భారతే వర్షే పరిక్షీణే యుగే తథా । అవస్థా యా భవేత్ బ్రహ్మన్! తన్మే వ్యాఖ్యాతు మర్హసి ॥ 2

మార్కండేయ ఉవాచ :

యుగేయుగే పరిక్షీణే వర్షే యాదవ ! భారతే। సంగ్రామేణ వినశ్యన్తి ప్రాయో వర్ణోత్తమా జనాః ॥ 3

వజ్ర ఉవాచ :

అస్మా చ్చతుర్యుగా ద్బ్రహ్మన్ ! యదతీతం యుగత్రయం ।
తేష్వహం శ్రోతు మిచ్ఛామి సంగ్రామం భృగునందన ! ॥ 4

మార్కండేయ ఉవాచ :

ఆసీ త్కృత యుగ స్యాన్తే విప్రాణాం క్షత్త్రియైస్సహ ।

వైశ్యానాంచ సశూద్రాణాం యుద్ధం పరమ దారుణమ్ ॥ 5
వర్ణత్రయం తత్ర రణే క్షత్రియై ర్వినిపాతితమ్ ।
(తతశ్చ బ్రాహ్మణాః కేచిత్ క్షత్రియానేవ మబ్రువన్ ॥ 6
అల్పైర్భవద్భిః కార్యేణ వయంకేన వినిర్జితాః)
తానబ్రువన్ మహాభాగాః క్షత్రియా స్సత్యసంగరాః ॥ 7

ఏకోఽస్మాకం ద్విజశ్రేష్ఠ స్సేనానీ రితి విశ్రుతః । సర్వశాస్త్రార్థ కుశలో వయం తస్య మతే స్థితాః ॥ 8
భవతాం బహుచిత్తత్వా ద్వయం తస్మాత్పదేపదే । జయామో విపులం సైన్యం నాత్ర కార్యా విచారణా ॥ 9
క్షత్రియై రేవముక్తాస్తే బ్రాహ్మణా స్సంశిత వ్రతాః । శశాంకం శరణం జగ్ముః ద్విజేశం సోమ మంజసా ॥ 10
స తా నువాచ ధర్మాత్మా సోమో రాజా ద్విజోత్తమాన్ ।
ప్రయాగే భార్గవో విద్వాన్ బ్రాహ్మణ స్సంశిత వ్రతః ॥ 11
శూరఇత్యేవ విఖ్యాతో నిత్యం వసతి ధార్మికః । ప్రమతిర్నామ తస్యాస్తి పుత్రో ధర్మభృతాం వరః ॥ 12
సర్వశాస్త్రార్థ కుశలో ధనుర్వేద పరాయణః । విష్ణుర్మానుష్య మాపన్నో యుష్మత్కార్యార్థ సిద్ధయే ॥ 13
కృత్వా సేనా ప్రణేతారం తంతు కృష్ణాజిన ధ్వజమ్ । నిర్మర్యాదాన్రణే సర్వాన్ క్షత్రియాన్ తాన్విజేష్యథ ॥ 14
సోమస్య వచనం సర్వైరేవ ముక్తై ర్ద్విజైః కృతమ్ । ప్రాయః క్షత్రియ హీనేయం లక్ష్మీ వసుమతీ కృతా ॥ 15
ఆదౌ కృతా క్షత్రబలై ర్విట్శూద్ర ద్విజ వర్జితా । ఏవం కృత యుగస్యాన్తే యుద్ధమాసీత్సు దారుణమ్ ॥ 16
తథా త్రేతా యుగస్యాన్తే రాక్షసై ర్యుద్ధ కర్కశైః ।
రాష్ట్రం రాష్ట్ర మథాఽఽసాద్యపార్థివా స్సగణా హతాః ॥ 17
రాజా భీమరథో నామ విష్ణుర్మానుష్య రూపధృక్ । దివో దాసాన్వయే జాతో నిజఘా నాథ రాక్షసాన్ ॥ 18
ఏవం త్రేతాయుగస్యాన్తే మహావిజయ కాంక్షిభిః । రాక్షసైః క్షత్రియా యుద్ధే కేశవేనచ తే హతాః ॥ 19
తథైవ ద్వాపర స్యాన్తే వాసుదేవార్జునౌ రణే । చక్రతు ర్వసుధాం లక్ష్మీం నర నారాయణౌ నృప! ॥ 20
ద్వాపరే ద్వాపరే రాజన్! తథైవ మధుసూదనః । ఏక మేవ యజుర్వేదం చతుర్ధా వ్యభజత్పునః ॥ 21
ద్వాపరేఽస్మిన్ నృపాతీతే వసిష్ఠ కులవర్ధనః । పారాశర సుతః శ్రీమాన్ విష్ణుర్ద్వైపాయన స్స్మృతః ॥ 22
ప్రకాశో జనితో యేన లోకే భారత చంద్రమాః । పరీక్షిత్ పుత్రం రాజ్యస్థం రాజానం జనమేజయం ॥ 23
వైశంపాయన ఇత్యేవ శిష్యో వ్యాసస్య విశ్రుతః । ఆఖ్యాస్యతి మహాఖ్యానం సర్వపాప భయాపహమ్ ॥ 24
ధర్మే చార్థేచ కామేచ మోక్షేచ యదునందన! ప్రదీపభూతం సర్వస్య బుధ బుద్ధి వివర్ధనమ్ ॥ 25
యత్రవిష్ణుకథాం దేవ్యాః శ్రుతయశ్చ సనాతనాః । తచ్ఛ్రోతవ్యం మనుష్యేణ పరంపద మభీప్సతా ॥ 26
భారతాత్పారణం ప్రాప్య నరకంతు న గచ్ఛతి । న చేత్స్యా ద్యది భూపాల! మహాపాతక సంయుతః ॥ 27
దశభిః పారణైస్స్నానం ప్రాప్నోతి జగతఃపతేః । కేశవస్య మహాభాగ ! నిర్మితం యేన భారతమ్ ॥ 28
వ్యస్య వేదం చతుర్ధాతు విష్ణుర్ద్వైపాయనో మునిః । శిష్యా నధ్యాపయామాస నామతస్తాన్ నిబోధమే ॥ 29
ఋగ్వేద మథపైలంతు సామవేదం తు జైమినిమ్ । అథర్వాణం సుమన్తుంతు యజుర్వేదం మహామునిమ్ ॥
అధ్యాపయామాస తదా వైశంపాయన సంజ్ఞకమ్ । వాకోవాక్యం పురాణంచ సూతం భారతమేవచ ॥ 31
అంగాని వేదాశ్చత్వారో మీమాంసా న్యాయవిస్తరః । ధర్మశాస్త్రం పురాణంచ విద్యాస్త్వేతా శ్చతుర్దశ ॥ 32
శిక్షకల్పౌ వ్యాకరణం నిరుక్తం జ్యోతిషాం గతిమ్ । ఛన్దో విశేష ష్షష్ఠశ్చషడంగో వేద ఉచ్యతే ॥ 33

సాంఖ్యంయోగం పంచరాత్రం శైవం పాశుపతమ్ తథా। కృతాంత పంచకం విద్ధి బ్రహ్మణః పరి మార్గణే ॥ 34
సంసారక్షయ హేత్వర్థే భావోపకరణే షు చ। సోత్తరా వైష్ణవా ధర్మా స్సారమేత త్ప్రకీర్తితమ్ ॥ 35
ఏతావా నేవ సకలో విద్యాగ్రామ స్తవేరితః। విద్యాః ప్రశస్తా శ్చైతాభ్యః శతశోఽథ సహస్రశః ॥ 36
యోఽసౌ వ్యాసస్య శిష్యో భూ దారణేయ స్సుత ఋషకః। తేనై వ దేవదేవేన విష్ణునా ప్రభవిష్ణునా ॥ 37
త్రేతాయుగే చతుర్వింశే భృగువంశోద్భవేన తు। వాల్మీకినాతు రచితం స్వమేవ చరితం శుభమ్ ॥ 38
రామాఖ్యానం మహాపుణ్యం శ్రోతౄణాం విష్ణులోకదం। వర్తమానే కలియుగే క్షీణే నృపతిసత్తమ! 39

వజ్రుడనియె పరశురామునికి వరుణుడు తెల్పిన యీ యంశములు విని నాకు సంశయమై యడుగుచున్నాను. ఈ భారత వర్షమందు యుగము క్షీణమయినప్పుడుండుస్థితి యెట్లుండునోయెరింగింపుమన మార్కండేయుడు ఓయాదవ! భారతమందప్పుడు రణమొనరించి యందరుత్తమ వర్ణములవారు నశింతురన వజ్రుండు గడచిన మూడుయుగాలలో నట్లుజరిగిన యుద్ధవృత్తాంతము విన గోరుచున్నన మార్కండేయుండిట్లనియె. కృతయుగమందు విప్రులకు క్షత్రియులకును వైశ్యులకు శూద్రులకు పరమదారుణయుద్ధములు జరిగి యందు మూడువర్ణములవారు క్షత్రియులవలన నశించిరి. అంతట క్షత్రియులంగని బ్రాహ్మణులు మీరల్పసంఖ్యాకులు అధికసంఖ్యాకులనెట్లు గెలిచిరనియడిగిరి. వారు సత్యప్రతిజ్ఞులనిరి. మాకొక్క బ్రాహ్మణుడు సేనానియను పేర సర్వశాస్త్రకుశలుడు నాయకుడై యుండెను. ఆయనయభిప్రాయమునకు గట్టుపడినిలిచినారము. మీరు బహుమనస్కులు. (బ్రాహ్మణానామనేకత్వం-బ్రాహ్మణులందరునొక యాలోచనకు గట్టుబడరు) కావున యడుగడుగున మీసైన్యమెంత విపులమయియున్నను మేమేగెలిచితిమి. ఇందు విమర్శింపబనిలేదన బ్రాహ్మణులు తీవ్రవ్రతపరాయణులయి చంద్రుడు ద్విజరాజుగావున యాతనిశరణందిరి. ఆధర్మాత్ముడు సోము రాజువారింగని, ప్రయాగక్షేత్రమందువిద్వాంసుడు వ్రతనిష్ఠుడుశూరుడను బ్రాహ్మణుడుధర్మపరుడుగలడు. ఆతనికుమారుడు ధార్మికశ్రేష్ఠుడు ప్రమతి యున్నాడు. అతడు సర్వశాస్త్రార్థకుశలుడు ధనుర్వేద పారగుడు మీకొరకు మనుష్యరూపముందాల్చివచ్చిన విష్ణువే యాతడు. ఆతనిని కృష్ణాజిన మనిలో పతాకచిహ్నముగా గొనినవానిని సేనాపతింగావించికొని సర్వక్షత్రియులను మీరు గెలువుడు. అన సోమని పలుకాలించి యట్లకావించిరి. కృతయుగమునందు బ్రాహ్మణ వైశ్య శూద్రులు తప్ప క్షత్రియులచే నీ విశ్వంభర భారమెల్లం దలంగెను. అట్లే త్రేతాయుగాంతమున రాక్షసులు యుద్ధకర్కశులై ప్రతిరాష్ట్రి మాక్రమించి పార్థివులను సపరివారముగ నిర్జించిరి. అప్పుడు విష్ణువు మానుషరూపియై భీమరథుండను రాజు దివోదాసుని వంశమునం దుదయించి రాక్షసులం బరిమార్చెను. ఇట్లు త్రేతాయుగము చివర రాజులు విజయకాంక్షులైన రాక్షసులచేతను శ్రీహరి చేతను మడిసిరి. అట్లే ద్వాపరము చివర వాసుదేవార్జునులు నరనారాయణమూర్తులు వసుధభారము హరించిరి. ప్రతి ద్వాపరమందు మధుసూదనుడొకే గ్రంథమయియున్న యజుర్వేదమును నాల్గుగా విభజించెను. ఈ ద్వాపరము గడువ వశిష్ఠవంశవర్ధనుడు పరాశరసూనుడు శ్రీకృష్ణ ద్వైపాయనుడు వ్యాసుడను పేర సాక్షాద్విష్ణువే భారతమను చంద్రుని ప్రకాశమునకుం గొనివచ్చెను. అయన శిష్యుడు వైశంపాయనుడు, పరీక్షిత్సుతుడు జనమేజయుడు రాజ్యమేలుతరి నాతని కీ మహాభారతేతిహాసమును జెప్పగలడు. అది సర్వపాపహరమగు గ్రంథము. ధర్మాది పురుషార్థములనది దీపమువలె ప్రకాశింపజేయునది. పండితులకు బుద్ధివర్ధకము. దానియందు విష్ణు కథలు దేవీమహిమలు సనాతన శ్రుతులు వివరింపబడినవి. పరమపదముగోరు మనుష్యుడు దానిం దప్పక వినవలయును. భారతము పారాయణముసేసి పరమపుణ్యమంగినవాడు మహాపాతకములు సేసినవాడుగాడేని నరకముం బొందడు. పది భారత పారణములు సేసినవాడు విష్ణుసాలోక్యమందును. దాని నిర్మించిన ద్వైపాయనముని నాల్గుగ వేదమును విభజించి వేదవ్యాసుడను పేరందెను. ఆయన పైలుని ఋగ్వేదమును జైమినిని సామవేదమును సుమంతుని అథర్వణమును వైశంపాయనుని యజుర్వేదమును అధ్యయనింపజేసెను. సూతుని వాకోవాక్యము పురాణము భారతమునుం జదివించెను. వేదాంగములు, నాల్గు వేదములు మీమాంస న్యాయవిస్తరము (న్యాయవైశేషికములు) ధర్మశాస్త్రము పురాణమునను నివి చతుర్దశ విద్యలు. శిక్ష కల్పము వ్యాకరణము నిరుక్తము జ్యోతిశ్శాస్త్రము ఛందస్సు నను నీ

యాఽంగములచే వేదము షడంగమనబడును. సాంఖ్యము యోగము పాంచరాత్రము శైవము పాశుపతము నను నివి పరబ్రహ్మ నన్వేషించుటందు కృతాంతపంచకమనబడు ప్రస్థానములు. (సిద్ధాంతపచకము లన్నమాట) సంసారక్షయ నిమిత్తముగ భావోప కరణములందు సధర్మోత్తర విష్ణుపురాణ మిదియనుం గీర్తింపబడినది.

సకలవిద్యాగ్రామమిది యింతవరకే యని నీకు దెల్పితిని. వీని నుండి పందలు వేలుగ ప్రశస్తములయిన విద్య లెన్నో యావిర్భవించినవి. వ్యాసుని పుత్రుడు శుకాచార్యులు. ఆయన శిష్యుడైయారణీయుడను పేరందెను. సర్వజగత్ప్రభువిష్ణువైన యవ్విష్ణువే యిరువదినాల్గవ త్రేతాయుగమందు భృగువంశమందు వాల్మీకి రూపమున నవతరించి తానే మహాపుణ్యము విష్ణుసాలోక్య ప్రదము నైన రామాఖ్యానము (రామాయణము) రచించెను.

కల్కీ విష్ణుయశోనామ భవిష్యతి జగత్పతిః । ఘాతయిష్యతి సర్వాన్స మ్లేచ్ఛాన్ పరబలార్దనః ॥ 40
మ్లేచ్ఛాక్రాంతాం వసుమతీం కృత్వా మ్లేచ్ఛ వివర్జితాం ! ధర్మ సంస్థాపనం కృత్వా స్వస్థాన ముపయాస్యతి ॥
ప్రజాసు ధర్మయుక్తాసు తతస్సంపత్స్యతే కృతం । ఇత్యేవం భగవాన్ విష్ణుః యుగే క్షీణేఽభిజాయతే ॥ 42
ధర్మ సంస్థాపనార్థాయ నిత్యమేవ యదూద్వహ । ప్రాదుర్భావ సహస్రాణి సమతీతా న్యనేకశః ॥ 43
భవిష్యతి తథా తస్య యేషాం సంఖ్యాన విద్యతే ॥ 44
ఏతత్తవోక్తం హి నరేంద్ర చంద్ర ! క్షీణేయుగే యద్భవతీహ లోకే ।
అతః పరం ధర్మభృతాం వరిష్ఠ ! ప్రబ్రూహి కింతే కథయామి రాజన్! ॥ 45

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే యుగాన్త వర్ణనం నామ చతుస్సప్తతి తమోధ్యాయః.

ఇప్పుడు జరుగుచున్న కలియుగము క్షీణించినతరి కల్కిమూర్తి విష్ణుయశుండను పేర రాజగును. అరిబలమర్దనుడాతడు సర్వమ్లేచ్ఛాక్రాంతమయిన యీ వసుమతిని మ్లేచ్ఛవిముక్తి గావించి ధర్మసంస్థాపనముసేసి స్వస్థానము నలంకరించును. ఆటుపై ప్రజలు ధర్మయుక్తులుకాగా కృతయుగ మారంభమగును. విష్ణుభగవానుడిట్లు యుగక్షీణదశయందు ధర్మసంస్థాపనము సేయుట కవత రించుచుండును. అనేక వేల యవతారములు గడచినవి. రానున్నవి. వాని లెక్క యింతయని లేదు. ఓ నరేంద్రచంద్ర? ఈ లోక మందు యుగక్షీణదశలో నేమగునో తెల్పితి నీవు నింకేమి తెలుపవలయు నది పలుకుము.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున యుగాంతవర్ణనమను డెబ్బది నాల్గవ యధ్యాయము.

## డెబ్బదియైదవ అధ్యాయము - మన్వంతర వర్ణనము

వజ్ర ఉవాచ :

మన్వంతరే పరిక్షీణే యాదృశీ ద్విజ! జాయతే । సమవస్థా మహాభాగ ! తాదృశీం వక్తు మర్హసి ॥ 1
మార్కండేయ ఉవాచ :
మన్వంతరే పరిక్షీణే దేవా మన్వంతరేశ్వరాః । మహర్లోక మథాఽఽసాద్య తిష్ఠన్తి గత కల్మషాః ॥ 2
మనుశ్చ సహశక్రేణ దేవాశ్చ యదునందన ! । బ్రహ్మలోకం ప్రపద్యన్తే పునరావృత్తి దుర్లభమ్ ॥ 3
ఋషయశ్చ తథా సప్త తత్ర తిష్ఠన్తి తే సదా । అధికారం వినా సర్వే సదృశాః పరమేష్ఠినః ॥ 4
భూతలం సకలం వజ్ర! తోయరూపీ మహేశ్వరః । ఊర్మిమాలీ మహావేగః సర్వమావృత్య తిష్ఠతి ॥ 5
భూలోక మాశ్రితం సర్వం తదా నశ్యతి యాదవ ! । నవినశ్యన్తి రాజేంద్ర ! విశ్రుతాః కులపర్వతాః ॥ 6
మహేంద్రో మలయః సహ్యః శుక్తిమానృక్షవానపి । వింధ్యశ్చ పారియాత్రశ్చ మాల్యవాన్ గంధమాదనః ॥ 7

హిమవాన్ హేమకూటశ్చ నిషధో నీల ఏవచ । శ్వేతశ్చ శృంగవాన్ మేరు ర్నవినశ్యన్తి పర్వతాః ॥ 8
శేషం వినశ్యతి జగత్ స్థావరం జగమంచయత్ । నౌర్భూత్వాతు సతీ దేవీ తదాయదుకులోద్వహ! ॥ 9
ధారయత్యథ బీజాని సర్వాణ్యేవాఽవిశేషతః । భవిష్యశ్చ మను స్తస్యాం భవిష్యా ఋషయ స్తథా ॥ 10
తిష్ఠన్తి రాజశార్దూల! సప్త యే ప్రథితా భువి । మత్స్యరూపధరో విష్ణుః శృంగీ భూత్వా జగత్పతిః ॥ 11
ఆకర్షతి తు తాం నావం స్థానాత్ స్థానం స లీలయా । కర్షమాణంతు తం నావం దేవదేవం జగత్పతిమ్ ॥ 12
స్తువన్తి ఋషయ స్సర్వే దివ్యైః కర్మభి రచ్యుతమ్ । ఘూర్ణమాన స్తదా మత్స్యో జలవేగోర్మిసంకులే ॥ 13
ఘూర్ణమానాంతు తాం నావం నయత్యమిత విక్రమః । హిమాద్రి శిఖరం నావం దేవదేవో జగత్పతిః ॥ 14

మత్స్య స్త్వదృశ్యో భవతి తేచ తిష్ఠన్తి తత్రగాః ॥ 15
కృతతుల్యం తదా కాలం తావత్ ప్రక్షాలనం స్మృతమ్ ।
ఆప స్సామ్య మథోయాన్తి యథాపూర్వం నరాధిప! ।
ఋషయశ్చమనుశ్చైవ సర్వం కుర్వన్తి తే తదా ॥ 16
మన్వంతరాన్తే జగతా మవస్థా మయేరితా తే యదునందనాఽథ ।
అతః పరం యత్తవ కీర్తనీయం సమాసత స్తద్వద భూమిపాల! ॥ 17

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే మన్వంతరవర్ణనంనామ పంచ సప్తతి తమోఽధ్యాయః.

వజ్రుండు మన్వంతరము గడుప నామీద నగు నయ్యవస్థావిశేష మానతిమ్మన మార్కండేయు డిట్లనియె: మన్వంతర క్షీణ దశయందు మన్వంతరాధిపతులు విగత కల్మషులు మహర్లోకమంది యందుందురు. మనువు దేవేంద్రుడు దేవతలును పునరావృత్తిరహిత బ్రహ్మలోకమందుందురు. సప్తర్షులు నధికారము లేకుండ కేవలము బ్రహ్మతో సాదృశ్యమంది యచ్చట నుందురు. మహేశ్వరుడు జలరూపి భూతలమెల్ల తరంగమాలికల ముంచెత్తి మహావేగియై సర్వము నావరించియుండును. భూలోకమందున్నదెల్ల నశించును. కులపర్వతములు ప్రసిద్ధిగన్న మహాగిరులు మాత్రము నశింపవు. ఆ నశింపని పర్వతములు మహేంద్రము మలయము సహ్యము శుక్తిమంతము ఋక్షవంతము. వింధ్యము పారియాత్రము మాల్యవంతము గంధమాదనము హిమవంతము హేమకూటము నిషధము నీలము శ్వేతము శృంగవంతము మేరువు నననువి. శేషించిన చరాచరజగమ్మెల్ల నశించును. వసుమతీదేవి యొక నౌకయై సర్వబీజధారణముసేసి (ధారణాద్ధరణియని పేరొంది) నిలుచును. ఆమె యందు కాబోవు మనువు సప్తర్షు లేడ్వురును నిలిచియుందురు. విష్ణువు మత్స్యమూర్తియై శృంగియై (కొమ్ముగొని) జగత్పతిగావున యా నావ నౌక చోటు నుండి యింకొకచోటికి విలాసముగ నాకర్షించుచుండును. అట్టితరి నాయనను నా నౌకాకారియైన వసుంధరను హరుని ఋషులు దివ్య కర్మలచే సూక్తములచే స్తుతింతురు. జలవేగమున తరంగసంకులమయిన యా జలధియం దీదుచు నా మత్స్యమమిత విక్రమమున హిమాలయపర్వత శిఖరముచేర్చును. అంతలో నా మత్స్యమూర్తి యదృశ్యుడై యందున్న వారందరు నటవే యుందురు. కృతయుగ పరిమాణముగల కాలమట్లనే కడచును. దానికి ప్రక్షాళన మను పేరు గల్గును. నీరు సమస్థితినిపొందును. సర్వ కార్యక్రమము నప్పుడు సర్వర్షులు మనువుకూడ నిర్వహింతురు. యదుకుమార! మన్వంతరము చివరి జగదవస్థ నీ కెరింగించితిని. ఈపైనేమి వర్ణింప వలయునది యడుగుము.

ఇది శ్రీవిష్ణు ధర్మోత్తర మహాపురాణమున ప్రథమఖండమున మన్వంతరవర్ణనమను డెబ్బదియైదవ యధ్యాయము.

## డెబ్బదిఆరవ అధ్యాయము-కల్పాంతవర్ణనము

వజ్ర ఉవాచ :

బ్రాహ్మస్య దివసస్యాన్తే యాదృశీ ద్విజ! జాయతే । జగతోఽస్య సమావస్థాతాదృశీం వక్తు మర్హసి ॥ 1

మార్కండేయ ఉవాచ:

వృత్తే ప్రక్షలనే రాజన్! కల్పస్యాన్తే చతుర్దిశమ్ । ఉత్తిష్ఠన్తి తదా ఘోరా దివి సప్త దివాకరాః ॥ 2

తేతు పీత్వాం జలం సర్వ శోషయన్తి జగత్త్రయమ్ । వినాశంసర్వభూతానామయోగుడ సమా తదా ॥ 3

భూమిర్భవతి భూపాల! దగ్ధా స్సర్వేచ జంతవః । వినష్టకిల్బిషా స్సర్వే జీవ మాత్రావశేషకాః ॥ 4

జనలోక మథాఽఽసాద్య తత్ర తిష్ఠన్తి నిర్భయాః! భూర్భువ స్వర్మహశ్చైవ తదా నశ్యన్తి పార్థివ! 5

జనలోకాదయో లోకాః నతు నశ్యన్తి పార్థివ! । తతోఽర్కాన్తే తు నశ్యన్తి సంహితా రుద్రతేజసా ॥ 6

ఉత్తిష్ఠన్తి మహారౌద్రా స్తతో దివిచరా ఘనాః । కేచి దంజన పుంజాభాః కేచిద్గజ కులోపమాః ॥ 7

కేచిత్పురవరాకారాః కేచిద్ధారిద్ర సన్నిభాః । హరితాలాంజన ప్రఖ్యా స్తథా హింగులవ ప్రభాః ॥ 8

శుకపత్ర నిభాః కేచిత్ కేచి న్నీలోపల ప్రభాః । విద్యున్మాలా వినద్ధాంగాః గర్జంతోఽథ బలాహకాః ॥ 9

ఆక్రమ్య గగనం రాజన్! పూరయన్తి మహీతలమ్ । గంగాప్రవాహ ప్రతిమై ర్ధారాపాతైః పునః పునః ॥ 10

తతస్సముద్రా భూపాల! వేలోద్భేద తరంగిణః । ఛాదయన్తి మహీం సర్వాం దగ్ధాం సూర్యగభస్తిభిః ॥ 11

తతస్సం వర్తకో వాయు ర్ఘనానా రుజతి క్షణాత్ । తతో వాయుంసమాదాయ స్వశరీరే పితామహ ॥ 12

స్వపిత్యేకార్ణవే లోకే నష్ట స్థావరజంగమే । నష్టచంద్రార్క పవన గ్రహనక్షత్రతారకే ॥ 13

సుప్త్వా యుగ సహస్రంతు దేవదేవో జగత్పతిః । పునర్విబుద్ధః కురుతే సృష్టిం ప్రాగ్వత్ పితామహః ॥ 14

సృష్టిం కరోతి ధర్మజ్ఞ కల్పే కల్పే పునః పునః । పితామహస్య రాత్ర్యన్తే తస్మాద్ధి సృజతి ప్రజాః ॥ 15

జంతూనాం జననాత్ రాజన్! జన ఇత్యభి ధీయతే । 16

ఏతావ దుక్తం తవ భూమిపాలా! కల్పే గతే యద్భవతీహలోకే ।

అతః పరంసర్వయదుప్రధాన! వదస్వ కింతే కథ యామి రాజన్ ॥ 17

ఇతి శ్రీ విష్ణు ధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
కల్పాంత వర్ణనం నామ షట్సప్తతి తమో ఽ ధ్యాయః

వజ్రుండు ఓ విప్రోత్తమ! బ్రహ్మయొక్క పగటి చివరిస్థితియేమో తెలుపుమన మార్కండేయు డనియె : ప్రక్షాళన కాలము జరిగిపోవ కల్పాంతమందు నాల్గుదెసలందు నేడుగురు సూర్యులు ఘోర రూపు లాకసమున నుదయింతురు. వారుదక మంతయుం ద్రావి ముల్లోకముల నెండింతురు. సర్వభూతములు నశింప నయ్యెడ పుడమి యినుపగుండువలె నుండును. సర్వ జంతువులు దగ్ధము లగును. కిల్బిషములు వోయి యందరు ప్రాణమాత్రావశిష్టులై జనలోకముం బొందియుట నిర్భయముగ నుందురు. భూలోకము భువర్లోకము (అంతరిక్షము) సువర్లోకము (ఆదిత్యమండలము) మహర్లోకము (చంద్రమఃస్థానము) నయ్యెడ నశించును. జనలోకము మొదలు మీఁది లోకములు నశింపవు. రుద్రతేజస్సుచే గప్పఁబడి యా సూర్యులందరు నశింతురు. అవ్వల మహారౌద్రము లయిన మేఘములు దివంబున గ్రమ్ముకొనును. కొన్ని కాటుకవలె యేనుగుల మందవలె పురములట్లుగ పసుపురంగు అరిదళము కాటుకవలెను యింగువరంగులో చిలుక రెక్కలట్లు (ఆకుపచ్చగ) నల్లగలువలట్లు మెరుపుదీగలతో బెనవేసికొని గర్జించుచు గగనముం

గ్రమ్ముకొని గంగాప్రవాహమట్టు ధారాపాతముగ నవని నెల్ల నీట మరిమరి ముంచెత్తును. అప్పల సముద్రములు చెలియలికట్టలం ద్రెంచు కెరటములతో సూర్యకిరణదగ్ధమైన మహినెల్ల నాక్రమించును. అంతలో సాంవర్తికవాయువు (ప్రలయవాయువు) మేఘము లను క్షణములో జెదరగొట్టును. అటుపై బ్రహ్మ యా వాయువుం దన శరీరమునందాకర్షించికొని లోకమేకార్ణవమైన యత్తరి స్థావర జంగమములు నశించినయెడ చంద్ర సూర్యులు గ్రహ నక్షత్రములు గాలి మొదలగునవన్నియు నష్టములైనవేళ నిదురవోవును. అట్లొక వేయియుగములు నిద్రించి యా జగత్ప్రభువు మేల్కాని మరల పూర్వమట్లు సృష్టికావించును. ప్రతికల్పమందు నాయన తన రాత్రి చివర మరల మరల సృష్టిచేయుచుండును. జీవుల జననముపలన నీలోకము జనలోకమని పేరొందినది. కల్పాంతస్థితి యిది యిందాక తెలిపితిని. ఇంకేమి తెల్పుమందువో యది యింక జెప్పెదను.

ఇది శ్రీ విష్ణుధర్మోత్తర మహాపురాణమున ప్రథమ ఖండమున కల్పాంతవర్ణనమను డెబ్బదియారవ యధ్యాయము.

## డెబ్బదియేడవ అధ్యాయము - మహాకల్పవర్ణనము

వజ్ర ఉవాచ-

మహా కల్పక్షయే బ్రహ్మన్! సమవస్థాం వదస్వ మే। భవాన్ జ్ఞాన నిధిః ప్రోక్తో యదా బ్రహ్మ పితామహః ॥ 1

మార్కండేయ ఉవాచ ।

పూర్ణే సంవత్సరశతే సంహృత్యసకలం జగత్ । శేతే బ్రహ్మ మహారాజ! ప్రాగ్వ దేకార్ణ వే తదా ॥ 2

సన్యస్య దేహం యోగేన పురుషం ప్రతిపద్యతే। మోక్షస్థాన మనుప్రాప్తే దేవదేవే పితామహే ॥ 3

యేగతా బ్రహ్మణ స్థానం ముచ్యన్తే సర్వ ఏవతే । అండస్యాభ్యంతరం సర్వం తదాంభోభిః ప్రపూర్యతే ॥ 4

శరీర ధారిణ స్సర్వే తదా నశ్యన్తి పార్థివ ! అంతర్గతేనతోయేన భిన్న మండం జగత్పతే! ॥ 5

పూర్ణే బ్రహ్మయుషి తదా బాహ్యేష్టంభసి లీయతే । ఏవంహా జగదాధారా ధరాతోయే ప్రలీయతే ॥ 6

జ్యోతిష్యాపః ప్రలీయన్తే జ్యోతిర్వాయౌ ప్రలీయతే । ఖే వాయుః ప్రలయం యాతి మనస్యాకాశ మేపచ ॥ 7

మనః ప్రలీయతే బుద్ధౌ బుద్ధి శ్చాత్మని లీయతే । అవ్యక్తే లీయతే చాత్మా అవ్యక్తః పురుషే పరే ॥ 8

అనన్తాని తథోక్తాని యాన్యండాని పురామయా । సర్వాణి తాని సంహృత్య సమకాలం జగత్పతిః ॥ 9

ప్రకృతౌ తిష్ఠతి తదా సా రాత్రి స్తస్య కీర్తితా । బ్రాహ్మ సమా శతే పూర్ణే పునరేవ జగత్పతిః ॥ 10

(సర్వం విధత్తే ధర్మజ్ఞ ! యథాపూర్వ ముదాహృతమ్ । అవ్యక్తాది క్రమేణాథ విధాయాండం మహేశ్వరః ॥ 11

అండే శరీరే భవతి స్వయంభూ రమృత ద్యుతిః) స్వయం సఏవ ధర్మజ్ఞ! బ్రహ్మ శుభ చతుర్ముఖః ॥ 12

సర్వే ష్వండేషు ధర్మజ్ఞ స్సమకాలం జగత్పతిః । స్వయం శరీరే భవతి ప్రాకామ్యా న్మనుజేశ్వర ॥ 13

బ్రహ్మయుషోఽన్తే జగతా మవస్థా మయేరితా తేయదు బృందనాథ !
అతః పరంకిం కథయామితుభ్యం తస్మే వదస్వాయతలోహితాక్ష ! ॥ 14

ఇతి శ్రీ విష్ణుధర్మోత్తరే మహాపురాణే ప్రథమ ఖండే మార్కండేయ వజ్రసంవాదే
మహాకల్ప వర్ణనంనామ సప్తసప్తతి తమోఽధ్యాయః

వజ్రుండు మహాకల్పము విపరిస్థితి యేమో తెల్పుము. నీవు బ్రహ్మవలె నిండైన జ్ఞాననిధివన్న మార్కండేయు డనియె! తనకు నూరేండ్లు నిండిన తర్వాత సర్వజగమును సంహరించి, మునుపటియట్లేకార్ణవమందు బరుండును. ఆత్తరి దేహమును విడిచి యోగసమాధియందు పురుషుని (బ్రహ్మమును) పొందును. పితామహుడట్లు మోక్షస్థానమందగా బ్రహ్మతోబాటు బ్రహ్మలోకమందు

గల జీవులందరు ముక్తినందుదురు. అప్పుడు బ్రహ్మాండ మంతయు జలముల నిండును. శరీరధారులందరు నప్పుడు నశింతురు. బ్రహ్మాండము లోనున్న నీటిచే పగిలిపోవును. బ్రహ్మ యాయువు పూర్తికాగా సర్వ వ్యాపకమయిన యాత్మయందాయన లీనమగును. ఇట్లు సర్వజగత్తుల కాధారమైన భూమి యుదకమందు. ఆ యుదకము జ్యోతిస్సునందు, అది వాయువునందు నా వాయువు ఆకాశము నందు, ఆకాశము మనసునందు, ఆమనసుబుద్ధియందు (మహత్తత్వమందు) బుద్ధి యాత్మయందుఆత్మ అవ్యక్త మనబ బడుపరమ పురుషు నందు లీనమగును. అనంతకోటి బ్రహ్మాండములని నేను మున్ను జెప్పినవన్నిటి వేకకాలమందుపసంహరించి జగత్ప్ర భువుయందుండును. అపుడది యాయనకు రాత్రి యనబడును. బ్రాహ్మమయిన యాయువు నూరేండ్లు పూర్తియైన తర్వాత జగత్పతి (పరమేశ్వరుడు) యథాపూర్వముగ తిరిగి జగద్రచన సేయును. ఆరచన అవ్యక్తాది క్రమముగ జరుగును. ఆఅమృతమూర్తిదన శరీర భూతనుయిన యాయండమునందు తానే ప్రవేశించును. ఆయన అణిమాది సిద్ధులలో ప్రాకామ్యమను సిద్ధి ననుసరించి అనం తకోటి బ్రహ్మాండములన్నింటియందు తానొక్కడై వ్యాపించియుండును. బ్రహ్మాయుఃపూర్తియందు జగత్తుల యవస్థను నీకెరింగిం చితిని. ఇంకేమి నీకు దెలుపవలెనో యడుగుము.

ఇది శ్రీ విష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమునందు మహాకల్ప వర్ణనమను డెబ్బది యేడవ యధ్యాయము.

## డెబ్బదియెనిమిదవ అధ్యాయము - బాలప్రభావకథనము

వజ్ర ఉవాచ :

సప్తమస్తే మహాభాగ ! జాతస్య దివసస్త్వయమ్ । వర్తతే బ్రహ్మణో బ్రహ్మన్ ! తత్ర మన్వంతరక్షయే ॥ 1
కథం కాల స్త్వయానీతః పురాకల్పక్షయే తదా ॥ ఏతన్మే సంశయం ఛిన్ధి ! త్వం సమః పరమేష్ఠినః ॥ 2
మార్కండేయ ఉవాచ :
నాగతేన మయానీతః కాలో మన్వంతర క్షయే । భూయో భూయో మహాభాగ ! దేవదేవ ప్రసాదతః ॥ 3
కల్పక్షయ మనుప్రాప్య దాహ కాల ఉపస్థితే । జనలోక గతేనాథ కాలోనీత స్త్వవై మయా ॥ 4
దాహకాలే తదా వృత్తే ప్రలయాంభోధి సంప్లవే । జనలోకాదహం భ్రష్టః పతితో ధరణీతలే ॥ 5
నూనం తస్యైవ దేవస్య సా మాయా భీమ విక్రమా । ఏకార్ణవే భూమితలేపతితస్యాఽపి మే నృప ! 6
జీవితం న వరిభ్రష్టం నూనం తస్య ప్ర భావత॥ తదాఽహం నష్టవిజ్ఞానః పతితోఽంభసి దారుణే ॥ 7
ఉహ్యమానోఽంబుకల్లోలై రితశ్చేతశ్చ యాదవ! । అపశ్యమానో జగతీం సశైల వనకాననామ్ ॥ 8
నిర్వేదం జీవితే దీర్ఘే తదా ప్రాప్తోఽస్మి శత్రుహన్! ।
సోఽహమార్తోఽథ నిర్విణ్ణ స్తస్మిం స్తూవక సంప్లవే ॥ 9
పశ్యామి జలమధ్యస్థం విపులే వటపాదపం । మహాశాఖం ఘనచ్ఛాయం స్నిగ్ధపల్లవ శోభితమ్॥ 10
త మహం భాహుభి ర్గత్వా తస్మి న్న్యగ్రోధపాదపే । (శాఖాస్తంతు పశ్యామి సవితారం తథోజ్జ్వలమ్ ॥ 11
దివ్యం పశ్యామి పర్యంకం సర్వరత్నోప శోభితమ్) । పర్యంకే తత్ర పశ్యామి బాలం కమల లోచనమ్॥ 12
అతసీపుష్పసంకాశం పీత వాసస మచ్యుతమ్ । పద్మపత్రాభ చరణం తదాకారకరం తథా ॥ 13
అలంకృతం వాభరణైః శిఖండైక విభూషితమ్ । ఏకం సాహస్ర మధ్యస్థం భ్రాజమాన మివ శ్రియా 14
సమాం దృష్ట్వా తదా బాలః స్మిత పూర్వ మువాచహ ।
యది శ్రాన్తో ఽసి ధర్మజ్ఞ ! విగ్రహం వదనేన మే ॥ 15
ప్రవిశ్య విశ్రమ స్వా ఽద్య యావద్వా రుచితం తవ । ఏవ కస్య సంజాతా వ్రీడా యదుకులోద్వహ! ॥ 16

తతో ఽ హ మవశ స్తస్య ప్రవిష్టో నృప విగ్రహమ్ । జగతీం తత్రపశ్యామి సశైల వనకాననామ్ ॥ 17
యథా పూర్వం మహాభాగ ! నగరాకార శాలినీం । దేవ దైత్యోరగా కీర్ణాం సముద్ర వర భూషణామ్ ॥ 18
నృప రాష్ట్రి సమాకీర్ణాం వణిగ్భి రుపశోభితామ్ । ద్విజాఽధ్యయన సంఘుష్టాం వర్ణాశ్రమ సమాకులామ్ ॥ 19
సరిత్పర్వత వృక్షాఢ్యాం యజ్ఞోత్సవ సమాకులాం । తాం దృష్ట్వా కౌతుకం జాతం తస్య బాలస్య కర్మణా ॥ 20
ద్రష్టు మిచ్ఛామి తస్యాంతంభ్రమమాణ స్తత స్తతః । యదా నాసాదయా మ్యత్ర తస్యబాలస్య చేష్టితమ్ ॥ 21
పూర్ణే యుగ సహస్రే ఽ పి తమేవాహం తదా శిశుం ।
సంప్రాప్తశ్శరణం రాజన్ ! అహం భావ్యర్థ చోదితః ॥ 22
తతో ఽ హం వదనా త్తస్య నిర్గత శ్శశి సన్నిభాత్ । యదా తస్యోదరేఽపశ్యం త్రైలోక్యం సచరాచరం ॥ 23
తథా పశ్యామి సకలం బహి ర్భూమిపస త్తమ । తతోఽ హం పతిత స్తస్య పాదయో స్సుమహాత్మనః ॥ 24

వజ్రుండు మన్వంతరక్షయందు బ్రహ్మకు పట్టిన నీ కేడపరోజు మునుపటి కల్పము క్షయించినతరువాత నీవు నీ కాల మెట్లు వెళ్ళించితివో బ్రహ్మకు సమానుడవుగావున నాసందేహము వోవ నెరింగింపుమన మార్కండేయుడనియె. మన్వంతరము తుద నేనానొకలోనే కాలముగడిపితిని. దేవదేవునను గ్రహమువలన కల్పాంతస్థితిలో జగమ్ములన్నియు దహింపబడు సమయము వచ్చినపుడు మరలమరల (అనేక కల్పములు)నేను జనలోకమ్మందుండి కాలము వెళ్ళించితిని. జగత్తులదాహకాలము గడచి ప్రలయసముద్రము ముంచెత్తినతటి నేనా జనలోకమునుండి భ్రష్టుడనైయవనితలమందు బడితిని. అట్లుపడినపుడుకూడ నాజీవితము పోకుండుడ యదినిక్కముగానాదేవదేవుని ప్రభావమే. అనుగ్రహమే. అత్తడి విజ్ఞానము నష్టమయి (తెలివితప్పి) యాదారుణప్రళయ జలమందువ్వెత్తుగలేచు నాకొరటములచే నిట్టట్టు గొట్టుకొనిపోబడి సశైలవనకాననమైన భూమికనబడక ఛీ ! ఈదీర్ఘజీవితమెందులకని నిర్వేదించితిని. ఆ జల ప్రలయమందట్లు నేనార్తుడనైయుండి యంతలో నొక సువిశాలమైన మఱ్ఱిచెట్టు నానీటినడుమ గాంచితిని. దాని కొమ్మలు లెక్కకిము డవు. నిగనిగమెరయు నాకులతో మబ్బుగ్రమ్మినట్లుండెను. నేనా నీటనీదుచు దాని దరికేగి యాకొమ్మపై మిగుల నుద్దీపించుసవితను (సూర్యుని) జూచితిని. అక్కడ సర్వ దివ్యరత్నోపశోభితమైన యొకపర్యంకమును (శయ్యను) జూచితిని. ఆబాలుని మేను అతసీ పుష్పమట్లు నిగనిగ నల్లగా మెరయుచున్నది. పీతాంబరములు ధరించి యున్నాడు. తామర రేకులట్లున్నవి యాచిన్నవాని యడుగులు. అరచేతులట్లే యెఱ్ఱగనున్నవి. అనేకాభరణములలంకరించుకొన్నాడు. నెమలిపింఛెమింపు నింపుచున్నది. కోటిసూర్యుల నడుమ యొక్కడై తేజరిల్లు శ్రీకళలతో నాబాలుంగంటిని. ఆపిల్లవాడు ననుజూచి చిరునవ్వు మున్నుగ ఓధర్మజ్ఞా! నీవలసియుంటివేని నీ ముఖము చాచి నా విగ్రహమందు (శరీరమందు) ప్రవేశించి యంతసేపు విశ్రాంతి గైకొనుమనియె. దానికేను సిగ్గుపడితిని. అప్పల నేను జేయగలదిలేక యాయన మేనం బ్రవేశించితిని. ఆలోన నేనుసశైలి వనకానన యైన జగతిని(భూమిని)చూచితిని. ఆ భూమి మున్నట్లు నగరమురతో నట్లు యొప్పుచుండెను. దేవదైత్య నాగకులములందలముకొనియున్నారు. సముద్రములు చుట్టుకొనియున్నవి. రాజధానులు వ్యాపారులతో వేదపన్నులగు బ్రాహ్మణుల యధ్యయన ఘోషములతో వర్ణాశ్రమ విభాగములతో సరిత్తులు సరస్సులు గిరులు తరువులతో యజ్ఞోత్సవములతో నున్న యాధరణింగని యాబాలుని చెయిదమునకు నేనెంతో మురిసితిని. ఆబాలుని కరములు చూతమని ముచ్చట పడి యట్టిట్టు తిరుగులాడి యాబాలుని క్రీడావిలాసము యొక్క పరమావధి గానలేనైతిని. అట్లు వేయియుగములు గడచిపోవ నాశిశువు దరికేనేనల్లన నేగి భావ్యర్థ ప్రేరణలు బట్టి యాతనినే శరణందితిని. ఆశిశు కడుపులలో చరాచరములగు ముల్లోకములందిలకించి చంద్రబింబమట్లున్న యాబాలుని నెమ్మోము వెలువడి వెలికి వచ్చితిని. వెలుపలను నేనదియెల్లయట్లనే చూచి యామహాత్ముని పాదములపై బడినాడను.

తత స్సోఽ న్తర్హితో బాల స్సహతేనై వశాఖినా । ఏవంమయా తస్య విశానరేంద్ర! సంప్రాప్య పుణ్యంజఠరేహినీతా ।
మహా శరీరస్య మహానుభావ ! మహా ప్రమేయస్య పితామహస్య ॥ 25

ఇతి శ్రీ విష్ణుధర్మో త్తరే మహాపురాణే ప్రధమఖండే మార్కండేయ వజ్రసంవాదే
బాల ప్రభావ కధనం నామ అష్టస ప్తతి తమోఽ ధ్యాయః ॥

అంతలో నాబాలుడా చెట్టుతో సంతర్హితుండయ్యెను. ఇట్లాచిన్నికుఱ్ఱడుగానున్న యమ్మహాశరీరధారి యప్రమేయుడు నైన పితామహుని యొక్క కడుపులో నేనొక్క రేయి గడపితిని.

ఇది శ్రీ విష్ణుధర్మోత్తర మహాపురాణము నందు ప్రథమ ఖండమున బాలప్రభావ కథనమను డెబ్బది యెనిమిదవ యధ్యాయము.

## డెబ్బది తొమ్మిదవ అధ్యాయము - పద్మనాభోపాఖ్యానము

వజ్ర ఉవాచ-
క స్త్వసౌ బాలవేషేణ కల్పాంతేషు పునః పునః । దృష్టోఽపి న త్వయా జ్ఞాత స్తత్ర కౌతూహలం మహత్ ॥ 1
మార్కండేయ ఉవాచ -
భూయో భూయ స్త్వసౌ దృష్టోమయాదేవో జగత్పతిః । కల్పక్షయే న విజ్ఞాత స్తన్మాయామోహితేనవై ॥ 2
కల్పక్షయే వ్యతీతే తు తం తు దేవం పితామహాత్ । అనిరుద్ధం విజానామి పితరం తే జగత్పతిమ్ ॥ 3
వజ్ర ఉవాచ:-
జ్ఞాతవానసి తందేవం కధందేవాత్ పితామహాత్ । దుర్విజ్ఞేయం జగద్యోనిం సర్వభూత భవోద్భవమ్ ॥ 4

వజ్రుడు నీవు కల్పాంతములందు మరలమరల చూచినబాలవేషధారి యెవ్వడు? నీవు చూచియు నెరుంగజాలవైతివి. ఇది వినవేడుకయయ్యెడునన మార్కండేయుడనియె. ఈజగత్పతి నేనెన్నో పర్యాయములు చూచితిని. కల్పాంతమందీ చూచిన మహానుభావు డెవ్వడోయెరుంగను. ఆయన మాయకుమోహమందితిని. కల్పాంతమువెళ్లినతర్వాత బ్రహ్మవలస నాతడనిరుద్ధుడని తెలిసితిని. ఆన వజ్రుండు సర్వభూతకారణుడు జగత్తుమూలము నెరుంగరానివాడునగు నాయననెట్లు బ్రహ్మవలన నెరింగితివో సవిస్తరముగ నాన తిమ్మన మార్కండేయుడనియె.

మార్కండేయ ఉవాచ:
మాయయామోహిత స్తస్య బాలస్యామితతేజసః । దృష్ట్వోదరే జగత్కృత్స్నం విస్మయావిష్టచేతనః ॥ 5
గత్వాఽహం బ్రహ్మ సదృశం పృష్టవాన్ తం పితామహమ్ । ఏకార్ణవేమయాలోకే దేవ దేవే జగత్పతౌ ॥ 6
దృష్టోబాలో మహాతేజా స్తస్యాఽహమవశ స్తతః । ప్రవిష్టో జఠరే తస్యదేవ! సర్వం చరాచరమ్ ॥ 7
మయా దృష్టం జగత్సర్వం నచ జానామి బాలకమ్ । ధ్రువం తం భగవాన్వేత్తి సర్వజ్ఞత్వా జ్జగద్గురుః ॥ 8
ఏవం పృష్టోమయా బ్రహ్మ మామువాచ జగద్గురుః । మార్కండేయ! విజానామి హ్యనిరుద్ధం జగద్గురుమ్ ॥ 0
త్వంచ తం వేత్థ తత్త్వేన నచకల్పక్షయే మునే । త్వయాదృష్టం యధాతస్య జఠరే భువనం మునే! ॥ 10
తథా దృష్టం మయా తస్య జగద్యోనే ర్మహాత్మనః । మదీయస్య దినస్యాన్తేకదాచి ద్భృగునందన ! ॥ 11
ఏకార్ణవే తదా లోకే నష్టే స్థావర జంగమే । నాగ పర్యంక శయనే పశ్యామి పురుషం తదా ॥ 12
తస్మిన్కాలే నజానామి తమహం తేనమోహితః । తతః పృచ్ఛామి తందేవం కోభవానితి విస్మితః ॥ 13

సమా మువాచ ప్రహసన్! మమేదం సకలం జగత్ । నతుమాంవేత్సి తత్త్వేన జగతా మీశ్వరేశ్వరమ్ ॥ 14
మయాఽప్యుక్త స్సదేవేశో మమేదం సకలం జగత్ । వృథా ప్రలయ మధ్యే తే మత్సమీపే విశేషతః ॥ 15
విప్రత్యయశ్చ యది తే ప్రవిశ్య జఠరం మమ । త్రైలోక్య మఖిలం పశ్య సంహృతం యన్మయా స్వయమ్ ॥ 16
ఏవముక్త స్స తు మయా తదా కేనాఽపి హేతునా । ప్రవిశ్య జఠరం మే స క్షణమాత్రా ద్వినిర్గతః ॥ 17
నిర్గమ్య మా మ బ్రవీచ్చ దృష్టం త్రిభువనం మయా । తవోదరే జగన్నాథ! త్వంచ పశ్య మమోదరే ॥ 18
ఏవముక్త్వా స సుష్వాప భోగి భోగాసనే తదా । అహ మప్యవశ స్తస్య ప్రవిష్టో జఠరం తదా ॥ 19
పశ్యామి జగతీం బ్రహ్మన్! సశైలవన కాననామ్ । స సముద్రసరిద్ద్వీపలోక పాతాళ భూషితామ్ ॥ 20
దృష్ట్వాహం పృథివీం తస్య తథా జఠరసంస్థితామ్ । నిర్గమిష్యన్న పశ్యామి శరీరం తస్య భార్గవ! ॥ 21
అన్తరిక్షం ప్రపశ్యామి నిరాలంబం పరిభ్రమన్ । పరిభ్రమణ ఖిన్నోఽస్మి తమేవ శరణం గతః ॥ 22
తతస్తు తస్య పశ్యామి రంధ్రహీనం తు విగ్రహమ్ । తస్య దేహా ద్వినిర్గంతుం శక్తి ర్నాసీ త్తథా చ మే ॥ 23
రంధ్రహీనా న్మహాభాగ! తమేవ శరణం గతః ।
తతోఽహం గతవాన్ బ్రహ్మన్! రంధ్రం ప్రాప్తం మయానఘ! ॥ 24
వాలాగ్రాదపి సూక్ష్మం తత్తతోఽహం తేన నిర్గతః । పద్మనాలే వినిష్క్రాంతం పశ్యామ్యాత్మాన మాత్మనా ॥
నాభి సరసి తత్పద్మం జాతం దేవస్య శార్ఙ్గిణః । శేష రత్నార్క శైవాలి వికాసిత దలం మహత్ ॥ 26
తతోఽహం పద్మ జన్మేతి లోకే ఖ్యాతి ముపాగతః । నాభిజాతం చ యత్పద్మం తస్య దేవస్య భార్గవ! ॥ 27
తన్మహా మండలం కృత్స్నం మేరు స్తస్య చ కర్ణికా । తత్రాఽహం తస్య సంభూతో దేవదేవస్య చక్రిణః ॥ 28
దేవస్స విష్ణు ర్జగతా మధీశః సర్వేశ్వరః సర్వజగత్ప్రధానః ।
యో బాలరూపీ భవతా న్త కాలే దృష్టోఽస్య సర్వస్య చరాచరస్య ॥ 29
ఏవం హి తస్యోదర సంస్థితేన మయోషితం జాతకుతూహలేన ।
తస్యైవ మాయా పరిమోహితేన కల్పాంతకాలేషు సదా నరేంద్ర ॥ 30

ఇతి శ్రీ విష్ణు ధర్మోత్తరే-ప్రథమ ఖండే మార్కండేయ వజ్ర సంవాదే
పద్మనాభో పాఖ్యానం నామ ఏకోనాశీతి తమోఽధ్యాయః ॥

అమితతేజస్వియగు నా బాలునిమాయకు దబ్బిబ్బుపడి యాయనకడుపులోనెల్ల జగమ్ముంగని యాశ్చర్యమొంది పితామహునిదరికేగి యడిగితిని. భగవంతుడవీవు. సర్వజ్ఞుడ నీవొక్కడవ యాబాలునెరుంగ గలవాడవు. జగద్గురుడవు కావున యానతిమ్మన బ్రహ్మనాతోనిట్లనియె. ఆతడు అనిరుద్ధుడు జగద్గురువు. కల్పాంతవేళ నీవుకూడ యతనిం దెలియనేరవు. ఆతని గర్భమందు జరాచరజగమ్ము నీవు చూచినట్లేనుం జూచితిని. నాగ పర్యంకశాయిగ నేనాతనింగంటిని. ఆ చూచినసమయమున నాతని నెవ్వడో యెరుంగను. మోహపడి యాపనినేయడిగితిని. ఆతడు నాతో నల్లననవ్వుచు నీజగమ్మెల్ల నాదియ. నారచనయేయన్నమాట. జగదీశ్వరులకీశ్వరుడనునేను. నన్నీవుతెలియలేవు. అనవిని నే నీజగత్తునాదియ (నారచించినదియ) ఇదంతయు నా ముందే యీప్రళయమందు వ్యర్థమైపోయినది. నీకిటనమ్మకము గల్గదేని నాజఠరమందు బ్రవేశించి నాచేతనే యుపసంహృతమయిన ముల్లోకములను నందు గనుము. అనవిని నేనేదోయొకకారణమున నాకడుపునాతడు ప్రవేశించి క్షణములోనే యీవలికివచ్చి నాతో నేను నీగర్భమున త్రిభువనముం గంటిని. నీవును నా గర్భమున నదిచూడుమని భోగిభోగపర్యంకమందప్పుడు నిదురవోయెను. నేను నవశుడనై యాతని కడుపునంజొచ్చి సశైలవనకానన ససాగరద్వీపపాతాలయునైన సర్వభువనకోశముంగంటిని. కాంచి యాక్షణమ యీవలికివచ్చియిటనాతని శరీరముంగాననైతిని. అట్టిటుదిరిగి నిరాలంబమైన యంతరిక్షముకాంచితిని. ఆత్రిప్పుటకలసిపోయిన నేనాయనను శరణందితిని

అవ్వల నాతని శరీరమును రంధ్రహీనముగ జూచితిని, రంధ్రములేని ఆదేహమును వెలువడివచ్చుటకు నాకుశక్తిలేదయ్యెను. అందుచే నతనినేశరణునొచ్చితిని, అప్పుడు వాలాగ్రముగంటె (వెండ్రుకకొనకంటె) సూక్ష్మమయిన యొకరంధ్రము లభించియందుండి వెలువడితిని. నేనొక తామరతూడినుండి వచ్చుచున్నట్లు ననునే నెరింగితిని. ఆవిష్ణువుయొక్క నాభి (బొడ్డు) యను సరస్సనందు పద్మము మొలచినది. శేషునిపడగలమీది రత్నములనెడి సూర్యుని వలన దాని రేకులు విచ్చికొన్నవి. అంతటనేను పద్మజన్ముడనను విఖ్యాతి నందితిని. ఆతని నాభియందు బొడమిన యాపద్మము సర్వబ్రహ్మాండమండలము. దానిదుద్దుమేరువు. ఆచక్రాయుధునివలన నేనందు జనించితిని. ఆదేవుడు విష్ణువు. సర్వ జగదీశుడు. సర్వేశ్వరుడు సర్వజగత్ప్రధానుడు చరాచర ప్రళయమందు నీవు చూచిన బాలమూర్తియాతడే. ముచ్చటకొని యేనాతనియుదరమందు మాయాపరిమోహితుడనై కల్పాంతకాలమందు నివసింతును.

శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము నందు ప్రథమఖండమున పద్మనాభోపాఖ్యానమను డెబ్బదితొమ్మిదవ అధ్యాయము

## ఎనుబదవ అధ్యాయము -యానకాలవర్ణనము

వజ్ర ఉవాచ :

బ్రహ్మణోఽస్య సముత్పత్తి మారభ్యసుమహాద్యుతే !
కాలస్య గతి మిచ్ఛామి శ్రోతుం భృగుకులోద్వహ! ॥ 1

మార్కండేయ ఉవాచ :

స్వేనాహో రాత్రమానేన బ్రహ్మణోఽస్య జగత్పతేః। సమాష్టకం గతం రాజన్! పంచ మాసాస్తథైవచ ॥ 2
అహోరాత్ర చతుష్కంచ వర్తమాన దినాద్గతమ్। అతఃపరం ప్రవక్ష్యామి తన్మేనిగదతః శృణు! ॥ 3
మనవః షడ్గతాః సప్త సంధయశ్చ తథా గతాః। సప్తవింశద్వ్యతీతాశ్చ తథైవచ చతుర్యుగాః ॥ 4
యుగత్రయం తథాఽతీతం వర్తమాన చతుర్యుగాత్। సంవత్సరాణాం దశకం తథా కలియుగాద్గతమ్ ॥ 5
వాతాశ్వమేఘ కాలేస్మిన్ సహాయక్షేణ యాదవ ! భవిష్యాణా మతీతానాం బ్రహ్మణాం భూరిదక్షిణ! ॥ 6
అనాది మత్వా త్కాలస్య సంఖ్యా వక్తుం న శక్యతే। గంగాయా స్సికతా ధారా యదా వర్షతి వాసవః ॥ 7
శక్యాగణయితుం రాజన్! న వ్యతీతాః పితామహాః। అనన్తవత్తాం బుధా బుద్ధ్వా సర్వస్య జగతీ పతే! ॥ 8
తన్మార్గం పరిమార్గన్తే యద్విష్ణోః పరమం పదమ్।
వజ్రఉవాచ- కియత్కాల పరీమాణం మయాశాస్యా వసుంధరా ॥ 9

వజ్రుడు ఈ బ్రహ్మ పుట్టుక మొదలుకొని యైన కాలముయొక్క గతి వినవలయు దెల్పుమన మార్కండేయుడనియె. జగత్పతియగు ఈబ్రహ్మకు ఆయన మానముప్రకారముఎనిమిది సంవత్సరాలయైదుమాసములమీదనాల్గుఅహోరాత్రములు నేటితో జరిగినవి. ఇటుపైలెక్కతెలిపెదవినుము. ఆరుగురు మనువులు. ఏడుసంధులు ఇరువదియేడు మాహాయుగములు మూడుయుగములు గడచినవి. ఇపుడు నాల్గవయుగమారంభమగుచున్నది. ఈకలియుగంలోగూడ పదిసంవత్సరాలు వెళ్లినవి. ఓభూరిదక్షిణ! దక్షిణలు నిండుగ నిచ్చి యజ్ఞములు సేసిన ఓ వజ్రమహారాజా ! ఈ యక్షునితో గూడిన వాతాశ్వ మేఘకాలమందు జరిగిన జరుగబోవు బ్రహ్మలయొక్క లెక్క కాలము మొదలుతుదయులేనిది కావున తెలుపుటకు శక్యముగాదు. గంగానదిలోని యిసుకరేణువులు ఇంద్రుడు గురిపించు వర్షధారలు నెన్నోలెక్కింప వలనుపడను. కాని గడచిన బ్రహ్మలను గణనసేయుట శక్యముగాదు. మొత్తమిదియంతయు నంతవంతమే (నశించునదే) యనితెలిసి యావిష్ణువుయొక్క పరమపదమార్గమును బుధులు వెదకుచుందురు.

పరీక్షితాచ ధర్మజ్ఞ! తన్మే బ్రూహి ! భృగూత్తమ।
మార్కండేయ ఉవాచ - అద్య ప్రభృతి రాజేంద్ర ! సమాపంచాశతే గతే ॥ 10
పరీక్షితి మహారాజే దివం ప్రాప్తే కురూద్వహే । పరీక్షిద్దినలోకేఽస్మిన్ ప్రాణితుం త్వంతు శక్ష్యసే ॥ 11
మహాప్రస్థాన మావిశ్య నాగలోకం గమిష్యసి । స్వర్గతే త్వయి రాజేంద్ర ! పరీక్షితి తథానృపే ॥ 12
రాజా నాగపురే భావీ పరీక్షిజ్జనమేజయః । మధురాయాంతథా భావీ తవ పుత్రోఽచలో నృపః ॥ 13
నగరం ఖాండవపురం భయాది వినివర్జితం। పాలయిష్యతి ధర్మాత్మా పుత్రస్తే భీమ విక్రమః ॥ 14
దానవేంద్రో మయః పూర్వం ఫాల్గునేన ప్రయాస్యతా।
మహాప్రస్థాన గోరాజన్ ! త్వత్ప్రియంకర్తుకామ్యయా ॥ 15
యావద్వజ్రో మహీం భుంక్తే ఖాండవ ప్రస్థమాశ్రితః । తావత్సభేయం సంరక్ష్యా త్వయా మదుపరోధతః ॥ 16
సేయం సంరక్ష్యతే ...... ప్రతిజ్ఞాయ ధనంజయే। త్వయినాక మనుప్రాప్తే సభేయం మయశాసనాత్ ॥ 17
హిమాచలంతు నేష్యన్తి యత్ర బిందు సరః సరః । రాక్షసాః కింకరా ......యత్తస్మాన్నిర్మితా పురా ॥ 18
ఉక్తం హి తే కాలగతం మయైత దాయుః ప్రమాణంచతథా తవోక్తం।
అతఃపరం ధర్మభృతాం వరిష్ఠ! వ దస్వకింతే కథయామి రాజన్! ॥ 19

ఇది శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్ర సంవాదే
యానకాల వర్ణనం నామ ఆశీతి తమోఽధ్యాయః ॥

అనవిని వజ్రుడు నేనీభూమినెంతకాలము పాలింప వలసియుండును? పరీక్షిత్తు ఎన్నాళ్లపాలించు నది యానతిమ్మన మార్కండేయుడనియె. రాజుఇప్పటినుంచి యైదుపంచలసంవత్సరములుగడువ పరీక్షిన్మహారాజుకూడ యీలోకమువదలి వెళ్లినతరువాత గూడ ఈలోకమందీవుప్రాణధారణము సేయగలవు. అప్పుడు మహాప్రస్థానముంగొని నాగలోకమునకేగెదవు. నీవుస్వర్గముంజెన తరువాత నాగపురమందు (హస్తినాపురమందు) పరిరక్షిత్తుకుమారుడు జనమేజయుడు రాజగును. మధురయందు నీకొడుకు అచలుడు రాజగును. ఖాండవప్రస్థమను నగరమును భయరహితముగ నీకొడుకు భీమవిక్రముడు ధర్మాత్ముడై పాలించును. అర్జునుడు మహాప్రస్థానము సేయుచు మయుడను దానవేంద్రునితో నీప్రియమొనరించుటకు-వజ్రుడు మహారాజ్యభోగము ననుభవించుదాక ఖాండవప్రస్థమందీవుండి ఈమహాసభగాపాడవలసినది. ఇదినాయాజ్ఞయని యానతిచ్చెను. ఆతడు ధనంజయునకు నట్లేయని మాటయిచ్చి దీనిని రక్షించును. నీవు స్వర్గమందగనే యీమయసభను మయుని యానతిచే యాతనినౌకరులు హిమాలయమందలి బిందు సరస్సునకు గొంపోదురు. ఆబిందుసరముకూడ మయుని నిర్మాణమే. నీకుకాలగతిని నాయుఃప్రమాణమునుగూడ దెల్పితిని. మరి యేమి చెప్పవలయు నది యడుగుమనియె.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణమున ప్రథమఖండమందు యానకాలవర్ణనమను నెనుబదవ యధ్యాయము.

## ఎనుబదియొకటవ అధ్యాయము - కల్పసాదృశ్యము

వజ్ర ఉవాచ:-
త్వయోదితానాం సర్వేషాం సమాసేన పృథక్ పృథక్ । కాలస్యావయవానాం చ శ్రోతు మిచ్ఛామి దేవతాః ॥ 1
మార్కండేయ ఉవాచ :-
పౌరుషం యదహోరాత్రం శ్రుతవానసి యాదవ ! కాలాత్మా పురుష స్తస్య సర్వ భూత పతిః ప్రభుః ॥ 2
కల్పస్య దైవతం బ్రహ్మ యస్యేదం సకలం జగత్ । క్రమా న్మన్వంతరాణాంతు మనవస్తు చతుర్దశ ॥ 3

స్వాయంభువస్తు ప్రథమోమను స్స్వారోచిష స్తథా । వైవస్వతో ఽథ సావర్ణిః బ్రహ్మపుత్ర స్తథైవ చ ॥ 4
ధర్మపుత్రో రుద్రపుత్రో దక్షపుత్ర శ్చ యాదవ । రౌచ్యో భౌత్యశ్చ విశ్వాత్మా మనవస్తు చతుర్దశ ॥ 5

వజ్ర ఉవాచ :-

య ఏతే భవతా ప్రోక్తా మనవ శ్చ చతుర్దశ । నిత్యం బ్రాహ్మే దినే ప్రాప్తే ఏత ఏవక్రమాద్ద్విజ ! ॥ 6
భవన్త్యుతాఽ న్యేధర్మజ్ఞ! ఏతన్మే ఛిన్ధి సంశయమ్। అథవా వర్తమానేఽస్మిన్ భవతా మమ కీర్తి తాః 7

మార్కండేయ ఉవాచ :-

ఏత ఏవ మహారాజ ! మనవస్తు చతుర్దశ । కల్పే కల్పే త్వయా జ్ఞేయా నాఽత్ర కార్యా విచారణా ॥ 8
ఏకరూపా స్త్రియః కల్పాః జ్ఞాతవ్యా స్సర్వ ఏవ హి । క్వచి త్కించి ద్విభిన్నాశ్చ మాయయా పరమేష్ఠినః ॥ 9
జ్ఞాతవ్య మేక రూపత్వ మబ్దానాంచ తథా త్వయా । కల్పే కల్పే మహారాజ! మనూనాంచ విశేషతః ॥ 10

వజ్ర ఉవాచ :-

కల్పానాం జనసాదృశ్యే యుక్తి ర్నైవోప పద్యతే । కదా చిదపి ధర్మజ్ఞ! తత్రపశ్యామి కారణమ్ ॥ 11
ఏతస్మిన్నంతరే ముక్తిం కల్పే కల్పే గతే ద్విజ! । ప్రభవిష్యజ్జగచ్ఛూన్యః కాలస్యాదేరభావతః ॥ 12

మార్కండేయ ఉవాచ :-

జీవస్యాఽన్యస్య సర్గేణ నరేముక్తి ముపాగతే । అచిన్త్యశక్తి ర్భగవాన్ జగ త్పూరయతే సదా ॥ 13
బ్రహ్మణా సహ ముచ్యన్తే బ్రహ్మలోక ముపాగతాః । సృజన్తేచ మహాకల్పే తద్విధా శ్చాపరే జనాః ॥ 14

తే ప్రాప్తాః పరమంస్థానం యేషాం జన్మ న విద్యతే ।
సమజీవ ప్రమాణాశ్చ సర్వే కల్పా స్తథా నృప ॥
బ్రహ్మలోకే విష్ణులోకే రుద్రలోకే చ యే గతాః । 15

విష్ణులోకా స్సు బహవో రుద్రలోకా స్తథైవ చ । శ్వేతద్వీప గతా యేచ తేషాం జన్మ నవిద్యతే ॥ 16
న తు సర్వేషు రాజేంద్ర ! తేషు ముక్తిః ప్రకీర్తితా ॥ బ్రహ్మలోకో పరస్తాచ్చ యేలోకా రౌద్ర వైష్ణవాః ॥ 17
మయోదితా స్తయో ర్గత్వా పున ర్జన్మ నవిద్యతే । మహా కల్పక్షయే జీవాః సర్వే తం పరమేశ్వరమ్ ॥ 18
ప్రాప్యాఽపి వినివర్తన్తే వినా జ్ఞానేన యాదవ! । భూయ ఏవ త్వలోకాన్ సర్గే సృజతి తాన్ ప్రభుః ॥ 19
కల్ప మధ్యేతు. కల్పాన్తే జ్ఞానోజ్ఝిత కలే బరాః । ప్రాప్నువన్తి పరం స్థానం తద్విష్ణోః పరమం పదమ్ ॥ 20
జీవ బీజాన్య సర్గేణ తత్స్థానం పరమేశ్వరః । ప్రపూరయతి ధర్మజ్ఞ రాజన్ ! కేనాపిహేతునా ॥ 21

వజ్రఉవాచ :

కల్పానాం సతి సాదృశ్యే యోభేదో భృగునందన । తమహంశ్రోతు మిచ్ఛామి తత్రమే కౌతుకం మహత్ ॥ 22

మార్కండేయ ఉవాచ :-

కల్పానాం సతి సాదృశ్యే శృణు భేదం నరాధిప ! । సమతీతే తదా కల్పే షష్ఠే మన్వంతరే గతే ॥ 23
సప్తమస్య చతుర్వింశే రాజన్ ! త్రేతాయుగే తదా । యదా రామేణ సమరే సగణో రావణో హతః ॥ 24
రామేణైవ తదా రాజన్ ! కుంభకర్ణో నిపాతితః । వర్తమానే తు యద్వృత్తం కల్పే యదుకులోద్వహ ! ॥ 25
రామస్య చరితం బద్ధం తదా వాల్మీకినా శుభమ్ । అతీత కల్పే యద్వృత్తం మయా తత్కామ్యకే వనే ॥ 26
యుధిష్ఠిరాయ కథితం ధర్మపుత్రాయ పార్థివ ! కల్పానాం సతిసాదృశ్యే భేద ఏష తవేరితః ॥ 27
తేషాం స్వరూపంచ తథా, తథా రాజ న్ననుక్రమమ్ । బ్రహ్మ జన్మని సర్గాశ్చ తథా తస్య పృథ గ్విధాః ॥ 28

కార్తికేయస్య లక్ష్మ్యాశ్చ తథా దేవస్య శూలినః ।
ఏవమాద్యాః ప్రభేదాస్తు త్వయా జ్ఞేయాః ను పార్థివ ! ॥
కల్పాదీనాం మహారాజ ! చాన్యత్రాఽపి యదూద్వహ ! ॥ 29
సాదృశ్య భేదావిహ భూమిపాల ! కల్పస్య కల్పస్య మయోదితౌ తే ।
యుగాది భిన్నస్య చ దైవతాని వక్ష్యామ్యత స్తాని నిబోధ రాజన్ ! ॥ 30

ఇతి శ్రీ ధర్మోత్తరే ప్రథమ ఖండే మార్కండేయ వజ్ర సంవాదే
కల్పసాదృశ్యం నామ ఏకాశీతి తమోఽధ్యాయః

కాలావయవములం గూర్చి కాలావయవ దేవతలం గూర్చి వినవలతునని వజ్రుడన మార్కండేయుడిట్లనియె. పౌరుషమయిన యహోరాత్రముం గూర్చి వింటివి. కాలపురుషునికి సర్వభూతేశ్వరుడు ప్రభువు. ఈ జగమెల్ల యెవ్వనిదో ఆ బ్రహ్మ కల్పమునకు దైవతము. మన్వంతరములకు మనువులు పదునల్గురు. వారు స్వాయంభువు మొదలయినవారు. వారు స్వాయంభువుడు, స్వారోచిషుడు, వైవస్వతుడు, సావర్ణి, బ్రహ్మపుత్రుడు, ధర్మపుత్రుడు, రుద్రపుత్రుడు, దక్షపుత్రుడు, రౌచ్యుడు, భౌత్యుడు, విశ్వాత్మ, అనవిని వజ్రుడు నీ చెప్పిన యీ మనువులు పదునాల్గురు బ్రహ్మదినము సంబెప్పుడును వీరే మనువులగుదురా ? లేక యిప్పుడున్న వారు మాత్రమే వీరా ? ఈ సందియము వారింపుమన మార్కండేయుడు వీరేప్రతికల్పమందు మనువులగుదురు. ఇచట విమర్శింపబనిలేదు. మూడు కల్పము లేక రూపములు. పరమేష్ఠిమాయచే కొంచెము కొంచెము మార్పునందుచుండును. అట్లే అబ్దములు (సంవత్సరములు) గూడనేక రూపములే అన వజ్రుండు ఆయా కల్పములందలి జనుల పోలికల విషయములో మాత్రము కల్పములట్లేక రూపములగుటకు వలను పడదు. అందులకు కారణమొకటి నే గమనించుచున్నాను. ఒకని మన్వంతర మందొక మనువు ప్రతి కల్పమునందు ముక్తిపొందును. అక్కడ కాలమునకాది లేనందున రాబోవు జగత్తు హ్రస్వమగును. అస నరుడింకొక జీవుని సంసర్గమున ముక్తినందగా, అచ్యుత శక్తియైన జీవుడు మరల క్రొత్త జీవులతో జగత్తును నింపుచునేయుండును. బ్రహ్మలోకగాములు బ్రహ్మతోపాటు ముక్తినందుదురు. మహాకల్పమందు మఱల వారివంటి వారు సృష్టికావింపబడుదురు. ఎవరు పరమపదము నందుదురో వారికి మాత్రము మఱి జన్మములేదు. ఆ విధముగా సర్వ కల్పము ౦ందు సమాన జీవప్రమాణములే కాని అందు హెచ్చుతగ్గులులేవు. విష్ణులోకము నందినవారు రుద్రలోకగతులు శ్వేతద్వీపమున కేగినవారు మాత్రము పునర్జన్మము నందరు. రౌద్ర వైష్ణవ లోకములు బ్రహ్మ లోకమునకు మీదనున్నవి. అందేగినవారు మరి పుట్టరు. మహా కల్పము చివర జీవులందరు నా పరమేశ్వరుని బొందికూడ జ్ఞానములేనిచో మరలివత్తురు. ప్రభువు వారిని తరువాత కల్పమునందు మరల బుట్టించును. కల్పము మధ్యమందు కల్పాంతమున జ్ఞానముచే నుపాధిని విడిచినవారు ఆ విష్ణువుయొక్క పరమ స్థానముం బడయుదురు. జీవ బీజము యొక్క సంసర్గముచే నీశ్వరుడొక నిర్వచింపరాని కారణమున జగత్తు నా జీవులచే బూరించును. అనవిని వజ్రుడు కల్పములొక దానినొకటి పోలినవే గదా : అట్టియెడ వానిలో జీవులకేర్పడు భేదమదియేమి ? అది యెందులకేర్పడును ? తెలుపుమన మార్కండేయుడు వినుమిది వివరించెద. గడచిన కల్పమందాఱవ మన్వంతరము గడచిన తర్వాత నేడవ మన్వంతరమున నిరుపది నాల్గవ త్రేతాయుగమందు రామునిచే రావణుడు, రాముని చేతనే కుంభకర్ణుడునూ హతుడయ్యెను. వర్తమాన కల్పము ననుసరించి వాల్మీకి రామాయణమును రచించెను. అతీత కల్పమందు జరిగిన కథ నేను కామ్యకవనమందు యుధిష్ఠిరునికి దెల్పితిని. కల్పములొకదానితో నొకదానికి పోలికయున్నను భేదమున్నదని నీకే జెప్పితిని. వాని వాని భేదములిక్కడనేకాదు మరి యెందైన నిట్లేయున్నవి. కార్తికేయకల్పము, లక్ష్మీకల్పము, రుద్రకల్పము, నాయా కల్పములందు నీ భేదము కానవచ్చును. ఇది నేను నీకెఱింగించితిని. యుగాదులందు భేదముపొందు నీజగత్తునందు గలుగు దైవతభేదమును గూడతెల్పెదనిది తెలిసికొనుము.

ఇది శ్రీ విష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమ ఖండమున కల్పసాదృశనమను నెనుబదియొకటవ యధ్యాయము.

# ఎనుబదిరెండవ అధ్యాయము - అబ్దఫలనిర్దేశము

మార్కండేయ ఉవాచ :-

భగవాన్ వాసుదేవశ్చ తథాసంకర్షణః ప్రభుః । ప్రద్యుమ్న శ్చానిరుద్ధశ్చ కృతాదీనాంచ దైవతాః ॥ 1
తథా ఖండయుగా నిహ ద్వాద శోక్తాని భూపతే! । షష్ఠా బ్దేచ వివ ర్తన్తే పంచాబ్దాని పృథక్ పృథక్ ॥ 2
తేషాం తవ ప్రవక్ష్యామి దైవతాం స్తు పృథక్ పృథక్ । విష్ణుర్బృహస్పతి శ్శక్రో వహ్ని స్త్వష్టా తధైవచ ॥ 3
అహి ర్బుధ్నశ్చ పితరో విశ్వేదేవా నిశాకరః । ఇంద్రాగ్నీచైవనా సత్యౌ భగశ్చైవ మహా బలః ॥ 4
ఇతి ద్వాదశ తేప్రోక్తాః మయా ఖండ యుగేశ్వరాః । అథ షష్ట్యబ్ద నామాని నిబోధ గదతో మమ ॥ 5
వర్తమానే తథా కల్పే షష్ఠే మన్వంతరే గతే । తస్యైవచ చతుర్వింశే రాజన్ త్రేతాయుగే తదా ॥ 6
యదా రామేణ సమరే సగణో రావణో హతః । లక్ష్మణేన తథా రాజన్! కుంభకర్ణో నిపాతితః ॥ 7
మాఘ శుక్లం సమారభ్య చంద్రార్కౌ వాసవర్షగౌ । జీవయుక్తౌ యదా స్యాతాంషష్ట్యబ్దాది స్తదా స్మృతః ॥ 8
ప్రభవో విభవ శ్శుక్లః ప్రమోదశ్చ ప్రజాపతిః । వైష్ణవే తు యుగే పంచప్రోక్తా స్సంవత్సరా శ్శుభాః ॥ 9
అంగిరాః శ్రీముఖోభావో యువాధాతా తధైవచ । అబ్దా జీవయుగే పంచ యేషామాద్యాశ్శుభాస్త్రయః ॥ 10
ఈశ్వరో బహుధాన్యశ్చ ప్రమాథీ విక్రమో వశః । శక్రాబ్దాః పంచనిర్దిష్టాః యేషామాద్యా వుభౌ శుభౌ ॥ 11
వహ్నిః స్వభాను స్తరణో వారిద శ్చ తథాఽవ్యయః ।
ఆగ్నేయాః పంచ నిర్దిష్టాః ద్వితీయం తేష్వశోభనమ్ ॥ 12
సర్వజిత్ సర్వధారీ చ విరోధీ వికృతిః ఖరః । త్వాష్ట్రే పంచయుగే తేషాం ద్వితీయం తు శుభప్రదమ్ ॥ 13
నందనో విజయ శ్చైవ జయః కామశ్చ దుర్ముఖః ।
అహిర్బుధ్న్యే యుగే పంచ యేషా మాద్యాః హితాస్త్రయః ॥ 14
హేమమాలీ (హేవలంబీ) విలంబీ చ వికారీ శర్వరీ ప్లవః ।
పైత్ర్యే పంచయుగే తేషాం పంచమశ్చ శుభప్రదః ॥ 15
శోకకృచ్ఛుభకృత్ క్రోధీ విశ్వావసు పరావసూ ।
వైశ్వే పంచ శుభాః వైషా మబ్దౌ రాజన్! ద్విపంచమౌ ॥ 16
ప్లవంగః కీలకః సౌమ్యస్సోమ్యో రోధకృదేవచ । సౌమ్యే పంచ శుభా వేషాం ప్రథమానంతరా వుభౌ ॥ 17
ధావనం మధనం వీరం రాక్షసం చాలనం తథా । ఇంద్రాగ్ని దేవతే పంచ సర్వ ఏవ శుభప్రదాః ॥ 18
పింగళః కాల యుక్తశ్చ సిద్ధార్థో రౌద్ర దుర్మతీ । ఆశ్వినేఽపి యుగే పంచ చతుర్థ స్తేషు శస్యతే ॥ 19
దుందుభ్యంగారకౌ రక్తః క్రోధ శ్చాపి క్షయ స్తథా । భాగ్యే పంచ శుభాస్సర్వే విశేషేణ తు పంచమః ॥ 20

మార్కండేయుడనియె. భగవంతుడగు వాసుదేవుడు సంకర్షణుడు ప్రద్యుమ్నుడు అనిరుద్ధుడు ననువారు కృత త్రేతా ద్వాపర కలియుగములకు దేవతలు. అట్లే పండ్రెండు ఖండయుగములు చెప్పబడినవి. అయిదు సంవత్సరములు ఒక ఖండయుగము మొత్తమరువది సంవత్సరములకు పండ్రెండు ఖండయుగములు. వానిదేవతలు వరుసగా విష్ణువు బృహస్పతి శక్రుడు (ఇంద్రుడు) వహ్ని త్వష్ట అహిర్బుధ్న్యుడు పితరులు విశ్వేదేవులు చంద్రుడు ఇంద్రాగ్నులు అశ్వనీదేవులు భగుడు ననువారు. ఇక నరువది సంవత్సరముల పేర్లు. ఇప్పుడు జరుగుచున్న కల్పమందు ఆఱవ మన్వంతరము గడువగా, నాకల్పమందే యిరువది నాల్గవ త్రేతా

యుగమునందు రామునిచే సగణముగ రావణుడు హతుడయ్యెను. లక్ష్మణునిచే కుంభకర్ణుడు నిహతుడయ్యెను. మాఘ శుక్లపక్షము మొదలుకొని చంద్రసూర్యులు వాసవదేవతాకమయిన(జ్యేష్ఠ)నక్షత్రమందుగురునితో గూడినతరినరుపది సంవత్సరముల లెక్క ఆరంభ మగును. అరువది సంవత్సరముల పేర్లు. ప్రభవ విభవ శుక్ల ప్రమోద ప్రజాపతియను నీయైదును శుభదములు. విష్ణుదేవతాకమయిన ఖండయుగమునందు సంవత్సరములు. అంగీరస శ్రీముఖ భావ యువధాతయను నైదును బృహస్పతి దేవతాక ఖండయుగమందలి సంవత్సరములు. ఇందుతొలి మూడును శుభప్రదములు. ఈశ్వరబహుధాన్యప్రమాథి విక్రమ వృష అనునవి శక్రదేవతాకఖండయుగ సంవత్సరములు. ఇందులో తొలిరెండును శుభదములు. వహ్ని (చిత్రభాను) స్వభాను తారణ పార్థివ అవ్యయములు అగ్నిదేవతా కఖండయుగసంవత్సరములు. వానిలోరెండవది శోభదముగాదు. సర్వజిత్తు సర్వధారి విరోధి వికృతి ఖరఅనునవి త్వష్టృదేవతాక ఖండయుగసంవత్సరములు, అందురెండవది శోభనము. నందన విజయ జయ మన్మథ (కామ) దుర్ముఖ అనునవి అహిర్బుధ్న్య దేవతాకములు। ఇందు తొలుత మూడును హితపరములు హేమమాలి విలంబి వికారి శార్వరి ప్లవయనునవి పితృదేవతాకములు. ఇందైదవది శుభదము. శోభవత్తు శుభకృత్తు క్రోధి విశ్వావసు పరావసులు వైశ్వదేవతాకములు ఇందురెండవది యైదవదియు శుభ ములు. ప్లవంగ కీలక సౌమ్య సోమ రోధకృత్తు సోమదేవతాకములు, ఇందుమొదటిది తరువాతిది శుభదములు. ధానవ మథన వీర రాక్షస ఆనలననునవి యింద్రాగ్నిదేవతాకములు. అన్నియు శుభప్రదములే. పింగల కాలయుక్త సిద్ధార్థ రౌద్ర దుర్మతి అశ్వినీ దేవ తాకఖండయుగమందలి యబ్దములు. అందు నాల్గవది శుభము. దుందుభి అంగారక రక్త క్రోధన క్షయ అనునవి భగదేవతాక ఖండ యుగమందు సంవత్సరములు. ఇవన్నియు శుభప్రదములే. అందులో నైదవది విశేష శుభదము.

అతః పరం చారవశా ద్దేవాచార్యస్య పార్థివ ! । ద్వాదశాబ్దాధిపాం స్తుభ్యం కథయామి ఫలాన్వితాన్ ॥ 21
ఆగ్నేయ కక్షగే జీవే వర్షం స్యా ద్వహ్ని దైవతమ్ । అహితం తద్వినిర్దిష్టంగో ద్విజాగ్న్యుజీవినామ్ ॥ 22
సౌమ్య రౌద్రో పగే జీవే సౌమ్యవర్ష ముదాహృతమ్ । ఈతయ స్సకలా యత్ర చానావృష్టి భయం తథా ॥ 23
ఆదిత్య పుష్యగే చాబ్దో విజ్ఞేయో గురు దైవతః । శుభంకరో హితో లోకే క్షేమారోగ్య సుభిక్షదః ॥ 24
సార్ప పైత్ర్యో పగే జీవే పైత్ర్యం వర్ష ముదాహృతం । హార్దం వృష్టి ప్రదం లోకే శివసౌభిక్ష్య కారకమ్ ॥ 25
ఫాల్గునిద్వయ హ స్తగే వర్షం భాగ్యముదాహృతం । చౌర ప్రాబల్యకం ఘోరం నారీ దౌర్బల్య కారకమ్ ॥ 26
చిత్రాస్వాతి గతే జీవే త్వాష్ట్రః సంవత్సర స్మృతః । శూక ధాన్య క్షయ కర శ్శిబి ధాన్య వివర్ధనః ॥ 27
ఇంద్రాగ్ని దైవతం జీవే విశాఖా మైత్రసం యుతే । యజ్ఞక్రియా ప్రవృత్తానాం హితం ముదత మానవమ్ ॥ 28
జ్యేష్ఠా మూల గతే జీవే శాక్త మబ్ద ముదాహృతమ్ । శూక ధాన్య క్షయ కరం భూతానాం భయ వర్ధనమ్ ॥ 29
ఆషాఢా ద్వయు గేజీవే వైశ్వదేవ ముదాహృతమ్ । నాఽశుభం నశుభం లోకే రాజ్ఞాం విగ్రహ కారకమ్ ॥ 30
విష్ణు వాసవ సంస్థేతు వైష్ణవం పరికీర్తితమ్ । క్షేమ సౌభిక్షదం లోకే పాషండి పరిపీడనమ్ ॥ 31
ప్రోష్ఠపదా ద్వయగతే జీవే వారుణ సంస్థితే । పూర్వ ధాన్యప్రదం త్వాజం పశ్చాద్ధాన్య వినాశనమ్ ॥ 32
పౌష్ణాశ్వి యామ్యగే జీవే వర్షం స్యా దశ్విదైవతం । సువృష్టి క్షేమదంలోకే సర్వాతంక వివర్జితమ్ ॥ 33

ఇటుపై గురుచారముంబట్టి ద్వాదశాబ్దాధిపతులను ఫలప్రదులను దెల్పెద. గురుడు ఆగ్నేయ కక్షయందున్నతరి వహ్ని దేవతాకమయిన సంవత్సరమని పిలువబడును. గోబ్రాహ్మణాగ్న్యుప జీవులకది యహితము. సౌమ్యరౌద్రరాసులందు గురుడున్నపుడు సౌమ్యవర్షమనబడును. అందీతిబాధలన్నియు గల్గును. అనావృష్టి భయమెక్కువ. ఆదిత్యపుష్యరాశులందు నక్షత్రములందు గురు డుండిన నకులవత్సర గురుదేవతాకము. క్షేమారోగ్య సుభిక్షముంనుగూర్చును. సార్పపైత్ర్యములందు గురుడున్న సంవత్సరము పైత్ర్యము. పితృదేవతాకము. హృదయానందకరము. సువృష్టిప్రదము మంగళప్రదము. సుభిక్షప్రదము. పూర్వోత్తరఫల్గుని హస్త యనువానియందు గురుడున్న వర్షము భాగ్యసంవత్సరము. అపుడు చోరబాధప్రబలముగానుండును. అతిఘోరము. స్త్రీలకు దౌర్బ ల్యము గూర్చును. చిత్రా స్వాతినక్షత్రములందు గురుడున్న నది త్వష్టృదేవతాకసంవత్సరము. తోవధాన్యక్షయమును శిబిధాన్య వృద్ధిని చేయును. గురుడు విశాఖామైత్ర సంయుతుడైన సంవత్సరమ ఇంద్రాగ్నిదేవతాకము-యాగకర్తలకు హితకరము. మానవులు సంతోషముతో నుందురు.

జ్యేష్ఠమూలనక్షత్రమందు బృహస్పతియున్నది శాక్తసంవత్సరమనంబడును. శాకధాన్యక్షయముసేయును. భూతభయంకరముగూడ. పూర్వాషాఢ ఉత్తరాషాఢయను వానియందు గురుడున్న వైశ్వదేవయనబడును. (విశ్వేదేవతాకమన్నమాట) అది యశుభము కాదు శుభమునుగాదు. రాజులు యుద్ధములు సేయుదురు. విష్ణు (శ్రవణ) వాసవ (ధనిష్ఠ) నక్షత్రములందు గురుడున్న నది వైష్ణవ సంవత్సరము. క్షేమము సుభిక్షము గూర్చును. పాషండజన పీడాకరము. ప్రోష్ఠపద-వారుణ నక్షత్రములందు గురుడున్న సంవత్సరము ఆజము (అజదేవతాకము) పూర్వ ధాన్యసమృద్ధిని ఉత్తర ధాన్యనాశనమునుజేయును. దేవగురుడు పౌష్ణ-అశ్వి యామ్య నక్షత్రములందున్న సంవత్సరముఅశ్విదైవత సంవత్సరము. విశ్వదైవతము. సువృష్టి క్షేమప్రదము. సర్వాతంక జర్జితము (విఘ్న రహితము).

చైత్రశుక్ల సమారంభే జగతాం జగదీశ్వర! । సర్వం చక్రే తదా రాజన్! తత స్తస్మిన్ సదాదినే ॥ 34

సంవత్సరేశః క్రియతే బ్రహ్మణా తు సదాగ్రహః ।
నాగోయజ్ఞశ్చ ధర్మజ్ఞ! గంధర్వ శ్చ తథైవచ ॥ 35

సప్త భిన్నేతు యశ్శేషః కలిపాత సమాగణే । ఆదిత్యాది స్సబోద్ధవ్యో గ్రహ స్సంవత్సరాధిపః ॥ 36

ఆదిత్యేన సహానన్తో నాగోభవతి భూమిప! । చిత్రాంగద స్తు గంధర్వో దీర్ఘభద్రో నిశాచరః ॥ 37

సౌమ్యేన వాసుకి ర్నాగః పూర్ణభద్రో నిశాచరః । చిత్రసేన శ్చ గంధర్వః సమాశ్చామీ ప్రకీర్తితాః ॥ 38

భౌమేన తక్షకో నాగో మణిభద్రో నిశాచరః । తదా చిత్రరథో నామ గంధర్వశ్చాభిషిచ్యతే ॥ 39

బుధేన నాగః కర్కోటో యక్షభద్రో నిశాచరః, తుంబురు ర్నామ గంధర్వః సమాప్స్వాస్వభిషిచ్యతే ॥ 40

జీవేన నాగః పద్మస్తు దీర్ఘబాహు ర్నిశాచరః । గంధర్వశ్చ మహాతేజా స్తథా శాలిశిరః ప్రభుః ॥ 41

మహాపద్మస్తు శుక్రేణ నాగోభవతి భూపతే । నారద శ్చైవ గంధర్వో మహాబాహు ర్నిశాచరః ॥ 42

సౌరేణ నాగః శంఖస్తు మహాకర్ణో నిశాచరః । ఊర్ణాయు శ్చైవ గంధర్వః సమాస్వాస్వభిషిచ్యతే ॥ 43

అతః పరం ప్రవక్ష్యామి సమారూపం మహీపతే! ।
గ్రహ స్వామి భవం తుభ్యం శేషా స్సర్వే తదాశ్రయాః ॥ 44

తీక్ష్ణార్క స్స్వల్ప మత్స్యశ్చ గత మేఘోఽతి భాస్కరః ।
బహునాగ వ్యాధి గణో భాస్కరాబ్దో రణాకులః ॥ 45

బహు వర్షోఽతి సస్యశ్చ గవాం క్షీరప్రదాయకః । చంద్రా బ్దః కామినా మిష్టః చిత్యంకిత మహీతలః ॥ 46

అగ్ని తస్కర రోగాఢ్యో నృప విగ్రహ దాయ కం ।
గత సస్యో బహు వ్యాలో భౌమాబ్దో బాలహా భృశమ్ ॥ 47

విప్ర క్షత్రియ సస్యానాం జనానాంచ కలాభృతాం । బుద్ధిప్రదోఽబ్దో బౌద్ధస్తు బహు సస్యాకరః క్షితౌ ॥ 48

బహుయజ్ఞోఽతి సస్యశ్చ గోగజాశ్వ హిత స్తథా । బహు వృష్టి ప్రద స్సౌమ్యో జీవాబ్దో ద్విజ పుష్టిదః 49

సస్యాఢ్యో ధర్మ బహులో గతాతంకో బహూదకః । కామినాం కామదః కామః సితాబ్దో నృప శర్మదః ॥ 50

దుర్భిక్షమరకాన్రోగాన్ కరోతి పవన స్తథా । శనైశ్చరాబ్ద శ్శోకాంశ్చ విగ్రహాణిచ భూభుజామ్ ॥ 51

క్రమేణ పరివర్తన్తే పంచ యాదవ! వత్సరాః । తేషా మధిపతీన్ వక్ష్యే నామాని చ ఫలాని చ ॥ 52

పంచ భక్తే తు యచ్ఛేషం త్రిషష్టే దబ్ద గణే గతే ।
సంవత్సరాద్య స్సంజ్ఞేయో నిత్యం సంవత్సరో బుధైః ॥ 53

ఆద్య స్సంవత్సరో నామ ద్వితీయః పరివత్సరః । ఇడాఖ్యశ్చ తృతీయోఽత్ర చతుర్థశ్చాను వత్సరః ।
ఇద్వత్సరాఖ్యః కథితః తథా చైవాఽత్ర పంచమః ॥ 54
సంవత్సరోఽగ్నిః పరివత్సరోఽర్కః ఇడాభిధానో భగవాన్ శశాంకః ।
బ్రహ్మా స్వయంభూ దనువత్సరోఽపి ఇద్వత్సరః శైలసుతా పతిశ్చ ॥ 55
వృష్టి స్సమాఖ్యే కథితా ద్వితీయే ప్రభూతతోయా కథితా తృతీయే ।
పశ్చాజ్జలం ముంచతి యశ్చతుర్థః స్వల్పోదకం పంచమమబ్ద ముక్తమ్ ॥ 56

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
అబ్దఫల నిర్దేశోనామ ద్వ్యశీతి తమోఽధ్యాయః

చైత్ర శుక్ల పాడ్యమినుండి బ్రహ్మ సృష్టి ప్రారంభమంతయుంజేసెను. ఆయన యొక్కొక్క గ్రహమును సంవత్సరాధి పతిగా గావించును. ఆ గ్రహముతోపాటు నాగుడు యజ్ఞుడు గంధర్వుడు నను వారు తోడుగ నుందురు. మొత్తము అరువది సంవత్సరములను నేడింట విభజింపగా వచ్చు శేషము ననుసరించి వరుసగా యాదిత్యాదు లధిపతులుగా నుందురు.

ఆదిత్యునితో అనంతుడను నాగుడు చిత్రాంగదుడను గంధర్వుడు దీర్ఘభద్రుడను నిశాచరుడు నుందురు. సోమునితో చంద్రునితో (సౌమ్యునితో) వాసుకి (నాగుడు) పూర్ణ భద్రుడు (రాక్షసుడు) చిత్రసేనుడు (గంధర్వుడు) నుందురు. కుజునితో తక్షకుడు (నాగుడు) మణిభద్రుడు (రాక్షసుడు) చిత్రరథుడు (గంధర్వుడు) నుందురు. బుధునితో కర్కోటుడు యక్షభద్రుడు తుంబురుడు నుందురు. జీవునితో (గురునితో) పద్ముడు దీర్ఘబాహువు శాలిశిరుడు నుందురు. శుక్రునితో మహాపద్ముడనునాగుడు మహాబాహు పనునిశాచరుడు నారదడు గంధర్వుడు నుందురు. శనితో (సౌరునితో) శంఖుడనునాగుడు మహాకర్ణుడనునిశాచరుడు, ఆనుగంధర్వుడు ఊర్ణాయువు సంవత్సరాధిపుడుగ అభిషేకింపబడును-

ఈపైని సంవత్సరస్వరూపముంజెప్పెద. అది గ్రహస్వామి వలన నేర్పడును. మిగతా నాగుడు మొదలయిన వారు ఆ సంవత్సరాధిపతి నాశ్రయించుకొని యుండువారే -

భాస్కరాబ్దము వర్షసస్య తీక్ష్ణసూర్యకము స్వల్పమత్స్యము. మేఘశూన్యము ప్రకాశమానము నాగ (సర్ప) బహుళము వ్యాధి ప్రచురము రణాకులము. చంద్రాబ్దమువర్షసస్యగోక్షీరసమృద్ధము, కాముకులకుప్రీతికరముభూమియెల్లచితులతోనిండియుండును. భౌమాబ్దము అగ్నితస్కరరోగాకులము రాజయుద్ధ సమ్మర్దము. సస్యశూన్యము క్రూరమృగప్రచారము బాలఘాతుకము. బుధాబ్దము విప్రక్షత్రియ సస్యసంపదలకు కళలకు బుద్ధికి సస్యములకు వృద్ధిప్రదము. జీవాబ్దము (బృహస్పతి సంవత్సరము) యజ్ఞబహుళము సస్యసమృద్ధము గోగజాశ్వములకు హితకరము బహువృష్టి ప్రదము. ద్విజులకు పుష్టిప్రదము. శుక్రాబ్దము సస్యసమృద్ధము ధర్మబహుళము నిరాంతకము (బాధ లేమియు లేకుండుట) ఉదకసమృద్ధము. కాముకులకు కామవర్ధనము. రాజులకు సుఖప్రదము. శనైశ్చరాబ్దము దుర్భిక్ష మారక రోగకారకము. శోకకారణము. రాజ కలహ సంకులము. ఈవిధముగా నైదేసి సంవత్సరములు పరివర్తనము పొందుచుండును. వాని అధిపతులను పేరులను, ఫలములను చెప్పెద. . సంవత్సరము పరివత్సరము ఇడావత్సరము అనువత్సరమునకు ఇద్వత్సరము నునవి. సంవత్సరమునకు అగ్ని పరివత్సరమునకు అర్కుడు (సూర్యుడు) ఇడావత్సరమునకు చంద్రభగవానుడు అనువత్సరము స్వయంభువైన బ్రహ్మ ఇద్వత్సరమునకు పార్వతీపతియునధిపతులు వర్షము జల సమృద్ధి. పూర్వభాగ జలసమృద్ధి. ఉత్తర భాగ జల సమవృద్ధి. స్వల్పోదకము ఇది క్రమముగా సంవత్సరాదు లైదింట గానవచ్చు ఫలితములు.

ఇది శ్రీ విష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమ ఖండమున
అబ్ద ఫల నిర్దేశమను ఎనుబది రెండవ యధ్యాయము.

# ఎనుబదిమూడవ అధ్యాయము-కాలావయవదేవతామాహాత్మ్యము

మార్కండేయ ఉవాచ :-

ఉత్తరం త్వయనం దివ్యం, పైత్ర్యంస్యా ద్దక్షిణాయనమ్ ।
వసన్తశ్చాగ్ని దైవత్యః శాక్రో గ్రీష్మ ఉదాహృతః ॥ 1
వైశ్వదేవీ తథాప్రావృట్ ప్రాజాపత్యా శరత్ స్మృతా ।
హేమంతో వైష్ణవః ప్రోక్తో మారుత శ్శిశిరః స్మృతః । 2
త్వాష్ట్రి శ్చైత్రస్తు వైశాఖోమాస శ్చైవాగ్ని దైవతః ।
జ్యేష్ఠ శ్శాక్ర స్స్మృతో మాస ఆషాఢో వైశ్వదైవతః ॥ 3
శ్రావణో విశ్వదైవత్యః అజో భాద్రపద స్తథా ।
అశ్వయుక్తాఽఽఽశ్వినో నామ ఆగ్నేయః కార్తికస్మృతః ॥ 4
మార్గశీర్ష స్తథా సౌమ్యః పౌష స్స్యాజ్జీవదైవతః ।
పైత్ర్యోమాస స్స్మృతో మాఘః ఫాల్గునో భగదైవతః ॥ 5
మాసేషు మాసదైవత్యాః శుక్లపక్షః ప్రకీర్తితాః । వక్ష్యామి కృష్ణపక్షాణాం దైవతాని తవానఘ! ॥ 6
చైత్రో యామ్య స్స్మృతో రాజన్! ఆగ్నేయ శ్చాప్యనన్తరః ।
జ్యేష్ఠో రౌద్రస్స్మృతః పక్షః త్వాషాఢ స్సార్ప ఉచ్యతే ॥ 7
పైత్రశ్చ శ్రావణోమాసః సావిత్ర శ్చాప్యనన్తరః ।
మైత్రశ్చాశ్వయుజో మాసః శాక్ర శ్చాప్యగ్ని దైవతః ॥ 8
తథాచ నైరృత స్సౌమ్యః పౌషస్స్యా ద్విష్ణుదైవతః ।
వారుణశ్చ తథా పైత్రః ఫాల్గునః పౌష్ణ ఉచ్యతే ॥ 9
అతః పరం ప్రవక్ష్యామి యద్దేవో యద్గ్రహ స్స్మృతః । అగ్ని రర్కస్స్మృతస్సోమో వరుణః పరికీర్తితః ॥
అంగారకః కుమారశ్చ బుధ శ్చ భగవాన్ హరిః । బృహతిస్స్మృత శ్శక్ర శ్శుక్రో దేవీ చ పార్వతీ ॥ 11
ప్రజాపతి శ్శనైశ్చరో రాహు ర్జ్ఞేయో గణాధిపః । విశ్వకర్మా స్మృతఃకేతు ర్యేగ్రహా స్తే పురః స్మృతాః॥ 12

మార్కండేయ ఉవాచ :

అతః పరం ప్రవక్ష్యామి తవ నక్షత్ర దేవతాః । కృత్తికా చాగ్ని దైవత్యారోహిణ్యర్కేశ్వరా స్స్మృతా ॥ 13
ఇంద్రర్క్షః సౌమ్యదైవత్యో రౌద్రీ ఆర్ద్రా తథా స్మృతా । పునర్వసు స్తథా దిత్యో పుష్యశ్చ గురుదైవతః ॥ 14
అశ్లేషా సర్పదైవత్యా మఘాచ పితృదైవతా । భాగ్యాశ్చపూర్వ ఫాల్గున్యః ఆర్యమాశ్చ తథోత్తరాః ॥ 15
సావిత్ర శ్చతథా హస్త శ్చిత్రా త్వాష్ట్రీ ప్రకీర్తితా । స్వాతి శ్చ వాయుదైవత్యా నక్షత్రే పరికీర్తితా ॥ 16
ఇంద్రాగ్ని దైవతా ప్రోక్తా విశాఖా యదునందన! । మైత్ర మృక్ష మనూరాధా శాక్రం జ్యేష్ఠా ప్రకీర్తితా ॥ 17
తథా నైరృత్య దైవత్యో మూలశ్చ తదుదాహృతమ్ ।
ఆప్యస్త్వాషాఢ పూర్వాస్స్యు శ్చోత్తరా వైశ్వదైవతాః ॥ 18

బ్రాహ్మం చైవాభిజిత్ ప్రోక్తాశ్రవణో వైష్ణవస్స్మృతః। వాసవం చ తదా ఋక్షల ధనిష్ఠా ప్రోచ్యతే బుధైః ॥ 19

తథా శతభిషక్ప్రోక్తం నక్షత్రే వారుణం నృప। ఆజం భద్రాపదాపూర్వా ఆహిర్బుధ్న్యం తథోత్తరా ॥ 20

పౌష్ణం చ రేవతీ చార్ష మశ్వినీ చాశ్విదైవతమ్। భరణ్య శ్చ తథా యామ్యం ప్రోక్తాస్తే ఋక్ష దేవతాః ॥ 21

బ్రహ్మా ప్రజాపతి ర్విష్ణుః యమస్సోమ స్తథైవచ। కుమారో మునయ స్సప్త హ్యష్టౌ చ మనవ స్తథా ॥ 22

పిశాచశ్చతథా ధర్మో రుద్రాశ్చైకాదశ స్మృతాః। ఆదిత్యా ద్వాదశ తథా కామదేవ స్తథైవచ ॥ 23

యక్షార్యపితరశ్చైవ ప్రతిపత్ పభృతిః నృప!। తిథీశ్వరాః తథాప్రోక్తాః వరణా న్నామతః శృణు! ॥ 24

తిధ్యర్ధ భోగి కరణం సదా వతి చపార్థివ! స్థిరాణి తేషాం చత్వారి సప్త విద్ధి చరాణి చ ॥ 25

ఉత్తరాయణము దివ్యము (దేవతలకు సంబంధించినది) దక్షిణాయనము పైత్ర్యము (పితృదేవతలకు సంబంధించినది) ఇందు ఋతువులుపసంతము అగ్ని దైవత్యము గ్రీష్మము శాక్ర(ఇంద్ర)దైవత్యము వర్షఋతువు వైశ్వదైవత్యము(విశ్వేదేవదైవత్యము) శరదృతువు ప్రాజాపత్యము (ప్రజాపతి దైవత్యము, హేమంతము విష్ణు దైవత్యము. శిశిరరుతువు వాయు దైవత్యము. చైత్రమాసమునకు దైవతము త్వష్ట. వైశాఖమునకు అగ్ని జ్యేష్ఠమునకు ఇంద్రుడు ఆషాఢమునకు వైశ్వదేవులు శ్రావణము నకు విశ్వేదేవతలు భాద్రపదమునకు అజుడు ఆశ్వయుజమునకు అశ్వనీ దేవతలు కార్తీకమునకు ఆగ్నేయుడు (కుమారస్వామి) మార్గశిరమునకు సోముడు పుష్యమాసమునకు గురువు మాఘ మాసమునకు పితృ దేవతలు ఫాల్గున మునకు భగుడు ననువారు దేవతలు. ఈ చెప్పిన మాసములందే చెప్పినవారు శుక్లపక్షాధి దేవతలు. ఇక చైత్రమాస కృష్ణ పక్ష దేవత యముడు. వైశాఖమునందగ్ని. జ్యేష్ఠమున రుద్రుడు ఆషాఢమున నాగుడు శ్రావణమున పితృదేవతలు భాద్రపదమున సవిత ఆశ్వయుజమున మిత్రుడు కార్తీకమునందగ్ని మార్గశిరమున నిరృతి పుష్యమున విష్ణువు మాఘమున పితరులు ఫాల్గునమున పూష. ఇక నేగ్రహ మేదేవతాకమో తెల్పెద. సూర్యునకుఅగ్ని, చంద్రునకు వరుణుడు, కుజునకు కుమారస్వామి బుధునకు హరి, గురునకు శక్రుడు, శుక్రునకు పార్వతీదేవి, శని ప్రజాపతి, రాహువునకు గణాధిపతి, కేతువువిశ్వకర్మ.

ఇక నక్షత్రదేవతలందెల్పెద. కృత్తిక అగ్ని దైవత్యమురోహిణి అర్కేశ్వర (సూర్యదైవత్యమన్నమాట) మృగశిర సోమ దైవత్యము ఆర్ద్రరుద్రదేవతాకముపునర్వసు ఆదిత్యదైవత్యముపుష్యమి గురుదైవత్యముము ఆశ్లేషసర్పదైవత్యము మఘ పితృదైవత్యము పూర్వఫల్గుని (పుబ్బ) భగదేవతాక. ఉత్తరఫల్గుని అర్యమ దేవతాకము. హస్త సవితృ దేవతాకము చిత్ర త్వాష్ట్రి (త్వష్టృదేవతాక) స్వాతి వాయుదైవత్యము విశాఖ ఇంద్రాగ్నిదైవత్యము అనూరాధ మిత్రదైవత్యము జ్యేష్ఠ శక్రదైవత్యము మూల నిరృతి దేవతాకముపూర్వాషాఢ అబ్దేవతాకము ఉత్తరాషాఢ విశ్వేదేవదైవత్యము అభిజిన్నక్షత్రము బ్రహ్మదేవతాకము. శ్రవణము వైష్ణవము ధనిష్ఠ ఇంద్ర దైవత్యము శతభిషము వరుణదేవతాకము. పూర్వాభాద్ర అజదేవతాకము ఉత్తరాభాద్ర అహిర్బుధ్న్య దేవతాకము. రేవతి పూషదైవత్యము అశ్విని అశ్వినీదేవతాదైవత్యము భరణి యమదేవతాకము. తిధులకు వరుసగా బ్రహ్మ ప్రజాపతి విష్ణువు యముడు సోముడు కుమారుడు సప్తర్షులు (కశ్యప-అత్రి-భరద్వాజ-విశ్వామిత్ర-గౌతమ-జమదగ్ని-వశిష్ఠ) అష్టమనువులు, పిశాచధర్ముడు, ఏకాదశరుద్రులు ద్వాదశాదిత్యులు, కామదేవుడు, యక్షులు, పితరులు పాడ్యమి మొదలుకొని తిథులకు అధిపతులు. ఇక కరణముల పేరు వినుము. తిథిలో సగముభాగము కరణము.

అంతే కృష్ణ చతుర్దశ్యాం ద్వితీయే శకుని స్స్మృతః। ప్రథమే పంచ దశ్యర్థే కృష్ణే ప్రోక్తం చతుష్పదమ్॥ 26
తస్యైవ చాపరే రాజన్। నాగాఖ్యం కరణం మతమ్। శుక్ల ప్రతిపదార్ధేతు కింస్తుఘ్నం కరణం మతమ్॥ 27
ఏతాని రాజన్! ప్రోక్తాని స్థిరాణి కరణాని తు। కలిర్ధర్మ స్తథా సర్పో యేషాం వాయుశ్చ దైవతమ్॥ 28
శుక్ల ప్రతిపదార్థేతు ద్వితీయే యదునందన! ॥ 29
పంచమ్యాంచ తథా హ్యర్ధే త్వష్టమ్యాంచ తథా పరే। ద్వాదశ్యర్థేతథా పూర్వే పౌర్ణమాస్యాం మథా పరే॥ 30
కృష్ణ పక్ష చతుర్థ్యాం తు ప్రథమేఽర్థే తథైవ చ। సప్తమ్యాం చాపరే త్వర్థే హ్యేకాదశ్యాం తథా ద్యకే॥ 31
కరణంతు బవం నామ కథితం శక్ర దైవతమ్। ద్వితీయార్థే తథాఽఽద్యేతు పంచ మ్యర్థే తథా పరే॥ 32
నవమ్యర్థే తథా పూర్వే ద్వాదశ్యర్థే తథా పరే। కృష్ణ ప్రతిపదా ద్యర్థే చతుర్థ్యర్థే తథా పరే॥ 33
అష్టమ్యర్థే తథాపూర్వే హ్యేవాదశ్యాం తథా పరే। బాలవం నామ కరణం కథితం బ్రహ్మదైవతమ్॥ 34
శుక్లపక్షే ద్వితీయార్థే షష్ఠ్యర్థే ప్రథమే తథా। నవమ్యర్ధే తథైవాన్తే త్రయోదశ్యాం తథాఽఽద్యవే॥ 35
కృష్ణ ప్రతిపదార్ధేతు పంచమ్యాం ప్రథమే తథా। ద్వితీయార్ధే తథాష్టమ్యాం ద్వాదశ్యాం ప్రథమే తథా॥ 36
కౌలవం నామ! కరణం కథితం మిత్ర దైవతం। ఆద్యే శుక్ల తృతీయార్ధే షష్ఠ్యర్ధేచ తథా పరే॥ 37
కృష్ణద్వితీయా ప్రథమే పంచమ్యర్ధే తథా పరే। నవమ్యర్ధే తథా పూర్వే ద్వాదశ్యర్ధే తథాపరే॥ 38
తైతిలం నామ కరణమార్యమ్ణం కథితం బుధైః। అంతే శుక్ల తృతీయార్ధే సప్తమ్యాం ప్రథమే తథా॥ 39
దశమ్యర్ధే తథైవాన్తే చతుర్దశ్యాం తథాద్యకే। కృష్ణపక్ష ద్వితీయాన్తే షష్ఠ్యర్ధే ప్రథమే తథా॥ 40
నవమ్యాంచ తథైవాన్తే త్రయోదశ్యాం తథాద్యవే। గరాభిధానం కరణం పృథివీదైవతమ్ స్మృతం॥ 41
శుక్లపక్ష చతుర్థ్యర్ధే సప్తమ్యాం చ తథా పరే। ఏకాదశ్యాం తథా పూర్వే చతుర్దశ్యాం తథా పరే॥ 42
కృష్ణ తృతీయా ప్రథమే షష్ఠ్యర్ధే చ తథా పరే। దశ మ్యర్ధే తథా పూర్వే త్రయోదశ్యాం తథా పరే॥ 43
వణిజం నామకరణం శ్రీదేవ మభి ధీయతే। శుక్లపక్షే చతుర్థ్యం న్తేహ్యష్టమ్యాం ప్రథమే తథా॥ 44
ఏకాదస్య పరే చార్ధే పౌర్ణమాస్యాం తథాద్యకే। అంతే కృష్ణతృతీయార్ధే సప్తమ్యాం ప్రథమే తథా॥ 45
ద్వితీయే చ దశమ్యర్ధే చతుర్దశ్యాం తథాద్యవే। విష్టిరిత్యేవ కరణం కథితం మృత్యు దైవతమ్॥ 46

సర్వ కర్మసు రాజేంద్ర! సర్వదా గర్హితం చ తత్।
చతుర్వింశత్యహో రాత్రే రాజన్! హోరాః ప్రకీర్తితాః॥ 47

గ్రహేశదేవ గంధర్వ నాగ యక్షే శ్వర ప్రభాః। సూర్యోదయా దథాఽఽరభ్య దినపాద్యాః క్రమేణతాః॥ 48
షష్ఠక్రమేణ చ తథా క్రమం తాసాం నిబోధ! మే। అర్కశు శుక్రక్ష రాత్రిశ సౌరజీవ కుజేశ్వరాః॥ 49
సర్వాసాం చ తథా కాలం రాహుర్భుంక్తే మహా గ్రహః। కులికశ్చ తథానాగో యక్షః పద్మోఽతి విశ్రుతః॥ 50
అంగార స్వర్ణశ్చ తథా గంధర్వ శ్చాభి ధీయతే। కులికస్య తు యా వేలా సావర్జ్యా సర్వ కర్మసు॥ 51
తస్యాం భుక్తేమహావ్యాధిః విషం భుక్తం న జీర్యతే।ప్రత్యక్షమపి తార్క్ష్యస్య తస్యాం దష్టోన జీవతి॥ 52
భుక్తం తస్యాం తు భైషజ్యం న తు కార్యకరం భవేత్। సాతు కాలవిదా జ్ఞేయా మంత్రిణా భిషజా తథా॥ 53
అవిజ్ఞాయ తు తాం వేలాం క్రియన్తే రాజపుంగవ!। వైఫల్య కరణా న్మూఢాఃప్రాప్నువ న్త్యయశో మహత్॥ 54
ప్రత్యేకస్యైవ వేలాయాం రాహో ర్భోగం నిబోధ మే। ఏకైకా తు భవే ద్హోరా సార్ధం విఘటికా శతమ్॥ 55
వినాడికా స్సప్తషష్ట్యా రవేష్షోడిశ కీర్తితాః। హోరాకులిక కాలస్తు శేషఃకాలో రవే స్స్మృతః॥ 56
స్వహోరాన్తే తథావేలా శ్చతస్రస్తు వినాడికాః। రాహో శ్చక్రస్య కథితాః శేషః కాల స్సి స్యచ 57

సౌమ్యహోరా సమారంభే చషకౌద్వౌ ప్రకీర్తితౌ । హోరాకుళిత వేలాతు శేషః కాలో బుధస్య చ ॥ 58
ఏక సప్తతి ముల్లంఘ్య హోరాయాం తు నిశాధృతః । అష్టౌతు కులిక స్యోక్తాః శేషఃకాలో నిశా ధృతః ॥ 59
షడశీతి మతిక్రమ్య చషకా న్రవిజస్య తు । యచ్ఛేష స్త ద్వినిర్దిష్టః కాలస్తు కులికస్య చ ॥ 60
సప్త సప్త త్యతిక్రమ్య సార్ధాంస్తు చషకాన్ గురౌ । రాహోస్తు చషకోహోరా శేషకాలో గురో ర్మతః ॥ 61
భౌమ హోరా సమారంభే ద్వాత్రింశత్తు వినాడికాః । వేలాతు కులికస్యోక్తా శేషః కాలః కుజస్య తు ॥ 62
జీవ జ్ఞ శుక్ర హోరాసు సర్మ కర్మాణి కారయేత్ । క్రూరాసుచ తథాఽన్మాసు న కించి త్కులికస్య చ ॥ 63
అతః పరం ముహూర్తానాం దైవతాని నిబోధమే । సర్వర్క్షాణి వివర్తన్తే హ్యహోరాత్రేణపార్థివ! 64
సతతం తే వినిర్దిష్టాః ముహూర్తా స్త్రింశ దేవతు ।

వజ్ర ఉవాచ :

అష్టావింశతి రుక్తాని త్వయాతాని మమాఽనఘ! 65
త్రింశ న్ముహూర్తాశ్చ కథం త ఏవ ద్విజసత్తమ!

ఇక కరణముల విషయమున బవబాలక కౌలవతైతుల, గరజ, వణిజి, భద్ర, శకునిచతుష్పాత్ నాగవము కింస్తుఘ్నము అనుపదునొకండు కరణములలో నాలుగు స్థిరకరణములు, మిగిలినయేడును చరకరణములు. కరణమొక్కొకడు తిథిలో సగము వ్యాపించును. తిథిని పూర్వార్థము ఉత్తరార్థము అని రెండు భాగములు చేయగా కృష్ణచతుర్దశియొక్క రెండవ అర్థమున శకుని, పంచదశి అనగా అమావాస్య పూర్వార్ధమున నాగవము, అమావాస్య ఉత్తరార్థమున చతుష్పాత్, శుక్లపాడ్యమియొక్క పూర్వార్థమున కింస్తుఘ్నము నుండును. ఓరాజా! ఇవి స్థిరకరణములవ్యాప్తి ప్రకారము. ఈ నాల్గింటివి వరుసగా కవి, ధర్ముడు, సర్పములు, వాయువు. ఆదిదేవతలు శుక్లపక్ష ప్రతిపత్తు పంచమి, అష్టమి యీతిథుల ఉత్తరార్థమునందును, ద్వాదశిపూర్వార్థమునందును, పూర్ణిమ ఉత్తరార్థమునందును, కృష్ణపక్ష చతుర్థి పూర్వార్థమునందును, సప్తమి ఉత్తరార్థమునందును, ఏకాదశి పూర్వార్థమునందును. బవ అను కరణముండును. ఈ కరణమునకు ఇంద్రుడధిదేవత. విదియయొక్క పూర్వార్ధమునందును, పంచమి ఉత్తరార్థమునందును నవమి పూర్వార్ధమునందును ద్వాదశిఉత్తరార్ధమునందును కృష్ణప్రతిపత్తు పూర్వార్థమునందును చతుర్థి ఉత్తరార్ధమునందును. అష్టమి పూర్వార్ధమునందును ఏకాదశిఉత్తరార్థమునందును బాలవ అను కరణముండును. ఈ కరణమునకు బ్రహ్మ అధిదేవత. శుక్లపక్షమున విదియ షష్ఠుల పూర్వార్థము నందును నవమి ఉత్తరార్ధము నందును త్రయోదశి పూర్వార్ధము నందును కృష్ణపక్షమున పాడ్యమీ పంచముల పూర్వార్ధము నందును అష్టమీ ఉత్తరార్ధము నందును ద్వాదశి పూర్వార్థము నందును కౌలవ కరణముండును. దీనికి మిత్రుడు అధిదేవత. శుక్లపక్షమున తదియ పూర్వార్థమున షష్ఠి ఉత్తరార్ధమున కృష్ణ పక్షమున విదియ పూర్వార్ధమున పంచమీ ఉత్తరార్ధమున నవమి పూర్వార్థమున ద్వాదశి ఉత్తరార్ధమున తైతుల కరణ ముండును. దీనికి అర్యము డధిదేవత. శుక్లపక్షమున తదియ ఉత్తరార్ధమున సప్తమి పూర్వార్ధమున దశమి ఉత్తరార్ధమున, చతుర్దశి పూర్వార్ధమున, కృష్ణపక్షమున విదియ ఉత్తరార్ధమున షష్టి పూర్వార్ధమున నవమి ఉత్తరార్ధమున, త్రయోదశి పూర్వార్ధమున గరము (శరజి) అనుకరణముండును. దీనికి పృథివి అధిదేవత. శుక్లపక్షమున చతుర్థీ సప్తముల ఉత్తరార్ధమున, ఏకాదశి పూర్వార్ధమున, చతుర్దశి ఉత్తరార్ధమున, కృష్ణపక్షమున తదియ పూర్వార్ధమున షష్ఠి ఉత్తరార్ధమున దశమి పూర్వార్ధమున త్రయోదశి ఉత్తరార్ధమున వణిజ కరణముండును. దీని కధిదేవత శ్రీదేవి. శుక్లపక్షమున చతుర్థి ఉత్తరార్థమున అష్టమి పూర్వార్థమున ఏకాదశి ఉత్తరార్ధమున పూర్ణిమ పూర్వార్థమున కృష్ణపక్షమున తదియ ఉత్తరార్ధమున సప్తమి పూర్వార్ధమున దశమి ఉత్తరార్థమున చతుర్దశి పూర్వార్థమున విష్టికరణము. దీనికి మృత్యువు అధిదేవత. ఈ కరణము అన్ని కర్మలయందును నింద్యమైనది. (ఇచట చెప్పిన తిథులలోనే మరల మరల వేరు వేరు కరణములువచ్చునట్లు చెప్పబడినవి. ఇది సిద్ధాంత గణితము ప్రకారము సరియైన యంశమే)

ఇక హోరల విషయము — ఒక్కొక్క అహోరాత్రమందు ఇరువదినాలుగు హోరలుండును. (హోర = hour) అనగా ఒక్కొక్క హోర పరిమాణము రెండున్నర గడియలు. సూర్యోదయారంభము మొదలుకొని మొదటి ఆరు హోరలకును సూర్యుడు దేవతలు, గంధర్వులు, నాగులు, కుబేరుడు, ప్రథ అనువారు ప్రతి ఆరేసి హోరలకును వరుసగా అధిదేవతలు. ఏనాడు ఏ హోరను గణనచేయవలెనో ఆ హోరను నిర్ణయించు క్రమము చెప్పబడుచున్నది :—

మనము ఏ వారమందు ఏ హోరను చూడవలెనో ఆవారపు అధిపతి ఆనాటి మొదటి హోరకు అధిపతి యగును. ఆ క్రమమున ఆదివారమున మొదటి హోరకు సూర్యుడు అధిపతి. ఇట్లు సూర్య శుక్ర బుధ చంద్ర శని బృహస్పతి కుజులు ఒకేనాడు ఎన్నోమారులు హోరాధిపతులుగ ఆవృత్తిపొందుచుందురు. అన్ని హోరల కాలవిశేషమును రాహువు, కులికుడు, నాగుడు యక్షులు పద్ముడు, అంగారపర్ణుడు గంధర్వుడు ననువారు తమ తమ భుక్తులుగ ననుభవింతురు. వీరిలో కులికుని సమయము అన్ని కర్మల యందును వర్జ్యము. కులికుని వేళయందు తినిన ఆహారము వ్యాధినికల్పించును. విషమును ఆసమయమున తినినచో జీర్ణముకాదు. ఆ సమయమున నెవ్వరినైన పాముకరచినయెడల వాని యెదుట గరుత్మంతుడే వచ్చినను ఉపయోగకారికాడు. ఆసమయములో తినిన ఔషధము ఫలితమునీయదు. కనుక దైవజ్ఞులు, మాంత్రికులు, వైద్యులునుకులికవేళను బాగుగ గుర్తించియుండవలెను. ఏలయన ఈ కాలువ్వరును దీనిని తెలియకపోవుటచే తాము చేసిన పనులు విఫలములై మూఢులని యనిపించుకొని యెంతయో అపకీర్తికి గురి యగుదురు. ప్రతియొక్క వేళయందును రాహువు మున్నగువారి భుక్తికాలముల నెరింగెదవ. ఆలకింపుము.

ప్రతియొక గ్రహముయొక్క హోరయందును రాహుభుక్తికాలము కొంతగలదు. అదియెట్లనగా—ఒక్కొక్క హోర నూట ఏభది విఘడియల పరిమాణముగలది. అందుమొదటినుండి నూరు విగడియల మీద అర్ధ విఘటక వరకు రాహుభుక్తికాలము.

ఇక ప్రత్యేక గ్రహముల హోరల విషయమున ఆ గ్రహముయొక్క భుక్త్యంశమును కుళికాంశమును వేరుపరచి తెలుసు కొనువిధానము—రవి హోరయందు మొదటి ఆరువదిఏడు విగడియలు రవి భుక్తి కాలము. మిగిలిన యెనుబదిమూడు విగడియలు దానిలోని కుళిక కాలము. శుక్ర హోరయందు చివరి నాలుగు విగడియలు శుక్రుని భుక్తికాలము. మిగిలిన కాలము నూట నలుబది విగడియలు కుళికకాలము. బుధ హోరయొకట ఆరంభమునందలి రెండు విగడియల(చషక) కాలము కుళికభుక్తికాలము. మిగిలిన నూటనలుబది యెనిమిది విగడియలు బుధ భుక్తికాలము. చంద్రహోరయందు మొదటి విగడియ నుండి డెబ్బదియొక్క విగడియలు గతించిన పిదప వచ్చు నెనిమిది విగడియలు మాత్రము కుళికి భుక్తి. దానికి నిటునటు గల మొత్తము నూటనలుబదిరెండు విగడియ లును చంద్రభుక్తికాలము. శని హోరయందు-మొదటి విగడియ నుండి యెనుబది యారు విగడియలు గతించిన పిదప వచ్చు అరు వదినాలుగు విగడియలును కుళికభుక్తి. అనగా నీమొదట యెనుబదియారు విగడియలకాలము కుజభుక్తి కాలము. గురుహోరయందు డెబ్బదియేడన్నర విగడియలవరకు గురుభుక్తికాలము తరువాతవచ్చు డెబ్బదిరెండున్నర విగడియలకాలమునుభకభుక్తి. కుజహోర యందు మొదట ముప్పదిరెండు విగడియలు కుళికభుక్తి. మిగిలిన నూటపదునెనిమిది విగడియలు కుజభుక్తి, గురు, బుధ శుక్రుల హోరలయందు సర్వశుభకర్మలను చేయసగును. ఇతరములగు హోరలు క్రూర హోరలు అట్టి క్రూరలయందుగాని, ప్రతిహోర యందును కుళిక భుక్తికాలములోగాని యే కార్యములను చేయరాదు.

మార్కండేయ ఉవాచ :

దిన రాత్ర్యోస్సమారంభే హ్యర్ధం భవతి పార్థివ ! 66
తయోర్మధ్యే చ సతత మభిజి చ్చాభిధీయతే ! తయోర్ద్విత్వా నస్మయా త్రింశ న్ముహూర్తా విహితా స్తవ ॥ 67
నక్షత్రైర్దైవతై స్తేషాం దేవతాః పరికీర్తితాః । కేవలం క్రమహానిశ్చ క్రమ స్తేషాం నిబోధ మే ॥ 68
రౌద్రస్సార్ప స్తథామైత్రః పైత్రో వాసవ ఏవచ । ఆప్యో వైశ్వ స్తథారాజన్! కేశ్వర శ్శక్రదైవతః ॥ 69
ఐంద్రాగ్నేయానైరృతస్తు వారుణ శ్చ్య మహీ యతే । ఆర్యమ్ణస్తు తథా భాగ్యో ముహూర్తాస్తు దివాచరాః ॥ 70

రౌద్రాజ దేవోఽహిర్బుధ్న్యః పౌష్ణ శ్చాశ్విన ఏవచ ।
యామ్యోఽగ్ని దైవత శ్చైత్ర బ్రాహ్మ సౌమ్య స్తథైవచ ॥ 71
ఆదిత్యో జీవ దైవత్యో వైష్ణవ స్సూర్య దైవతః ।
త్వాష్ట్రి శ్చైవాథ వాయవ్యో ముహూర్తా రాత్రి చారిణః ॥ 72
అహ్నః పంచ దశో భాగో రాత్రేశ్చ యదునందన! ।
ముహూర్త సంజ్ఞః కథితో మునిభి స్తత్వ దర్శిభిః ॥ 73
మహాకల్యా దథా రభ్య కాలావయవ దేవతాః । ఉక్తా స్తవ ముహూర్తాశ్చ తేషాం కాలే స్వకేఽర్చనమ్ ॥ 74
మహాఫలం హి నిర్దిష్టం స్యా ద్వియోగే విశేషతః ।
స్వకాలే దేవతాః పూజ్యాః సోపచారై ర్విశేషతః ।
తస్యా స్వకాలా ద్ధర్మజ్ఞ! కామయర్భి ర్మహ త్ఫలమ్ ॥ 75
కాలే స్వకేయః ప్రయత స్తు భక్త్యా । దేవాన్ యథావత్సముపైతి రాజన్!
సపర్యయా తస్య దిశ న్తి దేవాః । ఫలా నభీష్టాన్ నృప లోహితాక్ష! 76

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే మహాపురాణే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
కాలావయవ దైవతానాం మాహాత్మ్యవర్ణనం నామ త్ర్యశీతితమోఽధ్యాయః

ఇకమీదట ముహూర్తాధి దేవతల తెలిపెదను ఒక అహోరాత్రములో అన్ని నక్షత్రములును ఆవృత్తి చెందుచుండును. కాని ఈ మొత్తము అరువది గడియలకాలము ముప్పది ముహూర్తములేయగును. అని పలుకగా వజ్రుడిట్లు ప్రశ్నించెను. ఓ అనఘా! నక్షత్రములు అభిజిత్తుతో కూడ ఇరువది యెనిమిది నక్షత్రములని మీరు చెప్పియుండిరి. అవియే ముప్పది ముహూర్తములు లెట్లగును? మార్కండేయుడిట్లు బదులుచెప్పెను. ఓ రాజా! అభిజిత్తుఅను నక్షత్రము (వాస్తవమున నిది నక్షత్రము కాదు. కాలవిశేషమును పూర్వులు నక్షత్రముగ చెప్పినారు( పగటి ఆరంభమున రాత్రి యారంభమున రాత్రింబగల్ల మధ్యకాలమున నుండు కాలవిశేషమే అభిజిత్ అని చెప్పబడును. ఈ మొత్తము కాలమును మూడు భాగములుచేసి, రాత్రియారంభమున మూడింట ఒకవంతును పగట యారంభమున మూడింట ఒకవంతును దినార్ధ రాత్ర్యర్ధకాలమందలి రెండంశములను కలసి మూడింట ఒక వంతును కాగా అభిజిత్తుమూడు భాగములగుచున్నది. ఇట్లు ఈ యిరువది నక్షత్రములే ముప్పది ముహూర్తములగును. నక్షత్రముల అధి దేవతలే ముహూర్తములకును నధి దేవతలు లేకలమువారి క్రమము మాత్రము మారును. ఎలనగా- పగటిముహూర్తము లకు రుద్రులు సర్పములు, మిత్రుడు, పితరులు, వసువులు జలములు, విశ్వులు, అభిజిత్, బ్రహ్మ, వరణుడు, ఇంద్రుడు, ఇంద్రాగ్నులు, నిర్వతి వరుణుడు, అర్యమాభగుడు అనువారు.

ఇక రాత్రిముహూర్తములకు-శివుడు, అజైకపాత్, అహిర్బుధ్న్యుడు, పూష, అశ్వినులు, యముడు, అగ్ని, బ్రహ్మ సోముడు, అదితుడు బృహస్పతి, విష్ణువు సూర్యుడు, త్వష్టవాయువు. అనువారును ఒకటినుండి పదునైదు వరకు ఆయా ముహూర్తములకు అధిపతులు. కాల తత్త్వవేత్తలగు మునులు పగటని రాత్రిని వేరు వేరుగా పదునైదేసిభాగములు చేయగా రెండేసి గడియలతో (48 నిముషములతో) నేర్పడు కాల విభాగమును ముహూర్తమని నిర్దేశించిరి. ఈవిధము గ ఓ రాజా! నీకు మహాకల్యాము తిని. ఆయాముహూర్తముల యధిదేవతలనెరిగి ఆయాదేవతలనుగాని ఆయాముహూర్తాధి దేవతల మిత్రకోటలోని దేవతలనుగాని వారి వారి సొంతముహూర్తములందు అర్చించుటవలన విశేషఫలమునలుగును. వ్యాధులు మున్నగు ఆపదల నివారణకై చేయు అర్చనలు ఇంకను విశేషఫలముల నిచ్చును. కావున ఆయా దేవతలను అన్ని ఉపచారములతో వారివారి స్వముహూర్తకాలమందు అర్చించుట

యనునది ఆయుదేవతలనుండి మహా ఫలముల కాక్షించువారు చేయవలసిన పని. ఓ లోహితాక్షా! ఎవరు ఆయా దేవతలను వారి ముహూర్తములందు విధి విధానమున సర్వోపచారములతో సేవింతునో, వారికాయా దేవతలు అభీష్టఫలముల నిత్తురు.

ఇది విష్ణుధర్మోత్తర మహాపురాణమున ప్రధమఖండమున కాలావయవ దేవతలమత్య వర్ణనమను ఎనుబదిమూడవ అధ్యాయము

## ఎనుబదిబదినాలుగవ అధ్యాయము - షడ్లగ్నవర్ణనము

**మార్కండేయ ఉవాచ :**

లగ్నాని ద్వాదశోక్తాని దినరాత్రేణ నిత్యశః । యత్రా దిత్యః స్థితో రాశౌ తదాద్యాని నరాధిప! ॥ 1
మేషో వృషోఽథ మిథునః కుళీర స్సింహ ఏవ చ । కన్యా తులా తథా కీటో ధన్వీ మకర ఏవచ ॥ 2
కుంభో మీన శ్చ రాజేంద్ర! లగ్నా ద్వాదశ కీర్తితాః ।
కుజ శ్శుక్రో బుధ శ్చంద్ర స్సూర్య శ్చాంద్రి స్సిత స్తథా ॥ 3
భౌమో జీవ శ్చ సౌరశ్చ శని ర్జీవ స్తథైవచ । మేషాదీనాం క్రమేణోక్తాః ప్రభవః పృధివీపతే ॥ 4
లగ్నస్యార్ధం స్మృతా హోరా తయోర్విషమ రాశిషు । ఆదిత్య చంద్రౌ చంద్రార్కా వీశ్వరౌ సమ రాశిషు ॥ 5
లగ్న త్రిభాగో ద్రేక్కాణః క్రమా త్తేషాం తదేశ్వరాః । లగ్నేశః పంచమేశశ్చ నవమేశ స్తథైవ చ ॥ 6
మేశాద్యాః కథితా నిత్యం మేష సింహ ధనుర్ధరాః । మకరాద్యా స్తథా ప్రోక్తా వృష కన్యా మృగా స్తథా ॥ 7
తులాద్యా మిధున స్త్రౌలీ కుంభశ్చ వసుధాధిప! । కుళీరాద్యాః కుళీరశ్చ కీటోమీన స్తథైవ చ ॥ 8
ఆద్యుక్త రాశి ప్రభృతి గణనీయా నవాంశకాః । రాశీనాం తు యధోక్తానాం క్రమా న్నవ నవేశ్వరాః ॥ 9
స్వరాశిత స్తధారభ్య క్రమేణైవ నవేశ్వరాః । రాశీశ్వరేశ్వరాః ప్రోద్వా రాశీనాం ద్వాదశాంశకాః ॥ 10
పంచభౌమస్య సౌరస్య పంచ త్రింశాంశకా మతాః । జీవ స్యాష్టౌ వినిర్దిష్టాః సప్త ప్రోక్తాః బుధస్యతు ॥ 11
శుక్రస్తోక్తాః తథా పంచరాశౌ విషమ సంజ్ఞకే । ఆద్యాస్తు పంచ శుక్రశ్య తతస్సప్త బుధస్యతు ॥ 12
జీవస్యాష్టౌ తథా ప్రోక్తాః పంచ సౌరస్య చాప్యథ ।
కుజస్యతు తథా పంచరాశౌ తు సమ సంఖ్యకే ॥ 13
లగ్నంచ హోరాచ తథా ద్రికాణం నవాంశకం ద్వాదశభాగ సంజ్ఞమ్ ।
త్రింశాంశకం చాప్యథ షష్ఠమత్ర షడ్భేదమాహు ర్మునయశ్చ లగ్నమ్ ॥ 14

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్ర సంవాదే
షడ్ లగ్న వర్ణనం నామ చతురశీతి తమోఽధ్యాయః

మార్కండేయు డిట్లుపలికెను :-

ప్రతి అహోరాత్రమునందును పన్నెండు రాసులు ఆవృత్త మగును. (ఈ పండ్రెండు రాసులు ను ఇరువది నక్షత్రములే గాని వేరుగాదు. నక్షత్ర చక్రమును పండ్రెండుగ విభజించగా పండ్రెండు రాసులైనవి.) ఇవి పూర్వక్షితిజము (Horizon) మీది నుండి ఉదయించుచు క్రమముగ పైకి వచ్చి పశ్చిమక్షితిజమున అస్తమించుటను బట్టి లగ్నములన బడుచున్నవి. ఇవి మేషము, వృషభము, మిధునము, కర్కాటకము, కన్య, తుల, వృశ్చికము, ధనుస్సు, మకరము, కుంభము, మీనము అనునవి. వీనికి వరుసగా కుజుడు, శుక్రుడు, బుధుడు, చంద్రుడు, సూర్యుడు, శని, బృహస్పతి అను వార ధిపతులు. అరువది గడియల అహోరాత్రమున ఆవృత్తమగు పండ్రెండు లగ్నములలో నొక్కొక్కదానికి ఇంచుమించుగా

వైశ్వానరం పథం ప్రాహు స్తమేవాత్యంత దారుణమ్ ॥ 6
ఉదయాస్తమయాభ్యాంచ చారేణ చ తథా గ్రహాః । ఉత్తరాసు శుభాః ప్రోక్తాః దక్షిణా స్త్వశుభావహాః ॥ 7

వజ్రు డిట్లు పలికెను :- ఓ భార్గవ శ్రేష్ఠా ! ఈ మహీ తలమున కాలము ఇది శుభమైనది ఇది అశుభమైనదనికాని యెట్లు తెలియ వచ్చునో మిమ్ము అడుగుచున్నాను. దానిని తెలుపుడు.

మార్కండేయుడిట్లు చెప్పెను. :- నక్షత్ర (రాశి) చక్రము. సూర్యగమనమునకు సంబంధించి మూడు మార్గములుగ విభజింప బడి నది. వీనియందు ఉత్తర గతిని ఐరావతము, దక్షిణ గతిని వైశ్వానరము, మధ్యగతిని జరద్గవము అందురు. ప్రతి మార్గమునకును మూడేసి వీధులు గలవు. వాని వ్యవస్థ యీక్రింద చూపబడు చున్నది.

| | | | |
|---|---|---|---|
| 1. ఐరావత మార్గము | నాగవీధి<br>అశ్వని<br>భరణి<br>కృత్తిక | గజవీధి<br>రోహిణి<br>మృగశిర<br>ఆరుద్ర | ఐరావతవీధి<br>పునర్వసు<br>పుష్యమి<br>అశ్లేష |
| 2. జరద్గవ మార్గము | ఋషభవీధి<br>మఖ<br>పుబ్బ<br>ఉత్తర | గోవీధి<br>హస్త<br>చిత్త<br>స్వాతి | జరద్గవవీధి<br>విశాఖ<br>అనూరాధ<br>జ్యేష్ఠ |
| 3. వైశ్వానరమార్గము | అజవీధి<br>మూల<br>పూ.షాఢ<br>ఉ.షాఢ | మృగవీధి<br>శ్రావణం<br>ధనిష్ఠ<br>శతభిషము | వైశ్వానరవీధి<br>పూ.భాద్ర<br>ఉ.భాద్ర<br>రేవతి |

గమనిక : పైవిషయమున విష్ణుధర్మోత్తరమహాపురాణగతశ్లోకములు సరిగాలేక సమన్వయమున కనకూలపడనందున ఇదేవిషయము శ్రీ దేవీభాగవతములో చెప్పబడినదానిని నిచట చూపుట యైనది.

సుప్రభా రశ్మిమ న్తశ్చ నాగవీధ్యాం యదా గ్రహాః ।
న తదస్తి శుభం లోకే యన్న పశ్యన్తి మానవాః ॥ 8
విరశ్మయో వివర్ణాశ్చ వైశ్వానర పథాశ్రితాః । న తదస్తి శుభం రామ! యన్న కుర్యుర్జగత్త్రియే ॥ 9
రోహిణీ శకటం భిందుర్యగ్రిహా యది భవే త్తథా । నాశః ప్రజానాం క్రూరశ్చ విశేషేణాత్ర లక్ష్యతే ॥ 10
సౌరార సూర్యాః క్రూరాస్తు తథా క్షీణశ్చ చంద్రమాః ।
క్రూరైర్యుక్తో బుధ శ్చైవ రాహుః కేతు స్తథైవ చ ॥ 11
శేషా స్సౌమ్య గ్రహాః ప్రోక్తాః మునిభి స్తత్త్వదర్శిభిః ।
రోహిణీ కృత్తికా పిత్ర్యం వైష్ణవం మైత్రమేవ చ ॥ 12
పీడయన్తో గ్రహా హన్యుర్దిశం వరుణ పాలితామ్ । పూర్వస్యాం దిశి దృశ్యన్తే సర్వతారాగ్రహాయది ॥ 13
ప్రాచ్యానాంతు తదా రాజ్ఞాం భవే త్పీడా సుదారుణా ।

వైశ్వానర మార్గము మిగుల దారుణమైనది. గ్రహములు ఈమార్గములందలి నక్షత్రము లందున్నప్పుడు అశుభ ఫలితముల నిచ్చును. ఆయాగ్రహములు తమ తమ ఉదయాస్తమయములను రాశి సంచారమును ననుసరించి యుత్తర భాగమున నున్న గ్రహములు శుభ ములు. దక్షిణ భాగముననున్నవి అశుభమును కలిగించును. గ్రహము లెప్పుడు నాగ వీధి యందు మంచి కాంతిని తేజః కిరణము లను పొందియుండునో అపుడు లోకమున మానవులు పొందని శుభమేదియు నుండదు. (అన్ని శుభములు చేకూర్చును) అట్లే గ్రహ

ములు వైశ్వానర వీధి నాశ్రయించి తమ తేజః కిరణములను ప్రకాశమానిమగు వన్నెను కోల్పోయి యుండునో అప్పుడట్లున్న గ్రహములు జగత్త్రియమున తాము చేయజాలని శుభమేదియు నుండదు. (అన్ని శుభములు చేయునని తాత్పర్యము) గ్రహములెపుడు రోహిణీ శకటమును భేదించునో అపుడు ఈ లోకమున ప్రజలకు విశేషముగ క్రూరమైన నాశము కలుగును. ఏదేని గ్రహము వృషభ రాశికి సంబంధించిన ముప్పది భాగములలో మొదటి భాగమునుండి పదునేడవ భాగమున నుండగా ఆ గ్రహము యొక్క శరము క్రాంతి వృత్తమునకు దక్షిణ దిశగా రెండు భాగముల (డిగ్రీల) కంటే నెక్కువగా నున్నచో అట్లున్నంత కాలము ఆ గ్రహము రోహిణీ శకటమును - అనగా శకటాకారమున నమరియున్న అయిదు తారలతో నేర్పడు రోహిణీ నక్షత్రమును భేదించును అని జ్యోతిశ్శాస్త్రమున గ్రహగణిత సిద్ధాంతమున చెప్పబడినది. (చూ-సూర్యసిద్ధాంతము భగ్రహయుత్యధికారము 13శ్లో)

మధ్యే చ యది దృశ్యన్తే మధ్యదేశ నివాసినామ్ ॥ 14
వారుణ్యాం యది దృశ్యన్తే తాం దిశం పీడయన్తి చ ।
హీనాధికం చరన్తశ్చ వ్యభ్రే వాఽదర్శనం గతాః ॥ 15
ధూమాయన్తో జ్వలన్తోవా వేదయన్తి మహద్భయమ్ । ఏకాన్తరిత నక్షత్రగతా స్స్యుశ్చే ద్గ్రహా దివి ॥ 16
మాలా నామ భవేద్యోగో మధ్యదేశ క్షితీశహా ।
ప్రాస శ్చక్రం ధను ర్వజ్రం సస్యానాం క్షుద్రవృష్టిదాః ॥ 17
గ్రహా భయావహా నిత్యం శృంగాటశ పురోగమాః । భవేయురేకర్క్షగతా స్త్రిభి రూర్ధ్వం యదా గ్రహాః 18
వినాశాయైవ లోకానాం విజ్ఞేయా స్సమహీక్షితామ్ ।
ఏకేన యదివా ద్వాభ్యాం గ్రహాభ్యాం సహితో గురుః ॥ 19
శనైశ్చరో వా దృశ్యేత తదా దుర్భిక్ష మాదిశేత్ ।
చిత్రాయాం లోహితో యత్ర మూలే దేవగురు స్తదా ॥ 20
భార్గవ శ్చ శ్రవిష్ఠాసు తదా ఘోరం భయం భవేత్ । కృత్తికాసు శనైశ్చారీ విశాఖాసు బృహస్పతిః ॥ 21
స్థితౌ ప్రజానాం పీడాయై వృష్టి మన్త ర్దివం భవేత్ ।
పా ద్ద్వారేషు చరన్ భేషు సౌరో వక్ర మియా ద్యది ॥ 22
పృథివీం పీడయే త్సర్వాం పూర్వదేశం విశేషతః ।
రౌద్రే హస్తే తథై వాప్యే అహిర్బుధ్న్యే శనైశ్చరః ॥ 23
యదోదయం ప్రపద్యేత తదా సశ్యన్తి పార్థివాః ।
సౌమ్యే త్వాష్ట్రే శ్రవిష్ఠాసు స్థితే సౌరే మహీక్షితః । 24
సర్వపీడాం సమర్ఛన్తి యథా యాన్తి యమాన్తికమ్ ।
పూర్వాం పరాశాం సంప్రాప్తౌ భృగు జీవౌ పరస్పరం ॥ 25
సప్తమర్క్షగతౌ స్యాతాం తదా దేవో న వర్షతి । అపర్వణి శశాంకార్కౌ త్వష్టా నామ మహాగ్రహః ॥ 26
ఆవృణోతి తమ శ్శ్యమః సర్వలోక విపత్తయే । ఉదయాస్తమయే భానో శ్చంద్రస్య చ యదా భవేత్ ॥ 27
పరివేష స్తదా రాజాక్షిప్రం వధ మవాప్నుయాత్ । సకలం చేదహ స్సార్వో రాత్రిం చేత్సకలాం శశీ ॥ 28
పరివేషీ భవేద్రాజా తత్రాపి వధ మర్హతి । ద్వి సూర్యే గగనే వృద్ధిం క్షత్రియాణాం వివిర్దిశేత్ ॥ 29
ద్విచంద్రే బ్రాహ్మణానాం తు చాధిక్యం ప్రలయాయ తు ।
ఉదయాస్తమయౌ యత్ర సోమార్కౌ రక్తమండలౌ ॥ 30

స చాత్రాభ్రాణి దృశ్యన్తే తన్మహాభయ లక్షణమ్ । చంద్రమాః జన్మ నక్షత్రం పరిత్యజతి యస్య తు ॥ 31

శ్యావో రూక్షోపసవ్యం తు తస్య విద్యా దుపద్రవమ్ ।

అత్యన్తాఽదర్శనే రాహో స్తథా చాత్యన్తదర్శనే ॥ 32

ప్రజా పీడా వినిర్దేశ్యా వ్యాధి దుర్భిక్ష తస్కరైః। య న్నక్షత్ర గతో రాహు ర్గ్రసతే చంద్ర భాస్కరౌ ॥ 33

తజ్జాతానాం భవే త్పీడా యే నరా శ్శాన్తి వర్జితాః ।

గ్రహోపసృష్టే నక్షత్రే గ్రహణం తు యదా భవేత్ ॥ 34

తదా పీడా వినిర్దేశ్యా సైనికానాం నృపై స్సహ ।

గృహీతో రాహుణా చంద్రః సూర్యోవా గగనాచ్చ్యుతః ॥ 35

ఉల్కాని హన్యా త్తత్రాన్యో రాజా రాజ్యం కరిష్యతి । గృహీతౌ పరివేషే తౌ యదా చంద్ర దివాకరౌ ॥ 36

సమన్తా త్పీడ్యతే దేశ శ్శస్త్రకోపశ్చ జాయతే । మేఘై స్సంఛాద్యతే రాహుః అతివర్షతి వా యదా ॥ 37

ఆకాల జై స్తదా రాజ్ఞో భయం విద్యా దుపస్థితమ్ । య న్నక్షత్రా గతే సూర్యే ఛిద్రంవై సంప్రపద్యతే ॥

తజ్జాతః పార్థివః క్షిప్రం యమలోకం గమిష్యతి । తామ్రకుంకుమ రూక్షాభో ఘృత హారిద్రసన్నిభః ॥ 39

బంధు జీవ నిభో భానుః శిశిరాద్యేషు శస్యతే । అస్వచ్ఛవర్ణః పరుషో లేవనః ఖండ మండలః ॥ 40

సచ్ఛిద్రే రజసా ధ్వస్త ఉల్కా ద్యుపహతోఽపివా ।

మండలా దన్య సంస్థానం మేఘైశ్చాయుధ సన్నిభైః ॥ 41

ఉదయా స్తమయే ఛన్నః పార్థివానాం న శశ్యతే । పక్షిదౌ చాపసంస్థానే యుద్ధం శశిని నిర్దిశేత్ ॥ 42

గ్రహములలో శని అంగారకుడు సూర్యుడు, క్షీణచంద్రుడు, క్రూరగ్రహ సమేతుడైన బుధుడు, రాహు కేతువులు ఇవి క్రూరలు. మిగిలినవి సౌమ్యగ్రహములని జ్యోతిస్తత్వవేత్తల అభిప్రాయము. గ్రహములు రోహిణీ, కృత్తిక, మఖ, శ్రవణము అనూరాధ అను నీనక్షత్రములలోనున్న గ్రహములు పశ్చిమదిక్కువారికి పీడను హానినికలిగించును. తారాగ్రహములు తూర్పుదిక్కున నున్నకాలమున నాదేశపు రాజులకును, మధ్యభాగముననున్నపుడు మధ్యనివాసులకును పడమట నున్నపుడు ఆదిక్కునవారికి మిగుల దారుణమగు పీడలగును. గ్రహములు (తమనిజపద్ధతికంటె) ఎక్కువగగాని, తక్కువగగాని సంచరించుట మేఘములు లేని నిర్మలాకాశమునకూడ నచట కనపడవలసినగ్రహము అకస్మాత్తుగా కనపడక పోవుట, గ్రహమునుండి పొగ, మంటలు లేచుచున్నట్లు కనబడుట జరిగినచో అట్లు కనపడు ప్రదేశములవారికి మహాభయము కలుగును. ఆకాశమున గ్రహములన్నియు ఒక నక్షత్రమును విడిచి దాని తరువాత నక్షత్రమున (ఏకాంతరితముగ)నున్నచో మాలాయోగ మనంబడును. ఇది సంభవించినపుడు మధ్యదేశరాజులకు ప్రజలకు హానికలుగును. ఇట్లే ప్రాసము, చక్రము, ధనుస్సు వజ్రము అనెడి యోగములు గ్రహగతిలో సంభవించినపుడు (ఇట్టి వన్నియు గ్రహ గణితశాస్త్రమునుండి తెలియవలెను) సస్యములకు అపకారకమగు క్షుద్రవృష్టి సంభవించును. గ్రహగతిలో శృంగాటక యోగము సంభవించినచో-దానిలోనున్న గ్రహములు లోకములకు భయము కలిగించును. గ్రహములు ఒకనక్షత్రము నుండి దానితరువాత మూడు నక్షత్రములను వదలి నాల్గవ నక్షత్రమును అను ఈ క్రమమున నున్నచో రాజులకు లోకమునకు వినాశము కలుగును, బృహస్పతిగాని శనిగాని ఒకటి లేదా రెండుగ్రహములతో కూడియున్నచో దుర్భిక్షము కలుగును. చిత్తలోనంగారకుడు, మూలలో బృహస్పతి, ధనిష్ఠలో శుక్రుడు, కృత్తికలో శని, విశాఖలోబృహస్పతి యున్నపుడు సర్షములుకురియవు. శనితూర్పు దిక్కునందలి నక్షత్రములలో సంచరించుచు వక్రించినచో సమస్త పృధివి, విశేషించి పూర్వ (తూర్పు) దేశమును పీడించును. ఆ శనియే ఆర్ద్ర, హస్త, పూర్వాషాఢ పూర్వాభాద్ర నక్షత్రములలో ఉదయము (మౌఢ్యమినుండి) నొందినచో రాజులకు నాశనము కలుగును. రోహిణి, చిత్ర, ధనిష్ఠ, ఈ నక్షత్రములలో శనియున్నచో రాజులకు నన్నిపీడలు కలుగుటయేగాక యమలోకమును

ములు వైశ్వానర వీథి నాశ్రయించి తమ తేజః కిరణములను ప్రకాశమానిమగు పన్నెను కోల్పోయి యుండునో అప్పుడట్లున్న గ్రహములు జగత్త్రియమున తాము చేయజాలని శుభమేదియు నుండదు. (అన్ని శుభములు చేయుననిని తాత్పర్యము) గ్రహములెపుడు రోహిణీ శకటమును భేదించునో అపుడు ఈ లోకమున ప్రజలకు విశేషముగ క్రూరమైన నాశము కలుగును. ఏదేని గ్రహము వృషభ రాశికి సంబంధించిన ముప్పది భాగములలో మొదటి భాగమునుండి పదు నేడవ భాగమున నుండగా ఆ గ్రహము యొక్క శరమ క్రాంతి వృత్త మునకు దక్షిణ దిశగా రెండు భాగముల (డిగ్రీల) కంటే నెక్కువగా నున్నచో అట్లున్నంత కాలము ఆ గ్రహము రోహిణీ శకటమును - అనగా శకటా కారమున నమరియున్న అయిదు తారలతో నేర్పడు రోహిణీ నక్షత్రమును భేదించును అని జ్యోతిశ్శాస్త్రమున గ్రహగణిత సిద్ధాంతమున చెప్పబడినది. (చూ-సూర్యసిద్ధాంతము భగ్రహయుత్యధికారము 13శ్లో)

మధ్యే చ యది దృశ్య న్తే మధ్యదేశ నివాసినామ్ ॥ 14

వారుణ్యాం యది దృశ్య న్తే తాం దిశం పీడ య న్తి చ ।

హీనాధికం చర న్త శ్చ వ్యభ్రే వాఽ దర్శనం గతాః ॥ 15

ధూమాయన్తో జ్వలన్తోవా వేదయ న్తి మహద్భయమ్ । ఏకా న్తరిత నక్షత్రగతా స్స్యశ్చే ద్గ్రహా దివి ॥ 16

మాలా నామ భవేద్యోగో మధ్యదేశ క్షితీశహా ।

ప్రాస శ్చక్రం ధను ర్వజ్రం సస్యానాం క్షుద్రవృషిదాః ॥ 17

గ్రహా భయావహా నిత్యం శృంగాటక పురోగమాః । భవేయురేకర్క్షగతా స్త్రిభి రూర్ధ్వం యదా గ్రహాః 18

వినాశాయైవ లోకానాం విజ్ఞేయా స్సమహీక్షితామ్ ।

ఏకేన యదివా ద్వాభ్యాం గ్రహాభ్యాం సహితో గురుః ॥ 19

శనై శ్చరో వా దృశ్యేత తదా దుర్భిక్ష మాదిశేత్ ।

చిత్రాయాం లోహితో యత్ర మూలే దేవగురు స్తదా ॥ 20

భార్గవ శ్చ శ్రవిష్ఠాసు తదా ఘోరం భయం భవేత్ । కృ త్తికాసు శనై శ్చారీ విశాఖాసు బృహస్పతిః ॥ 21

స్థితౌ ప్రజానాం పీడాయై వృష్టి మ న్త ర్దివం భవేత్ ।

పా ద్వారేషు చరన్ భేషు సౌరో వక్ర మియా ద్యది ॥ 22

పృథివీం పీడయే త్సర్వాం పూర్వదేశం విశేషతః ।

రౌద్రే హ స్తే తథై వాప్యే అహిర్బుధ్న్యే శనై శ్చరః ॥ 23

యదోదయం ప్రప ద్యేత తదా నశ్య న్తి పార్థివాః ।

సౌమ్యే త్వాష్ట్రే శ్రవిష్ఠాసు స్థితే సౌరే మహీక్షితః । 24

సర్వపీడాం సమర్చ్ఛ న్తి యథా యా న్తి యమా న్తికమ్ ।

పూర్వాం పరాశాం సంప్రాప్తౌ భృగు జీవౌ పరస్పరం ॥ 25

స ప్తమర్క్షగతౌ స్యాతాం తదా దేవో న వర్షతి । అపర్వణి శశాంకార్కౌ త్వష్టా నామ మహాగ్రహః ॥ 26

ఆవృణోతి తమ శ్శ్యామః సర్వలోక విప త్తయే । ఉదయా స్తమయే భానో శ్చంద్రస్య చ యదా భవేత్ ॥ 27

పరివేష స్తదా రాజాక్షిప్రం వధ మవాప్నుయాత్ । సకలం చేదహ స్సూర్యో రాత్రిం చేత్సకలాం శశీ ॥ 28

పరివేషీ భవేద్రాజా తత్రాపి వధ మర్చ్ఛతి । ద్వి సూర్యే గగనే వృద్ధిం క్షత్రియాణాం వినిర్దిశేత్ ॥ 29

ద్విచంద్రే బ్రాహ్మణానాం తు చాధిక్యం ప్రలయాయ తు ।

ఉదయా స్తమయౌ యత్ర సోమార్కౌ ర క్తమండలౌ ॥ 30

స చాత్రాభ్రాణి దృశ్యన్తే తన్మహాభయ లక్షణమ్ । చంద్రమాః జన్మ నక్షత్రం పరిత్యజతి యస్య తు ॥ 31
శ్యావో రూక్షోపసవ్యం తు తస్య విద్యా దుపద్రవమ్ ।
అత్యన్తాఽదర్శనే రాహో స్తథా చాత్యన్తదర్శనే ॥ 32
ప్రజా పీడా వినిర్దేశ్యా వ్యాధి దుర్భిక్ష తస్కరైః। య న్నక్షత్ర గతో రాహు ర్గ్రసతే చంద్ర భాస్కరౌ ॥ 33
తజ్జాతానాం భవే త్పీడా యే నరా శ్శాన్తి వర్జితాః ।
గ్రహోపసృష్టే నక్షత్రే గ్రహణం తు యదా భవేత్ ॥ 34
తదా పీడా వినిర్దేశ్యా సైనికానాం నృపై స్సహ ।
గృహీతో రాహుణా చంద్రః సూర్యోవా గగనాచ్చ్యుతః ॥ 35
ఉల్కాని హన్యా త్తత్రాన్యో రాజా రాజ్యం కరిష్యతి । గృహీతౌ పరివేషే తౌ యదా చంద్ర దివాకరౌ ॥ 36
సమన్తా త్పీడ్యతే దేశ శ్శస్త్రకోపశ్చ జాయతే । మేఘై స్సంఛాద్యతే రాహుః అతివర్షతి వా యదా ॥ 37
ఆకాల జై స్తదా రాజ్ఞో భయం విద్యా దుపస్థితమ్ । య న్నక్షత్రా గతే సూర్యే ఛిద్రంవై సంప్రపద్యతే ॥
తజ్జాతః పార్థివః క్షిప్రం యమలోకం గమిష్యతి । తామ్రకుంకుమ రూక్షాభో ఘృత హారిద్రసన్నిభః ॥ 39
బంధు జీవ నిభో భానుః శిశిరాద్యేషు శస్యతే । అస్వచ్ఛవర్ణః పరుషో లేవనః ఖండ మండలః ॥ 40
సచ్ఛిద్రే రజసా ధ్వస్త ఉల్కా ద్యుపహతోఽపివా ।
మండలా దన్య సంస్థానం మేఘైశ్చాయుధ సన్నిభైః ॥ 41
ఉదయాస్తమయే ఛన్నః పార్థివానాం న శశ్యతే । పక్షిదౌ చాపసంస్థానే యుద్ధం శశిని నిర్దిశేత్ ॥ 42

గ్రహములలో శని అంగారకుడు సూర్యుడు, క్షీణచంద్రుడు, క్రూరగ్రహ సమేతుడైన బుధుడు, రాహు కేతువులు ఇవి క్రూరలు. మిగిలినవి సౌమ్యగ్రహములని జ్యోతిస్తత్వవేత్తల అభిప్రాయము. గ్రహములు రోహిణీ, కృత్తిక, మఖ, శ్రవణము అనూరాధ అను నీనక్షత్రములలోనున్న గ్రహములు పశ్చిమదిక్కువారికి పీడను హానినికలిగించును. తారాగ్రహములు తూర్పుదిక్కున నున్నకాలమున నాదేశపు రాజులకును, మధ్యభాగముననున్నపుడు మధ్యనివాసులకును పడమట నున్నపుడు ఆదిక్కునవారికి మిగుల దారుణమగు పీడలగును. గ్రహములు (తమనిజపద్ధతికంటె) ఎక్కువగగాని, తక్కువగగాని సంచరించుట మేఘములు లేని నిర్మలాకాశమునకూడ నచట కనపడవలసినగ్రహము అకస్మాత్తుగా కనపడక పోవుట, గ్రహమునుండి పొగ, మంటలు లేచుచున్నట్లు కనబడుట జరిగినచో అట్లు కనపడు ప్రదేశములవారికి మహాభయము కలుగును. ఆకాశమున గ్రహములన్నియు ఒక నక్షత్రమును విడిచి దాని తరువాత నక్షత్రమున (ఏకాంతరితముగ)నున్నచో మాలాయోగ మనంబడును. ఇది సంభవించినపుడు మధ్యదేశరాజులకు ప్రజలకు హానికలుగును. ఇట్లే ప్రాసము, చక్రము, ధనుస్సు వజ్రము అనెడి యోగములు గ్రహగతిలో సంభవించినపుడు (ఇట్టి వన్నియు గ్రహ గణితశాస్త్రమునుండి తెలియవలెను) సస్యములకు అపకారకమగు క్షుద్రవృష్టి సంభవించును. గ్రహగతిలో శృంగాటక యోగము సంభవించినచో-దానిలోనున్న గ్రహములు లోకములకు భయము కలిగించును. గ్రహములు ఒకనక్షత్రము నుండి దానితరువాత మూడు నక్షత్రములను వదలి నాల్గవ నక్షత్రమును అను ఈ క్రమమున నున్నచో రాజులకు లోకమునకు వినాశము కలుగును, బృహస్పతిగాని శనిగాని ఒకటి లేదా రెండుగ్రహములతో కూడియున్నచో దుర్భిక్షము కలుగును. చిత్తలోనంగారకుడు, మూలలో బృహస్పతి, ధనిష్ఠలో శుక్రుడు, కృత్తికలో శని, విశాఖలోబృహస్పతి యున్నపుడు వర్షములుకురియవు. శనితూర్పు దిక్కునందలి నక్షత్రములలో సంచరించుచు వక్రించినచో సమస్త పృథివి, విశేషించి పూర్వ (తూర్పు) దేశమును పీడించును. ఆ శనియే ఆర్ద్ర, హస్త, పూర్వాషాఢ పూర్వాభాద్ర నక్షత్రములలో ఉదయము (మౌఢ్యమినుండి) నొందినచో రాజులకు నాశనము కలుగును. రోహిణి, చిత్ర, ధనిష్ఠ, ఈ నక్షత్రములలో శనియున్నచో రాజులకు నన్నిపీడలు కలుగుటయేగాక యమలోకమును

పొందుదురు. బృహస్పతియు, శుక్రుడును అను వీరిలోనొకరు తూర్పు మరియొకరు పడమటదిక్కులకు సంబంధించిన నక్షత్రముల యందుండి, పరస్పరము ఏడవనక్షత్రముననున్నచో అనావృష్టి యేర్పడును. పర్వకాలము (పూర్ణిమ, అమా) కాకయే చంద్రసూర్యులను త్వష్టఅను మహాగ్రహము కప్పివేసినపుడు ఆ యేర్పడిన నల్లచీకటి సర్వలోకములకు విపత్తిని కల్పించును. సూర్యచంద్రుల ఉదయాస్తమయ కాలములందు వారికి పరివేషమేర్పడినచో రాజునకు మరణమేర్పడును. పగటి కాలమంతయు, సూర్యునకుగాని, రాత్రికాలమంతయు చంద్రునికిగాని పరివేషమేర్పడినచోకూడ రాజు మృతిపొందును. ఆకాశముననిద్దరు సూర్యులు కనబడినచో క్షత్రియులకు, ఇద్దరు చంద్రులు కనబడినచో బ్రాహ్మణులకు శుభము కలుగును. ఉదయాస్తమయ కాలములందలి చంద్రసూర్యులు ఎర్రని మండలములుకల్గి ఆసమయమున ఆకాశమున మేఘములు కనబడనిచో లోకమునకు నాశముకలుగును. ఇది మహాభయలక్షణము. చంద్రుడు ఎవ్వని జన్మనక్షత్రమును వదలి దానికి రెండవనక్షత్రముననుండి శ్యావ వర్ణము కలిగి, రూక్షుడై అపసవ్యముగ కనపడునో అట్టివానికి నుపద్రవము కల్గును. ఏనక్షత్రమున రాహువు బొత్తుగా కనపడకపోవుట, అధికముగ కనపడుట జరిగినచో వ్యాధి దుర్భిక్ష తస్కరాదిపీడయు ప్రజలకు కలుగును. ఏనక్షత్రమున రాహువువలన చంద్రసూర్యగ్రహణములేర్పడునో ఆనక్షత్ర జాతులకు పీడకలుగును. శాంతిచేసికొనిన యెడల నివృత్తములగును. ఏదేని గ్రహమున్న నక్షత్రములో గ్రహణము సంభవించిన యెడల రాజులకును సైనికులకును పీడకలుగును. గ్రహణము పట్టియుండిన చంద్రుడుకాని సూర్యుడుకాని ఆకాశమునుండి క్రిందికి జారిపడినటుల కనపడినను, ఉల్కలు కనపడినను అట్లుకనపడిన దేశపురాజును పర రాజులుచంపి రాజ్యమేలుదురు. అట్లేగ్రహణకాలమున చంద్రసూర్యులకు పరివేషము కలిగినచో అట్లుకనపడిన దేశమున నంతట పీడలును అయుధోపద్రవములును కలుగును. రాహువును మేఘములు కప్పివేయుటగాని అకాల మేఘములు అతిగా వర్షము కురియుటగాని జరిగినచో నాదేశపు రాజునకు భయము సంభవించును. సూర్యుడు ఏ నక్షత్రముననుండగా సూర్యునియందు ఛిద్రముకనపడునో ఆనక్షత్రజాతుడగురాజు శీఘ్రముగా మరణించును.

ఈ భానుఛిద్రమును గుర్తించువిధము : సూర్యుడుశిశిరఋతువున తామ్రవర్ణము వసంతమున కుంకుమవర్ణము గ్రీష్మమున రూక్షవర్ణము వర్షర్తువున ఘృతవర్ణము, శరత్తున హరిద్రావర్ణము హేమంతమున మంకెనపూవు వర్ణముకలిగియుండుటప్రశస్తము. దీనికిభిన్నముగ కనపడుట భానుఛిద్రము. అట్టిసమయమున సూర్యుడు స్వచ్ఛవర్ణము లేకుండుట పరుషవర్ణము కలిగి కనిపించుచున్నట్లుండుట సూర్య బింబము ఖండితమైనట్లుండుట, ధూళితో కప్పివేయబడుట ఉల్కలు మున్నగు జ్యోతిస్సులతో నుపహతమగుట తన మండల స్థానమును తప్పి ఆ స్థానమున నుండుట మున్నగునవికూడ మరికొన్ని భానుఛిద్రలక్షణములు. సూర్యుడు తన ఉదయాస్తమయ కాలములందు ఆయుధాకృతిగల మేఘములతో కప్పివేయబడుట రాజులకు క్షేమకరముగాదు. శుక్లకృష్ణములలో నేపక్షపు ఆది సమయము నందైనను చంద్రుడు ధనూరాశియందుండుట యుద్ధోపద్రవమును కలిగించును.

లాభ స్తేషాం జయ స్తేషాం యత్ర దృష్టం భయం తతః ।
సమకోటి విశాలశ్చ కించిద్వా ప్యుత్తరో న్నతః ॥ 43
మాసాదౌ చంద్రమా శ్శస్తో వామ ఏవ విపర్యయః ।
మండలే నాంతరీకుర్వన్ శృంగే సా యది వా స్పృశేత్ ॥ 44
తారాగ్రహం తదా కుర్యా ద్భయం జనపదే శశీ । శుక్లపక్షస్య వా వృద్ధిర్లోకే క్షేమ సుభిక్షదా ॥ 45
సా సితేతర పక్షస్య వృదిర్వ్యాం నైవ శశ్యతే । శ్రవణేఽభ్యుదితే భౌమః పుష్యే పక్రమియా ద్యది ॥ 46
ప్రాజా పత్యుదిత శ్చంద్రో నాశాయ స్యా న్మహీక్షితామ్ ।
గతాగతం యదా కుర్యా న్మఘా మధ్యేన లోహితః ॥ 47
తదా భవత్య నావృష్టిః పాండ్యోరాజా వినశ్యతి । ఫల్గునోరుదయం కృత్వా వక్రస్స్యా ద్వైశ్వ దైవకే ॥ 43

ప్రజాపత్యే ప్రవాసశ్చ త్రైలోక్యం తత్ర పీడ్యతే। ధ్రువేషు వైష్ణవే మూలే శాక్రేచ విచరన్ కుజః ॥ 49
ఘోరాం కరో త్యనావృష్టిం కృత్తికాసు మఘాసుచ। కార్తికేఽశ్వయుజే పౌషే చాషాఢే శ్రావణే బుధః ॥ 50
దృష్టో లోకే భయాయ స్యా న్మాఘ వైశాఖయో స్తథా। అకస్మాద్యత్ర దృశ్యేత దివా దేవ పురోహితః ॥ 51
రాజా వా మ్రియతే తత్ర స వా దేశో వినశ్యతి। థాహ స్సర్వం యదా శుక్రో దృశ్యతేఽథ మహాగ్రహః 52
తదా త్వ గ్న్యధిభి ర్గ్రామాన్ బాధతే నగరాణి చ। కార్తికేతు యదా మాసి కుర్వాతేఽ స్తమయో దయౌ ॥ 53
తదహ్నాం నవతిం పూర్ణం భువి దేవో న వర్షతి। శనైశ్చరో దేశ పీడాం దేశ నక్షత్ర పీడనే ॥ 54

ధ్రువం కరోతి రాజేంద్ర! నిత్యం చార వశేన తు।
సప్తాహా న్తర్గతా యే వై దివ్యపార్థివ నాభసాః ॥
గ్రహోపరాగే తీవ్రాస్స్యు రుత్పాతా స్స్వఫలేషు తే ॥ 55
ఏకస్మిన్ యది మాసే స్యా ద్గ్రహణం చంద్ర సూర్యయోః।
బ్రహ్మక్షత్ర విరోధాయ విపరీత వివృద్ధయే ॥ 56
యస్మిన్ దలశ్యేత నక్షత్రే విశాఖాయాం ప్రధూమవత్।
తద్దేశ జాతా పీడా స్యాత్ బుధ కేతు మహాగ్రహః ॥ 57

ఉల్కాద్యభి హతే సూర్యే కేతుభి ర్వా విధూమితే। అగస్త్యేవా ధ్రువే వాపి ప్రజా పీడాం వినిర్దిశేత్ ॥ 58
ఉల్కాయాభిహతా రూక్షా స్ఫురణా రజసా యుతాః। ఋషయ స్త్వప్తలోకానాంవినాశాయచ భూభృతామ్ ॥ 59

కృత్తికాభి స్సహోదేతి శాంకరీం దిశ మాశ్రితః।
కుమారీ ప్రీతితో హన్యాల్లోకే నృప కుమారకాన్ ॥ 60
సమాగమే గ్రహాణాం తు చంద్రమా శ్శస్యతే హ్యుదక్।
నక్షత్రా ణాం చ రాజేంద్ర! దక్షిణేన న శస్యతే ॥ 61
రాహుః కేతుః కుజః శుక్రః చంద్రేణ సహ యాయినః।
బుధో జీవశ్చ సౌరశ్చ నాగరా రవిణా సహ ॥ 62
యాయినా విజితే పౌరే రాజ్ఞాం స్యా ద్యాయినాం జయః।
యాయిగ్రహే పౌరజితే పురా రాజ్ఞాం జయో మృధే ॥ 63
పౌరేణ విజితే పౌరే పౌరైః పౌరక్షయం వదేత్।
యాయినా యాయిని హతే యాయిభ్యో యాయినాం క్షయః ॥ 64
గ్రహాణాం చే ద్భవే త్సామ్యం సామ్యం రాజ్ఞాం వినిర్దిశేత్।
జయా జయౌ నరేంద్రాణాం నిర్దేశ్యౌ గ్రహ విద్బుధైః ॥ 65
గ్రహోరూఢ చ్యుత స్థానాత్ స్ఫురేణ విజితో గ్రహః।
విజితో జయ లింగై శ్చ కృష్ణః శ్యామద్యుతీ స్తథా ॥ 66
ఉదఙ్ మార్గగతి స్స్నిగ్ధో విమలో విమల ప్రభః।
బృహద్రూపోఽశుక్ర శ్చ విజయీ కథితో గ్రహః ॥ 67

నదేయమేతచ్చపలస్య లోకే న నాస్తికస్యాధమ పూరుషస్య ।
గుహ్యం మునీనా మపి పార్థివేంద్ర! మయేరితం కాల వినిశ్చయంతే ॥ 68

ఇతి శ్రీ విష్ణు ధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
గ్రహ శుభాశుభ పరిజ్ఞాన వర్ణనం నామ పంచాశీతి తమోఽధ్యాయః.

చంద్రశృంగోన్నతి ఫలములు: పశ్చాదియందు చంద్రుడు ధనురాకారము న(సమశృంగములతో)కనబడినయెడల అట్లు కన బడిన దేశమున యుద్ధమును సూచించును. అట్లుయుద్ధభయము కనబడినను అప్రదేశగతజనులకు పర్యవసానమున లాభము జయము చేకూరును. అనగా మాసాదియందు చంద్రునకు శృంగములు కలిగొని, కొంచెము ఉత్తరశృంగోన్నతిలోగాని విశాల రేఖతోగాని కనపడినచో శుభము ఇందుకు భిన్నముగ కనబడినచో అశుభము కలుగును. ఈచంద్రుడు తన మండలరేఖలోపలికి రెండు శృంగములను నిమిడ్చుకొని గాని, లేదా వానిని తాకిగాని కనబడినచో ఆస్థితిని తారాగ్రహమందురు. ఇట్లుకనబడిన దేశమున భయము కనబడును. శుక్లపక్షములో కలుగునిట్టి చంద్రవృద్ధి వలన లోకమున క్షేమమును సుభిక్షమును కలుగును.

కృష్ణ పక్షమున కలుగు పైన చెప్పిన శృంగోన్నతి భేదము అశుభఫల ప్రదమగును. శ్రవణ నక్షత్రమున కుజుడు (తన అస్తమయ స్థితి నుండి) ఉదయించుట గాని పుష్యమీ నక్షత్రమున వక్రించుట గాని సంభవించినచో ఆదేశ రాజులకు నాశము కలుగును. అంగారకుడు (కుజుడు) మఘ నక్షత్రమున నుండగా వక్రించిన యెడల అనావృష్టియు, పాండ్యదేశ రాజునకు నాశ మును కలుగును. ఆతడే పుబ్బ, ఉత్తర నక్షత్రములలో నుదయించుట ఉత్తరాషాఢ యందు వక్రించుట రోహిణీ నక్షత్రమున నస్త మించుట జరిగినచో త్రిలోకములకు పీడ సంభవించును. ఆతడే శ్రవణము, మూల జ్యేష్ఠ, కృత్తిక, ధ్రువ (ధనిష్ట?) నక్షత్రము లందు సంచరించు నపుడు ఘోరమగు అనావృష్టిని కలిగించును. కార్తిక, పుష్య, ఆషాఢ, మాసములందు బుధుడు దర్శన మిచ్చినచో అట్లు కనపడిన దేశవాసులకు తీవ్ర భయము సంభవించును. మాఘ వైశాఖ మాసములలో అకస్మాత్తుగ పగలు బృహ స్పతి కనపడినచో ఆదేశరాజునకు మరణముగాని ఆ దేశ ప్రజలకు నాశముగాని సంభవించును. శుక్రుడు పగలంతయు కనపడినచో ఆ దేశమందలి నగరములకును గ్రామములకును అగ్ని భయమేర్పడును. శని కార్తిక మాసము నందు అస్తమయమును గాని ఉదయమును గాని పొందిన యెడల ఆనాడు మొదలు తొంబది దినముల వరకు వర్షము కురియనే కురియదు. చారవశమున శని యెప్పుడు ఏదేశపు నక్షత్రమున సంచరించునో ఆదేశమునకు పీడ కల్గును. (ఈదేశమునకీ నక్షత్ర మను సంగతి జ్యోతిశ్శాస్త్రము వలన తెలిసి కొన నగును.) గ్రహములకు ఉపరాగము (గ్రహణము) కలిగిన తరువాత ఏడు దినముల లోపున దివ్య, పార్థివ, నాభస ములను తీవ్రములగు నుత్పాతములు సంభవించినను, ఒకే మాసమున సూర్య చంద్రులకు నుపరాగము సంభవించిన యెడల బ్రాహ్మణులకు క్షత్రియులకు అశుభము తదితర వర్ణములకు శుభమును సంభవించును. బుధుడుగాని, కేతువుగాను, మహాగ్రహము (రాహువు) గాని విశాఖా నక్షత్రమునందు సంచరించుచు పొగబారినట్లు కనపడిన యెడల ఆ నక్షత్రపు దేశముల వారికి పీడ కల్గును. సూర్యుడు ఉల్కలచేగాని ధూమకేతువులచే గాని అభిహతుడగుట అగస్త్యుడు గాని ధ్రువుడు గాని పొగబారినట్లు అగపడుట సంభవించిన యెడల ప్రజలకు పీడ కలుగును. సప్తర్షులు ఉల్కలచే నభిహతులై గాని రూక్షవర్ణ యుతులై గాని ధూళితో గప్ప బడిన ప్రకాశము కలవారుగ గాని కనపడినచో జనులకును రాజులకును నాశము కల్గును. చంద్రుడు కృత్తికా నక్షత్రముతో గూడి ఈశాన్య దిక్కునుండి యుదయించిన యెడల నట్లు కనపడిన రాజకుమారులకు హానియు, రాజకుమార్తెలకు శుభమును కలుగును. చంద్రుడు ఉదక (ఉత్తర దిగ్గత) నక్షత్రములో నుండగా నతనికి నితర గ్రహ సమాగమము జరిగిన యెడల జనులకు శుభము: దక్షిణ నక్షత్ర సమాగమము కలిగిన యెడలి అశుభము కలుగును.

గ్రహ యుద్ధము — ఈ విషయమున రాహువు కేతువు కుజుడు శుక్రుడు చంద్రుడు ఈ అయిదుగురు యాయి (ముట్ట డిచేయు) గ్రహములన బడుదురు. బుధుడు బృహస్పతి శని రవి ఈ నలుగురును నాగరులు. వీరు తమ నగరమున నుండి ముట్టడిం

పబడువారు. యాయి గ్రహముచేత నాగరగ్రహము ఓడింప బడినచో అట్టి కాలమున యుద్ధ యాత్రచేయు ప్రభువులకు జయము కలుగును. అట్లుకాక నాగరగ్రహముచే యాయిగ్రహము జయింప బడినచో నట్టి నాగరగ్రహ సంబంధులగు రాజులు యాయి గ్రహ సంబంధి రాజుల నోడింతురు. లేదా నాగరుల చేతులలో రాజులు నాశన మందుదురు. అట్లే నాగర గ్రహము చేతిలో నాగర గ్రహము ఓడినచో ఆ దేశమండలి పౌరులు (నాగరులు) నాగరుల చేతిలోనే నాశమొందుదురు. యాయి గ్రహము చేతిలో యాయి గ్రహమోడినచో రాజుల చేతిలో రాజులకే నాశము కలుగును. ఈ విధముగ గ్రహములకు రాజులకు సామ్యము నిర్ణయించుకొని గ్రహ యుద్ధ విషయమున రాజులకు కలుగు శుభా శుభముల నిర్ణయించ వలయును. కాంతి హీనుడగుట కంపించుట పొగబారుట మొదలైనవి కలిగిన గ్రహము ఓడినట్లుగు నిర్ణయింపనగును. ఉత్తర మార్గమున సంచరించుట నున్ననై స్వచ్ఛమై నిర్మల కాంతి గలదై పెద్దరూపము గలదై మిగుల ప్రకాశవంతమై కనపడు గ్రహము గ్రహయుద్ధమున జయించునట్లు తెలియ వలెను. ఓ రాజేంద్రా! నేను నీకు తెల్పిన యీ కాల వినిశ్చయము మునులకు గూడ గుహ్యమైనది. దీనిని చపలునకు నాస్తికునకు నీచ స్వభావము గల వానికి తెలుపరాదు.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున గ్రహశుభాశుభ పరిజ్ఞానవర్ణనమను నెనుబదియైదవ అధ్యాయము.

## ఎనుబదిఆరవ అధ్యాయము - ప్రదేశపీడానిర్దేశము

వజ్ర ఉవాచ :

ప్రతిదేశం మహాభాగ! కథం ప్రాప్తముపద్రవమ్ ।
విజ్ఞాయతే ద్విజశ్రేష్ఠ! తన్మమాచక్ష్వ పృచ్ఛతః ॥ 1

మార్కండేయ ఉవాచ :

కృత్తికాం రోహిణీం సౌమ్యం మధ్యదేశస్య నిర్దిశేత్ । పీడితే త్రితయే తస్మిన్ మధ్యదేశః ప్రపీడ్యతే ॥ 2
ఆర్ద్రాం పునర్వసుం పుష్యం పూర్వదేశస్య నిర్దిశేత్ । పీడితే త్రితయే తస్మిన్ పూర్వదేశః ప్రపీడ్యతే ॥ 3
అశ్లేషాంచ మఘాం పూర్వాం చాగ్నేయ్యాం దిశి నిర్దిశేత్ ।
పీడితే త్రితయే తస్మిన్ ఆగ్నేయీ పీడ్యతేఽథ దిక్ ॥ 4
అర్యమ మథ హస్తంచ త్వాష్ట్రం స్యాద్దిశి దక్షిణే । పీడితే త్రితయే తస్మిన్ పీడ్యతే దక్షిణాచ దిక్ ॥ 5
స్వాతిం విశాఖాం మైత్రంచ నైరృత్యాం దిశి నిర్దిశేత్ ।
పీడితే త్రితయే తస్మిన్ పీడ్యతే నైరృతీ చ దిక్ ॥ 6
వాయవ్యాం దిశి నిర్దిష్టా వైశ్వ వైష్ణవవాసవాః । పీడితే త్రితయే తస్మిన్ వాయవీ పీడ్యతే చ దిక్ ॥ 7
వారుణం చాజ దైవత్యం చాహిర్బుధ్న్యం తథోత్తరే । పీడితే త్రితయే తస్మిన్ ఉత్తరా దిక్ ప్రపీడ్యతే ॥ 8
రేవతీ చాశ్వినీ యామ్య మైశానీ దిక్ ప్రపీడితా । పీడితే త్రితయే తస్మిన్ ఐశానీ దిక్ ప్రపీడ్యతే ॥ 9
ఆదిత్యో భృగుజో భౌమో రాహుస్సౌరో నిశాకరః ।
బుధో బృహస్పతి శ్చైవ ప్రాచ్యాదీశాః ప్రకీర్తితాః ॥ 10
విధ్వస్త వపుష స్తేతు గ్రహయుద్ధే పరాజితాః । నీలాః పితృగృహస్థాశ్చ స్వాం దిశం పీడయన్తితే ॥ 11
వజ్ర ఉవాచ :
స్వదేశపీడనం కుర్యా న్నక్షత్రః పీడితః కథం । సర్వమేత న్మమాచక్ష్వ సర్వ ధర్మ భృతాం వర ! 12

వజ్రుడు ప్రతి దేశము నుపద్రవమెందువలన పొందును? ఆదేశోపద్రవము తెలియుట యెట్లో యానతిమ్మన మార్కండేయుడిట్లనియె. కృత్తిక రోహిణి (సౌమ్యము) మృగశిర యనునవి మధ్యప్రదేశమునకు సంబంధించిన నక్షత్రములు. ఆ మూడింటికి పీడకలిగిన మధ్యదేశమునకు పీడకల్గును. అట్లే ఆర్ద్ర పునర్వసు పుష్యమియు తూర్పుదేశ నక్షత్రములు. వానికి పీడకలిగిన తూర్పుదేశమునకు పీడకలుగును. ఆశ్లేష మఘ పుబ్బ ఆగ్నేయీదిక్సంబంధములు. వానికి పీడకలిగిన ఆ ఆగ్నేయ దిక్కు పీడితమగును. ఉత్తర, హస్త, త్వాష్ట్రము దక్షిణ దిక్కునకు సంబంధించినవి. వీనికి పీడనకల్గినయెడల ఆదిక్కునకు పీడకల్గును. స్వాతి, విశాఖ, అనూరాధ నైరృతి దిక్కునకు సంబంధించినవి. ఇవి పీడితములైనచో ఆదిక్కునకు పీడకల్గును. జైష్ఠ (జేష్ఠ) వైష్ణవ (మూల) పూర్వాషాఢ (వాసవము) అనునవి వాయవ్య సంబంధులు. వీనికి పీడకల్గిన ఆ దిక్కు పీడితమగును. ఆజము ఆహిర్బుధ్న్యము వారుణము ఉత్తర దిక్సంబంధులు. వీనికి పీడకల్గిన ఆ దిక్కు పీడితమగును. రేవతి, అశ్విని, భరణి ఈశానదిక్సంబంధులు. వీనికి పీడకల్గిన ఆదిక్కునకు పీడకల్గును. సూర్యుడు శుక్రుడు కుజుడు రాహువు శని చంద్రుడు బుధుడు బృహస్పతి వరుసగా తూర్పు మొదలుగ గల 8 దిక్కులకధిపతులు. ఈ గ్రహములు శరీరధ్వంసము గ్రహయుద్ధమందు పరాజయము నీచస్థితి పితృ గృహమందుండుట అను వానికి లోనైనపుడు తమ తమ దిక్కులకు పీడ కలిగింతురు. వజ్రిందు నక్షత్రము పీడితమై తన దేశమునకు పీడాకరమగుట యెప్పుడెట్లు జరుగునో తెల్పుమన మార్కండేయుండిట్లనియె.

**మార్కండేయ ఉవాచ :**

శనైశ్చరారార్కా చారేణ వక్రేణాంగారకో గ్రహః । ఉపరాగేణ రాహుశ్చ కేతుశ్చాధూమనోదయైః ॥ 13
ఉదయాస్తమయాభ్యాంచ జీవశుక్ర శశాంకజాః । సంఛాదనేన చ శశీ హ్యగస్త్యశ్చైవ యోగతః ॥ 14

తథా యస్మింశ్చ నక్షత్రే దివ్య పార్థివ నాభసాః ।
దృశ్యన్తే తు మహోత్పాతాః స్వాందిశం సంప్రపీడయేత్ ॥ 15
దేశేషు సర్వేషు మయేరితం తే శుభాశుభం యాదవ ముఖ్యనాధ ! ।
అతః పరం ధర్మభృతాం వరిష్ఠ! వదస్వ! కింతే కథయామి రాజన్! ॥ 16

ఇది శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్ర సంవాదే
ప్రతిదేశ పీడావర్ణనం నామ షడశీతితమోఽధ్యాయః

శనిరవులు చారముచేతను కుజుడు వక్రించుటచేత గ్రహణములచే రాహువు ధూమనోదయము (పొగ క్రమ్ముట) లచే కేతువు, ఉదయాస్తమయములచే గురు శుక్రులు, బుధుడు యోగముచే, అగస్త్యుడు గప్పబడుటచే, చంద్రుడునేయేక్షత్రములందున్న నాయా దిశలందు దివ్యములు పార్థివము (భౌమములు) నాభసములు (ఆకాశమునకు సంబంధించినవి) అగు నుత్పాతములు గల్గును. వారు తమ దిశలకు పీడ కల్గింతురు. ఇంకేమి వినదలతు వడుగుము.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమ ఖండమున ప్రతిదేశ పీడా వర్ణనమను నెనుబది యారవ యధ్యాయము.

## ఎనుబదిఏడవ అధ్యాయము - ప్రతిపురుష శుభాశుభనిర్దేశము

వజ్ర ఉవాచ :

శుభాఽశుభ పరిజ్ఞానం భగవన్! పురుషం ప్రతి ।
త్వత్తోఽహం శ్రోతుమిచ్ఛామి తన్మమాచక్ష్వ పృచ్ఛతః ॥ 1

**మార్కండేయ ఉవాచ :**

జన్మాశ్రిత స్త్రిషష్ఠశ్చ సప్తమో దశమ స్తథా । ఏకాదశే శ్శశీయేషాం తదా తేషాం శుభం భవేత్ ॥ 2
జన్మ న్యథ చతుర్థే చ సాష్టమే దశమే తథా । ఏకాదశే బుధో యేషాం తేషామపి శుభం వదేత్ ॥ 3

ద్వి పంచమ గతో జీవ స్సప్తమో నవమ స్తథా । ఏకాదశ స్తథా హ్యేషాం తేషా మపి శుభం వదేత్ ॥ 4
షష్ఠ సప్తమ గ శ్శుక్రో దశమే నచశోభనః ।
ద్వాదశ శ్చ తథా హ్యేషాం తేషాం పీడాం వినిర్దిశేత్ ॥ 5
తృతీయే దశమే షష్ఠే తథాచై కాదశే శుభాః । సౌరార తీక్ష్ణ కిరణాః యేషాం తేషాం శుభం వదేత్ ॥ 6
యస్మిన్ హి జననం యస్య జన్మర్క్షం తస్య తత్ స్మృతమ్ ।
చతుర్థం మానసం తస్మా ద్దశమం కర్మ సంజ్ఞితమ్ ॥ 7
సంగాతకం షోడశం స్యా ద్వింశం స్యా త్సాముదాయికమ్ ।
వైనాశకం తు నక్షత్రం కర్మర్క్షం యత్త్రయోదశమ్ ॥ 8
షణ్ణక్ష త్రస్తు పురుష స్సర్వః ప్రోక్తో మహీపతే! । రాజా చ నవ నక్షత్రో నక్షత్ర త్రితయం శృణు ॥ 9
విత్య మభ్యధికం షడ్భ్యః పార్థివస్య నృపోత్తమ ! । దేశాభిషేక నక్షత్రౌ జాతి నక్షత్ర మేవచ ॥ 10
జాత్యాశ్రితాని వక్ష్యామి నక్షత్రాణి తవాఽనఘ! । పూర్వాత్రయ మథాగ్నేయ బ్రాహ్మణానాం ప్రకీర్తితమ్ ॥
ఉత్తరా త్రితయం పుష్యం క్షత్రియాణాం ప్రకీర్తితమ్ ।
పౌష్ణం మైత్రం తథా పిత్ర్యం ప్రాజాపత్యం విశాం స్మృతమ్ ॥ 12
ఆదిత్య మాశ్వినం హస్తః శూద్రాణా మభిచి త్తథా ।
సార్పం విశాఖా యామ్యంచ వైష్ణవంచ నరాధిప ! 13
ప్రతిలోమ భవానాంచ సర్వేషాం పరికీర్తితమ్ । ఈహాదే హ్యర్థహాని స్స్యా జ్జన్మర్క్షే చోపతాపితే ॥ 14
కర్మర్క్షే కర్మణాం హానిః పీడా మనసి మానసే ।
మూర్తి ద్రవిణ బంధూనాం హాని స్సాంఘాతికే హతే ॥ 15
సంతప్తే సాముదాయర్క్షే మిత్ర భృత్యార్థ సంక్షయః ।
వైనాశికే వినాశస్స్యా ద్దేహ ద్రవిణ సంపదామ్ ॥ 16
పీడితే చాభిషేకర్క్షే రాజ్యభ్రంశం వినిర్దిశేత్ । దేశర్క్షే పీడితే పీడాం దేశస్యచ పురస్య చ ॥ 17
పీడితే జాతి నక్షత్రే రాజ్ఞో వ్యాధిం వినిర్దిశేత్ ॥ 18
గ్రహర్క్ష జాతాం సమవాప్య పీడాం పూజాతు కార్యా విధి నా స్వకేన ।
తతశ్శుభం విందతి రాజసింహ! విధూత పాపః పురుష స్సదైవ ॥ 19

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
ప్రతి పురుష శుభాఽశుభ నిర్దేశోనామ సప్తాశీతితమోఽధ్యాయః

వజ్రుడిట్లడిగెను : దేవా ! నీ వలన ప్రతిపురుషునకు కలుగు శుభాశుభముల వినగోరుచున్నాను.

మార్కండేయుడనియె: జన్మలగ్నమందు మూడు ఆఱు సప్తమదశమ ఏకాదశ స్థానములందు చంద్రుడున్న శుభము కల్గును. జన్మ చతుర్థ అష్టమ దశమ ఏకాదశములందు బుధుడున్న శుభమగును. రెండు అయిదు సప్తమము తొమ్మిది పదునొకండు స్థానములందు గురుడున్నచో శుభమగును. ఆరింట సప్తమందు దశమ మందు శుక్రుడు శుభప్రదుడుగాదు. ద్వాదశమందున్నచో పీడకల్గించును. మూడుపది ఆరు పదునొక్కండు స్థానములందు శని అర=సూర్యులున్నచో శుభమునెప్పవలెను. ఏనక్షత్రమందు జననమగునో యదియా తనికి జన్మర్క్షమగును. దానికి నాల్గవది మానసము పదియవనక్షత్రము కర్మసంజ్ఞకము. పదునారవది సంగాతక మనబడును. ఇరువదియవది సాముదాయికము వైనాశకము పదమూడవది. ఆరవనక్షత్రము సర్వపురుషము తొమ్మిదవది రాజన

ఆకాశవర్ణం తమసః కేతో ర్ధూమ ప్రభం తథా ।

వజ్రుడు గ్రహములకు నక్షత్రములకు శాంతినిమిత్తముగ జేయనగు పూజావిధితెల్పుమన మార్కండేయుడనియె. మండలమునందు గ్రహమును అధిపతిగ్రహముతో ప్రతిష్ఠింపవలెను. నక్షత్రమును చంద్రునితో నధిపతి గ్రహముతోడునిలిపి పూజింపవలెను. నక్షత్రమొక్కొక్కదానియందుగల చుక్కలసంఖ్య తెలిపెదవినుము. రౌద్రము (ఆర్ద్ర) పుష్యమి త్వాష్ట్రము వాయవ్యము వారుణము పౌష్ణము నను నక్షత్రము లేకతారకములు. ఒక్కటే చుక్కగా నుండునవి). పూర్వఫల్గుని (పుబ్బ) ఉత్తరఫల్గుని పూర్వాభాద్ర ఉత్తరాభాద్ర ఆదిత్యము మూల ఐంద్రము ఆగ్నేయము ఆశ్వనము (అశ్విని) రెండుచుక్కలుగలవి. మూడుచుక్కగలవి భరణి సౌమ్యము ఐంద్రము బ్రాహ్మము వైష్ణవమునునవి. నాల్గుచుక్కలవి పూర్వాషాఢ ఉత్తరాషాఢ అనూరాధయును. అయిదుచుక్కలవి హస్తప్రాజాపత్యము వాసవము నునవి. ఆరుచుక్కలవి సార్పము (ఆశ్లేష) పిత్ర్యము ఆగ్నేయము. ఆదిత్యమండలము తామర పూవు రంగులోను చంద్రమండలము తెల్లరంగులోను కుజమండలము రక్తవర్ణములోను బుధగ్రహమండలము నీలివర్ణములో బృహస్పతిది పసుపుపచ్చగ శుక్రునిది తెల్లగ, శనిదినల్లగ, ఆకాశము రంగులో (నీలము) రాహువునకు కేతువునకు పొగరంగులో నేర్పరుపవలెను.

రక్తవర్ణం కృత్తికానాం, ఫల్గునీ ద్వితయస్య చ ॥ 10

హస్తస్య చ సపౌష్ణస్య, మైత్రస్య చ నరాధిప! । పీతం పుష్యస్య కేశస్య శాక్ర బాడబయో స్తథా ॥ 11

శ్వేతం సౌమ్యస్య రౌద్రస్య ఆప్య వారుణయో స్తథా । ఆదిత్య సార్ప పిత్ర్యాణాం బ్రాహ్మ వాయవ్యయో స్తథా ॥

ప్రోష్ఠ పాదద్వయ స్యాథ శ్వేత మేవాభిధీయతే । విచిత్ర వర్ణం త్వాష్ట్రస్య వై శ్వదేవస్య చాప్యథ ॥ 13

ఆశ్వినస్య తథాకార్యం నిత్యమేవ నరాధిప ! । కృష్ణం యామ్యస్య మూలస్య పాలాశం శ్రవణస్యచ ॥ 14

విశాఖాయాం పీతరక్తం కర్తవ్యం నృపమండలమ్ ॥ 15

యథోక్త వర్ణేన నరేంద్ర! కృత్వా పూర్వం గ్రహస్యానఘ! మండలం స్వం ।

ఋక్షస్య వాపూజ్య తమస్య రాజన్! పూజా విధేయా తదనంతరంచ ॥ 16

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే గ్రహర్క్షమండల నిర్దేశోనామ అష్టాశీతితమోధ్యాయః.

ఇకనక్షత్రపూజా విధానములో నక్షత్రమండల నిర్మాణముయొక్క రంగులు. కృత్తికలకు పూర్వఫల్గుని ఉత్తర ఫల్గునులకు హస్తకు పౌష్ణ మైత్రములకు రక్తవర్ణము, పుష్యమి కేశము శాక్రము బాడబములకు పసుపుపచ్చరంగు, సౌమ్యరౌద్ర ఆప్య వారుణములకు ఆదిత్య సార్ప పిత్ర్యములకు బ్రాహ్మ వాయవ్యములకు ప్రోష్ఠ పాదద్వయమునకు తెల్లరంగు చెప్పబడినది. త్వాష్ట్రము వైశ్వదేవము అశ్వినిలకు విచిత్ర వర్ణము వినియోగింప వలెను. యామ్యమునకు మూలకు కృష్ణ వర్ణము శ్రవణమునకు పాలాశవర్ణము విశాఖకు పసుపు ఎరుపు కలిసినరంగుతో నక్షత్ర పూజామండల మేర్పరుపవలెను. ఈచెప్పిన రంగులలో గ్రహనక్షత్ర మండలాలంకారము సేసి పూజగావింపవలెను.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తరమహాపురాణము ప్రథమఖండమున గ్రహనక్షత్రమండల నిర్దేశమను ఎనుబదెనిమిదవ యధ్యాయము.

# ఎనుబది తొమ్మిదవ అధ్యాయము - నక్షత్రస్నానము

**మార్కండేయ ఉవాచ :**

శకృన్మూత్రంతు సంగృహ్య శ్వేతస్య వృషభస్యచ । శ్వేతగోః పయసా సార్ధం స్నాతవ్యం కుశవారిణా ॥ 1
జన్మనక్షత్ర పీడాయాం తస్మాద్దోషా ద్విముచ్యతే । శిరీషచందనా శ్వత్థ తాటనాగాంబుభి ర్నరః ॥ 2
స్నాత శ్చేన్మానసే త స్తేతస్మా ద్దోషో విముచ్యతే । సిద్ధార్థకాన్ ప్రియంగుంచ శతపుష్పాం శతావరీమ్ ॥ 3
స్నాతవ్య మంభసి క్షిప్త్వా కర్మర్షే నృప! పీడితే । ప్రియంగు బిల్వ సిద్ధార్థ యవాశ్వత్థ సురాహ్వయాన్ ॥ 4
చందనోదక సంయుక్తే స్నానే సాంఘాతికే హృతే । సర్వగంధోదకై స్స్నానం తథా సిద్ధార్థకై శ్శుభైః ॥ 5
పీడితే సాముదాయర్షే పుంసాం కల్మష నాశనమ్ । వృష శృంగోద్ధృత మృదా తథా బిల్వోదకై శ్శుభైః ॥ 6
శతపుష్పా ససోమాహ్వైః స్నానం వైనాశికే భవేత్ ।పీడితే చాభిషేకర్షే సర్వ రత్నోదకై స్తథా ॥ 7
పీడితే దేశనక్షత్రే మృద్భి స్స్నానం విధీయతే । మృత్తికాశ్చ ప్రవక్ష్యామి గదత శ్శృణు మే నృప ! 8
నదీకూలద్వయా న్మధ్యాత్సంగమా త్సరస స్తటాత్ । అశ్వస్థానా ద్గజస్థానా ద్గోస్థానా ద్గిరి మస్తకాత్ ॥ 9
సర్పస్థానాత్సవల్మీకా ద్రాజస్థానా ద్వారాలయాత్ । గజ శృంగోద్ధృతాంచైవ వృషశృంగోద్ధృతాం తథా ॥ 10
సర్వబీజోదకస్నాతో జాతి నక్షత్ర పీడనే । ముచ్యతే కిల్బిషా ద్రాజన్! నాత్ర కార్యా విచారణా ॥ 11
ఇద మాపః ప్రవహతః స్నాన మంత్రాః ప్రకీర్తితాః ॥ 12
స్నాత స్తథైవం నృపచంద్ర! పశ్చాత్స్నానం ప్రకుర్వీత గ్రహోపదిష్టమ్ ।
పీడా కరస్యాథ తతస్తు కార్యం నక్షత్రయోగాభిహితం యథావత్ ॥ 13
పూజా గ్రహేంద్ర స్యనరేంద్రచంద్ర! పీడాకరస్యాథ తత స్తుకార్యా ।
తం పూజయే చ్చాప్యథ చంద్రయుక్తం తతస్స దోషాన్సకలాన్ జహాతి ॥ 14

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
నక్షత్ర స్నానం నామ ఏకోన నవతి తమోఽధ్యాయః

మార్కండేయుడనియె తెల్లావుపాలతో తెల్లయెద్దుపేడ మూత్రము గైకొని కుశోదకముతో స్నానముచేయవలెను. దీనివలన జన్మనక్షత్రపీడ శాంతించును. శిరీషము (దొద్దుగ) చందనము రావి తాట నాగోదకములచే స్నానము సేసిన మానసనక్షత్రపీడ తొలగును. ఆవాలు ప్రియంగువు శతపుష్ప శతావరి (పిల్లికదర) అనువానిని స్నానోదకములందుంచి స్నానముచేసిన కర్మనక్షత్ర పీడ పోవును. ప్రియంగు బిల్వము (మారేడు) సిద్ధార్థ (ఆవాలు) యవధాన్యము రావి సురయనువానితోగలిపి చందనోదకముతో స్నానముచేసిన సాంఘాతిక నక్షత్రశాంతియగును. సర్వగంధోదకములతో ఆవాలతో స్నానము చేయుటవలన సాముదాయక నక్షత్ర కల్మషము పోవును. ఎద్దుకొమ్ముచేత పెల్లగించిన మట్టితో బిల్వోదకములతో శతపుష్పా సోమలతలతో గలిపిచేసిన స్నానము వైనాశిక నక్షత్రశాంతి కూర్చును. అభిషేక నక్షత్రము పీడితమైనపుడు రాజు సర్వరత్నోదకముతో స్నానముచేయుట దోషశాంతికరము. దేశనక్షత్రపీడగల్గినపుడు మృత్తికాస్నానము శ్రేష్ఠము. మత్తికలలో విశేషమిదెతెల్పెదవినుము. నదీకూలములు రెండింటను నదీమధ్యమందును నదీసంగమమందును. సరస్సు తీరమునందు అశ్వగజగోస్థానములందు పర్వత శిఖరములందు పుట్టలతోనున్న సర్పస్థానమందు రాజస్థానమునందు ఆలయమునందుగల ఏనుగుఎద్దుదంతముతోపెల్లగించిన మృత్తికతో సర్వబీజోదక ములతో (నవధాన్యాలు కలిపిననీరు) స్నానముచేసిన జాతినక్షత్రపీడనుంచి ముక్తికల్గును. ఇందేమాత్రము నాలోచింపవలసినపనిలేదు.

స్నానమంత్రములు : "ఇదమాపః ప్రవహతః" అనుటతో నారంభమైనవి. వానితో తొలుత స్నానముసేసి ఆమీద గ్రహశాంతికి చెప్పినవి ఆమీద నక్షత్రయాగమునందు జెప్పిన విధానముతో యథావిధిగ స్నానముసేయవలెను. ఆమీద పీడాకరమైన గ్రహములకు చంద్రయుక్తముగ నక్షత్రదేవతలకు బూజసేయవలెను. దీనిచే సర్వదోషములును దొలుగును.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము నందు ప్రథమఖండమున నక్షత్రస్నానమను ఎనుబదితొమ్మిదవ అధ్యాయము

# తొంబదియవ అధ్యాయము - గ్రహనక్షత్ర పూజావిధి

వజ్ర ఉవాచ :

గ్రహాణాం భార్గవశ్రేష్ఠ! నక్షత్రాణాం తథైవచ ।
పూజావిధి మహం త్వత్తః శ్రోతు మిచ్ఛామి తత్త్వతః ॥ 1

మార్కండేయ ఉవాచ :

గ్రహం వాప్యథ నక్షత్రం యంపూజయితు మిచ్ఛతి ।
ఉపస్పృశ్య శుచిర్భూత్వా, కృత్వా తస్యాఽథ మండలమ్ ॥ 2
మండలే కల్పితం వాపి స్వయం దైవవిదా నృప! । పూజ్య స్నానేన విధి వ త్స్నాతః ప్రయత మానసః ॥
విధినో ప సమాదాయ ప్రయతో జాతవేదసమ్ । అథ వోప సమా దానే కృతే తత్ర పురోధసా ॥ 4
ప్రాక్ తంత్రేచ కృతే తత్ర చతుష్పాత్రే యథావిధి ।
మండలా త్పశ్చిమే భాగే ప్రాఙ్ముఖః ప్రయత శ్శుచిః ॥ 5
మండలస్యతు శౌచార్థం పంచ గవ్యం ప్రకల్పయేత్ ।
అభ్యుక్ష్య పంచగవ్యేన మండలం ప్రయత శ్శుచిః ॥ 6
అర్ఘ్యాది కల్పనాం కుర్యాత్ పాద్యాన్తాం తదనన్తరమ్ ।
జీవా దానం తతః కుర్యాజ్జీవస్యా వాహనం తతః ॥ 7
పూజ్యస్యావాహనం కుర్యాత్ తతోఽర్ఘ్యం వినివేదయేత్ ।
పాద్యం నివేదయే త్పశ్చా దాసనం చ నివేదయేత్ ॥ 8
దత్త్వైవాచమనీయం చ మధుపర్కం నివేదయేత్ ।
తతోఽనులేపనం దద్యాత్ తతో దద్యాద్విభూషణమ్ ॥ 9
తతో యజ్ఞోపవీతం చ తతః ప్రతిసరాన్ శుభాన్ ।
వస్త్రం తథా పతాకాం చ పుష్పం ధూపం తథైవ చ ॥ 10
దీపంచ దత్త్వా నైవేద్యం ముఖవాసం చ పార్థివ !
తతోఽగ్నిహవనం కుర్యా ద్యస్య యస్య యథా భవేత్ ॥ 11
కృత్వైవో త్తర తంత్రంచ దత్త్వాపూర్ణాహుతిం తతః ।
తదుక్తాం దక్షిణాం దత్త్వా మండలే ప్రతిపాదయేత్ ॥ 12
హోతు ర్వస్త్రయుగం దేయం గౌ స్సువర్ణం తథైవచ ।
గ్రాహ్యం కాలవిదా తచ్చ యద్దత్తం గ్రహమండలే ॥ 13

యథాశక్తి చ దాతవ్యా బ్రాహ్మణానాంచ దక్షిణా । విసర్జనం తతః కార్యం తతో బ్రాహ్మణ భోజనమ్ ॥ 14
భుక్తవత్సుచ విప్రేషు ప్రమార్ష్టి ర్మండలే భవేత్ । అర్ఘ్య పుష్పాదికం సర్వం జలే ప్రక్షిప్య పార్థివ! 15
అంబునా తర్పణం కార్యం పూజా స్యాత్తదనన్తరమ్ ॥ 16
పూజావిధిస్తే గదితోమయాద్య, సమాసతః పార్థివ సంఘముఖ్య! ।
అతఃపరం కిం కథయామి తుభ్యం తన్మే వదస్వాఖిల రాజసింహ! ॥ 17

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
గ్రహర్క్ష పూజా విధి వర్ణనంనామ నవతి తమోఽధ్యాయః

వజ్రుడు గ్రహములు నక్షత్రములయొక్కయు పూజావిధాన మానతిమ్మన మార్కండేయు డనియె. గ్రహమునుగాని నక్షత్రమునుగాని పూజింపనెంచినపుడు ఆచమనముసేసి శుచియై మండలముసేసి యందుతానుగాని దైవజ్ఞుడుగాని గ్రహనక్షత్ర ప్రతిమాకల్పనముసేసి యగ్నిప్రతిష్ఠసేయవలెను. లేదా పురోహితుడంతమున్న యగ్నియుపసాదనముసేసి పూర్వతంత్రము చక్షుష్పాత్ర ప్రయోగము యథావిధిగ ముగించియున్న యెడల మండలమునకు బడమటిదిశ తూర్పుమొగమైకూర్చుండి మండలమును శుచిగానొనర్చుటకు పంచగవ్యము నభ్యుక్షణము సేయవలెను (చల్లవలెనన్నమాట) అటుపై అర్ఘ్యపాద్యాదికల్పనము సేయవలెను. అవ్వల జీవా దానము (బలిపశువునుగొనివచ్చుట)దానియందుజీవావాహనము సేసి పూజింపనెంచిన గ్రహమునో పీఠముపైకావాహనముసేసి అర్ఘ్యము పాద్యము ఆసనము ఆచమనీయము మధుపర్కము అనులేపనము (గంధము) ఆభరణము, జందెము హారములు పూలమాలలు వస్త్రము పతాక పుష్పము దీపము నైవేద్యము తాంబూలము (ముఖవాసము) నను నుపచారములు నివేదించి యటుపై నగ్నిహవనము స్వకులానుసారముగ నిర్వర్తింపవలెను. ఉత్తరతంత్రముగూడ యిట్లొనరించి పూర్ణాహుతి నొసంగి యందుజెప్పబడిన దక్షిణ నొసంగి మండలమందుంచవలయును. హోతకు వస్త్రయుగ్మము గోవు సువర్ణము దానమీయవలెను. కాలజ్ఞుడు (జ్యోతిషికుడు) గ్రహమండల మందీయబడినపది తప్పక తీసికొనవలెను. అవుల యథాశక్తి బ్రాహ్మణులకు దక్షిణ నీయవలెను. అటుపై విసర్జనము (ఉద్వాసన) సేయవలెను. బ్రాహ్మణభోజనము పెట్టవలెను. విప్రభోజనమయిన తర్వాత నామండల ప్రమార్జన మొనరింపవలెను. అంచలి అర్ఘ్యజలము పుష్పలు మొదలగునవెల్ల జలములందు గలిపి యా జలముతో తర్పణము సేయవలెను. అటుపై పూజసేయనగును. ఓరాజోత్తమ గ్రహనక్షత్రపూజావిధిసంగ్రహపరచి నీకిదితెల్పితిని. ఇటుపై నేమితెల్పుమనది చెప్పుమనియె.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణమునందు ప్రథమ ఖండమున గ్రహనక్షత్ర పూజావిధియను తొంబదియవ యధ్యాయము.

## తొంబదియొకటవ అధ్యాయము - గ్రహనక్షత్ర స్నానవిధి

వజ్ర ఉవాచ :

గ్రహాణాం భార్గవ శ్రేష్ఠ! నక్షత్రాణాం పృథక్ పృథక్ ।
స్థానాని శ్రోతుమిచ్ఛామి తత్పీడా శకునా న్యహమ్ ॥ 1

మార్కండేయ ఉవాచ :

మంజిష్ఠాం మాతులుంగంచ కుంకుమం రక్తచందనమ్ ।
పూర్ణకుంభే కృతే తామ్రే సూర్యస్నానం విధీయతే ॥ 2
ఉశీరంచ శిరీషంచ పద్మకం చందనం తథా । శంఖే న్యస్తమిదం స్నానం చంద్ర దోష నివారణం ॥ 3
ఖదిరం దేవదారుం చ తిలా న్యామలకానిచ । పూర్ణ కుంభే కృతే రౌప్యే భౌమ పీడా వినాశనమ్ ॥ 4

నదీ సంగమతోయాని తన్మృదా సహితానిచ। న్యస్తాని కుంభే మాహీయే బుధ పీడావినాశనమ్॥ 5
గోరోచనం నాగమదం శతపుష్పా శతావరీ। విన్యస్య రాజతేకుంభే శుక్రపీడా నివారణమ్ ॥ 6
తిలాన్ మాషాన్ ప్రియం గుంచ గంధపత్రం తథైవచ। న్యస్తం కార్ష్ణాయసే కుంభే సౌరపీడ నివారణమ్ 7
గుగ్గులుం హింగులుం తాలం శుభాంచైవ మనశ్శిలామ్। శృంగే చ మాహిషే న్యస్తం రాహూ పీడా వినాశనమ్ 8
వరహ నిర్హృతాం రాజన్। పర్వతా గ్రమృదం తథా। ఛాగం క్షీరం ఖడ్గపాత్రే కేతుపీడా వినాశనమ్॥ 9

వజ్రుడు గ్రహములకు నక్షత్రములకు వానివాని పీడాశమనమునకై వేర్వేర సేయనగు స్నానములను గూర్చి వినవలెనన మార్కండేయుడనియె. మంజిష్ఠ (ఒక సుగంధద్రవ్యము) మాతులుంగము కుంకుమపువ్వు రక్తచందనముగలిపి తామ్రపూర్ణకుంభమునందుంచిన యుదకముతో సూర్యగ్రహమునకు స్నానము విధింపబడినది. ఉశీరము (వట్టివేరు) శిరీషము (దిరిసెన) పద్మకము చందనము ననువానితో శంఖమందలి యుదకముచే చంద్రునికిజెప్పబడినది. చంద్రగ్రహదోషనివారణమన్నమాట. ఖదిరము చంద్రు దేవదారు తిలలు ఆమలకములు (ఉసిరికాయలు) వెండిపూర్ణకుంభమునందుంచిన యుదకముచే స్నానము కుజగ్రహ పీడానివారకము. నదీసంగమ తీర్థజలమును అందలిమృత్తుతోగూడ మట్టికుంభమందుంచి చేయించుస్నానము బుధగ్రహపీడాహారము. గోరోచనము నాగమదము శతపుష్ప శతావరి పిల్లిపీచర వెండిబిందెలో నీళ్లలోనుంచి యుంచినస్నానము శుక్రగ్రహపీడా నివారకము. తిలలు మినుములు ప్రియంగువుగంధపత్రము నల్ల యినుపబిందెలోనుంచిన నీళ్లతోడి స్నానము శని పీడాహారము. గుగ్గులు హింగులము (ఇంగువ) తాళము = మనశ్శిల ననునవి గేదెకొమ్ములో నుంచిన నీటితో స్నానము రాహుగ్రహ పీడానాశనము. పంది చేతయబడి పర్వతాగ్రమందలి మృత్తుమేకపాలు ఖడ్గమృగము శృంగమందు (కొమ్మనందు) ఉంచిన నీటితో స్నానము చేసిన కేతుగ్రహపీడ నివారించును.

గ్రహస్నానమిదం ప్రోక్తమృక్షస్నానమత శ్శృణు। యేన సమ్యక్ ప్రయుక్తేన ముచ్యతే కిల్బిషాన్నరః 10
వటాశ్వత్థ శిరీషాణాం పత్రాణితు తిలైస్సహ। సర్వగంధోప పన్నాని కృత్తికాసు విధీయతే॥ 11
సర్వబీజోదకస్నానం రోహిణీషు ప్రశస్యతే । సర్వరత్నోదక స్నానం మృగశీర్షే విధీయతే॥ 12
వచా చ గంధా కాంతాభిః స్నానం రౌద్రే ప్రకీర్తితమ్। గోష్ఠ మృద్గోమయ స్నాన మాదిత్యే పాపనాశనమ్॥ 13
సర్వౌషధ్యః పంచగవ్యం తథా గౌరాశ్చ శాలయః। సిద్ధార్థకా స్సర్వగంధా స్తిష్య స్నానే శుభప్రదాః॥ 14
వల్మీకాగ్రమృదా స్నానం తథా సార్పే శుభప్రదమ్। సతిలం దేవ నిర్మాల్యం స్నాన శస్తం మఘాసుచ॥ 15
ఫల్గునీషు పూర్వాసు శాద్వలం లవణం ఘృతమ్। ఉత్తరాసు తథా స్నానం శిమ్బిముస్తాప్రియంగుభిః 16
హస్తేస్నానం ప్రశంసన్తి పర్వతాగ్రసరో మృదా। చిత్రాసు దేవనిర్మాల్యం స్వాతౌ పుష్పైర్జలోద్భవైః॥ 17
విశాఖాసు ప్రశంసన్తి రౌద్రచందన పద్మకైః। నదీకూల ద్వయాన్మృద్భి ర్మైత్రే స్నానం ప్రకీర్తితమ్॥ 18
జ్యేష్ఠోదకేన జ్యేష్ఠాసు సువర్ణ సహితం హితమ్ । సర్వమూల జలైః స్నానమాప్యే ముక్తాఫలోదకైః॥ 19
వైశ్వదేవే ప్రశంసన్తి పద్మకోశీర చందనైః। సర్వౌషధై శ్చాభిజితి శ్రవణే సంగమోదకైః॥ 20
నదీ వాపీ జలయుతై ద్వారుణే తు ప్రశస్యతే। ఆజే శ్రీ వాసకం స్నానం కాంతా పురుహితం హితమ్॥ 21
అహిర్బుధ్న్యే తథా స్నానం పద్మకోశీర చందనైః । కుంకుమాగురు కర్పూరైః సహితం పాపనాశనం ।
దర్భై ర్మూలయుతైః పౌష్ణే హరిద్రాద్వయ చందనైః ॥ 22
నాగాశ్వగంధా మదవన్తికా చ క్షౌద్రాన్వితా చాశ్వినికే ప్రదిష్టా ।
సురాహ్వకాష్ఠం రజని ద్వయంచ స్నానంవచాభిస్సహితంచయామ్యమ్ ॥ 23

ఇతి శ్రీ విష్ణు ధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
గ్రహనక్షత్ర స్నానవిధి వర్ణనం నామ ఏకనవతి తమోఽధ్యాయః

ఇటుపై నక్షత్రస్నానవిధి వినుము. దీనివలన నరుడు సర్వకిల్బిషములందలంగును. కృత్తికా నక్షత్రములందు స్నానమునకు మఱ్ఱి రావి దిరిసెనాకులు తిలలతో గలిపి సర్వగంధ సహితమైన ఉదకముచే స్నానము విహితము. రోహిణియందు సర్వబీజోదకస్నానము తగును (బీజములనగానిక్కడ నవధాన్యాలన్నమాట) మృగశిరయందు సర్వరత్నోదకము ఆర్ద్రకు వచ (వస) గంధ = గోష్ఠమృత్తు ( ) (గోమయము) తోడి స్నానము అదిత్యనక్షత్రము పునర్వసువునకు, మంగళాగురు, కాంత = తెల్లగరిక యనువానితో స్నానము, (పుష్యమికి) సర్వౌషధులు పంచ గవ్యము తెల్లవడ్లు (శాలిధాన్యము) తెల్లఆవాలు సర్వగంధములు శుభములు. తిష్యస్నానమునకు పుట్టమన్నుతో స్నానమాశ్లేషకు మఘకు తిలలతోడి దేవనిర్మాల్యస్నానము, పూర్వఫల్గునికి పచ్చగడ్డి (శాద్వలము) ఉప్పునెయ్యి, ఉత్తరఫల్గుని, (ఉత్తరకు) శింబి = తంబతీగ ముస్త = తుంగముస్తలు ప్రియంగువులతోడిది స్నానము. హస్తకుపర్వతాగ్రమందున్న సరస్సులోని మట్టినీటితో స్నానము, చిత్రకు దేవనిర్మాల్యము, స్వాతికి, జలములందు పుట్టిన పువ్వులు, విశాఖకురౌద్ర = చందన పద్మకోదకములు, అనూరాధకు నదియిరుగట్టుల మన్నుతోడి నీరు, జ్యేష్ఠకు సువర్ణసహితజ్యేష్ఠోదకము = అరటి ఆకులోని, నీరు మూలకుసువర్ణసహితజలములు ఆప్యమునకు = అబ్దేవతాకమైన పూర్వాషాఢకు ముత్యాలనీరు. వైశ్వదేవమునకు (ఉత్తరాషాఢకు) పద్మకము = చంగల్వకోష్ఠ ఉశీనరము = వట్టివేరు చందనముగలిపిననీరు, అభిజిత్తునకు సర్వౌషధీజలములు శ్రవణమునకు నదీసంగమోద కము, వరుణదేవతాకమయిన శతభిషకు నదీవాపీజలము, అజదేవతాకవయిన పూర్వాభాద్రమునకు శ్రీవాసకము = సరళదేవదారు కాంతా = తెల్లగరికలు, పురుహూతము (పురువనంతము) కొడిసి పాలతోడి ఉదకమును ఆహిర్బుధ్న్యము = ఉత్తరాభాద్రకు-చెంగల్వకోష్ఠ వట్టివేరు కుంకుమ పువ్వు చందనము, అగరు పచ్చకర్పూరము తోడి స్నానము, పూషదేవతాకమగు రేవతికి దర్భమూలములతోడి పసపు మ్రానిపసవు చందనము కలిపిననీరు, అశ్వనికి నాగ = నాగగన్నేరు, పొన్నేరు, మదవంతిక = మల్లి క్షేద్ర = తేనెయు కలిపిననీరు. యామ్యమందు = యమదేవతాకనక్షత్రమగు భరణియందు సురాహ్వాకాష్ఠము = దేవదారు. రంనీద్వయం = మ్రాని పసుపు కస్తూరి పసుపుపసకలిపిననీటితో స్నానము శుభప్రదము శాంతికరము.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణమందు ప్రథమఖండమున
గ్రహనక్షత్రస్నాన విధియను తొంబదియొకటవ అధ్యాయము

## తొంబదిరెండవ అధ్యాయము - అగ్నికార్య ప్రాక్తంత్రోత్తర తంత్రవిధి

వజ్ర ఉవాచ :

ప్రాక్తంత్రోత్తర తంత్రౌ ద్వౌ సర్వేషామగ్ని కర్మణామ్ ।
త్వత్తోఽహం శ్రోతుమిచ్ఛామి సర్వధర్మ భృతాం వర! ॥ 1

మార్కండేయ ఉవాచ :

ఉద్ధృత్యోర్వీం మయీం శుద్ధే దేశే వేదిం చ కారయేత్ ।
ప్రాగుదక్ప్రవణాం శుద్ధా మాయామా త్పదసప్తకమ్ ॥ 2
పూర్వభాగే చ విజ్ఞేయా విస్తరా త్పద పంచకమ్ ।
పశ్చిమే చ తథా భాగే విస్తరా త్స్యా చ్చతుష్టయమ్ ॥ 3
ఆగార దేశే చ తథా విస్తృతా సా పదత్రయమ్ । పూర్వభాగా దతిక్రమ్య పశ్చా త్పద చతుష్టయమ్ ॥ 4
యామ్యే నోత్తరత శ్చైవ విజ్ఞేయంతు పదం పదమ్ ।
ఆగారా త్పశ్చిమే భాగే వేదీ జ్ఞేయా పదద్వయమ్ ॥ 5

వేది మేవం విధాం కృత్వా స్నాత్వాచమ్య ప్రయత్నతః ।
సౌవర్ణాన్ రాజతాన్ తామ్రాన్ అథవాఽపి మహీమయాన్ ॥ 6
సూత్రార్ఘ్యై ర్మాల్యై ర్గంధై శ్చ స ఫలైః పల్లవైర్యుతాన్ ।
పూర్ణోద కుంభాంశ్చతురో విదిక్షు సుదృఢం న్యసేత్ ॥ 7

వజ్రునృపతి అగ్నికార్యములందు ప్రాక్తంత్రము ఉత్తర తంత్రము నను రెండు విధానములంగూర్చి మీవలన వినగోరు దునన మార్కండేయుడిట్లనియె. శుచిప్రదేశమందు. భూమిని ఉద్ధరించి (త్రవ్వి) వేదినిగావింపవలెను. ఆవేది తూర్పు ఉత్తరదిశల వైపు వాటముగల్గి యేడడుగులు పొడవుండవలెను. పూర్వభాగమందు ఐదడుగులు వైశాల్యము గలదిగను పడమటి భాగనందు నాల్గడుగులు నుండవలెను. అగ్న్యగారప్రదేశమందు (అగ్నిహోత్రగృహమందు) ఆవేది మూడడుగుల వైశాల్యము గల్గియుండవలెను. పూర్వభాగమును దాటిన తర్వాతనాల్గడుగులుండవలెను. దక్షిణమునకు ఉత్తరమునకు అడుగడుగుండవలెను. అగ్నిశాలకు పడమటి భాగమందు వేది రెండడుగులుండవలెను. ఇట్లు వేది నేర్పరచి స్నానముసేసి ఆచమనముచేసి, బంగారము వెండి రాగి లేక మృణ్మయము లైన నాల్గు పూర్ణకుంభములను నాల్గుమూలలందు కదలకుండ నుంచవలెను.

వేద్యా ముల్లిఖనం కార్య మైంద్రీభి ర్నృపసత్తమ! ।
ఉదుంబరస్య శాఖాభిః ప్రాగగ్రాభి స్సమంతతః ॥ 8
శుష్కేంధన సమృద్ధస్తు తతఃకార్యోహుతాశనః । న ధమే త్తాలవృంతేనన శూర్పేణ న వాససా ॥ 9
ముఖేనో పధమే దగ్నిం ముఖా దగ్ని రజాయత । పరి సమూహ్యా పర్యుక్ష్య పరిషిచ్య పరి స్తరేత్ ॥ 10
హుతాశనం బోధయిత్వా భూయ శ్చావాహయే ద్బుధః ।
వక్ష్యామి బోధనే మంత్రం తథా చా వాహనే నృప ! ॥ 11

ఆమీద వేదికయందు ఇంద్రదేవతాకమంత్రములతో-మేడికొమ్మలు (మండలు) ప్రాగగ్రములయినవానితో (తూర్పుకొనలు గలవానిని జేకొని) ఉల్లేఖనము చేయవలెను. ఆమీద నగ్నినెండిన సమిధలచే ప్రజ్వలింపజేయవలెను. తాటాకు విసనకఱ్ఱతోగాని చేటతో గాని వస్త్రముతోగాని అగ్నిని విసరరాదు. విరాటపురుషుని ముఖమునుండి అగ్ని జనించినది గావున ముఖముతోనే అగ్నిని ధమని (గొట్టము) ద్వారా ఊద ప్రజ్వలింప జేయవలెను. పరిసమూహన-పర్యుక్షణ పరిషేచనములు చుట్టుమంత్రముతో అగ్నిని పరిస్తరింపవలెను. అగ్నిని ఉద్బోధింపజేసి యప్పుల నావాహనము సేయవలెను. బోధనమునందు నావాహనమునందు ప్రయోగింపదగు మంత్ర మిదె దెల్పుచున్నాను.

ఉద్బుధ్యాగ్నే బోధయన్తి దేవతాస్తా స్సవాసవాః ।
బ్రహ్మా విష్ణుశ్చ రుద్రశ్చ స్కన్దో వై శ్రవణో యమః ॥ 12
వరుణో వాయు రాకాశం చంద్రాదిత్యౌ ప్రభాకరౌ ।
ఋషయశ్చ మహాభాగా స్త్రైలోక్యామల దర్శనాః ॥ 13
వేదాశ్చ వేదమాతా చ సావిత్రీ పాపనాశినీ । ఓషధ్యోఽథ వషట్కారో మంత్రాశ్చ వివిధా స్తథా ॥ 14
కాలస్యావయవా స్సర్వే దిశశ్చ విదిశ స్తథా । ఉద్బుధ్య యజమానస్య సర్వాన్ కామాన్ ప్రయచ్ఛవై ॥
(ఓం) ఆవాహయా మ్యహం దేవం దేవదేవం హుతాశనమ్ ।
జగతోఽస్య సముత్పత్తి స్థితి సంహారకారకమ్ ॥ 16
వేదమూర్తిం తదాధారం సర్వదేవముఖం విభుమ్ । పింగేక్షణం పింగజటం ధూమకేతుం విభావసుం ॥ 17
శుక యాన గమం దేవం సర్వాభరణ భూషితమ్ । సర్వగం వరదం భానుం జఠరస్థంచ దేహినామ్ ॥ 18

తేజోమూర్తిం దురాధర్షం స ప్తజిహ్వం మహాబలమ్ ।
సప్తార్చిషం సప్తర్షికం సమిత్స ప్తక మచ్యుతమ్ ॥
విష్ణోరంశ మనిర్దేశ్యం భావనం జాత వేదసమ్ । పావనం పుష్టిదం సౌమ్యం భ క్తానాం భూతి వర్ధనమ్ ॥ 20
తద్దత్త మాహుతి గణం సంప్రతీచ్ఛ జగద్గురో! । తేన భావయ! దేవేశ! యథాఽహం దేవతా గణాన్ ॥ 21
యాజకం యజమానంచ పుష్ట్యా విభజ! సర్వశః ।
ఇద మర్ఘ్య మిదం పాద్యం ధూపం దీపం ప్రగృహ్యతామ్ ॥ 22

అగ్నీ! మేల్కొనుము. ఇంద్రాది దేవతలు బ్రహ్మవిష్ణురుద్రులు స్కందుడు దిక్పాలురు సూర్యాది నవగ్రహదేవతలు కాలావయవ దేవతలు దిక్కులు విదిక్కులు (మూలలు) నిన్ను మేల్కొల్పుచున్నారు. మేల్కొని యజమానుని సర్వకామములు నిమ్ము. దేవుని దేవదేవుని నిన్నాహ్వానించున్నాము. నీవు సృష్టి స్థితి లయకారకుడవు వేదమూర్తివి వేదాధారుడవు సర్వదేవతల ముఖమయినవాడవు. తేనెరంగకన్నులు జడలు కలవాడవు ధూమకేతువవు విభావసువవు. చిలుక వాహనమున నేగువాడవు సర్వాభరణుడవు సర్వవ్యాపకుడవు.జఠరాగ్ని గానున్న వాడవు. తేజోమూర్తివి.

ఏవమావాహనం కృత్వా పాద్యార్ఘ్యం వినివేదయేత్ ।
వేద్యా మేవ న తౌ దేయావహ్నౌ యదుకులోద్వహ! ॥ 23
గంధ పుష్పాదికం దేయం సకలం జాతవేదసి । ధూపం దీపం సనై వేద్యం వేద్యామేవ నివేదయేత్ ॥ 24

ఇట్లు బౌధదాహ్వానములుసేసి పాద్యము నర్ఘ్యము నీయవలెను. వేదిలో నగ్నిలో నీపాద్యార్ఘ్యము లీయరాదు. గంధ పుష్పాదులు ధూపము దీపము నైవేద్యము వేదియందే నివేదింపవలెను.

తత స్తు ప్ర స్తరే ద్వేదిమక్షతాగ్రైః కుశైర్ద్విజ! ।
ఉపమూలా దధోలూనైః ప్రాగగ్రైః ప్రయత శ్శుచిః ॥ 25
పూర్వేచ ప్రాగ్దక్షిణతః పశ్చాచ్చైవా ప సవ్యతః ।
ఉ త్తరేణ తతఃకుర్యాత్ ప్ర స్తరస్య సమాపనమ్ ॥ 26
మూలచ్ఛిన్నంతు దాతవ్యం ప్ర స్తరే భూభృతాం వర! ఓషధ్యః ఫలవ న్త్యశ్చ పర్వవత్య స్తథైవచ ॥ 27
దర్భాభావే ప్రశంస న్తి త్రిస స్తత్ర చ వర్జయేత్ । రాజసీర వరూకం చ పరిబాధ మథోత్కటమ్ ॥ 28
విష్ణు ర్మనసా పూతే స్తో మంత్రేణానేన సువ్రత! ।
దార్భ్యం పవిత్ర ముత్సృజ్య తాభ్యాం చ తదన న్తరమ్ ॥ 29
దేవోవ ఇత్యథై తేన ఉత్పూయ ముదకం శుచి । స్రుక్స్రువా వథ పాలాశౌ శమీన్యగ్రోధ సంభవౌ ॥ 30
ఉదుంబర మయౌ తామ్రే రూప్య రుక్మమయౌ తథా । ఆజ్యస్థాలీ చ క ర్తవ్యా తైజస ద్రవ్య సంభవా ॥ 31
మాహేయీ వాపి భూపాల! నిత్యం సర్వాగ్ని కర్మసు ।
హ స్తమాత్రః స్రువః కార్యస్రువ బాహుసమం తథా ॥ 32
అంగుష్ఠ మధ్య ప్రతిమం హోమస్థానం స్రువస్యతు ।
ఆజ్యస్థాల్యాః పయోత్పూతం పంచానా మితి పంచ మ్ ॥ 33
ఆజ్యస్థాల్యాః ప్రమాణంతు యథాకామంతు కారయేత్ ।
గ్రామం పృశ్చాపయోపీతి మంత్రేణాజ్యం నరాధిప ! ఆజ్యస్థాల్యాః పయోత్పూతం పంచానా మితి పంచకమ్ ॥
పతన్ గృహ్ణీత! ధరాజేంద్ర! అర్ణేత్యగ్నా వధిశ్రయేత్ । ఆజ్యస్యాథ పవిత్రేణ కార్యముత్ప్లవనం ద్విజ ! 35

అగ్నిర్జిహ్వేతి సతతం హవి రస్యుత్పవ నాన్తరం । అక్షీణన్తు న కర్తవ్యం సతతం పార్థివోత్తమ ! 36
శుభాభ్యాం స్రుక్ స్రువౌ రాజన్! ప్రత్యుష్టమితి భావయ! పవిత్రస్యాగ్ర దర్భేణ ఆయురిత్యేవ మానద ! 37
ప్రతిమార్ష్టి స్రువం పశ్చా చ్చక్షురిత్యేవ పార్థివ! ।
ప్రతిమార్ష్టి స్రువం తాంశ్చదర్భాన్ వహ్నౌ వధోత్సృజేత్ ॥ 38
దర్భోత్సర్గే పఠేన్మంత్ర మిమం పార్థివ సత్తమ! । దివి శిల్పమవతతం పృథివ్యాః కకుభిశ్శ్రితమ్ ॥ 39
తేన సహస్రకాండేన ద్విషన్తం తాపయామసి । ద్విషన్త స్తప్యతాం చోక్త్వా క్షిపేద్దర్భాన్ హుతాశనే ॥ 40
ఇధ్మ ద్వయం తతో దేయం యాజ్ఞియ ద్రుమ సంభవమ్ ।
పలాశః ఖదిరో బిల్వః శమ్యశ్వత్థవటా స్తథా ॥ 41
ఉదుంబర మపామార్గః ఫల్గుశ్చ క్రముక స్తథా । చందనం దేవదారుశ్చ ద్రుమా ద్వాదశ యాజ్ఞియాః ॥ 42
చతుర్గృహీతం విన్యస్య స్రుచి పూర్వం విచక్షణః । ఇధ్మద్వయే ప్రజ్వలితే సౌమ్యభాగే నరాధిప! ॥ 43
ప్రజానాంపతయే త్వాదా వాహుతిం మనసాన్యసేత్ । చతుర్గృహీతే మృద్ధేతి దేయా దక్షిణతో భవేత్ ॥ 44
యుక్తః పరస్తా దిత్యాది పంచకం జుహుయా త్తతః । సన్తతీశ్చ జయాద్యాస్తా స్తథా రాష్ట్రభృతో నృప! 45
వార్త్రఘ్నౌ చాజ్యభాగౌచ దాతవ్యౌ పార్థివోత్తమ । అథౌదుంబర పత్రాణాం వేదౌ దక్షిణతో నృప! 46
సంచయే పద్మపత్రాణా మథవాపి మహీపతే । ఆవాహనం తు కర్తవ్యం దేవస్య పరమేష్ఠినః ॥ 47
ఆవాహ యామ్యహం దేవం బ్రహ్మాణం పరమేష్ఠినం । జగతోఽస్య సముత్పత్తిస్థితిసంహారకారకమ్ ॥ 48
చతుర్వేదం చతుర్వక్త్రం చాతుర్వర్ణ్యప్రభుం ప్రభుమ్ । చతురాశ్రమ గోప్తారం వరదం భూతభావనమ్ ॥ 49
పద్మయోనిం జగద్యోనిం యజ్ఞయోనిం జగత్పతిమ్ ।
ఆత్మయోని మనా ధృష్యం యజ్ఞవాహం జగత్పతిమ్ ॥ 50
యజ్ఞేశం యజ్ఞమూర్తించ త్రైలోక్యస్యైక కారణమ్ ।
సర్వగం వరదం సౌమ్యం పరమం పరమేశ్వరమ్ ॥ 51
భూత భవ్య భవం నాథం యోగజ్ఞేయం సనాతనమ్ ।
ఆగచ్ఛ భగవన్! బ్రహ్మన్! యజమానస్య వృద్ధయే ॥ 52
ఇద మర్ఘ్య మిదం పాద్యం ధూపం చేదం ప్రగృహ్యతామ్ ।
బ్రహ్మ లింగాం స్తతో మంత్రాన్ జపే ద్భక్త్యా సమాహితః ॥ 53
అపోహిష్ఠేతి మంత్రేణ బ్రహ్మణేఽర్ఘ్యం నివేదయేత్ ।
శన్నో దేవీతి పాద్యంచ ప్రయత స్సుసమాహితః ॥ 54
హిరణ్య గర్భేతి తథా దద్యాదాచమనం బుధః । ధ్రువా ద్యౌరితి మంత్రేణ హ్యాసనం వినివేదయేత్ ॥ 55
గంధం పుష్పమలంకారం వస్త్రం ధూపం సదీపకమ్ । నైవేద్యం చ తథా దేయం సావిత్రేణ నరాధిప! 56
ప్రాక్తన్త్రమేత దుక్తంతే తే మయా సర్వాగ్ని కర్మసు ।
పాక్తన్త్రేతు కృతే కార్యం హోమ మన్త్ర మయాసకమ్ ॥ 57
ఏవం కార్యం మహీనాథ! సర్వేష్వేవాగ్ని కర్మసు । 58
హోమస్య విహితస్యాన్తే తన్త్రం కార్య మథోత్తరమ్ ।

పిమ్మట భిన్నముగు అగ్రములుకానిదియు, మొదట కోయబడిన దర్భలతో వేదిచుట్టు తూర్పు, దక్షిణము, పడమర, ఉత్తరసమాప్తిగ ప్రస్తరణములు వేయవలెను. దర్భలు దొరకనపుడు ఫలవంతములగు ఓషధులను వేయవచ్చును. అందు

మూడు మూలికలు మాత్రము పనికిరావు (1) రాజసీరపరూకము పరిబాధను ఉత్కటము = సీటిరెట్లు "విష్ణుర్మనసా, పూతేస్థో" అను రెండు మంత్రములచే దర్భలతో జేసిన పవిత్రము విడిచి దేవోవ అను నీమంత్రముతో శుచియైన యుదకమును ఉత్పకనము గావింపవలెను. అటుపై పాలాశ పత్రముతో మోదుగాకులతో జేసిన వేనజమ్మికర్ర మట్టికర్రతో మేడికర్ర-రాగి వెండి బంగారముతో జేసిన స్రుక్స్రువములను గ్రహింబ వలెను. అజ్యస్థాలి తైజనములయిన ద్రవ్యములతో దయారు చేయబడవలెను. తైజసములు = వెండి బంగారము లేదా అగ్నికార్యములందన్నిటను మాహేయి = మట్టిపాత్ర ప్రశస్తము. స్రువము హస్తమాత్రముగా నుండవలెను. మూరెడు పొడవు వుండవలెనన్నమాట. స్రుపము బారెడుండవలె. స్రువముయొక్క లోతు బొటన వ్రేలు మధ్యమంత ధృపము గుంటయందు పరిచానా అని మంత్రముతో నైదుపార్లు ఆజ్యమించి గ్రహింతురు. (ఉత్మూతమువడినపాలు) ఆజ్యఅని మంత్రముతో కాచవలెను.

పసిత్రముతో నేతినుత్పవింపవలెను . ఆ ఉత్పవనమందు "అగ్నిర్జిహ్వా" అను మంత్రములో నది క్షీణము కానట్లు చేయవలెను. శుభాభ్యామను మంత్రముతోను ప్రత్యుష్టమనియు స్రుక్స్రువములు భావనచేయవలెను. పవిత్రముయొక్క మీదిదర్భతో అయురని మంత్రముతో స్రువమును దుడువవలెను. ఆపైని చ!క్షురను మంత్రముతో స్రువమును దుడిచి యారెండు దర్భలను నగ్నియందు వేయవలెను.

అటుపై రెండు ఇధ్మములను యజ్ఞియ వృక్షములతో జేసినవానిని అగ్నికి సమర్పింపవలెను. యజ్ఞియ వృక్షములు (యజ్ఞమున నుపయోగింపదగినవి) పండ్రెండు 1. పలాశము = మోదుగ 2. ఖదిరము = చండ్ర 3. బిల్వము = మారేడు 4. శమీ = జమ్మి 5. అశ్వత్థము = రావి 6. వటము = మఱ్ఱి 7. ఉదుంబరము = మేడి 8. అపామార్గః = ఉత్తరేణు 9. ఫల్గువు = 10. క్రమకము = పోక 11. చందనము = మంచిగంధము 12. దేవదారువు. తొలుత స్రుక్కునందు నాల్గుసారులు గ్రహించిన హవిస్సును ప్రజ్వలితమయిన (అంటుకొన్న) ఇధ్మమధ్యమందు సౌమ్యభాగమందు ఉత్తరమందు తొలియాహుతి మనస్సుతో (మౌనంతో) ప్రజాపతికీయవలెను. చతుర్గృహీతమును "మ్మూర్ధా" అను మంత్రాముతో దక్షిణము వైపున నీయనగును. "యుక్తః పరస్తాత్" ఇత్యాది మంత్రములతో నైదాహుతులీయవలెను. సంతతులను జయాదులను రాష్ట్రభృక్తుతుల వార్త్రిమ్నుము లను మంత్రములతో రెండాజ్య భాగములను వరుసగా నీయవలెను. ఆ పైని వేదియందు దక్షిణ దిశని మేడియాకుల ప్రోగుమీద లేదా తామరాకులమీద పరమేష్ఠియొక్క (బ్రహ్మ) ఆవాహనము గావింపవలెను.

బ్రహ్మదేవానాం అను మంత్రములయిదింటిలో ఇదిగో అర్ఘ్యము ఇదే పాద్యము గ్రహింపుమని బ్రహ్మలింగమంత్రములను జపించవలెను. "ఆపోహిష్ఠా" అను మంత్రముతో బ్రహ్మ కర్ఘ్యమును "శంనోదేవీ" అని పాద్యమును "హిరణ్యగర్భ"అను మంత్రముతో నాచమనము "ధ్రువాద్యౌరమ" మంత్రముతో ఆసనము సావిత్రమంత్రముతో గంధ పుష్పాలంకార వస్త్ర ధూప దేప నైవేద్యములీయవలెను। ఇది ప్రాక్తంత్రము. నీకు తెల్పితినిక నుత్తర తంత్రమును వినుము.

ప్రాక్తంత్రమయిన తర్వాత "అయాశ్చాగ్నే" అనే మంత్రముతో ఒక్కపర్యాయముహోమము చేయాలి.

మహాకల్పస్య కల్పస్య తథా మన్వంతరస్యచ ॥ 59
యుగస్యాథ సమాయాశ్చాయనస్యహి తథైవ చ । ఋతోర్మాసస్య పక్షస్య గ్రహ నక్షత్రయోస్తథా ॥ 60
తిథేశ్చ కరణస్యాథ ముహూర్తస్యచ పార్థివ! । వర్తమానస్య సర్వస్య దేయస్యాధిపతి ర్భవేత్ ॥ 61
ఇహగావ అయం యజ్ఞ అనః ప్రజాస్తథైవ చ । ధూర్తించైవోప ధూర్తించ ఇహాభాగం తథైవచ ॥ 62
దేయం చతుర్గృహీతేన హోమ ద్రవ్యేణ పార్థివ! ।
త్వన్నో అగ్నే! వరుణస్య స త్వంనో అగ్న ఏవ చ ॥ 63
అయాశ్చాగ్నే స్తథై వేతి తథా వ్యాహృతయో నృప! ।

త్వం నో అగ్నేతి చ తతో హోతవ్య మృక్ త్రయం పునః ॥ 64
న్యూనం తతేతి రిక్తేతి న్యూనే చైవాతి రిక్తకమ్ ।
సమం సమే తథా హుత్వా హోతవ్య మృక్త్రియం తతః ॥ 65
అనాజ్ఞాతం యదాజ్ఞాతం స్విష్టి శ్చాప్యథ పార్థివ! మనోర్జ్యోతి స్తథైవాత్ర త్రయస్త్రింశ త్తథైవ చ ॥ 66
యన్మే చ మనసా ఛిద్రం విశ్వకర్మా తథైవచ ।
అయా శ్చాగ్నే స్తథా రాజన్! త్వన్నో అగ్నే తథైవచ ।
స త్వన్నో అగ్నే ఇత్యేవం హుత్వా పార్థివ సత్తమ ! ॥ 67
ఆశ్రావితేతి మంత్రేణ దేయా పూర్ణాహుతి ర్భవేత్ ॥ 68
ఇష్టోహి యజ్ఞో భృగుభి ర్మంత్రేణానేన పార్థివ! ।
ఆజ్యస్థాలీం స్రుక్ స్రువౌ చ దర్భైస్తు పరిమార్జయేత్ ॥ 69
తాంశ్చ దర్భాన్ క్షిపే ద్వహ్నౌ ప్రయత స్సుసమాహితః ।
పూర్ణ మిత్యేవ చ స్రువా కార్యం సంవీక్షణం తతః ॥ 70
యథా దిశం భూమిపాల! తథా తుర్యా ద్విమోచనమ్ । తతో విసర్జనం కార్యం బ్రహ్మణః పరమేష్ఠినః ॥ 71

వర్తమాన (ఇప్పుడు జరుగుచున్న) మహాకల్పము, కల్పము, మన్వంతరము యుగము సంవత్సరము ఆయనము ఋతువు మాసము పక్షము గ్రహ నక్షత్రములు తిథి కరణము ముహూర్తము అనువాని యధిపతులను వేర్వేర నాహ్వానింపవలెను. ఇహగావ, అయంతుజ్ఞః అనః ప్రజాః ధూర్తి ఉపధూర్తి ఇహాభాగము అని నాల్గుసార్లు గ్రహించి హోమద్రవ్యమును—"త్వంనో అగ్నే వరుణస్యసత్వంనో అగ్న ఏపచ అయాశ్చాగ్నే స్తథైవ" అని ఆహుతులిచ్చి "త్వంనో అగ్నే" అని మూడుఋక్కులతో తిరిగి హోమము సేయవలెను. "న్యూనంతతా రిక్తా" అని న్యూనమందును అతిరిక్తమును "సమయమును సమయమందును ఋక్త్రియముతో హోమము సేయవలెను. అనాజ్ఞాతం యదాజ్ఞాతమని స్విష్టియని మనోజ్యోతిః త్రయస్త్రింశత్ యన్మేమనసా ఛిద్రం విశ్వకర్మా ఆయాశ్చాగ్నేః త్వన్నో అగ్నే" "సత్వంనో అగ్నే" అనుమంత్రముల సంపుటితో హోమములుసేసి "ఆశ్రావిత" అనుమంత్రముతో పూర్ణాహుతి గావింపవలెను. "ఇష్టొహియజ్ఞోభృగుభిః" అను మంత్రముతో ఆజ్యస్థాలిని (నేతిగిన్నెను) స్రుక్స్రువములను దర్భలతో పరిమార్జింప వలెను. (తుడుప వలెను) ఆదర్భలను శుచియై శ్రద్ధతో నగ్నియందు వేయవలెను. పూర్ణకును మంత్రముతో స్రువముతో సంవీక్షణము సేయవలెను--దిశానుసారముగవిమోచనము సేయవలెను, ఆమీదపరమేష్ఠియగు బ్రహ్మకు విసర్జనము సేయవలెను.

భగవన్! దేవ దేవేశ! జగతా మార్తి నాశన! । వ్రజస్వ పూజా మాదాయ పున రాగమనాయచ ॥ 72
యజమానస్య శాన్త్యర్థం సర్వస్య జగత స్తథా । ఆరోగ్య ధనధాన్యేన యజమానంచ వర్ధయ! 73
హుతాశనస్య కర్తవ్యం తతో రాజన్! విసర్జనమ్ । ద్రవ్యభుక్త్వం వరేణ్యస్త్వం ప్రణతార్తి వినాశనః ॥ 74
వ్రజస్వ పూజా మాదాయ పున రాగమనాయచ । శాన్త్యర్థం యజమానస్య రాష్ట్రస్య చ వివృద్ధయే ॥ 75
గోబ్రాహ్మణ హితార్థాయ జయాయ చ మహీపతేః ।
పూర్ణపాత్ర మథాஉஉదాయ వాచ్యం స్వస్త్యయనం తతః ॥ 76
తత స్తు దక్షిణా దేయా యథా ప్రోక్తా మయాపురా! ఏ తదుత్తర తన్త్రంతు ప్రోక్తం సర్వాగ్ని కర్మణామ్ ॥
విధాన మేత త్కథితం తవార్య సర్వాగ్నికర్మ స్వనఘోపయోగి ।
అతః పరం కిం కథయామి రాజన్! తన్మేవదస్వాయత లోహితాక్ష ! 78

ఇది శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్ర సంవాదే
అగ్నికార్యే ప్రాక్తనోత్తరత న్త్రవిధిర్నామ ద్వినవతి తమోஉధ్యాయః

ప్రార్థనామంత్రము యజమానికి సర్వజగత్తునకు శాంతికలుగుటకు జపింపవలెను. ఆరోగ్య ధన ధాన్యములతో యజమానుని నభివృద్ధిపరుపుమని ప్రార్థింపవలెను. ఆ మీద నగ్నిహోత్రునికి విసర్జనము గావింపవలెను. దానిమంత్రమిది—దానిఅర్థం ద్రవ్యభోక్తవు నీవు. నీవు వరేణ్యుడవు ప్రణతుల ఆర్తిని బాపువాడవు. పూజకొని తిరిగి రాకకొరకు దయసేయుము. యజమానికి రాష్ట్రమునకు సుఖశాంతుల సమృద్ధికి గో బ్రాహ్మణ హితముకొరకు తిరిగిరాకకు దయసేయుమని పూర్ణపాత్రను చేతబట్టుకొని స్వస్తి పలుకవలెను. రాజా! రక్తాంతదీర్ఘనేత్ర! ఈపై నింకేమి వచింతునది తెలుపుము.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమ ఖండమున అగ్నికార్యమందు ప్రాక్తంన్త్రోత్తర తంత్రవిధి అను తొంబదిరెండవ అధ్యాయము.

## తొంబదిమూడవ అధ్యాయము - గ్రహపూజావిధానము

వజ్ర ఉవాచ :

విస్తరాచ్ఛ్రోతు మిచ్ఛామి గ్రహనక్షత్ర పూజనమ్ । త్వత్తోఽహం భార్గవశ్రేష్ఠ! తన్మమాచక్ష్వ పృచ్ఛతః ॥

మార్కండేయ ఉవాచ :

కల్పితే మండలే స్నాతః ప్రాక్తంత్రేచ తథా కృతే ।
మండలస్య తు శౌచార్థం పంచ గవ్యం ప్రకల్పయేత్ ॥ 2
పయః కాంచన వర్ణాయాః, నీలాయాశ్చ తథా ఘృతమ్ ।
దధివై కృష్ణవర్ణాయాః, శ్వేతాయాశ్చైవ గోమయమ్ ॥ 3
గోమూత్రం తామ్రవర్ణాయాః పంచగవ్యం ప్రకల్పయేత్ ।
అథైతాని సమస్తాని కపిలాయా స్సమాహరేత్ ॥ 4
గాయత్ర్యా గృహ్య గోమూత్రం రథే అక్షేతి గోమయమ్ ।
ఆప్యాయస్వేతి చ క్షీరం దధి క్రాన్ణేతి వై దధి ॥ 5
తేజోఽపి శుక్ర మిత్యాజ్యం సావిత్రేణ కుశోదకమ్ । అఘ మర్షణ మంత్రేణ సంయోజ్య ప్రణవేన తు ॥ 6
మండలాభ్యుక్షణం కార్యం సావిత్ర్యా తదనన్తరమ్ । పూర్ణం క్షీరాక్షతోపేతం సర్షపా తండులైర్యుతమ్ । 7
శంఖే రజతే తామ్రేవా కుర్యా దర్ఘ్యం విచక్షణః । రథే అక్షేతి మంత్రేణ ద్రవిణేన తథైవ చ ॥ 8
పాద్యస్య కల్పనా కార్యా ద్రుపదాయా స్తథైవచ । హిరణ్య వర్ణేత్యాచమ్య ఋక్త్రయేణ తథైవచ ॥ 9
ఆపో హిష్ఠేతి తిసృభిః శన్నో దేవీతి పార్థివ! । జీవ దానం తతో దేయం మండలే నృప పుంగవ ! 10
అర్ఘ్యోదకం పవిత్రేణ తత్ర మంత్రః ప్రకీర్తితః । అగ్నేరాయు రసీత్యేవ మనువాకం నరాధిప ! 11
జీవస్యావాహనం కార్యంతం చ వక్ష్య మ్యతః పరమ్ ।
ఓమ్-ఆవాహయామ్యహం దేవం జీవం సర్వగతం విభుమ్ ॥ 12
పంచధాఽవస్థితం దేహం పంచధావస్థితం పునః । పంచధావస్థితం భూయః పంచధావస్థితం తతః ॥ 13
వాయవ్యేనతు భావేన పంచధావస్థిత స్సదా । ఆగ్నేయేనతు భావేన పంచధావస్థిత స్తథా ॥ 14
భూతాత్మకేనతు తథా పంచధావ స్థితం ప్రభుమ్ । వారుణేన చ భావేన పంచధాఽవ స్థితం ప్రభుమ్ । 15

మండలేఽస్మి న్నదృశ్య స్త్వం ప్రవిశాద్య నమోఽస్తుతే ।
జీవస్యావాహనం కృత్వా యథావ త్పార్థివోత్తమ ॥ 16
వక్ష్యే మ్యావాహనాఽధ్యాయాన్ పూజ్యస్యావాసానం భవేత్ ।
తద్విష్ణోః పర మిత్యేవ మర్ఘ్యం దేయం నరాధిప ! ॥ 17
ధ్రువా ద్యౌదితి మంత్రేణ హ్యాసనం వినివేదయేత్ । ఆపో హిష్ఠేతి తిసృభిః పాద్యం చ వినివేదయేత్ ॥ 18
అర్ఘ్యోదకా దాచమనం గాయత్ర్యా వినివేదయేత్ । దధి క్షౌద్రం ఘృతం చైవ మధుపర్కం నివేదయేత్ ॥ 19
తత్ర మంత్ర త్రయం జ్ఞేయం దధి క్రాష్ణేతి పార్థివ! । తేజోఽసి శుక్ర మిత్యేవ మధువాతా ఋతాయతే ॥ 20
మధుపర్కిక మశ్వత్థం తతో మాత్రాం నివేదయేత్ । సహిరణ్యం బీజపాత్రం ద్రవిణేనసదైవతు ॥ 21
పశుః కలౌ న కర్తవ్య ఇత్యాహ భగవాన్ భృగుః । రథే అక్షేతి మంత్రేణ దాతవ్య మనులేపనమ్ ॥ 22
విభూషణం చ తేనైవ తతః పరతరం నృప! । యజ్ఞోప వీతం తు నవం తథా ప్రతిసరం శుభమ్ ॥ 23
వస్త్రం పతాకాం చ తథా సావిత్రేణ నివేదయేత్ । పుష్పం పుష్పవతీత్యేవ ధూపం ధూరసి చాప్యథ ॥ 24
ధూప మంత్ర మిదం చాన్యం నిబోధ గదతో మమ । వనస్పతి రసో దివ్యో గంధాఢ్యో గంధ ఉత్తమః ॥ 25
ఆహ్వానం సర్వదేవానాం ధూపోఽయం ప్రతిగృహ్యతామ్ ।
తేజోఽసి శుక్ర మిత్యేవ దీపం దద్యా న్మహీపతే ॥ 26
హిరణ్యగర్భే త్వష్టర్చం దేయం సర్వం నివేదయేత్ । నిబోధ గదతో మంత్ర మన్నపాన నివేదనే ॥ 27
తుష్టిపుష్టికరం హృద్యమాహారం సర్వదేహినామ్ ।
గృహాణ! వర దాచిన్త్య! పానం భక్త్యా మయోదితమ్ ॥ 28
పానే నానేన పరమా తృప్తిరస్తు తవాఽనఘ! । తృప్తస్తర్పయ కామైస్తు యజమానం నమోఽస్తుతే ॥ 29
అనుక్త మంత్రం శ్రుత్వాఽద గ్రహేభ్యో యః ప్రయచ్ఛతి ।
సావిత్రం తస్య నిర్దిష్టం మంత్రం పార్థివ సత్తమ! ॥ 30

ప్రజుడు గ్రహనక్షత్ర పూజావిధానము తెలుపుమన మార్కండేయుడనియె: పూజామండల మేర్పరచిస్నానముసేసి ప్రోక్షంత్రమొనరించిన తర్వాత శుచిత్వసంపాదనకు పంచగవ్యమనగా; బంగారురంగులో నున్న గోవుయొక్కపాలు, నీలవర్ణమునఉన్న ఆవుయొక్కనెయ్యి, నల్లావుయొక్క పెరుగు, తెల్లావుయొక్క గోమయము, రాగిరంగుగోవుయొక్కమూత్రము, లేదా కపిలగోవుయొక్క యీయైందు పదార్థములు సమకూర్చుకొనవలెను. గాయత్రీ మంత్రముతో గోమూత్రము "రథేఅక్ష" అనుమంత్రముతో గోమయము "అప్యాయస్వ" అనుదాన పాలు, దధిక్రాష్ణ అనుదానపెరుగు తేజోసిశుక్ర" మని నెయ్యి సావిత్ర మంత్రముతో పశౌచకము అఘమర్షణమంత్రముతోకలిపి ప్రణవముతో మండలాభ్యుక్షణముసేయవలెను. మండలమందు జల్లవలెనన్న మాట, అటుపై సావిత్రీమంత్రముతో క్షీరాక్షతలు ఆవాలు తండులములతో పూర్తి చేయవలెను. శంఖమందు రజత (వెండి) గిన్నెలో రాగిగిన్నెలోగాని. అర్ఘ్యముసుంచవలెను. "రథేఅక్ష" అనుమంత్రము "ద్రవిణేన" "ధ్రువదాయా" అనుమంత్రములచేత పాద్యము కల్పింపవలయును. "హిరణ్యవర్ణ" అనుమంత్రము మొదలుకొని మూడు ఋక్కులతో "ఆపోహిష్ఠ" అను మూడుమంత్రములతో "శన్నో దేవీ" అనుమంత్రముతో మండలమందు జీవదానము సేయవలెను "అగ్నేరాయురసి॥ అను ననువాకముతో జీవాహ్వానము సేయ నగును. ఆజీవాహ్వారీతి చెప్పెద. ప్రణవపూర్వకముగా నీశ్లోకములు పఠించవలెను. వానిబావము. నేను సర్వగతమై యున్న విభువైన జీవుని ఆవాహనము చేయుచున్నాను. అయిదు విధాలుగానున్న దేహమును వాయువ్య భావముతో ఆగ్నేయ భావముతో భూతాత్మక భావముతో వారుణ భావముతోఈమండలమందు నీవు అదృశ్యుడవై (కనబడకుండ) ప్రవేశింపునట్టి నీకు నమస్కారము. అని జీవా

వాహనముచేయవలెను. ఆవాహనాధ్యాయము చెప్పెద. పూజ్యమైన వానికి ఆవాహనముండును. "తద్విష్ణోః పరమమ్" అను మంత్రముతో అర్ఘ్యమీయవలెను. "ధ్రువాద్యౌః" అను మంత్రముతో ఆసనము, "దధిక్రావ్ణ" తేజోఽసి మధువాతాఋతాయతే అను మూడు మంత్రములతో మధుపర్కము సమర్పించి మాత్ర (చిల్లర డబ్బులు) దక్షిణ నీయవలెను. బంగారముతోడి బీజపాత్రను (నవధాన్య పాత్రను ) "ద్రవిణ" యను మంత్రముతో నీయవలెను. కలితో పశువును వేయకూడదని భృగు మహర్షి చెప్పినారు. "రథే అక్ష" అను మంత్రముతో అనులేపనము (గంధము) ఆభరణము గూడ సమర్పింప వలెను. యజ్ఞోప వీతము ప్రతిసరము (మాల) నవమైనది వస్త్రము పతాకయుంగూడ సావిత్ర మంత్రముతో నీయవలెను. "పుష్పవతి" అను మంత్ర ముతో పుష్పము "ధూరసి" అను మంత్రముతో ధూపము నీయవలెను. "వనస్పతి అనునీశ్లోకరూప మంత్రము సంపుట పరచి ధూపమీయవలెను.

"తేజోఽసి శుక్రమసి" అను మంత్రముతో దీపమునీయవలెను. "హిరణ్యగర్భ" అను నెనిమిది ఋక్కుల సంపుటితో సర్వము నివేదింపవలెను. అన్న పానముల నివేదించుటకు "తుష్టి పుష్టి కరమ్" అను నీ (28వ) శ్లోక రూపమయిన మంత్రముతో పా నేనా నేన అను 29వ శ్లోక మంత్రముతో పానము(మంచితీర్థము) నొసంగవలెను. గ్రహములకుచేయునుపచారములందు మంత్ర మేదేని చెప్పబడనపుడు సావిత్ర మంత్రము సంపుటి చేయవలెను.

తతోఽగ్నిహవనం కృత్వా దత్వా రాజేంద్ర! దక్షిణామ్ ।
సావిత్రేణ తు మంత్రేణ తతః కార్యం విసర్జనమ్ ॥ 31
ఇమాం పూజాం సమాదాయ మయా భక్త్యా నివేదితామ్ ।
పునరాగమనాయేహ వ్రజధ్వం నాక ముత్తమమ్ ॥ 32
ఆధయో వ్యాధయ శ్చైవ ప్రశమం యాన్తు సర్వశః ।
రక్షా చాఽస్తు శివం చాస్తు యజమానస్య సర్వతః ॥ 33
గవాం శివం చాస్తు తథాద్విజానాం రాజ్ఞాం శివం చాస్తు తథా ప్రజానాం ।
ఆతంక హీనం జగదస్తు సర్వం దోషాః ప్రణాశం సకలాః ప్రయాన్తు ॥ 34

ఇతి శ్రీ విష్ణు ధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
గ్రహ పూజా విధానం నామ త్రినవతి తమోఽధ్యాయః

ఆమీద అగ్ని హవనము సేసి దక్షిణ యిచ్చి సావిత్ర మంత్రముతో విసర్జనము సేయవలెను. ఈ నా చెప్పిన భక్తితో నివేదితమైన పూజను (పూజాఫలము) చేకొని ఇచటికి తిరిగి వచ్చుటకు ఉత్తమ స్వర్గమునకు వెళ్ళుము. ఆధులు (మానసిక క్షోభలు. (స్థూలశరీర రోగములు) వ్యాధులుపశమించుగాక యజమానునికి రక్షణ శివము (శుభము) గలుగుగాక. గోవులకు శివమగుగాక ద్విజులకు రాజులకు భద్రమగుగాక ప్రజలకు మంగళమగుగాక. జగత్తు నిరాతంకమగుత అనగా అభ్యంతరములు విఘ్నములు లేనిదగు గాక! సకల దోషములు ప్రశమించుగాక !

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున గ్రహ పూజావిధానమను తొంబదిమూడవ యధ్యాయము

## తొంబదినాల్గవ అధ్యాయము - సర్వగ్రహ పూజామండల కల్పనము

వజ్ర ఉవాచ :

ఏకైకస్యేద ముక్తంతే విధానం ద్విజ! పూజనే । సర్వగ్రహాణాం యజనే విధాన మమ కీర్తయ! ॥ 1

మార్కండేయ ఉవాచ :
ఏకైక స్యేద ముక్తంతే విధానం రాజసత్తమ ! సర్వగ్రహాణాం యజనే మండలస్య విధిం శృణు ॥ 2
ఆదా వేవ సర వ్యాఘ్ర! యాగం వక్ష్యా మ్యతః పరమ్ ।
ప్రాగాయతం తు కర్తవ్య మాదౌ లేఖా ద్వయం నృప! 3
తస్యోపరి తథా కార్య మపరం తూత్తరాయతమ్ । ఏవం కృతే సంభవతి భగణం ద్వాదశక్షయమ్ ॥ 4
తతోగ్రహేభ్యః కర్తవ్యం తథా లేఖా చతుష్టయమ్ ।
(తచ్ఛక్తిభ్యః ప్రకర్తవ్యం తథా రేఖ్యా చతుష్టయమ్)
ఏవం కృతే సంభవతి భగణం ద్వాదశక్షయమ్ ॥ 5
త్రయోదశం తథా తస్య ధ్రువస్థానం తు మధ్యమం ॥ 6
ప్రాచ్యాం దిశి మహీనాథ! మేషంతు పరికల్పయేత్ । తదా ద్యా గణనా కార్యా పరిశేషేషు రాశిషు ॥ 7
రేఖావిధానం ద్విగుణం శోభార్థం పరికల్పయేత్ । రాశిస్థానాని సర్వాణి రాశివర్ణేన రంజయేత్ ॥ 8
రాశివర్ణా న్యథో వక్ష్యే యథావ దను పూర్వశః । అరుణ శ్చ సిత శ్చైవ హరితః పాటల స్తథా ॥ 9
ఆపాండు శ్చ విచిత్రశ్చ కృష్ణశ్చ కపిల స్తథా । పింగళః కర్బురో బభ్రుర్మ లిన శ్చ యథాక్రమమ్ ॥ 10
మేషాదీనాం వినిర్దిష్టా వర్ణాః పార్థివ సత్తమ! । ఆకాశ వర్ణం కర్తవ్యం ధ్రువస్థానం తథైవచ ॥ 11
ధ్రువ స్థానే మహీనాథ! దేవతా సప్తకం న్యసేత్ । మండలై శ్శుక్లవర్ణైస్తు దిగ్విభాగం నిబోధమే ॥ 12
ధ్రువస్య మండలం మధ్యే ప్రాగ్భాగే మండల త్రయమ్ ।
మండలం గగన స్యాఽత్ర భాగే ప్రాగుత్తరే భవేత్ ॥ 13
ప్రాగ్భాగే చ తథా రాజన్ ! మండలం బ్రహ్మణ స్స్మృతమ్ ॥
ప్రాగ్దక్షిణే తథా భాగే దిశం పూర్వాం ప్రకల్పయేత్ ॥ 14
భాగేవై నైరృతే కార్యం భువో భూపాల! మండలమ్ ।
శేషస్య చ తదా కార్యం ప్రతీచ్యాం దిశి మండలమ్ ॥ 15
దిగధస్తా త్తథా తస్య మండలం పశ్చిమోత్తరే । గ్రహాశ్చారవశా ద్రాజన్ ! యస్మిన్రాశౌ వ్యవస్థితః ॥ 16
మండలం తస్య కర్తవ్యం తస్మిన్నేవ యథావిధి ।
న్యాసం కార్యం గ్రహేంద్రాణాం దేవతాభి స్సహాఽనఘ! 17
ఆదిత్యా త్సప్తమే రాశౌ కేతోః కార్యంతు మండలమ్ ।
రాశౌ సవర్ణే తద్వర్ణం యస్య స్యా న్మండులం నృప ! 18
ఉత్పాద్యః పరిధి స్తస్య రంగేనాన్యేన పార్థివ! । గంధ చూర్ణయుతా రంగాః కర్తవ్యా భూతి మిచ్ఛతా ॥ 19
రాశిచక్రం సమగ్రంతు రేఖయా పరివారయేత్ । నక్షత్రాణాం తతః కార్యో న్యాసః పార్థివసత్తమ ! 20
రాశౌ రాశౌ యథాస్థానం రేఖయా పరివారితమ్ । రాశౌ రాశౌ వతో వక్ష్యే నక్షత్రాణాం సమాశ్రయం ॥ 21
అశ్వినీ భరణీ చైవ కృత్తికాంశం చతుర్థకమ్ । మేషరాశౌ వినిర్దిష్టం నిత్యం పార్థివసత్తమ! 22
పాదత్రయం కృత్తికానాం రోహిణీ సకలా తథా । ఇల్వలానాం తథైవార్ధం జ్ఞేయం వృషసమాశ్రయమ్ ॥ 23
ఇల్వలార్థం తథైవార్ద్రా హ్యాదిత్యా శ్చరణ త్రయం ।
నిత్య మేవ సముద్దిష్టం మిథునస్య సమాశ్రయమ్ ॥ 24

పాదం పునర్వసోః పుష్యం సార్పం కర్కటకాశ్రయమ్ ।
పిత్ర్యం భాగ్యం తథార్యమ్ణం ప్రథమం చరణం తథా ॥ 25
సింహరాశౌ వినిర్దిష్టం నిత్యం పార్థివ సత్తమ! । పాద త్రయ మథార్యమ్ణం హస్త శ్చిత్రార్ధమేవచ ॥ 26
కన్యారాశౌ వినిర్దిష్టం నిత్యం పార్థివసత్తమ ! చిత్రార్ధ మథ వాయవ్యం విశాఖా చరణత్రయమ్ ॥ 27
తులా రాశౌ వినిర్దిష్టం మునిభి స్తత్వ దర్శిభిః । విశాఖా చరణం మైత్రం శాక్రం వృశ్చిక భే స్మృతమ్ ॥ 28
మూల మాప్యం తథా పాదం వైశ్వదేవస్య ధన్విని । పాద త్రయం వైశ్వదేవా ద్రాజన్! వైష్ణవమేవచ ॥ 29
ధనిష్ఠార్ధం చ మకరే నిత్యమేవ ప్రకీర్తితమ్ । ధనిష్ఠార్ధం శతభిష గజపా చ్చరణ త్రయమ్ ॥ 30
కుంభరాశౌ వినిర్దిష్టం సతతం పార్థివోత్తమ! । పాద మాజస్య సకలం చాహిర్బుధ్న్యం నరాధిప ! 31
పౌష్ణంతు కథితం మీనే మునిభి స్తత్వ దర్శిభిః । భచక్ర పూజనే రాజన్! నక్షత్రస్య పృథక్ పృథక్ ॥ 32
రాశి చక్రస్య బాహ్యే తు హ్యేకైకం తారకం న్యసేత్ ।
ప్రాగుక్త వర్ణై ర్భూపాల! న్యాసః కార్యోయథావిధి ॥ 33
తారా చక్రస్య విన్యాసం రేఖయా పరివార్య తమ్ । నక్షత్ర దైవత న్యాసం బహిఃకార్యం సమన్తతః ॥ 34
యథా నక్షత్ర స్వామీ స్యా దృక్షవర్ణైః పృథక్ పృథక్ ।
తస్యాపి రేఖా కర్తవ్యా వృత్తా వా ప్యను మండలమ్ ॥ 35
రేఖా బాహ్యేన విన్యాసం దిగీశానాంతు కారయేత్ । దిశశ్చ పార్థివ శ్రేష్ఠ! యథా వ దను పూర్వశః ॥ 36
స్వాశ్రయ ర్క్ష సమం వర్ణం దిగీశానాంతు కారయేత్ । ఉత్తరాయాంచ కర్తవ్యం ధనదస్యచ మండలమ్ ॥ 37
రుక్మ వర్ణం ప్రయత్నేన దిశోవర్ణ మత శ్శృణు! । ఉత్తరాతు భవే చ్ఛుక్లా రక్తా ప్రాచీ ప్రకీర్తితా ॥ 38
దక్షిణా పీతవర్ణాస్యాత్ కృష్ణా జ్ఞేయాచ పశ్చిమా । పద్మ వర్ణా తథాజ్ఞేయా తామ్రాస్యాత్ పూర్వ దక్షిణా ॥ 39
పాలాశా చ వినిర్దిష్టా తథా దక్షిణ పశ్చిమా । నీలోత్పల సవర్ణాతు వాయవ్యా పరికీర్తితా ॥ 40
శుక్లవర్ణా తథా జ్ఞేయా చైశానీ తత్త్వదర్శిభిః । దిఙ్మండలం తు తద్విద్వాన్ లేఖయా పరివారయేత్ ॥ 41
వృత్తయా వేష్టయే ద్వృత్తాం లేఖయా చతుర స్రయా ।
తన్మధ్యం శంఖ పద్మాద్యైః మంగళై రుప శోభయేత్ ॥ 42
లేఖా విధానం ద్విగుణం సర్వత్రైవ ప్రకల్పయేత్ ।
మండల స్య తు కోణేషు హ్యాద కుంభా న్నవాన్ దృఢాన్ ॥ 43
ఫల పల్లవ సంఛన్నాన్ గంధ పుష్పాది సంయుతాన్ । చతురో విన్యసే ద్విద్వా న్నిత్యమేవ విచక్షణః ॥ 44
లేఖాసు విన్యసే ద్రాజన్ ! పతాకాశ్చ ధ్వజాం స్తథా ।
ఛత్రాణి చ సవర్ణాని గ్రహేంద్రాణాం పృథక్ పృథక్ ॥ 45
స్థానం తు విజ్ఞాయ యథావదత్ర కార్యం యథా మండలక ప్రమాణమ్ ।
యథా మహత్తా నృప ! మండలస్య తథా తథా వృద్ధి ముపైతి కర్తా ॥ 46

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
మండల కల్పనా నామ చతుర్నవతి తమోఽధ్యాయః

ప్రజుడొక్కొక్క గ్రహపూజ విషయము సెప్పితివి. సర్వగ్రహ (సమష్టి) పూజావిధి ఆనతిమ్మన మార్కండేయుడనియె. సర్వ గ్రహ పూజా విధానమునందు మండల నిర్మాణము వినుము. మొదట తూర్పుగా రెండు లేఖనములు సేయవలెను. దర్భలతో రెండు గీతలు గీయవలెనన్నమాట. దానిపై నుత్తర 'దిగాయతముగ నొక గీత గీయవలెను. ఇట్లు సేయగా నడుమ చతురస్రము (నలు చదరము)గ మండలమేర్పడును. ఆమీద నాల్గురేఖలు కోష్టాంతమున గీయవలెను. ఇట్లు చేయగా బండెండ్రు స్థానములుగల భగణమేర్పడును. దాని మధ్యస్థానము పదమూడవది ధ్రువస్థానము. తూర్పున మేషము మొదలుకొని పండ్రెండు గదులను పండ్రెండు రాసులుగా పరిగణించ వలెను. ఆమీద రెట్టింపు రేఖా విధానము శోభకొరకు(అందముకొరకు)సేయవలెను. అనగా ఒకే గీత ప్రక్కన యింకొక రేఖ గీయవలెనన్నమాట. ఆ యా రాసుల స్థానములను ఆ యా రాసులకు జెప్పబడిన రంగులతో నలంకరింపవలెను. రాశి వర్ణములు తెలిపెద. అరుణము (యెరుపు) సితము (తెలుపు) హరితము (పసుపు పచ్చ) పాటలము (లేత ఎరుపు) ఆ పాండువు(నిండు తెలుపు) విచిత్రము (రంగు రంగుల కలయిక) నలుపు. కపిలవర్ణము పింగళము కద్బురము బభ్రువు మలినము ఇట్లు మేషాది రాసులకు రంగులు క్రమముగ చెప్పబడినవి. ధ్రువస్థాన మాకాశము రంగులో కల్పింపవలెను. ధ్రువస్థానమందు దేవతాసప్తకమును న్యాసము సేయవలెను. తెలుపు రంగుగల మండలములచే దిగ్విభాగము సేయవలెను. నడుమ ధ్రువమండలము. తూర్పున మూడు మండలములు ఏర్పడును. ప్రాగుత్తర భాగమున (ఈశాన్య మూల) గగన మండలము మేర్పడును తూర్పుదిక్కున బ్రహ్మకు మండల మేర్పరుప వలెను. ప్రాగ్దక్షిణ భాగమందు ఆగ్నేయమున తూర్పు దిక్కునకు స్థానము నైరృతి మూల భూమండల స్థానము. పడమట దిక్కున పశ్చిమోత్తర (వాయవ్య) దిక్కునందు శేషునకు మండలము నేర్పరుప వలెను. చారవశమున నేగ్రహ మేరాశిలో నప్పుడున్నదో యారాశిలో నాగ్రహమునకు మండలము నేర్పరుప వలెను.

ఆ మీద దేవతా ప్రత్యధి దేవతలలో గూడ సూర్యాదిగ్రహన్యాసము సేయవలెను. సూర్యునికి సప్తమ రాశియందు కేతు మండలము. ఏగ్రహము రంగేదో యారంగులోనే యాగ్రహమునకు మండలము నేర్పరుపవలెను. గంధచూర్ణముతో రంగముల (రంగులు)తో రంగు నాకుండలమునకు పరిధి నేర్పరుప వలెను. ఆరంగుల పరిధి వలన నాజిమానునకు భూతి (ఐశ్వర్యము)గల్గును ఆ సంపూర్ణ రాశి చక్రము చుట్టును గీతగీయ వలెను. అటుపై నక్షత్ర న్యాసము సేయవలెను.

అశ్విని 4 పాదములు భరణి 4 పాదములు కృత్తిక 1 పాదము - వీనిని మేష రాశియందు న్యాసను సేయవలెను. ఆ నక్షత్ర పాదములు వాని రాశులు ప్రసిద్ధముగా గిలిసినవే. అవి తెలిసిన్యాసము సేయవలెను. రాశి చక్రము యొక్క వెలుపల నొక్కొక్క నక్షత్రమును ఇంతకుమున్న వానివానికి చెప్పిన రంగులలో నలంకరింప వలెను. ఆ తారాచక్ర (నక్షత్ర మండల) విన్యాసమును గీతతో జుట్టి దాని వెలుపల నక్షత్ర దేవతాన్యాసము సేయవలెను. ఆయా నక్షత్రాధిపతి నక్షత్రముల యొక్క రంగులతో వేరువేరుగా కనిపించునట్లు అయా గ్రహముల చుట్టును గుండ్రని రేఖ గీయవలెను. ఆ రేఖకు వెలుపల దిక్పతుల న్యాసము సేయవలెను. దిక్కులకు ఆయా దిక్కులందున్న నక్షత్రముల రంగునే వాడవలెను. ఉత్తరదిక్కున కుబేరమండలము బంగారు రంగులో జేయవలెను దిక్కుల రంగులుదెల్పెద వినుము : ఉత్తరదిక్కు తెలుపు. తూర్పు ఎఱుపు దక్షిణము పసుపుపచ్చ పడమర నలుపు, ఆగ్నేయము తామరపూవు రంగు (ఎరుపు), నైరృతిమూల పాలాశ వర్ణము (ఆకుపచ్చ) వాయవ్యమూల నల్లగులువ రంగు, ఈశాన్యమూల తెలుపు, ఆదిఙ్మండలమును చుట్టుగీతతో కప్పవలెను. చతురస్రరేఖతో నావర్తులాకార మండల మధ్యమును శంఖ పద్మాది మంగళ ద్రావ్యములచే నలంకరింప వలెను. ఎక్కడనైన రేఖలు గీసినపుడు రెండేసి రేఖలు గీయవలెను, మండలము యొక్క కోణములందు జల పూర్ణ కుంభములను నాల్గింటిని పండ్లు చిగుళ్ళతో గంధ పుష్పాదులతో నింపినవి కదల కుండ నిలుపవలెను. ఆ యా రేఖలందు పతాక ధ్వజ ఛత్రములను నా యా గ్రహాధీశ్వరులను వారి వారి రంగులలో విన్యాసము సేయవలెను. అ యా గ్రహముల స్థానములు తెలిసి యథావిధిగ మండల ప్రమాణము నేర్పరుప వలెను. ఆ మండలమెంతెంత గొప్ప దగునో యా యజమాని యంతంత విజ్ఞాన సంపన్నుడగును.

ఇదిశ్రీవిష్ణుధర్మోత్తరమహాపురాణము ప్రథమఖండమున గ్రహనక్షత్రపూజావిధానమందుమండలకల్పనమను తొంబదినాల్గవయధ్యాయము.

## తొంబదియైదవ అధ్యాయము - గ్రహనక్షత్రావాహనమంత్రాధ్యాయము

**మార్కండేయ ఉవాచ :**

ఆవాహనా న్యతో వక్ష్యే సర్వేషాం పార్థివోత్తమ! । సర్వస్యావాహన స్యాన్తేశ్లోకోఽయం పరికీర్త్యతే ॥ 1

* వి.ధ.పు-26

మండలేసంప్రవిశ్యాఽస్మిన్మయాభక్త్యానివేదితమ్ । ఇదమర్ఘ్యమిదంపాద్యంధూపోఽయంప్రతిగృహ్యతామ్ ॥ 2
ధ్రువ మావాహయిష్యామి సర్వగ్రహ గణేశ్వరమ్ । నిరుద్ధం భ్రామ్యతే యేన భ చక్రం వాత రజ్జుభిః ॥ 3
ఏహి మే ధ్రువ! దేవేశ! కేశవాచింత్య విక్రమ! । సర్వ గ్రహ గణాధ్యక్ష! సర్వలోక నమస్కృత ! 4
ఆవాహయిష్యామ్యాకాశం విమాన శత మండితమ్ । తృతీయం దేవ దేవస్య పదం విష్ణోర్మహాత్మనః ॥ 5
ఏహి! మే భగవన్! సౌమ్య! నిరాలంబ! నభ స్థల! । అప్రమేయాతి గంభీర! నక్షత్రగ్రహ మండిత! 6
ఆవాహయా మ్యహం దేవం బ్రహ్మాణం జగతాంపతిమ్ । జగతోఽస్య సముత్పత్తి స్థితి సంహారకారకమ్ ॥ 7
ఏహి! సర్వ ప్రజాధ్యక్ష! పద్మయోనె! చతుర్ముఖ! । వేదమూర్తే! తదాధార! కాల నిర్మాణ తత్పర! ॥ 8

ఊర్ధ్వ మావాహయిష్యామి హ్యనన్తాం మహతీం దిశమ్ ।
అప్రమేయాం నిరాలంబాం చంద్రసూర్యాంశు వర్జితామ్ ॥ 9

ఆగచ్ఛేహ మహాభాగే. సతతం సిద్ధసేవితే! । అనన్తే! విపులే! దేవి! నిర్మలే! హితకారిణి! ॥ 10

పృథ్వీ మావాహ యిష్యామి సర్వ సత్త్వ హితే రతామ్ ।
ధరాం భూమిం క్షమాం క్షోణీం వరదాం భూతధారిణీమ్ ॥ 11

ఏహి! మే వసుధే దేవి వారాహేణ సముద్ధృతే! । సర్వ బీజ ధరే భద్రే! సర్వభూతాపహారిణి! 12
శేష మావాహయిష్యామి మహీ మండల ధారణమ్ । ఫణావలీ రత్నజాల మరీచి వికసోజ్జ్వలమ్ ॥ 13
ఏహి ! శేష! మహాభాగ! ఏహ్యనన్తాది కేశవ! । ఆహేయీ త్వం తనుస్తస్య విష్ణో రమిత తేజసః ॥ 14
ఆవాహయామ్యధస్తాత్తు దిశం శేషేణ పాలితామ్ । నాగదైత్యోరగ గణైః స్సతతం చ నిషేవితామ్ ॥ 15
ఏహిమే రత్నబాహుల్యే! నిత్యం శేషేణ పాలితే! । గంభీరె! విపులే! భీమే! బహు స్థానాభి మండితే ! 16
ఆవాహయిష్యే వరదం దేవేశం జాతవేదసం । వేదమూర్తిం తదాధారం దేవదేవం హుతాశనమ్ ॥ 17
ఏ హ్యగ్నే! సర్వదేవేశ! సర్వదేవముఖా చ్యుత । సర్వత్ర స్థః మహాభాగ! సర్వభూత హితే రత! 18
ఆవాహయిష్యే వరదం సహస్రాంశుం దివాకరమ్ । తేజోమూర్తిం దురాధర్షం భక్తానా మభయప్రదమ్ ॥ 19
ఏహి దేవ! జగన్నాథ! ఋక్ సామ యజుషాం పతే! త్రైలోక్య మండల దీప! సర్వ వ్యాధి వినాశన! ॥ 20

ఆవాహయా మ్యహం దేవ మాదిత్య ముదకే శయమ్ ।
స్నిగ్ధ వైడూర్య సంకాశం వరుణం సు మహాద్యుతిమ్ ॥ 21

ఏహి దేవ! జలాధ్యక్ష! యాదోగణ మహేశ్వర । నాగ దైత్యోరగ గణైః స్సతతం సేవితాఽచ్యుత! 22
ఆవాహయా మ్యహం చంద్రం శీతాంశుమమృత ప్రభమ్ । ఓషధీశం ద్విజాధ్యక్షం నయనానంద కారకమ్ ॥ 23
ఏహి! మే భగవన్ చంద్ర! ఏహి మే మృగలాంఛన! । భక్తానుకంపిన్! సతతం సర్వ నక్షత్ర పూజిత! ॥ 24

స్కంద మావాహయిష్యామి షణ్ముఖం వరదం శిశుమ్ ।
దేవారి సేనామథనం పార్వత్యా నంద వర్ధనమ్ ॥ 25

ఏహి! దేవ సమారాధ్య! మహిషాసుర తస్కర । కార్తికేయ? జగన్నాథ! మయూర వర వాహన! 26
భౌమ మావాహ యిష్యామి తేజోమూర్తిం దురాసదమ్ । రుద్రమూర్తి మనిర్దేశ్య వక్త్రం రుధిర సప్రభమ్ ॥ 27

ఏహి మే భగవన్! భౌమ! అంగారక! మహాప్రభ !
త్వయి సర్వం సమాయత్తం భూతలేఽస్మిన్ శుభాఽశుభమ్ ॥ 28

విష్ణు మావాహ యిష్యామి శంఖ చక్ర గదా ధరమ్ ।అతసీ కుసుమ శ్యామం పీత వాసన మచ్యుతమ్ ॥ 29
ఏహి! మే దేవ దేవేశ! ప్రజా నిర్మాణ కారక । నారాయణ! సుదుష్పార! మహా శార్ఙ్గ ధనుర్ధర! 30

బుధ మావాహయిష్యామి బోధకం జగదీశ్వరమ్ ।
చాంద్రిం గ్రహ గణాధ్యక్షం తేజోమూర్తిం దురాసదమ్ ॥ 31
ఏహి! శీతాంశుజాచిన్త్య! జగజ్జిష్ణో! జనార్దన! మహాబల! మహాసత్వ! మహాబాహో! మహాద్యుతే! 32
శక్ర మావాహయిష్యామి దేవం సురగణేశ్వరమ్ ।
వజ్రపాణిం మహాబాహుం గోబ్రాహ్మణ హితేరతమ్ ॥ 33
ఏహి! దేవ! సహస్రాక్ష! దేవారి బలసూదన! । ఐరావతస్థ! ధర్మజ్ఞ! శచీ హృదయనందన! ॥ 34
జీవ మావాహయిష్యామి దేవేశ్వర పురోహితమ్ ।
బృహస్పతిం బృహ ద్వాచం వేద వేదాంగ పారగమ్ ॥ 35
ఏహి! జీవ! మహా భాగ! జీవభూత! మహీతలే । సస్య వృద్ధి స్త్వయాయత్తా సతతం భూమి వర్ధన! ॥ 36
దేవీ మావాహ యిష్యామి పార్వతీం వరదా ముమాం ।
హరస్య దయితాం భార్యాం చార్వంగీం భూతి వర్ధనీమ్ ॥ 37
ఏహి! దేవి! జగన్నాథే! మేనా హృదయ నందిని! । పవిత్రే! వరదే! సౌమ్యే నిత్యం భక్తజన ప్రియే! ॥ 38
శుక్ర మావాహయిష్యామి భార్గవం జగదీశ్వరమ్ । నిత్యం సర్వజనాధ్యక్షం తపసా ద్యోతిత ప్రభమ్ ॥ 39
ఏహి! శుక్ర! మహాభాగ! షోడశార్చి ర్వరప్రద! । ప్రభు స్త్వం వరదాచింత్య! వర్షా వర్షస్య నిగ్రహే ॥ 40
ఆవాహయా మ్యహం దేవం ప్రజాధ్యక్ష మకల్మషమ్ । భక్తానుకంపినం దేవం ప్రజానిర్మాణ కారకమ్ ॥ 41
ఏహి! దేవ! ప్రజాధ్యక్ష! పూజానిర్మాణ కారక! । త్వయి దేవ! సమాయుక్తం ప్రజానామభవోద్భవమ్ ॥ 42
ఏహి! మే భగవన్! బ్రహ్మన్! ప్రజాపతి మహాద్యుతే ।
సౌరి మావాహయిష్యామి శనైశ్చారిణ మచ్యుతమ్ ॥ 43
తపస్విన మనాధృష్యం భక్తానా మభయ ప్రదమ్ । ఏహి! తీక్ష్ణాంశుజాఽచిన్త్య! భావాఽభావ ప్రదర్శక! ॥ 44
త్వయి సర్వం సమాయత్తం రాజ్ఞాం భూమౌ శుభాఽశుభమ్ ।
ఆవాహయా మ్యహం దేవం గజ వక్త్రం గణేశ్వరమ్ ॥ 45
విఘ్నేశం విఘ్నహర్తారం పార్వతీ హృదయప్రియమ్ । ఏహి! దేవ! గణాధ్యక్ష! లంబోదర! మహాభుజ! 46
కార్యసిద్ధి స్సమాయత్తా త్వయి సర్వేశ! దేహినామ్ ॥
రాహుమావాహయిష్యామి దైత్యేశం గ్రహతాం గతమ్ ॥ 47
కేశవాప్త వరం వీర! తపసా దగ్ధ కిల్బిషమ్ । ఏహ్యేహి! దైత్య ప్రవర! వరదాఽచిన్త్య విక్రమ! ॥ 48
తపోమూర్తే! దురాధర్ష! విపరీత చరాంబరే । ఆవాహయా మ్యహం దేవం విశ్వ కర్మాణ మచ్యుతమ్ ॥ 49
సర్వాసాం దేవతానాం తు సదా శిల్ప ప్రవర్తకమ్ । ఏహి! దేవవరాఽచిన్త్య! సర్వ శిల్ప ప్రవర్తక! ॥ 50
త్వయి సర్వైవ సర్వేషాం కర్మణా మాశ్రితా గతిః । కేతు మావాహయిష్యామి కేతుం సర్వదివౌకసామ్ ॥ 51
బ్రహ్మణ్యం సర్వధర్మజ్ఞం భక్తానా మభయ ప్రదమ్ । ధూమకేతో! ఇహాభ్యేహి! హుతాశన సమప్రభ! ॥ 52
శిఖా కరాల! వికచ! పూజితాఽఘ వినాశన! వహ్నే రావాహనం ప్రోక్తం పూర్వ మేవ మయాఽనఘ! ॥ 53
ఆవాహయిష్యామి శుభాం కృత్తికాం దేవ పూజితామ్ । ఏహి సాధారణే దేవి! జ్యేష్ఠ దక్షసుతే! శుభే! ॥ 54
ప్రజాపతేః తథాప్రోక్తం రోహిణ్యా. శృణు! పార్థివ! ।
ఆవాహయామి వరదాం రోహిణీం చంద్ర వల్లభామ్ ॥ 55

ఏహి! రోహిణి! ధర్మజ్ఞే! ధ్రువ కర్మసు శోభనే! । చంద్రస్యావాహనం ప్రోక్తమిల్వలాయాః నిబోధ! మే ॥
ఆవాహయామి వరదా మిల్వలాం శశి వల్లభామ్ । ఏహి! మే ఇల్వలే! దేవి! మృదు కర్మసు శోభనే! ॥ 57
రుద్ర మావాహయిష్యామి త్రినేత్రం శూలపాణినమ్ । ఏహి! శంకర! సర్వాత్మన్! మహాదేవ! గణేశ్వర! ॥ 58
ఆర్ద్రా మావాహయిష్యామి నక్షత్రం బాహుసంజ్ఞకమ్ । ఏహ్యార్ద్రే చారు సర్వాంగి! దారుణే! రుద్రసమ్మతే! ॥59
ఆవాహయిష్యా మ్యదితిం తపసా దగ్ధ కిల్బిషాం । ఆదిత్యారణి! ధర్మజ్ఞే! ఏహి! దేవి! మహాప్రభే ॥ 60

మార్కండేయుడనియె. సర్వగ్రహ నక్షత్రావాహన విధానము తెల్పెద. సర్వావాహన పర్యవసానమందీ శ్లోకము కీర్తింపవలయును. తాత్పర్యము. ఈమండలమందు ప్రవేశించి భక్తితో నేను సమర్పించు నీ అర్ఘ్యము పాద్యము ధూపము గ్రహింపుము. వాయురజ్జువులచే నిరుద్ధమై (ఆగిపోయిన) భచక్రమును త్రిప్పుచుండు సర్వగ్రహ గణేశ్వరుని ధ్రువుని ఆవాహనము సేయుచున్నాను ఓ ధ్రువ! ఇటకు దయసేయుము. కేశవా! సర్వగ్రహాధ్యక్ష సర్వలోక వంద్య విచ్చేయుము. దేవదేవుని విష్ణువుయొక్క తృతీయ పాదమయిన విమాన శతాలంకృతమైన ఆకాశమును ఆవాహనము సేయుచున్నాను. సౌమ్యమూర్తి! ఓనిరాలంబ అంబర రూపదేవతా! అప్రమేయా! అతిగంభీరా! నక్షత్రాలంకృతా! దయసేయుము. బ్రహ్మదేవుని జగత్పతిని జగత్సృష్టి స్థితి లయ కారకుని ఆవాహనము సేయుచున్నాను. ఓ సర్వప్రజాధ్యక్ష పద్మయోనీ (పద్మమందుదయించినవాడా! చతుర్ముఖ! వేదమూర్తీ! వేదాధార! కాలనిర్మాణ తత్పరా! రమ్ము. అనంతమైన ఊర్ధ్వదిక్కునావాహనము సేయుచున్నాను. అది అప్రమేయము నిరాలంబము చంద్ర సూర్యాదులు సంచరించనిది. ఓ మహాభాగా! సిద్ధసేవితా! అంతులేనిదానా! విపులా! నిర్మలా! హితకారిణీ! ఓ ఊర్ధ్వదిశా రమ్ము. ధరా భూమ క్షమ వరద భూతధారిణి వసుధా వరాహావతార సముద్ధృతా! సర్వ బీజ ధరా! భద్రా! (కల్యాణి) సర్వభూతాపహారిణి! ఓ పృథ్వీ ఆవాహనము సేసెద రమ్ము. మహీమండలధారి పణావళింగల రత్నావళీ కాంతిపుంజముచే మిగుల దీపించు శేషుని నిన్నావాహింతునో అనంతా! ఆదికేశవ మహానుభావ! విచ్చేయుము. నీవా విష్ణువు యొక్క ఆమేయామూర్తివి సర్పాకార మూర్తివి. అధోదిశను (పాతాళమును) శేషపావితమైన దానిని నాగదైత్య సర్ప గణములు నిరంతరము సేవించు దానిని ఆవాహనము సేయుదుచ. రత్న సమృద్ధా! శేషపావితా! గంభీర విపుల భయంకర మూర్తీ! బహుస్థానాలంకృతా! రమ్ము. వరదుని జాతవేదసుని వేదమూర్తిని వేదాధారుని దేవదేవుని హుతాశనుని ఆవాహించుచున్నాను. సర్వ దేవతలకు ముఖ్యమయిన వాడా! సర్వమందున్న వాడా! సర్వ భూత హితా! మహాభాగా! సర్వ దేవేశ! ఆగ్నే రమ్ము. సహస్ర కిరణుడగు సూర్యుం బిలుతును. దివాకరతేజోమూర్తి దురాధర్షా భక్తాభయప్రద! బుగ్యజు స్సామాధిపతీ! భగవంతుడా! భక్తానుగ్రహ కరా! సర్వనక్షత్ర పూజిత : మణిప్రకాశుని త్రైలోక్యమండల దీప! సర్వవ్యాధి వినాశన ఆదిత్యుని దేవుని నిన్నావాహనము సేయుచున్నాను. ఉదకములందుండు వరుణుని స్నిగ్ధ వైడూర్య మణి ప్రకాశు నావాహించుచున్నాను ఓ జలాధ్యక్ష యాదొ గణేశ్వర! నాగ దైత్య సర్పగణ సేవితా దయసేయుము. శీతాంశుని జంద్రుని అమృత ప్రభామూర్తిని ఓషధీశ్వరుని ద్విజాధ్యక్షుని నయనానందకరుని నిన్ను ఆవాహనము చేయుచున్నాను. చంద్ర భగవానుడా! శశలాంఛన! సర్వ నక్షత్ర పూజితా! భక్తానుకంపీ! దయసేయుము. షణ్ముఖుని వరదుని స్కందస్వామిని శివపుత (కుమారుని) దేవ శత్రుసేనా మథనుని పార్వత్యానంద వర్ధనుని ఆవాహించుచున్నాను. దేవ దేవారాధ్య మహిషాసుర తస్కర! కార్తికేయ! జగన్నాథ మయూర వాహన రావోయి. భౌముని (కుజుని) తేజోమూర్తిని దురాసదుని (దరిజేర వలను గాని వానిని) రుద్రమూర్తి నిర్దేశింప వలను గానిముఖము గల వానిని రక్త ప్రభుని పిలుచుచున్నాను ఓ భౌమా! భగవంతుడా! అంగారక మహాప్రభూ! దయసేయుము. ఈ భూతల మందలి శుభాశుభ ఫలమంతయు నీ యందధీనమై యున్నది.

శంఖచక్రగధాధరుని అతసీకాసుమశ్యాముని బీతవానుని అచ్యుతునిఆహ్వానించుచున్నాను. దేవదేవేశ! ప్రజానిర్మాణకారకా! నారాయణ సుదుష్పార! (అంతుగనరానివాడా) శాఙ్గధరా! దయసేయుము బుధావాహనము సేయుచున్నాను. బోధకుడు (జ్ఞాన

!ప్రదుడు) జగత్పతి చాంద్రి (చంద్రునికి బుట్టిన వాడు) గ్రహాధ్యక్షుడు తేజోమూర్తి దురాసదుడు. శీతాంశుప్రవర ! అచింత్య జగమును జయించినవాడా ! జనార్దన ! మహాద్యుతీ ! రమ్ము - దేవగణాధీశ్వరుని నింద్రునావాహనము సేయుచున్నాను. వజ్రపాణి గోబ్రాహ్మణ హితానక్తుడు సహస్రాక్షుడు దేహరి బలమర్దనుడు ఐలావత వాహనుడు శచీహృదయానందనుడు ధర్మజ్ఞుడు నైన ఓ ఇంద్రా! రమ్ము. ఇంద్రపురోహితుని బృహస్పతి వేదవేదాంగ పారగుడు మంచి వక్త ఓజీవా ! మహాత్మా అవనికిఅంతకు జీవమైన వాడ ! సస్యసమృద్ధి నీపై నాధారపడియున్నది. భూమి వర్ధన ! రమ్ము.. పార్వతీదేవిని ఆవాహనము సేయు చున్నాను. వరదాత్రి ఉమ హరప్రియపత్ని సుందరాంగి భూతవర్ధిని దేవీ ! జగన్నాథే ! మేనాహృదయ నందిని ! రావమ్మా పవిత్రురాల ! వరప్రద ! మంచిదాన ! భక్త జన వత్సల ! రారమ్మ భార్గవుని బిలుతును. సర్వజనాధ్యక్ష శుక్రాచార్య ! తపఃప్రభాభాసుర ; షోడశ జ్యోతిర్మూర్తీ ! వర్షము కురయుటకు కురియకుండుటకు నీవు స్వామివి. ప్రజాధ్యక్షుని పరమ నిర్మలుని నిన్ను బిలనుచున్నాను. ప్రజా నిర్మాణకారకుడవు భక్తానుకంపి రావయ్యా ! ప్రజాపతి నాహ్వానింతునిదిగో ! ప్రజాధ్యక్ష ! రమ్ము. ప్రజానిర్మాణదక్ష ! సౌరిని (సూర్య కుమారుని) శని నావాహనింతు. శుభాశుభములు నీయందాధార పడియున్నవి. భావాభావ ప్రవర్తకుడవు నీవు రమ్ము. గజముఖుని గణపతిని వరదుని పార్వతీ ప్రియనందనుని ఆవాహించుచున్నాను. లంబోదర ! విఘ్నేశ్వర ! దేవుల కార్య సిద్ధి నీపై నాధార పడియున్నది. రాహు గ్రహము నావాహింతును. దైత్యపతి గ్రహత్వమందిన వాడు- విష్ణువున కాప్తుడు తపస్సుచే పాపము హరింపచేసికొనినవాడనైన ఓరాహువా ! వరదా రమ్ము. ఆకాశమందు విపరీతముగా సంచరించు వాడవు నీవు. విశ్వకర్మ నావాహింతును. సర్వదేవతలకు శిల్ప విద్యాప్రవర్తకుడవగు నీవు రమ్ము. నీయందు సర్వుల కర్మగతి యాధార పడి యున్నది. సర్వదేవతలకు కేతువయినవాడు (జెండా వంటివాడు) బ్రహ్మణ్యుడు సర్వ ధర్మజ్ఞుడు భక్తాభయ ప్రదాతయునైన ఓ ధూమకేతువా ! బ్రహ్మణ్యుడు సర్వధర్మజ్ఞుడు భక్తాభయప్రదాతయునైన యో ధూమకేతువా అగ్ని సమప్రభతో నిలుకు రమ్ము విరబోసికొన్న జుట్టుతో భయంకరుడవైన నీవు పూజించువారి పాపముల నశింపజేయువాడవు. అని కేతువుంబూజింపవలెను. అగ్ని ఆవాహన విధానమింతకు మున్ను తెలిపితిని. ఆమీద దేవపూజ్యయగు కృత్తికనావాహనము సేయుదును. దక్షుని పెద్దకూతురా ! కల్యాణి ! రమ్ము. రోహిణీ నక్షత్రావాహనము ప్రజాపతి ప్రోక్తము, వినుము. చంద్రవల్లభ వరదాత్రి యైన రోహిణిం బిలుతును. ధర్మజ్ఞా ! రోహిణీ ధ్రువ కర్మములందు స్థిరముగా ప్రతిష్ఠింప వలసిన దేవాలయ గృహనిర్మాణాది కార్యములందు శోభనదేవతవు నీవు రమ్మని రోహిణి నావాహనముసేసి పూజింపలెవను. చంద్రుని ఆవాహన విధానమంతయు మున్ను జెప్పితిని. ఇల్వలా దేవి పిలుపు వినుము. వరద యు చంద్రప్రియయునైన యో ఇల్వలాదేవీ ! మృదుకార్యములందు (సంగీతాది కళలు మొదలయన సుకుమార విద్యలందు పనులందు) నీవు శోభన దేవత వని పిలిచి పూజింప వలెను. ఆమీద రుద్రుని త్రినేత్రుని శూలపాణిని శంకరా ! సర్వాత్మ స్వరూపా ! మహాదేవ గణనాధా ! యని యాహ్వానించి పూజింప నగును. బాహువను పేరుగల ఆర్ద్రా నక్షత్రమును ఓ సర్వాంగసుందరి ! రుద్రప్రియ ! దారుణ స్వరూప రమ్మని పిలిచి పూజింపవలెను. అటుపై నదితిని తపసుచేసి సర్వపాపముల హరించి కొన్నదానవు ఆదిత్యులకు అరణివి నీవు (దేవతలకు దల్లియని భావము) దివ్యప్రభతో దేవీ రమ్మని పిలువ వలెను.

ఋక్షమావాహయిష్యామి ధర్మజ్ఞంతు పునర్వసుమ్ । పునర్వసో! ఇహాగచ్ఛ! చర కర్మ ప్రసాదక! ॥ 61
జీవస్యావాహనం ప్రోక్తం పుష్యస్యాథ ప్రచక్షతే । పుష్యమావాహయిష్యామి నక్షత్రం క్షిప్ర సంజ్ఞితమ్ ॥ 62
ఏహి! పుష్య! మహాభాగ! ఘోషం వర్ధయ! సర్వతః । సర్పా నావాహయిష్యామి త్రైలోక్యాన్తర గోచరాన్ ॥ 63
ఆయాన్తు సర్వత స్సర్పాః సౌమ్యరూపా భవన్తు చ । ఆవాహయిష్యా మ్యాశ్లేషాం భక్తానాంశ్రీ వివర్ధనామ్ ॥
ఆశ్లేషే! త్వ మిహాఽభ్యేహి! దారుణే! విజయప్రదే! ।
పిత్యా నావాహయిష్యామి మూర్త్య మూర్తిధరా నహమ్ ॥ 65

ఆయాన్తు! పితరః శీఘ్రం సుధా కవ్యభుజోఽవ్యయాః । మఘా మావాహయిష్యామి ఉగ్ర నక్షత్ర మంజసా ॥
ఏహి! మే సుభగే! దేవి! మఘే! ఒఘ వినిషూదనే । భగమావాహయిష్యామి పూర్వఫల్గుని సంజ్ఞితమ్ ॥ 67
ఏహి! భాగ్యే! మహాభాగ్యే! ఉగ్ర కర్మ ప్రసాదికే! । ఆవాహయిష్యామ్యర్యమ్ణ మాదిత్యం తేజసాం నిధిమ్ ॥ 68
ఆర్యమం స్త్వం స మభ్యేహి! భక్తపాతక నాశన! । ఋక్షమావాహయిష్యామి చోత్తరా ఫల్గునీం శుభామ్ ॥ 69
ఏహిత్వం సుభగే! దేవి! ధ్రువే! సర్వాంగసుందరి! । ఆవాహనం మయాప్రోక్తం సవితు ర్దీప్త తేజసః ॥ 70
హస్త మావాహయిష్యామి సావిత్రం క్షిప్ర మంజసా । ఏహి! సావిత్ర! ధర్మజ్ఞ! భక్తానాం పాపనాశన!॥ 71
ఆవాహయామ్యహం దేవం త్వష్టారమమిత ద్యుతిమ్ । ఏహి! మే భగవన్! త్వష్టః! ప్రజాపాలన తత్పర! ॥
చిత్రా మావాహయిష్యామి చిత్రరూపాం మనోహరామ్ । ఏహి! మే వరదే! చిత్రే! మృదుకర్మ ప్రసాధిని! ॥ 73
వాయు మావాహయిష్యామి సర్వగం దీప్తతేజసమ్ । దేవ! వాయో! త్వ మభ్యేహి! సర్వభూత జగత్ప్రియ! ॥
స్వాతి మావాహయిష్యామి నిత్య ముత్తర మార్గగామ్ । దేవి! స్వాతే! త్వ మభ్యేహి! చరకర్మసు శోభనే ॥
ఆవాహయిష్యా మీంద్రాగ్నీ సహితౌ దీప్తతేజసౌ । ఇంద్రాఽభ్యేహి! జగన్నాథ! ఏహ్యగ్రేవిజయప్రద! ॥ 76
ఋక్షమావాహయిష్యామి విశాఖాం దీప్త తేజసమ్ । విశాఖే! త్వ మిహాఽభ్యేహి! దేవి! సాధారణే శుభే! ॥ 77
మిత్ర మావాహయిష్యామి దేవం దీప్తాంశు మూర్జితమ్ । ఏహి! మిత్ర మహాభాగ! భక్తాఽఘ ప్రలయంకర! 78
ఋక్ష మావాహయిష్యామి హ్యనురాధాం వరప్రదామ్ । అనూరాధే! త్వ మభ్యేహి! మృదుకర్మసు శోభనే! 79
శక్రస్యావాహనం ప్రోక్తం జ్యేష్ఠాయాః శృణు పార్థివ! ।
జేష్ఠా మావాహయిష్యామి నక్షత్రం శక్రదైవతమ్ ॥ 80
జ్యేష్ఠే! దేవి! త్వ మభ్యేహి! దారుణే! చారులోచనే! । దేవ మావాహయిష్యామి దేవం నిర్ఋతిజం ప్రభుమ్ ॥
ఏహి! దేవ! విరూపాక్ష! మహాబల పరాక్రమ! । మూల మావాహయిష్యామి నక్షత్రం దారుణం మహత్ ॥ 82
ఏహి! మూల! మహాభాగ! భక్తానా మభయప్రద! । అపస్త్వా వాహయిష్యామి సర్వగా వరదా శ్శివాః ॥ 83
ఆపస్త్వాయాన్తు వరదాః పవిత్రాః మంగళావహాః । ఋక్ష మావాహయిష్యామి పూర్వాషాఢేతి సంజ్ఞితమ్ ॥ 84
ఏహి! త్వముగ్రే! వరదే చాషాఢే పూర్వ పూర్వకే । విశ్వా నావాహయిష్యామి దేవా నద్భుత తేజసః ॥ 85
ఆయాన్తు వరధా స్సర్వే విశ్వేదేవా మహాబలాః । ఋక్ష మావాహయిష్యామి ఉత్తరాషాఢ సంజ్ఞితమ్ ॥ 86
ఏహి! త్వ ముత్తరాషాఢే! సర్వకర్మసుశోభనే! ।
బ్రహ్మణ ఆవాహనం ప్రోక్తమభిజితి శృణు! హే ప్రభో! ॥ 87
ఋక్ష మావాహయిష్యామి యత్త దభిజి దుచ్యతే । ఏహి! ధిష్ణ్య వరిష్ఠాద్య! క్షిప్రకర్మ ప్రసాధక! ॥ 88
విష్ణో రావాహనం ప్రోక్తం శ్రవణస్య నిబోధ మే । ఋక్షమావాహయిష్యామి శ్రవణం సర్వకామదమ్ ॥ 89
అశ్వత్థ! త్వం సమభ్యేహి! చర కర్మ ప్రసాధక! । వసూ నావాహయిష్యామి దేవా నష్టౌ వర ప్రదాన్ ॥ 90
అయాన్తు వరదా దేవా వసవః పాపనాశనాః । ధనిష్ఠా మావాహయిష్యామి నక్షత్రం రాశివల్లభమ్ ॥ 91
ధనిష్ఠే! త్వ మిహాగచ్ఛ! చర కర్మ ప్రసాధకే! । ఆవాహనం మయాప్రోక్తం వరుణస్య మహాత్మనః ॥ 92
ఋక్షమావాహయిష్యామి నామ్నా శతభిషం శుభమ్ । ఆగచ్ఛ! త్వం శతభిషే! చరకర్మసు శోభనే! ॥ 93
ఆజైకపాదం వరదం రుద్రమావాహయామ్యహమ్ । అహిర్బుధ్న్య! సమభ్యేహి! జటాజూటోప శోభిత! ॥ 94
ధ్రువ మావాహయిష్యామి దేశే భాద్రపదోత్తరే ।
ఏహి! త్వం సుమహాభాగే! మమ భాద్రపదోత్తరే । ఋక్షమావాహయిష్యామి రేవతీం చారుదర్శనామ్ ॥ 95

ఏహి! రేవతి! ధర్మజ్ఞే! మృదుకర్మ ప్రసాధకే! । ఆవాహయామ్యహం దేవం పూషణం పాపనాశనమ్ ॥ 96
పూషన్! సమ్యగిహాభ్యేహి! సర్వకర్మ ప్రసాదిత! । ఆవాహయామ్యహం దేవౌ నా సత్యౌ సూర్యనందనౌ ॥ 97
ఆగచ్ఛేతాం మహాభాగౌ వరదా వశ్వినా వుభౌ । ఋక్ష మావాహయిష్యామి చాశ్వినీం సర్వకామదమ్ ॥ 98
యమ స్యావాహనం ప్రోక్తం భరణీ మథ వై శృణు! ।
ఋక్షమావాహయిష్యామి చోగ్రం భరణీ సంజ్ఞకం ॥ 99

ఆటుపై పునర్వసు నక్షత్రమును చరకర్మములకు సాధకురాల విటురమ్మని పిలువ వలెను. ఆటుపై గురుగ్రహావాహనము పుష్యమీ నక్షత్రావాహనము చెప్పబడినది. క్షిప్రమను పేరుగల పుష్యమిని ఆహ్వానింతునని పుష్యమీ! యిటకు విచ్చేసిపుష్టిని పెంపొంది దింపుమనవలెను. అటుపై సర్పదేవ తాకమయిన ఆశ్లేషను ముల్లోకములందును గానవచ్చు సర్పములను ఆవాహనముసేయుచున్నానని అన్నిలావులనుండి సర్పములు సౌమ్యరూపములయి యిటకు వచ్చుగాక భక్తులకు శ్రీవర్ధనమైన ఆశ్లేష ను ఆవాహించుచున్నానని దారుణ మూర్తి మూర్తితోను మూర్తిలేకుండనుండు పితరుల నావాహనముసేయుచున్నానని ఉగ్రనక్షత్రమును (మఘానక్షత్రమును) ఓ సౌభాగ్యవతి ! అఘవినాశినీ మఘా ! రమ్మని పిలువ వలెను పూర్వ ఫల్గుని యనుపేరుగల భగుని (భగదేవతను) పిలుతునని భాగ్యరూపిణి ? మహాభాగా ! ఉగ్రకర్మ సాధకురాలా ! యని పిలువ వలెను. అర్యముని తేజోనిధియైన ఆదిత్యుని పాపనాశన ! రమ్మని. ఉత్తర ఫల్గుని సర్వాంగసుందరి ! రమ్మని పిలువ వలెను. సవిత ఆవాహనము నింతమున్నె రింగించితిని సవితృదేవతాకము (సావిత్రము) హస్తా నక్షత్రమును ఆహ్వానింపవలెను త్వష్టను బిలుచుచున్నానని ప్రజాపాలన తత్పరా ! త్వష్ట భగవానుడా రమ్మని పిలువ వలెను. చిత్రరూపయైన సుందరిని చిత్రనుబిలుచుచున్నానని ఓచిత్రా ! మృదుకర్మసాఫల్యము గూర్చుదానవు నీవు రమ్మని పిలువవలెను. సర్వవ్యాపకము తేజస్సంపన్నమునైన నాయువును దేవా ! సర్వ భూత జగత్ప్రియా ! రమ్మని పిలువవలెను. నిత్యము నుత్తర దిశను సంచరించు స్వాతిని చరకర్మ సిద్ధినిచ్చు నీవు రమ్మని పిలువవలెను. ఇంద్రాగ్నులిద్దరి నొకరితో నొకడు కలిసిన వారిని తేజస్వులను బిలుచుచున్నానని ఇంద్రా ! జగన్నాథా ! దయసేయుము విజయప్రదా ! యని విశాఖను మహాతేజస్విని విశాఖను నీ విటకు రమ్మని పిలువ వలెను. మిత్ర దేవతను బిలుచుచున్నానని మంచి తేజస్సుతో నిండి భక్తపాపప్రలయంకరా ! రమ్మని మృదుకర్మ శోభనయైన మిత్రదేవతాకయైన యనూరాధ నాహ్వానింప వలెను జ్యేష్ఠానక్షత్రా వాహనమందు శక్రు నావాహనము సేయవలెను. ఇంద్ర దైవత్యమయిన జ్యేష్ఠను జేష్ఠా దేవి ! దారుణురాల ! సునేత్ర ! నీవురమ్మని పిలువ వలెను. నైరృతి ప్రభువును ఓ విరూపాక్ష ! మహాబల పరాక్రమ! రమ్మని మూలనాహ్వానింతునని కడుదారుణమైన భక్తాభయప్రదవని మూలా నక్షత్రమును బిలువవలెను. సర్వత్ర వరదలై మంగళ ప్రదలైన యబ్దేవతలు వత్తురు గాక యని పిలిచి పూర్వాషాఢా నక్షత్రమును నీవు ఉగ్రరూపిణివి వరప్రదాత్రివి రమ్మనవలెను. అద్భుత తేజశా లురైన విశ్వేదేవతలంబిలుతునని మహా బలశాలురు విశ్వేదేవులు వత్తురుగాక యని ఉత్తరాషాఢా నక్షత్రమును సర్వకర్మ శోభనవని పిలువవలెను. అభిజిత్తునందు బ్రహ్మను పిలువలెను. అభిజిన్నక్షత్రమా! నీవు(ధిష్ణ్య) భాగ్యపరిష్ఠవు శీఘ్రకార్యసిద్ధిప్రదవని ఆవాహిం పవలెను. శ్రవణమునకు విష్ణువుం బిలువవలెను సర్వకామప్రదయయిన శ్రవణమును బిలువవలెను. ఓ అశ్వత్థమా ! నీవు చరకర్మ ఫలసిద్ధిప్రదవు రమ్మనవలెను. అష్టవసువులు వరప్రదాతలు పాపనాశనులు దయచేయుదురు గాకయని ధనిష్ఠానక్షత్రమందు రాశివ ల్లభమైనదానిని ధనిష్ఠా ! చరకార్య సిద్ధిప్రదవీవిటు రమ్మనవలెను. వరుణుని యావాహన విధానము మునుపు చెప్పితిని. వరుణ దైవ త్యమైన శతభిష నక్షత్రమును చరకర్మ సిద్ధిదవని ఆవాహనముసేయవలెను. అజైకపాదుని వరదుని రుద్రుని బిలుతునని చెప్పి అహి ర్బుధ్న్య ! జటాజూటోపశోభితా! అని పూర్వాభాద్రనుబిలువ వలెను. ధ్రువుని బిలుతునని మహానుభావురాలా! యని ఉత్తరాభాద్రను బిలువవలెను చక్కనిదైనను రేవతిని మృదుకర్మ శోభన దేవతవు రమ్మని ఆమున్ను తదధి దైవతను పూషుని సర్వకర్మ సాధకు డవు రమ్మని పిలువవలెను. అశ్వులనాసత్యులను (అశ్వినీదేవతలను) సూర్యకుమారులను మహాభాగులు మీరిద్దరును రండని పిలిచి

సర్వకామప్రద యగు అశ్వినీ నక్షత్రమును ఆవాహనము సేయవలెను అటుపై యమదేవతాహ్వానము భరణీ నక్షత్రావాహనమొనరింపవలెను. ఉగ్రనక్షత్రమైన భరణి ని నీవు అందగత్తెవు చక్కగ గనిపింతువని పిలువవలెను.

ఏహి! త్వందేవి! భరణి! సుభగే! చారుదర్శిని! । శక్రస్యావాహనంప్రోక్తంపూర్వ మేవ మయా నృప! ॥ 100
ప్రాచీ మావాహయిష్యామి సూర్యోదయ విభూషితామ్ । ఏహి! త్వం వరదే! పూర్వే! శుభకర్మ ప్రసాధికే! ॥
వహ్నే రావాహనం ప్రోక్తం పూర్వ మేవ మయా తవ ।
దిశ మావాహయిష్యాను వరదాం పూర్వ దక్షిణామ్ ॥ 102
వహ్నిప్రియే! స మభ్యే హి! వరదే పూర్వదక్షిణే! ।
యమ స్యావాహనం ప్రోక్తం యామ్యాయాశ్చ దిశ శ్శృణు ॥ 103
అహమావాహయిష్యామి దక్షిణాం దక్షిణాం దిశమ్ । దక్షిణే! త్వంసమభ్యేహి. సర్వకర్మసు శోభనే! ॥ 104
పూర్వమావాహనం ప్రోక్తం విశ్వరూపస్య ధీమతః । దిశ మావాహయిష్యామి శుభాం దక్షిణ పశ్చిమామ్॥
ఏహి!మే నైరృతీ దేవి! సతతం భూత వర్ధిని । ఆవాహనం మయా ప్రోక్తం వరుణస్య మహాత్మనః ॥ 106
దిశమావాహయిష్యామి వారుణీం వరుణీం శుభామ్ । ఆగచ్ఛ పశ్చిమే దేవి! వరదే! వరుణప్రియే! ॥ 107
ఆవాహనం మయా ప్రోక్తం వాయోశ్చైవ మహాత్మనః ।
ఆవాహయామి విదిశం వాయవ్యాం పశ్చిమోత్తరామ్ ॥ 108
వరదే। త్వం నమభ్యేహి! వాయవ్యే పశ్చిమోత్తరే । ఆవాహయామి ధనదం దేవం వైశ్రవణం ప్రభుమ్ ॥
రాజ రాజ! స మభ్యేహి! సర్వయజ్ఞ। ధనాధిప! । దిశ మావాహ యిష్యామి సౌమ్యాం ధనద పాలితామ్ ॥ 110
ఉత్తరే త్వం స మభ్యేహి! సర్వ కర్మసు శోభనే! ।
దేవస్యావాహనం ప్రోక్తం త్ర్యంబకస్య మహాత్మనః ॥ 111
దిశ మావాహయిష్యామి శుభాం ప్రాగుత్తరా మహమ్ । ఏహి! త్వం సుభగే! దేవి! సతతం శివ పాలితే ॥ 112

శక్రుని(ఇంద్రుని పిలువుమని దెల్పితిని. సూర్యోదయముచే విభూషితమైన తూర్పుదిగ్దేవతను నీవు వరదవు శుభకర్మ ప్రసాధకురాలవని పిలువవలెను. అగ్ని యొక్క ఆవాహన మింతకుమున్ను దెల్పితిని.పూర్వదక్షిణ దిశను (ఆగ్నేయమును మూలను)అగ్ని ప్రియా! వరదా! పూర్వదక్షిణ దిశా! రమ్మని ఆవాహనము సేయవలెను. దక్షిణదిశకు యముని బిలువవలెను. నేనందరియందు దక్షిణ= సమ్ప్రీతి దక్షిణదిశను సర్వకర్మ శోభన దేవతను బిలువవలెను. విరూపాక్ష దేవతావాహన మింతకుమున్ను జెప్పితిని. నిరంతరైశ్వర వర్ధిని రమ్మని నిరృతిని బిలువవలెను. వరుణు నాహ్వానము దెల్పియున్నాను. వరుణ దిక్కును (పడమటి దిశను)శుభప్రదవు వరుణుని ప్రియురాలవు రమ్మని పిలువవలెను మహాత్ముడగు వాయుదేవుని యావాహనము లోగడ జెప్పియున్నాను. వరదురాలా! పశ్చిమోత్తర దిగ్దేవతా! వాయవ్యవి దిగ్దేవతా రమ్మని పిలువవలెను. ధనదుని వైశ్రవణుని (విశ్రవసుడను ప్రజాపతికొడుకును) ప్రభువును రాజరాజ! సర్వయజ్ఞ ధనములకును ప్రభువ నీవు రమ్మని కుబేరునింబిలిచి కుబేరపాలితయగు సౌమ్యదిశను (ఉత్తర దిక్కును) సర్వకర్మ సుశోభనవు రమ్మని పిలువవలెను. అవ్వల త్ర్యంబక దేవుని ఆవాహనము చెప్పబడినది. ప్రాగుత్తర దిశను (ఈశాన్యదిక్కును) శుభప్రదయైన దానిం బిలుతునని శివపాలిత దిగ్దేవతా! యని సంబోధింప వలెను.

సర్వా నావాహయిష్యామి పూర్వకుంభేషు సాగరాన్ । రత్నాఢ్యాః సమాయాన్తు చత్వార ఇహ సాగరాః ॥
ఈశాన్యాం దిశి యః కుంభః పూర్వ స్తస్య సాగరః । ఆగ్నేయ్యాంతు సమాయాతు దక్షిణే దక్షిణ శ్శివః ॥
పశ్చిమస్తు సమాయాతు కుంభే దక్షిణ పశ్చిమే । ఉత్తరశ్చ తదాఽభ్యేతు కుంభే వై పశ్చిమోత్తరే ॥ 115
ఆవాహితానాం కర్తవ్యం భూమౌకృత్వా తతశ్శిరః । ప్రణామ మభివాద్యంచ తతో మంత్ర ముదీరయేత్ ॥ 116

భవతాం హి ప్రసాదేన భవతాం ప్రతిపూజనై: ।
ప్రయతిష్యే యథాశక్త్యా తన్మేఽనుజ్ఞాతు మర్హథ ॥ 117
యుష్మాకం పూజనం కర్తుం కేన శక్యం యథా విధి ।
యుష్మత్పూజావిహీనేన కుతో లభ్యం మహత్పదమ్ ॥ 118
తత: కర్తుం యథా శక్త్యా భవతాం ప్రతిపూజనే ।
వరదా: ప్రయతిష్యామి తన్మే ఽనుజ్ఞాతు మర్హథ ! ॥ 119
భవత్పూజావిధా వస్మిన్ బహువిఘ్నం సదైవతు ।
స్వాం స్వాం దిశ మధిష్ఠాయ దిక్పాలా: దీప్త తేజస: ॥ 120
ఉత్పాదయన్తు సకలాన్ విఘ్నాన్మే సముపస్థితాన్ ।
అస్మా ద్దేశాత్ ప్రణశ్యన్తు యజ్ఞఘ్నా బ్రహ్మరాక్షసా: ॥ 121
వినాయకా విఘ్నకరా మహోగ్రా యజ్ఞద్విషో యే పిశితాశనాశ్చ ।
సిద్ధార్థకై ర్వజ్రసమానకల్పై ర్మయా నిరస్తా: స్వగృహం ప్రయాన్తు ॥ 122
ఏతావ దుక్త్వా వికిరేత విద్వాన్ సిద్ధార్థకా దిక్షు తథా విదిక్షు ।
రక్షోగణం చాత్ర తదైవ మంత్రం వక్తవ్య ముచ్చై ర్ద్విజ పుంగవేన ॥ 123
సర్వ గ్రహాణాం యజనే ప్రదిష్టం సర్వౌషధై స్స్నాన మదీన సత్త్వ! ।
బీజైస్సమగ్రైశ్చ తదైవ గంధై:మృద్భిశ్చ రత్నైశ్చ తథా జలైశ్చ ॥ 124

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
గ్రహరావాహన మంత్రాధ్యాయో నామ పంచనవతి తమోఽధ్యాయ:

మండలము నలుమూలలందు నిలిపిన పూర్ణకుంభములందు సర్వ సాగరములను; ఆవాహనము సేయవలెను. ఈశాన్య దిశనున్న పూర్ణకుంభమున తూర్పు సముద్రము ఆగ్నేయదిశ కుంభమందు దక్షిణ సముద్రము నైరృతి మూల నున్న కుంభమందు పశ్చిమ సముద్రమును వాయవ్యమూల కుంభమందు ఉత్తర సముద్రమును వచ్చుగాక! యని సముద్రముల నావాహనముసేసి; మీ ప్రసాదముచే మీ మీ పూజలం యథాశక్తి ప్రయత్నించుచున్నాను. దాని ననుమతింపుము. మీపూజ యథావిధిగ జేయ నెవ్వని తరమగును? మీపూజసేయని వానికి మహాపదవి (స్థానము) ఎట్లు లభించును? అందువలన యథాశక్తి మీరు వరదులగునట్లు పూజింప యత్నించుచున్నాను. అందు నాకు మీరనుజ్ఞ దయసేయుడు. ఈ మీ పూజావిధి యందెల్ల వేళల పెక్కుమంది తెలిసిన పండితులున్న యీపూజయందు తమతమ దిక్కులందున్న దిక్పాలురు దీప్త తేజస్కులు, నాకుగల్గు విఘ్నములన్నిటిని దొలగింతురు గాక! యజ్ఞఘాతకలు బ్రహ్మరాక్షసు లీ ప్రదేశమునుండి తొలగిపోవుదురుగాక! వినాయకులు విఘ్నకరులు మహోగ్రులునయిన యజ్ఞద్వేషులు పిశితాశనులు (మాంసభక్షకులు రాక్షసులు) వజ్రాయుధముతో సమానమునైన యీ ఆవాలచేత (సిద్ధార్థము= అర్థసిద్ధదమ్ము) నాచేత నిరస్తులై తమ యింటికి పోవుదురు గాక! అని పలికి యజ్ఞ విధిజ్ఞుడైన యజమాను డావాలను ఎనిమిది మూలలం జల్లవలెను. బ్రాహ్మణపుంగవుడు రక్షోఘ్నమంత్రమును గూడ గట్టిగా పఠింపవలెను. సర్వగ్రహయజ్ఞములందు సర్వౌషధులతో స్నానము చెప్పబడినది. సర్వబీజములు గంధమును పుణ్యమృత్తికలు రత్నములు నింపిన జలములచే నదివివాతమైనది.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమ ఖండమున గ్రహనక్షత్రావాహన
మంత్రాధ్యాయమను తొంబది యైదవ అధ్యాయము.

## తొంబదియారవ అధ్యాయము - అనులేపకథనము

వజ్ర ఉవాచ :

సర్వేషాం తు సమాచక్ష్వ గంధమాల్యం తథైవచ ।
ధూపం బ్రహ్మన్! స నైవేద్యం పానంచైవ పృథక్ పృథక్ ॥ 1
హోమద్రవ్యం తథా మంత్రం దక్షిణాశ్చ భృగూత్తమ! ।
ఏకస్త్వం సర్వవిద్ బ్రహ్మన్! బ్రహ్మేవా జగతాం పతిః ॥ 2

మార్కండేయ ఉవాచ : 3

ధ్రువస్థాన నివిష్టానాం దేవానాం చ మహీపతే! । సర్వాసాం చందనం దేయం నిత్యమేవ పృథక్పృథక్ ॥ 3
సూర్యాయ కుంకుమం దేయం కర్పూరం శశినే తథా ।
భౌమాయ చందనం రక్తం చాగురుం శశిజాయ చ ॥ 4
జీవాయ చందనం దేయం కుంకుమేన విమిశ్రితమ్ । శుక్రాయ చందనం శ్వేతం సౌరాయచ మృగోద్భవమ్ ॥ 5
కుంకుమేన యుతం దద్యాద్దానవాయ మృగోద్భవమ్ । అగురుం కుంకుమం చోభౌ సుదేయౌ ధూమకేతవే ॥ 6
కుంకుమం కృత్తికానాంతు రోహిణీనాం మృగోద్భవమ్ ।
ఇల్వలానాం చ కర్పూరం రౌద్రే నాగమదం తథా ॥ 7
ఆదిత్యస్య ప్రదాతవ్యా వుభౌ కుంకుమచందనౌ । ఉశీరచందనౌ దేయా వాశ్లేషా పైత్ర్యయోస్తథా ॥ 8
ప్రియంగు చందనౌ దేయౌ తథా భాగ్యస్య పార్థివ! । అర్యమ్ణశ్చ ప్రదాతవ్యౌ చందనౌ శ్వేత రక్తకౌ ॥ 9
సావిత్రస్య ప్రదాతవ్యం కుంకుమం పృథివీ పతే ।
త్వాష్ట్రస్య చందనం దేయం కుంకుమం చమృగోద్భవమ్ ॥ 10
జాతీఫలయుతం దేయం వాయవ్యస్య చ చందనం । విశాఖా యాః ప్రదాతవ్యం కుంకుమం చందనం తథా ॥ 11
తురుష్క సహితం దేయం తథా మైత్రేయచందనమ్ ।
జ్యేష్ఠాయాశ్చ ప్రదాతవ్యం చందనం కుంకుమం తథా ॥ 12
మూలాయ శింశుపా సారం తథా దేయం మృగో ద్భవమ్ ।
ఆప్యాయ కుష్ఠ సంయుక్తం దాతవ్యం చందనం భవేత్ ॥ 13
వైశ్వదేవాయ మృగజం చందనా గురుణీ తథా । బ్రహ్మేయ చందనం దేయం వైష్ణవాయా గురుం తథా ॥ 14
జాతీలవంగౌ దాతవ్యౌ సుపిష్టౌ వాసవాయ తౌ । వారుణాయచ కర్పూర మాజాహి ర్బుధ్న్యయోస్తథా ॥ 15
పౌష్ణాయ చందనం రక్త మాశ్వినాయ తథా సితమ్ ।
యామ్యాయాగురు సంయుక్తం తథా దేయం మృగోద్భవమ్ ॥ 16
సమాన దేవ నక్షత్రం కథితం చ త్వయా దిశం । ఉత్తరాయాస్తథా దేయే చందనాగురుణీ శుభే ॥ 17
సాగరాణాం ప్రదాతవ్యం సర్వేషా మేవ చందనమ్ । అలాభేతు తథా దేయం సర్వేషా మేవ చందనమ్ ॥ 18
మంగల్యం తత్పవిత్రం చ దేవానాం దయితం చ తత్ ।
ధార్యం చ దేయం తద్రాజన్! తత్ర లక్ష్మీః ప్రతిష్ఠితా ॥ 19

యద్యద్గ్రహస్యాఽభిహితం మయైత ద్ధృక్షస్యవా భూమిపతి ప్రధాన! ।
తద్దేవతాయాశ్చ తదేవ దేయం దిశ స్తథా నాత్ర విచారణాఽస్తి ॥ 20

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
అనులేప కథనం నామ షణ్ణవతి తమోఽధ్యాయః

వజ్రుడు గ్రహనక్షత్రములకు సమర్హములైన గంధమాల్య ధూపదీప నైవేద్య పానాది సామగ్రిని వేర్వేర హోమద్రవ్యము మంత్రము దక్షిణయు నానతిమ్ము : నీ వొక్కడవ యిది సర్వము నెరింగినవాడవు. జగత్పతి బ్రహ్మయునన మార్కండేయుడనియె: ధ్రువస్థానమందున్న దేవతల కందరకు వేర్వేర నిత్యము గంధము నొసంగవలెను. సూర్యునకు కుంకుమము (కుంకుమ పువ్వు) చంద్రునికి పచ్చకర్పూరము కుజునికి ఎఱ్ఱచందనము బుధునకు అగురు గురునకు కుంకుమపువ్వుతో చందనము (మంచి గంధము) శుక్రునికి తెల్లగంధము శనికి కస్తూరి కుంకుమపువ్వుతో గూడినది. రాహువునకు కస్తూరి కేతువునకు అగురు కుంకుమ పువ్వు రెండును గలిపి యీయవలెను. కృత్తికలకు కుంకుమపువ్వు రోహిణికి కస్తూరి ఇల్వలకు కర్పూరము రౌద్రమునకు నాగమదము ఆదిత్యునకు కుంకుమ చందనములు రెండును ఆశ్లేషకు మఘకు వట్టివేరు చందనమును భాగ్యమునకు ప్రియంగు చందనములు అర్యమ్ణమునకు తెలుపు ఎరుపు చందనములు సావిత్రమునకు కుంకుమపువ్వు త్వాష్ట్రమునకు చందనము, కుంకుమపువ్వు కస్తూరి వాయవ్యమునకు జాజికాయతో చందనము విశాఖకు కుంకుమ చందనములు మైత్రమునకు తురుష్కసహిత చందనము జ్యేష్ఠకు చందన కుంకుమములు మూలకు శింశపాసారము కస్తూరి, అప్యమునకు (పూర్వాషాఢకు) కుష్ఠచందనములు వైశ్వదేవమునకు కసూరి చందనము అగురు బ్రాహ్మమునకు చందనము వైష్ణవమునకు అగురును వాసవమునకు చక్కగా నూరినజాజిలవంగములమద్ద, కారుణమునకు పచ్చకర్పూరము అజ-అహిర్బుధ్న్యములకు పౌష్ణమునకు (రేవతికి) రక్తచందనము అశ్వినికి తెల్లచందనము యామ్యమునకు (భరణికి) అగురుతోకస్తూరి, ఒకదానితో నొకటిసరియైన దేవత నక్షత్రము దిక్కుతెల్పినాము. ఉత్తరదిశకు చందనాగురులు సర్వసాగరములకు చందనము, అయాద్రవ్యాలు లభించనప్పుడందరికిని చందనము నొసంగవలెను. గంధము మంగల్యము పవిత్రము దేవతల కిష్టము. అదితాసుధరింప నయినది. సమర్పింపదగినదికూడ. గంధమందు లక్ష్మి ప్రతిష్ఠితయైనది. ఏదియేది గ్రహమునకు జెప్పితినోయదే నక్షత్రమునకు నక్షత్రాధిదేవతకును దిక్కులకును దిగ్దేవతలకునుగూడ సమర్పింపదగినది. ఇందు విచారణలేదు.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున అనులేపకథనమను తొంబదియారవ యధ్యాయము

## తొంబదిఏడవ అధ్యాయము - గ్రహనక్షత్రవిశేషపుష్పదేయాదేయ నిరూపణము

మార్కండేయ ఉవాచ :

సవర్ణాని గ్రహర్క్షాణాం దిశాంచ జగతీపతే! । నిత్యం దేయాని వాసాంసి పతాకాశ్చ విజానతా ॥ 1
భూషణాని చ దేయాని కాంచనాని శుభాని చ । రత్న చిత్రాణి రమ్యాణి యథాశక్త్యా నరాధిప! ॥ 2
ధ్రువస్థాన నివిష్టానాం దేవతానాం మహీప తే! । జాతీ పుష్పాణి దేయాని సర్వేషా మవిశేషతః ॥ 3
రక్త పద్మాని సూర్యస్య శ్వేత పద్మాని చేందవే । బంధూ కాని చ భౌమాయ బుధా యేందీవరాణిచ ॥ 4
జీవాయ యూథికా పీతా సితాయ చ తథా సితా । బాణపుష్పాణి సౌరాయ రాహవే పాటలాని చ ॥ 5
తథా దమనకం దేయం కేతవే వసుధాధిప! । కృత్తికా సు చ దేయాని రాజన్! రక్తోత్పలాని చ ॥ 6
చంపకాని చ రోహిణ్యా ఇల్వలాయాః సితోత్పలమ్ । ధత్తూరకా ఋద్యార్ద్రాయా ఆదిత్యస్య చ మల్లికా ॥ 7

చంపకాస్యేవ పుష్యస్య జాతీస్యా త్సార్ప పిత్ర్యయోః । భాగ్యస్య కాన్తా దాతవ్యా ఆర్యమ్ణ శ్చ సువర్చలా ॥
సావిత్ర త్వాష్ట్రయో ర్నిత్యం బంధూక కుసుమాని చ । వాయవ్యస్య చ దేయాని సింధు వారాణి పార్థివ! ॥ 9
ఐంద్రాగ్న్యస్య చ దేయాని కురండ కుసుమానిచ । రక్తాశోక స్య పుష్పాణి తథా మైత్రస్య పార్థివ! ॥ 10
చంపకాని చ శాక్రస్య తథా దేయాని భూపతే! । మూలస్యచ తథా దేయం రాజన్! కృష్ణ కుహేటకమ్ ॥ 11
కల్హారాణి తథాఽఽప్యస్య వైశ్వదేవస్య కుబ్జకమ్ ।
బ్రాహ్మస్య జాతీ పుష్పాణి వైష్ణవస్య చ చంపకమ్ ॥ 12
పాటలా వాసవ స్యాఽపి వారుణ స్యోత్పలాని తు । అర్కపుష్పాణ్య థా పస్య తథా దేయాని పార్థివ! ॥ 13
అహిర్బుధ్న్యస్య దేయాని ధత్తూర కుసుమాని చ । కరవీరః పుష్పాణి తథా పౌష్ణస్య పార్థివ! ॥ 14
చూతపుష్పాణి దేయాని అశ్వినస్య నరాధిప! నీలోత్పలాని యామ్యస్య తథా దేయాని భూపతే! ॥ 15
సమానవేశ నక్షత్ర కథితాని తథా దిశామ్ । ఉత్తరాయాశ్చదేయాని నాగపుష్పాణి పార్థివ! ॥ 16
సాగరాణాంచ దేయాని కమలాని మహీ పతే! । ఉక్తాఽలాభే ప్రదేయాని సవర్ణాని నరాధిప! ।
స్వకాలయాని పుష్పాణి సర్వేషా మవిశేషతః ॥ 17
యద్యద్రహస్యాభిహితం మయాఽత్ర ఋక్షస్యవా భూమిపతి ప్రధాన! ।
తద్దేవతాయాశ్చ తదైవదేయం దిశ స్తథా నాఽత్ర విచారణాఽస్తి ॥ 18

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
గ్రహర్క్ష విశేష పుష్పదేయాఽదేయ కథనం నామ సప్తనవతి తమోఽధ్యాయః॥

మార్కండేయుడనియె గ్రహనక్షత్రములకు దిక్కులకు ఆయాదేవతలతో సమానమైన రంగులుగల వస్త్రములు పతాకలు బంగారువస్తువులను నీయవలెను. చిత్రవర్ణములయ్యు రమ్యములయిన రత్నములును యథాశక్తి సమర్పింపవలెను. ధ్రువస్థానమందున్న దేవతలకందరకు జాజిపువ్వుల నీయవలెను. సూర్యునకు ఎఱ్ఱతామరపువ్వులు కుజునకు బంధూకములు (ఎఱ్ఱగానుండు మంకెనపువ్వులు) బుధునకు నల్లకల్వలు గురునికి పచ్చని యూధికలు శుక్రునికి తెల్లని శనికి బాణ పుష్పములు రాహువునకు పాటలములు కేతువునకు దమనకము (దవనమనబడును) నీయవలెను. కృత్తికలకు ఎఱ్ఱకలువలు రోహిణికి చంపకములు ఇల్వలకు (మృగశిరకు) తెల్లగలువ ఆర్ద్రకు దుత్తూరము ఆదిత్యునకు (పునర్వసువునకు) మల్లి పుష్యమికి చంపకము (సంపెంగ) ఆశ్లేషకు మఘకు (పిత్ర్యమునకు) జాజి భాగ్యమునకు (పుబ్బకు) కాంత అర్యమ్ణమునకు సువర్చల సావిత్ర త్వాష్ట్రములకు బందూకములు (మంకెన) వాయవ్యమునకు సింధువారములు = వావిలిపూలు, ఐంద్రాగ్న్యము(న)లకు కురండములు అనూరాధ నక్షత్రమునకు ఎఱ్ఱఆశోకములు శాక్రము(జ్యేష్ఠ)నకు చంపకములు, మూలకు కృష్ణ కుహేటకము = అప్యమునకు కల్హారములు (రక్తసంధ్యకమను ఎఱ్ఱతామరపువ్వు) వైశ్వదేవమునకు కుబ్జకము బ్రాహ్మమునకు జాజిపువ్వులు వైష్ణవమునకు దుత్తూరములు పేష్ణమునకు (రేవతికి) కరవీరములి అశ్వనికి మామిడి పువ్వులు యామ్యమునకు (భరణికి) నల్లగలువలు సమర్పింపనయినవి గ్రహనక్షత్రములకు దిక్కులకు గల పోలిక ననుసరించి యివి చెప్పబడినవి. ఉత్తరకు నాగపుష్ప మురీయవలెను. సాగరములకు కమలములు సమర్పింపవలెను. ఈచెప్పినవి దొరకని యెడల వానికిదైనవి సమానమైన రంగుగలవి, ఆయాకాలములందు పూయు పువ్వులను నిర్విశేషముగ సమర్పింపవచ్చును. ఏయే గ్రహమునకు నక్షత్రమునకు నిక్కడ నే నేదేదిచెప్పితిని దానిదాని తద్దేవతకు దిక్కులకును గూడ సమర్పింప వలయును. ఇచట మరి విమర్శలేదు.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున గ్రహనక్షత్ర విశేష పుష్ప
దేయాదేయనిరూణమను తొంబది యేడవ అధ్యాయము.

## తొంబదియెనిమిదవ అధ్యాయము - గ్రహనక్షత్ర ధూపదీప విధానము

మార్కండేయ ఉవాచ :

ధ్రువస్థాన నివిష్టానాం దేవతానాం మహీపతే! । గుగ్గులుం ఘృతసంయుక్తం ధూపం దద్యా ద్విచక్షణః ॥ 1
ధూపం త్వగురు రర్కాయ నమేరుంచ తథేందవే । భౌమాయ గుగ్గులుం దద్యాత్సర్జం దద్యా ద్బుధాయచ ॥
శిలాజతు తు జీవాయ దాతవ్యం పార్థివోత్తమ! । శ్రీవాసకం తు శుక్రాయ నఖం సౌరాయ పార్థివ ॥ 3
మదశ్చ రాహవే దేయః కేతవే చ వసా తథా ॥
కృత్తికానాం ఘృతం దేయం రోహిణీనాం చ చందనమ్ ।
ఇల్వలానాం చ కర్పూర మార్ద్రాయైంచ నఖం తథా ॥ 4
పునర్వసో శ్చాప్యగురుం పుష్యస్యచ తథాక్షతమ్ । శ్రీవాసకం చ సార్పస్య పైత్రస్యచ తథా ఘృతమ్ ॥ 5
ప్రియంగుం మధునా యుక్తం భాగ్యస్య సఘృతం భవేత్ ।
ఘృతేన మధునా యుక్త మార్యమ్ణస్య శతావరీమ్ ॥ 6
కుందురుంచైవ హస్తాయ త్వాష్ట్రాయైచ పలం భవేత్ ।
వాయవ్యాయ చ కర్పూర మైంద్రాగ్న్యాయ మిసి ర్భవేత్ ॥ 7
మైత్రాయ కుంకుమం దేయ శాక్రాయ మృగజం భవేత్ ।
శాటీ మూలం చ మూలాయ ఆప్యాయ నలదం తథా ॥ 8
గుగ్గులుం వైశ్వదేవాయ బ్రాహ్మాయ ఘృతచందనే । వైష్ణవాయాగురుం దద్యా ద్వాసవాయ తథా పలమ్ ॥ 9
వారుణాయ తథో శీరమాజాయ చ ఫలం భవేత్ । ఆహిర్బుధ్న్యాయ దాతవ్యం దేవదారుం నరాధిప! ॥ 10
కంకోలికాని పౌష్ణాషాయ ఆశ్వినాయచ చందనమ్ । యామ్యాయ గుగ్గులు ర్దేయః సతతంభూతి మిచ్ఛతా ॥ 11

మార్కండేయుడనియె. ధ్రువస్థానమందున్న దేవతలకు గుగ్గులు నేతితో కలిపి ధూపమువేసి యాఘ్రాణింప జేయవలెను. రవికి అగోరు శశికి నమేరువు కుజునికి గుగ్గులు బుధునికి సర్జము గురునికి శిలాజిత్తు శుక్రునికి శ్రీవాసకము శనికి నఖము రాహువునకు మదము కేతువునకు వస ధూపము వేయవలెను. కృత్తికకు నెయ్యి రోహిణికి చందనము మృగశిరకు కర్పూరము ఆర్ద్రకు నఖము పునర్వసువునకు అగురు పుష్యమికి అక్షతము ఆశ్లేషకు శ్రీవాసకము మఖకు నెయ్యి పూర్వఫల్గునికి నెయ్యి తేనెతోడి ప్రియంగువు ఉత్తరఫల్గునికి (అర్యమ్ణము) తేనెతోడినెయ్యి. హస్తకు శతావరి కుందురువు చిత్తకు (త్వాష్ట్రమునకు) పలము- వాయవ్యమునకు (స్వాతికి) కర్పూరము ఐంద్రాగ్నమునకు (విశాఖకు) మిసి (పొలామిశ్రికాబోలు) అనూరాధకు కుంకుమపువ్వు జ్యేష్ఠకు (శాక్రము) కస్తూరి మూలకు శాటిమూలము ఆప్యమునకు (పూర్వాషాఢకు నలదము వైశ్వదేవమునకు గుగ్గులు బ్రాహ్మము లకు నెయ్యి చందనము వైష్ణవమునకు అగురు వాసవమునకు పలము వారుణమునకు పట్టివేరు. అజమునకు ఫలము అహిర్బుధ్న్యమునకు దేవదారువు పౌష్ణమునకు కంకోలికములు అశ్వినికి చందనము భరణికి గుగ్గులు ధూపము వేయవలెను. దానివలన భాగ్యవంతుడగును. ॥

కర్పూరం కుంకుమంచైవ చందనం మృగజం తథా ।
తురుష్క మగురుం కాంతాం గుగ్గులుంచ క్రమాద్దిశామ్ ॥ 12
ప్రాచ్యాదీనాం మహీనాథ! సాగరాణాంచ చందనమ్ ।
సర్వాఒభావే చ దాతవ్యః సర్వేషామేవ గుగ్గులుమ్ ॥ 13

వనస్పతి రసోదివ్యః గంధాఢ్యో గంధ ఉత్తమః । ఆఘ్రాణ స్సర్వదేవానాం గుగ్గులు ప్రవర స్మృతః ॥ 14
దీప శ్చాజ్యేన దాతవ్యః సర్వేషాధమ విశేషతః । తైలేన వా మహీనాథ! వసాఽఽద్యేన వివర్జయేత్ ॥ 15
యద్యద్గ్రహ్యస్యాఽభిహితం మయాఽత్ర ఋక్షస్యవా భూమిపతిప్రధాన! ।
తద్దేవతాయాశ్చ తథైవ దేయం దిశాం తథా నాత్ర విచారమస్తి ॥ 16

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
గ్రహర్క్ష ధూప దీపో నామ అష్టనవతి తమోఽధ్యాయః

ఎనిమిది దిక్కులకు వరుసగా పచ్చకర్పూరము కుంకుమపువ్వు చందనము కస్తూరి తురుష్కము అగరు కాంత గుగ్గులు ధూపము వేయవలెను. సాగరమునకు చందనము. ఈ చెప్పినవి లేనియెడ గుగ్గులు ధూపము వేయవలెను. గుగ్గులు వనస్పతి రసము దివ్యము. పరిమళమంతమయిన ఉత్తమ గంధము. సర్వదేవతా సాధారణమైన శుభప్రదమైన యాఘ్రాణము గుగ్గులు. అందరకు ఆవునేతితో దీపము పెట్టినలునది నువ్వుల నూనెయునుయోగ్యమే. వసతోడి నూనెదీపము పనికిరాదు. గ్రహమున కేదేదిచెప్పబడినదో అదిమరి నక్షత్రమునకు తదధిదేవతకు దిక్కులకు సర్వమగును. ఇందు మరి విమర్శ లేదు.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున గ్రహనక్షత్రధూప దీపములు అనుతొంబదియెనిమిదవ అధ్యాయము.

## తొంబదితొమ్మిదవ అధ్యాయము - గ్రహనక్షత్ర దేయాదేయవిధి

మార్కండేయ ఉవాచ :

ధ్రువస్థాన నివిష్టానాం దేవతానాం నరాధిప! । దధ్యోదనం పాయసంచ ప్రత్యేకం వినివేదయేత్ ॥ 1
గుడౌదనం గుడాఽపూపాః ఫలాని గుడపాయసమ్ । నివేదనం తు సూర్యాయ ధాన్యలాజే మధూత్కటే ॥ 2
సర్పి ర్దధ్యోదనం చైవ ఫలాని వివిధాని చ । మోదకాని చ ముఖ్యాని పాయసం శశిన స్తథా ॥ 3
గుడౌదనం గుడాఽపూపా యావకం గుడ పాయసమ్ । కృసరం చ తథా దేయం భూమిపుత్రాయ పార్థివ! 4
క్షీరౌదనం స సర్పిష్కం క్షీర వృక్ష ఫలానిచ । క్షీరిణ్య శ్చ తథౌషధ్యో సోమ పుత్రాయ దాపయేత్ ॥ 5
శింబిధాన్య వికారాణి బిల్వా న్యామలకాని చ । ఘృతౌదనం చ జీవాయ దాతవ్యం భూతి మిచ్ఛతా ॥ 6
దధ్యోదనం పాయసం చ మధునా సర్పిషాయుతమ్ । ఉత్సారికం మోదకాంశ్చ భార్గవాయ నివేదయేత్ ॥ 7
మాషౌదనం ససర్పిష్కం కృసరం దధి యావకమ్ । నివేదయేత్తు సౌరాయ పలుత్థం చణకై స్సహ ॥ 8
ప్లక్షం దధిత్థంచ తథా పలలం చైవ రాహవే । మాషౌదనం తథా దేయం యవాపూపాం స్తథైవచ ॥ 9
తల్లోపికా స్తథా మత్స్యాః కేతవే కృసరం తథా । వసా సర్పీంషి చ తథా దేయాని మనుజేశ్వర! ॥ 10
మధులాజే కృత్తికానాం కుల్మాషం దధి సర్పిషీ । రోహిణీనాంచ బీజాని దధి పిష్ట వృషాణి చ ॥ 11
దధ్యోదకం చేల్వాలానాం మృగ మాంసం తథైవచ । రుధిరం కృసరం చోభౌ రౌద్రస్య వినివేదయేత్ ॥ 12
పునర్వసోః ప్రదాతవ్యం పలలం సలిలాయనమ్ । పాయసం చ ససర్పిష్కం తిష్యాయ వినివేదయేత్ ॥ 13
పిష్ట సర్వాణి సార్పస్య క్షౌద్రం దధియుతం తథా । తిలౌదనం స పలలం పైత్ర్యస్య వినివేదయేత్॥ 14
షష్టికాన్నంచ భాగ్యస్య మధు సర్పీంషి చాప్యథ । ఆర్యమ్ణాయ తిలా పూపాన్ షష్టికాన్నం తథైవచ ॥ 15
ప్రియంగు తండులై స్సిద్ధం సావిత్రాయచ పాయసమ్ ।
త్వాష్ట్రస్య చైవ పీయూషం ద్విజా చిత్రాండజా స్తథా ॥ 16

వాయవ్యస్యచ ఫల్గూని మూలకాని శుభాని చ । కులత్థాని విశాఖాసు యవాఽపూపా స్తథై వచ ॥ 17
కులత్థ భక్తం మిత్రాయ దధి క్షౌద్రాన్వితం తథా । ఘృతౌదనం చ శాక్రాయ ఫలాని వివిధాని చ ॥ 18
మూలాని చ విచిత్రాణి తథా మూల ఫలాని చ । ఆప్యస్య సక్తవో దేయాః మధు మిశ్రోదకై స్సహ ॥ 19
సక్తవో వైశ్వదేవాయ మధులాజై తథైవ చ । బ్రాహ్మయ పాయసం దేయం సగుడం భూతి మిచ్ఛతా ॥ 20
దధ్యోదనం పాయసం చ వైష్ణవాయ నివేదయేత్ । ఘృతోదకంచ శాకాని వాసవాయ నివేదయేత్ ॥ 21

పైష్టం బిడాలం శాకాంశ్చ వారుణాయ తథా దధి ।
ఆదాయ మాంస మాజం తు వ్యాఘ్రిం పిష్టకృతం దధి ॥ 22

ఆహిర్బుధ్న్యాయ మాంసాని తథైవచ రసౌదనమ్ । పౌష్ణాయ సక్తవో మాషా మాషయుక్తాశ్చసక్తవః ॥ 23
అశ్వం పిష్టకృతం మాషాన్ యావకంచ తథా దధి । అశ్వినస్యాథ యామ్యస్య తండులాని తిలాని చ ॥ 24

రాజన్! పైష్టాశ్చ పశవో మాంసం పక్వామకం తథా ।
పాయసం సఘృతం క్షౌద్రం పూర్వస్యాం వినివేదయేత్ ॥ 25

ఆగ్నేయ్యాం దిశి రాజేన్ద్ర! కృసరం క్షీర మిశ్రితమ్ । దక్షిణస్యాంచ దాతవ్యం కృసరం తైల మిశ్రితమ్ ॥

నైరృత్యాంచ ప్రదాతవ్యం కృసరం మత్స్య సంయుతమ్ ।
కుల్మాషాంశ్చైవ మత్స్యాంశ్చ పశ్చిమస్యాం నివేదయేత్ ॥ 27

వాయవ్యాయాశ్చ మత్స్యాని తథా క్షీరోదనాని చ । ఐశాన్యాయాః ప్రదాతవ్యా ఘృతక్షీరోదనా వుభౌ ॥ 28

మోదకోల్లోపికా మిశ్రాః సాగరాణాం బలిర్భవేత్ ॥ 29
యద్యద్గ్రహస్యాఽభిహితం మయాఽత్ర ఋక్షస్యవా భూమిపతిప్రధాన! ।
తద్దేవతాయాశ్చ తదేవందేయం దిశ స్తథా నాఽత్ర విచారణాఽస్తి ॥ 30

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
గ్రహర్క్ష నైవేద్య దేయాదేయ విధిర్నామ నవనవతి తమోఽధ్యాయః

మార్కండేయుడనియె. ధ్రువస్థానమందున్న దేవతలకు దధ్యోదనము పాయసము ప్రత్యేకముగ నివేదింపవలెను. గుడాన్నము (బెల్లపు అన్నము) బెల్లపు అప్పాలు పండ్లు బెల్లపు పాయసము సూర్యునికి నివేదనీయములు. తేనెతో తడిపిన ధాన్యపు పేలాలు నెయ్యి దధ్యోదనము పండ్లు పలురకములు మోరకములు పాయసము చంద్రునికి నివేదనీయములు. గుడాన్నము గూడా పూపములు యవపిష్టముతోడి బెల్లపు పాయసము కృసరము = పిలగము భూమిసుతునకుచితము. క్షీరాన్నము ఆవునేతితో క్షీర వృక్షఫలములు పాలుగల ఓషధులు బుధునికి నివేదనయములు-శింబిధాన్య వికృతులు బిల్వములు (మారేడు పండ్లు) ఉసిరిపండ్లు నేతియన్నముగురునికి అర్హము. భూతిప్రదము. శుక్రునికి దధ్యోదనము తేనెతో ఆవునేతితోడి పాయసము ఉత్కారికము = బెల్లమడుము. మోదకములు శుక్రునికి నివేదింప నగును. మాషోదనము (మినపన్నము) ఆవునేతితో కృసరముపెలుగుయావకాన్నము శనికి దగినది. సెనగలతో ఉలవలయన్నము ప్లక్షము పెలుగులోని పలలము రాహువునకు దగును. మాషాన్నమూ యవలపిండితోజేసిన అప్పములు లోపికలు మత్స్యములు కృసరము కేతువున కర్హములు.

వస నెయ్యి తేనె పేలాలు కృత్తికలకు. భరణికి కుల్మాషము = కాలుమినుముపెలుగునెయ్యి రోహిణికి బీజములు పెలుగు పిండి వృషములు = మూషికములు మృగశిరకు దధ్యోదకము మృగమాంసము రుధిరము (రక్తము, కృసరము ఆర్ద్రకు పునర్వసువునకు పలలము = మాంసము

తిష్యమునకు (పుష్యమికి) నేతితో పరమాన్నము ఆశ్లేషకు పిష్టసర్పములు (పిండితోజేసిన పాములు) పెఱుగుతో తేనె మృఘకు మాంసముతోగూడ తిలాన్నము పుబ్బకు షష్టికాన్నము తేనె నెయ్యి (షష్టికలను బియ్యము) ఉత్తరఫల్గుణ ఆర్యమ్ణునకు తిలాపూపములు షష్టికాన్నము హస్తకు ప్రియంగు తండులతోడి పాయసము త్వాష్ట్రమునకు (చిత్రకు) పీయూషమూ (మీగడ) చిత్రాండజములు వాయవ్యమునకు (స్వాతికి) ఫల్గువులు = బొమ్మమేడి మూలకములు = ముల్లంగివిశాఖకు కులుత్థములు. ఉలవలు యవాపూపములు. అనూరాధకు కులత్థాన్నము తేనె పెఱుగుతో జ్యేష్ఠకు ఘృతాన్నమూ వివిధ ఫలములు మూలకు విచిత్రములైన దుంపలు పండ్లు సక్తువు తేనెతోడి యుదకములతో పూర్వాషాఢ సక్తువు తేనె పేలాలు ఉత్తరాషాఢకు పాయసము బెల్లముతో, శ్రవణమునకు బెల్లపు పాయసము ధనష్ఠదకుధ్యోదనము పాయసము శతభిషమునకు ఘృతోదనయు కూరలు పూర్వాభాద్రనుపైష్ట బిడాలము శాకములు పెరుగు ఉత్తరాభాద్రకు మేకమాంసముపిండతో జేలస్థ పులి ఉత్తరాభాద్రకు మాంసము రసౌదనము రేవతికి సక్తువు మినుముతోడి సక్తువు గారెలు పిండితో జేసిన అశ్వము మినప వడలు యావకము పెఱుగు అశ్విని, భరణికి బియ్యము, నువ్వులు; పిష్టపశూవులు మాంసము పక్వామకము—పాయ ము నెయ్యి తేనె తూర్పుదిశకు. ఆగ్నేయమునకు పాలుతోడి కృసరము =పులగము దక్షిణదిశకు తైలమిశ్రిత కృసరము నైరృతిమూలకు మత్స్య సంయుక్తమైన కృసరము. పడమటి కుల్మాషములు చేపలు వాయవ్యమునకు చేపలు క్షీరాన్నము ఘృతక్షీరోదనము మశాన్న దిశకూ సమర్పింపనగును ఉల్లోపికములతో మిశ్రములైన మోదకములు పాగరములకు బలి వేయవలెను. గ్రహమునకు నక్షత్రమునకేదేది నేను జెప్పితినో తత్తద్దేవతకు దిక్కులకునదే నివేదింపవలెను. ఇందు మఱి విమర్శింప పనిలేదు.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున గ్రహనక్షత్ర దేయాదేయవిధియను తొంబదితొమ్మిదవ అధ్యాయము

## నూరవ అధ్యాయము - ప్రతిగ్రహనక్షత్ర దేయాదేయ పానీయవర్ణనము

మార్కండేయ ఉవాచ :

ధ్రువస్థాన నివిష్టానాం దేవతానాం పృథక్ పృథక్ । పానాయ దాపయేత్ క్షీరం ప్రీతయే వాఽన్తరాత్మనః ॥ 1
గంధోదకం తథాఽర్కాయ పయసోమ్యాయ కీర్తితమ్ ।
భూమి పుత్రాయ ఖర్జూరం మార్ద్వీకం శశిజాయ చ ॥ 2
జీవాయచ తథా తక్రం శుక్రా యేక్షు రసం తథా ॥

మాంసపానం తు సౌరాయ రాహోర్మీన రసం తథా । ఛాగం పయః ప్రదాతవ్యం కేతవే మనుజేశ్వర! 3
గంధోదకం కృత్తికానాం రోహిణీనాం సువీరకమ్ ।
ఇల్వలానాం పయః ప్రోక్తం రౌద్రేః ఖర్జూర మాసవమ్ ॥ 4
ఆదిత్యాయ తథా గౌడం క్షీరం తిష్యాయ దాపయేత్ । క్షీర మేవ చ సార్పాయ తథా పిత్ర్యాయ యాదవ! ॥ 5
గంధోదకంచ భాగ్యాయ తథాఽర్యమ్ణాయ కీర్తితమ్ । సావిత్రాయ తథాయస్తు త్వాష్ట్రాయ చ తథా పయః॥ 6
వాయవ్యాయచ మార్ద్వీక మైంద్రాగ్న్యాయ చ కాంజికమ్ ।
మిత్రాయ తక్రం దేయంచ శాక్రాయ దధి దాపయేత్ ॥ 7
నారికేళాంబు మూలాయ తథాప్యాయ మధూదకమ్ । ఖార్జూరం వైశ్వదేవాయ బ్రాహ్మాయ సలిలం హితమ్ ॥
ఆమైత్రి పానం వైష్ణవాయ జంబుఖి ర్వాసవాయ చ । వారుణాయ మధూకైశ్చ రస మాజస్యపార్థివ! ॥ 9
ఆహిర్బుధ్న్యస్య చ తథా రసమేవ భవే న్నృప! ।
పౌష్ణాయ చ భవే చ్ఛాగం చాశ్వినాయ చ మాహిషమ్ ॥ 10

సమానదేవ నక్షత్రం కథితం చ తథా దిశామ్ । ఉత్తరాయై ప్రదాతవ్యం తథా క్షీరం నరాధిప! ॥ 11
సాగరాణాంచ సర్వేషాం సతతం భూతి మిచ్ఛతా ॥ 12

యద్యద్రహస్యాఽ భిహితం మయాఽత్ర ఋక్షస్యవా భూమిపతిప్రధాన!
తద్దేవతాయాశ్చతద్దైవదేయం దిశ స్తథా నాఽత్ర విచారణాఽస్తి ॥ 13

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే - ప్రథమ ఖండే - మార్కండేయ వజ్రసంవాదే
ప్రతిగ్రహర్షదేయా దేయపానవివరణంనామ శతతమోఽధ్యాయః

మార్కండేయుడనియె. ధ్రువస్థానమందున్న దేవతలకును వేర్వేర పానముకొఱకు క్షీరమొసగవలెను. అది అంతరాత్మ ప్రీతి కరమగును. గంధోదకము సూర్యునికి చంద్రునికి పాలు కుజునికి ఖర్జూర పండ్ల రసము బుధునికి ద్రాక్షరసము గురునికి మజ్జిగ శుక్రునికి చెఱకురసము శనికి మాంసపానము రాహువునకు మీనరసము కేతునకు మేకపాలు నీయవలెను. కృత్తికకు గంధోదకము రోహిణికి సువీరకము = పులిసిన కడుగు మృగశిరకు పాలు ఆరుద్రకు ఖర్జూరాసవము పునర్వసువునకు బెల్లపు ఆసవము, పుష్యమికి ఆశ్లేషునకు మఘకును పాలే. పుబ్బకు ఉత్తరకు గంధోదకము హస్తకు చిత్తకు పాలు స్వాతికి ద్రాక్షరసము విశాఖకు కాంజికము (గంజి) అనూరాధకు తక్రము (మజ్జిగ) జ్యేష్ఠకు పెరుగు, మూలకు కొబ్బరినీరు, పూర్వాషాఢకు మధూదకము. ఉత్తరాషాఢకు ఖర్జూరోదకము శ్రవణమునకు మంచినీళ్ళు ధనిష్ఠకు మామిడిపండ్లరసము శతభిషమునకు నేరేడుపండ్లరసము పూర్వాభాద్రకు మేకరసము ఉత్తరాభాద్రకు మాంసరసము రేవతికి మేకపాలు అశ్వినికి గేదెపాలు భరణికి స్వచ్ఛమైన మాంస రసము నీయవలెను. గ్రహనక్షత్ర దేవతాధిదేవతల కొకేవిధముగా నిది చెప్పబడినది. సముద్రములకు నంతే. ఉత్తర దిక్కునకు మాత్రము క్షీరము పానీయముగా నీయవలెను.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమును ప్రతి గ్రహనక్షత్ర దేయాదేయ
పానీయవర్ణనమను నూఱవ యధ్యాయము.

## నూటయొకటవ అధ్యాయము - హోమద్రవ్య విభాగము

మార్కండేయః :

ధ్రువస్థాననివిష్టానాం దేవతానాం మహీపతే! । ఘృతాక్తై రక్షతై ర్హోమఃకార్యశ్చ సతిలై ర్భవేత్ ॥ 1
అర్కః పలాశః ఖదిర శ్చాపామార్గోఽథ పిప్పలవి। ఉదుంబరశ్శమీ దూర్వాః కుశాశ్చేతి యథాక్రమమ్ ॥ 2
సమిదర్థం ప్రశస్యంతే సూర్యాదీనాం నరాధిప! । హోతవ్యా స్సమిధశ్చైవ ఘృతాక్తా మనుజేశ్వర! ॥ 3
తథా ప్రాదేశ మాత్రాశ్చ ప్రాగగ్రా నిత్యమేవచ। ఊర్ధ్వశుష్కాః సపత్రాశ్చ విత్వచశ్చ వివర్జయేత్ ॥ 4
కృత్తికానాం ఘృతేనాక్తో హోమః పార్థివ సత్తమ! । రోహిణీ నాంతథా బీజై రిల్బిలానాంచ పాయసైః ॥ 5
మాక్షికైశ్చ తథార్ద్రాయా మాదిత్యస్యచ తండులైః । పుష్యస్య పాయసేనాపి సార్పస్యచ తథౌ షధైః ॥ 6
తిలై స్సతండులై ర్హోమః తథా పైతృస్య కీర్తితః ॥ ప్రియంగుభిశ్చ భాగ్యస్య చార్యమ్ణస్య తథాఽక్షతైః ॥ 7
సావిత్రస్య తథా దధ్నా చిత్రాయాః పాయసేనచ। వాయవ్య స్యాక్షతైః కార్యాః సఘృతై ర్మనుజేశ్వర ! ॥ 8
ఐంద్రాగ్నస్య సదా కార్యో యావకేన తథైవచ। మసూరై శ్చైవ మైత్రస్య శాక్రస్య చణకేన తు ॥ 9
మూలస్యౌషధిభిః కార్య స్తథైవాప్యస్య శాలిభిః। వైశ్వ దేవస్య పయసా తథా బ్రాహ్మస్య పాయసైః ॥ 10
మణిభి స్తండులోపేతైః శ్రవణస్య విధీయతే। స్యగ్రోధోదుంబరఫలైః వాసవస్య విధీయతే ॥ 11

వారుణస్యోదకైః పుష్పైః తథాచైవవాక్షతైః శుభైః । అజ స్యాజ్యేన మధునా దద్యాచ్చ నృపసత్తమ! ॥ 12
వ్రీహిభిశ్చ తథాకార్యాశ్యా హిర్బుధ్న్యస్య పార్థివ! । ఫలైశ్చసాక్షతైః కార్య స్తథా పౌష్ణస్య పార్థివ! ॥ 13
క్షీరవృక్షసమిద్భిశ్చ ఆశ్వినస్య విధీయతే । యామ్యస్య మధుసంయుక్తై స్తిలైః పార్థివసత్తమ! 14
ఆజ్యం తిలాశ్చ తైలంచ కృశరం మధుపాయసమ్ । దధి క్షీరం ఘృతంక్షౌద్రం ప్రాచ్యాదీనాం యథాక్రమమ్॥ 15
సాగరాణాంచ పయసా హోమః కార్యః పృథక్ పృథక్ । ఉక్తానాంచ సర్వేషాం హోమః కార్య స్తిలాక్షతైః 16
స ఘృతైః పార్థివ శ్రేష్ఠ ద్రవ్యకార్యం వివర్జయేత్ । ప్రభోః ప్రథమ కల్పస్య యోఽను కల్పేన వర్తతే॥ 17
న సాంపరాయికం తస్య భవతీహ సుదుర్మతేః ॥ 18
యద్యద్గ్రహస్యాభిహితం మయాత్ర యుక్తస్త్వయా భూమిపతిప్రధాన ! 19
తద్దేవతాయాశ్చ తథైవ దేయం దిశ స్తథా నాత్ర విచారణాఽస్తి ॥

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే హోమద్రవ్య విభాగోనామ ఏకోత్తర శత తమోఽధ్యాయః

* గమనిక : 101, 103 అధ్యాయముల తాత్పర్యము పట్టికలో చూపబడినది.

## నూటరెండవ అధ్యాయము - హోమద్రవ్య మంత్రాధ్యాయము

మార్కండేయః :

ధ్రువా ద్యౌరితి మంత్రేణ హోమః కార్యో ధ్రువస్యతు । ఊర్ధ్వో అధర ఇత్యేవ ధ్రువాయాశ్చదిశో భవేత్ ॥ 1
బ్రహ్మజజ్ఞాన మిత్యేష బ్రహ్మణః పరికీర్తితః । ద్యౌస్త్వా ఇతిచ మంత్రేణ దివః కార్యోమహీపతే! ॥ 2
పృథివీ దివిచేత్యేవ పృథివ్యాః పరికీర్తితః । ప్రణవేన చ శేషస్య బాధస్తాచ్చ తథా దిశః ॥ 3
అగ్ని ర్మూర్ధేతి మంత్రోఽయ మగ్నయే పరికీర్తితః । ఉదుత్తమం వరుణపాశం మంత్రోఽయం వరుణస్యతు ॥ 4
ప్రణవశ్చ కుమారస్య తద్విష్ణో ర్విష్ణవే భవేత్ । త్రాతార మింద్రం శక్రస్య దేవ్యాశ్చ ప్రణవో భవేత్ ॥ 5
ప్రజాపతే నత్వదేతా మంత్రోఽయంస్యాత్ ప్రజాపతేః । వినాయకాయ ప్రణవో విశ్వకర్మేతి చాప్యథ ॥ 6
మంత్రశ్చ పఠితో రాజన్! సంతతం విశ్వకర్మణః । ఆకృష్ణేతి చ మంత్రోఽయ మాదిత్యస్య ప్రకీర్తితః ॥ 7
ఇమం దేవేతి సోమస్య అగ్నిర్మూర్ధా కుజస్యచ । ఉద్ బుధ్యస్వ బుధస్యాపి మంత్రః ప్రోక్తో నరేశ్వర ॥ 8
బృహస్పతే అతియదర్యో మంత్రఉక్తో బృహస్పతేః । అన్నాత్ పరిస్రుతే త్యేవం మంత్రః శుక్రస్య కీర్తితః ॥ 9
శంనోదేవీతి సౌరస్య కాండాత్కాండేతి రాహవే । కేతుం కృణ్వన్నితి తథా మంత్ర ఉక్తశ్చ కేతవే ॥ 10

మార్కండేయుడనియె. "ధ్రువాద్యౌః" అను మంత్రముతో ధ్రువునికి హోమము సేయవలెను. "ఊర్ధ్వో అధర" అను మంత్రముతో ధ్రువాదిశకు హోమముచేయవలెను". బ్రహ్మయజ్ఞానమ్" మంత్రముతో బ్రహ్మకు "ద్యౌస్త్వా" అనుదాన దివమునకు 'పృథివీదివిచ' అనుదాన పృథివికి ప్రణవముతో శేషునికి అధో దిశకును, "అగ్నిర్మూర్ధా" అని యగ్నికి 'ఉదుత్తమం వరుణపాశమ్' అనుదానవరుణునికి ప్రణవముతో కుమారస్వామికి, తద్విష్ణోః అని విష్ణువునకు త్రాతారమింద్రయని యింద్రునికి, ప్రణవముతో శచీదేవికి 'ప్రజాపతేనత్వదేతా' అనుమంత్రముచే ప్రజాపతికి, వినాయకునికి ప్రణవముతో "విశ్వకర్మ" అను మంత్రముతో విశ్వకర్మకు, "ఆకృష్ణ" మంత్రముతో ఆదిత్యునికి, "ఇమందేవ" అనుదాన సోమునికి "అగ్నిర్మూర్ధా" అను దాన కుజునికి "ఉద్బుధ్యస్వ" అని బుధునికి "బృహస్పతే అతి యదర్యో" అనుదాన బృహస్పతికి అన్నాత్పరిస్రుత" అనుదాన

శుక్రునికి "శన్నోదేవీ" అనుదాన శనికి "కాండాత్కాండ" అనుదాన రాహువునకు 'కేతుం కృణ్వన్' అను మంత్రముచే కేతువునకు హోమము నిర్వర్తింపవలెను.

అగ్నిర్మూర్ధాకృత్తికానాం రోహిణీనాం ప్రజాపతే। మధువాతేతి మంత్రోఽయమిల్వలానాం ప్రకీర్తితః॥ 11
మృడానో రుద్రమార్ద్రయాః సుత్రామాణం పునర్వసోః। తవ శ్రీయేతి పుష్యస్య హోమమంత్రో విధీయతే॥ 12
నమోఽస్తుసర్వేభ్యశ్చేతి మంత్రః సార్పస్య కీర్తితః। అహం పితౄనితి తథా మంత్రః పిత్ర్యస్య కీర్తితః॥ 13
సదాసుగేతి భాగ్యస్య తథా మంత్రః ప్రకీర్తితః। ఏతే అర్యమ న్నిత్యేవ మార్యమ్ణస్య చ నిర్దిశేత్॥ 14
సావిత్రస్య చ సావిత్రీ త్వాష్ట్రస్యయ ఇమే తథా। వాయు రగ్నేతి చ తథా వాయవ్యస్య నరాధిపః॥ 15
ఇంద్రాగ్నీ రోచనేత్యేవ మింద్రాగ్నస్య ప్రకీర్తితః। 16
మిత్రోజనేతి మైత్రస్య హోమమంత్రః ప్రకీర్తితః। ఇంద్రస్సుత్రావ ఇతిచ శాక్రస్య వసుధాధిపః॥ 17
యనైదేవేతి నిర్ఋతిం మూలస్యచ తథాభవేత్। శన్న ఆప స్తథాఽప్యస్య హోమమంత్రః ప్రకీర్తితః॥ 18
విశ్వదేవీతి వైశ్వస్య తథాచ వసుధాధిప। బ్రహ్మజజ్ఞాన మిత్యేవం తథా బ్రాహ్మస్య నిర్దిశేత్॥ 19
వషట్తేవిష్ణ ఇత్యేవం వైష్ణవస్య తథా భవేత్। ఆమే గ్రహా భవత్యేవం వాసవస్య ప్రకీర్తితః॥ 20
ఇమంమే వరుణేత్యేవం వరుణస్య తథా భవేత్। ఉపప్రాగేతి మంత్రేణ హోమ మాజస్యకారయేత్॥ 21
మంత్రశ్చాహి రివేత్యేవ మాహిర్బుధ్న్యస్య కీర్తితః। ప్రయాదమితి మంత్రేణ అశ్వినస్య ప్రకీర్తితః॥ 22
యమోదాధార పృథివీం తథా యామ్యస్య కీర్తితమ్। నక్షత్ర దేవతాహోమే మంత్రా ఏతేప్రకీర్తితాః॥ 23
నక్షత్రదేవతా తుల్యాః దిగీశానాం తథైవ చ ప్రవేన దిశః కార్య స్తథా వైశ్రవణస్య చ॥ 24
సాగరాణాంచ రాజేంద్ర। పృథగేవం విజానతా। ఏక చక్రేతి వా ద్వ్యర్చం గ్రహాణాం చ నరాధిప॥ 25
సమాగ్నేతి తథా ద్వ్యర్చం నక్షత్రాణాం విధీయతే॥ 26

ఏతావదుక్తో నృపవర్య తుభ్యం హోమాశ్రయో మంత్రగణో గ్రహాణామ్।
హుతేన యేనాఽనఘ మానవానాం కామా నభీష్టాన్ ప్రదిశన్తిలోకే॥

ఇతి శ్రీ విష్ణుధర్మోత్తరే ప్రథమఖండే హోమమంత్రాధ్యాయోనామ ద్వ్యధికశతతమోఽధ్యాయః

అగ్నిర్మూర్ధా మంత్రము కృత్తికలకు ప్రజాపతే మంత్రము రోహిణులకు 'మధువాత' అనునది మృగశిరకు "మృడానో రుద్ర" మంత్రము ఆర్ద్రకు సుత్రామాణం అనునది పునర్వసునకు 'తవశ్రియా' అని పుష్యమికి హోమము విధింపబడినది. నమోఽస్తు సర్వేభ్యః అని సార్పదైవత్యమగు ఆశ్లేషకు, అహంపితౄన్ అనునది పిత్ర్యమయిన మఖకు సదాసుగమంత్రముతో పూర్వఫల్గునికి (భగదేవతాకమునకు) పతేఅర్యమన్నమదా ఉత్తర ఫల్గునికి సావిత్రమునకు (హస్తకు) సావిత్రీ' అను మంత్రముచేత వాయురగ్నేతి మంత్రముచే స్వాతికి ఇంద్రాగ్నీరోచనేతి మంత్రముచే నింద్రాగ్నసక్షత్రమగు విశాఖకు మిత్రోజనేతి మంత్రముతో మిత్రదైవత్యమైన అనూరాధకు ఇంద్రః సుత్రామ అనునది జ్యేష్ఠకు యంతేవతి మంత్రముతో నిర్ఋతికి గౌరితిమూలకు "శన్న ఆపః" అనుదాన పూర్వాషాఢ హోమము విధీహితమైనది. "విశ్వేదేవి" అని ఉత్తరాషాఢ బ్రహ్మయజ్ఞాన" మని శ్రవణము, "వషట్తేవిష్ణ" అని ధనిష్ఠ "ఆమేగృహాభవతు" అని శతభిషము "ఇమంమేవరుణ" అని పూర్వాభాద్ర (వారుణము) ఉపప్రాగేతి మంత్రముతో ఉత్తరాభాద్రకు మంత్రశ్చాహిరసి రేవతికి ప్రయాపమను మంత్రముచే అశ్వినికి "యమోవధార" అనుదాన భరణికిహోమము సేయనైనది. నక్షత్రదేవతా తుల్యముగ దిక్పతులకును హోమముసేయవలెను. ప్రణవముతో నుత్తరదిగ్దేవతకు హోమముసేయవలెను. సాగరములకు నిట్లే వేర్వేరజేయవలెను. "ఏకచక్ర" అనునది మొదలయిన రెండు ఋక్కులచే గ్రహములకు నమాగ్నే అని రెండుఋక్కులు నక్షత్ర

మూలకు హోమము విధింపబడినది. గ్రహహోమ మంత్రములివి తెల్పితిని. వీనిచే పాపములు బాపి మానవుల కభీష్టసిద్ధిని గ్రహము లీయగలవు.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తరమహాపురాణమునందు ప్రథమఖండమున హోమమంత్రాధ్యాయమను నూటరెండవయధ్యాయము.

## నూటమూడవ అధ్యాయము - దక్షిణాధ్యాయము

మార్కండేయః -

ధ్రువస్థాననివిష్టానాం దేవతానాం పృథక్ పృథక్। దక్షిణార్థే ప్రదాతవ్యం సర్వేషా మేవ కాంచనమ్ ॥ 1
రక్తాం వత్సయుతాం ధేనుం దద్యాదర్కాయ పార్థివ। శంఖం దద్యా న్నరేంద్రేణ దక్షిణార్థం నిశాకృతః ॥ 2
రక్తవర్ణో హ్యనడ్వాంశ్చ దాతవ్యః క్షితిజస్యతు। కాంచనీం స్వాం ప్రతికృతిం బాలక్రీడన కానిచ ॥ 3
బుధాయ రాజన్! దేయాని దక్షిణార్థే విశేషతః। క్షేమం దుమాలం కార్పాస వాసాంసి గురవే తథా ॥ 4
సితవర్ణం చ తురగం భార్గవాయ ప్రదాపయేత్। కృష్ణాంధేనుం సవత్సాంచ దద్యాత్ సూర్యసుతాయవై 5
ఉష్ణీషం లోహదండశ్చ దాతవ్యోన్నృప! రాహవే। ఛాగశ్య కేతవే దేయం కుతపంచ నరాధిప ॥ 6
కృత్తికానాం తు కనకం దాతవ్యం భూతి మిచ్ఛతా। సర్వబీజాని దేయాని రోహిణీనాం తథైవచ ॥ 7
దోగ్ధ్రీం ధేనుం చేల్వలానామనడ్వాహంచ రాహవే । అదిత్యాయ శుభం వస్త్రం పుష్యాయ కనకం ఘృతమ్ 8
సార్పాయ వృషభం దద్యాత్ రుక్మశృంగం మహీపతే। పిత్ర్యస్యచ తిలాన్ దద్యాత్, వాయవ్యస్యచ చామరమ్ 9
భాగ్యస్య దేయా గంధాశ్చ ఆర్యమ్ణస్య చ కాంచనమ్। హస్తస్య కుంజరం దద్యాత్కనకం వా మహీపతే! ॥ 10
త్వాష్ట్రస్య వృషభం దద్యాదైంద్రాగ్నస్య నరాధిప। వస్త్రాణి చైవ మైత్రస్య శాక్రస్య కనకం తథా॥ 11
దద్యా న్మూలస్య మూలాని ఫలాని వివిధానిచ। ఆప్యస్య దధిపాత్రాణి శకటం వాసవస్యచ॥ 12
తథాచందన కాష్ఠంచ వారుణస్య ప్రదాపయేత్। అజ మాజస్య దాతవ్య మహిర్బుధ్న్యస్య చౌదనమ్॥ 13
ధేనుం పౌష్ణస్య తురగ మాశ్వినస్య తథైవచ। తిలధేనుంచ యామ్యస్య దద్యాత్ పాపాపనుత్తయే ॥ 14
కుంజరంచ తథైవోష్ట్రం రథం శకట మేవచ। హయమశ్వతరం చైవ నరయానంచ పార్థివ! ॥ 15
ప్రాచ్యాదీనాం క్రమాద్దద్యాత్ దక్షిణాంచ నరాధిప। సాగరాణాంచ దాతవ్యం కనకం భూరిదక్షిణమ్॥ 16
నక్షత్రాణాం గ్రహాణాంచ దిశాంచ మనుజేశ్వర। యదుక్త మగ్ర తద్దేయం దేవతానాం పృథక్ పృథక్ ॥ 17
ఉక్తాఽభావేచ దాతవ్యా ధేనుః పార్థివసత్తమ । ప్రత్యేకస్య మహాభాగ। శుభా కాంస్యోపదోహనా ॥ 18
దోగ్ధ్రీ సవత్సా శీలాఢ్యా వస్త్రరత్నోపశోభితా । రుక్మశృంగైః ఖురైః రౌప్యైః ముక్తాలగూం భూషితా ॥ 19
తతో విసర్జనం కార్యం పూర్వోక్త విధినాన్నృప। దధిక్షీర ఘృతప్రాయం తథా త్రిమధురాన్వితమ్॥ 20
భోజయే ద్బ్రాహ్మణాన్ భక్త్యా ప్రత్యేకస్య నరాధిప। యథాశక్త్యా మహారాజ! తేషాం దద్యాచ్చ దక్షిణామ్ ॥
ప్రయత స్తాంశ్చ యాచేత పూజితాన్ ప్రీణనం బుధః॥ 21

ఏతావదుక్తం తవ శాన్తికర్మ సమస్త పాపప్రశమాయ రాజన్! ।
కర్తవ్య మేతత్ ప్రయతేన శక్త్యా న విత్తశాఠ్యేన న మాయయా చ॥ 22

ఇతి శ్రీ విష్ణుధర్మోత్తరే ప్రథమఖండే దక్షిణాధ్యాయోనామ త్ర్యధిక శతతమోఽధ్యాయః

గమనిక :- 101, 103వ అధ్యాయము తాత్పర్యములు పట్టికలో చూపబడినది.

# నూటనాల్గవ అధ్యాయము - ప్రతిసరబంధ ఆశీర్వాదము

మార్కండేయః

ఏవం శాన్త్యవసానేతు యజమానస్య యాజకః। హృది విన్యస్య దర్భాగ్రాన్ తథా స్వేదక్షిణే కరే॥ 1
కుర్యాత్ప్రతిసరాబంధం తన్మే నిగదతః శృణు। । బద్ధప్రతిసర స్యాస్య సర్వే నశ్యన్తు రాక్షసాః॥ 2
ధ్రువ స్త్వా మూర్ధ్వతః పాతు పూర్వతః పాతుభాస్కరః। భౌమో దక్షిణతః పాతు పశ్చా త్పాతు శనైశ్చరః॥ 3
ఉత్తరేణ బుధః పాతు కేతుఃపాతు తథాహ్యధః। పూర్వదక్షిణతః శుక్రో దక్షిణాపరత స్తమః॥ 4
పశ్చిమో త్తరత శ్చంద్రో జీవః ప్రాగు త్తరేణతు। ఉక్తసంధిషు సర్వాణి నక్షత్రాణి తవానఘ॥ 5
స్వాం స్వాం దిశ మధిష్ఠాయ తవ నిత్యం దిగీశ్వరాః। రక్షంతు సర్వదుష్టేభ్యః శక్రవహ్ని పురోగమాః॥ 6
శాత్రవాణాంచ చోరాణాం వ్యాధీనాం పాతకస్యచ। అమంగళానాం ఘోరాణా మనిష్టానాం తథైవచ॥ 7
దుస్స్వప్నానాంచ ఘోరాణాం చింతితానాం కృథా మృషా। వజ్రేణ నాశనం శక్రః కరోతు బలసూదనః 8
దండేన నాశనం నిత్యం విదధాతు యమోఽన్తకః । పాశేన వారుణో దేవో గదయాచ ధనేశ్వరః॥ 9
గ్రహసన్నాహసన్నద్ధో గ్రహపంజరమధ్యగః। అదృశ్యః సర్వభూతానాం సర్వదుఃఖవివర్జితః॥ 10
సర్వవ్యాధివిహీనశ్చ కాలకర్ణీ వివర్జితః। తథా త్వం భవ! దీర్ఘాయుః గ్రహేంద్రాణాం ప్రసాదతః॥ 11

రక్షన్తుతే దేవగణాః సమగ్రాః ధర్మే మతించాపి సదా దిశన్తు।
నాశం తథా శత్రుగణస్య చోగ్రంభోగాన్ మనోజ్ఞాన్ విపులాం చ లక్ష్మీమ్॥ 12

ఇతి శ్రీవిష్ణు ధర్మోత్తరే ప్రథమఖండే శాన్త్యవసానే ప్రతిసరబంధ
ఆశీర్వాదోనామ చతురధికశతతమోఽధ్యాయః

మార్కండేయుడనియె. ఇట్లు శాంతిపూర్తియైనతరువాత యాజకుడు దర్భలను కొనలను తన కుడిచేతబట్టుకొని హృదయమునందానించి యాతనికి తోరము(ప్రతిసరము) గట్టవలెను. యజమానుని కీప్రతిసరము కట్టిన యాతనికి సర్వరాక్షసులు నశింతురుగాక! ధ్రువుడు నిన్ను మూర్ధభాగమున రక్షించుగాక! భాస్కరుడు తూర్పున రక్షించుగాక! కుజుడు దక్షిణమున గాపాడుగాక! పడమట శని ప్రోచుగాక! ఉత్తరమున బుధుడు రక్షణయిచ్చుగాక! అధోభాగమున కేతువు పాలించుగాక! ఆగ్నేయమూల శుక్రుడు దక్షిణదిక్కుఅవ్వల నిరృతిమూల రాహువు వాయవ్యమూల చంద్రుడు ఈశాన్యదిశను గురువు నిన్ను బ్రోచుగాక! ఈ చెప్పిన సంధులందు సర్వ నక్షత్రములు తమతమ దిశలందధిష్ఠించి దిక్పతులు ఇంద్రాగ్ని ప్రభృతులు సర్వదుష్టుల నుండి నిన్ను రక్షింతురుగాక! బలసూదనుడైన శక్రుడు ఇంద్రుడు వజ్రాయుధముంగొని శత్రువులు చోరులు రోగములు పాపము అమంగళములు ఘోరములు అరిష్టములుయొక్కఅసత్యచింతనములు దుఃస్వప్నములయొక్కయు నాశనముచేయుగాక! అంతకుడగు యముడు దండముచే నిత్యమును వరుణుడు, పాశముచే గదచే ధనేశుడు వీనిని నశింపజేయుదురుగాక! నీవు గ్రహసన్నాహసన్నిద్ధుడవై గ్రహపంజరమధ్యస్థుడవై సర్వభూతములకు నదృశ్యుడవై సర్వదుఃఖవివర్జితుడవై నీవు గ్రహాధీశ ప్రసాదముచే దీర్ఘాయువగుము. దేవగణములెల్ల నిన్నురక్షింతురుగాక! ధర్మమునందు బుద్ధిని నీ కనుగ్రహింతురుగాక! నీ శత్రువుల నాశనమతిభయంకరముగ నాచరింతురు గాక! మనోజ్ఞములయిన విపులములైన భోగములను లక్ష్మిని నీకు వారు ప్రసాదింతురుగాక!

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున ప్రతిసరబంధ—ఆశీర్వాదమను నూటనాల్గవ అధ్యాయము.

## నూటఐదవయధ్యాయము — గ్రహసంభవము

మార్కండేయః :

హవిష్యాశీ తతస్తిష్ఠేత్ బ్రహ్మచారీచ తాం నిశామ్। గ్రహశాన్తి రియం ప్రోక్తా మయా కల్మషనాశినీ ॥ 1
అనావృష్ట్యాం ప్రయోక్తవ్యా వృష్టికామేన భూభుజా। అతివృష్ట్యాం ప్రయోక్తవ్యా వృష్టిం శమయతా తథా ॥ 2
యాత్రాకాలే తథా కార్యా రిపూణాం క్షయ మిచ్ఛతా। రణకాలే తథా కార్యా సంగ్రామే జయ మిచ్ఛతా ॥ 3
కర్తవ్యా చాభిచారార్థం శత్రూణాం మనుజేశ్వర। పుష్టికామై ర్నరైః కార్యా విద్యాకామై స్తథైవచ ॥ 4
లాభార్థంచ తథా వైశ్యైః శూద్రే ధర్మ ఫలే ప్సుభిః। రాజ్యకామేన కర్తవ్యా రాజపుత్రేణ పార్థివ ! ॥ 5
తథా బంధనమోక్షార్థం బద్ధేన చ మహీపతే । స్థాన చ్యుతేన కర్తవ్యా స్థాన లబ్ధి మభీ ప్సతా ॥ 6
వ్యాధితేన చ కర్తవ్యా వ్యాధేః ప్రశమ మిచ్ఛతా । మారికే చ తథా కార్యా మారకక్షయ మిచ్ఛతా ॥ 7
పరాభిచారశంకాయాం గ్రహశాన్తిం ప్రయోజయేత్ । దివ్యాన్తరిక్ష భౌమానా ముత్పాతానాం తథోద్భవే ॥ 8
గ్రహాధీనా నరేంద్రాణా ముచ్ఛ్రాయాః పతనానిచ। భావాభావౌ చ జగతాం గ్రహాయత్తా నరాధిప ! ॥ 9
బ్రహ్మణైషాం వరో దత్తః పూజితాః పూజయిష్యథ। తస్మా త్సర్వ ప్రయత్నేన నృణాం పూజ్యతమా గ్రహాః ॥ 10
గురు భక్తస్య దాన్తస్య ధర్మార్పితధనస్యచ। పూజనాచ్చ గ్రహేంద్రాణాం సదా సానుగ్రహా గ్రహాః ॥ 11
మానవస్యాస్వతంత్రస్య గోబ్రాహ్మణహితస్యచ। మాంసభక్షణ హీనస్య సదా సానుగ్రహా గ్రహాః ॥ 12
యే భక్తాః పుండరీకాక్షం దేవదేవం జనార్దనమ్। నాస్తి తేషాం జగ త్యస్మిన్ దోషో గ్రహ కృతో నృణాం ॥ 13
యథా రణ ప్రహారాణాం కవచం వారణం భవేత్। తథా దైవోపఘాతానాం శాన్తిర్భవతి వారణం ॥ 14
గ్రహయాగవిధిం సమ్యగ్యశ్చాధీతే నరాధిప । గ్రహపాప కృతం చైవ తస్యాపి న భవిష్యతి ॥ 15
అతీవ విస్తరేణేయం గ్రహశాన్తి రుదాహృతా। ధన్యా యశస్యా చాయుష్యా సర్వకిల్బిష నాశినీ ॥ 16
ప్రయుంజతో సమ్య గిమాం నరేంద్ర। న జాతు లోకే భయ మస్తి కించిత్।
ఆరోగ్య మాసాద్య చిరంచ జీవేత్। ప్రాప్నోతి లక్ష్మీం సకలాంశ్చ భోగాన్ ॥ 17

ఇతి శ్రీవిష్ణు ధర్మోత్తరే ప్రథమ ఖండే గ్రహశాన్తి ఫలవర్ణనంనామ
పంచాధిక శతతమో ఽధ్యాయః ॥

మార్కండేయుడనియె. శాంతియయిన యారాత్రి హవిష్య మారగించి బ్రహ్మచారియై యుండవలెను. కల్మషహరమైన గ్రహశాంతి యిది నే దెల్పితిని. అనావృష్టియందు వర్షముకోరి రాజిద్దానిని బ్రయోగింపవలెను. అతివృష్టికి రోగశాంతికిని యిది ప్రయోగింపదగినది. శత్రుక్షయమునకు, దండయాత్ర సమయములో, యుద్ధకాలములో జయముకోరి యిది యాచరించవలెను. అభిచారమునకు [శత్రునాశనముగావలెనని] యిది సేయనగును.

పుష్టిని విద్యనుగోరువారిది యనుష్ఠింపవలెను. లాభార్థులై వైశ్యులు ధర్మఫలార్థులై శూద్రులు రాజ్యలేమియై రాజకుమారుడు నిది నిర్వర్తింపనగును. బంధమోక్షమునకు స్థానభంగమందినవాడు స్థానలాభముకోరి వ్యాధితుడు వ్యాధిశాంతినర్థించి దుర్భిక్షదశలో దుర్భిక్షముపోగోరి శత్రువెవడేని అభిచారకర్మ చేతబడి మొదలైనవిచేసెనేమోయని శంకగల్గినపుడు దివ్య-అంతరిక్ష-భౌమములను త్రివిధోత్పాతములు తటస్థించినతరి మనోవ్యాధులతిశయించినపుడు నిది యనుష్ఠింపవలెను. రాజులకు ఉచ్ఛ్రాయము (హెచ్చుస్థితి) పతనములు జగత్తులకు భావాభావములు (ఉండుట లేకుండుట) మొదలగు నివి యెల్ల గ్రహనిమిత్తములు. బ్రహ్మ వీరికి మిముత్ర

పూజించినవారిని మీరు పూజింపుడని వరమిచ్చియున్నాడు. కావున సర్వప్రయత్నముచేత నరులకు గ్రహములు అత్యంతపూజ్యములు. గుర్వనుగ్రహపాత్రునికి దాంతునికి ధర్మార్జిత సంపన్నునికి గ్రహాధీశ పూజకునికి గ్రహములు సదా సానుగ్రహములగును. అస్వతంత్రుడైన మానవునకు గోబ్రాహ్మణహితునికి మాంసభక్షణము సేయని వానికి గ్రహములు మహానుగ్రహ సంపన్నులగును. పుండరీకాక్షునియెడ దేవదేవుని జనార్దనుని భక్తులగు వారికీలోకమందు గ్రహదోషము లేదు. బాణములదెబ్బలకు కవచము వారణమైనట్లు దైవికోపఘాతములకు హరిభక్తి నివారణ మగును. ఈ గ్రహయాగ విధి నెవ్వడు చక్కగా జదువు నాతనికి మహాపాపఫలముగూడ గలుగదు ఈ గ్రహ శాంతి మిక్కిలివిస్తరముగకు దాహృతమైనది. ఇది ధన్యము యశస్యము ఆయుష్యము సర్వకిల్బిష నాశకము. దీనిని చెన్నుగ ప్రయోగించిన వాని రాజేంద్ర! ఎన్నడు దేని లోకమున నెంచుకేని భయము కలుగదు. అతడారోగ్యమంది లక్ష్మిని సకలభోగములు నంది చిరకాలముజీవించును. మహాలక్ష్మిని సకలభోగములనుగూడ పొందును

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున గృహశాంతి ఫలవర్ణనమను నూటయైదవ అధ్యాయము.

## నూటఆరవ అధ్యాయము - గ్రహసంభవము

వజ్ర ఉవాచ :

ధ్రువస్యాహం ద్విజశ్రేష్ఠ! బ్రాహ్మణానాం పృథక్ పృథక్। సంభవం శ్రోతు మిచ్ఛామి నక్షత్రాణాం చ మానద!
మార్కండేయః- బ్రహణా సృష్టికామేన పూర్వమేవ నరాధిప । అదిత్య స్తమసాం హన్తా తేజసాం గోలకః కృతః 2
తమోమయో గోలకశ్చ రాహు స్తేన తథాకృతః। అమ్మయాని తథాఽన్యాని గోలకాని నరాధిప! ॥ 3
కృతాని తేన ధర్మజ్ఞ! గ్రహర్క్షాణాం పృథక్ పృథక్ ।ధ్రువస్థాన నివిష్టా శ్చతారాకాశ్చ చతుర్దశ॥ 4
తేషాం నామవిభాగం మే గతతః శృణు పార్థివ! । ఉత్తాన పాద స్తస్యాఽధ విజ్ఞేయఃశ్రోత్తరో హనుః॥ 5
యజ్ఞోఽధరస్తు విజ్ఞేయో ధర్మోమూర్ధానమాగః। హృది నారాయణః సాధ్యా వశ్వినౌ పూర్వపాదయోః॥ 6
వరుణ శ్చార్యమా తస్య పశ్చిమే చైవ సక్థినీ। శిశ్నః సంవత్సర స్తస్య మిత్రోఽపానం సమాశ్రితః॥ 7
పుచ్ఛోఽగ్నిశ్య మహేంద్రశ్చ మారీచః కశ్యపో ధ్రువః।
ధ్రువః స్థాస్ను ర్గ్రహ ర్క్షాణాం మేధీ భూతః పరికీర్తితః॥ 8
ధ్రువేణ భ్రామ్యతే సర్వ మాయత్తం త్రిదివం ధ్రువే। ధ్రువోహి భగవాన్ విష్ణుః కాలో లోక పరికాలనః ॥ 9

వజ్రుడు విప్రోత్తమ! ధ్రువుని యొక్క బ్రాహణుల యొక్కయు నక్షత్రముల యొక్కయు పుట్టుక వినగోరెదనన మార్కండేయుడనియె. సృష్టిసంకల్పమందు బ్రహ్మ చీకటుల హరించు తేజో గోళమును ఆదిత్యుడను పేర సృజించెను. కేవలము చీకటి గోళము రాహువును నతడే సృజించెను. తదితరగోళము లాపోమయములు. వానిని అతడే చేసెను. గ్రహములు నక్షత్రములు వేర్వేర ధ్రువస్థానమందుండు తారకలు పదునాల్గును నాతనిసృష్టియే. ధ్రువమండలమందలి వానిపేరులు. ఆ ధ్రువునికుత్తరపు (మీది) హనువు. (చెక్కిలి) ఉత్తానపాదుడు. యజ్ఞము క్రిందిదౌడ. ధర్మము మూర్ధము-హృదయము నారాయణుడు, సాధ్యులు అశ్వినులు నాతని పూర్వపాదములందు. వరుణుడు అర్యముడు పశ్చిమమందలి సక్థులు=పద మటసంవత్సరము శిశ్నము. మిత్రుడపానము. పుచ్ఛమందగ్ని మహేంద్రుడు మారీచుడు కశ్యపుడు ధ్రువుడు గ్రహనక్షత్రములకు (స్థాస్నుః=కదలికలేనివాడై మేధిమైయున్నాడు. ధ్రువునియందాధారపడియున్న త్రిదివము జ్యోతిర్మండలము) ధ్రువునిచే త్రిప్పబడుచున్నది. అతడు ఈజ్యోతిశ్చక్రమునకు నడుమ మేధియైయున్నాడు. గానుగ చుట్టు నెద్దు తిరుగునట్లు మేదీభూతుడైన ధ్రువునిచుట్టు గ్రహతారకాదులు తిరుగుచున్నవన్నమాట. ధ్రువుడు సాక్షాద్విష్ణుభగవానుడే. లోకప్రకాలనుడు కాలుడునతడే.

శింశుమార నిబద్ధానాం తారకాణాం పృథక్ పృథక్। నామధేయాని విజ్ఞాయ దృష్ట్వాచ విమలేఽంబరే ॥ 10
ఆయురభ్యధికంజీవే ద్వర్షాణి తు చతుర్దశ। అహోరాత్రకృతా త్పాపాత్ తత్షణా రేవ ముచ్యతే ॥ 11
అమ్మయానాం గ్రహర్క్షాణాంమూర్ఛితాః సూర్యరశ్మయః। జనయన్తి ప్రకాశత్వం నాత్ర కార్యా విచారణా॥ 12
స్ఫాటికాని విమానాని తథా సుకృతినాం నృప। నాకే తారక బద్ధాని అమ్మయానీవ యాదవ ॥ 13
గ్రహర్క్షాణి సమస్తాని ధ్రువశ్చ భగవాం స్తథా। కల్పస్థాయీని రాజేంద్ర నాత్ర కార్యా విచారణా ॥ 14
తేషాం తదభి మానిన్యో దేవతా యదునందన। మన్వంతరాదౌ జాయ న్తేన భవ న్తి పునః పునః ॥ 15
ఔత్తానపాది ర్ధర్మాత్మా ధ్రువ స్తేష్వపి యాదవ। స్వాయం భువేంతరే జాత స్తిష్ఠ త్యాభూత సంప్లవమ్ ॥ 16

శిశుమారచక్ర మందసుబద్ధములైయున్న తారకల పేర్లను వేర్వేర తెలిసి యాకసమంచు వానింజూచియున్నాతడు పదునాల్గేండ్లెక్కువ జీవించును. అహోరాత్ర కృతపాపమును తక్షణమ పాయును. అమ్మయములు (జలమయములు) ఆయిన గ్రహనక్షత్రములందు మూర్ఛితములయిన (పడిన) సూర్యరశ్మిలు వెలుగును జనింపజేయుచుండును. ఇందాలోచింపవలసినదిలేదు. సత్యమన్నమాట. పుణ్యాత్ముల స్ఫాటికములయిన విమానములు అమ్మయములైన ధ్రువుడును కల్పాంత స్థాయులు. సందేహము లేదు. వానివాని అభిమానదేవతలు మన్వంతరము మొదటనే యేర్పడుదురు. పునఃపునర్జననము వారికి లేదు. ఉత్తానపాదుని కొడుకు ధ్రువుడు స్వాయంభువ మన్వంతరమందు పుట్టినవాడు భూతప్రలయముదాక నతడుండును. సర్వపాపనాశనమయిన యా ధ్రువజన్మ వృత్తాంతము చెపుచున్నాను.

తస్యతే జన్మ వక్ష్యామి సర్వ కల్మష నాశనమ్। పూర్వం బ్రహ్మా మహీపాల ! సిసృక్షుర్వివిధాః ప్రజాః ॥ 17
ద్విధా కృత్వాత్మనో దేహమర్ధేన పురుషో ఽభవత్। అర్ధేన నారీ తస్యాసీత్ విరాజ మసృజత్ ప్రభుః ॥ 18
విరాడసృజత్ పురుషం పురుషో మను రుద్యతే। యస్యైవ స ప్తతిగుణం మన్వంతర మిహోచ్యతే॥ 19
ప్రియవ్రతోత్తాన పాదౌ మనోః పుత్రౌ వుభౌ స్మృతౌ।క్షత్రప్రవ ర్తకౌ తౌ తు పూర్వే మన్వంతరే స్మృతౌ॥ 20
ఉత్తానపాద పుత్రస్తు ధ్రువో విష్ణుః ప్రకీ ర్తితః। నిబద్ధోభ్రామ్యతే యత్ర మరుతాం జ్యోతిషాం గణః ॥ 21
స ప్తర్షి మండలం నిత్యం తస్యాధస్తాత్ ప్రకీ ర్తితః। మరీచిశ్చ వసిష్టశ్చ అంగిరాశ్చాత్రిరేవ చ ॥ 22
పులస్త్యః పులహశ్చైవ క్రతు స్సప్త ర్షయోఽమలాః। వసిష్ఠ మాశ్రితా సాధ్వీ తేషాం మధ్యా దరుంధతీ॥ 23
తస్యాధ స్తాత్ భచక్రంచ తస్యాధస్తాత్ శనైశ్చరః। తస్యాధస్తా త్తథా జీవః తస్యా ధస్తా త్కుజః స్మృతః ॥ 24
తస్యాధస్తా ద్దినేశశ్చ తస్యాధస్తా చ్ఛభార్గవః। తస్యాధస్తా ద్బుధః ప్రోక్తః తస్యాధస్తాచ్చ చంద్రమాః ॥ 25
ప్రాగ్దక్షిణగతిశ్చైవ జ్యోతిషాం చక్ర ముచ్యతే। సర్వే గ్రహాః ప్రాగ్గతయః తుల్యవేగాః ప్రకీ ర్తితాః॥ 26
శీఘ్రత్వేచర న్తే యథా సన్నం మహిపతే।యథాయథా విశిష్టాశ్చ తథా మందాః ప్రకీ ర్తితాః॥ 27
తేషాంతే సంభవం వత్రేప్రాప్తే వైవస్వతేఽంతరే। తేషాంజనన సాహస్రైః అతీతైః కిం ప్రయోజనమ్॥ 28

మున్ను బ్రహ్మ ప్రజల సృష్టింపగోరి తన దేహమున సగముచే పురుషుడు సగముచే స్త్రీయునై విరాజుని (విరాట్పురుషుని) సృష్టించెను .ఆ విరాట్టు పురుషుం గనెను. అతడే మనువు డెబ్బదియొక్క మహాయుగములాయన కాలము-మన్వంతర మనబడును. ఆమనువు కొడుకులు ప్రియవ్రతుడు ఉత్తానపాదుడనువారు. వారు మునుపటి మన్వంతరమున క్షత్ర (వంశ) ప్రవర్తకులు ఉత్తానపాదకుమారుడు ధ్రువుడు. విష్ణువని కీర్తింపబడెను. ఆయన ధ్రువమండలమందు నిబద్ధుడైయున్నాడు. ఆధికారికపురుష స్థానమందు (పదవి యందు) ఉన్నాడన్నమాట. అతని నాధారము సేసికొని (ఆ రక్షణశక్తిచే) మరుద్గణము (వాయువులు) జ్యోతిర్గణము అంతరిక్షమున తిఱుగుచున్నవి. ఆ ధ్రువునికి గ్రిందుగనే సప్తర్షిమండలమున్నది. అందధికారపురుషులుగా నీమన్వతరమందున్న వారు మరీచి వశిష్ఠుడు అంగిరసుడు అత్రి పులస్త్యుడు పులహుడు క్రతువునను పుణ్యజీవులు. వారిలో వశిష్ఠ

వెంటనున్న యావిడ సాధ్వి (పతి వ్రత) అరుంధతి. ఆతనికి క్రిందుగ భచక్రము, దానికి క్రిందుగ శనియున్నాడు. ఆయనకు క్రిందుగ గురుడు ఆట క్రిందుగ కుజుడు ఆ క్రింద సూర్యుడు ఆ క్రింద శుక్రుడు ఆ క్రింద బుధుడు ఆ క్రింద చంద్రుడు నున్నారు. తూర్పునుండి దక్షిణముగ (ప్రదక్షిణముగ) జ్యోతిశ్చక్రము తిరుగుచున్నది. అన్నిగ్రహములు ప్రాగ్గతులు తూర్పునకు తిరుగునవే. వాని వేగముకూడ సమానమే. వారి గమన దూరము దగ్గరయైనపుడు వారు శీఘ్రవేగులనబడుదురు. అది దూరమైనపుడు మంద వేగులనబడుదురు. అతీతమన్వంతరములందును వారు పుట్టి యా యా యధికారస్థానములనధిష్ఠించి తిరుగుచునే యుందురు. వారం దరి కథవలన ప్రయోజనమేమి. వైవస్వతమన్వంతరమందు వారి సంభవ వృత్తాంతమునందు చెప్పుచున్నాను.

అనాదినిధనః శ్రీమాన్ విష్ణుర్నారాయణః ప్రభుః। సఏవ దేవకార్యార్థం భూత్వా ద్వాదశధా పురా॥ 29
ఆదితేర్జనయామాస హ్యాత్మానం కశ్యపాత్ ప్రభుః। తేషాంతు మధ్యే సవితా ఆదిత్యస్యచ దేవతా॥ 30
ప్రోక్తంతే సవితుర్జన్మ శృణు చంద్రమస స్తతః। దశభ్యశ్చ దిసాభ్యస్తు తథాఽత్రే స్సుమహాత్మనః॥ 31
విష్ణురేవాఽభవద్రాజన్! పుత్రస్స మృగలాంఛనః। దాక్షాయణీ వసోర్నామ పత్నీ ధర్మస్య నిశ్రుతా ॥ 32
జనయామాస ధర్మజ్ఞం వసుమధ్యే నిశాకరమ్। శ్రీ సహాయ స్తథా జాతః సోమ శ్చామృతమంథనాత్ 33

విష్ణువాదిఅంతములేనిప్రభువు. ఆయనయే దేవకార్యనిమిత్తము పండ్రెండు రూపులయి కశ్యపునివలన యదితియందు తనను తానే పుట్టించుకొనెను. (స్వయంభువు అయ్యెనన్నమాట) ఆ పండ్రెండుగురలో సవిత (ఆదిత్యుడు) దేవత యొకడు. అదేరీతిగ అత్రికి పది దిక్కులనుండి విష్ణువే యుదయించెను. ఆయనయే మృగలాంఛనుడు (శశాంకుడు) చంద్రుడు. వసువులలో నొకడైన ధర్ముని భార్య దాక్షాయణి వసువులనడుమ ధర్మజ్ఞుడయిన నిశాంకరుని గన్నది. అతడే యమృత మథనము వేళ సోముడై లక్ష్మీదేవితోగూడ యుదయించినాడు.

ప్రాకామ్యేన శశాంకస్య జన్మ తేఽభిహితం త్రిథా। అతఃపరం ప్రవక్ష్యామి తవ భౌమస్య సంభవమ్॥ 34
ఆసీ ద్దైత్యో హిరణ్యాక్షో మహాబలపరాక్రమః। సవై కన్యా మజనయద్వికేశీం నామ నామతః॥ 35
సా లేభే తపసా కేశాన్ తాంవై స్థాణు రకామయత్। తస్యాం మైథునస క్తస్య దేవేశస్య పినాకినః॥ 36
వహ్నిసంభవభీతేన కృతో విఘ్నో హ్యథాగ్నినా। ప్రవిష్టం మైథునాగారం వహ్నిం దృష్టవత స్తథా॥ 37
క్రోధాయాసోద్భవః స్వేదో హరస్య సమపద్యత। ఆననస్వేదజో బిందుః దేవస్యా మిత్రఘాతినః ॥ 38
తస్యాః పపాతః వదనే సా పపౌ త త్ప్రయత్నత। అంతర్వ ర్న్యపి తేనాసీ స్సశాక చ తేజసా॥ 39
మోహితా తస్య బాలస్య గర్భంధారయితుం తదా। ఉత్ససర్జాఽథ తం గర్భం దీప్తానలసమ ప్రభం॥ 40
తం దధార మహీపాల ధరా దేవీస్వరూపిణీ। సంస్కార మకరోచ్చాస్య స్వయమేవచ కశ్యపః॥ 41
అంగారనికటస్థత్వాన్నామ్నా చాంగారకః కృతః । ఉక్తం తే జన్మ భౌమస్య, బుధస్యాతః పరం శృణు॥ 42

ప్రాకామ్యమణిమాదివిభూతులలో నొకటి దానిప్రభావముచే నేనీచంద్రజన్మ వృత్తాంతము మూడురకములుగదెల్పితిని. ఒకేవ్యక్తి ముగ్గురు దంపతులకు మూడుపేర్ల జనించినట్లున్న యీకథ లోకదృష్టికి వికృతముగా దోచును. గాని యిది జ్యోతిర్మండల ములోజరిగిన అద్భుతస్వాభావిక పరిణామముగాన దీనికి జన్యజనకభావము గల్పించిచెప్పుట సామాన్యజనసుబోధమగుటకే. ఈ ప్రాకృతతత్త్వము విజ్ఞానరహస్యము అతీంద్రియేంద్రియకముగావున దానిని ఋషులు ప్రాకామ్యమను విభూతివైభవముచే గుర్తించి మరియొకరీతిం గాదని యిక్కడ వ్యాసహృదయ మించుక వెల్లడింపబడినది.

ఇక భౌమ (కుజ) జన్మకథ తెల్పెద, హిరణ్యాక్షుడను దైత్యుడు మహాపరాక్రముడు. వాని కూతురు వికేశి. (జుట్టులేనిది) ఆమె తపస్సుచేసి జుట్టుసంపాదించుకొనెను. ఆమెను స్థాణువు (శివుడు) కామించెను. ఆమెతో పినాకిరత్యాసక్తుడైయున్నపుడు, నిప్పు పుట్టునని భయపడి దానికగ్ని విఘ్నముకావించెను. అత్తటినగ్ని యేకాంత గృహమందుండగా హరుడు కని కుపితుడైనంత నాతని

మోమున బొదమిన చెమటచుక్క దేవి మోముసంబడెను. దాని నామె త్రావెను. దాన గౌరి గర్భవతియయ్యె. ఆగర్భతేజస్సు మోయ లేక ప్రజ్వలించునగ్నిప్రభవలెనున్న యాగర్భము నామె జారవిడిచెను. దేవిస్వరూపిణియైన ధరణి యాగర్భముంధరించెను. ఆశిశువునకు కశ్యపుడు స్వయముగా జాతకర్మాదిసంస్కారములు సేసెను. బొగ్గుల సమీపమున నుండుటచే నాబాలుని కంగారకుడను పేరు పెట్టబడెను. కుజునియొక్క జన్మవృత్తాంతమిది. ఇక బుధజన్మవృత్తాంతము వినుము.

కశ్యపస్య దనుర్నామ పత్నీ త్రైలోక్య విశ్రుతా। జనయామాస తనయం రజోనామేతి విశ్రుతమ్ ॥ 43
సోఽకామయతవై కన్యాం వరుణస్య మహాత్మనః। వారుణీ నామ విఖ్యాతాం త్రైలోక్య స్యైక సుందరీం ॥ 44
తత స్తపశ్చ తేజశ్చ బలం వీర్యం తథైవచ । శుల్కార్థం సదదౌ తస్యై తా నాదాయ వరాంగనా ॥ 45
అప్సులీనా తదా జాతా తప సోగ్రేణ దానవః । తామప్సు లీనాం విజ్ఞాయ ప్రవివేశోదకం తదా ॥ 46
తస్యాః స్పర్శోపలంభేన ద్రవీభూత స్సదానవః । ద్రవతాం సమను ప్రాప్తాం తాం విజ్ఞాయ నిశాకరః ॥ 47
మమన్థ సహసా తోయం పుత్రార్థీ మనుజేశ్వర! । మధ్యమానే జతే తేన తదాసోమేన పార్థివ! ॥ 48
వివేశ తేజసి పయో విష్ణు ర్దేవ నమస్కృతః । తతః కుమారస్సంజాతో బుధస్తు గ్రహబోధనః ॥ 49
తద్ధధార తదా తారా గురుపత్నీ యశస్వినీ । యదా ధారయితుం శక్తాన బాలం తేజసాన్వితం ॥ 50
దాక్షాయణీ చోత్ససర్జ చంద్రపత్నీ సుతం తదా । ఏవం జన్మ బధస్యోక్తం జీవస్యాతః పరం శృణు। ॥ 51

కశ్యపునికి దనువను పత్ని. ఆమెత్రిలోక ప్రసిద్ధురాలు. ఆమె రజుడను కుమారుంగనెను. అతడు వరుణునికూతురగు వారుణిని గామించెను. ఆమె త్రిలోకసుందరి. ఆమెకు తన తపస్సును తేజస్సును బలమును వీర్యమును శుల్కముగానిచ్చెను. ఆరమణి వానింగొని యుదకములందు లీనమయ్యెను. ఉగ్రతపస్సుచే దనుకుమారుడైన రజుడలనీట లీనమైనట్లామె నెరింగి తాను నా నీటిలో ప్రవేశించెను. ఆమెను దాకెను. తాకినమాత్రాన నతడు ద్రవించెను. (కరగిపోయెను). ద్రవత్వమందినట్లామె గ్రహించి చంద్రుడా యుదకమును పుత్రార్థియై మథించెను. సోముడట్లుమథించుచున్నతరి లోకనమస్కృతుండగు విష్ణువాతేజస్సునందు ప్రవేశించెను. అంతట బుధుడు పుట్టెను. గ్రహములయందొకడుగా దెలియు బుధుడాతడే. ఆ తేజస్సును బృహస్పతిభార్య తార తాను ధరించెను. ధరింపలేక దక్షకన్యయగునామె (చంద్రుని భార్య) యామెయు నాబాలుని గర్భచ్యుతుంగావించెను. ఇది బుధుని జన్మవృత్తాంతము. ఇక గురుని జన్మము వినుము.

సురూపా నామ దుహితా మరీచేస్తు ప్రజాపతేః । దత్తా త్వంగిరసే సాతు రూపయౌవనశాలినీ ॥ 52
తస్యాం స జనయామాస దేవాచార్యం బృహస్పతిమ్ । బృహద్వాచం మహాబుద్ధిం వేదవేదాంగపారగమ్ ॥ 53
ఉక్తంతే జన్మ జీవస్య శుక్రస్యాతః పరం శృణు ॥ ఉషానామ తథా కన్యా హిరణ్యకశిపోస్సుతా ॥ 54
భృగుపత్నీ విశాలాక్షీ సర్వలోకైకసుందరీ । జనయామాస ధర్మజ్ఞం ఖ్యాతమౌశనసం ప్రభుమ్ ॥ 55
స జహారాథ యోగాత్మా ధనం వైశ్రవణస్యతు । హృతే విత్తే తు యక్షేశో జగామ శరణం హరమ్ ॥ 56
తతః క్రుద్ధో మహాదేవో భార్గవం హంతు ముద్యతః । భార్గవోఽపిచ యోగేన ప్రవివేశ హరం తదా ॥ 57
హరోదరస్థ స్తుష్టావ దేవీం పర్వత నందినీం । తయో క్తస్తంతు తత్యాజ తదా శిశ్నేన శంకరః ॥ 58
శుక్రస్తు నామ చైవాస్య తదా చక్రే జగద్గురుః । ధనేశత్వం దదౌ చాస్య ధనేశేన సహాఽనఘ ॥ 59
మైత్ర్యం చాస్య ధనేశేన తథా చక్రే త్రిలోచనః । శనైశ్చరస్య వక్ష్యామి జన్మాఽతస్తే నరేశ్వర! ॥ 60

## గురుజననము

మరీచి ప్రజాపతి కూతురు సురూప, రూప యౌవనశాలిని. ఆమెనతడంగిరసునకిచ్చెను. ఆయన యామెయందు బృహస్పతిని దేవగురుంగనెను. ఆయన మంచివక్త. మహాబుద్ధిశాలి, వేద వేదాంగపారంగతుడు. ఇక శుక్రజన్మవృత్తాంతము వినుము.

## శుక్రజననము

హిరణ్యకశిపుని కూతురు ఉష. ఆవిశాలాక్షి త్రిలోకసుందరి. భృగుమహర్షి భార్య. ఆమె శౌశనసుని (ఉశనుడను భృగు మహర్షి కుమారుని, శుక్రునింగనెను. ఆయన ధర్మజ్ఞుడు. యోగశక్తిచే నతడు కుబేరునిధనమును హరించెను. విత్తముగోల్పడి కుబేరుడు హరుని శరణంజెను. దాన శివుడు కోపముగొని భార్గవుని ఉంపనుద్యమించెను. భార్గవుడు యోగశక్తిచేత హరునికోనే ప్రవేశించెను. ఆదేవదేవు నుదరమందుండి స్తుతించెను పార్వతీ దేవింగూడ కొనియాడెను. శంకరుడంతట వానిని శిశ్నము ద్వారమున విడిచెను. జగద్గురువు శంభు డతనికి శుక్రుడను పేరు పెట్టెను. ధనేశునితోబాటితనికి గూడ ధనాధిపత్యము మెసంగెను. మరియు కుబేరునితో నితనికి మైత్రిని గూడ గూర్చెను. ఇక శని జన్మ వృత్తాంతము తెలిపెద.

బ్రహ్మణోమానసః పుత్రః త్వష్టానామ ప్రజాపతిః । సంజ్ఞాంతు జనయామాస కన్యాం త్రైలోక్య సుందరీమ్ ॥ 61
తాం దదౌ సవితుః పత్నీం తస్యాం సూర్యో మహాతపాః । జనయామాస ధర్మజ్ఞం మనుం వైవస్వతం ప్రభుమ్ ॥
యమం చ యమునాం చైవత్రైలోక్యస్యైకపాలినీమ్ । తేషుజాతేషు పుత్రేషు సంజ్ఞాసా చారులోచనా ॥ 63
భర్తుస్తేజోఽతి దుర్ధర్ష మసహన్తీ వరాంగనా । సాతుఛాయాం సమాహూయ ఇదం వచన మబ్రవీత్ ॥ 64
మద్రూపేణ త్వయా భద్రే వస్తవ్య మవికారయా । పాలనీయౌ చ మేపుత్రౌ త్వయేమౌ దుహితాచ మే ॥ 65
ఏవముక్త్వాయయౌ దేవ పితరం వరవర్ణినీ । పిత్రా నిరస్తా భర్తారం గచ్ఛ గచ్ఛేతి భాషితా । 66
ఉత్తరాంస్తు కురూన్ గత్వా బడబారూపధారిణీ । చచార శాద్వలాన్ శుభ్రాన్ వనేషూపవనేషు చ ॥ 67
ఛాయాయాంచ తథార్కోఽపి సంజ్ఞేయ మితి చింతయన్ । ద్వౌపుత్రౌ జనయామాస సావర్ణంతు శనైశ్చరం ॥ 68

వజ్ర :—

కథం తా మాప్తవాన్ సంజ్ఞాం భూయ ఏవ దివాకరః ।ఏతన్మే సంశయం బ్రూహి భృగువంశ వివర్ధ ॥ 69

## శని జననము - అశ్విని జననము

బ్రహ్మ మానస పుత్రుడు త్వష్ట ప్రజాపతి. త్రిలోక సుందరియగు సంజ్ఞయను కూతురుంగని సూర్యుని కిచ్చెను. సూర్యుడామెయందు వైవస్వతమనువుంగనెను. యముని యమునను గూడ గనెను. యమునానది త్రైలోక్యపావని. సంతానము గల్గిన తర్వాత నా సుందరి సంజ్ఞాదేవి సుకుమారి భర్తతేజమును సైపలేక ఛాయం బిలిచి కల్యాణి నా రూపుగొని యెట్టి వికృతి దోపనీక యిట సూర్యభగవానునిదగ్గర నుండుము. నా కొడుకులను నా కూతురును గాపాడుచుండుము. అని పలికి యా సంజ్ఞాదేవి తండ్రి దరికేగెను. ఆతడు నీ మగని దగ్గరకుపొమ్మన నుత్తరకురుభూముల కేగి బడబారూపమున నచ్చట పచ్చికబయళ్లతోడి యుపవనంబులందు దిఱుగుచుండెను. సూర్యుడును ఛాయయం దీమె సంజ్ఞయేయని భావించుచు నిద్దరుకొడుకులంగనెను. వారు సావర్ణుడు, శనైశ్చరుడు. అన వజ్రుండు రవి తరిగి యాసంజ్ఞ నెట్లుపొందెను? నాసంశయమిది నివారింపుమన మార్కండేయుడనియె.

మార్కండేయః—

పుత్రయో స్స్వాతపుత్రాంస్తు యథా ఛాయానువర్తతే ।న తథా వర్తతే దేవీ సంజ్ఞాసూతేషు భామినీ ॥ 70
తతః కదాచిత్తాం క్రుద్ధః సంతతర్జ తదా యమః । తం శశాప తదా ఛాయా పాదస్తే పతతా మయం ॥ 71
యమ శ్శశంస తత్సర్వం పితుః పరబలార్దనః । శ్రుత్వా యమస్య వచనం యమం ప్రోవాచ భాస్కరః ॥ 72
కృమయో మాంసమాదాయ తథా యాస్యన్తి భూతలం । ఏవం శాపేచ్ఛ శాపస్తే త్వం చ త్రాతో భవిష్యసి॥ 73
ఏతచ్ఛ్రుత్వా పితుర్వాక్యం చకార సుమహత్తపః । ఆరాధయామాస తదా దేవ దేవం జనార్దనం ॥ 74
తస్మాత్స లేభే ధర్మాత్మా ధర్మరాజత్వ మంజసా । సూర్యోఽప్యవిందన్ తత్త్వేన పుత్రశాపస్య కారణం ॥ 75
క్రోధావిష్ట స్తదా ఛాయాం పప్రచ్ఛామిత్రఘాతనః । శశంస తస్యై సా సర్వం యథా వృత్త మనిందితా ॥ 76

శ్రుత్వాతు వచనం తస్యా స్త్వష్టు ర్వేశ్మగప ద్రవిః । న దదర్శచ తత్రస్థాం తాం భార్యాం శుభచారిణీం ॥ 77
త్వష్ట్రా చాశంసితం తస్య బడబారూపధారిణీ । అసహన్తీ తు తేజ స్తే కురూ నావసతే శుభా ॥ 78
భ్రమి మావేశ్య దేవేశం త్వష్టాప్యపి జగతాం పతిం ॥ తేజసః శాతనం చక్రే దేవస్య సవితు స్తదా ॥ 79
కీర్ణే తేజసి తద్రూపం భృశం కాంతతరం స్థితం । చీర్ణేన తపసా చక్రం త్వష్టా చక్రే జగద్గురోః ॥ 80
సుదర్శన మితి ఖ్యాతం దేవస్య హరిమేధసః । కా న్తరూపస్తు సవితా హయరూపధర స్తదా ॥ 81
ఉ త్తరాంస్తు కురూన్ గత్వా బడబారూపధారిణీం । స్వాం దదర్శ తదా భార్యాం శీతలద్రవ్య సంయుతాం ॥ 82
మైథునార్థీతు దాం దేవో జగామ త్వరిత స్తదా । వేగవంతంతు సంప్రాప్తం దృష్ట్వా తురగము త్తమం ॥ 83
వ్యచేష్టత చ సా దేవీ పర పుంసోప శంకయా । ముఖే చ భాపయామాస తాంసూర్యో దీ ప్తదీధితిః ॥ 84
తస్యా నాసాపుటౌ పూర్ణౌ తదా శుక్రేణ పార్థివ! । తథా తస్యా స్తదా జాతౌ నాసత్యా వశ్వినా వుభౌ ॥ 85
భూమౌచ పతితం యచ్చ తాభ్యాం శుక్రం విమర్దితం ।
తస్మా త్సోశ్వాత్ సముత్పన్నః కుమార స్సూర్య సన్నిభః ॥ 86
తతస్స్వరూప మాస్థాయ దేవదేవోఽపి భాస్కరః । స్వరూపిణీ మథాదాయ సంజ్ఞాంతాం స్వగృహం యయౌ ॥ 87
నా సత్యౌ దేవభిషజౌ కృతవానశ్వినా వుభౌ । తతో విమర్దనా జ్జాతం పుత్రం దృష్ట్వా దివాకరః ॥ 88
రేవంతేతి తదా తస్య నామ చక్రే జగద్గురుః । తంచపుత్ర మువాచాథ సూర్యోగ్రహగణేశ్వరః ॥ 89
యస్మాత్సోఽశ్వాత్ సముత్పన్నో మత్త స్త్వంద్దీ ప్తదీధితి । పూజా మాప్స్యసి సోఽశ్వేభ్య స్తస్మాన్నిత్యం జగత్త్రయే
యేచత్వాం పూజయిష్య న్తి తేషాం వృద్ధి ర్భవిష్యతి । శనైశ్చరస్య తే జన్మ మయో క్తం నృపస త్తమ! 91

## అశ్వినీ దేవతల జననము

సంజ్ఞ కన్నకొడుకుల యెడ, తాను కన్న కొడుకుల యందట్లు ఛాయాదేవి ప్రవర్తింప దయ్యెను. అంతట నొకతటి కోపముగొని యముడామె బెదరించెను. ఆమె నీ కాలు పడిపోవుగాకయని శపించెను. యముడది తండ్రికి జెప్పెను. భాస్కరుడది విని కృపములు నీ పాదముం దొలిచి యూహాంసముంగొని భూతలమునకు పోగలవు. ఈ విధముగా నీ శాపము శమించును. నీవు రక్షింపబడుదు వనెను. ఇది విని యముడు తీవ్ర తపముసేసి విష్ణునారాధించి యాయన వలన ధర్మరాజత్వమును బడసెను. సూర్యుడును పుత్రుని శాప కారణము తెలిసికొని క్రోధావేశమున ఛాయ నడిగెను. ఆ సాధ్వి జరిగినదెల్ల వివరించి చెప్పెను. అది విని భానుడు త్వష్ట యింటికేగి యచట సంజ్ఞాదేవిం గానక యా మామ గారి వలననామె బడబా రూపమున (గుఱ్ఱమురూపున) నున్నది. నీ తేజ మోర్వలేక కురుభూములందిఱుగు చున్నదని తెలిపి, అల్లుని జగత్ప్రభుని సూర్యుని భ్రమియను యంత్రమున కెక్కించి తేజశ్శాతన మొనరించెను. అతని తేజస్సులు తరణి బట్టెనన్నమాట. అట్లు తేజస్సు చిమ్మబడ నా ప్రభాకరుని తేజస్సు మిగుల మనోహరమయితోచెను. ఆ తరణి బట్టిన తటి రాలిన పొడితో త్వష్టచక్రాయుధమును జేసెను. అదే హరీమేధసునకు విష్ణువునకు సుదర్శనమను పేరనాయుధమయ్యెను. అట్లు సవిత కాంత రూపుడై హయరూపము మూని యుత్తర కురు దేశములకేగి బడబా రూపమున నున్న తన భార్యం చల్లని వస్తువులతోనున్న దానిం గాంచెను. ఆ సూర్య దేవుండప్పుడు తొందర గొని మైథునార్థియై యామెందరిసెను. బహువేగమున వచ్చునా తురగోత్తమముంగని పరపురుషుడను శంకగొని నిశ్చేష్టురాలయ్యె. సూర్యుడామె ముఖమునందుభావింపజేసెను. ఆమె ముక్కుపుటము వీర్యముతో నిండినవి. అపుడామెకు అశ్వినులు నాసత్యులని పేర వారు పుట్టిరి. వారిద్దరి సమర్దము నంది భూమి మీద పడిన ఆ అశ్వములయొక్క శుక్రమునుండి సూర్యునితో సముడగు కుమారుడుదయించెను. అప్పుడు దేవదేవుడు సూర్యుండును నిజరూపమునసున్న సంజ్ఞాదేవిజేకొని స్వగృహమునకేగెను. అయిద్దరు నాసత్యులను అశ్వినీ దేవతలకు వైద్యులనుగావించెను. సమ్మర్దమువలనపుట్టిన కొడుకునుగని దివాకరుడు జగద్గురువువానికి రేవంతుడని నామకరణముచేసెను.

గహగణాధీశ్వరుడు కొడుకునుంగని నీవు అశ్వములనుండి నిత్యము పూజనందెదవు. జగత్ప్రియుడవయ్యెదవు. నిన్నెవరుపూజింతురు వారి వృద్ధిక ల్గుననెను. ఇటుపై రాహువు జన్మ వృత్తాంతము తెలిపెద వినుమని మార్కండేయు డనియె.

-రాహు కేతు జననము-

అతః పరం ప్రవక్ష్యామి రాహోర్జన్మ తథాఽనఘ । దాక్షాయణీ సింహికాఖ్యా భార్యావై కశ్యపస్యతు ॥ 92
అకాలే వరయామాస భర్తారం తపసాన్వితం । భగవన్! పుత్రకామాఽహం తం ప్రయచ్ఛ మమానఘః ॥ 93
అకాలయాచ్ఞానంక్రుద్ధ స్తాంజగాద స కశ్యపః । దైత్యదానవ సంకాశం పుత్రం త్వం జనయిష్యసి ॥ 94
రాహుం సాజనయామాస వరదానా న్మహాత్మనః । అతఃపరం ప్రవక్ష్యామి కేతో స్తే జన్మ పార్థివః ॥ 95
ప్రజానాం మహతీం వృద్ధిం దృష్ట్వా దేవః పితామహః। క్షయేతాసాం సదాచక్రే వృద్ధిం బుద్ధిమతాం వరః 96
క్షయం చిన్తయత స్తస్య ప్రజానాం మనుజేశ్వర! । ప్రాదుర్భూతా తతః కన్యా మృత్యు ర్నామేతి విశ్రుతా ॥ 97
తాంజగాద తదా బ్రహ్మ ప్రజాః సంహర శోభనే! । సా తథోక్తా తదా తేన దరోద వరవర్ణినీ ॥ 98
తదా శ్రుబిందుభి ర్జాతా వ్యాధయోఽథ సహస్రశః । దృష్ట్వా వ్యాధీన్ సముత్పన్నాన్ సంహృత్యా శ్రుణిభామినీ ॥
సుదుస్తరం తప స్తేపే పుష్కరారణ్యమాశ్రితా । స్థానేషుచ తథాన్యేషు బహూన్ వర్షగణాన్ శుభా ॥ 100
భూయో జగాద తాం బ్రహ్మప్రజాః సంహర శోభనే । మయోక్తం యత్పురా భద్రే ! తత్తథాన తదన్యథా ॥ 101
తపసా తే వరం గ్రాహ్యం తదాచక్ష్వ సుశోభనే! । నృణాం నిమిత్తం మరణే లోకేయాస్యతి దోషతః ॥ 102
నకశ్చి ద్దోషతో మన్తా త్వాం కదాచిదపి ధ్రువే । ఏవముక్తా తదాతేన బ్రహ్మణా సాసుశోభనా ॥ 103
దీర్ఘముష్ణంచ నిఃశ్వాసం ముమోచ వర వర్ణినీ । కృష్ణసర్పసమాకార స్తస్మాత్కేతు రజాయత ॥ 104
శిఖీదీప్తశిఖో రాజన్! కాలానల సమప్రభః । ధూమ్రప్రభస్య తస్యాథ కేతురూపస్య పార్థివః ॥ 105
సంజ్ఞాం చకార సర్వాత్మా దేవ దేవః పితామహః । ధూమకేతురయం నామ్నా భవిష్యతి జగత్త్రయే ॥ 106
దర్శయిష్యతి లోకానాం తథైవచ శుభాశుభం । దివ్యన్తరిక్షేభువిచైక ఏషః సందృశ్యతే ధూమకేతు ర్మహాత్మా ॥
సంస్థానరూపై సుబహుప్రకారైః శుభాశుభం దర్శయన్ మానుషాణాం ॥ 107

ఇది శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే గ్రహసంభవోనామ షడుత్తర శతతమోఽధ్యాయః.

రాహుకేతువుల జననము :— కశ్యపప్రజాపతి భార్య సింహిక. ఆమె దక్షుని కూతురు. తపస్సుననున్న భర్తనుజేరి భగవంతుడా! నేను బుత్రుని గావలెనని కోరికతో నున్నానను గ్రహింపు మనియె. ఆ సమయమందడుగుటకు కోపించి యా ప్రజాపతి దైత్య దానవుల పోలిన వానిని గుమారుని నీవు గనెద వనెను. ఆ మహాత్ముని వరదానమున నామె రాహువుం గనెను.

ఇకకేతువుజన్మకథ : బ్రహ్మ ప్రజలూరక పెరిగిపోవుటమాచి యాబుద్ధిశాలి ప్రజలుక్షయించుటకనువైన యాలోచనసేసెను. ఆ ఆలోచన మృత్యువనుకన్య యాయనకు గల్గెను. ఆమెను జూచి "ఓ కల్యాణి! నీవు ప్రజాసంహారము చేయు" మని విధి పల్కెను. అదివిని యామె ఏడ్చెను. ఆ కన్నీళ్ళనుండి వ్యాధులు వేలకొలది పుట్టెను. ఆమె వారింగని కన్నీళ్ళు ఆపుకొని (తుడిచికొని) ఉష్కరారణ్యముం జొచ్చి దుశ్చర తపము సేసెను. అక్కడనే కాదు పెక్కుచోట్ల పెక్కు సంవత్సరములు తపస్సు చేసెను - బ్రహ్మ మరల యామెంగని ప్రజాసంహారము సేయుము. మున్నునేజెప్పితిని గదా! అది యట్లే కావలయును. మఱొకలాగున కాదు. అదివిని యాసుందరి వేడి నిట్టూర్పువుచ్చెను. ఆ యూర్పు నుండి కేతువు పుట్టెను. అగ్నివలె జ్వలించు శిఖ(జుట్టు) కాలాగ్నివంటి కాంతియు కల్గి పొగలు గ్రమ్ముచు కేతురూపుడై (జెండా వలెనుండి) యున్నవానిని దేవదేవుడు బ్రహ్మ ధూమకేతువను పేరందెదవు. లోకములకు శుభాశుభములం జూపింతువనెను. దినమున నంతరిక్షమున భూమియం దీకేతువొక్కడే ధూమకేతువయి బహువిధముల రూపములతో గానిపించును. మనుష్యులకు శుభాశుభ ఫలమును జూపుచుండును.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర పురాణమున ప్రథమఖండమున గ్రహసంభవమను నూటయాఱవ అధ్యాయము.

# నూటయేడవ అధ్యాయము - గ్రహనక్షత్రాది సంభవము

మార్కండేయః :

పూర్వం బ్రహ్మ మహీపాల సిసృక్షు ర్వివిధాః ప్రజాః । అభ్యయుంక్త తదాత్మానం తస్యయుక్తస్య పార్థివ ॥ 1

తతోఽస్య జఘనా త్పూర్వం మసురాన్ జజ్ఞిరే సుతాన్ ।అసుః ప్రాణః స్మృతోవిప్రైః తజ్జన్మాన స్తతోఽసురాః॥ 2

యధాసృష్టాః సురా స్తస్వా తాంతనుం సవ్యపోహిత ।

అవ్యం క్తం త త్త్వబహుళం తతస్తాన్ సోఽభ్యయుంజత ॥ 2

తతస్తాన్ యుంజమానస్య ప్రియ మాసీత్ ప్రభోఃకిల । తతో ముఖాత్ సముత్పన్నా దివ్యత స్తస్య దేవతాః ॥ 4

ఉత్పన్నా దీవ్యత స్తస్యదేవా స్తేన తతః స్మృతాః । ధాతుర్దివీతి యత్ప్రోక్తం క్రీడార్థం సంవిభావ్యతే ॥ 5

తస్మా ద్దేవా స్తు తనాయేం జజ్ఞిరే తస్య దేవతాః । దేవాన్ దృష్ట్వా తతస్సో వై తను మన్యాం ప్రపద్యత ॥ 6

సత్త్వమాత్రాత్మికా మేవ తనుంతాం సోఽభ్యయుంజత । పితేవ మన్యమాస్తాన్ సుతాన్ విధ్యాధ స ప్రభుః ॥ 7

పితరోహ్యుప పక్షాభ్యాం మధ్యే రాత్ర్యహ్నయోః పురా ।

తస్మాత్తే పితరో దేవాః పితృత్వం తేషు తత్ స్మృతమ్ ॥ 8

యయా సృష్టాస్తు పితర స్తనుం తాంస వ్యపోహాత సాఽపవిద్ధా తను స్తేన సద్యః సంధ్యా వ్యజాయత ॥ 9

తస్మాదహ ర్దేవతానాం రాత్రిస్స్యా దాసురీ మతా । తయోర్మధ్యేతు పితరః సా తనుస్తు గరీయసీ ॥ 10

తస్మా ద్దేవాసురాశ్చైవ ఋషయో మానవా స్తథా । యుక్తాస్తే తా ముపాస న్తే తథా విష్ణో ర్వద న్తరమ్ ॥ 11

తస్మా ద్రాత్ర్యహ్న యోః సంధా వుపాస న్తే ద్విజాస్తుతామ్ ॥

తతోఽన్యస్యాం పునర్బ్రహ్మా స తన్వా ముపపద్యత ॥ 12

రాజసత్వాత్మికాయాం తు మనసా సోఽసృజత్ ప్రభుః । మనసాతు తత స్తస్య ప్రజానాం జజ్ఞిరే ప్రజాః 13

మనసా చ మనుష్యా న్తే జననాత్ ప్రథితాః ప్రజాః ।

సృష్ట్వా పునః ప్రజాస్సోమ్య ! స్వాంతనుం సోఽ వ్యపోహత ॥ 14

సాఽపవిద్ధా తను స్తేన జ్యోత్స్నా సద్యః ప్రజాయత ।

తస్మాద్భవ న్తి సంహృష్టాః జ్యోత్స్నాయాః ఉద్భవే ప్రజాః ॥ 15

తా ముత్సృజ్య తతో జ్యోత్స్నాం తతోఽన్యాం ప్రావిశత్ప్రభుః ।

మూ ర్తిం రజ స్తమాసక్తాం తతస్తాం సోఽభ్యయుంజత ॥ 16

తతోఽన్న భవన్ధకారేతు క్షుధాఽఽవిష్టాః ప్రజాః నృప ।

తాః సృష్ట్వాతు క్షుధా విష్టాః అంగుళ్యా ధాతు ముద్యతాః ॥ 17

అంభాంస్యేతాని రక్షామ ఉక్తవ న్తస్తు తేషుయే । రాక్షసాస్తేస్మృతా స్తస్మాత్ క్షుధాత్మానో నిశాచరాః 18

ధ్రువం క్షిణోమి యేఽమ్భాంసి తేషు దృష్ట్వా పరస్పరమ్ । తేన తేకర్మణా యక్షా గుహ్యకాః క్రూరకర్మిణః। 19

రక్షణే పాలనే చాపి ధాతురేవవి భావ్యతే । యక్ష ఇత్యేషధాతుర్వై క్షేపణే సన్నిరుచ్యతే ॥ 20

రక్షణా ద్రక్ష ఇత్యుక్తాః క్షపణా ద్యక్ష ఉచ్యతే । తాన్ దృష్ట్వా తత్క్షణే నాస్య కేశా శ్శీర్య న్త ధీమతః ॥ 21

తేశీర్ణా వ్యుత్థితా హ్యూర్ధ్వ మారోహ స్త తతః పునఃసర్పణాత్తు స్మృతాస్సర్పాః పన్నత్వా త్పన్నగాః స్మృతాః ॥ 22

వాలాత్మానః స్మృతా వ్యాళాః హీనత్వా చ్చాహయః స్మృతాః ।
పన్నత్వా త్పన్నగా శ్చాపి సర్పాసేఽపాయసర్పణాత్ ॥ 23
తేషాం లయాః పృథివ్యాపః సూర్యాచంద్రమసౌ ఘనాః । తస్య క్రోధోఽభవత్ ధూమ మగ్నిగర్భః సుదారుణః ॥
సతాన్ సర్పాన్ సముత్పన్నా నావికేశ విషాత్మకాన్ ।
సర్పాన్ దృష్ట్వా తతః క్రోధాత్ క్రోధాత్మకాన్ వినిర్మమే ॥ 25
గాం ధయన్త స్తతో దృష్ట్వా గంధర్వా అగ్నిరేతసః । ధయ ఇత్యేష ధాతుర్వై పానే హ్యేష నిరుచ్యతే ॥ 26
పిబన్తో జజ్ఞిరే వాచా గంధర్వాస్తేన తే స్మృతాః । కర్ణేన కపిశా భూత్వా పిశాచాః కపిశా హ్యలమ్ ॥ 27
భూతత్వాత్తే స్మృతా భూతాః పిశాచాః పిశితాశినః । అష్టాసు తాసు సృష్టాసు దేవయోనిషు స ప్రభుః ॥ 28
తతః స్వచ్ఛందతోఽన్యాని వయాంసి వయసా సృజన్ । పక్షిణః సతు దృష్ట్వావై తతః పశుగణాన్ సృజన్ ॥ 29

మార్కండేయుడనియె : బ్రహ్మ సృష్టిచేయదలచి తననందుకొఱకు నియోగించుకొనెను. అప్పుడాతని జఘనములనుండి = పిఱుదుల భాగమునుండి యసురులు. అసుః ప్రాణము దానినుండి జన్మమందిన వారు అసురులని విప్రులు నిర్వచించిరి. తనువు నుండి సురలు సృష్టింప బడిరి. అతడాతనువును = శరీరమును అవ్యక్తము తత్త్వబహుళమునైన దానిని దానికై వినియోగపరచెను. దానినుండి సురలను సృష్టించినందున నాతనికి ప్రీతి గల్గెను. ఆయన తేజోమయమైన ముఖమునుండి దేవతలు పుట్టిరి. కావున వారికి దేవతలను పేరుగల్గెను. ధాత యొక్క దేవిగ (పత్ని) క్రీడానిమిత్తముగా సంభావితయైనట్లు చెప్పబడినయాయన శరీరమునందు దేవతలు జనించిరి. వారిని జూచి యాతడింకొక శరీరము స్వీకరించెను. అది కేవల సత్త్వగుణమాత్రము. దానిని సృష్టియందు వినియోగించెను. ఆ సమయములో తన నాతడు పితగా (తండ్రిగా) భావించెను. కావున నందుభయ పక్షముల నుండి పితరులు రాత్రింబవళ్ళకు నడుమ జనించిరి. అందుచే వారు పితరులనబడిరి. పితృత్వము దానివలన వచ్చినది. పితరులు జనించిన యా తనువు నాతడు వదలిపెట్టెను. ఆ విడిచిన శరీరమే సంధ్యయయ్యెను. కావుననే పగలు దేవతలది దైవి రాత్రి అసురులది. (ఆసురి) యనబడినది. ఆ రెండింటి నడుమనున్నవారు పితరులు. ఆ శరీరము గొప్పది కావున దేవతలు, అసురులు ఋషులు, మానవులు నందఱు గలిసి విష్ణువుయొక్క యా శరీరమునుపాసింతురు. రాత్రింబవళ్ళ నడిమి సంధ్యారూపవిష్ణుశరీరమును ద్విజు లుపాసింతురు. అటుపై బ్రహ్మ మఱియొక తనువు స్వీకరించెను. అది రాజ శరీరము. (రజోగుణప్రధానము) మనసుచేతనే దాని నతడు సృజించెను. మానసమైన దాని నుండి పుట్టిన ప్రజలకు ప్రజలు (సంతానము) గల్గిరి. మనసుచే పుట్టినందున వారు మనుష్యులనబడిరి. అవిధముగా ప్రజలను సృష్టిచేసి తన యాశరీరమును విడిచెను. ఆ విడువబడిన శరీరము వెన్నెలయ్యెను. దాని పుట్టినప్పుడు ప్రజలానందభరితులైరి. ఆతడది విడిచి యింకొక తనువుసంప్రవేశించెను. అది రజస్తమోగుణసమష్టి రూపము. అంధకారరూపమైనదాని నుండి యాకలితోగూడిన ప్రజల సృజించెను. ఆ ప్రజ యాకలితో వ్రేళ్లుగుడిచికొనుచు నా అంభస్సులను రక్షామ = రక్షించుకొందుమనిరట. అందుచే వారు రాక్షసులను పేర కేవలము నాకలియే స్వరూపముగాగల నిశాచరులయిరి వారొండొరులంజూచి యీ నీళ్ళను భ్రువునిగూర్చి చల్లెదనుని (క్షణోమి) యొకరిపైనొకరు చల్లుకొనినందున యక్షులు పేరొందిరి. వారే గుహ్యకులు క్రూరకర్ములు. యక్ష అనుధాతువు రక్షణమందు పాలనము నందు క్షపణము = విసరుట (చల్లుట) యందు నిర్వచింపబడును. కావున రక్షణాత్ రక్షః = రక్షించుటచే రాక్షసులనబడిరి. యక్షణాద్ క్షేపణమువలన యక్షులనబడిరి. బ్రహ్మ వారిని జూచిన యాక్షణమే కేశములూడిపోయెను. యూడిపోయినవే తిరిగి యూర్ధ్వము మొలచి పైకెగబ్రాకినవి. సర్పణమువలన (ప్రాకుట వలన సర్పములనబడినవి. పన్నత్వాత్ పడిపోయినందువల్ల పన్నగములనబడినవి. అవే వాలరూపములగుట వలన (అహయః) హీనములుకానందున నహులుఆనబడెను. వానికి లయవ్యాలములున స్థానములు దాగేస్థానములు. (లీనములగు తావులు) భూమి నీరు సూర్యుడు చంద్రుడు మేఘములును - అ బ్రహ్మయొక్క కోపమే పొగ

యైనది దాని గర్భమందగ్ని దారుణముగనుండును. అా బ్రహ్మ విషరూపములయిన యా సర్పములందావేశించెను. వానిని క్రోపముతో జూచి క్రోధస్వరూపములుగా మొనరించెను. ఆ మీద గాం వాక్కును ధత్‌యనా కుడిచికొనిరి అను నిర్వచనము ప్రకారము అగ్నిరేతసులగు గంధర్వులు పుట్టిరి. ఆయనచెవినుండి కపిశ వర్ణముగల పిశాచులు కపిశవర్ణమువారు పుట్టిరి. (కపిశవర్ణ=జేగురురంగు) వారు భూతత్వమువలన పుట్టుట వల్ల భూతములని, పిశిత + అశినః = మాంసమును దినుట వలన పిశాచులునని నిర్వచింపబడిరి. ఇట్లు ఎనిమిదిరకాలు దేవయోనులు సృజింపబడగా నా బ్రహ్మ స్వచ్ఛందముగా (తన యిచ్ఛానుసారముగ) పయస్సుచేత (ప్రాయముచేత) వయసములను (పక్షులను) సృజించెను. అందుచే పక్షులకు వయస్సు ఎక్కువ యన్నమాట. ఆవి పక్షులగుట చూచి రెక్కలు గలవగుటగని యవ్వల పశువులం సృష్టించెను.

ముఖతోఽజాః సృజన్ సోవై వక్షసః చావయోఽసృజత్ ।
గాస్తథ్చైవోదరా ద్బ్రహ్మ పున . న్యాంశ్చ నిర్మమే ॥ 30

పాదతోఽశ్వాంస్తురంగాంశ్చ రాసభాన్ గవయాన్ । మృగాన్ న్ష్రిం శ్చైవ వరాహాంశ్చ శ్వానా నన్యాంశ్చ జాతయః ॥
ఓషధ్యః ఫలమూలిన్యో రోమభిస్తస్య జజ్ఞిరే । ఏవం విధా షధీః సృష్ట్వా న్యయుజత్ సోఽధ్వరేషు తాః ॥ 32

ముఖము నుండి అజములను (మేకలను) వక్షము నుండి (అవి) గొఱ్ఱెలను ఉదరము నుండి గోవులను సృజించి మఱి పెక్కు జాతులను పుట్టించెను. పాదములనుండి అశ్వములను తురంగములను రాసభములను (కంచర గాడిదలను) గవయమృగములను ఒంటెలను పందులు కుక్కలు మఱి పెక్కు జాతులను సృజింపజేసెను. ఓషధులను పలమూలములను రోమములనుండి పుట్టించెను. ఇట్టివెల్ల పుట్టించి వానిని యజ్ఞములు యందు వినియుక్తములు గావించెను.

ఆస్యత్వాదౌతు త్రేతాయుగముఖే పురా । గోరజః పురుషోఽధావి రథాశ్వతర గర్దభాః ॥ 33
ఏతే గ్రామ్యాః స్మృతాః సప్త ఆరణ్యా స్సప్తచాపరే । మహిషో గవయోష్ట్రాస్తు ద్విఖురశ్శరభో ద్విపః ॥ 34
మర్కట స్సప్తమస్తే షామారణ్యాః పశవస్తు తే । గాయత్రం చ ఋచం చెవ త్రివృత్స్తోమం రథన్తరమ్ ॥ 35
అగ్నిష్టోమం చ యజ్ఞానాం నిర్మమే ప్రథమా న్ముఖాత్ । యజ్ఞోఽపి త్రైష్టుభం ఛందః స్తోమం పంచదశ స్తథా ॥ 36
బృహత్ సామ తథోక్తంచ దక్షిణాత్ సోఽసృసాన్ముఖాత్ । సామాని జగతీం చైవ స్తోమం సప్తదశం తథా ॥ 37
వైరూప్య మతి రాత్రంచ పశ్చిమాత్సోఽ సృజన్ముఖాత్ । అథర్వ మేక వింశంచ త్రిష్టుఽబ్వైరాజ మేవచ । 38
అప్తోర్యామం చయజ్ఞానాం చోత్తరా త్సోఽస్పజన్ముఖాత్ । విద్యుతోఽశని మేఘాంశ్చ రోహితేంద్ర ధనూంషిచ ॥
సృష్ట్వా చతుష్టయం పూర్వం దేవర్షిపితృమానవాన్ । తతోఽసృజత్సర్వభూతాని స్థావరాణి చరాణి చ ॥ 40
సృష్ట్వా యక్షపిశాచాంశ్చ గంధర్వాప్సరసస్తథా । నరకింనర రాక్షాంసి వయః పశుమృగోరగాన్ ॥ 41
అవ్యయం చ వ్యయం చైవ ద్వయం స్థావరజంగమమ్ । జరాయుజం చాండజంచ స స్వేదజ మథోద్భిజమ్॥ 42
భూతగ్రామం సకృతవాన్ దేవ దేవ శ్చతుర్విధమ్ । పశవశ్చమృ గాశ్చైవ వ్యాళా శ్చోభయతోదతః ॥ 43
రక్షాంసి చ పిశాచాంశ్చ మనుష్యాంశ్చ జరాయుజాన్ । అండజాన్ పక్షిణ స్సర్పాన్నక్రాన్ మత్స్యాంశ్చ కచ్ఛపాన్ ॥
యానిచైవం ప్రకారాణి స్థావరాణి చరాణిచ । స్వేదజం దంశమశక యూకా మక్షిక మత్కుణమ్ ॥ 45
ఊష్మణ శ్చోపజాయన్తే యచ్చాన్యత్కించి దీదృశమ్ । ఉద్భిజా స్తరవ స్సర్వే బీజకాండప్రరోహిణః ॥ 46
ఓషధ్యః ఫల పాకాన్తా బహుపుష్ప ఫలోపగాః । అపుష్పాః ఫలవంతో యేతే వనస్పతయః స్మృతాః ॥ 47
పుష్పిణః ఫలినశ్చైవ వృక్షా శ్చోభయతః శుభాః । ప్రతానా శ్చైవ వల్ల్యశ్చ వీరుధః పరికీర్తితాః ॥ 48
గుచ్ఛగుల్మంతు వివిధం తథైవ తృణజాతయః । బీజకాండ రుహాణ్యేవ ప్రతానా వల్ల్య ఏవచ ॥ 49
తమసా బహురూపేణ వేష్టితాః కర్మహేతునా । అనుసంజ్ఞా భవన్త్యేతే సుఖదుఃఖ సమన్వితాః ॥ 50

ఏకదన్తాస్తుగతయో బ్రహ్మాద్యా స్సముదాహృతాః । ఘోరేఽస్మిన్ భూత సంసారే నిత్యే సతతయాయిని ॥ 51

ఈయన తొలి కల్పము యొక్క త్రేతాయుగను మొట్టమొదట గోవు అజము పురుషుడు గొఱ్ఱె అశ్వతరము.గాడిద అను నీయేడును గ్రామ్యములు దున్నపోతు గపయము ఒంటె రెండు రెక్కలుగల శరభము ద్విపము (ఏనుగు) మర్కటము నను నివి యారణ్య పశువులు ననబడెను. గాయత్రి ఋక్కు త్రివృత్ స్తోమము రథంతరము అగ్నిష్టోమముననను వానిని యజ్ఞములయొక్క మొదటి భాగములను సృష్టించెను. యజ్ఞము త్రైష్టుభ ఛందస్సు, స్తోమము పందశ ఛందస్సు. బృహత్సామను కుడిముఖమునుండి సృజించెను. సామములు జగతీ ఛందస్సు స్తోమము సప్తదశము వైరూప్యము అతిరాత్రమునను వానిని పశ్చిమముఖము నుండి సృజించెను. అధర్వము ఏకవింశము త్రిష్టుప్పు వైరాజము అప్తోర్యామమునను యజ్ఞభాగములను ఉత్తరముఖము నుండి సృష్టించెను. విద్యుత్తు అశని=పిడుగు మేఘములు రోహితము = ఇంద్రధనుస్సు, ననునాల్గును దేవర్షిపితరులను మానవులను పూర్వము సృజించి అటుపై స్థావర జంగమ భూతములను సృష్టించి మృగములకు అప్యయము వ్యయమున స్థావరజంగమములకు యక్షపిశాచ గంధర్వ అప్సరసలకు నరకిన్నర రక్షసులను పక్షులను పశువులను వాముల జరాయుజమను (మావివలన పుట్టు పశువులను) అండజములను = గ్రుడ్డు నుండిపుట్టు పక్షులను స్వేదజములను (చెమటవలన పుట్టు క్రిములను) ఉద్భిజ్జములను (విత్తునుండిపుట్టు మొక్కలు మొదలయినవానిని) భూతగ్రామములను నాల్గురకములును సంస్కరించెను. పశువులు మృగములు వ్యాళములు రెండువైపుల దంతములు గలవి (ఉభయ దంతములు) రాక్షసులు పిశాచములు మనుష్యులు జరాయుజములు అండజములు పక్షులు. సర్పములు, మొసళ్ళు, చేపలు, తాబేళ్ళు ననువాని చరాచరములను స్వేదజములను దంశ (కరచేవి) మశక = యూక = పేలు మక్షిక = ఈగలు మాతృణములను నల్లులు మొదలయిన వానిని ఉద్భిజములు విత్తునుండి కాడనుండి మొలచునవి ఔషధాలు ఫలింపగానే నశించునవి బహుపుష్ప ఫల భరితములయిన వానిని పుష్పులులేకుండనే ఫలించు వనస్పతులు పుష్పించుట ఫలించుటయను రెండు విధములగల శుభజాతులు ప్రతానములు వల్లులు = తీగలు వీరుధములు ననబడునవి. గుచ్ఛములు గుత్తులుగలవి గుల్మములు (పొదలుగా పెరుగునవి) తృణజాతులు సృజించెను ప్రతానములనగా విత్తునుండి మొలచు తీగలు వల్లులు అనగా కాండము. కాడకొమ్మ పాతినచో మొలచు తీగలునను వానిని సృజించెను.

పెక్కుతీరుల కర్మవలన నేర్పడిన తమస్సు (తమోగుణముచే)నివి చుట్టుకొని యుండును. వీనికి సుఖదుఃఖము లుండును. అనుసంజ్ఞములు (అంతర్విధములు అనగా వీనికి చైతన్యములో వీలుగానుండును. ఉత్తపత్తి మొదలైనవి మనము తాకగానే యాకులు ముడిచి కొనును. దానినిబట్టి వేదన, సంజ్ఞ = తెలివిలోపల నుండును. ఏకదంతులు గతులు అని చెప్పబడు నిత్య సంసరణ శీలమయిన యీ ఘోర సంసారమునందు బ్రహ్మాదులు నింద నిమగ్నులై యున్నవారే.

యంతు కర్మణి యస్మిన్న న్యయుంక్త ప్రథమం ప్రభుః । తత్తదేవ స్వయం తేజో యుజ్యమానః పునః పునః ॥
హింస్రాఽహింస్రే మృదుక్రూరే ధర్మాఽధర్మే ఋతాఽనృతే । తద్భావితాః ప్రపద్యన్తే తస్మాత్తత్తస్య రోచతే ॥
యద్యస్య సోఽదదా త్సర్గే సతత్తత్స్వయ మావిశత్ । యథర్తు లింగా న్యతవః స్వయమేవతు పర్యయే ॥ 54
స్వాని స్వాన్యభి పద్యన్తే తథా కర్మాణి దేహినామ్ । లోకానాంతు వివృద్ధ్యర్థం ముఖ బాహూరుపాదతః ॥ 55
బ్రాహ్మణం క్షత్రియం వైశ్యం శూద్రంచ నిరవర్తయత్ । ఆస్యాద్వై బ్రాహ్మణాజాతా బాహుభ్యాం క్షత్రియాః ॥
ఊరుభ్యాంచ విశ స్సృష్టాః శూద్రః పద్భ్య మజాయత । వర్ణానా మాశ్రమాణాంచ ధర్మంచక్రే పృథక్ పృథక్ ॥
స్వధర్మేచ నివిష్టానాం స్థానాని వ్యదధా త్ప్రభుః । బ్రహ్మలోకం బ్రాహ్మణానాం శాక్రం క్షత్రియ జన్మనామ్ ॥ 58
మారుతంచ విశాంస్థానం గాంధర్వం శూద్ర జన్మనామ్ । బ్రహ్మ చారివ్రతస్థానాం బ్రహ్మలోకం ప్రజాపతిః ॥ 59
ప్రాజాపత్యం గృహస్థానాం యథా విహిత కారిణామ్ । స్థానం సప్తఋషీణాంచ తథైవ వన వాసినామ్ ॥ 60

యతీనా మకృతం స్థానం యత్రేచ్ఛా గామినాం సదా । కృత్వాస సూత్ర సంస్థానం ప్రజాగర్భంతు మానసమ్ ॥
అథాఽసృజత్ ప్రజా కర్తౄన్ మానసాన్ తనయాన్ ప్రభుః । ధర్మం రుద్రం మమంచైవ సనకంచ సనందనమ్ ॥
భృగుం సనత్కుమారంచ రుచిం శ్రద్ధాం తథైవచ । మరీచి మత్ర్యంగిరసౌ పులస్త్యం పులహం క్రమమ్ ॥ 63
వసిష్ఠంచ మహాభాగం నారదంచ మహామునిమ్ । స్వభాస్కరాన్ బర్హిషః అగ్నిష్వాత్తాం స్తథైవచ ॥ 64
క్రవ్యాదాం శ్చోపహూతాంశ్చ ఆజ్యపాంశ్చ సుకాలినః । ఆద్యా మూర్తి విహీనాశ్చ త్రయసేషాం గణా స్మృతాః ॥
చరమాస్తే గణాస్తేషాం కథితాస్తు సమూర్తయః । మహాభూత శరీరాణి సృష్టవాన్స తథైవచ ॥ 66

ఎవనినేకర్మమందు మొదట ప్రభువు నియోగించునో దానినా జీవుడు మాటిమాటికాతేజస్సునే సంయోజనము చేసికొనుచు హింస అహింస మార్దవము క్రూరత్వము ఋతము అనృతమునను నాయాస్వభావములను ఆయా గుణముల భావనచే సంస్కార రూపమున బొందుచుందురు. ప్రాక్తన సంస్కారము ననుసరించి యాయాగుణములాయా జీవులకు ఇష్టమగుచుండును. ఆ సృష్టి కర్త సర్గమందు సృష్టియారంభమందే గుణమెవ్వని కిచ్చెనను ఆయాగుణములు తమంతనే వానియందావేశించును.

ఋతుప్రారంభ మందు ఋతుచిహ్నములట్లు తమతమ సమయమందు తమకుతమకు సంక్రమించు చుండునో యట్లే జీవులకు ప్రార్మబ్ధకరముయి సంక్రమించును. లోకముల విశుద్ధిచేయుటకు బ్రహ్మ ముఖబాహూరు పాదముల నుండి వరుసగా బ్రాహ్మణ క్షత్రియ వైశ్యశూద్రులను ప్రవర్తింప జేసెను. వర్ణములకు ఆశ్రమములకు వేర్వేరు ధర్మము నేర్పర చెను. సధర్మని విష్ఠువుల కా ప్రభువు స్థానములను (పదవులను) ఏర్పరచెను. బ్రాహ్మణులకు బ్రహ్మలోకము క్షత్రియులకు శాక్రము ఇంద్రలోకము స్వర్గము. వైశ్యులకు మరుల్లోకము శూద్రులకు గాంధర్వలోకము ను నిర్దేశించెను. ఆ ప్రజాపతి బ్రహ్మ చారి వ్రతనిష్ఠులకు బ్రహ్మలోకము, యథావిధిగ కర్మాచరణము సేసిన గృహస్థులకు ప్రాజామత్స్యలోకము వాన ప్రస్థులకు సప్తర్షి మండలము. యతులకు అకృత స్థానము (అనగా తమయిచ్చాను సారము పోగల వారికి తానేర్పరచిన స్థానము గాక అన్ని పుణ్య లోకములందు వారికి గతి సంచారముండునన్న మాట) నేర్పరచెను.

మానసికమయిన ప్రజాగర్భమును సూత్రస్థాలమొనరించి (యొక హద్దు నేర్పరచి) ఆ మీద ప్రజా కర్తలను మానస పుత్రులను సృష్టించెను. వారు ధర్ముడు. రుద్రుడు కునువుసనమేదుసనందనుడు భృగువు సనత్కుమారుడు రుచిశ్రద్ధ మారీచి అత్రి అంగిరస్సుపులస్త్యుడు పులహుడు క్రతువు వశిష్ఠుడు మహానుభావుడు నారదుడుమహాముని స్వభాస్కరులు బర్హిషదలు అగ్నిష్వాత్తులు క్రవ్యాదులు ఉపహూతులు ఆజ్యవులు సుకాలు సృజించిన వారి మొదటి గణముల వారు ముగ్గురు మూర్తిలేనివారు. వారిచరమ గణములవారు. (చివరిగణములవారు మూర్తిగలవారు. అటుపై మహాభూత శరీరమును ఆకాశాదులను సృష్టించెను. 66

ఏవం కృత్వా ప్రజాసర్గం చాంగుష్ఠా దక్షిణా త్తతః । ససర్జ దక్షం భగవాన్ వామాంగుష్ఠా స్తథైవచ ॥ 67
ససర్జ భార్యాం తస్యైవ దేవదేవః పితామహః । తస్యాంతు జనయామాస దక్షో దుహితర శ్శుభాః ॥ 68
దదౌ తాశ్చ స ధర్మాత్మా బ్రహ్మ పుత్రేభ్య ఏవచ । సతీం దదౌ సరుద్రాయ రుద్రా యస్యాః సుతాః స్మృతాః ॥
అసంఖ్యేయా మహావీర్యాః హరతుల్యా పరాక్రమాః । యైర్వ్యాప్తం భువనం సర్వం సూర్యస్యేవ గభస్తిభిః ॥ 70
భృగవే చ దదౌ ఖ్యాతిం రూపేణాఽప్రతిమాం శుభామ్ । భృగుర్ధాతా విధాతారౌ జనయామాస సాయుధౌ ॥ 71
శ్రియంచ జనయామాస సచరాంశ్చ తురంగమాన్ । భృగుః ప్రాదా చ్ఛ్రియందేవీం రాజన్! నారాయణస్య చ ॥ 72
తస్యాం సంజనయా మాస బలోన్మాదౌ మదోత్కటౌ । మేరోః పర్వత రాజస్య ద్వే కన్యే భువి శ్రుతే ॥ 73
ధాతుర్విధాతు ర్ద్వే దత్తే ఆయతి ర్నియతి స్తథా । ఆయతి ర్జనయామాస ప్రాణం యదుకులోద్వహ ! ॥ 74
నియతి ర్జనయామాస మృకండుం తపసాం నిధిమ్ । వ్యతీతే సప్తమే కల్పే మృకండోః సుమహాత్మనః ॥ 75

అహం పుత్ర స్సముత్పన్నో మనస్విన్యాం నరాధిప : పత్నీ మరీచే స్సంభూతి ర్దక్షస్య తనయా శుభా ॥ 76
ప్రజా పతిం పూర్ణమాసం జనయామాస భామినీ । పూర్ణమాసస్య విరజాః సుధామా తు తదాత్మజః ॥ 77
లోకాలోక నివిష్టస్తు లోకపాలో మయేరితః । పుత్రశ్చ పౌర్ణమాసస్య సర్వేశో నామ చాపరః ॥ 78
జనయామాస పుత్రౌ ద్వౌ స్తంబః కశ్యప ఏవచ । తయోర్గోత్ర కరౌ పుత్రౌ జ్ఞేయౌ సంన్యాస నిశ్చయౌ ॥ 79
స్మృతి మంగిరసం ప్రాదా ద్దక్షః పూర్వం ప్రజాపతిః । సినీవాలీ కుహూరాకా తథైవానుమతిః శుభా ॥ 80
తస్యాం సంజనయా మాస అగ్నించ భరతం తథా : భరతస్య తదా పుత్రః పర్జన్య ఇతి విశ్రుతః ॥ 81
హిరణ్య రోమా పర్జన్య ఉదీచీం దిశ మాశ్రితః । లోకా లోకేఽవతిష్ఠన్తే లోకపాలో మయేరితః । 82

ఇట్లు ప్రజాసృష్టిచేసి కుడి యంగుష్ఠమునుండి దక్షుని ఎడమ అంగుష్ఠమునుండి యాతని భార్యను సృజించెను. ఆమె యందు దక్షుడు కల్యాణులయిన కన్యలం గనెను. వారి నాతడు బ్రహ్మకొడుకున కిచ్చెను. సతీదేవిని రుద్రునికిచ్చెను. ఆమెసంతానమే రుద్రులు. ఆరుద్రు లసంఖ్యాకులు మహావీర్యులు హరతుల్య పరాక్రములు. సర్వభువనము సూర్యుని కిరణములచేతంబోలె వారిచేత వ్యాప్తమైయున్నది. ఖ్యాతియను కన్యను భృగున కిచ్చెను. ఆమె యప్రతిమాన సౌందర్యవతి. భృగువు ధాత విధాత యను సాయుధులను ఇద్ధఱింగనెను. శ్రీదేవింగూడ గనెను. ఆకాశచరములయిన గుఱ్ఱములనాతడు గనెను. భృగువు లక్ష్మీదేవిని (భార్గవిని) నారాయణున కిచ్చెను. అతడామెయందు మదోత్కటులలున ఖలోన్మాదులయిన కొడుకులం గాంచెను. ఆ యిద్దరకు పర్వత రాజగు మేరువు కూతుండ్రు జగత్ప్రసిద్ధలయిన ఆయతిని నియతియను వారినిచ్చెను. ఆయతి ప్రాణునను కొడుకుంగనెను. నియతి మృకండు డను తపోనిధింగనెను. బ్రహ్మయొక్క సప్తమకల్పముగనడువ మహామహుడైన మృకండునకు మనస్విని యను సాధ్వియందు నేను బుట్టితిని. (మార్కండేయుడన్నమాట) మరీచి యొక్క భార్య సంభూతి దక్షుని కూతురు. ఆమె పూర్ణమాసుడను ప్రజాపతిం గనెను పూర్ణమాసునికి విరజుడుకొడుకు, వానిసుతుడుసుదాముడు. అతడులోకాలోకపర్వతమందున్నాడు. లోకపాలుడు. పౌర్ణమాసుని కొడుకు సర్వేశుడను మరియొకడు స్తంబుడు కశ్యపుడునను నిద్దరు కొడుకులం గనెను. వారికి కొడుకులిద్దఱు గోత్రకర్తలు సన్యాసులొకడు. మరియొకడు నిశ్చయతనువారు దక్షప్రజాపతి అంగిరస్సునకు స్మృతియను కన్యనిచ్చెను. అంగిరస్సు ఆమెయందు సినీవాలి కుహూవు రాకఅనుమతి అనునాడుపిల్లలను అగ్నిభరతుడునను మగపిల్లలను గనెను. భరతుని కొడుకు పర్జన్యుడు. పర్జన్యుడు హిరణ్యరోముడు (బంగారు రోమములు గలవాడు) ఉత్తర దిశయందు లోకపాలుడుగా లోకాలోక పర్వత మందున్నాడు.

అనసూయాం దదౌ దక్షః తథాఽత్రేః సుమహాత్మనః । తస్యాం స జనయామాస తపోరాశి కరం పరమ్ ॥ 83
ప్రీతిం దక్షః పులస్త్యాయ దత్తోర్ణాం జననీం దదౌ । పులస్త్యాయ క్షమాం ప్రాదాత్ కర్దమస్యతు మాతరమ్ ॥ 84
కార్దమిః శంఖ పాద శ్చ దక్షిణా మాశ్రితో దిశమ్ । లోకాలోక నివిష్టస్తే లోకపాలో మయేరితః ॥ 85
దక్షశ్చ సన్నతిం ప్రాదాత్ క్రతవే భూరితేజసే । షష్టిః పుత్ర సహస్రాణి వాలఖిల్యా ఇతి స్మృతాః ॥ 86
జనయామాస ధర్మజ్ఞాన్ సర్వాం స్తామూర్ధ్వరేతసః । దక్షః ప్రాదా దథై వోర్జాం వసిష్ఠాయ మహాత్మనే ॥ 87
తస్యా మస్య సుతా జాతాః సప్త సప్తా శ్వ వర్చసః । రజోబాహు శ్చోర్ధ్వ బాహుః పవన శ్చానఘశ్చయః ॥ 88
సుతపాః శక్తి రిత్యేతే వాసిష్ఠాః సప్త కీర్తితాః । కేతుమాన్ సునుహా తేజా రాజసశ్చ తథా సుతః ॥ 89
లోకాలోక నివాసీ తే ప్రతీచ్యాం స మయేరితః । స్వాహాం ప్రాదా త్స దక్షోఽపి సశరీరాయ వహ్నయే ॥ 90
దివ్యాంతరిక్షభౌమానా మగ్నీనాం జననీం ప్రభుః । స్వధాం ప్రాదాత్ పితృభ్యస్తు మేనాయాః జననీం శుభామ్ ॥ 91
హిమాచలాయ మేనాఽపి పితృభిః ప్రతి పాదితా । చతుర్దశేమాః కన్యాశ్చ దక్షో ధర్మాయ వై దదౌ ॥ 92
కీర్తి ర్లక్ష్మీ ర్ధృతి ర్మేధా పుష్టిః శ్రద్ధా క్రియా మతిః । బుద్ధిర్లజ్జా వపుః శాన్తిః తుష్టిః సిద్ధి శ్చతుర్దశ ॥ 93
కీర్తి పుత్రో యశోదేవో దర్పో లక్ష్మీ సుతః స్మృతః । నిశ్చయశ్చ ధృతేః పుత్రో మేధా పుత్ర స్తథా శ్రుతః ॥ 94

పుష్టే ర్లాభ స్సుతశ్చైవ కామః శ్రద్ధా సుతః స్మృతః । క్రియాయా స్తనయో దేవో మతి పుత్ర స్తథా దమః ॥ 95
బుద్ధే ర్బోధ స్సుతః ప్రోక్తో లజ్జాయా వినయః స్మృతః । వపుషో వ్యవసాయస్తు క్షేమః శాన్తి సుత స్తథా ॥ 96
తుష్టేః పుత్రస్తు సంతోషః సుఖః సిద్ధేశ్చ భాస్వరః । కామస్యచ రతి ర్భార్యా తత్పుత్రో హర్ష ఉచ్యతే ॥ 97

దక్షుడత్రికి అనసూయ నిచ్చెను. ఆతడు మహామహుడు. అనసూయ యందు పరమత పోరాశిని గనెను. ఆయనయే దత్తాత్రేయుడు. దక్షుడు ప్రీతి యనుకన్యను పులస్త్యునకిచ్చెను.ఆమెదత్తోర్ణుడను కొడుకుం గన్న తల్లి. పులస్త్యునకు క్షమ యను కన్యం గూడ నిచ్చెను. ఆమె కర్దమునిగన్న తల్లి. కర్దముని కొడుకు శమఖపాదుడు. దక్షిణ దిక్కునందు లోకపాలుడై లోకాలోక మందున్నాడు. దక్షుడు సన్నతిని భూరితేజశ్శాలియైన క్రతువున కిచ్చెను. ఆమె వాలఖిల్యులను నరువది వేలమంది ధర్మజ్ఞులను ఊర్ధ్వరేతస్కులం గొడుకులం గన్నది. దక్షుడూర్ణను మహాత్ముడను వశిష్ఠున కొసగెను. ఆయన యామెయందు సూర్యవర్చస్సులగు నేడుగురు కొడుకులం గనెను. రజోదాహువు ఊర్ధ్వబాహువు పవనుడు సుతవుడు శక్తికేతుమంతుడు రాజసుడు వశిష్ఠులోకాలోక నివాసి. పడమటి దెసనున్నాడు. దక్షుడు స్వాహాదేవుని సశరీరుడైన వహ్నికిచ్చెను. ఆయన కామెయందుదివ్యాంత రిక్షభౌములయిన యగులుదయించిరి. దక్షుడు స్వధను పితరులకిచ్చెను. ఆమె మేనయను కన్యం గన్నది. పితరులామెను హిమాలలున చిచ్చి. దక్షుడు పదునల్గురు కూతుండ్రను ధర్ము కిచ్చెను. వారు కీర్తి, లక్ష్మి, ధృతి, మేధ, పుష్టి, శ్రద్ధ, క్రియ, మతి, బుద్ధి, లజ్జ, వపువు, శాంతి. తుష్టి, సిద్ధి అనువారు, కీర్తి కొడుకు యశోదేవుడు. లక్ష్మి కొడుకు దర్పుడు. ధృతి కొడుకు నిశ్చయుడు. మేధ కొడుకు శ్రుకుడు. పుష్టి కొడుకు లాభుడు శ్రద్ధకొడుకు కాముడు క్రియకొడుకు దేవుడుమతి బిడ్డదముడు వృద్ధిపుత్రుడు బోధుడు లజ్జ కన్నవాడు వినయుడు వపువు కొడుకు వ్యవసాయుడు. శాంతి కొడుకు క్షేముడు తుష్టి కన్నవాడు సంతోషుడు సిద్ధి వలన కల్గిన వాడు తెజుస్వియైన సుఖుడు. కాముని భార్య రతి. కొడుకు హర్షుడు.

ఏవం ప్రజా వివృద్ధ్యర్థం దక్షో దత్వాఽథ కన్యకాః । ఈజే కదాచి ద్యజ్ఞేన హయ మేధేన పార్థివ ! ॥ 98
తస్య జామాతర స్సర్వే గతా యజ్ఞ నిమంత్రితాః । భార్యాభి స్సహితా స్సర్వే రుద్రం దేవీం సతీం వినా ॥ 99
రుద్రోనతిం న కురుతే భావ్యర్థ వినిచోదితః । కదాచిదపి దక్షశ్చ తేనాసౌ న నిమంత్రితః ॥ 100
అనాహూతాపిచ గతా పశ్చా త్తత్ర సతీ శుభా । దక్షాన్న లేభే పూజాం సా తతః క్రుద్ధా శుభాననా ॥ 101
తత్యాజ దక్ష సంభూతాం తాం తనుం హిమకందరే । వినష్టాంతు సతీంశ్రు త్వా దేవ దేవః పినాకధృక్ ॥ 102
శశాప దక్షం ధర్మజ్ఞం మనుష్యస్త్వం భవిష్యసి । ధ్రువస్యాన్వయ సంభూతో రాజా త్రైలోక్య విశ్రుతః ॥ 103
తత్రాపి విఘ్నం కర్తాస్మి యజ్ఞ కర్మ ణ్యుపస్థితే । భృగుం మరీచిమత్రించ పులస్త్యంపులహం క్రతుమ్ ॥ 104
శశాప చైవాం గిరసం వసిష్ఠంచ మహా మునిమ్ । సతీ మను ప్రవృత్తస్య దక్షిస్యాస్య ప్రజాపతేః ॥ 105
అను వృత్తిః కృతా యస్మా ద్భవద్భి ర్ధర్మ కోవిదైః । తస్మా ద్వైవస్వతే ప్రాప్తే శుభే మన్వంతరే ద్విజాః ॥ 106

దక్ష ప్రజాపతి ప్రజావృద్ధికై యిట్లు కన్యాదానములు సేసి యొకపుడు అశ్వమేధ యాగమును గావించెను. అందల్లుండ్రందరు నాహూతులై భార్యలతో సతీదేవి రుద్రుడుం దక్క అంగరు వచ్చిరి. రుద్రుడు భావ్యర్థ ప్రబోధనసుసరించి మామగారికెన్నడును నమస్కరింప డయ్యెను. అందు వలన దక్షుడాతనిని పిలువుడాయెను.

అనాహూతయయ్యు కల్యాణి సతీదేవి యటకేగి దక్షుని వలన నాదరము వడయక కుపితయై దక్షుని వలన వచ్చిన తనువును హిమగిరి కందరము నందు త్యజించెను. దేవదేవుడు పినాకధారి యదివిని ధర్మజ్ఞుని దక్షుని నీవు మనుష్యుడగుదువు పొమ్ము. ధ్రువుని వంశ మందు త్రైలోక్య విఖ్యాతుడవై జనింతువు. అక్కడ గూడ యజ్ఞమునందు నీకేను విఘ్నము గావింతునని శపించెను. సతీదేవి కనుకూలముగా ప్రవర్తింపని దక్ష ప్రజాపతిని ధర్మకోవిదులయ్యు మీరను వర్తించినారు గావున వైవస్వత మన్వంతరము రాగానే యందు యజమానుడైన యా బ్రహ్మ యొక్క క్రూరమైన జన్మము పొందుడని భృగు మరీచి అత్రిపులస్త్య పులహక్రత్వంగిరో వశిష్ఠులను శపించెను

బ్రహ్మణో యజమానస్య జన్మ క్రూర మవాప్యథ ! । దేహ త్యాగే కృతే రాజన్ ! సతీ దేవీ మహాబలా॥ 107
ఉమేతి విశ్రుతా లోకే మేనాయాః సమపద్యత । హిమాచలోఽపి తాం దేవీం దదౌ శర్వాయ పార్థివ ! ॥ 108
తయా వియుజ్యతే నాఽసౌ కదాచి దపి విశ్రుతః । తస్యాంతు జనయామాస దేవ దేవోఽపి శంకరః ॥ 109
వినాయకం కుమారంచ భృంగేశం సుమహాబలమ్ । విఘ్ననాంచ గణానాంచ పుత్రం రాజ్యేఽభ్యషేచయత్ ॥ 110
వినాయకం మహాదేవో గజ వక్త్రం మనస్వినమ్ । దేవసేనాపతిం శక్రః కుమారం కృతవాంస్తదా ॥ 111
న తత్యాజ సమీపాచ్చ భృంగేశం శంకర స్తదా । వైవస్వతేఽంతరే ప్రాప్తే రాజా దక్షో వ్యజాయత ॥ 112
ధ్రువ స్యాన్వయ సంభూతో మహాబల పరాక్రమః । తత్రా శ్వమేధే వితతే ఆనాహూతేన శూలినా ॥ 113
యజ్ఞో విధ్వంసిత స్తస్య వీరభద్రేణ పార్థివ । స దక్షో జనయా మాస కన్యాః పార్థివ సత్తమ ॥ 114
తాసాంచ మధ్యాత్ ప్రదదౌ దష్టా వింశతి మిందవే । దేవతా స్త్వభి మానిన్యో నక్షత్రాణాం పృథక్ పృథక్ ॥ 115
ఉక్తం హి తే ఋక్ష గణస్య జన్మ శుభావహం పాప భయా పహంచ ।
అతః పరం కిం కథయామి తుభ్యం తత్త్వంవదస్వా యత లోహితాక్ష ! ॥ 116

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే హోమద్రవ్య గ్రహర్క్షాది సంభవా ధ్యాయో నామ
సప్తోత్తర శత తమోధ్యాయః

సతీదేవి దేహము విడిచి ఉమయను పేర మేనకకు జనించెను. హిమాలయ మామెని శివున కిచ్చెను. ఈయనయాశక్తితో నెన్నడు నెడబడి యుండదు. శంకరు డామె యందు వినాయకుని కుమారస్వామిని భృంగీశుని కుమారుని గనెను. వినాయకుని విఘ్నములకు ప్రమథ గణములకు రాజ్యమందు ప్రభువుగా పట్టాభిషేకించెను. ఆ వినాయకస్వామి గజవక్త్రండు మనస్వి యను ఇంద్రుడు కుమారుని దేవసేనాపతింగావించెను. శంకరుడు భృంగేశుని మాత్రమెన్నడో తనదగ్గర నుండి పోనీయ లేదు. వైవస్వత మన్వంతరము రాగానే దక్షుడు ధ్రువుని వంశ మందు రాజై పుట్టెను. అప్పుడశ్వమేధ మందనాహూతుడైన శూలిచే (వీరభద్రునచే) నయజ్ఞము ధ్వంసము చేయబడినది. ఆ దక్షుడు కన్యలంగని వాడి నిరువది యెనమండుగురను నక్షత్రాభిమాన దేవత లను చంద్రుని కిచ్చెను. నక్షత్ర సంభవము సెప్పితి మతేమి సెప్పెద సెప్పుమనియె.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర పురాణమున ప్రథమఖండమున గ్రహనక్షత్ర సంభవము. నూట యేడవ అధ్యాయము.

## నూటయెనిమిదవ అధ్యాయము - వేననాస్తికవారము

వజ్రః:—దక్షస్య వంశం సకలం నక్షత్రాణాంచ సంభవమ్ । త్వత్తోఽహం శ్రోతు మిచ్ఛామి సర్వ ధర్మభృతాంవీర॥ 1
మార్కండేయః ఔత్తాన పాది ర్ధర్మాత్మా ధ్రువః పూర్వం మయోదితః । ధ్రువ స్త్వజనయత్ సృష్టిం మహాబల పరాక్రమామ్॥
తస్య ప్రాచీన గర్భస్తు పుత్ర స్తస్యాఽప్యుదారధీః । దివంజయ స్తస్య సుత స్తస్య పుత్రో రిపుః స్మృతః ॥ 3
రిపోః పుత్ర స్తథా శ్రీమాన్ చాక్షుషః కీర్తితో మనుః । ఊరు స్తస్య సుతః శ్రీమానంగ స్తస్యాప్యథాత్మజః ॥ 4
అత్రిర్జగ్రాహ తంపుత్రం దత్తకంతు యశస్వినే । అంగస్య వేనః పుత్రస్తు నాస్తికో ధర్మవర్జితః ॥ 5
అసచ్ఛాస్త్రరతో నిత్యం లోకాయతిక సత్తమః । చకారలోకే మర్యాదాం ధర్మబాహ్యో నరాధి పః ॥ 6
న యష్టవ్యం నహోతవ్యం న దేయం ధర్మ కారణమ్ । ఋషయ స్తమాగమ్య కదాచిద్వాక్య మబ్రువన్ ॥ 7
ఋషయః-పూర్వప్రవృత్తాం మర్యాదాం పూర్వైరై పూర్వతరైః కృతామ్ । లోకాయతిక వాక్యేన న త్వం హన్తు మిహార్హసి ॥8
కర్మణా సుకృతే నేహ సుఖంజన్తుః సమశ్నుతే । దుఃఖం జన్తుశ్చ ప్రాప్నోతి దుష్కృతేన చ కర్మణా ॥ 9

యే యజన్తే సదా దేవాన్ గురుశుశ్రూషకాశ్చ యే । విప్రపూజారతాయేచ తీర్థయాత్రా రతాశ్చయే ॥ 10
తపస్వినః సత్యరతా యేచదానే సదా రతాః । సమశ్నువన్తి భూపాల పరలోకే సుఖాని తే ॥ 11
సత్వం సుఖపరిభ్రష్టాన్ నృలోకాన్ గంతుమర్హసి ।

వజ్రుండు, దక్షవంశము నక్షత్ర వంశమును నా తిమ్మన మార్కండేయు డిట్లనియె:— ధ్రువుని గురించి లోగడ నేను జెప్పితిని. ధ్రువుడు సృష్టియను మహాపరాక్రమునిం గనెను. వాని కొడుకు ప్రాచీన గర్భుడు. వాని కొడుకు దివంజయుడు. వాని కొడుకు రిపుడు. రిపుని కొడుకు చాక్షుషుడను మనువు వాని కొడుకు ఊరువు. వాని కొడుకంగుడు. ఆ అంగుని అత్రి మహర్షి దత్తు చేసి కొనెను. అంగుని కొడుకు వేనుడును నాస్తికు డొకడు. అసచ్ఛాస్త్రరతుడు. లోకాయతిక మతము వాడు. ధర్మ దూరుడై వాడు యజ్ఞములు సేయవలదు. ధర్మనిమిత్తము దానమీయరాదని కట్టడ సేసెను. వానిని ఋషులు సమీపించి యొకతటి నీకంటె పూర్వులు అంతకు పూర్వులేర్పరచిన మర్యాదను లోకాయతికుల మాటచే నీవు చెఱుప దగదు. ఇహ మందలి పుణ్యకర్మలచేత జీవుడు సుఖమందును. దుష్కృతము వలన దుఃఖమందును. ఎవరు దేవతలను యజింతురు గురుశుశ్రూష సేయుదురు విప్రుల పూజింతురు తీర్థయాత్రలు సేయుదురు. నిత్యతపస్సత్య దానరతులగుదురు వారు పరలోకమందు సుఖములనుభవింతురు. నీవు సుఖ పరిభ్రష్టములయిన నరలోకముల కేగనర్హుడవు. అనవిని వేనుం డిట్లనియె.

వేనః- భవతాం కిం ప్రలాపేన వృథైవ ద్విజపుంగవాః ॥ 12
యే మృతాస్తే మృతాస్సర్వే మృతానాం సంభవః కుతః । ప్రాణస్య వాయుభూతస్య నిష్క్రాన్తస్య శరీరతః ॥ 13
భూయః శరీర గ్రహణం యుక్త్యా నైవోప పద్యతే । తపాంసి హాయనాశ్చిత్రాః సంయమో భోగ వంచనా ॥ 14
అగ్నిహోత్రాదికం కర్మ బాలక్రీడేవ లక్ష్యతే ॥ గ్రామ్యాణాం మూఢచిత్తానాం స్వగ్విణాంచైవ యోషితాం ॥ 15
అన్యేషాం చైవధనినాం ధూర్తైరాదిత్సుభిర్ధనమ్ । శాస్త్రాణ్యనేకరూపాణి గ్రథితాని సహస్రశః ॥ 16
దేహి నిత్యం యజస్వైవం దేవాస్తేఽనుగ్రహీకృతాః । ధనమాప్స్యసి శత్రూంశ్చ విజేష్యసి సుఖంచతే ॥ 17
ముగ్ధాఏవం ప్రతార్యన్తే ధూర్తైర్ధన జిహీర్షయా । యావజ్జీవం సుఖం జీవే న్నాస్తి మృత్యో రగోచరమ్ ॥ 18
భస్మీభూతస్య శాంతస్య పునరాగమనం కుతః । నాస్తిదత్తం హుతం చేష్టం నదానవా ఋషయోదేవ ॥ 19
మయాప్తం భువిరాజ్యంచ భోగాశ్చాన్యే పృథగ్విధాః । కథంప్రాప్తంహిత్యక్ష్యామి భవతాం వచనేనవై ॥ 20
మార్కండేయ ఉవాచ :- ఏతచ్ఛ్రుత్వా వచస్తస్య వేనస్య నృపసత్తమ! । ఋషయస్తమ థోచుస్తే రాజానం దుష్టచేతనమ్॥

ఓ ద్విజోత్తములార! వృథాప్రలాపము లెందుకు, గిట్టినవారు గిట్టిని వారే వారికి పుట్టుక యెక్కడిది. వాయు రూపమైన ప్రాణము శరీరము నుండి పోయిన తర్వాత తిరిగి శరీరగ్రహణము చేయుట యుక్తికి కుదరదు. తపస్సులు చిత్రములయిన హాయనములు=కాలక్షేపములు. సంయమము భోగముల వంచించుట. అగ్నిహోత్రాది కర్మ వట్టి పిల్లలాట. పల్లెటూరి పందల యొక్కయు హారాద్యలంకారములు దాల్చిన స్త్రీలయొక్కయు ఇతర ధనికుల యొక్కయు ధనముంగా జేయుటకు దూర్తులు శాస్త్రములను అనేక రూపముల గూర్తురు. నిత్యము ఇమ్ము లూజింపుము. దేవతలు నిన్ననుగ్రహింతురు. ధనవంతుడగుదువు. శత్రులంగెల్తువు- సుఖము నీకు గల్గునని యిట్లు ధనము గుంజుకొననెంచి ధూర్తులచే సమాయకులు మోసపుచ్చ బడుచుందురు. బ్రతికినన్నాళ్లు సుఖముగా బ్రతుక వలెను. మృత్యువు వాతబడని దొక్కటియు లేదు. బూడిదయై చల్లారిన వానికి తిరిగి రాక యెట్లు? ఇచ్చినదిచ్చినదే. హుతమైనది హుతమైనదే. యజించినది యజింప బడినదే అదేదియు లేనేలేదు. దేవతలువేరు ఋషులు వేరు. భువిలో నేను రాజ్యము బడసితిను. ఈ ప్రాప్తించిన దాని నేనెట్లు మీ మాటంబట్టి వదలి వేయగలను. అనిన వేనుని మాట విని యామనస్యభావునింగని ఋషు లిట్లనిరి.

ఋషయఉవాచః- నైత దాపయికం వాక్యం ధ్రువ వంశోద్భవస్యతే । ప్రత్యక్షం కర్మణాంలోకే ఫలం పార్థివ దృశ్యతే॥ 22
రౌంఖ్యమాణాంజ్ఞానాన్పశ్య భోజనాచ్ఛాదనం పరమ్ । సహస్రం భరకానన్యా నృశ్యభూపాల! మాకవాన్ ॥ 23

శిబికాఖ్యా స్త థైవాన్యా న్గచ్ఛమానాన్యథా సుఖమ్ । క్షుధయాచరీవతాంశ్చ శాకోచ్ఛిష్ట భుజ స్తథా ॥ 24
కాష్ఠభార సమాక్రాంతా న్పరి భూతాన్పరై స్తథా । జుగుప్సితాం స్తథా దీనాన్బహుశల్యాన్న రాం స్తథా ॥ 25
పంగూనన్యా న్కుబ్జికాంశ్చ కుష్ఠజ్వర విపీడితాగి । రోగై ర్బహుభిరాక్రాంతా న్పరిభూ తాన్పరై స్తథా ॥ 26
తార్కికా న్కృపాణాన్దీనా న్వ్యాధిగ్రస్తాన్ సుఖచ్యుతాన్ । ఇష్టబంధు వియోగార్తా న్పశ్య పాపేనమానవాన్ ॥ 27
ఆరోగ్య రూపసత్త్వౌజో ధనధాన్య సమన్వితాన్ । ధర్మేణచ జనాన్పశ్య బంధుభృత్య సమన్వితాన్ ॥ 28
రాజుమార్గ మిమంలోకా స్తవ కర్మానువ ర్తతే। మార్కండేయఉవాచ: తత స్తేషాంవచః శ్రుత్వా ఋషీణాముగ్రచేత సామ్ ॥
హ స్తేన హస్తం సంఘట్య ప్రహసం స్తానువాచహ। శుభేనకర్మాణ సౌఖ్యం దుఃఖం పాపేన కర్మాణావేనః ॥ 30
నాప్నువంతిజనా విప్రాః ప్రాప్నువంతి స్వభావతః । స్వభావశ్చ విచిత్రోఽయం సంసారోద్వేజకః సదా ॥ 31
నాత్ర పూర్వకృతం కర్మ ధూ ర్తవాదో యథాద్విజాః । అశ్మానః కర్మణాకేన సూక్ష్మాశ్చాన్యే మహత్తరాః ॥ 32
విన్యస్తాః కర్మణాకేన సురార్చా పాపభూమిషు । పాషాణార్చాది ద త్తేన కథం తుష్యంతి దేవతాః ॥ 33
కే దేశా నమయాదృష్టానాపి పూర్వం పితామహైః । నాన్యైర్జన్యై స్తథాతాంశ్చ ధూర్తవాక్యాత్ప్రతీమహే ॥ 34
అన్యభు క్తేన చాన్యస్య తృ ప్తిశ్చైవ కథం భవేత్ । అన్యభు క్తేన చాన్యస్యయిది తృప్తిర్భ విష్యతి ॥ 35
దద్యాత్ప్రవసితేశ్రాద్ధ న స పథ్యో దనం మహత్ ॥ మృతస్య వహ్నేదగ్ధస్య భగ్మిభూతస్యవా పునః ॥ 36
సర్వభావ వినష్టస్య కింను శ్రాద్ధైః ప్రయోజనమ్ । కృపణైర్యజ దేహీతి ధనలుబ్ధైః ప్రకీ ర్తితమ్ ॥ 37
ధనినాం ధననాశాయ సతతం స్వార్థతత్పరైః ధర్మేనిపిష్టాః ప్రరుషా దృశ్యంతే దుఃఖజీవినః ॥ 38
సుఖాన్వితాకాదృశ్యంతే పాపకర్మరతా స్తథా । తస్మాద్ధర్మేణకింకార్యం సుఖం జీవేత్తు పండితః ॥ 39

ధ్రువుని వంశమునంబుట్టిన నీకీమాట యుచితము గాదు. కర్మఫలము లోకములో ప్రత్యక్షముగా గనబడుచున్నవి. భోజనాచ్ఛాదనము కాపలయునను వారింజూడుము. రాజా! వేలకొలది దీనుల భరించువారిం గనుము. శిబికలెక్కి సుఖముగా దిరుగువారిం గనుగొనుము. ఆకలింగుములుచు నెంగిలి కూరాకులను దినువారిని కట్టెల మోపులమోయువారిని మొరులచే పరాభవింపబడు వారిని చూడ నసహ్యముగా నున్న వాండ్రను దీనులను శల్యమాత్రావశిష్టులను కుంటి, గూను, గ్రుడ్డి వాండ్ర నుకుష్ఠు, జ్వరాది, బహురోగాక్రాంతులను తార్కికులను నీచులను వ్యాధిగ్రస్తులను సుఖభ్రష్టులను పాపమునచే నిష్టబంధు వియోగమున నేడ్చు వారిని జూడుము. ఇంకొక వంక ధర్మముచే ఆరోగ్యము అందము సత్తువ ఓజశ్శక్తి ధనధాన్యములు గల్గి బంధుభృత్య పరివారముతో నున్నవారిని జూడుము. రాజువగు నీ మార్గము నీలోకమనుసరించును. [యథారాజా తథాప్రజాః - రాజెట్లో ప్రజలట్లుగదా!] బని మహోగ్ర చిత్తులయిన ఋషులు పల్కిన మాట విని చేతంజేయి చఱచి (చప్పట్లు కొట్టి) నవ్వుచు వేణుడిట్లనియె.

పుణ్యకర్మలచే సౌఖ్యము పాపముచే దుఃఖమును జనులు పొందుట శుద్ధమైన యబద్ధము. సుఖదుఃఖములు స్వభావసిద్ధ సంసారోద్వేజక మయిన యీ స్వభావమెప్పుడును విచిత్ర మైనది. ఇక్కడ పూర్వకృతమైన కర్మలేదు. అట్టి ధూర్తులనిడి మాట. రాళ్ళు ఏ కర్మచేత చిన్నవగును? దేనిచో పెద్దవగును? అందు గొన్ని యే కర్మముచేత దేవపూజ పీఠమునకు కొచ్చి పాప భూముల యందు నుంప బడును. పాషాణములకు బూజ పురస్కారములు చేయుటచే దేవతలెట్లు సంతోషింతురు? నేను నా పూర్వులు తాత ముత్తాతలు మరి ఇతర జీవులు నే ప్రదేశము లెన్నడును జూడబడినవి. స్వర్గాదులునుగ ధూర్తులు ప్రేమ మాటల చేత మాత్రమే నమ్మ వలసిది కాని వాటి మార్గము లేదు. ఒకడు తిన్నతిండి చేత నింకొకనికి తృప్తి కగుటెట్లు? అట్టు తృప్తి కలుగునేని ప్రవాసము వెళ్ళిన వానికి శ్రాద్ధము పెట్టినది వానికి దారిబత్తెము కాదే. బ్రతికి యున్న పరదేశవాసికే యది యందనప్పుడు, చచ్చినా వాని విషయములో కాలి బూడిదయైన వానికది యెట్లందును. సర్వభావ వినష్టుని (సర్వాత్మనా రూపుమాసిన వానికి) శ్రాద్ధముల వలన నేమి ప్రయోజనము. కృపణులు (నీచులు దరిద్రులు) ధనలుబ్ధులు యజ = యాగము సేయుము. దేహి = ఇమ్ము అని పలకరించుదురు

స్వార్థపరులు ధనవంతుల ధనము నాశనమగుటకిట్లు నిత్యము ప్రేలుచుందురు. ధర్మ నిపుణులయిన మానవులు దుఃఖజీవులగుచున్నారు. పాపరతులు సుఖవంతులుగా కనిపించుచున్నారు. కావున ధర్మములతో నేమి పని? పండితుడు (తెలిసినవాడు) హాయిగా జీవింప వలెను. కామ పురుషార్థము ధనముచే లభించును అన విని బుద్ధులు వేనునితో నిట్లనిరి.

పురుషార్థః పరః కామోధనేనచ తదావ్యతే । ఋషయఊచుః:- ప్రత్యక్షమేవ పశ్యంతః పూర్వజన్మనిమానవాః ॥ 40
పరలోకం నపశ్యంతి పశ్యదేవేన వంచితాః । జాతమాత్రోయధా జంతుస్తనం గృహ్ణాతి పార్థివ ॥ 41
పూర్వ జన్మాంత రాభ్యానం వినా తత్కాస్య చేష్టితమ్। ప్రాణేన వాయుతేభూన జన్మన్యస్మిన్యధానరః ॥ 42
కరోతిదెవాగ్రహణం జన్మాంతర గతస్తథా । మహీవికారమశ్మానః కర్మజీవ వివర్జితాన్ ॥ 43
సూక్ష్మత్వంచ మహత్వంచ తేషా మిశ్వర కారితమ్ । మంత్రేణనీయతే శ్రాద్ధం పరలోకగతే జనే ॥ 44
దృష్టః ప్రవాసినోనైవ తథా మంత్రస్య పార్థివ । ప్రాకామ్యయుక్తా లఖిమనాతథా ॥ 45
జ్ఞానయుక్తాశ్చగృహ్ణంతి సర్వత్రవినివేదితమ్ ॥ ధర్మమా సేవతాంన్ణాం విపత్తిర్వానరాధిప ॥ 46
పూర్వజన్మకృతేనేహ సుకృతేన కర్మణా ॥ సుతప్తే నేహతవసా బ్రాహ్మణై ర్వసుధాధిప ॥ 47
శాపాని దీయమానాని ప్రత్యక్షం కిన్నపశ్యసి అమోఘాశాస్తథావిప్రా సుతప్త తపసోనృప ॥ 48
కిన్నపశ్యసిలోకేస్మి న్ప్రత్యక్షం ధర్మ దర్శనమ్ । బీజాని బీజ కావేషు యైరే పూప్తాని పార్థివ ॥ 49
త ఏవలోకే దృశ్యంతే ప్రత్యక్షం ఫలభాగినః । దృష్ట్వా మంత్ర ప్రభావేణ విప్రకర్షణతత్పరాన్ ॥ 50
విషాపహారం కుర్యాణన్ద ర్మోఽవ్యస్తీతి చింతయ । మేషామపివచః క్షుద్రం పరలోకం న విద్యతే ॥ 51
తేఽప్యద్విజస్తేపాపానాం తస్మాద్పాపం వివర్జయ ॥
మార్కండేయఉవాచ :- ఏతచ్ఛ్రుత్వాతు వచన యృషీణాం భావితాత్మనామ్ ॥ 52
హృతోత్తర స్తదాదీనో నోత్తరం ప్రత్యభాషత । చింతయామాస మనసా బ్రాహ్మణైర్ధర్మ తత్పరైః ॥ 53
యదేత దుక్తంవచనం మిథ్యైత న్మాత్ర సంశయః । అభిప్రాయం నరేంద్రస్య జ్ఞాత్వా బ్రాహ్మణ ప్రంగణః ॥ 54
వినష్టం మేనిరేసర్వం త్రైలోక్యం సచరాచరమ్ । ఏతస్మిన్నంతరేదేవై ర్బ్రాహ్మణానాం మహాత్మణమ్ ॥ 55
బుద్ధిర్నివేశితాతస్య వినాశాయదురాత్మనః । సర్వేశ్వరః సర్వశక్తిః సర్వదృక్సర్వ సాధనః ॥ 56
ప్రార్థితశ్చతదా విష్ణుః పృథివీరాజ్య కారణత్ । దేవాఊచుః:- ధ్రువ వంశోద్భవం దేవవేనం భూపాల కిల్బిజం ॥ 57
బ్రాహ్మణ ఘాతయిష్యంతి మంత్ర పూతైః కుశోదకైః । ఊరూచాన్యతతః క్షిప్రం మథిష్యంతి సమాహితాః 58
కురుష్వ సంభవంతత్ర లోకానాంహిత కామ్యయా । కృత్వాతునంభవంతత్ర పాలయిస్వ జగత్తయిమ్ ॥ 59
అస్థాయ మానుషంరూపం త్వహిపాలయితావతః । ఏం కరిష్య ఇత్యుక్తం దేవదేవేన దక్షిణః 60
దేవక్రోధేన సంక్రుద్ధా నిజఘ్ను ర్బ్రాహ్మణ నృపమ్ । మంత్రపూతైః కుశైః న్త ర్వే స్తతస్తస్యదురాత్మనః 61
ఊరూమమన్థుః నహిసాతతోఽస్య తనయోఽభవత్ । హ్రస్వోఽతిమాత్రం కృష్టాంగో దారుణో దారుణకృతిః 62
నిషేదాతీ తమూచుస్తే బ్రాహ్మణ వేదపారగాః। సర్వభూత నిషాదానా మృషివ్యాక్యేన పార్థివ । 63
నిషాద వంశకర్తారం వేనకల్మష సంభవమ్ తతోఽస్య దక్షిణంపాణింమమంథుః సహసాద్విజాః 64
తస్మా దన్యసుతోజాతో విష్ణుర్మానుష రూపధృకి । పృథురిత్యేష నామాస్య చక్రుస్తే ద్విజప్రంగనాః
తేన జాతేన పుత్రణవేనః పాపాదముచ్యత్ ॥ 65
తత్పుత్యలాభాత్త్రిది వంజగామ వేనోదురాత్మా కృతసర్వపాపః ।
దృష్ట్వాపిజాత మృషయః కుమారం సంమేనిరే లోకమిదం కృతార్థమ్ ॥

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే పృథూద్భవూనామాష్టోత్తర శతతయోఽధ్యాయః

పూర్వజన్మ మందు మానవులు ప్రత్యక్షమునే చూచుచున్న వారైకూడ దైవవంచితులై పరలోకమును జూడలేరు. ప్రాణి పుట్టగానే తల్లి స్తనముం జేకొనును. అది పూర్వజన్మాభ్యాసమున కాక మరిదేని చేష్ట? ఈ జన్మ మందు నరుడు వాయుభూతమైన ప్రాణము చేత దేహగ్రహణ మెట్లు సేయునో జన్మాంతర మొందిన వాడు నట్లే దేహముం బొందును. రాళ్ళు భూమి యొక్క వికృతులు. కర్మ జీవము వానికి లేదు, వాని సూక్ష్మత్వము మహత్త్వమును (చిన్నవగుట పెద్దవగుట) ఈశ్వరుడు చేసినదే. పరలోకమున కేగిన జీవునుద్దేశించి మంత్రము చేత శ్రాద్ధమందింప బడును. పరదేశమునకు నెళ్ళిన వాని కట్లాహారమందించుటకు మంత్రమేదియు గనబడదు. ప్రాకామ్యము లఘిమ అను నణిమాదిశక్తులు గలవారు దేవతలు కనబడుచున్నారు. వారు జ్ఞానము కల వారు కూడ. కావున వీరెక్కడ నెవరు నివేదించిన పదార్థమునైన గ్రహింతురు. ధర్మమును సేవించు వారికి విపత్తునునదేది. పూర్వజన్మ కృతమైన పుణ్యము చేత నలోకములో మిక్కిలిగ జేసిన తపస్సుచేత బ్రాహ్మణులిచ్చు శాపములను నీవు చూచుట లేదా? అట్లేమిక్కిలిగ తపస్సు చేసిన విప్రుల యభిలాషలు కూడ అమోఘములు. పప్పక ఫలించి తీరును. ధర్మము, ధర్మఫలము నీలోకమునందు ప్రత్యక్షముగ నీవు చూచుట లేదా? విత్తనములు బీజకాలములో బీజరూపమున నభించినవే. ఫలవంతములయి ప్రత్యేకముగ లోకమందు గనబడుట లేదా? మంత్రప్రభావముచేత విప్రులను ఆకర్షించువారిని హరించువారినిచూచి రాజా! ధర్మమున్నదని యాలోచింపుము. పరలోకములేదనితుచ్ఛముగా నెవరుమాట్లాడుదురో వారుకూడపాపముల కాందోళనపడుచునే యుందురు. అందుచే పాపమును విడువుము. అని ఋషులు పలికినది విని వేనుడు జవాబు తోచక మాఱుపలుకడయ్యెను. మనసులో ధర్మతత్పరులు బ్రాహ్మణులు పలికిన యామాట వట్టిబూటకమని సంశయము లేపనుకొనెను. ఆరాజు నభిప్రాయము బ్రాహ్మణపుంగవులు గ్రహించి చరాచర ప్రపంచము నాశనమై పోయినదే యనుకొనిరి. ఈలోన దేవతలు మహానుభావులైన యా బ్రాహ్మణుల యందు దురాత్ముని వీని కడతేర్ప వలెనను తలంపును వారిలో ప్రవేశ పెట్టిరి. పృథ్వీరాజు రక్షణ నిమిత్తముగ వారు సర్వేశ్వరుని సర్వశక్తిని సర్వద్రష్టను సర్వసాధకుని విష్ణువు నిట్లు ప్రార్థించిరి. ప్రభూ! ధ్రువవంశజుడైన వేనుని పాపాత్ముని రాజును మంత్రపవిత్రములయిన కుశోదకములచే జంపుదురు. అందరేకమై వీని తొడలు వేర్వేరుగ మథింతురు. ఆ మథించిన తఱి నీవు లోక హితము గోరి యవతరింపుము. అవతరించి మానుష రూపముగొని పరితాపము నుండి రక్షింపుము. విష్ణువును నిట్ల యొనరింతుననియె.

ఆ దేవుని కోపముచే ఋషులును కోపించి బ్రాహ్మణులు మంత్రపూత కుశలచే నా దుష్టుని జంపి వాని తొడల నొక్కుమ్మడి మథించిరి. అంతట వీనికొక పుత్రుడు గల్గెను. వాడు మరుగుజ్జు దారుణాకారుడు. మహాదారుణుడు వేదపారగులు వారు వానిని నిషీద = కూర్చుండుము. అనిరి. వేనుని కల్మషము (పాపము) నుండి పుట్టిన వానినిఋషి వాక్యాను సారము సర్వ నిషాద వంశములకు (బోయవాళ్ళజాతికి) కర్తను గానించిరి. ఆ మీద వీని కుడి బాహువును తొందరగ మథించిరి, అందుండి విష్ణువు మానుష రూపము గొని కొడుకై పుట్టెను ఆ విప్రవరులాతనికి "పృథువు" అను పేరుపెట్టిరి. ఆ పుట్టిన పుత్రునిచే వేనుడు పాపము. నుండి ముక్తుడయ్యె. సత్పుత్రలాభమున వేనుడు స్వర్గమున కేగెను. పుట్టిన కుమారుని ఋషులు చూచి యీలోకము ధన్యమైనదనుకొనిరి.

ఇది శ్రీ విష్ణుధర్మోత్తర మహాపురాణమున ప్రథమఖండమున వేదనాస్తిక వారణ:పృథుసంభవమునను నూటయెనిమిదవ అధ్యాయము

## నూటతొమ్మిదవ అధ్యాయము - పృథుపట్టాభిషేకము

అద్య మాజగవం నామ ధనుర్గృహ్య మహాయశాః । దృష్ట్వా జాతం పృథుం దేవాః సర్వఏవసవాసవాః ॥ 1

ఆజగ్ముః పుష్కరంతీర్థ మభిషేక్తుంతదా పృథుమ్ । తంచాభిసిషిచుర్దేవా రత్నచిత్ర వరాసనే ॥ 2

బ్రహ్మా విష్ణుశ్చ రుద్రశ్చ చంద్రాదిత్యౌ ప్రభాకరౌ । దిశశ్చ విదిశశ్చైవ లోకపాలాః సవాసనాః ॥ 3

సర్వదేవగణాశ్చైవ ఋషయశ్చ తపోధనాః । స్వంస్వంతోయముపాదాయ సముద్రాశ్చనరాధిప ॥ 4
సరాంసి సరితశ్చైవ సర్వేతీర్థవరాస్తథా । సోఽభిషిక్త స్తదాశ్రీమాన్ వేనపుత్రః పరంతప! ॥ 5
సంవత్సరః కృత స్తస్య వృద్ధగర్గో మహాయశాః। స్థితాః శిష్యవరావిత్యం తస్యోత్పాత నిరీక్షణే ॥ 6
పురోహితః కృత స్తస్య యాజ్ఞవల్క్యో మహాయశాః । అథర్వణే నయ స్తస్య సర్వాన్దోషాన్వ్యపోహత॥ 7
ఉశనాశ్చ తథామంత్రీ కృత స్తస్య మహాత్మనః । షాడ్గుణ్యయోగాద్య స్తస్య సర్వదోషాన్వ్యపోహత ॥ 8
కమలాభరణోనామ సుప్రతీకసుత స్తదా । రాజహస్తీ కృత స్త స్వస్యయంగర్గేణధీమతా ॥ 9
శ్రీసుత స్తురగః శ్రేష్ఠః శశాంకసదృశచ్ఛవిః । మంగలాశ్వః కృత స్తస్య వృద్ధగర్గేణ పార్థివ ॥ 10
స్వయందేవ వరై స్తస్య దత్తాని మనుజాధిప । ఛత్రం సవాలవ్యజనం ఖడ్గంచ వసుధాధిప ॥ 11
తస్యలక్షణ సంయుక్తం దదుర్దేవా నరేశ్వర! । ఇత్యేవంచాభిషి క్తస్తు ర్వైనో మహాయశాః ॥ 12

దేవతలా ఆజగవమను విల్లు పట్టుకొని పుట్టిన పృథువుంగని యందరు నతని నభిషేకించుటకు పుష్కరతీర్థమున కేతెంచిరి. రత్న చిత్ర సింహాసన మందాతని నిలిపి యభిషేకించిరి. బ్రహ్మ విష్ణు రుద్రులు చంద్రాదిత్యులు దిక్కులు విదిక్కులు నింద్రునితోడి దిక్పాలురు సర్వ దేవగణములు తపోధనులయిన యెల్ల ఋషులు, తమతమ తోయములంగొని సముద్రములు సరస్సులు సరిత్తులు (నదులు) సర్వ తీర్థ రాజములు వచ్చిరి. వేనసుతుడుం తట శ్రీమంతుడు పృథు వభిషిక్తుడయ్యెను. మహాయశుడు వృద్ధ గర్గుడు సంవత్సరుడుగ (జ్యోతిషకుడుగ) నుండ నాయన శిష్యులు నిరంతర మాతని కేవేని యుత్పాతములు గలుగునేమోయని కని పెట్టుచుండు వారైరి. అతనికి యాజ్ఞవల్క్యుడు పురోహితుడుగావింపబడెను. అధర్వ వేదోక్త విధానమున నాతడా రేనికేదోషము గలుగకుండ శాంతి నొనరించెను. (ఉపద్రవ శాంతి కల్ప మధర్వ వేదోక్తము. రాజ పురోహితుడందుచే నధర్వ వేదవేత్తయయి యుండవలెనది శాస్త్రములు తెల్పుచున్నవి.) ఆ మహాత్మునికి ఉశనుడు=శుక్రాచార్యుడు మంత్రి గావింప బడెను. ఆయన షాడ్గుణ్యముచే = సంధి విగ్రహయానాసనద్వైధీభావసమాశ్రయములను రాజనీతి ప్రతిపాదితములగు నాఱువిధానముల వలన రాజ్యాంగ మందేదోషము లేకుండ జూచెను. సుప్రతీకమను దిగ్గజము యొక్క కొడుకు కమలాభరణుడను గజరాజును వృద్ధగర్గా చార్యుడాతనికి పట్టపుటేనుంగొనరించెను. అతడే శ్రీదేవికి పుట్టిన చంద్రసమాన వర్ణమగు శ్రేష్ఠమైన గుఱ్ఱమును ఆతనికి మంగళాశ్వముం గావించెను. (ఇట మంగళశబ్దము పంచకల్యాణి గుఱ్ఱమును జ్ఞాపనము చేయును.) దేవతాశ్రేష్ఠులు స్వయముగ ఛత్రము చామరము సులక్షణ మైన ఖడ్గమును నాతని కొసంగిరి. ఇట్లా వైన్యుడు శాస్త్రోక్త విధానమున పట్టాభిక్తు డయ్యెను.

విధినాశాస్త్రదృష్టేన బ్రాహ్మణైర్మంత్ర పారగైః । తస్యపైతామహేయజ్ఞే హయమేధే పురాతనే ॥ 13
అప్తుర్యామస్యసుత్యేఽహ్ని సూతోజాతః పరంతప! । సామగేష్వథగాయత్సు అధ్వరే వైశ్వదేవికే ॥ 14
మాగధశ్చ సముత్పన్న స్తస్మిన్నేవ మహాక్రతౌ । పృథో ర్వై వార్థలతౌరేవౌ చోదితావృషిభి స్తథా ॥ 15
ఊచుచస్తౌ తదాదేవా నృషీంశ్చ ప్రణతౌ స్థితౌ । కర్మభిస్తూయతేసర్వః కర్మచాస్యన విద్మహే ॥ 16
కర్మణశ్చాప్యవిజ్ఞానా స్తోషావ స్తత్కథం పృథుమ్ ॥ 17
ఋషయఊచుః : అస్మత్ప్రభావ విజ్ఞాతౌ స్తువతా మవిచారతః ॥
మార్కండేయ ఉవాచ : ఋషిభిస్తౌ నియుక్తౌతు తుష్టువాతే స్వకర్మభిః । భవిష్యత్పృథివీపాలం దివ్యజ్ఞానౌ పరంతపౌ॥ 18
తయోర్వైన్యస్తు సంప్రీతః ప్రమఃప్రాదాత్ప్రజేశ్వరః । అనూపదేశం సూతాయ మగధం మాగధాయచ ॥ 19

ఆ పృథుచక్రవర్తి పితామహుడు సేసిన యశ్వమేధ యాగమందు అప్తుర్యామము యొక్క సుత్యాహస్సువందు సూతుడు జనించెను. వైశ్వదైనిక యాగమందు సామగులు (ఉద్గాతలు) సామగానము సేయుచుండగ నదే యజ్ఞమందు ఇద్దఱు సూతమాగధు లనువారు పుట్టిరి. ఋషులు వారిని పృథుచక్రవర్తిని స్తుతించుచు పాటలు పాడుడని ప్రేరణ సేసిరి. ఆ యిద్దరును దేవతలకు ఋషు

లకు ప్రణతిసేసి నిలువడడి యెవ్వడేని చేవిన పనులంబట్టి (చరిత్రంబట్టి) కీర్తింప బడును. ఇతని పనులేమో (చరిత్రయేమో) మేమెఱుంగము. పౌత్రిగా నది యెరుంగకే మీతని నెట్లు పొగడుదు మనిరి. అప్పుడు ఋషులు మా ప్రభావము మీఱెరుగుదురు గద! దానిం బట్టి యీతనిం గొనియాడుడన వారిద్దరు కాబోవు చక్రవర్తి నానానిని దివ్య జ్ఞానమును గొని స్తుతించిరి. వారియెడ పృథువు మిక్కిలి ప్రీతినొంది సూతునికి అనూపదేశముసు (జలప్రాయ ప్రాంతమును) మగదునితి మగధదేశమును బహూకదించెను.

తతో వైన్యం మహాభాగం ప్రజాస్తాః సంప్రదుద్రువుః । త్వంనో వృత్తిం దదస్వేతి మహర్షివచనాత్తదా ॥ 20
సోఽభిద్రుతః ప్రజాభిస్తు ప్రజాహితచికీర్షయా । ధనురాదాయబాణాంశ్చ వసుధాం మర్దయ న్బలీ ॥ 21
తతో వైన్యం భయత్రస్తా గోర్భూత్వా ప్రాద్రవన్మహీ । బ్రహ్మలోకాదికాన్లోకా న్నచత్రాణ మవిందత ॥ 22
సర్వత్రైవ పృథుంవైన మాత్తకార్ముజ మచ్యుతమ్ । దదర్శసుమహాభాగం తేజసా భాస్కరప్రభమ్ ॥ 23
అలభంతీతు సాత్రాణం వైన్యమేవాన్వపద్యత । కృతాంజలిపుటాదేవీ పూజ్యాలోకై స్త్రిభిస్తదా ॥ 24
ఉవాచవైన్యం నాధర్మం స్త్రీవధే పరిపశ్యసి । కథంధారయితా చాసి మాయాహీనస్త్విమాః ప్రజాః ॥ 25

అటుపై నా మహాబాగుని దరికాతని ప్రజలు పరుగెత్తి మహర్షులు మాటం బట్టి నీవు మాకు వృత్తము (బ్రతుకు తెరువు) దయ సేయుమనిరి. ఆతడు ప్రజల హితము కోరి దనుర్బాణమును గొని వసుధను మర్తింపబరువిడెను. ఆ బలశాలిని గని పుడమి గోవై జడిసి పారిపోయెను. బ్రహ్మలోకాదుల వెంటనెటకు బరువెత్తి పోయినను రక్షణ పొంద దయ్యెను. ఎటుకేగిననక్కడ ధనుష్పాణియై భాస్కరునట్లు వెలుగు మహానుభావుని వైన్యునే యెట్ట యెదుట జూచెను. రక్షణ దొరతక యామె వైన్యునే శరణం బొందెను. దోసిలొగ్గి యాత్రిలోక పూజనీయ మహీదేవి పృథునితో స్త్రీ వధ యధర్మమని కనవా? నేను లేని యీప్రజల నీ వెట్లు ధరింతువన పృథుచక్రవర్తి యిట్లనియె.

పృథురువాచ: ఏకస్యార్థాయ యోహన్యా దాత్మనోవాపరస్యంవా । ఏకం జీవంబహూత్వేఽపి కామంనైవాస్తిపాతకమ్ ॥
యస్మింస్తు నిహతే భద్రే ఏధంతే బహవః సుఖమ్ । తస్మిన్హతే నాస్తిపరే పాతకం నోపపాతకమ్ ॥ 27
సోఽహం ప్రజానిమిత్తంత్వాం వధిష్యామి పసుంధరామ్ । ఆత్మానంప్రథయిత్వాతు ధారియిష్యే ప్రజాస్త్విమాః ॥ 28
వృత్త్యుపాయం నచేదాసాం ప్రజాం నాం త్వం విధాస్యసి । విధాస్యసి యధా భద్రే తదా త్వం సుఖ మాప్స్యసి ॥ 29
పృథివ్యువాచ : ప్రజానాం జీవనోపాయం విధాస్యామి నరేశ్వర । విధత్స్వవత్సం ధర్మజ్ఞ క్షరేయం యేన వత్సలా॥ 30
సమాంచ కురుసర్వత్ర మమ ధర్మభృతాంవర! । యధా నిష్యంద మానంవై క్షీరం సర్వత్ర భావయేత్ ॥ 31
మార్కండేయ ఉవాచ : తత ఉత్సారయామాస శిలాజాలాని సర్వతః । పృదుర్వైన్యో మహాతేజా స్తేనశైలా వివర్ధితాః
తతః ప్రభృతి రాజేంద్ర! గ్రామాశ్చ నగరాణిచ । కృష్యాదికంచ సకలం భువి కర్మ ప్రవర్తితమ్ ॥ 33
తస్యాః సస్యాని సాదుర్గా పృథునా పృథివీక్షితా । వత్సం స్వాయంభువం కృత్వా మనుం వైదక్షిణేకరే ॥ 34
తతస్తు ఋషిభిర్దుగ్ధా ఛందః పాత్రే వసుంధరా । వత్సః సోమోఽభవత్తేషాం దోగ్ధాచైవ బృహస్పతిః ॥ 35
ఊర్జం దేవగణైర్దుగ్ధా రుక్మపాత్రే వసుంధరా । వత్సస్తు మఘవానాసీ ద్దోగ్ధా చ సవితా తథా ॥ 36
సుధాంచ పితృభిర్దుగ్ధా రౌప్యపాత్రే వసుంధరా । దుగ్ధా రజతనాభేన వత్సం కృత్వా ధనేశ్వరమ్ ॥ 37
అన్తకశ్చాభవద్దోగ్ధా వత్సో నైవస్వతో యమః । పయశ్చైవాయసేపాత్రే దుగ్ధా దైత్యై ర్వసుంధరా ॥ 38
దుగ్ధా గగనమూర్ధాసా వత్సం కృత్వా విరోచనమ్। అలాబుపాత్రే సర్పైశ్చ విషం దుగ్ధా ధరా తథా ॥ 39
తేషాంచ వాసుకిర్దోగ్ధా వత్సశ్చాసీచ్చ తక్షకః! అంతర్ధానం యదా యక్షైః రామపాత్రే వసుంధరా ॥ 40
దుగ్ధా రజతనాభేన వత్సం కృత్వా ధనేశ్వరమ్ । కపాలే రుధిరం దుగ్ధా రాక్షసై ర్భీమ విక్రమైః ॥ 41
హేతిః ప్రహేతిశ్చతధా దోగ్ధా వత్సస్తథాభవత్ । దుగ్ధా గంధా న్పద్మపాత్రే గంధర్వాప్సరసాంగణైః ॥ 42

వత్సశ్చిత్రరథ స్తేషాం దోగ్ధా వసురుచి స్తథా । ఔషధ్యశ్చ తథా శైలై ర్దుగ్ధాఃపాత్రే శిలామయే ॥ 43
వత్స స్తు హిమవానాసీ ద్దోగ్ధా మేరు ర్మహాగిరిః । పాలాశపాత్రే వృక్షైస్తు దుగ్ధం పుష్పం ఫలం శుభమ్ ॥ 44

ఒక్కని ప్రయోజనమునకై తనయొక్క లేక యింకొకని యొక్కగాని ప్రాణమును దీసినచో పాపముండదు. ఒక్కని తుదముట్టించిన ననేకులు సుఖపడుదురేని వానిం జంపుట వలన పాతకము ఉపపాతకమేనిగలుగదు. అందుచే నేను వసుంధరను నిన్ను జంపెదను. నన్ను నేను ప్రకటించుకొని ప్రజలు బ్రతుకు నుపాయము నీవు సేయవేని వీరిని నేను భరింతును. కల్యాణి! నీవే యది సేయుదువేని సుఖము నందెదవు. అనగా ధాత్రి నరేశ్వరా! ఆయుపాయ మేనొనరింతును. అందులకొక దూడను సమకూర్చుము. అప్పుడు నేను జేసెదను. నన్నంతట సమురాలిం గావింపుము. అప్పుడు నా చేసిన పాలెల్లెడల సమమగా తడప గలదనెను. అదివిని పృథువంతటనున్న శిలలను లేపెను. అందుచే శైలము లేర్పడెను. అదిమొదలెగుడు దిగుడులు మెట్టపల్లములు లేకుండ సరిచేయబడిన యీ పృథివిపై పల్లెలు పట్టణములు కృషి వ్యవసాయము మొదలగు నదెంతయు నేర్పడినది.

అ జేనిచే భూమి పంటలు పిదుక బడెను. అప్పుడు ఋషులు స్వాయం భువమనువును దూడంజేసి కుడిచేతి యందు ఛందస్సులనెడి పాత్రయందు వసుంధరం బిదికిరి. సోముని దూడంచేసి బృహస్పతి పితుకు వాడుగా దేవతలు ఊర్జమును బంగారు చెంబు లోనికి బిదికిరి. ఇంద్రుడు దూడగా సవితదోగ్ధగా వెండి పాత్రలోనికి పితరులు స్వధనుబిదికిరి. అంతకు డుదోగ్ధయై వైవస్వతు డగుయముడు దూడగా ఆయన (ఇనుప రాగి) పాత్రయందు దైత్యులు పాలు పిదికిరి. గగన మూర్ధుడు (వ్యూమకేశుడు = శివుడు) విరోచనుని దూడంజేసి ఆలాబు (సొరకాయ) పాత్రయందు నాగులు విషము బిదికిరి. అప్పుడు వాసుకిదోగ్ధ. దూడ తక్షకుడు, యక్షులలో రజతనాభుడు ఆమ (మట్టి) పాత్రలో ధనేశుని (కుబేరుని) దూడగావించి యంతర్ధానముం బిదికెను. భీమ విక్రములు రాక్షసులు 'హేతి' పిదుకు వాడుగా ప్రహేంతి దూడగా కపాలములోనికి రక్తముం బిదికిరి. గంధర్వాప్సరోగణములు చిత్రరథుని దూడగావించి వసురుచిమూలమున పద్మ పాత్రయందు గంధములను బిదికిరి. శైలముచే శిలామయ పాత్రయందు హిమవంతుని దూడం జేసి మేరువు పితుకు వాడుగా ఔషధులం బితికి కొనెను. వృక్షములు పలాశపాత్రము నందు (మోదుగదొప్పె) పుష్పఫలరూ పక్షీరమును బితికి గొన్నవి. కామదోగ్ధయత్తరి సాలవృక్షమయినది. ప్లక్షము = జువ్విచెట్టు దూడ యయ్యెను.

కాం మధుక్ చ తతః సాలం ప్లక్షో వత్సస్తువై స్మృతః । సర్వకామదుఘా దోగ్ధ్రీ పృథివీ భూతభావినీ ॥ 45
సైషా ధాత్రీ విధాత్రీచ జననీ భావినీ తథా । చరాచరస్య లోకస్య ప్రతిష్ఠోత్పత్తి రేవచ ॥ 46
సర్వభూత శరణ్యాంచ సర్వభూత హితైషిణీ । వర్ణదా మేదినీ భూమిః క్షమాక్షోణీ వసుంధరా ॥ 47
సర్వభూత శరీరస్థా సర్వానుగ్రహకారిణీ । మన్వంతరేఽస్మి న్సంప్రాప్తే వైన్యేన పృథివీక్షతా ॥ 48
ప్రథమం వసుధా దుగ్ధా తతో దుగ్ధా యథోదితైః । దుహితృత్వంగతాతస్య పృథివీ తేన చోచ్యతే ॥ 49
ఏవం ప్రభావః స పురా పృథురాసీ న్మహీపతిః । పిత్రా ఉ వరంజితా స్తస్య ప్రజా స్తేనానురంజితాః ॥ 50
ప్రజానాంరంజనా త్తస్య నామ రాజేతి కీర్తితమ్ । రాజాభోజో విరాట్ సమ్రాట్ గో పతిః పార్థివ స్తథా ॥ 51
స ఏవోక్తో మహీనాథ శబ్దైః పర్యాయవాచకైః । నమస్కార స్తు కర్తవ్య స్తస్య నిత్యం ద్విజోత్తమైః ॥ 52
వేదకామైర్వేదవిద్భిః ప్రార్థయద్భిర్మహద్యశః । పార్థివైశ్చ మహాభాగైః ప్రార్థయద్భి ర్మహద్యశః ॥ 53
వృత్తిదాతా తథావైశ్యై ర్నమస్కార్య స్తథాపృథుః । శూద్రైరపి నమస్కార్యో ధర్మకామైర్మహీపతిః ॥ 54
క్షేమేప్సుభి స్తథా ధ్యానే నమస్కార్యః పృథుర్నృపః । యోహియోధో రణేయాతి కీర్తయిత్వా పృథుం నృపమ్ ॥ 55
స ఘోరరూపాత్సంగ్రామా త్క్షేమీభవతి పార్థివ । పృథోః కృత్వా నమస్కారం సర్వత్ర విజయీభవేత్ ॥ 56
తస్మా త్తస్య నమస్కారః సదా కార్యో జయేప్సునా । వైన్యస్యభూపాలవరస్య రాజన్! శ్రుత్వాభిషేకం ప్రయతో మనుష్యః ॥

పాపం సమగ్రల విజహాతి శీఘ్రం జయం తథాప్నోతి యశశ్చలోకే ॥ 57

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరమహాపురాణె ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
పృథ్వభిషేకాది వర్ణనం నామ నవోత్తర శతతమోఽధ్యాయః

ఇట్లు సర్వకామదోగ్ధ్రియై భూతభావిని యైన యీ పృథివి ధాత్రి (దాది) విధాత్రియు జననియునైనది. చరాచర లోకము పాలిట ప్రతిష్ఠ (ఆధారము) ఉత్పత్తి=పుట్టుకకు కారణమునై సర్వభూతములకు శరణ్యమై సర్వభూత హితైషిణియు నై వర్గద మేదిని భూమి క్షమ క్షోణి వసుంధర యను సార్థకమైన పేర్లతో సర్వభూత శరీర సర్వాస్థను గ్రహకారిణి యైనది. ఈ మన్వంతరమందు పృథువుచే మొట్టమెదట పిదుకబడి తరువాత నింతమున్ను చెప్పబడిన వారివారిచ వారివారి కనుపైన క్షీరము పిదుక బడినది. అందుచే పృథువున కామెదుహితయై (కూతురై) పృథివియను పేరు గూడ పొందెను. మున్నా పృథు చక్రవర్తి యిట్టి ప్రభావము గలవాడై యుండెను. అతని తండ్రి యగు వేమనిచేత నపరంజితులు = బాధితులు అయిన ప్రజలు ఆతనిచే రంజింప (ఉల్లసింప) బడిరి ప్రజల రంజించుటచే నతనికి 'రాజు' అనునది సార్థకమైన పేరయ్యెను. రాజు భోజుడు విరాట్టు సమ్రాట్టు గోపతి పార్థివుడు ననునీ పర్యాయ వాచకములయిన శబ్దములచే నతడే చెప్పబడెను

వేదకాములు వేదవిదులు మహాకీర్తి కోరువారునై ఉత్తమ ద్విజులు కూడ నాతనికి నమస్కరింప వలయును. మహాకీర్తి కాములయిన మహాభాగులు పార్థివులాతనికి మొక్కవలయును. వృత్తిదాతగా (జీవన ప్రదాత) నతడు వైశ్యులకు వందనీయుడు. శూద్రులు కూడ ధర్మకాములై క్షేమముకోరువారై ధ్యానమునందు పృథుచక్రవర్తి నమస్కార్యుడు. ఏయోధుడు పృథువును గీర్తించి (ఆపేరు పేర్కొని) యుద్ధమున కేగు నాతడు ఘోరమైన సంగ్రామమునుండి క్షేమముగ వచ్చును. పృథువుకు మ్రొక్కిన యాత డెల్లయెడల విజయము గాంచును. జయార్థియైన వాడెల్లపుడు నతనికి నమస్కరింప వలయును. నియమముతో మానవుడు వేన సుతుడైన పృథువు యొక్క పట్టాభిషేకమునువిని సర్వపాపముల బాయును. వెంటనే విజయముగాంచును. లోకమందు యశస్సు నందును.

ఇది శ్రీవిష్ణు ధర్మోత్తర మహాపురాణము ప్రథమ ఖండమున పృథుచక్రవర్తి
పట్టాభిషేకమను నూట తొమ్మిదవ యధ్యాయము.

## నూటపదవ అధ్యాయము - దక్షవంశవర్ణనము

మార్కండేయః :- అంతర్ధానః పృథోః పుత్రో హవిర్ధానః తదాత్మజః । ప్రాచీన బర్హిస్తత్పుత్రః పృథివ్యా మేకరాట్ బభౌ ॥
ఉపయేమే సముద్రస్య లవణస్య స వై సుతామ్ । సువర్ణాయాం తు సాముద్ర్యాం దశ ప్రాచీనబర్హిషః ॥ 2
సర్వేప్రాచేతసో నామ ధనుర్వేదస్య పారంగాః । అపృథక్ధర్మ చరణాస్తేఽతప్యన్త మహత్తపః ॥ 3
దశవర్ష సహస్రాణి సముద్ర సలిలేశయాః । సముద్రగేషు దశసు తపస్యత్సు మహీరుహాః ॥ 4
అరక్షమాణాం గాం వవ్రుర్బభూవేత్థం ప్రజాక్షయః । న శక్యో మారుతో వాతుం వృత్తం సమభవద్ద్రుమైః॥ 5
తదుపశ్రుత్య రాజానః సర్వేయుక్తాః ప్రచేతసః । ముఖేభ్యోవాయు మగ్నించ ససృజుర్జాతమన్యవః ॥ 6
నిర్మూలానథ వృక్షాంస్తాన్ కృత్వావాయు రశోషయత్ । తానగ్ని రదహత్ క్రుద్ధ ఏవమాసీత్ ద్రుమక్షయః ॥ 7
ద్రుమక్షయ మథో దృష్ట్వా కించిద్ధగేషు శాఖిషు ॥ ఉపగమ్యాఽబ్రవీ దేతాన్ సోమో రాజా ప్రచేతసః ॥ 8

మార్కండేయుడనియె. పృథుకుమారుడు అన్తర్ధానుడు. వానిపుత్రుడుహవిర్ధానుడువానికుమారుడుప్రాచీనబర్హి. ఇతడుభూమండల మునకేకైకఛత్రాధిపత్యమువహించినవాడు. లవణుడను సముద్రుని కూతురును సువర్ణను పెండ్లాడెను. ఆమెయందుప్రాచీనబర్హిషునకుపది

మంది కుమారులు గల్గిరి. వీరికి ప్రాచేతసులను పేరు గలదు. ధనుర్వేద పారగులు. అందరు నొకే ధర్మాచరణ పరులై మహాతపస్సు జేసిరి. పదివేలేండ్లు సముద్ర జలములందే యుండి వారు తపస్సు సేయుచుండగా చెట్లు రక్షణలేని భూదేవిని ఆవరించెను. ఇట్లు ప్రజాక్షయమైనది. వాయువు వీచుట కెడము లేకున్నది. చెట్లు క్రిక్కిరిసి పోయినవి. ప్రాచీన బర్హిషులు రాజులది విని కోపించి ముఖములనుండి వాయువును అగ్నిని సృజించిరి. చెట్ల నగ్ని దహించెను. సర్వ వృక్షక్షయమయ్యెను. ఆదిచూచి చెట్లించుక కాలగా సోమ రాజేతెంచి ప్రచేతసులంగని యిట్లనియె.

కోపం త్యజత రాజానః ! సర్వే ప్రాచీన బర్హిషః । కృతా మహీ వృక్షశూన్యా శామ్యేతా మగ్ని మారుతౌ ॥ 9
రత్న భూతాచ కన్యేయం వృక్షాణాం వరవర్ణినీ । భవిష్యం జానతా హ్యేషా ధృతా గర్భేణవైమయా ॥ 10
మారిషా నామ చవతాం పత్న్యర్థే ప్రదదా మ్యహమ్ । తతస్సోమస్య వచనా జ్జగృహు స్తే ప్రచేతసః ॥ 11
సంహృత్య కోపం వృక్షేభ్యః పత్నీధర్మేణ మారిషాం । మనసా చదధు స్తస్యాం గర్భం సర్వే ప్రచేతసః ॥ 12
దశభ్యస్తు ప్రచేతోభ్యో మారిషాయాం ప్రజాపతిః । భవశాపేన సంభూతో భూయో దక్ష ప్రజాపతిః ॥ 13
అసృజన్మనసా దక్షః ప్రజాః పూర్వం చతుర్విధాః ॥ నోత్పద్యన్తేచ తా స్తస్య అపధ్యాతా హరేణ తు ॥ 14
మైథునేన తతః సృష్టిం కర్తుమిచ్ఛన్ ప్రజాపతిః । అసిక్నీ మవహ ద్భార్యాం వీరణస్య ప్రజా పతేః ॥ 15
సుతాం సుమహతీం యుక్తాం తపసా లోకధారిణీమ్ । తస్య పుత్ర సహస్రంతు వీరిణ్యాం సమపద్యత ॥ 16

రాజులారా ! కోపము విడువుడు. మహి వృక్ష శూన్యమయ్యెను. అగ్ని వాయువులను శమింపజేయుడు. ఇదిగో వృక్షముల యొక్క కన్యారత్న మీమె చక్కనిది. భవిష్య మెరిగి నేనీమెను గర్భమందు ధరించితిని. మారిష యను పేరు గలది. మీకు పత్నిగా నిత్తును. అనవిని వారామెను పరిగ్రహించిరి. వృక్షముల యెడ కోప ముడిపికొని పత్నీ ధర్మమున మారిషను మనస్సుచే సమావేశమంది ఆమెయందు గర్భము ధరించిరి. దక్షప్రజాపతి ముందటి శివ శాపముచే నా పదిమంది వలన మరల జన్మించెను. అతడు మనస్సుచే నాల్గు విధముల ప్రజలను తొలుత గనెను. వారు శివునిచే నపధ్యాతులయి (వ్యతిరేక భావన చేయబడిన వారై) ప్రజాపతి కనుకూలముగ సృష్టికి సహకరింపరైరి. అంతట దక్ష ప్రజాపతి మిథున ధర్మమున సృష్టి గావింప నెంచి వీరణ ప్రజాపతి కుమార్తెను అసిక్నిని పెండ్లాడెను. ఆమె చాల గొప్పది. తపస్విని లోకధారిణి. ఆ దక్షుని కామెయందు వేయిమంది పుత్రులు కల్గిరి.

తాంస్తు దృష్ట్వా మహాతేజాః వివర్ధయిషవః ప్రజాః । తా నువాచ మహాతేజాః బ్రహ్మపుత్రః స నారదః 17
కింప్రమాణం తు మేదిన్యాం స్రష్టవ్యస్య తథైవచ । అజ్ఞానాత్తు కథంసర్గం భవన్తః కర్తుముద్యతాః ॥ 18
మహీమానా మథాన్వేష్టుం గతా దక్షసుతా స్తతః । లోకా లోకస్య పరతో గర్భోదస్య తథోపరి ॥ 19
వాయు మండల మాసాద్య భ్రమణా న్నాశమాగతాః । దక్షోఽపి తేషు నష్టేషు వీరిణ్యా మేవ ధర్మవిత్ ॥ 20
సహస్రం జనయామాస పుత్రాణా మపరం తతః । వివర్ధయిషవ స్తేతు శబలాశ్వాః పునః ప్రజాః ॥ 21
పూర్వ ముక్తంవచ స్తద్వై శ్రావితా నారదేనతు అన్యోన్య మూచు స్తే సర్వే సమ్యగాహ మహాన్మునిః ॥ 22
భ్రాతౄణాం పదవీచైవ గంతవ్యా నాత్ర సంశయః । తేఽపి హర్యశ్వమార్గేణ ప్రయాతాః పృథివీ మిమామ్ ॥ 23
తమేవ వాయు మాసాద్య వినష్టాః శాశ్వతీ స్సమాః । తదా ప్రభృతి వైభ్రాంతాః భ్రాతు రన్వేషణే రతాః 24
ప్రయాతో నశ్యతి విభో! తన్నః కార్యం విజానతా ॥ అథ తేషు వినష్టేషు దక్షః కోపసమన్వితః ॥ 25
శశాప నారదం క్రుద్ధః తుల్యం జన్మ న చాప్స్యసి ॥ దేహం త్యక్త్వా స శాపేన తేన దక్షస్య నారదః॥ 26
భూయో మునిసుతో జాతః కశ్యపస్య మహాత్మనః । అశ్వమేధం చ వితతం దక్షస్యాద్భుత కర్మణః ॥ 27
విధ్వంసయామాస హరః పూర్వవైరేణ భావితః । దక్షోఽపి శప్తవాన్ రుద్రం శప్తాస్తే బ్రాహ్మణోత్తమాః ॥ 28
అద్య ప్రభృతి యక్ష్యన్తి నత్వా సార్ధం దివౌకసైః । జన్మాంతరేఽపి వైరాణి వినశ్యన్తి న పార్థివ! ॥ 29

తస్మాద్వైరం న కర్తవ్యం కదాచిదపి కేన చిత్ । హర్యశ్వేష్వపి నష్టేషు మహాత్మసు పురా తదా ॥ 30
అసిక్న్యాం జనయామాస దక్షో దుహితరస్తదా । షష్టిః కన్యా రూప యుక్తాః తపసా మహతా యుతాః॥ 31
ద్వే దదౌ బాహుపుత్రాయ చతస్రోఽరిష్ట నేమినే । ద్వే ప్రాదా త్స కృశాశ్వాయ దశ ధర్మాయ చాప్యథ ॥ 32
చతుర్దశ కశ్యపాయ చాష్టావింశతి మిందవే । ప్రదదౌ బాహుపుత్రాయ సుప్రభాం భామినీం తదా ॥ 33
మనోరమాం భానుమతీం విశాలాం బాహుదా మథ । దక్షః ప్రాదా న్మహా భాగ శ్చతస్రోఽరిష్టనేమినే ॥ 34
స కృశాశ్వాయ చ ప్రాదాత్ సుప్రభాంచ తథా జయామ్ । అరుంధతీం వసుం జామిం లంబాం భాను మిరావతీమ్ ॥
సంకల్పాంచ ముహూర్తాంచ సాధ్యాం విశ్వాం తథైవచ । దదౌ స దశ ధర్మాయ మహాత్మా లోక విశ్రుతః ॥ 36
అదితి ర్దితి ర్దనుః కాలా దనాయుః సింహికా మునిః । కద్రూః క్రోధా ఇరా ప్రాధా వినతా సురభిః ఖగా ॥ 37
చతుర్దశైతాః ప్రదదౌ కశ్యపాయ ప్రజాపతిః । నామభిః పూర్వ విఖ్యాతాః కృత్తి కాద్యాస్తథైవచ ॥ 38
దదౌ నక్షత్ర యోగిన్య అష్టామింశతి మిందవే । దేవతా స్త్వభిమానిన్యో నక్షత్రాణాం మహీపతే! ॥ 39
ఏతావ దుక్తం తవ దక్షవంశ మృక్షోద్భవం చాప్యథ భూమిపాల! ।
అతః పరం కిం కథయామి తుభ్యంతన్మే వదస్వాయత లోహితాక్ష ॥ 40

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే దక్షవంశవర్ణనం నామ దశోత్తర శతతమోఽధ్యాయః

వారు ప్రజాభివృద్ధి సేయుటకిచ్ఛగించగా వారింగని బ్రహ్మ పుత్రుండగు నారదుడు ఇట్లనియె. సృష్టింప వలసిన వస్తువునకు (జగమునకు) ప్రమాణమేమి? ఈ సంగతి నెఱుంగక తాము సృష్టినెట్లుసేయ యత్నించుచున్నారు. అనవిని యా దక్షసుతులు లోకాలోక పర్వత మవ్వలను గర్భోదకమునకు మీద నున్న వాయు మండలము చేరి భూమియొక్క ప్రమాణమును వెదుక వలెనని యేగి ఇట్టట్టు దిరిగి చివరకు నశించిరి. దక్షుడది యెరిగి వీరిణి యందు మరి వేయిమంది కొడుకులం గనెను. వారు శబలాశ్వులు. ప్రజావృద్ధి సేయగోరి ముందటియట్ల నారదుడు పలుక విని మహర్షి చక్కగా జెప్పినాడు. అన్నల దారిని మనమును బోవుదమని యొండొరులు కూడ బలికికొని వారును హర్యశ్వ మార్గమున (సూర్య మార్గములో) నీ పృథివికి వచ్చిరి. చిరకాలము వారటునిటు నన్నల జాడం బరిభ్రమించి యదేవాయువును (వాయుమండలమును) బొంది నశించిరి. అది మొదలు మన పని విన్నవాడు అన్నను వెదకబోవు నాతడు నశించునని యొక తీర్మానము గావించిరి. వారట్లు నశింప దక్షుడు కుపితుడై నారదుని నీవీజన్మముతో సమమైనజన్మము పొందపని శపించెను. ఆశాపముచే నారదుడు దేహము వాసి కశ్యపమునికి కొడుకై పుట్టెను. అద్భుతములెన్నోచేసిన దక్షుడుచేసిన యశ్వమేధమును హరుడు ముందటిపగ గొని ధ్వంసము సేసెను. దక్షుడు ఇంతనుండి దేవతలతో బాటు నన్నెవరు యజింపరు 'నీకు హవిర్భాగమీయ) అని శంకరుని శపించెను. రాజా! జన్మాంతరములందు గూడ వైరములు పోవు. కావున నెప్పుడేని యెవనితోనైన పగ గొనరాదు. హర్యశ్వులు (సూర్య మార్గమంటి వెళ్ళిన దక్ష సంతానము) అట్లు నశింప, దక్షుడాపై అశిక్నియందు చక్కనినాని తపశ్శాలినుల నరువదిమంది కూతుండ్రం గనెను. బాహువు కొడుకున కిద్దరను అరిష్టనేమికి నల్గురను, కృశాశ్వుండను వానికిద్దరిని ధర్మునికి బదిమందిని కశ్యపునకు బదునల్గురను చంద్రుని కిరువది యెనమండుగురును నిచ్చెను. బాహుమన కిచ్చిన కన్యలు సుప్రభ భమిని యనువారు. అరిష్టనీమికిచ్చిన నల్గుర పేర్లు మనోరమ భానుమతి విశాల బాహుదయని. కృశాశ్వునికి సుప్రభ జయ యను వారినిచ్చెను. ధర్మనకిచ్చిన పదిమంది పేర్లు ఆరుంధతి వసువు, జామి లంబ భానువు ఇరావతి సంకల్ప ముహూర్త సాధ్య విశ్వ యనునవి పది. అదితి దితి దనువు కాల దనాయువు సింహిక ముని, కద్రువు, క్రౌధ, ఇర, ప్రాధ, వినత, సురభి, ఖగ అను నీ పదునల్గురను కశ్యపున కిచ్చెను. ఇదివరకే పేర్కొనబడినవారుప్రఖ్యాతులు కృత్తికాదులు నక్షత్ర యోగినులిరువదియెనిమిది మందిని దక్షప్రజాపతి చంద్రునికిచ్చెను. వీరు నక్షత్రాభిమాని దేవతలు. ఇందనుక నీకు దక్ష వంశము నక్షత్ర వంశమును దెలిపితిని. మరియేమి సెప్పవలయుం దెలుపుము.

ఇది శ్రీవిష్ణు ధర్మోత్తర మహాపురాణము ప్రథమ ఖండమున దక్షవంశ వర్ణనమను
నూట పదియవ అధ్యాయము.

# నూటపదునొకండవ అధ్యాయము - భృగువంశాను కీర్తనము

వజ్ర ఉవాచ:-మహాదేవేన ఋషయః శప్తాః స్వాయంభువేఽనరే । తేషాం వైవస్వతే ప్రాప్తే సంభవం మమకీర్తయ ॥
దాక్షాయణీనాంచ తథా ప్రజాః కీర్తయ మే ప్రభో! । ఋషీణాంచ తథా వంశం భృగువంశ వివర్ధన! ॥ 2
మార్కండేయః:-మన్వంతరేఽస్మిన్ సంప్రాప్తే రాజన్! వైవస్వతే పురా । అశ్వమేధేతు వితతే బ్రహ్మణః పరమేష్ఠినః ॥
మహాదేవస్య శాపేన త్యక్త్వా దేహాన్ స్వయం తతః । ఋషయస్తు సముద్భూతాః హుతే శుక్రే ప్రజేప్సయా । 4
దేవానాం మాతరో దృష్ట్వా దేవపత్నీ స్తథైవచ । స్కన్నం శుక్రం మహారాజ! బ్రహ్మణః పరమేష్ఠినః ॥ 5
తజ్జుహావ తతో బ్రహ్మ తతో జాతో హుతాశనాత్। తతో జాతో మహాతేజాః భృగు స్స తపసాం నిధిః ॥ 6
అంగారే ష్వంగిరా జాత స్సభార్యోఽత్రి స్తథైవచ। మరీచేభ్యో మరీచి శ్చ తతోజాతో మహాతపాః ॥ 7
వసుమధ్యా త్సముత్పన్నో వసిష్ఠ శ్చ మహాతపాః। భృగుః పులోమ్నశ్చసుతాం దివ్యాం భార్యా మవిందత॥ 8
యస్యాం తస్య సుతాజాతాః దేవా ద్వాదశ యాజ్ఞికాః। భువనో భావన శ్చైవ సుజన్యః సుజన స్తథా॥ 9
క్రతు స్సువశ్చ పూగశ్చ వ్యాజశ్చ వ్యశ్నుజ శ్చహ। ప్రసవ శ్చావ్యయ శ్చైవ దక్షో ద్వాదశమ స్తథా॥ 10
ఇత్యేతే భృగవో నామ దేవా ద్వాదశ కీర్తితాః। పౌలో మ్యజనయ ద్విప్రం దేవానాం తు కనీయసమ్॥ 11
చ్యవనంతు మహాభాగ మాత్మవ న్తం తథాఽప్యసౌ। ఆత్మవా నాత్మజ స్త్వౌర్వో జమదగ్ని స్తదాత్మజః॥ 12
ఔర్వో గోత్రకర స్తస్య భార్గవానాం మహాత్మనామ్। తత్ర గోత్ర కరాన్ వక్ష్యే భృగోర్దీప్తౌ జస స్త్వహమ్॥ 13

వజ్ర మహారాజు:- స్వాయంభువ మన్వంతరమందు మహాదేవుడు (శివుడు) ఋషులను శపించెను. వారు వైవస్వత మన్వంతము వచ్చినపుడెట్లు జన్మించిరో తెలుపుము. దాక్షాయణుల సంతానము ఋషుల వంశముల గూడ యానతిమ్మన మార్కండేయుడనియె :- మున్ను ఓ రాజా! వైవస్వత మన్వంతరము ప్రవేశింపగా బ్రహ్మ అశ్వమేధము సేసిన తతి మహాదేవ శాపముచే దేహములను విడిచిన ఋషులీమన్వంతర మందు జనించిరి. సంతానార్థియైన బ్రహ్మ దేవమాతలను జూచినంత సంతానాభిలాషచే శుక్రము స్కన్నమయ్యెను. ఆ వీర్యము నతడగ్నియందు వ్రేల్చెను. దాన నగ్ని నుండి మహాతేజస్వి తపోనిధియనగు భృగువుదయించెను. అంగారము (బొగ్గు) లందు అంగిరస్సు పత్నీ సమేతుడై యుదయించెను. అత్రియు నట్లే యావిర్భవించెను. మరీచుల (అగ్నిజ్వాలల) నుండి మరీచి, వసుమధ్య మందుండి వసిష్ఠుడునుదయించెను. భృగువు పులోముని కూతురును దివ్యయను నామెను భార్యగ స్వీకరించెను. ఆమయందాతనికి దేవులు పండ్రెండుగురు కొడుకులు యాజ్ఞికులు జనించిరి. వారి పేర్లు భువనుడు, భావనుడు, సుజన్యుడు, సుజనుడు, క్రతువు, సువుడు, పూగుడు, వ్యాజుడు, వ్యశ్నుజుడు, ప్రసవుడు, అవ్యయుడు, దక్షుడు పండ్రెండవ వాడు. వీరు పండ్రెండుగురు భృగువులు దేవతలని పేరందిరి. భృగు పత్ని పౌలోమి దేవతలలో కనిష్ఠునిగ చ్యవనుడను వానిం గనెను. అతడు మహాభాగుని ఆత్మ వంతుడను వానిని అతడు ఔర్వుని అతడు జమదగ్నినిం గనెను. ఔర్వుడు భార్గవ గోత్రకర్త, మహౌజస్వియిదీపించు భృగువు యొక్క గోత్ర ప్రవర్తకులం దెల్పెద

భృగుశ్చ చ్యవన శ్చైవ ఆత్మవాంస్తు తథైవచ। ఔర్వశ్చ జమదగ్నిశ్చ వాత్స్యో దండిర్నడాయనః॥ 14
నాగాయనో వహేతిశ్చ పేలు శ్చైరాను శాతికః। శౌనకాయస జీవంతిః కౌమోధః పార్ష్ణి స్తథా॥ 15
వైహీనరి ర్విరూపాక్షో రౌహిణ్యాయని రేవచ। వైశ్వానరి రుపారీరు ర్వశా వర్షి ర్వ్యేకా స్వకః॥ 16
విష్ణుః పౌరేయ వాలాకి తేలికేనా స్త భాగినః। మృతబాగేయ మర్కండ జిహితోనేధిన స్తథా॥ 17
మండూ మాండవ్య మండూక స్సేన సాంకృతిన స్తథా। స్థాలి పిండిః శిలావ త్తిః శార్కరాక్షి స్తథైవచ॥ 18

మృకాయణో దేవమతిః షాండరాయిః సిగాలవః। సకృత్వ శ్చాతకిః కాయి ర్యాజ్ఞో దార్భిత్రిలాయనిః॥ 19
గార్గ్యాయణో హ్యాయనశ్చ ఋషిర్గేహాయన స్తథా। గోష్ఠాయనోవాహ్యాయనో వై శంపాయన ఏవచ॥ 20
వైకర్ణేయిః శార్ఙరవో యాజ్ఞెయి ర్భ్రాష్టకాయనః । లలాటిర్ల కుటిశ్చైవ లాక్ష్మాయ్యాః పరిమండలః ॥ 21
ఉలుంబిః శైలుకిః కోష్టిః తథాఽన్యః పైప్పలాయనిః సత్యాయని ర్మాలయనిః కోటాలిః కౌచహ స్తికః ॥ 22
శ్రాక్రిః శాక్లిః స కౌచాక్షిః కౌసి శ్చాంద్రమసి స్తథా । జైక హిమ్షిః జిహ్వ శూన్య వాజ్యలేఢిక వైరిణః ॥ 23
శారద్వతికరే నిత్యా లోష్ఠాక్షిశ్చల వైరిణః । నాగాయని శ్చానుమతిః పౌర్ణభా గధికాశి కృత్ ॥ 24
సమాఖ్యాతా స్తథైతేషాం పంచ తు ప్రవరా మతాః । భృగుశ్చ చ్యవనశ్చైవ ఆత్మవాన స్తథైవచ ॥ 25
ఔర్వశ్చ జమదగ్నిశ్చ పంచైతే ప్రవరా మతాః । పరస్పర మవైవాహ్య ఋషయః పరికీర్తితాః ॥ 26
వాజ్యావాజ్యో న వైవాహ్యః జ్ఞేయా త్రిప్రవరాస్తుతే । భృగుశ్చ జమదగ్నిశ్చ తథైవార్వశ్చ పార్థివః ॥ 27

భృగువు మొదలు కాశివృత్తు వరకు పేర్లు స్పష్టముగా వరుసగా నున్నవి. వీరందరు పంచప్రవరులు. ఆ పంచ ప్రవరులు ఋషులు వరుసగా భృగుచ్యవన ఆత్మ వాన ఔర్వ జమదగ్నులు. ఈ ప్రవరలను వారొండరులు వివాహము సేసికొన రాదు. ఇందు వాజ్యావాజ్యలను ఋషులు త్రిప్రవరవారును వివాహము సేసికొనకూడదు. ఆ ఋషులు భృగువు జమదగ్ని ఔర్వుడు

అతః పరం ప్రవక్ష్యామి శృణు చాన్యాన్ భృగూ ద్వహాన్ । జమదగ్ని ర్విదశ్చైవ పౌలస్త్యో వైజభృ త్తథా ॥ 28
ప్రాచీన యోగ్యో భగవా నృషిః క్రౌంచాయన స్తథా । ఋషిభయ శ్చాజాతశ్చ ఏకాయన వటాయనౌ ॥ 29
ఆత్రేయోఽభిమత శ్చైషాం సర్వేషాం ప్రవరః స్మృతః । భృగుశ్చ చ్యవన శ్చైవ హ్యాత్మవాన స్తథైవచ॥ 30
పరస్పర మవైవాహ్య ఋషయః పరికీర్తితాః । ఋగ్వేదీయా మార్గపథే గ్రామాయణీ రథాయనిః । 31
ఆప స్తంబిః తథా తాల్విర్నైకతిః కంఠిరేవచ । ఆర్ష్టిషేణో గార్దభిశ్చ కార్దమాయణి రేవచ ॥ 32
అశ్వాయని రథాన్నాపి పంచార్షేయాః ప్రకీర్తితాః । పరస్పర మవైవాహ్య ఋషయః పరికీర్తితాః ॥ 33

ఇక మీద భృగుగోత్రముల వారి నితరులను బేర్కొందును వినుము. జమదగ్ని విదుడు పౌలస్త్యుడు వైజ భృత్తు ప్రాచీన యోగ్యుడు క్రౌంచాయనుడు ఋషిభయుడు అజాతుడు ఏకాయనుడు వటాయనుడు. వీరందఱికి నభిమతుడైన ప్రవరుడు ఆత్రేయుడు. భృగుచ్యవన ఆత్మ వానులు ఋషులు వారొకరొకరు పెండ్లి చేసికొనరాదు, ఋగ్వేదీయ శాఖలు గ్రామాయణి ఆయని ఆపస్తంబి తాల్వి, నైకతి, కంఠి, ఆర్ష్టిషేణుడు, గార్దభి, కార్దమాయణి, అశ్వాయని, అన్నద యనువారు పంచార్షేయులు. వారన్యోన్య వివాహా నర్హులు.

యోవిరాథో వీత హవ్యో నాసాథశ్చండమో దమః । జీవం త్యాయనిః మౌద్గశ్చ విలిశ్చైవ ఖలి స్తథా ॥ 34
భావిలి ర్భాగ వి త్తిశ్చ కౌశాంబేయి ర్వృకాశ్చకిః । వాలేయిః సమదా గేయి ర్గారక్షితి రథైవచ ॥ 35
గౌర్గజిశ్చ స వంశాల స్తథా పౌష్ణాయనో మునిః । రోమాదశ్చ తథై తేషా మార్షేయాః ప్రవరామతాః ॥ 36
భృగుశ్చ వీతహవ్యశ్చ తథాచైవ సదేవసః । పరస్పర మవైవాహ్య ఋషయః పరికీర్తితాః ॥ 37
ఖాలాయనిః శాకటాభ్యో మైత్రేయః సాతయ స్తథా । ద్రోణాయనో నౌక్మాయన ఆశిషిశ్చ పికాయనిః॥ 38
హోమజిహ్వ స్తథై తేషాం ఆర్షేయాః ప్రవరా మతాః । భృగుశ్చైవాథ వధ్య్రశ్వో దివోదాస స్తథైవచ ॥ 39
పరస్పర మవైవాహ్యః ఋషయః పరికీర్తితాః । సకాయనో యజ్ఞపతి ర్మధ్య గంధి స్తథైవ చ ॥ 40
ప్రత్యూహశ్చ తథా శ్రౌభ్య క్షోక్షి ర్వైకా దశాయనిః । తథా గృత్సమదో రాజన్ ! శునకశ్చ మహానృషిః ॥ 41
ప్రవర స్తు యథో క్తానాం ద్వ్యార్షేయాః పరికీర్తితాః । భృగుర్గృత్సమద శ్చైవ ద్వ్యాక్షేతౌ పరికీర్తితౌ ॥ 42
పరస్పర మవైవాహ్య ఇత్యేతే పరికీర్తితాః ।

ఏతే తవోక్తా భృగువంశ జాతా మహాను భావా నృపః గోత్రకారాః।
యేషాం నామ్నాం పరికీర్తనేన పాపం సమగ్రం విజహాతి జంతుః ॥ 43

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
భృగువంశాను కీర్తనం నాను ఏకాదశోత్తర శతతమోఽధ్యాయః ॥

యోవిరాధుడు వీతహవ్యుడు నాసాథుడు చండముడు దముడు జీవంత్యాయని మౌద్గుడు విలి ఖలి ఖావిలి భాగవిత్తి కౌశాం చేయి వృక చవి బాలేయి మముద గేయ గౌర క్షితి గార్గజి సవంశాల పౌషాయన రోమాదులును ఋషుల ప్రవరలు. భృగువు వీత హవ్యుడు సదైవసుడు నను వారును ప్రసిద్ధ ప్రవరులు. వీరొకరి కొకరు పెండ్లి చేసికొన గూడదు. ఖాలాయని మైత్రేయుడు శాకటుడు యజ్ఞ పతి మత్యగంధి ప్రత్యూహుడు, శౌభ్యాక్షి, వైకాదశాయని గృత్స మదుడు శునకుడు ప్రవరులుగ పేర్కొన బడిరి. ఈ నీ ఋషుల ప్రవరలు వివాహాదులం గలియరాదు. వీరు భృగు గోత్ర కర్తలు వీరిని నామకీర్తనము పాపహరము.

ఇరి శ్రీ విష్ణుధర్మోత్తర మహాపురాణమన ప్రథమ ఖండమున భృగు వంశాను కీర్తనము
నూట పదునొకండవ అధ్యాయము.

## నూటపండ్రెడవ అధ్యాయము - అంగిరోవంశాను కీర్తనము

మార్కండేయః : మరీచితనయా రాజన్ః సురూపానామ విశ్రుతా। భార్యాహ్యాంగిరసో దివ్యా యస్యాః పుత్రా దశస్మృతా
ఆత్మా హ్యాయు ర్మను ర్దక్షో మదః ప్రాణ స్తథైవచ । హవిష్మాం శ్చాగ విష్ణశ్చ ఋతఃసత్యశ్చ తే దశ ॥ 2
ఇత్యేతేఽంగిరసో నామ దేవా వై సోమపీథినః । సురూపా జనయామాస ఋషీన్ సర్వేశ్వరా నిమాన్ ॥ 3
బృహస్పతిం గౌతమంచ సంవర్తంచ మహాఋషిం। ఆయస్యం వామదేవంచ ఉతథ్య ముశిజం తథా ॥ 4
ఇత్యేతే ఋషయ స్సర్వే గోత్రకారాః ప్రకీర్తితాః । తేషాం గోత్ర సముత్పన్నాన్ గోత్రకారా న్నిబోధః మే ॥ 5
ఉతథ్యో గౌతమశ్చైవ తైలజోఽభిజితి స్తథా । బౌద్ధి నైషిః సతౌగాక్షిః క్షీరోజో టాంకి లేవచ ॥ 6
రాహోహకిః సౌపురిశ్చ కైరతిః శారి తామకిః । పౌణ్యజీ ర్భాను భావ శ్చ ఋషిశ్చైవ బడౌబడః ॥ 7
కరాటకశ్చ మాచీయః ఉపబిందు రథైషిణిః । రౌహిణ్యాయని జార్గాలిః క్రోష్టా చైవారుణాయనిః ॥ 8
సోమో డాయని కాశేకః కౌటిల్యః పార్థివ స్తథా । రౌహిణ్యాయని రౌవాయు ర్మూలయోవాంశురేవచ ॥ 9
తథాచ గుల్మయో వాంశు స్తంబయోషాంశు రేవచ । కావాక్షిః పుష్పథ శ్చైవ క్షీర కారండి రేవచ ॥ 10
క్షపాది శ్చ కరేరిశ్చ పారికారీరి రేవచ । ఇత్యార్షేయాస్తు సర్వేషాం ప్రవరాః పరికీర్తితాః ॥ 11

మార్కండేయుడనియె :- మరీచి కూతురు సురూప యంగిరసుని భార్య. ఆమె కుమారులు పది మంది. ఆత్మ, ఆయువు, మనువు, దక్షుడు. మదుడు, ప్రాణుడు, హవిష్మంతుడు, చాగవిష్ణుడు, ఋతుడు, సత్యుడునను వారు. సోమపీథులుసురూప మఱియు నీ క్రింద నుదాహరింప బడిన ఋషులను సర్వేశ్వరులనుం గనియె. (ఇక్కడ సర్వేశ్వరులనగా అణిమాది యోగ విభూతులు. గలవారని చెప్పనగును.) వారు బృహస్పతి గౌతముడు సంవర్తుడు అయస్యుడు వామదేవుడు ఉతథ్యుడు ఉశిజుడు నను వారు. వీరందరు గోత్ర కర్తలుగా పేర్కొనబడిన వారు. వారి గోత్రములం దుద్భవించిన గోత్రకర్తలనిదె తెలియుము. ఉతథ్యుడు గౌతముడు తైలజుడు అభిజతి బౌద్ధినైషి లౌగాక్షి క్షీరోజుడు టాంకి రాహో హరి సౌపురి కైరతి శారిలామకి పౌణ్యజి భాను బాపుడు బడోబడుడు కరాటకుడు మాచీయుడు ఉపబిందువు ఏషిణి రౌహిణ్యాయని జార్గాలి క్రోష్ట ఆరుణాయని సోముడు డాయనిదేకుడు కౌటిల్యుడు పార్థివుడు రౌహిణ్యాయని ఔవాయువు మూలయోవాంశువు గుల్మయోవాంశవు, స్తంబయోషాంశువు కావాక్షి పుష్పథుడు క్షీరకారండి క్షపాది కరేరి పారికారీరియునని యీ ఆర్షేయప్రవరులు పేర్కొనబడిరి.

అంగిరాశ్చ తథోతథ్యో మునిర్దీర్ఘ తపా స్తథా । పరస్పర మవై వాహ్యా ఇత్యేతే పరికీర్తితాః ॥ 12
ఉష్టాజిష్ట అయస్యశ్చ కక్షీవాన్ గౌతమ స్తథా । ఇత్యేయాః ప్రవరా శ్చైవ తేషాంచ ప్రవరాన్ శృణుః ॥ 13
అంగిరశ్చ తతోతశ్చ ఉపాజిశ్చ మహాన్ ఋషిః । సౌమ స్తంభి ర్వితంభిశ్చ సాలుభి ర్వాలుభి స్తథా ॥ 14
భారద్వాజిః సౌబుద్ధిశ్చ మేఘి దేవమతీ స్తథా । అత్ర్యయాయణ సౌవిష్ట్యో హ్యగ్నివేశః శలాధలిః ॥ 15
వాలిశేయని శ్శేకేయి వారాహి ర్వాకలి స్తథా । శాటిశ్చ ఋషివర్ణశ్చ ప్రావాహి శ్చాశ్వలాయనిః ।
పరస్పర మవై వాహ్యాః ఋషయః పరికీర్తితాః । 16
కావాకిశ్చ సభాకాయి స్తథా చాంశుమతిః ప్రభుః ॥ భావీ క్లైయారి నై భుల్విః పుష్పాన్వేషీ తథై వచ ॥ 17
బాధ్యో విచ్ఛింది శాటికిః భారగ్రీవి స్తథైవచ । దేవద్యారి ర్దేవస్థాని ర్హరికర్ణిః సంభ్రాగికః ॥ 18

అంగిరుడు ఉతథ్యుడు దీర్ఘతపుడునను ఋషుల గోత్రములు పరస్పరము వివాహము చేసికొనరాదు. ఉష్టాజిష్టుడు అయస్యుడు కక్షీవంతుడు గౌతముడు ననువారు ఆర్షేయ ప్రవరులు, వారి ప్రవరులను వినుము అంగిరుడు ఉపాజుడు సౌముడు తంభి వితంభి సాలుభి వాలుభి భారద్వాజి సౌబుద్ధి మేఘి దేవమతి అత్ర్యయాయణుడు సౌవిష్టుడు అగ్ని వేశుడు శలాథవి వారి శేయని శేకేయి వారాకా వాకలి శాటి ఋషివర్ణుడు ప్రావాహి ఆశ్వలాయని యను ఋషులు పరప్పర వివాహములు సేసికొనరాదు. కావాకి సభాకాయి అంశుమతి ప్రభువు భావి క్లైయారి నైభువి పుష్పాన్వేషి బాధ్యుడు విచ్ఛింది శాటూకిభారగ్రీవి దేవాద్యారి దేవస్థాని హరికర్ణి సభాంగికుడు.

ధౌవాయిః సాభిముగ్రిశ్చ తథా గోమద గంధికః । మాత్స్య క్వాథః సాలహరో హ్యాలో హార స్తథైవచ ॥ 19
గాగౌదయిః కౌతపతిః కారుక్షేత్రి స్తథైవచ । తాటాకి ర్జైన్యద్రోణిశ్చ జై బాలాయని రేవచ ॥ 20
అప స్తథర్మోజహృష్టిః కార్ష పింగలి రేవచ । పౌలశ్చైవ ంగిమహాతేజాః శంకిలాయని రేవచ ॥ 21
ఆర్షేయో నామతశ్చైషాం సర్వేషాం ప్రవరో నృప! । అరాః ప్రవర స్తేషాం ద్వితీయశ్చబృహస్పతిః ॥ 22
తృతీయశ్చ భరద్వాజః ప్రవరాః పరికీర్తితాః । పరస్పర మవై వాహ్య ఇత్యేతే పరికీర్తితాః ॥ 23

ధౌవాయి సాభిముగ్రి గోమదగంధికుడు మాత్స్య క్వాథుడు సాలహరుడు ఆలోహారుడు గాగౌదయ యితపతి కౌరుక్షేత్రి తాటాకి జైన్యద్రోణి జైబాలాయని ఆపస్తధర్ముడు జృహష్టి కార్ష్ణపింగలి పౌలుడు శంకలాయని అనువీరందరి పేర ఋషి ప్రవరలు ప్రసిద్ధములు. అందు అంగిన్సు బృహస్పతి భరద్వాజుడు ననువారివి మూడు ప్రవరుంవారు పరస్పరము వివాహము సేసికొనరాదు.

కాణాయనాః కౌషయవా స్తథా వాత్స్య పరాయణాః । భ్రాష్టకృద్ భ్రాష్టవిందీచ నేంద్రా లి స్సయకాయనః ॥ 24
క్రౌడిః శాక్రీ చ కార్షిచ తాలకృ ద్మాధురా వతాః । లువ కృ ద్భాల విప్రేషో మర్కటః పైలుకాయనః ॥ 25
మృత్సం శశ్చ తథా చాక్రీ గర్గః శ్యామాయని స్తథా । వాలలిః సాహరిశ్చైవ పంచార్షేయాః ప్రకీర్తితాః ॥ 26
అంగిరాసు మహాతేజాః దేవాచార్యో బృహస్పతిః । భరద్వాజ స్తథా గర్గ శ్చైత్యశ్చ భగవాన్నృషిః ॥ 27
పరస్పర మవైవాహ్యా ఋషయః పరికీర్తితాః । కపీతరః స్వస్తితరో దర్భః శకిః పతంజలిః ॥ 28
భూయసీ జల సంధిశ్చ బిందు దండిః కుశీతకిః । భృగుసు రాజకేశీచ శౌంబాటిః శాంశిబి స్థా ॥ 29
శాలిశ్చ శకలః కాణ్వో మునిః కేరీరయి స్తథా । కాద్యో వాధ్యాయని శ్చైవ సావస్యాయని రేవచ ॥ 30
త్ర్యార్షేయో నామత స్తేషాం ప్రవరో భూమిపో త్తమ । అంగిరా దమ వాహ్యాశ్చ తథా చైవా ప్యతత్ క్షయః ॥ 31
పరస్పర మవైవాహ్యాః సర్వ ఏవ ప్రకీర్తితాః । సకృతిశ్చత్రి మార్షిశ్చ శేధూః శైషవిరేవచ ॥ ॥ 32
తండిశ్చ జానకి శైవ తైలకాద్రవ్య ఏవచ । నారాయణి శ్చార్షభి శ్చ లౌక్షిర్గార్గి ర్హాల స్తథా ॥ 33
గాలవి శ్చాపి త్ర్యార్షేయః సర్వేషాం ప్రవరామతాః । అంగిరా సకృతి శ్చైవ గారిపీతి స్తథైవచ ॥ 34

పరస్పర మవైవాహ్యాః ఋషయః పరికీర్తితాః । కాణ్వాయనో హరితకః కౌత్స్యః పౌగ్య స్తథైవచ ॥ 35
హస్తిదమో వాత్స్యమాలి ర్మాంద్రి ర్గాలి ర్గవేరణః । భీమవేశ శ్శాంఖ్య దర్భి స్సర్వే త్రిప్రవరా మతాః ॥ 36

కాణాయనులు కౌషయవులు వాత్స్య పరాయణులు భ్రాష్ట్రి కృత్తు భ్రాష్ట్రివింది నేంత్రాలి సయకాయణుడు క్రౌడి శాక్రి కార్షి తాలకృత్తు మాధురావతులు లాపకృత్తు బాలవిక్షేపుడు మర్కటుడు పైలు కాయణుడు మృత్సంశుడు చాక్రి గర్గుడు శ్యామాయని వాలవి సాహరి యనువారు పంచార్షేయులన బడుదురు. మహాతేజవ్వి అంగిరస్సు దేవగురువు బృహస్పతి భరద్వాజుడు గర్గుడు చైత్యుడు నను ఋషి గోత్రముల వారు పరస్పరము పెండ్లి చేసుకొనరాదు. కపీతరుడు స్వస్తితరుడు దర్భుడు శక్తి పతంజలి భూయసి జలసంధి బిందుదండి కుశీతకి భృగువు రాజకేశి శౌంబాటి శాంశిబి శాలి శకలుడు కాణ్వుడు కేరీరయి కౌద్యుడు వాధ్యాయని సావస్యాయని అను వారు త్ర్యార్షేయ ప్రవరలవారు. అంగిరుడు దమవాహ్యుడు అతత్క్షయుడునను ఋషి గోత్రముల వారు పరస్పరము వివాహమాడకూడదు.

సకృతి త్రిమార్షి శేధువు శైపవి తండి జానకి తైలకుడు ద్రవ్యుడు నారాయణి ఆర్షభి లౌక్షి గార్గి హలుడు గాలవియు నను నందరి ప్రవద త్ర్యార్షేయము. అంగిరస్సు సంకృతి గౌరవియను ఋషులవారు పరస్పరము వివాహమాడరాదు. కౌణ్వాయసుడు హరితకుడు కౌత్స్యుడు పౌగ్యుడు హస్తి దమఌడు వాత్స్యమాలి మాంద్రి గాలి గరేరణుడు భీమవేశుడు శాంఖ్యదర్భి యనువారు ప్రవరులు. ముగ్గురు ఋషుల వారన్నమాట.

అంగిరాస్తు తమస్యశ్చ పురుకుత్స స్తథైవచ । కుత్సాః కుత్సై రవైవాహ్యాః ఏవమాహుః పురాతనాః ॥ 37
రథీతరణాం ప్రవరాః త్ర్యార్షేయాః పరికీర్తితాః । అంగిరాశ్చ స్వరూపాశ్చ తథైవచ రథేతరః ॥ 38
రథేతరా అవైవాహ్య నితరాశ్చ రథేతరైః । విష్ణు వృద్ధిః శగేమద్రి ర్ఙత్రిణః కర్త్రిణ స్తథా ॥ 39
ప్రడివశ్చ మహాతేజా స్తథా చైవ పరాయణః । త్ర్యార్షేయశ్చ మత స్తేషాం సర్వేషాం ప్రవరశ్శుభః ॥ 40
అంగిరాశ్చ విరూపాశ్చ పృషదశ్వ స్తథైవచ । పరస్పర మవైవాహ్యాః ఇత్యేతే పరికీర్తితాః ॥ 41
సాంత్య సుగ్ధి ర్మహ్వా తేజాః హిరణ్యస్తంబి ముద్గలౌ । త్ర్యార్షేయోஉపి మతశ్చైషాం సర్వేషాం ప్రవరో నృప ॥ 42
అంగిరా గృత్సదశ్యశ్చ ముద్గలశ్చ మహా తపాః । పరస్పర మవైవాహ్యాః ఇత్యేతే పరికీర్తితాః ॥ 43
మోహజిహ్వో దేవజిహ్వో అగ్నిజిహ్వ విరాడయః । అపానేయస్త్ర్యగ్నయశ్చ వైరిణ్యాస్తావిమౌద్గలాః ॥ 44
త్ర్యార్షేయోஉపి మతశ్చైషాం సర్వే షాం ప్రవరశ్శుభః । అంగిరాశ్చైవ తావిశ్చ మౌద్గల్యశ్చ నుహాతపాః ॥ 45
పరస్పర మవైవాహ్యాః ఋషయః పరికీర్తితాః । ఉరుండశ్చ ఖురుండశ్చ తృతీయః శాకటాయనః ॥ 46
తతః ప్రాగథమోనారీ నుర్కటో రమణః శణః । కాణ్వ మార్కటయశ్చైవ తథా రామవణో ముచిః ॥ 47
శ్యామాయన స్తథైతే షాంత్ర్యార్షేయః ప్రవరోమతః । అంగిరాశ్చాజ మీఢశ్చ కాణ్వాశ్చైవ మహాతపాః ॥ 48
పరస్పర నువైవాహ్యాః ఋషయః పరికీర్తితాః । తిత్తిరిః కపి భూశైవ గార్గ్యశ్చ వమహా నృషిః ॥ 49
పరస్పర మౌవైవాహ్యాః ఋషయః పరికీర్తితాః । ఆర్షేయో నామత శ్చైషాం సర్వేషాం ప్రవరశ్శుభః ॥ 50
అంగిరా స్తిత్తిరి శ్చైవ కపిభూశ్చ మహాన్ ఋషిః । పరస్పర నువైవాహ్యాః ఋషయః పరికీర్తితాః ॥ 51
అంగిరాః స భరద్వాజో ఋషి ర్వాందనవ స్తథా । 52
బృహస్పతి ర్మైత్రవచాః పంచార్షేయాః ప్రకీర్తితాః । అంగిరా స్సభరద్వా స్తథా చైవ బృహస్పతిః ॥ 53
ఋషిర్మిత్రవచశ్చైవ ఋషిర్వాందనవ స్తథా । పరస్పర మవైవాహ్యాః ఋషయః పరికీర్తితాః ॥ 54
భారద్వాజః కటాశౌంగః శైశిరేయ స్తథైవచ । ఇత్యేతే కథితా స్సర్వే ద్వ్యాముష్యాయణ గోత్రజాః 55
పంచాగ్నేయాః తథాஉప్యేషాం ప్రవరాః పరికీర్తితాః । అంగిరా స్సభర ద్వాజ స్తథైవచ బృహస్పతిః ॥ 56

సౌంగళ్చ శైశవిశ్చైవ ప్రవరాః పరికీర్తితాః । పరస్పర మవైవాహ్యాః ఋషయః పరికీర్తితాః ॥ 57
ఏతే తవోక్తాంగిరసస్తువంశే సుహానుభావా నృప! గోత్రకారాః । యేషాంచ నామ్నాం పరికీర్తనేన
పాపం సమగ్రం పురుషోజహాతి ॥ 58

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే అంగిరసో వంశానుకీర్త వర్ణనం నామ ద్వాదశాధిక శతతయోఽధ్యాయః

అంగిరసుడు తమస్యుడు పురుకుత్సుడు ననువారుకుత్స్యులు. వీరు కుత్సస గోత్రులతో వివాహము సేసి కొనరాదు. రథీతరుల ప్రవరలు త్ర్యార్షేయులు. అంగిరస్సు స్వరూపులు రథీతరుడు.

విష్ణువృద్ధి శగేమద్రి జత్రిణుడు క్రత్రిణుడు ప్రడిపుడు పరాయణుడు నను వారిది త్రార్షేయప్రవర. అంగిరస్సు విరూపుడు పృషదశ్వుడు నను వారు పరస్పరము పెండ్లి చేసికొనరాదు. సాంత్యసుగ్ది హిరణ్యస్తంబి ముద్గలుడునను వారు త్ర్యార్షేయులు. అంగిరస్సు గృత్సదశ్వుడు ముద్గలుడు ననువారును పరస్పరమునవివాహానర్హులు మోహజిహ్వుడు దేవజిహ్వుడు అగ్నిజిహ్వుడువిరాడి అపానేయులై త్ర్యగ్నులు కైరిణ్యులు తావి మేద్గలులు నను వారి ప్రవర త్ర్యార్షేయము. అంగిరస్సు తావి మేద్గల్యుడు నను ఋషులు వివాహములనం గలియరాదు. రుండద ఖురుండుడు శాకటాయనుడు ప్రాగథముడు నారి మర్కటుడు రమణుడు శణుడు కాణ్వులు మాస్కటులు రామణుడు శ్యామాయనుడు నను వారి ప్రవర త్ర్యార్షేయము. అంగిరస్సు అజమీఢుడు కాణ్వుడు ననువారు పరస్పరము పెండ్లి సేసి కొనరాదు. తిత్తిరి కపిభువు గార్గ్యుడు నను ఋషులు పరస్పర వివాహముచితము గాదు. వీరి పేరిట ఆర్షేయ ప్రవర శుభద్రము. అంగిరస్సు తిత్తిరి కపిభువు నను వారు పరస్పర వివాహ మాడరాదు. అంగిరస్సు భరద్వాజుడు వాందనవుడు బృహస్పతి మైత్రవచుడు నను వారి పంచార్షేయులు. అంగిరస్సు భరద్వాజుడు. బృహస్పతి మిత్రవచుడు వాందనవుడు నను వారు పరస్పర వవివాహా నర్హులు. భారద్వాజుడు కలాశౌంగుడు శైశిరేయుడు నను వీరు ద్వాముష్యాయణ గోత్రులు. అనగా ఇద్దరు ఋషుల వారన్న మాట. పంచాగ్నేయుల ప్రవరలు నట్లే యిద్దరి ఋషుయి గలవని చెప్పబడినవి. అంరస్సు భరద్వాజుడు బృహస్పతి సౌంగుడు శైశవి యను ప్రవరల వారు పరస్పరము వివాహ మాడరాదు. అంగిరస వంశమందలి గోత్రకర్తల యుక్క ప్రవలివి నీకేతింగిచితినో రాజా! వారి నామ సంకీర్తనముచే మానవు డెల్ల పాపముం బాయును.

ఇది శ్రీ విష్ణుధర్మోత్తర మహాపురాణమునందు ప్రథమఖండమున అంగిరోవంశాను కీర్తనము
నూటపండ్రెండవ అధ్యాయము.

## నూటపదమూడవ అధ్యాయము - అత్రివంశాను కీర్తనము

మార్కండేయఉవాచ:- అత్రివంశ సముద్భూతాన్గోత్రకారాన్ని బోధమే । కర్ప్వారాయణ శాఖేయా స్తథా శారాహణాశ్చయే॥
శైవాలకీ శౌనవర్ణిరఘో సౌద్రుతయశ్చయే । గౌరగ్రీవ స్సకారంజి రథ మైత్రాయణాశ్చయే ॥ 2
అత్మయన్యా నామరథ్యా గోపనాస్తాకి బిందవః । హ్వానజిద్బాహు రింద్రోవి రైద్రాలికి శాకటాయనః ॥ 3
తైతీయశ్చైవ జాతీయ శ్చాత్రిగౌణీ మత్తి స్తథా । జలదోభాగపాదశ్చ సౌపుష్పిశ్చ మహాతపాః ॥ 4
ఛాందోగేయ స్తద్వైతే షామార్షేయః ప్రవరోమతః । ధ్యారాశ్వాశ్చత ధాతిశ్చ ఋచనానసంఏవచ ॥ 5
పరస్పరమ వైవాహ్య ఋషయః పరికీర్తితాః । దక్షిర్బాలిః పాలకృచ్చ జార్ణనాభిః సిలిర్మిలిః ॥ 6
భీజవాపీ శిరీషశ్య మౌంజకేశి గవిష్ఠిరా ॥ బలంధన స్తద్వై తేషాంత్ర్యార్షేయః ప్రవరో మతః ॥ 7
అత్రిర్గవిష్ఠిరశ్చైవ తథా పూర్వాతిథిః స్మృతాః । పరస్పరమవైవాహ్యాః ఋషయః పరికీర్తితాః ॥ 8
ఆత్రేయాన్పుత్రికా పుత్రాన్నత ఊర్ధ్వం నిబోధమే । హాలేయశ్చ సవాతీయో నామమథ్య స్తద్వై వచ ॥ 9

గోత్రేయశ్చైవ గోత్రేయాః త్ర్యార్షేయాః పరికీర్తితాః । అత్రిశ్చవామరథ్యశ్చ పౌత్రిశ్చైవమహానృషిః 10
పరస్పర మవైవాహ్యాఋషయః పరికీర్తితాః । ఇత్యత్రి వంశ ప్రభవా స్తవోక్తా॥ మహానుభావా నృప! గోత్రకారాః॥ 11
యేషాంతునామ్నాం పరికీర్తనేన । పాపం సమగ్రం పురుషో జహాతి ॥

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే అత్రివంశాను కీర్తనం నామత్రయోదశాధిక శతతమోఽధ్యాయః

మార్కండేయుడనియె. అత్రివంశీయులగు గోత్ర కర్తల నిక దెలియుము. వారు కర్ద్వాయణ శాఖేయులు శారాహణులు శైవాలకులు శౌనవర్ణులు రఘో సాత్రుతులు నను పేరనున్నవారు. గౌరగ్రీవుడు సకారంజి మైత్రాయణులు ఆత్మయన్యులు వామరథ్యులు గోపనులు తాకిబిందులు హ్వానజిత్తు బాహువు ఇంద్రోవి ఐంద్రాని శాకటాయనుడు తైలేయుడు బౌలేయుడు అత్రిగౌమణితి జలదుడు భగపాదుడు సౌపుష్పి ఛాందోగేయుడు నను నీ ఋషుల ప్రవర చెప్పబడినది. ధ్యారాశ్వులు అత్రి ఋచనాకానసుడు ననువీరు పరస్పర వివాహమాడ తాదు. దక్షి బలి పాలకృత్తు జౌర్ణనాభి సిలి మిలి బీజవాపి శిరీషుడు మౌంజకేశి గవిష్ఠిరుడు బలంధనుడు ననువారి ప్రవర త్ర్యార్షేయము. అత్రి గవిష్ఠిరుడు పూర్వాతి యనువారు పరస్పర వివాహమాడరాదు. ఆత్రేయుల పుత్రికాపుత్రుల నిక నావలన వినుము. హాలేయుడు సరాలేయుడు వామమథ్యుడు గోత్రేయుడు నను నీ గోత్రములవారు త్ర్యార్షేయులు. అత్రి వామరథ్యుడు పౌత్రియు ననువారు పరస్పరము వివాహమాడరాదు. అత్రి వంశీయులు మహానుభావులు గోత్ర కర్తలు వేరిని నీకుదెల్పితిని. వీరి నామ సంకీర్తనముచే మానవుడు సర్వపాపమును వీడును.

ఇది శ్రీ విష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున అత్రి వంశాను కీర్తనమను నూటపదమూడవ అధ్యాయము.

## నూటపదనాల్గవ అధ్యాయము - విశ్వామిత్ర వంశాను కీర్తనము

మార్కండేయ ఉవాచ :- అత్రే రేవాపరం వంశం తవ వక్ష్యామి పార్థివ! ।
ఆత్రేః సోమ స్సుతః శ్రీమాం స్తస్య వంశోద్భవో నృపః ॥ 1
విశ్వామిత్రస్తు తపసా బ్రాహ్మణ్యం సమవాప్తవాన్ । తస్యవంశ మహంవక్ష్యే తన్మే నిగ దతః శృణు ॥ 2
విశ్వామిత్రో దేవరాత స్తథా చేకితి గాలవౌ । వతండశ్చ శలంగశ్చ తథా చాశ్వాత తాయనః ॥ 3
శ్యామాయనో యాజ్ఞవల్క్య జాబాలిః సైంధవాయనః । దాభ్రవ్యాశ్చ కారీషీచ సౌశ్రుత్యా అథసౌశ్రుతాః 4
ఔలూపా ఔపగవయః పాణ్యోదర యమాంచయః । ఖరబాధా వహలయః పాణతంబః సకౌశికాః ॥ 5
త్ర్యార్షేయాః ప్రవరా స్తేషాం సర్వేషాం పరికీర్తితాః । విశ్వామిత్రో దేవరాతః ఉద్దాలశ్చమహాయశాః ॥ 6
పరస్పరమవైవాహ్యా ఋషయః పరికీర్తితాః । మార్గమిత్రా స్త థాద్యాశ్చ మాధుచ్ఛందస ఏవచ ॥ 7
త్ర్యార్షేయాః ప్రవరా స్త్వేతే ఋషయః పరికీర్తితాః । విశ్వామిత్ర స్తథా జ్యేష్ఠో మధుచ్ఛందా స్తథైవచ । 8
పరస్పర మవైవాహ్యా ఋషయః పరికీర్తితాః । ధనంజయః కపర్దేయః పరికుష్టశ్చ పార్థివా ॥ 9
పాణినిశ్చైవ త్ర్యార్షేయాః సర్వవతే ప్రకీర్తితాః । విశ్వామిత్రో మధుచ్ఛంద స్తథా చైవాఘమర్షణః ॥ 10
పరస్పరమవైవాహ్యా ఋషయః పరికీర్తితాః । కామలాయనిజాశ్చైవ ఆశ్మరథ్యా స్తథైవచ ॥ 11
బంధులిశ్చైవ త్ర్యార్షేయాః సర్వేషాం ప్రవరా మతాః ॥ విశ్వామిత్రశ్చాశ్మ రథో బధులిశ్చమహాతపాః ॥ 12
పరస్పరమవైవాహ్యాః ఋషయః పరికీర్తితాః । పూరణాః పరిధాప స్తః ద్వ్యార్షేయాః పరికీర్తితాః ॥ 13
విశ్వామిత్రః పూరణశ్చ తయోర్ద్వౌ ప్రవరౌస్మృతౌ । పరివర్తా అవైవాహ్యాః పూరణాశ్చ పరస్పరమ్ ॥ 14

లోహితా అష్టకాశ్చైవ త్ర్యార్షేయాః పరికీర్తితాః । విశ్వామిత్రో లోహితశ్చ అష్టకశ్చమహాతపాః ॥ 15
అష్టకా లోహితైర్నిత్య మవైవాహ్యాః పరస్పరమ్ । ఉదరేండః కంథకశ్చ ఋషిశ్చొదావహి స్తథా ॥ 16
త్ర్యార్షేయోఽ పి మత శ్చైషాం సర్వేషాం ప్రవరః శుభః । ఋణవాన్రృథితశ్చైవ విశ్వామిత్ర స్తథైవచ ॥ 17
పరస్పర మవైవాహ్య ఋషయః పరికీర్తితాః ఔదుంబరిశ్శశి రటి ర్ఋషి సార్ష్యాయణ స్తథా ॥ 18
త్రైకాయని సైకాయని స్తార్ష్యాయణి రథైవచ । కాత్యాయనిః కరీరామిః శాలంకాయ నిలావకీ ॥ 19
మౌంజాయనిశ్చ భగవాంస్త్రార్షేయాః పరికీర్తితాః । కిలిః కలి స్తథా విద్వాన్ విశ్వామిత్ర స్తథైవచ ॥ 19
పరస్పర మవైవాహ్యాః ఋషయః పరికీర్తితాః ॥
ఏతే తవోక్తాః కుశికా నరేంద్ర! । మహానుభావాః సతతం ద్విజేంద్రాః ।
యేషాంతు నామ్నాం పరికీర్తనేన పాపం సమగ్రం పురుషోజహాతి ॥ 20

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే విశ్వామిత్ర
వంశాను కీర్తనంనామ చతుర్దశాధిక శతతమోఽధ్యాయః

మార్కండేయుడనియె: అత్రియొక్క యింకొక వంశమును నీకుదెల్పెదను. అత్రి కొడుకు శ్రీమంతుడుసోముడు. (చంద్రుడు). వాని వంశజుడు విశ్వామిత్రుడు తపస్సుచే బ్రాహ్మణ్యము నందినవాడు. అతని వంశమిదెతెల్పెద. వినుము. విశ్వామిత్రుడు దేవరాతుడు చేకిత గాలవుడు వతండుడుశలంగుడు అశ్వాత ఆశ్వాతతాయనుడు శ్యామాయనుడుయాజ్ఞవల్క్యుడు జాబాలిసైంధవాయనుడు. దాభ్రువ్యుడు కాదీషి సౌశ్రుత్యులు జౌలూమలు సౌశ్రుతులు జౌపగవులు పాణ్యోదరులు ఖర బాధులు వహలులు పాణితంబులు కౌశికులు. వీరు త్రార్షేయ ప్రవరుల్యుక్ష విశ్వామిత్రుడు దేవరాతుడు ఉద్దాలుడు నను వీరు పరస్పర వివాహ మాడరాదు. మార్గమిత్రులు మాధుచ్ఛందుసులు ననువారుత్ర్యాషేయులు. విశ్వామిత్రుడు జ్యేష్టుడు మధుచ్ఛందులు పరస్పరవివాహమాడరాదు. ధనంజయుడు కపర్దేయుడు పరికుష్టుడు పాణినియు వీరెల్లరు త్రార్షేయులు. విశ్వామిత్రుడు మధుచ్ఛందుడు అఘమర్షణుడు నను వీరు పరస్పరము పెండ్లాడరాదు. కామలాయనిజులు ఆశ్మరథ్యులు బంధులి యనువారు త్ర్యాషేయ ప్రవరులు. విశ్వామిత్రుడు అశ్మరథుడు బంధులియు పరస్పర వివాహ నర్హులు. పూరణులు పరిధాపంతులు ద్వ్యాషేయులు (ఇద్దరు ఋషులవారు) విశ్వామిత్రము పూరణుడు ననువారు ప్రవరులు రెండు పరివర్తులు పూరణులు పరస్పర వివాహ మాడరాదు లోహితులు అష్టకులు త్ర్యాషేయులు. విశ్వామిత్రులు లోహితుడు అష్టకుడు (మహాతపస్వి) నను వారి ప్రవరలు గలవారు అష్టకులు లోహితులతో పెండ్లి సేసికొనరాదు. ఉదరేండుడు కంథకుడు జౌదావహి యనువారు త్ర్యార్షేయ ప్రవర. ఋణవంతుడు రథితుడు విశ్వామిత్రుడు పరస్పర వివాహ నర్హులు. జౌయంబరుడు శౌరిరటి తార్ష్యాయణి కాత్యాయని కరీరామి శాలంకాయని లావకి మేంజాయనియు త్రైవాయని త్రైవాయని, తార్క్మణయణ త్రాషేయులు. కిలికవి విశ్వామిత్రుడు ననువీరు పరస్పర వివాహ మనిషిద్ధులు. వీరు కుశిక వంశ మహానుభావులు. వీరి నామ కీర్తనము పాపహరము.

ఇది శ్రీ విష్ణు ధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున విశ్వామిత్ర
వంశాను కీర్తనమను నూట పదునాల్గవ అధ్యాయము.

## నూటపదునైదవ అధ్యాయము - కశ్యపవంశాను కీర్తనము

మరీచేః కశ్యపః పుత్రః కశ్యపస్య తథా కులే । గోత్రకారావృన్వషీక్ష్యే తేషాం నామా ని మేశృణు ॥ 1
ఆగ్రాయణా ఋషగణా మేష కౌరిటికాయనాః । గురుత్రవజీ మాఠరశ్చ గోజావిరథలక్ష్మణః ॥ 2
శాలాహలేయాః కౌరిజ్యా శ్చైకన్యాశ్చసురాయణాః । మందాన్యావై మృగయనో శ్రౌతసో భౌసతాయనాః ॥ 3
దేవయాతా గోపయాతా అథోచ్ఛాయతయశ్చయే । తాకయానాశ్చి త్రహయా అభిర్యోగా గదాయనాః ॥ 4

క్రాతువందిర్మహాచక్రిర్దాక్షపాణయ ఏవచ । గ్రీవాయణా హర్కిరయో హాస్తి దాసా స్తథైవచ ॥ 5
వాత్స్యో వాలిన్య కృతహా హాస్త లాయనిస స్తథా । ఆగ్రాయణః పేలు మూలీ రాశ్వతాతాయన స్తథా ॥ 6
కౌశీత కాశ్చపాకాంతా అగ్నిశర్మాయణాశ్చయే । మైషయః కైవమేయాశ్చ తథాచైవ సుబభ్రవః ॥ 7
ప్రాచీథయో జ్ఞానగయా ఆగ్రావ మధవేవతు । శ్యామోచరా నైమిషయం తత్ష్యాయే శాద్వలాయనాః ॥ 8
కాష్టహాయన మారీచా దౌజి హాయన హాస్తికాః । వైకర్ణేయాః కాశ్యపాశ్చ శామి శా హారితాయనాః ॥ 9
మాతంగినో బభ్రసవః త్యార్షేయాః పరికీర్తితాః । వత్సరః కశ్యపశ్చైవనిధ్రువశ్చ మహాతపాః ॥ 10
పరస్పరమవైవాహ్యా ఋషయః పరికీర్తితాః । రైహాశ్చ సాంఖ్యమిత్రాశ్చ త్ర్యార్షే యాః పరికీర్తితాః ॥ 11
వత్సారః కశ్యపశ్చైవ రైహాశ్చైవ మహాతపాః । పరస్పరమవైవాహ్యా గోత్రాద్వౌ పరికీర్తితౌ ॥ 12

మరీచి కుమారుడు కశ్యపుడు. అతని వంశమందలి గోత్ర కర్తల నెరింగింతు నిదె వినుము. ఆగ్రాయణులు ఋష గణులు మేష కౌరీటి కాయనులు గురువ్రజీ మాతరుడు గోజావి లక్ష్మణుడు శాలాహలేయులు కోరిజ్యులు చౌకన్యులు ఆసురాయణులు మందాన్యులు మృగయనుడు శ్రోతస్కులు భౌసతాయనులు దేవ యాతులు గోపయాతులు ఉచ్ఛాయతులు తాకయానులు చిత్రహయులు అధిర్యోగులు గదాయనులు కౌతువంది మహాచక్రి దాక్షాయణుడు గ్రీవావణులు హర్కిరయుడు హాస్తిదాసుడు వాత్స్యులు వాలిన్యులు కృతహులు హస్తలాయనులు ఆగ్రాయణుడు పేలుమాలి రాశ్వ తాతాయనుడు కౌశీతకులు పాకాంతులు అగ్నిశర్మాణులు మైషయుడు కైవమేయులు ఆగ్రావమథుడు. శ్యామోచరులు నైమిషులు తక్షులు శాద్వలాయనులు కాష్ట హాయనులు మారీచులు దౌజిహాయనులు హాస్తికులు వైకర్ణేయులు కాశ్యపులు శామిశులు హారితాయనులు మాతంగులు బభ్రసులునను వీరు త్ర్యార్షేయులు. వత్సరుడు కశ్యపుడు నిధ్రువుడు ననువారు పరస్పర వివాహ మాడరాదు. రైహులు సాంఖ్య మిత్రులు త్ర్యార్షేయులు వత్సారుడు కశ్యపుడు రైహుడు నను గోత్రములు రెండు పరస్పర వివాహానర్హులు.

అతః పరం ప్రవక్ష్యామి హ్యాముష్యాయణ గోత్రజాన్ । అనుష్టుభోభా క్తరయఃస్వా తయోరాజవల్లయః ॥ 13
శైరేశిరోదేవహిశ్చ సైరంధ్రీ రౌప సేవకిః । సాలులిఃకాటు వింగాక్షిః శత శంభి స్తథైవచ ॥ 14
దివా వసిష్ఠా ఇత్యేతే నక్తం జ్ఞేయాశ్చ కాశ్యపాః । త్ర్యార్షేయాశ్చ తథాతేషాం సర్వేషాం ప్రవరాః శుభాః ॥ 15
వత్సారః కశ్యపశ్చైవ వసిష్ఠశ్చ మహాతపాః । పరస్పర మవైవాహ్యా ఋషయః పరికీర్తితాః ॥ 16
సా మాతా బలి పుత్త్రిశ్చ భౌవ్యలోఽథ జలత్వరః । ముంజామయూరః పర్యశ్చసోఽష్టమో గర్దభీముఖః ॥ 17
హిరణ్య బాహుః కైరాతః ఉభౌ కాశ్యప గోభితా । ఆహలో వృషకండశ్చ సుకేతుశ్చ తథోత్తరః ॥ 18
ఉదకేథ స్తృణో వత్స్యో మహాకేరలయశ్చయే । శాండిలవైశానవసౌ ద్రావోలే వలయాతవః ॥ 19
పైప్పలాదిః పూర్వపరిర్వారివిత్థావరీనికః । త్ర్యార్షేయాఽపిమతశ్చైషాం సర్వేషాం ప్రవరః శుభః ॥ 20
అసితోదేవలశ్చైవ కశ్యపశ్చ మహాతపాః । పరస్పరమవైవాహ్యా ఋషయః పరికీర్తితాః ॥ 21
ఋషిప్రధానస్యతు కశ్యపస్య దాక్షాయణాభ్యః సకలం ప్రసూతమ్ ।
జగత్సమగ్రం యదుసింహముఖ్య! తత్తేచ వక్ష్యామ్యహముత్తరత్ర ॥ 22

ఇది శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయవజ్రసంవాదే
కశ్యపవంశానుకీర్తనంనామ పంచదశాధిక శతతమోఽధ్యాయః

ఈమీద ఆయుష్యాయణ గోత్రజుల నెరింగించెదను. అనుష్టుభులు భాక్తరులు స్వాతులు రాజవల్లులు శైరేశిరుడు దేవహి సైరంధి రౌపసేవకి సాలువిక కాటువింగాక్షి శత శంభి అను వీరిని పగలు వశిష్ఠులుగా రాత్రి కాశ్యపులుగా

నెరుంగవలెను. వారి ప్రవరలు త్ర్యార్షేయములు. వత్సారుడు కశ్యపుడు వశిష్ఠుడు నను ఋషులు పరస్పరము వివాహమాడరాదు. ఆ తల్లి ఖలి పుత్రుడు భౌప్యలుడు జలత్వరుడు ముంజామయూరుడు పర్యుడు గంభీరముఖుడు హిరణ్యబాహువు, కైరాతుడు, కాశ్యపుడు, గోభిలుడు, ఆహలుడు వృషకండుడు సుకేతువు ఉత్తరుడు ఉదకేభుడు తృణుడు వత్స్యుడు మహాకేరలులు శాడీలుడు వైశ్వానవసుడు ద్రావుడు లేవలుడు, యాతువు, పైప్పలాదుడు పూర్వవరి వారి విత్థుడు వరీనికుటునను వీరి ప్రవర త్ర్యార్షేయము. అసితుడు దేవలుడు కశ్యపుడు నను ఋషులు పరస్పర వివాహము సేసికొన దగరు. ఋషి ప్రకుడగు శపునను దాక్షాయణుల (దక్ష కన్యల) వలన సమగ్ర జగత్తునుసంభవించినది. ఓ యదువంశ శ్రేష్ఠ ! ఆ వంశము సమగ్రముగ తరువాత దెలిపెదను.

ఇది శ్రీ విష్ణు ధర్మోత్తర మహాపురాణము ప్రథమ ఖండమున కశ్యప వంశాను కీర్తనమను
నూట పదునైదవ అధ్యాయము.

## నూటపదునాఱవ అధ్యాయము - వశిష్ఠవంశానుకీర్తనము

మార్కండేయ ఉవాచ : వసిష్ఠ వంశజాన్విప్రాన్నిబోధగదతో మమ । ఏకార్షేయశ్చ ప్రవరో వసిష్ఠానాం ప్రకీర్తితః ॥
వసిష్ఠ ఏవ వాసిష్ఠా అవివాహ్యా వసిష్ఠజైః । వ్యాఘ్రపాదా ఔపగవా వైక్లబాశ్వాద్వలాయనాః ॥ 2
కౌపిష్ఠలాశ్శైటలోమా ఆశ్వలాః సర్వటాకరాః । గోపాయనాబోధయశ్చ ద్వాకల్పా అపవాహ్యాకృత్ ॥ 3
బాలి శేయా పాలిశిష్యా స్తథోమాంకురవశ్చయే । ఆయస్థూణా శ్మీతవృక్షా స్తథా బ్రహ్మపురోహితాః ॥ 4
లోమాత్యాః స్వస్తికరాః మాండలి గ్గాతలి స్తథా । వాహ్నేహండిశ్చ సుమనాశ్వపాదిర్వ్యద్ధిరేవచ ॥ 5
శాలి ర్గోలి ర్బ్రహ్మబలో వైలిశ్రవస ఏవచ । మాండవో యాజ్ఞవల్క్యశ్చ ఏకార్షేయా స్తథా నృపః ॥ 6
వసిష్ఠ ఏషాం ప్రవర అవైవాహ్యాః పరస్పరమ్ । శైలాలయోమహాకర్ణః కౌరవ్యః క్రైవణి స్తథా ॥ 7
కపింజలో బాలశిఖి ర్భార్గవిత్తాయనాశ్చయే । కౌరాయణా లాకహయా కౌలకృద్భాగురాయణాః ॥ 8
శాకహవ్యాః కశాపేయా అథో ఉల్వపయాశ్చయే । సాంఖ్యాయనా అనడుహా అథో మాషశిరాధయః ॥ 9
దామ కాయనా వాహయవో వాక్య యోగోరథ స్తథా । ఆబాయనాశ్చ ఋషయో యే చ క్రోడాదనాయవాః ॥ 10
ప్రలంబాయనాశ్చ ఋషయ ఔపమన్యవ ఏవచ । సాంఖ్యాయనాశ్చ ఋషయ స్తథాయేచ దశేరకాః ॥ 11
పాదకాయన ఔద్వాహా ఋషయశ్చైవ లేఖయః । మాలేయా బ్రహ్మవలయః పూర్ణాగారి స్తథైవచ ॥ 12
త్ర్యార్షేయోఽపిమతశ్చైషాం సర్వేషాం ప్రవర స్తథా । భగోవసుర్వసిష్ఠశ్చ ఇంద్రః సమ్మతిరేవచ ॥ 13
పరస్పరమవైవాహ్యా ఋషయః పరికీర్తితాః । ఔపస్వస్థాః స్వస్థలయో వాలో హాలో హయాశ్చయే ॥ 14
మధ్యందినా అక్షతయః పైప్పలా దేవిచం కపీ । త్రైశృంగావనగా ఆలవాః కుండినాశ్చనరోత్తమః ॥ 15
త్ర్యార్షేయోఽపిశ్చైషాం సర్వేషాం ప్రవరః శుభః । వసిష్ఠ మిత్రా వరుణౌ కుండినశ్చ మహాతపాః ॥ 16
పరస్పర మవైవాహ్యాః ఋషయః పరికీర్తితాః । జాతూకర్ణా యవశ్చైవ పాదపాశ్చ తథైవచ ॥ 17
త్ర్యార్షేయోఽపితశ్చైషాం సరేషాం ప్రవర స్తథా । జాతుకర్ణో వసిష్ఠశ్చ తథైవాం త్యశ్చపార్థివ ॥
పరస్పర మవైవాహ్యాః ఋషయః పరికీర్తితాః ॥ 18
వసిష్ఠ వంశేఽభిహి మయైతే ఋషిప్రవర్గా నృప! గోత్రకారాః ।
యేషాంతునామ్నాం పకీర్తనేన పాపం సమగ్రం పురుషోజహాతి ॥ 19

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
వసిష్ఠ వంశానుకీర్తనం నామ షోడశోత్తర శతతమోఽధ్యాయః

వసిష్ఠ వంశీయులగు విప్రులను తెల్పెద వినుము :- వశిష్ఠుల యొక్క ప్రవర ఏకార్షేయమని పేర్కొన బడినది. వశిష్ఠ గోత్రులతో వాశిష్ఠులు వివాహ మాడకూడదు. వ్యాఘ్రపాదులు ఔపవులు వైక్లబులు శాద్వలాయనులు తాపిష్ఠలులు శైలలోములు ఆశ్వలులు సర్వలూకరులు గోపాయనులు బోధులు ద్వారలులు ఆపవాహ్యాకృతులు బాలిశేయులు పాలిశిష్యులు ఉమాంకురులు. ఆయస్థూణులు శీతవృక్షులు బ్రహ్మ పురోహితులు లోమాత్యులు. స్వస్తి కరులు మాండలి గౌతలి వాహ్నేహంది సుమనుడు అశ్వ పాది విద్ది శౌలిశ్వ లోలి బ్రహ్మబలుడు వైలిశపనుడు మౌండులు యాజ్ఞవల్క్యుడు నను వీరేకార్షేయులు. వీరిలో ప్రవరుడు వశిష్ఠుడు. వీరు పరస్పరము అవివాహ్యులు. శైలాలయుడు మహాకర్ణుడు కౌరవ్యుడు క్రైపణి కపింజులుడు బాలశిఖి భాగవిత్తాయణులు కేరాయణులు లాకహాయులు కాలకృద్భాగురాయణులు శాకహవ్యులు కశాపేయలు ఉల్వపయులు సాంఖ్యాయనులు అనడుహులు మాషశిరాధులు దామకాయనులు వాహయులు వాక్య యోగుడురథుడు. ఆవాయచులు క్రోడాదనులు యవులు ప్రలాంచాయనులు జాపమన్యులు. సాంఖ్యాయనులు దశేరకులు పాదకాయనుడు ఔద్రాహులులేఖులు, మాలేయులు, బ్రహ్మవలులు పూర్ణాగారి యను వీరిప్రవర త్ర్యార్షేయము భృగుడు వసువు వశిష్ఠుడు ఇంద్రుడు సన్మతి యనువారు పరస్పరము వివాహమాడరాదు. ఔపస్వస్థులు స్వస్థలులు బాలుడు హాలుడు హయుడు మధ్యందనులు అక్షతులు పైప్పలులు దేవి చంతపిలు త్రైశృంగురు వనగులు ఆలవులు. కుండినులు నను వీరు త్ర్యార్షేయ ప్రవరులు వశిష్ఠమిత్రావరణులు కుండినడు ఈ ఋషులు పరస్పర వివాహమాడరాదు. జాతూకర్ణులు యవులు పాదపుయి త్ర్యార్షేయులు జాతుకర్ణుడు, వశిష్ఠుడు అంత్యుడు, వీరు పరస్పర వివాహమునకు తగరు. చేను వశిష్ఠవంశ ఋషి ప్రవరల గోత్రకర్తల నెఱింగిచితి. వీరి పుణ్యనామ కీర్తనచే మానవుడు సర్వ పాపమునం బాయును.

ఇది శ్రీ విష్ణుధర్మోత్తర మహాపురాణ ప్రథమఖండమున వశిష్ఠవంశాను కీర్తనమను.
నూటపదునాఱవ అధ్యాయము.

## నూటపదునేడవ అధ్యాయము - పరాశరవంశాను కీర్తనము

వసిష్ఠస్తు మహాతేజా నిమేః పూర్వపురోహితః । 1
బభూవ పార్థివశ్రేష్ఠ! యజ్ఞె స్తస్య మహాత్మనః । శాంతాత్మా పార్థివ శ్రేష్ఠ విశశ్రామ తదాపురా ॥ 2
తం గత్వా పార్థివశ్రేష్ఠో నిమి ర్వచనమబ్రవీత్ । భగవన్యష్టుమచ్ఛామి తన్మా యాజయ మాచిరమ్॥ 3
తమువాచ మహాతేజా వశిష్ఠః పార్థివోత్తమమ్। కంచిత్కాలం ప్రతీక్షస్వ తవ యజ్ఞైఃసమంతతైః ॥ 4
భృశంశ్రాంతోఽస్మివిశ్రమ్య యాజయిష్యామి తే నృప! । ఏవముక్తః ప్రత్యువాచ వసిష్ఠం నృపసత్తమః ॥ 5
పారలౌకిక కార్యేషు కః ప్రతీక్షితు ముత్సహేత్ । నయస్య సౌహృదం బ్రహ్మన్! కృతాంతేన బలీయసా ॥ 6
ధర్మకార్యేత్వరాకార్యాలంయస్మార్ధి జీవితమ్ । ధర్మమార్గరతో జంతుర్మృతమ్యపి సుఖమశ్నుతే ॥ 7
శ్వః కార్యమద్య కుర్వీత పూర్వాహ్ణేచాపరాహ్ణికకు । నహిప్రతీక్షతేమృత్యుః కృతంవాస్య నవా కృతమ్ ॥ 8
క్షేత్రాపత్య గృహాసక్త మన్యత్రగత మానసమ్ । వృకీవోరణమాసాద్య మృత్యురాదాయగచ్ఛతి ॥ 9
న కాలస్య ప్రియః కశ్చిద్ద్వేష్యో వాఽస్యన విద్యతే । ఆయుష్యే కర్మణిక్షీణే ప్రసహ్య హరతేబజనమ్ ॥ 10
ప్రాణోవాయుశ్చలత్వంచ నా యోర్వికిత మేవచ । యత్రయజ్జీవ్యతే బన్షణమాత్రం తదద్భుతమ్ । 11
సోఽహంసభృతసంభారో భవన్మాల ముపాగతః । నచేద్యా జయసేమహ్యం యాస్యామ్యన్యంతు యాజకకు ॥ 12
ఏవముక్తస్తదా తేన నిమినా బ్రాహ్మణోత్తమః । శశాంసిమింక్రోధా ద్విదేహస్త్వం భవిష్యసి ॥ 13
శ్రాంతం మాంత్వం సముత్సృజ్య యస్మాదన్యంద్విజోత్తమమ్ । ధర్మజ్ఞః సన్నరేంద్రాద్య యాజకంకర్తు మిచ్ఛసి ॥ 14

నిమి స్తం ప్రత్యువాచాథ ధర్మకార్య రతస్యమే । విఘ్నంకరోషినాన్యేన యాజనం చతథేచ్ఛసి ॥ 15
శాపందదా మితస్మాత్త్వం విదేహోఽద్యభవిష్యసి । ఏవము క్తేతు తౌజాతౌ విదేహౌ ద్విజపార్థివౌ ॥ 16
దేహహీనౌతయోర్జీవౌ బ్రహ్మాణము పజగ్మతుః । ఆగతౌతాసమీపేఽథ బ్రహ్మావచన మబ్రవీత్ ॥ 17
అద్యప్రభృతితే స్థానం నిమే జీవం దదా మ్యహమ్ ॥ నేత్రపక్ష్మసు సర్వేషాం మనుష్యాణాం భవిష్యతి ॥ 18
త్వత్సంబంధా త్తథా తేషాం నిమేషః సంభవిష్యతి । చాలయిష్యంతి తు యదానేత్ర పక్ష్మాణిమానవాః ॥ 19
ఏవము క్తేమనుష్యాణాం నేత్రపక్ష్మసు సర్వశః । జగామ నిమి జీవంతు వరదానాత్స్వయంభువః ॥ 20
వసిష్ఠ జీవంభగవాన్ బ్రహ్మావచనమబ్రవీత్ । మిత్రావరుణయోః పుత్రోవసిష్ఠత్వంభవిష్యసి ॥ 21
వసిష్ఠఇతితేనామ తత్రాపిచభవిష్యతి । జన్మద్వయ మతీతంచ తత్రాపి త్వం స్మరిష్యసి ॥ 22

మార్కండేయుడనియె : వశిష్ఠ మహర్షి నిమి చక్రవర్తికి ముందటి పురోహితుడు. అనేక యజ్ఞములు కావింపచేసి యా శాంతాత్ముడు విశ్రమించెను. అత్తరి నిమి యాయన దరికేగి వశిష్ఠ భగవానుడా! మరియొక యజ్ఞము సేయదలచితిని. అది నాచే జేయింపవలయునన వశిష్ఠముని కొంతకాలము నిరీక్షింపుము. నీయజ్ఞములచే నేను మిక్కిలియలసితిని. కొంచెము విశ్రమించి యామీద జేయింతుననెను. అదివిని నిమి పారలౌకిక కార్యములందెవడు నిరీక్షింపగలడు. యముడు (కాలుడు) బలీయుడు. ఆతనికెవనితోగూడ మంచితనములేదు. (మైత్రిలేదు) జీవితము చలము ధర్మ కార్యమందు త్వరపడుట యవసరము. ధర్మకార్య రతుడు చచ్చినను సుఖమందును. రేపటిపని యీవేళ చేయవలెను. మలిజాము పని తొలిజాముననే ముగింపనగును. మృత్యువు జీవుని కృతాఽకృతముల నిరీక్షింపడు. క్షేత్ర పుత్ర కలత్రాదులందు సక్తమై మనసింకొకట నూరేగుచుండును. మానవుని తోడేలు మేకనట్లు మృత్యువు కరచుకొని పోవును. కాలునకొకడు ప్రియుడు లేడు శత్రువు లేడు. ఆయుష్యోపయోగియైన కర్మము క్షీణము కాగానే జనుని బలాత్కారముగా లాగికొని పోవును. ప్రాణమనగా వాయువు. వాయువునకుచలత్వము తెలిసినదేకద. ఎక్కనైన నెవడేని క్షణమాత్రము జీవించుటే చిత్రము. (మరణించుట స్వభావము) నేను యజ్ఞ సంభారములన్నియు సంపాదించి పెట్టుకొని నీదగ్గరకు వచ్చితిని. నీవు యజ్ఞము సేయింపవేని యింకొక యాజకుని దరికేగెదను. అని నిమియన విని యా బ్రాహ్మణోత్తముడు కోపముగొని నీవు విదేహుడవు (దేహములేనివాడవు) అయ్యెదవని శపించెను. అలసియున్న నన్ను విడిచి ధర్మము తెలిసియు నింకొకని యాజకుని కావింప నెంతువా? యన నిమి ధర్మకార్యాసక్తుడనగు నాకు విఘ్నము సేయుటయే కాక యింకొకని యాజనమునకు గూడ నిష్టపడవు కావున శాపమిచ్చెద. నీవును విదేహుడ వగుదువనెను. ఇట్లయ్యిద్దరు (బ్రాహ్మణ క్షత్రియులు) గురుశిష్యులు విదేహులైరి. దేహములేని వారిజీవములు బ్రహ్మ దగ్గరకు జనెను. వానింగని బ్రహ్మ; ఓనిమీ! నీకు ప్రాణమిచ్చుచున్నాను. ఇది మొదలు నీవు సర్వ మనుష్యుల కనురెప్ప లందుండ గలవు. కనురెప్పలు కదల్పగా నీవలన వారికి రెప్పపాటు సంభవింప గలదు. అని బ్రహ్మ పలుకగ నిమి జీవముం బడసి మనుష్యుల కనురెప్పల జేరెను. వశిష్ఠుని జీవముంగని బ్రహ్మ నీవు మిత్రావరుణులకు పుత్రుడ వగుదువు. నీకు వశిష్ఠుడను పేరప్పుడు కలుగును. నీవు నీ కడచిన రెండు జన్మములను ఆజన్మమందు స్మరింప గలవు అనెను.

ఏతస్మిన్నేవ కాలేతు మిత్రశ్చ వరుణ స్తథా । బదర్యాశ్రమమాసాద్య తప స్తేపతురవ్యయమ్ ॥ 23
తపస్యతో స్తయో రేవం కదాచిన్మాధవే ఋతౌ । పుష్పితద్రుమసంఛన్నే శుభే దక్షిణమారుతే ॥ 24
ఉర్వశ్యథవరారోహా కుర్వతీ కుసుమోచ్చయమ్ । సుసూక్ష్మ రక్తవసనా తయోర్దృష్టి పథంగతా ॥ 25
తాందృష్ట్వా సుముఖీంసుభ్రూం నీలనీరజలోచనామ్ । ఉభౌచుక్షుభతు ర్వీర్యాత్త ద్రూపపరి మోహితౌ ॥ 26
స్కన్నంరేత స్త యోర్దృష్ట్వా శాపభీతావరాప్సరాః । చకార కలశేసుభ్రూస్తోయ పూర్ణేమనోరమే ॥ 27
తస్మా దృషివరౌజాతౌ తేజసాఽప్రతిమౌభువి । వసిష్ఠశ్చాప్యగ స్త్యశ్చ మిత్రావరుణయోః సుతౌ ॥ 28
వసిష్ఠస్తూపయేమేఽథ భగినీంనారదస్యతు । అరుంధతీం వరారోహాం తస్యాంశక్తిమజీజనత్ ॥ 29

శక్తేః పరాశరః పుత్త్రస్తస్య వంశం నిబోధమే । యస్యద్వైపాయనః పుత్త్రః స్వయం విష్ణురజాయత ॥ 30
ప్రకాశంజనితోయేన లోకే భారతచంద్రమాః । పరాశరస్య తస్య తం శృణువంశమనుత్తమమ్ ॥ 31
కార్ద్రిమయోవాహయానో జైమయోమైమ తాయనః । గోపాలిః పంచమశ్చైషాం జ్ఞేయాః కృష్ణపరాశరాః ॥ 32
ప్రారోహయో బాహ్యతపాః పార్ష్ణయః కౌతుజాతయః । హార్యశ్విః పంచమశ్చైషాం జ్ఞేయా నీలపరాశరాంః ॥ 33
కార్ష్ణాయసాః కాపిసౌధాః కోకేయసా స్తయాస్తపాః । పుష్కరః పంచమశ్చైషాం జ్ఞెయారక్త పరాశరాః ॥ 34
శ్రవిష్ఠాయనావార్ష్ణేయా దాసేయాః శ్లోకజాశ్చయే । ఇషీకహస్తః పంచమశ్చైతే శ్వేతపరాశరాః ॥ 35
వటికా బాదరాశ్చైవ స్కంభన్యాః క్రోశకాతయః । షామిరేషాం పంచమశ్చ ఏతే గౌరవపరాశరాః ॥ 36
ఖల్వాయణీ వార్ష్ణయణీ తిల్వణో బైల్వయూథపః । తామిరేషాం పంచమశ్చ ఏతేధూమ్ర పరాశరాః ॥ 37
పరాశరాణాం సర్వేషాంత్ర్యార్షేయః ప్రవరోమతః । పరాశరశ్చ శక్తిశ్చ వసిష్ఠశ్చ మహాతపాః ॥ 38
పరస్పర మవైవాహ్యాః సర్వఏవపరాశరాః ఉక్తాస్తథైతే నృప! వంశముఖ్యాః 39
పారాశరాః సూర్యసమ ప్రభావాః । యేషాంతు నామ్నాం పరికీర్తనేన పాపం సమగ్రం పురుషోజహాతి ॥ 40

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
పరాశరవంశానుకీర్తనంనామ సప్తదశాధిక శతతమోఽధ్యాయః

ఇదే సమయమున మిత్రుడు వరుణుడు బదర్యాశ్రమ మేగి తీవ్ర తపస్సు సేయుచుండగా వసంత ఋతువు వచ్చినంత చెట్లు చక్కగా పూచినవి. దక్షిణ మలయమారుతము వీచుచుండెను, ఊర్వశి దేవసుందరి పువ్వులు కోసికొనుట కటకేతెంచెను. ఎఱ్ఱని జిలుగు పావడ కట్టుకొని యది యాతపస్వుల దృష్టిలో బడెను. ఆ సుముఖిని నీలనీరజ లోచననుగని యామె రూపమునకు మైమరచి వారుభయులు వీర్య క్షోభమందిరి. స్ఖలనమయిన వారి శుక్రముంగని యాయప్సర శాపమునకు వెరచి యొక చక్కని నిండ నీరుగల కుంభము నందుంచెను. అందుండి యప్రతిమాన తేజస్వులు తపస్వి లిద్దరుదయించిరి. వారు వశిష్ఠుడు అగస్త్యుడును. వశిష్ఠ మహర్షి నారదుని చెల్లెలి నరుంధతిం బెండ్లాడెను. ఆమె శక్తి యను వానిం గన్నది. శక్తి యొక్క కొడుకు పరాశరుడు. ఆయన వంశమిదె తెలియుము. పరాశరునికి ద్వైపాయనుడై సాక్షాద్విష్ణువే జనించెను. ఆయన చేత భారతమను చంద్రుడుదయించెను. ఆ పరాశరుని వంశక్రమము వినుము. కార్ద్రిమయుడు వాహయానుడు జైమవాయుడు మైమతాయనుడు గోపాలి అను నీ యైదుగురు కృష్ణపరాశరు లనబడిరి. ప్రారోహయుడు బాహ్యతపుడు పార్ష్ణయుడు కౌతుజాతయుడు హార్యశ్వి నను వారైదుగురు నీల పరాశరులు. కార్ష్ణాయులు కాపిసౌధులు కోకేయస్యులు తయాస్తపులు పుష్కరుడు ననునీ యైదుగురు రక్త పరాశరులు. శ్రవిష్ఠాయన - వార్ష్ణేయ దాసేయ శ్లోకజులు ఇషీకహస్తుడుంగలిసి శ్వేత పరాశరులు. వటిక బాదర సంభన్య క్రోశకాతి షామియను నీ యైదుగురు గౌర పరాశరులు. ఖల్వాయణి వాష్ణాయణి తిల్వణ బైల్వయూథప తామియను నైదుగురు ధూమ్ర పరాశరులు. పరాశరులందరికి త్ర్యార్షేయ ప్రవరయే. పరాశరుడు శక్తి వశిష్ఠుడు ననువారు పరస్పర వివాహములు చేసికొనరాదు. రాజా! పరాశర ముఖ్య వంశములు తెలిపితిని వీరం దరు సూర్య సమప్రభా శాలురు. వీరి నామ కీర్తనమున సమగ్ర పాపములు వాయును.

ఇది శ్రీ విష్ణు ధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున పరాశర వంశాను కీర్తనమను
నూట పదునేడవ అధ్యాయము.

## నూటపదునెనిమిదవ అధ్యాయము - అగస్త్యవంశాను కీర్తనము

అతః పర మగస్త్య స్యవక్ష్యే వంశోద్భవాన్ ద్విజాన్ । అగస్త్యేయః కరంభోయః కౌసల్యాకులజాస్తథా ॥ 1

స్వమేధసో మయోభువ స్తథా గాంధారకాయనిః । పౌలస్త్యాః పులహాశ్చైవ క్రతువంశభవా స్తథా ॥ 2
వార్ష్ణేయోఽపి మతశ్చైషాం సర్వేషాం ప్రవరాః శుభాః । అగస్త్యశ్చమహేంద్రశ్చఋషిశ్చ మయోభువః ॥ 3
పరస్పరమవైవాహ్యాః ఋషయః పరికీర్తితాః । పౌర్ణమాసాః పారణాశ్చ త్ర్యార్షేయాః పరికీర్తితాః ॥ 4
అగస్త్యః పౌర్ణమాసశ్చ పారణశ్చ మహాతపాః । పరస్పరమవైవాహ్యాః పౌర్ణమాసాశ్చపారణమ్ ॥ 5
ఏతదుక్తమృషీణాంతే వంశముత్తమ పూరుషమ్ । అతఃపరం ప్రవక్ష్యామికింతవానఘ ! కథ్యతామ్ ॥ 6
వజ్రఉవాచ:- పులహస్య పులస్త్యస్య క్రతోశ్చైవ మహాత్మనః । అగస్త్యస్య తథాచైకం కథం వంశం తదుచ్యతే ॥ 7
మార్కండేయఉవాచ:- క్రతుః ఖల్వనపత్యోఽస్తి రాజన్వైవస్వతేంతరే। ఇధ్మవాహంస పుత్రత్వే జగ్రాహన్నృపసత్తమ ॥
అగస్త్య పుత్రం ధర్మజ్ఞ! ఆగస్త్యా క్రతవ స్తథా । పులహస్యతథా పుత్రా స్తిరశ్చః పృథివీ పతే! ॥ 9
తేషాంతే జన్మవక్ష్యామి ఉత్తరత్రయథావిధి । పులహస్య ప్రజాందృష్ట్వా నాతిప్రీతమనా హ్యభూత్ ॥ 10
అగస్త్యజం ద్రుఢస్యుం తం పుత్రత్వేకృతవాం స్తదా । పౌలహాశ్చతథారా జన్నాగస్త్యాః పరికీర్తితాః ॥ 11
ఏతేతవోక్తాః ప్రవరా ద్విజానామ్ మహానుభావా నృప గోత్రకారాః ।
యేషాంచనామ్నాం పరికీర్తనేన పాపం సమగ్రం పురుషోజహాతి ॥ 12

ఇతి శ్రీవిష్ణోధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
అగస్త్య వంశానుకీర్తనం నామ అష్టాదశోత్తర శతతమోఽధ్యాయః

ఈ మీద నగస్త్య వంశ సంకీర్తన మొనరింతును. కరంభు దగస్త్య కుమారుడు. కౌసల్యాకులజులు స్వమేధసులు మయోభువులు. క్రతువంశజులు గాంధారకాయని పౌలస్త్యులు పులహులు వార్ష్ణేయుడు నను వీరి ప్రవరులు శుభకరములు. అగస్త్యుడు మహేంద్రుడు మయోభువుడు నను వారు వీరు ముగ్గురు ఋషులు పరస్పరము వివాహము సేసికొనరాదు. ఆగస్త్యుడు పౌర్ణమాసులు పారాణులు ననువారొండొరులు పెండ్లి చేసికొనరాదు. ఇంతవరకు ఋషుల అపూరుష వంశముం దెలిపితిని. (అపౌరుష మనగా అర్షనునిసామాన్యమని యర్థముచెప్పికొనవలెను.)ఇకనేమి చెప్పుదును. వజ్రుడు పులహుడు పులస్త్యుడు క్రతువు ఆగస్త్యుడు నను వీరివంశమంతయు యొక్కటేయని యేలచెప్పబడినదనగా మార్కండేయుడనియెః క్రకుపు వైవస్వతమన్వంతరమందు సంతానములేని వాడై యుండెను. అందుచే ఇధ్మవాహు నతడు కుమారునిగా గ్రహించెను. ఆయిధ్మవాహుడగస్త్యుని కుమారులు అగస్త్యుని వలన నిట్లు క్రతు పరంపర వారేర్పడినారు. పులహుని కొడుకు తిరశ్చుడు (పశుపక్షులు-) వారి జన్మవృత్తాంతము (మనుష్య) యీ మీద యథావిధిగా తెల్పెదను. పులహ్యుడు సంతానము గలుగకుండుట జూచి యప్రియ మంది అగస్త్య కుమారుని దృఢస్యుని పుత్రునిగా గైకొనెను. ఆ విధముగా పౌలహులు ఆగస్త్యులుగా పేర్కొన బడిరి. గోత్రకర్తలు మహాను బావులునైన యీ ద్విజుల ప్రవరులను నీకు దెల్పితిని. వీరి నామ పరి కీర్తనముచే మానపు డెల్ల పాపముం బాయును

ఇది శ్రీ విష్ణుధర్మోత్తర మహాపురాణమున ప్రథమఖండమునందు అగస్త్య వంశాను కీర్తనమను
నూటపదునెనిమిదవ అధ్యాయము.

## నూటపందొమ్మిదవ అధ్యాయము - ధర్మవంశాను కీర్తనము

మార్కండేయఉవాచ :- అస్మిన్వైవ స్వతేప్రాప్తే శృణు ధర్మస్య పార్థివ! ।
ధాక్షాయణ్యాశ్చ సకలం శృణు త్వం వంశముత్తమమ్ ॥ 1
ఏవం తాని మహేదుర్గశరీరాణి నరాధిప ! । అరుంధత్యా ప్రసూతాని ధర్మోవైవస్వతేఽంతరే ॥ 2

అష్టౌ చవసవః పుత్రాః సోమపాశ్చవసోస్తథా । ధరోధ్రువశ్చ సోమశ్చ ఆపశ్చై వానలానిలౌ ॥ 3
ప్రత్యూషశ్చ ప్రభాసశ్చ వసవోఽష్టౌ ప్రకీర్తితాః । ధరస్య పుత్రోంబునింబః కాలః పుత్రోధ్రువస్యచ ॥ 4
కాలస్యావయవానాంతు శరాణి నరాధిప । ముహూర్త వర్జం కాలాదిర్ధి ప్రసూతాన్య విశేషతః ॥ 5
సోమస్య భగవాన్వర్చాః శ్రమస్త్వాపస్య కీర్త్యతే । అనేక జన్మాజనవః కుమారశ్చానలన్యతు ॥ 6
పురోజనాశ్చానిలస్య ప్రత్యూషస్య చదేవలః । విశ్వకవిర్మా ప్రభాసస్యత్రి దశానాంస వార్ధకిః ॥ 7
జామీదుహితరః ప్రోక్తాః నాగవీధ్యాదయోనవ । లంచాపుత్రః స్మృతోఘోషో భాను పుత్రశ్చభానవః ॥ 8
గ్రహర్షాణాంచ సర్వేషాం చాన్యేషామపితేజసామ్ । మరుత్వత్యాంమరుత్వంతః సర్వే పుత్రాః ప్రకీర్తితాః ॥ 9
సంకల్పాయాశ్చ సంకల్పాస్తథా పుత్రాః ప్రకీర్తితాః । ముహూర్తశ్చ ముహూర్తాయాః సాధ్యాత్సాధాః సుతాఃస్మృతాః ॥
మత్తోన్మత్తచ్చ ప్రాణశ్చ నరోపాశాణశ్చ వీర్యవాన్ । చిత్తిర్నరో హయశ్చైవ హంసోనారాయణస్తథా ॥ 11
విభుశ్చాపి ప్రభుశ్చాపి సాధ్యాద్వాదశకీర్తితాః । విశ్వాయాశ్చతథా పుత్రాః విశ్వేదేవాః ప్రకీర్తితాః ॥ 12
క్రతుర్దక్షోవసుః సత్యః కాలః కామోధునిస్తథా । ఊరవాన్మనుజో విశ్వేరోమాయాశ్చ హితేదశ ॥ 13
ఏతావదుక్తంత వధర్మవంశం సంక్షేపతః పార్థివ సంఘముఖ్య! । వ్యాసేనవక్తుంన హిశక్తిరస్తి రాజన్వినా వర్షశతైరనేకైః ॥

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
ధర్మవంశాను కీర్తినంనామ ఏకోన వింశోత్తర శతతమోధ్యాయః

మార్కండేయు డిట్లనియె:- రాజా! వైవశ్వత మన్వంతరము రాగానే ధర్మునియొక్క దాక్షాయణియొక్క సర్వవంశమును వినుము. వసువు యొక్క కుమారులెనమండుగురు. అష్టవసువులు. సోమపానము సేసినవారు. వారిపేర్లు ధరుడు, ధ్రువుడు, సోముడు, ఆపుడు, అనలుడు, అనిలుడు, ప్రత్యూషుడు, ప్రభాసుడునని. ధరుని కొడుకు అంబునింబుడు. కాలుడు ధ్రువుని కొడుకు. కాలుని యవయవములయొక్క శరీరములు ముహూర్తముతప్ప మిగిలినవి కాలునివలన పుట్టినవి. సోమునికొడుకు వర్చుడు. ఆతాపుని కుమారుడు శ్రముడు. అనలునికుమారుడు అనేకజన్మము లెత్తిన జనవుడు. అనిలుని కుమారుడు పురోజవసుడు ప్రత్యూషుని సుతుడు దేవలుడు. ప్రభాసునికుమారుడు విశ్వకర్మ. ఇతడుదేవతల వడ్రంగి. నాగవీధ్యాదులు తొమ్మిదిమంది కూతుండ్రు. లంబాపుత్రుండు ఘోషుడు భానుపుత్రుడు గ్రహములునక్షత్రములు మరియితర తేజస్సులన్నిటి యొక్క సంతానమే. ముహూర్తములు మరుత్వతియందుదయించిన కొడుకులందఱు మరత్వంతులు. సంకల్పయను నామె కొడుకులు సంకల్పులు. ముహూర్త కుమారులు. సాధ్యయందు గలిగిన వాడు సాధుగలు ద్యసులుతు. మత్తుడు ఉన్మత్తుడు ప్రాణుడు నపోపాణు చిత్తి నరుడు హయుడు హంసుడు నారాయణుడు విభువు ప్రభువుననువారు పండ్రెండుగురు సాధ్యలు విశ్వ యొక్క కొడుకులు విశ్వేదేవులు. క్రతువు, దక్షుడు, వసువు, సత్యుడు, కాలుడు, కాముడు, ధుని, ఊరహతుడు, మనుజుడు విశ్వేదేవతలుననువారు పదిమంది రోమ యొక్క కుమారులు.

ఇంత వరకు ధర్ముని వంశము సంక్షిప్తముగ దెల్పబడినది. పెక్కు వందల యేండ్లకుగాని విపరముగ దెలుపగల శక్తి నాకు లేదు.

ఇది శ్రీ విష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున ధర్మవంశాను కీర్తనమను
నూటపందొమ్మిదవ అధ్యాయము

## నూటయిరువదియవ అధ్యాయము - ఆదిత్యోత్పత్తి

మార్కండేయ ఉవాచ ; అతః పరం కశ్యపస్య శృణువంశం నరాధిపః
యత్రప్రాయేణ సంభూతం జగత్స్థావరజంగమమ్ ॥

అదితేః ద్వాదశాదిత్యాః దేవపుత్రాః ప్రకీర్తితాః । ధాతాపుత్రోఽర్యమా పూషా శక్రోంఽశోవరుణో భగః ॥ 2
త్వష్టా వివస్వానరుణో విష్ణుర్ద్వాదశమ స్తథా । విష్ణురంశేన సంభూతాః సాధ్యా దేవగణా నృప ॥ 3
తఏవ తేజసోఽర్ధేన జాతాశ్చైవాదితేఃసుతాః । నరనారాయణౌచోభౌ యౌతౌ రాజన్మయేరితౌ ॥ 4
ఇంద్రావిష్ణూ తథైవోక్తా వాదిత్యేషునరాధిప । మనోరంతరమాసాద్య సర్వత్రై వ జనార్దనః ॥ 5
అంశేనైకేన భవతి సగణ సోమపాయినామ్ । తస్మిన్గణే దేవవరో విష్ణు ర్లోకనమస్కృతః ॥ 6
తేజసాఽభ్యధికో నైకో భవతీతి నసంశయః । య స్తేషామార్తి శమనం కరోతి వసుధాధిప ॥ 7
కర్మాణ్యతీతేషు తథాంతరేషు । వక్ష్యే భవిష్యేషు తథా నరేంద్రః ।
మన్వంతరాణాం పరికీర్తనేషు । శృణుష్వ తావద్దితివంశముగ్రమ్ ॥ 8

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరమహాపురాణె ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
ఆదిత్యోత్పత్తిర్నామ వింశత్యధికశతతమోఽధ్యాయః.

మార్కండేయుడనియె ఇటుపై కశ్యప వంశము నాలింపుము. ఈ వంశము నందు చరాచర ప్రపంగమంతయు జనించి నది. అదితియందు కశ్యపునికి గలిగినవారు (ఆదిత్యులు) పండ్రెండుగురు. వారు 1 ధాత 2. పుత్రుడు 3. ఆర్యముడు 4. పూషుడు 5. శక్రుడు 6. అంశుడు 7. వరుణుడు 8. భగుడు 9. త్వష్ట 10. వివస్వంతుడు 11. అరుణుడు 12. విష్ణువు వనువారు. విష్ణువు వంశమున జనించిన సాధ్యులనెడి దేవగణమువే యంధలి యదాంశముతో నదితి కుమారులై (అదిత్యులై) పుట్టినారు. నరుడు నారాయణుడు అనినను నే మున్ను దెల్పిన యిద్దరు ఇంద్రుడు విష్ణువుగా నాదిత్యుల యందు పేర్కొనబడినారు. మన్వంతరమందు జనార్దనుడుసోమపాయుల గణముగా నవతరించును. ఆసోమ పీథుల గణమందు దేవవరుడగు విష్ణువు సర్వలోక నమస్కృతుడై అత్యధిక తేజస్వియై యనేకములగు (అవతారములు) రూపులు ధరించును. వారి యార్తిని పోగొట్టుచుండును. గడచిన రాబోవునట్టి మన్వంతరములందు సంభవించు ఉగ్రమైన (భయంకరమైన) దితి వంశము (దైత్య పరంపరను) తెల్పెద వినుము.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున ఆదిత్యోత్పత్తియను నూటయిరువదవ అధ్యాయము.

## నూటయిరువదియొకటవ అధ్యాయము - దితివంశాను కీర్తనము

మార్కండేయ ఉవాచ : దితిః పుత్ర ద్వయం రాజన్! జనయామాస విశ్రుతమ్ ।
హిరణ్యాక్షం చ దుర్ధర్షం హిరణ్యకశిపుం తథా ॥ 1
హిరణ్యాక్షోహతో రాజన్నృవరాహేణ సంయుగే । హిరణ్యకశ్యపూరాజన్నృసింహేననిపాతితః ॥ 2
హిరణ్యకశిపోః పుత్రః ప్రహ్లాదోరి కులాంతకః । కాలనేమిశ్చ దుర్ధర్షో మహాబలపరాక్రమః ॥ 3
ఆరాధ్య కేశవం దేవం ప్రహ్లాదశ్చ మహాబలః । ప్రాప్తవాన్జీజలితం దీర్ఘం బ్రాహ్మందిన మనుత్తమమ్ ॥ 4
కాలనేమిశ్చ దుర్ధర్షోమహాబలపరాక్రమః । నిహతో వాసుదేవేన నివృత్తే తారకాగమే ॥ 5
ప్రహ్లాదస్య సుతః శ్రీమాన్రాజన్నామ్నా విరోచనః । విరోచన సుతః శ్రీమాన్బలిరిత్యేవ విశ్రుతః ॥ 6
వామనం రూపమాస్థాయ బద్ధోయో విష్ణునాపురా । బలేర్బాణః సుతోరాజన్ స్మృతో బాహు సహస్రవాన్ ॥ 7
పితు స్తేశ్వశురః శ్రీమాన్ పితురర్థే తవానఘః । వివాహంకృతవాన్ కృష్ణో నగరే శోణితాహ్వయే ॥ 8
యస్మిన్నవైదేవవరః ప్రసహ్య । స్కందంచ రుద్రం దితిజైః సమేతమ్ ।
రణే విజిగ్యే నృపతిప్రధానః సహానుగం వీర్య బలోప పన్నమ్ ॥ 9

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
దితివంశానుకీర్తనంనామ ఏకవింశత్యుత్తర శతత మోఽధ్యాయః

మార్కండేయుడనియె : దితికిద్దరు కొడుకులు హిరణ్యాక్షుడు హిరణ్య కశిపుడను వారు. నరవరాహావతారమెత్తి విష్ణువు హిరణ్యాక్షుం జంపెను. నరసింహావతారుడై హిరణ్యకశిపుం జంపెను. హిరణ్యకశిపు కుమారులు. ప్రహ్లాదుడు, కాలనేమియును. కాలనేమి బలశాలి. వానిని తారకామయము నివృత్తముకాగా విష్ణువు గడతేర్చెను. ప్రహ్లాదుడు హరిని ఆరాధించి బ్రహ్మయొక్క యొక పగలు అనగా నొక కల్ప మాయువుం బడసెను. ప్రహ్లాదుని సుతుడు విరోచనుడు. వానికొడుకు బలి. వామనరూపుముదాల్చి విష్ణువు అతనిం బంధించెను. బలి కొడుకు బాణుడు. వానికి వేయిబాహువులుండెనట. ఓ వజ్ర మహారాజా! నీతండ్రి తాతగారగు కృష్ణుడు మీతండ్రి కొరకు శోణిత నగరమున వివాహము గావించెను. ఆ వివాహమందు స్కందుని (కుమారస్వామిని) రుద్రుని దేవతలతో గూడి వచ్చినవారిని యుద్ధమునందు సపరివారముగ నున్నవారిని జయించెను.

ఇది శ్రీ విష్ణు ధర్మోత్తర మహాపురాణము ప్రథమ ఖండమున దితి వంశ కీర్తనమను
నూట యిరువది యొక్కటవ అధ్యాయము

## నూటయిరువదిరెండవ అధ్యాయము - అగ్నిస్తోత్రము

వజ్రఉవాచ : హిరణ్యకశిపోః పుత్త్రః కాలనేమిర్మహాసురః । కథంకృష్ణేన నిహతస్తన్మమాచక్ష్వ పృచ్ఛతః ॥ 1
మార్కండేయ ఉవాచ :- యదాదైత్యవధేవృత్తే దైత్యాః పాతాళమాశ్రితాః ।
మయతారౌసమాశ్రిత్య భూయోదేవాన్ప్రదుద్రువుః ॥ 2
తత్రదేవగణాః సర్వే మయతార పురస్సరైః । దానవైర్నిహతాయుద్ధే దేవాచార్యం బృహస్పతిమ్॥ 3
సంప్రాప్తాః శరణంవిప్రం తానువాచ బృహస్పతిః । తారకశ్చమయశ్చైవ మహాబల పరాక్రమౌ ॥ 4
యయుర్జేతుం ధేవగణాన్తా విమౌ చోదయామ్యహమ్ । ఏవముక్త్వా దేవగణాన్దేవాచార్యో బృహస్పతిః ॥
తుష్టావ దేవదేవేశం బహురూపం హుతాశనమ్॥ బృహస్పతి రువాచ : 5
త్వమగ్నే! సర్వ భూతానామంతశ్చరసిపావక । వేదాస్త్వ దర్థం జాతాశ్చజాత వేదాస్త థాహ్యసి ॥ 6
త్వంయజ్ఞస్త్వంవషట్కార స్త్వంహవింషి మహాద్యుతే! । త్వం స దేవ ! చరస్యాత్మా విష్ణోరమితతేజసః ॥ 7
త్వం ముఖంసర్వదేవానాం సర్వస్యాత్మా తథా భవాన్ । ఊష్మాత్వం దేహినాం దేహే భుక్త పీతవత స్తథా ॥ 8
యచ్ఛక్తిః సర్వదేవానాం త్వదీయా భూతభావన! । ప్రాప్తా త్వయాహుతిః సమ్యగాదిత్య ముపతిష్ఠతే ॥ 9
ఆదిత్యాజ్జాయతే వృష్టిర్వృష్టేరన్నంతతః ప్రజాః । సర్వదేవవరేశానః సర్వలోక నమస్కృతః ॥ 10
సర్వలోక సముత్పత్తావేకః కారణతాంగతః । కాలాగ్నిరుద్రో భగవాన్ జగత్సంహారకారకః ॥ 11
స్థితౌ నిమిత్తంచ భవాన్ సర్వేషాం దేహినాం శమః । అతీవదుర్ధరం దేవ తవతేజః సుదారుణమ్ ॥ 12
తేజసా తేన దైత్యేంద్రాన్ జహి మా త్వచిరం కృథాః । సఖాచ తే రణే దేవ భవిష్యతి సమీరణః ॥ 13
ఇత్యేవముక్తోంగిరసా మహాత్మా తథేతి తం ప్రాహ నృపేంద్ర! పూజ్యమ్ ।
జీవోఽపి గత్వా పవనం జగాద దేవేశ్వరస్యానఘ ! సిద్ధిమిచ్ఛన్ ॥ 14

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయవజ్రసంవాదే
అగ్నిస్తోత్రం నామ ద్వావింశత్యధిక శతతమోఽధ్యాయః

వజ్రుడు హిరణ్యకశిపు సుతుని కాలనేమిని కృష్ణుడెట్లు చంపెనో తెలుపుమన మార్కండేయుడనియె. కృష్ణుడు దైత్యులం జంపిన తరువాత మిగిలినవారు పాతాళమునకేగిరి. మయుడు తారుడునను వారి నాశ్రయించి వారు దేవతలపైకి దండెత్తిరి. అందు

దేవతలెల్లరోడిరి. వారు విప్రుడగు బృహస్పతిని శరణంచిరి. బృహస్పతి వారింగని తారకుడు మయుడు మహా బలశాలులు. దేవతలం జయింప నేగినారు. నేనే నీరిని ప్రేరేపించితిని అని పలికి దేవ గురువు బహు రూపుడగు నగ్నిని స్తుతించెను.

బృహస్పతి కృతమగు అగ్ని స్తుతి

ఓ అగ్నీ !నీవు సర్వ భూతాంతర్యామివి. నీవలన వేదములు పుట్టినవి. అందుచే నీవు జాతవేదుడవన నొప్పితివి. నీవు యజ్ఞము, వషట్కారము హవిస్సులు నీవే. నీవు విష్ణువు యొక్క ఆత్మవై చరించుచున్నావు. నీవు దేవతలందరకు ముఖము. అంతకు నీవాత్మవు. నీవు శరీరులు తిని త్రాగినపుడేర్పడిన ఊష్మ (ఉక్క, ఉడుకు) అదే దేవతలందరకు శక్తి. నీవు యజ్ఞములందు పొందు ఆహుతి ద్రవ్యము సరిగా ఆదిత్యుం పొందును. ఆదిత్యుని వలన వర్షము, వృష్టివలన నన్నము, దానన్ ప్రజలు గల్గుదురు. సర్వ దేవరులకు నీశ్వరుడవు. సర్వలోక వంద్యుడవు నీవు. ముల్లోకముల పుట్టుకకు నీవే కారణ మయిన వాడవు జగత్సంహార కారకుడగు కాలాగ్ని రుద్రుడు నీవే. సర్వ దేహుల స్థితికి (నిలుకడకు) నీవే హేతువు. శమ స్వరూపుడవు(శాంతి)నీతేజస్సు మిక్కిలి దారుణము. (భరింపరానిది.) దైత్యులను నీవాతేజస్సుచే సంహరింపుము. ఆలసింపకుము. నీకువాయువు తోడగును. అని యంగీరసుడు (బృహస్పతి) నుతింప మహాత్ముడగ్ని సరియే యనియెను. గురుడుచని వాయువునకీవిషయ మింద్రునికి జయముకోరి యెరింగించెను.

ఇది శ్రీ విష్ణు ధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున యగ్నిస్తోత్రమను నూటఇర్వది రెండవ అధ్యాయము.

## నూటయిరువదిమూడవ అధ్యాయము - వాయుస్తోత్రము

బృహస్పతి రువాచ : జగదాయుర్భవాన్వాయో : శరీరస్థః శరీరిణామ్ ।
అనంతమూర్తి ర్ధర్మాత్మా దేవోనారాయణః ప్రభుః ॥ 1
అచింత్య వీర్యః పురుషః సదాధారః సనాతనః । సాక్షిభూతశ్చ సర్వేషాం కర్మణోః శుభపాపయోః ॥ 2
ఘ్రాణ స్త్వం దేహినాం దేహే చేష్టితంచ తథా భవాన్ । భవాన్ రుద్రో భవాన్బ్రహ్మా భవాన్విష్ణుః సనాతనః ॥ 3
తవాయత్తం హి జగతాం వర్షావర్షం శుభాశుభమ్ । భవాన్విసృజతే మేఘాన్ భవాన్సంహరతే పునః ॥ 4
భవాన్ధారయతే మేఘాన్ వర్షమాణాం స్తథా దివి । ఆదిత్యరశ్మి పీతస్య మేఘోదరగతస్యచ ॥ 5
రసస్యభంక్తా సతతం భవానేవనభ స్తతే । తడిల్లతానాంచతథా భవాన్ కర్తా జగత్త్రయే ॥ 6
అంభసాంభేదకాలేతు సర్వాధారః సమీరణః । పరస్పరంహి చపత స్తథా సంఘటనా త్ప్రభో! ॥ 7
గర్జితం జాయతే లోకే మేఘోదర గతం మహత్ । బలేన త్వత్సమంనాన్యంభూతం పశ్యామి భూతలే ॥ 8
తస్మాత్త్వంకురు సాహాయ్యం వేదమూర్తే ర్విభావసోః ॥ 9
ఏతావదుక్తోంగిరసామహాత్మా । తథేతి తంప్రాహసమీరణోఽపి ।
జగామ యుద్ధం సహపావకేన । దైత్యేశ్వరాన్ దేశరిపూన్మహాత్మా ॥ 10

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
వాయుస్తోత్రంనామ త్రయో వింశత్యధిక శతతమోఽధ్యాయః.

బృహస్పతియనియె. ఓ వాయుదేవతా ! నీవుజగముయొక్క యాయుస్స్వరూపుడవు. శరీరుల శరీరమందుందువు. అనంత మూర్తివి. ధర్మాత్ముడవు. నారాయణ దేవుడవనీవే. నీ వీర్యమూహింప వలను గానిది. పురుషుడవు సదాధారుడవు. సనాతనుడవు శుభాశుభ సర్వకర్మ సాక్షివి. దేహుల మేనిలోని ఘ్రాణేంద్రియము నీవు. కదలిక యంతయు నీవే. త్రిమూర్తులు నీవే. జగత్తుయొక్క వర్షాఽవర్షము, శుభాశుభములు నీయందే ఆధారపడి యున్నవి. నీవు మేఘములను వదలుదువు. ఉపసంహరింతువు. అవివర్షించుతరి నాకాశమందీవు వానిని ధరింతువు. ఆదిత్య కిరణములు త్రావగా మేఘములలో జేరిన

రసమును (నీటిని) ఆకసమందు విభజించు వాడవు నీవే. మెరుపు తీగలకు నీవు కర్తవు. మేఘగర్భమందలి నీటిని నీవు విభజించుతరి సర్వాధారుడగు వాయువీవు. ఉదకముతో పొందిన సంఘర్షణ వలన పెద్ద గర్జితము (ఉరుము) పుట్టును. నీతో సమబలు నింకొక భూతముం గానను. (మహా బలుడను పేరు నీకు సార్థకము) అందుచే వేదమూర్తి యైన యగ్నికి సహాయము సేయుము అని యింత వరకంగీరసుడు పలికినది విని వాయుభగవానుడట్లేయని దేవ శత్రువులను దైత్యేశ్వరులపై కగ్నితో గూడ యుద్ధమున కేగెను.

ఇది శ్రీ విష్ణు ధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున వాయుస్తోత్రమను నూట యిరువదిమూడవ అధ్యాయము.

# నూటయిరువదినాల్గవ అధ్యాయము - భగవద్దర్శనము

మార్కండేయ ఉవాచ :- నాయ్వగ్నీ సహితౌగత్వామయతారపురోగమాన్ ।
జిగ్యతుః సమరే దైత్యా న్నానా ప్రహరణోద్యతాన్ ॥ 1
విజితాస్తే రణేదైత్యా మయతార పురోగమాః । త్యక్త దేవాలయాః సర్వే వరుణాలయ మాగతాః ॥ 2
ఏతస్మిన్నేవ కాలేతు హిరణ్యకశిపోః సుతః । కాలనేమిరితి ఖ్యాతః శీత శీర్షోను దృశ్యతే ॥ 3
శతబాహుర్మహాకాయః పర్వతాకార దర్శనః । బ్రహ్మలబ్ధవరోరౌద్రో దగ్ధ శైలసమచ్ఛవిః ॥ 4
ఏకోదరోద్వైపాదశ్చ ఏకగ్రీవః సురాంతకః । అంగదీ బద్ధముకుటః కుండలాంబర భూషణః ॥ 5
సర్వాయుధధరో రౌద్రో గదాపాణిర్విభీషణః । దత్వాఽభయం సదైత్యానాం తస్మై మేరుంసురాలయమ్ ॥ 6
గత్వా విజిగ్యే త్రిదశాన్ స్థానేభ్యశ్చావరో పయత్ । త్రైలోక్యమాత్మ సాత్కృత్వా సుఖమాస్తే త్రివిష్టపే ॥ 7
తస్యతేహ్యనుగాః సర్వేలోకాః స్థావరజంగమాః । తదాజ్ఞాకారిణస్సర్వే తద్భావస్యాను వర్తకాః ॥ 8
పంచతత్రాభ్య వర్తన్త విపరీతేన కర్మణా । వేదో ధర్మ క్షమా సత్యం శ్రీశ్చనారాయణాశ్రయాః ॥ 9
సర్వేషామను సంధానాత్సరోషో దానవేశ్వరః । వైష్ణవం పదమయన్విచ్ఛన్ యయౌనారాయణాన్తికమ్ ॥ 10
జ్ఞాత్వాదైత్య మధాయాంతం దేవోఽపిమధుసూ దనః । తార్క్ష్యమావాహయాంచక్రే ఆరురోహచతం హరిః 11
సదదర్శ హరిందేవం తార్క్ష్యస్థం దైత్యరాట్ తదా ॥
సజల జలదనీలం పద్మ పత్రాయతాక్షమ్ ఖగవతి మవరూఢం కల్పవృక్షోపమానమ్ ।
హలముసలగదాభిః శోభితందేవదేవం పర పురుషమజేయం శార్ఙ్గ చక్రాసిపాణిమ్ ॥ 12

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే కాలనేమ్యుపాఖ్యానే
శ్రీభగవద్దర్శనం నామ చతుర్వింశత్యధిక శతతమోఽధ్యాయః

మార్కండేయుడనియె:- వాయువు అగ్నియు నేగిమయతారా ప్రభృతులగు దైత్యులను గెల్చిరి. ఆ దైత్యులు దేవాలయము (స్వర్గమును) విడిచి వరుణాలయమునకు వచ్చిరి. ఇదే సమయమున హిరణ్యకశిపుని కొడుకు కాలనేమి చల్లని శిరస్సుతో గనబడెను. శతబాహులై పర్వత మట్లుండెను, బ్రహ్మ వరములొందెను. కాలినకొండవలె వెలుగుచుండెను. ఏకోదరుడు ద్విపాదుడు సురాంతకుడు అంగదములు దాల్చి కిరీటము పెట్టుకొని కుండలములు దాల్చి చక్కని వస్త్రములు కట్టుకొని సర్వాయుధములూని భయంకరు దై దైత్యుల కభయమిచ్చి సురలకావాసమైన మేరువునకేగి వేల్పులను గెల్చెను. వారిని స్థానభ్రష్టులను గూడ చేసెను. ముల్లోకములు తన వశము సేసికొని స్వర్గమందు సుఖముండెను. వానిననుగమించి చరాచరములయిన యెల్లలోకములు వాని యాజ్ఞకు కట్టుపడి వాని భావమున కనుకూలముగ మెలగిరి. వాని రాజ్యమందు వేదము ధర్మము క్షమ (ఓరిమి) సత్యము. నారాయణాశ్రయమైన లక్ష్మియను నైదు పదార్థములు మాత్రము వానికి విపరీతములై (వ్యతిరేకించి) ప్రవర్తించినవి. అందరిం గూడకట్టుకొని రోషముతో వైష్ణవ

స్థానముకోరి నారాయణుని దరికేగెను. దైత్యుని రాకగని విష్ణుదేవుండును గరుడుని పిలిచి యదియెక్కి యెదురేగెను. వాడా హరిం గని జలము తోడి మబ్బట్లు నిగనిగలాడు నల్లనిమేను తామర రేకులట్లి కన్నులు గల గరుడారూఢుని కల్పవృక్షమట్లున్న నాగలి రోకలి గద మున్నగు నాయుధములతో శోభించు నా దేవదేవు నజేయుని శార్ఙ్గ చక్ర గదాఖడ్గధారిని హరిం జూచెను.

ఇది శ్రీ విష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున కాలనేమి ఉపాఖ్యానమందు
భగవద్దర్శనమను నూటయిరువదినాల్గవ అధ్యాయము.

## నూటయిరువదియైదవ అధ్యాయము- కాలనేమివధ

మార్కండేయఉవాచ :- దృష్ట్వా సపురతోదేవం దాన వానభ్య భాషత । అయం సదృశ్యతే విష్ణుర్గానవా యేన ఘాతితాః ॥
శతృష్ణయేవ శక్రార్థే బభూవకిల నామనః ॥ యదావంచిత వాన్పుత్రిం భాతృవ్యస్య బలింమమ ॥ 2
నృవరాహవపుః కృత్వాలోకచితహరంపురా । హిరణ్యాక్షం జఘ్నానైవ పితృవ్యం మమవిస్మితమ్ ॥ 3
అపూర్వం రూపమాస్థాయ నరసింహస్యదానవాః । పితరం యోజఘానైన హిరణ్యకశిపుం రణే ॥ 4
వరాహరూపిణానేన పాతాళతలమాస్థితాః । అసంభావ్య భయేనాజౌ దానవా వాని పాతితాః ॥ 5
నరాశ్వవ పుషాయేన మధుకై పభయోఃపురా । పాతాళాదాహృతా వేదా స్తతస్తౌ యుధిఘాతితౌ ॥ 6
అస్యాజ్ఞా కారిణోదేవా నసంతిష్ఠంతిశాసనే । అయరక్షాం దేవానామస్మాభిర్వై ప్రకృప్యతామ్ ॥ 7
త్రైలోక్యేదైత్యముద్భూతం యుద్ధేనైవపుసః పునః । దేవసార్ధమ ఇత్యేవ తేన వధ్యోఽథమేరిపుః ॥ 8
అతీతస్యాద్యకాలస్య దుర్ణయస్యకృతస్యచ । భోక్ష్యతేఽయంఫలం దైత్యాః సర్వే పశ్యత మాచిరమ్ ॥ 9
ఇత్యేత దైత్యనాథస్య వాక్యం శ్రుత్వైవ దానవాః । జయశబ్దంతతశ్చక్రు స్సింహనాద రవంతథా ॥ 10
వాచశ్చప్రతికూలాస్తా స్తేన దుష్టేన చేతనా । తచ్ఛ్రుత్వాచహరి ర్దేవః క్రుద్ధోనామేదమ బ్రవీత్ ॥ 11
కిమిదం గర్జసేదైత్య! శారదాంబుదవద్వృథా । ప్రజాపతి కృతం సేతుం కథం లంఘితుమిచ్ఛసి ॥ 12
ఏవంకథయతో ర్దేవదైత్యయోః పార్థివోత్తమ । ప్రావర్తత రణోఘోరో గదాపాత విభీషణః ॥ 13
దానవైర్దేవ దేవోఽపి కాలనేమి పురః సరైః । సంభాద్యతే మహాస్త్రైఘై ర్మఘైరివనభ స్తలమ్ ॥ 14
సంభాద్యమానో దైత్యేంద్రై ర్గావదేవో నవివ్యథే । యోధయామాస సరణే గదయాదాన వాన్బహూన్ ॥ 15
తస్యదైత్య ప్రసక్తస్య కాలనేమిర్మహాసురః । పాతయామాస వేగేన గదాం గరుడమూర్ధని ॥ 16
గదాఘాతేన రౌద్రేణ తేనతార్క్ష్య స్యమానద! । నాసాభగ్నావ్యథా జాతా రక్తచ్ఛర్దిశ్చ దారుణా ॥ 17
వ్యథితం గరుడం గృష్ట్వా దేవేన హరి మేధసా । క్షిప్తం దైత్య వినాశాయతదా చక్రం సుదారుణమ్ ॥ 18
యత్తత్సుదర్శనలనామ సూర్యతేజః సముద్భవమ్ । వజ్రనాభం సహస్రారం క్షురపర్యంత మండలమ్ ॥ 19
చ్యుతం చక్రికరాచ్చక్రం కాలనేమిం మహాసురమ్ । శీఘ్రం విశిరసంచక్రే విబాహుంచ తథా నృప ॥ 20
విబాహు శిరసంకృత్వా దేవ హస్తముపేయివాన్ । విబాహు శిరసం కాయం క్షర చ్ఛోణిత నిర్ఝరమ్ ॥ 21
సపపాతాస్య మేదిన్యాం యదాతార్క్ష్యస్తతో రయాత్ । ఉరసాపాతయామాస దేవానాం పశ్యతాం తదా ॥ 22
పతతా దైత్యకాయేన సశైల వన కాననా । కంపితా వసుధా సర్వా పతితాశ్చశిలోచ్చయాః ॥ 23
దానవేంద్రంహతం దృష్ట్వామయతార పురోగమాః । తుష్టువు ర్దేవదేవేశం వరచక్రాసి పాణినమ్ ॥ 24
తుష్టావచ తథాదేవో బ్రహ్మ శుభచతుర్ముఖః । సుతశ్చ బ్రహ్మణాదేవోలోక పాలాన్యథాపురా ॥ 25

స్థానేషుయోజయామాస యజ్ఞం దేవముఖేతథా । జగామ బ్రహ్మణాసార్ధం బ్రహ్మలోకం తదా విభుః ॥ 26
తత్రాత్మానం యజ్ఞమూర్తి మిజ్యమానం ద్విజోత్తమైః । దృష్ట్వా స్వయంతు జగ్రహ యజ్ఞభాగం మహాత్మనామ్ ॥ 27
తత్రపూజా ముపాదాయ జగామ స హిరణ్వతీమ్ । అస్త్రైరనుగత స్తత్ర సుష్వాప కిల యోగవిత్ ॥ 28
ఏవం సదైత్య ప్రవరో నరేంద్ర ! । కృష్ణేన చక్రేణ పురానిరస్తః ।
అతఃపరం కిం కథయామి తుభ్యం । తన్మేవదస్వాయత లోహితాక్ష ! ॥ 29

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయవజ్రసంవాదే
కాలనేమివధోనామ పంచవింశత్యుత్తర శతతమోఽధ్యాయః

మార్కండేయుడనియె:- ప్రహ్లాదుడెమట హరంగని దానవులతో ఇడుగో! నరవరాహ మూర్తి! మాపిన తండ్రిని హిరణ్యాక్షుని దానవులను జంపిన వాడు కనబడు చున్నాడు. లేనిపోని యాశతో (యాచకుడై) ఇంద్రుని కార్యము చక్కబెట్టు వామనుడై మాపినతండ్రి కొడుకగు బలిని వంచించి నాడితడే. నరసింహ మూర్తియై మా తండ్రిని హిరణ్య కశిపుం పోరిలో గూల్చిన యతడితడే వరాహావతారుడై భయమననేమో యెఱుంగని యీతనిచేత బాతాళవాసురాలైన దైత్యులుగూల్పబడిరి. ఆరూపుతోడనే మధుకైటభుల పరివారము గూల్పబడి పాతాలమునుండి వేదము తీయనపలననే గొనిరాబడినవి. అవ్వల యుద్ధమందు వాండ్రిద్దరు హతులైరి. వీని శాననము సమలుచేయు దేవతలు మన పశముస నుండరు. దేవతలకితడు రక్షాకపచము. దీనిని మనము లాగి పారవేయ వలెను. దైత్యజాతి తిఱిగితిఱిగి యుద్ధముతోనే యుద్భవించినది. అనగా మనజాతి కేవలము యుద్ధనిమిత్తముగానే పుట్టినట్లున్నది. మనపోరున కంతు గానబడుటలేదన్న మాట. ఇపుడు ముల్లోకములు దేవపశమై పోయినవి కావుననే యీ శత్రువును కడతేర్చ పలసినవాడయి యున్నాడు. జరిగి పోయిన కాలము యొక్కయు, తాను మన యెడల చేసిన దుర్నయమునకు ఫలమిప్పుడే యనుభవింప గలడు అని యిట్లు దైత్యనాథుడు పలికినది విని జయజయధ్వానములు సింహగర్జనములుం జేసిరి. దుష్టమతితో నతడు పలికిన ప్రతికూల వచనములను హరి విని కుపితుడై యిట్లనియె.

ఓరీ! దైత్యా! శరత్కాలమేఘమట్లు వ్యర్థముగ నేమిది గర్జించుచున్నావు. ప్రజాపతి ఏర్పరచిన కట్టను దాటనెట్లు తలంచు చున్నావు అని యిట్లు పలుకుచుండ దేవాసురులకు ఘోరరణ మార్రంభ మయ్యెను. కాలనేమి మున్నగు దానవుల మాయభయఁచే మహాస్త్రములచే విష్ణువు విష్ణుపదముగూడ (ఆకాశముకూడ) కప్పివేయబడెను. కాని దానికి హరియించుకయు బాధనొంద దయ్యెను. గద చేకొని శత్రువులతో బోరెను. అంతలో కాలనేమి గరుత్మంతునిపై గదను విసరెను. ఆగదా ఘాతముచే గరుడుని ముక్కు పగిలి వ్యథ గలిగెను. దారుణముగా రక్తము గ్రక్కు కొనెను. అదిమాచి హరిమేధసుడు దైత్యనాశనపగు గాకయని అతిదారుణ చక్రాయుధ మును విసరెను. ఆసుదర్శనము సహస్రారము (వెయియరలు పలుకలు) నడిబొడ్డు వజ్రమయము సూర్యునట్లు వెలుగుచుండెను. బ్రహ్మండము తుది దాక వ్యాపించిన తేజో మండలము కలది. చక్ర కరము నుండి వదలివెళ్ళిన యమ్మహాయుధము కాలనేమి మహాసురుని శిరోహీనుని బాహుహీనుని గావించెను. అది తిరిగి స్వామి హస్తమునకు వచ్చెను. తల చేతులు పోయి రక్తము సెలయేఱట్లు ప్రవహింప నింకను రణమందు పడిపోకున్న వాని మొండెమును గరుడుడు ఱొమ్మునందాకి దేవతలట్టె చూచుచుండ మేదినిం బడవేసెను. ఆ దానవుని కాయము పడుచున్నంత ననంతగిరి కాననయైన యనంత (భూమి కంపించెను. పర్వతములు గూలెను. దానవేంద్రుడు హతుడగుట చూచి మయిరు తారుడు మున్నగు దానవులు చక్రగదా ఖడ్గపాణియగు విష్ణువును స్తుతించిరి. బ్రహ్మయు నలుమోముల నా హరిం గొనియాడెను. స్తుతింప బడి దేవదేవుడు లోకపాలురను ముందటియట్ల వారివారి స్థానములందు నిలిపి దేవముఖ మందు యజ్ఞమును సంయోజించెను. (యజ్ఞ హవిర్భాగములు దేవతల ముఖమున కందునట్లు గావించె నన్నమాట.) అపుడు బ్రహ్మతో హరి బ్రహ్మలోకమున కేగెను. అక్కడ యజ్ఞమూర్తిగదన్ను ద్విజవరులు యజించు చుండ జూచి యా మహాత్ముడిచ్చిన యజ్ఞభాగములను దానునందుకొనెను. అక్కడ పూజగైకొని అస్త్రములు (అధి దేవతలు) తనను వెంబడింప హిరణ్యవతికేగి యోగేశ్వరుండట నిద్రపోయెను. ఇట్లా దైత్యనాథుడు కాలనేమి కృష్ణుని చక్రాయుధముచే గూల్పబడెను. ఇటుపై నేమి యాన తిత్తు నది యడుగుమన వజ్రుండు మార్కండేయున కిట్లనియె.

ఇది శ్రీ విష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున కాలనేమివధయను నూటఇరువదియైదవ అధ్యాయము.

# నూటయిరువదియారవ అధ్యాయము - వరాహప్రాదుర్భావము

వజ్ర ఉవాచ : యదుక్తం దైత్యవాదేన దైత్యానాం కాలనేమినా । పాతాల దైత్య శమనం వపుర్దేవస్య చక్రిణః ॥ 1
తదహం శ్రోతుమిచ్ఛామి తత్రమే సంశయో మహాన్ । చరితం తస్యదేవస్య భవాన్వేత్తి యథాతథమ్ ॥ 2
విష్ణునా తు బలౌ బద్ధే పాతాళతలమాశ్రితాః । జఘ్నుర్దైత్యగణా లోకాన్ బ్రాహ్మణాంశ్చ విశేషతః ॥ 3
భూతలేహన్యమానేతు యజ్ఞనాశ ముపాగతే । క్షుత్క్షామైస్త్రిదశై ర్బ్రహ్మా దైత్య హేతోః ప్రచోదితః ॥ 4
బ్రహ్మాపిచోదయామాస దేవదేవం జనార్దనమ్ । బ్రహ్మణా చోదితో దేవః పాతాల గమనేచ్ఛయా ॥ 5
చకారరూపం వారాహం భిన్నాంజన చయ ప్రభమ్ । శశాంక లేఖా దంష్ట్రాగ్రం వజ్ర ప్రోథఖురం తథా ॥ 6
వజ్రసంహననం భీమం త్రైలోక్య క్షోభకారకమ్ । పీనవృత్తాయత స్కంధం మహాపీన శిరోధరమ్ ॥ 7
వివృత్తాస్యం మహాకాయం భీమాక్షం భీమ నిస్వనమ్ । ఆవర్త రోమ సంఘాతం తేన విగ్రహమూర్జితమ్ ॥ 8
స సముద్రేణ పాతాళం ప్రవిశ్య మధుసూదనః । దైత్యానాం దర్శనే తస్థౌ మహాబలపరాక్రమః ॥ 9
పాతాళేసూకరం దృష్ట్వా ప్రోథదారిత భూతలమ్ । సుముస్త గర్భకబలం ఘుంఘుంకారకృతాననమ్ ॥ 10
పంకానులిప్త సర్వాంగం నిర్యయుర్దానవాస్తదా । సతతం మృగయాశీలా జఘ్నుస్తంచ వరాయుధైః ॥ 11
సహన్యమానో దైత్యాస్త్రైః పృషతైరివ పర్వతః । స్కంధ కండూచ్ఛలేనాథ దైత్యాధిప నివేశనమ్ ॥ 12
పాతయామాస వేగేన మహాద్రి శిఖరోపమమ్ । వేశ్మనశ్చ నిపాతేన దేవదేవస్య మాయయా ॥ 13
హన్యంతే దానవాఘోరాః శతశోఽథ సహస్రశః । తే క్షయా ద్దైత్యముఖ్యానాం దైత్యముఖ్య క్షయంకరాః ॥ 14
యథార్థ క్షయతాం జగ్ముః క్షయే రౌద్ర ఉపస్థితే । క్షీయమాణాం క్షయైర్దృష్ట్వా క్షతజోక్షిప్త మూర్ధజాన్ ॥ 15
క్ష్మాతలస్థాన్ క్షతైర్గాత్రైః క్షణేన క్షణదా చరాన్ । ప్రధానా దైత్య ముఖ్యాయే ఘోరసేన బలేన తే ॥ 16
జగ్ముర్వరాయధైర్దేవం శతశోఽథ సహస్రశః । హన్యమానో దైత్యేంద్రైః ప్రోథేన దితిజోత్తమాన్ ॥ 17
విదారయామాస రణే దంష్ట్రాగ్రేణ తథావరాన్ । ఏవం వరాహేణ రణే హతాన్ దృష్ట్వా దితేః సుతాన్ ॥ 18
హరిం విజ్ఞాతవాన్దేవం ప్రహ్లాదో దైత్యసత్తమః । సప్రణమ్య హరిం దేవం తుష్టావవరవీరహా ॥ 19
తంజగాద మహాతేజా దేవదేవో జనార్దనః । అనుగ్రాహ్యోఽసిమే దైత్య! భక్తో ఽసి సతతంయతః ॥ 20
తవాజ్ఞా లంఘకాఘోరాః ప్రాయేణ నిహతామయా । తవాజ్ఞాకారిణో దైత్యా నమే వధ్యా దితేః సుతాః ॥ 21
శాసనం పాలయ మహ్యం పాతాలం త్వం సుఖీభవ । మూర్ధ్నే స్థాపాయ దైత్యాం స్త్వం త్వదాజ్ఞా పరిబృంహితాన్ ॥ 22
ఆభూతసంప్లవం దైత్యజీవం త్వం న విమోక్ష్యసే । ధర్మిష్ఠానాంచ దైత్యానాం సదా రాజా భవిష్యసి ॥ 23
మద్భక్త్యా పరయా వత్స! పుత్ర స్తవ విరోచనః ॥ మార్గచ్యుతోఽపి నహతః కిల్బాయుశ్చతథాక్షతః ॥ 24
బలిర్వైరోచన శ్చైవ మయాబద్ధః కృతే తవ । కరిష్యతి సశక్రత్వం ప్రాప్తే సావర్ణికేంతరే ॥ 25
బాణంచ తనయం తస్య మమ విప్రియకారకమ్ । త్వత్కృతేన హనిష్యామి తస్యచ్ఛేత్స్యామి దోర్ద్రుమాన్ ॥ 26
భిన్నబాహు ర్మయాయుద్ధే హరస్యానుచరో బలీ । మహాకాల ఇతి ఖ్యాతో కల్పస్థాయీ భవిష్యతి ॥ 27
ఏకమేకంతు దైత్యేంద్ర! సంతానే సతతంతవ । నాహం వధిష్యే ధర్మజ్ఞ! త్వత్కృతే వ్యేతు తే భయమ్ ॥ 28
భవాన్భక్తస్తథామహ్యం భక్తేష్వపి తథా మమ । నాస్త్యదేయం మహాభాగ! తస్మాత్త్వంగచ్ఛ నిర్వృతః ॥ 29
హతశేషానుపాదాయ దైత్యాన్సత్పథమాశ్రితాన్ । ఏతావదుక్త్వా ప్రహ్లాదం తత్రైవాంత రధీయత ॥ 30
ఏతద్వరాహచరితం తవ రాజ సింహః ప్రోక్తం మయా సకల కల్మష నాశకారి ।
ఉద్వృత్త దైత్య శమనస్య ఋషిస్తుతస్య । కండూ వినోదన హతాసుర పుంగవస్య ॥ 31

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
పాతాళే వరాహ ప్రాదుర్భావోనామ షడ్వింశత్యధిక శతతమోఽధ్యాయః

కాలనేమికథనమునందు పాతాళమందలి దైత్యుల సంహరించుటకు హరి పూనిన శరీరమునుగూర్చి నాకు సంశయముగల్గు చున్నదది యానతిమ్మన మార్కండేయుడనియె. బలిని హరి బంధించినతరువాత పాతాళవాసులగు దైత్యులు లోకములను విశేషముగ బ్రాహ్మణులను చంపిరి. భూతలము హతమై యజ్ఞము నాశనమంద నాకలింగుమిలి దేవతలచే దైత్య (వధ) నిమిత్తముగ బ్రహ్మ ప్రేరేపింపబడెను. బ్రహ్మయుం బ్రేరేపింప హరి వరాహరూపముం దాల్చెను. నూరినకాటుకవలె నల్లని రూపము చంద్రరేఖవంటి కోరకొన వజ్రాయుధమట్టి ముట్టెయు గిట్టలును వజ్రశరీరమునుం నిండ బలిసిన వర్తులాకారమైన మూపు మగల నొత్తుకొన్న (లావైన) మెడ తెఱచిన మొగము భయంకర నేత్రములు భయంకర ఘుర్ఘురారావము సుడులుతిరిగిన రోమ సంఘాతముగల భయంకర త్రిలోక క్షోభకరమైన వరాహాకారముంబూని సముద్రము దారింబడి పాతాళముం జేరి దైత్యులెమరగుటకై నిలువబడెను. ముట్టెతో భూతల ముంజీల్చుచు తుంగముస్తలనోట గఱచికొని నమలుచు ఘంఘంకారము సేయుచు నొడలంత బురదపూసుకొనియున్న సూకరమును (పందిని) పాతాళమందుగని మహా బల విక్రములు వేట కలవాటుపడినవాండ్రు దానవులు వెడలి నిశితాయుధములం గ్రుమ్మిరి. వాన చినుకులం బర్వతమట్లా యసురుల యాయుధములం తాకిడివడి మూపు గోకుకొను నెపమున నవియంధట్టట్టు మెలగి మహాద్రి శిఖరమట్లున్న దైత్యరాజు భవనముం బడవేసెను. దేవదేవుని మాయచే నాగృహముగూలిపడ దానియడుగునబడి నూరులు వేలుగ మూక దానవులు నుగ్గునుగ్గెరి. అట్లు దైత్యముఖ్యులు దైత్యముఖ్యక్షయము (నాశనము)నకు కారణులై క్షయమునుండి (భవనము నుండి) కూలియు అది పనిబడియు భయంకరమైన క్షయము = నాశనము (దానవులకు ప్రలయకాలము) అసన్నమైన యంపరును యదార్థ క్షయమును బొందిరి. అసలైన నాశనమందిరన్నమాట. ఇట్లు సర్వవిధ క్షయములచేత క్షీణించిన యా దానవులను రక్తముచేనిండిన జుట్టుతో క్షణములో క్షతగాత్రులై క్షితితలమునబడి క్షణదాచరులను (క్షణద = రాత్రి) నిశాచరులను బూచి యింతను మిగిలియున్న ప్రధానులు దైత్యముఖ్యులు జేరిన బలముతో (ఉరః = రొమ్ము-గుండెబలముతో గుండెలు రుదుటబెట్టుకొని యన్న మాట) గట్టియాయుధములతో పందలు వేలుగా దేవదేవుం గొట్టిరి. అట్లుగొట్టువడి వరాహము ముట్టెతో కొమ్ముతో గ్రుమ్మి దైత్య ముఖ్యులను జీల్చివైచెను. నీవరాహమిట్లాహవమున దితి సంతానముం దెగనేయటంగని దైత్యోత్తముడు ప్రహ్లాదుడీయన హరియని గ్రహించెను. అతడు హరిం బ్రణమిల్లిస్తుతించెను. వానింగని మహాతేజస్వి జనార్దనుడు దైత్యా! నీవు నాకనుగ్రాహ్యుడవు నా భక్తుడవు. కావున నీ యాజ్ఞోల్లంఘనము సేసిన ఘోర రాక్షసుల నెందరనో నేను గూల్చితిని వీయాజ్ఞాకరులను నేను వధింపను. పాతాళమందీవు శాసన పాలనముసేయుము. సుఖముండుము. నీయాజ్ఞావశులను దారిలోబెట్టుము. భూత ప్రళయము దాక నీవు ప్రాణముంగోల్పోవు. ధర్మనిష్ఠులయిన దైత్యులకీవు శాశ్వత ప్రభ వగుదువు. వత్సా! నీ పుత్రుడు విరోచనుడు నాయెడగల పరమ భక్తి మార్గము దప్పినవాడయినను నేను జంపలేదు. పైని వానిం గల్పాయుష్కుంగావించెను. నీకొరకే విరోచనుని కొడుకును బలిని నేను బంధించితిని. సావర్ణి కమన్వంతర మందాతడే యింద్రుడగును. ఆ బలికొడుకు బాణుని నాకప్రియమొనరించినవాని నీకొరకు (నీవునా పరమ భక్తుడవని) జంపలేదు. వాని భుజతరువుల మాత్రము ఖండించితిని. నాచేజేతులు తెగినవాడు పరశివునికనుచరుడై యాబలశాలి మహాకాలుడను పేర కల్పాంతమువరకు జీవించును. నీ నిమిత్తమయిన యాదరముచేత నీ సంతానము నేయుక్కనిం గాని నేను సంహరింపను. నీకు భయము వలదు. నీవు నా భక్తుడవు. భక్తులకు నాకు నీయరాని దొక్కటియు లేదు. మహాభాగ! నీవు సంతుష్టుడవై చావగా మిగిలిన సన్మార్గము నందున్న దైత్యులం జేకొని జనుము. అని ప్రహ్లాదునితో నని భగవంతుడంతర్ధానమందెను. రాజసింహా! ఇది వరాహావతార చరిత్ర యింతదనుక నీకు దెల్పితిని. సర్వపాప హారి యిది. ఉచ్ఛృత్తులయిన దైత్యులను గూల్చి ఋషిస్తుతుడై దురద గోకికొను నెపమున నసుర వరులం గడతేర్చిన హరి చరిత్ర యిది.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున వరాహావతార చరిత్రమను
నూటయిరువదియారవ అధ్యాయము.

# నూటయిరువది ఏడవ అధ్యాయము-మరుదుత్పత్తి

వజ్ర ఉవాచ :- దితిర్వినష్ట పుత్రాచయచ్చకార ద్విజోత్తమ ! తన్మమావక్ష్య సంక్షేపాత్ తత్రమే సంశయోమహాన్ ॥ 1
మార్కండేయ ఉవాచ :- దితిర్వినష్టపుత్రాచ తపసామహతా నృప । ఆరాధయామాస తదా భర్తారం కశ్యపంమునిమ్ 2
ఆరాధితః సుతపసా చ్ఛందయామాస భామినీమ్ । వరేణచ వచఃకాలే పుత్రవ్యసన కర్షితామ్ ॥ 3
కశ్యపఉవాచ :- వరం వరయ! సుశ్రోణి! వరదోఽహముపస్థితః । ఏవముక్తా వరం వవ్రే దేవీ పుత్రవినాకృతా ॥ 4
దితిరువాచ :- శక్రహంతార మిచ్ఛామి పుత్రం బ్రహ్మ న్యశస్వినమ్ ।
యదితుష్టోఽసి మేబ్రహ్మం స్తం ప్రయచ్ఛ సుతంమమ ॥ 5
మార్కండేయ ఉవాచ :- ఏవముక్తస్తదా భర్తా నాతిప్రీతోఽబ్రవీద్వరమ్ । ఏవంతే భవితాభద్రే!శుచిస్త్వం చేద్భ విష్యసి ॥
పూర్ణంవర్షసహస్రంచ నాస్యథా తద్భవిష్యతి । ఏవముక్త్వా తయాసార్థ ముపాసరజనీం ద్విజః ॥ 7
తతోజగామధర్మాత్మా తపసేదృఢ నిశ్చయః । ఆతస్థే నియమందేవీ సగర్భాచ దితిస్తదా ॥ 8
నియమస్థాంతు తాందృష్ట్వాశక్రో వచనమబ్రవీత్ । ॥
శక్ర ఉవాచ :- అహందేవి! కరిష్యామి తవ శుశ్రూషణంసదా । స్థితాయా నియమే ఘోరే తదనుజ్ఞాతు మర్హసి ॥ 9
మార్కండేయఉవాచ:- బాఢమస్త్విత్యథోక్తస్తు తయాదేవః పురందరః । తత్రోవాస చ్ఛలాన్వేషీ శుశ్రూషు ర్మాతరంసదా ॥
తదాబ్దశేషేకాలేచ దివాసుప్తాఽదితిర్నృప ! । మధ్యాహ్నసమయే రాజన్పాదయోఃకృతమూర్ధజా ॥ 11
తస్యాః సంప్రాప్యతచ్ఛిద్రం వజ్రీపరపురంజయః । వికశ గర్భ మార్గేణ దివ్యతేన నరేశ్వర! ॥ 12
సంప్రవిశ్యైవ తంగర్భం వజ్రేణ శతపర్వణా । కృతవాన్సప్త ధావజ్రీ భాగం భారింతతః పునః 13
ఏకైకం సప్తధా చక్రే గర్భోఽపిప్రారుదత్తదా । మారుదస్వేతిం వజ్రీ ప్రాహకార్యేస్వకేస్థితః ॥ 14
ఏతస్మిన్నేవ కాలేచ దైత్యేంద్ర జననీ తదా । విబుద్ధా వారయామాస శక్రందశశతేక్షణమ్ ॥ 15
వజ్రగర్భాంజలిఃశక్రో మాతుర్యచన యంత్రితః । నిశ్చక్రామోదరాత్తస్యాః సహబాలైర్మహాత్మభిః ॥ 16
తంజగాద దితిః శక్రం ప్రాంజలిం పురతః స్థితమ్ నతే శక్రాఽ పరాధోస్తి మమగర్భనికృంతనే ॥ 17
సతోపాయైర్విధయంతవ్యః శత్రుర్నయ విదా సదా । మమా పరాధాద్గర్భోఽయం త్వయాద్యబహుధాకృతః 18
భవన్తుమరుతోనామ సర్వే దేవాః పృథక్ పృథక్ । మారుదధ్వమితి ప్రోక్తా యతః శత్వక్రయా సుతాః ॥ 19
తతశ్చమరుతోనామ భవిష్యంతి జగత్త్రయే । త్వత్సహాయా భవిష్యన్తి త్వదాజ్ఞావశవర్తినః ॥ 20
నచైతే భ్యోభయం కించిత్కదాచిత్తే భవిష్యతి । ఏషాంనామ విభాగాంస్తుస్థానానివ తథాకురు ॥ 21
ఏకజ్యోతిశ్చ ద్విజ్యోతి స్త్రిచతుర్జ్యోతిరేవచ । ఏకశక్రోద్విశక్రశ్చత్రి శక్రశ్చ మహాబలః ॥ 22
ప్రథమే పవనస్కంధే గణోఽయం సురథః స్మృతః । ఇంద్రశ్చగవ్యో దృశ్యశ్చ ఇతః ప్రతిశిరాస్తథా ॥ 23
మితశ్చ సమ్మితశ్చైవ అమితశ్చ మహాబలః । ద్వితీయే పవనస్కంధే గణోనా నామ ప్రఘోషణః ॥ 24
ఋతజిత్సత్యజిచ్చైవ సుషేణః సేనజిత్తథా । అతిమిత్రోనామిత్రశ్చ పురుమిత్రోఽపరాజితః ॥ 25
తృతీయ పవనస్కంధే గణః సంతాపనఽస్మృతః । ఋతేశ్చ ఋతవాన్ధాతా విధాతా ధరణోధ్రువః ॥ 26
విధారణశ్చతుర్థస్తు గృహమేధో గణః స్మృతః । ఇదృక్షశ్చ సదృక్షశ్చ ఏతాదృగమృతాశనః ॥ 27
క్రీతనః ప్రసదృక్షశ్చ సరభశ్చమహాయశాః । గృహేచ రోషణానామ వాయుస్కంధేచ పంచమే ॥ 28
భర్తాదుర్గధ్వనిర్భీమో హ్యభియుక్తిః కృపాసహః । షష్ఠేతు పవన స్కంధే సాప్వీనామ గణఃస్మృతః ॥ 29
ద్యుత్యతిర్వపురనాదృశ్యో నామఃకామో జయోవిరాట్ । ప్రేజేషణో గణోనామ వాయుస్కంధేచ సప్తమే ॥ 30

ఏషాందామ విభాగస్తు దత్త్వాస్థానాని దాచ్యుతః । జగామ స్వవృహం ప్రీత్యా దితిశ్చస్వగృహంయయౌ ॥ 31
ఏతత్తవోక్తం మరుతాంనృవీర! జన్మోత్తమం పాపభయాపహారి ।
యస్మిన్ శ్రుతే నైవ జనస్యలోకే భయంతు వృత్త్యాన భవిష్యతీహ ॥

ఇతి శ్రీవిష్ణు ధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
మరుదుత్పత్తిర్నామ సప్తవింశత్యధిక శతతమోఽధ్యాయః

మార్కండేయుడనియె :- దితి కొడుకులం గోల్పోయి తపస్సుచేసి కశ్యప మునిని ఆరాధించెను. ఆయన వరము కోరుకొను మనియె. ఆమె ఇంద్రుని జంపు యశస్వియైన కొడుకును గోరుచున్నాను సంతుష్టుడవై శివేని దయసేయుమనియె. అపుడామె భర్తదానికి కంప ప్రీతి నందనివాడయ్యు నీవు శుచిగా నుందువేని నీకు కుమారుడు గల్గును. వేయేండ్లు ముగియు నప్పటికి నీ కోరిక సఫలమగును ఇంకొకరీతి కాబోదని ఆమె దరి నొకరాత్రి వసించి మఱునాడు తపమ్మునకేగెను. దితి నియమంతురాలై గర్భవతి యయ్యెను. నియమమునందున్న యామెంగని యింద్రుడు దేవీ! నేను నీకు శుశ్రూష సేసెదను. ఈ ఘోరమైన నియమమున నాసేవలంగీక రింపుమన యామె ఇట్లనియె. తల్లింగొలుచుచు మోసగించుటకు సమయము కనిపెట్టుచు నుండెను. ఒక్క సంవత్సరము శేషించిన తఱి నామె మధ్యాహ్నవేళ పాదములపై జుట్టు విరబోసికొని నిద్రపోయెను. ఆగని యింద్రుడు వజ్రముంగొని విడివడిన గర్భ మార్గమున లోన బ్రవేశించి నూరుపర్వములు (అంచులు) గల యా వజ్రాయుధముచే నామె దర్భము నేడు తునకలుగావించెను. ఒక్కొక్క తునకను మఱియేడు ఖండములు గావించెను. అత్తఱి గర్భస్థశిశు వేడ్చెను. వజ్రియాశిశువును "మారుద" ఏడువకుమనియె. ఇదే సమయమున దితి మేలుకువగొని వేయికన్నుల వానినయ్యింద్రుని నెదుట నిలుచ బడిన వానింగని ఈ గర్భచ్ఛేదమందు నీ తప్పిదములేదు. నీతి తెలిసిన వాడు సర్వోపాయయముంచే శత్రువును నిగ్రహింప వలసినదే. నాయ పరాభవము వలనని నీవు నా గర్భమును పెక్కుతునకలు సేసితివి. దీనివలన మరుత్తులను దేవతలు వేర్వేరు నేర్పడగలరు. వారికి మరుత్తులను పేరు ప్రసిద్ధ మగును. నీయాజ్ఞావశులై వీరునీకు సహాయులగుదురు. వీరి వలన నీ కే కొంచెమేని యెపుడేని భయము గలుగబోదు. వీరికి వేర్వేరు పేరులు స్థానములను నేర్పరుపుము. ఏకజ్యోతి ద్విజ్యోతి త్రిజ్యోతి చతుర్జ్యోతులను పేర నాల్గురు, ఏకశుక్ర ద్విశుక్ర త్రిశుక్రులను పేర ముగ్గురు ఈ యేడ్వురు ప్రథమ వాయుస్కంధము మరుద్గణము. సురథమను పేరం బరగ గలదు. ఇంద్ర-గవ్య-దృశ్య ఇత ప్రతిశిర-మిత సమ్మిత అమితులను పేరు రెండవ మరుద్గణము వాయు స్కంధమున ప్రఘోషణ మను పేరం ప్రసిద్ధమగును.

ఋతజిత్ సత్యజిత్ సుషేణ సేనజిత్ అతిమిత్ర నా మిత్ర పురు మిత్రుఅపరాజితలను పేరులతో తృతీయ వాయుస్కంధము నందు సంతాపనమను గణ మేర్పడును. ఋతి ఋతవంతుడు ధాత విధాత ధరణుడు ధ్రువుడు విధారణుడు అను పేరులతో గృహమేధయను నాల్గవవాయు స్కంధము నందు మరుద్గణ ముండును. (1) ఇదృక్షుడు (2) సదృక్షుడు (3) ఏతాదక్క (4) అమృతాశనుడు (5) క్రీతనుడు (6) ప్రసదృక్షుడు (7) సరభుడు రోషణమను వాయుస్కంధ మైందవ మరుద్గణము. (1) ధర్త (2) దుర్గ (3) ధ్వని (4) భీముడు (5) కృపుడు (7) సహుడు నను నేడు వాయువులతో ఆఱవ వాయువు స్కంధము స్వావియను మరుద్గణమున్నది. (1)ద్యుతి (2) వపుడు (3) అనావృష్యుడు (4) వాసుడు (5) కాముడు (6) జయుడు (7) విరాట్టు నను నేడు వాయువులతోడి ప్రేజేషణమను మరుద్గణము సప్తమ వాయుస్కంధమున్నది.

ఇట్లే మరుత్తులకు పేర్లు స్థానములను హరి యొసంగి తన గృహమున కేగెను. దితియుం దన యింటికిం జనెను. ఓ నరేశ్వర! మరుత్తు జన్మ వృత్తాంతమిది పాప భయ నివారకము నీకు దెలిపితి. దీనిని విన్న వానికీలోకమున జీవితవృత్తికి భయము గలుగదు. సుఖజీవనము సేయునన్నమాట.

ఇది శ్రీ విష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండము నందు మరుదుత్పత్తియను
నూటఇరువదియేడవ అధ్యాయము.

# నూటయిరువది యెనిమిదవ అధ్యాయము-కశ్యపసర్గము

మార్కండేయ ఉవాచ :- జనయామాస రాజేంద్ర! దనుర్దానవ పుంగవాన్ ।
విప్రచిత్తి ముఖాన్వీరాన్ దైత్య పక్షముపాశ్రితాన్ ॥ 1
కాలంచ జనయామాసకాలకేయాన్సుదారుణాన్ । దైత్యపక్షాశ్రితాన్ క్రూరాన్విరుద్ధాన్ దేవతాగణే ॥ 2
దనాయుషాయాః పుత్త్రస్తు వృత్రో నామమహాసురః । విరుద్ధస్తుసదా తేవైర్దైత్య పక్షముపాశ్రితః ॥ 3
సింహిజనయామాససైంహికేయాన్మహాసురాన్ । రాహుసాల్వముఖాన్వీరాన్ బహుసమితతేజసః ॥ 4
గంధర్వాప్సరసో దివ్యా మునయస్తాన్నిబోధమే । చిత్రసేనోగ్రసేనౌచ ఊర్ణాయురనఘస్తథా ॥ 5
ధృతరాష్ట్రశ్చ గోపశ్చ సూర్యవర్చాస్తథైవచ : యుగపస్తృణపః పార్ష్ణిరర్ధశ్చిత్రరథస్తథా ॥ 6
కలిఃశాలి శిరాశ్చైవ పర్జన్యో నారదస్తథా । తేషాంచైవ యవీయస్యోదివ్యాశ్చాప్సరసస్తథా ॥ 7
అనూచానానవద్యాచ ప్రియముఖ్యా గణెచరీ । మిశ్రకేశీ తథాచాపి పర్ణాశాపుంజకస్థలా ॥ 8
మరీచిశుచికాచైవ ఎద్యుత్పర్ణీతిలోత్తమా । అట్టిలక్ష్మణా క్షేమా దేవీరంభా మనోరమా ॥ 9
ఆసితాచ సుబాహుశ్చ సువ్రతాసువపుస్తథా । పుండరీకా సుగంధా చ సుదారా సురసా తథా ॥ 10
హేమా శరద్వతీచైవ ప్రసూతా కమలాయా । సుముఖీహంసమార్గాచ సౌరీయాప్సరసః స్మృతాః ॥ 11
కద్రూశ్చ జనయామాస నాగాంస్త్రీవ పరాక్రమాన్ । యేషాంశేషః ప్రధానస్తు విష్ణుర్నాగవపుర్ధరః ॥ 12
యేనేయంధార్యతే భూమిః సశైలవన కాననా । ఆహేయీంవాసుదేవస్య పూర్వమూర్తి ర్మయేరితా ॥ 13
అనంత ఇతి విఖ్యాతా మహాకల్ప వినాశినీ । మహాకల్పే మహాసత్త్వే స్వయంభవతియా సదా ॥ 14
తస్యాంశేన సముత్పన్నశ్శేషోహి ధరణీధరః । తస్యానుజాంస్తే నాగేంద్రాన్ ప్రాధాన్యేన వదామ్యహమ్ ॥ 15
వాసుకిస్తక్షకశ్చైవ ఏలాపుత్త్రో ధనంజయః । ఐరావతోమహాపద్మః కంబలాశ్వతరావుభౌ ॥ 16
శంఖపద్మౌ మహాపద్మౌ ధృతరాష్ట్రవలాహకౌ । నీలాశ్వః పుష్పదంతశ్చ సుముఖోదుర్ముఖస్తథా ॥ 17
నహుషః కరరోమాచ కురుశ్చ కువికస్తథా । క్రోధశ్చ జనయామాస దశకన్యా నరాధిప ॥ 18
పులహాయ చ తాదత్తాః కశ్యపేన మహాత్మనా ॥ మృగాచ మృగమందాచ హరిభద్రా మనోహరా ॥ 19
భూతాచ కశిపా దంష్ట్రీ సరసా సురసాతథా । ఇరాచైన తృణం సర్వం జనయామాస భామినీ ॥ 20
పంచ ప్రకారం ధర్మజ్ఞ తమే నిగదతః శృణు । వృక్షగుల్మలతా వల్ల్యస్త్వక్సారతృణాజాతయః ॥ 21
అంతః సంజ్ఞా భవన్త్యేతా ఘోరేణతమసావృతాః । ఏతేషా మభిమానిన్యో దేవతా యదునందన ॥ 22
జనయామాసధర్మజ్ఞ ఇరా దాక్షాయణీ శుభా । ప్రాధాప్రసూతాఽప్యరసస్తాసాం నామామే శృణు ॥ 23
అనవద్యా అనూకాచ మునూకా కరుణ ప్రియా । మనూనా సుభగాచైవ సహజన్యా చ మేనకా ॥ 24
ఘృతస్థూలా ఘృతాచీచ విఘాచీ పూర్వచిత్త్యపి । ప్రమ్లోచీత్య ప్సరాశ్చైవ నిమ్లోచస్త్రీ తథైవచ ॥ 25
అనేనైవ ప్రసంగేన తథాన్యాసాం మహీపతే । జన్మతేఽప్యరసాంవక్షేతన్మే నిగదతఃశృణు ॥ 26
సుందోప సుందనాశాయ నిర్మితా విశ్వ కర్మణా । తిలంతిలంసమాదాయ సర్వరత్నైస్తిలోత్తమా ॥ 27
యస్యాః ప్రదక్షిణాజ్జాతశ్చతుర్వక్త్రః పినాకభృత్ । సహస్రనయనః శ్రీమాన్వజ్రీ శక్రశ్చ పాకహా ॥ 28
శేషైర్దేవగణైర్దృష్టా భ్రమద్వక్త్రైః ప్రదక్షిణైః । కృతే కర్మణి సాప్రాప్తా సూర్యలోకం వరాంగనా ॥ 29
ఏకస్థంరూప సౌందర్యం ద్రష్టుమిచ్ఛన్పితామహః । అహల్యాంనామ కృతవాంస్త్రైలోక్యస్యైక సుందరీమ్ ॥ 30
గౌతమాయచ తాంప్రాదాద్బ్రహ్మా శుభచతుర్ముఖః । యస్యాః కృతేతమేన శక్రో నిర్వృషణః కృతః ॥ 31
నారాయణోరు సంభూతా తథాచైవోర్వశీశుభా । సంత్యక్త మానసావవ్రే భర్తారంబుధజన్నృపమ్ ॥ 32

పురూరవ సనామానం రూపేణాఽప్రతిమంభువి । తేనైవ సార్థమద్యాపి దివం ప్రాప్యైచ తిష్ఠతి ॥ 33
ఆహూత్య ఇతి విఖ్యాతా తథైవాప్సరసః శుభాః । బ్రహ్మణామనసా సృష్టా దేవరామా మనోరమాః ॥ 34
మనోః సుతాః శౌచవత్యో విద్యుజ్జాతి రుచః స్మృతాః । భీరవశ్చసుతామృత్యోర్యాభుః జాతా భువః స్మృతాః ॥ 35
అమృతాఖ్యాశ్చ సంభూతాస్తథైవామృతమంథనే । వహ్నిజాతాసుదానామ సోమాద్వైకురయాస్తథా ॥ 36
ఆయుర్వత్త్యస్తథా ప్రోక్తా సూర్యరశ్మి సముద్భవాః । యజ్ఞోద్భవాస్తథానామ ఋక్సామభ్యస్తథేష్టయః ॥ 37
వాయూత్పన్నా సుదానామ దేవరామాః ప్రకీర్తితాః । ఇత్యేతే బహుసాహస్రా విజ్ఞేయా ప్సరసాం గణాః ॥ 38
దేవతానామృషీణాంచ పత్న్యస్తామాతరశ్చవై । సుగంధాశ్చా ప్యనిష్యంధా సర్వాహ్యప్సరసశ్శుభాః ॥ 39
తాసామాప్యాయతే స్పర్శాదానందంచాశ్నుతే మహత్ । వినతా జనయామాస రుద్రాన్వైసోమ పీధినః 40
అంగారకం తథాసూర్యం నిరృతించ ఖఖగం తథా । అజైకపాదాహిర్బుధ్న్య ధూమకేతుధ్వజాస్తథా ॥ 41
హవనం నృశ్వరం స్వభ్యం కపాలమథ కింకిణీమ్ । ఏకాదశైతే కథితాస్తవరుద్రామహా బలాః ॥ 42
యేషాంచజన యామాస ద్వౌపుత్రౌ యక్షరాక్షసౌ । యయోః సంతాఽసంభూతా రాజన్వై యక్షరాక్షసాః 43
ఇమంచవంశం నియమేన యః వరేత్ పుపాహాత్యస్మనాం బ్రాహ్మణదేవసన్నిధౌ ।
అపత్యలాభం స లభేతపుష్కలాం శ్రీయంతథా ప్రేత్యస శోభనాంగతిమ్ ॥ 44

ఇతి శ్రీవిష్ణు ధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
కశ్యప సర్గోనామ అష్టావింశత్యధిక శతతమోఽధ్యాయః

మార్కండేయుడు వజ్రునకు కశ్యపుడు ధనువునందు విప్రచిత్త మొదలైన దానవులను, ధన్వాయప యను నామెయందు వృత్రుని సింహిక యందు సైంహికేయులను నసురులను రాహు సాల్వాది వీరులను, గంధర్వాప్సరలను మునులను గనెనని తెల్పి వారి పేర్లు సెప్పెను. వారికి చెల్లెంద్రు గా నప్సరలను గనెనని వారిపేర్లు వేర్వేర పేర్కొనెను. అతడు కద్రువయను భార్యయందు నాగులను గనెను. వారిలో శేషుడు అనంతుడను పేర విష్ణువే ఈభూమిని ధరించు నాగేంద్రు డతడే. మహాకల్పమందు వాసుకి తక్షకాదులా శేషుని తమ్ములు. వారిలో క్రోధుడను నాగుడు పదిమంది నాగ కన్యలం గనెను. వారిని కశ్యపుడు పులహున కిచ్చెను. వారి పేరు లీయబడినవి - ఇర యనునది యేడువిధముల తృణజాతలం గనెను. ఆ తృణజాతి యేదురకములు. వృక్షములు గుల్మములు(పొదలు) లతలు వల్లులు త్వక్సార్యములు అనునవి. ఇది ఘోరమయిన తమో గుణములతో నావృతములయి యంతస్సారములుగా నుండును. అనగా వీనిలో చైతన్యము లోలోన నుండును. (అంతర్వేదిములని కూడ వీనిని పురాణములు పేర్కొన్నవి) ఈ తృణజాతుల యభిమాన దేవతలను దక్షుని కూతురు ఇరా కన్నది. ప్రాధయను నామె యప్సరలం గన్నది. వారి పేర్లు వినుము. అనవద్య అనూక మూనూక కరుణప్రియ మనూన సుభగ సహజకన్య మేనక ఘృతస్థూల ఘృతాచి విషూచి పూర్వచిత్త ప్రమ్లోచ నిమ్లోచింతి. ఈప్రసంగములోనే మరికొందరప్సరసల పుట్టుకను గురించి తెల్పెద వినుము.

విశ్వకర్మ సుందోప సుందుల నాశనమునకు తిలనొక్కటిగా గైకొని (నువ్వుగింజను) సర్వ రత్నములతో తిలోత్తమ యను నప్సరసం జేసెను. ఆమయొక్క ప్రదక్షణము వలన నలువ పినాకపాణి సహస్రాక్షుడు (ఇంద్రుడు) ననువారు పుట్టిరి. మిగిలిన దేవతలు ప్రదక్షిణముగా దిరిగిమొగములు ద్రిప్పగా దావచ్చిన పనియైనదనియా తిలోత్తమ సూర్యలోకమునకు వెళ్ళెను. బ్రహ్మ సర్వ రూప సౌందర్యము నొక్కచోటప్రోగుపరచి చూడవలెనని అహల్యను త్రిలోక సుందరిగా జేసెను. ఆయన యామెను గౌతమ మహర్షి కిచ్చెను. ఆమె నిమిత్తముగానే యింద్రుడు గౌతమ మునిచే వృషణ రహితుడుగా నొనరింప బడెను. నారాయణుని ఊరువు నుండి ఊర్వసి పుట్టినది. బుధుని కొడుకును పురూరవుని భర్తగా మనస్సు తప్పించుకొని భూలోకమునకు వచ్చి యా పురూరవుని పేరుగలవాని నింకొక రాజును వరించినది. అతనితోనే స్వర్గమునందు యిప్పటికి నక్కడనే యున్నది. బ్రహ్మచే ఆహూతులను కల్యాణమూర్తుల దేవతా స్త్రీలు పరమ సుందరులు మనసుచే సృష్టింప బడిరి. మనువు శుచిత్వము గలవారు మెరుపు తీగలట్లుమెరయు

వారు గనుక విద్యుజ్జ్వాల రుచులను పేర వారు జనించిరి. మృత్యువునకు భీరువులను వారు భూమికి పుట్టిన వారు భవులను పేర దేవ తాస్త్రీలు ప్రసిద్ధిగనిరి. అమృత మథనమందు అమృతలను పేర కొందరు జనించిరి. అగ్నికి సుదలు సోమునికి భేకురయలు సూర్య రశ్ములకు పుట్టిన దేవతాంగనలు ఆయుర్వతులను పేరంబరగిరి. ఋక్సామములవలన యజ్ఞమునందు పుట్టిన యిష్టులు యజ్ఞోత్పన్నలను పేరొందిరి. వాయువునకు గల్గినవారు సుదలను దేవతాస్త్రీలు. ఈ అప్సర స్త్రీగణములు పుష్కల వేలున్నవి. వారు దేవతలకు ఋషులకు భార్యలు తల్లులునైరి. అంచర్భును సుగంధలు పరిమళించుచుండువారు అనిష్యందలు (చెమట మొదలయినవి లేని వారన్నమాట)వారి స్పర్శమాత్రమున మహానందము గల్గును. (తృప్తి) ఆప్యాయనముదయించును. వినత సోమపేథులగు రుద్రులం గన్నది. (వారు సోమపానము చేసిన వారన్నమాట) వారు అంగారకుడు సూర్యుడు నిర్ఋతి భగుడు ఆజైకపాత్తు అహిర్బుధ్న్యుడు కపాలుడు కింకిణి యనువారు. వీరేకాదశ (11 గురు) రుద్రులు. వీరికిద్దరు కొడుకులు. యక్షుడు రాక్షసుడు ననువారు. వారి సంతానమే యక్షులు రాక్ష సులు. ఈ మహాను భావుల వంశము నెవ్వడు బ్రాహ్మణులయు దేవతలయొక్కయు సన్నిధిం బఠించునో యతడు పుష్కలమైన సంతానమును నైశ్వర్యమును శోభనమైన గతినింగూడ బొందును.

ఇది శ్రీ విష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున కశ్యప సర్గమను
నూట యిరువది యెనిమిదవ అధ్యాయము.

## నూటఇరువదితొమ్మిదవ అధ్యాయము – ఊర్వశీసంభవము

వజ్ర ఉవాచ : ఉర్వశీచ కథంజాతా బుధజం పార్థివం కథమ్ । పతిం కృతవతీ దేవీ మానుషం తత్ప్రకీర్తయ ॥ 1
మార్కండేయ ఉవాచ : సాధ్యౌ ధర్మసుతౌ ప్రోక్తౌ నరనారాయణా వృషీ ।
యౌ తౌ పూర్వం మహీపాలౌ తావుభౌ యదునందన! ॥ 2
విష్ణోరంశౌ మహావీర్యౌ తపస్యభిరతౌ సదా । తయోస్తదాశ్రమం రమ్యం సుగంధి విట పద్రుమమ్ ॥ 3
బదర్యాశ్రమమిత్యుక్తం మృదుస్పర్శ హిమం శుభమ్ । ఉష్ణతోయవహా గంగా శీతతోయ వహా పరా ॥ 4
సువర్ణసికతారమ్యా కాంచనోత్పలమాలినీ । తత్రసా బదరీ రమ్యా నిత్య పుష్ప ఫలోపగా ॥ 5
తత్రతౌ ముని శార్దూలౌ ఘోరం తపఉపాశ్రితౌ । భవాయ సర్వలోకస్య సర్వలోకేశ్వరావుభౌ ॥ 6
తయోస్తపస్యతో దేవం మానేయాప్సరసో దశ । తయోస్తు తపసో విఘ్నం సంభూయ కృతనిశ్చయాః ॥ 7
తం ప్రదేశ మనుప్రాప్తా నానాభరణ భూషణాః । పితామహాన్న సౌమ్యాఽస్తి కశ్చిద్రాజన్ జగత్త్రయే ॥ 8
తాసాం దర్శన మాసాద్య నరఃకామ వశోభవేత్ ॥ కుసుమావిచిన్వత్యోలంవత్యశ్చ యథా సుఖమ్ ॥ 9
దృష్ట్వా నారాయణోనాథ సర్వాబాల మృగేక్షణాః । తాసామంతర్గతం భావం జ్ఞాత్వా వేదవిదాంవరః ॥ 10
జితక్రోధో మహాతేజా జితకామోఽర్థధర్మవిత్ । ఆదాయ సహకారస్య రసంమదన దీపనమ్ ॥ 11
ఊరోశ్చిత్రేణచార్వంగీం నిర్మమేఽప్సరసం శుభామ్ । ఊరోః కృతాసా చిత్రేణ చిత్రాభరణశాలినీ ॥ 12
తస్మిన్నేవ క్షణేనారీ బభ్రూవాయతలోచనా । న దేవీ నచ గంధర్వీనాసురీ నచ పన్నగీ ॥ 13
తాదృగ్విధానలోకేఽస్మిన్యాదృశీసావరాంగనా । తాం దృష్ట్వా వ్రీడితాః సర్వా మాన్తేయాప్సరసో దశ ॥ 14
జగ్ముర్యథాగతం రాజం స్తచ్ఛుశ్రావ పురందరః । ద్రష్టుం కౌతూహలాత్తాంచ బదర్యాశ్రమమాగతః ॥ 15
పాదయోర్న్య పతద్వజ్రీ సాధ్యయోర్ధర్మ నిత్యయోః । దదర్శచ శుభాంగీం తాం శ్రియం దేవీ మివాపరామ్ ॥ 16
తమువాచ హసన్సాధ్య స్తదా నారాయణః ప్రభుః । మమోరుజాతా ధర్మజ్ఞ ఉర్వశీయం భవేదితి ॥ 17
నయస్వ త్రిదివంచైతాం భవత్వప్సరసానఘా । ఏవముక్తే ముదంప్రాప్య అభివాద్యచతౌ వృషీ ॥ 18
ఆనయత్తాం తతః స్వర్గం దేవీం బాల మృగేక్షణామ్ । శిష్యత్వే ప్రదదౌ త్వేతాం గంధర్వస్యచ తుంబురోః ॥ 19
తతః కదా చిచ్ఛక్రస్యనన ర్త పురతస్తుసా । ఉపవేశ మతిక్రమ్య తుంబురో శ్చారుహాసినీ ॥ 20

తాంశశాప స గంధర్వో మానుష్యే వత్స్యసే శుభే। దేవతోర సమంత్యక్త్వా మానుషేణ సహానఘే॥ 21
కంచిత్కాల ముపాస్యైవం మానుషం తం శుచిస్మితే! । ఆగమ్య త్రిదివే తావ త్తస్మాదభ్యస్యసే తతః ॥ 22
తేనైవ సార్థం త్రిదివే రంస్యసే త్వం శుభాననా । వైవస్వతాఖ్యస్యమనో ర్యావదంతర ముచ్యతే ॥ 23
ఏవంహి శప్తా నృపవర్య! తేన పపాతరాజన్!గురుణాన్నలోకే। ఉవాసరాజ్ఞాసహితాతుతస్మాత్ స్వర్గం సమాసాద్య తథైవతేన॥

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
ఉర్వశీ సంభవోనామై కోనత్రింశదధిక శతతమోఽధ్యాయః

ఊర్వశి జన్మవృత్తాంతము : ఆమె బుధుని కొడుకగు మనుష్యునెట్లు భర్తను గావించుకొన్నదది తెలుపుమని వజ్రుండడుగ మార్కండేయు డిట్లనియె. ధర్ముని కొడుకులు సాధ్యులు నరనారాయణులు ఋషులుగా పేర్కొనబడిరి. వారు మున్ను భూపాలురు. విష్ణ్వంశ సంభూతులు మహావీరులు నిరంతరము తపస్సునం దిష్టము కలవారు. వారి యాశ్రమమది సుగంధితరులతాభరితము. అతి సుందరము. మృదుస్పర్శము గల మంచుతో గూడినది. బదర్యాశ్రమమనబడునది. అక్కడ గంగయొకటి ఉష్ణోదక ప్రవాహము గలది. వేరొకటి శీతోదక ప్రవాహము గలది. అందలి యిసుక బంగారమే. అందు కలువ పూలు సువర్ణ మయములు. నిత్య పుష్ప ఫల భరితమైన బదరీ వృక్షము (రేగు చెట్టు) అక్కడున్నది. అక్కడ నా మునివరులు ఘోర తపంబు నందుండిరి. సర్వ లోకేశ్వరులు వారు తపస్సు చేయుట లోకక్షేమస్థితికే. ఇట్లు తపస్సుచేయుచుండ హౌనేయ లను యప్సరసలు పదిమంది (హౌనేయలనగా బ్రహ్మ మానస పుత్రునికి గల్గిన వారన్నమాట) యాయన తపస్సునకు విఘ్నము సేయనిశ్చయించుకొని నానాభరణ శోభితులై యా తావునకు వచ్చిరి. రాజా! ముల్లోకములందు పితామహుని కంటె (బ్రహ్మకంటె) నింకొకడు సౌమ్యుడు లేడు.

ఆయన సృష్టిలోని యా యందగత్తెల దర్శించిన నరుడు కామవశుడై తీరును. వారు సుఖముగా ముచ్చటలు గులుకుచు నట పూలు కోసుకొనుచుండిరి. ఆ బాల మృగ నయనల నా బాలలం గని నారాయణుడు వేద విదులలో నగ్రేసరుడు గావున వారిలోని భావము గ్రహించి మహా తేజస్వి కోపము నిగ్రహించుకొని కామము గెలిచి, ధర్మార్థములను పురుషార్థములను జక్కగా నెరింగినవాడు గావున తీయమామిడి పండ్ల రసము మదన దీపనమగుట దానింగైకొని తన మూరువుల నుండి నొక్క యింతిని పరమ సుందరి నప్సరసం గల్యాణిని చిత్రరూపమున నిర్మించెను. ఆ చిత్రరుపు క్షణములో స్త్రీయయ్యెను. ఆమె దేవతాస్త్రీ గాదు గంధర్వి ఆ సురి నాగకన్యయుం గాదు ముల్లోకములందు నామెంబోలిన సుందరి లేదు. ఆమెం జూచి యప్సరసలు అవ్వల తాము వచ్చిన దారిని జనిరి. ఇంద్రుడది విని యా త్రిలోక సుందరిం జూడనెంచి బదర్యాశ్రమమునకు వచ్చెను.

ఇంద్రుడు అచట నున్న సాధ్యులు ధర్మనిరతులైన యా నరనారాయణుల పాదములపై బడెను. ఇంకొక శ్రీదేవియో యన్నట్లున్న యా రమణిం జూచెను. అత్తరి నల్లన నవ్వుచు సాధ్యుడగు నారాయణ ప్రభు నా ఇంద్రునితో నిట్లనియె. ఓ ధర్మజ్ఞా! ఈమె నాయూరువు నుండి జనించినది. అందుచే నీమె ఊర్వశి యనంబడును. ఈమెను త్రిదివమునకు గొనిపొమ్ము. అప్సరసలం దీమెయ నొక్కతె గాగలదు. అనవిని యింద్రుడానందించి యా ఋషుల కెరగి భాంహారిణాక్షి నా దేవిని స్వర్గమునకుం దీసికొని వెళ్ళెను. ఇంద్రుని ముందొకతరి తుంబురు నేర్పిన దానికంటెను మిన్నగ చక్కగ నాట్యము సేసెను. అందుచే నా సుహాసిని నాతోడ గొంతకాలముండి యా మానవుని సేవించి తిరిగి స్వర్గమునకువచ్చి నా వలన విద్యాభ్యాసముం బడయుదువనియె. స్వర్గమునకు వచ్చి కూడ నీవా పురుషునితోనే క్రీడింతువు. వైవస్వత మన్వంతరమంతయు నీవాతనితోనే యుందువు అని యిట్లు తుంబురుడు శపింప స్వర్గమునుండి యవనిపై బడి యా యన్న విధముగా యటనుండి తిరిగి యాతనితో స్వర్గమందు యటనే వసించెను.

ఇది శ్రీ విష్ణు ధర్మోత్తర మహాపురాణమున ప్రథమఖండమున యూర్వశీ సంభవమను
నూట యిరువది తొమ్మిదవ అధ్యాయము.

## నూటముప్పదవ అధ్యాయము - ఉర్వశీరంభా సంవాదము

వజ్రఉవాచ:- నాకంత్య క్త్వోర్వశీ బ్రహ్మన్! బుధ పుత్త్రం కథంగతా। క్వచసా తం రేంద్రేంద్రం దృష్ట వత్య పరాజితం॥

మార్కండేయ ఉవాచ మనో ర్వైవ స్వతస్యాస్య ద్వా పరేప్రథమేపురా ।వృత్తేదేవా సురేయుద్ధే వృత్తే చామృతవః
సంగ్రామే కృతకర్మాణం తస్మిన్నేవ నరాధిపమ్ । శక్ర స్యార్థాసన గతం రూపేణాప్రతమంతదా ॥
సంపూజ్యమానం త్రి దశైర్దదర్శాయతలోచకా । బుధ పుత్త్రం నరేంద్రేంద్రం తదా నారాయణాత్మజా ॥
దృష్ట్వా బభూవ చాస్వస్థా కామమార్గణ తాడితా । తతః ప్రభృతిభవ్యేషు మేరుకుంజేషు భామినీ ॥
ఆకారం గూహమానాసా కాలం నయతి కామినీ । చింతయంతీ నరేంద్రేంద్రం కందర్ప ప్రతిమం సదా ।
న సా భుంక్తే నస్వపితి శ్రాంతా స్వపితి సాయదా । తదాపశ్యతితం స్వప్నే నీలనీరజలోచనా ॥
మనోరథాంశ్చ కురుతే యాంశ్చ తం ప్రతి భూమిపమ్ ।
తాని సా పశ్యతి స్వప్నే కథం చిత్స్వప్న మోహితా । కదా చిత్క్రీడతే రాజ్ఞా కదాచిదను నీయతే ॥
సుప్తా కదా చిద్రాజేంద్ర ! వదతీ ప్రతిబుధ్యతే । కంఠేగృహీతా సా రాజ్ఞా తయాచాసౌ మహీపతిః ॥
ఏవందృష్ట్వా తు స్వప్నే నిద్రా మోహముపాగతా । తథైవ బాహు పాశేన రచితేస విబుధ్యతే ॥
స్వప్నసంస్థం యదాదృష్ట్వా మోహ మాయాంతి సా చిరమ్ । కృత్వాచిత్రగతం పట్టే కదాచిచ్చ నిరీక్షతే ॥
ఏవం నరేంద్రే గతసర్వభావాం విజ్ఞాయ తాం చారుతరాంగయష్టిమ్ ।
ఆపాండురక్షామ కపోలభిత్తిం దృష్ట్వైవ రంభా త్వరితం జగాద ॥
యత్నేన చార్వంగి! నిగూహమానా భావం మయా త్వం విదితాఽసిసుభ్రూః
తస్మిన్నరేంద్రే హృదయం తవేదం యోఽసౌ మహాత్మా సమరేష్వజేయః ॥
పురూరవానామ జగత్త్రిమేఽస్మిన్ ఖ్యాతింగతః సచ్చరితైర్నృవీరః
రూపేణ కామంవ్యతిరిచ్య భాతి శౌర్యేణ శక్రా దతిరిచ్యతే సః ॥
దానే సమ స్తస్య చ నాస్తి కశ్చిత్ సత్యేప్యనౌపమ్యగుణేన్నృవీరః ।
దేవాసురేఽస్మిన్సమరే హతాని తేనాసురాణాం నియుతాని పంచ ॥
కేశీ విశాలో మదనస్తథోగ్రో మహాబలస్తేన తథా పి శస్తః ।
చంద్రస్య పౌత్రశ్చ బుధస్యపుత్రో మాతాపి తస్యార్క సుతస్య ధాత్రీ ।
మానం సముత్సృజ్య విశాలనేత్రం తంగచ్ఛ బాలే నృపతిం ప్రతీతమ్ ।
త్వదాప్తయే తస్యచనాస్తి యత్నః సుదుర్లభత్వం ఖలుదేవతానామ్ ॥
మనోరథానాం త్వమగమ్యభూమి ర్యస్మాద్విశాలాక్షి ! సురాసురాణామ్ ।
మృణాలశయ్యా సుతను ! త్వయేదం సంశ్లేశితా చందన పంకయుక్తా ॥
తస్యాంక మారుహ్య భవస్వ కాంతే, విముక్తతాపా తపనీయ వర్ణే
యాస్యామ ఏహ్యేహి నరేశ్వ రస్య తస్యాశు భో వేశ్మ వర ప్రయోగే!
పురం ప్రతిష్ఠానమితి ప్రతీతం మాతామహా ద్య త్సమవాప రాజా ।
ఇత్యేవ ముక్తా తపనీయవర్ణా తథ్యం విదిత్వా త్రపితా బభూవ ॥
ఉవాచ రంభాం సఖి ! తథ్యముక్తంత్వయామతం తద్రుచితం భృశం మే ।
యాస్యామ అద్యైవ నరేశ్వరస్య తస్యాంతికం బాలమృగాభ నేత్రే ॥
యద్యద్య తం నీల సరోజ నేత్రం సంపూర్ణ చంద్రాభ ముఖం నరేంద్రమ్ ।
పశ్యామి నాహం పృథు దీర్ఘ బాహుం తతో గమిష్యా మ్యవశా వసానమ్ ॥
పంచైవ కామస్య జనః ప్రషత్కాన్ యదాహ రంభే తదలం మృషైవ ।

ముహ్యామ్యనిశం బాణభరైస్తు విధ్యన్ నశామ్యత్రే త్వక్షి నిమేష మాత్రమ్ ॥ 24
కామాగ్ని మధ్యే పరివర్త మానం నయాతి భస్మత్వమిదం శరీరమ్ ।
తస్యైవ రాజ్ఞో వదనేందునా తత్ సంరక్ష్య తే మేహృదయ స్థితేన ॥ 25
నయస్వమాం తస్య విశాలనేత్రైః సమీప మద్యైవ నరేశ్వరస్య ।
ఇత్యేవముక్తా కరుణేన రంభా పాణావుపాదాయ విశాలనేత్రామ్ ॥ 26
బుద్ధ్యా సముత్పత్య తతోఽంతరిక్షం । జగామ రాజ్ఞో భ వనం ప్రహృష్టా ॥ 27

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయవజ్రసంవాదే
ఊర్వశీ రంభా సంవాదోనామ త్రింశదుత్తర శతతమోఽధ్యాయః.

స్వర్గమువిడిచి ఊర్వశి బుధపుత్రునెట్లు గలిసెను. ఆమె పశ్చాజయమెరుగని యాతని నెక్కడ జూచెనని వజ్రుడడుగగా మార్కండేయుడనియె. వైవస్వత మనువుయొక్క మొదటి ద్వాపర యుగమందు మున్ను దేవాసురుల యుద్ధముజరిగి యమృత మథనమయినతరువాత నా సమరమందు కృతార్థుడైయింద్రుని యర్థాసన మధిష్ఠించిన పరమ సుందరుడగు రాజును దేవతలందరి పూజలందుకొనుచున్న వానిని బుధ కుమారుని పురూరవుని నారాయణ తనయ ఊర్వశి చూచెను. చూచినదే తడవుగ కామబాణవశయై మనసు కలతపడి యది మొదలు మేరు పర్వతమునందు జక్కని పూలపొదరిండ్లందనరూపు మరగుపరచికొని విరహాకులయై కాలము గడుపు చుండెను. మన్మధుని వంటి యా రాకుమారుని నిరంతరము ధ్యానించు చుండెను. భుజింపదు నిదురవోదు. మిక్కిలి యలసటగొని యొకవేళ నిదురించెనా కలలో నా సుందరునే దర్శించుచుండెను. ఆ సొగసుకాని యెడల తానేమేమి మనోరథములను (ముచ్చటలను) ఊహించుచుండెనో యవన్నియుం గలలో నామెకు గోచరించు చుండెను. ఒకతరి నందు రాజుతో క్రీడించును. ఒకవేళ నాతనిచే ననునయింపబడుచుండెను (ప్రణయ కలహ మిద్దరికి నేర్పడినట్లును, అందా సుందరుడు తనను గలిసి బ్రతిమాలినట్లును గలలు గనుచుండె నన్నమాట.) ఒకపుడు కలలో మోహవశయై యాతని బిగికౌగిటం జిక్కినట్లై మెలుకువ గనుచుండెను. కలలోగన్న యా మోహనమూర్తిని మెలకువ గొని చిత్రరువున వ్రాసి చూచి మైమరచు చుండెను. ఇట్లు నరేంద్రునిపై నిండు వలపు గొనిన యా సుందరాంగిని, నిండ తెలువాలిన (విరహ వశమున పాలిపోయిన) చిక్కిన నును చెక్కిళుల విన్ననైయున్న యా యన్నువ మిన్నంగని రంభ యిట్లనియె.

ఓ సుందరాంగీ! నీతలపు గప్పిపుచ్చి మోహమున జిక్కిన నిన్నేను గ్రహించితి? ఆ నరేంద్రునిపై నీహృదయము లగ్నమైనది. నీవు మనసు పడిన యాతడు మహానుభావుడు. సమరదుర్జయుడు. అతడు ముల్లోకములం దుత్తమ చరిత్ర చేతను పురూరవుడను పేరం బ్రఖ్యాతి గన్నాడు. తనసోయగముచే కాముసతిశయించి శౌర్యముచే శత్రునతిక్రమించినాడు. దానమందు సత్యమందును పరమ గుణ సంపద యందాతని పోలిన వాడొక్కడునులేడు ఈ దేవాసుర సంగ్రామ మందాతని వలన నసుర సైన్యము నియుత పంచకము గూలినది.

అతడు చంద్రుని పౌత్రుడు. బుధుని పుత్రుడు. అతని తల్లి అర్క పుత్రుడగు కుజుంగన్న తల్లి. నీవు గుట్టు(సిగ్గు)విడిచి యశస్సంపన్ను నా విశాల నేత్రు నా పుడమి రేనిం గూర్చి నీవ యరుగుము. అందువలన దేవతలకు గూడ యందని నిన్నందగత్తెను బొందుట కాతని కెక్కువ యత్న మవసరము గలుగదు. ఓ విశాలాక్షి సురాసురుల మనోరథములకేని యందని దానవు. చందనమలది చల్లని మెత్తని తామర తూండ్లు పరచిన యీ పాన్పు నీచే నలిగి పోయినది. నీ విరహ తాపమున వాడి యట్టిటు దొరలిన నీ మేనిచే నిది యొత్తికొని మెత్తన చెడినది. ఆతని యంక మెక్కి యోకనకాంగీ! తాపము వాసి సుఖముండుము. ఆ రేని యింటి కో రమణీ! యాతని వరించు పని మీద వెళ్ళుదము రారమ్మ! అతనిది ప్రతిష్ఠాన పురము. మాతామహుని వలన నద్దాని నాతడు వడసెను. ఇట్లు రంభ పలుక నా సువర్ణాంగి యది నిజమని యెరింగి సిగ్గు పడెను. మరియు నా రంభంగని యిట్లనియె.

నెచ్చెలీ! రంభా! నీవునిజము పల్కితివి. నీ యిష్టమే నాకును మిగుల నిష్టము. ఇప్పుడు మన మానరేశ్వరుని దరికి వెళ్లదము. ఇప్పుడాయిందీవర నయనుని సంపూర్ణ చంద్రాననుని పృథు విశాల బాహునిం జూడనేని వివశనై కడతేరుదును. కాముని

బాణము లైదేయని జన మనును. అది యబద్ధమే. నిరంతర మనేక బాణ పరంపర నీకు గల్గించుచు నొక్క రెప్పపాటు కాలమేని యాతడూరకున్నది లేదు. కామాగ్ని మధ్యమందు పొరలుచున్న యీ మేను బూదియైన గాకున్నది నా యెడంద నున్న ఆ రాజు వదనేందు బింబముచేతనే యీ శరీరము రక్షింప బడగలదు. ఓ విశాలనేత్రా! ఇప్పుడ నన్నా నరేంద్రు సన్నిధికిం గొనిచనుము. అని యిట్లు జాలిగలుగ నుగ్గడింప నూర్వశి పలుకు లాలించి రంభ యామెంగొని తలపుమాత్రన నంతరిక్షమున కెగిరి మిగుల సంతసమున నారాజు భవనమున కేగెను.

ఇది శ్రీ విష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున ఊర్వశీ రంభా సంవాదమను నూటముప్పదియవ అధ్యాయము.

## నూటముప్పది యొకటవ అధ్యాయము-ఉద్యానవనవిహారము

మార్కండేయ ఉవాచ :- ఊర్వశీ రంభయాసార్ధం జగాను త్వరితం తదా।కామార్తాసిద్ధ మార్గేణ సొదదర్శాథ నారదమ్ ॥
ప్రజంతంసిద్ధమార్గేణ దేవలోకముసాగతమ్ । సంపూజ్య నారదం సుభ్రూః ప్రయయావేకసత్వరా ॥ 2
తామాహనారదో రంభే! కేయం తే ప్రస్థితా సఖీ । రంభాశాపభయా త్తస్యాః సర్వమేవన్యవేదయత్ ॥ 3
తా మాహ నారదో భూయః శృణుష్వవచనం మమ । ఊర్వశీ గత భావేయం మానుషం తంనరేశ్వరమ్ ॥ 4
శాపేన తుంబురో ర్మోహాదుచితం తత్రవత్స్యతి । యథాశుభం తథాకార్యం త్వయామే వచనంశుభే ॥ 5
సమయేనోర్వశీ తస్య వసత్య సితలోచనా । సమయ శ్చానయా కార్యో యోరాజ్ఞస్తం విబోధమే ॥ 6
మేషద్వయంతు పుత్త్రిత్వే పురాకృతవతీశుభా । తన్నిత్యంశయనాభ్యాశే స్థాపనీయం సులోచనే! ॥ 7
ఆహారం ఘృతమాత్రం చ కర్తవ్య మనయాతథా । నద్రష్టవ్య స్తథా నగ్నో రాజా రంభే! పురూరవాః ॥ 8
నకర్తవ్య మకామాయా స్తథా తేనచమైథునమ్ ॥ ఏకస్మిన్నవ్యథో భగ్నే సమయే దారులోచనా ॥ 9
యదివత్స్యతి రాజానం శిలాభూతా భవిష్యతి । ఊర్వశీరంభయా సార్థమేవ మస్త్విత్వితి నారదమ్ ॥ 10
ఉక్త్వా సంపూజ్యచమునిం ప్రతస్థే పునరేవచ । నారదో వ్యగమ ద్విప్రః పురంవైశ్రవణస్యచ ॥ 11

మార్కండేయుడనియె:- ఊర్వశి కామార్తయై రంభతోడ సిద్ధమార్గమున సత్వరమ చని యట దేవలోకము నుండి యేతెంచిన నారదుని దర్శించెను. ఆ సుందరి యమ్మునిని బూజించి తొందరగ నట నుండి ముందునకు జనెను. ఆమెంగని సురముని రంభా! నీ చెలికత్తె కాబోలీమె యెవరు? నీతో పయనించుచున్నదని యడుగ, రంభ శాపమునకు జడిసి యామె వృత్తాంత మంతయు నివేదించెను. ఆమెంగని నారదముని ఓ కల్యాణి! నా మాట వినుము. ఈ యూర్వశి మనుష్యుడైన యాతేనిపై వలపు గొన్నది. ఇది తుంబురుని శాపము వలన మోహవశయై యాతని దరినుచితవర్తనమున నీమె యుండగలదు. ఈమెకు మేలుగలుగుట కేను జెప్పినట్లు నీవు సేయవలయును. ఈ నీలాయతాక్షి యతని దరి నొక్క కట్టడకు లోబడి మసల వలయును. ఈమె యా రాజుతో జేసికొన వలసిన సమయము (కట్టడ) నేదెల్పెద నెఱిగి కొనుము. మున్నీమె రెండు మేకపిల్లలను దన పిల్లలుగా బెంచికొన్నది. వానిని దాను శయనించు ప్రక్కకు ప్రక్కనే నిలుపుకొనవలెను. ఈమె నేయి మాత్రమే యాహారముగ గైకొన నగును. ఈమె పురూరవుని నగ్నునిగా (దిగంబరిగా) నెన్నడు జూడరాదు. ఈమెయిచ్ఛగించనపుడాతడీమెతో నాడు గలియరాదు. ఈ సమయములం దేయొక్కటి చెడినను నీమె యాతేనితోనే యున్నయెడల రాయి కాగలదు. ఊర్వశీ రంభతో గూడ నట్లే యగుగాక యని యమ్మునిం బూజించి తిరిగి పయన మయ్యెను. నారదుడును వైశ్రవణుని (కుబేరుని) పురమున కేగెను.

దదర్శచ ప్రతిష్ఠానం చోర్వశీ రంభయాసహ । ప్రాకారేణార్కవర్ణేన కాంచనేన విరాజితమ్ ॥ 12
చతుర్భిర్గోపురైః శుభై రాజతైశ్చ విరాజితమ్ । శోభనంచతథా రమ్యం విద్రుమస్యచతోరణైః ॥ 13

సువిభక్త మహారణ్యాం మహారాజపథంశుభమ్ । పరిఘాభిర్విచిత్రాభిః పద్మినీభిరలంకృతమ్ ॥ 14
సముల్లిఖద్భిః ప్రాసాదైః పాండురై రుపశోభితమ్ । శూరాఢ్య జనభూయిష్ఠం దివ్యం పురుష సంయుతమ్ ॥ 15
వణిగ్భిరుప సంకీర్ణం నానాపణ్య విభూషితమ్ । ఐరావత కులోత్పన్నై శ్చలత్పర్వత సంనిభైః ॥ 16
కుంజరై ర్బహుసాహస్రై స్సంయుతం సుమనోహరైః । తురగై ర్వహ్నిజాతైశ్చ పవనస్య సమైరపే ॥ 17
పానమత్తై ర్న రైర్యుక్త ముద్యానేషు తత స్తతః । శంఖభేరీమృదంగానాం పటహానాంచ నిస్వనైః ॥ 18
వివిధానాంచ వాద్యానాం వాదిత్రం సర్వకేత్మగమ్ । బ్రహ్మఘోషం మహాఘోషం వీణావేణునినాదితమ్ ॥ 19
హృష్టపుష్ట జనాకీర్ణం సర్వబాధా వివర్జితమ్ । పద్మకింజల్క వర్ణాభిర్యుతం స్త్రీభిః సహస్రశః ॥ 20
శ్యామాభిశ్చ మహారాజః కాందగౌరీభిరేవచ । నానావేషధరై ర్ధరైర్యుక్తం నానాదేశోర్భవై స్తథా ॥ 21
నరై రనేకరూపైశ్చ శిల్పజ్ఞైశ్చ హ్యనేకశః । పురస్యతస్యమధ్యేసా దదర్శనృపతేర్గృహమ్ ॥ 22
మధ్యేహిమాచలస్యైవ కైలాసంపర్వతోత్తమమ్ । శ్రీమద్భిః సంయుతం రమ్యైర్గృహమేధైః సహస్రశః ॥ 23
సుధావదాతై ర్విపులై శ్చంద్రరశ్మి సమప్రభైః । క్వచిద్రత్నైః క్వచిద్రౌక్మైః క్వచిద్భూపాల! రాజతైః ॥ 24
మణివిద్రుమ సోపానై ర్ముక్తాజాలవిభూషితైః । క్వచిచ్చ పుష్పదామాఢ్యై ర్వైజయంతీయుతైః క్వచిత్ ॥ 25
తస్యా విదూరేవిపులం వనంచైత్రరథో పమమ్ । రాజ్ఞః క్రీడావనం రమ్యం దదర్శవిపులేక్షణా ॥ 26
ద్రుమైర్బహువిధై ర్యుక్తం పుష్పఫలోప హైః । పద్మినీభిర్వి చిత్రాభిః క్రీడాశైలైఃమనోహరైః ॥ 27
ప్రాసాదైశ్చతథా రమ్యై రమ్యైర్మణిగణై స్తథా । తత్తు రంభావనందృష్ట్వా సఖీ వచన మబ్రవీత్ ॥ 28
రాజ్ఞఃక్రీడావనేరమ్యే గహనేఽస్మిన్సులోచనే! । మాయాచ్ఛన్నానివత్స్యామో యావద స్తమయంరక్షేః ॥ 29
తతోగత్వా నరేంద్రం తం చోక్త్వాతవ చికీర్షితమ్ । అహంత్వాం తు నయిష్యామి సవిధే తస్య భూపతేః ॥
ఏకముక్త్వా సఖీ వాక్యం నోదయామాస చోర్వశీ 30
క్రీడావనం తేచ తతోఽవతీర్ణే తద్దేవ రామే సు మనోఽభిరామమ్ ।
క్రీడావనే తత్ర తథోర్వశీసా సూర్యాస్త కాలం మనసాసమైచ్ఛత్ ॥ 31

ఇతి శ్రీవిష్ణు ధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
క్రీడావనావతరణంనామ ఏకత్రింశ దుత్తర శతతమోధ్యాయః

ఊర్వశి రంభతో గూడి సూర్యప్రభమైన బంగారు ప్రాకారముతో నాల్గురజతమయ (వెండి) గోపురములతో రాజిల్లుచు విద్రుమ తోరణములచే సుశోభనము సురమ్యము. సువిభక్త మునగు మహారణ్యము సునుచిర మహారాజపథము పద్మినీ సమలంకృత విచిత్ర పరిఘాలంకృతము. ఐరావత కులమందుపుట్టి కదలుచున్న పర్వతమట్లున్న బహు సహస్రకుంజరములతో నొప్పుచు నగ్నిం బుట్టిన వాయుజవములయిన యుత్తమాశ్వములతో పానమత్తులగు జనులతో నుద్యానములం దెల్లెడశంఖభేరీ మృదంగ పటహాముఖ వాద్యధ్వనులతో బ్రతిధ్వనించు సుందర మందిరములతో నొక వంక బ్రహ్మ ఘోషము (వేదధ్వని) వేఱొకట వీణావేణునినాదములు విననగుచు హృష్టపుష్టజనాకీర్ణమై యేబాధలులేక పద్మకింజల్క సవర్ణశరీరులగు నవయౌవన మింపెనయు వేలకొలది తరుణులతో నానావేషధరులు నానాదేశోద్భవులు నానారూపులగు నరులతో శిల్పులతో నాపుర మతి సుందరమై యుండును. ఆ పురము నడుమ రాజసౌధము హిమాచలము నడుమ కైలాసమట్లుండెను శ్రీమంతములగు గృహవేంఘములతో గ్రమ్ముకొని యుండెను. ఆ గృహములు కొండొక యెడ నచ్చము తెల్లనిది. సువిశాలము కొన్ని చంద్రరశ్మి ప్రకాశములు కొండొకయెడ రత్నములు కొండొక యెడ స్వర్ణమయములు, కొండొక యెడ రాజితములు అందలి సోపానములు మణిమయములు విద్రుమ (పగడ) మయములు ముత్యాలపేరులు కొన్నియెడల పూలమాలలుం గల్గిన వైజయంతులతో, నలరు చుండెను. ఆ రాజ సౌధమున కల్లంత దూరమున రమ్యమగు కేళీవన మొక్కటి యామె చూచెను. అందనేక పుష్పఫల భరితములయిన వృక్షములు గలవు. పద్మినీ లతలు సొంపు

గొల్పుచుండెను. క్రీడాశైలములతి మనోహరములు. అత్యంత రమ్యములగు ప్రాసాదములు మనోహరమణి స్థగితములు. అటునొక రంభ యూర్వశితో సఖి! ఇది రాజ కేళీవనము సురమ్యము గహనము (రహస్యస్థానము) ఇందో సునేత్రా! మాయచే గప్పబడి ప్రొద్దు గ్రుంకు దనక నుండుము. అప్పల నేనా నరేంద్రువి దరికేగి నీ చేయవలసిన పని నెఱింగించి నిన్నా రాజుదరికిం గొంపోయెదను. అన విని యూర్వశి యామెంబంపినది. ఆ దేవవనిత నిట్లా సమమోభిరామమైన యుద్యానములో దిగినది. ఊర్వశి సూర్యాస్తమయ సమయమును గోరుచుండెను.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమునందు ఊర్వశీ రంభా క్షేరావనామతరణను ఆను నూటముప్పదియొకటవ ఆధ్యాయము.

## నూటముప్పది రెండవ అధ్యాయము - చంద్రోదయ వర్ణనము

సూర్యాస్తమయ మిచ్ఛంతీం జ్ఞాత్వారంభా తథోర్వశీమ్ । వినోదార్థంహి తస్యాశ్చదర్శయామాసతద్వనమ్ ॥ 1
చారుప్రసూనం పశ్యేమంసుభగే చంపకద్రుమమ్ । త్వద్గాత్రవర్ణ సదృశైః సమంతాత్కుసుమైశ్చితమ్ ॥ 2
ఇమంచదాడిమం పశ్య! పుష్పితం వామలోచనే! । యోఽయంబిభర్తి కుసుమైస్త్వ దీయామధరశ్రియమ్ ॥ 3
పశ్యకామశరాకారం సహకారం మనోరమమ్ ॥ యత్రచాత్మ సముత్పన్నా రూఢా స్తస్యమహాత్మనః ॥ 4
శ్రియంకపోలయోస్తుభ్యమాదదానైర్మనోరమైః । పుష్పైరుపేతాః చార్వంగి! మధూకం పశ్యశోభనే! ॥ 5
త్వత్పయోధరసంకాశైర మ్యైరుపచితంఫలైః । పశ్య తాలద్రుమం సౌమ్యే! మనసఃప్రీతివర్ధనమ్ ॥ 6
స్తంభైస్త్వదూరు సంకాశైః కదలీం పశ్యశోభనే! । సువర్ణాచారుసర్వాంగీ నిర్మితా విశ్వకర్మణా! ॥ 7
పశ్యావిముక్తకలతాం కుసుమాఢ్యాం మనోహరామ్ । త్వత్కేశపాశ సంకాశై ర్భ్రమరైరుపశోభితామ్ ॥ 8
పశ్యేమం కుందవిటపం త్వద్దంత సదృశైఃశుభైః । సమంతా చ్ఛోభితం పుష్పై ర్విశాలాక్షి! మనోహరైః ॥ 9
పశ్యచోత్పలినీమేతా ముత్పలై రుపశోభితామ్ । త్వన్నేత్రసదృశైః పుల్లైర్మనోహృదయ నందనైః ॥ 10
నళినీంసుభగే!పశ్య కమలైః పుష్పితైర్యుతామ్ । తవనిఃశ్వాసగంధాఢ్యైః సావర్ణై ర్వ్రజకేసరైః ॥ 11
రాజహంసానిమా న్పశ్య! నళినీతీర గోచారాన్ । గమనంసు మనోహారి త్వదేయమివ శిక్షితాన్ ॥ 12
త్వత్సఽరాగ్ర విధానౌమ్యే! ధారయత్యిశ్చపల్లవాన్ । క్రీమశైలమిమంపశ్య యుక్తంబహు విధైర్ద్రుమైః ॥ 13
క్రీడాశైలేచూత గతః కోకిలః కామవర్ధనః । కూజత్యయం మనోహారి స్వనేన సదృశేన తే ॥ 14
క్రీడాశైలే నదీం పశ్యః నిన్నృతాం శీతలోదకామ్ । తుల్యంతే మనసాసౌమ్యే వహంతం నిర్మలంజలమ్ ॥ 15
బహ్వాశ్చర్య యుతంసౌమ్య! దర్శనీయం వనంబహు । కింనుపశ్య విశాలాక్షి! సూర్యోఽస్తముపగచ్ఛతి ॥ 16
త్వాంతుకామవశాంజ్ఞాత్వా కృపయేవదివాకరః । సంవృత్తాంశుధరో దేవప్త్వస్త మాయాతి భామిని! ॥ 17
కఠోరాణ్యపి పత్రాణి పల్లవానీవసుందరి! । అస్తతాసానురక్తాని రాజంతే శాఖినాం భృశమ్ ॥ 18
గిరీణాం శిఖరాన్రక్తా న్కరోత్యేష దివాకరః । జగామాస్తం విశాలాక్షి! కృతకర్మా దినక్షయే ॥ 19
సంధ్యాకాలేర క్తేన ప్రతీచం పశ్యశోభనే! । ఆలింగమానాం సహసాకామినీమివ కామినా ॥ 20
సాంప్రతం నియమోపేతా ద్విజా ద్విజవరోద్భవే! । సంధ్యాకాలముపాసంతే సతాంమార్గమనువ్రతాః ॥ 21
అనుయాతారవింసంధ్యా గతమస్తమపిప్రభుమ్ । సాధ్వీవవనితా కాంతేకులజాతా మనస్వినీ ॥ 22
యాస్యమానం సునాసోరు! తమసాపశ్యభూతలమ్ । భృంగోదరత మాలానాం తుల్యేనవవర్ణిని ॥ 23
వ్యాప్తంహి తమసాసర్వార్ న విరాజతికించన । మనినేనాయతా పాకగి! జగత్సర్వం సమీకృతమ్ ॥ 24

*వి ధ.పు-36

అస్యాంహి సఖి! వేలాయాం మదనేన వశీకృతాః । నీలాంబరధరాః కాంతాః యాంతికాంతానలంకృతాః ॥ 25
పశ్యోదితంచసుభగే! సుభగంచంద్రమండలమ్ । పానమత్తపురంధ్రీణారవదనేన సమత్విషమ్ ॥ 26
కించిదాక్రమ్యగగనం శ్వేతకాంతిగతంసఖి । పశ్యచంద్రమసంసుభ్రు! నయనానందకారకమ్ ॥ 27
జగతోఽన్యతమోగత్వా శశాంకః సత్త్వసంనిభః । విరాజత్యమలం సౌమ్యే! గగనేసితసుప్రభే! ॥ 28
కామబాణహతాయాస్తే సదృశం గండయోశ్రియా । బిభర్త్యుభయతశ్చంద్రో జ్యోత్స్నాజాలం సముత్సృజన్ ॥ 29
చంద్రరాజతకుంభేన దిశేయం వరవర్ణిని! । జ్యోత్స్నాచ్ఛలేన క్ష్మాదేవీ రాజతీవ విరాజతే ॥ 30
చంద్రమస్యుదితే పశ్య ఫుల్లాం కుముదినీం శుభే! । త్వదీయహాససంకాశైః కుసుమైరుపశోభితామ్ ॥ 31
విరహే చక్రవాకోఽయం రక్తాముత్పలినీంశుభే! । సితామివ సుదుఃఖార్తో విశత్యాయతలోచనే ॥ 32
చంద్రకాంతగృహాదస్మాచ్చంద్రరశ్మి సమప్రభాః । చంద్రరశ్మి పరామృష్టాః పతంత్యుదక బందవః ॥ 33
ఆలింగితా చంద్రమసా జహౌరాత్రిస్తమఃపటమ్ । కామినేవవిశాలాక్షి! కామినీవసనం శుభా ॥ 34
చంద్రోదయే చంద్రసమాన వక్త్రే! నరేంద్ర చంద్రే ప్రమదావరీఽస్మిన్ ।
పశ్యత్యమాశంసచజీవితాశాం । త్వద్భాగ్యమన్నం సహసాప్రవిష్టమ్ ॥ 35

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
ఉపవనే చంద్రోదయ వర్ణనోనామ ద్వాత్రింశదుత్తర శతతమోఽధ్యాయః.

మార్కండేయుడనియె:- రంభ చంద్రోదయమున కెదురు సూచుచున్న యూర్వశింగని వినోదము కొఱకామె కావనమును జూపించెను. చెలీ? ఈ తోటలో పూవులతో నిలపుగుల్కు నీ చంపక ద్రుమముం జూడవె. ఇది నీ మేని రంగునకు సరియగు నిండ జూచిన విరుల నిండుకొని యున్నది. ఓ వామనయనా! ఇదిగో పుష్పించిన యీ దానిమ్మ చెట్టు గనవె. పువ్వులతో నిది నీ యధర బింబము సొంపుగొని యున్నది. ఇదిదె జూడు మీ సహకారము పంచశర శరాకారమెంత మనోహరముగ నున్నది! నీ మెఱుగు చెక్కిళ్లు కొక క్రొత్తయనుందల వరించు పువ్వులతో నున్న మదూకమును (ఇప్పచెట్టును) గనుము. నీ పయోధరములట్లతి రమ్యములయిన పండ్ల బరువెక్కి మనసునకెంతేని వేడుక గూర్చు నీ తాటిచెట్టు వంక చూపు నిల్పుము. కల్యాణీ? నీ యూరవులకు సరియై నిల్చు నీయరటిం గనుగొనవె. విశ్వకర్మ దీనికి చక్కని వన్నెగూర్చి సర్వాంగ సుందరముగ నిర్మించినాడు. పువ్వుల విరియబూచి మనసుందొంగిలుచున్న యీ యవిముక్తలతికం దిలకింపవే. ఇది వేనలి కెనయై తుమ్మెదలు ముసరనెంతేని ముచ్చట గొల్పుచున్నది. విశాలాక్షి! ఇటుచూడు మీమొల్ల తరువు. నీ పలుపరుస కీడుగా చక్కని పూవుల మిగుల రాజించుచున్నది. ఇదియుం గనుగొనవె. ఈ కలువపూ దీగ నీ కనుల కెనయగు విరిసిన కలువలడెందమున కానందము నించుచున్నది చక్కగ విరసిన కమలములతో నిండిన యీ తామర తీగనో సుందరీ! కాంచు మిది నీ యూర్పులనెత్తావుల జిమ్ముచు బంగారు కింజల్కముల నొల్లసిల్లు విప్పారిన కమలము నెంతేని సొంపు నింపు చున్నది. తామర కొలని దరులందరిసిన యీ రాయచలం గనుమివి నీ మనోహర మందగమనము విలాసము నేర్చికొన్నట్టున్నవి. నీ కెంగేలి రంగు గొనిన లేజివురులం దేజిరిల్లు పలురకము లయిన తరువులనలము కొన్న యీ క్రీడాశైలమును నీక్షింపుము. ఈ విహార గిరిపై నున్న తీయ మావిగున్నపై నుండి మరు నూరక యెస కొల్పుచుం నీ మధుర కంఠ స్వరమునకు సరిగ గూయుచు మనసు నాచికొనుచున్నదదిగో కోకిల. క్రీడాద్రి నుండి వెడలుచున్న యీనదిం జూడుమిది నీ మనసు వలె నతి స్వచ్ఛమైన చల్లని తేట నీట గాటముగ దనియించు చున్నది. ఎంతయు వింత గొల్పుచు నెంతేని జూడ ముచ్చటయగు నీ చల్లని పూదోట నాలో కింపు ముదిమదిగో నీవు కాము బారికిం జిక్కితవని తెలిసి జాలిం గొని కాబోలు జగద్బంధువు తన కరముల నిమిడించి కొని రవి చాటగు చున్నాడు. ఓ సుందరి! ఎంతచిరు సైనవియు చెట్ల యాకులం జివురాకులును సూర్యాస్తమయ సమయ తాపమున తాయెఱుపెక్కి మిక్కిలి దీపించు చున్నవి. దినకరుడు గిరి శిఖరముల నెరుపార జేయుచున్నాడు.

రవి స్వధర్మము నిర్వర్తించి దివసాన మందస్తమించి నాడు. కల్యాణీ! అధురక్తిమైన సంధ్యా కాలము తనంత నొక కాముకు డొక్క కామిని నట్ట ప్రాగ్దిక్కును కౌగిలించు కొనుచున్నదల్లదిగో చూడుము! ద్విజశ్రేష్ఠులు నియమముగొని సత్పురుషుల మార్గముననువర్తించుచు నిపుడు సంధ్యాకాలము నుపాసించుచున్నారు. (సాయం సంధ్యా వందనము సేయుచున్నా రన్నమాట.) అస్తంగతుడైనను సూర్య ప్రభువును పతివ్రతయు మనస్వినియు నగు సాధ్వివలె సంధ్యా దేవి అనువర్తించు చున్నది. ఓ సునాసోరూ! (చక్కని ముక్కు చక్కని ఊరువులును గలదానా!) చూడు మిది. భూతలము తుమ్మెదలలముకొన్న తాపింఛ వృక్షములతో పోలికగ చీకటిం గ్రమ్ముకొన్నది. సర్వము గాఢాంధకార బంధురమై యేమియు గనిపించుట లేదు. సర్వజగత్తు మాలిన్యముచేనేకరూప మయినది. సఖీ! ఇత్తఱి బిత్తఱులు కామాయత్తలై నల్లని చీరలు గట్టుకొని నగలుపెట్టుకొని కాంతులు గదియ జను చున్నారు. ఓ సుందరీ! అల్లదిగో చూడు చంద్ర బింబముదయించినది. అది పౌన్మత్తమైన మత్తకాశినుల నెమ్మోములతో సమముగ ప్రభలొల్కు చున్నది. ఇంచుకగ గగన మాక్రమించి యది తెల్లదన మంది నయనానందకరముగుచు చంద్రుని జూడుము. శశాంకు డొక సత్త్వ మట్లీ జగమ్ము నలము కొన్న తమస్సును (చీకటిని) దూరి పాటి అచ్ఛము తెలికాంతి గులుకు నాకసమున స్వచ్ఛముగ రాజిల్లు చున్నాడు.అనగా తమోగుణనశుడైన వాడు. పుడమి విడిచి కేవలసత్త్వగుణ సంపన్నుడై మీది కేగి పుణ్య లోకముల రాజిల్ల బూనిన పుణ్యాత్ము నట్లున్నాడని భావము. చంద్రుడిరు వంకల నేకరూపముగ వెన్నెలల జిమ్ముచు కామబాణ నిహతలైన నీ చెక్కిళుల తళుకు గొని యున్నాడు. ఈ తూర్పుదిశ చంద్రుడును వెండిబిందెందాల్చి ఈ భూదేవి వెన్నెల నెపమున కేవల రజతమయయో యన్నట్లు (కేవలం వెండితో చేసినదో యన్నట్లు) రాజిల్లు చున్నది.

చంద్రుడుదయింప విస్ఫారిత కుముదిని (నల్లకలువ తీగ) నీ చిఱు నవ్వుల పురివచ్చు పువ్వులతో మిక్కిలి శోభించు చున్నదల్లదె చూడుము. విశహము గొని యీ చక్రవాక పక్షి మిక్కిలి దుఃఖము గని విరహ తాప శాంతికి కాబోలు చల్లని తెల్ల గలువ గతీ లోనికి జొచ్చుచున్నట్లున్నది.

ఈ చంద్రకాంతసదనమునుండి చంద్రకిరణసమ్రపభలును చంద్రకిరణ సంస్పృష్టములునైన నీటిచినుకులుపడుచున్నవి. విరహదశలో నాయకుడు గురియు నశ్రుబిందువులో యన్నట్లు మంచు బిందువులు గురియు చున్నవన్నమాట చంద్రునిచే గౌగిలికిం దార్చబడి రాత్రి (కాముని కౌగిట నున్న కామినివలె) తమః పటమును (చీకటి యను వలువను) విప్పికొన్నది. ఓ చంద్రాననా! ఈ చంద్రోదయమందు ప్రమదామనోహరుడైన యీ నరేంద్ర చంద్రునందూర్వశీ! నీవు జీవితాశను వర్జింపుము( బతుకుతెఱువు గమనింపు మన్నమాట) అంతియకాదాతని యందు ప్రాణములమీది యాశనుబెట్టుకొనుము. అని రెండవయర్థము [ఇది నీ భాగ్య విశేషమున తటాలున నీకు తారసిల్లినది.]

ఇది శ్రీ విష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున చంద్రోదయవర్ణనమను
నూటముప్పదిరెండవ అధ్యాయము

## నూటముప్పదిమూడవ అధ్యాయము - ఊర్వశీపురూరవసమాగమము

మార్కండేయ ఉవాచ :- ఇత్యుక్తారంభయా వాక్యం దృష్ట్వా రాజా సమాగతమ్ ।
హృష్టా ససాధ్వసా దేవీ బభూవాథ తథోర్వశీ ॥
అత్యాశ్చర్య మభూ ద్దృష్టే రాజ్ఞి తస్యాఃశుభాననే! । రోమాంచితతనుత్వంచ సప్రస్వేదం సమాబభౌ ॥ 2
తా మువాచ తతో రంభా శృణూర్వశి వచోమమ । నేహాగమేఽస్య నృపతేః కార్యమల్పం భవిష్యతి ॥ 3
రాజా సఖాసహాయోఽయం ప్రవిష్టోనిశి కాననమ్ । ప్రచ్ఛన్నేశృణువ స్తావ దస్యవాక్యాని భూపతేః ॥ 4

ఏవమస్త్విత్యు వా చాథ రంభాం నారాయణాత్మజా । మాయాచ్ఛన్న శరీరే తే తతశ్చాయయతు ర్నృపమ్ ॥ 5
రాజానం చారుసర్వాంగం ప్రపచ్ఛ తు తదా సఖా । రాజ్ఞోబహుమతోనిత్యంగుణనాంశ్చాతి ధార్మికః ॥ 6
సఖోవాచ :- యతః ప్రభృతి రాజేంద్ర! । త్రిదివాత్త్వమిహాగతః । తతః ప్రభృతి చాస్వస్థో మయాదృష్టోఽసిఃమానదః ॥
త దస్వాస్థ్యం కామకృతం జ్ఞాతవానస్మి తేనృప! । తన్మమాచక్ష్వ తే గుసహ్యం నచే న్నరవరో త్తమ! ॥ 8
పురూరవా ఉవాచ!- తవ గుహ్యం న మే కించిత్ కదాచిదపి విద్యతే।అస్వాస్థ్యకారణంలసౌమ్య! తవ వక్ష్యామ్య ధాత్మనః॥
నారాయణసుతా కాంతా రూపేణాప్రతిమా శుభా । ఉర్వశీనామతః ఖ్యాతా మయాదృష్టా వరాప్సరాః ॥ 10
యతః ప్రభృతి చార్వంగీ తతః ప్రభృతిమేసఖే! । కామేనాలోడ్యతే చిత్తం నచశామ్యతి మే తథా ॥ 11
నచోపాయం ప్రపశ్యామి తస్యా లాభే ద్విజోత్తమ! । దేవతానామపి శుభా దుర్లభా సా వరాంగనా ॥ 12
ఏవందుఃఖపరీతస్య సఖే! కాలోగతోమమ । ఉపభుక్తామయాస్వప్నే సాద్య చార్వసితేక్షణా ॥ 13
చంద్రకాంత గృహేహ్యస్మిన్ కామమార్గణతాడితా । చంద్రోదయే చారుముఖీ త్రైలోక్యస్యైకసుందరీ ॥ 14
వినోదనార్థంమిహసఖే! మనసోఽతిమనోహరమ్ । చంద్రోదయేతతః ప్రాప్తంచంద్రకాంత శిలాగృహమ్ ॥ 15
తదేహి త్వరితంసౌమ్య! ప్రవిశ్యరుచిరంగృహమ్ । వినోదయామి హృదయంమన్మథేన వశీకృతమ్ ॥ 16
సఖోవాచ :- యథా దృష్టం త్వయాస్వప్నే తథాద్య భవితాధ్రువమ్ । సాపికామపరీతాంగీ త్వాముపేష్యతి భామినీ ॥ 17
మార్కండేయ ఉవాచ :- ఏవముక్త్వా నివేశాథ చంద్రకాంత శిలాగృహమ్ । ఆసాంచక్రే తదాతస్మిన్మదనేనవశీకృతః ॥
ఉర్వశీరంభయాసార్థం తత్రృత్వాహర్షమాగతా, । ఆత్మానం దర్శయామాస రంభాపి నృపతే స్తదా ॥ 19
జయేత్యుక్త్వా మహీనాథం రంభా కామవశా త్తథా । బభూవ పురత స్తన్య శోభయంతీవ తద్గృహమ్ ॥ 20
తామువాచ తతోరాజా స్వాగతం తే వరాననే ! । అలంకురుష్వచార్వంగి ! రత్నాసనమిదం శుభమ్ ॥ 21
రత్నాసనోపవిష్టాయాం తదాగమన విస్మితః । తదారాజీవర క్తాక్ష స్తామువాచ వరాననామ్ ॥ 22
శక్రస్యగరం రమ్యం రాజతే నిత్యశ స్త్వయా । పౌర్ణమాస్యా యథారాత్రిః శశాంకేనేవ భామిని! ॥ 23
త్వం సభా మండనం తస్య సచ్ఛిష్యా త్వంచ తుంబురోః । త్వయాఽభిభూతాః సకలాః స్త్రియఃసుప్తాః సుశోభనే! ॥ 24
త్వయాఽభిభూతాః సకలాః స్త్రియః స్వర్గేసుశోభనే! । తవనేత్ర సహస్రేణ పశ్యన్నపి తు పాకహా ॥ 25
సర్వత్ర చారుసర్వాంగి! నతృప్యతి శుభాననే । తన్మమాచక్ష్వ సుభగే! ఇహాగమనకారణమ్ ॥ 26

మార్కండేయుడనియె :- ఇట్లు రంభ యూరడించుచు పలికినంతట లోనననుకొనకుండ నాలోన నరుదెంచిన రాజుంగని నంతన యూర్వశి తత్తరపాటు నెందెను. అతడు కనబడినంత నామె కత్యాశ్చర్యము గల్గెను. మేను పులకరించెను. చెమట పట్టెను. అంత రంభ యిట్లనియె. ఊర్వశీ నా మాట విను. ఈతేని యీరాకలో జరుగ వలసిన కార్యము చిన్నదియై యుండదు. ఈ రాజు నెచ్చెలులతో నర్ధరాత్రి యీ కాననముఁజొచ్చి నాడు. మనమిద్దరము చాటున నిల్చి యీ భూపతి మాట లాలింతము. అన నూర్వశి యట్లే యనెను. వారిరువురు మాయతో తమ మేనులం గ్రమ్ముకొని యారాజు నెదుట కరుదెంచిరి. పరమ సుందరు నారాజు నాతని చెలికాడు రాజునకెంతేని యెడపడని యిష్టుడు గుణవంతుడతి ధార్మికు డిట్లని ప్రశ్నించెను.

రాజేంద్రా! స్వర్గమునుండి యిటు వచ్చినదిమొదలు నాకీవస్వస్థుడవుగ గనబడు చుంటివి. ఆ యస్వాస్థ్యము కేవలము కామ నిమిత్తమని నేగ్రహించితిని. నాకడ దాపరానిదైనచో నా రహస్యము నాకు జెప్పుమన పురూరవు డిట్లనియె. నీకు నా వలన దాపరిక మెన్నడు నేమియు లేదు. ఓ సౌమ్యా! నా యస్వస్థతకు కారణము నీకు దెల్పెదను. నారాయణుని కుమారి భూమియం దప్రతిమాన రూపవతి. ఊర్వశి యను పేరి యప్సరస నాకు కనబడినది. ఆమె కంటబడినది మొదలు మిత్రమా! నామనసు కామునిచే కలత బడినది. ఆ కలత శమించుట లేదు. ఓ విప్రోత్తమా! ఆమెంబడయుట కుపాయ మేదియు తోచకున్నది. నాకే కాదా వరాంగి దేవతలకేని దుర్లభ ఇట్లు పగలం బొగులు నాకు కొంబొక జాలము జరిగినది. ఆ నీలలోచనం గలలో నీలోన ననుభవించితిని.

ఈ చంద్ర కాంత శిలాన్వగిత మందిరమందు కామబాణ తాడితయై చంద్రోదయ సమయమందా సుందరముఖిం త్రైలోక్య సుందరిని మనోహరమైన యీసదనమున కేను మనస్సునకు వినోదనార్థమైవల్య చంద్రోదయమైనతఱిం దర్శించితిని. సౌమ్యా! ఈ చక్కని సదనమునకు త్వరగరమ్ము మన్మథ వశమైన నాహృదయము నిచ్చట వినోదింప జేసికొందును. అనవిని రాజుసఖుండు కలలో నీ కెట్లు కనబడినదట్లే యిపుడు తప్పక గాగలదు. ఆభామిని కూడ కామపరీతయై యీదరికి రాగలదు. అన విని రాజాచంద్రకాంత శిలాగృహముం జూచ్చి యట మదనవశుడై యుండెను. ఊర్వశి రంభతో నదియెల్లవిని హర్ష మొందెను. రంభ రాజునకు దనను దాదర్శింప జేసి కొనెను. మఱియు రాజును జయశబ్దమున నభినందించి కామవశమున ఆ గృహమెల్ల శోభింప జేయుచు నెదురయ్యెను. ఆమెం జూచి రాజు శుభాననా! స్వాగతము ఈ రత్నాసన మలంకరిలపు మనియె.

రత్నాసనమందు గూర్చున్న యంత నామె రాక కచ్చెరు వంది యా రాజీవ రక్తాంతనయను డారమణితో రంభా! నీచే నింద్రుని నగరము పున్నమి రేయి పున్నమి చంద్రునిచే నట్లెంతేని రాజిల్లుచుండును. కల్యాణీ! స్వర్గభామిను లెల్లరు నీచే దిరస్కృతులు. పాకశాసనుడు నిన్ను వేయిగన్నులం గనుచుండియుందని వినొందడు సరికాని ఓ సుందరీ! నీ విటకు వచ్చిన కారణము నాకు దెలుపుమన రంభ యిట్లనియె.

రంభోవాచ :- శృణుష్వావహితో రాజన్మ మాగమన కారణమ్ । శ్రుత్వాతచ్చ నరేంద్రేంద్రః కురుష్వ వచనంమమ ॥ 27
నారాయణసుతాదేవీ తత్ర త్రైలోక్య సుందరీ । ఉర్వశీనామ చార్వంగీ భూమిపాల! సఖీమమ ॥ 28
సా త్వాందృష్ట్వా మహేంద్రస్య సదనే కామమోహితా । నశర్మలభతే బాలా హా హేతి వదతీముహుః ॥ 29
సా త్వదర్థ మనంగేన మార్గణైర్భృశపీడితా । లావణ్యశేషాసంవృత్తా దినైః కతిపయైః శుభా ॥ 30
క్షామక్షామ కపోలా సా త్వత్సమర్పితమానసా । మదనే నాభితప్తాంగీ మానముత్సృజ్య భామినీ ॥ 31
ప్రస్థితా సా మయా సార్థం తవ దర్శనలాలసా । అంతరానారదేనోక్తా యత్రత్వం ప్రస్థితాశుభే ॥ 32
తత్రత్వయాతుయేవ స్తవ్యం సమమేన వరాననే । మేషద్వమంతు పుత్త్రత్వేయ త్త్వయా పరికల్పితమ్ ॥ 33
తత్తుతే శయనాభ్యాశే స్థాపయే త్సతతంయది । సరాజా చారు సర్వాంగి నగ్నో నేక్షేత భామిని! ॥ 34
మైథునం చాప్యకామాయా నాసౌతే కర్తుమర్హతి । ఘృతాహారా సదా తత్ర వసత్వం సుభగే! సదాః ॥ 35
ఏకస్మిన్న ప్యతిక్రాంతే సమయే యది పార్థివమ్ । నత్యక్ష్యసి తదా సౌమ్య! శిలాభూతా భవిష్యసి ॥ 36
ఏతానీ సమయాన్యుక్త్వా నారదేన సఖీమమ । తానిత్వం ప్రతిపద్యస్వభజవ్వ చశుభాననామ్ ॥ 37

రాజా! నారాకకు కారణము మనసు పెట్టి వినుము. విని నాయా మాట నీవు నెరవేర్పుము. నారాయణుని కూతురు త్రైలోక్య సుందరి. ఊర్వశి యను పేరిందిది. నా సఖురాలు. ఆ బాలిక నిన్నింద్రభవనమున జూచి కామ మోహితయై యిపుడింతేసి సుఖము గనకున్నది. మాటి మాటి కయ్యో అయ్యోయని పలువరించును. అది నీకై యనంగుని యమ్ములకు గురియై మిక్కిలి పీడ నొందుచున్నది. కొన్ని రోజులలోనే యా కల్యాణి లావణ్య మాత్రా వశిష్ట యైనది. చెక్కిళులు మిక్కిలి మిక్కిలి చిక్కినవి. మనసు నీ కప్పనము సేసినది. మదనునిచే నమ్మానిని మేనెంతేని క్రాగుచున్నది. గుట్టు విడిచి నిను దర్శించు వేడుక గొని యాయింతి యటవెడలి నాతో బయలు దేరి, దారిలో నారదుడు నీ వున్న జాడ తెలిపి, నీ వెవనికై బయలు దేరితి వక్కడ ఒక కట్టుబాటునకు (షరతు) లో బడి వసింప వలయాను. నీవు పుత్రులట్లు పెంచిన మేకలు రెండునూ నీ శయనము దరినే యుంచికొనవలయును. ఆ రాజు నగ్నుడై నీకు గనబడరాదు, నీవు కోరనపుడతడు నీతో సంగమము కూడ చేయరాదు. ఓ సుందరీ! వాని దరి నీవు నేయి మాత్రమాహారించుచు వసింప వలయును. ఈ చెప్పిన యే యొక్క సమయమేని దప్పినచో నీ వా రాజును వదల వలయును. అప్పుడు నీ వొక రాయి యయ్యెదవు. అని యిట్లు నారదుడు మా చెలి కెఱింగించెను. ఆ సమయముల నీవు అంగీకరించి మా చెలి ననుభవింపుము. అన విని పురూరవుం డిట్లనియె.

పురూరవా ఉవాచ - రంభే! తవాద్య వాక్యేన అమృతేనేవ భామినిః । మృత్యోర్వశమనుప్రాప్తో జీవితోఽస్మి శుభాననే ॥

మమాపితత్కృతే రంభే! మదనః శరవృష్టిభిః । దునోతిహృదయం సుభ్రూః దివారాత్రమతంద్రితః ॥ 39
సా త్వంజీవయ మాం శీఘ్రం దర్శయస్వవరాంగనామ్ । స్థాస్యామి సమయే తస్మిన్ యస్మిన్మాం వక్ష్యసేశుభే! ॥ 40
కృతం తం సమయం విద్ధి నారదేన యదీరితమ్ । అనాక్రందే నిమగ్నస్య మమకామమహోదధౌ ॥ 41
ప్లవోభవ విశాలాక్షి! ప్రాణదాభవ సుందరి! । మార్కండేయఉవాచ :- ఏవముక్త్వా నరేంద్రేణ రంభా చాంతర్దధే తదా ॥
ఉర్వశీ సహితాచాథ దర్శయామాసతంనృపమ్ । జయేత్యుక్త్వా నరేంద్రంతు తదా నారాయణాత్మజా ॥ 43
వ్రీడితా పురత స్తస్థౌ తస్యరాజ్ఞోమహాత్మనః । తాందృష్ట్వా ప్రీతిమాపాఽథ స నరేంద్రోమహాద్యుతిః ॥ 44
ప్రులకాంచిత సర్వాంగో వర్ణితుం సాన శక్యతే । పాణా వాదాయ త్రపితాం ఉత్సంగేచోపవేశయత్ ॥ 45
రత్నాసనం తథా భేజే రంభాఽపి సుమనోహరమ్ । తతశ్చోవాచ వచనంరాజా ముదితమానసః ॥ 46

రంభా! అమృతముచేనట్లు నీమాటచే నేనిట మృత్యువశుడనయ్యునిదె బ్రతికితిని. శుభాననా! అమెకై మదనుడు రేయిం బవళ్ళు శరవర్షముల నాహృదయమూరక వేధించుచున్నాడు. నీవు నన్ను బ్రతికింపుము. శీఘ్రముగా నా సుందరాంగింజూపింపుము. నీ వెట్లంటివట్ల కట్టుబాట్లకేను గట్టువడియుండెద. నారదుడు సెప్పిన యాసమయము నేను నిర్వర్తించితినే యనితెలియుము. ఆక్రందింప విన దిక్కులేని కామమహాబ్ధిలోమునిగిన నాపాలిటి కీవు తెప్పవగుము. ప్రాణదాత్రివిగమ్ము. అని పురూరవుండు పలుక రంభ యపుడ యంతర్ధానమంది యూర్వశితోగూడ వచ్చి యామె రేనిం జూపించెను. అత్తరి నారాయణ తనయ (ఊర్వశి) జయ జయ శబ్దము గావించి సిగ్గుగొని యామహానుభావుని ముందు నిలువబడెను. అమ్మహాతేజస్వి యామెంజూచి యెక్కుడలేని ప్రీతింబొందెను. మేనుపులకింప నామె వర్ణింప శక్యముగాక యున్నయామెం గేలగైకొని తన యంకమున గూర్చుండబెట్టుకొనెను. రంభయు నయ్యెడ చక్కని నొక రత్నాసనము నలంకరించెను. రాజానందభరిత మనస్కుడై యప్పుడిట్లనియె.

పురూరవాఉవాచ :- కామదేవః ప్రసన్నోఽద్య మమోర్వశి! వరాననే! । అద్య వేద్మ్యధికం సుభ్రూః శక్రాదాత్మానమాత్మనా॥
త్రైలోక్య రాజ్యలాభేఽపికుతః సాశుమేశుభేరతిః । ఆజ్ఞాకారిత్వమాసాద్యయా తవాద్యసులోచనే! ॥ 48
మార్కండేయ ఉవాచ :- ఏవంవదతి భూపాలే యయౌ రంభావరాసనా ।
క్షణేన మేషసహితా పునః ప్రాప్తా నృపాంతికమ్ ॥ 49
మేషౌదత్వా నరేంద్రస్య రాజానంవాక్య మబ్రవీత్ । రంభోవాచ :- యాస్యామి లంకాం రాజేంద్ర! తత్రప్రాణేశ్వరోమమ ॥
మత్ప్రతీక్షః స్థితః శ్రీమాన్ ధనదస్యాత్మ సంభవః । నలకూబర నామాఽసౌత్రైలోక్య విదితః ప్రభో! ॥ 51
యథాచేయంసఖీమహ్యం నోత్కంఠాంకురుతే శుభా । సఖీజనస్య స్వర్గస్య తథాకార్యంత్వయాఽనఘః ॥ 52
పురూరవా ఉవాచ :- యతిష్యేఽహం తథాకర్తుం నిర్వృతాభవ మానదే! ।
రత్నాన్యేతాన్యుపాదాయ నిర్గచ్ఛస్వ యథా సుఖమ్ ॥ 53
మార్కండేయ ఉవాచ :- ఏవముక్త్వా తతోరంభా నృపతేః ప్రీతికారణాత్ ।
రత్నాన్యుపాదాయ యయౌఖేన లంకాం మహాపురీమ్ ॥ 54
లబ్ధ్వోర్వశీం నరేంద్రోఽపి రేమే స సహిత స్తయా । యథాశచ్యా సురారిఘ్నో బలవాన్పాకశాసనః ॥ 55
సంన్యస్తభారః సతు మంత్రిముఖ్యం రేమేతయా యాదవ సింహముఖ్య! ।
లక్ష్మ్యాసమేతో భగవా ననంతో యథాసదేహోభువనస్యగోప్తా ॥ 56

ఇతి శ్రీవిష్ణు ధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
ఉర్వశీ పురూరవసమాగమోనామ త్రయస్త్రింశదుత్తర శతతమోఽధ్యాయః

ఓసుముఖీ! ఇపుడు కామదేవుడు నాయెడ సుముఖుడైనాడు. ఇపుడు నన్నేను శక్రునికంటెనధికునిగా నెరింగికొనుచున్నాను. సులోచనా! ఇపుడునీయాజ్ఞంజేయువాడనై ధన్యుడనై యుండుభాగ్యముబడసినవాడి కిక త్రైలోకరాజ్యలాభమందెక్కడి కోరిక! అని

యిట్లుభూపాలుండనుచుండగనే రంభయట నుండి క్షణములో జని తిరిగి మేకలతోనాదేని సన్నిధికేతెంచెను. ఆమేకలనురాజేంద్రునకిచ్చి యతనితోనిట్లనియె. రాజేంద్రా నేను లంకంకుజనియెద. అక్కడ నాప్రాణేశ్వరుడున్నాడు. నాకొరకెదురు చూచుచుండును. ధనదుని తనయుండాయన నలకూబరుడను పేరివాడు త్రైలోక్య ప్రసిద్ధుడు. నానెచ్చెలి నాకై జెంగపెట్టుకొని యేవిధముగతన తన సఖురాంద్ర కొఱకు స్వర్గము కొరకును ప్రతీక్షింపనియట్లీమె నీవులాలింపుము. పాలింపుమన పురూరవుడు "కలతపడకు మీవన్నట్టు సేయుటకు యత్నించెదను, వెళ్ళిరమ్ము ఈరత్నాలుగైకొని సుఖముగా బయలుదేరుము" అని పురూరవుడన రంభ రాజు ప్రీతికొరకు రత్నాలను జేకొని యాకాశమున లంకా మహాసురమునకేగెను. నరేంద్రుడు నట్లూర్వశింబొంది యామెతో శచీదేవితో సురేంద్రుడట్లు క్రీడించెను. ఓయాదవ సింహనాయకమణీ! పురూవుడు మంత్రి ముఖ్యునిపై రాజ్యభారముంచి భగవంతుడనంతుడు భువనరక్షకుడు కాగా విష్ణువు లక్ష్మీదేవితో నట్లాదేవితో నతడు క్రీడించెను.

ఇది శ్రీ విష్ణు ధర్మోత్తర మహాపురాణము ప్రథమ ఖండమున ఊర్వశీ పురూరవ సమాగమము అను నూటముప్పదిమూడవ అధ్యాయము.

## నూటముప్పది నాల్గవ అధ్యాయము - ఉర్వశీసంభోగ వర్ణనము

మార్కండేయ ఉవాచ :- ప్రాసాదేషు విచిత్రేషు తథా మణిగృహేషుచ । పుష్పవేశ్మసు రమ్యేషు తథావస్త్ర గృహేషుచ ॥
రత్నవేశ్మసు ముఖ్యేషు తథా చిత్రగృహేషుచ । పర్వతానాంచదుర్గేషు నదీనాంపులినేషుచ ॥ 2.
పద్మినీషుచ ఫుల్లాసు తథాచోత్పలినీషుచ । శయ్యాసుచపరార్థ్యాసు పుష్పశయ్యాసుచాప్యథ ॥ 3
రమయామాసతాందేవీం తథావిరచితేషుచ । గృహేషుబహురత్నేషు ధూపోద్గారిషు పార్థివ ॥ 4
రేమేసతుతయాసార్థం మానసేషుపునః పునః । రమయంస్తాం వరారోహాం నతృప్యతి స నిత్యశః ॥ 5
నిశాసుచసచంద్రాసు చంద్రకాంతతరం ముఖమ్ । పపౌతస్యాయథాకామం నరేంద్రః సనరాధిపః ॥ 6
నిశాసునష్టచంద్రాసు తన్ముఖోద్యోతితప్రభే । దేశేతాం రమ యామాస రాజాతాజీవలోచనాం ॥ 7
వర్థయంతీ నరేంద్రస్య సాతుకామందినే దినే । అదృష్టపూర్వేవశుభా భవత్యాయతలోచనా ॥ 8
రాజ్ఞోదృఢం సాదయితా తస్యాశ్చద్విగుణోనృపః । తయాఽసౌప్రీయతే రాజాతేనసాపి వరాంగనా ॥ 9
వరచందన దిగ్ధాంగౌ నానా భరణ భూషితౌ । రేమాతే దంపతీహృష్టౌ నానారత్న విభూషితౌ ॥ 10
అలంకరోతితాంరాజా స్వయమేవ కదాచన । తయాఽలంక్రియమాణశ్చ ప్రీతిమాప్నోత్యనుత్తమామ్ ॥ 11
వరేషు తౌవిచిత్రేషు రేమాతే ముదితౌ భృశమ్ । కేశాన్సంశోభయంతౌ తౌ కుసుమైస్తు పరస్పరమ్ ॥ 12
ఉర్వశ్యభ్యుదితంపుష్పం తథా చగ్రథితం పునః । ధారయామాసశిరసాప్రేమ్ణా పార్థివ సత్తమః ॥ 13
పత్రచ్ఛేదేన యాంశ్చక్రే తిలకాన్స నరాధిపః । తాంశ్చసా ధారయామాసలలాటే చారుహాసినీ॥ 14
ఏవం సంక్రీడతో రాజ్ఞస్తయానహ సుమధ్యయా । బభూవుస్తసయాఃపంచ నామతస్తాన్నిబోధమే ॥ 15
ఆయుర్జ్యేష్ఠస్తతో ధీమాం స్తతశ్చాన్య స్త్వనామయః । అయుతాయుశ్చతుర్థోఽభూచ్ఛ తాయుశ్చైవపంచమః ॥ 16
ఏవంతస్యాః ప్రసూతావై యాతి కాలే మనోహరే । 17
గంధర్వా ముఖ్యాస్తుతదాసమేతా తయావిహీనాభృశముత్సుకాస్తు ।
తదాగమాయాథ సురేంద్రలోకే మంత్రంతదా చక్రురదీనసత్త్వాం ॥ 18

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండేమార్కండేయ వజ్రసంవాదే ఉర్వశీ సంభోగవర్ణనోనామ చతుస్త్రింశదుత్తర శతతమోఽధ్యాయః

మార్కండేయుడనియె. చిత్ర విచిత్ర ప్రాసాదములందు మణిమందిరములందు పూపొదరిండ్లం జక్కని పట కుటీరము.

లందు రత్నగృహములందు ఇసుక తిన్నెలందు వికసించిన తామర పూదీగలందు నప్పటి కప్పుడు పైకెగిసిన బహురమ్యములుగా ధూపవాసనల ఘుమఘుమలు నించు సుందర హర్మ్యము లందా రాజాదేవసుందరిని రమింపజేసెను. ఆమెతోగూడ నాతడు మానస సరస్తీరములందు మరి మరి నిరంతరము క్రీడించుచు క్రీడింప జేయుచు దృప్తి గనడయ్యెను. చంద్రునితోడి వెన్నెల రేల నా రాజ చంద్రుడు చంద్రునియట్లు మిసలచక్కనిదాని నెమ్మోమును దనివితీర నాస్వాదించెను. ఆ రాజీవనయనుడు చంద్రుడులేని రాత్రులందా చంద్రముఖి కున్ముఖుడై దాన మిక్కిలిగ ప్రభనించు ప్రదేశ మందామె నానంద పరవశం జేయుచుండెను. దినదినమీ యిందువదన యా నరేంన్ద్రుకి కామ మినుమడింప జేయుచు మున్నెన్నడు చూడని దట్లప్పటి ంప్పుడా విశాల వయన క్రొత్తదియై తోచి యా రేని కెంతేని దయిత (వల్లభ) యై రెట్టింపుగ క్షణ క్షణ నూతనుడయి తోచుచు ప్రీతినించెను. వలపులు నించు మంచి గంధపు పూతలతో నానాభరణములతో నా దంపతులు నానారత్న సముదయములతో మిక్కిలిగ విలసించిరి. ఆ రేడామెను ఆమె తనను అలంకరింప నెక్కడలేని యానందము నందుచుండెను. ముదితులై యా యిద్దరు దవ్య నవనములందు క్రీడించిరి. ఒండొరులు తమతమ వేనలులం బుష్పాలుముడిచికొనుచు నెనలేనీ శోభనముం బొందుచుండిరి. ఊర్వశి నీళ్లుపోసి పెంచి పూయించిన అమె తనయంద జుట్టునంగై సేసిన పువ్వుల ప్రేమమెయి దలదాల్చి యా పార్థివోత్తముండెంతేని మురియుచుండెను. ఆతడు నా యింతినెమ్మోమున రకరకములపత్రరేఖ లేమేమిరచించెను. ఏమేమి తిలకములు దిద్దెను. వాని వాని నల్లన నవ్వుచుం దన సుమట ధరించి ముచ్చటలు నించెను. ఇట్లామెంగూడి క్రీడించు నా రేని కై దుగురు తనయులు గలిగిరి. వారిలో ఆయువు జ్యేష్ఠుడు అటుపై క్రమముగ ధీమంతుడు అనామయుడు అయుతాయువు శతాయువు ఇట్లు కాలము గడు సొంపుగ గడుపుకుండ నామె యెడమాటుగొని గంధర్వముఖ్యు లామె రాకకొరకు సురేంద్ర లోకమున నయ్యెత నాలోచనము సేసిరి.

ఇది శ్రీ విష్ణుధర్మోత్తర మహాపురాణమున ప్రథమఖండమునందు ఊర్వశీ సంభోగ పర్ణనమను
నూట ముప్పదినాల్గవ అధ్యాయము.

## నూటముప్పదియైదవ అధ్యాయము- పురూరవవిరహవర్ణనము

మార్కండేయ ఉవాచ :- ఊర్వశ్యాగమనేయత్నం చక్రుస్తే మంత్రముత్తమమ్ ।
గంధర్వస్తూగ్రసేనాఖ్యస్త దామరిత్రమ భాషత ॥ 1
ఉగ్రసేన ఉవాచ :- సమయేఽవస్థితా తస్మిన్నుర్వశీ చారుభూషణా వ్యుత్క్రాంతసమయంసాకు రాజానం త్యక్ష్యతే చతమ్॥
తమహంవేద్మి సమయం తత్రయాస్యామిచానఘః । యుష్మత్కార్యం కరిష్యామి ససహాయోన సశంయః ॥ 3
మార్కండేయ ఉవాచ :- ఏవముక్త్వాయ యౌతత్రత యత్రాసౌనృపతిః స్థితః ।
రాత్రౌ జహారమేషంచ మాయయా స నరాధిపః ॥ 4
మేషం జ్ఞాత్వాహృతందేవీ రాజాన మిదమబ్రవీత్ । మేషోహృతో మహీపాలః కేనావ్యద్ధా సుతోమమ ॥ 5
ద్వితీయశ్చ హృతో రాజంస్తమానయ సుతంమమ । ఏవముక్తస్తయా రాజా నగ్న ఏవాధసంభ్రమాత్ ॥ 6
ఉత్థాయాన్వేషణం చక్రే మేషయోః పురుషర్షభ । అధాపశ్యత సానగ్నం దాజాన మసితేక్షణా ॥ 7
సంస్మృత్య నారదవచస్తతో భూతాబభూవసా । గంధర్వాణాం యయౌసాపి సమీపందుఃఖితాతదా ॥ 8
స్వర్గం ప్రావ్యవిశాలాక్షీ నిత్యంనృప పరాయణా । కామనున్న శరీరాపి కాలం నయతిసుందరీ ॥ 9
ఋషిశాప భయాద్భీతా మదనేనవశీకృతా । నిత్యమాస వరారోహా నిఃశ్వాసపరమాసతీ ॥ 10
అప్రాప్య మేషయుగళం ఎనివృత్తోనరాధిపః । నాపశ్యచ్ఛయనేదేవీం సస్మారసమయంతదా ॥ 11
విదిత్వా త్యక్తమాత్మానం స్మృత్వాసమయ మాత్మనః । కామ బాణార్దితోరాజా తధాపి ఎజనే వనే ॥ 12
తాంమార్గతి వరారోహా మున్మత్త ఇవ సర్వతః । ఏకాకీఎజనేరాజా ప్రియయా రహితస్తదా ॥
ఎలలాపమహాసత్త్వః కుసత్త్వాఇ వకశ్చన । 13

మార్కండేయుడనియె. గంధర్వులు ఊర్వశి తిరిగి వచ్చుటకు చాల ప్రయత్నమును జేసిరి ఉగ్రసేను డప్పుడొకయాలో చన చెప్పెను. ఊర్వశి పురూరవునితో నొక నియమము సేసియున్నది. అతడా నియమమును దప్పిన యెడల నామె యాతావు విడిచి వేయును. ఆ నియమము నేనెరుంగుదును. అట కేగుటచే సహాయుడనై మీ పని జక్కబెట్టి వచ్చెదను అని పలికి యుగ్రసేను డా రాజున్న యెడ కేగి రాత్రి మాయచేసి యామేకలను హరించెను. అదితెలిసి యూర్వశి రాజా! మేక నెవ్వడో హరించెను. రెండవ మేక గూడ దొంగిలింప బడినది. దానిం గొనితెమ్ము అన విని తేడు దిగంబరిగానే తొట్రుపడుచు లేచి యా మేకలను వెదకెను. ఆ యప్సరస యతనిని నగ్నునిగానే చూచెను. నారదుని మాట జ్ఞప్తిసేసికొని యప్పుడ యంతర్ధానమై దుఃఖించుచు గంధర్వుల సమీప మున కేగెను. స్వర్గమందా విశాలాక్షి రాజుపైన మనసుపడి నిత్యము మన్మథ వివశయై కాలము గడపుచున్నది. ఋషి శాప భయ మున మదన వశయై నిట్టూర్పులు పుచ్చుచుండెను. నరపతి వెదకియు నా మేకలం గానక మున్నొనరించిన ప్రతిజ్ఞ జ్ఞాపకము వచ్చి దానింబట్టి యామె తనను విడిచి వెళ్ళినదని తెలిసి కామార్తితుడై విజనమైన యా వనమున నామెను వెదకి పిచ్చివాడట్లొంటరియై నామె లేమి గడు కృశించి మహా సత్త్వుడయ్యు సత్త్వవ లేని వాడయి యిట్లు పరితపించెను.

పురూరవా ఉవాచ :- క్వగతాఽసి విశాలాక్షి! విహాయ విజనే త్రమామ్ ॥ 14
కథం ప్రవేక్ష్యామి పురం ప్రతిష్ఠానం వినాత్వయా । ప్రాణా స్త్యక్త్వా గమిష్యంతి శరీరంమమ సుందరి ! ॥ 15
అనుగంతుం శరీరేణ నశక్నోమి వరాననే! । త్వంహిమే చపలాపాంగి! ప్రాణేభ్యోఽపిగరీయసీ ॥ 16
త్వయాత్యక్తో ధ్రువం ప్రాణాం స్త్యక్ష్యామి వరవర్ణిని! । క్వాసి క్వాహం గమిష్యామి కింకరోమి వ్రజామి కామ్ ॥ 17
శరణం కామతప్త స్యకోమే సందర్శయేత్ప్రియామ్ । కంస్విత్పృచ్ఛామి విజనే కస్యసా విదితా భవేత్ ॥ 18
క్షేమో వామమ కస్యస్యాత్ యోమేసందర్శయేత్ప్రియామ్ । ప్రియావిరహితస్యైష నిశాశేషోగతోమమ ॥ 19
అంతర్ధానం గతాస్తారా యథాదేవీ మమోర్వశీ । దేవోఽరుణకరస్పర్శాచ్ఛోభాంత్యజతిచంద్రమాః ॥ 20
నిశాక్షయేక్షామవపు ర్యథాఽహం తద్వినాకృతః । ఏషాహ్యేవ రతేపూర్వా సంధ్యాస్నాత్వాద్విజాతయః ॥ 21
నూనం నియమ సంయుక్తా స్తిష్ఠంతి విజి జితేంద్రియాః । అయంహ్యుదయ మాయాతి సవితా రక్తమండలః ॥ 22
సర్వసత్త్వ సమోదేవః సర్వేషాంపాపనాశనః । ఉదితశ్చాప్యయం సూర్యో విభాతివిమలేంబరే ॥ 23
ఏకంఫుల్లం మహాపద్మం సరసీనామతేయథా । ఉదితంభాస్కరంజ్ఞాత్వా నళినీ పద్మలోచనా ॥ 24
ఉన్మీల్యాలోకతే సర్వంవినా తేన నిమీలితా । తీక్ష్ణార్కః సంప్రవృత్తోఽయం దివసః కామవర్ధనః ॥ 25
నైదాఘో మాం విశేషేణ సంతాపయతి తాంవినా । కంపృచ్ఛామి వరారోహాం సంతప్తకనకప్రభామ్ ॥ 26
దృష్టామయేతి సాదేవీ కోమాంవక్ష్యతి కాననే । కరీంద్రస్త్వయ మభ్యేతి తత్కుచాభౌ సముద్వహన్ ॥ 27
కుంభౌకతోరా సుముఖం పృచ్ఛామ్యేనం మతంగజం । త్వద్దంతయుగల ప్రఖ్యం యదూరుయుగళంహ్యభూత్ ॥ 28
గతాంతాంయదిజానీషే కథయస్వమమోర్వశీం । ఏషహ స్తీ గతస్త్రాసాత్సింహ స్యాస్య మహాత్మనః ॥ 29
అదత్త్వైవో త్తరంమహ్యం సింహం పృచ్ఛామ్యహం వనే । మధ్య స్తదుపమ స్తస్యాః క్వసా సంప్రత్యి కేసరిన్! ॥ 30
ఉర్వశీదయితా మహ్యం యదిజానాసి కథ్యతాం । అదత్త్వైవో త్తరం సింహః కథమేషగతోమమ ॥ 31
దృష్టాకథయమేబింబ! దేవీం బింబఫలాధరాఽ అనేనాపిన బాఖ్యాతా వృష్టేన సుదతీమమ ॥ 32
మయూర! యది జానీషే బాలాం బాలమృగేక్షణాం ఉర్వశీం కథయస్వాద్య క్వప్రియా మమవర్తతే ॥ 33
అంతఃశరీరం కామాగ్నిర్బహి ర్దహతి భాస్కరః । తాపార్తానిఃశ్వసంత్యేతే సింహా గిరిగుహాగతాః ॥ 34
నిర స్తజిహ్వాః స్రస్తాంగా వివృతాస్యాముహుర్ముహుః । యూథాని మహిషీణాంచ శేరతే నళినీజతే ॥ 35
సూర్యోద్ధృత జలాస్వన్యే పంకశేషాసుశేరతీ । గగనం చాతకశ్చాయం తృష్ణార్తో లోకతే ముహుః ॥ 36
సభృశంతోయ పానార్థే ఉర్వశ్యర్థే యథా త్వహం యాంత్యేతే పద్మినీ ఖండాన్ కుంజరాస్తా పరూషితాః ॥ 37

సుహ స్తముక్తైశ్చజలై ః సించంత్యాత్మాన మాత్మనా । మహాద్రుమాణాం స్కంధేషు విషణ్ణా శ్చాపరేగజాః ॥ 38
తాపంనయంతి మధ్యాహ్నే ముంచంతః శీకరంముహుః । శాఖాపర్ణాంతరాణ్యేతే విహగాస్తా పతాపితాః ॥ 39
విశంతిచై వ(త్రాణార్థం మధ్యాహ్న సమయే భృశమ్ । ద్రుమశాఖాగతాహ్యేతే విహగానాంచ బాలకాః ॥ 40
రక్తాంతచక్రాః సుభృశంవిశంతీహ ముహుర్ముహుః । త్యక్తాహార క్రియాశ్చైతే మృగయూథా మహావనే ॥ 41
ద్రుమచ్ఛాయాసు తిష్ఠంతి రోమంథంకుర్వతోముహుః । అన్వేషమాణో దయితాం శ్రాంతోస్మి విజయే భృశమ్ ॥ 42
ఛాయాయాం వి(శమిష్యామి శిరీషస్యాస్యసాంప్రతమ్ । తద్గాత్రసుకుమారాణి పుష్పాణ్యస్యవనస్పతేః ॥ 43
శిరీషవృక్షోరమ్యోఽయం మనోహృదయనందనః । కింతుమాం పీడయత్యేష శిరీష స్త ద్వినాకృతమ్ ॥ 44
సూర్యశ్చా స్త ముపాయాతి క్వగమిష్యామి శర్వరీమ్ । అస్తంయాతః సహస్రాంశు ర్నిశాప్రాప్తా సుదారుణా ॥ 45
రాత్రిమేనాం వివత్స్యామి న్యగ్రోధేఽస్మిన్మహాద్రుమే । ఉర్వశ్యా బుద్ధిరచితే పరకేశ్మని పార్థివః ॥ 46
సక్రీడతి తయాసార్థం సర్వకామైః సుపూజితః । నూనంమాంసజనో కే త్తి ప్రతిష్ఠానపురే తుమే ॥ 37
ఏతామవస్థాం కశ్చిన్మే న విజానాతి సాంప్రతమ్ । పౌరోజానపదః కశ్చి జ్జనోమేదయితఃసదా ॥ 48
నిద్రేభజస్వ మన్నేత్రే ధ్రువంస్వప్నేవరాననామి । తాంతుప్రాప్స్యామ్యహం సౌమ్యాం మనసః ప్రీతివర్ధనీమ్ ॥ 49
కథమభ్యుదితశ్చంద్రః పీడాంజనయతేమమ । తద్వక్త్రవిజితః పూర్వం వికరోత్యధునామయి ॥ 50
తుద చంద్ర! యథాకామం మమదేహం వినాకృతమ్ । త్వయాతునాథం సంప్రాప్య సావత్న్యం మమదర్శయ ॥ 51
హాహతోఽస్మివినష్టోస్మి ఉర్వశ్యారహితోసనే । చంద్ర! పౌత్రేకురుదయాం దర్శయస్వ మమప్రియామ్ ॥ 52
శశాంక! దేవ! శీతాంశో! నృణాందృష్టిమనోహర । ఆక్రందామి తనాద్యాహం దర్శయస్వప్రియాం మమ ॥ 53
అతృ ప్తదర్శనన్యైవ సాగతాసుందరీ మమ । అంతర్ధానం విశాలాక్షీ తాందర్శయ మమోర్వశీం ॥ 54
కదాఽధర రసం తస్యాః పాప్యామ్యమృతసంనిభం । కద్రాదష్టాఽస్మి తాంభూయః కమలోదర సంనిభాం ॥ 45
మృణాళబాహుయుగళాం పద్మవక్త్రాంకదాప్రియామ్ । నీలోత్పలాక్షీమాలింగ్య తాపంత్యక్ష్యామ్యనంగజం ॥ 56
అనంగశరనున్నస్యబాలే! భవ గతిర్మమ ॥ దదస్వ దర్శనం సుభ్రూః కామమాన్యాగతిర్భవేత్ ॥ 57
కామమోహ గృహీతస్య త్వమేవాభూర్గతిర్మమ । భూయ స్త్యమేవ సుభగే! గతిర్భవ మమానఘే! ॥ 58
ఏషావిరశితారాత్రి ర్మమ వర్షశతో పమా । అన్వేష్టుంక్వ గమిష్యామి నిర్ఘృణాం తాం మమోపరి ॥ 59
యస్యాః కోంన జానామిస్వప్నేఽపివరవర్ణిని! । దై వేనోపహతస్యాద్య త్యక్తాసాసుభగా గతా ॥ 60
మార్కండేయ ఉవాచ :- ఎవంసవిలప(న్రాజా త్యక్తా హారః పరిభ్రమన్ । ఆససాదకురుక్షేత్రం ద్వాదశాహేన పార్థివః ॥
పుష్కరిణ్యా స్తటప్లక్షే పుష్కరై రుపశోభితే । నిషసాద తదాశ్రాంతః క్షుత్పిపాసాసమన్వితః ॥
విలలాప స తత్రాపి మదనేన వశీకృతః । 62
కదానుతచ్చంద్ర మసోఽనుకాంతి । ముఖంస్మితం చారువిలోచనాయాః ।
ఉన్నమ్యపాస్యా మ్యథ రంతృషార్తో । వారీవపాంథః పథికృచ్ఛ్రలభ్యమ్ ॥ 63

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
పురూరవః ప్రలాపవర్ణనోనామ పంచత్రింశదుత్తర శతతమోఽధ్యాయః

ఓ విశాలాక్షి; నన్నీ నిర్జనమైన యడవిని విడిచిపెట్టి యెటుపోయితివి? నీవు లేకుండా నేను ప్రతిష్ఠానపురమెట్లు ప్రవేశింప గలను. సుందరీ! నా ప్రాణము లీతనువుం బాసిపోనున్నవి. శరీరమును వెంబడింప జాలను ఓ చపలాక్షీ! నీవు నా ప్రాణముల కంటెను నెక్కువ దానవు గదా! నీవు నన్నెడబాసిన నేను తప్పక ప్రాణములు విడిచెదను ఏట నున్నావు? ఎటకు బోదును? ఏమి సేయుదును? ఎవ్వతెం గూర్చి పోవుదును? ఈ కామతప్తునకు దిక్కెవ్వడు? ఎప్పుడు నా ప్రియురాలిం జూపును? ఈ నిర్జనా

రణ్యమం దెవ్వని నడుగుదును? ఎవని కీమె తెలియును? నా క్షేమమెవనికి గావలయును? నా ప్రియురాలి నెవ్వడు చూపించును. ప్రియ విరహితుడనైన నాకప్పుడే యీ రేయి కడ చనినది. నా దేవి చక్కనిచుక్క యుర్వశి యంతర్ధాన మైనట్లే చుక్కలు యంతర్థానమైనవి. అరుచు కరస్పర్శచే చంద్ర భగవాను డల్లదె ఆమెం బాసి నేనెట్లు బక్కచిక్కితి నట్లు శోభ దక్కి యున్నాడు.

ఇదిగో పూర్వ సంధ్య తిరిగినది. ద్విజులు విజితేంద్రియులు స్నానముసేసి మడిగట్టుకొని యనుష్ఠానము లందున్నారు. ఇదుగో నెఱ్ఱని బింబముతో సవిత యుదయ మందు చున్నాడు. సర్వ సత్త్వసఖుడు సర్వ పాపముల నశింప జేయు సూర్యభగవానుడుదయించి యిల్లిదె నిర్మలాకాశమని దేఱకిల్లు చున్నాడు ! భాస్కరుడుదయించుటెరిగి పద్మ లోచన పద్మిని యీ ప్రభువు లేమి నింతమున్ను మూసికొని యున్నదిప్పుడు తెరచి కొని సర్వమ్ముం జూచుచున్నది. ఇదిగో దివసదు ప్రచండార్కమై కాకమ్ముం బెంచు చున్నది. ఆమె నెడబాసిన నన్నీ నైదాఘము (వేసవి) మిక్కిలిగ నుడికించు చున్నది. కరగిన బంగారము వన్నెగల యన్నట్లుయామిన్నం గూర్చి యెవ్వని నడుగుదును? ఆ దేవి నాకు గనపడినదని కారడవిన నెవ్వడు నాకు దెలుపును? యింతి కుచముల కఠినమైన కుంభస్థలము లూని యిల్లిదె కరీంద్రము సుఖమై సమ్ముఖమయి వచ్చుచున్నది. ఈ కరీంద్రము నామెజాడ యడుగుదునా ! నీలురు దంతముల సెంపున నింపు గులుకు నూపురులం గొని నడచి చనిన యా పడతి నూర్వశి నెరుంగుదువా? నాకు తెల్పుమని ప్రశ్నింతునా ! ఈ ఏనుగిదె యీ మహానుభావునకు సింహమునకు జడిసి పోయి నాకు బదులు పల్కకుండ నిటుపోయినది. పోనిమ్మి సింహమును, ఆ తనూమధ్య మధ్యము (నెన్నడుము) నీ నడుముం బోలునది కేసరీ ! ఇప్పుడామె యెక్కడున్నది? నా ప్రాణేశ్వరి యెరిగితేని నాకు దెలుపును. ఈ సింహము గూడ నాకు ప్రత్యుత్తర మీయకుండ బోయినది. ఓ బింబమా ! ఓ దొండతీగా ! బింబఫలాధర (దొండ పండు వంటి పెదవులు గలది) నా దేవి గనబడినదా? చెప్పుము. నే నడిగిన నిదియుం నా సుదతి జాడం గూర్చి బదులీయకున్నది. ఓ నెమలీ ! లేడి పిల్ల కన్నులు గల యా బాల యూర్వశి నా వల్లభ యిప్పుడెందున్న దీ తెల్పుము. కామాగ్ని శరీరము లోపలను భాస్కరుడు వెలుపలను దహించు చున్నారు. ఇవిగో గిరిగుహలందున్న యీ సింహములు తాపార్తములై నాలుకలు వెలుపరించి మేను వడక నోళ్లు తెరచుకొని మాటి మాటికి నిట్టూర్చు చున్నవి. గేదెల మందయునిట్ల తామర కొలనిలో పండుకొన్నవి. కొన్ని సూర్య డుదకముల నెత్తికొని పోవ యడుసు మిగిలిన మడువులందు పండుకొన్నవి. ఇదుగో ఈ చాతకము (తృష్ణార్తమై) దప్పికకు నుడిసి తోయ పానార్థియై (నీరు ద్రావ గోరి) తృష్ణార్తుడనైని (యామె వంక నాస పుట్టుకొనిన) అధర పానార్థియైన నావలె నూరక యాకసము వంక జూచుచున్నది. ఇల్లిదె కుంజరములు తాపమున నుడికి తొండములందుండి యరలు జలములం దమ్మ దాము తడుపుకొనుచు పద్మినీ ఖండములకై (తామర తూడులకు లేదా తామర మడువులకు) పోవుచున్నవి. కొన్ని యేనుగులు పెద్ద మ్రాకుల నీడకు జేరి మరి మరి తొండములం దుంపురుల విసరించుచు నీ మధ్యాహ్న వేళ తాపమును వారించు కొనుచున్నవి. ఇవిగో పక్షి కిలకిలలు. మధ్యాహ్న సమయ తాపమును వారించుకొనుటకు కొమ్మల లోలోని యాకుల గుబురుల దూరి యున్నవి. మృగముల (లేళ్ళ) మంద లల్లదిగో మేతలు మాని యిమ్మాహా వనమగదు చక్రాంతడూలు ఎరుపెక్కి (దక్రాంత చక్రాః) మరి మరి నెమరు వేయుచు జెట్ల నీడలందు నిలిచినవి. నా వల్లభ నల్లల్ల విజనమై నెదకి వెదక యొల్లబోయితిని (అలసితిని) ఇపుడి శిరీషము (దిరిసెన) నీడ విశ్రమింతును. ఈ తరువు కుసుమము లామె మేని వలె సుకుమారములుగా నున్నవి. ఈ వృక్షమతి రమ్యము. నా మనస్సులు హృదయము నానందింప జేయ గలదే. కాని యామె విడ సేయబడిన నన్నిది యిప్పుడెంతేని బాధ పుట్టుమన్నది. సహస్రకిరణుడస్తమించినాడు సుదారుణ రాత్రి వచ్చినది. ఈ పెద్ద మఱ్ఱి చెట్టు నీడ నీరేయి నూర్వశి భాగ్య సమృద్ధిం సమకూర్ప బడినది నన్ను నిక్కముగా నెరుంగును. కాని యీ నా యవస్థ నిప్పుడు నా పేర బూనవద మేదియు నెరుంగదు. ఓ నిద్రా ! నా కన్నులం బొందుము. శుభానను నా మనసు నుల్లాసముం బెంపొందించు నా సౌమ్యను (మంచి దానిని) నా సుందరిని గలలో నైన నిక్కముగ తిలకింతును. మున్నామె నెమ్మోమున చంద్రుడిపుడభ్యుదయ మొంది నాకెంత బాధ కల్గించు చున్నాడు ! మున్నామె నెమ్మోముచే నోడింపబడి యిప్పుడు నాపై కసి దీర్చుకొను చున్నాడు. ఓ చందమామా ! ఆమె కెడమయి యిప్పుడు నీతో సనాథమయిన నీచే ననాదమైన అనగా ఇప్పుడు నీవే స్వామివై నీవేదిక్కయి యున్న యీ దేహమును నీయిష్టమౌ వచ్చినట్లు వేధింపుము. దానియెడ సాప

త్న్యమును (సవతి తనమును) చూపింపుము. అయ్యో! హతుడ నైతిని. ఊర్వశీ నే వినష్టుడనై తిని. నీ పౌత్రునియందు (నీ కొడుకు బిడ్డనైన నాయందు) దయగొనుము (జాలిగొనుము) నా ప్రియురాలిం జూపింపుము. ఓ శశాంకా! ఓ శీతాంశూ! మానవుల దృష్టిని మనమును హరించు వాడ! నీకై యాక్రందించు చున్నాను (గోల పెట్టు చున్నాను). నాకా యూర్వశిం గానిపింపుము. అమృతము వంటి ఆమె అధర రస మెప్పుడు నే గ్రోలెదను? కమలోదరమట్లు అరుణారుణ ప్రభ గులుకు మేని దానిం దానిని మరల యెప్పుడు గాంతును. తామర తూడుల కెనయగు బాహువులు పద్మమున కీడగు మొగము నల్లగలువల తులతూగు కన్నులు గల నిజ వల్లభ నే నెన్న డాలింగనమొనరించికొని యీ యనంగ తాపమును బాసెదను. ఓ బాలికా! అసమ శర శరాహతుడగు నా కీవు గతివిగమ్ము. ఓ సుభ్రు! కామ మోహము బట్టిన నాకు నీవే గతి వయితివి. ఓ సుందరీ! ఓ పుణ్యాత్మురాలా! నీవ యిప్పుడును గతివి గమ్ము. ఈ యొక్క రేయి నాకు నూరేండ్లట్లు పెరిగినది. నాపై జాలిలేని యా లేమను వెదకుట కెక్కడకు బోదును. కలలోనైన నెవ్వతె కోపమే నెరుంగ నట్టి సుందరి దైవోపహతుడ నగు నన్ను విడిచి వెళ్ళినది. అని యిట్లా రాజు విలపించుచు నాహారమముట్టక నిట్టట్టు దిరుగుచు బంద్రెండు రోజులకు కురుక్షేత్రమును జేరెను. తామర పూవులచే శోభించు పుష్కరిణి యొడ్డునంగల జువ్వి చెట్టు క్రింద నలసి యాకలి దప్పికల సొలసి కూర్చుండి యట కూడ మదనునికి లొంగి దప్పిక నడలి చంద్రుని కెనయైన కాంతి గల యాకాంత మ్రోల నవ్వును గులుకు నా చారులోచన నెమ్మోమియల్లన నెత్తి యయ్యధరమ్ము నతి కష్టము మీద లానించిన మంచినీటిం బాటసారి యట్లెప్పుడో గ్రోలుతును గద యని విలపించెను.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండము నందు పురూరవవిరహవర్ణనమను నూటముప్పదిఐదవ అధ్యాయము

## నూటముప్పది యారవ అధ్యాయము - త్రేతాగ్ని సంభవము

మార్కండేయ ఉవాచ : ఉర్వశ్యపివరారోహా మదనేనాభిపీడితా । జగాద నారద స్యాథ స్వామవస్థాం నృపంవినా ॥ 1
తతస్తాం నారదః ప్రాహ సుభగే! గచ్ఛపార్థివమ్ । తస్యాప్యవస్థా మహతీ త్వద్విహీనస్యసుందరి ॥ 2
ఏకాం రాత్రిం నరేంద్రేణ సహోష్య వర వర్ణిని! । స్వర్గలోక ముపాగచ్ఛ శ్రేయః ప్రాప్స్యసి వైతతః ॥ 3
నారదే నైవముక్తాసా సఖీభిర్బహుభిర్వృతా । పుష్కరిణ్యాస్తరు ప్లక్షే యయౌస్నాతుం వరాననా ॥ 4
ఏతస్మిన్నేవకాలేతు నిద్రయోపహృతో నృపః । అప్సరోభిరవజ్ఞాత స్తత్ర సుష్వాప పార్థివ! ॥ 5
అద్యయాస్యామి రాజానమితి హృష్టా తదోర్వశీ । క్రీడంత్యత్రజలే తస్మిన్ సఖీగణ వృతా తదా ॥ 6
త్యక్త నిద్రో నరేంద్రోఽపి విలలాపచిరం పునః । శుశ్రావ విలపన్తంసా సఖీభిః సహితా నృపమ్ ॥ 7
దర్శయామాసచాత్మానం పార్థివస్య శుభా తతః । ఉవాచచ వరారోహా నారదోక్త మశేషతః ॥ 8
తత్రైవోవాస తాం రాత్రిం సహతేన వరాననా । రాత్రిక్షయే విసంజ్ఞం సా రాజానం వాక్యమబ్రవీత్ ॥ 9
ఉర్వశ్యువాచ : ఆరాధయస్వ గంధర్వాన్ మోహం త్యక్త్వా నరేశ్వర! ।
తేషాం ప్రార్థయ మాం సౌమ్య! తతః ప్రాప్స్యసి మా చిరమ్ ॥ 10
మార్కండేయ ఉవాచ : ఏవముక్త్వా యయౌ స్వర్గం రాజా తత్రైవ పార్థివ! ।
తపః స విపులం చక్రే తద్గతేనైవ చేతసా ॥ 11
అథ సంవత్సరే పూర్ణే సూర్యస్యోదయనం ప్రతి । నారదం పురతః కృత్వా గంధర్వా దర్శనం దదుః ॥ 12
గంధర్వా ఊచుః : వరం వరయ రాజేంద్ర! యదిచ్ఛసి మహాభుజ! ॥

వయంహి తవ దాస్యామః సర్వఏకామర ప్రభాః ॥ 13
పురూరవా ఉవాచ : భవంతశ్చేత్ప్రసన్నా మే యదిమేరోచతే వరమ్ । ఉర్వశీసేహచా ర్వంగీ భవద్భిర్మమ దీయతామ్ ॥
గంధర్వా ఊచుః : స్థాలీం పూర్ణామిమాం రాజన్గృహాణాగ్నేర్మహాభుజః ।
అస్మాదగ్నిం త్రిధా కృత్వా యజస్వ విగత జ్వరః ॥ 15
వేదోక్తే న విధానేవ గంధర్వత్వ మవాప్స్యసి । త్రేతాగ్నిపూర్వస్యవిధేరస్మి న్మన్వంతరే భవాన్ ॥ 16
భవితా దర్శితా లోకే గురుశ్చ జగతీపతిః । గంధర్వత్వ మవాప్యాథ రాజన్ప్రాప్స్యస్యథోర్వశీమ్ ॥ 17
మన్వంతర మిమం సర్వంరంతాచత్వం తయాసహ । మన్వంతరేగతే రాజన్నుర్వశ్యా సహితో భవాన్ ॥ 18
ప్రవేక్ష్యతి నిశానాథం సోమం శీతాంశుముజ్జ్వలమ్ । ఆధారం సర్వలోకస్య పితౄణాం స్థాన ముత్తమమ్ ॥ 19
మార్కండేయ ఉవాచ : అగ్ని స్థాలీం నృపే దత్వా గంధర్వా స్త్రిదివం యయుః ।
అథాఽఽజగామ తం దేశం బాలమాదాయచోర్వశీ ॥ 20
ఉర్వశ్యువాచ : తస్మిన్సమాగమే సౌమ్య! జాతోఽయం తనయః ప్రభో! ।
తమాదాయ ప్రతిష్ఠానం వ్రజ పార్థివ: మాచిరమ్ ॥ 21
కృతం నామాస్య గంధర్వై ర్విశ్వాయురితి భూమిప: ।
మార్కండేయ ఉవాచ : ఏవం దత్వా నృపే బాలం సాప్రయాతా త్రివిష్టపమ్ ॥ 22

మార్కండేయుడనియె :- ఊర్వశి రాజుం బాసి మరుబారికిం దక్కి నారద మహర్షితో దనయవస్థ విన్నవించుకొనియె అయనయు నో సుందరి! నీ వా పార్థివుని దరి కరుగుము. అతడును నిదే దురవస్థం గుములు చున్నాడు. ఒక రేయి యాతనితో నుండి స్వర్గమునకు దిఱిగి రమ్ము. నీకు శ్రేయస్సు కలుగునన నా భామిని సఖురాంద్రతో పుష్కరణీ ప్లక్ష వృక్ష ప్రాంతమునకు స్థానము సేయ నేగెను. ఇదే సమయమున రాజు అప్సరసల వలన నవమానితుడై యట నిదురించెను. ఇప్పుడ రాజుం బొందెదనని యానందభరితయై యూర్వశి చెలికత్తెలతో నట జలక్రీడ లాడ జొచ్చెను. నరేంద్రుడంతట మెళుకువగని విరహవ్యథం దుఃఖించెను. అది విని యయ్యప్సర యేగి యాతనికి గనబడెను. మఱియు నారదుడు చెప్పిన మాట విన్నవించెను. ఆ రేయి యతనితో నచ్చటనే వసించెను. ప్రేమఅపున నున్న ఆ జేనితో నీవు మోహమువాసిన గంధర్వుల నారాధింపుమ. ఓ సౌమ్య మూర్తీ! నిన్నమ్మని వారిం బ్రార్థింపుము. అప్పుడు నన్ను బొందెద వాలసింపకు మని స్వర్గమునకుం జనెను. ఆ భూపతి యామెపై మనసువడి దివుల తపస్సు చేసెను. అటుపై నొక్క సంవత్సరమునకు గంధర్వులు నారద మహర్షిని ముందిడుకొని వచ్చి సూర్యోదయమున దర్శన మిచ్చి రాజేంద్రా! నీ కిష్టమైన వరము కోరుము. మే మమర ప్రభా సంపన్నుల మది యిత్తుమన పురూరవుడు తాము నా యెడ ప్రసన్నులై రేని యూర్వశి నా లలితాంగిం దయసేయ దనియె. వారు నిదిగో యీ యగ్ని పూర్ణస్థాలిం (పాత్ర) గైకొనుము. బాధవాసి ఇందున్నయగ్నిని మూడుగా నొనరించి వేదోక్త విధానమున యజింపుము. అందు వలన నీ మన్వంతరమందు గంధర్వుడ వయ్యెదవు. మఱియు నీ లోకమునకాదర్శ ప్రాయతగు గురువౌదువు. గంధర్వత్వ లాభమున నీ వూర్వశిం బొందెదవు. అమెతో నీ మన్వంతరమెల్ల క్రీడించి మన్వంతరము చివర నిశాపతి, నా శీతాంశుని సోమునిం బ్రవేశింప గలవు. ఆయన సర్వలోకాధారుడు. పితృదేవతలకు మహాస్థానమయినవాడు. అని గంధర్వు లగ్ని స్థాలి నాతేని కిచ్చి వారు త్రిదివమునకుం జనిరి. అవ్వల నూర్వసి బాలునెత్తుకొని యట కేతెంచి, ప్రభూ! ఆ నాటి మన సమాగమమున నీ తనయుడు గల్గినాడు. వీనిం జేకొని ప్రతిష్ఠాన నగరమున కేగుము. ఆలసింపకుము గంధర్వులు వీనికి విశ్వాయు నను పేరు పెట్టిరి. అని యాతేని కాపిల్లవాని నిచ్చి యామె నాకమున కేగెను.

ఏకాకీ చింతయామాస బుధ పుత్రోఽప్యనంతరమ్ । కింను బాల ముపాదాయ గాగ మిష్యామిపురం స్వకమ్ ॥ 23

అథాదాయ గమిష్యామి స్థాలీమేతాం విభావసోః । శ్వాపదేభ్యో భయం ఘోరం బాలస్యాస్య భవిష్యతి ॥ 24
మయా విహీనస్య భయం నాస్తి కించిద్విభావసోః । ఏవం సనిశ్చయం కృత్వా బాల మాదాయ సత్వరః ॥ 25
జగామ స్వపురంహృష్టః ససైన్యశ్చాగమ త్పునః । స్థాలీం దదర్శహీనాంతు దృష్ట్వా మోహముపాగతః ॥ 26
త్రిదివాదేత్య గంధర్వా మూఢం పార్థివస త్తమమ్ । ఉత్థాపయిత్వా వచన మూచు స్తద్ధితకాంక్షిణః ॥ 27
రాజన్నస్మించ్ఛమీగర్భే ప్రవిష్టః స హుతాశనః । అస్మా త్త్వమరణింకృత్వా జనయ స్వహుతాశనమ్ ॥ 28
త్రిధాకృత్వాతు తం వీర! యజస్వ విధివ త్తదా । తనిష్ట్వా ప్రాప్స్యసే వీర! గంధర్వత్వమసంశయమ్ ॥ 29
త్రేతాగ్నింతే నరేం దేహ హోష్యంతి సతతం ద్విజాః । స ప్తవర్షాణితేఽప్యేవం యాస్యత్యస్మత్సలోకతామ్ ॥ 30
త్రయోగ్న్యయశ్చౌపసదం తవ రాజన్ప్రకీ ర్తితాః । అగ్నిరాహవనీయ స్తు వాసుదేవో నరాధిపః ॥ 31
దక్షిణాగ్ని స్తథాజ్ఞేయో నిత్యం సంకర్షణో బుధైః । తథాచ గార్హపత్యో ఽగ్నిః ప్రద్యుమ్నః పరిపఠ్యతే ॥ 32
తథై వౌపసథో రాజన్ననిరుద్ధః ప్రకీ ర్తితః । తస్మా దేవ వరో విష్ణు శ్చతురాత్మా నరాధిపః ॥ 33
ఫలాభిసంధాన హుతో గంధర్వత్వం ప్రయచ్ఛతి । కామంవినాగ్నిహోత్రేణ హుతో రాజన్! జనార్దనః ॥ 34
ప్రయచ్ఛతి పరంస్థాన మమృతం శాశ్వతం ధ్రువమ్ । అగ్నిహోత్రా దృతే రాజన్గంధర్వత్వం న విద్యతే ॥ 35
సుహుతేనాగ్నిహోత్రేణ ప్రాప్యతే సంశయం వినా । ఏవము క్త్వా యయుః సర్వే గంధర్వా స్త్రిదివం తతః ॥ 36
రాజాప్యరణి మాదాయ శమీగర్భాద్గృహంయయౌ । తతః ప్రభృతి రాజేంద్ర! శమీగర్భాద్ధుతాశనమ్ ।
జనయంతి ద్విజశ్రేష్ఠా స్తత్ర సన్నిహిత స్త్వసౌ ॥ 37
ఏకోగ్ని రాసీ న్నృపవర్య! పూర్వం । వైవస్వతస్యాస్య తథాఽంతరేఽస్మిన్ ।
త్రిధాకృత స్తేన మహానుభావ! । సంమంత్రి విప్రైః క్రతుశాస్త్ర విజ్ఞైః ॥ 38

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
త్రేతాగ్న్యుత్పత్తిర్నామ షట్త్రింశదుత్తర శతతమోఽధ్యాయః.

అనతంర మొంటరిగ నా బుధ కుమారుడీ మసుంగొని నా రాజధాని కేగుదునా? అటుపై నీ యగ్నిం స్థాలిం గూడ గొంపోదునా! ఇయ్యడవిలో నీ శిశువునకు క్రూరమృగములవలని భయముగల్గును. నేను లేకున్న నగ్ని కేభయముగల్గదని నిశ్చయించి దొందరగ సంతోషమున బాలునెత్తుకొని తన నగరమునకుం జనెను. సేనతో తిఱిగి యటకువచ్చి యగ్నిలేని స్థాలిని(పాత్రను) జూచి మూర్ఛవడెను. గంధర్వులు సురలోకమునుండి వచ్చి లేపతీసి యాతని హితవు గోరి రాజా! యగ్ని యీజమ్మిగర్భమునం బ్రవేశించి నాడు. దీని నరణిం గావించి యందుండి యనలుని బుట్టింపుడు. ఆ యగ్నిని మూడు భాగములుసేసి యథావిధి యజింపుము. అందు వలన గంధర్వత్వ మందెదవు సందియములేదనిరి. ఈ నీ త్రేతాగ్నిని నవనిలో ద్విజులు యజింపగలరు. ఏడు సంవత్సరములలో వారు సాలోక్యమునందుదురు నీఔపసదమీ త్రేతాగ్నులలో నాహవనీయాగ్ని వాసుదేవుడు. దక్షిణాగ్ని సంకర్షణుడు. గార్హపత్యము ప్రద్యుమ్నుడు అట్లే ఔపసదము అనిరుద్ధుడు నను విద్వాంసులు వేదములందు పఠింతురు. అందువలన చతుర్వ్యూహ స్వరూపు డైన విష్ణువు ఫలాభి సంధానముగ హోమము గావింప బడి గంధర్వత్వ మొసంగును. నిష్కామముగ జనార్దనుడు హోమము గావింపబడు నేని శాశ్వతమైన యమృత స్థానమునుగ్రహించును. అగ్నిహోత్రము లేకుండ గంధర్వత్వము లేదు. సుహుతమైన యగ్నిహోత్రము చేత నిస్సందేహముగ నది యందబడును. ఇట్లని యా గంధర్వులు త్రివిష్టపమునకుం జనిరి. అవ్వల నా రాజు శమీదర్భము నుండి యరణింగొని యింటికి జనియె. రాజేంద్ర వింటివా? అది మొదలు ద్విజశ్రేష్ఠులు శమిగర్భమునం దగ్నియు సన్నిహితుడు, గావున నందుండి మథించి యగ్నిం జనింప జేయుదురు. ఇంతమున్నగ్ని యొక్కడే ఈ వైవస్వతమన్వంతర మందాయన క్రతు శాస్త్ర విదులగు విప్రత్రయము (శ్రౌతుల) తో బాటు మూడుగా నొనరింపబడెను.

ఇది శ్రీ విష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమునందు త్రేతాగ్నిసంభవమను
నూటముప్పదియారవ అధ్యాయము.

# నూటముప్పదియేడవ అధ్యాయము - పురూరవ స్వర్గప్రాప్తి

మార్కండేయ ఉవాచ :- తతః స స్వపురం ప్రాప్య చాగ్న్యుపాసన తత్పరః ।
ఈజే బహువిధైర్యజ్ఞైః ప్రజా ధర్మేణ పాలయన్ ॥ 1
అశ్వమేధశతైరిష్ట్వా వాజపేయైః సహస్రశః । అగ్నిష్టోమైశ్చాతిరాత్రై ర్ద్వాదశాహైః పునః పునః ॥ 2
స సప్తద్వీపసముద్రాయాం పృథివ్యామేకరాడ్ బభౌ । అమానుషైర్వృతః సత్త్వైః స విజిగ్యేమహీతలమ్ ॥ 3
దుర్భిక్షంమరణం వ్యాధిర్నాభవత్కస్యచిత్క్వచిత్ । సర్వోధర్మపరోలోకః సర్వ ఏవసుఖీజనః ॥ 4
సర్వేచైవ సమృద్ధార్థాస్తస్మిఞ్జన పదేశ్వరే । నాసీత్పశువధార్థానాం వధస్తస్మిన్ వృథాతదా ॥ 5
సర్వభూతాని రాజానం భావేనోపగతాని తమ్ । సర్వస్యచ జనస్యాసీత్సరాజా పితృసంనిభః ॥ 6
దృష్ట్వాతంభూపతింస్వప్నే ప్రసీదంతి జనాస్తదా । యత్యదానిర్యాసౌ రాజాచతురంగబలాన్వితః ॥ 7
గృహచర్యారతా నార్యస్తదా పశ్యంతి తంసదా । పుష్పైశ్చందనధూపైశ్చ తథైవ వికిరంతి తమ్ । 8
ఉర్వశీ కృతపుణ్యాసా దేవీ నారాయణాత్మజా । యయాక్రీడి తమస్యాంకే వదంత్యేవంచ యోషితః ॥ 9
అయ మాయాత్యసౌ రాజా యదాశృణ్వంతియోషితః । గృహకార్యాణ్యపి త్యక్త్వా తదా యాంతి గవాక్షకాన్ ॥ 10
అభ్రాణిశారదానీవబహూ చంద్రాణి యోషితామ్ । ముఖై రాజంతి వేశ్మాని నిర్యాతే పృథివీశ్వరే ॥ 11
యానపశ్యతితం యాంతం సాతం జ్ఞాత్వాతిరోహితమ్ । ముషితం చైవ సాఽఽత్మానం లేత్తినిందతి సాభృశమ్ ॥ 12
యాచపశ్యతితం యాంతం కందర్పసదృశంనృపమ్ । తద్గతేన హృదాసాఽపిశూన్యాతిష్ఠతి వేశ్మని । 13
యదాయజతియజ్ఞైశ్చ తదాశూన్యావసుంధరా । సర్వాభవతి రాజాన్యం తతా గచ్ఛజనః ॥ 14
యశ్చయాతిజనస్తస్య యజ్ఞైరాజ్ఞో మహాత్మనః । కిమిచ్ఛకైస్తదారాజ్ఞా సర్వః సంపూజ్యతేతదా ॥ 15
సభాసంస్థస్యవై రాజ్ఞః ప్రతీహారో దినేదినే । ఉద్ఘోషయతికార్యార్థీ తస్యరాజ్యే కథంచన ॥ 16
ఇత్యేవం శాసతోరాజ్యం గతఃకాలోమహీపతేః । సకదాచిద్ద్విజానాహ దర్శయధ్వంమ మోర్వశీమ్ ॥ 17
ద్రక్ష్యసే తాంస్త్వయం రాజన్నవయం దర్శయామహే । తతస్తే షాంధనేలోభంచ కామనిపీడితః ॥ 18

మార్కండేయుడనియె. అటుపై పురూరవుడు తన పురమునుజేరి త్రేతాగ్న్యుపాసన తత్పరుడై ప్రజలను ధర్మముగ పాలించుచు పలువిధములైన యజ్ఞములుగావించెను. అనేక శతాశ్వమేధములు వాజపేయసహస్రములు పండ్రెండురోజులదీక్షగల అగ్నిష్టోమాతి రాత్రములు మరల మరల గావించి సప్తద్వీప వసుంధర కేకచ్ఛత్రాధిపతియై విలసించెను. అమానుష సత్త్వ సంపన్నుడై మహీమండలమెల్ల జయించెను. దుర్భిక్షము మరణము వ్యాధి యెవ్వనికినిలేకుండెను. సర్వలోకము ధర్మపరమై సర్వజనముసుఖించెను. అతడు రాజ్యాధిపతియైనతరి నందరు సర్వార్థ సమృద్ధులై యుండిరి. ఆతని రాజ్యమున వ్యథా పశువధ లేదు. ఆ తేని నెల్లభూతము లాశ్రయించికొని యుండెను. ఎల్ల జనమునకాతడు తండ్రివలె నుండెను. అయ్యెడ నాతనిం గలలో గని జనులు ప్రసన్న మనస్కులగుచుండిరి. చతురంగ బలములతో నతడు పురము వెడలుతరి నింటిపనుల నిరుకువడియుం బడతులాతనిపై పూవులను చందనోదకములను ధూపముల వెదజల్లుచుండిరి. నారాయణుని గన్నకూతురు ఊర్వశి యీతని యొడిలో క్రీడింప నెంతపుణ్యము సేసికొన్నదని పురాంగన లొండొరులతో చెప్పికొనుచుండిరి. ఇడుగో రాజు వచ్చుచున్నాడని విని మానిసు లింటిపనులు గూడ మాని గవాక్షముల చెంతకు బరువులిడి యా దొరం దిలకించు చుండుట అనేక చంద్రబింబములతోడి శారదాకాశములో యన నాతనిం జూచు వేడుక గొన్న సుందరుల నగుమొగములతో నా నగరమందలి మందిరము లింపొంచుచుండును. రాజవీధి నతడు దాటి కనుమరుగువడెనని తెలిసి యక్కలికి దానేమో దొంగతనము సేసికొన్నట్లనుకొని తన్ను దా నిందించుకొనును. కందర్పుడట్లు సుందరుడగు నతడూరేగు

చుండ గని యతనిపై మనసుపడి యింట శూన్యయై ఏమియు తోచక బెంబేలు పడి నిలుచును, అతడు యజ్ఞము లెప్పుడు సేయునప్పు డాతని సన్నిధికి జనమెల్ల చన నయ్యెడ వసుంధర యెల్ల శూన్య మయ్యెను. అనగా నాతని రాజ్యమందలి ప్రజలాబాలగోపాలముగ నీతని యజ్ఞ వైభవమును జూడ నుచ్చట గల్గి యుండిరన్నమాట. అమ్మహాత్ముని యజ్ఞమున జనమేదికోరి వెళ్ళినను నతడు వారి వారి కది యిచ్చి సత్కరించు చుండెను. దిన దినము నతడు సభ నలంకరించినతరి నాతని ప్రతిహారి యెవరెవరి పనులేమని యాతని రాజ్యమునందలి ప్రజలకు జాటించు చుండెను. ఇట్లు ప్రజారంజనముగ నారాజు పరిపాలనము సేయ బహుకాలము గడచెను.

హ్రియమాణేధనే విప్రైః శప్తః పంచత్వమాగతః । జీవితశ్చాపరైర్విప్రైర్గతరోషైర్మహీపతిః ॥ 19
ఆత్మానం గర్హయిత్వాఽసౌ లబ్ధ సంజ్ఞో మహీపతిః । ఆయుం రాజ్యేఽభిషిచ్యైవ ప్రతిష్ఠాన పురేస్వకే ॥ 20
సాగ్నిహోత్ర స్తతోరాజా యయౌనారాయణాశ్రమమ్ । తస్యాశ్రమేతపశ్చక్రే రాజా సంవత్సరత్రయమ్ ॥ 21
తతోనారాయణః ప్రాహతంనృపం తవసి స్థితమ్ । అద్య ప్రాప్స్యసి తాం రాజన్! యత్కృతేపరితప్యసే ॥ 22
సశరీరోఽద్యగంతాఽస్త్రితి దివం రాజసత్తమ! । ఏవంద్విజేంద్రే వదతి విమానం ప్రత్యదృశ్యత ॥ 23
ఉర్వశ్యాధిష్ఠితం రమ్యం గంధర్వైశ్చసహస్రశః । యస్మిన్యుక్తంతురంగాణాం సహస్రం చంద్రవర్చసామ్ ॥ 24
విమానాదవరుహ్యాథ గంధర్వాప్సరసాంగణాః । ఉర్వశీచవవందైన మృషిం జ్వలనతేజసమ్ ॥ 25
అనుజ్ఞాతోఽథఋషిణా తదారాజా పురూరవాః । కృత్వాగ్నిహోత్రమాత్మస్థం విమానంతం సమాస్థితః ॥ 26
ఋషింప్రదక్షిణీకృత్య త్రి తివం సన్నృపోగతః । సశరీరో నృపః స్వర్గం తదాప్రాప్య సుదుర్లభమ్ ॥ 27
శక్రేణాభ్యర్చితః కాలే విజహార యథాసుఖమ్ । దేవోద్యానేషు సర్వేషు ఉర్వశ్యాసహిత స్తదా ॥ 28
నాసౌవియుజ్యతే సాక్షాదాచిదపి పార్థివః । అమావస్యామమావస్యాం నియతం చంద్రభాస్కరౌ ॥ 29
ద్రష్టుంయాతౌమహీపాల మేకరాశిగతంసదా । ఉర్వశ్యాసహితం పౌత్రం యదాపశ్యతిచంద్రమాః ॥ 30
తదాసుధారసందేవః స్నేహాత్స్రవతి మానద! । సుధామృతరసం తంచ పిబంతిపితరఃసదా ॥ 31
శ్రాద్ధకాల స్తదాప్యుక్తో నృణాం నృపవరోత్తమ! । తదాశ్రాద్ధంహియద్దత్తం సుధారసవిమిశ్రితమ్ ॥ 32
తదశ్నంతి మహీపాల! పితరోఽమృత సన్నిభమ్ । అమావస్యామమావస్యాం తదాశ్రాద్ధం ప్రయత్నతః ॥ 33
కురుష్వ భూమిపశ్రేష్ఠ! సర్వాన్కామానవాప్స్యసి । యేఽపిశ్రాద్ధం కరిష్యంతి తదాచాఽప్యేనరాధిప! ॥ 34
తేషామాయుర్యశః సౌఖ్యం దాస్యంతి ప్రపితామహాః । దేవకార్యా దపిశ్రేష్ఠం పితృకార్యంప్రచక్షతే ॥ 35
పితరోనామరాజేంద్ర! దేవానామపిదేవతాః । రాజ్యకామః స్వర్గకామః పుష్టికామ స్తథైవచ ॥ 36
పితౄన్సంతర్పయేచ్ఛ్రాద్ధే చంద్రసూర్యసమాగమే । వసంతి సతతంరాజన్! పితరశ్చంద్రమండలే॥ 37
తేషాంమాసమహోరాత్రం విభాగంతత్రమేశృణు । కృష్ణపక్షాష్టమీమధ్యే తేషాముదయతే రవిః ॥ 38
శుక్లాష్టమ్యాం తథైవా స్తం తేషాంయాతిదివాకర । అమావస్యాతదాతేషాం మధ్యాహ్నంజాయతేనృప! ॥
తస్మాచ్ఛ్రాద్ధాని దేయానితస్మిన్కాలే ప్రయత్నతః । 39
ఏతావదుక్తం నృపవర్యః తస్య ధర్మాత్మజస్యాప్రతిమస్యవృత్తమ్ ।
ధన్యం యశస్యం రిపునాశనంచ సౌభాగ్యదం పాపహరం సుఖంచ ॥ 40

ఇతి శ్రీవిష్ణు ధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
పురూరవసః స్వర్గప్రాప్తిర్నామ సప్తత్రింశదుత్తర శతతమోధ్యాయః

అతడొకప్పుడు నాకూర్వశిం జూపింపుడని ద్విజులతోననెను. రాజా! నీవు స్వయముగా నామెం జూడగలవు. మేము చూపింపమని వారనిరి. కామవశుడైన కతన నా నృపతి వారికి ధనాశ గల్పించెను. ధనములట్లు హరించుకొనిపోవుచు నది చాలక

యత్ప్రప్తిచేతనో పరియేమో వైమనస్యమున వారిచే శపింపబడి ప్రాణములువాసి మరికొందరు రోషములేని మహానుభావులచే బ్రతికింపబడెను. ["యాచకస్య యాచకశ్శత్రుః" అను న్యాయమున నొకనికి సత్కారము బాగుగ జరిగినది. నాకు జరుగలేదని యసూయ ఈర్ష్యగలవా రుద్రిక్తులై యజమానునెడ వైరము గొనుట లోక స్వభావ మన్నమాట.] అతడట్లు తెలివి వచ్చి తనను దానిందించుకొని కుమారుని రాజ్యాభిషిక్తుం గావించి యగ్నిహోత్రములతో నాభూపతి నారాయణాశ్రమమునకేగి యచ్చట మూడేండ్లు తపస్సు చేసెను. అతనితో నప్పుడు నారాయణుడు దేనికై నీవుపరితపించు చున్నావో ఆమె నిప్పుడు పొందెదవు. రాజోత్తమా ! శరీరముతో నీవిపుడు స్వర్గమునకేగుదువు. ఇట్లా ద్విజోత్తముడనుచుండగనే ఊర్వశి యెక్కివచ్చిన రమణీయవిమాన మాయెదుటగనబడెను. అందు వేలకొలది గంధర్వులూర్వశితో పాటు కూర్చుండియుండిరి. చంద్రప్రభములైన వేయిగుఱ్ఱము లావిమానమును వహించుచుండెను. అవ్వల నావిమానము నుండిగి గంధర్వాప్సరో గణములు ఊర్వశియును నగ్నివలె వెలుంగు నీనారాయణునికి వందనము సేసిరి. అవ్వల ఋషియనుజ్ఞగొని పురూరవో నృపతియగ్నిహోత్రమును ఆత్మారోపణముసేసికొని యావిమానమెక్కెను. దాన నారాయణ ఋషికి ప్రదక్షిణము సేసి సుదుర్లభమైన త్రిదివమును(స్వర్గమును) సశరీరముగబొంది యింద్రునిచే మిగులనర్చింపబడి యనేకకాలము యథాసుఖముగ సర్వసుపర్వోద్యానము లందు నూర్వశిం గూడి యయ్యెడ విహరించెను.

ఆ పార్థివు డొక్కవుడేని యామెను విడిచి యుండలేడు. అమావాస్య యమావాస్యకు సూర్య చంద్రులు నియతముగా నేకరాశి యందుండి యాతనిం దర్శింప నేగుచుండిరి. ఊర్వశీ యుక్తుడైన మనుమని (పౌత్రుని) నెప్పుడు సూచు నపుడా దేవుడు చంద్రుడు వాత్సల్యముచే నమృతరసము స్రవించును. ఆ అమృత రసమును స్వధాకార భరితమైన దానిని పితృదేవత లెల్లపుడు ద్రావుచుందురు. అపుడు మానవులకది శ్రాద్ధకాలమున గలిసివచ్చును. సుధారస విమిశ్రితముగ నా యీయబడిన శ్రాద్ధము అమృత ప్రాయముగ పితృదేవత లారగింతురు. ఓ భూమిపశ్రేష్ఠా ! ప్రతియమావాస్యకు నీవు శ్రాద్ధమునిర్వర్తింపు మెల్లకామములం బడయుదువు. ఇంక నెవ్వరేని యీ యమావాస్య శ్రాద్ధమును సేయుదురు వారికాయుర్దాయమును సౌఖ్యమును బితామహులనుగ్రహింతురు. పితృకార్యము దేవకార్యము కంటెను మిన్నయని చెప్పుదురు. పితరులనగా దేవతలకు గూడ దేవతలు. రాజ్యకాముడు స్వర్గకాముడు పుష్టికాముడును చంద్రసూర్య సంగమమందు (అమావాస్య - యందు) శ్రాద్ధము పెట్టి యందు పితృదేవతలను సంతర్పితులం జేయవలెను. పితృదేవత లెల్లపుడు చంద్రమండలమునందు వసింతురు. వారికి మాసము అహోరాత్రము నను వాని విభాగము విషయము వినుము. కృష్ణపక్షాష్ట మీతిథి మధ్యమందు వారికి సూర్యుడుదయించును. శుక్ల పక్షాష్టమి నాడస్తమించును. అనగానమావాస్య వారికి మధ్యాహ్న కాలమగును. కావున నా కాలమున వారికి ప్రయత్న పూర్వకముగ శ్రాద్ధము పెట్టవలయును. ఓ నృపాగ్రణీ ! ఆ ధర్మ సుతుడగు పురూరవ శ్చక్రవర్తి చరిత్ర యింతదాక చెప్పబడినది. ఇది ధన్యత్వసంపాదకము, యశస్యము (యశస్కరము) శత్రునాశకము, సౌభాగ్యదము, పాపహరము సుఖకరమును.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున పురూరవుని స్వర్గప్రాప్తియను నూట ముప్పది యేడవ అధ్యాయము.

## నూట ముప్పదియెనిమిదవ అధ్యాయము - స్వర్గనరకపితృసమాప్యాయనవర్ణనము

వజ్రఉవాచ : వర్తంతేపితరః స్వర్గేకేషాంచిన్నరకేతథా నరకస్థాః ఫలం దాతుం కథంశక్తా వదస్వమే ॥ 1

మార్కండేయ ఉవాచ : పితౄణాంతుగణాః సప్తనామత స్తాన్నిబోధ మే ।

త్రయోఽమూర్తి మతశ్చైషాంచత్వారశ్చసమూర్తయః ॥ 2

సుభాసురాబర్హిషదోఽగ్నిష్వాత్తా స్తథైవచ । త్రయోమూర్తి మతశ్చైషాంచత్వారశ్చవ్యమూర్తయః ॥ 3

క్రవ్యాదాశ్చోపహూతాశ్చ ఆజ్యపాశ్చసుకాలినః । మూర్తిమంతః పితృగణాశ్చత్వారశ్చ ప్రకీర్తితాః ॥ 4

సుభాసురా బ్రహ్మసుతాః సోమ మాప్యాయయంతి యే । బ్రహ్మలోకచరా రాజన్! నిత్యం మూర్తివివర్జితాః ॥ 5
తథాబర్హిషదోనామ రాజపుత్రాః మరీచినః । ఆప్యాయయంతితేదేవాన్ లోకే సోమపదేస్థితాః ॥ 6
విభ్రాజలోకే తిష్ఠంతి అగ్నిష్వాత్తా నరాధిపః । పులస్త్య స్య ఋషేః పుత్రాభావయంతి జగంతి తే ॥ 7
దానవా న్యక్ష గంధర్వాన్ పిశాచోరగ రాక్షసాన్ । దైత్యాన్భూత పిశాచాంశ్చవిద్యాధర గణాం స్తథా ॥ 8
నాగాన్సర్పాన్సు పర్ణాంశ్చ పర్వతాన్సరిత స్తథా । క్రవ్యాదాంశ్చో పహూతాంశ్చ ఆజ్యపాంశ్చసుకాలినః ॥ 9
బ్రాహ్మణాన్ క్షత్రియాన్వైశ్యా న్భావయంత్యంత్యజాం స్తథా । కవేరాంగిరసశ్చైవ కర్దమస్యప్రజాపతేః ॥ 10
వసిష్ఠస్యతథా పుత్రాః క్రమేణైతే ప్రకీర్తితాః । జ్యోతిర్భాసః స్మృతాలోకే యేచలోకా మరీచినః ॥ 11
తేజస్వినోమానసాశ్చ క్రమేణైతే ప్రకీర్తితాః । ఏతేశ్రాద్ధస్యభోక్తారో విశ్వేదేవైః సదాసహ ॥ 12
ఏతేశ్రాద్ధం సదాభుక్త్వా పితౄన్సంతర్ప యన్త్యతః । యత్రక్వచన ధర్మజ్ఞః వర్తమానాహియోగతః ॥ 13
ఏతేచపుష్ట్యా వినియోజయంతి శ్రాద్ధస్యదాతార మదీన సత్త్వాః ।
తృప్తాస్తథైతే వినియోజయంతి దాతుఃపితౄన్ సర్వగతాన్ మహీపః 14

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
పితృస్వర్గనరక నివాసహేతు నిర్ణయోనామ అష్టత్రింశదుత్తర శతతమోఽధ్యాయః

వజ్రప్రభువు కొందరి పితరులు స్వర్గమందు వసింతురు. కొందరి పితృవర్గము నరక మందుందురు. నరకమందున్న పితరులు ఫలము నెట్లీయ గలరు? ఇది నాకు వచింపుమన మార్కండేయుడనియె. పితరుల గణములు ఏడు. వేర్వేర నవి వినుము. ఇందు మూడు గణములు అమూర్తిమంతములు. నాల్గు మూర్తిమంతములు. సుభాసుర - బర్హిషద-అగ్నిష్వాత్తులను మూడు గణముల వారు అమూర్తులు. క్రవ్యాదులు ఉపహూతులు ఆజ్యపులు సుకాలులు నను పితరులు నాలుగు గణముల వారు మూర్తిమంతులు. అమూర్తులు అయిన సుభాసురులనువారు బ్రహ్మ సుతులు. బ్రహ్మ లోకమందు సంచరింతురు. సోముని (చంద్రుని) పానము సేయుదురు. వీరికి మూర్తి (ఆకారము) లేదు. బర్హిషదులు రాజపుత్రులు. మరీచులు అనువారు చంద్ర స్థానమున నుండి లోకమందలి దేవతలను అప్యాయనము సేయుదురు. వీరును అమూర్తులే. అగ్నిష్వాత్తులను పితరులు పులస్త్య ఋషి పుత్రులు. విభ్రాజ లోకమందు వసించువారు. జగమ్ములను భావింతురు. ఆప్యాయన మొనరింతురు. వీరును మూర్తిలేని వారే. ఇక మూర్తిమంతులయిన నాల్గు పితృగణములకు జెందినవారు క్రవ్యాదులు ఉపహూతులు ఆజ్యపులు సుకాలులు ననువారు. బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులను అంత్యజులను భావన సేయుదురు. ఆప్యాయితులం గావింతురు. ఈ నల్గురు వరుసగా కవియొక్క (శుక్రునియొక్క) అంగిరస్సుయొక్క కర్దమ ప్రజాపతి యొక్క వశిష్ఠుని యొక్క పుత్రులు - వీరిలోకములు వరుసగా జ్యోతిర్భాసనులు మరీచులు తేజస్వులు మానసములు నని పేర్కొనబడినవి. ఈపితృగణము వారెల్లరు విశ్వేదేవులతోగలిసి శ్రాద్ధము నారగింతురు. వీరు శ్రాద్ధమును భుజించి పితరులను సంతర్పింప జేయుదురు. సంతృప్తులను గావింతురన్న మాట. ఓ ధర్మజ్ఞా! వజ్రనృపతీ! యోగశక్తిచే నెక్కడనైన వర్తింపగలవారై మహాసత్త్వ సంపన్నులైన వీరు శ్రాద్ధదాతకు పుష్టిని సమకూర్తురు. అంతేకాదు తాము తృప్తులయి శ్రాద్ధదాత యొక్క పితరులను (పితృపితామహ ప్రపితామహులను) వారేలోక మందున్నను వారినందరిని సంతృప్తులం గావింతురు.

ఇది శ్రీవిష్ణు ధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమునందు స్వర్గనరక నివాసి
పితృ సమాప్యాయన వర్ణనమను నూట ముప్పది యెనిమిదవ అధ్యాయము.

## నూటముప్పది తొమ్మిదవ అధ్యాయము - శ్రాద్ధోత్పత్తి

వజ్రఉవాచ : వైవస్వతేంతరేప్రాప్తే ప్రథమేభృగునందనః । శ్రాద్ధం ప్రదర్శితంకేనః తన్మమాచక్ష్వ పృచ్ఛతః ॥ 1

మార్కండేయ ఉవాచ : హిరణ్యాక్షవధేపూర్వం యదా త్యక్త్వాధరాధరాః । 2
ధరాం సపక్షాః ఖగమాః ఖంగతా మనుజేశ్వర! 3
ధరాధర పరిత్యక్తా తదాచలిత బంధనా । ధరా స్థానాచ్చ్యుతా వేగాత్ప్రివివేశరసాతలమ్ ॥ 4
హిరణ్యాక్షంతదా హత్వా నృవరాహోజనార్దనః । ప్రోథేన చ కరాభ్యాంచ విదార్యవసుధాంబలాత్ ॥ 5
సంపూజ్యమానస్త్రిదశైః ప్రవివేశరసాతలమ్ । రసాతలతలంగత్వా శేషమూర్త్యాస్వకే స్థితః ॥ 6
దంష్ట్రాగ్రేణ సముద్ధృత్య మహీంద్రధేతదాభుజే । వామబాహు నివిష్టాంతాం కృత్వా త్రిదశపుంగవః ॥ 7
ఉజ్జహార మహాతేజా లోకానాం హితకామ్యయా । రత్నజ్వాలావలీ పుంజదుర్విభావ్య ముఖాంబుజః ॥ 8
శేషస్తుష్టావ దేవేశం తస్మిన్కాలే జగద్గురుమ్ । పురంధ్రివేశా వసుధా దేవంతద్బాహు సంస్థితా ॥

వైవస్వత మన్వంతరము వచ్చినపుడు మొట్టమొదట నెవ్వరిచే శ్రాద్ధము ప్రదర్శితమైనదో యది నాకు వచింపుమని వ్రజుడడుగ మార్కండేయు డిట్లనియె: హిరణ్యాక్ష వధయైనపుడు ధరాధరములు (పర్వతములు) తెక్కలతో ధరణిని నదలి యాకాశమున కెగిరి పోయినవి. అపుడు పర్వతముల బరువు లేని భూమి పట్టుదప్పి సడలి మట్టుకదలి తనచోటునుండి జారి మహావేగ మున రసాతలమున గూరుకొని పోయెను. విష్ణువపుడు నరవరాహావతారమెత్తి హిరణ్యాక్షుం గూల్చి ముట్టెతో వసుధం దరించి త్రిదశపూజితుడై రసాతలముం బ్రవేశించెను. అటనని తన శేషమూర్తి యందు తానుండి తన కోర చివర నవని నెత్తి దాల్చెను. లోకహితముకోరి తన యెడమ భుజమున నవనిం ధరించెను. ఆ మహానుభావుడు శేషుడు రత్నజ్వాలావలీ పుంజముచే దుర్విభావ్యమైన (మనసుచేగూడ తలచుటకువశము గాని) ముఖ పద్మమున నింపొందినాడు. ఆ సమయమందు అతడుపుడు దేవేశుని జగద్గురుని సాధ్వి పురంధ్రి వేషమైన వసుధయాయన బాహువులందు నిలిచి మిక్కిలి రమణీయమైన యాకృతిగలవానిని గొనియాడెను.

తదాతుష్టావ భూపాలః రమణీయతమాకృతిః । ఉద్ధృత్యవసుధాంస్థానే స్థాపయిత్వా తథాస్వకే ॥ 9
జగామ!భూమౌధర్మజ్ఞః వరాహంనామ పర్వతమ్ । కల్పారంభే వరాహస్య పరమూర్తేః సశైలతామ్ ॥ 10
తాంసమాసాద్య ధర్మాత్మా దేవః సర్వగతః ప్రభుః । దంష్ట్రాగ్రలగ్నంమృత్పిండం గృహీత్వాదక్షిణేకరే ॥ 11
ప్రస్వేదాచ్చతిలాన్కృత్వా దర్భాన్రోమభ్యఏవచ । జలప్రస్రవణా భ్యాశే తస్మిన్గిరివరే తదా ॥ 12
దక్షిణాగ్రాంస్తు విన్యస్య దర్భాంస్తా న్మధుసూదనః । మృత్పిండాన్స తిలాంస్తేషు దత్తవాంస్త్రీన్న రాధిప ! 13
దత్త్వాచ గంధపుష్పాద్యైః పూజయామాస ధార్మికః । పూజయిత్వాచమర్యాదాం కృతవాన్స నరాధిపః 14
అద్యప్రభృతి లోకేషు ప్రేతానుద్దిశ్య వైపిత్ర్యాన్ । యేతుశ్రాద్ధం కరిష్యంతి తేషాం పుష్టిర్భవిష్యతి ॥ 15
శ్రాద్ధకాలేతదాతేన పిండ నిర్వాపణంతథా । పితౄణాంయేకరిష్యంతి తేషాం పుష్టిర్భవిష్యతి ॥ 16
పితాపితామహశ్చైవ తథైవ ప్రపితామహః । పూజయాతే భవిష్యంతి స్వయంపిండేషు నిత్యదా ॥ 17
తేషాంత్రయః పూజితాశ్చ భవిష్యంతి తథాగ్నయః । త్రయోలోకాస్త్రయో దేవా స్తథైవచయు గత్రయమ్ ॥ 18
పూజితాశ్చత్రయోదేవా బ్రహ్మవిష్ణు మహేశ్వరాః । పూజితైస్తైర్భవిష్యామి చతురాత్మా తథావ్యహమ్ ॥ 19
పితుఃపైతామహః పిండో వాసుదేవః ప్రకీర్తితః । పైతామహశ్చనిర్దిష్టః తథా సంకర్షణః ప్రభుః ॥ 20
పితృపిండశ్చ విజ్ఞేయః ప్రద్యుమ్నశ్చాపరాజితః । ఆత్మానిరుద్ధోవిజ్ఞేయః పిండనిర్వాపణంబుధైః ॥ 21
శ్రాద్ధం కర్తుం కథం శక్యం వినావైష్ణవతేజసా । ఏవంసంపూజితస్తేన చతురాత్మా త్వహంస్థితః ॥ 22
భవిష్యామి ప్రదాస్యామి తస్యకామాన్యథేప్సితాన్ । చత్వారః పూజితావేదాశ్చత్వారశ్చతథాగ్నయః ॥ 23
చత్వారశ్చయుగాస్తేన చతస్రశ్చదిశస్తథా । చత్వారశ్చ తథా వర్ణాశ్చత్వారశ్చతథాశ్రమాః ॥ 24
చత్వారోలోక పాలాశ్చ భవిష్యంతీహ పూజితాః । ఏవంకృత్వాస మర్యాదాంతత్రైవాంతరధీయత ॥
తతః ప్రభృతి లోకేస్మిన్ శ్రాద్ధం సద్భిః ప్రకీర్తితమ్ ॥ 25

స్వర్గంచమోక్షంచ యశః సుఖాని రాజ్యంచ పుత్త్రాంసథ భూమిపాలః ।
స్త్రియశ్చముఖ్యా వివిధాంశ్చకామాన్ దేవేశ్వరః శ్రాద్ధకృతో విధత్తే ॥ 26

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
శ్రాద్ధోత్పత్తి ర్నామైకోనచత్వారింశోఽధ్యాయః

అట్లీ వసుధ నెత్తి యా హరి యథాస్థానమున సునిచి భూమింగల వరాహ పర్వతమున కేగెను. కల్పారంభ మందు వరాహావతారమూర్తి యొక్క పర్వతమూర్తి యా పర్వతము. సర్వగతుండగు విష్ణువట నిలిచి కోర చివర లగ్నమైన మట్టి యుండను కుడిచేతం బట్టుకొని చెమట నుండి నల్లతిల (నువ్వు)లను రోమముల నుండి దర్భలను జనింప జేసి, యా కొండ మీది యా వాగు దరిని మధుపురి దక్షిణాగ్రములుగా దర్భలంబరచి వానిలో మూడు మట్టిముద్దల నుంచెను. వానిని గంధ పుష్పాదులచే పూజించి యావిష్ణు వొక మర్యాద నొనరించెను. (మర్యాద = కట్టుబాటు) ఇది మొదలు ప్రేతలయిన పితరుల నుద్దే శించి యెవ్వరు శ్రాద్ధ మొనరింతురు శ్రాద్ధకాలమున పిండ నిర్వపణము సేయుదురు వారికి పుష్టి కలుగును. పితృ పితామహ ప్రపితా మహులు నిత్యము నాపిండములందు పూజింప బడుదురు. వారేకారు వారి త్రేతాగ్నులును బూజింపబడును. మూడు లోకములు మూడు దేవతలు మూడుయుగములు బ్రహ్మ విష్ణు మహేశ్వరులను ముగ్గురు దేవతలును దీన బూజింప బడుదురు. ఆ పూజింపబడిన యందరితో నేను కూడి చతురాత్ముడ నయ్యెద. ఆ నాల్గు స్వరూపముల నేనే యుండెదనన్నమాట. ప్రపితామహ పిండము వాసుదేవ మూర్తి. పితామహ పిండము సంకర్షణుడు. పితృపిండము ప్రద్యుమ్నమూర్తి. నాల్గవది ఆత్మపిండము అనిరుద్ధమూర్తి. వైష్ణవతేజస్సు లేకుండ శ్రాద్ధమెట్లుసేయశక్యమగును? ఇట్లా యజమానునిచే చతురాత్ముడనై (చతుర్వ్యూహ స్వరూపుడనై) పూజింపబడియుంటిని. ఆతనికి నేను దిక్కుకాగలను. కోరిన కోర్కుల నీయగలను. ఈవిధమయిన శ్రాద్ధ నిర్వహణముచే నాల్గు వేదములు నాల్గు అగ్నులు పూజింప బడును. ఆతనిచే నాల్గు యుగములు నాల్గు దిక్కులు నాల్గు వర్ణములు నాల్గాశ్రమములు నల్గురు లోకపాలురు నిందు పూజితులగుదురు. ఇట్లా మహావిష్ణు వొక మర్యాద యేర్పరచి యక్కడనే యంతర్ధాన మందెను. అప్పటి నుండి లోకమందు సత్పురుషులు ఋషులు నీ లోకమందు శ్రాద్ధమును బ్రశంసించుచుండిరి. స్వర్గము మోక్షము సుఖములు రాజ్యమును పుత్రులను స్త్రీలను వివిధములయిన ముఖ్యములయిన యభీష్టములను దేవేశ్వరుడు భగవంతుడు శ్రాద్ధ కర్తకు సమకూర్చును.

ఇది శ్రీ విష్ణుధర్మోత్తర మహాపురాణమందు ప్రథమఖండమున శ్రాద్ధోత్పత్తియను
నూటముప్పదితొమ్మిదప అధ్యాయము.

## నూట నలుబదవ అధ్యాయము - శ్రాద్ధవివరణము

వజ్రఉవాచ : భగవంచ్ఛ్రోతుమిచ్ఛామి కథ్యమానమహంత్వయా । విధింశ్రాద్ధస్య ధర్మజ్ఞ! తన్మమాచక్ష్వ పృచ్ఛతః ॥ 1
మార్కండేయ ఉవాచ : వక్ష్యమాణగుణాన్విప్రాన్ పూర్వేద్యు రుపమంత్రయేత్ ।
కర్త్రా సమేతైస్తైర్భావ్యం సంయతైశ్చ నిమంత్రితైః ॥ 2
శ్రాద్ధాహే ప్రయతః స్నాతః స్వాచాంతః సుసమాహితః । శుక్లవాసాః సమభ్యర్చ్య నృవరాహం జనార్దనమ్ ॥ 3
ఆమశ్రాద్ధేషు కామ్యేషు హుత్వా ప్రథమ పంచకమ్ । మధ్యమం పంచకం హుత్వాపశుశ్రాద్ధేష్వసంశయమ్ ॥ 4
అమావాస్యాసు సర్వాసుహుత్వా చోత్తమ పంచకమ్ । హుత్వాచ పంచకానేతా నష్టకాత్రితయం క్రమాత్ ॥ 5
అన్వష్టకాసుచ తథా భోజయేత్ప్రయతోద్విజాన్ । ద్వౌదివ్యే ప్రాక్త్రయః పిత్ర్యే చైకైకముభయత్రవా ॥ 6
ఉదఙ్ముఖాంశ్చ పిత్ర్యేస్నాతాన్విద్యాద్గుణక్రమాత్ । తిలదర్భావకీర్ణేషు చాసనేషూ పవేశయేత్ ॥ 7
పితౄనావాహయామీతిస్వయ ముక్త్వా సమాహితః । ఆవాహయస్వేతితతో ద్విజైరుక్తోఽథతన్మనాః ॥ 8

పయాంత్వసురా ద్వాభ్యాంయాతుధాన విసర్జనమ్ । తిలైః కుర్యాత్ప్రియత్నేన త్వథవా గౌరసర్షపైః ॥ 9
తే పితరఇత్యేవ సర్వాం స్తా నగ్న ఆవహ । ఆగ్నేయస్తు తథోదీర్యః ఏతద్వఃపితర స్తథా ॥ 10
కుశాం స్తిలావమిశ్రేణ తథా గంధయుతేనచ । యా స్తిష్ఠంతి ధారయంతి అమృతావాగితి త్య్రృచా ॥ 11
యన్మేమాతేతిచ తథా పాద్యమర్ఘ్యంచకారయేత్ । నివేద్య విప్రేషుతథా పాద్యార్ఘ్యం ప్రయతః క్రమాత్ ॥ 12
గంధైర్వస్త్రైశ్చ పుష్పైశ్చ ధూపైశ్చాప్యథ భూషణైః । అర్చయే ద్బ్రాహ్మణాంచ్ఛక్త్యా శ్రద్ధధానః సమాహితః ॥ 13
ఆదౌసమర్చయేద్విప్రాన్వైశ్వదేవ నివేశితాన్ । నివేశితాంశ్చ పిత్రర్థే తతః పశ్చాత్సమర్చయేత్ ॥ 14
వైశ్వదేవనివిష్టానాం చరమం హ స్తధావనమ్ । విసర్జనంచ నిర్దిష్టంతేషు రక్షా యతఃస్థితా ॥ 15
సర్వమన్యత్ప్రదాతవ్య మాదౌతేషాం నరాధిప । సంపూజ్యగంధపుష్పైశ్చ బ్రాహ్మణాన్ప్రయత స్తదా ॥ 16
ఆదిత్యా వసవోరుద్రా ద్విజాన్వీక్ష్య తతోజపేత్ । అగ్నౌచ కరవాణీతి తైరు క్తంచ కురుష్వేతి ॥ 17
పరి స్తీర్య తతోవహ్నిముద్ధృత్య పర్వతః । అహితాగ్నిస్తు జుహుయాద్దక్షిణాగ్నౌసమాహితః ॥ 18
అనాహితాగ్నిశ్చాపసదే అగ్న్యభావే తథాప్సువా । సోమాయాదౌ పితృమతే కవ్యవాహనాయ చాగ్నయే ॥ 19
యమాయ చైవాంగిరసే హుత్వాప్రయతమానసః । యే మామకాశ్చ పితరఏతద్వః పితర స్తథా ॥ 20
అయం యజ్ఞ స్తథైవేతి ఏషావో గీతి రప్యథ । ప్రయత స్తన్మనాః కృత్వా రాజంశ్చైవాభిమంత్రణమ్ ॥ 21
ఆమా సుపక్వేతి తతోఘృతంవా వ్యథవాపయః । నిషిచ్యరౌప్యపాత్రేషు రజతా క్తేషు భావతః ॥ 22
యథోపపన్నే ష్వథవా తూష్ణీమన్ననివేదయేత్ । నమో విశ్వేభ్య ఇతిచ సతిలేనోదకేనచ ॥ 23
ప్రాఙ్ముఖేషుచ యద్ద త్తం తదన్నముప మంత్రయేత్ ఉదఙ్ముఖేషు యద్దత్తం నామగోత్రప్రకీ ర్తనైః ॥ 24
మంత్రయేత్రయతః ప్రాజ్ఞః స్వధాంతైః సుసమాహితః । యన్మేప్రకామాహోరాత్రై ర్యద్వాక్రవ్యాత్తథైవచ ॥ 25
ఇతిహాసపురాణాని ధర్మశాస్త్రాణిచాప్యథ । స ప్తర్చం పరమంమంత్రం శ్రావయేదగ్రతోద్విజాన్ ॥ 26

వజ్రుడు ధర్మజ్ఞా! శ్రాద్ధవిధిని వినగోరెద నన మార్కండేయు డనియె: ముందురోజు చెప్పబోవు లక్షణములుగల బ్రాహ్మణులను నిమంత్రింప వలెను. కర్త ముందు రోజే నియమ వంతుడుగా నుండ వలెను. భోజనాదులు వారితో కూడ కలిసి చేయవలెను. శ్రాద్ధదినమున స్నానముసేసి మడికట్టుకొని సమాహితుడై యాచమించి తెల్లని బట్టలు ధరించి నరవరాహ మూర్తిని హరి నర్చింప వలెను. ఆమ శ్రాద్ధములందు కామ్యశ్రాద్ధములందు ప్రథమ పంచకము (పశుశ్రాద్ధములందు మధ్యమ పంచకము) హోమము సేయ వలెను. అమావాస్యలన్నిటను ఉత్తమ పంచక హోమము సేయవలెను. ఈ మూడు పంచకముల హోమము తరువాత అన్వష్టకలయందు బ్రాహ్మణులకు భోజనము పెట్టవలెను. దేవస్థానమందిద్దరిని పితృస్థానమునందు ముగ్గురిని లేక రెండు స్థానములం దొక్కొక్కనిని నిమంత్రింప వలెను. పితృస్థానము నందలి బ్రాహ్మణులను స్నానము సేసిన వారిని తిలలు దర్భలు చిమ్మిన స్థానములందు ఉత్తరాభిముఖముగా నుపవేశింప జేయవలెను. కర్త తాను పితరుల నాహ్వానించు చున్నానని పలికి బ్రాహ్మణులు పిలువుమని పలుక మనస్సు నక్కడ పెట్టి (శ్రద్ధగొని) "అప యాన్త్వసురా" అని రెండు చోట్లను తిలలతో నెట్టి యావాలతో గాని రాక్షస విసర్జనము గావింప వలెను. "ఏతేపితర" అను "అగ్న ఆవహ" అను ఆగ్నేయ మంత్రము చెప్పి ఏతద్వఃపితరః అనియు కుశలను తిలలను గంధమును గలిపి "యా స్తిష్ఠంతి, ధారయంతి, అమృతావాగను త్ర్యృచతోను యన్మేమాతా యను వానిచే పాద్యమును అర్ఘ్యమునీయవలెను. గంధవస్త్రపుష్పములచే ధూపములచే భూషణములచే యథాశక్తి శ్రద్ధతో సమాహితుడై బ్రాహ్మణుల నర్చింప వలెను. అటు పితృస్థానముసందర్చన జరుపవలెను. విశ్వేదేవస్థాన మందలి వారిని హ స్తధావనము (హస్త ప్రక్షాళనము) విసర్జనమును జివర చేయవలెను. కారణము శ్రాద్ధరక్షణ కార్యము వారియందున్నది. ఆ రెండు విధులు తప్ప మిగిలిన కృత్యము లన్నింటిని వారికి ముందే జరుప వలయును. బ్రాహ్మణులను గంధపుష్పములచే బూజించి "ఆదిత్యావసవోరుద్రా" అను మంత్రమును వారి వంక చూచి జపింప వలెను. అగ్నౌకరణం కరిష్యే అని తాననగ వారు "కురుష్వ" అన్న తరువాత

అగ్నికి పరిస్తరణములు వేసి అగ్ని నంతట నుద్ధరించి హోమము సేయవలెను. ఆహితాగ్ని దక్షిణాగ్ని యందును అనాహితాగ్ని ఔపసదమందును అగ్ని లేనప్పుడు ఉదకములందును హోమము సేయవలెను. తొలుత సోమాయ పితృమతే కవ్యవాహనా యాగ్నయే యమాయ చాంగిరసే యని హోమము సేసి, యే మామకాశ్చ పితరః - ఏతద్వః పితరః అయం యజ్ఞస్తథైవ ఏషావో గీతిరవ్యథ అని యభిమంత్రణము సేసి ఆమా సుపక్వా అని ఘృతముకాని పాలుకాని వెండి లేదా వెండితో దడుప బడినవాని గిన్నెలలో లేదా వాని భావముతో యథాసంభవములయిన పాత్రలం దన్నమును మౌనముతో నివేదింప వలెను. నమో విశ్వేభ్యః అని తిలలతోడి యుదకముచే ప్రాఙ్ముఖముగ వేసిన పాత్రలందు వడ్డించిన యన్నము నుపమంత్రణము సేయవలెను. ఉత్తరాభిముఖములయిన పాత్రలందున్న యన్నమును నామగోత్ర ప్రకీర్తనముచేసి స్వధాంతముగ నుపమంత్రణమును సేయవలెను. "యన్మేప్రక్రామహోరాత్రైః" "తదా క్రవ్యాత్" అను మంత్రములను ఇతిహాస పురాణములను ధర్మశాస్త్రములను సప్తర్చ మంత్రమును బ్రాహ్మణుల ముందు వినిపింపవలెను.

దక్షిణాగ్రాం స్తతోదర్భాంల్లూంనాం శ్చైవోపమూలతః । మంత్రితాన్ బ్రహ్మమంత్రేణ వికిరేత్సుసమాహితః ॥ 27
పిండనిర్వాపణంకుర్యాత్ తేషుదర్భేష్వ సంశయమ్ । మధ్వాజ్యతిల మిశ్రేణ చాన్నేనాగ్ర్యేణ యాదవః 28
పితృపిండేభవేన్మంత్రః పృథివీదర్విరక్షితా । పైతామహేభవేన్మంత్ర స్త్వంతరిక్షేతి పార్థివః 29
ప్రపితామహకేమంత్రం ద్యౌర్దర్విరితి కీర్తయేత్ । యేత్రతపితరఃప్రేతా మంత్రేణానేనధర్మవిత్ ॥ 30
సూత్రం నివేదయేద్భక్త్యాక్షీరాన్నం చనివేదయేత్ । ఊర్జంవహ న్తీతితతః సాన్నందద్యాదథోదకమ్ ॥ 31
అపసవ్యేన పిండేషుశ్రద్ధయాపరయాయుతః । గంధైః పుష్పైస్తథా ధూపైర్దీపైర్భక్ష్యైశ్చ భోజనైః ॥ 32
పానైః సమర్చయేత్పిండాన్ సాదరః ప్రయతః సదా । యత్కించిత్పచ్యతేగేహే భక్ష్యం వాభోజ్యమేవవా ॥ 33
అనివేద్య నభోక్తవ్యం తస్మిన్నాయతనేసదా । భుక్తవత్స్వథ విప్రేషు విధింమేగదతః శృణు ॥ 34

అటుపై మొదళ్లదరిత్రుంచి యగ్రములుదక్షిణదిశగానుండునట్లు బ్రహ్మమంత్రముచే నభిమంత్రితములయిన దర్భలనుపరచి వానిపై పిండనిర్వపణము సేయవలెను. పితృపిండమందు పృథివీదర్విరక్షితాయను మంత్రముచెప్పిమధువు (తేనె) తిలలతోగూడిన యన్నముతో పితృపిండనిర్వపణము సేయవలెను. పితామహ పిండమందు 'అంతరిక్ష' అను మంత్రమును, ప్రపితామహ పిండమందు "ద్యౌర్దర్వి అను మంత్రమును జెప్పవలె. పరమశ్రద్ధతో పిండమందు అపసవ్యముగ "యేత్రత పితరఃప్రేతాః" అను నీ మంత్రముతో భక్తితో సూత్రమును క్షీరాన్నమును నివేదింపవలెను. ఊర్జం వహంతీ యను మంత్రము చెప్పి అన్నము ఉదకము గంధములు పుష్పములు ధూపదీపములు భక్ష్యములు పానములు నివేదించి పింద పూజసేయవలెను. ఇంటిలో నానాటు వండు భక్ష్యము భోజ్యము నివేదింపకుండ తాను దిన గూడదు. బ్రాహ్మణ భోజనములైన తరువాత జరుపనగు విధిం దెల్పెద వినుము.

అన్నం సతృణ మభ్యుక్ష్య మామేక్షి ష్ఠేతి యత్నతః । ఉదఙ్ముఖానాం విప్రాణాం పురతః సోదకంతతః ॥ 35
అన్నంతు వికిరేద్భక్త్యా పితృభాగస్తుసస్మృతః । ప్రష్టవ్యాబ్రాహ్మణాభక్త్యాభూనివిష్టేన జానునా ॥ 36
తృప్తాభవంతః సంపన్నో భవతాంకశ్చిదేవతు । తృప్తాఃస్మేతిచతైరుక్తః సంపన్నమితి చాప్యథ ॥ 37
దద్యా దాచమనం భక్త్యా శ్రద్ధధానః సమాహితః । యన్మేరామశ్చ శక్రశ్చ ఇతికృత్వా ప్రదక్షిణామ్ ॥ 38
ప్రత్యేకంతర్పయేద్విద్వాన్ దక్షిణాభిః స్వశక్తితః । భవంతోఽభి రమంత్వితివాచ్యా విప్రాస్త్వనంతరమ్ ॥ 39
తైరుక్తోఽభి రతాః స్మేతి ద్విజానాంపురతః స్థితః । దేవాశ్చపితరశ్చేతి జపేన్మంత్రమతంద్రితః ॥ 40
పితౄణాం నామగోత్రేణ జలం దేయ మనంతరమ్ । బ్రాహ్మణానాంద్విజైర్వాచ్యం చాక్షయం మనుజేశ్వర ॥ 41
తతస్తు ప్రార్థనా కార్యా మంత్రేణానేన భూమిప । దాతారోనోఽభివర్ధంతాం వేదాః సంతతిరేవచ ॥ 42
శ్రద్ధాచనోమావ్యగమ ద్బహుదేయంచనోఽస్త్వితి । వాజేవాజేతి తూత్థాప్య కృత్వా చైషాంప్రదక్షిణామ్ ॥ 43
ఆమభ్యా మవనిం గత్వాప్రణిపత్య విసర్జయేత్ । అపసవ్యేనకర్తవ్యం పితృకార్యం నరాధిప 44

బ్రాహ్మణైర్నైవ వక్తవ్యా యదిపృష్టా హవిర్గుణాః । యావదూష్మా భవత్యన్నే యావదశ్నన్తి వాగ్యతాః ॥ 45
తావదశ్నంతి పితరః యావన్నోక్తా హవిర్గుణాః । ఉచ్ఛిష్ట మార్జనం యావన్నకృతం నృపసత్తమః 46
తావదశ్నంతి పితరః స్వధారస విమిశ్రితమ్ । హస్తదత్తాని లేహ్యాని లవణం వ్యంజనానిచ ॥ 47
దాతారం నోపతిష్ఠంతి భోక్తా భుంక్తేచ కల్బిషమ్ । సౌవర్ణ రాజతాభ్యాంతు ఫల్గుపాత్రేణ చాప్యథ ॥ 48
దత్తమక్షయతాంయాతి ఖడ్గే నౌదుంబరేణవా । మాంసంనాశ్నాతి యఃపంక్త్యాం యథావద్వినియోజితమ్ ॥ 49
సప్రేత్య నరకంయాతి నాత్రకార్యావిచారణా । శ్రాద్ధే దాతాచ భోక్తాచ మైథునంయది గచ్ఛతః ॥ 50
తన్మాంసంపితర స్తస్య భుంజతే రేతసాయుతమ్ । ఏవంశ్రాద్ధంతథా కార్యం శూద్రేణాపినరాధిపః ॥ 51
మంత్రవర్జ్యంహి శూద్రస్య సర్వమేతద్విధీయతే । వజ్రఉవాచః యస్యజీవేత్పితా శ్రాద్ధం కస్యాసౌకర్తు మర్హతి ॥ 52
త్వమేవ సంశయచ్ఛేత్తా సంశయంఛింధి మేద్విజః ।
మార్కండేయ ఉవాచ : యేషాంశ్రాద్ధం పితా కుర్యాత్తేషామేవ స కారయేత్ ।
మంత్రహీనం ప్రకర్తవ్యం తేన శ్రాద్ధం యథావిధి ॥ 53
మాతామహానాంశ్రాద్ధంతు మంత్రహీనంచ కారయేత్ । శ్రాద్ధంచ సుహృదాంకుర్యాత్ స్త్రీణాంచాక్షయవాచకమ్ ॥ 54
వజ్రఉవాచ : పితా పితామహశ్చైవ జీవేతాం యస్యదేహినః । తేనశ్రాద్ధం కథంకార్యం తన్మమాచక్ష్వ పృచ్ఛతః ॥ 55
మార్కండేయ ఉవాచ : యేషాం పితామహః కుర్యాత్తేషాం శ్రాద్ధం నరాధిపః ।
తేన కార్యం మహాప్రాజ్ఞః యథావదనుపూర్వశః ॥ 56
వజ్రఉవాచ : పితాపితామహశ్చైవ తథైవ ప్రపితామహః । యస్యజీవంతి కర్తవ్యం తేనశ్రాద్ధంకథంద్విజః ॥ 57
మార్కండేయ ఉవాచ : తేనశ్రాద్ధంనకర్తవ్యం విధిలోపంతు యాదవః
పూజనీయాశ్చ పితరః పితామహపితుః స్వయమ్ ॥ 58
వజ్రఉవాచ : జీవేత్పితామహోయస్య పితుశ్చైవ పితామహః । పితాప్రేత స్తథా యస్యతస్యశ్రాద్ధవిధింవద ॥ 59
మార్కండేయ ఉవాచ : పిండనిర్వపణంకృత్వా స పితు ర్మనుజేశ్వరః ।
పితుఃపితామహాదూర్ధ్వం ద్వాభ్యాంపిండం నివేదయేత్ ॥ 60
వజ్రఉవాచ : పితాపితామహౌ ప్రేతౌ యస్యస్యాతాంద్విజోత్తమః । పితుఃపితామహోజీవేత్తస్య శ్రాద్ధవిధింవద ॥ 61
మార్కండేయ ఉవాచ : పిత్రేసపిత్రేకృత్వాతు పిండనిర్వపణంతతః । పిండనిర్వపణం కుర్యాత్పితామహ పితామహే ॥
వజ్ర ఉవాచ : ప్రేతః పితాభవేద్యస్య పితుశ్చైవపితామహః । తేనకార్యం కథం శ్రాద్ధం తన్మమాచక్ష్వ పృచ్ఛతః ॥ 63
మార్కండేయ ఉవాచ : సతు దత్వా పితుఃపిండం తతఊర్ధ్వంపితామహాత్ ।
ద్వాభ్యాం దద్యాత్సదా పిండం త్వేవ మాహు ర్మనీషిణః ॥ 64
వజ్ర ఉవాచ : ప్రేతః పితామహోయస్య పితా జీవేద్ద్విజోత్తమః । పితుఃపితామహోజీవేత్తస్యశ్రాద్ధ విధింవద ॥ 65
మార్కండేయ ఉవాచ : దత్త్వాపితామహేపిండం సతూర్ధ్వం ప్రపితామహాత్ ।
పిండ నిర్వపణంకుర్యాత్ ద్వాభ్యాం నిత్యమతంద్రితః ॥ 66

"మామేక్షిష్ఠ" అను మంత్రముచే దర్భపై నుంచిన యన్నమును దర్భతో అభ్యుక్షణము చేసి ఉత్తరాభిముఖులయి యున్న విప్రులముందుదకముతో నభ్యుక్షణము సేసి భక్తితో అన్నమును జిమ్మవలెను. అది పితృభాగ మనబడినది. అటుపై మోకాళ్లపై గూర్చుండి భక్తితో బ్రాహ్మణులను "తృప్తాభవంత స్సంపన్నో భవతాం కశ్చి దేవతు" తమరు తృప్తులయినారా? శ్రాద్ధము సంపన్నమైనదా? యని యడుగవలయును. "తృప్తాఃస్మః" అని వారు 'సంపన్నం' అని బదులు పలుకగా దానిమీద ఆచమన మీయవలెను. అటుపై "యన్మేరామశ్చశక్రశ్చ" అను మంత్రము పఠించుచు ప్రదక్షిణము సేయవలెను.

అటుపై తన శక్తిననుసరించి వారికి వేర్వేర దక్షిణలీయవలెను. "భవంతోఽభిరమన్తు" మంత్రమును విప్రులం గూర్చి చెప్ప వలెను. "అభిరతాఃస్మ" అని వారనవలయును. అటుపై దేవాశ్చపితరశ్చయను మంత్రమేమాత్రము తొందరపడక జపించి పితరులకు నామ గోత్రములుసెప్పి యుదకము వదలవలెను. అక్షయమని బ్రాహ్మణులనవలెను. అటుపై దాతారోనోభివర్ధంతాం వేదాస్సంతతిరేవచ శ్రద్ధా చనోమావ్యగమద్బహుదేయంచ నోఽస్త్వితి. మాదాతలభివృద్ధినందుమరుగాక. వేదములు సంతానము మాకు సమృద్ధములుగా గలుగు గాక. మమ్ము శ్రద్ధ యెపుడును విడువకుండుగాక! దానము చేయవగు ద్రవ్యసమృద్ధి మాకు గల్గుగాక! అను మంత్రము పలికి ప్రార్థన సేయవలెను. "వాజేవాజే" యను మంత్రముచే బ్రాహ్మణులను లేపి నిలువబెట్టి వారికి ప్రదక్షిణము సేసి మోకాళ్లపై భూమి మీద కూర్చుండి ప్రణామములు సేసి విసర్జనము సేయవలెను. పితృకార్యమపసవ్యముగా ప్రాచీనావీతిగ నొనరింప వలెను. హవిస్సు యొక్క గుణములను (శాకపాకాదుల రుచులను) కర్త యడుగగూడదు. ఒకవేళ పొరపాటున నతడడిగినను బ్రాహ్మణులు చెప్పగూడదు. అన్నమునందు వెచ్చదనమున్నంతవరకు బ్రాహ్మణులు మౌనముతో భోజనము సేయుచున్నంతవరకు, హవిర్గుణములు వారు వచింపనియెడల ఉచ్ఛిష్టమార్జనము జరుపనంతవరకు పితృదేవతలా శ్రాద్ధాన్నమును స్వధారసమిశ్రముగా నారగింతురు. లేహ్యములు, నాకి తినవలసిన వంటకములు కూరలు చేతితో వడ్డించినచో నవి దాతను జెందవు. వానిండిన్నవాడు (బ్రాహ్మణుడు) పాపము భుజించును. బంగారు వెండి పాత్రలలో బొమ్మమేడి పాత్రలోకాని ఖడ్గమృగ పాత్రలోకాని మేడి పాత్రలోకాని పెట్టిన అన్నాదులు అక్షయములగును. పంక్తిలో యథావిధిగ వడ్డించిన మాంసము నెవ్వడు తినడో యతడు చనిపోయి నరకమున కేగును. ఇందు విమర్శ చేయకూడదు. శ్రాద్ధ దినమందు కర్తగాని భోక్తగాని మైథునము చేసినచో వారి మాంసమును వారి రేతస్సుతోగలిపి వాని పితరులు తిందురు. ఇట్లు శూద్రుడుకూడ శ్రాద్ధము పెట్టవలెను. కాని యతనికి అమంత్రకముగా నిది యెల్ల విధింపబడినది. అస వస్ర్జుండు తండ్రి బ్రతికి యున్నవాడు ఎవరికి శ్రాద్ధము పెట్టనర్హుడన మార్కండేయుడు తండ్రి ఎవరికి శ్రాద్ధముపెట్టునో వారికే యతడు మంత్రహీనముగా యథావిధిగ పెట్టవచ్చును. మాతామహుల కేని మంత్ర హీనముగా శ్రాద్ధముపెట్టవలెను. అట్లే మిత్రులకు స్త్రీలకును. వజ్రుడు తండ్రి తాతయు బ్రతికియున్నవాడు శ్రాద్ధ మెవరికి నెట్లు వెట్టవలెననగా - ఎవరికి తండ్రి తాత ముత్తాతయు జీవించి యుందురో యతడెట్లు పెట్ట వలెననగా మార్కండేయుడనెను. అతడు గూడ శ్రాద్ధ విధిలోపము చేయరాదు. పితృ పితామహుని పూర్వులయిన పితృదేవతలు గూడ వానికి బూజార్హులే.

వజ్రుడు-ఎవని పితామహుడు తండ్రియొక్క పితామహుడు బ్రతికియుండి తండ్రి గతించునో యతడెట్లు శ్రాద్ధముపెట్టవలెననియడుగ మార్కండేయు డతడు తండ్రికి పిండప్రదానముసేసి తండ్రియొక్క పితామహునిపైయిద్దరికిపిండప్రదానము సేయవలెను. వజ్రుడు తండ్రి తాత గతించి ప్రపితామహుడు జీవించియున్నాడో అప్పుడెట్లన మార్కండేయుడు తండ్రికి తాతకు పిండములు పెట్టి ప్రపితామహుని తండ్రికి మూడవ పిండము పెట్టవలెను. ఒకనికి తండ్రి - తండ్రియొక్క తాత గతించిరనుకొనుడు. అప్పుడెట్లన మార్కండేయుడిట్లనెను - అతని పితామహుడెవ్వరికి శ్రాద్ధము పెట్టునో వారికీతడు పెట్టవలెను. మరల వజ్రు డడిగెను - తండ్రికి పిండముపెట్టి ఆమీద తాతకు పైనిద్దరకు పిండప్రదానము గావింపవలెను. వజ్రుడు తాత చనిపోయినాడు తండ్రి బ్రతికియున్నాడు-తండ్రియొక్క తాత (అనగా కర్తయొక్క ముత్తాత గూడ జీవించి యున్నాడు అపుడేమి చేయవలెనన, తాతకుపిండమిచ్చి ముత్తాతకు పైయిద్దరికి పిండనిర్వపణము సేయవలెను.

వజ్ర ఉవాచ : సప్తార్చిష మహంమంత్రంశ్రోతుమిచ్ఛామి భార్గవ! శ్రాద్ధకాలేషునియతం రక్షోఘ్నం యస్యకీర్తితమ్ ॥
మార్కండేయ ఉవాచ : పాపాపహం పావనీయ మశ్వమేధ సమం తథా ।
మంత్రంవక్ష్యామ్యహం తస్మాదమృతం బ్రహ్మనిర్మితమ్ ॥ 68
దేవతాభ్యఃపితృభ్యశ్చ మహాయోగిభ్యఏవచ । నమఃస్వధాయైస్వాహాయై నిత్యమేవభవత్విహ ॥ 69
ఆద్యేవసానేశ్రాద్ధస్య త్రివారంతు జపేత్సదా । అశ్వమేధ ఫలంత్వేతద్ద్విజైః సత్కృతి పూజితమ్ ॥ 70
పిండనిర్వపణేచాపి జపేదేతత్సమాహితః । పితరఃక్షిప్రమాయాంతి రాక్షసాః ప్రద్రవంతిచ ॥ 71
పితౄంశ్చత్రిషులోకేషు మంత్రోఽయం తారయత్యుత । పఠ్యమానః సదా శ్రాద్ధే నియతైర్బ్రహ్మ వాదిభిః ॥ 72

రాజ్యకామోజపేదేతత్సదా మంత్ర మతంద్రితః । వీర్యసర్వార్థశౌర్యాది శ్ర్యాయు ర్వృద్ధి వివర్ధనమ్ ॥ 73
ప్రీయంతే పితరోఽనేన జపేన నియమేనచ । సప్తార్చిషం ప్రవక్ష్యామి సర్వకామ ప్రదం శుభమ్ ॥ 73

## -: సప్తార్చిష మంత్రమును గూర్చిన వివరణము :-

వజ్రుడు సప్తార్చిషమను మంత్రము శ్రాద్ధకాలమందు రక్షోఘ్న మనివిందునుదానింగూర్చి వివరింపుమన మార్కండేయుడిట్లు చెప్పదొడంగెను. పాపహరము పావనీయము అశ్వమేధ సమమునైన మంత్రమిదె వచించెద నద్దానివలన అమృతమైన బ్రహ్మవస్తు వేర్పరుపబడినది - ఆ మంత్రము 69వ శ్లోకము. అర్థము స్పష్టము. దానిని శ్రాద్ధము ముందు తర్వాత మూడుమార్లు జపింపవలెను. ఇది యశ్వమేధ ఫలదము. సత్కార్యదక్షులు పూజింతురు. పిండ నిర్వాపణ సమయమందిది జపించిన పితృదేవతలు వేగముగ వత్తురు. రాక్షసులు పారిపోవుదురు. ఇది ముల్లోకములందలి పితృదేవతలను దరింపజేయును (భూర్భువ స్స్వర్లోకములు మూడింటను పితృదేవతలుందురు) నియమ శీలురైన బ్రహ్మవాదులు దీనిం బఠింతురు. రాజ్యకాముడు దీనిని పఠింపనగును. వీర్య సర్వార్థ శౌర్య శ్రీలను దీర్ఘాయువునిది పెంపొందించును. సప్తార్చిష మంత్రమిదె తెల్పెద వినుము. నియమముతో దీనిని జపించిన యెడల పితృ దేవతలు సంతుష్టులగుదురు.

అమూర్తానాంచ మూర్తానాం పితౄణాందీప్త తేజసామ్ । నమస్యామి సదాతేషాం ధ్యాయినాం యోగచక్షుషామ్ ॥ 75
ఇంద్రాదీనాంచనేతా రోదక్షమారీచయోస్తథా । సప్తర్షీణాం పితౄణాంచ తాన్నమస్యామి కామదాన్ ॥ 76
మన్వాదీనాంచనేతారః సూర్యాచంద్రమసోస్తథా । తాన్నమస్కృత్య సర్వాన్వైపితౄనప్స్వర్ణవేషుచ ॥ 77
నక్షత్రాణాంగ్రహాణాంచ వాయ్వగ్ని పితరస్తథా । ద్యావాపృథివ్యోశ్చతథా నమస్యేతాన్కృతాంజలిః ॥ 78
దేవర్షీణాంచ నేతారః సర్వలోకనమస్కృతాన్ । త్రాతారః సర్వభూతానాం నమస్యేతాన్పితామహాన్ ॥ 79
ప్రజాపతేర్గవాం వహ్నేః సోమాయచయమాయచ । యోగేశ్వరేభ్యశ్చతథా నమస్యేతాన్కృతాంజలిః ॥ 80
పితృగణేభ్యః సప్తభ్యోనమోలోకేషుసప్తసు । స్వయంభువేనమస్కృత్య బ్రహ్మణేలోకచక్షుషే ॥ 81

అమూర్తులు సమూర్తులు తేజశ్శాలురు నిరంతర ధ్యాన నిష్ఠులై యోగ చక్షుస్కులకు (దివ్యదర్శనము గలవారికి) నమస్కరించు చున్నాము.

ఇంద్రాదులకు దక్ష మరీచులకు సప్తర్షులకు పితరులకు కామదులయిన వారికి నమస్కరించు చున్నాను.

మన్వాదులకు సూర్యచంద్రులకు నేతలయి(నడిపించువారై)నీళ్ళలో సముద్రములలోనున్న పితరులనునమస్కరించుచున్నాను.

నక్షత్రములకు గ్రహములకు వాయువునకు అగ్నికిని ద్యావాపృథివులకు పితరులయినవారికిచేతులుమోడ్చినమస్కరించుచున్నాను.

దేవర్షి నాయకులయి సర్వలోక నమస్కృతులయి సర్వభూతత్రాతలైన యీ పితామహులను నమస్కరించుచున్నాను.

ప్రజాపతికి గోవులకు అగ్నికి సోమునికి యమునికి యోగేశ్వరులకు నంజలిసేసి మ్రొక్కెదను.

సప్త లోకములందున్న సప్త పితృగణములకు నమస్కారము. బ్రహ్మలోక చక్షువు స్వయంభువుడునైన బ్రహ్మకు నమస్కారము.

ఏతత్తదుక్తం సప్తార్చిర్బ్రహ్మర్షి గణపూజితమ్ । పవిత్రం పరమం హ్యేతచ్ఛ్రీమద్రక్షో వినాశనమ్ ॥ 82
ఏతేన విధినాయుక్తః త్రీణ్యేవం లభతేనరః । అన్నమాయుః సుతాంశ్చైవ వదంతి పితరోభువి ॥ 83
భక్త్యాపరమ యాయుక్తః శ్రద్దధానో జితేంద్రియః । సప్తార్చిషంజపేద్యస్తు నిత్యమేవ సమాహితః ॥
సప్తద్వీప సముద్రాయాం పృథివ్యామేక రాడ్భవేత్ ॥ 84

ఇది సప్తార్చిర్మంత్రము. బ్రహ్మర్షి గణ పూజితము. పరమ పవిత్రము శ్రీమంతము. రక్షోవినాశనము. ఈ మంత్రవిధితో గూడినవాడు అన్నము ఆయువు పుత్రులను ముఖ్యమయిన మూడు ఫలముల నందును. పరమభక్తి గలిగి శ్రద్ధగల్గి యింద్రియముల జయించి నిత్యము నెవ్వడు సమాహితుడై (మనస్సును ఇంద్రియములను గుదిరించుకొని) జపించునో యాతడు సప్తద్వీప సప్తసముద్ర పరివ్యాప్తమయిన పృథివికేకైక చక్రవర్తి యగును.

* వి ర స-39

వజ్ర ఉవాచ : బ్రహ్మమంత్రం సమాచక్ష్వ సర్వరక్షో నిబర్హణమ్ ।
పిండనిర్వపణే యేన మంత్రణీయాః కుశోత్తమాః ॥ 85
మార్కండేయ ఉవాచ : నిహన్మి సర్వం యదమేధ్య వద్భవేత్ హతాశ్చ సర్వేసురదానవా మయా ।
యే రాక్షసాయక్ష పిశాచగుహ్యకా హతా మయా యాతుధానాశ్చ సర్వే ॥ 86
ఏతేనమంత్రేణసమాహితాత్మాతిలాన్కిరేద్దిక్షుతథావిదిక్షు।యస్మిన్దేశేపఠ్యతేమంత్రఏషతంవైదేశంరాక్షసావర్జయంతి ॥ 87

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
శ్రాద్ధవివరణోనామ చత్వారింశ దుత్తర శతతమోఽధ్యాయః.

వజ్రుడు బ్రహ్మణ్యా ! సర్వరక్షోఘ్న మంత్రముతో పిండనిర్వపణ మందు కుశలనభిమంత్రింప వలసిన దానతిమ్మన మార్కండేయుడు దీనిచే నమేధ్యమైన దానినంతను సంహరింతురు. నాచే సర్వాసుర దానవులు రాక్షసులు యక్షపిశాచ గుహ్యకులు యాతుధానులెల్లరు నిహతులయ్యేదరు. అని యీమంత్రముచేత మనసు చక్కగ కుదిరించుకొని దిక్కులందు విదిక్కులందు (మూల లందు) తిలలను విరజిమ్మ వలెను. ఏప్రదేశమందీ మంత్రము పఠింపబడు నాప్రదేశమును రాక్షసులు వదలి వెళ్ళుదురు.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున ధర్మవివరణమను నూటనలుబదియవ అధ్యాయము

## నూటనలుబదియొకటవ అధ్యాయము – శ్రాద్ధ హవిర్ద్రవ్య నిరూపణము

వజ్ర ఉవాచ : కస్మిన్దేశే న కర్తవ్యం శ్రాద్ధంభృగుకులోద్వహ! । కించదేయ మదేయంచ తన్మేబ్రూహిద్విజోత్తమః 1
మార్కండేయ ఉవాచ : త్రిశంకుంవర్జయేద్దేశం సర్వంద్వాదశ యోజనమ్ । ఉత్తరేణ పతంగస్య దక్షిణేనచ కైకటమ్ ॥
దేశస్త్రైశంకవోనామ వివర్జ్యః శ్రాద్ధకర్మణి । కారస్కరాః కలింగాశ్చ సింధోరుత్తరమేవచ ॥ 3
చాతుర్వర్ణ్యవిహీనాశ్చ యేచ దేశా నరాధిప! । అన్యేష్వపిచదేశేషు తద్దేశ జనదర్శనమ్ ॥ 4
వర్జయేచ్ఛ్రాద్ధకాలేతు పతితానాం విశేషతః । రజస్వలాశ్చ షండాశ్చ శ్వానసూకరకుక్కుటాః ॥ 5
యథాశ్రాద్ధంనపశ్యన్తి తథాకార్యం విజానతా । రక్షార్థం చాప్యథైతేషాం గుప్తిఃకార్యానరేశ్వర ॥ 6
తిలావికిరణం కార్యంయాతుధాన వినాశనమ్ । పిండాంశ్చగోఽజ విప్రేభ్యో దద్యాదగ్నావథక్షిపేత్ ॥ 7
మధ్యమంపుత్ర కామావా పత్నీ పిండంచ భక్షయేత్ । తీర్థశ్రాద్ధేతథా పిండాన్ క్షిపేత్తీర్థే విచక్షణః ॥ 8
దక్షిణాభిముఖోభూత్వాప్రేతీ దిక్సా ప్రకీర్తితా । పిండనిర్వపణం కార్యం కుశాలాభే విచక్షణైః ॥ 9
కుశేషురాజ న్సర్వేషు పవిత్రేతేపరేమతే । సూత్రం ప్రదేయం వాసోఽర్థేక్షౌమ కార్పాససంభవమ్ ॥ 10
దశాం వివర్జయేత్ప్రాజ్ఞో యద్యప్య హతవస్త్రజామ్ । క్షౌమకార్పా సజం త్యక్త్వావస్త్రమన్యత్ర దాపయేత్ ॥ 11
ఘృతేన దీపోదాతవ్య స్త్వథ వా ప్యోషధీరసైః । వసామేదోద్భవందీపం ప్రయత్నేన వివర్జయేత్ ॥ 12
చందనాగురు కర్పూర కుంకుమాంశ్చ ప్రదాపయేత్ । అశ్వమేధ సమాహ్యేతే పితౄణామనులేపనాః ॥ 13
నదాతవ్యం మనుష్యేంద్ర ! యదన్యచ్చాను లేపనమ్ । ధూపోగుగ్గులుజోదేయ స్తథాచందనసారజమ్ ॥ 14
అగురుంచ సకర్పూరం తురుష్కంచ ప్రదాపయేత్ । అతోఽన్యదపి ధూపార్థేయత్కించిత్త ద్వివర్జయేత్ ॥ 15
సఘృతం గుగ్గులుంధూపం ధూపార్థేయః ప్రయచ్ఛతి । అశ్వమేధఫలం తస్యధూపదాతుస్తథైవచ ॥ 16
జాత్యశ్చ సర్వా దాతవ్యా మల్లికాశ్వేతయూథికా । జలోద్భవాని సర్వాణి కుసుమాని వివర్జయేత్ ॥ 17
యానికంటకిజాతాని నదేయానినరాధిపః । యానికంటకి తాగ్రాణి శుక్లాని సురభీణిచ ॥ 18
తానిరాజేంద్ర! దేయానిలతాజాని విశేషతః । రక్తా నిజలజాతాని తథాదేయాని యాదవ! ॥ 19
విపులాంశ్రియ మాప్నోతి పితౄన్పుష్పైః సమర్చయన్ ।

వజ్రుండు భృగువంశ భూషణా ! ఏ దేశమందు శ్రాద్ధము పెట్టవలయు నే ద్రవ్య మీయదగినది యేది యీయగూడనిది ఆనతిమ్మన మార్కండేయుడనియె. శ్రాద్ధకర్మమందుత్రిశంకుదేశమును పండ్రెండామడమేరవర్జింపవలెను. పతంగమునకు నుత్తరమున కైకటము దక్షిణమున ననుసవిహద్దులుగా గలదేశమును త్రైశంకవమని యందురు. కారస్కరములు కలింగములు సింధునది కుత్తర ప్రదేశము చాతుర్వర్ణ్య వ్యవస్థ లేని మరి యితర దేశములను నా యా దేశముల జనములను జూచుటయు శ్రాద్ధకాలమందునిషిద్ధములు. విశేషించి పతితులు (జాతి కుల భ్రష్టులు) రజస్వలలు షండులు (నపుంసకులు) కుక్కలు పందులు కోళ్ళు శ్రాద్ధమును జూడకుండునట్లు సేయవలెను. వీని వలని రక్షణకు గుప్తి చేయనగును. గుప్పెడు తిలలను జల్లవలయును. అది రక్షో వినాశకరము. శ్రాద్ధ పిండములను గోవులకు మేకలకు బ్రాహ్మణునకు పెట్టవచ్చును. అగ్నియందు వేయవచ్చును. పుత్రకామయైన స్త్రీ మధ్యపిండము దినవచ్చును. తీర్థశ్రాద్ధము నందెపుడును పిండములను తీర్థమందే వేయవలెను. పిండనిర్వపణము దక్షిణాభి ముఖుడై సేయవలెను. ఆ దిక్కు పితృదేవతల దిక్కని కీర్తింప బడినది. కుశలు లభింపనపుడు తెలిసినవాడు దక్షిణాభి ముఖుడగుట విధింప బడినది. కుశలు దక్షిణ దిక్కు అనునవి రెండును పరమపవిత్రములని చెప్పబడినవి. వస్త్రార్థము సూత్ర(బద్దె)మీయవలెను. అది క్షౌమము(పట్టు) కార్పాసము దూదిది పనికిరాదు. అహత వస్త్రమందున్నను క్రొత్తదైనను నా వస్త్రమున కంచు (దశ) ఉండ గూడదు. ఆవునేతి దీపముపెట్టవలెను. లేదా ఓషధీ రసములతో నైన బెట్టవచ్చును. వస మేదస్సు (కొవ్వు) అను వానితో దీపము పనికిరాదు. చందనము అగరు కర్పూరము కుంకుమపువ్వు నను నివి అశ్వమేధముతో సమానమైనవి పితృదేవతల కర్హములైన యను లేపనములు. ఇంతకుమించి యేవస్తువైన పనికిరాదు. గుగ్గులు ధూపము చందనసారముచే నైనది. ధూపము - అశ్వమేధ ఫలప్రదము అన్ని జాతులు (జాజిపువ్వులును) మల్లెలు శ్వేతయూథికలు (తెల్లమొల్లలు) నీయవలెను. నీటిలోబుట్టిన పువ్వు లేవియు పనికిరావు. ముండ్లచెట్ల పువ్వులు పనికిరావు. అగ్రమందు ముళ్ళున్నవి. (గులాబీల వంటివి) తెల్లనివి పరిమళము గలవియుం బనికివచ్చును తీగల బూచిన యెఱ్ఱపువ్వులు ప్రశస్తములు. నీటబుట్టిన ఎఱ్ఱదామరలు కూడ శ్రేష్ఠములే. పితరులను బూవుల నర్చించిన విపులమైన యైశ్వర్యము నొందును.

అభక్ష్యాణి వివర్జ్యాని శ్రాద్ధే నిత్య మతంద్రితైః ॥ 20
భక్ష్యేష్వపి నదేయాని యాని తానినిబోధమే । భూస్తృణం సుముకం శిగ్రుం పాలక్యం తండులీయకమ్ ॥ 21
కూష్మాండాలాబు వృంతాక పిప్పలీమరిచానిచ । శ్రాద్ధేషునాగరం దేయం లవణం సైంధవంతథా ॥ 22
సైంధవవ్యతిరేకే ణలవణాని నదాపయేత్ నక్తంగృహీతముదకంతథా పల్వలసంభవమ్ ॥ 23
శ్రాద్ధకాలేవివర్జ్యంచ మాహిషం క్షీరమేవచ । రాజమాషమసూరాశ్చ చణకాః కోరదూషకాః ॥ 24
వర్జ్యాశ్చా భిషవోనిత్యం శత పుష్పంగవేధకమ్ । కరంభాణి కుసుంభంచ పటోలం బృహతీఫలమ్ ॥ 25
కరీరసురభీచోభా పూతిగంధిచయద్భవేత్ । జంబీరజఫలం వర్జ్యం కోవిదారంచపార్థివ! ॥ 26
వస్తుసందర్శనం శస్తంశ్రాద్ధే నిత్యమరిందమ! । కుతపస్యచసాంనిధ్యం తథాకృష్ణాజినస్యచ ॥ 27
కృష్ణాజినస్యదానంచ రజతస్య విశేషతః । కృష్ణాజినంసకుతపం కృష్ణానిచతిలానిచ ॥ 28
శ్రాద్ధకర్మణిశస్తాని విట్పతిస్త త్సుతస్తథా । సోమః సద్దైవమాసాంతే రవిణాసహసంగతః ॥ 29
ఆపశ్చైవోషధీశ్చైవ తదావిశతి పార్థివః । అమాయాంతు పయః పీత్వాభుక్త్వాచై వౌషధీః శుభాః ॥ 30
పయఃక్షరంతి యద్దివ్యం గావోఽమృతరసో పమమ్ । తత్పవిత్రం పరంరాజన్! కాపిలంచేద్విశేషతః ॥ 31
హవ్యేకవ్యే చతద్రాజ న్సోమతుల్యం ప్రకీర్తితమ్ ।

శ్రాద్ధమందభక్ష్యములను విడువవలెను. భక్ష్యములలోగూడ భూస్తృణము =(కర్పూర తృణము) సువాసనగల సుముకము ఒక గడ్డి శిగ్రు = తోటకూర పాలక్యము = పాలకూర జీవంతి తండులీయకము కూష్మాండ (గుమ్మడి) అలాబు (ఆనప) వృంతాక = నీరువంగ పిప్పలీ = పిప్పళ్ళు మరిచములు = మిరియాలును శ్రాద్ధనిషిద్ధములు. నాగరము = శొంఠి, సైంధవలవణము

మంచిది. సైంధవ లవణముగాక మరియే లవణములును బనికిరావు. రాత్రి దెచ్చిన నీరు పల్వలములలో (గుంటలలో) నీరు నిషిద్ధము. గేదెపాలు వర్జ్యము. బొబ్బర్లు సెనగలు మసూరములు = చిరుసెనగలు క్షారదూషకములు = అట్టి అసుధాన్యము వర్జ్యములు. అభిషవము = శతపుష్పము = గవేధుకమను అడవిగోధుములు కరంభములు — అడవి పిప్పలి. కుసుంభము = కుసుంభా పుష్పము పటోలము = పొట్ల బృహతీఫలము — వాకుడు ములగయు, పూతిగంధియు — దుర్వాసనగలదియునగు కరీరము = వెణుతురు సులభి జంబీరఫలము = నిమ్మ కోవిదారము = కాంచనము నిషిద్ధములు. చక్కగా కనిపించు వస్తువు ప్రశస్తము. కుతపకాలము, కృష్ణాజినము కృష్ణాజిన దానము రజత దానము విశేష యోగ్యములు. కుతపకాలముతోడి కృష్ణాజినముయొక్క సాన్నిధ్యము కృష్ణతిలలు మిక్కిలి ప్రశస్తములు. శ్రాద్ధమందు విట్పతి = ఆయుసకొడుకు; (మాసాంతమందలి సూర్యునితోడి సోముడు (చంద్రుడు) (అమావాస్య యన్నమాట) చాల ప్రశస్త వస్తువులు. ఆనాడు ఉదకములలో ఓషధులలో చంద్రుడు ప్రవేశించును. అమావాస్యయందు శుభములైన ఓషధులం దిని సిరుద్రావి గోవులు అమృతరసోపమానమైన దివ్యక్షీరము నొసంగును. కపిల గోక్షీర మింకను బరమ పవిత్రము. ఆపాలు హవ్యమందు (దేవతల నుద్దేశించు హవిస్సునందు) కవ్యమందు (పితృదేవతల నుద్దేశించి యీయబడు హవిస్సునందు) నది సోమునితో సమానము.

తిలై ర్వ్రీహియవై ర్మాషై రద్భిర్మూలఫలేనచ ॥ 32
ప్రియంగుభి స్తథాదారైః శృంగాటక ఫలైః శుభైః । గోధూమై శ్చేక్షుభిర్ముద్గైః సచీనచణకై స్తథా ॥ 33
శ్యామాకై ర్హస్తిశ్యామాకై ర్మధూకై ర్ద్రాక్షాదాడిమైః । పనసై ర్నారికేరైశ్చ ఖర్జూరామ్రఫలై స్తథా ॥ 34
ఆమ్రాతైశ్చామ్రమాతులంగై ర్బిల్వైర్వల్లీభిశ్చ మూలకైః । విదార్యానిర్భ రూపైశ్చ విశేషైశ్చవరాటకైః ॥ 35
పిచుకైశ్చతథా కర్కైర్బదరైః కరకందుభిః । పాలేవతై రాష్ట్రికైశ్చ అక్షోటైః వనసై స్తథా ॥ 36
కాకోలైః క్షీరకాకోలై స్తథా పిండాలుకైః శుభైః । సువర్చలామధూకైశ్చవాస్తుకేనచ పార్థివ! ॥ 37
సితాఖండగుడై ర్ముఖ్యైః ఫణితేనచ సక్తుభిః । లాజాభిశ్చ సధానాభి స్త్రపుసైర్వ్యారుచిర్భటైః ॥ 38
సర్షపారాజికా శాఖ్యామింగుదై రాజ జంబుభిః । ప్రియాలానులకైర్ముఖ్యైః ఫల్గుభిశ్చతిలోలకైః ॥ 39
వేత్రాంకురై స్తాలదర్భైశ్చక్రికాక్షీరి నాథవైః । చోచైః సమీచై ర్లకుచై స్తథావై బీజపూరకైః ॥ 40
ఛత్రాశిచ్ఛత్రక్షీరాకైః కలందుక కశేరుకైః । సుజాతకైః పద్మఫలైర్భక్ష్యైర్భోజ్యైః సుసంస్కృతైః ॥ 41
రాగషాడవచోష్యైశ్చత్రి జాతక సమన్వితైః । దత్తేనమాసం ప్రీయంతే శ్రాద్ధేన పితరోనృణామ్ ॥ 42
ద్వౌమా సౌమత్స్యమాంసేన త్రీన్మాసాన్హారిణేనతు । ఔరభ్రేణాథచతురః శాకునేనతుపంచవై ॥ 43
షణ్మాసాన్ఛాగమాంసేన ప్తపార్షతేనచ । తథాష్టౌచాగమాంసేన పయసాపాయసేనచ ॥ 44
వారాహేణనవైవాహూ రౌరవేణ తథా దశ । మాసానేకా దశైవాహూర్గవయేననరాధిపః ॥ 45
సంవత్సరంతు గవ్యేనపయసాపాయసేనచ । పయోవికారై శ్చతథా హృద్యైశ్చమనుజేశ్వరః ॥ 46
పానకైశ్చతథాహృద్యై స్త్రిసుగంధైః సుశీతలైః । వార్ధ్రీణసస్యమాంసేన తృప్తిర్ద్వాదశ వార్షికీ ॥ 47
వజ్రఉవాచ : వార్ధ్రీణసమహం బ్రహ్మన్ శ్రోతుమిచ్ఛామి తత్త్వతః । యస్యమాంసేనకథితా తృప్తిర్ద్వాదశవార్షికీ ॥ 48
మార్కండేయ ఉవాచ : త్రిపిబంత్వింద్రియక్షీణం యూథస్యాగ్రసరంతథా ।
రక్తంవర్ణేన రాజేంద్ర ఛాగం వార్ధ్రీణసం విదుః ॥ 49
కాలశాకం మహాశల్కం ఖడ్గమాంసం తథైవచ । ఆనంత్యాయభవేద్దత్తం సర్వంచమధుసంయుతమ్ ॥ 50
ఖడ్గావిషాణైః పరివర్జితాయే తేషాంహి మాంసేనభవత్యనన్తమ్ ।
శ్రాద్ధంమహారాజః తతః ప్రదేయం ఖడ్గస్యమాంసేనహితాయతేషామ్ ॥ 51

ఇతి శ్రీవిష్ణు ధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
శ్రాద్ధహవిర్వర్ణనం నామైకచత్వారింశదుత్తర శతతమోఽధ్యాయః.

తిలలు (నువ్వులు) వ్రీహులు = వడ్లు యవలు ఉదక మూలములు నీటిలోని దుంపలు పండ్లు ప్రియంగువులు = కొఱ్ఱలు దాదములు శృంగాటక ఫలములు = ఒకరకమైనపండ్లు గోధుమలు జొన్నలు పెసలు మినుములు = మినుము ధాన్యము, చణకములు (సెనగలు) శ్యామాకలు = చామలు హస్తి శ్యామాకములు = చామలలోరకము మధూకము = ఇప్ప హస్తవాదములు ఖర్జూరములు మామిడి పండ్లు ఆమ్రాతకములు = అంబాళము మామిడి ఆమ్రములు = మామిడిపండ్లు నారంగములు మారేడుపండ్లు దీర్ఘమూలకములు తీగతుమిడి విదారి = తెల్లనేలగుమ్మడి నిర్భరూటములు వరాటకములు పిప్పలములు బిరెంక కర్దములు బదరములు = రేగు కర్కంధువులు = రేగులోరకము పాలేవతములు రాష్ట్రిక వాకుడు అక్షోటములు = మృదు ద్రుమము (అక్రోటు) పనసలు కాకోలములు = క్షీరకాకోలములు పిన్నపాల మనుపాల, పిండాలుకములు సువర్చలములు మధూకములు = ఇప్ప వాస్తుకము = చక్రవర్తికూర సితా = పంచదార ఖండ = కలకండ (పటికబెల్లము) గుడ = బెల్లము ఫణీతము సక్తుప్ర = పేలపిండి లాజలు = పేలాలు ధానలు త్రవుస = చేదుదోస వారుచులు = ఖటములు సర్షప = ఆవాలు, రాజాకములు రాజజంబువులు = అల్లొనేరేడు ప్రియాలములు = మోరటి ఆమలకములు = ఉసిరికాయలు ఫల్గువులు = బొమ్మమేడి కుక్కమేడి తిలోలములు వేత్రాంకురములు = వేపచిగుళ్ళు(?) తాలదర్భలు చుక్రిక = చింతపండు క్షీరిక = చిరుపాల ధవములు నోచములు సమీచములు ఒకుప ములు = గజనిమ్మ బీజపూరకములు ఛత్రములు = కొత్తుమిరి చినూప అతిచ్ఛత్రములు = సహపక్షీరకములు కంకుకములు = ఒకరకము కూరాకు (గోళి) కశేరుకములు సుజాతకములు పద్మఫలములు సంస్కృతములో = చక్కగా శుచిగా వండిన భోజ్యములు. ఇవిగాక భక్ష్యములు త్రిజాతక సహితములైన రాగషాడబములు చోష్యములు నమవానితో నిడిన శ్రాద్ధముచే పితృదేవత లొక్కనెల తృప్తి పొందుదురు. చేప మాంసముచే రెండు నెలలు, హరిణ (జింక) మాంసముచే మూడు ఔరభ్ర మాంసముచే పొట్టేలు మాంసముచే నాల్గు శాకున మాంసముచే నైదు శాశిక మాంసముచే నారు పారిశత మాంసముచే నేడు ఛాగము (మేక) మాంసముచే పాలచే పాయసముచే నెనిమిది వరాహ మాంసముచే తొమ్మిది రురుమాంసముచే పది గవయ మాంసముచే పదునొకండు నెలలు గవ్యములయిన (గోవుయొక్క) పాలు పాయసము ఆవుపాలతో దయారగు రకరకాల రుచికరములైన పంటకములచే సంవత్సరము సంతృప్తులగుదురు. త్రిసుగంధ ద్రవ్యమిశితములు (త్రిసుగంధములు - ఏలకులు లవంగాలు జాపత్రి (జాజికాయలు) మిక్కిలి చల్లనివియు నగు రుచిగల పాకములు. సంవత్సరము ప్రీతి నిచ్చును. వార్ధ్రీణస మాంసము పండ్రెండు సంవత్సరాల తృప్తి నిచ్చును. అనవిని వజ్రుడు వార్ధ్రీణసమన నేమో విన కుతూహలి పడుచున్నానన మార్కండేయుడు - త్రిపిబము ఇంద్రియక్షీణము తన మందకు ముందునడమనది ఎఱ్ఱనిదియునగు ఛాగమును (మేకను) వార్ధ్రీణస మందురు. కాలశాకము మహాశల్కము ఖడ్గమాంసము మధువుతోను (తేనెతో) నిచ్చిన ననంత ఫలమిచ్చును. ఖడ్గమృగములు కొమ్ములులేని వాని మాంసమనంత ఫలదము కాన పితృదేవతల హితముకొరకు తృప్తికి ఖడ్గమాంసముతో శ్రాద్ధము పెట్టవలెను.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తరమహాపురాణము ప్రథమఖండమున శ్రాద్ధహవిర్ద్రవ్య నిరూపణమను నూటనలుబదియొకటవఅధ్యాయము.

## నూటనలుబదిరెండవ అధ్యాయము - శ్రాద్ధకాల నిరూపణము

వజ్ర ఉవాచ :- శ్రాద్ధకాలం సమాచక్ష్వ సర్వధర్మ భృతాంవర । కస్మిన్కాలేకృతే శ్రాద్ధేప్రీయంతేపితరోనృణామ్ ॥ 1
మార్కండేయ ఉవాచ :- శ్రాద్ధకాలస్త్వమావస్యాం నిత్యం పార్థివసత్తమ! ।
2
పౌర్ణమాసీతథామాఘీ శ్రావణీచనరోత్తమః ॥
ప్రోష్ఠపద్యామతీతాయాం తథాకృష్ణ త్రయోదశీ । ఆగ్రహాయణ్యా తీతాయాం కృష్ణాస్తి స్రోఽష్టకాస్తథా ॥ 3
శాకైశ్చ ప్రథమంకార్యా మాంసైశ్చ తదనంతరం । తృతీయాచతథాఽపూపైర్నిత్య మేవవిజానతా ॥ 4

అన్వష్టకాసు చస్త్రీణాం శ్రాద్ధంకార్యంతథైవచ । అష్టకావిధినాహుత్వా క్రమేణైతాస్తు పంచకాః ॥ 5
మాతేరాజన్ పితామహ్యై శ్రాద్ధంకార్యంయథావిధి । తథైవప్రపితామహ్యై విశ్వేదేవ పురస్సరమ్ ॥ 6
పిండనిర్వపణం కార్యం తాసాంచ పితృవన్నృప ! । భుక్తవత్సుచ విప్రేషు తత్ర కర్మని బోధమే ॥ 7
ప్రాదేశమాత్రారాజేంద్రః చతురంగులమాయతాః । తావదేవసముత్సేధాః షట్కర్షూ స్తత్రకారయేత్ ॥ 8
ప్రత్యేకకర్షుమూలేతు పరిస్తీర్యహుతాశనమ్ . అగ్నిసోమయమానాంచ యాగంకృత్వాయథాపురా ॥ 9
కర్షుత్రితయమూలేతు పురుషాణాంతుకారయేత్ । పింద నిర్వపణం ప్రాగ్వదేకైకస్మిన్యథావిధి ॥ 10
కర్షుభిస్త్రితయం తచ్చ క్షీరాన్నాద్యైః ప్రపూరయేత్, । కర్షుత్రితయమూలేతు స్త్రీణాం నిర్వపణంభవేత్ ॥ 11
దధ్నామాంసేన పయసా కర్షూణాం చైవ పూరణమ్ । అన్నోదక విమిశ్రేణ కార్యం మనుజ పుంగవః ॥ 12
భవంతీభ్యో భవత్యేత దక్షయం పరికీర్తితమ్ । ఏతానిశ్రాద్ధకాలాని నిత్యాన్యాహ ప్రజాపతిః ॥ 13

ఓ సర్వధర్మ నిధీ ! ఏకాలమున శ్రాద్ధము జరిపిన పితరులు ప్రీతులగుదురో తెలుపుమన మార్కండేయుడనియె. అమావాస్య శ్రావణపూర్ణిమ మాఘపూర్ణిమ ప్రోష్ఠపది దాటిన కృష్ణత్రయోదశి, అగ్రహాయణి దాటిన కృష్ణపక్షమందలి మూడు అష్టకములు శ్రాద్ధప్రశస్తములు. ముందు కూరలచేతను తరువాత మాంసముచేతను నదిజరుపవలెను. అపూపములుకూడ అర్హములే. అన్వష్టకలందు అష్టకాది దానమున క్రమముగా నీయైదు హోమములు సేసి శ్రాద్ధము చేయవలయును. తల్లి పితామహి ప్రపితామహి విశ్వేదేవులు అనువారికి పిండనిర్వపణము తండ్రికట్లే చేయవలెను. బ్రాహ్మణ భోజనమయిన తరువాత నక్కడ చేయవలసినది తెలిసికొనుము. నాల్గు అంగుళములు పొడవు అంతేవెడల్పు గల షట్కర్షువులు ఏర్పరుప వలెను. ఆ కర్షువుల మొదలున దర్భలుపరచి అగ్నిని ప్రతిష్ఠించి అందు ముందటియట్ల అగ్నిసోమయమ దేవతల నుద్దేశించి యాగము (హోమము) సేసి ఆ మూడు కర్షువుల మొదల పురుషులకు పిండప్రదానము ఒక్కొక్కరి కొక్కదానిపై చేయవలెను. కర్షుత్రితయమును క్షీరాన్నాదులతో నింపవలెను. పెరుగు మాంసము పాలు ననువానితో నా దొన్నెలను బూరింపవలెను. అన్నము నీరు గలిపి యది చేయవలెను "భవతీభ్యః భవత్వే తదక్షయం" తమకీ యర్చన మక్షయమగుగాక యనిచెప్పవలెను. బ్రహ్మ నిత్యశ్రాద్ధ కాలము లివియని పలికెను. ఇందు శ్రాద్ధము సేయనివాడు నరకమందును.

శ్రాద్ధ మేతేష్వకుర్వాణో నరకం ప్రతి పద్యతే । వృద్ధౌ శ్రాద్ధంనరః కుర్వన్ నిత్యం వృద్ధిము పాశ్నుతే ॥ 14
వృద్ధౌ సమర్చయేద్విప్రాన్ నిత్యం నాందీముఖాన్పితౄన్ । వృద్ధి శ్రాద్ధేషు కర్తవ్యాస్తిల స్థానేయవాస్తథా ॥ 15
కర్కంధు దధిసం మిశ్రాన్ తథా పిండాంశ్చ నిర్వపేత్ । అచ్ఛిన్న నాభ్యాం కర్తవ్యం శ్రాద్ధంవైపుత్ర జన్మని॥ 16
ఆశౌచో పరమే కార్య మథవాఽ పినరాధిప । వివాహ దివసే శ్రాద్ధం తథా కార్యం! విచక్షణైః ॥ 17
వృద్ధి శ్రాద్ధం విధానేన చంద్రే జన్మర్క్ష మాశ్రితే । శ్రాద్ధం ప్రయత్నాత్కర్తవ్యం భూతికామేన పార్థివః ॥ 18
ఉత్తరాద య నాచ్ఛ్రాద్ధం శ్రేష్ఠం స్యాద్దక్షిణాయనే । చాతుర్మాస్యంచతత్రాపి సుప్తే స్వాత్కేశవేహితమ్ ॥ 19
ప్రోష్ఠపద్య పరం పక్షం తథా పిచ విశేషవత్ ॥ పంచమూర్ధ్వం చతత్రాపి దశ మ్యూర్ధ్వం తతోఽప్యతి. 20
మఘాయుతా చతత్రాపి శస్తా రాజం స్త్రయోదశీ । తత్రాక్షయం భవేచ్ఛ్రాద్ధం మధునా పాయసేనచ ॥ 21
సర్వస్వేనాపి కర్తవ్యం శ్రాద్ధమత్ర నరాధిప । పరాన్న భోజీత్వ పచః శ్రాద్ధమత్రతు కారయేత్ ॥ 22
యస్తుశ్రాద్ధం సదాకుర్యాత్ సోఽశ్వ మేధఫలో భవేత్ । నిద్రాంత్యజతి సర్వాత్మాయస్మిన్కాలే జనార్దనః ॥ 23
తత్రశ్రాద్ధ మథానంత్యం నాత్రకార్యా విచారణా । శ్రాద్ధం సంక్రమణే భానోః కర్తవ్యం పృథివీ పతేః ॥ 24
విషువద్ద్వి తయంతత్ర అయనేద్వే విశేషతః । వ్యతీ పాతే తథా శ్రాద్ధం జ్ఞేయం బహుఫలంన్నృపః ॥ 25
అక్షయంచ తథా శ్రాద్ధం విజ్ఞేయం రాహు దర్శనే । వ్రీహిపాకేచ కర్తవ్యం యవపాకే తథైవచ ॥ 26
నత్వానద్యుర్మహారాజ! వినాశ్రాద్ధం కథంచన । ఆశ్వినస్యాపరే పక్షే ప్రథమే కార్తికస్యచ ॥ 27

పూర్వాహ్ణే శుక్లపక్షస్య శ్రాద్ధం కుర్యాద్విచక్షణః అపరాహ్ణే తథా కార్యం కృష్ణ పక్షేన రాధిప: ॥ 28
సంధ్యయో ర్వర్జయేచ్ఛ్రాద్ధం తత్రరాత్రౌనరేశ్వర: । రాత్రావపిచ కర్తవ్యం యదాస్యాద్రాహు దర్శనమ్ ॥ 29
అక్షయం తత్సముద్దిష్టం య ద్దత్తం రాహు దర్శనే । అతఃకామ్యాని వక్ష్యామి శ్రాద్ధాని తవ పార్థివ: ॥ 30

వృద్ధియందు శ్రాద్ధము పెట్టినవాడు నిత్యము వృద్ధిపొందును. వృద్ధి శ్రాద్ధమందు తిలలకు బదులు యవలు వాడవలెను. కర్కంధువుతో పెరుగుతో కలిపి పిండనిర్వపణ మొనరింపవలెను. కొడుకు గల్గినపుడు బొడ్డు కోయకుండ గాని పురుడు వెళ్ళిన తర్వాత గాని వృద్ధి శ్రాద్ధము నొనరింపనగును. వివాహమురోజున చంద్రుడు జన్మనక్షత్రమందున్నపుడు భూతికాముడు (ఐశ్వర్యము కావలెనను వాడు) వృద్ధిశ్రాద్ధము నొనరింపవలెను. ఉత్తరాయణముకంటె దక్షిణాయనము శ్రేష్ఠము. ఆషాఢ పూర్ణిమ మొదలు (చాతుర్మాసము) నాల్గుమాసములు విష్ణువు శయనించిన కాలము శ్రాద్ధప్రశస్తము. అందులోగూడ ప్రోష్ఠపది యవతలి పక్షము విశేషమైనది. అందుకూడ పంచమి తరువాత దశమి తరువాతను మరీమంచిది. మఘతోడి త్రయోదశినాడు తేనెతో పాయసముతో శ్రాద్ధము పెట్టిన నక్షయమగును. సర్వవిధముల నెపుడు శ్రాద్ధము పెట్టితీరవలెను. పరాన్నభుక్కు, ఇంటిలో వంటలేనివాడు నీశ్రాద్ధము పెట్టవలెను. ఈ చెప్పిన శ్రాద్ధములను మానకుండ జరిపిన వాడశ్వమేధ ఫలము పొందును. విష్ణువు నిద్రనుండి లేచినపుడు పెట్టిన శ్రాద్ధమనంత ఫలప్రదము. రవిసంక్రమణము రెండు అయనములందలి రెండు విషువత్పుణ్య కాలములు వ్యతీపాత గ్రహణమందు వ్రీహిపాకము యవపాకమునైన శ్రాద్ధమత్యుత్తమము. అవి లేకుండ మరి శ్రాద్ధప్రసక్తి ఋషులు చేయనేలేదు. ఆశ్వయుజమాస కృష్ణపక్షము కార్తిక శుక్లపక్షము శుక్లపక్ష పూర్వాహ్ణమున శ్రాద్ధము సుప్రశస్తము. కృష్ణపక్షమందపరాహ్ణము మంచిది. సంధ్యాసమయము రాత్రి నిషిద్ధములు. గ్రహణ శ్రాద్ధము రాత్రికూడ పెట్టవచ్చును. అది యక్షయము. ఇటుపై కామ్య శ్రాద్ధములు తెల్పెదను.

ఆరోగ్యమథ సౌభాగ్యం సమరే విజయం తథా । సర్వాన్కామాంస్తథా విద్యాం ధనం జీవితమేవచ ॥ 31
ఆదిత్యాది దినేష్వేవం శ్రాద్ధం కుర్వన్సదానరః, క్రమేణై తదవాప్నోతి నాత్రకార్యా విచారణా ॥ 32
స్వర్గంహ్యపత్యాని తథా బ్రహ్మవర్చసమే వచ । రౌద్రేణ కర్మణాసిద్ధిం భువంపుష్టిం తథాశ్రియమ్ ॥ 33
సర్వాన్కామాంశ్చ సౌభాగ్యం ధనం జ్ఞాతి ప్రధానతామ్ । రూపయుక్తాంశ్చతనయా న్వాణిజ్యాద్ధనసం పదమ్ ॥ 34
కనకం సుహృదో రాజ్యం సఫలాంచ తథా కృషిమ్ । సమ్ముద్ర యానాల్లాభంచ సర్వన్కామాం స్త థైవచ ॥ 35
శ్రైష్ఠ్య కామాంస్తథా సర్వాన్బల మారోగ్యమే వచ । రూప్యం ద్రవ్యం గృహం గాశ్చ తురగాంశ్చైవ జీవితమ్ ॥ 36
కృత్తికాది భరణ్యంతం క్రమాత్తు భగనేరః । ఏకైక స్మిన్కామత్కుర్వం శ్ఛ్రాద్ధం ప్రాప్నోత్య సంశయమ్ ॥ 37
స్త్రియః సురూపాఃస్వగృహే కన్యానాంచ తథా వరాన్ । సర్వాన్కామాన్య శశ్చైవ శ్రియంద్యూతజయంకృషిమ్ ॥ 38
వాణిజ్యం పశవశ్చైవవాజినశ్చ తథా సుతాన్ । సువర్ణరౌప్య సౌభాగ్యం ప్రాప్నోతి శ్రాద్ధదః క్రమాత్ ॥ 39
ప్రతిపత్ప్ర భృతిహ్యేతత్ యావద్రాజంస్త్ర యోదశీ । చతుర్దశ్యాం తుకర్తవ్యం యే నరాః శస్త్రఘాతితాః ॥ 40
శ్రాద్ధం సదా పంచదశీషు కార్యం కామాన్స మగ్రాంల్లభతే మనుష్యః ।
తస్మాత్ప్ర యత్నేన నరేంద్ర కార్యం । శ్రాద్ధం సదా పంచద శీషుత జ్జ్ఞః ॥ ॥ 41

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
శ్రాద్ధకాల వర్ణనంనామ ద్విచత్వారింశ దుత్తరశతతమోఽధ్యాయః.

కామ్యశ్రాద్ధములు.

ఆరోగ్య సౌభాగ్యములు యుద్ధవిజయము మరియెల్లకోరికలు విద్య ధనము ప్రాణముకోరి ఆదివారము మొదలు వరుసగా శ్రాద్ధము పెట్టినవాడా యా ఫలములం దప్పక పొందును. స్వర్గము సంతానము బ్రహ్మవర్చస్సు రౌద్రకర్మసిద్ధి భూమి పుష్టి సంపద సర్వాభీష్టములు సౌభాగ్యము ధనము జ్ఞాతులందరిలో ప్రధానుడగుట రూపవంతులయిన కొడుకులు వాణిజ్య

మూలకముగ ధనసంపద బంగారము సుహృత్తులు (మిత్రులు) రాజ్యము వ్యవసాయ సాఫల్యము సముద్రయానము వలన లాభము అన్ని శ్రేష్ఠములయిన కోరికలు బలము ఆరోగ్యము వెండి ద్రవ్యసంపద ఇల్లు గోవులు గుఱ్ఱములు ప్రాణము కామ్య శ్రాద్ధమువలన పొందును. కృత్తిక మొదలు భరణిదాక నొక్కొక్క నక్షత్రమందది సేసిన నీపైనిచెప్ప ఫలములు గల్గితీరును. చక్కని స్త్రీలు తనయింట నాడు పిల్లల కుత్తమవరులు కీర్తి సంపద జూదములో గెలుపు కృషి వాణిజ్యము పశువులు గుఱ్ఱములు కొడుకులు బంగారము వెండి సౌభాగ్యమునను నానిని శ్రాద్ధదాత తప్పక పొందును. పాడ్యమి మొదలు త్రయోదశిదాక నివి జరుపవలెను. శస్త్రఘాతము పొందినవారికి చతుర్దశినాడు పెట్టవలెను. పూర్ణిమనాడు శ్రాద్ధము తప్పక పెట్టినసర్వకామ సమృద్ధుడగును.

ఇతిశ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున శ్రాద్ధకాల నిరూపణమను నూటనలుబదిరెండవ అధ్యాయము.

# నూటనలుబదిమూడవ అధ్యాయము - పాత్రాపాత్ర నిరూపణము

కస్మై శ్రాద్ధంనదాతవ్యం కేన భుక్తం మహా ఫలమ్ । భవతీహ ద్విజశ్రేష్ఠ తన్మమాచక్ష్వ పృచ్ఛతః ॥ 1
మార్కండేయఉవాచ:
అనూఢా తనయో రాజన్యశ్చ పౌనర్భవః సుతః । శూద్రా పతిర్దురాచారో వాణిజ్యాయుధ జీవనః ॥ 2
తథా వార్ధుషికో యశ్చ శూద్రస్యచ పురోహితః । పర్వకార స్తథా సూచీయస్యచో పపతిర్గృహే ॥ 3
కృత్వానక్షత్ర నిర్దేశం యశ్చ జీవతి పార్థివః । చికిత్సి తేన చ తథా య స్యవృత్తి ర్నరేశ్వరః ॥ 4
వేదవిక్రయకో యశ్చ వేదనిందక ఏ వచ । తర్క శాస్త్రేణ దగ్ధశ్చ నాస్తి కోధర్మవర్జితః ॥ 5
పిత్రావివద మానశ్చయశ్చైవోపనయేద్బహూన్ । అయాజ్యయాజీస్తేనశ్చయక్ష్మీ కితవ ఏవచ ॥ 6
శ్విత్రీచయ స్తథాకాణో బధిరోంధఃకుణి స్తథా । పరపూర్వా పతిశ్చైవ గ్రామప్రేష్యో నిరాకృతిః ॥ 7
అవకీర్ణీ కుండగోలీ కునఖీ శ్యావదంతకః । కన్యా దూష్య భిశ స్తశ్చ మిత్రధ్రుక్ పిశునస్తథా ॥ 8
పరివి త్తః పరివేత్తా తస్యకన్యా ప్రదశ్చయః ।యాజకశ్చ తథా తస్య సోమవిక్రయక స్తథా ॥ 9
కూట సాక్షీచ వాగ్దుష్టః పరదారో వికర్మకః । తథా చైవాపవిద్ధాగ్నిః విరుద్ధ జనక స్తథా ॥ 10
యశ్చహీనాతిరిక్తాంగో దుశ్చర్మాదమ క స్తథా । యశ్చయు క్తస్తథా రాజన్ పాత కైశ్చోపపాతకైః ॥ 11
ద్విషస్మిత్రే ఉభే చైవ ప్రయత్నేన వివర్జయేత్ అతః పరంప్రవక్ష్యామి బ్రాహ్మణాన్పంక్తి పావనాన్ ॥ 12

ప్రభుడెవ్వనిని శ్రాద్ధమందు బ్రాహ్మణునిగా బిలిచిపెట్టవలెను, ఎవనికి పెట్టగూడదో తెలుపుమన మార్కండేయుడనియె. వివాహముకానిదానికి బుట్టినవాడు పౌనర్భవుడు శూద్రస్త్రీ మగడు దురాచారుడు వాణిజ్యముచేత ఆయుధముచేత జీవించువాడు వార్ధుషికుడు శూద్రపురోహితుడు పర్వకారుడు సూచి ఉన్నవాడు తిథులు నక్షత్రాలు చెప్పి జీవించువాడు వైద్యవృత్తి సేయువాడు వేదవిక్రయి వేదనిందకుడు తర్కశాస్త్రదగ్ధుడు నాస్తికుడు ధర్మదూరుడు తండ్రితో వివాద పడువాడు పెక్కుమందికి (సామూహిక) ఉపనయనములు చేయించువాడు అపాత్రునిచే యజ్ఞము సేయించువాడు దొంగ యక్ష్మ వ్యాధిగలవాడు జూదరి శ్విత్రి (బొల్లిగలవాడు) కాణుడు గ్రుడ్డివాడు చెవిటివాడు కుణి పరపూర్వాపతి (జారిణి మగడు) గ్రామ నౌకరు పరివేత్త (అన్నకు పెండ్లికాకుండ పెండ్లైనవాడు) వానికి కన్యనిచ్చినవాడు వాని యాజకుడు సోమవిక్రయి కూట సాక్షి దుష్టవాక్కు పరదారుడు వికృతకర్ముడు దైవికముగ నగ్నిభ్రష్టుడు (జఠరాగ్నిలేనివాడేమో) లోకవిరుద్ధులను గన్నవాడు హీనాంగుడు అధికాంగుడును దుష్టచర్మముగలవాడు దమకుడు పాతకోపపాతకములుకలవాడు శత్రుడును మిత్రుండును (వీరిద్దరు మిక్కిలి నింద్యులు). ఇక పంక్తిపావనులైన (పంక్తిలో గూర్చున్న పంక్తిలో నందరిని బవిత్రులంజేయగలవారు) బ్రాహ్మణులం జెప్పెద వినుము.

బ్రహ్మదేయాను సంతానః తపస్వీ విజితేంద్రియః ।పారగోయజుషాంయశ్చ సామవేదస్య పారగః ॥ 13
ఋగ్వేదపారగో యశ్చ భృగ్వంగి రసపారగః । అథర్వ శిరసోఽధ్యేతా త్రిసువర్ణస్య పారగః ॥ 14
త్రిణాచికేతః పంచాగ్ని ధర్మశాస్త్ర విశారదః । పురాణపారగో యశ్చ ఇతిహాస విశారదః ॥ 15
అధీతే సోత్తరం యశ్చ విష్ణుధర్మ మిదంశుభమ్ । విజానాతి యథా వచ్చ యశ్చ వ్యాకరణం నృప ! 16
జ్యోతిషశ్చ తథా వేత్తా ఆయుర్వేద స్యచద్విజః । తాభ్యాంవృత్తింనచేత్కుర్యాద్వ్రుతిస్తా భ్యాం విగర్హితా ॥ 17
ఆహితాగ్నిశ్చయో విద్వాన్ సోమపశ్చద్వి జోత్తమః । గురు శుశ్రూషణ పరస్తీర్థ పూతశ్చయాదవః
గాయత్రీ జాపనిరతో యోగీధ్యాన పరాయణః ॥ 18
యస్యావ్యనంతేజగతా మధీశే భక్తిః పరాయాదవ! దేవదేవే ।
తస్మాత్పరం నాపరమస్తి కించిత్ పాత్రంత్రిలోకే పురుష ప్రవీరః 19

ఇతి శ్రీ విష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
పాత్రాపాత్ర పరీక్షా విధిర్నామ త్రిచత్వారింశదుత్తర శతతమోఽధ్యాయః.

బ్రహ్మదేయాను సంతానుడు = బ్రహ్మణే "పరబ్రహ్మర్పణమస్తు" అని పరబ్రహ్మకు సమర్పణముగా దేయం=ఇవ్వబడినది. శ్రౌతస్మార్తాది కర్మ. దాని అను=అనుసృత్య అనుసరించి ప్రవృత్తమైన సంతానం = పితృపితామహాది సంతతిగలవాడు అనగా పరబ్రహ్మ ప్రీతిగా కర్మానుష్ఠానులైనవారి వంశమునబుట్టినవాడు-లేదా బ్రహ్మ = వేదము కర్మ-ఉపాస-జ్ఞానరూపకాండ త్రయాత్మకము యథాధికారం = వేదవేదార్థ విదులచే శ్రేయోర్థులకు ఉత్తమాధికారులకు దేయః = ఇవ్వదగినది. అట్టివారిని అను = అనుసరించి ప్రవృత్తమైన సంతతి కలవాడు అనగా పరం పరబ్రహ్మ విద్యా గురుశిష్య సంప్రదాయాను గతుడైనవాడు. అతడు పంక్తి పావనుడని భావము. మొత్తముమీద మొట్టమొదటి యర్థములో అనూచాన శ్రౌత స్మార్తాది కర్మానుష్ఠాత యని రెండవ సమన్వయార్థములో అనూచాన సగుణ నిర్గుణ బ్రహ్మవిద్యాభిజ్ఞుడనియు తేలిన యీ యిద్దరును పంక్తి పావనులని ఫలితార్థము.

తపశ్శాలి జితేంద్రియుడు యజుర్వేదపారగుడు సామవేద విశారదుడు ఋగ్వేద పారగుడు భృగ్వంగిరస పారగుడు అథర్వ శిరోధ్యయన మాచరించినతడు త్రిసుపర్ణ వేత్త త్రిణాచికేతుడు పంచాగ్ని ధర్మశాస్త్ర విశారదుడు పురాణేతిహాస పారంగతుడు. ఈ విష్ణు ధర్మోత్తరముతో శుభదమై విష్ణుపురాణ మధ్యయనము సేసినయతడు వ్యాకరణవేత్త జ్యోతిశ్శాస్త్రాయుర్వేదములు దెలిసినవాడు. వానివలన (వృత్తి) జీవనము సేయనివాడు (జ్యోతిషాయుర్వేదముల వలన జీవనము బహునింద్యము) ఆహితాగ్ని విద్వత్సోమయాజి గురుశుశ్రూషాపరుడు తీర్థపూతుడు (తీర్థయాత్రలను సేవించినవాడు) గాయత్రీజప తత్పరుడు యోగి ధ్యానపరుడు. ఎవని కనంతుడు జగదధీశుడగు దేవదేవుని యందు పరమభక్తిగలదో వానికిపైని క్రిందనుగూడ ముల్లోకములందు నేకొంచెము లేదు.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున పాత్రాపాత్ర నిరూపణమను నూటనలుబదిమూడవ అధ్యాయము.

## నూటనలుబదినాల్గవ అధ్యాయము - శ్రాద్ధ దేశానుకీర్తనము

కస్మిన్ బహుఫలం శ్రాద్ధం దేశేబ్రాహ్మణ పుంగవ । ఏతత్సర్వం సమాచక్ష్వ భవాన్ బ్రహ్మేవాపరః ॥ 1
గయాశీర్షవటే శ్రాద్ధమక్షయ్యం పరికీర్తితమ్ ॥ యదర్థమేషా చరతి గాథాలోకే పురాతనీ ॥ 2
ఏష్టవ్యా బహవః పుత్రాయద్యేకోఽపిగ యాంవ్రజేత్ । యజేతవాఽశ్వమేధేన నీలంవావృషముత్సృజేత్ ॥ 3
పుష్కరేష్వక్షయం శ్రాద్ధం ప్రయాగేనైమిషేతథా ।వారాణస్యాం ప్రభాసేచ కురుక్షేత్రే సమంతతః ॥ 4
సంనిహత్యాం విశేషేణ రాహుగ్రస్తే నిశాకరే । (రాహుగ్రస్తే దినకరే సన్నిత్యాంపార్థివోత్తమః) ॥ 5
శ్రాద్ధంకృత్వా సమాప్నోతి రాజసూయ శతం నరః । అశ్వమేధ సహస్రస్య సమ్యగిష్టస్య యత్ఫలమ్ ॥ 6

స్నాత ఏవతదాప్నోతి కృత్వాశ్రాద్ధం సమానవః । సర్వేషు దేవలోకేషు కామచారీ విరాజతే ॥ 7
పద్మవర్ణేన యానేన కింకిణీ జాలమాలినా । దేవరామాగణాఢ్యేన వీణామురజనాదినా ॥ 8
దివ్యశ్వేతాశ్వయుక్తేన కామగేన యథాసుఖమ్ । ఆభూతసంప్లవం యావత్క్రీడ త్యప్సరసాం గణైః ॥ 9
కృతకృత్యశ్చ భవతి పితౄణామనృణస్తథా । శ్రాద్ధం తథా పితౄణాం చ నోపయుజ్యేతవై పునః ॥ 10
యత్రక్వచన గంగాయాంశ్రాద్ధ స్యానంత్య ముచ్యతే । యమస్య భగినీ దేవీ యమునా పాపనాశినీ ॥ 11
యత్రక్వచన తస్యాంహి శ్రాద్ధ స్యానంత్య ముచ్యతే । పితౄణాందుహితా రాజన్నర్మదా సరితాంవరా ॥ 12
తస్యాస్తీరేతథానంతం శ్రాద్ధం సర్వత్ర పార్థివః । అక్షయ్యంచ తథా శ్రాద్ధ మమరాంతిక పర్వతే ॥ 13
వరాహ పర్వతే రాజన్ శ్రాద్ధ స్యానంత్య ముచ్యతే । హిమవాన్పర్వత శ్రేష్ఠః శంకరశ్వశురోగిరిః ॥ 14
ఆకరః సర్వరత్నానాం సర్వసత్త్వ సమాశ్రయః । తాపసానా మధీవాసః శ్రాద్ధం తత్రాక్షయంభవేత్ ॥ 15

వజ్రుడు స్వామీ! నీవపరబ్రహ్మవు. కావున శ్రాద్ధయోగ్యమయిన దేశమును ఆనతిమ్మన మార్కండేయుడనియె. గయా శీర్ష వటమునందలి శ్రాద్ధ మక్షయ్యము. దానికొరకేపురాతనగాథ వ్యాప్తిలోనున్నది. పెక్కుమంది పుత్రులుకావలెనని కోరదగును. ఒక్కడేని గయకు వెళ్ళును. అశ్వమేధముసేయును. నల్లయెద్దును విడుచును. నీలవృషభోత్సర్జనము (అచ్చుబోసి యాబోతును వదలుట) గావించును అను భావముతో నిట్లు కోరవలెనన్నమాట) పుష్కర క్షేత్రము లందు ప్రయాగ నైమిశారణ్యము వారణాసి (కాశి) ప్రభాసము కురుక్షేత్రమందు రాహుగ్రస్తగ్రహణముపట్టిన తావున శ్రాద్ధముపెట్టి నూరు రాజసూయముల పేయి యశ్వమేధముల ఫలమందును. సర్వలోకములందు స్వేచ్ఛాసంచారి కాగలడు. శ్రాద్ధము పెట్టెడివాడు స్నానము సేయగానే పద్మము రంగుగలది కింకిణీజాలమాలికలతోగూడినది దేవతా సుందరీ సుందరము వీణామురజాది మంగళవాద్యనాదితము దివ్య శ్వేతాశ్వయుక్తము కామగమునైన విమానమునందు ఆభూత సంప్లవము భూతప్రలయముదాక యప్సరోగణములతో విహరించును. పితౄణము తీరి కృతకృత్యుడగును. గంగాతీరమందెక్కడపెట్టినను దానితో సమానమేదిలేదు. అది యనంతఫలదము యమునానది యముని చెల్లెలు. పాపనాశిని. తత్తీరమందెటనేని పెట్టిన శ్రాద్ధమనంత ఫలదము. పితృదేవతల కూతురు నర్మద. సరిద్వర. ఆ నదీతీరమందు పెట్టిన శ్రాద్ధమనంతము. అమరాంతిక పర్వతమునగూడ అక్షయ్యము. వరాహాద్రియందు శంకరుల మామగారగు హిమవత్పర్వతమందు అనంతఫలదము. ఆపర్వతము సర్వరత్నాకరము. సర్వసత్త్వాశ్రయము. తాపసుల వది నివాసము అక్కడి శ్రాద్ధమక్షయ్యము.

ఏవమాదిషు తీర్థేషు పర్వతేషు సరిత్సుచ । సరోవరేషు ముఖ్యేషు ఋషీణా మాశ్రమేషుచ ॥ 16
నిర్ఝరేషు తథా రణ్యే నదీనాం ప్రభవేషుచ । సంగమేషుచ ముఖ్యేషు పులినేషు విశేషతః ॥ 17
ఉద్యానేషు విచిత్రే షు సైకతేషు సమేషుచ । శాద్వలేషు చ రమ్యేషు గిరీణాం కందరాసుచ ॥ 18

గహ్వరేషు నితంబేషు చ్ఛాయాయాం కుంజరస్యచ । మహీగతాంతర న్యస్త గజ చ్ఛాయాసు పార్థివ । 19
యః కుర్యాదపరాహ్ణేతు సకృచ్ఛ్రాద్ధం ప్రయత్నతః । అక్షయ్య మన్నపానం తు పితౄణాం చోపతిష్ఠతే ॥ 20
గోమయే నోపలిప్తేషు శ్రాద్ధం కార్యం గృహేషుచ । మనోజ్ఞేషు విచిత్రేషు రుచిరేషూత్త మేషుచ ॥ 21
దేవాయ తన గోష్ఠేషు శ్రాద్ధం బహుఫలం భవేత్ । 22
తీర్థానియానీహ నరేంద్రచంద్రః లోకేపురాణైః పరికీర్తితాని ।
తీరేషు తేషాం విధివత్ప్రదాయ శ్రాద్ధం నశోచేన్మరణంజితాత్మా ॥ 23

ఇతి శ్రీవిష్ణు ధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
శ్రాద్ధదేశాను కీర్తనం నామ చతుశ్చత్వారింశదుత్తర శతతమోఽధ్యాయః.

ఇవి మొదలగు తీర్థములు పర్వతములు నదులు ముఖ్య సరోవరములు ఋష్యాశ్రమములు నిర్ఝరములు (కొండవాగులు సెలయేళ్ళు) నదులు పుట్టిన యరణ్యములు ముఖ్య నదీ సంగములు పులినములు విచిత్రోద్యానములు సైకతములు ఇసుకతిన్నెలు, రమ్యములైన పచ్చికబయళ్ళు కొండచరియలు గహ్వరములు పర్వతనితంబము గజచ్ఛాయయందు, భూమిలోపలనున్న గజచ్ఛాయ అందు సపరాహ్ణమందెప్పటొక్కమారేని సప్రయత్నము శ్రాద్ధము నొనరించుమనేని యాయన్నపానములు పితరుల కక్షయ్యమైనుట్టును. ఆవుపేడతో అలికిన చక్కని విచిత్రములు రుచిరములు నుత్తమములయిన యిండ్లయందు దేవాలయములందు గోశాలలందు పెట్టిన శ్రాద్ధము బహుఫలమగును. ఓ నరేంద్రచంద్రా! పురాణములందు బరికీర్తితములయిన తీర్థములేవేవి యీ భారతభూమి నున్నవి వానివానియందు యథావిధి శ్రాద్ధము పెట్టినతడు మనసు నిగ్రహముపొంది మరణమునుగూర్చి శోకింపడు.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున శ్రాద్ధదేశానుకీర్తనమను నూటనలుబదినాల్గవ అధ్యాయము.

## నూటనలుబదియైదవ అధ్యాయము - అశూన్యశయన ద్వితీయావ్రతవర్ణనము

మార్కండేయ ఉవాచ :

అతః పరం ప్రవక్ష్యామి పితృభిర్యాః ప్రకీర్తితాః ।గాథాః పార్థివ శార్దూలః కామయద్భిః పురేస్వకే ॥ 1
అపిస్యాత్సకులేఽస్మాకం యోనోదద్యాజ్జలాంజలిమ్ । నదీషు బహుతోయాసు శీతలాసు విశేషతః ॥ 2
అపిస్యాత్సకులేఽస్మాకం హిమమిశ్రం జలాంజలిమ్ । తిలమాక్షిక సంయుక్తం యోనోదద్యాత్సమాహితః ॥ 3
అపిస్యాత్సకులేఽస్మాకం యోనోదద్యాచ్చ భక్తితః । పాయసం మధుసమ్మిశ్రం వర్షాసు చ మఘాసుచ ॥ 4
దాల్భ్యఉవాచ :
పత్న్యై నృణాం మునిశ్రేష్ఠః యోషితాంచ తథా నరాః । తచ్ఛ్రోతు మిచ్ఛా విప్రర్షేః విధవాస్త్రీ నజాయతే ॥ 5
ఉపోషితేన యేనాగ్ర్యః పత్న్యా న రహితో నరః ॥ 6

మార్కండేయుడు పితృదేవతలు కోరి తమపురమున కీర్తించిన గాథలను దెల్పెద. మాకు బహూదకములయిన జలాంజలి (చల్లనినదులలో) నొసగువాడు మాకులములో గల్గునా? మంచుగలిపినది, నువ్వులు తేనెయుం గూడిన జలాంజలి (తర్పణము) సేయువాడు మాపటుంబమున బుట్టునో భక్తితో లేనెకలిపిన పాయసమును వర్షర్తువున మఘానక్షత్రమందు మాకు నివేదించువాడు మాకులమున బుట్టునో అని యాగాథల యభిప్రాయము. దాల్భ్యుడనియె. భర్తలకు భార్యలు భార్యలకు భర్తలు వియోగము పొంద కుండుటకు స్త్రీకి వైధవ్యము కలుగకుండుటకు ఉపవాసమున్న పురుషుడు పత్నీవియోగము పొందకుండుట కుపాయము సెప్పుమన పులస్త్యుం డశూన్య శయన ద్వితీయా వ్రతమందుఱకు గావింపవలయు నదివినుము.

పులస్త్య ఉవాచ :
అశూన్యశయనాం నామ ద్వితీయాం శృణు భో ద్విజ!
యాముపోష్యన వైధవ్యం ప్రయాతి స్త్రీ ద్విజోత్తమః । పత్నీ వియుక్తశ్చనరో న కదాచిత్ప్ర జాయతే ॥ 7
శేతేజల నిధౌకృష్ణః శ్రియా సార్ధం యదాద్విజః అశూన్యశయనా నామ తదా శ్రాద్ధేహి సా తిథిః ॥ 8
కృష్ణపక్ష ద్వితీయాయాం శ్రావణే ముని సత్తమః ఇమముచ్చారయేన్మంత్రం ప్రణమ్య జగతః పతిమ్ ॥ 9
శ్రీవత్స ధారిణం శ్రీశం భక్త్యాఽభ్యర్చ్య శ్రియాసహ । శ్రీవత్సధారిన్! శ్రీకాంత! శ్రీధామన్ శ్రీపతేఽచ్యుత! 10
గార్హస్థ్యం మా ప్రణాశం మేయాతు ధర్మార్థకామదః అగ్నయోమా ప్రణశ్యంతు మా ప్రణశ్యంతు దేవతాః ॥ 11
పితరో మాప్రణశ్యంతు మత్తోదాంపత్య భేదతః । లక్ష్మ్యా వియుజ్యతే దేవనకదాచి ద్యథాభవాన్ ॥ 12
తథాకలత్ర సంబంధో దేవమేనైవభిద్యతు । లక్ష్మ్యాహ్యశూన్యం వరదః యథాతే శయనం సదా ॥ 13

శయ్యామమాప్యశూన్యాఽస్తు తథైవ మధుసూదనః ఏవం ప్రసాద్య పూజాంచ కృత్వాలక్ష్మ్యాస్తథా హరేః ॥ 14
ఫలానిదద్యాచ్ఛాయాయామ భీష్టాని జగత్పతేః । నక్తంప్రణమ్యాయతనే హవిర్భుంజీత వాగ్యతః ॥ 15
బ్రాహ్మణాయద్వితీయేఽహ్ని శయ్యాందద్యాత్సదక్షిణామ్ । ఏవంకరోతియః సమ్యఙ్నరో మాసచతుష్టయమ్ ॥ 16
తస్య జన్మత్రయేదాల్భ్య! గృహభంగోన జాయతే । అశూన్య శయనశ్చాసౌ ధర్మ కర్మార్థ సాధకః ॥ 17
భవత్య వ్యాకృతైశ్వర్యః పురుషోనాత్ర సంశయః । నారీచదాల్భ్య ధర్మజ్ఞ! వ్రతమేత ద్యథావిధి ॥ 18
యాకరోతినసాశోచ్యా బంధువర్గస్య జాయతే । వైధవ్యం దుర్భగత్వంవా భర్తృవ్యంగ్యంచ సత్తమ ॥ 19
నాప్నోతి జన్మత్రితయ మేతచ్చీర్త్వా పతివ్రతా । 20

ఇతి శ్రీవిష్ణు ధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
అశూన్యశయన ద్వితీయా వర్ణనం నామ పంచచత్వారింశ దుత్తర శతతమోఽధ్యాయః.

ఓ విప్రోత్తమ అశూన్య ద్వితీయనాడుపవాస ముండిన స్త్రీపురుష లన్యోన్యవియోగము పొందరు. కృష్ణుడు లక్ష్మితో సముద్రమున నిద్రవోవు తిథి "అశూన్య శయన తిథి" యనబడును. అది శ్రాద్ధమునకు చాలప్రశస్తము. అది శ్రావణబహుళ ద్వితీయ. ఆనాడు జగత్పతిని మ్రొక్కి యీమంత్రము పఠింపవలెను. దీనిభావము శ్రీవత్స చిహ్నమును దాల్చిన శ్రీపతిని శ్రీదేవితోగూడ భక్తితో బూజించి, శ్రీవత్సధారీ! శ్రీకాంత! శ్రీధామ! శ్రీపతే! అచ్యుత! ధర్మార్థకామద! దాంపత్య భేదముచే నావలన నాగార్హస్థ్యము నశింపకుండుగాత! అగ్నులు నశింపకుండుగాక! దేవతలు నశింపకుండుగాక! పితృదేవతలు నశింపకుందురుగాక. తమరు లక్ష్మితో నెన్నడుగాని వియోగము పొందకుండునట్లు నాకు కలత్ర సంబంధమెన్నడుగాని విడిపడకుండుగాక! ఓ వరద! నీ శయనము (పాన్పు) లక్ష్మీదేవితో నెన్నడు శూన్యము కానట్లు మధుసూదన! నా శయ్యయును అశూన్యమగుగాక! అనియిట్లు హరిం బ్రసన్నుం గావించి లక్ష్మితో హరింబూజించి ఛాయయందు (ఎండయుండగా, పగలు.) ఫలములు నివేదించి, రాత్రి మరల దేవతా గృహమునందు నమస్కరించి హవిస్సును మౌనముతో భుజింపవలెను. మరునాడు దక్షిణతో బ్రాహ్మణునికి శయ్యాదానము సేయవలెను. ఇట్లీనరుడు నాల్గుమాసములీ వ్రతము సేయునో యతనికి మూడు జన్మములు గృహభంగము కలుగదు. అశూన్య శయన వ్రతము ధర్మకర్మ సాధకము. మానవుడు దీనిచే నవ్యాకృతైశ్వర్య సంపన్నుడు గాగలడు. స్త్రీకూడ యీ వ్రతము సేసినది బంధువులకు శోకింపవలసినది గాదు. దాల్భ్య! ఆ పతివ్రత వైధవ్యము దౌర్భాగ్యము భర్తృ విరహమును మూడు జన్మలు పొందదు.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున అశూన్యశయన ద్వితీయావ్రతవర్ణనమను
నూటనలుబదియైదవ అధ్యాయము.

## నూటనలుబది యారవ అధ్యాయము - కృష్ణ యుధిష్ఠిర ధర్మప్రసంగమున వృషోత్సర్జన వృషభలక్షణ వర్ణనము

దాల్భ్యఉవాచ :

ఉపవాసాశ్రితం సమ్యగ్లోక ద్వయ ఫలప్రదమ్ । కథితం భవతా సర్వం యత్పృష్టోఽసిమయాద్విజ ॥ 1
అన్యదిచ్ఛామ్యహం శ్రోతుంతద్భవాన్ప్ర బ్రవీతుమే । సంసారహేతుంముక్తించ సంసారాన్మునిసత్తమ ॥ 2
పులస్త్య ఉవాచ :

అవిద్యా ప్రభవం కర్మ హేతు భూతం ద్విజోత్తమ । సంసారస్యాస్యతన్ముక్తిః సంక్షేపాచ్ఛ్రూయతాంమమ ॥ 3
స్వజాతివిహితం కర్మ రాగద్వేషాది వర్జితమ్ । కుర్వతః క్షీయతే పూర్వమన్య బంధశ్చనేష్యతే ॥ 4

అపూర్వ సంభవాభావాత్ క్షయంయాతేతు కర్మణి । దాల్భ్యసంసార విచ్ఛేదః కారణాభావసంభవః ॥ 5
భవత్య సంశయంచాన్య చ్ఛ్రూయతా మత్రకారణమ్ । సంసార విచ్యుతేర్దాల్భ్య సమాసాద్వదతోమమ॥ 6
గృహీతా కర్మణాయేన పుంసా జాతి ర్ద్విజోత్తమ! తత్ప్రాయశ్చిత్త భూతం వైశృణు కర్మక్షయావహమ్ ॥ 7
బ్రాహ్మణ క్షత్రియ విశాం తథాంత్యానాం చసత్తమ । స్వజాతి విహితం కర్మ రాగద్వేషాది వర్జితమ్ ॥ 8
జాతి ప్రదస్యాక్షయదం తదేవాద్యస్య కర్మణః । జ్ఞాన కారణ భావంచ తదేవ ప్రతిపద్యతే ॥ 9
పుమాంశ్చాధి గతజ్ఞానో భేదంనాప్నోతి సత్తమ! బ్రహ్మణా విష్ణు సంజ్ఞేన పరమేణా వ్యయాత్మనా ॥ 10
ఏతత్తే కథితం దాల్భ్య! సంసారస్య సమాసతః । కారణం భవముక్తిశ్చ జాయతే యోగినోమమ ॥ 11
మార్కండేయ ఉవాచ :
ఇతిదాల్భ్యః పులస్త్యేన యథా వత్ప్రతి బోధితః । ఆరాధయామాస హరిం లేభే కామాంశ్చ వాంఛితాన్ ॥ 12
తథాత్వమపి రాజేంద్ర! కేశవారాధనం కురు । ఆరాధ్యతం జగన్నాథం నకశ్చి దవసీదతి ॥ 13
ఏ తస్మయోక్తం సకలం తవభూమిప! పృచ్ఛతః । అనారాధ్యా చ్యుతం దేవం కః కామానాప్నుయాన్నరః ॥ 14
వజ్ర ఉవాచ :
భగవానవ తీర్ణోఽ భూన్మర్త్యలోక మిహాచ్యుతః । భారావతారణార్థాయ భువో భూమిపతిర్హరిః ॥ 15
మానుషత్వేచ గోవిందో మమ పూర్వపితామహః । చకార ప్రీతి మతులాంపాండు పుత్త్రైః సహ ద్విజ ॥ 16
సారథ్యం కృతవాంశ్చైవ తేషాం సర్వేశ్వరో హరిః । నిస్తీర్ణో యేన భీష్మౌఘః కురుసైన్య మహోదధిః ॥ 17
ధన్యాస్తే కృతపుణ్యాశ్చ తే మే పాండు సుతా మతాః । వివిశుర్యే పరిష్వంగై ర్గోవింద భుజపంజరమ్ ॥ 19
రాజ్యహేతోరరీన్ జఘ్నురకస్మాత్పాండు నందనాః । సప్తలోకైక నాథేనయే భవంత్యేక శాయినః ॥ 20
ఆత్మానమను గచ్ఛామి భగవంత మకల్మషమ్ । జాతంనిర్ధూ తపాపేఽస్మిన్ కులే విష్ణు పరిగ్రహే ॥ 21
ఏవం దేవ వరస్తేషాం ప్రసాదసు ముఖోహరిః । పృచ్ఛతాం కచ్చిదాచష్ట కించిద్గుహ్యం మహాత్మనామ్ ॥ 22
గుహ్యాన్ జనార్దనం యాంస్తుధర్మ పుత్త్రోయుధిష్ఠిరః । పప్రచ్ఛ ధర్మా నఖిలాంస్తాన్నమా ఖ్యాతు మర్హసి ॥ 23
ధర్మార్థకామ మోక్షేషు య ద్గుహ్యంమధు సూదనః । తేషామవోచద్భగవాన్ శ్రోతు మిచ్ఛామి తత్త్వతః ॥ 24

దాల్భ్యుడు ఉపవాసముతో గూడిన నుభయలోక ఫలసాధనమైన వ్రతము నీవు తెలిపితివి. మరియు కొన్ని విశేషములెఱుంగ గోరెద నానతిమ్ము. సంసారకారణము సంసార ముక్తింగూర్చి వినగోరెదనన పులస్త్యుండిట్లనియె. అవిద్యవలన సంసార హేతువైన కర్మ మేర్పడినది. ఆ కర్మ విముక్తినిగూర్చి వినుము. తనజాతికి విధింపబడిన కర్మము రాగద్వేషములు లేకుండ జేసినవానికి ప్రారబ్ధము వర్తమానమునైన కర్మము క్షీణించును. అపూర్వము పుట్టుటలేదుగావున కర్మక్షయముకాగానే సంసారబంధము తెగిపోవును. కారణములేని కార్యముండదుగద! సంసార విచ్యుతిని సంగ్రహపరచి చెప్పెదను వినుము. మానవుడు మున్నుజేసిన ఏకర్మమువలన జాతిని గ్రహించెనో(పుట్టెనో) ఆ కర్మమునకు బ్రాయశ్చిత్తమైనది కర్మక్షయకారకమైనది. బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు శూద్రులకు అంత్యులకు గూడ సజాతి విహితకర్మము రాగము ద్వేషము లేకుండ చేయవలసినదున్నది. (అదే స్వధర్మ మనబడును) జన్మకారణమైన ప్రారబ్ధము నది క్షయింపసీయదు. అది జ్ఞానమునకు గారణముకాదు. జ్ఞానము వడసిన యాతడు విష్ణువను పేరుగల అవ్యయమైన పరబ్రహ్మతో భేదము పొందడు. సంసార కారణము ముక్తికలుగు మార్గమునిది నీకు వచించితిని అనెను. ఇట్లు దాల్భ్యుడు పులస్త్యునిచే యథాతథముగా బోధింపబడి హరిని గొలిచి యభీష్టములను బడసెను. అట్లే ఓ వజ్రమహారాజా! కేశవు నర్చించి ధన్యుడవుగమ్ము. అచ్యుతునారాధింపక యెవ్వడభీష్టముల నందగలడు? అనిమార్కండేయుడన వజ్రుండు భగవంతుడు భూభారహరణమునకీ మానవలోకము నందవతరించినాడు. నాకు ప్రపితామహుడగు గోవిందుడప్పుడు పాండవులకెంతో ప్రీతినికూర్చెను. సర్వేశ్వరుడు వారికి రథముకూడ తోలెను. భీష్ముడను ప్రవాహముగల కురుసైన్య మహాసముద్ర మాయనవలన వారు దాటిరి. అన్నియెడల నాయన పాండవులకు తండ్రివలె నుపకరించెను. వారాతని గౌగలించుకొని యా గోవిందుని భుజపంజరమందు జొచ్చి భద్రముగ నుండిరి. రాజ్యముకొరకు శత్రువు నవలీలగ గూల్చిరి. సప్తలోకముల కేకైక నాథుడగు భగవంతునితో నొక్కశయ్యం బఱుండిరి.

విష్ణుశరణమై పాపమువాసిన యీ మా యమవంశమున నవతరించిన యా భగవంతుని పరమాత్మ నే ననుసరించెదను. ఇట్లు ప్రసన్నుడై యా మహానుభావులకేదేని యుంచుక రహస్యమునుపదేశించెనా? ధర్మపుత్రుడు యుధిష్ఠిరు డేమేని ధర్మరహస్యముల నా పరమాత్మ నడిగెనా? ధర్మాది పురుషార్థ రహస్య విషయములను వారికి భగవంతుడానతిచ్చిన వానిని విన గుతూహలపడుచున్నానన మార్కండేయుడనియె.

మార్కండేయ ఉవాచ :

బహూనిధర్మ గుహ్యాని ధర్మ పుత్త్రాయ కేశవః । పురా ప్రోవాచ రాజేంద్ర ప్రసాద సుముఖోహరిః ॥ 25

శరతల్ప గతాద్భీష్మా ద్ధర్మాంశ్ఛ్రుత్వాయుధిష్ఠిరః । పృష్టవాన్య జ్జగన్నాథం తన్మే నిగదతః శృణు ॥ 26

కృష్ణుడు మున్ను ధర్మజునకెన్నో ధర్మగుహ్యములను అనుగ్రహ సుముఖుడై వచించెను. శరతల్పగతుడైన భీష్ముని వలన ధర్మములను విని యైదవ యశ్వమేధమందవభృథస్నానము సేసిన ధర్మరాజు జగన్నాథుని కృష్ణునడిగిన యంశము చెప్పెదవినుము

పంచమేనాశ్వ మేధేన యదాస్నాతో యుధిష్ఠిరః ॥

యుధిష్ఠిర ఉవాచ : భగవన్వైష్ణవా ధర్మాః కింఫలాః కింపరాయణాః ॥ 27

కింకృత్య మధికృత్యైతే భవతోత్పాదితాః పురా । యదితే పాండవస్నేహో విద్యతే మధు సూదన ॥ 28

శ్రోతవ్యాస్తే మయాధర్మా స్తతస్తాన్కథయాఖిలాన్ । పవిత్రాశ్చ వయేధర్మాః సర్వపావప్రణాశనాః ॥ 29

తవవక్త్ర చ్చ్యుతాదేవ! సర్వధర్మేష్వను త్తమాః । తాంఛ్రుత్వా బ్రహ్మహాగోఘ్నః పితృఘ్నో గురుతల్పగః 30

సురాపో వాక్కృతఘ్నశ్చ ముచ్యతే సర్వకిల్బిషైః । ఏతన్మే కథితం సర్వం సభా మధ్యే సురోత్తమ! 31

వసిష్ఠాద్యైర్మహాభాగైర్మునిభిర్భావితాత్మభిః । తతోఽహం తవదేవేశ ! పాదమూలముపాగతః ॥ 32

ధర్మాన్కథయతాన్దేవ! యద్యహంభవతః ప్రియః । శ్రుతా మేమాన వాన్ధ ర్మా న్వాసిష్ఠాన్వా మహాఫలాన్ ॥ 33

వరాశరకృతాంశ్చైవ తథాఽత్రేయస్య ధీమతః । శ్రుత్వాశంఖస్యగార్గ్య స్య లిఖితస్యయమస్యచ ॥ 34

జాబాలేశ్చ మహాబాహోర్మునేర్ద్వైపాయ న స్యచ । ఉమామహేశ్వరాశ్చైవ జాతిధర్మాశ్చ పావనాః ॥ 35

గుణస్య గుణ బాహోశ్చ కాశ్యపేయా స్తథైవచ । బహ్వీయన కృతాశ్చైవ శాకునేయా స్త థైవచ ॥ 36

అగస్త్య గీతా మౌద్గల్యాః శాండిల్యాః సౌరభా స్తథా । భృగోరంగిరసశ్చైవ కశ్యపోద్దాల కోదితాః ॥ 37

సుమంతా జైమినీ యాశ్చ పైలస్యచ మహాత్మనః । వైశంపాయన గీతాశ్చ పిప్పలాద కృతాశ్చయే ॥ 38

ఐంద్రాశ్చ వారుణాశ్చైవ కౌబేరావాత్స్య పౌణకాః । ఆపస్తంబకృతా ధర్మా స్తథా గోపాలకస్యచ ॥ 39

భృగ్వంగిరః కృతాశ్చైవ సౌరాహారీత కాస్తథా ।

శ్రీభగవానువాచ : శృణురాజన్! మహాబాహో! ధర్మాత్మన్కురు నందన! ॥

భగవంతుడా ! విష్ణుభక్తులయొక్క ధర్మములకు ఫలమేమి? వాని పరమ లక్ష్యమేమి? ఏ కృత్యము నుద్దేశించి నీవు వీని నేర్పరచితివి మాయెడ నీకు చెలిమిగలదేని యవి యానతిమ్ము నే వినవలయును. నేను నీ కిష్టుడనేని యా పవిత్ర ధర్మములను నీ ముఖమున విననెంచెద. వానినివిని బ్రహ్మఘ్నుడు గోహంత పితృఘాతకుడు గురుతల్పగుడు సుర త్రాగినవాడు కృతఘ్నుడును సర్వ కిల్బిషములను బాయును వశిష్ఠాది మహానుభావు లాత్మభావనులు మునులీ యంశమును నాసభలో సెలవిచ్చినారు. అందువలన నేను నీ పాదములచెంత కేతెంచితిని. నేను మను వశిష్ఠ పరాశర ఆత్రేయ శంఖ గార్గ్య లిఖిత యమ జాబాలి మహాబాహు ద్వైపాయన ఉమా మహేశ్వర గుణ గుణబాహు కాశ్యప బహ్వీయన శకున అగస్త్య ముద్గల శండిల సురభ భృగు అంగిరః కశ్యప ఉద్దాలక సుమంత జైమిని పైల వైశంపాయన పిప్పలాద ఇంద్ర వరుణ కుబేర వాత్స్యపుణక ఆపస్తంబ గోపాల సూర్య హారీతక ప్రభృతులగు మహర్షులానతిచ్చిన ధర్మములను విన్నానన భగవంతుండు రాజా! వినుమనియె

ధర్మవృద్ధి కరం వచ్మి వృషభస్యతులక్షణమ్ । ఋషభః ససముద్రాఖ్యః సతతం కులవర్ధనః ॥ 41

మల్లికాపుష్ప చిత్రశ్చ ధన్యోభవతి పుంగవః । కామలైర్మండలైశ్చాపి చిత్రోభవతి భోగదః ॥ 42
అతసీపుష్ప వర్ణశ్చ తథా ధన్యతరః స్మృతః । ఏతేధన్యాస్తథా ధన్యాన్కీర్తయిష్యామి తేనృప ॥ 43
కృష్ణతాల్వోష్ఠదశనా రూక్ష శృంగశ ఫాశ్చయే । అవ్యక్త వర్ణా హ్రస్వాశ్చ వ్యాఘ్ర భస్మని భాశ్చయే ॥ 44
ధ్వాంక్షగృధ్ర సవర్ణాశ్చ తథా మూషకసం నిభాః । కుబ్జాఃకాణా స్తథాఖంజాః కేక రాక్షా స్త థైవచ ॥ 45
విషమశ్వేత పాదాశ్చ ఉద్భ్రాంతనయనా స్తథా । నతేవృషాః ప్రయోక్తవ్యా నచధార్యా స్తథాగృహే ॥ 46
మోక్తవ్యానాంచ ధార్యాణాం భూయో వక్ష్యామి లక్షణమ్ ।। 47

ధర్మవర్ధనమైన వృషభము యుక్క లక్షణము దెలిపెద సముద్రమనుపేరి వృషభము కులాభివృద్ధిసేయును. మల్లిపువ్వు వలెనుండు కమలాకారమునైన ఎఱ్ఱని చుక్కలు (మండలములు) గలది భోగప్రదము. ఈరంగని నిర్ణయింపరానివి పొట్టివి పెద్ద పులిభస్మము కాకి గ్రద్ద ఎలుకల రంగుగలవి గుజ్జువి కాణములు ఖంజములు కుంటివి విషమముగా తెల్లగానున్న పాదములు గలవి, మిడిగ్రుడ్లు గలవియునగు నెడ్లు దానమీయదగవు. ఇంటనుండగూడదు, ఇందులకుచితమైన వృషభముల లక్షణమిదె దెల్పెద.

స్వస్తి కాకార శృంగాశ్చ మేఘౌఘ సదృశస్వనాః । మహాప్రమాణాశ్చ తథా మత్త మాతంగ గామినః ॥ 48
మహోరస్కా మహోచ్ఛ్వాసా మహాబల పరాక్రమాః । శిరః కర్ణాలలాటంచ వాలధిశ్చరణానిచ ॥ 49
నేత్రపార్శ్వేచ కృష్ణాని శస్యంతే చంద్రమస్త్విషః । చిహ్నాన్యేతాని శస్యంతే కృష్ణస్యతు విశేషతః ॥ 50
భూమింకర్షతి లాంగూలాత్ప్రశస్తః స్థూలవాలధిః । పురస్తాన్న తథా నీచో వృషభశ్చ ప్రశస్యతే ॥ 51
శక్తి ధ్వజ పతాకాభా యేషాం రాజిర్విరాజతే । అనడ్వాహస్తు తేధన్యా బుద్ధి సిద్ధి జయావహాః ॥ 52
ప్రదక్షిణం నివర్తంతే స్వయంయే వినివర్తితాః । సమున్నత శిరోగ్రీవా ధన్యాస్తే కోశవర్ధనాః ॥ 53
రక్తశృంగాగ్రనయనాః శ్వేతవర్ణాభవంత్యపి । శఫైః ప్రవాళసదృశై ర్నాస్తి ధన్యతరస్తతః ॥ 54
ఏతేధన్యాః ప్రయత్నేన మోక్తవ్యా యదివావృషాః । ధారితాశ్చ తథా ముక్తాధనధాన్య వివర్ధనాః ॥ 55
చరణానిముఖం పుచ్ఛం యస్యశ్వేతాని గోపతేః । లాక్షారససవర్ణశ్చ తంనీలమితినిర్దిశేత్ ॥ 56
వృషఏవ సమోక్తవ్యోన సంధార్యో గృహే భవేత్ । యదర్థమేషా చరతి గాథాలోకే పురాతనీ ॥ 57
ఏష్టవ్యా బహవః పుత్రాయద్యేకోఽపిగయాంవ్రజేత్ । యజేతవాఽశ్వమేధేన నీలంవా వృషముత్సృజేత్ ॥ 58
ఏవంవృషం లక్షణ సంప్రయుక్తం గృహోద్భవంక్రీత మథాపిరాజన్!
ముక్త్వాన శోచన్ మరణం మహాత్మా మోక్షంవిధించాహ మతోవిధాస్యే ॥ 59

ఇతి శ్రీవిష్ణు ధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
వృషలక్షణ వర్ణనం నామ షట్చత్వారింశదుత్తర శతతమోఽధ్యాయః.

స్వస్తికాకారమునకొమ్ములు మేఘమురిమినట్టి అంకెయుంగల్గి పెద్దప్రమాణమునునుండి మదపుటేనుగువలె నడచుచు పెద్దఱొమ్ము పెద్దయుచ్ఛ్వాసము గొప్పబలము పరాక్రమము తల చెవులు నుదురు తోక కాళ్ళునుంగలిగినవి కంటికొన నలుపుగలిగి చంద్రుని కాంతి గల వృషభములు విశేషించి నల్లనివిప్రశస్తములు. రోమరాజి(సుడి) తోక భూమి తాకుచుండునవి చాలశ్రేష్ఠములు. ముంగాళ్ళు పొట్టిగా లేనిది శక్తి ధ్వజము పతాక రూపమున నున్న యెడ్లు మంచివి. సమృద్ధిని కార్యసిద్ధిని జయమును నొసంగును. తోలినపుడు ప్రదక్షిణము గాదిరిగి నడచునవి ఉన్నతశిరస్సు మెడయుంగలవి ధన్యములు కోశమును(ధనమును)పెంపొందించును. ఎఱ్ఱని కనుగొలుకులగలవి యుత్తమములు. డెక్కపవడముల రంగులోనున్నవానిని మించినది మరిలేదు. ఇట్టివానిని అచ్చువోసి వదలినను ఇంట బెంచికొనినను ధనధాన్యసమృద్ధిసేయును. కాళ్ళు ముఖముతోక తెల్లగాను లక్కరంగులోనుగల వృషభరాజము నీలమనబడును. అదిఉత్సర్జనార్హము ఇంటనుంచుకొనరానిది. ఈవిషయమున నొక్క పురాతన గాథ ప్రచారమందున్నది. ఒక్కడేని గయకు వెళ్ళును. అశ్వమేథమైన

జేయును. నీలవృషోత్సర్జనమేని జేయునని పెక్కుమంది పుత్రులు గావలెనని కోరుకొనవలెను. రాజా ! ఇట్టి లక్షణములుగల యెద్దును చనయింటబుట్టిన దానినమ్మినను వదలినను నామహాత్ముడు మరణమన కేద్వడు. ఇక మోక్ష విషయమున విధి నెరింగింతును.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున కృష్ణ యుధిష్ఠిర ధర్మ ప్రసంగమున వృషోత్సర్జన వృషభ లక్షణ వర్ణనమను నూటనలుబదియారవ అధ్యాయము.

## నూటనలుబదియేడవ అధ్యాయము - వృషోత్సర్జన వర్ణనము

మార్కండేయ ఉవాచ :

ఆశ్వయుక్ కృష్ణ పక్షస్య పంచదశ్యాం నరాధిప । కార్తికేఽవ్యథవా మాసి వృషోత్సర్గం నరాధిప ॥ 1
గ్రహణేద్వేమహాపుణ్యే తథా చైవాయనద్వయమ్ । విషువద్వితయంచైవ మృతాహో బాంధవస్యచ ॥ 2
మృతాహోయస్య తస్యార్థే తస్మిన్నహని శంకరమ్ । సుసమిద్ధే గవాంమధ్యే పరి స్తీర్య హుతాశనమ్ ॥ 3
పయసాశ్రపయే ద్విద్వాంశ్చరుం పౌష్ణం సమాహితః । పూషాగా అన్వేతు నశ్చ పూష్ణేహుత్వానరాధిపః 4
ఇహరాడితి చ జపేద్రుద్రా న్సమాహితః । తథైవ పౌరుషం సూక్తం కూష్మాండాని నరాధిపః 5
తతః కోష్ణేన వృషభమయ స్కారః సుశిల్పవాన్ । శూలేన దక్షిణే పార్శ్వే వామే చక్రేణ నిర్దహేత్ ॥ 6
అంకితం స్నాపయేత్పశ్చా త్స్నానే తస్య తథా పఠేత్ । హిరణ్య వర్ణేతి ఋచశ్చత స్రోమను జేశ్వర! 7
ఆపోహిష్ఠేతి తిస్రశ్చ శన్నోదేవీతి చాప్యథ । వత్సతర్యశ్చతస్రశ్చ తంవృషంచ నరాధిపః 8
అలంకుర్యాత్తతః పశ్చాద్గంధ మాల్యైశ్చ శక్తితః । కింకిణీభిశ్చరస్యా భిస్తథా చీనాం శుకైః శుభైః ॥ 9
తతఃకర్తా జపేన్మంత్ర మిమం ప్రయతమానసః । వృషోహిభగవాన్ ధర్మశ్చతుష్పాదః ప్రకీర్తితః ॥
వృణోమి తమహంభక్త్యా సమే రక్షతు సర్వతః ॥ 10
ఏనం యువానం వృషభం దదామి గవాంపతిం యూథపతిం సధర్మమ్ !
అనేన సార్ధం చరత ప్రకామం యథాతథా ప్రాప్నుత వత్సతర్యః ॥ 11
ఏనంయునానం గోపతిం వోదదామి అనేన క్రీడంతీశ్చరతీః ప్రియేణ ।
సహాస్మాభిః ప్రజయా మా తనూభిః మావధామద్విషతం సోమరాజన్ ॥ 12
మంత్రం పితా వత్స ఇతి ప్రతీతం జపేతకర్ణే వృషభస్య సవ్యే ।
ప్రచాలయేత్తం వృషభం తతస్తు పూర్వాందిశంవత్స తర్యశ్చ సర్వాః ॥ 13
వాసోయుగం గ్రహీతురథ ప్రదేయం సువర్ణ యుక్తం సఘృతంచకాంస్యమ్ ।
శిల్పప్రధానస్యత థైవమూల్యం దేయం యథాతుష్టిముపైతి రాజన్ ॥ 14
విప్రాస్తథాన్నం దధి సర్పిషాయుతం సంభోజనీయాః పయసాచమిశ్రమ్ ।
ఉత్సృష్ట మాత్రే వృషభే వ్రజంతి తృప్తిం పరాంతస్య పితామహాయే ॥ 15
యస్మింస్తమంగే సజలం తృషార్తః పాతుం సమాగచ్ఛతి తత్పితౄణామ్ ।
దివ్యాంబు పూర్ణంకలశం మహీపతేః లోకం పరం తృప్తి మతః ప్రయాంతి ॥ 16
సరిద్వరాం కాంచి దథోపయాతి తృష్ణాన్విత స్తస్య పితామహానామ్ ।
తృప్తిం నిధత్తే సరితాం వరిష్ఠా సుదీర్ఘ కాలం విమలాంబు వాహైః ॥ 17
దర్పేణపూర్ణః సవిషాణ ఘాతైః ధరాంయదా ధారయతే నరేంద్ర!

పితౄంస్తదా తస్య తదన్నకూటం ధ్రువంస నయతీతి నసంశయోఽత్ర ॥ 18
రోమ్ణాం చతుల్యాని శతాని రాజన్ః భోక్తా తథా తస్య దివం ప్రయాతి ।
సంవత్సరాణాం పరిపూర్ణ కామః సంసేవ్య మాన స్త్రిదశాంగనాభిః ॥ 19

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
వృషోత్సర్గవర్ణనం నామ సప్తచత్వారింశదుత్తరశతతమోఽధ్యాయః.

మార్కండేయుడనియె. ఆశ్వయుజ బహుళమందమావాస్యనాడు కార్తికమాసమందు వృషోత్సర్గము సేయవలెను. సూర్య చంద్రగ్రహణములు ఉత్తర దక్షిణాయనములు రెండు విషువత్పుణ్యకాలములు బంధువెవరేని చనిపోయిన రోజున యతని నుద్దేశించి తన గోవులమంద నడుమ తెలిసిన యతడగ్ని పరిస్తరణము సేసి శంకరు నుద్దేశించి గోక్షీరముతో పౌష్ణచరువును హోమము సేయవలెను. పూష గోవులను మమ్ములను వెంబడించు గాక అను నర్థముగల మంత్రముతో "ఇహరాడితి" యను మంత్రముతో హోమము సేసి రుద్రపును = నమకచమకములను పురుషసూక్తమును కూష్మాండ మంత్రమును జపింపవలెను. అవ్వల నించుక వేడిగల శూలముతో కమ్మరి శిల్పి యా యెద్దునకు కుడిప్రక్కను ఎడమప్రక్క చక్రముతో గాల్చవలెను. అట్లంకితమయిన దానిని స్నానము సేయింపవలెను. అప్పుడు "హిరణ్యపర్ణ" అను నాల్గు ఋక్కులను "ఆపోహిష్ఠా" అను మూడు "శంనోదేవీ" అనుమంత్రమును పఠింపవలయును. అవ్వల నాల్గు దూడలను ఆ ఎద్దును గంధమాల్యాదులచేత నలంకరింప వలెను. శక్తిని బట్టి చక్కని చిరుగంటలు చీనాంశుకములుగూడ యలంకరింపవలెను. అవ్వల కర్త మనస్సుకుదిరించికొని వృషభము సాక్షాత్తు చతుష్పాదమైన ధర్మదేవతయే. అట్టిధర్మమును నేనుభక్తితో నర్చించుచున్నాను. అది నన్నన్నివిధముల రక్షించుగాక ! ఈ నడివయసులోని యెద్దును(గిత్తను) వృషభపతిని ధర్మసహితుని యిట్టిచ్చుచున్నాను. ఈ యనతోగూడ స్వేచ్ఛగా నీ దూడలు చరించుగాక ! ఆదియేగిన యట్లాయాతావులను బొందుగాక ! ఓ దూడలారా ! ఈ వృషభరాజును ఎయసులోనున్న దానిని మందకునాయకుని గోపతినిమీకిచ్చుచున్నాను. ఈ వృషభపతితో మీరు క్రీడించుచు దిరుగుడు. "పితాపత్స" యనుమంత్రమును వృషభముయొక్క కుడిచెవిలో బిగ్గరగా జపింపవలెను. అటుపై నా వృషభమును దూడలను దూర్పుదిశగా తోలవలెను. అటుపై వస్త్రయుగ్మమును సువర్ణముతో అవునేతితోడి కంచుచెంబును ప్రతిగ్రహీతకీయవలెను. శిల్పికిని సంతృప్తికలుగునట్లు మూల్యమునీయవలెను. నెయ్యి పెరుగుతోడి మృష్టాన్నభోజనము విప్రులకు బెట్టవలెను. ఇట్లు వృషభమును వదలినంతనే యజమాని తాతముత్తాతలు పరమ తృప్తినందుదురు. ఆ కలశము పుచ్చుకొన్న యాతడు దప్పికగొని చెరువునకేగి యా పాత్రతో మంచినీళ్ళు త్రావునంతట నా కలశప్రదాతయొక్క పితరులు సంతృప్తులై యుత్తరలోకమునకేగుదురు. ఆ వృషభము దప్పికగొని యొకమహానదికివచ్చి యందలినీరు త్రావినంతట నాతని పితృదేవతల కానది నిర్మలోదక ప్రవాహములచే సుదీర్ఘకాలము సంతృప్తికలిగించును. నిండుదర్పముగొని కొమ్ములతో డెక్కలతో నావృషభము భూమిని చీల్చినంత నావృషోత్సర్జనము చేసినవారి పితృదేవతల నన్నరాసుల కది నడిపించును. సంశయములేదు. వృషోత్సర్జనము చేసినయతడు ఆయెద్దుయొక్క రోమములెన్నిగలవో యన్ని సంవత్సరము లాపుణ్యముననుభవించి యాతడు స్వర్గమునకుజనును. అక్కడ దేవతాసుందరులతో సేవింపబడును.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున వృషోత్సర్జనమను నూటనలుబదియేడవ అధ్యాయము.

## నూటనలుబది ఎనిమిదవ అధ్యాయము - మద్రేశ్వర(పురూరవ)తపోవనగమనము

వజ్రఉవాచ : చరితం బుధపుత్రస్య మార్కండేయ మయాశ్రుతమ్ । శ్రుతః శ్రాద్ధవిధిః పుణ్యః సర్వపాప ప్రణాశనః॥
ధేన్వాః ప్రసూయమానాయాః ఫలం దానే మయాశ్రుతమ్ । కృష్ణాజిన ప్రదానం చ వృషోత్సర్గస్తథైవచ ॥ 2

శ్రుత్వా రూపం నరేంద్రస్య బుధపుత్రస్య భార్గవః । కౌతూహలం సముత్పన్నం తన్మమా చక్ష్వ పృచ్ఛతః ॥ 3
కేనకర్మ విపాకేనసతు రాజా పురూరవాః । అవాపతాదృశం రూపం సౌభాగ్యమపి చోత్తమమ్ ॥ 4
దేవాంస్త్రి భువనశ్రేష్ఠాన్ గంధర్వాంశ్చ మనోరమాన్ । ఉర్వశీ సంగతా త్యక్త్వా సర్వ భావేనతం నృపమ్ ॥ 5

మార్కండేయ ! బుధకుమారుని చరిత్రవింటిని. పుణ్యమైన శ్రాద్ధవిధి సర్వపాపహరము ప్రసవించుచున్నగోవును దానము చేయుటవలని ఫలితము (ద్విముఖీ గోదానమని దీనినందురు) కృష్ణాజినదానము వృషోత్సర్జనముగూడ విన్నాడను. బుధకుమారుడగు పురూరవుని యందమునిని యట్టిరూపముకలుగుటకు కారణమేమో వినగుతూహలముగలుగుచున్నది. అంతయందగానిని సౌభాగ్యవంతుని యూర్వశి త్రిభువనశ్రేష్ఠులగుదేవతలనుమనోరములయినగంధర్వులనుగాదని సర్వభావముతోగూడుకొన్నదన మార్కండేయుండిట్లనియె.

మార్కండేయఉవాచ : శృణుకర్మ విపాకేన యేన రాజా పురూరవాః । పురూరవా ఇతిఖ్యాతో మద్రేష్వాసీన్మహీపతిః ॥
చాక్షుషస్యాన్వయే జాతో చాక్షుషస్యాంతరే మనోః । సర్వైర్నృపగుణైర్యుక్తః కేవలం రూప వర్జితః ॥ 7
వజ్రఉవాచ : పురూరవా మద్రపతిః కర్మణాకేన భార్గవః । బభూవ కర్మణాకేన కురూపశ్చ తథా ద్విజః ॥ 8
మార్కండేయఉవాచ : ద్విజగ్రామే ద్విజశ్రేష్ఠో నామ్నై వాసీత్పురూరవాః । నద్యాః కూలే మహారాజః పూర్వజన్మనిపార్థివః ॥
సతుమద్ర పతిర్నామ్నా యోఽ భూద్రాజా పురూరవాః ।అస్మిన్ జన్మన్య సౌవిప్రో ద్వాదశీషు సదానఘః ॥ 10
ఉపోష్య పూజయామా సరాజ్యకామో జనార్దనమ్ । చకార సోపవాసంచ స్నాన మభ్యంగ పూర్వకమ్ ॥ 11
ఉపవాస ఫలం ప్రాప్య రాజ్యం మద్రేష్వ కంటకమ్ । ఉపోషితదినాఽ భ్యంగా ద్రూపహీనోఽభ్య జాయత ॥ 12
ఉపోషితోనరస్తస్మాత్స్నానమ భ్యంగ పూర్వకమ్ । వర్జయేత్తత్ప్ర యత్నేన రూపఘ్నం తత్పరంనృణామ్ ॥ 13
ఏతత్తే కథితం తస్య యద్వృత్తం పూర్వజన్మని ।మద్రేశ్వరత్వే చరితం శృణు తస్య మహీ పతేః ॥ 14
తస్యరాజగుణైః సర్వైః సము పేతస్య పార్థివః । జనానురాగో నైవాసీ ద్రూప హీనస్య పార్థివ! ॥ 15

పురూరవుడేకర్మ పరిపాకమున నట్టివైభవము పేరుగడించెనో వినుము. చాక్షుషమనువు వంశము కాలమున నాతని వంశమందు పురూరవుడనురాజు మద్రదేశమందుండెను. అతనికన్ని యుత్తమ గుణములున్నవికాని మంచిరూపముగాని లేకుండెను. అన వజ్రుండు మద్రపతి రూపహీనుడగుటకు గారణమైన కర్మమేమి? అన మార్కండేయుడు. ఒకబ్రాహ్మణ గ్రామమందు ద్విజశ్రేష్ఠుడిదేపేరుతో ముందటి జన్మమందొక నదీతీరమందుండెను. అతడు రాజ్యకాముడై యుపవాసముండి జనార్దనుం బూజించెను. ఆనాడత డభ్యంగస్నానము గావించికొని యుపవసించిన ఫలముగా మద్రదేశమను నిష్కంటకమైన రాజ్యమునకు రాజయ్యెను. ఉపవాసముండి తలంటుకొనుటవలన నతడు కురూపియయ్యెను. కావున నుపవాసమున్నవాడు తలంటుకొనరాదు. అదిరూపఘ్నము. (రూపము చెరచును) ఇది యాతని పూర్వజన్మకథ. ఇక నతడు మద్రేశ్వరుడైన తరువాతి కథ తెల్పెద వినుము.

రూపకామఃస మద్రేశ స్తపసే కృత నిశ్చయః । రాజ్యం మంత్రి గతం కృత్వా జగామ హిమ పర్వతమ్ ॥ 16
వ్యవసాయద్వితీయస్తు పద్భ్యామేవ మహాయశాః । ఊర్ధ్వం సంతీర్య సనదం విషయాంతే స్వకీంనదీమ్॥
ఇరావతీమితి ఖ్యాతాం దదర్శాతి మనోహరామ్ ॥ 17
తుహినగిరి భవాం మహౌఘవేగాం తుహిన సగర్భ సమాన శీతలోదామ్ ।
తుహిన సదృశ వర్ణఫేనయుక్తాం తుహినయశాః సరితం దదర్శరాజా ॥ 18

ఇతి శ్రీవిష్ణు ధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
మద్రేశ్వరస్య తపోవన గమనంనామ అష్టచత్వారింశదుత్తర శతతమోఽధ్యాయః.

అట్లు కురూపియైన యాతేడు తపస్సుచేయ నిశ్చయించుకొని మంత్రులకు రాజ్యమప్పగించి హిమవత్పర్వతమున కేగెను. అతనికి వ్యవసాయము ప్రయత్నముతప్ప మరియెవ్వడు తోడులేరు. పాదచారియై మీదికరిగి యొకనదమునుదాటి తనరాజ్యము సరిహ

ద్దున ఇరావతియను తనదేయైన నదింజూచెను. ఆనది చాలచక్కనిది. మంచుకొండ కుదయించినది. (హైమవతి) మహాప్రవాహము గలది. మంచులోపలి చలువకెనయగు చల్లని యుదకముగలది. మంచువలె (తుహినమువలె) నచ్చని తెలుపుగల నురుగులు గలదియగు నానదిని యా తుహినయశుడు (మంచువలె నచ్చమైనకీర్తిగలవాడు) పర్కించెను.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున మద్రేశ్వర (పురూరవ) తపోవనగమనమను నూట నలుబదియెనిమిదవ అధ్యాయము.

## నూటనలుబది తొమ్మిదవ అధ్యాయము - ఇరావతీవర్ణనము

మార్కండేయ ఉవాచ : సదదర్శ నదీం పుణ్యాం రమ్యాం హైమవతీం శుభామ్ ।
గంధర్వ గణసంకీర్ణాం నిత్యంశక్రేణ సేవితామ్ ॥ 1
సురేభమద సిందూరై ర్యస్యాం రాజిర్విరాజతే । మధ్యేన శక్రచాపాభా తస్యాం మజ్జతి సర్వదా ॥ 2
తపస్వి శరణాయాతాంముఖ్య బ్రాహ్మణ సేవితామ్ । దదర్శ శీతపానీయాం మహారాజః పురూరవాః ॥ 3
ప్లుత హంసావళీచ్ఛత్రాం కాశచామర వీజితామ్ । సాభిషేకామివ స తాం పశ్యన్ ప్రీతింపరాంయయౌ ॥ 4
పుణ్యాంసుశీతలాంహృద్యాంమనసః ప్రీతివర్ధనీమ్ । క్షయవృద్ధి యుతాం సౌమ్యాం సోమమూర్తి మివాపరామ్ ॥ 5
సుశీత శీఘ్రపానీయాం ద్విజపుంజనిషేవితామ్ । సుతాంహిమవతః శ్రేష్ఠాం చంచద్వీచి విరాజితామ్ ॥ 6
అమృతస్వాదు సలిలాంతా పసైరుపశోభితామ్ । స్వర్గారోహణనిఃశ్రేణీం సర్వకల్మష నాశనీమ్ ॥ 7
అగ్ర్యాం సముద్ర మహిషీంమహిషీ గణగాహితామ్ । హితాం సర్వస్యలోకస్య కస్యనౌత్సుక్య కారిణీమ్ ॥ 8
గోకులాకుల తీరాంతాం రమ్యాం శైవాల వర్జితామ్ , హంససారస సంఘుష్టైర్జలజైః సేవితాం శుభైః ॥ 9
ఆవర్త నాభిగంభీరాం ద్వీపోరుజఘనస్థలామ్ । నీరనీరజ నేత్రాంతా ముత్ఫుల్ల కమలాననామ్ ॥ 10
హిమాభఫేనవ సనాం చక్రవాకధరాం శుభామ్ । బలాకా పంక్తి దశనాంచలన్మత్స్యావళి భ్రువమ్ ॥ 11
స్వజలోద్ధత మాతంగరమ్యకుంభ పయోధరామ్ । హంసనూపుర సంఘుష్టాం మృణాలవలయావలీమ్ ॥ 12
యస్యాంరూపమదోన్మత్త గంధర్వాను గతఃసదా । మధ్యాహ్నసమయే రాజన్ క్రీడత్యప్సర సాంగణః ॥ 13
తామప్సరోవినిర్ముక్తా న్వహంతీం కుసుమాన్ముఖాన్ । స్వతీరద్రుమసంభూతాన్నానా వర్ణాన్సు గంధినః ॥ 14
తరంగ శత సంక్రాంత సూర్యమండల దుర్దశమ్ । సురేభజనితాఘాత వప్రద్వయవి భూషితామ్ ॥ 15
శక్రేభగండ సలిలైర్దేవస్త్రీ కుచచందనైః , సంయుతం సలిలంయస్యాః షట్పదైరుప సేవ్యతే ॥ 16
యస్యాస్తీరభవా వృక్షాః సుగంధికుసుమాన్వితాః । తథాప్రకృష్ట భ్రమరా భ్రమరైస్తే నిరాకులాః ॥ 17
యస్యాస్తీరేరతిం యాంతి సదాకామవశానుగాః , తపోధనాశ్చఋుషయ స్తథా దేవాః సవాసవాః ॥ 18
లభ్యంతేయత్ప్లుతాంగాస్తు దేవేభ్యః ప్రతిమాననాః । స్త్రియశ్చనాకేబహులాః పద్మేందు ప్రతిమాననాః ॥ 19

మార్కండేయుడనియె. ఆ రాజు పురూరవుడు చక్కని శుభమైన పుణ్యనదిని యిరావతిని నిత్యము గంధర్వగణ సంకులమైనదాని నింద్రుడు సేవించుదానిని జూచెను. ఆనది యైరావత మద సిందూరముచే నందలి తరంగరాశి ఎఱ్ఱని గీతగీసినట్లు విరాజిల్లుచుండును. అట్టి ఆఎఱ్ఱని తరంగపంక్తి నదీమధ్యమం దింద్రధనుస్సువోలె విలీనమగుచుండెను. అనేకమంది ఋషుల యాశ్రమము లందుండి యానది బ్రాహ్మణముఖ్యసేవితయై వచ్చుచుండును. పురూరవమహారాజు శీతపానీయమైన యాపుణ్యనదింజూచెను. అందీదులాడు హంసలు శ్వేతచ్ఛత్రముగను రెల్లుపూపొదలచే చామరములుగను మంగళోదకములచే రాజ్యాభిషిక్తయగు మహారాజ్ఞియోయన్న

ట్లున్న యా నదీమతల్లింగని రాజెంతేని ప్రీతిసెందెను. పుణ్యము సుశీతలము హృద్యము మనః ప్రీతిసంవర్ధనము పెరుగుసతరుగులు గలదియు రెండవ సోమమూర్తియో (చంద్రబింబమో) యన్నట్లు చలువతో నతిశీఘ్ర ప్రవాహజలములతో ద్విజపుంజము సేవింప కెరటములువేయుచునున్న హిమగిరి కన్యారత్నమును అమృతస్వాదూదకమై తాపసులచే శోభించుచు స్వర్గారోహణమున నిఃశ్రేణియో (నిచ్చెనయో) యన్నట్లు సర్వకల్మషనాశనియై సముద్రుని కగ్రమహిషియై మహిషీగణముదిగి యీదులాడు సర్వలోక హితకారిణిని సర్వలోకమునకు ఔత్సుక్యకారిణిని (వేడుకగూర్చుదానిని) అలమందలచే సందడిగొను తీరములతో నాచులేక హంసలతో సారసములతో (బెగ్గురుపక్షులు) సంఘర్షణముసెందునీ తామరపూలతో పిలువబడునది సుడులను లోతైన నాభిగలదానిని ద్వీపములను విశాల జఘనములు (పిఱుదులు) గలదై నీలనీరజములనెడి కన్నులుగలదై మంచునుఱుగట్టి తెలిచీరదాల్చి చక్రవాకములనెడి చేపలనెడి కనుబొమలుగొని తననీటబుట్టిన యేనుగులయొక్క కుంభస్థలములనెడి పయోధరములందాల్చి హంసలనెడి యందెలసవ్వడిగొని తామరతూండ్లనెడివలయములు బాహువులదాల్చి దనయా సరస్సున సౌందర్యమదోన్మత్తులయిన గంధర్వులతోమధ్యాహ్న సమయమందునప్సరోబృందమందు క్రీడించుచుండును. అప్సరసలు తనయొద్దునంగల తరువులకుమాచిన పలురంగుల సువాసనలలించు తమకొప్పులందాల్చిన పువ్వుల ధరించినదియు ననేకతరంగములందు ప్రతిబింబించిన సూర్యమండలము లనేకములచే గనుల మిరుమిట్లుగొలుపుచున్నదియు దేవలోకమందలి ద్విరదములు మదముగొని వప్రక్రీడావిలాసమున కుంభస్థలములంగ్రుమ్మిన యిరువైపు దరుల(ఒడ్డులచే) మిగుల సుందరమైనదియు ఇంద్రగజమగు నైరావతముయొక్క గండస్థలములంజారు సలిలములచే దేవసుందరీ స్తనచందనసుఖలం పరిమళించు దుమ్మెద లాస్వాదించుచుండు సలిలముల గులుకునదియు గండుతుమ్మెదలు నిండుతుమ్మెద లెంతగ్రమ్ముకొన్నను నొక్కింతయేని వ్యాకులము సెందనివాడని సొగసువీడని గంధికుసుమ భరితములైన తావులతో తపోధనులతో యింద్రాది బృందారకులుం పురుషులుగూడ రతిక్రీడా వినోదులయి యేనది యుభయతీరములందు జలములందోగి దేవతలతో సమానమయిన ముఖములు గలవారగుదురు స్త్రీలును పద్మముతో చంద్రునితోసీడగు ముఖములుగలవారగుచుందురు.

యాబిభర్తి సదాతోయందేవ సంఘైర పీడితమ్ । పులిందమృగబృందైశ్చవ్యాధబృందైర పీడితమ్ ॥ 20
సతామర సపానీయాంసతారాగ గనామలామ్ । సతాంపశ్యన్యయౌ రాజా సతామీప్సిత కామదామ్ ॥ 21

దేవబృందముగాని మృగబృందముగాని బోయలు ఎరుకలు కోయలు కొండజాతులుఅతి వినిర్మలసలిలములుంగలదియు. తామరలతోగూడి సదా పానీయమునై తామరాక్షసహితమై సదాగగనమట్లు తిస్వచ్ఛమై సత్పురుషుల కోరికల నీయగలదైయున్న యా యిరావతీనదిని జూచుచు నారాజేగెను.

యస్యాస్తీరరుహైః కాశైః ఫుల్లైశ్చంద్రాంశు సంనిభైః । రాజద్భిర్వి వృతాకాశై రమ్యే స్తత్తీరసంస్థితైః ॥ 22
యాచసదాది విసేవ్యతిదేవై ర్యాచ సదాభువి సేవ్యతి విప్రైః ।
యాచసదా సకలాఘ వినాశం భక్త జనస్య కరోత్యచిరేణ ॥ 23
యాచగతా సరితాంచ కదంబైః యాచనుతా సతతంహిమమీనైః ।
యాచయుతా సతతోయ కదంబైః యాచగతా సతతంహిమమీనైః । 24
యుక్తాపి కేసరిగణైఃకరిబృందయాతా సన్నాగ యుక్త సలిలాపి సుపర్ణయుక్తా ।
సూర్యాంశుతాప పరివృద్ధి వివృద్ధి శీలా శీతాంశుతుల్యయ శసా దదృశేన్న పేణ ॥ 25

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
ఇరావతీ వర్ణనో నామైకోన పంచా శదుత్తర శతతమోఽధ్యాయః.

చంద్రకిరణముల్లచ్ఛము తెల్లగపూచిన రెల్లుదుబ్బులుకాశములు అతిరమ్యములై యాకాశమును విస్తరింపజేయుచుండెను. ఆ నదిని దివంబున దేవతలు భువిలో భూదేవతలు నిరంతరము సేవింతురు ఆ నది భక్తజనసకలాఘవినాశిని. అనేక నదీకదం

బుములానదితో గూడును. మహీనులు (మహీ + ఇన) భూపతులానదిని వినుతింతురు.- పంచుగప్పనియనేక జలకదంబముతోనదిసతతము సంగమించును. కేసరిగణముతో పుష్పకింజల్కములతో గూడియు (సింహగణములతో గూడియు అని శ్లేష) కరిబృందముతో (ఏను గులతో) గూడియున్నది. - సన్నాగయుక్త సలిలాపి = ఏనుగులతోకూడిన యుదకములు గలదయ్యు సువర్ణయుక్తా = చక్కని రంగు గలది (మంచిబంగారముగలది) సూర్యునికిరణములవలని తాపవృద్ధిచేతా పవృద్ధినందియు శీతాంశుతుల్యయశసా = చల్లని కిరణములు గల చంద్రునితో సమానమైన కీర్తిగలదై యా పుణ్యనది యా మేదినీశునకు మిగుల దర్శనీయయయ్యెను.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండము నందు ఇరావతీ నదీవర్ణనమను
నూటనలుబదితొమ్మిదవ అధ్యాయము.

## నూటయేబదియవ అధ్యాయము - హిమగిరి వర్ణనము

ఆలోకయన్నదీం పుణ్యాంతత్సమీ రహ్నాతక్లమః । సగచ్ఛన్నేవదదృశేహి మవంతం మహాగిరిమ్ ॥ 1
ఖముల్లిఖద్భిర్బహుశైర్వృతంశృంగైః సపాండురైః । పక్షిణా మథసంచారై (ర్) వినాసిద్ధగతిం శుభామ్ ॥ 2
నదీ ప్రపాత సంజాతమహాశబ్దైః సమంతతః । అసంశ్రుతాన్య శబ్దన్తం శీతతోయం మనోరమమ్ ॥ 3
దేవదారు వనైర్నీలైః కృతాధోవసనం శుభం । మేఘోత్తరీయం తం శైలం దదృశేసనరాధిపః ॥ 4
శ్వేతమేఘ కృతోష్ణీషం చంద్రార్కముకుటంక్వచిత్ । హిమాను లిప్తసర్వాంగం క్వచిద్ధాతు విచిత్రితమ్ ॥ 5
చందనేనాను లిప్తాంగం దత్త పంచాంగు లింయథా । శీతప్రదం నిదాఘేఽపి శిలావిషమ సంకటమ్ ॥ 6
సాలక్తకైరప్సరసాంముద్రితం చరణైః క్వచిత్ । క్వచిదస్పృష్ట సూర్యాంశుం క్వచేచ్ఛత మసావృతమ్ ॥ 7
దరీముఖైః క్వచిద్భీమైః పిబంతమనిలంబహు । క్వచిద్విద్యాధరగణైః క్రీడద్భిరుప శోభితమ్ ॥ 8
ఉపగీతం తథా ముఖ్యైఃకింనరాణాంగణైః క్వచిత్ । ఆపాన భూమౌచగణై ర్గంధర్వాప్సరసాంక్వచిత్ ॥ 9
గీతాదిభిః సమాకీర్ణంగంధర్వీణాం మనోహరమ్ । నిరుద్ధ పవనైర్దేశైర్నీల శాద్వల మండితైః ॥ 11
క్వచిచ్ఛుక సుమైర్యుక్తంచాత్యంతరుచిరైః శుభమ్ । తపస్వి శరణంశైలం కామినామ పిదుర్లభమ్ ॥ 10
మృగయూథాను చరితందంతిభిన్న మహాద్రుమమ్ । యత్రసింహని నాదేన త్రస్తానాంభైరవం రవమ్ ॥ 12
శ్రుత్వోత్పశ్యతి విభ్రాంతం గజానామాకులం కులమ్ । తపశ్చతాపసైర్యస్య కూలదేశేష్వలంకృతమ్ ॥ 13
రత్నైర్యతః సముత్పన్నైస్త్రైలోక్యం చాప్యలం కృతమ్ । అహీనశరణం నిత్యమహీన జనసేవితమ్ ॥ 14
అహీనః పశ్యతిగిరి మహీనం రత్నసంపదమ్ । అల్పేనత పసాయత్ర సిద్ధిః ప్రాప్యేతతా పసైః ॥ 15
యశ్చదర్శన మాత్రేణ సర్వకల్మషనాశనః । మహాప్రతాప సంపాతప్రభీతఖగ బంధుభిః ॥ 16
వాయునీత సదావృష్టిః కృతదేశం క్వచిత్క్వచిత్ । అలబ్ధ జలదైః శృంగైః క్వచిచ్చాతి సముచ్ఛ్రితైః ॥ 17
నిత్యార్క తాప విషమైరగమ్యైర్మన సాయుతమ్ । దేవదారు మహావృక్ష పుంజశాఖా నిరంతరైః ॥ 18
సమస్తభువనాకారైః ప్రదేశైరుప శోభితమ్ । హిమచ్ఛన్న మహాశృంగం ప్రపాతమిత నిర్ఝరమ్ ।
శబ్దలభ్యాంబు విషమం హిమసంరుద్ధకందరమ్ ॥ 19
దృష్ట్వైవతాంచారు నితంబ భూమిం మహాను భావః సమహీంద్రనాథః ।
బభ్రామతత్రైవ ముదాసమేతః స్థానంతతః కించిదథా ససాద ॥ 20

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
హిమవద్వర్ణనో నామ పంచాశదుత్తర శతతమోఽధ్యాయః.

మార్కండేయుడనియె. ఆపుణ్యనదిం జూచుచు నానదిపైనుండివీచు వాయువులచే శ్రమవాసినదచునేపోయి రాజు హిమాలయ మహాపర్వతముంజూచెను. అది తెల్లనిశిఖరములనేకములచే నాకసమును రాయుచుండెను. సిద్ధులగమనముదప్ప మరిపక్షి సంచారము గానరాదు. సెలయేళ్లవలని శబ్దముతప్ప మరియేశబ్దమట వినిపింపదు. ఆచటిజలములు గడుచల్లనివి. అదిమాడ నింపైనది. నల్లని దేవదారు వనములాగిరికి చక్కని కట్టువస్త్రము. మేఘముత్తరీయ మట్లుండెను. (మేఘమండలము దాటి యా పర్వతమున్నదని భావము) తెల్లని మేఘములు తలపాగగ చంద్రసూర్యులు కిరీటములుగ మంచు మైపూతగ గంధముపూసినమేన గోరింటాకు మెదలైనవానిచే చిత్రవర్ణములైన యైదువేళ్ళున్నట్లు అట నటగైరికాది ధాతువుల పలురంగుల విచిత్రవర్ణమై గ్రీష్మఋతువునం గూడ చలువనించునదై ఎగుడు దిగుడుగనున్న రాళ్ళచే నొడుదుడుకులైన చెట్లక్రింద నప్సరసల యడుగులపారాణి ముద్రలంగొని సూర్యకిరణములు తాకక యొకచో భయముగొలుపు గుహాముఖముల నూరక వాయువుంద్రాగుచు గొన్నియెడల విద్యాధరగణము లాడుకొన మిగులశోభనమై కొండొక తావుల కిన్నరవరులు గుమిగూడిపాడుకొన మిక్కిలిమోహనమై వేరొకట పానశాలల గంధర్వాప్సరోగణములయు గంధర్వులయొక్క గంధర్వస్త్రీలయొక్కయు గీతములచే నంతటననముకొన్నదై వాయువుచొరని ప్రదేశముల నీలపురంగులు గుల్కు ముదురు పచ్చిక బయళ్ళతోనొక్కెడ నత్యంత రుచిరములైన కుసుమములతో గూడినదై తపస్వులకాశ్రయము కాముకులకుగూడ దుర్లభమునై మృగముల మందలందందు చరింపనై నద దంతి విభిన్న మహాద్రుమమై సింహముల భయంకర గర్జన రవములాలించి యదలి కన్నులుతేలవైచి యట్టిటు పరువులిడు నేనుగుల గుంపులంగూడి తాపసుల తపస్సు నదీతీరముల నలంకరింప తనయంద పుట్టిన రతనములచే ముల్లోకము నలంకరింప అహి + ఈన శరణమై = సర్పరాజుల కాశ్రయమై నిరంతరమును అహీన = హీనులు గాని మహానుభావులచేత సేవింపబడుచు నా హిమగిరి పరమసుందరమై యుండెను. అహీనుడా గిరిని అందలి ఆహీనమైన రత్న సంపదను దర్శించును. తాపసులట నేకొంచెము తపస్సు చేసినను సిద్ధిం బడయుదురు. ఏ గిరి దర్శన మాత్రమున సర్వకల్మష నాశనము అచ్చటి గొప్పగొప్పప్రపాతములయొక్క సంపాతములచే ఖగబంధువులు (అల్పాల్పములయిన పక్షులు) హడలిపోవు చుండును. మేఘములకందుబాటులోలేని మిక్కిలియెత్తైన శిఖరములుగలిగిన కఠినవాయువుచేత గొనిరాబడిన నిరంతరవృష్టులుగురియు ప్రదేశములు కొన్ని యందుగలవు. దేవదారు మహాతరు పుంజముల కొమ్మలు ఎడములేకుండ గ్రమ్ముకొని నిత్యమును సూర్యుని వేడిమికి విషమములై మనస్సునకుగూడ యగమ్యములైన్న సమస్త ఘననాకారములయిన ప్రదేశములతో శోభించునదై మంచు గప్పిన మహాశిఖరములు ప్రపాతములచే మితమైన సెలయేళ్ళు గల్గి శబ్దమాత్రముచే చప్పుడుం బడి పొందదగిన నీటిచే విషమమై (నీరెక్కడ లభించునో తెలియనంత దట్టమై చీకటి గొన్నచన్నమాట) మంచు గ్రమ్మిన కంచరములు (చరియలు) గల్గియున్న యా చక్కని హిమగిరి నితంబ (మధ్య) భూమిం దర్శించి యా మహానుభావుడు పురూరవ మహీంద్రనాథుడట పరిభ్రమించి (అట్టిటు తిరిగి) యానందభరితుడై యచ్చలనట నొకించుక చోటుం జేరెను.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమునందు హిమగిరివర్ణనమను నూటయేబదియవ అధ్యాయము.

## నూటయేబదియవ అధ్యాయము-మహర్ష్యాశ్రమ వర్ణనము

మార్కండేయ ఉవాచ : తస్యైవ పర్వతేంద్రస్య ప్రదేశం సుమనోహరమ్ ।
అగమ్యంమానుషై రన్యైర్దైవయోగాదు పాగతః ॥ 1

ఇరావతీసరిచ్ఛ్రేష్ఠా యస్మాద్దేశాద్వి నిర్గతా । మేఘశ్యామంచ తందేశంద్రు మఖండై రనేకశః ॥ 2

సాలైస్తాలై స్తమాలైశ్చకర్ణికారైః సశాల్మలైః । న్యగ్రోధై శ్చతథాశ్వత్థైః శిరీషైః శింశుపాద్రుమైః ॥ 3

శ్లేష్మాతకై రామలకైర్హరీత కవిభీతకైః । రమ్యైశ్చందనవృక్షైశ్చ కపిత్థైరక్తచందనైః ॥ 4

వటమాహిషకాక్షోటై రశ్వకర్ణైస్తథార్జునైః । హస్తికర్ణైస్సపనసైఃకోవిదారైఃసుపుష్పితైః ॥ 5
దేవదారు మహావృక్షైస్తథా కాలేయకద్రుమైః । పద్మకైశ్చందనైర్బిల్వైః కుటజైర్హరిచందనైః ॥ 6
ప్రాచీనాగురుకైశ్చైవస్థూణికైః సమశండికైః । ఖర్జూరైర్నారికేలైశ్చప్రియాల్వామ్రాతకైంగుదైః ॥ 7
తేరుమానైః ర్వటైర్భవ్యైః కాశ్మరైః ఫలిభిస్తథా । జాతీఫలైః పూగఫలైః కట్ఫలైర్లవలీఫలైః ॥ 8
మందారైఃకోవిదారై శ్చకింశుకైః కుసుమాంశుభిః । పలాశైఃశమిసూల్లాసై ర్వేతసై రమ్లవేతసైః ॥ 9
రక్తాతిరంగనారంగై రింగుదైః సప్రియంగుభిః । రక్తాశోకైస్తథా ఽశోకై రారుకైః సచిరారుకైః ॥ 10
ముచుకుందైస్తథా కుందై రాటరూషపరూషకైః । కింకరాతైఃకిరాతైశ్చ కేతకైశ్చసకేతకైః ॥ 11
శోభాంజనై రంజనైశ్చ ముకూలకనికోచకైః । సుపూర్ణచారువసనైర్ద్రుమైఃశ్లేష్మైరథాసనైః ॥ 12
మన్మథస్యశరాకారై స్సహకారైర్మనోరమైః । నేతయుథికయా రాజన్ శ్వేతయూథికయాతథా ॥ 13
జాత్యాచంపక జాత్యాచతుంబు రైశ్చాప్యుదుంబరైః । మాషైశ్చోచ్చైస్సలకు చైస్తలంబలకుశంబలైః ॥ 14
తథా సుపుష్పావరణై ర్వరణైః కామివల్లభైః । పుష్పాకులై శ్చపమేలైః పారిభద్రక భద్రకైః ॥ 15
ధారాకదంబైః కుటజైః కదంబైర్గిరికూటజైః । ఆక్రాంతసర్వకకుభైః కకుభైః కమనీయకైః ॥ 16
కర్కంధు బదరైర్నీపైః దీప్తైరివమహోజ్జ్వలైః । రక్తైః పాలీవతైః శ్వేతైర్హాడిమైశ్చణ్యకద్రుమైః ॥ 17
ప్రతానైః పిప్పలీనాంచనాగవల్ల్యాశ్చభాగశః । మరీచస్యతథాగుల్మై ర్నవమల్లికయాతథా ॥ 18
మృద్వీకామండలై ర్ముఖ్యైరతిముక్త కకుండలైః । త్రపుసైర్వారుకానాంచ ప్రతానైః సఫలైఃశుభైః ॥ 19
కూష్మాండానాం ప్రతానైశ్చ అలాబూనాంతథాక్వచిత్ చిర్భటస్యప్రతానైశ్చ పటోలైః కారవేల్లకైః ॥ 20
కర్కోటకైః ప్రతానైశ్చ వార్తాకైర్బృహతీఫలైః । కల్హారైర్మూలకైర్ముఖ్యైః శాకైశ్చ వివిధైస్తథా ॥ 21
సువర్చలాభిః సర్వాభిః సర్షపాభిస్తథైవచ । కాకోలీక్షీరకాకోలీఛత్రయా చాతిఛత్రయా ॥ 22
కాకమాచీ మహాబద్ధిశకర్దల కందలైః । తథాక్షీరికశాకేస కాలశాకేన చాప్యథ ॥ 23
శింబిధాన్యైస్తథా థాన్యైః సర్వైర్నిరవశేషతః । ఓషధీభిర్వి చిత్రాభిర్దీ ప్యమానాభిరేవచ ॥ 24
కందైర్విదార్యాచతథా తరూటైః స్వాదు సంయుతైః । సునిషణ్ణాశటీశేషా రాజక్షయ కవాస్తుకైః ॥ 25
ఆయుష్యాభిర్య శస్యాభిర్వర్ణాభిశ్చ నరాధిప । జరామృత్యుభయఘ్నాభిః క్షుద్భయఘ్నాభిరేవచ ॥ 26
సౌభాగ్యజననీభిశ్చ వృష్యాభిశ్చాప్య నేకశః । వేత్రవేణులతాభిశ్చ తథా కీచకవేణుభిః ॥ 27
కాశైఃశశాంక సంకాశైః శరగుల్మైస్తథాక్వచిత్ । కుశగుల్మైస్తథారమ్యైర్గుల్మైశ్చేక్షుమనోహరైః ॥ 28
కార్పాసయాతువర్యాచదుకూలేన శుభేనచ । తథాచకదళీఖండై ర్మనోహారిభిరుత్తమైః ॥ 29
తథామరకతప్రఖ్యైః ప్రదేశైః శాద్వలాన్వితైః । ఇరాపుష్ప సమాయుక్తైః కుంకుమస్యచభాగశః । 30
తగరాతివిషామాంసీ గ్రంథిపర్ణీ సురాగదైః । సువర్ణపుష్పైశ్చతథా భూమిపుష్పైస్తథా పరైః ॥ 31
జంబీరికాభూస్తృణైశ్చ సరసైః స్సుముకైస్తథా । శృంగవేరాజమోదాభిః కురేరకప్రియాలుకైః ॥ 32
జలజైశ్చతథా పద్మై ర్నానావర్ణైః సుగంధిభిః । ఉదయాదిత్య సంకాశైః పూర్ణచంద్ర నిభైస్తథా ॥ 33
తపనీయ సవర్ణైశ్చ అతసీ పుష్పసంనిభైః । శుకపత్రనిభైశ్చాన్యైః స్థలపద్మైశ్చభాగశః ॥ 34
పంచవర్ణైః సమాకీర్ణం బహువర్ణైస్తథైవచ । దుష్టదృష్ట్యాహితముదైః కుసుమైశ్చంద్ర సంనిభైః ॥ 35
తథావహ్నిశిఖా కారైరాజస్రక్తోత్పలైఃశుభైః । నీలోత్పలైః సకల్హారైర్దుర్జాత కసేరుకైః ॥ 36
శృంగాటకైర్మృణాళైశ్చ కావాటైరాక్షసోత్పలైః । జలజైః స్థలజైర్మాలైః ఫలైః పుష్పైరశేషతః ॥ 37

వివిధైశ్చైవ నీవారైర్మునిభోజ్యైర్నరాధిప । నతద్ధాన్యం నతత్సస్యం నతచ్ఛాకం నతత్ఫలమ్ ॥ 38
నతన్మూలం నతత్కందం నతత్పుష్పం నరాధిప । నాగలోకోద్భవం యచ్చ నాకలోకోద్భవం చయత్ ॥ 39
అనూపబంధనోత్థంచ తన్నయన్నాస్తియాదవ । సదాపుష్పఫలం సర్వమజస్రమృతుయోగతః ॥ 40
మద్రేశ్వరః సదదృశేతపసోఽర్ధాయయోగతః । దదృశేచతథాతత్ర నానారూపాన్పతత్రిణః ॥ 41
మయూరాన్ శతపత్రాంశ్చ కలవాచక కోకిలాన్ ॥ తథాకాదం బకాన్హంసాన్కుక్కుటాఞ్జలకుక్కుటాన్ ॥ 42
కృకరాన్పర్కశాన్శ్యామాం స్తిత్తిరాన్సకపింజలాన్ । ధార్తరాష్ట్రాన్ప్లవాన్మద్గూన్కల వింకాంచుకాన్బకాన్ ॥ 43
చటకాంశ్చక్రవాకాంశ్చ ఆటకాంట్టిటిభాన్సటూన్ । పుత్త్రప్రియాన్లోహపృష్ఠాన్ గోనందగిరి వర్తకాన్ ॥ 44
పారావతాన్కామలాంశ్చశారకాన్ జీవజీవకాన్ । లావవర్తక వర్తీరాన్ రక్తచర్మ ప్రభద్రకాన్ ॥ 45
తామ్రచూడాన్స్వర్ణ చూడాన్కోయష్టిన్ఖంజరీటకాన్ । ఋషిపుత్రాన్సహారీతాన్ కుక్కుటాన్ కాష్ఠకుక్కుటాన్ ॥ 46
లట్వాన్ లటేమాన్గోక్ష్వేడాంస్తథా కుంకుమచూడకాన్ । భృంగరాజాంఛారపాదాన్భులిం గాన్పిండి మాలవాన్ ॥ 47
మంజూలీయకదా త్యూహగోపపుత్రాన్సవంజులాన్ । భారద్వాజాంస్తథా చాషాన్సువర్ణాన్జనీయకాన్ ॥ 48
ఏతాంశ్చాన్యాంశ్చసు బహూన్ పక్షిసంఘాన్మనోహరాన్ శ్వాపదాన్వివిధాకారాన్ మృగాంశ్చైవ మహామృగాన్ ॥ 49
వ్యాఘ్రాన్కేసరిణః సింహాన్ద్వీపినః శరభాన్వృకాన్ । ఋక్షాంస్తరక్షూన్బంధూ కాన్గోలాంగూలాన్సవానరాన్ ॥ 50
శశాంల్లోకాంచ్ఛశపలాన్మార్జారా న్మాయవఃశునః । మూషికాన్నాకులాన్కాచాన్సింహాన్క్షుద్రసురోమకాన్ ॥ 56
తథామత్తాంశ్చమాతం గాన్మహిషాన్గవయాన్వృషాన్ । చరమాన్సృమరాంశ్చైవ తదాగోరాన్నఖానపి ॥ 52
ఉరభ్రాంశ్చతథా మేషాన్ సారంగానథకర్కశాన్ । రురూన్నమృష్పదాన్పృషాన్మర్కటాన్కర్కటాన్మృగాన్ ॥ 53
నీలాంశ్చైవ మహానీలాన్ కరాలమృగమార్దకాన్ । శ్వదంష్ట్రాన్నామ శరభాన్ కోడ కాక పశస్వరాన్ ॥ 54
కరాశాన్కృతమాలాంశ్చ కాలపుచ్ఛాంస్త థారుణాన్ । ఉష్ట్రాన్గజాన్వరాహాంశ్చతురగాన్ఖ రగర్దభాన్ ॥ 55

మార్కండేయుడనియె. ఆ పర్వతేంద్రముయొక్క యతిమనోహరము మానవుల కగమ్యాగోచరము నైన యొకానొక తావునకా నరేంద్రుడు జేరుకొనెను. అది యిరావతి నది పుట్టినచోటు. అనేక వృక్ష షండముచే నది మేఘమండల మట్టితి నలుపుగొనియుండెను. అందు సాలతమాలాదిసంతత సర్వ పుష్ప ఫల వృక్ష లతాముల జాతులు తామర పూలలో రకాలు - పక్షులు సింహాది జంతువులు గలవు. పురూరవ చక్రవర్తి అక్కడ అత్రి యాశ్రమమునకు జేరెను.

ఏతాన్పశ్యన్స మద్రేశోవిరుద్ధాంశ్చ పరస్పరమ్ । అవిరుద్ధాన్వనే తస్మిన్నిర్వృతిం స పరాం యయౌ ॥ 56
తదాశ్రమపదేముఖ్యే బభూవాత్రిః పురాన్నృప । తత్రప్రసాదాత్సదాయుక్తం స్థావరైర్జంగమైస్తథా ॥ 57
హింసంతిన తథాఽన్యోఽన్యంహింసకాస్తు పరస్పరమ్ । క్రవ్యాదాః ప్రాణినస్తత్రసర్వేక్షీర ఫలాశనాః ॥ 58
నిర్మితాస్తత్ర రత్యర్థమత్రిణా సుమహాత్మనా । శిలానాంనిమ్నదేశేషు తత్రగావః స్వయంన్నృప ॥ 59
పయఃక్షరంతి తద్దివ్య మమృత స్వాదుసంనిభమ్ । క్వచిద్రాజమహిష్యశ్చ క్వచిద్రాజాచభాగశః ॥ 60
శిలాఃక్షీరేణసంపూర్ణా దధ్నాచాన్యత్రయాదవ! । సపశ్యన్పరమాంప్రీతి మవాపవసుధాధిపః ॥ 61
సరాంసితత్రదివ్యానినద్యశ్చ విమలోదకాః । మృణాళకాని దివ్యాని శీతలానిచ భాగశః ॥ 62
కందరాణిచ శైలస్యసుఖసేవ్యానియాదవ । హిమపాతో నతత్రాస్తిసమంతాత్పంచ యోజనమ్ ॥ 63
ఉపత్యకాసు శైలస్య శిఖరేషుతువిద్యతే । తత్రాపిరాజంచిఖరం పర్వతేంద్ర స్యపాండురమ్ ॥ 64
హిమపాతంసదా తత్రఘనాః కుర్వంతి సంహతాః । తత్రాస్తిచాపరం శృంగం యత్రతోయం ఘనాఘనాః ॥ 65
నిత్యమేవాభివర్షంతి శిలాభిః శిఖరం ఖరమ్ । తదాశ్రమం మనోహారియత్ర కామధరాధరాః ॥ 66

సురముఖ్యోపభోగ్యత్వాత్ శాఖినః సఫలాః సదా । సదోపగీత భ్రమరం సురస్త్రీసే వితామరమ్ ॥ 67
సర్వపాపక్షయకరం శైలస్యైవ మహాకరమ్ । వానరైః క్రీడమానైశ్చ దేశేదేశే నరాధిపః ॥ 68
హంసపుంజాః కృతాస్తత్రచంద్రబింబ సమప్రభాః । తదాశ్రమసమంతాచ్చ హిమసంరుద్ధ కందరమ్ ॥ 69
శైలవాటైః పరికృత మగమ్యం మనుజైః సదా । పూర్వారాధితదేవేశో మహారాజః పురూరవాః ॥
తదాశ్రమమను ప్రాప్తో దేవదేవ ప్రసాదితః ॥ 70
తదాశ్రమంశ్రమశ మనం మనోహరం మనోహరైః కుసుమశతై రలంకృతమ్ ।
కృతంచ తత్స్వయమథచాత్రిణాశుభం శుభప్రదంతం దదృశేసమద్రరాట్ ॥ 71

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
మహర్ష్యాశ్రమ వర్ణనం నామైకపం చాశదధిక శతతమోఽధ్యాయః.

అత్రిమహర్షి - ఆశ్రమ వర్ణనము

ఆ యాశ్రమమునందు పరస్పరము హింసించుకొను జీవులును హింసను మానినవి. అట ఘాతుక జంతువులు పచ్చి మాంసము తినునవి పాలు పండ్లు మాత్రమే తినును. అట క్రింది లోయలందు రాళ్ళ చరియలలో నత్రిమహర్షి స్వయముగా గోవులను నిర్మించెను అవి అమృతప్రాయమగుదివ్య క్షీరమును చేపును. ఒకచో రాజ మహిషులు నొకచో రాజును నా యా భాగము లందు అచటి శిలలు క్షీర పూర్ణములు దధి పూర్ణములు. ఆ గిరి కందరములు సుఖ సేవ్యములు. అట యోజన పంచకమందు మంచు పడదు. ఉపత్యక (గిరి సమీప ప్రదేశము) మందు గిరి శిఖరములందు మంచుకురియదు. అక్కడ ఘనములు ఘనాఘనములు = మేఘములు ఘనములైనవి. నిరంతరము శిఖరములనుండి ఖరముగా (తీవ్రముగా) వర్షము గురియును. ఆశ్రమమతి మనోహరము అచట ధరలు (భూములు) కామధరలు సురశ్రేష్ఠుల కుపభోగ్యములగుటచే నట శాఖులు (శాఖలుగలవి వృక్షములు) సదా - సఫలములు = ఎల్లపుడు పండ్లతో గూడినవి. (సార్థకములు పుణ్య ఫల సంపన్నములని శ్లేషార్థము) నిరంతర గానము చేయు భ్రమరములు నిత్యము సురస్త్రీలు సేవించు నమరులు గలది సర్వపాపక్షయకరము. ఆ శైలముయొక్క మహాకరము గొప్ప నివాస స్థానము. ఆ శైలముయొక్క కరమే యది. అట నెచ్చోటను హంసపుంజము చంద్రబింబ సమప్రభమై వానరములతో నాడుకొనును. ఆ ఆశ్రమము నల్గడల మంచుగప్పిన కందరము శైలవాటములతో జుట్టువారుకొని మనుజులక గమ్యమైన యచ్చోటికి మున్ను దేవేశుని హరుని యారాధించినవాడు కావున పురూరవ మహారాజు చని దేవదేవుని ప్రసాదమున మనోహర కుసుమ రాసుల నలంకృతమైన అత్రిమహర్షి స్వయముగ నిర్మించిన శుభము శుభప్రదమునైన శ్రమశమనమైన యత్రి యాశ్రమమును జేరెను.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున అత్రిమహర్ష్యాశ్రమవర్ణనమను నూటయేబదియొకటవ అధ్యాయము.

## నూటయేబది రెండవ అధ్యాయము - ఆశ్రమ వర్ణనము

మార్కండేయఉవాచ:
తత్రయౌతౌ మహాశృంగౌమహా వర్ష్మమహీధరౌ । తృతీయంతుతయోర్మధ్యేశృంగ మత్యంతముచ్ఛ్రితమ్ ॥
నిత్యాత పంతప్త శిలంసదా భవతి వర్జితమ్ । తస్యాధస్తాద్వృక్షగణేదేశే భాగేచ పశ్చిమే ॥ 2
జాతీలతాపరిక్షిప్తం వివరం చారు దర్శనమ్ । దృష్ట్వైవకౌతుకావిష్ట స్సంవివేశ మహీపతిః ॥ 3
తమసాచాతిని బిడం నల్పమాత్రం మహీపతిః ! నల్పమాత్ర మతిక్రమ్య స్వప్రభాభరణో జ్జ్వలమ్ ॥ 4
సముచ్ఛ్రితమథా త్యంతం గంభీరం పరివర్తులమ్ । నతత్ర సూర్య స్తపతి నవిరాజతి చంద్రమాః ॥ 5

తథాపి దివసాకారం ప్రాకాశ్యంతద హర్నిశమ్ । క్రోశాధిక పరీమాణం సరసాచ విరాజితమ్ ॥ 6
సమంతాత్సరస స్తస్య శైలలగ్నాతువేదికా । సౌవర్ణై రాజతైర్వ్రాశ్మైర్విద్రుమై రపి శోభితా ॥ 7
నానామాణిక్య కుసుమైః స్వప్రభాభరణోజ్జ్వలైః । తస్మిన్సరసి పద్మాని పద్మరాగచ్ఛదానిచ ॥ 8
వజ్ర కేసరజాలాని సుగంధీని తథావ్యతి । పత్రైర్మరకతై ర్నీలై ర్వైదూర్యైశ్చ మహీపతేః ॥ 9
కర్ణికాశ్చ తథా శేషా జాతరూపస్య పార్థివః । తస్మిన్సరసియా భూమిర్వసాకర్దమ సంకులా ॥ 10
నానారత్నైరుపచితా జలజానాంసమాశ్రయా । కపర్దకానాం శుక్తీనాం శంఖానాంచమహీపతే ॥ 11
మకరాణాంచ మత్స్యా నాంపైండానాంకచ్ఛపైఃసహ । తత్రమర తక ఖండాని వజ్రాణిచ సహస్రశః ॥ 12
పద్మరాగేంద్ర నీలాని మహానీలాని పార్థివః । పుష్పరాగాణి రమ్యాణి తథాకర్కేతకానిచ ॥ 13
తురూకస్యచఖండాని తథాశేషస్యభాగశః । రాజావర్తస్యముఖ్యస్య రుధిరాఖ్యస్య చాప్యథ ॥ 14
సూర్యేందుకాంతయో శ్చైవ పీలోర్భల్లాత కస్యచ । జ్యోతీరసస్య రమ్యస్య శంఖకస్యచ భాగశః ॥ 15
మసార గవలంకానాం స్పటికస్య తథైవచ । గోమేదపి త్తకానాంచ ధూళీమర తకస్యచ ॥ 16
వైదూర్య సౌగంధిక యో స్తథా రాజమణేర్నృప ! ।

మార్కండేయుడనియె : అక్కడ రెండు శిఖరములు పర్వము మంచును నధికముగా గలవి. వాని నడుమ మూడవ శిఖరము మిక్కలి యెత్తైనది. అట నెల్లపుడు నెండగాయును. సప్త శిలము ఏడు శిలలు గలది. నక్షత్ర గతి యక్కడ యుండదు. దానికి క్రింద గపడమటి భాగమందు నక్షత్ర దర్శనమున్న తావున జాజిలతలతోడి యొక చక్కని వివర (రంధ్ర) మున్నది. రాజు కేవలము నల్వ మాత్రము కారు చీకటి గ్రమ్మినదియు నగు నా వివరముంజూచి తాను ధరించిన రత్నాభరణ ప్రభచే వెలుగు గొన్న యా లోతైన వర్తులాకారమైన ఫత్తైన సూర్య చంద్ర సంచారము లేని యా గుహలోనికిం జొచ్చెను. అట సూర్య చంద్రులు లేకున్నను నహర్నిశము పట్టపగల్లు వెలుగు నించుచుండును. క్రోసు కంటె మించి విశాలమైనది. అట నొక సరస్సున్నది. ఆ సరస్సు చుట్టునున్న శైలములపై వేదిక యొకటి యున్నది. ఆ వేదిక బంగారు వెండి పవడముల చెట్లచే శోభిల్లు చుండును. నానా విధ మాణిక్య కుసుమములతో గూడిన యాసరస్సు నందు పద్మరాగమణులట్టి పద్మములు గలవు. వాని కేసరములు వజ్రమయములు అయినను సువాసనలు వెదజల్లు చుండును వాని రేకులు నీలమరకత వైడూర్యమయములు. ఆ తామర పూవుల కర్ణికలు దుద్దులు స్వర్ణమయములు. ఆ సరస్సు క్రింది భూమి మట్టి గాదు నానారత్న స్థగితములయిన కమలముల కాశ్రయము. గవ్వలు ముత్యపు చిప్పలు శంఖములు మొసళ్లు చేపలు తాబేళ్లతో గూడిన పైండములు కేవలము మరకత వజ్రమయములు. పద్మ రాగేంద్ర నీల మహా నీల పుష్పరాగములు కర్కేతములు = తురూకములను మణుల ఖండములు గలవు. శేషము రాకావర్తము రుధిరము సర్వకాంత చంద్ర కాంతములు పీలువు భల్లాతకము జ్యోతీరసము శంఖము మసారము గవలంకము స్పటికము గోమేదము పిత్తకము మరకతము అను రత్నాలధూళి, వైడూర్యము సౌగంధము రాజమణి ముక్తాఫలము (ముత్యాలు) తారామూర్తులై (నక్షత్ర స్వరూపము లై యన్ని రత్నాలట ప్రకాశము నించుచుండును.

ఖంజస్య చైవముఖ్యస్య తథా బ్రహ్మమణేరపి ॥ 17
ముక్తాఫలానాం ముఖ్యానాం తారావిగ్రహధారిణామ్ । సుఖోష్ణం చైవతత్తో యంస్నానాచ్ఛీత వినాశనమ్ ॥ 18
వైదూర్యస్య శిలామధ్యే సరస స్తస్య శోభనా । ప్రమాణేన తథా సాచ ద్వేచరాజన్ధనుః శతే ॥ 19
చతురస్రాతథా రమ్యాతపసా నిర్మితాఽత్రిణా । బిలద్వార సమేదేశే కేతుస్తత్ర హిరణ్మయః ॥ 20
ప్రదేశః సతురాజేంద్రః ద్వీపేతస్మిన్మనోహరే । తథాపుష్కరిణీ రమ్యాతస్మిన్రాజన్బి లాతలే ॥ 20
సుశీతామల పానీయా జలజైశ్చవిరాజితా । ఆకాశ విమలా రాజన్ చతురస్రా మనోహరా ॥ 22
తస్యాస్త దుదకంస్వాదు లఘు శీతంసుగంధిచ । నక్షిణోతి తథాకాయంకుక్షి మాపూరయత్యపి ॥ 23

తృప్తింవిధత్తే పిబంతా శరీరేచమహత్సుఖం । మధ్యే చతస్యాః సుకృతం ప్రాసాదం తపసాత్రిణా ॥ 24
రుక్మసేతు ప్రవేశంత త్సర్వ రత్నమయం శుభమ్ । శశాంకరశ్మి సంకాశం ప్రాసాదం రాజతంహితమ్ ॥ 25
రమ్యం వైదూర్య సోపానం విద్రుమామల తారకమ్ ఇంద్రనీల మహాచక్రం జాతరూప విభూషితమ్ ॥ 26
పద్మరాగ మహాస్తంభం తథా మరకతవేదికమ్ । వజ్రాంశుజాలైశ్చురితం రమ్యం దృష్టి మనోహరమ్ ॥ 27
ప్రాసాదేత్రత భగవాన్దేవదేవో జనార్దనః భోగిభోగావళీసుప్తః సర్వాలంకార భూషితమ్ ॥ 28
జానుమాకుంచితంత్వేకం దేవదేవస్యచక్రిణః । ఫణీంద్ర సంనివిష్టాంఘ్రి ర్ద్వితీయశ్చతథానృప : 29
లక్ష్మ్యుత్సంగగతాంఘ్రిస్తు శేషభోగప్రసారితః । ఫణీంద్ర భోగవిన్యస్త బాహుకూర్పర శోభితః ॥ 30
స్వాంగుళీపృష్ఠవిన్యస్త దేవశీర్షధరం విభుమ్ । ఏకంతు దేవదేవస్య ద్వితీయం సంప్రసాదితమ్ ॥ 31
సమాకుంచితజానుస్థ మణిబంధసు శోభితమ్ । కించిదా కుంచితంచైవ నాభిదేశే కరస్థితమ్ ॥ 32
తృతీయంచ భుజంత స్యచతుర్థంతు తథా శృణు । ఆత్తసందాన కుసుమం ఘ్రాణదేశాను సర్పిణమ్ ॥ 33
లక్ష్మ్యాసంవాహ్యా మానాంఘ్రిం ఫుల్లపద్మని భైఃకరైః । సంతాన మాలాముకుటం హారికేయూర భూషితమ్ ॥ 34
భూషితంచ తథాదేవమంగదై రంగుళీయకైః । ఫణీంద్ర ఫణ విన్యస్త చారురత్నశిఖోచ్ఛలమ్ ॥ 35
అజ్ఞాతవస్తు చరితం ప్రతిష్ఠిత మథా త్రిణా । సిద్ధాంత పూజ్యం సతతం సమంతాత్కుసు మార్జితమ్ ॥ 36
దివ్యగంధావలిప్తాంగం దివ్యధూపేన ధూపితమ్ । గోరసైః సఫలైర్భృద్యై సిద్ధై రుపహృతైఃసదా ॥ 37
సంశోభితం పురః పార్శ్వం దేవముత్తమ శీర్షకమ్ । తథా పశ్చాన్ముఖందృష్ట్వా వవందే సనరాధిపః ॥ 38
జానుభ్యాం శిరసాచైవ గత్వాభూమిం యథా విధి । నామ్నాం సహస్రేణ తథా తుష్టావ మధుసూదనమ్ ॥ 39
ప్రదక్షిణమథో చక్రే సతూత్థాయ పునః పునః । రమ్యమాయతనందృష్ట్వా తత్రోవాసాశ్రమేనృపః ॥ 40
విశాలాంచ గుహాంకాంచిదా శ్రిత్యసుమనోహరామ్ । తపశ్చకారతత్రైవ పూజయానో జనార్దనమ్ ॥ 41
నానారసైః సదాపుష్పైః ఫలైర్మాలైః సగోరసైః । నిత్యంత్రిషవణస్నాయీ వహ్నిపూజా పరాయణః ॥ 42
దేవవాపీజలైః కుర్వన్స తతంప్రాణధారణమ్ । సర్వాహార పరిత్యాగం సకృత్వా మనుజేశ్వరః ॥ 43
అనాశ్రిత గుహాశాయీ కాలంనయతి పార్థివః ।
త్యక్తాహారక్రియ స్యాస్య కేవలాంభోఽ శిన స్తథా । గ్లానిస్తస్య సమాయాతి నశరీరే తదద్భుతమ్ ॥ 44
ఏవం సరాజా తపసిప్రసక్తః సంపూజయన్దేవ వరంసదైవ ।
తత్రాశ్రమే కాలమువాస కంచిత్ స్వర్గోపమే దుఃఖమ విందమానః ॥ 45

ఇతి శ్రీ విష్ణు ధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
ఆశ్రమవర్ణనోనామ ద్విపంచాదశదధిక శతతమోఽధ్యాయః.

ఆ సరస్సునందలి నీరు వెచ్చనై స్నానయోగ్యమై సుఖకరముగ నుండును. వైఢూర్యశిలా మధ్య మందు రెండు వందల ధనుస్సుల విశాలమై నలుచదరమై అత్రి మహర్షి తపస్సుచేత నిర్మించిన రమ్యమైన బిలద్వారము వంటి ప్రదేశ మందు స్వర్ణమయమై జెండావలె నొక చక్కని భూమి ద్వీపమున్నది. ఆ రమ్య ద్వీపమధ్య మందు పుష్కరిణి యున్నది. అందులో నున్న ఒక్క శిలా తలమందు మిక్కిలి చల్లని స్వచ్ఛమైన నీరుగలది తామరపూవులతో నున్నది. ఆకాశమట్లు నిర్మలమై నలుచదరముగ మనోహరమైన యా పుష్కరిణి యొక్క నీరు మధురము లఘువు (తేలికది) చల్లనిది. సువాసన వెదజల్లునది. శరీరము కృశింప నీయదు. కడుపును నిండచేసి పరమతృప్తి నిచ్చును. శరీరమున కెంతేని సుఖమిచ్చును.

ఆపుష్కరిణి నడుమ చక్కని శిల్పము గలది అత్రిమహర్షి తపశ్శక్తిచే నిర్మించిన ప్రాసాదము (రాజసౌధము) గలదు. ఆ సౌధమునకు పోవుటకు బంగారు సేతువు గలదు. ఆ సౌధము సర్వరత్నమయము చంద్రకిరణ సదృశము. రజతమయము.

వైడూర్య రత్న సోపానములుగలది. ఫ్షిద్రుమములు (పవడములు) అందు తారకల (చుక్కల) వలె మెరయుచుండును. ఇంద్ర నీలములు చక్రాకారముగ పొదుగబడినవి. స్వర్ణభూషితము. పద్మరాగమయ స్తంభములు, మరకతమయ వేదికలు వజ్ర కిరణ స్ఫురణముగలిగి చక్కనై చూపులను మనస్సును హరించును. ఆ ప్రాసాదమందు దేవదేవుడగు విష్ణువు సర్వాలంకారములు పెట్టుకొని భోగి (శేష) భోగతల్పమునందు శయనించి యుండును. ఆ చక్రి మోకాలు ముడిచి కొనియుండును. రెండవ పాదము ఫణీంద్రునిపై లక్ష్మీదేవి యొడిలోనికి ప్రసారితమై యుండును. స్వామి యొకచేయి వంచి మణికట్టు మోకాలి కానించి యుండును. రెండవ హస్తము నాభి దేశమందుండును. మూడు నాల్గుహస్తములు కల్పవృక్ష ప్రసూనములూని నాసిక దగ్గర నుంచి వాసన చూచుచున్నట్లుండును. విప్పారిన తామర పూలట్లు మృదులములైన చక్కని హస్తములలో లక్ష్మి పాదములొత్తుచుండును. కల్పవృక్ష కుసుమ మాలలు కిరీటముగ జుట్టుకొని హారకేయూరభూషితుడై భుజకీర్తులు దాల్చి ఉంగరములు పెట్టుకొని ఫణీంద్ర ఫణాగ్రమందానించిన చక్కని రత్నాలంకృతమైన కొప్పుతో నేరికిం దెలియరాని యపూర్వకథా మధురమైన చరిత్రగలిగి అత్రిమహర్షిచే ప్రతిష్ఠితమై యా శేషశయన మూర్తి నిరంతరము సంతానతరు పుష్ప సముచ్చయముచే సిద్ధాంతానుసారము (కల్పోక్త ప్రకారమన్నమాట) పూజింపబడు చుండును. ఆ మూర్తి నిండ దివ్యగంధములు పూయబడును. దివ్యధూపములాఘ్రాణింప బడును. తియ్యని గోరసములు పండ్లు సిద్ధులుగొని తెచ్చినవి నిత్యమా స్వామికి నివేదింప బడుచుండును. పురూరవ చక్రవర్తి శిరస్సు శేషఫణిపడగల నొత్తుగా నానించి యొక ప్రక్కగా పండుకొనిన పశ్చిమముఖుడైన స్వామిని దర్శించి మోకాళ్ళు భూమినానించి వంగి శిరస్సు వంచి వందనము కావించెను. విష్ణునామ సహస్రమున నమ్మధు సూదను స్తుతించెను. ఆ పైలేచి పునఃపునః ప్రదక్షిణములు సేసెను. ఆ దేవాలయపు నందము చూచి రాజక్కడనే విశాలమైన యొక గుహలో జేరి యటనివసించెను. శ్రీహరిని పూజించుచునట తపస్సు చేసెను. నానావిధ ఫలములను గోరసములను నానుచు నిత్యము త్రిషవణ స్నానము నాచరించి యగ్నిహోత్రము సేయుచు దేవవాపీజలములం గ్రోలుచు ప్రాణధారణము సేసెను. ఆ మ్మనుజేశ్వరుడట సర్వాహార పరిత్యాగము సేసెను. గుహలలో గాక యారుబయట పరుండి కాలము గడుపు చుండెను. ఆహారము మాని కేవలము నీరు ద్రావుచున్న యాతనికి మేనిలో గ్లాని (వాడుట) గలుగనేలేదు. అది యెంతేని వింత.

ఇట్లా రాజు తపస్సునందు మిక్కిలి సక్తుడై నిరంతరము దేవదేవుం బూజించుచు స్వర్గోపమమైన యాప్రదేశమం దేవగపు నొందక హాయిగ వసించెను.

ఇది శ్రీ విష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమునందు
అత్రి యాశ్రమ వర్ణనమను నూటయేబదిరెండవ అధ్యాయము.

## నూటయేబదిమూడవ అధ్యాయము - జలక్రీడా వర్ణనము

మార్కండేయ ఉవాచ : గత్వాశ్రమ పదేరాజా త్యక్తాహార పరిచ్ఛదః । క్రీడా విహారైర్గంధర్వైః పశ్యత్య ప్సరసస్సహ ॥
కృత్వాపుష్పోచ్చయం భూరి గ్రంథయిత్వాతథా స్రజః । అగ్రేనివేద్య దేవాయ గంధర్వేభ్యస్తథా దదౌ ॥ 2
పుష్పోచ్చయ ప్రసక్తా నాం క్రీడంతీనాం యథా సుఖమ్ । చేష్టానానావిధాహారాః పశ్యన్న పినపశ్యతి ॥ 3
కాశ్చిత్పుష్పోచ్చయేసక్తా లతాజాతేన వేష్టితాః । సఖీజనేన సంత్యక్తాః కాంతేనవరమోక్షితాః ॥ 4
మకరంద సమాక్రాంత నయనాః కాశ్చిదంగనాః । కాంతనిః శ్వాసవాతేన నీరజస్కీకృతేక్షణాః ॥ 5
కాచిదుచ్చిత్యపుష్పాణి దదౌ కాంతస్య భామినీ । కాంతసంగ్రథితై స్త్రైశ్చర రాజకృత శేఖరా ॥ 6
స్వయముచ్చిత్య సంగ్రథ్య రమణ కృతశేఖరా । కృతకృత్యమి వాత్మానంమేనే మన్మథ వర్ధినీ ॥ 7
అన్యస్మిన్గహనే కంజే విశేష కుసుమాలతా । కాచిదేవం రహోనీతా రమణేనరిరంసునా ॥ 8
కాంత సంనామిత లతా కుసుమాని విచిన్వతీ । సర్వాభ్యః కాచిదాత్మానం మేనే సర్వగుణాధికమ్ ॥ 9
క్వచిత్పశ్యతి భూపాలో నళినీషు పృథక్పృథక్ । క్రీడ్యమానాస్తు గంధర్వైర్దేవరా మామనోరమాః ॥ 10

కాచిచ్ఛాతాడయత్కాంతముదకేన శుచిస్మితా । తాడ్యమానా తథైవాన్యా కాంతేన రతిమాయయా ॥ 11
కాంతాతు తాడయామాస జాతఖేదా వరాంగనా । అదృశ్యత వరారోహా శ్వాసనృత్యత్పయోధరా ॥ 12
కాంతాంబు తాడన భ్రష్టకేశపాశని బంధనా । శ్వాసాకుల ముఖీభాతి మధుపైరివ పద్మినీ ॥ 13
స్వవక్త్ర సదృశైః పుష్పైః సంఛన్న నళినీ వనే । ఛన్నాకాచిచ్చిరాత్ప్రాప్తా కాంతే-నాన్విష్య యత్నతః ॥ 14
స్నాతాశేతాపదేశేన కాచిత్ప్రౌఢాంగనా భృశమ్ । రమణాలింగనం చక్రేమనోఽభిలషితంచిరమ్ ॥ 15
జలార్ద్రం వసనం సూక్ష్మ మంగలీనం శుచిస్మితా । ధారయంతీ జనంచక్రే కాచిత్త్రతస మన్మథమ్ ॥ 16

మార్కండేయుడనియె : రాజాశ్రమస్థానమునకేగి యాహార నిద్రలు మాని క్రీడా విహారులైన గంధర్వులతో గూడ యప్సరసల నాలోకించుచుండెను. సమృద్ధిగా బూవులుకోసి మాల గ్రుచ్చి విష్ణుదేవునికర్పించి గంధర్వులకు బ్రసాదముగా నొసంగుచుండెను. పుష్పాపచయ ప్రసక్తలై సుఖముగా క్రీడించుచున్న యప్సరస్సుందరుల నానావిధ విలాస వికారములం జూచుచుండియుం జూడడయ్యెను. పూలగోయుచు కొందరబలలు తీగలగుబురులం జుట్టుకొని సఖీజనముచే విడిపింపబడి ప్రియునిచేగూడ తప్పింపబడి మకరందరసము కన్నులంబడి రమణుల నిశ్శ్వాసవాయువులచే కంటిలో ధూళి యూదివేయబడి సుఖమందుచుండిరి. ఒక భామిని పూవులుకోసి కాంతుని కొసంగెను. వానిచే నతడు గట్టి పూలచెండు శిరమునం గట్టుకొనెను. స్వయముగా పూలుగోసి బంతి గట్టి యీయగార మఖుండది తలదాల్చ మన్మథవర్ధినియై యా బాల తనను కృతార్థురాలైనట్లు భావించుకొనెను. ఒక రమణీమణిరహస్యముగా గ్రీడింప నొకనిచే గహనమైన పొదరింటికిం గొంపోబడెను. ఒక మానిని తన మగడు తీగలుపంప నందుకొని పూలుగోయుచు సంభదికంటె తాన సౌభాగ్య గుణ సంపన్నురాలననుకొనెను. తామరకొలనునందు గంధర్వులతో గూడి వేర్వేర జలక్రీడ లాడుచు మనోహారిణులైన దేవరమణుల నా భూరమణు డొక్కచో దిలకించుచు నిలిచెను. అచ్చపు తెలినవ్వులం గులుకును నొక కులుకులాడి సొగసుకానిపై నీళ్ళం జిమ్మికొట్టెను. అట్లే యింకొక కాంత తన్ను కాంతుడుదకములం జల్లినంత నెంతేని రతి నొందెను. యొక సుందరి నిజసుందరుని సలిలములం జల్లిచల్లి యలసి నిట్టూర్పులం బాలిండ్లుతూగ కాంతు డుదకమల గొట్ట గొప్పవిరిసి శ్వాసాకులముఖియై తుమ్మెదలు పైనలమిన పద్మినివోలె విలసిల్లెను. తన మోమున కెనయైన పువ్వులతో గ్రమ్ముకొన్న పద్మినీవనమందొక వధూటి దాగికొని వల్లభుడు చాలసేపు యత్నించి యత్నించి వెదకికొన కొనకు గనవచ్చెను. ఒక్క ప్రౌఢాంగన (జాణ) స్నానము సేసి చలివేయునున్నదను నెపమున చిరకాలమునుండి తా ముచ్చటపడుచున్న రమణుని దాన గట్టిగ కౌగలించుకొనెను. ఒక పడతి కడుసన్నని జిలుగు తడిచీర గట్టుకొని యచ్చమైన చిఱునగవుల గులుకుచు మడువెడలి గట్టునకు వచ్చి యచ్చటి జనమ్ములను మన్మథ వివశులం గావించెను.

గంధమాల్య గుణైః కాచిత్ కాంతేనా కృష్యచాంభసి । త్రుట్యత్స్రగ్దామ పతితం రమణం ప్రాహసచ్చిరమ్ ॥ 17
కాచిన్మగ్న సఖీదత్త జానుదేశన ఖక్షతా । సంభ్రమాక్రాంతర మణమగ్నాసాఽపిపిన్యమజ్జత ॥ 18
కాచిత్పృష్ఠీ కృతాదిత్యా కేశనిస్తోయకారిణీ । శిలాతల గతాభ్రాన్తా దృష్టాకామార్త చక్షుషా ॥ 19
హృతమాల్యం సులలితల సంక్రాంత కుచకుంకుమమ్ । రతాంత క్లాంత కాంతాభమ భవత్తత్సరోదకమ్ ॥ 20
సుస్నాంత దేవగంధర్వ దేవరామాగణేనచ । పూజ్యమానం స దదృశే దేవదేవం జనార్దనమ్ ॥ 21

ఒక కామిని సుగంధ బంధుర కుసుమ మాలికా గుణంబుల (గుణములు = దారములు) నీటిలోనికి లాగికొని చని యా సూత్రములు తెగి యా నీటిలో బడిపోయిన సొగసుకానింగని మిక్కిలి తడవు పకపక నవ్వజొచ్చెను. నీటమునిగి చెలికత్తెలు మోకాలి కడ గోరుల గిచ్చినతరి (నఖక్షతము సేసినయెడ) విభ్రాంతయై కాంతుని కడకు ధూకి యతడు మునుగ దాను నాతనితో నీట మునిగెను. ఒక యంగన సూర్యునకు వెనుదిరిగి జుట్టు పిడిచికొనుచు నొక రాతిపై నిలువబడి కామార్తములయిన చూపులం మదనిచే జూడబడెను. పూలమాలలల్లుకొని కుచకుంకుమ లలమికొని యా సరోవర జలము రతతాంతయైన కాంతవలె జూడముచ్చట యయ్యెను.

చక్కగ స్నానములు సేసి దేవగంధర్వాప్సరః సుందరీగణము పూజించు దేవదేవుని జనార్దను నా పురూరవ సార్వభౌముడు దర్శించెను.

క్వచిచ్చ దదృశే రాజాలతాగృహ గతాః స్త్రియః । మండయంత్యః స్వగాత్రాణి కాంతసంన్యస్తమానసాః ॥ 22
కాచిదా దర్శసువ్యగ్ర కరా దూతీ ముఖోద్గతమ్ । శృణ్వతీకాంత వచన మతి క్లాంతముఖాబభౌ ॥ 23
కాచిత్సత్వరితా దూత్యాభూషణానాంవి పర్యయమ్ । కుర్వాణానైవ బుబుధే మన్మథా విష్టచేతనా ॥ 24

ఒక్కెడ లతాగృహములం జొచ్చి (పొదరిండ్లు సొచ్చి) కాంతులపై స్వాంతములుంచి తమ శరీరముల జక్కగ నలంకరించుకొను మించుబోణుల య్యెడనుండుట చూచెను. ఒక యిందువదన యద్దమట్టిట్టుగ నొరగు హస్తములతో దూతికల ముఖమునుండి వెడలు ప్రియవచనములాలించి మిక్కిలి వసివాడిన నెమ్మోమునం దీపించెను ఒక యింతి దూతిక తొందరవెట్ట మన్మథావిష్టమనస్కయై తాను నగలం దామమాపగ ధరించుటను గుర్తింపనేలేవయ్యె. (కాలికి పెట్టుకొనునగ చేతికి, ముక్కుకుపెట్టుకొనునది చెవికి నిట్లు మదనావేశమున మైమరచి ధరించినారనుట యిది శృంగారానుభవము).

వాయునున్నాంత సురభి కుసుమోత్కర మండితే । క్వచిత్పి బంత్యోదదృశే ప్రదేశే నీలశాద్వలే ॥ 25
పాయయామాస రమణం స్వయం కాచిద్వరాంగనా । కాచిత్ప పౌవరారోహా కాంత పాణి సమర్పితమ్ ॥ 26
కాచిత్స్వ నేత్రసంక్రాంత నీలోత్పల యుతం వధూః । పీత్వా ప ప్రచ్ఛరమణం క్వగతేతే మహోత్పలే ॥ 27
త్వయైవ పీతేతేనూన మిత్యుక్తారమణేనసా । సత్యం విదిత్వాముగ్ధత్వాద్బ భూవ వ్రీడితాచిరమ్ ॥ 28
కాచిత్కాం తార్పితం సుభ్రూః కాంతపీతావ శేషితమ్ । సవిశేష రసంపానం పపౌమన్మథ వర్ధనమ్ ॥ 29
ఆపాన గోష్ఠీషు తదాతా సాంసనర పుంగవః । శుశ్రావవివిధం గీతంతంత్రీ స్వరవిమి శ్రితమ్ ॥ 30
ప్రబోధసమయే తాశ్చ దేవదేవం జనార్దనమ్ । రాజన్సదోపనృత్యంతి నానావాద్య పురఃసరాః ॥ 31
యామమాత్రే గతే రాత్రావ నిర్జిత్య గుహా ముఖాత్ । ఆయాంతి సంయుతాః కాంతైః స్వబుద్ధిర చితాన్గృహాన్ ॥ 32
నానాగంధార్పిత తలాన్ నానాగంధ సుగంధినః । నానావిచిత్ర శయనాన్కు సుమోత్కర మండితాన్ ॥ 33

గాలికి జలజల రాలు పరిమళభరిత పూలజల్లుల నుల్లసించు చల్లని నీడల నీల శాద్వలములు (పచ్చికబయళ్ళ) నొక్కెడ నాసవముం ద్రావు నంగనామణులు గానవచ్చిరి. అందొకతె తానతాన వల్లభుం ద్రావించుచుండెను. వల్లభుడు తనచేత త్రావింప ద్రావుచుండెను. ఒక్క మానవతి ఒక్కయెడ నొక మధపతి త్రాగి తన నేత్రములందు (ముద్దువెట్టుకొన్నపుడు) భర్త చేతిలో నల్లగలువలు తాకియు తాకిన దెరుగక మైమరచి నీ చేతిలోని కలువపూజంట యెటువోయెనని ప్రశ్నించెను. వానిని నీవే త్రాగివేసితివి నిజమని మగడన ముగ్ధ గావున నిజమనుకొని జగడముసేయక చాలసేపు బిడియపడి యూరకుండెను. ఒక సుభ్రువు (సొగసైన కనుబొమ్మలు కలది) తన కాంతు డందించిన తన కాంతుడు త్రాగి మిగిలినది కావున నందెతో విశేష రుచి కలదని మన్మథవర్ధనమైన యా మధువును దాను ద్రావినది. పానగోష్ఠులందు (పానశాలలో త్రాగుబోతులు గుంపులు గుంపులుగా గూర్చుండి త్రావుచుందురు గావున దానిని పానగోష్ఠియని కవులు పేర్కొనుచుందురు.) త్రావి యా యువిదలు తంత్రీస్వర సమ్మేళనముగ బాడు నాటి గీతములు నా నరపుంగవుడప్పుడక్కడాలించెను. ఆ యంగనామణులును ప్రబోధ సమయమందు దేవదేవు నెదుట నానావాద్య సమ్మేళనముగ నుపనర్తించుచుండిరి (శివుడు నర్తించునని యాయనతోడ వెనువెంట నాగును న [illegible]

వయంహితే ప్రదాస్యామో మనసః కాంక్షితాన్వరాన్ । తానాదాయ గృహంగచ్ఛ తిష్ఠేహయదివాపునః ॥ 36
పురూరవాఉవాచ : అమోఘదర్శనాస్సర్వే భవంత స్త్వ మితౌజసః । వరం వితరతాద్యైవ ప్రసాదం మధుసూదనాత్ ॥ 37
మార్కండేయ ఉవాచ :
ఏవమ స్త్విత్యథోక్త స్తైః సతురాజాపురూరవాః । తత్రోవాస సుఖీమాసం పూజయానో జనార్దనమ్ ॥ 38
ప్రియఏవ సదైవాసీ ద్గంధర్వాప్సర సాంనృప । తుతోష సజనో రాజ్ఞస్త స్యాలౌల్యేన కర్మణా ॥ 39
మఘస్యమధ్యేస నృపః ప్రవిష్ట స్తదాశ్రమం రత్నసహస్ర చిత్రమ్ ।
తోయాశ నస్తత్ర ఉవాసమాసం యావత్సితాంతంన్నృప ఫాల్గునస్య ॥ 40

ఇతి శ్రీ విష్ణు ధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
జలక్రీడా వర్ణనంనా మత్రిపంచాదశధిక శతతమోఽధ్యాయః ॥

ఇట్లా మహారాజా పర్వతముపై నా యప్సరో యువతీమణుల క్రీడలును వనకేళీ విహారములను జూచుచు మాధవార్పిత మానసుడై తపస్సు చేసెను. అతని దరికేగి గంధర్వాప్సరోగణము లో అరిమర్దన! నీవు స్వర్గోపమమైన దేశమునకు వచ్చితివి. మేము నీకు మనసైన కోరికలను వరముల నిత్తుము. వానిం గొని నీ యింటికిం జనుము. లేదా మరి యిక్కడనే యుండుము. అనిరి. పురూరవుడు మీరోజస్సమృద్ధులు. అమోఘ దర్శనలు. మీ దర్శనము వ్యర్థముకాదు. విష్ణునివలన ప్రసాద మిది వరముం దయసేయుడు అన అట్లయగుగాకయని వారన నాప్రభువు హరి నారాధించుచు నొక్కనెల యటనే యుండెను. వజ్రమహారాజా! అతడక్కడ గంధర్వాప్సరసల కెల్లతరిం జాలప్రియుడయ్యెను. ఆజనమును లౌల్యములేని యాతని యనుష్ఠానమున కెంతేని సంతోషించెను. మాఘమాసము నడుమ నాతడారత్న సహస్ర చిత్రమైన యాశ్రమముం బ్రవేశించి జలాశనుడై నీరుమాత్రమేత్రావుచు ఫాల్గునశుక్లపక్షము చివరదాక యటనే యుండెను.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున జలక్రీడావర్ణనమను నూటయేబదిమూడవ అధ్యాయము.

## నూటయేబదినాల్గవ అధ్యాయము - పురూరవునకు అత్రిమహర్షి దర్శనము

మార్కండేయఉవాచ :
ఫాల్గునామల పక్షాంతే రాజాస్వప్నే పురూరవాః । తస్యైవదేవదేవ స్యశుశ్రావ గదితం శుభమ్ ॥ 1
రాత్ర్యా మస్యాంవ్య తీతాయాం మంత్రిణా త్వంసమేష్యసి । తేన రాజన్స మా గమ్యకృతకృత్యో భవిష్యసి ॥ 2
స్వప్న మేవం సరాజర్షి ర్దృష్ట్వా విపుల విక్రమః । ప్రత్యూషకాలే విధివత్స్నాతః ప్రాగ్వదతంద్రితః ॥ 3
కృతకృత్యో యథా కామం పూజయిత్వా జనార్దనమ్ । స్వప్నంతద్దేవ దేవస్యన్యవేదయతధార్మికః ॥ 4
తతఃశుశ్రావవచనం దేవతార్చా సమీరితమ్ । ఏవమే తన్మహీపాల! నాత్రకార్యా విచారణా ॥ 5
ఏవం ప్రసాదం సం ప్రాప్యదే వదేవాజ్జనార్దనాత్ । కృతకృత్యమివాత్మానం మేనేసనరపుంగవః ॥ 6
కృతదేవార్చనో రాజా తదాహుతహుతాశనః । జగాద సుహృదాంతేషాం ప్రసాదం మధుసూదనాత్ ॥ 7
తమూచుశ్చతదా సర్వేరాజానమ పరాజితమ్ । విదధాతు ప్రసన్న స్తే దేవదేవో జనార్దనః ॥ 8
అప్రసన్నే జగన్నాథే దేశేఽస్మిన్నృప కస్యచిత్ । నగతిర్విద్యతే రాజంస్త్వంచ దేశమిహాగతః ॥ 9
సుఖం ప్రాప్నుహిభద్రంతే భూయ ఏవహితేప్సితాన్ । ప్రసాదయిత్వాతే కామాన్ దేవః సర్వగతః ప్రభుః ॥ 10
ఏవముక్త్వానరేంద్రంతం గంధర్వాప్సర సాంగణాః । జగ్ముః క్రీడా విహారార్థం యథా పూర్వ మరిందమ ॥ 11

మార్కండేయుడనియె. ఫాల్గున శుక్లపక్షము చివర పురూరవ మహారాజు కలలో నా దేవదేవుని పలుకులు వినెను.

ఈరేయి గడువ నీవు నీ మంత్రిని కలిసికొందువు. నీవందువలన కృతకృత్యుడయ్యెదవు. ఆరాజర్షి ఇట్లు కలగని వేకువ వేళ నెప్పటియట్లు యథావిధిగ స్నానముసేసి యెట్టి తొందరగొనక తా గోరినయట్లు విష్ణుపూజసేసి యా ధార్మికుడా స్వప్నమును హరికి నివేదించెను. అప్పల అర్చామూర్తి నుండి ఇది యిట్లేయగును. ఓ మహీపతి! ఇక్కడ నాలోచింపవలదు అను పలుకు వినెను. ఇట్లు జనార్దనుని ప్రసాదము నొంది యతడు తాను గృతార్థునిగ భావించెను. దేవతార్చనగావించి యగ్నిని వేల్చి మధుసూదనునివలని యనుగ్రహ మాత్మసఖులకుం జెప్పెను. వారెల్లరు నాతనితో ప్రసన్నుడై విష్ణువు నిన్నపరాజితుం గావించుగాక! ఆ జగత్పతి ప్రసన్నుడు గాడేని యీ ప్రదేశమున కెవ్వనికి దారి దొరకదు. రాజా! నీ వీ ప్రదేశమునకు వచ్చితి సుఖమందుము. నీకు భద్రమగుంగాక! సర్వగతుడైన యా ప్రభువు నీయభీష్టములన్నిటిని నెరవేర్పగలడు. అని గంధర్వాప్సరో గణము లా రేనితో బలికి మునుపటియట్ల క్రీడావిహార మొనరింపనేగిరి.

అథాజగామ తందేశం బ్రహ్మణోమానసః సుతః । త్రిజగద్యశసాంస్థాన మత్రిస్సుర గణార్చితః ॥ 12
తమాగతం ముని వరం దృష్ట్వా రాజా పురూరవాః । పాద్యార్ఘ్యాచమనీయాద్యైరా సనే నాభ్యపూజయత్ ॥ 13
సంపూజ్యచ మహాభాగమిదంవచన మబ్రవీత్ । అద్యమే సఫలం జన్మ అద్యమే సఫలంతపః ॥ 14
యత్తేదేవగణై ర్వంద్యౌవందితౌ చరణౌమయా । శ్రేయః ప్రసూతి వృక్షస్య ప్రరోహ స్తవ దర్శనమ్॥ 15
సర్వ పాపాంతకరణం సర్వకల్యాణ కారణమ్ । కింవానలభ్య మస్తి హతేషాంద్వి జవరోత్తమ ! 16
అమోఘదర్శనే దృష్టేభవత్యమిత తేజసి । ఏవముక్త స్తదా రాజ్ఞాసంప్రసన్నో జగాదతమ్ ॥ 17

అటుపైని బ్రహ్మమానస పుత్రుడు ముల్లోకముల కీర్తికి స్థానమునైన యత్రి మహర్షి సురగణ పూజితుడచ్చోటికి దయచేసెను. ఆ వచ్చిన మునివరుం దర్శించి రాజు పాద్యార్ఘ్యాచమనీయాసనా ద్యుపచారములం బూజించి యిట్లనియె. ఇపుడు నా పుట్టువు సఫలమైనది. ఇపుడు నాతపస్సు ఫలించినది. వేల్పులెల్ల పూజించు నీపాదములను నేనిపుడు పూజింప గల్గితిని. నీదర్శనము శ్రేయఃప్రసూతి వృక్షమునకు అంకురము. ఇది సర్వ పాపాంతకరము. సర్వకల్యాణ కారణము. ఓ ద్విజవరశ్రేష్ఠా! మహాతేజస్వివగు నీదర్శనమయినవారికి అమోఘుడవగు నిను దర్శించిన వారికి యిట మరి లభ్యముకాని దేమున్నది? అని రాజు పలుక ఋషిరాజు ప్రసన్నుడై యతనికిట్లనియె

శృణురాజన్వచోమహ్యం యత్తేవక్ష్యామి సువ్రత ! । దేవదేవ సమాదేశాద్దత్తంతే దర్శనంమయా ॥ 18
సుప్రసన్నోహిభగవాన్దే వస్తే మధుసూదనః । ద్వాదశీషు సదా రాజన్నో పవాసేన నిత్యశః ॥ 19
పూజితో భగవాన్విష్ణు స్త్వయాతీతేతు జన్మని । రాజసేనతు భావేన త్వయాదేవః సమర్చితః ॥ 20
అవరం కామమాశ్రిత్య రాజన్నిహత కంటకమ్ । సాత్త్వికేనతు భావేన పూజయిత్వాజనార్దనమ్ ॥ 21
రాజ్యం మదేష సంప్రాప్తం నిష్కంటకమరిందమ ! । ద్వాదశ్యర్చా ప్రసన్నేన దేవదేవేన చక్రిణా ॥ 22
ప్రదర్శితమిదం స్థానం మదీయం స్వర్గసన్నిభమ్ । ఇహరాజం స్త ప స్తప్త్వా దేవదేవంనార్దనమ్ ॥ 23
ఆరాధ్యదృష్టవానస్మి పురావర్షగణాన్బహూన్ । ప్రాప్యాను జ్ఞాంహృషీకేశా త్తత్కృతే వివరేశుభే ॥ 24
నిత్యంసన్నిహితారాజం స్తస్యై వార్చాస్వ వినిర్మితా । నియోగాద్దేవదే వస్య పూజ్యతే సిద్ధసత్తమైః ॥ 25

రాజా! నామాటవినుము. నీవ్రతము సువ్రతమైనది. విష్ణునాజ్ఞచే నీకు నేదర్శనమిచ్చితిని. భగవంతుడు నీయెడనెంతేని యనుగ్రహము జూపినాడు ద్వాదశులందుపవాసముసేసి నీవు గడచిన జన్మమందు విష్ణుదేవుని రాజసభావముతో నవరము (అంత మంచిది కానిది) అయిన కోరికనుగొని యర్చించితివి. తరువాత సాత్వికభావముతో నర్చించితివి. కాన నీకిపుడు నిష్కంటకమైన మద్రరాజ్యము లభించినది. ద్వాదశీ సమర్చనమున బ్రసన్నుడైన దేవదేవుండు చక్రాయుధుడు స్వర్గతుల్యమైన యీ నా ఆశ్రమ స్థానముం జూపించెను. ఇక్కడ తపస్సుచేసి పెక్కేండ్లు హరిం గొలిచి యీ స్థానముంగంటివి. హృషీకేశు ననుజ్ఞ వడసి యాయన యొనరించిన యీ శుభ పదమైన వివరమందు ఆ శ్రీహరి యర్చనము నిత్యసన్నిహితముగ నేర్పరుపబడినది. ఆ దేవదేవుని నియోగమున సిద్ధవరులిట హరిపూజ గావింతురు.

నేయంద్రష్టా మనుష్యేంద్ర! మనుష్యైర్న పరాక్షసైః । పిశితాశైస్త థైదానైర్ద్రష్ట పూర్వాకథంచన ॥ 26
అస్మిన్స్వర్గో పమేదేశేత్వయాలౌల్యేన కర్మణా । ఆరాధితో జగన్నాథో దేవశ్చక్రగదా ధరః ॥ 27
ఆసన్నఫలమూలేఽపిబహుగోరస సంయుతే । షాద్రియుక్త శిలా ప్రాయే సమాక్షిక ఫలైర్యుతే ॥ 28
కేవలాంభోశినాతప్తం యత్త్వయా పరమంతపః । తేనతేహం వరందద్మియదభీష్టం తవానఘ! 29
అచిరేణైవకాలేన త్వయారాజన్కృతం తపః । రూపార్థం రూపలాభాయ ప్రాప్తంమే గదతఃశృణు ॥ 30
తద్వ్రతం యేకరిష్యంతి మనుజేశ్వర మానవాః । స్త్రియోఽథవానర శ్రేష్ఠ ప్రాప్స్యంతే రూపముత్తమమ్ ॥ 31
సౌభాగ్యమతులం లోకే లావణ్యమపి చోత్తమమ్ । ధర్మిష్ఠతాం తథా రోగ్యం కులేజన్మ తథోత్తమే ॥ 32
జన్మాంతర మథాసాద్యస్వర్గ లోకం తథా విధమ్ । స్వర్గలోకాత్పరి భ్రష్టామానుష్యే గుణసంయుతాః ॥ 33
బ్రాహ్మణా ధనసంపన్నాభవిష్యంత్యథవానృపాః । జన్మాంతర మథాసాద్య సర్వస్యైవ ఫలప్రదాః ॥ 34
రూపవంతో మహారాజ ఇహాముత్రచతేఽనఘాః । యస్మాత్త్వయా తపస్తప్తం కేశవశ్చాథ పూజితః ॥ 35
మయాసమాగతశ్చాపి గంధర్వైశ్చసహస్రశః ఇహైవకృత్వాథధర్మజ్ఞ! రూపసత్రంమహాఫలమ్ ।
దివ్యరూపధరో భూత్వాస్వరాష్ట్రంగంతు మర్హసి ॥ 36
ఏతావదుక్తః సతుమద్రనాథో మహాత్మనాతేన నరేంద్ర సింహః ।
పప్రచ్ఛతం ధర్మభృతాం వరిష్ఠః సత్రస్య తస్యాగముజం విధానమ్ ॥ 37

ఇతి శ్రీ విష్ణు ధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
పురూరవసోఽతిదర్శనం నామ చతుః పంచాశదధిక శతతమోఽధ్యాయః.

ఈ యర్చనను మనుజులుతప్ప మరియెవ్వరు మాంసాశనులు రాక్షసులు చూడలేరు. ఈ స్వర్గోపమమయినచోట నీవుచేసిన లౌల్యములేని కర్మముచే (నిష్కామ కర్మముచేత) చక్రగదాధరుడు జగదాధారు డర్చితుండయ్యె. పండ్లుదుంపలు నందుబాటులో నున్నను పెక్కు గోరసములు తేనెతోలుకు శిలలు సమృద్ధిగనున్నను తేనెలూరు పండ్లు నిండుగానున్నను కేవలము జలాశనముసేసి నీవు పరమ తపస్సుసేసినావు. అందుచే నీకేను నీ కోరిన వరమిచ్చుచున్నాను. నీ వీ తపస్సు రూపముగోరి చాల స్వల్పకాలమే సేసితివి. రూపనిమిత్తమైన వ్రతమును స్త్రీలేని పురుషులేని యిట నొనరించినవారు ఉత్తమరూపముం బొందుదురు. అనుపమాన సౌభాగ్యమును అత్యుత్తమ లావణ్యమును ధర్మిష్ఠతను (ధర్మనిష్ఠను) ఆరోగ్యమును ఉత్తమకుల జన్మమును బొందుదురు. అటుపై నింకొక జన్మమొంది పైవిధమయిన స్వర్గముంబొంది యటనుండి తిరిగి యిటకుజారి మానవలోకమందు గుణవంతులయిన బ్రాహ్మణులయి ధనసంపన్నులగుదురు లేదా రాజులగుదురు. అటుపై మరొక జన్మమంది సర్వఫలప్రదులై పరమందు నా పుణ్యాత్ములు రూపవంతులుగ రూపొందుదురు. నీవు తపమాచరించితివి కేశవస్వామి నర్చించితివి నాతో సమాగమమునుం బొందితివి. వేలకొలది గంధర్వుల గలిసికొంటివి. ఇక్కడనే నీవు మహాఫలమైన రూపసత్ర మాచరించి దివ్యరూపధారివై నీరాజ్యమున కేగదగుదువు. అని యింతదాక విష్ణువు పలుక మద్రనాధుడు ధర్మనిష్ఠులలో పరిష్ఠుడా పురూరవ మహారాజ శ్రేష్ఠుడా సత్రమునకు సంబంధించిన విధానముం గూర్చి యమ్మహర్షిం బ్రశ్నించెను.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండము పురూరవునకగ్నిమహర్షి సందర్శనము నూటయేబదినాల్గవ అధ్యాయము.

## నూటయేబదియైదవ అధ్యాయము - రూపసత్రవర్ణనము

పురూరవా ఉవాచ : శ్రోతుమిచ్ఛామి భగవన్రూప సత్రం మహాఫలమ్ ।
యత్సమాప్తౌ భవిష్యామి దివ్య రూపధరోమునే ॥ 1

అత్రిరువాచ : తత్సత్రం కర్తుకామేన చాన్వేష్యో బ్రాహ్మణోగురుః ।
జ్యోతిషం యోవిజానాతి ఇతిహాసాంశ్చ కృత్స్నశః ॥ 2
తత్ప్రదిష్టేన విధినా పాదర్క్షాత్ప్రభృతి క్రమాత్ । ఉపోషితవ్యం నక్షత్రం ప్రత్యేకం తన్నిబోధమే ॥ 3
ఫాల్గున్యాం సమతీతాయాం కృష్ణపక్షాష్టమీతుయా । సమూలాం తాంతు సంప్రాప్య వ్రతం గృహ్ణీత మానవః ॥ 4
ఉపోషితవ్యం నక్షత్రం నక్షత్రస్యచ దైవతం । వరుణంచ తథా చంద్రం పూజయేద్విధినానరః ॥ 5
పూజయేద్దేవదేవేశం భగవంతంజనార్దనమ్ । ఉపోష్య సంగం దేవస్య ప్రయత్నేనచ పూజయేత్ ॥ 6
తతోగ్ని హవనం కృత్వాపూజయిత్వాతథా గురుమ్ । ఉపవాసస్తుకర్తవ్యోద్వితీయేహని పార్థివ ॥ 7
ఉపోష్యఋక్షేవిగతే స్నాత్వా సంపూజ్యకేశవమ్ । కృత్వాగ్ని హవనం శక్త్యాపూజయిత్వాద్విజోత్తమాన్ ॥ 8
హవిష్య మన్నం భోక్తవ్యం శృణుచాంగ క్రమం మమ । పాదయోః కథితం మూలం ప్రాజాపత్యంతు జంఘయోః ॥ 9
ఆశ్వినం జానుయుగలం చోరుయుగ్మంచ పార్థివః । సహితేద్వే తథా షాఢేగుహ్యేచ సహితేస్మృతే ॥ 10
పూర్వోత్తరేచ ఫాల్గున్యౌకృత్తికాసు కటిర్భవేత్ । పార్శ్వయోః కుక్షియుతయోర్నక్షత్రత్రియంమతమ్ ॥ 11
ఉభేప్రోష్ఠపదే రాజన్రేవతీచ తథాభవేత్ । ఉరోఽనురాధాసుతథా పృష్ఠనిష్ఠ్యాసు కీర్తితమ్ ॥ 12
భుజౌజ్ఞేయౌ విశాఖా సుహస్తే ప్రోక్తౌ తథాకరౌ । అంగుల్యశ్చ తథాప్రోక్తా రాజసింహపునర్వసౌ ॥ 13
ఆశ్లేషాయాం తథాప్రోక్తా జ్యేష్ఠాయాం నృపకంధరా । శ్రవణౌ శ్రవణౌజ్ఞేయే ముఖంపుష్యే ప్రకీర్తితమ్ ॥ 14
దంతాః స్వాతౌశతభిషా హనూప్రోక్తా తథాన్నృప! । మఘాయాం నాసికాప్రోక్తా మృగశీర్షంచలోచనే ॥ 15
చిత్రాలలాటే విజ్ఞేయా భరణ్యశ్చతథాశిరః । శిరోరుహాస్తథార్ద్రా సువ్రతస్యాంతే నరాధిప! ॥ 16
మాఘశుక్లావసానేతు సత్రం పరిసమాప్యతే । యద్యంతరాయం నభవేత్ కించిచ్ఛౌ చనిమిత్తజమ్ ॥ 17
అంతరాయం మహారాజ! యదిశౌచ నిమిత్తజమ్ । ఉపోషమేవో పవసేన్నక్షత్రమపరం పునః ॥ 18
క్రమప్రాప్తం హినక్షత్రం చాశుద్ధ్యామప వర్జితమ్ । ఉల్లంఘయన్మహీపాల! ప్రత్యవాయం సమశ్నుతే ॥ 19
అంగక్రమేణసకలం ఋక్షవర్గము పోషితః । వ్రతాంతే ప్రయతః స్నాత్వా పూజయేన్మధుసూదనమ్ ॥ 20

పురూరవ చక్రవర్తి ఓఋషి చక్రవర్తీ! మహాఫల వ్రవమగు దేనిసమాప్తి యందు దివ్యరూప ధరుండనగుదు నా రూప సత్రముంగూర్చి విన వేడుక గొంటిననత్రి యిట్లనియె : రూపసత్రము సేయగోరు నతడు మొట్టమొదట జ్యోతిషము ఇతిహాసములను నెఱింగిన బ్రాహ్మణుని గురువుగా వెదకి కొనవలెను. ఆయన చెప్పినట్లుగా నక్షత్ర పాదమునుండి ఒక నక్షత్రము పూర్తియగు దాక ఉపవాసముండ వలయును. ఫాల్గున మాసమందు బహుళాష్టమి మూలానక్షత్రముతో గూడిన నాడు వ్రత సంకల్పము సేయ వలయును. ఆ నక్షత్ర మంతయునుపవసించి ఆ నక్షత్రాధిదైవత మగు వరుణుని చంద్రుని యథావిధిగ బూజించి విష్ణువును బూజింప వలెను.

### ప్రత్యంగ పూజావిధానము :-

ప్రత్యంగ పూజా విధానము వినుము. పాదములందు మూలానక్షత్రము ప్రాజాపత్య నక్షత్రము (రోహిణి) పిక్కలందు మోకాళ్లయందు తొడలయందు గుహ్యమందు పూర్వోత్తరాషాఢలు కటి(నడుమునందు) పూర్వోత్తర ఫల్గునులు కడుపు ఇరుపార్శ్వములందు పూర్వోత్తర ప్రోష్ఠపదములు అనగా పూర్వాభాద్ర ఉత్తరాభాద్ర రేవతి వక్షమునం దనూరాధ పృష్ఠమునందు నిష్ఠ్యలు రెండు భుజములందు విశాఖ రెండు చేతులందు హస్త వ్రేళ్లయందు పునర్వసువు మెడయందు ఆశ్లేష జ్యేష్ఠయును శ్రవణమందు (చెవులందు) శ్రవణ నక్షత్రము ముఖమందు పుష్యమి దంతములందు స్వాతి చెక్కిళ్లయందు శతభిషము ముక్కునందు మఘ కన్నులందు మృగశిర నుదుటియందు చిత్తశిరస్సునందు భరణి జుట్టునందు ఆర్ద్రము పూజా నక్షత్రములుగా జెప్పబడినవి. శౌచ

నిమిత్తమైన యభ్యంతరము నడుమ కల్గినచో మాఘశుద్ధిపూర్ణిమతో నీ వ్రతము పూర్తి యగును. నడుమ నేమేని యంతరాయము గల్గినచో తరువాతి నక్షత్రమందుపవాసము సేయవలెను. అనాచారము (అశుచి) గల్గినపుడు, వరుసగా వచ్చిన నక్షత్రమును వర్జించ వలెను. పూజావిధానము నందు మాత్రము నక్షత్రోల్లంఘనము సేసినచో ప్రత్యవాయము (దోషము) వచ్చును. అంగక్రమమునను నక్షత్రముల యందుపవసించి వ్రతాంతమున నాచారవంతుడై స్నానము సేసి జనార్దను నర్చింప వలెను.

చందనాగురుకర్పూర మృగదర్పైః సకుంకుమైః । జాతీఫలైః సకంకోలై ర్లవంగ కుసుమైస్తథా ॥ 21
బోల గుగ్గుల నిర్యాసైః పుష్పైః కాలోద్భవైః శుభైః । ధూపోనరేంద్రాగురుణా చందనేన సుగంధినా ॥ 22
దీపాశ్చదేయా రాజేంద్ర! తిలతైలప్రపూరితాః । దీపేషువర్తయః కార్యాః మహారంజనరంజితాః ॥ 23
నైవేద్యంచతథా కార్యం పరమాన్నేన భూరిణా । దధ్నాక్షీరామృతా భ్యాంచ మధునాచ గుడేనచ ॥ 24
సితయాచతథాభక్ష్యైః ఫలమూలై ర్యథావిధి । అపూపైః పానకైర్హృద్యైః శీతలైశ్చ సుగంధిభిః ॥ 25
లవణస్యచ పాత్రాణికృసరం చనివేదయేత్ । సర్వబీజాని రాజేంద్ర! భూషణానిచశక్తితః ॥ 26
మహార్హాణిచవస్త్రాణి భక్త్యా ప్రయతమానసః । తద్విష్ణోః పరమమితి హోమఃకార్యోహ్యనంతరమ్ ॥ 27
ద్వాదశాక్షరకం మంత్రంస్త్రీ శూద్రేషు విధీయతే । ఘృతంమాక్షిక సంయుక్తం జుహుయాత్తిల తండులమ్ ॥ 28
తతస్తుదక్షిణాదేయా గురవేనృపసత్తమ । నాగాశ్చమదమత్తావైగాశ్చైమాశ్చ వివిధాస్తథా ॥ 29
తురగాశ్చతథాముఖ్యా రత్నాని వివిధానిచ । బ్రాహ్మణశ్చ పితాజ్ఞేయో రూపసత్ర ప్రదర్శకః ॥ 30
రూపసౌభాగ్యలావణ్య జన్మభోగ ప్రదాయకః । రాజ్యస్యవాద్వి జత్వస్య బహువిత్తస్యదాయకః ॥ 31
నతస్యనిష్కృతిః శక్యా గంతుందానేనభూరిణా । గురుప్రసాద ఏవాత్ర దక్షిణానాంతు కారణమ్ ॥ 32
తస్మాత్ప్రసాదమాకాంక్షేత్ రూప సత్ర ప్రదర్శకాత్ । అవశ్యంతస్య దాతవ్యం ఘృతపూర్ణంతు భాజనమ్ ॥ 33
చతుష్పలంతు కాంస్యస్య సువర్ణంకాంచనస్యచ । తతః పరంభోజనీయాః స్వశక్త్యా ద్విజపుంగవాః ॥ 34
లవణక్షీర మధ్వాజ్యగుడ భక్ష్యసితోత్కటమ్ । భోజనం పానకోపేతం పశ్చాద్దేయాచ దక్షిణా ॥ 35
వస్త్రయుగ్మంప్రదా తవ్యం బ్రాహ్మణస్యనవంశుభమ్ । బ్రాహ్మణాయ చదాతవ్యం మహారాజత రంజితమ్ ॥ 36
సప్తబీజాని దేయాని లవణం రూప్యమేవచ । యచ్చాన్య దవ్య భీష్టంస్యాచ్ఛ్రోత్రపానత్కమేవచ ॥ 37
విత్తశాఠ్యంనకర్తవ్యం సత్రదానే మహీపతే! అవశ్యదేయం సత్రేఽస్మిన్ ఘృతపూర్ణంచ భాజనమ్ ॥ 38
చతుష్పలంతుకాంస్యస్య సువర్ణం కాంచనస్యచ । వ్రతేనానేన చీర్ణేన దేహత్యాగే దివంగతః ॥ 39
తత్రోష్యసుచిరంకాలం మానుష్యేయది జాయతే । రాజాభవతి ధర్మాత్మా బ్రాహ్మణోవాధనాన్వితః ॥ 40
కులేమహతి సంభూతో రూపేణాప్రతిమోభువి! । ఆరోగ్యం మహదాప్నోతి సౌభాగ్యమపిచోత్తమమ్ ॥ 41
లావణ్యం బుద్ధిమేధేచ మతింధర్మేచ శాశ్వతమ్ । సంపూర్ణచంద్ర ప్రతిమః సర్వసత్త్వ వశంకరః ॥ 42
నరోభవతి రాజేంద్ర ! నారీచాప్సరసోపమా । సుభగాదర్శనీయాచ లావణ్య గుణసంయుతా ॥ 43
బహుధాన్యా బహుధనా బహుభూషణసంయుతా । భర్తుశ్చాత్యంత దయితాలోకే ఖ్యాతాచ సద్గుణైః ॥
నిత్యారోగ్యవతీకాంతా సర్వదోష వివర్జితా ॥ 44
చంద్రాననా నీలసరోజనేత్రా త్రైలోక్యకాంతా పతివల్లభాచ । 45
భవత్యవశ్యం సుభగా సుశీలా లావణ్యయుక్తాయ శసాశ్రియాచ ॥ 46

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
రూపసత్ర వర్ణనంనామ పంచ పంచాశదధిక శత తమోఽధ్యాయః.

చందనము అగురు కర్పూరము (పచ్చకర్పూరము) కస్తూరి కుంకుమ పువ్వు జాతీఫలములు (జాజికాయలు) కంకోలములు లవంగాలు బోల గుగ్గులు సగ్గిలము యాయా కాలములందు పూయుపూవులు అగురు చందనములతో ధూపము తైలదీపములు సమృద్ధిగ పరమాన్నము నివేదనము సేయవలెను. దీపము వత్తులు మహారంజనరంజితములుగా వలెను. (మహారజనము) నైవేద్యమందు పెరుగు పాలు అమృతము మధువు (తేనె) బెల్లము పంచదార భక్ష్యము పండ్లు దుంపలు అపూపములు. సుశీత సుగంధి పానకములు లవణములు కృసరము = పులగము సర్వ బీజములు (నవధాన్యములు) నివేదింపవలెను. అలంకార సమర్పణము కూడ యథాశక్తి చేయవలెను. అమూల్యవస్త్రములు సమర్పించ వలెను. అటుపై "తద్విష్ణోః పరమ పదం" అన్నమంత్ర ముతో హోమము సేయవలెను. స్త్రీ శూద్రులకు ద్వాదశాక్షరమంత్ర జపము సెప్పబడినది. ఆపైని నెయ్యితేనె తిలలు బియ్యము హోమద్రవ్యములు మదగజములు వివిధగ్రామములు జాతిగుఱ్ఱములుగురువులకు దక్షిణయీయవలెను. వ్రతముజేయించు బ్రాహ్మణుడు తండ్రియేయనితెలియ వగును. ఆతడు రూపసౌభాగ్య లావణ్య జన్మభోగప్రదాత. రాజ్యము ద్విజత్వము ధనసమృద్ధి యీయగలడు. భూరిదానమెంత సేసినను గురువు ఋణము తీరదు. అన్ని దక్షిణలకు గురు ప్రసాదమే కారణము. రూప సత్రప్రదర్శకుడైన యాచార్యు నుండి కోరవలసినది యొక్క గురు ప్రసాదమే (అనుగ్రహమే). ఆయనకు ఘృతపూర్ణ కుంభము (ఆవునేతి నిండు కడవ) అవశ్య మీయవలెను. నాల్గుపలాలు కంచు బంగారము నొసగవలెను. ఆ మీద స్వశక్తి ననుసరించి బ్రాహ్మణులకు భోజనము పెట్టవలెను. ఆభోజనము లవణ క్షీరమధు ఆజ్యగుడభక్ష్యసిత (పంచదార) పానీయములతో సమృద్ధముగా నుండవలెను. అటుపై దక్షిణ యీయవలెను. వస్త్రయుగ్మమీయవలెను. ఆ వస్త్రములు మహారాజత రంజితములుగా (వెండిజరీతో నందగింప బడినవిగా) నుండవలెను. సప్తబీజములు లవణము వెండి (రూప్యము = రూపాయి) మఱియుం దనకు వారికి సభీష్టమైన దెల్ల యీయవలెను. గొడుగు పాదరక్షలు నీయవలెను. రాజా! సత్రదానమందు ధనలౌభ్యము పనికిరాదు. ఈ సత్రమందవశ్య మిచ్చి తీరవలసినది ఘృతపూర్ణ కుంభము నాల్గుపలములు కంచు నాల్గు పలములు బంగారమును జాల ముఖ్యము.

ఈ వ్రతము సేసిన తదవ సానమందు స్వర్గమందు చిరకాలమట నుండి మనుష్యలోకమందు బుట్టెనేని ధర్మాత్ముడగు రాజగును. ధనవంతుడగు బ్రాహ్మణుడేని గాగలడు. పరమ సుందర రూపుడై పుట్టును. ఆరోగ్య సౌభాగ్య లావణ్యాదులను జ్ఞానమును మేధాశక్తిని సర్వసమృద్ధముగ నొందును. సంపూర్ణ చంద్రబింబమట్లుండును. కాంతిమంతుడై సర్వసత్త్వ వశంకరుడై యుండును. ఈ వ్రతమాచరించిన స్త్రీయప్సరసలతో సమమగు రూపవతి సౌభాగ్యవతి లావణ్యగుణశాలిని ధనధాన్య సంపన్నయు బహుభూషణ భూషితయునై భర్తకత్యంత ప్రీతిపాత్రమై సద్గుణ సంపదచే సర్వజగత్ప్ర సిద్ధయగును. నిత్యరోగగ్రస్తయైన కాంత సర్వదోషములువాసి చంద్రానన నీలసరోజనేత్ర త్రైలోక్యమనోహారిణి భర్తృవల్లభసుభగ సుశీల లావణ్యవతి యశస్విని శ్రీమంతు రాలునగును.

ఇది శ్రీవిష్ణు ధర్మోత్తర మహాపురాణమున ప్రథమఖండమునందు రూపసత్ర వర్ణనమను
నూటయేబది యైదవ అధ్యాయము.

## నూట యేబదియారవ అధ్యాయము - పురూరవుడు తన రాజధానిం బ్రవేశించుట

పురూరవా ఉవాచ : భగవన్సర్వ ధర్మజ్ఞ! పితామహ! మహాద్యుతే! । గురుత్వంతు వ్రతే బ్రహ్మన్ కర్తుమర్హసిమానద! ॥ 1
వ్రతావసానేచ తథా సామగ్ర్యం ద్విజ పుంగవ! । ఏవం శక్యోఽస్మ్యరణ్యేఽస్మిన్ కర్తుం బ్రహ్మన్ మహద్వ్రతమ్ ॥ 2
అత్రిరువాచ : తవ ప్రసాదం భగవాన్ సర్వాత్మా మధుసూదనః । కురుతేఽహం కరిష్యామి గురుత్వమపరాజితః ॥ 3
వ్రతానసానేచతథా సామగ్ర్యం ద్విజపుంగవైః । కామాః సన్నిహితాశ్చాన్యైర్దేశేఽస్మిన్ నృపసర్వదా ॥ 4
మార్కండేయ ఉవాచ : ఏవముక్త్వాసధర్మాత్మా సప్తమేచదినే తదా ।
జ్యేష్ఠాయాం సప్తమీయోగే గ్రాహయామాస తం వ్రతమ్ ॥ 5

ఫాదర్క్షాత్తు ప్రభృత్యేవ మృక్షేఋక్షే నరాధిపః । కారయామాస దేవస్య కథితాంగాది పూజనమ్ ॥ 6
స్నానం నక్షత్రనిర్దిష్టం నక్షత్రస్యచ పూజనమ్ । నక్షత్రదైవతస్యాపి సోమస్య వరుణస్యచ ॥ 7
పూజనంచ తథా విష్ణో ర్దేవదేవస్య చక్రిణః । హోమంత్వథైవ సర్వేషాం యథావన్మనుజేశ్వర ॥ 8
మాఘశుక్లమఘాం ప్రాప్య ద్వాదశీంచతథాతిథిమ్ । అత్రి ర్వ్రతానసానే తమాగతో బ్రాహ్మణైఃసహ ॥ 9
వ్రతావసానే సంపూజ్యకేశవాం గార్చ్చి సోమజాన్ । రాజ్యంనివే దయామాససోఽత్రేః సకలమేవహి ॥ 10
ప్రతిగృహ్యాచ తద్రాజ్యం తస్మాద్వైమంత్రవిన్నృప! । భూయః ప్రాదాత్సతస్యైవ వచనం చేదమబ్రవీత్ ॥ 11
నమేరాజ్యేన కర్తవ్యం కించిదేవాస్తిపార్థివ! । నధనేననకామేన యాజితా ధ్రువ యాజ్ఞియాః ॥ 12
సభుత్వం రాజశార్దూల! స్వస్తిగచ్ఛ గృహాన్ప్రతి । ఏవముక్త్వాయ యావత్రిరంతర్ధానమథేశ్వరః ॥ 13
సర్వైర్ద్విజగణైః సార్ధం తదాదత్వా సపార్థివః । దేవపుష్కరిణీతోయేస్నాతమాత్రో బభూవహ ॥ 14
తప్తజాంబూనదాకారో నీలకుంచితమూర్ధజః । పృథువక్షామహాబాహు స్తనుకుక్షిర్మహాకటిః ॥ 15
గంధర్వరాజప్రతిమః సర్వసత్త్వవశంకరః । రూపంతుతాదృశం తస్యదృష్ట్వా గంధర్వసత్తమాః ॥ 16
తథైవాప్సరసోముఖ్యాదిష్ట్యా దిష్ట్యేతితేఽబ్రువన్ । సభాజ్యపార్థివంతేన పూజితాః ప్రయయుః సుఖమ్ ॥ 17

పురూరవుండు స్వామీ! ధర్మజ్ఞా! పితామహా! మహాతేజస్వీ! నేనొనరింపబోవు నా రూపసత్రమందు తాము గురుత్వము వహింపవలెను. వ్రతము చివర దానికి సామగ్ర్యమును = సంపూర్ణతను సంపాదింప వలయును. ఈ యరణ్యమందేనీ మహాద్భుత వ్రతము సేయుశక్తి గల వాడనన నత్రి మహర్షి యనియె. రాజా! నీయెడభగవంతుడు మధువైరి తప్పక ప్రసన్నుడగును. నేను నిందపరాజితమైన గురుత్వము పూనెదను. వ్రతావసానమున ద్విజపుంగవులతో గూడి దీనికి సమగ్రతను జేకూర్చెదను. ఈ వ్రతమందు సర్వదా సర్వాభీష్టములు సన్నిహితములై యున్నవి. అని పలికి నాటికి సప్తమదివసమందు సప్తమీ తిథియందు జ్యేష్ఠ నక్షత్ర పాదమునుండి యిది ప్రారంభించి ప్రతినక్షత్రమందు నాతేనిచే నీమున్ను జెప్పబడిన ప్రత్యంగ పూజ నక్షత్ర నిర్దిష్టమైన స్నానము నక్షత్ర దేవతకు సోమునికి వరుణునికి దేవదేవుడు చక్రాయుధుడునగు విష్ణువునకు పూజ యందరికి యథావిధిగ హోమమును జేయించెను. తుదను మాఘశుక్లమందు మఘానక్షత్రము ద్వాదశి తిథి కూడిన నాడు బ్రాహ్మణులతో నత్రి మహర్షి యాతేనిదరికి దయచేసెను. ఆరాజు వ్రతావసానమందు మహర్షిని బూజించి కేశవునంగములను అర్చిని బుధునినర్చించి యా యత్రి మహర్షికి తనసర్వరాజ్యమును నివేదించెను. మంత్రవిదుడైన యమ్ముని యాతని నుండి రాజ్యముంగైకొని తిరిగి యాతేనికే దాని నొసంగి యమ్ముని వరుడు "పార్థివా! నాకు రాజ్యముతో బనిలేదు. ధనముతో కోరికలతో నవసరము లేదు. ధ్రువయాజ్ఞియులు (యజింపదగిన) శాశ్వతులయిన దేవతలను నీవు యజించితివి. నీకు స్వస్తియగుగాక! ఇక గృహములకేగుము. అని యమ్మునీశ్వరుండంతర్ధానమయ్యెను. అటుపై పురూరవ చక్రవర్తి ద్విజగణమందఱితో నేగి దేవపుష్కరిణీజలమందు స్నానము సేసిన యంతన పుటము వెట్టిన బంగారపు మేనిచాయ నీలములై కుంచితములైన శిరోజములు విశాలవక్షము ఆజానుబాహువు సూక్ష్మకుక్షి మహాకటిభాగము గల్గి గంధర్వరాజు వలెనయి సర్వసత్త్వాకర్షకుడయ్యెను. గంధర్వవరులలాటి యతని రూపముంజూచి యప్సరః కాంతామణులు బాగుబాగనిరి. ఆతేనిని యందఱుం గౌరవించి యాతని వలన బూజలందుకొని సుఖాన నేగిరి.

నిశ్వాసంవత్సరంతత్ర పూర్ణేసంవత్సరే నృపః । దేవతాశ్చాప్యథామంత్ర్య పూజయిత్వా యథావిధి ॥ 18
తథాపుష్కరిణీంపుణ్యాం గుహాంపద్మ సరస్తదా । ఆశ్రమం శైలముఖ్యంచ తథైవచ వనస్పతిమ్ ॥ 19
గంధర్వాప్సరసశ్చైవ! ప్రయయౌస్వపురంతతః । ఉచ్చసంగమసంప్రాప్తాదృష్టో వైషయికైస్తతః ॥ 20
స్తుతోదేవ ప్రసాదాచ్చ భక్త్యాతైశ్చాభినందితః । సత్వరైశ్చతథా కైశ్చిద మాత్యానాం నివేదితః ॥ 21
అమాత్యాశ్చాగతంశ్రుత్వా లబ్ధకామ్యంనరాధిపమ్ । నిర్యయుర్నగరాత్తస్మాచ్చతురంగబలాన్వితాః ॥ 22

రాజ్ఞః ప్రతిగ్రహార్థంతే గణముఖ్యా పురఃసరాః । తైః సమేత్య సరాజర్షిర్యథావన్మనుజేశ్వర ॥ 23
కల్పితేన గజేంద్రేణ పతాకాధ్వజశోభినా । ప్రవివేశపురంహృష్టః శాకలం నామనామతః ॥ 34
రాజ్ఞః ప్రవేశేతత్పౌరైః సితచందనవారిణా । బహువర్ణైస్తథా పుష్పైర్యథాస్థానే విభూషితమ్ ॥ 25
చందనాగురుసారాణాం ధూపన్నైః సురభీకృతమ్ । మహోచ్ఛ్రిత పతాకాఢ్యం మాల్యదామ పరిష్కృతమ్ ॥ 26
మాల్యమోదక హస్తైశ్చ పౌరజాన పదైర్యుతమ్ । అతీవజన సంబాధమతీవ సునోహరమ్ ॥ 27
ప్రాసాదవరసంస్థాశ్చ గవాక్షక గతాస్తథా । వేదికాస్థాశ్చ పశ్యంతిస్త్రియస్తం మన్మథార్దితాః ॥ 28
సముష్ణన్న్యోషితాం చిత్తం దృశశ్చ మనుజాధిపః । లాజాచందనచూర్ణైశ్చ కీర్యమాణః సమంతతః ॥ 29
పుష్పైశ్చస్త్రీకరోన్ముక్తైః పూర్యమాణో నరాధిపః । అభిగమ్యచతత్రాసౌ దేవతాయతనాంస్తతః ॥ 30

రాజచటనే యొక యేడుండి దేవతలందరితో జెప్పి యథావిధి నాపుణ్యపుష్కరిణిని గుహను పద్మసరస్సును ఆశ్రమమును గిరిరాజమును నటనున్న వనస్పతిని గంధర్వాప్సరసలనుం బూజించి తనపురమునకేగి మహోన్నత మంగళాచారములం బౌరులువచ్చి దర్శింప స్తుతింప దేవప్రసాదముపలన భక్తిచేతను వారిచేత నభినందింపబడి తొందరగా కొందరేగి మంత్రులకు తనరాక తెలుప వారెదురువచ్చి చతురంగములతో పురము వెడలివచ్చి స్వాగతమీయ వారితో గణముఖ్యులును వారిగొనివచ్చి పతాకాధ్వజాలంకృతమైన ఏనుగుపైనెక్కి (గజమెక్కి) శాకలమను తన రాజధానిం బ్రవేశించెను. రాజనగర ప్రవేశమునందు పౌరులు తెల్లచందనపు నీరతనిపైనించిరి. చక్కని రంగురంగు పూలు జల్లిరి. చందనాగరు సారధూపములం బరిమళించుచు మిక్కిలి యెత్తుగ నెత్తిన పతాకలలో పూలమాలల యలంకారములతో గూడిన యా నగరమందు పూమాలలు మోదకములు (లడ్లు) చేతులంబూని నాగరికులు జానపదాలు (పల్లెటూరి జనము) నెదురేగి స్వాగతమయి మిగుల సమ్మర్దమై సుమనోహరమైన ప్రాసాదమునెక్కి గవాక్షములనుండి కొందరు యరుగులమీదనిల్చి కొందరు పౌరసుందరు లాసుందరునింగని మరుబారికి జిక్కిరి. ఆ మనుజపతి యువతుల చూపులను మనసులనునాచికొనుచు వారు కరకమలముల పేలాలు పూలు మంచిగంధపుపొడి గ్రమ్మకొన పైపైజిమ్మచుండ నరుగుదెంచి తొలుత నాతడు దేవాలయములకేగి దేవదర్శనముసేసి శరత్కాలమేఘ పాండురమగు తనమందిరనుుం బ్రవేశించెను.

ప్రవివేశగృహం శ్రీమత్ శారదాభ్రచయోపమమ్ । తత్రాభిగమనం కృత్వాదేవతానాం యథావిధి ॥ 31
సంపూజ్య బ్రాహ్మణాన్ భక్త్యా వివిధైర్ధన సంచయైః । సభాస్థం సాంత్వయామాస పౌరజానపదంజనమ్ ॥ 32
ఆశ్వాస్యప్రేషయామాస గృహాన్యోధజనంతథా ।

అక్కడ యథావిధి గృహదేవతల నభిగమించి (యెదురుగనిల్చి) భక్తితో వివిధ ధనరాసుల బ్రాహ్మణులం బూజించి కొలువునందున్న పౌర జానపద జనమందర నాదరించెను. మరియు వారిని తన యోధవర్గమును వారివారి గృహములకంపించెను.

జనానురాగసంయుక్తస్తతః ప్రభృతిపార్థివః ॥ 33
రాజశాస్త్రోపదేశేన పాలయామాసమేదినీమ్ । రేమేచ సహరామాభిర్గం ధర్వప్రతిమోయువా ॥ 34
సతుకాలేన మహతా రాజా పంచత్వ మాగతః । ఉవాససుచిరం కాలం పూజ్యమానః సురోత్తమైః ॥ 35
మన్వంతరేహ్యతీతేతు చాక్షుషస్య మహాత్మనః । వైవస్వతేఽథ సంప్రాప్తే బుధపుత్రోత్వ మాగతః ॥ 36
తత్రతస్యతు యద్రూపం సౌభాగ్యాదేవ విశ్రుతమ్ ॥ సశరీరస్యచతథా స్వర్లోకేగమనంన్నృప ॥ 37
స్వర్గతోఽపి సరాజర్షిః క్షీణేవైవస్వతేంతరే । ప్రవిశ్యాతిపురం విష్ణోశ్చంద్రమండలమధ్యగమ్ ॥ 38

ఏతత్తే సర్వమాఖ్యాతం కర్మణాయేన పార్థివః । అవాపతాదృశంరూపం సౌభాగ్యమపి చోత్తమమ్ ॥ 39

ఆదిమొదలు జనానురాగము చూరగొని యారాజు రాజశాస్త్రముల యుపదేశము ననుసరించి మేదినిం బరిపాలించెను. గంధర్వసముడు యువకుడయ్యెడ రమణీమణులతో క్రీడించెను. అటుపై చాలకాలమతడు కాలగతింజెందెను. సురవరులు పూజింప బహుకాలమతడు స్వర్గమందు విహరించెను. చాక్షుమన్వంతరము గడచి వైవస్వత మన్వంతరమేతేర నతడు బుధునికి గుమారుడై సౌభాగ్యసంపన్నమైన యా తొలుతటి రూపముంగొని సశరీర స్వర్గగమనము సేసెను. ఆ రాజర్షి స్వర్గమందయుండి వైవస్వత మన్వంతరము గడచిన చంద్రమండల మధ్యమందున్న విష్ణువు నతిపురమందుండెనను నీవృత్తాంతమెల్ల నీకు దెల్పితి.

పూజయంతిహరిం దేవం సాత్త్వికాస్తు నిరాశిషః । రాజసాః కామకామాశ్చ క్రూరకామాశ్చ తామసాః ॥ 40
హరింసంపూజ్యమనసా రాజసేన పురూరవాః । సప్తద్వీప సముద్రాయాం పృథివ్యామేకరాడ్బభౌ ॥ 41
స్వర్గం సుదుర్లభం ప్రాప్యస్థానం ప్రాప్స్యతి శాశ్వతమ్ । నాస్తివిష్ణు సమోనాథోనాస్తి విష్ణుసమాగతిః ॥ 42
నాస్తివిష్ణు సమంత్రాణం నరస్యార్తస్య భేషజమ్ । సత్కృతం పూజనంయేన కృతందేవస్యచక్రిణః ॥ 43
ఆరాత్రికం కృతంతేన సంప్రాప్తం పరమంపదమ్ యేనసంకీర్తితం రాజన్హరిరిత్యక్షరద్వయమ్ ॥ 44
బద్ధః పరికరస్తేన మోక్షాయగమనం ప్రతి । ఏతత్తే బుధపుత్రాస్య త్రిషుజన్మసు పార్థివ! ॥ 45
ధన్యంయశస్యం రిపునాశనంచ సౌభాగ్యదం పుష్టివివర్ధనంచ ।
శ్రోతవ్యమేతన్నియతంచసద్భి రాఖ్యానమూర్జస్కరమృద్ధికామైః ॥ 46

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
పురూరవసస్స్వపుర గమనం నామషట్పంచాశదధికశతతమోధ్యాయః.

విష్ణుదేవుని నిరాశిషులు (ఆశీస్సులు కోరనివారు) అనగా నేకోరికయు లేనివారు సాత్త్వికులు (సత్త్వగుణ ప్రధానులు) పూజింతురు. కామకాములు (సకాములు) క్రూర రాజసులు క్రూరకాములు తామసులును హరిని పూజింతురు. పురూరవుడు రాజస మనస్కుడై హరినర్చించి సప్తద్వీపములకు నేకచ్ఛత్రాధిపతి యయ్యెను. దుర్లభమైన స్వర్గస్థానముగూడ బడసి శాశ్వతస్థానమును (ముక్తిపదమును) బొందగలడు. విష్ణువునకు సమునయిన నాథుడు లేడు. విష్ణుగతితో సమానమైన గతిలేదు. విష్ణుసమానమైన రక్షణ లేదు. ఆర్తుడగు నరునకు నంతకుమించు ఔషధములేదు. చక్రిపూజనము నొనరించిన యతడు సర్వమ్ముం జక్కగా నొనరించినవాడే. ఆ స్వామికి ఆరార్తికము (కర్పూర హారతి) నొసంగినయతడు పరమపదమందును. రాజా! ఎవ్వడు హరియను రెండక్షరములు సంకీర్తించునాతడు ప్రయాణమునకు బద్ధపరికరుడే. రాజా ! బుధకుమారుడగు పురూరవుని మూడుజన్మముల చరితమిదియెల్ల నీకేను వచించితిని. ఇది ధన్యము యశస్యము శత్రునాశనము సౌభాగ్యప్రదము పుష్టివర్ధనము. సత్పురుషులు బుద్ధికాములై ఓజస్కరమైన యీకథను నియతముగా వినవలసినది.

ఇది శ్రీవిష్ణు ధర్మోత్తర మహాపురాణమందు ప్రథమఖండమున పురూరవుడు తన రాజధానిబ్రవేశించుట యను
నూటయేబదియాఱవ అధ్యాయము.

## నూటయేబది యేడవ అధ్యాయము - రాజ్యప్రద ద్వాదశీవర్ణనము

వజ్రఉవాచ: ద్వాదశీషు కథం విష్ణుః సోపవాసేన పూజితః । రాజ్యప్రదఃస్యాద్ధర్మజ్ఞః తన్మేత్వంబ్రూహి తత్త్వతః ॥
పశ్యరాజ్యస్య మాహాత్మ్యం యత్రధర్మ సఖావుభౌ । శృణుతస్య చధర్మస్య ఫలభాగ్ధార్మికో నృపః ॥ 2
బ్రహ్మచారీగృహస్థశ్చ వానప్రస్థోఽథ భిక్షుకః । రాజ్ఞాసంరక్షితాః సర్వేశక్యా ధర్మం నిషేవితుమ్ ॥ 3

మానుషేణశరీరేణ రాజా దేవవపుర్ధరః । క్షత్త్రియోఽపి సదాపూజ్యో బ్రాహ్మణానాం మహాత్మనామ్ ॥ 4
వినారాజ్యంహియాలక్ష్మీః పరతంత్రాహిసామతా । తస్మాద్రాజ్యం ప్రశంసంతి తత్రాజ్ఞా న విహన్యతే ॥ 5
తుల్యధాతు శరీరాణాం తుల్యావయవజీవినామ్ । నరేంద్రాణాం నరైర్ బ్రహ్మన్ దేవవద్భువి మన్యతే ॥ 6
రాజ్యదాంద్వాదశీం తస్మాద్వక్తు మర్హతిమే భవాన్ । యాముపోష్య మహద్రాజ్యం ప్రాప్నుయాత్సతువై ద్విజః ॥ 7

వజ్రుడు విష్ణువును ద్వాదశులందుపవసించి పూజించిన రాజ్యలాభమగునట యా విషయము యదార్థము నాకానతిమ్ము రాజ్యముయొక్క మహిమమెంత గొప్పదో కనుము. రాజు ధర్మము ననువారిద్దరు మిత్రులు. ధర్మము చేసినందువలన గల్గు ఫలమును బొందువాడు ధర్మపరుడైన రాజు. బ్రహ్మచారి గృహస్థు వానప్రస్థు భిక్షువు ననువారు రాజుయొక్క సంరక్షణం బొంది ధర్మము నాచరింప శక్తులగుదురు. రాజు మానుష శరీరధారియగు దేవుడు. మహాత్ములగు బ్రాహ్మణుల కతడుగూడ పూజనీయుడే. రాజ్యములేకుండ గల్గినలక్ష్మి పరతంత్ర యనంబడును. గావున రాజ్యమును పెద్దలు కొనియాడుదురు. అందు రాజాజ్ఞ కడ్డులేదు. మానవులందరి శరీరములో ధాతువులు సమానములే శరరీములును సమములే. అవయవములు ప్రాణములు సమానములే. అయినను భూమిమీద భూపతి దేవుడని భావింపబడును. కావున రాజ్యము నొసంగు ద్వాదశీవ్రతముంగూర్చి నాకు వచింపదగుదువన మార్కండేయుడిట్లనియె.

మార్కండేయ ఉవాచ : శృణుష్వావహితో రాజన్రాజ్యదాంద్వాదశీంశుభామ్ ।
యాముపోష్య నరోలోకే రాజ్యమాప్నోత్యకంటకమ్ ॥ 8
మార్గశీర్ష స్యమాసస్య శుక్లపక్షే నరాధిపః । దశమ్యాం ప్రయతః కృత్వాస్నాన మభ్యంగ పూర్వకమ్ ॥ 9
ఉపవాసస్య సంకల్పంశ్వోభూతస్యతుకారయేత్ । దేవాగారేకు శాస్త్రీర్ణామే కవస్త్రోత్త రచ్ఛదామ్ ॥ 10
అధ్యాసీత మహీంతత్రతాం రాత్రిం ప్రయతోనయేత్ । ద్వితీయేఽహ్నితతః కుర్యాద్బహిః స్నానమతంద్రితః ॥ 11
పూజనందేవ దేవస్య సర్వం శుక్లేన కారయేత్ । కర్పూరం చందనందేయం మల్లికా శ్వేతయూథికా ॥ 12
జాత్యాచ శుక్లా రాజేంద్ర ధూపే కర్పూరమేవచ । ఘృతేన దీపాదాతవ్యాః శుక్లవర్తి సమన్వితాః ॥ 13
ఘృతౌదనం దధిక్షీరం పరమాన్నంతథైవచ । ఇక్షుమిక్షు వికారాంశ్చదేవదేవే నివేదయేత్ ॥ 14
కాలోద్భవం మూలఫలం వర్జంతత్రతన చింతయేత్ । యథాలాభేన తద్దేయం శుక్లం చేత్స్యాద్విశేషతః ॥ 15
హవనంచ తతః కార్యం పరమాన్నేన పార్థివ ! తద్విష్ణోః పర ఇత్యేవ హోమ మంత్రో విధీయతే ॥ 16
ద్వాదశాక్షరకం మంత్రం స్త్రీ శూద్రస్య విధీయతే । తతోఽగ్ని హవనం కృత్వా శక్త్యా సంపూజ్యచ ద్విజాన్ ॥ 17
సితరంగేన కర్తవ్యా భూమి శోభా సురాలయే । రాత్రౌజాగరణం కార్యం గీతం నృత్యంచ పార్థివః 18
కర్మణాంచైవ దేవస్య కర్తవ్యం శ్రవణం తథా । ద్వాదశ్యాం విధినాకేన భూయః పూజ్యోజనార్దనః ॥ 19
రాజలింగం ప్రదాతవ్యమేకం విప్రాయ దక్షిణా । తతస్తు పశ్చాద్భోక్తవ్యం హవిష్యం పార్థివోత్తమః 20
ఏకాదశీ యథా మధ్యేస్నానయోరంతరేన్నృప ! కష్టం మౌనంతు కర్తవ్యం జప్యం కార్యంతు మానసమ్ ॥ 21
ద్వాదశీ ష్వేవ శుక్లాసు సర్వాస్వేవావి శేషతః । విధిస్త్వయం నిర్దిష్టః కృష్ణాస్వేవచ కారయేత్ ॥ 22
విశేషంతే ప్రవక్ష్యామి తన్మేనిగదతః శృణు । రక్త వర్ణేన కర్తవ్యా దేవపూజాంయథావిధి ॥ 23
రక్తంచ దేయం నైవేద్యం పుష్పగంధాను లేపనమ్ । తిలతైలేన దీపాశ్చ మహారంజన రంజితాః ॥ 24
దీపేషు వర్తయో దేయా హోమః కార్య స్తథా తిలైః । భూమిశోభాచకర్తవ్యా రక్తై ర్భూపాల వర్ణకైః ॥ 25
అనేన విధినాకృత్వా రాజన్సంవత్సరం తతః ! కార్తిక్యాం సమతీతాయాం కృష్ణాయా ద్వాదశీ భవేత్ ॥ 26
వ్రతావసానే తస్యాంతు మహావర్తింతుదాపయేత్ । వాససాచ సమగ్రేణతులయాచ ఘృతస్యవై ॥ 27

బ్రాహ్మణాయప్రదాతవ్యా ధేనుః కాంస్యోపదోహనా । హేమశృంగీరౌప్యఖురా ముక్తాలాంగుల భూషితా ॥ 28
వస్త్రోత్తరీయా దాతవ్యా శక్త్యా ద్రవిణసంయుతా । సంవత్సరేణ రాజాస్యాన్నరః పర్వత గహ్వరే ॥ 29
త్రిభిః సంవత్సరైః పూర్ణైర్జాయతే సఫలం తతః । తథా ద్వాదశభిః పూర్ణై రాజాభవతి పార్థివః ॥ 30
రాజ్య ప్రదాతేఽభిహితా మయైషా సుద్వాదశీ పాపహరావరిష్ఠా ।
ఉపోష్యయాం భూమితలే నరేంద్రో । భవత్యజేయశ్చ రణేఽరి సంఘైః ॥ 31

ఇతి శ్రీ విష్ణు ధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
రాజ్యప్రదద్వాదశీ విధిర్నామ సప్తపంచాశదధిక శతతమోఽధ్యాయః.

రాజా ! శ్రద్ధతో నాలింపుము. మార్గశీర్ష శుక్లదశమినాడు శుచియై యభ్యంగ స్నానముసేసి రేపు ఏకాదశినాడుపవాసమాచరింతునని సంకల్పము సేయవలెను. దేవగృహమున నేలపై దర్భాసనముపై వస్త్రము పరచుకొని దానిమీదనే కూర్చుండి యా రేయిగడుపవలెను. మరునాడేగిస్నానముసేసి తెల్లనివస్తువులతో గంధాక్షతలతో పువ్వులతో విష్ణుపూజసేయవలెను. పచ్చకర్పూరము చందనము మల్లెపువ్వులు తెల్లయూథికలు బొడ్డుమల్లెలు విరజాజులతో పూజసేయవలెను. తెల్లనివత్తులువేసి ఆవునేతి దీపములు పెట్టవలెను. నేతియన్నము పెరుగు పాలు పరమాన్నము చెరకురసము మరియు చెరకురసముయొక్క పలురకములయిన పంచదార మొదలగు వస్తువులతోడి పదార్థములను వారికి నివేదింపవలెను. ఆకాలములోదొరకుపండ్లు మూలములు రంగునుగూర్చి విమర్శింపక సమర్పింపవలెను. తెల్లని పదార్థము లేవియైన లభించినంతవరకీయవలెను. ఆవ్వాల పరమాన్నముతో హవన మునరింపవలెను. "తద్విష్ణోః పరమం పదం" అన్నమంత్రము హోమమున ప్రయోగింపవలెను. స్త్రీలకు శూద్రులకు ద్వాదశాక్షర మంత్రము విధింపబడినది. ఆమీద నగ్ని హవనమొనరించి యథాశక్తి విప్రులం బూజించి దేవగృహమున తెల్లని రంగవల్లికలతో భూమిని శోభింపజేయవలెను. రాత్రి గీతనృత్యాదులతో జాగరణము సేయవలెను. భగవచ్చరిత్రలను బురాణములను వినవలెను. ఇది ద్వాదశీ విష్ణుపూజావిధానము. విప్రునికొక రాజలింగమును దక్షిణ యీవలయును అటుపై హవిష్యాన్న మారగింపవలెను దశమీ ద్వాదశీ స్నానముల నడుమ ఏకాదశినాడు మౌనమూని మానసిక జపముసేయవలెను. సర్వ శుక్లద్వాదశులందు నెట్టిభేదములేకుండ ననుష్ఠింపవలసిన విధి యిదినీకు నిర్దేశించితిని. కృష్ణద్వాదశు లందును నిట్లు సేయవలయును. అందు విశేషము తెల్పెద వినుము. అప్పుడు ఎరుపురంగుతో పూజయెల్ల జరుపవలెను. పుష్ప గంధాను లేపనాదులు నైవేద్యము నెఱ్ఱని వస్తువులతోనే నివేదింపవలయును. నువ్వుల నూనెతో దీపములు వత్తులు మహారంజన రంజితములుగా నుండవలెను. తిలలు హోమము సేయవలెను. పూజాస్థలముశోభ రక్తవర్ణములయిన రంగవల్లులు మొదలయిన వానితో గూర్పవలెను. ఇట్లొక సంవత్సర మీవ్రతము చేసి తుదకు కార్తిక బహుళ ద్వాదశినాడు మహావర్తి సమర్పింపవలెను. ఆ వర్తి పూర్తివస్త్రముతో జేయవలెను. నెయ్యి సంపూర్ణమయిన తూనికలో నుపయోగింపవలయును. కొలిచిపెట్టిన నేతిలో కొంతభాగముతీసి వాడరాదన్నమాట. కంచుపాలచెంబుతో నొకగోవును బ్రాహ్మణుని కీయవలెను. కొమ్ములకు బంగారుతొడుగులు గిట్టలకు వెండివి తోకకు ముత్యాలుకట్టి నూతన వస్త్రముత్తరీయముగ గప్పి యథాశక్తి ద్రవిణ సంయుతముగ (ధనముతోడి) దక్షిణయీయవలెను. ఈ వ్రతమొక సంవత్సరమట్లు సేయవలెను. యతడు పర్వత గహ్వరమందు రాజగును. (కొండరాజగును) మూడుసంవత్సరములు సేసిన నరపాలుడగును. ఇది రాజ్యప్రదము. ఉపవాసముండి చేయదగినది. దీన నజేయుడయిన ప్రభువగును

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున రాజ్యప్రద ద్వాదశీవర్ణనము నూటయేబదియేడవ అధ్యాయము.

## నూటయేబది ఎనిమిదవ అధ్యాయము - కామద్వాదశీవ్రతము

మార్కండేయ ఉవాచ : మార్గశీర్షస్య మాసస్య శుక్లపక్షా జ్జనాధిపః । ఆరభ్యాభ్యర్చయే ద్దేవం ద్వాదశీషుసదైవతు ॥ 1

పక్షయో రుభయో ర్నిత్యం సోపవాసో జితేంద్రియః । ఫలైఃపుష్పైర్యథా కామం నై వేద్యైర్హోమ కర్మణా ॥ 2
పూజనే బ్రాహ్మణానాంచ శక్త్యా దానంచ పార్థివ । అభీష్ట నామ జప్యేన పూర్ణాత్సంవత్సరాన్నరః ॥ 3
తదేవాప్నోతి రాజేంద్ర! యత్రగత్వాన శోచతి । అకామాః సాత్త్వికా దేవం పూజయంతి జనార్దనమ్ ॥ 4
తస్మాదకామేన నరేంద్ర చంద్ర సంపూజనీయో భువన స్యగోప్తా ।
త్యక్త్వా వణిజ్యం నరదేవ! లోకే దేవేశ్వరో విష్ణు రుపాస నీయః ॥ 5

ఇతి శ్రీవిష్ణు ధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
కామద్వాదశీ వర్ణనం నామ అష్టపంచా శదధిక శతతమోఽధ్యాయః.

మార్గశిరశుద్ధద్వాదశి మొదలుకొని తరువాతి ద్వాదశులందు దేవదేవుని విష్ణునర్చింపవలెను. ప్రతిమాసమందు రెండుపక్షములందలి ద్వాదసులందును నింద్రియముల నిమిడించికొని యుపవాసముసేసి ఫలపుష్పములతో యథాభిలాషముగ నివేదనలుసేసి హరినర్చించి యథాశక్తి బ్రాహ్మణులం బూజించి దానములిచ్చి తనకిష్టమైన భగవన్మంత్రముం జపించి నాతడానందభరిత పుణ్యలోకములనందును. నిష్కాములు సాత్త్వికులయిన భక్తులే విష్ణునర్చింతురు. సర్వభువన గోప్తయగు హరిని నిష్కామబుద్ధితో నర్చింపవలెను. ఆయనతో వాణిజ్యము (వ్యాపారము పర్తకము) పుణ్యఫలమును గురించిన బేరసారములు పెట్టుకొనకుండ హరియుపాసింపవలసినవారు.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున కామద్వాదశీ వర్ణనము నూటయేబదియెనిమిదవ అధ్యాయము.

## నూటయేబది తొమ్మిదవ అధ్యాయము - శుక్లపక్ష ద్వాదశీవ్రత వర్ణనము

వజ్ర ఉవాచ : భగవంశ్రోతుమిచ్ఛామి ద్వాదశీషు పృథక్పృథక్ । ఉపోష్యకింఫలంలోనే శుక్లపక్షే విధీయతే ॥ 1
అనేకజన్మ సాహస్రైర్యేషాం పాపంక్షయం గతమ్ । అకామాస్తే ప్రవర్తంతే దేవదేవార్చనేనరాః ॥ 2
మార్కండేయ ఉవాచ : ద్వాదశ్యాంమార్గశీర్షస్య శుక్లపక్షే ఉపోషితః ।
నామ్నా కేశవ మభ్యర్చ్య వహ్నిష్టోమ ఫలంలభేత్ ॥ 3
నారాయణంతథాభ్యర్చ్య పౌషేమాసే జగత్పతిమ్ । అత్యగ్నిష్టోమ మాప్నోతి నాత్రకార్యావిచారణా ॥ 4
మాఘేమాధవమభ్యర్చ్య ద్వాదశాబ్ద ఫలంలభేత్ । గోవిందం ఫాల్గునేమాసి పూజయిత్వా మహీధర ॥ 5
అతిరాత్రస్యయజ్ఞస్య ఫలం ప్రాప్నోత్య సంశయమ్ । చైత్రేవిష్ణుమథాభ్యర్చ్య వాజపేయఫలం లభేత్ ॥ 6
ద్వాదశ్యాం మాసివైశాఖే సంపూజ్యమధు సూదనమ్ । గోసవస్యతుయజ్ఞస్యఫలం ప్రాప్నోత్యనుత్తమమ్ ॥ 7
జ్యేష్ఠేమాసేతథాభ్యర్చ్య దేవదేవం త్రివిక్రమమ్ । పుండరీకస్యయజ్ఞస్య ఫలంవిందతి మానవః ॥ 8
ఆషాఢే వామనం దేవం పూజయిత్వాజగత్పతిమ్ । క్షిప్రమేవసమాప్నోతి యజ్ఞం బహుసువర్ణకమ్ ॥ 9
శ్రీధరంశ్రావణే మాసిపూజయిత్వామహేశ్వరమ్ । వైష్ణవస్యతు యజ్ఞస్య ఫలం విందత్య సంశయమ్ ॥ 10
మాసేభాద్రపదే దేవం హృషీకేశం సమర్చయన్ । అశ్వమేధ మవాప్నోతికులంచైవ సముద్ధరేత్ ॥ 11
ఆశ్వినేమాసి సంప్రాప్తే పద్మనాభం సమర్చయన్ । రాజసూయమవాప్నోతినాత్రకార్యా విచారణా ॥ 12
దామోదరమథాభ్యర్చ్య కార్తికేమాసియాదవ! । సర్వమేధమవాప్నోతి స్వర్గలోకంచ గచ్ఛతి ॥ 13
మాసోక్తేన సదా నామ్నాశుక్లపక్షేష్వ్యుపోషితః । ద్వాదశీషుసదా కుర్యాజ్జప్యహోమాన్సమాహితః ॥ 14
సంవత్సరాంతే దాతవ్యం ఘృతపూర్ణంచ భాజనమ్ । కాంస్యస్యవైనతేయంచ రుక్మపత్రనివేశితమ్ ॥ 15
క్రమోపవాస తస్త్వేతేప్రోక్తాయజ్ఞ ఫలాన్నృప । పూర్ణంసంవత్సరం కృత్వావ్రతమేతన్నరాధిప! ॥ 16

స్వర్గలోకమవాప్నోతి కులంచైవ సముద్ధరేత్ । దేవరామాగణస్థేన వీణామురజనాదినా ॥ 17
హంససారసయుక్తేన విమానేనార్కవర్చసా । కింకిణీశతఘోషేణ విహరత్యమరప్రభః ॥ 18
యావజ్జీవంనరః కుర్యాద్వ్రత మేతత్సమాహితః । శ్వేతద్వీపమవాప్నోతి యత్రచరంత్ప్రధానరాః ॥ 19
చతుర్భుజా మహాసత్త్వానిత్యతృప్తాః సుగంధినః । అనిష్యందా నిరాహారాః సర్వజ్ఞాః సర్వదర్శినః ॥ 20
తత్రోష్యకాలం సుచిరం నరేంద్రః భిత్త్వార్క బింబం సహసాప్రయాతి ।
స్థానంపురోదేవవరస్యవిష్ణోర్నిత్యస్య తస్యానఘః సర్వగమ్య! ॥ 21

ఇతి శ్రీవిష్ణు ధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
శుక్లపక్ష ద్వాదశీ విధిర్నామ ఏకోనషష్ట్యధిక శతతమోఽధ్యాయః

వజ్రుడనియె. శుక్లపక్షద్వాదసులన్నిటియొక్క ఉపవాస ఫలము వినపలతును. అనేక జన్మసహస్రములెత్తి పాపము క్షయించుకొని నిష్కాములయిన వారు దేవదేవుని యర్చనమునందు ప్రబసృత్తులగుదురన మార్కండేయుడనియె. మార్గశిరశుక్ల ద్వాదశినాడుపవాసముసేసి విష్ణునర్చించినవారు అగ్నిష్టోమము సేసిన ఫలమందుదురు. వైశాఖమాస ద్వాదశినాడిట్లు మధుసూదను నర్చించినచో గోమేధముసేసిన ఫలమందును. జ్యేష్ఠమాస ద్వాదశీవ్రతముసేసి హరినర్చించిన పౌండరీక యాగముసేసిన ఫలము గల్గును. ఆషాఢమందు వామనమూర్తి నర్చించిన బహుసువర్ణ దక్షిణాకములయిన యజ్ఞముల ఫలమువచ్చును. శ్రావణమాసమం దర్చించిన విష్ణుయాగఫలముపొందును. భాద్రపదమందు హృషీకేశుని ద్వాదశీవ్రతముసేసి యర్చించిన అశ్వమేధయాగఫలమబ్బును. ఆశ్వయుజమందు పద్మనాభునర్చించిన రాజసూయము సేసిన ఫలముగల్గును. కార్తికమందు దామోదరు నర్చించిన సర్వమేధఫల ములనందుటయేకాక స్వర్గలోకముంగూడ పొందును. ఈ చెప్పినమాసములలో శుక్లపక్షమందే ద్వాదశులందు ఉపవసించి జపహోమ ములను అర్చనమును జేయవలెను. సంవత్సరము తుదిని కంచుపాత్రలో ఘృతమునింపి దానముసేయవలెను. దానితోబాటు గరుత్మంతుని బంగారురేకుపై ముద్రకూడ దానమీయవలెను. ఈ మాసక్రమ ద్వాదశీ తిథులందుపవాసము వ్రతము సర్వయజ్ఞ ఫల ప్రదము. ఇట్లు సంవత్సరము పూర్ణముసేసినచో స్వర్గము పొందును. కులము నుద్ధరింపగలడు. ఈవ్రతమిట్లుసేసిన పుణ్యాత్ముడు దేవసుందరీమణిగణము కొలువ వీణలు మురజములు (గుంజలుఅని వాడుక) మొరయ హంసలు సారసములు నలంకరించు చిరుగంటలుమ్రోయ సూర్యప్రభమైన విమానమెక్కి దేవతా ప్రభతో విహరించును. ఈవ్రతమును యావజ్జీవ మాచరించిన సుకృతి చంద్రప్రభా భాసురులయిన నరులు విహరించు శ్వేతద్వీపమును బొందును. అక్కడనుండు పుణ్యులు నాలుగు సేతులు గల్గి మహాసత్త్వులై నిత్యతృప్తులై సువాసనభరితులై(అనిష్యందులై) క్రిందికితిరిగి జారిపడక నిరాహారులై సర్వజ్ఞులై సర్వద్రష్టలై యుందురు, అక్కడ సుచిరకాలము వసించి సూర్యబింబముం ఛేదించికొని అనగా సూర్యబింబమునకు చుట్టున్న తేజోమండలములకు నడిమి దారింజూచి నిత్యుడగు విష్ణువుయొక్క లోకమునకేగును.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున శుక్లపక్ష ద్వాదశీవర్ణనము నూటయేబదితొమ్మిదవ అధ్యాయము.

## నూటఅరువదియవఅధ్యాయము - కృష్ణపక్ష ద్వాదశీ వ్రతము

వజ్ర ఉవాచ : కేవలం కృష్ణపక్షస్య ద్వాదశీషు జనార్దనమ్ । కదాప్రభృతి ధర్మజ్ఞ విధినాకేనచార్చయేత్ ॥ 1
మార్కండేయ ఉవాచ : మార్గ్యాంతు సమతీతాయాం ద్వాదశీయాభవేన్నృప ।
తతఃప్రభృతికర్తవ్యం వ్రతమేవము పోషితః ॥ 2
ద్వాదశీషుచ కృష్ణాసు నామకృష్ణ స్యకీర్తయేత్ । తేనైవనామ్నా కర్తవ్యోజపహోమౌతథైవచ ॥ 3
తిలైర్నివేదనం కార్యం హోమః కార్యస్తథాతిలైః । పౌష్యాంతు సమతీతాయాం కృష్ణాయాద్వాదశీభవేత్ ॥ 4

తస్యాం వ్రతావసానేతు తిలాన్దద్యాద్ద్విజాతిషు । సువర్ణంచ మహీపాల! రక్తవస్త్రం తథైవచ ॥ 5.
సంవత్సర మిదంకృత్వా వ్రతం మనుజపుంగవ! । తిర్యగ్యోనిం నచాప్నోతి స్వర్గలోకంచగచ్ఛతి ॥ 6.
యావజ్జీవం వ్రతమిదం యఃకరోతిసమాహితః । నసదుఃఖం సమాప్నోతి నరకంచ నరాధిప! ॥ 7
యత్రవైతరణీ దుర్గా క్షురధారాశ్చ పర్వతాః । పాపానాం యాతనా మత్ర తత్రాసౌనగమిష్యతి ॥ 8.
యస్యాంగణాః భీమబలా మహోగ్రా దంష్ట్రాకరాళా వికటోగ్రవేషాః ।
విద్రావణాః పాపకృతాం నరాణాం నయేన తస్యా నృపయాంతిమార్గమ్ ॥ 9.

ఇతి శ్రీ విష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
ప్రతికృష్ణపక్ష ద్వాదశీవిధిర్నామషష్ట్య ధికశతతమోఽధ్యాయః

కేవలము కృష్ణపక్ష ద్వాదశీ వ్రతముసేసి హరి నర్చించు విధాన మానతిమ్మని వజ్రుడన మార్కండేయ డిట్లనియె. మార్గశిరమాసము గడచినప్పటినుండి అనగా పుష్యమాసమందు కృష్ణపక్షమందు ద్వాదశి మొదలుకొని యీవ్రత ముపవాసముండి సేయవలెను. కృష్ణ ద్వాదసులందు కృష్ణనామ సంకీర్తనము సేయవలెను. ఆ నామ సంపుటితోనే జపము హోమములు సేయ నగును. తిలలు (తిలాన్నము) నివేదన తిలలతో హోమము చేయవలెను. పుష్యమాసము గడచి (మాఘమాసమందన్నమాట) కృష్ణ పక్ష ద్వాదశినాడు వ్రతము సమాప్తిసేసి (ఉద్యాపనమన్నమాట) ద్విజులకు తిలదానము సేయవలెను. అందు బంగారము ఎఱ్ఱని వస్త్రములుగూడ యీయవలెను. ఒక్క సంవత్సర మీవ్రత మాచరించినాతడు పశుపక్ష్యాది జన్మములందడు. స్వర్గలోకమేగును. ఇది యావజ్జీవము సేసినాతడు దుఃఖము నెరుంగడు. నరకమునకుం జనడు. దాటరాని వైతరణి దుర్గమమయిన పదునైన కత్తుల నరకము యమయాతనలుగల నరకమున కీ పుణ్యాత్ముడు పోడు. ఆ నరకమందు భయంకరులు మహాబలులు మహోగ్రులు వికృత మయిన కోరలతో జడిపించువారు వికటమయిన ఉగ్రమైన వేసములవారు పాపులను అటునిటు నూరక తరిమికొట్టువారును సమ్మర్ద మగ దిరుగు నా నరకమార్గము నీ ద్వాదశీవ్రతము సేసినధన్యులు చూడనైన జూడరు.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున కృష్ణపక్ష ద్వాదశీ మహిమయను నూట అరువదియవ యధ్యాయము.

## నూటఅరువది యొకటవ అధ్యాయము - శ్రవణద్వాదశీ ప్రశంస

వజ్ర ఉవాచ : ఉపవాసాస్వసమర్థానాం శుక్లపక్షేద్విజోత్తమ! । ఏకాయాద్వాదశీపుణ్యాతాంవదస్వమమానఘ! ॥ 1
మార్కండేయ ఉవాచ : మాసిభాద్రపదే శుక్లాద్వాదశీశ్రవణాన్వితా । మహతీద్వాదశీజ్ఞేయా ఉపవాసే మహాఫలా ॥ 2
సంగమే సరితోః పుణ్యేద్వాదశీంతాముపోషితః । అయత్నాదేవమాప్నోతి ద్వాదశ ద్వాదశీఫలమ్ ॥ 3
బుధశ్రవణ సంయుక్తా సైవచేద్ద్వాదశీభవేత్ । అత్యంతమహతీయస్యాం సర్వంకృతమథాక్షయమ్ ॥ 4
ద్వాదశీశ్రవణోపేతాయదాభవతి పార్థివ! । సంగమేతు తదాస్నాత్వా సత్తీర్థ స్నానజం ఫలమ్ ॥ 5
సోపవాసః సమాప్నోతి నాత్రకార్యా విచారణా । వారిధానీంతదాదత్వా జలపూర్ణాంద్విజాతయే ॥ 6
ఛన్నాం వస్త్రయుతాం రాజన్ ఛత్రోపానహ సంయుతామ్ । స్వర్గలోకమ వాప్నోతి కులముద్ధరతిస్వకమ్ ॥ 7
స్వర్గం సమాసాద్య చిరంచభోగాన్ భుక్త్వా మహేంద్రోపమ దేవతుల్యాన్ ।
మానుష్యమాసాద్య భవత్యరోగో ధనాన్వితో ధర్మపథోమనస్వీ. 8

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
శ్రావణీద్వాదశీ ప్రశంసావర్ణనంనామ ఏకషష్ట్యధిక శతతమోధ్యాయః

ఉపవాసములు సేయజాలని వారికిగూడ పుణ్యద్వాదశి యేదో యానతీయ వలయునన మార్కండేయుడు భాద్రపద శుక్ల ద్వాదశి శ్రవణానక్షత్రముతో గూడినది మహాద్వాదశి యన బడునది. అందుపవాసము మహాఫలమిచ్చును. రెండు నదులు కలిసిన పుణ్యతీర్థమందు భాద్రపద శుక్లద్వాదశినాడుపవసించి హరి నర్చించిన ధన్యుడప్రయత్నముగ ద్వాదశద్వాదసుల ఫలమందును. అదే భాద్రపద శుక్ల ద్వాదశినాడు బుధవారము శ్రవణానక్షత్రము కూడ కలిసివచ్చినచో నంతకంటె మించిన గొప్ప తిథి మరిలేదు. అందు జేసిన వ్రతము ఉపవాసము అర్చనము అక్షయము. శ్రవణ ద్వాదశినాడు (శ్రవణానక్షత్రయుక్త ద్వాదశియన్నమాట) నదీ సంగమస్థానమందుపవసించి హరి నర్చించిన యాతడు సర్వతీర్థ స్నానఫలము నందును. ఇక్కడ విమర్శచేయ నవసరము లేదు. అప్పుడు తీర్థజలపూర్ణ కుంభమును పైని నూతనవస్త్రముంగప్పి ఛత్రముతో (గొడుగుతో) ఉపానహములతో (పాదరక్షలతో) దానమిచ్చిన పుణ్యాత్ముడు స్వర్గలోకమందు తన కులమెల్ల నుద్ధరించును స్వర్గమందు దేవేంద్రభోగములనుభవించి యాతడు మనుజుడై పుట్టి యెట్టి రోగములు లేక ధనవంతుడు ధర్మపరుడు ఉత్తమమనస్సంపన్నుడగును.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండము శ్రావణీద్వాదశీ ప్రశంసనము నూటఅరువదియొకటవ అధ్యాయము.

## నూటఅరువదిరెండవ అధ్యాయము - పిశాచమోక్షణ శ్రవణద్వాదశీ వర్ణనము

మార్కండేయ ఉవాచ : అత్రాప్యుదాహరంతీమమితిహాసంపురాతనమ్ ।
మహత్యరణ్యే యద్వృత్తం భూమిపాల పురాతనమ్ ॥ 1
దేశా దాశేరకానామ తేషాం భాగేతు పశ్చిమే । అస్తిరాజన్మరుర్దేశః సర్వసత్త్వభయంకరః ॥ 2
సుతప్తసికతా భూమిర్యత్రదుష్టమహోరగా । స్వల్పచ్ఛాయా సమాకీర్ణామృతప్రాణిసమాకులా ॥ 3
శమీఖదిరపల్లాస కరీరాః పైలుభిస్సహ । తత్రభీమాద్రుమగణా కంటకైరావృతాః సమమ్ ॥ 4
చండప్రాణిగణాకీర్ణా తత్రభూమి స్తథాక్వచిత్ । అత్యంతతాపవిషమా నిస్తృణా పరుషోపలా ॥ 5
నాశ్రయ స్తత్రనా హారోజ్వలితాగ్ని సమేభృశమ్ । తథాపితత్రజీవంతిజనాః కర్మనిబంధనాత్ ॥ 6
నోదకం నోదకధరా రాజం స్తత్రవలాహకాః । కదాచిదపిదృశ్యంతే దేశేనిరయసంనిభే ॥ 7
తత్రపక్షాంతరతత్తైస్తృషితైః శిశుభిః సహ । ఉత్క్రాంత జీవితా రాజన్దృశ్యంతేఽథవిహంగమాః ॥ 8
ఉత్ప్లుత్యోత్ప్లుత్య సహసాప్సృగాః సైకతమాలయాత్ । సైకతేష్వేవనశ్యన్తి జలేసైకతసేతువత్ ॥ 9
తస్మింస్తథావిధేదేశే కశ్చిద్దైవవశాద్వణిక్ । వనమాతపవిభ్రష్టః ప్రవిష్టస్తుపరిభ్రమన్ ॥ 10

ఈసందర్భములో నొకయితిహాసముగలదది యొకమహారణ్యములోజరిగినది. రాజా వినుమని మార్కండేయుడిట్లు తెలుప నారంభించిరి. దాశేరక దేశములకు పడమట భాగమందు మరుదేశమున్నది. అది సర్వజంతుభయంకరము. అందలి యిసుక మిడమిడ గాలుచుండును. మహాసర్పములట గానిపించును. అయ్యెండమావులలో నీడ అతిస్వల్పము. ఎటజూచిన చచ్చిన జీవములే. జమ్మి చండ్ర పల్లాసము కరీరములు (దురదగొండి) పైలువులు ననునపక్కడ కనుపించు భయంకర వృక్షాటవులు. ముండ్లతో నిండినవి. అందొక్కచోటు. క్రూరమృగములకు నెలవు. అది అత్యంతతాప విషమ దేశము. గడ్డిపోచ గనిపింపదు. కరకురాళ్ళెటుచూచిన. అట నిలువనీడ తినతిండి లభింపదు. మండుచుండు నగ్నియట్లది యుండును. అయినను ప్రారబ్ధకర్మవశులైన ప్రాణులు కొందరట బ్రతుకుచున్నారు. నీరులేదు. నీరుధరించు నీరధరములు మబ్బులు నట నెన్నడుం గనిపింపవు. అదియొక నిరయము (నరకము) అక్కడ రెక్కలురాని మిక్కిలి దప్పికంగుములు పిల్లల రెక్కలచాటున నదిమికొని ప్రాణములు వాసిన పక్షులట గానవచ్చుచుండును. జంతువులు తమ నివాసములనుండి యయ్యిసుకపై దూదూకి యా యిసుకలోనే యిసుకతో వేసిన పంతెన నీట

మునిగినట్లందే ప్రాణములు వాయుచుండును. ఆవిధమైన యాత్రావున దైవవశమున నొక వర్తకుడెందరకు సుమిలి యట్టిటులిట్టాడి యక్కడ కడుగిడెను.

సతత్రదదృశే ప్రేతాన్సుత్తృష్ణావ్యాకులేంద్రియాన్ । ఉత్కృచాన్మలినాన్రూక్షాన్నిర్మాంసాన్భీమదర్శనాన్ ॥ 11
స్నాయుబద్ధసిరాకాయాన్ ధావమానానిత స్తతః । కంచిత్సమాంసంత త్రైకం ప్రేతస్కంధగతంతథా ॥ 12
దదర్శబహుభిః ప్రేతైః సమంతాత్పరివారితమ్ । తత్స్కంధాద పరంస్కంధం నీయమానం క్రమాత్క్రమాత్ ॥ 13
ప్రేతోఽపిదృష్ట్వాతాం ఘోరామటవీం నరమాగతమ్ । ప్రేతస్కంధాన్మ హీంగత్వా తస్యాంతికము పాగమత్ ॥ 14
సోఽభివాద్య వణిక్ర్శేష్ఠమిదం వచనమబ్రవీత్ । అస్మిన్ఘోరేమహారణ్యే ప్రవేశో భవతః కథమ్ ॥ 15
తమువాచవణిగ్ధీమాన్సార్థ భ్రష్టస్యమేవనే । ప్రవేశోదైవ యోగేన పూర్వకర్మకృతేనతు ॥ 16
తృష్ణామే బాధతేఽత్యర్థం క్షుత్క్షామశ్చభృశంతథా । ప్రాణాఃకంఠ మను ప్రాప్తావదనం భ్రశ్యతేచమే ॥ 17
అత్రోపాయం నపశ్యామి ధ్రియేఽహం యేనకేనచిత్ । ఇత్యేవముక్తః ప్రేతస్తు వణిజం వాక్యమబ్రవీత్ ॥ 18

అతడక్కడ ప్రేతములను దప్పికగుములునింద్రియములతో జుట్టువిరబోసికొని మలినములు రూక్షములు(భయంకరములు) మాంసమెండి బక్కచిక్కిన జీవులను ప్రేవుల కట్టుబాటున మాత్రమే నిలిచియున్న మేనులతో నట్టిటుచెదరిపారు ప్రాణులను జూచెను. అనేకప్రేతములు చుట్టువారుకొన నొక్కప్రేతము మూపుననున్న యొక మాంసము చేతకొనియున్న ప్రేతమొకానొకని నా వర్తకుడు జూచెను ఒకప్రేతము మూపునుండి వేరొకప్రేతము మూపున కానరుడందింప బడుచుండెను. ఆప్రేతముగూడ యా ఘోర దుర్గమారణ్యమున కేతెంచి యీ నరునింగని యా మూపునుండి యవనికురికి యాప్రేత మీ వణిగ్వరునికి మ్రొక్కి ఈమహాఘోరాటవిలో నీకు ప్రవేశమెట్లయ్యె ! ననియడుగ బుద్ధిమంతుడా వర్తకుడు మా వర్తకుల గుంపునుండి దారితప్పి దైవయోగమున బూర్వకర్మవశమున నిట ప్రవేశించితిని. మిక్కిలి దప్పికగొన్నాను. ప్రాణములు కంఠగతములయినవి. మొగమెండినది. ఎట్లాగైన బ్రతుకుద మన్న నిటనేయుపాయము గనిపింపకున్నదనవిని యాప్రేత మావర్తకుని కిట్లనియె.

పున్నాగమిమమాశ్రిత్య ప్రతీక్షస్వక్షణం మమ । కృతాతిథ్యో మయాయావద్గమిష్యసి యథాసుఖమ్ ॥ 19
ఏవముక్త స్తదాచక్రే సవణిక్తృష్ణయాన్వితః । మధ్యాహ్న సమయేప్రాప్తే ప్రేత స్తందేశమాగమత్ ॥ 20
పున్నాగవృక్షాచ్ఛీతోదాం వారిధానీం మనోరమామ్ । దధ్యోదన సుయుక్తేన వర్ధమానేన సంయుతామ్ ॥ 21
అవతార్య తత స్త్వగ్రం ప్రదదాతీచ యత్తదా । తతోగ్రమాత్రేణ వణిక్పరాం తృప్తిముపాగతః ॥ 22
వితృష్ణో విజ్వరశ్చైవం క్షణేన సమపద్యత । తతః ప్రేతేషు సర్వేషు క్రమాద్భాగంతదాదదౌ ॥ 23
దధ్యోదనాత్సపానీయా త్తేఽపితృప్తిం పరాంయయుః । అథసంతర్పయిత్వాతు ప్రేతాంస్తాంత్సతు సర్వశః ॥ 24
ప్రేతాధిపః సబుభుజే పశ్చాదన్నం యథాసుఖమ్ । తస్యభుక్తవత స్త్వన్నం పానీయంచక్షయంయయౌ ॥ 25
ప్రేతాధిపంతత స్తృప్తం వణిగ్వచనమబ్రవీత్ ।

ఇదుగో యీ పున్నాగమునీడ నొక్కక్షణము నిరీక్షింపుము. నావలన నాతిథ్యము వడసి సుఖముగ నేగుదువు గాక. అన విని యావణిజుండట్లసేసెను. మధ్యాహ్నమగునంతకు ప్రేతమటకువచ్చి యా చెట్టుమీదనుండి చల్లనినీటి చక్కని కూజాను దానితో బాటు దధ్యోదనమునిండిన వర్ధమానముంగూడ క్రిందికి దింపెను. అట్లుదింపి (అగ్రమును) తొలిముద్ద నాతనికిం బెట్టెను. అయ్యగ్ర కబళమాత్రమున నావణిజుండెంతేని తృప్తిసెందెను. క్షణములో దప్పికవాసెను. తాపమువాసెను. అవ్వల నటగూడిన ప్రేతము లన్నిటికిం గ్రమముగ నందు భాగము పెట్టెను. అవికూడ ఆ దధ్యోదనమువలన నా చల్లని మంచినీటను దృప్తిపడినవి. అట్లాతడా ప్రేతములనన్నింటిని దృప్తిపరచి యాప్రేతాధిపతి తానును నాయన్నమును సుఖముగ నారగించెను. అతడు దిన్నంత త్రావినంత నా తెచ్చిన యన్నము పానీయము మిగులకుండ యైపోయెను. అవ్వల దృప్తుడైన యా ప్రేతరాజుంగని వణిజుండిట్లనియె.

ఆశ్చర్యమేతత్పరమం వనేఽస్మిన్ప్రతిభాతి మే ॥ 26
అన్నపానస్య సంప్రాప్తిః పరమస్య కుతస్తవ । స్తోకేనచ తథాన్నేన బిభర్షిచ బహూన్కథమ్ ॥ 27
తృప్తాఅపికథం సర్వేనిర్మాంసా భిన్నకుక్షయః ॥ కశ్చిత్త్వమస్యాం ఘోరాయామటవ్యాంతుకృతాలయః ॥ 28
ఏతన్మేసంశయంఛింధి పరంకౌతూహలంహిమే । ఏవముక్తః సవణిజా ప్రేతోవణిజమబ్రవీత్ ॥ 29

ఈయడవిలో నిదినాకు పరమాశ్చర్యముగ దోచుచున్నది. ఇటకీ అన్నపానములు వచ్చుట నీవివి సమకూర్చుట ఈ కొంచెమన్నముతో నింతమందిని భరించుచున్నావిది యెట్లు? వీరు తృప్తిగ దినియు సంచరు బక్కచిక్కి కడుపులెండి యున్నారు. నీవీ ఘోరాటవిలో నివసింతువా? ఈ నా సందియము వారింపు వినవేడుక గొన్నాను అనవిని ప్రేతమిట్లనియె.

వాణిజ్యాసక్తస్య పురాకాలోఽతీతో మమానఘః శాకలేనగరేరమ్యే నాస్తికస్యదురాత్మనః ॥ 30
ధనలోభాన్మయాతత్ర నకదాచిదపిప్రభో! । దత్తాసీద్భిక్షవేభిక్షా కృపణేనకథంచన ॥ 31
ప్రాతివేశ్యశ్చతత్రాసీద్ బ్రాహ్మణో గుణవాన్మమ । శ్రవణద్వాదశీయోగే మాసిభాద్రపదేతథా ॥ 32
సకదాచిన్మయాసార్ధంతాపీంనామనదీం యయౌ । తస్యాశ్చసంగమః పుణ్యో యత్రాసీచ్చంద్ర భాగయా ॥ 33
చంద్రభాగా సరిచ్ఛ్రేష్ఠా యత్రశీతామలోదకా । మహాదేవజటాజూటే గంగానిపతితాపురా ॥ 34
చంద్రేణ భాగతోన్యస్తా చంద్రభాగాస్మృతాతతః । తత్కాల తప్తసలిలాతాపీతత్రార్కనందినీ ॥ 35
శీతోష్ణేచోదకేతస్మిన్ సంగమేసుమనోహరే । తంసదేశం సమాసాద్య ప్రాతివేశ్యమసౌద్విజః ॥ 36
శ్రవణద్వాదశీయోగే స్నానార్చన ఉపోషితః । చాంద్ర భాగస్యతోయస్య వారిధానీనవాదృఢా ॥ 37
దధ్యోదనయుతైఃసార్ధం సంపూర్ణైర్వర్ధమానకైః । ఛత్రైశ్చోపానహైరమ్యై ర్వస్త్రైశ్చవివిధైర్యుతా ॥ 38
ప్రదదౌవిప్రముఖ్యేభ్యో రహస్యజ్ఞో మహీపతిః । చిత్తసంరక్షణార్థాయ తస్యాపిచతదామయా ॥ 39
సోపనాసేనదత్తైకా వారిధానీనవా దృఢా । చాంద్రభాగస్యతోయస్య దధ్యోదనయుతా తదా ॥ 40
గత్వాగృహమను ప్రాప్యతతః కాలేనకేనచిత్ । పంచత్వమహమాసాద్యనాస్తిక్యాత్ప్రేతతాం గతః ॥ 41

ఓ పుణ్యుడ ! మున్ను వర్తకమందే నాకు జాలకాలము గడచెను. శాకలనగరమందేనొక పరమ నాస్తికుడు దురాత్ముడను ధనలోభముచే నేనెన్నడు నే బిచ్చగానికి బిచ్చముం బెట్టియెరుగను పరమ కృపణుడను. అక్కడ నాకొక గుణవంతుడు బ్రాహ్మణుడు ప్రాతివేశ్య (ఇరుగుపొరుగు) డొకడుండెను. శ్రవణానక్షత్ర ద్వాదశీతిథి యోగమందు భాద్రపద మాసములో నతడు నాతో తాపియను నదికి వెళ్ళినాడు. అక్కడ చంద్రభాగానది యా నదిలో సంగమించును. అక్కడ చంద్రభాగానది చల్లని నీరు గలది. మున్ను మహాదేవ జటామకుటమునుండి గంగజారినది. చంద్రుడందు భాగముగొని వచ్చి యుంచినందున నిది చంద్రభాగయైనది. ఆకాలమందుడుకునీటనున్న యీ అర్కనందిని తాపీనది వేడినీట నా చక్కని చల్లని నదికలిసినది. ఆనదీసంగమస్థానమున కీబ్రాహ్మణుడు నాతో బ్రాతివేశ్యమువడసి శ్రవణద్వాదశీ యోగమందు స్నాన పూజాదికము ఉపవాసము సేసెను. చంద్రభాగా నదీపూర్ణమైన గట్టివారి ధాని (కూజా, కడవ) క్రొత్తది దధ్యోదనములతో ఉపానహములతో (పాదుకలు లేక పాదరక్షలు) నీ రాజు ధర్మరహస్యమెరిగినవాడు కావున విప్రముఖ్యులకు దానముసేసెను. ఆయన మనస్సు గాపాడుట కాతనికిని నేనుపవాసముండి యీయొక్క ఉదకపాత్ర నిచ్చితిని. ఇందు చంద్రభాగా తోయముతోపాటు దధ్యోదన పాత్రముగూడ యిచ్చితిని. అవ్వల నేనింటికి జని కొంతకాలమునకేను మృతినంది నాస్తిక్యముపలన నీ ప్రేతజన్మమందినాడను.

అస్యామటవ్యాం ఘోరాయాం యోవాహ్యకుశలస్తదా । శ్రవణద్వాదశీయోగేదత్తాయా సౌమయానఘః ॥ 42
దధ్యోదనయుతారమ్యా వారిధానీనవాదృఢా । సేయం మధ్యాహ్నసమయే దివసేదివసేమమ ॥ 43
ఉపతిష్ఠేత్సదైవేహ యథాదృష్టాత్వయానఘ । బ్రహ్మస్వహారిణస్త్వేతే పాపాః ప్రేతత్వమాగతాః ॥ 44

పరదార రతాః కేచిత్స్వామి ద్రోహ రతాః పరే । మిత్ర ద్రోహరతాః కేచిద్దేశేఽస్మిన్భృశదారుణే ॥ 45
మమానుయానం కుర్వంతి అన్నపానకృతేఽనఘః । అక్షయో భగవాన్విష్ణుః పరమాత్మా సనాతనః ॥ 46
తముద్దిశ్యతుయద్దత్తం తదక్షయ్యం ప్రకీర్తితమ్ । అక్షయ్యేనతథాన్నేనతృప్తా అపిహిమానద ॥ 47
ప్రేతభావేన దౌర్బల్యం నవిముంచంతి కర్హిచిత్ । అహంచ పూజయిత్వాత్వామతిథిం సముపస్థితమ్ ॥ 48
ప్రేతభావాద్వినిర్ముక్తోయాస్యామి పరమాంగతిమ్ । మయావిహీనాః ప్రేతాస్తువనేఽస్మిన్భృశదారుణే ॥ 49
పీడామనుభవిష్యంతి దారుణాంకర్మయోగజామ్ । ఏతేషాంత్వం మహాభాగః మదనుగ్రహకామ్యయా ॥ 50
ప్రత్యేకం గోత్రనామానిగృహీత్వాలిఖితేనచ । అస్తికక్ష్యా గతై వైషాతవ సాపుస్తికాశుభా ॥ 51
హిమవంతమథాసాద్యతత్రత్వం లప్స్యసేనిధిమ్ । గయాశీర్షేతతోగత్వా శ్రాద్ధంకురుమహామతే ॥ 52
ఏకైకం త్వమథోద్దిశ్య ప్రేతం ప్రేతంయథా సుఖమ్ । తతస్తు తేవిమోక్ష్యంతి ప్రేత భావమసంశయమ్ ॥ 53
ఇత్యేవం సవదన్నేవతప్త జాంబూనద ప్రభః । విమానవరమాస్థాయస్వర్గలోకం తతోగతః ॥ 54
స్వర్గతే ప్రేత నాథేతు ప్రేతానాం సవణిక్క్రమాత్ । నామగోత్రాణి సంగృహ్య ప్రయాతః సహిమాలయమ్ ॥ 55
తత్ర ప్రాప్యనిధింగత్వానిక్షిప్యచ తథాగృహే । ధనం కించిదుపాదాయగయా శీర్షం తతోయయౌ ॥ 56
ప్రేతానాంక్రమశస్తత్ర చక్రేశ్రాద్ధం దినేదినే । యస్యయస్యయదాశ్రాద్ధం కరోతి సమహావణిక్ ॥ 58
ప్రేతభావోమయాత్యక్తః ప్రాప్తోఽస్మిత్రిదివం ధ్రువమ్ । కృత్వాసధనదానేన ప్రేతానాం నిష్కృతింవణిక్ ॥ 59
జగామస్వగృహం తత్రమాసిభాద్రపదేతదా । శ్రవణద్వాదశీయోగే పూజయిత్వాజనార్దనమ్ ॥ 60
ధనంచదత్త్వా విప్రేభ్యః సోపవాసోజితేంద్రియః । పుణ్యేషు సతతం రాజన్ నదీనాం సంగమేషుచ ॥ 61
గంగాసరయ్వోర్గంగాయాశ్శోణస్య చమహామతిః । ఇక్షుమత్యాశ్చ గంగాయా గంగాయమునయోస్తథా ॥ 62
గోమత్యాశ్చ సరయ్వాశ్చ కౌశికీగండక్యోస్తథా । విపాశయాదేవ హ్రదాయత్రయోగం ప్రపద్యతే ॥ 63
విపాశాచ తథాయోగం యత్రయాతిశతద్రుణా । ఇరావతీ తథాయోగం యత్రవ్రజతి సింధునా ॥ 64
చంద్రభాగా చవ్రజతి యత్రయోగం వితస్తయా । మహాసింధుశ్చ సంయోగం యత్రయాతి వితస్తయా ॥ 65
ప్రత్యబ్దంయావదేతేషు సంగమేషు మహావణిక్ । కరోతి విధివద్దానం యావద్దిష్టాంత మాగతః ॥ 66
అవాప పరమంస్థానం దుర్లభం యత్తుజంతుభిః । యత్రకామఫలావృక్షానద్యః పాయసకర్దమాః ॥ 67
శీతలామలపానీయాః పుష్కరిణ్యోమనోహరాః । సువర్ణ సికతారాజన్ మణిసోపాన భూషితాః ॥ 68
ఆనంత్యాయ ససంప్రాప్తోదేశంతంభూరిదక్షిణః । తందేశమాసాద్యవణిఙ్మహాత్మా ।
సుతప్తజాంబూనద భూషితాంగః । కల్పంసమగ్రం ముదితో యతాత్మా । రేమేసరామాభియుతః కృతాత్మా ॥ 69
విమానైరప్సరోభిశ్చసిద్ధ గంధర్వసేవితః । విష్ణులోక మవాప్నోతి యావదా భూతసంప్లవమ్ ॥ 70
రాజసూయాదిభిర్యజ్ఞైర్యత్ఫలం సమవాప్యతే । శ్రవణద్వాదశీం కృత్వాతత్ఫలం లభతేనరః ॥ 71

ఇతి శ్రీవిష్ణు ధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
పిశాచమోక్షణేశ్రవణద్వాదశీ మాహాత్మ్య వర్ణనంనామ ద్విషష్ట్యధిక శతతమోఽధ్యాయః.

ఈఘోరాటవిలో నొక చేతగాని వాడెవ్వడు దొరకునాయని దినదినము నేను చూచుచుండ నీవులభించితివి. ఓ పుణ్యాత్ముడ! సరిగా శ్రవణద్వాదశీ యోగమునందిక్కడ నీవుగనిపించితివి. అదుగో! ఈ ప్రేతలు మున్ను పరమపాపులు. బ్రహ్మస్వము హరించి ప్రేతత్వము వడసినారు. వీరు పరదారరతులు కొందరు స్వామిద్రోహులు. వీరీపరమదారుణ దేశమందున్నారు. వీరందరు అన్నపానములకై నావెంట పడుచుందురు. భగవంతుడు పరమాత్మ సనాతనుడు విష్ణువక్షయుడు. ఆయనను ద్దేశించి యిచ్చినదది

యక్షయ్యమనబడును. అక్షయ్యమైన అన్నముచే వీరుతృప్తులు. వీరు ప్రేతత్వముచే దౌర్బల్యము నెంతకేని విడుపకున్నారు. అనుకోకుండ దారసిల్లిన అతిథిని నిన్నేను నర్చించి ప్రేతభావమునుండి ముక్తినంది పరమగతినందుచున్నాను నన్నువీడిన ప్రేతలీయడవిలో ప్రారబ్ధకర్మవశమైన పరమనికృష్ట పీడననుభవించుచున్నారు. ఓ మహానుభావ! నాపై ననుగ్రహముసేసి నేనువ్రాసియిచ్చిన వీరి గోత్రనామముల నీవుగైకొనుము ఆ పుస్తిక (పుస్తకము) ఇదిగో నాచంకలోనున్నది. నీవు హిమవంతమునకేగి యటనొకనిధిని (గనిని) బడయుదువు. ఆమీదనేగి నీవు గయాశీర్షమునందు ఒక్కొక్క ప్రేతమునుద్దేశించి యథాసుఖముగ శ్రాద్ధము గావింపుము అందువలన వారు ప్రేతత్వమును బాయగలరు. సందేహములేదు.

ఇట్లాతడు పలుకుచునే పదనారవవన్నె బంగారుచాయగొని విమానశ్రేష్ఠమెక్కి స్వర్గలోకమునకేగెను. యాప్రేతల నామగోత్రములనుగొని ఆ ప్రేతనాథునర్చనయైన తర్వాత యాతడు హిమాలయమేగెను. అక్కడ యాతడన్నట్లు గనింబడసి యదియింటనుంచి, అందింపక ధనముగొని గయాశీర్షమునకేగెను. అక్కడ ప్రేతలకు దినదినము క్రమముగ శ్రాద్ధమొసంగెను. ఆ మహావర్తకుడెవనికెవనికి అట శ్రాద్ధముచేయునో ఆయాజీవులాతని కారేయి కలలో గనిపింపచువచ్చిరి. కనిపించి ఓ మహానుభావ! నీప్రసాదమున నో పుణ్యుడ! నేను ప్రేతత్వముబాసితిని శాశ్వత స్వర్గముపొందితిని. అని యెరింగింపుచుండెను. ఇట్లావణిజుండు ధనదానముచే నాప్రేతలకు నిష్కృతి (పాపోపశమనము) సేసి తనయింటికేగెను. ఏగి యట ప్రతి భాద్రపదమందును శ్రవణద్వాదశీయోగమందుపవసించి జనార్దనుబూజించి విప్రులకుధనములిచ్చిజితేంద్రియుడై పుణ్యనదీసంగమతీర్థములందుఅనగా గంగాసరయూనదులుగంగాశోణానదులు ఇక్షుమతీ గంగానదులు గంగాయమునానదులు గోమతీసరయూనదులు కౌశికీ గండకీనదులు విపాశా దేవహ్రదానదులువిపాశాశతద్రునదులు సింధుఇరావతీనదులు చంద్రభాగా వితస్తానదులు మహాసింధు వితస్తానదులు కలిసిన పుణ్యతీర్థములందు ప్రతిసంవత్సరమీ మహావణిజుడు యథావిధిగదిష్టాంతమగుదాక(అవసానముదాక)యథావిధిదానముసేసి జంతువులేవియునందలేని పరమస్థానమునుబొందెను. ఆస్థానమందు చెట్లుకామఫలములు(కోరినపండ్లిచ్చునవి)నదులు పాయసపూర్ణములు. పుష్కరిణులు సుశీతమధురోదకములు మనోహరములు. అందిసుక కేవలసువర్ణమే మెట్లు మణిమయములే. భూరిదక్షిణుడైన యావర్తకుడనంతత్వము కొరకు శాశ్వతస్థితికి (అపునరావృత్తయైనముక్తికి) పాత్రుడై యటకువచ్చెను. ఆమహాత్ముడు పణిగ్వరుడటకేతెంచి పుటముపెట్టిన బంగారుచాయమేనుగలవాడై ఒక్కకల్పకాలమురామామణులతోగూడిముదమునవిహరించెను. అట్లుకృతార్థుడై అప్సరసలు సిద్ధగంధర్వులుసేవింపవిమానములెక్కి ప్రళయావసానముదాక విష్ణులోకమందు విహరించును. శ్రవణద్వాదశీవ్రతమాచరించిన నరుడు రాజసూయాదియజ్ఞములు సేసినఫలమునందును.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తరమహాపురాణము ప్రథమఖండమున శ్రవణద్వాదశీమహిమానువర్ణనమను నూటఅరువదిరెండవఅధ్యాయము.

## నూట అరువదిమూడవ అధ్యాయము - తిలద్వాదశీ మహిమానువర్ణనము

వజ్ర ఉవాచ : ఏకాముపోష్య కృష్ణాంయాం ద్వాదశీం విధినా నరః । మహత్ఫలమవాప్నోతి తాం సమాచక్ష్వభార్గవః ॥ 1
మార్కండేయఉవాచ: పౌష్యాంతు సమతీతాయాం శ్రవణేనతు సంయుతా । ద్వాదశీ యాభవేత్కృష్ణాప్రోక్తాసా తిలద్వాదశీ ॥
తిలైఃస్నానంతిలైర్హోమం నైవేద్యంతిలమోదకైః । దీపాశ్చతిలతైలేన తథాదేయం తిలోదకమ్ ॥ 3
తిలాశ్చదేయావిప్రేభ్యస్తస్మిన్నహని పార్థివః । ఉపవాసదినేరాజన్హోతవ్యాశ్చ తథాతిలాః ॥ 4
ఉపోషితేనాపరేఽహ్ని హోతవ్యాశ్చ విశేషతః । ఇంధనంచ ప్రదాతవ్యం బ్రాహ్మణేభ్యస్తథాఽనఘ! ॥ 5
తిలప్రస్థంతదాహుత్వా సోపవాసో జితేంద్రియః । నదుర్గతిమవాప్నోతి నాత్రకార్యా విచారణా ॥ 6
తద్విష్ణోః పరమంపదం హోమమంత్రః ప్రకీర్తితః । పౌరుషంచతథాసూక్తం శ్రీసూక్తేన చ సంయుతమ్ ॥ 7
హోమఃకార్యోఽథరాజేంద్రః సావిత్ర్యాచయతాత్మనా । ఏతత్ప్రోక్తం ద్విజాతీనాం స్త్రీశూద్రేషుతథాశృణు ॥ 8
ద్వాదశాష్టాక్షరో మంత్రస్తేషాం ప్రోక్తో మహాత్మనామ్ । హితౌచద్విజాతీనాం మంత్రశ్రేష్ఠౌ నరాధిప ॥ 9
తాభ్యామభ్యధికో మంత్రో విద్యతేనేహకుత్రచిత్ । వజ్ర ఉవాచ : ద్వాదశాష్టాక్షరౌ మంత్రౌ కథయస్వమమానఘ ॥ 10
పుణ్యౌపవిత్రౌ మంగల్యౌ సర్వ పాపప్రణాశనౌ ।
మార్కండేయ ఉవాచ : ఓం నమోభగవతే వాసుదేవాయ। ఓం నమో నారాయణాయ ॥ 11
ఏతౌమయాతేకథితౌ పవిత్రౌ మంత్రోత్తమౌ పాపహరౌ వరేణ్యౌ ।
పారాయణౌ సర్వ తపస్వినాంచ రహస్య భూతౌభువనేషు నిత్యమ్ ॥ 12

యథాతిథిస్తే శ్రవణేనయుక్తా మాఘస్యమాసస్యతథాతవోక్తా ।
కార్యాతథేయం నృపతే విశేషా ద్యోగేపవిత్రే సరితోర్ద్వయస్య ॥ 13

ఇతి శ్రీ విష్ణుధర్మోత్తరే మహాపురాణే ప్రథమఖండే మార్కండేయవజ్రసంవాదే
తిలద్వాదశీ ప్రశంసావర్ణనం నామత్రిషష్ట్యధిక శతతమోఽధ్యాయః.

భార్గవా ! ఏ ఒక్కకృష్ణపక్షద్వాదశినాడుపవసించి మహాఫలమును బొందవచ్చునో యానతిమ్మన మార్కండేయుడిట్లనియె. పుష్యమాసము గడచినమీదట శ్రవణనక్షత్రముతో గూడిన కృష్ణద్వాదశి తిలయుండలతో నివేదనము చేయుట నువ్వులనూనె దీపము పెట్టుట తిలతర్పణముసేయుట విప్రులకు తిలదానముసేయుట ప్రశస్తము. నాడుపవసించి తిలలతోహోమముసేయనగును. ఉపవసించి మరునాడు తిలలతోహోమముసేయుట చాలవిశేషము. బ్రాహ్మణులకు ఇంధనము (కట్టెలమోపు) దానముసేయవలెను. ఉపవాసముతో తిలప్రస్థము ప్రస్థపరిమాణతిలలను హోమముసేయవలెను. అట్టివానికి దుర్గతి కలుగదు. హోమముసేయునపుడు "తద్విష్ణోః పరమం పదం" అన్నమంత్రము నుపయోగింపవలెను. నియమశాలియై పురుషసూక్త శ్రీసూక్తములు సావిత్రీమంత్రమును సంపుటీకరించి హోమముసేయనగును. ఇదిద్విజులవిషయము. ఇక స్త్రీలు శూద్రులవిషయము వినుము. మహాత్ములయినవారికి ద్వాదశాక్షర అష్టాక్షర మంత్రములు సెప్పబడినవి. అవి ద్విజులకును హితములే. వానినిమించిన మంత్రమింకొకటి యిటలేదు. అనవిని వజ్రుండామంత్రములు పవిత్రములు మంత్రోత్తమములు సర్వపాపహరములు మంగళ్యములుంగావున యవి యానతిమ్మన మార్కండేయుడు వాని నిట్లుపదేశించెను. ఓం నమోభగవతే వాసుదేవాయ- ఇదిద్వాదశాక్షరమంత్రము. ఓం నమోనారాయణాయ- ఇదిఅష్టాక్షరమంత్రము. శ్రేష్ఠములయిన యీమంత్రములను నేను నీకుపదేశించితిని. ఇవి సర్వతపస్వులకు పరమోపాస్యములు. భువనములందివి అతిరహస్యములును. రెండుపవిత్రనదుల సంగమమందు మఘానక్షత్రయుక్త పూర్ణిమనాడు (మాఘమాసములో) ఈ ద్వాదశీ విధినిర్వహణము చాలవిశేషము.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున "తిలద్వాదశీ మహిమానువర్ణన"మను
నూటఅరువదిమూడవ అధ్యాయము.

## నూటఅరువదినాల్గవ అధ్యాయము - తిలద్వాదశీవ్రతకథ

మార్కండేయఉవాచ: అత్రాప్యుదాహ రంతీమ మితిహాసంపురాతనమ్ ।
మాగధేషుతు యద్వృత్తం తచ్ఛృణుష్వ నరాధిప ॥ 1
బభూవమాగధోరాజా చండవేగ ఇతిశ్రుతః । తస్యాసీద్రూప సంపన్నా భార్యానయన సుందరీ ॥ 2
సర్వధర్మా న్పరిత్యజ్య ప్రతిసంవత్సరంతుసా । తిలాన్ హోమయతే విప్రై ర్జుహోతి చ తథాస్వయమ్ ॥ 3
శ్రవణ ద్వాదశీయోగే మాఘేమాసి హుతాశనే । దేవస్య చైవ నైవేద్యం కరోతి తిలమోదకైః ॥ 4
అర్చనేనచ వాసోభిః పూజయత్య పి మాధవమ్ । మహారంజిత రక్తానివాసాంసి వివిధానిచ ॥ 5
బ్రాహ్మణీనాంచ గేహేషు విసర్జయతి తత్పరా । మహావర్తి ప్రదానంచ విధత్తే కేశవాలయే ॥ 6
తాం కదాచిత్సుఖాసీనాం బ్రాహ్మణీ తు వసన్తికా । పప్రచ్ఛ సఖిభావేన రహస్యం నిర్జనేస్థితా ॥ 7
వసన్తికోవాచ: సర్వధర్మాన్పరిత్యజ్య మాఘేమాసి శుభాననే ।
ద్వాదశ్యాం కృష్ణపక్షస్య కస్మాదర్చ యసేహరిమ్! ॥ 8
కస్మాత్తథా బహుతిలం హావయస్యనలే తథా । ఏతన్మే సంశయంఛింధి రహస్యం చేన్నతేశుభే! ॥ 9

మార్కండేయుడిట్లనియె. ఈ తిలద్వాదశీమహిమను దెలుపు నితిహాసమొకటి మాగధదేశములందు జరిగినది వినుము. మాగధాధిపతి చండవేగుడను నాతడుండెను. ఆయనకు రూపవతి నయనసుందరియను భార్యయుండెను. ఆమె సర్వధర్మములను మాని యొక్కయేడు మాఘశ్రవణ ద్వాదశినాడు విప్రులచే తిలహోమము సేయించెను. తానునుంజేసెను. నువ్వుపప్పుండలను (చిమ్మిరి) నివేద్యముసేయుచుండెను. అర్చనమందు విష్ణువునకునూతనవస్త్రములు సమర్పించుచుండెను. బ్రాహ్మణస్త్రీలకు చక్కని ఎఱ్ఱజరీచీరలనేకములను అనేకమందికిచ్చుచుండెను. విష్ణ్వాలయములో మహావర్తి దీపదానముకూడ చేసెను. ఒకప్పుడు సుఖాసీనయై యున్నయామెనేకాంతమున వసంతికయను బ్రాహ్మణిచెలిమియై సర్వధర్మములువిడిచి ఒక్క మాఘకృష్ణద్వాదశినాడు కృష్ణార్చనము మాత్రమే యెందులకు జేయుచున్నావు. ఎందులకు తిల సమృద్ధిగా హోమము సేయుచున్నావు. ఓ శుభానన! ఇది రహస్యముగాదేని నా సందియము వాపుమన నయనసుందరి యిట్లనియె.

నయనసుందర్యువాచ: రహస్య మేతత్పరమం న రహస్యం తథాత్వయి।త్వంమే సఖీశ్వరీ ప్రాణ స్త్వం మే ప్రాణధనేశ్వరీః ॥
అస్తివైతస్తికోనామదేశః పరమధార్మికః । తత్రగ్రామవరేచా సీద్వసతిర్మే సుశోభనా ॥ 11
చండవేగశ్చ విప్రోఽభూద్భర్తా మేపూర్వజన్మని । నాస్తికోనిరను క్రోశస్తర్క శాస్త్రరతః సదా ॥ 12
తత్రైవ విషయేరాజా బభూవ దధివాహనః । తస్యభార్యావయస్యామే బభూవకమలాశుభా ॥ 13
సాకదాచిన్మామువాచ రహస్యం వరవర్ణినీ । నారీభర్తృకృతాదర్ధం పుణ్యం ప్రాప్నోతిసుందరీ ॥ 14
నాస్తిస్త్రీణాం పృథగ్యజ్ఞోన వ్రతం నాప్యుపోషితమ్ । పతింశుశ్రూషతేయాతు తేనస్వర్గేమహీయతే ॥ 15
కర్తవ్యం యోషితాపుణ్యం పృథగ్వా పి తదిచ్ఛయా । పతిస్తేనాస్తికోభద్రే కించిన్నాచరతేశుభమ్ ॥ 16
నచాచరసిధర్మంత్వంతథా చతదనుజ్ఞయా । కాగతిః పరలోకేచ భవిష్యతిశుభాననే ॥ 17
ఇహయత్క్రియతే కర్మప్రేత్యతత్రోపభుజ్యతే । యేనోప్తం ఫలకాలేతు సవీవాశ్నాతి భామిని! ॥ 18
మానుష్యం దుర్లభం ప్రాప్య విద్యుత్సంపాతచంచలమ్ । నాచరంతిశుభంయేతు తేషాంజన్మ నిరర్థకమ్ ॥ 19
కదాచిద పివామోరుః యోనిష్వథ పరిభ్రమమ్ । మానుష్యం నామజాయేత యత్రాయత్తం శుభాశుభమ్ ॥ 20
చాండాలత్వేఽపిమానుష్యం సర్వథా సఖిదుర్లభమ్ । ఆత్మాశక్య స్త్వయాత్రాతుం మానుష్యాన్నాన్యతరఃశుభే! ॥ 21
తవోపరితథాజాతాసఖీ భావేనమేకృపా । కదర్యస్యాస్యభార్యాత్వం సుస్వభావా పతివ్రతా ॥ 22
తత్రతేఽనుగ్రహంకించిత్కరిష్యామినిబోధతత్ । హరస్యదయితాభార్యా శైలేంద్రతనయా ఉమా ॥ 23
విస్తారిత మహాకూలాసా వితస్తా మహానదీ । అవృత్తికర్శితః పాపం కృత్త్వైవ ఋతుపంచకమ్ ॥ 24
స్నానేనైకేన సకలం శైశిరేణ వ్యపోహతి । యస్యాం యస్యాంతిథౌ స్నాతః స్వర్గమాప్నోత్య సంశయమ్ ॥ 25
తస్యాం సంవత్సరం స్నాత్వామోక్షోపాయంతు విందతి । యాచసుస్వాదుసలిలాయాచ పాపక్షయంకరీ ॥ 26
తస్యాస్తీరే మయానిత్యం ప్రతిసంవత్సరంశుభే! । ఉపోష్యమాఘ కృష్ణస్యద్వా దశ్యాం శ్రవణేతథా ॥ 27
పూజితోభగవాన్విష్ణుర్బ్రాహ్మణాశ్చహుతాశనః । తిలైస్తస్మాత్తు తేఖ్యాతం బ్రాహ్మమేతద్వ్రతంమమ ॥ 28
తస్మాత్సన్నం తిలంయచ్ఛ యదగ్నౌపతితంనచ । తతఃపుణ్యఫలం సర్వంత్వమాప్నుహి వరాననే! ॥ 29

ఇది పరమరహస్యమే. అయినను నీయెడ నిదిదాపరికము చేయరానిది. నీవు నాసఖీశ్వరివి ప్రాణమవు. ప్రాణధనేశ్వరివి. వైతస్తికమను నొకపరమ ధార్మికమైన దేశముగలదు. అందొక గ్రామమందు మామిక్కిలి చక్కని యిల్లున్నది పూర్వజన్మమందు చండవేగుడను విప్రుడు నాభర్త. ఆతడు నాస్తికుడు. జాలిలేనివాడు. తర్కశాస్త్రరతుడు. అదేదేశమందు దధివాహనుడను రాజుండెను. ఆతనిభార్య కమల నాచెలికత్తె. ఆసుందరి ఒకప్పుడు రహస్యముగ నాతో "స్త్రీ భర్తచేసిన పుణ్యములో సగముపొందును. స్త్రీలకు వేరే యజ్ఞము వ్రతము ఉపవాసము నను నదిలేదు. పతి శుశ్రూషచేసినంజాలు స్వర్గమునందును ఒకవేళ నాడు దేదైన పుణ్యము

చేయవలెనన్న మగని యనుమతితోనే చేయవలెను. నీ పెనిమిటి నాస్తికుడు. కొంచెమేని మంచిపనిచేయడు. అతనియనుజ్ఞతో నీవేని యించుక పుణ్యకార్యము సేయవు. ఓ పద్మానన! నరకలోకమునందు నీకేగతిపట్టును? ఇక్కడ యేకర్మమాచరించిన మరణించి యది యక్కడయనుభవింపవలయును భామిని ! ఎవ్వడు విత్తనమ వేయునాతడు ఫలకాలమందది యనుభవించును. వట్టి మెరపువోలె నతిచంచలమైన మనుష్యజన్మము దుర్లభమైనదెత్తి యెవ్వరుపుణ్యము సేయరో వారిజన్మము వ్యర్థమగును. అనేకయోనులం దిరుగాడిన మీదట మానుష్యమనునదివచ్చును, శుభాశుభములా మనుష్యజన్మమున కధీనములయి యుండును. సఖి! చండాలుడుగనేని మనుష్యుడై పుట్టుట దుర్లభము. మానుష్యమువలననే నిన్నీవు కాపాడుకొనగలవుగాని మరియొక జన్మమువలనగాదు. నీపై చెలికారమున జేసి నాకుజాలికల్గినది. ఈ పరమనీచునికి పరమోత్తమ స్వభావవు భార్యవైతివి. అందు నీయెడ నేనొకింత యనుగ్రహము సేసెద నిదెతెలియుము. హరుని యిల్లాలు శైలరాజుకూతు రుమాదేవి. ఆమెయే వితస్తా మహానది. సువిశాలములైన యుభయతీరముల నొరసి పారుచున్నది. అనేకావృత్తులు అయిదుఋతువులు పాపములు సేసినవాడుగూడ యందొక్కమారు మాఘమాసమున మునిగిన జాలు నెల్లపాపముల బాయగలడు. అందే యేతిథియందు స్నానముసేసి స్వర్గముపొందునో యదేతిథియందొక్క సంవత్సరము స్నానముసేసెనేని మోక్షోపాయముం బొందును. ఆ నదీమతల్లి స్వాదూదక. పాపక్షయంకరి. ఆ నదీతీరమందేదేనొక్క సంవత్సరముపవాసముండి మాఘకృష్ణ ద్వాదశి శ్రవణనక్షత్రము కలిసిననాడు స్నానముసేసి విష్ణుభగవానుని బూజించితిని. బ్రాహ్మణులనర్చించితిని అగ్నిని తిలలచే వేల్చితిని. అందుచే నీనావ్రతము బ్రాహ్మమను ప్రఖ్యాతి నందెను. అప్పుడక్కడ జారినసువ్వుగింజ యగ్నిలోపడనిదేదేని యున్నదానివలని పుణ్యఫలమెల్ల నో శుభానన! నీవుపడయుదువుగాక !

ఇత్యేవముక్తయాగత్వా భర్తా పృష్టస్తదామయా । హసతాతేనచా ప్యుక్తాగచ్ఛగృహ్ణీష్వ తత్ఫలమ్ ॥ 30
స్వయం కృత్వాశుభం కర్మ కమలాసాసఖీమమ । సహభర్త్రా విశాలాక్షీ విష్ణులోకమితోగతా ॥ 31
తల్లోక మక్షయం తస్యాః శ్రుతం వైవస్వతాన్మయా । తస్మాద్దృష్టఫలంభద్రేకరోమి తిలద్వాదశీమ్ ॥ 32
ఏతత్తే సర్వమాఖ్యాతం యన్మాం పృచ్ఛసి సుందరిః ।
మార్కండేయ ఉవాచ : ఏతచ్ఛ్రుత్వాశుభంవాక్యం బ్రాహ్మణ్యపివసంతికా । 33
శ్రవణద్వాదశీయోగే పూజయామాసకేశవమ్ । మాఘకృష్ణేమహాభాగః తిలైర్నిత్యమతంద్రితా ॥ 34
పూజయిత్వాపి సాదేవం శ్వేతద్వీపమితోగతా । సాపిరాజ్ఞోమహాభాగా తథానయన సుందరీ! ॥ 35
అమలం స్థానమాసాద్య విరరాజ శశి ప్రభా । తస్మాత్సర్వ ప్రయత్నేన తదా పూజ్యోజనార్దనః. 36
తిలైర్నిత్యం మహాభాగహోతవ్యాశ్చ తథాతిలాః । తిలాశ్చదేయా విప్రేభ్యస్తస్మిన్నహని పార్థివ! ॥ 37
ఏకైక స్మాత్తిలాద్రాజం స్తిలబీజోద్భవేయథా । సుకృష్టక్షేత్ర జాద్దృష్టం దేవేకాలప్రవర్షిణి ॥ 38
ఏకైకస్మాత్తిలా త్తద్వత్ఫల మక్షయ్యమశ్నుతే । స్వర్లోకేవిష్ణులోకేవామానుష్యేయది వానృప: ॥
అక్షయ్యంఫలమాప్నోతి ఏకైకస్మాత్తిలాత్తిలాత్ ॥ 39
తస్మాత్ప్రయత్నేననరేంద్ర చంద్రః తస్యాం సమభ్యర్చయ వాసుదేవమ్ ।
ఉపోషితః ప్రీతమనాయథావత్ త్రాణం సదేవః ప్రథితోనరాణామ్ ॥ 40

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
చండవేగోపాఖ్యానే తిలద్వాదశీమాహాత్మ్యవర్ణనం నామ చతుఃషష్ట్యధిక శతతమోఽధ్యాయః.

ఇట్లామె పలుకవిని చనినంత నామగడడుగ నిది యెల్లనేనెరిగింప నతడు పరిహసించి పోపొమ్ము! ఆఫలమెల్ల మూటగట్టుకొమ్మన నాసఖి కమల తాను స్వయముగ నాపుణ్యమెల్ల నాచరించి యటనుండి భర్తతో విష్ణులోకమేగెను. ఆపుణ్యలోక మామెకక్షయమైనదనికూడ యమధర్మరాజువలననేనువినియున్నాను. కావున కల్యాణి! ఇదిదృష్టఫలము. తిలద్వాదశీవ్రతము నేనుజేయుచున్నాను.

ఇదెల్ల నడిగితివని నీకుదెల్పితిని. అన నీపుణ్యవచనమాలించి యా బ్రాహ్మణి వసంతిక శ్రవణద్వాదశీయోగమందు మాఘబహుళములో తిలలతో విష్ణువునారాధించి యేపాటితొట్రుపాటులేక యా మహానుభావురాలిటనుండి శ్వేతద్వీపమునకేగెను. ఆరాజ్ఞి నయనసుందరియుం చంద్రప్రభనంది పుణ్యలోకమునంచి రాజిల్లెను. కావున సర్వవిధముల నా పుణ్యతిథియందిట్లు హరి పూజనీయుడు. తిలలతో పూజ హోమము దానము నానాడు ప్రశస్తము. చక్కగా దున్నిననేల ఒక్కనువ్వుగింజనుండి పెక్కు నువ్వుగింజలు పుట్టినట్లు ఒక్కొక్క నువ్వుగింజవలన నక్షయ్యమయిన ఫలమందు. స్వర్గమందుగాని విష్ణులోకమందుగాని మనుష్యలోకమందుగాని యక్షయ్య ఫలము గల్గితీరును. కావున సప్రయత్నముగ నో నరేంద్రచంద్ర ! ఆ మాఘద్వాదశీ తిథియందు వాసుదేవు నుపవసించి పూజించి సంప్రీత మనస్కుడగునేని వానికాదేవుడు రక్షకుడగునను విషయము ప్రసిద్ధము.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తరమహాపురాణము ప్రథమఖండమున తిలద్వాదశీవ్రతకథయను నూటఅరువదినాల్గవ అధ్యాయము.

## నూటఅరువదియైదవ అధ్యాయము - గాయత్రీమాహాత్మ్యము

వజ్రఉవాచ : హోతవ్యే విష్ణుదైవత్యే సావిత్రీమేత్వయోదితా । హోమకర్మణి సందేహోమహాన్మేభృగునందన ॥ 1
సవితాదైవతం తస్యాః సావిత్రీత్యుచ్యతే తతః । తయాకథంతు కర్తవ్యం హోమకర్మతువైష్ణవమ్ ॥ 2
ప్రభావమార్షేశ్చతథా తస్యాస్తం మమ కీర్తయ । వేదమాతాతు సాప్రోక్తా సర్వపాపప్రణాశినీ ॥ 3
మార్కండేయ ఉవాచ : రవిమధ్యేస్థితః సోమః సోమమధ్యేహుతాశనః ।
తేజోమధ్యేస్థితం సత్త్వం సత్త్వ మధ్యేస్థితోఽచ్యుతః ॥ 4

విష్ణుదైవత్యమైన హోమమునకు సావిత్రీమంత్రమునుకూడ తామసెలవిచ్చినారు. అందు నాకు పెద్ద సంశయముకల్గుచున్నది. సవిత (సూర్యుడు) దైవతముగా గలదిగాన యా మంత్రము "సావిత్రీ" అని పలుకబడుచున్నది. అపుడుదాని సంపుటీకరణముతో విష్ణుదేవతాకమైన హోమము సేయుటెట్లు? ఆమంత్రముయొక్క ఆమంత్రర్షియొక్క ప్రభావము నాకు వర్ణింపుము. ఆ సావిత్రిసర్వ పాపప్రణాశిని వేదమాతయనియు జెప్పబడినదిగదాయన మార్కండేయు డిట్లనియె.

అంగుష్ఠమాత్రః పురుషః పూర్వమేవమయేరితః । శంకరేణ తదాదృష్టః ప్రభవః సర్వతేజసామ్ ॥ 5
సవిష్ణుర్భువనాధారోయస్యేదం సకలంజగత్ । వరేణ్యంతచ్చ సవితుర్భర్గోవాచ్యంతుయోగినామ్ ॥ 6
ధ్యేయం పరంతదుద్దిష్టం బహిరంతశ్చయాదవ! । ధీశబ్దవాచ్యం బ్రహ్మాణం ప్రచోదయతియః సదా ॥ 7
సృష్ట్యర్థం భగవాన్విష్ణుః సవితాసప్రకీర్తితః । సర్వలోకప్రసవనాత్సవితా సతుకీర్త్యతే ॥ 8
యతస్తద్దేవదైవత్యా సావిత్రీత్యుచ్యతేతతః । గానాద్త్రాయతేయస్మాద్గాయత్రీ వాతదాస్మృతా ॥ 9
ఏతస్మాత్కారణా ద్రాజన్సావిత్రీకీర్తితామయా । తవధర్మభృతాంశ్రేష్ఠః నిత్యంవైష్ణవకర్మసు ॥ 10
సవ్యాహృతీక ప్రణవాం గాయత్రీం శిరసాసహ । యేజపంతి సదాతేషాం నభయం విద్యతే క్వచిత్ ॥ 11
దశకృత్వః ప్రజప్తా సారాత్ర్యహ్నాయత్కృతంలఘు । తత్సా పంప్రణుదత్యాశు నాత్రకార్యా విచారణా ॥ 12
శతం జప్తాతుసాదేవీ పాపోపశమనాస్మృతా । సహస్రజప్తాసాదేవీ చోపపాతకనాశినీ ॥ 13
లక్షజాపేనచతథా మహాపాతకనాశినీ । కోటిజాప్యేన రాజేంద్రః యదిచ్ఛతితదాప్నుయాత్ ॥ 14
విద్యాధరత్వం యక్షత్వంగం ధర్వత్వ మథాపివా । దేవత్వ మథవా రాజ్యంభూర్లోకేహతకంటకమ్ ॥ 15
కోటిసాహస్రజాపేననిష్కామః పురుషోత్తమః । విధినారాజశార్దూల ప్రాప్నోతి పరమంపదమ్ ॥ 16
యాథాకథంచిజ్జప్తైషాదేవీ పరమ పావనీ । సర్వకామప్రదాప్రోక్తా విధినాకింపునర్నృపః ॥ 17

రవి మధ్యమున సోముడు సోముని నడుమ హుతాశనుడు (అగ్ని) యున్నాడు (అగ్ని) తేజోమధ్యమందు సత్త్వగుణము సత్త్వమధ్యమందచ్యుతుడు నున్నారు. ఆ అచ్యుతుడు అంగుష్ఠమాత్ర పురుషుడని లోగడనే తెల్పితిని. సర్వతేజః ప్రాదుర్భావమునకు గారణముగా నా విష్ణువు భువనాధారమైనవాడు. ఈ జగ మాతనికి సంబంధించినది. అవిష్ణుతత్త్వమే సవితయొక్క వరేణ్యము (శ్రేష్ఠము) అగుభర్గః = తేజస్సు యోగులకు పరమధ్యేయముగ ధ్యానమునకు లక్ష్యముగా ఉద్దేశింపబడినది. వెలుపల లోపలనదే వారికి ధ్యానలక్ష్యము. అదే ధీశబ్దవాచ్యుడైన బ్రహ్మనెల్లపుడు చోదనసేయును. భగవంతుడగు విష్ణువు సృష్టికార్యమందు సవిత యనబడును. సర్వలోకమును బ్రసవించుటవలన నాతడు సవితయని కీర్తింపబడును. ఆదేవుని ద్రైవీశక్తియే సావిత్రి యని పలుకబడుచున్నది. గానముచేయుటవలన త్రాయతే = త్రాణముసేయునది (రక్షించునది) గావున ఆమెయే గాయత్రియని పేర్కొనబడినది. ఇందువలన నోరాజా! సావిత్రిని నీకు వైష్ణవ కర్మోపాసనలందు నేను బేర్కొన్నాను. వ్యాహృతులతో ప్రణవముతో రస్సుతోగూడని గాయత్రిని జపించువారి కెందునుభయముండదు. పదిసారు లిది జపించిన రాత్రిపవలు చేసిన స్వల్ప పాపమును వెనువెంటనే పోగొట్టును. ఇక్కడ విమర్శింప వలసినపనిలేదు. అది నూరునూరులు జపించిన పాపోపశమనము సేయును వేయిసారులది జపించిన నుపపాతకములను హరించును. లక్షజపించిన మహాపాతకముల విదళించును. రాజేంద్ర! ఆగాయత్రిని కోటి పర్యాయములు జపించిన నేదికోరిననదివడయును. విద్యాధర-యక్ష-గంధర్వ-దేవత్వములు భూలోకమునందు నిష్కంటకమైన రాజ్యమునుంబడయును. సహస్రకోటి జపముచే నిష్కాముడై పురుషోత్తముని పరమపదవాచ్యునిం బొందును. యథాభిలాషముగ నేకొంచెము జపించినను బరమపావని సర్వకామప్రదయు ననబడిన యీగాయత్రి యథావిధిగజపించినచో నేమనవలయును.

వజ్రఉవాచ : విధినాకేన జప్తవ్యాగాయత్రీపాపనాశినీ । మహాపవిత్రా పరమా సర్వ కల్యాణకారిణీ ॥ 18
మార్కండేయ ఉవాచ : కుశశయ్యాం నివిష్టస్తు కుశపాణిర్జితేంద్రియః ।
అర్కమధ్యగతం ధ్యాయేత్ పురుషంతంమహాద్యుతిమ్ ॥ 19
అథవార్కం మహీపాలః బహిఃస్నాతస్వతంద్రితః । అనన్యచిత్తోమేధావీ పూర్వాహ్ణేతువిశేషతః ॥ 20
భైక్ష్యయావక శాకాశీపయోమూలాశనోథవా। ఫలమూలాశనో వాఽపిన క్తంవాపిహవిష్యభుక్ ॥ 21
అనేనవిధినాజప్యం యఃకరోతి మహీపతేః । సయాతి పరమం స్థానం వాయుభూతః ఖమూర్తిమాన్ ॥ 22

వజ్రుండిది విని గాయత్రి పాపనాశిని మహాపవిత్ర సర్వకల్యాణకారిణి పరమమంత్రదేవత నేవిధానమున జపింపవలయు నన మార్కండేయుడిట్లనియె. కుశాసనముగూర్చుండి కుశపాణియై జాపకుడు సూర్యమధ్యస్థుడై వెలుంగు మహాతేజస్సును పురుషుని ధ్యానమునేయవలెను. లేదాస్నానముసేసి తొందరపడక వెలుపలనున్న సూర్యుని ధ్యానింపవలెను. వేరొకమనసు గొనక మేధాశాలియగు జాపకుడు పూర్వాహ్ణమందు విశేషముగా నీధ్యానము నిట్లుసేయవలెను. భిక్షగాలభించిన యావకశాకములను (అన్నము కూరలను) దినుచు లేదాపాలు (నీరు) దుంపలు పండ్లు పువ్వులుగానిదినుచు నీజపముసేయవలెను. రాత్రి హవిష్యమును గొనవలెను. ఇట్లు జపముసేసినతడు వాయువై ఆకాశమూర్తియై పరమోన్నతస్థానమున కేగును. కోరినను కోరని వాడయ్యును నాత డభీప్సిత సిద్ధింగాంచును.

అకామఃకామకామస్తు కామమా ప్నోత్యభీప్సితమ్ ॥ సవ్యాహృతీక ప్రణవాః ప్రాణాయామాస్తుషోడశ ॥ 23
అపిభ్రూణహణం మాసాత్పునంత్య హరహః కృతాః । సవ్యాహృతీక ప్రణవాం గాయత్రీం శిరసాసహ ॥ 24
త్రిఃపఠేదాయత ప్రాణః ప్రాణాయామః సఉచ్యతే । ప్రాణాయామత్రయం కార్యం కల్యముత్థాయవైద్విజః ॥ 25
అహోరాత్రకృతాత్పాపా త్తత్క్షణాదేవముచ్యతే । సర్వదోషహరం ప్రోక్తం ప్రాణాయామంద్విజన్మనామ్ ॥ 26
తత స్త్వభ్యధికం నాస్తి రాజన్పరమపావనమ్ । ప్రాణసంధారణం మాసం కుశాగ్రచ్యుత బిందునా ॥ 27
యఃకుర్యాదంభ సాంపానం ప్రాణాయామంతుతత్సమమ్ । నిరోధాజ్జాయతే వాయు స్తస్మాదగ్ని స్తతో జలమ్ ॥ 28

త్రిభిః శరీరం సకలం ప్రాణాయామైస్తు శుధ్యతి । ఆకేశాగ్రాన్నఖాగ్రాచ్చత పస్తప్యేత్స ఉత్తమమ్ ॥ 29
ఆత్మానం శోధయేద్యస్తు ప్రాణాయామైః పునఃపునః । శ్రావణ్యాం పౌర్ణమాస్యాంతు సోపవాసోజితేంద్రియః ॥ 30
ప్రాణాయామ శతం కృత్వాముచ్యతే సర్వకిల్బిషైః । అంతర్జలేత్రిరావర్త్య గాయత్రీం ప్రయతోజపన్ ॥ 31
ముచ్యతే పాతకైః సర్వైర్య దిన బ్రహ్మహాభవేత్ । నాస్తిసత్యాత్పరోధర్మో నాస్తికృష్ణసమాగతిః ॥ 32
గాయత్ర్యాశ్చ పరంనాస్తిదివిచేహచపావనమ్ । హుతాచవరదాదేవీ సర్వకామఫలప్రదా ॥ 33
గాయత్ర్యాః సుతిలైర్హోమః సర్వపాప ప్రణాశనః । శాంతికామోయవైః కుర్యాదాయుష్కామోఘృతేనచ ॥ 34
కర్మణాం సిద్ధికామస్తు కుర్యాత్సిద్ధార్థకైర్నరః । బ్రహ్మవర్చసకామస్తు పయసాస సమాచరేత్ ॥ 35
పుత్త్రకామ స్తథా దధ్నా ధాన్యకామస్తుశాలిభిః । క్షీరవృక్షసమిద్భిశ్చ గ్రహపీడాప్రశాంతయే ॥ 36
ధనకామ స్తథాబిల్వైః శ్రీకామఃకమలైస్తథా । ఆరోగ్యకామః క్షీరాక్తైః కుర్యాద్దూర్వాంకురైః శుభైః ॥ 37
దేశోపసర్గే సంప్రాప్తే తదేవచ విధీయతే । గుగ్గులోర్గుళికాభిస్తు కృత్వాహోమమతంద్రితః ॥ 38
సౌభాగ్యం మహదాప్నోతి నాత్రకార్యా విచారణా । పాయసేనతథాహుత్వా విద్యాంసమధిగచ్ఛతి ॥
యేనయేనతు కామేన లక్షహోమం సమాచరేత్ ॥ 39
తదేవకామమాప్నోతి నాత్రకార్యావిచారణా । కృచ్ఛ్రేణాశుద్ధి ముత్పాద్య ప్రాణాయామశతేనచ ॥ 40
అంతర్జలేనవాజప్త్వా స్నాతో నిత్యమతంద్రితః । ప్రాణాయామాంస్తతః కృత్వావిధినైవసషోడశ ॥ 41
పూర్వాహ్ణేజుహు యాద్వహ్నౌ సుసమిద్ధేయథావిధి । భైక్ష్యయావకశాకాశీ ఫలమూలాశనోఽథవా ॥ 42
క్షీరసక్తు ఘృతాహారీ భవేదథవిచక్షణః ఆహారాణాం యథోక్తానామేకాహారం సమాశ్రయేత్ ॥ 43
యావత్సమాప్తిర్భవతి లక్షహోమస్యపార్థివ! । లక్షహోమావసానేతు బ్రాహ్మణానాంతు దక్షిణా ॥ 44
దేయాభవతి రాజేంద్ర గావోవస్త్రాణికాంచనమ్ । సర్వోత్పాతసముత్పత్తౌ బ్రాహ్మణైరనుపూజితైః ॥ 45
పంచభిర్దశభిర్వాపి లక్షహోమం సమాచరేత్ । అసంకీర్ణస్తథా హారైర్నృపతిస్త్రత్ప్రశాంతయే ॥ 46
నాస్తిలోకేస ఉత్పాతో యోహ్యనేన నశామ్యతి । మంగళం పరమంనాస్తి యత్తస్మాదతిరిచ్యతే ॥ 47

ప్రణవముతోగూడిన వ్యాహృతులతో పదునారుసారులు ప్రాణాయామముసేసిన భ్రూణహత్య సేసిన పాపమునుగూడ నది హరించును. వ్యాహృతులతో ప్రణవముతో శిరస్సుతో కలిపి మూడుసారులు (ఆవృత్తిగా) గాయత్రిని మనసుతో ధ్యానించుచు జేయు వాయునిరోధమదియొక ప్రాణాయామమనబడును అట్టి ప్రాణాయామములు మూడువేకువను రేపగానే చేయవలెను. దానివలన నొక్క పగలురేయింజేసిన పాపమాక్షణములో క్షయించును. ద్విజులకు ప్రాణాయామము సర్వదోషహరమని చెప్పబడినది. రాజా! దానిని మించినది పరమపావనమైన సాధనమింకలేదు. ఒక్కనెల ప్రాణసంధారణము (ప్రాణాయామము) నెవ్వడు కుశాగ్రమందుండి జారిన బిందువుతో నుదకపానము చేయుటయు రెండునొక్కటే. ప్రాణనిరోధము వలన (ఊపిరిబిగబట్టుటవలన) వాయువు దానినుండి అగ్ని అందుండి జలమును జనించును. అట్టిమూడు ప్రాణాయామములచే సకలశరీరము పరిశుద్ధమగును. ఎవ్వడు ప్రాణాయామములచే కేశాగ్రమునుండి కాలిగోటిదనుక తపముగావించి ఆత్మశోధనము సేసికొనునో శ్రావణి పూర్ణిమయందు ఉపవాసముండి ఇంద్రియముల జయించినూరు ప్రాణాయామములుసేసి నతడు సర్వపాపవినిర్ముక్తుడగును. నీళ్లలోనుండి గాయత్రిని ముమ్మారు నియమముగా జపించిన బ్రహ్మహత్య తప్పతక్కిన యన్నిపాపములనుండి ముక్తుండగును. సత్యముకంటె పరమధర్మములేదు. కృష్ణునితో సమమైనసద్గతిలేదు. గాయత్రికంటె మరిదివంబున నిక్కడ పావనముసేయు (పవిత్రముసేయు) మంత్రములేదు. వరదయగు గాయత్రీదేవి నుద్దేశించి హోమముసేసిన సర్వకామఫలప్రదయగును. తిలలతో గాయత్రీమంత్రము జపించి చేయుహోమము సర్వపాపహరము. శాంతికోరినాతడు యవలతో ఆయుష్కాముడు నేతితో కర్మసిద్ధికాముడు (సిద్ధార్థములతో) ఆవాలతో బ్రహ్మవర్చసకాముడు పాలతో

హోమము సేయవలెను. పుత్రకాముడు పెరుగుతో ధాన్యకాముడు శాలిధాన్యముతో గ్రహపీడా ప్రశాంతికాముడు పాలచెట్లసమిధలతో ధనకాముడు మారేడుతో శ్రీకాముడు కమలములతో (వేయిరేకుల తామరపువ్వులతో) ఆరోగ్యకాముడు పాలతోదడిపిన దూర్వాంకురములతో (గరికపోచలతో) హోమముసేయవలెను. దేశోపద్రవమేర్పడినపుడుగూడ యీ చెప్పినవిధానమే యుచితము. గుగ్గులపు గుళికలతో (గుగ్గులపుకర్రపూసలతో) హోమముసేసిన మహాసౌభాగ్యమందును ఇది నిశ్చయము. పాయసముతో హోమముసేసిన విద్యాసిద్ధినందును. ఏ యే కోరికతో లక్షహోమముసేయునో యాకోరిక దానతప్పకసిద్ధించును. కృఛ్రముచేతను (కృఛ్రచాంద్రాయణము) ఇది యనేకవిధములుగానున్నది. ఇది నీళ్ళు పాలు వగైరాలు త్రాగుచుచేయు వివిధ విధములుగానున్నది.

నూరు ప్రాణాయామములుసేసియు దేహశుద్ధి కూర్చుకొని స్నానముసేసి నీళ్ళలో నిత్యము తొందరపడక గాయత్రీ జపముగావించి అవ్వల విధివిధానమున బదునాఱు ప్రాణాయామములుసేసి పూర్వాహ్ణ మందు సుసమిద్ధమైన (ప్రజ్వలితమైన) యగ్ని యందు హోమము గావింప వలెను. భిక్షాన్నము యవాన్నము కూరలు గాని ఫలమూలములు గాని పాలుగాని పేలపిండి నెయ్యి గాని యాహారించుచు నీ యనుష్ఠానము సేయవలెను. లక్షహోమ సమాప్తిదాక యీ చెప్పిన యాహారములతో నేదోయొక్క దానినే నమ్ముకొని యుండవలెను. లక్షహోమములు సమాప్తిచేసి బ్రాహ్మణులకు గోవులు వస్త్రములు బంగారమును దక్షిణ యీయవలెను. దేశమందు ఏ ఉత్పాతములు సంభవించినను అనుపూజితులైన (దేవతలతో పాటుగ భూదేవతలుగ) బ్రాహ్మణులతో లక్షహోమము సేయవలెను. రాజు దేశోత్పాత ప్రశాంతికి (ఈముస్ను జెప్పిన అహారముల నొకదానితోనొకటి సంకీర్ణముగాకుండ) ఏదోయొక్క యాహారమునే కొనుచు నీ గాయత్రీ హోమము గావింపవలెను. ఈ విధానముచే శాంతింపని యుత్పాతము లోకమునందేదియు లేదు. దీనిచే సమకూడని పరమ మంగళమును లేదు.

కోటిహోమంతుయోరాజా కారయేత్పూర్వవద్ద్విజైః । నతస్యశత్రవః సంఖ్యేజాతుతిష్ఠంతికర్హిచిత్ ॥ 48
నతస్యమరణందేశే నవ్యాధిర్జాయతే తథా । అతివృష్టిరనావృష్టి ర్మూషకాః శలభాః శుకాః ॥ 49
రాక్షసాశ్చ ప్రశామ్యంతి సర్వాస్తత్రతథేతయః । రసవంతిచతోయాని సస్యానిస్వాదువంతిచ ॥ 50
జాయంతే తస్యదేశేతు ధర్మిష్ఠశ్చ జనోభవేత్ । కోటిహోమేతువరయేత్ బ్రాహ్మణాన్ వింశతీన్నృపః ॥ 51
శతంవాథ సహస్రంవాయ ఇచ్ఛేద్భూతి మాత్మనః । కోటిహోమం స్వయంయస్తు కుర్యాద్బ్రాహ్మణ సత్తమః ॥ 52
క్షత్రియోవాథవావైశ్య స్తస్య పుణ్యఫలం మహత్ । యద్యదిచ్ఛతి కామానాంతత్త దాప్నోత్యసంశయమ్ ॥ 53
సశరీరోఽపి చేద్గంతుందివమిచ్ఛేత్తదాప్నుయాత్ । సావిత్రీపరమాదేవీ సావిత్రీ పావనీపరమ్ ॥ 54
సర్వకామప్రదాదేవీ సావిత్రీకథితాతథా । అభిచారేషు తాందేవీం విపరీతాం ప్రయోజయేత్ ॥ 55
కార్యావ్యాహృతయశ్చాత్ర విపరీతాక్షరా స్తథా । విపరీతాక్షరం కార్యం శిరశ్చమనుజేశ్వరః ॥ 56
ఆదౌశిరః ప్రయోక్తవ్యం ప్రణవాంతేచ యాదవః । స్వాహాస్థానేచ ఫట్కారం సాధ్యనామసమన్వితమ్ ॥ 57
గాయత్రీంచింతయేత్తత్ర దీప్తానలసమప్రభామ్ । ఘాతయంతీంచ శూలేనకేశేష్వాకృష్యవైరిణమ్ ॥ 58
నిర్దహంతీంచతం క్రోధాత్ భ్రుకుటీభీషణాననామ్ । ఉచ్చాటనేచతాం దేవీం వాయుభూతాంవిచింతయేత్ ॥ 59
వహమానాంతథా సాధ్యం తస్మాద్దేశాత్సుదూరతః । అభిచారేచహోతవ్యా రాజికావిషమిశ్రితాః ॥ 60
స్వరక్తమిశ్రం హోతవ్యం కటుతైలమథాపివా । తత్రాపిచ విషందేయం హోమకాలేచ యత్నతః ॥ 61
మధ్యేజప్యోద్యదిక్రోధం ధ్రువంనశ్యేత్సఏవతు । అనాగసిన కర్తవ్యమభిచారమతోబుధైః ॥ 62
ల్పాగసినకర్తవ్య మభిచారంత థైవతు ।
మహాపరాధం బలినం దేవబ్రాహ్మణ కంటకమ్ । అభిచారేణ యోహన్యాన్న సదోషేణలిప్యతే ॥ 63
ధర్మ ప్రధానేతునరే అల్పాగసి తథైవచ । అభిచారం నకుర్వీత బహూపాయం విచక్షణః ॥ 64

బహూనాం కంటకం యంతుపాపాత్మానం సుదుర్మతిమ్ । హన్యాత్ప్రాప్తా వరాధంతు తస్యపుణ్యఫలంలభేత్ ॥ 65
యేభక్తాఃపుండరీకాక్షం దేవదేవంజనార్దనమ్ । నతానభిచరేజ్జాతు తత్రతద్విఫలం భవేత్ ॥ 66
నహికేశవభక్తానామభిచారే ణకర్హిచిత్ । వినాశమభిపద్యేత తస్మాత్తన్న సమాచరేత్ ॥ 67

ఏ రాజు కోటిహోమము బ్రాహ్మణులచే జేయించునో యాతనికి యుద్ధమునందు శత్రువులు నిలువలేరు. ఆతని దేశమున (రాజ్యమునందు) చావు వ్యాధియు నుండవు. అతివృష్టి అనావృష్టి మూషికములు శలభములు (మిడుతలు పచ్చచిలుకలు) రాక్షసులును నను నీతి బాధలు ప్రశమించును. ఉదకములు రుచిమంతములు మాటలుమధురములునగును. అతని రాజ్యమందలి ధనము ధర్మిష్ఠమగును. కోటిహోమమునందిరువది మంది బ్రాహ్మణులను ఋత్విగ్వరణము సేయవలెను. నూరు, వేయి మందినిగూడ తనకు భూతి (ఐశ్వర్యము) గావలెనని రాజు కోరవచ్చును. కోటి హోమము స్వయముగ నిడయును. శరీరస్వర్గమును గోరెనేని యదియుం బొందును. సావిత్రి వర దేవత. సావిత్రి పరమపావని. ఆ దేవి సర్వకామప్రద. ఆదేవిని అభిచారములందు (చేతబడులందు) విపరీతముగ (తలక్రిందులుగ) ప్రయోగించ వలెను. హోమము సేయునపుడు వ్యాహృతులను అక్షరములను గాయత్రి శిరస్సును విపరీతముగా ద్రిప్పిజపింప వలెను. స్వాహాస్థానమున వషట్కారము సాధ్యసమన్వితముగ పలుక వలెను. (ఎవనిమీద ప్రయోగము చేయ వలెననుకొనునో వాని పేరు కలిపి చేయవలెనని కాబోలు.) అక్కడ గాయత్రిని ప్రదీప్తాగ్ని సమముగ ధ్యానింప వలెను. జుట్టు పట్టుకొని శూలముతో శత్రువును పొడుచుచున్న దానింగా ధ్యానింపవలెను. హోమముచే కనుబొమలుముడివడి భయము గొలుపు ముఖముతో శత్రువును దహించుచున్నదానిగా భావింప వలెను. ఉచ్చాటనమందాదేవిని వాయురూపిణిగా భావన సేయవలెను. మఱియు సాధ్యుని తన శత్రువును యటనుండి సుదూరము మోసికొని పోవుచున్న దానింగా తలంపవలెను. అభిచారికమునందు విష మిశ్రితములైన రాజికలను (నల్ల ఆవాలు) హోమము సేయవలెను. లేదా తన రక్తము గలిపి చేయు-తైలము విషము కలిపి సేయవలెను. హోమము నడుమలో శత్రువు నెడ కోపము విడిచెనేని తానే తప్పక నశించును. కావుననే పగలేని యెడల దెలిసిన వాడు అభిచారము (చేతబడివగైరాలు) చేయకూడదు. (చేసిన నది వెడిసి ఎదురు తిరిగి తనను చంపు ఁజంపునన్నమాట.) అట్లే స్వల్ప వైరము గలవాని యెడ నభిచారము సేయరాదు. మహాపరాధి బలవంతుడు దేవ బ్రాహ్మణ కంటకుడు నైనవానిని అభిచార ప్రయోగము సేసి చంప వలెను. ఆ చంపిన వానికి దోష మంటుకొనదు. ధర్మ ప్రధానుడగు మనుజునెడ నల్పాపరాధి యెడను విచక్షణుడు బహుపాపియైన యభిచారము (చేతబడి) చేయరాదు. బహుజనకంటకుని పాపాత్ముని దుర్బుద్ధిని అపరాధిని హతమార్చ వలెను. అట్లు చేసిన బహుపుణ్య ఫలమందును. పుండరీకాక్షుడు దేవదేవుడునగు జనార్దనుని భక్తులయెడ నెన్నడునభిచరించరాదు. అక్కడ అది విఫలముయితీరును. కేశవభక్తులను అభిచారములవలన నాశనమెన్నడుం గలుగదు. కావున నది యక్కడ జేయరాదు.

సేయం ధాత్రీవి ధాత్రీచ సావిత్ర్యఘ వినాశినీ । ప్రాణాయామేన జప్యేన తథైవాంతర్జలేనచ ॥ 68
సవ్యాహృతీక ప్రణవాజప్తవ్యాశిరసాసహ । ప్రణవేనతథాఽభ్యస్తా వాచ్యావ్యాహృతయః పృథక్ ॥ 69
దైవతం సవితా తస్యా గాయత్రం ఛందఏవచ । విశ్వామిత్రఋషిశ్చైవ ప్రోచ్యతే వసుధాధిపః ॥ 70
కర్మేంద్రియాణి పంచైవపంచ బుద్ధీంద్రియాణిచ । పంచేంద్రియార్థాన్మహతాం భూతానాంచైవపంచకమ్ ॥ 71
మనోబుద్ధిస్తథైవాత్మా అవ్యక్తంచయదుత్తమ । చతుర్వింశత్యథైతాని గాయత్ర్యా అక్షరాణితు ॥ 72
ప్రణవం పురుషం విద్ధిసర్వగం పంచవింశకమ్ । సప్తలోకానియానీహ మహావ్యాహృతయస్తథా ॥ 73
శిరసశ్చతథా వాచ్యః పురుషః పరమేశ్వరః । ఏవం విధాసాసావిత్రీ జప్తవ్యాసతతంబుధైః ॥ 74
హోతవ్యాచతథాశక్త్యా సర్వకామసమృద్ధిదా । గాయత్రీమాత్ర శరణో వరం విప్రః సుయంత్రితః ॥ 75
నాయంత్రితశ్చతుర్వేదీ సర్వాశీసర్వవిక్రయీ । గాయత్రం జపతేయస్తు కల్యముత్థాయవైద్విజః ॥ 76
లిప్యతేన సపాపేభ్యః పద్మపత్త్రమివాంభసా । కామకామోలభేత్కామం గతికామస్తుసద్గతిమ్ ॥ 77

## నూటఅరువదియేడవ అధ్యాయము - దీపదానఫలము లలితికోపాఖ్యానము

మార్కండేయ ఉవాచ : అత్రాప్యుదాహరంతీమ మితిహాసం పురాతనమ్ । దీపదానాల్లలితి కాయదవాప పురానృప ! 1
ఆసీచ్చిత్రరథో నామవిదర్భేషుమహీపతిః । తస్యపుత్ర శతంరాజ్ఞో జజ్ఞే పంచదశోత్తరమ్ ॥ 2
ఏకైవ కన్యాతస్యా స్సీల్లలితానామ నామతః । సర్వలక్షణ సంపూర్ణా రూపేణా ప్రతిమాభువి ॥ 3
తాందదౌకాశిరాజాయ సపితాచారుధర్మిణే । శతానితస్యభా ర్యాణాం త్రీణ్యాసంశ్చాత్ర ధర్మిణః ॥ 4
తాసాంమధ్యేఽగ్రమహిషీ లలితాఽస్య తదాఽభవత్ । విష్ణోరాయతనే తస్యాః సహస్రం రాజసత్తమ ॥ 5
ప్రదీపానాం ప్రజ్వలతి దివారాత్రమరిందమః । తామ్మిస్సమాశ్వయుక్కృష్ణం శుక్లపక్షంచ కార్తికాత్ ॥ 6
తస్యాః ప్రజ్వలితం దీపముచ్చస్థాన కృతంతథా । తస్మిన్కాలేతథా నిత్యం బ్రాహ్మణావసథేషుసా ॥ 7
నిత్యం భవతిసాయాహ్నే దీపప్రేషణ తత్పరా । చతుష్పథేషు రథ్యాసు దేవతాయతనేషుచ ॥ 8
చైత్యవృక్షేషు గోష్ఠేషు పర్వతానాంచమూర్ధసు । పులినేషునదీనాంచకూప మూలేషు యాదవ ॥ 9
తస్మిన్నృపతి సాకాలే దీపదాన పరాయణా । తాంసపత్న్యోఽథసంగమ్య ప్రపచ్ఛు రిదమాదృతాః ॥ 10

మార్కండేయుడీ దీపదానమును గూర్చిన యొక పురాతనేతిహాసము గలదు. లలితికయను నంగన దీపదానము సేసి పొందిన ఫలము వినుము. విదర్భదేశములందు చిత్రరథుడను రాజుండెను. అతనికి నూటపదునేడుగురు పుత్రులుగల్గిరి. కూతు రొక్కతియె. లలితికయని యామె పేరు. చక్కని చక్కని లక్షణములన్నియునుగలది. చారుధర్ముడను కాశిరాజునకామెనొసంగెను. అతనికి మూడువందల మంది భార్యలుండిరి. అందరిలో నీ లలితిక యగ్రమహిషి. విష్ణ్వాలయములో నామె పెట్టిన దీపములు వేయి. రేయింబవళ్ళు చక్కగా వెలుగు చుండును. ముఖ్యముగా ఆశ్వయుజ కృష్ణపక్షము నందు, కార్తిక శుక్ల పక్షము నందు నామె ఎత్తుగా పెట్టిన దీపసహస్రము మిక్కిలిగ శోభించు చుండెను. అదే పుణ్య కాలము నందామె ప్రతిసాయంకాల మందు బాహ్మణ గృహములకు దీపములు పంపు చుండెడిది. చతుష్పథము లందు (గోశాలలందు) కొండ నెత్తములందు నదీతీరముల నిసుక తిన్నెలందు బావుల మొదల నామెకు దీపములు పెట్టుటే పనిగ నుండెను. అది చూచి యామె సపతులందఱుం గలిసి యాదరముతో నిట్లడిగిరి.

సపత్న్య ఊచుః : సర్వాన్ధర్మాన్పరిత్యజ్యలలితేత్వం సదైవతు । విష్ణోరాయతనే సుభ్రూర్దీపదాన పరాయణా ॥ 11
తదేతత్కథయాస్మాకం లలితే! కౌతుకంపరమ్ । మన్యామహేత్వయాఽవశ్యం దీపదాన ఫలంశ్రుతమ్ ॥ 12
లలితికోవాచ : నాహం మత్సరిణీ భద్రానచరాగాది దూషితా । ఏకపత్న్యాశ్రయా యాతా భవత్యోమమమానదాః ॥ 13
అపృథగ్ధర్మ చరణాః శృణ్వంతు గదితంమమ । మయై తద్దీపదానస్య యథా వై భుజ్యతే ఫలమ్ ॥ 14
హరస్య దయితా భార్యా శైలరాజ సుతావరా! । ఉమా దేవీతి మద్రేషు దేవికాయా సరిద్వరా ॥ 15
నరాణా మనుకంపార్థం బ్రాహ్మణైరవతారితా । తీరయో రుభయోస్తస్యాః క్షేత్రంక్రోశచతుష్టయమ్ ॥ 16
తస్మింస్తీర్థేతు పానీయం సర్వతీర్థ ప్రతర్పితమ్ । తస్మిం స్తీర్థే మృతామర్త్యాః ప్రాప్నువన్తి శుభాంగతిమ్ ॥ 17
శ్రుతాభిలాషితా దృష్టాదేవికా పాపనాశినీ । తస్యాం స్నాత్వా సకృన్మర్త్యో గాణపత్య మవాప్నుయాత్ ॥ 18
తస్యాః తీర్థం నృసింహాఖ్యం సర్వ కల్మషనాశనమ్ । నృసింహ వపుషా స్నానం కృతం యత్రపురాశుభా ॥ 19

అక్కా! అన్నిధర్మములు వదలి విష్ణువునాలయమందు దీపము వెట్టుటదే పనిగ బెట్టుకొన్నావు. లలితా! దీపదానవల మీవు బాగుగ నాలించితి వను కొందుము. ఆ విశేషము తెలుపుము. మేము వినవలయునని యెంతో ముచ్చట పడుచున్నామన లలితిక వారి

కిట్లనియె. నాకు మాత్సర్యము లేదు. (ద్వేషము లేదు) రాగాదులచే చెడను. సుఖముగా నున్నాను. మీరును నేను నొక్కచోట నుండ నున్నవారము. మీరును నేనును భిన్నధర్మ పరాయణలముగాము. నేనీ దీపదానము నెట్లనుభవింతునో తెల్పెద వినుండు. హరుని ల్లాలు గిరిరాజు కూతురు. ఉమాదేవి మ దేశములందు దేవికా నదీతీరమున నున్నది. ఆమెను బ్రాహ్మణులు నారాయణునను గ్రహము కొఱకవతరింపజేసిరి. ఆ నది యిరుతీరము లందు నాల్గు కోసులు సుక్షేత్రము. ఆ తీర్థ మంపలి యుదకము సర్వతీర్థ కల్పితము ఆతీర్థ మందు తను వీగిన వారు పుణ్యగతి నందుదురు. ఆ పుణ్యతీర్థముం గూర్చి విన్నాను. కోరి దర్శించినాను గూడ. అందు తాన మాడిన నరుడు గాణాపత్య మందును. (ప్రమథ గణాధిపతియగును.) ఆనదీ తీర్థము సర్వపాపహరము. నృసింహ తీర్థమనంబడును. నృసింహావతారమెత్తి హరి యిక్కడ స్నానము సేసెను.

సౌవీర రాజస్య పురా మైత్రేయోఽభూత్పురోహితః । తస్మిం స్తీర్థేతదా తేన విష్ణోరాయతనంకృతమ్ ॥ 20
అహన్యహని శుశ్రూషాం పుష్పధూపాది లేపనైః । దీపదానాదిభి శ్చైవ చక్రే తత్రసవై ద్విజః ॥ 21
కార్తికే దీపకాస్తత్ర ప్రదత్తాస్తేన చైకదా । ఆసీన్నిర్వాణ భూయిష్ఠో దేవార్చా పురతోనిశి ॥ 22
దేవతాయతనేచాసం తథాహమపి మూషికా । ప్రదీప వర్తిహరణే కృతబుద్ధి ర్వరాననే! ॥ 23
గృహీతాచ మయావర్తిః వృషదంశో రురావచ । నష్టాచాహం తదా తస్య మార్జారస్య భయాత్తదా ॥ 24
వర్తిప్రాంతేన నశ్యంత్యా దీపతః ప్రేరితో మయా । జజ్వాల పూర్వవద్దీప్త్యా తస్మిన్నాయతనే పునః ॥ 25
మృతా చాహం తదాజాతా విదర్భరాజ కన్యకా । జాతిస్మరా మహీపస్య మహిషీ చారు ధర్మిణః ॥ 26
ఏవం ప్రభావో దీపస్య కార్తికే మాసి శోభనాః । దత్తస్యాయతనే విష్ణో ర్యస్యేయం వ్యుష్టి రుత్తమా ॥ 27
యదివో నాస్తి మాత్సర్యం దీపోదేయస్సదా శుభః । అసంకల్పిత మప్యేతత్ ప్రేరణం యత్కృతం మయా ॥ 28
కేశవాలయ దీపస్య తస్యేదం భుజ్యతే ఫలమ్ । ఏతస్మా త్కారణా ద్దీపానహమేతా నహర్నిశమ్ ॥ 29
ప్రయచ్ఛామి హరేర్ధామ్ని జ్ఞాతస్యచహియత్ఫలమ్ ।
మార్కండేయఉవాచ : ఏవముక్తా స్సపత్న్యస్తాః దీపదానపరాయణాః ॥ 30
బభూవుర్దేవ దేవస్య కేశవస్య నరాగృహే । తతః కాలేనమహతా తేనరాజ్ఞా మహాత్మనా ॥
విష్ణులోక మనుప్రాప్తాః పంచత్వం ప్రాప్యమానద ॥ 31
తంలోక మాసాద్య నృపేణ సార్ధం సారాజ పుత్రీ కమలాభ రూపా ।
రేమే మహీపాల! ముదా సమేతా దీప ప్రదానాచ్చ్యవనా ద్విముక్తా ॥ 32

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే దీపమాహాత్మ్యే లలితికోపాఖ్యానం
నామ సప్తషష్ట్యధిక శతతమోఽధ్యాయః.

మున్ను సౌవీరరాజు పురోహితుడు మైత్రేయుడా తీర్థమందు విష్ణ్వాలయము కట్టించెను. ఆద్విజుడక్కడ స్వామిని ప్రతి దినము సేవించెను. గంధపుష్ప ధూపదీపాదుల నర్చించెను. కార్తిక మందక్కడ దీపములను గూడ పెట్టెను. ఒకతఱి రాత్రి దేవతా ర్చన ముందున్న యొక దీప మించుమించు పెద్దదగు స్థితిలో నుండెను. అపుడాలయమందెలుకనై దీపములోని వత్తి హరింప వలయు నని యనుచుంటిని. వత్తిని నేను బట్టితిని పిల్లి మ్యావుమ్యావు మన్నది దానిపలని జడుపున ప్రాణము విడిచితిని. వత్తి పట్టువిడిచి దానికి దాపుగ నేను బడిన తఱి దీప మెగయించుట జరిగినది. ఆదీపము తొంటియట్ల యయ్యాలయ మందు చక్కగ వెలింగెను. ఆట నేనుచచ్చి విదర్భరాజు కూతురనై పుట్టితిని. పూర్వజన్మ స్మృతియుం గలిగినది. ఈ చారుధర్మునికి పట్టమహిషినైతిని. కల్యాణులారా! ఇది కార్తిక మాస దీపముయొక్క ప్రభావము. అందులోనిది విష్ణువునాలయము. కార్తిక మాసము. ఇందిట్లు దీపము పెట్టిన ఫలమింతటిది. మీకు మచ్చరము లేదేని మీరీదీపము పెట్టుడు. అనుకోకుండనే నేనీ ప్రేరణ చేయుట జరిగినది. గోవిందాలయ

దీపదాన ఫలమిదియే ననుభవించుచున్నాను. ఈ తెలిసినందులకు ఫలముగా నేనీ హరియాలయమున రేయింబవళ్ళు దీపములు పెట్టుచున్నాను. అనవిని లలిత సవతులందరు హరిమందిర మందు దీపదాన పరాయణులయిరి. అవల చిరకాలమునకు వారు పరమపదించి ఆమహాత్ముడగు రాజుతో విష్ణులోకమందిరి. లక్ష్మీస్వరూపురాలగు రాజపుత్రి లలితయు సవతులు నాతేనితో విష్ణులోక మంది దీపదాన ప్రభావముచే పునరావృత్తిలేక యాతనితో నటవిహరించెను.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణమందు ప్రథమఖండమున లలితోపాఖ్యానమను
నూటయరుపదియేడవ యధ్యాయము.

## నూటఅరువదియెనిమిదవ అధ్యాయము - పుష్పఫలాహరణ పూజా వర్ణనము

వజ్రఉవాచ : ఉపవాసాఽసమర్థానాం హీనానాం ద్రవిణేనచ । కర్మణాకేన ధర్మజ్ఞ! తోష మాయాతి శంకరః ॥ 1
మార్కండేయః : సన్తి పుష్పాణ్యరణ్యేషు మూలానిచ ఫలానిచ । స్వయం గ్రాహ్యాణి రాజేంద్ర! యైస్తుష్యతి జనార్దనః ॥
చంద్రః సామాన్య దీపోఽయం విభవైః కింప్రయోజనమ్ । యథాలభ్యేన రాజేంద్ర! యై స్తుష్యతి జనార్దనః ॥ 3
ఫలమూలాశినోఽరణ్యే కుసుమైర్మధుసూదనం । సంపూజ్య సతతం కామానభీష్టం ప్రతిపద్యతే ॥ 4
అకామ స్తదవాప్నోతి యద్విష్ణోః పరమం పదమ్ । అరణ్యేషునరః కృత్వా దేవదేవస్య చార్చనమ్ ॥ 5
అతీత ముద్ధరే ద్రాజన్! ఫలేన సశతం నృణామ్ । భవిష్యాణాం శతం చైవ నరాణాం యదునందన! ॥ 6
నగరేఽపి వసన్యస్తు భైక్ష్యాశీ సంశిత వ్రతః । అరణ్యా దాహృతై పుష్పైర్మూల పత్రఫలాంకురైః ॥ 7
యథోపపన్నైః సతత మభ్యర్చయతి కేశవమ్ । సర్వకామ ప్రదో దేవ స్తస్యస్యా న్మధుసూదనః ॥ 8
తస్యాప్యకామకామస్య పరం స్థానం ప్రకీర్తితం । యత్రగత్వాన శోచ న్తి తద్విష్ణోః పరమం పదమ్ ॥ 9
స్వయ మాగత్య పుష్పాద్యైర్భైక్ష్యాశీకేశవార్చనం । కృతం యేన సరాజేంద్ర! వంశానుద్ధరతే శతమ్ ॥ 10
వంశా నతీతాన్ పంచాశత్ తావతశ్చాప్యనాగతాన్ । ఉద్ధరే దాత్మనో రాజన్! నాత్రకార్యా విచారణా ॥ 11

ఉపవాసము సేయలేనివారు నిరుపేదలు నేమి సేసిన శంకరుడు సంతుష్టుడగు నానతిమ్మన మార్కండేయుడు వజ్రనృపతి కిట్లనియె. ఆడవులందు పువ్వులు పండ్లు దుంపలు పెక్కులున్నవి. తమంతతామెవ్వరేని యేరితెచ్చికొనవచ్చును. దాని సమర్పణమున హరి సంతుష్టుడగును. చంద్రుడు సర్వసాధారణ దీపము. దానికి విభవములుండుట లేకుండుటతో నేమిపని ? లభించినదానిం దానుసమర్పించిన జనార్దనుడు హర్షించును. పండ్లు దుంపలు దిని యడవిలో బువ్వుల మధుసూదను నర్చించి యభీష్టార్థములం బడయవచ్చును. కోరికలులేనివాడు విష్ణువు పరమపదమందియందును. (ముక్తినందునన్నమాట) అస్థానమందినవానికి శోకముండదు. అరణ్యములందా దేవదేవు నర్చించినయతడు తత్ఫలముచే నూరుతరముల మునుపటివారిని తరువాతివారినిగూడ యుద్ధరింపగలడు. నగరమందు వసించియు భిక్షాశనము నారగించి వ్రతనిష్ఠుడై అడవినుండి తెచ్చిన పూలతో పండ్లతో దుంపలతో నాకులతో జివుళ్ళతో బుట్టినవిపుట్టినట్లుగా గొనివచ్చి విష్ణువునర్చించినవానికి విష్ణువు సర్వకామము లనుగ్రహించును. గడచినవారి నేబది తరములవారు రాబోవువారి నేబదితరములవారు మొత్తము నూరుతరములవారతనిచే నుద్ధరింపబడుదురు. ఇట సందేహమేమియులేదు.

గృహస్థోఽపినరో రాజన్ ధర్మాగత ధనాగమః । అరణ్యా దాహృతైః పుష్పైః యఃకుర్యాత్కేశవార్చనమ్ ॥ 12
ఏతదేవ సమాప్నోతి నాత్రకార్యావిచారణా । ధర్మార్జిత ధనః క్రీత్వాయః కుర్వన్ కేశవార్చనమ్ ॥ 13
స్వయముప్తైశ్చ కుసుమైర్యః కుర్యా త్కేశవార్చనమ్ । ఉద్ధరిష్యత్య సందేహం సప్తపూర్వావరాన్నరాన్ ॥ 14
యథా కథంచి దాహృత్య కథంచి త్పూజయేద్ధరిమ్ । నాకపృష్ఠమావాప్నోతి నమేఽత్రాస్తి విచారణా ॥ 15
మానుష్యేచ పరాం రాజన్! శ్రియమాప్నోత్యసంశయమ్ । వనా దాహృత్య కుసుమైః కర్తవ్యం దేవతార్చనమ్ ॥ 16

పత్రం పుష్పం ఫలం తోయం దూర్వాంకుర మథాపివా । నివేదయిత్వా కృష్ణాయ భోక్తా నాకమవాప్నుయాత్ ॥ 17
అశక్తై స్తూపవాసానాం తథా ధన వివర్జితైః । వనా దాహృత్య కుసుమైః కర్తవ్యం దేవతార్చనమ్ ॥ 18
అరణ్యా దాహృతైః పుష్పైః సంపూజ్యమధుసూదనమ్ ।

గృహస్థుకూడ ధర్మమునవచ్చినధనముతో నరణ్యానీతములయిన పుష్ప ఫలాదులతో ధర్మార్జిత ధనముతో కొన్నవానితో గాని కేశవునర్చించి యిదేఫలమందును. తనకుదా గోసిన పూవులతో హరినర్చించిన యతడు సప్తపూర్వోత్తర పితృవర్గము నుద్ధరించును. ఏదోవిధముగ నీ పూజాసామగ్రి సేకరించి యెట్లేని హరినర్చించి నా కపృష్ఠ మధిరోహించును. ఇచట విమర్శలేదు. వనము నుండి కొనివచ్చిన పూలతో హరినర్చించి మనుష్యజన్మమందు పరమైశ్వర్యమునందును. పత్రము పుష్పము ఫలము తోయము, గరిక మొలకగాని కృష్ణునికి నివేదించిన ప్రసాదముగ భక్షించినవాడు నాకముగందును. ఉపవాసము సేయలేనివారు ధనహీనులు నడవి నుండి పువ్వులుతెచ్చి హరినర్చింపనగును. ముందటి పుట్టువున అరణ్యాహృతములయిన పూలచే మధువైరి నర్చించి పొందిన రాజ్యమునుగురించి యిదెవినుము.

పూర్వజన్మని సంప్రాప్తం శృణుః నరాధిప! ॥ 19
నృగోయయాతి ర్నహుషో విష్వగశ్వః కరన్ధమః । దిలీపో యవనాశ్వశ్చ ఋతుపర్ణో భగీరథః ॥ 20
సోమకః సహదేవశ్చ మహామాలో మహాహనుః । రేవకః కాలకాఖ్యశ్చ కృతవీర్యో గుణాకరః ॥ 21
దేవరాతః కకుత్థ్సశ్చ వినీతో విక్రమే రఘుః । మహోత్సాహో వీతభయో నిరమిత్రః ప్రభాకరః ॥ 22
కపోతరోమా పర్జన్యశ్చంద్రసేనః పరాంతకః । భీమసేనో దృఢరథః కుశనాభః ప్రభద్రకః ॥ 23
ఏతేచాన్యేచ బహవః పూర్వజన్మని కేశవమ్ । పూజయిత్వాక్షితా వస్యాంప్రాపుః రాజ్యమకంటకమ్ ॥ 24
యక్షత్వమథ దేవత్వం గంధర్వత్వం తథైవచ । విద్యాధరత్వం నాగత్వం యేగతా మనుజోత్తమః ॥ 25
బహుత్వాత్తే కథం శక్యా మయావక్తుం తవానఘ ! తస్మాద్యత్నః సదా కార్యః పురుషైః కుసుమార్చనే ॥ 26
అరణ్యజాతైః కుసుమైః సదైవ సంపూజయిత్వా స్వయమాహృతైస్తు ।
సర్వేశ్వరత్వం ఫల మాప్నువన్తి రాజేంద్ర! తద్వర్ణయితుం నశక్యమ్ ॥ 27

ఇతి శ్రీ విష్ణుధర్మోత్తరే మహాపురాణే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
పుష్పాహరణ ఫల వర్ణనం నామ అష్టషష్ట్యధిక శతతమోధ్యాయః.

నృగుడు యయాతి నహుషుడు విష్వగశ్వుడు కరంధముడు దిలీపుడు యవనాశ్వుడు ఋతుపర్ణుడు భగీరథుడు సోమకుడు సహదేవుడు మహామాలుడు మహాహనువు రేవకుడు కాలకుడు కృతవీర్యుడు గుణకరుడు దేవరాతుడు కకుత్థ్సుడు వినీతుడు విక్రముడు రఘువు మహోత్సాహుడు వీతభయుడు నిరమిత్రుడు ప్రభాకరుడు కపోతరోముడు పర్జన్యుడు చంద్రసేనుడు పరాంతకుడు భీమసేనుడు దృఢరథుడు కుశనాభుడు ప్రభద్రకుడు ననువీరు మరియెందరో ముందటిజన్మమందు హరినర్చించి యీ క్షితియందకంటకమైన రాజ్యముంబడసిరి. యక్షత్వము దేవత్వము గంధర్వత్వము విద్యాధరత్వము నాగత్వము పొందినవారున్నారు. వారు పెక్కురగుటవలన నీకునేనుజెప్పుటకు వశముగాదు. అందుచే మానవులు పూలచే హరినర్చింప యత్నముసేసి తీరవలయును. అరణ్యములందు పూసినపూలను దానుస్వయముగా గొనివచ్చి హరినర్చించినచో సర్వైశ్వర్యవంతు డగును. రాజేంద్ర! ఆఫలము వర్ణనకందదు.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తరమహాపురాణము ప్రథమఖండమున పుష్ప ఫలాహరణ
పూజావర్ణనమను నూటఅరువదియెనిమిదవ అధ్యాయము.

# నూటఅరువదితొమ్మిదవ అధ్యాయము - ఉపలేపనఫల ప్రశంస

వజ్రః ఉవాచ : అటవ్యో దారుణా బ్రహ్మన్! సింహవ్యాఘ్రనిషేవితాః । తస్కరా చరితాఘోరాః సరీసృప విమిశ్రితాః ॥
నిత్యోత్థితస్య చాధ్వానం నాహక్షయ వరం పరమ్ । అతః స్వల్పతరం కర్మ బ్రూహిమే కేశవార్చనే ॥ 2
మార్కండేయః : అతః స్వల్పతరం రాజన్! దేవ వేశ్మాను లేపనమ్ ।
మహాఫలం వినిర్దిష్టం బ్రాహ్మణై ర్వేదపారగైః ॥ 3
సంమార్జనంతుయః కుర్యాత్పురుషః కేశవాలయే । రజస్తమోభ్యాం నిర్ముక్తః సభవేన్నాత్ర సంశయః ॥ 4
పాంశూనాం యావతాం రాజన్! కుర్యా త్సంమార్జనం నరః । తావన్త్యబ్దాని ససుఖీ నాకమాసాద్యమోదతే ॥ 5
అభ్యుక్షణం తుయః కుర్యాత్పానీయేన సురాలయే । సశాంత పాపో భవతి నాత్రకార్యా విచారణా ॥ 6
కృత్వో పలేపనం విష్ణోర్న రస్త్వాయతనే సదా । గోమయేన శుభాంల్లోకా నయత్నాదేవ గచ్ఛతి ॥ 7
హస్తప్రమాణం భూభాగము పలిప్య నరాధిపః । దేవరా మా శతం నాకం లభేత సతతం నరః ॥ 8
తతోఽను సారేణ ఫలం విస్తృతాయాంక్షితౌ స్మృతం । నిత్యాఽసమర్థస్తు తథా దేవ వేశ్మోపలేపనే ॥ 9
త్రిః పక్షస్యతు కుర్వీత దేవవేశ్మోపలేపనం । పంచమీం దశమీం చైవతథా పంచదశీం నృప ॥ 10
త్రిః పక్షస్య సదా కృత్వా దేవవేశ్మోపలేపనం । సంవత్సరాత్తదాప్నోతి యత్ఫలం తన్నిబోధమే ॥ 11
జన్మాంతర మథాసాద్య గృహం ప్రాప్నోత్య నుత్తమమ్ । సర్వోపభోగ సంయుక్తం గృహంప్రాసాద సంకులమ్ ॥ 12
వృక్షోద్యాన లతా గుల్మ తోయవాపీ విభూషితమ్ । గవాశ్వ ధన ధాన్యాఢ్యం సర్వోపకరణైర్యుతమ్ ॥ 13
ప్రియం వదాభిః దృష్టాభిః సురూపాభిశ్చ పార్థివః । వృతంచ బహుభిః స్త్రీభిః చారు వంశాభిరేవచ ॥ 14
గార్హస్థ్యంచ దృఢం తత్ర సచాప్నోతి మహీతలే । నచ ప్రచ్యవనం తస్మా జ్జీవన్నాప్నోతి కర్హిచిత్ ॥ 15
తస్యయే బాంధవా స్తత్ర సర్వేతే దీర్ఘజీవినః । భవన్తి న భవన్త్యస్య ఆధయో వ్యాధయస్తథా ॥ 16
నతస్య మృత నిష్క్రాంతిర్గృహే భవతి కర్హిచిత్ । యావజ్జీవత్యసౌతత్ర గృహే శ్రీమాన్ ముదాయుతః ॥ 17
చౌరజం న భయంతస్య నచవ్యాధి కృతం భయమ్ । వ్యాళభూపాలజంవాఽపినచ తస్య ఫలంభవేత్ ॥ 18
స్వరూపః సర్వ సిద్ధార్థో దీర్ఘాయు ర్వ్యాధివర్జితః । ఆజ్ఞావిధేయ కృత్యశ్చధ్రువం స్యాన్మనుజేశ్వరః ॥ 19
భుంజానోయ స్సదాకుర్యాత్తస్యైతత్కథితం ఫలం । నక్తభోజీ తథా కృత్వా ద్విగుణం ఫలమాప్నుయాత్ ॥ 20
ఉపోషితస్తు రిక్తాసు పూర్ణాసు తుహరేర్గృహే । కృత్వోపలేపనం నిత్యం చానంతంఫల మశ్నుతే ॥ 21
ఉపలేపన కృద్యస్తు కృష్ణస్యాయతనే భవేత్ । పాప సంమార్జనం తస్య శీఘ్రమేవ భవిష్యతి ॥ 22
నిష్పాద్య మేతత్స సుఖం నరేంద్రః ఆరాధనం దేవ వరస్య విష్ణోః ।
ప్రోక్తం మయాతే ధనవర్జితానాం ధనాన్వితానాంతు ఫలం విశేషమ్ ॥ 23

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
ఉపలేపన ఫల ప్రశంసనంనామ ఏకోనసప్తత్యధిక శతతమోఽధ్యాయః.

సింహవ్యాఘ్రాది భయంకర మృగ సంకులములు తస్కరా చరితములు అతి ఘోరములు మహాసర్ప సమ్మర్దము లడవులు. నిత్యము నిదేపనిగ బయలుదేరిన వానికి దాహము వారించు మార్గమును విష్ణునర్చన మంచు అత్యల్పముగా జేయనైన పనిని

యానతిమ్మన మార్కండేయు డిట్లనియె. ఇంత కంటె మిక్కిలి తేలికయైనసేవ దేవాలయముల కనులేపము సేయుట, అలుకుట, కడుగుట యన్న మాట. వేదపారగులగు బ్రాహ్మణులది మహాఫలమని పేర్కొన్నారు. విష్ణువుగుడిలో సమ్మార్జనము సేసినవాడు రజోగుణ తమోగుణ నిర్ముక్తుడగుటలో సందియము లేదు: హరియాలయ మందెన్ని పాంసువులను (పరాగములను) తుడుచు నన్ని యేండ్లాతడు స్వర్గమందానందించును. దేవాలయములో పానీయముచే (మంచినీటిచే) అభ్యుక్షణము (కలయంపి) చల్లిన వాడు పాప ములు వాయును. విష్ణ్వాలయమున గోమయముచే ఉపలేపనము (పూత) పెట్టినవాడు మఱియేయత్నములేకుండ పుణ్యలోకముల కేగును. రాజా! ఒక్కమూర మేర యలికిన పుణ్యుడు నూరుగురు దేవతా సుందరులతోడి స్వర్గముం బొందును. నిత్యము దేవాలయ మలుకలేని వానికి గూడ యీ విశాల భూమిందదనుసారముగ ఫలము తెలుపబడినది. పక్షమునకు (15 రోజులకు) మూడుమార్లు దేవాలయోప లేపనము పంచమి దశమి పంచదశి నాడు నెలకారుసార్లు ఒక సంవత్సరము సేసినవాడు మఱి పుట్టువున నుత్తమ గృహలాభమందును. ఆ గృహము శయనాసనాది సర్వోప భోగములతో మేడలతో మిద్దెలతో వృక్షోద్యానల తాగుల్మ జలవాపీ విభూషితమై గోవులు గుఱ్ఱాలు ధనము ధాన్యము సర్వసామగ్రితో నిండియుండును. అంతియగాదు ప్రియముగ మాటలాడుచు హృదయమున కానందముగూర్చుచు చక్కనివారై మిక్కిలి యెక్కువైన వంశమున బుట్టిన సుందరులతో నాయిల్లు కలకలలాడుచుండును. అట్టి గృహమందాతడు నిలుకడగల గార్హస్థ్యము నిర్వహించును. బ్రతికి యుండగా నాతడా గృహస్థ ధర్మమునుండి జారిపోడు. ఆతని బంధువులందును వారందరు దీర్ఘజీవులగుదురు. వీనికి ఆధి = (మనోవ్యాధి), వ్యాధి యుంగలుగవు. వాని యింటినుండి యెన్నడు మృత (నిష్క్రాంతి) జరుగదు. (ఆయింట నెవ్వడు చచ్చిపోడన్నమాట) శ్రీమంతుడై యీపుణ్యపురుషుడాయింట వసించునంతకాలము చోరభయము వ్యాధిభయము వ్యాలభయము (వ్యాలము = పాము క్రూరజంతువును) రాజభయము వానికిగల్గదు. చక్కనిరూపము సర్వార్థసిద్ధి దీర్ఘాయువు నీ ఆరోగ్యముగని ఆజ్ఞా విధేయులయిన నౌకరులతో నీతడు సుఖముండును. ఈఫలము నిత్య భోజనముసేయుచు నుండువానికి దెల్పబడినది. నక్తభోజి (రాత్రిమాత్రమేభుజించువాడు) ఇంతకు రెట్టింపు ఫలమందును. రిక్తతిథులందు విష్ణువు గుడిలో నుపలేపనము (అలుకుట) సేసినాతడనంతఫలమందును. కృష్ణాలయమున నలుకువానికి (సమ్మార్జనముసేయువాని) పాపసమ్మార్జనము వెనువెంటనేయగును. విష్ణు దేవుని యారాధనమందీ యుపలేపనము (గుడియలుకుట) చాలసుఖకరమైనది (తేలికగాజేయనైనది) ఇది ధనములేనివాని కొరకునీకెరిగించితి. ఇదేధనవంతులు సేసిన యెడల విశేషఫలముగల్గును.

ఇది శ్రీ విష్ణుధర్మోత్తర మహాపురాణ ప్రథమఖండ మందు విష్ణ్వాలయోపలేపనఫల ప్రశంసయను నూటయరువది తొమ్మిదవ యధ్యాయము

## నూటడెబ్బదియవ అధ్యాయము - మాంధాతృ చరిత్ర

మార్కండేయః : అత్రాప్యుదాహరన్తీమ మితిహాసం పురాతనమ్ । ఫలమాసాద్య యద్గీతం దేవ వేశ్మోపలేపనే ॥ 1
బభూవ శూద్రజాతీయః కశ్చిద్భాగ్య వివర్జితః । కృతవాన్ సతువాణిజ్యం ధనశేషేణ కేనచిత్ ॥ 2
తస్మిన్ విపన్నే సకృషిం చకారనృపసత్తమ । తస్యామపి విపన్నాయాం చక్రే సేవాం పునః పునః ॥ 3
తతోఽప్యనాసాద్య ఫలం సిద్ధిం తీరము పాశ్రితః । గంగాయాః సప్తమోభాగః సింధుర్నర వరోత్తమః ॥ 4
సీతతామల పానీయః స్వర్గలోక ప్రదాయతః । యత్రస్నాత్వా గతింయాన్తి బ్రాహ్మణాశ్చ తపస్వినః ॥ 5
తస్యతీరే వరాహార్చా పురాణర్షి వినిర్మితా । తాం సమాసాద్య శూద్రస్తు నిత్యం భైక్ష్య పరాయణః ॥ 6
నిత్యోపలేపన పరస్తదర్చాదేవ వేశ్మని । ఉవాస భార్యయా సార్ధం తత్రనిత్యానురక్తయా ॥ 7

ఏతస్మిన్నేవకాలేతు వరాహార్చాది దృక్షయా । సౌవీర రాజః సంప్రాప్త స్తందేశం చిత్రవాహనః ॥ 8
సింధౌస్నానం సమాసాద్య పూజయిత్వాజగత్పతిమ్ । సభార్యం పృథివీ పాలః ప్రాయా ద్రాజన్ః యథాగతమ్ ॥ 9
శ్రియం తస్యతు తాందృష్ట్వా సశూద్రో భార్యయా సహ । భూపాలత్వ స్పృహాం కృత్వాకాలా త్కాల వశం గతః ॥ 10
వనాత్కాష్ఠా న్యుపాహృత్య కృత్వా భర్తు స్తతశ్చితిమ్ । అన్వారురోహ తంభార్యా శూద్రం పంచత్వమాగతమ్ ॥ 11
సశూద్రో భార్యయా సార్ధం నాక పృష్ఠమితో గతః । సతతం ధర్మశీలస్తు దేవ వేశ్మోప లేపనాత్ ॥ 12

దేవాలయోపలేపనము సేసి ఫలమంది కీర్తి గాంచిన వాని పురాతనేతిహాసమును మహానుభావులుదాహరించి రది వినుమని మార్కండేయుడిట్లు తెలుపదొడంగె. ఒక శూద్రజాతీయుడు భాగ్యములేమి నేదోయించుక మిగిలిన ధనముతో వర్తకమారంభించెను. ఆవర్తకము దెబ్బతినగా కృషి (వ్యవసాయము) సేసెను. అదికూడ నష్టముకాగా మాని దాస్యముసేసెను. దాని వలన ఫలము లేక సింధు నదీతీరమును జేరెను. సింధునది గంగయొక్క సప్తమభాగము. అందలి నీరు స్వచ్ఛమయినది. చల్లనిది. పానార్హము. అది స్వర్గప్రదము. అందుస్నానముసేసి బ్రాహ్మణులు తపశ్శాలురు నుత్తమ గతికేదుదురు. ఆ సింధు తీరమునందు వరాహస్వామి పూజ విశిష్టమని పురాణములందు జెప్పబడినది. ఆ శూద్రుడాపూజను నిత్యము సేయుచు భైక్ష్యముందినుచు నాదేవాలయోపలేపనము సేయుచుండెను. తనయెడ నెడములేని యనురాగముగొన్న భార్యతో నక్కడతడు వసించెను. ఇదే సమయమున సౌవీరరాజు చిత్రవాహనుడా వరాహార్చనము దిలకింప నచ్చోటికి వచ్చెను. అతడు సింధువున స్నానము సేసి జగత్పతిని పూజించి భార్యతో వచ్చిన దారిం దన నగరమున కేగెను. శూద్రుడారాజు సంపదగని భార్యతోగూడ తానును రాజుగావలెనను కోరిక గొని కొంతకాలమునకు కాలవశుండయ్యెను. వాని యిల్లాలడవి నుండి కట్టెలుగొని వచ్చి చితిపేర్చి వానితో సహగమనము సేసెను. ఆ శూద్రుడింతితో నట నుండి నాకపృష్ఠ మధిరోహించెను. ధర్మశీలుడై నిరంతరము హరియాలయోపలేపనము సేయుట వలన నిట్టి సుగతి నందెను.

ఏతస్మిన్నేవకాలేతు యువనాశ్వో మహీపతిః । విష్ణుం సంపూజయామాస పుత్రీయేణ వ్రతేనతు ॥ 13
రాజ్ఞస్తస్య వ్రతస్యాన్తే స్వప్నే ప్రాహ జనార్దనః । భార్గవం చ్యవనం గిచ్ఛ తతః పుత్రమవాప్స్యసి ॥ 14
యువనాశ్వ స్తథోక్తస్తు స్వప్నే దేవేన చక్రిణా । ప్రాతః పద్భ్యాం యయౌ తస్యచ్యవనస్యాశ్రమం శుభమ్ ॥ 15
సంపూజయిత్వా చ్యవనం, చ్యవనేనచ పూజితః । వ్రతస్వప్నా వుభౌ తస్య జగాద నృపసత్తమః ॥ 16
ఋషిసంఘాను పాదాయచ్యవనోఽపి మహాతపాః । అవిజ్ఞాతం నరేంద్రేణ పుత్రీయం కృతవాన్జలమ్ ॥ 17
కలశస్థం జలం తచ్చ స్థాపయామాస భార్గవః । తతోనిశీథే సంప్రాప్తే తృషార్తః సమహీపతిః ॥ 18
ఋషిమధ్యేతు సంసుప్తా నృషీన్ వాక్య మథాఽబ్రవీత్ । తృషార్తోఽస్మి భృశం విప్రాః పానీయం మేప్రయచ్ఛత 19
ఋషిస్తస్య నశుశ్రావ కశ్చిద్వ్యాభ్యర్థ చోదితః । తతః ఖిన్నో మహీపాలః కలశస్థజలం పపౌ ॥ 20

ఇదే సమయమున యువనాశ్వ మహారాజు పుత్రులు కలుగగోరి వ్రతమూని విష్ణువుం బూజించెను. వ్రతోద్యాపన మందా తని కలలో హరి భార్గవుడైన (భృంగువంశీయుడైన) చ్యవనుని దరికేగుము. అటుపై పుత్రునిం బడయుదువనియె. కలలో జక్రి వలన నామాట విని యా రాజు పాదచారియై చ్యవనుని పుణ్యాశ్రమమున కేగెను. అమ్మునింబూజించి యమ్మునిచే బూజితుడై నృపసత్తముడు తనపుత్ర నిమిత్త వ్రతము స్వప్నవృత్తాంతమును విన్నవించెను. చ్యవన మహర్షియు ఋషుల వెంటనిడికొని రాజెఱుంగని పుత్రలాభముగూర్చు జలమును కలశమందు నింపి యట నుంచెను. ఆ రాత్రి రాజు దప్పికగొని మునుల నడుమ నిదురించు ఋషులతో మిక్కిలి దప్పికగొంటిని నాకు మంచినీళ్ళిండన నందొకడును నాతని పలుకులు కాగలకార్యము యొక్క ప్రేరణచే వినడయ్యె. దాననాతడు ఖిన్నుడై యట కలశమందున్న నీరు ద్రావి నిద్రించెను.

పీత్వాసుష్వాప ఋషయః ప్రాతః సర్వే సముత్థితాః । అపశ్యమానాః కలశం పప్రచ్ఛుస్తే పరస్పరమ్ ॥ 21
పుత్రీయం కలశం రాజ్ఞః కృతం యత్తద్గతం క్వను । తదోవాచ సరాజేంద్ర స్తానృషీన్ సంశిత వ్రతాన్ ॥ 22

తృషార్తేన మయాపీతః కలశస్త్వప వాహితః । తేహోచుస్తం నృపశ్రేష్ఠం ఖావ్యం కర్మకృతం త్వయా ॥ 23
భార్యాపీత్త్వేవ తత్తోయం పుత్రంతేజన యిష్యతి । ఇత్యేవం మంత్రకలశః సోఽస్మాభిః భూపతేః కృతః ॥ 24
పుత్రీయ ముదకం తచ్చత్వయా పీత మబుద్ధినా । తస్మాత్తమేవ తనయం స్వకుక్షౌ జనయిష్యసి ॥ 25
నావాప్స్యసితథా మృత్యుం వరదానాద్ద్విజన్మనామ్ । ఏవముక్తస్తు సంపూజ్య బ్రాహ్మణాన్ స్వగృహంగతః ॥ 26

ఋషులెల్లరు వేకువ మెలకువగని యాకలశముంగానక యొండొరుల నడిగికొనిరి పుత్రీయకలశమిది రేనికొరకు నుద్దేశించినది. ఏమైనది? అనివారనుకొనుచుండ తీక్ష్ణవ్రతనిష్ఠులగు నమ్మునులతో నా నృపాలుడు ఆకలశముంగైకొని దప్పికయై నందలి జలమేను త్రావితిననియె వారు నా రాజుంగని కాగలపని నీవుసేసితివి. నీభార్యకు యాజలము త్రావి నీకై కుమారునిం గనగలదని మేమీ మంత్రకలశము నీకొఱకేర్పరచితిమి. తెలియక నీవా పుత్ర జననార్థమైన యుదకను త్రావితివి. అందువలన నీవే తనయుని నీకడుపునం గనగలవు. ద్విజోత్తముల వరదానముచే నటుజరిగినది నీవు మృత్యువందవు. అని పలుకవిని యారేడు బ్రాహ్మణులం బూజించి గృహమునకేగెను.

రాజ్ఞః కుక్షిం వినిర్భిద్య జజ్ఞేబాలార్కసన్నిభః । పునః పుత్రవతాం శ్రేష్ఠః శూద్రోఽసౌ నాకవిచ్యుతః ॥ 27
జాతమాత్రస్య తస్యేంద్రో దదౌప్రాదేశినీం ముఖే । ఆసాద్యయాం సబాలత్వం శిశుస్తత్యాజ తత్క్షణాత్ ॥ 28
కుక్షిం పస్పర్శరాజ్ఞస్తు రాజసింహ శతక్రతుః । రాజా శక్ర పరామృష్టో విజ్వరశ్చాఽవ్రణోఽభవత్ ॥ 29
యువనాశ్వః సతస్యాపి నామచక్రే శతక్రతుః । మాంధాస్యతీతి మాంధాతా ఖ్యాతిం త్రిభువనేగతః ॥ 30
తమావివేశ భగవాన్ తేజసాస్వేన మాధవః । సాఽపిస్వర్గచ్యుతా భార్యా తస్య శూద్రస్య యాదవః ॥ 31
కాశిరాజ సుతాజాతా భీమవేగస్య మానదః । నామ్నా ప్రభావతీ సుభ్రూ స్త్రైలోక్యైకసుందరీ ॥ 32
యువనాశ్వస్తు తాంవవ్రే మాంధాతుర్లక్షణాన్వితామ్ । సరాజా ప్రదదౌ తాంతుమాంధాతుశ్చిత్రవాహనః ॥ 33
ఏకైవ భార్యాసాతస్య బభూవాత్యంత సుందరీ । రూపయౌవన సంపన్నా ప్రాణేభ్యోఽపి గరీయసీ ॥ 34
కృత్వోద్వాహ మయోధ్యాయా మభిషిచ్యసతం నృపమ్ । యువనాశ్వోవనం ప్రాయాద్వనాదపి త్రివిష్టపమ్ ॥ 35
రాజ్యస్థోఽపి సమాంధాతా త్రైలోక్యం సప్తభిర్దినైః । రథేనైకేన వశగంచకార ఖడ్గదర్పితః ॥ 36
పాతాళే గగనేశైలే సముద్రేచ మహాత్మనః ॥ ఆసీత్తస్యాఽప్రతిహతా గతిశ్చక్రస్య పార్థివ! । 37
చక్రవర్తీ సధర్మాత్మా వైష్ణవశ్చ తథాఽభవత్ । సమాయుతానాం బుభుజే సరాజ్యం దశమానదః ॥ 38
బ్రహ్మాండ మండపం యావత్ సూర్యస్తపతిరశ్మిభిః । తావత్క్షేత్రం మహీభర్తుః యువనాశ్వస్య కీర్త్యతే ॥ 39
ఏవం సరాజా విజితారి పక్షో దేవాజిరా లేపనకృత్ బభూవ ॥
భార్యా చసాతస్య బభూవ భార్యా । లోకే వరిష్ఠా ప్రమదా వరాభ్యః ॥ 40

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయవజ్ర సంవాదే
మాంధాతుపాఖ్యానంనామ సప్తత్యధిక శతతమోఽధ్యాయః.

రాజుకడుపుంజీల్చుకొని బాలసూర్యుడట్టి బాలుడుదయించెను ఆ పుట్టినవాడు స్వర్గమునుండి జారిన యాశూద్రుడు. పుట్టగనే యాశిశువు నోట నింద్రుడు చూపుడువేలు గుడిపెను. అదిగుడిచి యాశిశువాక్షణమ బాలత్వముం బాసెను శతక్రతువు (ఇంద్రుడు) రాజుయొక్క కుక్షిని స్పృశించెను దాన నారాజు ప్రసవవేదనయుమరియే బాధయులేనివాడయ్యెను. ఇంద్రుడాబాలునికి యువనాశ్వుడనుపేరుపెట్టెను. మాంధాస్యతి-నన్నుకుడచుకొనుచున్నాడని ఇంద్రు డనుటంబట్టి యతడు ముల్లోకముల మాంధాత యనుపేరునందెను. మాధవుడా మాంధాతను దనతేజముచే నావేశించెను. ఆశూద్రుని భార్య స్వర్గమునుండి జారినది కాశిరాజు భీమవేగుని కూతురై పుట్టి ప్రభావతియను పేరంది త్రిలోకసుందరియై రూపయౌవన సంపన్నయైయుండెను. యువనాశ్వుడామెను

మాంధాత కిమ్మని పరించెను. చిత్రనాహస మహారాజామెను మాంధాత కొసంగెను. ఆతనికామెయొక్కతెయే భార్య. పరమసుందరి రూపయౌవనసంపన్న ప్రాణముకంటె మిన్నయై యుండెను. యువనాశ్వుడు వారికిగల్యాణముగావించి అయోధ్యయందతని పట్టాభిషేకించి వనమేగెను. వనమునుండి త్రివిష్టపమునకు (స్వర్గమునకు) జనియె. ఆమాంధాత చక్రవర్తి కత్తిచే దర్పమెత్తి యొక్కరథమున నేడు రోజులలో ముల్లోకములను స్వాధీనము సేసికొనెను. ఆ మహాత్మునికి పాతాళమున గగనమందు శైలమున సముద్రమందున ప్రతిహత చక్రగతి యేర్పడెను. అందుచే నతడు చక్రవర్తి యయ్యెను. ఆ ధర్మాత్ముడు విష్ణుభక్తుండునయ్యె. అతడు నూరుయేండ్లాతడు రాజ్యమనుభవించెను. సూర్యుడు తన కిరణములచే నెంతదాక యీ బ్రహ్మాండమంతపము వెలిగించు నంతదాక యువనాశ్వునికి క్షేత్రమై కీర్తింప బడినది. ఇట్లు రాజుహరియాలయసమ్మార్జనను సేసి విజతారియై తేజరిల్లెను. ఆతని భార్యయు సర్వభామినీ పరివృతయై యాతని భార్యయయ్యె.

ఇది శ్రీ విష్ణుధర్మోత్తర మహాపురాణ మందు ప్రథమఖండమున మాంధాతృ చరితమను నూటడెబ్బదియవ అధ్యాయము.

## నూటడెబ్బదియొకటవ అధ్యాయము - పురుషస్వరూప వర్ణనము

వజ్ర ఉవాచ : సతురాజా మయా బ్రహ్మన్ మాంధాతా భువనేశ్వరః । మాహేశ్వరేణ శూలేన లవణేన హతః శ్రుతః ॥
మార్కండేయః - అజేయం వైష్ణవం తేజస్తచ్చ నిత్యంచ జంతుషు ।
నాశమాయాన్తి తేసర్వేహీనా వైష్ణవ తేజసా ॥ 2
అవినాశి జగత్యస్మిన్ నకించి దథ విద్యతే । ఋతేతు మహతస్తస్మాత్తేజసో నృప! వైష్ణవాత్ ॥ 3
తేజస్తస్య సుదుర్గ్రాహ్యం దేహిభిః నృప! సర్వదా । తస్మాత్తేన విహీనాస్తే క్షయం గచ్ఛన్తి మానదః 4
మత్స్యః కూర్మోవరాహశ్చ నారసింహోఽథవామనః । బ్రహ్మ శంభుస్తథైవార్క శ్చంద్రమాశ్చ శతక్రతుః ॥ 5
ఏవమాద్యా స్తథైవాన్యే యుక్తావైష్ణవ తేజసా । గజచ్ఛాయానుమానేన వియుజ్యన్తేచ తేజసా ॥ 6
వితేజసశ్చతే సర్వే పంచత్వ ముపయాన్తిచ । పంచభూతాత్మకం స్థూలం యత్కించిజ్జగతీ గతమ్ ॥ 7
సర్వం వినాశి తద్జ్ఞేయం త్వయా పార్థివ సత్తమ! । అవినాశితు తద్విద్ధి యేన విశ్వమిదంతతమ్ ॥ 8
యత్తుగంధ గుణైర్హీనం రూపస్పర్శ వివర్జితమ్ । శబ్దహీనంచ విరసం సర్వేశం సర్వగం చయత్ ॥ 9
నిర్గుణం తద్గుణాతీత మన్తిక స్థంచదూరగమ్ । సర్వేంద్రియ గుణాభాసం సర్వేంద్రియ వివర్జితమ్ ॥ 10
సర్వతః పాణి పాదాంతం సర్వతోఽక్షి శిరోముఖమ్ । సర్వేంద్రియగుణం దేవం సర్వతః పరమేశ్వరమ్ ॥ 11
అవినాశి తదేవైకం యస్యోదర గతం జగత్ । సదాశివేతి తంకేచిదాహుర్దేవం జగత్పతిమ్ ॥ 12
వాసుదేవేతి చాప్యన్యే కాల మిత్యేవ చాపరే । దైవ మిత్యపరే తంచ స్వభావమితి చాపరే ॥ 13
కర్మేతి చాపరేప్రాహుః పురుషేతి తథా పరే । ప్రణవాఖ్యం తథా తంచ విదురేద్వవిదో జనాః ॥ 14
తదేవ మజమవ్యక్త మవినాశం నరాధిప! । ఋతే తమేకమీశానమంతవ త్సకలం జగత్ ॥ 15
ఏతత్తవోక్తం భువనస్య పత్యుర్మయా స్వరూపం యదువంశచంద్ర! ।
భక్తిం వినా బుద్ధిమతాఽపియస్య శక్యం నవక్తుం గ్రహణం నరేణ ॥ 16

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
పురుషస్వరూప వర్ణనం నామ ఏకసప్తత్యధిక శతతమోఽధ్యాయః

భువనాధీశ్వరుడగు ఆమాంధాత చక్రవర్తి మహేశ్వరుని శూలముచే లవణాసురునిచే హతుడయ్యెనని వింటినని వజ్రుండన మార్కండేయుండిట్లనియె. అజేయమగు వైష్ణవతేజస్సు జంతువులందు నిత్యముండును ఆవైష్ణవతేజస్సులేని జీవులన్నియు నాశము బొందును. ఆవైష్ణవ తేజస్సుతప్ప తక్కినదేదియు నీజగమందు నశింపనిదే కొంచెమును లేదు. ఎల్లప్పుడు దేహధారుల కావిష్ణుని తేజస్సు సహింపశక్యముగాదు. అందువలన నదిలేనివారు క్షయమందుచుందురు. మత్స్యము కూర్మము వరాహము నరసింహము వామనము బ్రహ్మ శంభువు అర్కుడు చంద్రుడు శతక్రతువు ఈ మొదలుగ నింకనుంగల వైష్ణవ తేజోయుక్తులుగూడ గజచ్ఛాయ (సూర్యగ్రహణము మరియొక పుణ్యకాలము) యొక్క అనుమానముచే యెంతవారైన యందరునావైష్ణవతేజో హీనులగుదురు అట్లు తేజోహీనులగు వారందరు పంచత్వము నందుదురు (పంచభూతములలో గలియుదురన్నమాట) జగమందలి యేకొంచెమేని స్థూల వస్తువు పంచభూతమయము. రాజోత్తమా! అది యెల్ల నిట్లు వినాశమందునదని యెరుంగుము. ఈ యెల్లజగము నిండియున్నది నాశికానిదిమాత్రమది యొక్కటి యని యెరుంగుమ గంధగుణములు లేనిది రూపములేనిది స్పర్శలేనిది శబ్దములేనిది రసము (రుచి) లేనిదియగునది సర్వేశము సర్వగమ నిర్గుణము గుణాతీతము దగ్గరనున్నది దూరముగనున్నది సర్వేంద్రియ గుణముల భాసింప జేయునది అదిమట్టుకు సర్వేంద్రియములులేనిది సర్వత్రపాణి పాదాంతములు గలది అన్నియెడల కన్ను శిరసు ముఖము గలది సర్వేంద్రియగుణములతో నైనది దేవము=ప్రకాశరూపము (కేవలజ్ఞానమన్నమాట) సర్వవ్యాపకము పరమేశ్వరము అవినాశి యదొక్కటేవస్తువు. దానియుదరమున జగమున్నది. అట్టి దానిని కొందరు సదాశివుడందురు. కొందరు జగదీశ్వరుడందురు కొందరు వాసుదేవుడందురు. మరికొందరు కాలమందురు దైవమని మరికొందరందురు. మరికొందరు స్వభావమందురు కర్మమని కొందరు పురుషుండని ఇంకగొందరు ప్రణవమని వేరొకరు వేదవేత్తలావస్తువును పేర్కొందురు. ఆవస్తువు ఒక్కటి అజము (పుట్టనిది) అవ్యక్తము (వ్యక్తముదృశ్యమగు జగత్తునకధిష్ఠానమైయున్నదన్నమాట) అనాశనము ఈశానమైనయది తప్ప సకల జగమునంతయుగలదే. భువనపతియొక్క స్వరూపమిది నేనోయాదవవంశచంద్ర! నీకుచెప్పితిని. భక్తిలేనివరులకు బుద్ధిమంతుల కేనియిది తెలుపరాదు తెలియరాదు.

ఇది శ్రీ విష్ణుధర్మోత్తర మహాపురాణమందు ప్రథమఖండమున పురుషస్వరూపమను
నూటడెబ్బదియొకటవ అధ్యాయము

## నూటడెబ్బదిరెండవ అధ్యాయము-ప్రాదుర్భావ స్వరూప వర్ణనము

వజ్ర ఉవాచ : ప్రాదుర్భావా వరాహాద్యాః సర్వేశ స్యామితాత్మనః ।
మహాభూతచయా స్సర్వేజన్మ మృత్యు యుతాశ్చమే ॥ 1
యద్యేవం ప్రాణిభిస్తేషాం కో విశేషో భృగూత్తమ! । ఏతత్త్వం సంశయం ఛింధి పరం కౌతూహలంహిమే ॥ 2
మార్కండేయః : సర్వేజీవా మహీపాల! కర్మబంధనిబంధనాః । జాయన్తేచ మ్రియంతేచ పరతంత్రా స్సదైవ హి ॥
ఈశ్వర ప్రేరితై ర్నిత్యం కర్మబంధైః శుభాఽశుభైః । జన్మాంతర కృతైర్భూప! సుఖదుఃఖ సమన్వితాః ॥ 4
వాసుదేవస్తు ధర్మాత్మా ప్రాదుర్భావేషు యాదవః । ఆత్మనః స్వేచ్ఛయా జన్మ విధత్తే మరణం తథా ॥ 5
కర్మాణినచ లింపన్తి ప్రాదుర్భావేష్వపి ప్రభుమ్ । కర్మస్వపి సదా సక్తం పద్మపత్రమివాంభసా ॥ 6
ఫలానాం కర్మజాతానాం భోగం తత్రాపి యాదవః । నృణాం దర్శయతే మిథ్యా మర్యాదా భేదధీర్నృప! 7
యదా యదాహిధర్మస్య గ్లానిర్భవతి యాదవః । అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజత్యసౌ ॥ 8
దేవతిర్యజ్ మనుష్యేషు గంధర్వోరగ పక్షిషు । యోనిష్వన్యేష్వపి తథా బుద్ధ్వాకార్య బలాబలమ్ ॥ 9

యస్యాం యస్యాం యదాయోనౌ ప్రాదుర్భవతి కారణాత్ । తద్యోని సదృశం తత్స తదాలోకే విచేష్టతే ॥ 10
సంహర్తుం జగదీశానః సమర్థోఽపితదా నృపః । తద్యోని సదృశోపాయైర్వధ్యాన్ హింసతి యాదవః ॥ 11

హరియొక్క పరాహాది ప్రాదుర్భావములు (అవతారములు) మహాభూతసంఘములు జన్మమృత్యువులుగల వేయైనచో వానికి వీనికి ప్రాణిసమూహమునకు గలభేదమింకేమున్నది? ఈసంశయము వారింపుము. వినువేడుకనున్నానని వజ్రుండనగా మార్కండేయుడిట్లనియె. మహీశా! అన్నిప్రాణులు కర్మబంధముతో ముడివడియున్నవే. అవి పుట్టుచు గిట్టుచుండును. ఎల్లపుడు నవి పరాధీనములు. ఈశ్వరప్రేరితములయిన జన్మాంతరకృత పుణ్యాపుణ్య కర్మబంధములచే సుఖదుఃఖములతో గూడుచుండును. వాసుదేవుడు మాత్రము ధర్మమూర్తికావున అవతారములందు స్వేచ్ఛగాదనకు దాన పుట్టువును మరణమును గల్గించుకొనుచుండును ఈప్రాదుర్భావములందు ప్రభువుగావున (సర్వ సమృద్ధుడుగావున) ఆయనను వేకర్మములు నంటుపడవు. ఆయన యాయాకర్మము లందున్నను దామరాకు నీటిచే నంటువడనట్లు వానిచే నతడంటుపడడు (నిర్లిప్తుడుగానే యుండును) ఆయన కాయసచేసిన కర్మముల ఫలానుభవముకూడలేదు. అయినను లోకమొక హద్దుమీరునను భయముచేత వలె దానును కర్మఫలమనుభవించుచున్నట్లు ప్రదర్శ నము సేయును. ఆయన సీతా వియోగాదుల వలన శోకించుట మొదలయినదంతయు లోకమున కేకపత్నీవ్రతమర్యాద యలవర చుటకు చేసిననటనకాని నిజానికా శోకస్పర్శయాయనకు లేనే లేదన్నమాట. ఓ యాదవ! ఎప్పుడెప్పుడు ధర్మమునకుగ్లాని (వాడు వాటు) గల్గునో, అధర్మమున కభ్యుత్థానము (ఎగిసిపాటు) గల్గునో అప్పుడప్పుడు దనను దాసృజించుకొనును. అందుచేతగూడ ఆ యాకారములయొక్క బలాబలమెరిగి దేవతలలో పశుపక్షులలో మనుష్యులలో మరి యితర యోగులలో దనను బ్రాదుర్భవింపజేసి కొనును. ఏయేయోనియం దెప్పుడు కారణవశమునందానవతరించునో ఆయోనికి (జన్మకారణమైనజాతికి) అనువుగ నతడెల్లపుడు నడచుకొనును (ఆయాచేష్టలనేచేయు నన్నమాట) జగదీశానుండాయన సంహారముసేయుటకు సమర్థుండయ్యు నాయవతార సమ యమునందు దానికి సరియైన యుపాయములచేతనే వధ్యులను (చంపదగినవారిని) జంపును.

హార్దంతమస్తథానైశం మూర్తంచ పురుషోత్తమః । ఏక ఏవ సలోకానాం నాశయ త్యమల ద్యుతిః ॥ 12
హార్దం ధ్వస్తం తమస్తేన జగతో దేవమూర్తినా । జ్యోతీరూపేణచ ధ్వస్తం తమో నైశం సుదారుణమ్ ॥ 13
తమోనాశయితుం మూర్తం ప్రాదుర్భావ గతః సదా । మూర్తం తమశ్చ రాజేంద్రః దైత్యదానవ రాక్షసాః ॥ 14
వధ్యానా మపిదైత్యానాం దేహస్థోఽపి జనార్దనః । న విముంచతి దేహాని యుక్త్యా తాంశ్చ జిఘాంసతి ॥ 15

ఆపురుషోత్తముడు లోకముయొక్క హృదయగతమైన తపస్సును (తమోగుణమను చీకటిని) రాత్రిసంబంధమైన తమస్సును=చీకటిని గూడ కేవలనిర్మల జ్ఞానజ్యోతి స్వరూపుడుగావున తానొక్కడే హరించును. దేవమూర్తియై (హృదయ గుహ యందు నీవారశూకమట్లు సుసూక్ష్మమైయున్న యణురూపమైన జ్యోతియొక్క శిఖమధ్య దీపించుపరమాత్మతానై) జీవుల హార్దమైన తమస్సును (హృద్గుహయందు సంస్కారరూపమైయున్న తమోగుణమును) ధ్వంసముచేయును. రాత్రిగ్రమ్ముకొను కారుచీకటిని సూర్యాదిజ్యోతీరూపమును తానేయైహరించుచుండును. మూర్తమైన (రూపుగొన్న) తమస్సు నాశనముసేయుటకప్పుడును ప్రాదుర్భావ మందును. (అవతారము ధరించును) మూర్తమైన తమస్సనగా నోరాజేంద్ర! యేదోకాదు దైత్యదానవరాక్షసులేయా చీకటి. వధ్యు లయినయాదైత్యుల దేహమందు హరితానుండియు నా దేహములను దాను విడువడు సర్వాంతర్యామిగా దానటనుండియే యుక్తిచేత వాండ్రను సంహరించును.

దేవతానాం గురూణాంచ ద్విజానాంచ గురుప్రియః । శాస్త్రదృష్టేన విధినా భవత్యారాధనే రతః ॥ 16
నచ తస్యాస్తి కర్తవ్యం త్రిషులోకేషు కించన । నైవానాప్త మవాప్తవ్యం వర్తతేఽథచ కర్మసు ॥ 17
సర్వజ్ఞః సర్వదర్శీచ సర్వశక్తి రపి ప్రభుః । తథాఽప్యధీతే యజతే తపస్తప్యతి పార్థివః ॥ 18
మర్యాదా స్థాపనార్థాయ జగతో హితకామ్యయా । కరోతి రాజన్ః కర్మాణి కీనాశ ఇవదుర్బలః ॥ 19
యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరోజనః । సయత్ప్రమాణం కురుతే లోకస్తదను వర్తతే ॥ 20

ఏత త్కారణ మాస్థాయ సదా కర్మసు వర్తతే। ప్రాదుర్భావ కృతోవిష్ణుః యథాన్యః ప్రాకృత స్తథా ॥ 21

గురుప్రియుడు కావున నాభగవంతుడు శాస్త్రము (వేదము) నందుగానవచ్చు విధిచే (వేదవిహిత విధానముచే) దేవతల యొక్కయు గురువులయొక్కయు ద్విజులయొక్కయు ఆరాధనమందు ఆసక్తిగలవాడగుచుండును. ఆయనకు ఈలో నాయనకెట్టి కర్తవ్యము ముల్లోకములందునులేదు. లేకపోయినను లోకాను శిక్షణము కొరకు గుర్వారాధ నాదికర్మము లిందతి శ్రద్ధతో వర్తించుచుండును. తానుపొందనిది పొందవలసినదియు నాయనకులేదు. అయినను కర్మములయందు ప్రవర్తించుచుండును. ప్రభువు సర్వజ్ఞుడు సర్వదర్శి సర్వశక్తిమంతుడయ్యునుగూడ యధ్యయనము సేయును యజ్ఞములు సేయును తపస్సుచేయును రాజా! జగత్తు హితవుకోరి మర్యాదాస్థాపనకై యిటుసేయును దుర్బలుడైన నిరుపేదవలె కార్యములు సేయును. శ్రేష్ఠుడు (పెద్ద) సేయు పనిని తదితరుడుం కొద్ది వాడును జేయును. అతడు ప్రమాణముగాగొను ప్రమాణమును లోకమనువర్తించును. ఇది కారణముగా గైకొని ప్రాకృతుడట్లు ప్రాదుర్భావములు సేయును. అవతారము లెత్తును.

దేవేభ్యశ్చ ఋషిభ్యశ్చ వరాన్ ప్రార్థయతే సదా। వరాంశ్చ వరద స్తేషాం మానయత్యపి పాండవ! ॥ 22
ప్రాదుర్భావ రత స్తస్మాత్ పరోఽయమితి మానవాః। పురుషం నాధిగచ్ఛన్తి మోహితా స్తస్య మాయయా ॥ 23
ప్రాదుర్భావం గతోఽప్యేవం సంహృత్యైన చరాచరమ్। నిమేషాంతర మాత్రేణ శక్తిమాన్ జగతః ప్రభుః॥ 24
ప్రాదుర్భావ గతస్యాపి తస్య సర్వగతా స్మృతా। స్వతంత్రతాచ సర్వత్ర నాత్ర కార్యా విచారణా ॥ 25
మహ ద్విశేష మేతత్తే ప్రాణిభిః ప్రాణినాం పతేః। మయోక్తం తస్య దేవస్య సర్వగస్య స్వయం భువః ॥ 26

అంతియగాదు తానును దేవతలనుండి ఋషులనుండియు వరము లడిగికొనును. వరదుడయ్యుంతాను వారిచ్చిన వరము లను గౌరవించును అవతారములెత్త వేడుకపడువాడీతడు వేరని ప్రాకృతుడని (సామాన్యమానవుడని) మానవులా ప్రభువు యొక్క మాయచే మోహితులగుచుందురు. ఇటు తానవతారమెత్తియు చరాచరమైన యీజగత్తును రెప్పపాటులో నుపసంహరించుట కా ప్రభువు శక్తిమంతుడై యున్నాడు. అవతారమందుండియు నతడక్కడ యొకచోటనేయున్నాడు. ఆయన సర్వగుడగుట స్మృత మైనది. ఆయన స్వతంత్రతగూడ యెల్లయెడల స్మృతమైనది ఇక్కడ మరి విమర్శచేయరాదు. సామాన్యప్రాణులకంటె నీమహా విశేషము సర్వప్రాణి పరిపాలకుడు దేవదేవుడు సర్వగతుడు స్వయంభువుడు నైన యాతనిది. నేను నీకు దెల్పితిని.

ఆక్షిప్తాః కర్మభిః పుణ్యైః కైశ్చిద్యదు వరోత్తమ!। తేషామా విశతే దేవ స్తేజసాతేన సర్వశః ॥ 27
ఆవిష్టా స్తేజసా తేన దేవేన పరమేష్ఠినా। తద్వత్కర్మాణి కుర్వన్తి పూజ్యమానా మహర్షిభిః ॥ 28
తథాతుకాలే సంన్యస్తా స్తేన వైష్ణవ తేజసా। దిష్టాంత వశ మాయాన్తి తస్యైత దుచితం యథా ॥ 29
యేచకేచన లోకేఽస్మిన్ దృశ్యన్తే తేజసాన్వితాః। తేషాం తద్వైష్ణవం తేజస్త్వయా జ్ఞేయం మహీపతే! ॥ 30
యచ్చంద్రమసి యచ్చాగ్నౌ యచ్చసూర్యే జగత్పతౌ। తేజః పశ్యతి తత్సర్వం వైష్ణవం విద్ధి పార్థివ! ॥ 31
అగస్త్య ప్రముఖానాంచ యాచశక్తి రతీంద్రియా। తత్తస్య రాజన్! సాజ్ఞేయా త్వయా వైష్ణవ తేజసా ॥ 32
యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జిత మేవవా!। తత్తదేవావగచ్ఛ త్వం యుక్తం వైష్ణవ తేజసా ॥ 33

యదువంశభూషణా! కొందరనేక పుణ్యకర్మములందు నిమగ్నులైయుందురు. అట్టి మహానుభావులకు తేజస్సుచే నా విష్ణువు సర్వత్ర యావేశించును. అనగా పుణ్యశీలురుచేసిన తపస్సునకు ఫలముగా వారి భావననుసరించి యాయా యావేశావతారము లెత్తుచుందురని భావము. ఆవిష్ణువు పరమేష్ఠి తేజస్సుచే నావేశింపబడినవారు-వరాహాద్యవతారమూర్తులు మహర్షులచే పూజింపబడు చున్న వారై యాయవతార ప్రయోజన నిర్వహణమున కాయాపనులు సేయుచుందురు. అట్లే కాలక్రమమున నావైష్ణవ తేజస్సు నా విష్ణువుపసంహరించినపుడు, దైవవశులై అవతారోప సంహారము పొందుదురు. ఆదికూడ పరాత్పరుని కభిమతముగానే జరుగును. రాజా! ఈలోకమందే కొందరు తేజస్సంపన్నులుగా గానవత్తురో వారి తేజస్సు (వారియందున్న యావిశిష్ట ప్రభావ వైభవము.

విభూతి) అది వైష్ణవ తేజస్సేయని నీవెరుంగవలసినది. రాజా! చంద్రునందు నగ్నియందు జగత్ప్రియగు సూర్యునందుగల తేజస్సు వైష్ణవతేజమని యెఱుంగుము. అగస్త్యప్రముఖులగు మహర్షులందుగల అతీంద్రియశక్తియు విష్ణువుయొక్క తేజస్సుతోడిదిగా నీ వెరుంగదగినది. విభూతి (ఐశ్వర్య) యుతము శ్రీమంతమునగు ప్రాణిజాతమెల్ల వైష్ణవతేజస్సుతో గూడినదని నీవవగాహన సేసికొనుము.

బ్రాహ్మణానాం సురాణాంచ సాధ్వీనాంచ తథా గవామ్ । జగతీం ధారిణీం శక్తిం విద్ధి తాం వైష్ణవీం విభో! ॥ 34
రాజాన స్తేజసా యుక్తా వైష్ణవేన వసుంధరామ్ । పాలయన్తి మహీపాలాః వీర్యోదగ్రాః యశస్వినః ॥ 35
ఋషయశ్చతథా విప్రాః వేద వేదాంగ పారగాః । పాలయన్తి జగత్ కృత్స్నం యుక్తా వైష్ణవ తేజసా ॥ 36
త్రేతాయుగాదౌ యే కేచి జ్జాయన్తే చక్రవర్తినః । గురుణా విద్ధి తాన్సర్వాన్ సంయుక్తా న్విష్ణుతేజసా ॥ 37
ఆజాను బాహవ స్సర్వే న్యగ్రోధ పరి మండలాః । జిహ్వయా సకలం వక్త్రం పరిమార్జన్తి తేతథా ॥ 38
షష్ట్యా దంతైశ్చ సంయుక్తా దంష్ట్రాభిశ్చ తథాఽష్టభిః । ఔర్ణేయంచ శుభం తేషాం భవత్యన్తర్భ్రువోర్నృప ॥ 39
చక్రాంకితైః పాదతలైః కరైశ్చాపి శరాంకితైః । జాలపాద కరాశ్చైవ తథా తురగ మేహనాః ॥ 40
రూపవన్తః ప్రభావన్తో వపుష్మన్తశ్చ యాదవః । అతీంద్రియ జ్ఞాన బలాః పృథివ్యాం చక్రవర్తినః ॥ 41
తేషాంతుసప్తరత్నాని భవన్తీహ మహీతలే । హస్త్యశ్వరథ రత్నాని భార్యా రత్నం తథైవచ ॥ 42
తథైవాయుధ రత్నంచ మణి రత్ననిధి స్తథా । చతస్ర శ్చాప్రతిహతాః తేషాం తు గతయ స్తథా ॥ 43
పాతాలే గగనే శైలే సముద్రేచ మహీపతేః । సముద్రః స్తంభితజలః ప్రయాణే చక్రవర్తినామ్ ॥ 44
భూసమాశ్చ తథా శైలాః మార్గేతేషాం భవన్తితుః । భూమిర్దదాతి వివరం పాతాళ ముపయాస్యతామ్ ॥ 45
నవిషీదన్తి గగనే తథా తేషాం తురంగమాః । శ్రుతేన తపసా యజ్ఞై ర్వీర్యేణాస్త్రబలేన చ ॥ 46
సర్వేభ్యస్తేఽతిరిచ్యన్తే ప్రాణిభ్యో మనుజేశ్వరః । ఆరాధిత జగన్నాథాః ప్రాప్నువన్తీహ తత్పదమ్ ॥ 47
వర్షాయుతాని జీవన్తి షడష్టసప్త వా నృపః । తేషాంచ తేజసా విష్ణుః కరోత్యాప్యాయనం సదా ॥ 48
యేన తే కథితం సర్వం ప్రాప్నువన్తి గుణోదయమ్ । స్థానాన్తర గతేనాపి తేఽపి వైష్ణవ తేజసా ॥ 49
సంహార ముపగచ్ఛన్తి క్షయకాల ఉపస్థితే । క్షయకాలేచ మాంధాతు స్తేజ స్తదతిదుస్సహమ్ ॥ 50
వైష్ణవం శూలి శూలాగ్ర మాశ్రయామాస యాదవః । అర్జునస్య నరేంద్రస్య యుక్తస్య హరి తేజసా ॥ 51
హరిరేవాంత కృచ్చాసీ ద్రామోభృగుకులోద్వహః । భార్గవస్యచ రామస్య తేజ స్తదతిదుస్సహమ్ ॥ 52
ఆదత్తే వైష్ణవం ఘోరం రామో దశరథాత్మజః । కాంచిత్తను మధిష్ఠాయ తేన ఘోరేణ తేజసా ॥ 53
కరోతి దేవకార్యాణి కృతకర్మా తతః ప్రభుః । ఆదానం తేజస స్తస్య విదత్తే స స్వతేజసా ॥ 54
నాఽన్యః శమయితాలోకే నృపః వైష్ణవ తేజసః । 55
తస్యావ తారేషు మయా స్వరూప మేతత్తవోక్తం భువనస్య పత్యుః ।
రహస్య మేత త్పరమం మునీనాం జ్ఞానా మృతం కల్మషనాశకారి ॥ 56

ఇతి శ్రీవిష్ణు ధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
ప్రాదుర్భావ స్వరూప వర్ణనం నామ ద్విసప్తత్యధిక శతతమోఽధ్యాయః.

బ్రాహ్మణులు దేవతలుసాధ్వులు(పతివ్రతలు) గోవులు అనువానిలోగల జగద్ధారిణియైన శక్తిని ఆవైష్ణవీశక్తియని ఎఱుంగుము. వైష్ణవతేజః సంపన్నులైనరాజులే వీర్యోదగ్రులై యశస్వులై వసుంధరం బాలింతురు. ఋషులు వేదవేదాంగపారగులైన విప్రులు వైష్ణవతేజస్సుతోగూడియుండియేసర్వజగద్రక్షణము చేయుచున్నారు. త్రేతాయుగము మొదట నేచక్రవర్తులు పుట్టిరో వారినందరను గొప్ప విష్ణు

తేజస్సుతో గూడినవారింగా నెరుంగుము. ఆజానుబాహువులు ఊడలువారినపెను మఱ్ఱిపృక్షమువలె విస్తరించిన కేశబంధముగల యా ప్రభువులు నాలుకతో నెల్లవదనమును (ముఖమును) పరిమార్జింతురు. అరువదిదంతములతో నెనిమిది కోరలతో గూడినవారికి కను బొమలనడుమ శుభలక్షణమైన ఔర్ణేయము (సాలీడు పంటిరేఖ గుర్తు) కనిపించును. పాదములలో చక్రరేఖలు, కరములలో బాణరేఖలు గానవచ్చును. జాలపాదము (హంస) గుర్తుచేతులందుండు (రహస్యులు) వారు తురగమేహసులు (అశ్వమేధులు) రూపవంతులు ప్రభా వంతులు కండ పుష్టిగల విగ్రహములు (శరీరము) గలవారు అతీంద్రియజ్ఞానమే బలముగ గలవారునగు చక్రవర్తులకీ మహీ తలమందు సప్తరత్నములు గల్గును. అవి హస్తి అశ్వరథరత్నములు, భార్యారత్నము, ఆయుధరత్నము మణినిధి రత్ననిధి. వారు పాతాళము, పర్వతము, సముద్రములందు అప్రతిహతగతులు (అడ్డులేని సంచారములు) అట్టి చక్రవర్తుల ప్రయాణమందు సముద్ర జలము స్తంభితమగును. మార్గమున పర్వతములు నేలతోసమానమగును. పాతాళమునకేగుచో వారికి భూమి వివరమొసంగును (దారియిచ్చును) వారి గుఱ్ఱములాకాశమందు విషాదమునందవు. ఆకాశయానము సేయుదురన్నమాట. శ్రుతము (పాండిత్యము) తపస్సు యజ్ఞములు వీర్యము అస్త్రబలము అనువానిచే వారందరు ప్రాణులనతిశయింతురు. జగన్నాథుని (విష్ణుని) ఆరాధించుచు వారు వైష్ణవ పదమధిష్ఠింతురు. వారు అరువదివేలు డెబ్బదివేలు ఎనుబదివేల సంవత్సరములు జీవింతురు. విష్ణువు తనతేజస్సుచే నిత్యము వారి కాప్యాయనము సేయుచుండును. నావిష్ణుః పృథివీ పతిః అన్నమాట. దానివలననే వారిచెప్పిన గుణోదయమునందు (లక్షణ సంపద) పొందుదురు-వారుక్షయకాలమురాగా వారిలోని వైష్ణవ తేజస్సు మరొక స్థానమునకుపోగా వారు సంహారమందుదురు. (మరణ మొదిం తురన్నమాట) క్షయకాలమందుగూడ మాంధాత తేజస్సు అతి దుస్సహమైయుండెను. ఆవైష్ణవ తేజస్సానమీపమందు శూలి (శివుని) యొక్క శూలము చివరనిలిచెను. విష్ణుతేజస్సుతో గూడిన చక్రవర్తి (కార్తవీర్యార్జునుని తుదముట్టించినవాడు భృగుకుల సంభవుడును పరశురామరూపమున హరియేఅయ్యెను. భార్గవరాముని తేజస్సతిదుస్సహము. దశరథకుమారుడు పరశురాముని ఘోర వైష్ణవ తేజస్సును స్వీకరించెను. ఒకానొక మానవతనువు నధిష్ఠించి యాప్రభువు వైష్ణవ తేజస్సుతో దేవకార్యములు చక్క బెట్టినాడు. దాననా ప్రభువు కృతార్థుడునయ్యెను. ఆయన తన తేజస్సుచే నావిష్ణు తేజస్సును గ్రహించినాడు (లోననిమిడించుకొన్నాడు) లోక మందు మరియెవ్వడును వైష్ణవతేజస్సు నుపశమింప జేయగలవాడులేడు. భువన ప్రభువగు ఆవిష్ణువుయొక్క యవతారములందలి యీ పరమరహస్య స్వరూపమును మునులకు జ్ఞానామృతమైన దానిని కల్మషనాశకారియైన దానిని నీకేనానతిచ్చితిని.

ఇది శ్రీవిష్ణు ధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున ప్రాదుర్భావ స్వరూపవర్ణనము నూటడెబ్బది రెండవయధ్యాయము.

## నూటడెబ్బదిమూడవ అధ్యాయము - అనంతవ్రతమాహాత్మ్యము

వజ్ర ఉవాచ : యువనాశ్వేన యద్రాజ్ఞా పుత్రీయంతు కృతం వ్రతమ్ ।

తమహం శ్రోతు మిచ్ఛామి జనానాం హితకామ్యయా ॥ 1

మార్కండేయః : పుత్రీయం తే ప్రవక్ష్యామి వ్రతం భూపాల సత్తమః ।

అనన్తవ్రత మిత్యుక్తం సేవతాం పుత్రజన్మదమ్ । 2

మాసిమాసితు నక్షత్రం మాసనామ్నాతు చిహ్నితమ్ । సంప్రాప్య పూజయేద్దేవం సోపవాసో నరోత్తమ! ॥ 3

ఏకైక మంగం దేవస్య ప్రతిమాసం విశేషతః । పూజయే ద్యత్నతః శుద్ధః శృణు! చాంగక్రమం మమ ॥ 4

మార్గశీర్షాదథాఽఽరభ్య వ్రతమేతత్సమారభేత్ । దేవస్య మార్గశీర్షేతు వామం జానుం సమర్చయేత్ ॥ 5

కటిభాగం తథావామం పౌషే మాసి సమర్చయేత్ । మాఘే మఘాసు వామం చ భుజం దేవస్య పూజయేత్ ॥ 6

ఉత్తరా ఫల్గునీ ఋక్షేస్కంధంవామం ప్రపూజయేత్ । చతుర్ష్వేతేషు వామేషు గోమూత్ర స్నానమాచరేత్ ॥ 7
పూజనం దేవ దేవస్య రక్తైః పుష్పాదిభి స్తథా । హోమోఘృతేన కర్తవ్యః తిలదానం ద్విజాతిషు ॥ 8
తామ్రస్యచ తథా దానం గోమూత్రప్రాశనం తతః । హవిష్యాన్నేన చాహారం తతః కార్యం విజానతా ॥ 9
దేవస్య దక్షిణం స్కంధం చైత్రేచిత్రాసు పూజయేత్ । వైశాఖేచ విశాఖాసు బాహుం దేవస్య దక్షిణమ్ ॥ 10
దక్షిణం కటిభాగం చ జ్యేష్ఠేజ్యేష్ఠాసు పూజయేత్ । దక్షిణంచ తథా జాను మాషాఢే వైశ్వదేవకే ॥ 11
చతుర్ష్వేతేషు మాసేషు క్షీరస్నానం విధీయతే । పీత పుష్పాది పూజాచ దేవ దేవస్య చక్రిణః ॥ 12
హోమంచశాలిభిః కుర్యా ద్యవా దేయా ద్విజాతిషు । రజతంచ తథా దేయం యవాఽన్నేన భుజిక్రియా ॥ 13
తథా కార్యా మనుష్యేంద్ర! శ్రావణే శ్రవణే తతః । పాదాదౌ పూజయేత్తస్య యస్యేదం సఫలం జగత్ ॥ 14
గుప్తం భాద్రపదే మాసి ఆశ్వినే హృదయం తతః । శిరసః పూజనం కార్యం కార్తికే కృత్తికాసుచ ॥ 15
చతుర్ష్వేతేషు మాసేషు దధ్నాస్నానం విధీయతే । పూజనం దేవ దేవస్య శుక్లైః పుష్పాదిభి స్తథా ॥ 16
క్షీరేణ హోమః కర్తవ్యో ఘృతం దేయం ద్విజాతిషు । సువర్ణంతు తథా రాజన్! దధ్నా కార్యా భుజిక్రియా ॥ 17
అనంతనామ జప్తవ్యం సర్వమాసేషు పార్థివః । తేనైవ నామ్నా దేవస్య హోమకర్మాపి నిర్దిశేత్ ॥ 18
వ్రతావసానే దాతవ్యం బ్రాహ్మణేభ్యస్తు భోజనమ్ । దానం శక్త్యాచ దాతవ్యం బ్రాహ్మణేభ్యో నరాధిప! ॥ 19
సంవత్సరా దవాప్నోతి సర్వానేవ మనోరథాన్ । పుత్రార్థిభిర్వృత్తి కామైర్భృత్యదార ధనేప్సుభిః ॥ 20
ప్రార్థయద్భిశ్చ కర్తవ్యం బలమారోగ్య సంపదమ్ । ఏతద్వ్రతం మహారాజ! పుణ్యం స్వస్త్యయనం పరమ్ ॥ 21
అనంత వ్రత మిత్యుక్తం సర్వ కల్మషనాశనమ్ । వ్రత మేత త్పురా కృత్వా యువనాశ్వో మహీపతిః ॥ 22
మాంధాతారం సుతం లేభే రాజానం చక్రవర్తినమ్ । కృతవీర్యస్య రాజేంద్ర! భార్యా శీలధరా తథా ॥ 23
వ్రతేనానేన సా లేభే పుత్రం బాహు సహస్రిణమ్ । కార్తవీర్యార్జునం నామ రాజానం చక్రవర్తినమ్ ॥ 24
యమా వివేశ భగవాంస్తేజసా స్వేన మాధవః । నమస్తే కార్తవీర్యాయ అర్జునాయ మహాత్మనే ॥ 25
సప్తద్వీప సముద్రాయాం మేనాద్యై మీశ్వరాయచ । ఏతావదుక్తా పుణ్యేన తిల ప్రస్థస్య యుజ్యతే ॥ 26
రాజన్! దత్తస్య విధివత్ బ్రాహ్మణాయ యతాత్మనే । యస్యవైజాత మాత్రస్య ప్రవవౌ వనిలః శుభః ॥ 27
నీరజస్క మభూద్వ్యోమ ముదం ప్రాపాఖిలం జగత్ । సమాశ్రయార్థం నృపతిం దైత్యా మానుష్యతాం గతాః ॥ 28
ఆశ్రయామాసు రవ్యగ్రాశ్శతశోఽథ సహస్రశః । యస్మిన్ రాజన్వతీ వార్తా భూమి ర్భరావ పీడితా ॥ 29
పుత్రీయమేత త్తవ రాజసింహ! మయావ్రతం తేకథితం పురాణమ్ ।
కర్తవ్య మేతద్భువి పుత్రకామైః పాపాపహం ధర్మవివర్ధనంచ ॥ 30

ఇతి శ్రీవిష్ణు ధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
అనంత వ్రత మాహాత్మ్యవర్ణనం నామ త్రిసప్తత్యుత్తర శత తమోఽధ్యాయః.

యువనాశ్వమహారాజు పుత్రప్రదమైన అనంతవ్రతము సేసెను. జనహితముకొరకది యేనువిగోరెవనన వజ్రునికి మార్కండేయుడిట్లనియె. పుత్రలాభముంగూర్చు నావ్రతముం దెల్పెదవినుము. చైత్రాదిమాసములు పండ్రెండును నానెలలో పూర్ణిమనాడున్న నక్షత్రమునననుసరించి యేర్పడినవి. కావున యానక్షత్రమందు విష్ణుదేవునియొక్కొక్క యంగమునొక్కొక్క నక్షత్రమందు బూజింపవలెను. ఆయంగక్రమమిది. ఈపూజ మార్గశీర్షమున మొదలువెట్టవలెను. మార్గశీర్షమందు ఎడమమోకాలును, పుష్యమాసమున నడుమునెడమభాగమును, మాఘమందు ఎడమభుజమును ఉత్తరాఫల్గుని నక్షత్రమందెడమవైపు స్కంధమును (మూపును) పూజింపవలెను. ఈనాలుగెడమవైపులందు గోమూత్రముతో స్నానముసేయింపవలెను. ఎఱ్ఱపువ్వులు ఎఱ్ఱఅక్షతలు ఎఱ్ఱనిచందనముతో నీపూజసేయ

వలెను. నేతితోహోమము బ్రాహ్మణులకు తిలదానము సేయవలెను రాగిపాత్రయు నీయవలెను. గోమూత్రప్రాశనము సేయనగును. హవిష్యాన్నమాహారముగ దినవలెను చైత్రమందు చిత్రానక్షత్రమందు హరియొక్క కుడిమూపు వైశాఖమందు విశాఖానక్షత్రమందు కుడిబాహువు జ్యేష్ఠమందు జ్యేష్ఠానక్షత్రమందు కుడి కటిభాగము ఆషాఢమందు విశ్వేదేవతానక్షత్రమగు ఉత్తరాషాఢా నక్షత్రమందు కుడిమోకాలునుం బూజింపవలెను. ఈ నాల్గునెలలందు స్వామికి క్షీరస్నానము సేయింపనగును. విష్ణుపూజ పచ్చుపుపచ్చనిపూలతో జేయవలెను (పచ్చగన్నేరు మొదలయినవన్నమాట) శాలిబియ్యముతో హోమము యవలు విప్రునికి దానమును సేయవలెను వెండియును సీయవలెను. భోజనముపెట్టవలెను.

అట్లే శ్రావణమాసమందు శ్రవణనక్షత్రమందా జగత్పతికి పాదాదిగ పూజసేయవలెను. భాద్రపదమందు గుహ్యాంగము అశ్వినమందు హృదయము కార్తికమందు శిరస్సును బూజసేయవలెను. ఈ నాల్గునెలలు పెరుగుతో స్నానము విహితము. తెల్లని పువ్వులు గంధాక్షతలతో పూజ, క్షీరముతో హోమము, బ్రాహ్మణులకు నేయి దానము సువర్ణదక్షిణయు నీయవలెను. పెరుగుతో భోజనమును బెట్టవలెను. అన్నిమాసములందు అనంతనామజపము సేయవలెను. ఆదేనామముతో హోమమును ఇట్లేడాది వ్రతముసేసి తుదను బ్రాహ్మణులకు భోజనము యథాశక్తి దానములను నొనరింపవలెను. ఒకసంవత్సరమిదిసేసిన సర్వాభీష్టములను బొందును. పుత్రార్థులు వృత్తి (బ్రతుకుతెరువు) కోరువారు ఆలుబిడ్డలు దాసదాసీజనము ధనమును బలము ఆరోగ్యము సంపదను కోరువారీ వ్రతమాచరింపవలెను. ఇది పరమమంగళప్రదము. పుణ్యప్రదము. సర్వపాపహరము. ఈ అనంతవ్రతమును యువనాశ్వుడాచరించి మాంధాతచక్రవర్తిని గనెను. కృతవీర్యునిభార్య శీలధరయను నామె యీవ్రతముచే వేయిబాహువులుగల కొడుకుని బడసెను. ఆయనయే కార్తవీర్యార్జునుడు చక్రవర్తి. ఆయనయందు విష్ణుభగవానుడావేశించి యుండెను. 'మహాత్ముడగు కార్తవీర్యార్జునునకు సప్తద్వీపసముద్రయైన మేదినికెల్ల సార్వభౌముడైన నీకునమస్కారము' అని యీమంత్రముపఠించి యథావిధిగ బ్రాహ్మణుని కొక్కతిలప్రస్థము (కుంచెడు నువ్వులు) దానముసేసినవాడు పుణ్యసంపన్నుడగును. ఏ కార్తవీర్యార్జునుడవతరింపగనే పుణ్యసుగంధబంధుర వాయువులువీచెనో, యాకాశమెల్ల రజోరహితము (స్వచ్ఛము) అయ్యెనో సర్వజగమానందమందెనో ఎవనినాశ్రయింప దైత్యులు మానుష్యభావమునంది యే యాందోళనముగొనక వందలువేలువచ్చి యాశ్రయించిరో ఎవ్వని పాలనమందు భూమి యామున్ను భారాపపీడితయై రాజన్వతి (ఉత్తమ రాజుగలది) యనుప్రఖ్యాతిగాంచెనో, జలసమృద్ధితో నా వసుమతి తననుదా ధరించి యుబ్బితలూగెనో అట్టి కార్తవీర్యార్జునునియొక్క విష్ణుతేజోమూర్తియొక్క యవతార మీపుత్రీయ వ్రతప్రభావముపలననే జరిగినది. ఇట్టిపురాణవ్రతమేను నీకెరింగించితి. నిదిపుత్రార్థులైనవారు సేయవలసినది. పాపహరము ధర్మవివర్ధనమును.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తరమహాపురాణము ప్రథమఖండమున అనంతవ్రతమాహాత్మ్యమను

నూటడెబ్బదిమూడవ అధ్యాయము.

## నూటడెబ్బదినాల్గవ అధ్యాయము - మాసనక్షత్ర పూజనము

మార్కండేయ ఉవాచ : ఇద మన్యత్ ప్రవక్ష్యామి మాసనక్షత్ర పూజనమ్
యత్ఫలం దేవ దేవస్య పురుషః సముపాశ్నుతే । 1
ఆరభ్య కార్తికా దేతద్వ్రతం కార్యం విజానతా! । పారణ త్రితయేనైత ద్వ్రతం పరిసమాప్యతే ॥ 2
చాతుర్మాస్యం తథైవాత్ర పారణం నృప! కీర్తితమ్ । పారణే పారణే రాజన్! ప్రతి మాస విధిం శృణు! ॥ 3
పంచగవ్యజల స్నానం సదైవచ సమాచరేత్ । పుష్పాది పూజాకర్తవ్యా యథాలాభ ముపాహృతైః ॥ 4
నైవేద్యం కృసరం పూర్వ మత్రమాస చతుష్టయమ్ । యావకేన తథా కార్యం మధ్యమంచ చతుష్టయమ్ ॥ 5

చతుష్టయే తృతీయేచ నైవేద్యం పాయసం భవేత్ । తేనైవాన్నేన రాజేంద్రః బ్రాహ్మణాన్ భోజయేద్బుధః ॥ 6
నక్తం నైవేద్య మశ్నీయా ద్వాగ్యతః సుసమాహితః । సంయతస్తాంభ వేద్రాత్రిం తథా స్థండిల శాయకః ॥ 7
ఏవం కుర్యాత్పున స్తావద్యావ త్కార్తిక కృత్తికా । తత్ర సంపూజ్య దేవేశ మారంభవిధినా నృపః ॥ 8
భాజనం ఘృత సంపూర్ణం సహిరణ్యం ద్విజాతయే । దాతవ్యం భోజనం కార్యం బ్రాహ్మణానాం విశేషతః ॥ 9
సంవత్సర మిదం కృత్వా వ్రతం పురుష సత్తమః । లబ్ధ్వా స్థానంచ మోదేత తథా నారీచ యాదవః ॥ 10
స్థిరాంశ్రియం ధర్మమతిం బలంచ సౌభాగ్యమోజః స్థిర సత్త్వతాంచ ।
ఆస్థాం సుదీర్ఘాం త్రిదివేచ కుర్యాత్ వ్రతం నృణా మేత దతీవ పుణ్యమ్ ॥ 11

ఇతి శ్రీవిష్ణు ధర్మోత్తరే ప్రథమ ఖండే మార్కండేయ వజ్రసంవాదే
మాస నక్షత్ర పూజనం నామ చతుస్సప్త త్యధిక శతతమోఽధ్యాయః.

మార్కండేయుడిట్లనియె: మాసనక్షత్ర పూజన మిట్లుండుంకొకటితెల్పెద. దీనివలన విష్ణుపురలన మానవుడు పొందుఫలమునుం వాక్రుచ్చెద. కార్తికము నుండి యీ వ్రతము సేయవలెను. మూడు పారణములతో నిది పూర్తియగును. నాల్గుమాసములకొక పారణము విహితము. ప్రతిపారణమందు ప్రతిమాసము నాచరింప వలసిన విధిని వినుము. పంచగవ్య జలముతో స్నానము నిత్యము సేయ వలెను. యథాలాభముగ గౌనివచ్చిన పూలతో బూజ, నైవేద్యము కృసరము మొదట నాల్గు మాసములు రెండవ నాల్గు మాసములు యావకము నువ్వుండలు నాఱుమినుములతో చేసిన పిండి వంటలు యవాన్నము (పులగము) నైవేద్యము. మూడు నాల్గుమాసము లందు పాయసము నివేదన సేయవలెను. బ్రాహ్మణులకు నీ యన్నము విందుసేయవలెను. వ్రతస్థుడు వాఙ్నియమముతో సమాహితుడై రాత్రి నైవేద్యముం దాను దినవలెను. ఆ రాత్రి కటికినేలం బరుండ వలెను ఇట్లు కార్తిక మాసమున కృత్తిక తిరిగి వచ్చుదాక (ఒకయేదాది) సేయవలెను. అప్పుడు హరినర్చించి ఘృతకుంభ దానము సువర్ణ దక్షిణతో ద్విజునకీయవలెను. విశేషముగ సంతర్ప ణమును సేయవలెను. ఇట్లొక సంవత్సర మీవ్రతము సేసిన పురుషోత్తముడు ఉత్తమస్త్రీయు నుత్తమ పుణ్య స్థానము నందిమోదిం చును. ఈ పుణ్యవ్రతము శాశ్వత శ్రీని ధర్మబుద్ధిని బలమును సౌభాగ్యమును ఓజస్సు చెదరని సత్త్వమును స్వర్గముఖాభిలాషను జేకూర్చును

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణమందు ప్రథమఖండమున మాసనక్షత్రపూజనమను
నూటడెబ్బదినాల్గవ యధ్యాయము.

## నూటడెబ్బదిఐదవ అధ్యాయము - ఇంద్రాఖ్యానము

మార్కండేయః : అత్రతే వర్ణయిష్యామి కథాం పాప ప్రణాశినీమ్ । స్వర్గేవృత్తాం సమాశ్రిత్య మాసనక్షత్ర పూజనమ్ ॥
పూర్వేషు చరితం శక్రః నాహంజానామి కించన । భవతస్సమ కాలీనం విద్ధి మాం సురసత్తమ ॥ 2
ఇయం సిద్ధా విజానాతి ప్రఖ్యాతా శాంబరాయణీ । ఏవముక్తస్తతః శక్రః పప్రచ్ఛ బలసూదనః ॥ 3
జగాద సాచ శక్రస్య పూర్వేంద్రచరితం మహత్ । శక్రాణాం సావ్యతీతానాం శతశోఽథ సహస్రశః ॥ 4
జగాద తత్ర చరితం కల్పేష్వ న్యేష్వపి ప్రభోః ॥
శాంబరాయణ్యువాచ : సర్వేషా మపి శక్రాణాం యేతు దాయాదబాంధవాః : 5
సర్వే వినాశితాస్తేన విష్ణునా ప్రభవిష్ణునా । సర్వే శక్రా స్తథాయుక్తాస్తేన వైష్ణవ తేజసా ॥ 6
భూతేభ్య స్త్వతిరిచ్యన్తే తేన తేగుణ సంపదః । దానేన యజ్ఞైః శౌర్యేణ తపసాచబలేనచ ॥ 7

శ్రుతేన ధర్మిష్ఠతయా దేవదైత్య మహోరగాన్ । ఋషయశ్చ మహాభాగా స్తేఽపి పార్థివ సత్తమ! ॥ 8
వర సంపాదనం తైశ్చ కృతం సర్వం స్వయం భువా । పరాజయం యతః ప్రాప్తాః దాయాదేభ్యః పునః పునః ॥
సర్వేశ్వరా వీర్య బలోపపన్నాః ధర్మేనివిష్టా జగతః ప్రధానాః ।
త్యక్తాధికారాశ్చ తతః క్రమేణ సర్వేగతా విష్ణు సహాయతాంచ ॥ 9

ఇతి శ్రీవిష్ణు ధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
శక్రచరితాఖ్యానంనామ పంచసప్తత్యధిక శతతమోఽధ్యాయః.

మార్కండేయుడనియె : ఈ మాసనక్షత్ర పూజనము ననుసరించి స్వర్గమందు జరిగిన పుణ్యకథను వర్ణింతును. ఇంద్రా. దీనినిబూర్వులాచరించిరి. నేనిది యేకొంచె మెఱుంగను. నేను నీ సమకాలీనుడనుగదా! శాంబరాయణి యను నీ సిద్ధురాలిది యెఱుంగును. అని పలుక నింద్రుడు విని యా సిద్ధురాలినడుగ నామె శక్రునికి నంతమున్నింద్రులైన వారాచరించిన యీవ్రత కథను దెలిపెను. ఇప్పటి యీయింద్రునకు ముందటి దేవేంద్రులు వందలు వేల మంది యుక్క యితర కల్పములందు జరిగిన చరిత్ర నిట్లామె చెప్పెను.

ఇంద్రులందరి యొక్క దాయాదులు (జ్ఞాతులు) బంధువులును సర్వసమర్థుడైన యా విష్ణువుచే నశింప జేయబడిరి. అంద రింద్రులు నా విష్ణువు యొక్క తేజస్సుతో గూడిన వారే. అందువలన సకల సద్గుణ సంపన్నులయి వారన్ని భూతముల కంటె మిన్నయై యుండిరి. వైష్ణవ తేజస్సు వలన దానములచే యజ్ఞములచే శౌర్యములచే తపస్సుచే బలముచే శ్రుతముచే (పాండిత్యముచే) ధర్మనిష్ఠచే వారు దేవదైత్య నాగకులముల నతిశయించి యుండిరి. వారందరు మహాను భావులైన మహర్షులు. వారు స్వయంభువు వలన (బ్రహ్మవలన వరసంపాదనము చేసినవారే. అట్టివారయ్యు తిఱిగితిఱిగి వారపజయమునొందిరి. సర్వేశ్వరులు వీర్యబలోపపన్నులు ధర్మనిష్ఠులు జగత్ప్రధానులయిన వారుగూడ అధికారములు నోయి క్రమముగ విష్ణువును సహాయునిగా బొందిరి.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణమందు ప్రథమఖండమున ఇంద్రాఖ్యానమను
నూట డెబ్బదియైదవ అధ్యాయము.

## నూటడెబ్బదియాఱవ అధ్యాయము - శాంబరాయణితెల్పిన ప్రథమమన్వంతర వర్ణనము

ఇంద్ర ఉవాచ : యస్మిన్ కాలే వ్యతీతాయే షడింద్రాభూరితేజసః । తేషాం చరిత మిచ్ఛామి శ్రోతుం విస్తరశః శుభే ॥
ప్రతి శక్రం మనుం భద్రేః మనుపుత్రాం స్తథైవచ । దేవాన్ సప్త ఋషీంశ్చైవ తథాదాయాద బాంధవాన్ ॥ 2
శక్రస్య తేషాంచ వధం తథా దేవాజ్జనార్దనాత్ । త్వత్తోఽహం శ్రోతు మిచ్ఛామి సర్వంతం వేత్సి సుందరి ॥ 3
శాంబరాయణీ: బ్రహ్మణో మానసః పుత్రః ప్రథమస్తు మనుః స్మృతః ।
దశపుత్రాశ్చ తస్యేమేఖ్యాతా స్త్రిభువనేశ్వర ॥ 4
అగ్నీధ్రశ్చాతి బాహుశ్చమేధా మేధాతిథి ర్వసుః । జ్యోతిష్మాన్ ద్యుతిమాన్ హవ్యః సవనః సత్రఏవచ ॥ 5
మరీచి రత్ర్యంగిరసౌ పులస్త్యః పులహః క్రతుః । వసిష్ఠశ్చ మహాతేజాః ఋషయ స్సప్తకీర్తితాః ॥ 6
జయాఖ్యాశ్చాజి తాఖ్యాశ్చ శుక్రయామా స్తథైవచ । గణా ద్వాదశకా ఏతే చత్వార స్సోమపీథినః ॥ 7
విశ్వభుజ్నామ దేవానాం తేషా మింద్రోబభూవహ । ఆసం స్తస్యాసురా ఘోరా స్తదా దాయాదబాంధవాః ॥ 8
బభూవ నృపతి ర్యేషాం బాష్కలో నామ నామతః । యస్య హస్తా దుభౌలోకౌ వామనేన హృతౌ పురా ॥ 9
క్రమద్వయేన తుహృతం పాతాళంచ సురేశ్వర । యస్యపుత్రవతస్త్వాసీ త్కేశీనామ బలోత్కటః ॥ 10
జహార భూయస్త్రైలోక్యం శక్రస్యా క్రమ దుర్మతిః । తమాహూయ రణేవిష్ణుః తార్క్ష్య ప్రవరవాహనః ॥ 11

ద్విధా చక్రేణ చకార త్రైలోక్యహిత కామ్యయా ॥ 12
ఏవం హృతస్తేన పురారిముఖో మహాత్మనా కాలసమ ప్రభావః ।
శక్రప్రియార్థం జగతాం హితార్థం దేవేశ్వరేణాఽప్రతిమేన తేన ॥ 13

ఇతి శ్రీవిష్ణు ధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
శాంబరాయణీ వాక్యే ప్రథమ మన్వంతర వర్ణనం నామషట్ సప్తత్యధిక శతతమోధ్యాయః.

కల్యాణి ! ఏ కాలమందు మహాతేజస్వులా ఆఱుగురింద్రులు గడచిరి। వారి చరితము విస్తరము వినగోరెద. ఇంద్రుడొక్కొక్కని తరి మనువు మనుపుత్రులు దేవతలు సప్తర్షులు వారివారి జ్ఞాతులు బాంధవులు. ఇంద్రునియొక్క వారియొక్క విష్ణుకృత సంహారమును నీ వలన విన నర్థించెద. ఓ సుందరీ! నీవ యెఱుగుదు విది యెల్లనన శాంబరాయణి శతక్రతునకిట్లు తెలుప దొడంగెను. త్రిభువనాధీశా! బ్రహ్మమానస పుత్రుడు మొదటి వాడు మనువు. ఆ మనువునకు పది మంది కొడుకులు. 1 అగ్నీధ్రుడు 2 అతిబాహువు 3 మేధ 4 మేధాతిథి 5 వసువు 5 జ్యోతిష్మంతుడు 7 ద్యుతిమంతుడు 8 హవ్యుడు 9 సవనుడు 10 సత్రుడు ననువారు. 1 మరీచి 2 అత్రి 3 అంగిరసుడు పులహుడు 4 పులస్త్యుడు 5 పులహుడు 6 క్రతువు 7 మహాతేజస్వి వసిష్ఠుడు నను వారు సప్తర్షులు. జయులు అజితులు యాములు ద్వాదశగణములు సోమపీథులు (సోమ యాజులు సోమపానము సేసినవారు) నల్గురువారికి "విశ్వభుక్కు" అను పేరివాడింద్రుడయ్యెను. ఘోరులయిన యసురు లాతనికి జ్ఞాతులు బంధువులునై యుండిరి. వారికి ప్రభువు బాష్కలుడు. అతని చేతినుండియే మున్ను వామనమూర్తిచే రెండు లోకములు లాగికొనబడినవి. ఆ రెండింటి క్రమమంలోనే పాతాళము గూడ హరింప బడినది. ఆ బాష్కలుని కొడుకు కేశిఅను ల్యాడుడు దుష్టుడు శక్రుని త్రిభువనముల నాక్రమించి లాగికొనెను. విష్ణువు వానిని యుద్ధమునకు బిలిచి గరుడవాహనుడై చక్రముచే త్రిలోకహిత మాచరింప వానిని రెండు" ఖండించెను. కాలుని (యముని)తో సమమైన ప్రభావముగల యా శత్రువును నింద్రుని ప్రీతి కొఱకు జగద్ధితము కొఱకు మహానుభావుడు దేవేశ్వరుడు మహాత్ముడునగునా విష్ణువు చేత నిహతుడయ్యెను.

ఇది శ్రీ విష్ణుధర్మోత్తర మహాపురాణమందు ప్రథమఖండమున
శాంబరాయణి తెల్పిన ప్రథమమన్వంతర వర్ణనమను నూటడెబ్బదియాఱవ అధ్యాయము.

## నూటడెబ్బదియేడవ అధ్యాయము - ద్వితీయమన్వంతర కథ

శాంబరాయ్యువాచ : మనుః స్వారోచిషోనామ బభూవ తదనంతరమ్ ।
యస్యాసన్ సుమహాభాగాః పుత్రాః భూమండలేశ్వరాః ॥ 1
చైత్రః కవిరుత శ్చైవ కృతాన్తో విద్యుతో రవిః । బృహద్రథో నభశ్చైవ మహాబల పరాక్రమః ॥ 2
ఊర్జస్తస్య తథా ప్రాణ ఋషభో నిశ్చలస్తథా । దన్తోభిః శాక్వరీవాంశ్చ ఋషయస్యప్త కీర్తితాః । 3
భూషితా ద్వాదశ ప్రోక్తాస్తథా పారావతాశ్చయే । తేషామింద్రో విపశ్చిచ్చ మహాత్మా లోకవిశ్రుతః ॥ 4
ఆసంస్తస్యాసురా ఘోరాస్తదా దాయాదబాంధవాః । తేషా మాసీత్తదా రాజా పురుణిత్సో బలాధికః ॥ 5
శక్రస్య విప్రియాసక్తో మృగయాయై వనంగతః । వ్యధమ తుంజరాన్ మత్తాన్ బహువీర్య సమాశ్రయః ॥ 6
హస్తిభూపాల సచివః సజఘాన హరీన్ వనే ।
జఘాన సఃశైల ఇవాతి వర్ష్మా నీలాంజనాభో రచితోగ్రహాసః ।
జఘాన తం దైత్యవరం ప్రసహ్య దేవాఽసురాణాం సమరేష్వవధ్యమ్ ॥ 7

ఇతి శ్రీవిష్ణు ధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్ర సంవాదే
శక్రం ప్రతి శాంబరాయణ్యుపాఖ్యానే ద్వితీయ మన్వంతరకథా వర్ణనం నామ సప్త సప్తత్యధిక శతతమోఽధ్యాయః.

శాంబరాయణి యింద్రుని కిట్లనియె. అటుపై స్వారోచిషమనువు (స్వరోచికుమారుడు) వచ్చెను. అతని కొడుకులు భూదుండలేశ్వరులు. చైత్రుడు, కవిరుతుడు, కృతాంతుడు, విద్యుతుడు, రవి, బృహద్గ్రహుడు నభుడు ననువారు ఆతనికాలములో ఊర్జుడు ప్రాణుడు ఋషభుడు నిశ్చలుడు దంతుడు అభి శక్వరీవంతుడు ననువారు సప్తర్షులు (ఖాడుమో) పంద్రెండుగురు పారావతులను వారు భూషితులైరి. వారికింద్రుడు "విపశ్చిత్తు" అను పేరలోక ప్రసిద్ధుడు. అతనికిల ఘోరులైన అసురులు దాయాదులు బంధువులునై యుండిరి. వారికప్పుడు బలవంతుడగు పురుకుత్సుడురాజుయియుండెను. అతడు ఇంద్రునికి కీడుసేయగోరి వేటకై యడవి కేగెను. వీర్యాతిశయమున నవేక మదపుటేనుగులను గూల్చెను. వాని మంత్రిహస్తియనువాడు గూల్చెను. ఆతడు పెద్దపర్వతమట్లుండి కారునలుపు శరీరముగల్గి యరచేతనేకొట్టి సింహములం గూల్చెను. ఆ దైత్యనాయకు నింద్రుడు సంహరించెను.

ఇది శ్రీవిష్ణు ధర్మోత్తర మహాపురాణమునందు ప్రథమఖండమున ద్వితీయమన్వంతరకథయను
నూట డెబ్బది ఏడవయధ్యాయము

## నూటడెబ్బదియెనిమిదవ అధ్యాయము - తృతీయమన్వంతర వర్ణనము

శాంబరాయణీ : ఔత్తమస్య మునేః పుత్రాం స్తృతీయస్య నిబోధమే । అజశ్చ పరశుశ్చైవ దేవ దేవో వృథోనయః ॥
దేవా వృథశ్చాప్రతి మోమహోత్సాహో గజస్తథా । వినీతశ్చ సుకేతుశ్చ సుమిత్రః సుబలః శుచిః ॥ 2
అతఃపరం ప్రవక్ష్యామి ఋషయస్సప్తవైతదా । రజోబాహూర్ధ్వ బాహూచ సవనశ్చానఘశ్చయః ॥ 3
సుతపాఃశక్తిరిత్యేతే ఋషయస్సప్తకీర్తితాః । వశవర్తినః స్వధాసానో వశాసత్యహో మతార్దనాః ॥ 4
వసువర్తిః సుధామానః వశాస్సత్యా ప్రతర్దనాః ॥
పంచ దేవగణాః ప్రోక్తాః సర్వేద్వాదశకాస్తుతే । తేషాం సుచిత్తిర్నామ్నా ఒభూచ్ఛక్రః పరపురంజయః ॥ 5
ఆసంస్తస్యాసురా ఘోరా స్తదాదాయాద బాంధవాః । యేషామాసీద్బలీ రాజా ప్రలంబోనామ నామతః ॥ 6
శక్రస్య విప్రియాసక్తం తం సముద్రాంబువాహినమ్ । మత్స్యరూపధరో విష్ణుః గ్రస్తవాన్ బలవత్తరమ్ ॥ 7
కాలానలాభంతు విదేశశత్రుం రూపేణ మాత్స్యేన జగత్ప్రచారః ।
జఘాన తం పర్వతకూటమాత్రం సముద్ర మధ్యేశరదాన తృప్తమ్ ॥ 8

ఇతి శ్రీవిష్ణు ధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
తృతీయ మన్వంతర వర్ణనంనామ అష్టసప్తత్యధిక శతతమోధ్యాయః.

శాంబరాయణి యిట్లనియె. ఔత్తమమనువు మూడవవాడు. అతని పుత్రులు అజుడు పరశువు దేవ దేవుడు వృధుడు నయుడు. సాటిలేని దేవావృధుడు గజుడు వినీతుడు సుకేతుడు సుమిత్రుడు సుబలుడు శుచియనువారు. ఇటుపైన నాసమయమున సప్తర్షులు, రజోబాహువు ఊర్ధ్వబాహువు సవనుడు అనమందు చయుడు సుతుడు శక్తి అనువారు వశవర్తులు స్వధాసానులు వశులు సత్యకరులు మతార్దనులు ననునైదు దేవగణములు. అందరును ద్వాదశకులు అనగా నొక్కొక్కగణమునందు పంద్రెడుగురున్నారన్నమాట. వారికి శత్రుంజయుడగు సుచిత్తియను వాడింద్రుడైయుండెను. వానికెందరో ఘోరులైన అసురులు జ్ఞాతులు బంధువులునుండిరి. వారికి రాజు బలశాలియగు ప్రలంబుడు ఇంద్రునికి విప్రియము సేయనున్న వానిని సముద్రజలముల వహించు నాబలవంతుని మత్స్యావతారమెత్తి విష్ణువు సంహరించెను. వాడు కాలానలతుల్యుడు విదేశశత్రువు పర్వతకూటమట్లున్న యా ప్రలంబుని శరదాన తృప్తుని సముద్రమునందు హరించెను.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తరమహాపురాణము ప్రథమఖండమున తృతీయమన్వంతరమను నూటడెబ్బదియెనిమిదవఅధ్యాయము.

# నూటడెబ్బదితొమ్మిదవ అధ్యాయము - చతుర్థమన్వంతరకథ

శాంబరాయణీ : తామసస్యమనోః పుత్రాం శ్చతుర్థస్యనిబోధమే । జానుజంఘః శాన్తభయోనయః ఖ్యాతిర్నర స్తథా ॥
ప్రియభృత్యో హ్యవిక్షిచ్చ ప్రస్థిలశ్చ దృఢేషుధిః । కృతశ్చకృతగంధశ్చ తామసస్య మనోఃసుతాః ॥ 2
ఋషిర్వనః కఠీయా న్వైగాత్ర శ్చైత్రోఽగ్నిరేవచ । జ్యోతిర్వాసాః పృథుఃకార్యః ఋషయః సప్తకీర్తితాః ॥ 3
సత్యాః సుపాదాః సురిహా హరశ్చేతి ప్రకీర్తితాః । దేవతానాం గణాఏతే చత్వారః పంచవింశకాః ॥ 4
సత్యానామపిభేదౌద్వౌ సత్యా విశ్వాశ్చ కీర్తితాః । సత్యాద్వాదశ నిర్దిష్టాః విశ్వాః ప్రోక్తా స్త్రయోదశ ॥ 5
తేషామాసీ న్మహాతేజాః శిబిరింద్రః ప్రతాపవాన్ । ఆసం స్తస్యాఽసురా ఘోరాః తదా దాయాద బాంధవాః ॥ 6
యేషా మాసీ న్మహాతేజా రాజా భీమరథః ప్రభుః । ప్రసాద్య యేన బ్రహ్మాణ మవధ్యత్వంస్థలే వృతమ్ ॥ 7
జలం స వర్జయామాస తతః ప్రభృతి దుర్మతిః । స దదర్శ మరౌ కూర్మం పర్వతాకార దర్శనమ్ ॥ 8
తామారురోహ దుర్బుద్ధిః కౌతూహల సమన్వితః । సమారూఢం మహాకాయ మాదాయ భగవాన్ హరిః ॥ 9
కూర్మరూపధరో వేగాత్పాతాళ జల మావిశత్ । పాతాళజల మానీయ మజ్జయిత్వా జగామ తమ్ ॥
ఆక్రమ్య తం మహాకాయం మహతా కూర్మవర్ష్మణా ॥ 10
ఏవం స కూర్మేణ జలే ప్రసహ్య దేవేశ్వర స్యా ప్రతిమస్య శత్రుః ।
నిపాతితః సర్వసుర ప్రధానః సర్వేశ్వరేణాఽప్రతిమేన తేన ॥ 11

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
చతుర్థతామస మన్వంతర వర్ణనం నామ ఏకోనాశీత్యధిక శతతమోఽధ్యాయః.

శాంబరాయణి యిట్లనియె. తామసమనువు కొడుకులు జానుజంఘుడు, శాంతభయుడు, నయుడు, ఖ్యాతి, నరుడు, ప్రియభృత్యుడు అవిక్షిత్తు ప్రస్థిలుడు దృఢేషుధి కృతుడు కృతగంధుడు అనువారు. ఈతని మన్వంతరమందు సప్తర్షులు ఋషియగు వనుడు కఠీయస్ గాత్రుడు చైత్రుడు అగ్ని జ్యోతిర్వాసుడైన పృథువు కార్యుడు ననువారు. సత్యులు సుపాదులుసురిహులు హరులుననునీనాల్గు దేవతాగణములు ఇందొక్కొక్కదానియందు ఇరువది యైదుమంది దేవతలున్నారు సత్యులనువారిలోగూడ సత్యులు విశ్వులు నను రెండు భేదములు గలవు; సత్యులు పండ్రెండుగురు. విశ్వులు పదుముగ్గురు! వారికి ప్రతాపవంతుడు మహాతేజస్వియగు శిబి యింద్రుడై యుండెను; ఆతనికి జ్ఞాతులు బాంధవులు ఘోరులైన యసురులున్నారు. వారికి రాజు భీమరథుడను ప్రభువు; అతడు బ్రహ్మను ప్రసన్నునిం జేసికొని నేలయందు మథింప బడకుండునట్లు వరము బొందెను. అది మొదలా దుష్టుడు నీటిలో నివాస మొనరించెను. అతడు ఒక మరుభూమిలో (నిర్జల ప్రదేశములో) నొక పర్వతాకారమగు తాబేలుం జూచెను. ఆదుర్మతి వేడుక పడి యా కూర్మము మీదికెక్కెను. భగవంతుడు హరి యా కూర్మావతార మూర్తి వాని నెత్తికొని వేగముగ పాతాళ జలములం బ్రవేశించెను. వాని నా నీటిలో ముంచి గొప్ప కూర్మ శరీరముతో నా మహాకాయుని నాక్రమించి చంపి వేసెను. సాటిలేని దేవదేవుడగు నా విష్ణుని శత్రువైన యా భీమరథుడు నీటిలో నా సర్వదేవప్రధానుడైన కూర్మముచే గూల్పబడెను.

ఇది శ్రీవిష్ణు ధర్మోత్తర మహాపురాణమందు ప్రథమఖండమున
నాల్గవ తామస మన్వంతర వర్ణనమను నూటడెబ్బదితొమ్మిదవ అధ్యాయము.

## నూటయెనుబదియవ అధ్యాయము - ఐదవరైవతమన్వంతర చరిత్ర

శాంబరాయణీ : రైవతస్య మనోః పుత్రాన్ పంచమస్య నిబోధమే । మహాపురాణః సంభావ్యః ప్రత్యంగః పరహా శుచిః ॥
చల బిందు ర్నిరామిత్రః కేతు శృంగో దృఢవ్రతః । రైవతస్య మనోః పుత్రా ఋషయః తస్యవచ్మితే ॥ 2
వేదశ్రుతి ర్వేదబాహు రూర్ధ్వబాహు ర్యజు స్తథా । హిరణ్యరోమా పర్జన్యః సత్యనేత్ర స్తథైవచ ॥ 3
ఆభూతరాజసశ్చైవ తథా దేవాః సుమేధసః । వైకుంఠా శ్చామృతాశ్చైవ చత్వారో దేవతాగణాః ॥ 4
ఏకైకస్మిన్ గణేదేవాః కథితాస్తు చతుర్దశ । తేషామింద్రో విభుర్నామ లోకేవిఖ్యాత విక్రమః ॥ 5
ఆసం స్తస్యాఽసురా ఘోరా స్తదా దాయాద బాంధవాః । తేషా మాసీన్మహాతేజాః శంభుర్నామ మహేశ్వరః ॥ 6
బ్రహ్మలోకేన మరణం వృతం యేన పితామహాత్ । స కదాచి న్మహాకాయః సముద్రజల చారిణమ్ ॥ 7
హంసం దృష్ట్వైవ జగ్రాహ తంచారోహతి దుర్మతిః । ఆరూఢమాత్ర మాదాయ బ్రహ్మలోకం జగామ సః ॥
హంసరూపేణ తత్రైవ జఘాన భగవాన్ హరిః ॥ 8
ఏవం స హంసేన హతో మహాత్మా । సర్వేశ్వరేణాప్రతిమేన తేన ।
మహాబలః పర్వతతుల్యకాయః । సురాంతకారీ సమరే ష్వజేయః ॥ 9

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే ఇంద్ర శాంబరాయణీ సంవాదే
పంచమ రైవత మన్వంతర వర్ణనంనామ అశీత్యధిక శతతమోఽధ్యాయః.

శాంబరాయణి యనియె : రైవతమనువైదవవాడు. అతని కొడుకులు మహాపురాణుడు సంభావ్యుడు ప్రత్యంగుడు పరహంత శుచి చలబిందువు నిరామిత్రుడు కేతుశృంగుడు దృఢవ్రతుడు నను వారు. అతని సప్తర్షులు వేదశ్రుతి వేదబాహువు ఊర్ధ్వబాహువు యజువు హిరణ్యరోముడు పర్జన్యుడు సత్యనేత్రుడు అనువారు. అతని దేవగణములు నాల్గు. ఆభూత రాజసులు సుమేధసులు వైకుంఠులు అమృతులు నను వారు. ఒక్కొక్క గణమందు పదునాల్గుమంది పంతున దేవతలు సెప్పబడినారు. వారికి విభుడను పేరుగలవాడు ప్రఖ్యాతపరాక్రముడింద్రుడు. అతనికి ఘోరులయిన యసురులు దాయాదులు బాంధవులు గలరు. మహాతేజస్వియగు శంభువను మహేశ్వరుడు వారికి ప్రభువు. ఆయన బ్రహ్మవలన బ్రహ్మలోక మరణముం గోరెను. దుర్మతియై అతడొకప్పుడు సముద్రజలమందు తిరుగు మహాకాయముగల హంసను జూచి పట్టుకొని దానిపైకెక్కెను. ఎక్కినదేతడవుగ వానింగొని యాహంస బ్రహ్మలోకమేగెను. హంసరూపియై యా విష్ణువే వానిం గూల్చెను. ఆ మహాత్ముడు మహాబలుడు పర్వతాకారుడు సురాంతకుడు సమరములం దజేయుడునగు శంభువు అప్రతిముడైన యా విష్ణువుచే నిహతుడయ్యెను.

ఇది శ్రీ విష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమునందు యైదవ రైవత మన్వంతరచరిత్రయను
నూటయెనుబదవ యధ్యాయము.

## నూటఎనుబదిఒకటవ అధ్యాయము - చాక్షుషమన్వంతర వర్ణనము

శాంబరాయణీ : చాక్షుషస్య మనోః పుత్రాన్ షష్ఠస్యశృణు వాసవ । ఉరుః పురుః శతద్యుమ్నః తపస్వీ సత్యవాన్ ధృతిః ॥
అగ్నిష్టుదతి రాత్రశ్చ సుద్యుమ్నశ్చ తథాఽనఘః హవిష్మానున్నతః శ్రీమాన్ సుధామా విజయ స్తథా ॥ 2
అభిమానః సహిష్ణుశ్చ మధుశ్రీః ఋషయః స్మృతాః । ఆద్యాః ప్రసూతా భావ్యాశ్చ లేఖాశ్చ పృథుకా స్తథా ॥ 3

అష్టకాశ్చ గణాః పంచ తదాప్రోక్తా దివౌకసామ్ । తేషాం మనోజవో నామ బభూవేంద్రః ప్రతాపవాన్ ॥ 4
ఆసంస్తస్యాఽసురా ఘోరా స్తదా దాయాదబాంధవాః । యేషాం బభూవ నృపతిః మహామాలో బలాధికః ॥ 5
సకదాచి ద్వనం యాతో మృగయాం పాప నిశ్చయః । తత్ర చంద్రాంశు సంకాశం దదర్శాఽశ్వం మనోహరమ్ ॥ 6
తమారురోహ దుర్బుద్ధిః మృగాఘాత చికీర్షయా । తమారూఢం సమాదాయ తదా వేగాత్తురంగమః ॥ 7
గత్వా పారే సముద్రస్యచిక్షేపోపరి దుర్మతిమ్ । క్షిప్తమాత్రః సదుర్బుద్ధిః పవనేనావవాహితః ॥ 8
అనాసాదితతోయశ్చ పవనేన స తూహ్యతే । అద్యాపి సుమహాతేజా లోకాలోకస్య బాహ్యతః ॥ 9
అమృత్యు వరదానేన సతుపాపః స్వయం భువః । వాయు మార్గం సమాశ్రిత్య నతుప్రాణైర్వియుజ్యతే ॥ 10
ఏవం స ఘోరో వరదాన దర్పా దమృత్యు రస్మీతి కృతాపరాధః ।
దేవద్విజానాం హయరూపధారీ చిక్షేప విష్ణుః పవన ప్రవాహే ॥ 11

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
షష్ఠచాక్షుష మన్వంతర వర్ణనంనామ ఏకాశీత్యధిక శతతమోఽధ్యాయః.

శాంబరాయణి యనియె : ఆరవ చాక్షుషమనువు పుత్రులు ఊరువు పూరువు శతద్యుమ్నుడు తపస్వి సత్యవంతుడు ధృతి అగ్నిష్టుత్తు అతిరాత్రుడు సుద్యుమ్నుడు అనువారు, హవిష్మంతుడు, ఉన్నతుడు, శ్రీమంతుడగు సుధాముడు విజయుడు, అభిమానుడు సహిష్టుడు మధుశ్రీ ఋషభుడు అనువారు సప్తర్షులు. ఒక్కొక్క గణములో నెనమండుగురు దేవతలుగలరు. ఆద్యులు ప్రసూతులు భావ్యులు లేఖులు పృథుకులు అను దేవగణములైదు గలవు. వారికి మనోజవుడనువాడింద్రుడు ప్రతాపవంతుడు. అతనికి జ్ఞాతులు బంధువులు ఘోరాసురులుండిరి. బలాధికుడైన మహాబలుడనువాడు వారికి రాజు. వాడొకనాడు పాపమతియై వేటకై యొక తరి వనమునకేగెను. అక్కడ చంద్రకిరణమట్లున్న చక్కని గుఱ్ఱమును జూచెను. దుర్బుద్ధియైన యాతడు మృగములం జంపు తలంపున నాగుఱ్ఱమెక్కెను. ఆయెక్కినవానింగొని యా తురంగమము వేగమున బరుగెత్తి సముద్రతీరమున నాతని పడగొట్టెను. పడగొట్టినమాత్రన నా దుష్టుడు వాయువుచే మోసికొనిపోబడెను. వాయువు వానిని నీరు కనబడనిచోటికి మోసికొనిపోయెను. లోకాలోక పర్వతము వెలుపల నిప్పుడును నామహాతేజస్వి చావులేకుండ బ్రహ్మవలన నొందిన వరముచే వాయుమార్గమందున్నాడు. వాని ప్రాణములు పోలేదు,

ఈవిధముగా నా ఘోరుడు వరదాన గర్వముచే దేవబ్రాహ్మణులకపరాధము సేసియు చావకిప్పటికినున్నాడు. హయమూర్తి దాల్చి విష్ణువు వానిని వాయుప్రవాహమందు విసరివైచెను.

ఇది శ్రీ విష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున యారవ చాక్షుషమన్వంతరవర్ణనమను
నూట యెనుబదియొకటవ యధ్యాయము.

## నూటఎనుబదిరెండవ అధ్యాయము - సప్తమవైవస్వత మన్వంతరవర్ణనము

శాంబరాయణి : అథాఽన్యస్య భవిష్యస్య మనోర్వైవస్వతస్యచ । సప్తమస్య ప్రవక్ష్యామి తస్య పుత్రాన్ యశస్వినః ॥ 1
ఇక్ష్వాకు రథ నాభాగో విష్ణుః శర్యాతి రేవచ । అవృధ్యతు స్తథా ప్రాంశు ర్మహాత్మా దిష్ట ఏవచ ॥ 2
కరూషశ్చ పృథుధ్రశ్చ సుద్యుమ్నశ్చ మనోః సుతాః । అత్రి ర్వసిష్ఠో భగవాన్ జమదగ్నిశ్చ కాశ్యపః ॥ 3
గౌతమశ్చ భరద్వాజో విశ్వామిత్రోఽథ సప్తమః । దేవాహ్యేకోన పంచాశ న్మరుతః పరికీర్తితాః ॥ 4
ద్వావశ్వినౌ వినిర్దిష్టౌ విశ్వేదేవా స్తథా దశ । దశైవాంగిరసో దేవా హ్యేవం దేవగణానవ ॥ 5

యేషాం శక్రస్తు మోజంబీ నామ్నా శత్రుభయంకరః । ఘోరా స్తథాపి యే త్వాసన్ దైత్యాదాయాదబాంధవాః ॥ 6
తేషాం బభూవ నృపతిః హిరణ్యాక్షో మహాబలః । నృవరాహేణవపుషా తం జఘాన హరిః పురా ॥ 7
దైత్యేశ్వరం తం సుర సంఘభీమం మహాబలం పర్వత మాత్రకాయమ్ ।
జఘాన చక్రేణ హరిః ప్రసహ్య రూపం సమాశ్రిత్య వరాహ శీర్షమ్ ॥ 8

ఇతి శ్రీ విష్ణు ధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
సప్తమవైవస్వత మన్వంతర వర్ణనంనామ ద్వ్యశీత్యధిక శతతమోऽధ్యాయః.

శాంబరాయణి యనియె : ఇక కాబోవు వైవస్వతమనువేడవవాడు. ఆయశస్వి కుమారులు ఇక్ష్వాకువు నాభాగుడు విష్ణువు శర్యాతి అవృధ్యతువు ప్రాంశువు దిష్టుడు కరూషుడు పృథుధ్రుడు సుద్యుమ్నుడు అనువారు. అత్రి వశిష్ఠభగవానుడు జమదగ్ని కశ్యపుడు గౌతముడు భరద్వాజుడు విశ్వామిత్రుడు ననువారా మనువు కాలమందు సప్తర్షులు దేవతలు నలుబదితొమ్మిదిమంది మరుత్తులనబడుదురు. అశ్వినీదేవత లిద్దరు విశ్వేదేవతలు పనిమంది ఆంగిరసులను దేవతలు పదిమంది. వీరు దేవగణములు తొమ్మిది. వీరి కింద్రుడు మోజాంబి యను పేరుగలవాడు శత్రుక్షయంకరుడు. ఘోరులు దైత్యులతనికి దాయాదులు బంధువులునై యుండిరి. వారికి రాజు హిరణ్యాక్షుడు మహాబలుడు. నరవరాహావతారమెత్తి హరి వానిం గూల్చెను. సురసంఘభయంకరుని మహాబలశాలిని పర్వతమాత్రశరీరు నాదైత్యేశ్వరుని హరి వరాహశీర్షావతారమెత్తి చక్రముచే సంహరించెను.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున సప్తమ వైవస్వత మన్వంతర వర్ణనమను
నూటయెనుబదిరెండవ అధ్యాయము.

## నూటఎనుబదిమూడవ అధ్యాయము - అష్టమసావర్ణ మన్వంతర వర్ణనము

శక్రః ఉవాచ: అస్మిన్ కల్పే మహాభాగే భవిష్యా మనవస్తుయే । తేషాం పుత్రా న్నృషీన్ దేవాన్ శక్రదాయాద బాంధవాన్ ॥
తస్య ఘాతం తథా కృష్ణాత్ సర్వమేతత్ ప్రకీర్తయః సర్వజ్ఞ కల్పాభవతీ దివ్యజ్ఞానా మతామమ ॥ 2
శాంబరాయణీ - అష్టమస్య భవిష్యస్య సావర్ణస్య మనోః సుతాన్ । కథయిష్యామి తే శక్రః మహాబల పరాక్రమాన్ ॥ 3
విజయ శ్చావరీ వాంశ్చ నిర్మోహ స్సత్య వాక్కృతిః । చరిష్ణు శ్చాప్యధృష్ణుశ్చ వాచ స్సమతి రేవచ ॥ 4
సావర్ణస్య మనోః పుత్రాన్ ఋషీంశ్చైవ నిబోధమే । అశ్వత్థామా కృపో వ్యాసోగాలవో దీప్తిమా నథ ॥ 5
ఋష్యశృంగ స్తథారామ ఋషయః పరికీర్తితాః । సుతపా అమృతాభాశ్చ ఆత్రేయాశ్చ గణాస్త్రయః ॥ 6
సర్వే విశంతిభిర్దేవ గణైర్యుక్తా మహాత్మనామ్ । యేషా మింద్రో భవిష్యస్తు బలిర్దానవ సత్తమః ॥ 7
త్వత్కృతే దేవదేవేన బద్ధో యస్త్రిదశేశ్వరః । దాయాదా బాంధవా స్తస్య నభవిష్యన్తి వాసవ ! 8
శక్రత్వం తేన కర్తవ్యం మన్వంతర మకంటకమ్ । దేవదేవ కరన్యస్తం దానమేతన్మహా సురః ॥ 9
త్రైలోక్యరాజా భవతి సావర్ణ స్యాంతరే మనోః । తస్మిన్ మన్వంతరే ప్రాప్తే హిమ శైలాలయో బలీ ॥ 10
భవిష్యతి దురాచారో నానాలో నామరాక్షసః । బ్రహ్మ లబ్ధవరో రౌద్ర స్త్రైలోక్యోత్సాదనే రతః ॥ 11
తం వధిష్యతి ధర్మాత్మా విష్ణుర్గరుడవాహనః । చక్రేణ శతధారేణ జగతాం హితకామ్యయా ॥ 12
దంష్ట్రాకరాళం వికటోగ్రవేషం నీలాంజనాభం భయదం త్రిలోకే ।
చక్రేణ దేవః ప్రవిదార్య కర్తా లోకం సమగ్రం భయ విప్రయుక్తమ్ ॥ 13

ఇతి శ్రీవిష్ణు ధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
శక్రశాంబరాయణీ సంవాదే అష్టమసావర్ణి మన్వంతర వర్ణనం నామ త్ర్యశీత్యధిక శతతమోऽధ్యాయః.

ఓ మహానుభావురాల! ఈ కాలమందు కాబోవు మనువులు వారి పుత్రులు ఋషులు దేవతలు ఇంద్ర శత్రువులు బంధువులు కృష్ణునిచే వారి సంహారము గీర్తింపుము. పూజ్యురాలవు నీవు సర్వజ్ఞవు దివ్యజ్ఞాన సంపన్నవని నా తలంపన శాంబరాయణి యిట్లనియె. అష్టమ మనువు కాబోవు వాడు సావర్ణుడు. విజయుడు, అవీరవంతుడు, నిర్మోహుడు సత్యవాక్కు కృతి చరిష్ణువు ఆధృష్ణువు వాచుడు సుమతి యనువారు సావర్ణ మనువు కుమారులు అశ్వత్థామ కృపుడు వ్యాసుడు గాలవుడు దీప్తిమంతుడు ఋష్యశృంగుడు రాముడనువారు అతనిస ప్తర్షులు. సుతపులు అమృతాభులు ఆత్రేయులు నునవి మూడు దేవగణములు. ఇందు ఇరువది దేవగణములుండును. వీరికింద్రుడు దానవోత్తముడగు బలి కాబోవుచున్నాడు. నీ కొఱకై దేవదేవునిచే నా త్రిభువనేశ్వరుడు బద్ధుడై యున్నాడు. అతనికి జ్ఞాతులుబంధువు లెవ్వరునుండరు. దేవదేవుని చేతిలో నాతడుచేసిన దానమహిమచే నొక్క మన్వంతరమాతడింద్రత్వము న్నిష్కంటకముగ నిర్వహించును. మహాసురుండయ్యు నా చేసిన దానప్రభావముచే త్రిభువనేశ్వరుడుడగును. ఆమన్వంతరము వచ్చినపుడు హిమశైలమందువసించువాడు బలవంతుడుదురాచారుడునగునానోలుడనురాక్షసుడు బ్రహ్మవరములందిరౌద్రుడై ముల్లోకముల నాశనము సేయనెంచును. వానిచే ధర్మమూర్తియను విష్ణువు గరుడవాహనుడై శతధారలుగల చక్రముచే జగద్ధితమునకై ఖండించును. కోరలచే కరాలుడై వికటోగ్రవేషియై నల్లని కాటుక కొండవోలెనున్న త్రిలోక భయంకరుని వానిని స్వామి చక్రమునంజీల్చి సమగ్ర లోకమును భయరహితముం గావించును.

ఇది శ్రీవిష్ణు ధర్మోత్తర మహాపురాణమందు ప్రథమఖండమున
అష్టమసావర్ణుని మన్వంతర వర్ణనమను నూటయెనుబదిమూడవ అధ్యాయము.

## నూటఎనుబదినాల్గవ అధ్యాయము - నవమబ్రహ్మపుత్రమన్వంతరవర్ణనము

శాంబరాయణీ - బ్రహ్మపుత్రస్యతుమనోర్నవమస్య సుతాన్ శృణు । ధృతికేతుర్దీప్తికేతుః పంచహస్తోనిరావృతిః ॥ 1
పృథుశ్రవా బృహద్యుమ్నఋచీకో బృహతాంగణః । బ్రహ్మపుత్రస్య తే పుత్రాః ఋషయశ్చ నిబోధమే ॥ 2
మేధాతిథిర్ద్యుతిశ్చైవ సవనో వసురేవచ । జ్యోతిష్మాన్‌హవ్యసత్యౌచ ఋషయః పరికీర్తితాః ॥ 3
పారామరీచి గర్భాశ్చ స్వధర్మాణశ్చ తేత్రయః । గణాద్వాదశకాః ప్రోక్తా యేషామింద్రో భవిష్యతి ॥ 4
విభుర్నామ మహాతేజాః సర్వ దేవేశ్వరో బలీ । దాయాదా బాంధవాస్తస్యయే భవిష్యన్తి ధార్మికాః ॥ 5
కాలకక్ష ఇతిఖ్యాత స్తేషాం రాజాభవిష్యతి । తస్మిన్ మన్వంతరే రాజా వసునాభో భవిష్యతి ॥ 6
పుత్రస్తు భవితా తస్య వాసుదేవో మహీపతిః । చక్రవర్తీ మహాతేజాః పద్మనాభ ఇతి శ్రుతః ॥ 7
దేవాసురే తు సంగ్రామే కాలకక్షం రణోత్కటమ్ । నరవధ్యం మహాతేజాః పద్మనాభో హనిష్యతి ॥ 8
శరేణ జాంబూనద భూషితేన బ్రహ్మాస్త్ర యుక్తేన రణ ప్రచండమ్ ।
హత్వాఽసురం కాల సమ ప్రభావం రాజా స లోకస్య భయం నిహన్తా ॥ 9

ఇతి శ్రీ విష్ణు ధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
శక్రశాంబరాయణీ సంవాదే నవమ బ్రహ్మపుత్ర మన్వంతర వర్ణనం నామ చతురశీత్యధిక శతతమోఽధ్యాయః.

శాంబరాయణి యిట్లనియె: బ్రహ్మపుత్రుడగు నవమ మనువు యొక్క కొడుకులు - ధృతికేతువు దీప్తికేతువు పంచహస్తుడు నిరాకృతి పృథుశ్రవుడు బృహద్యుమ్నుడు ఋచీకుడు బృహద్గణుడు ననువారు. ఇక సప్తర్షులు-మేధాతిథి ద్యుతి సవనుడు వసువు జ్యోతిష్మంతుడు హవ్యుడు సత్యుడు ననువారు. పారులు మరీచి గర్భులు స్వధర్ములు ననువారు పన్నిద్దరుగల మూడు దేవగణములు. వారికింద్రుడు విభువనునాతడు కాగలడు. మహాతేజస్వి సర్వదేవేశ్వరుడు బలశాలియునగు ఆయన దాయాదులు బాంధవులు ధార్మి

కలు కాలకక్షుడు వారికి రాజగును. ఆ మన్వంతరాధినాధుడు వసులాఖుడగును. ఆతనికి కుమారుడు వసుదేవుడను వాడు. చక్రవర్తి మహాతేజస్వి పద్మనాభుడను పేరొందును. దేవాసురయుద్ధమందు రణప్రచండుడై కాలకక్షుని సరునిచేత వధ్యుడగు వానిని పద్మనాభుడు చంపెను. బంగారముచే భూషితము బ్రహ్మాస్త్రాను సంధితమునైన బాణముచే రణప్రచండుడైన కాలునితో సమమైన ప్రభావముగల యా యసురుని జంపి యా రాజు లోకముయొక్క భయమును హరించును.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణమందు ప్రథమఖండమున
నవమ బ్రహ్మపుత్ర మన్వంతర వర్ణనమను నూటయెనుబదినాల్గవ యధ్యాయము.

## నూటఎనుబదిఐదవ అధ్యాయము - దశమ ధర్మపుత్ర మన్వంతర వర్ణనము

శాంబరాయణీ: ధర్మపుత్రస్యతు మనోర్దశమస్య సుతాన్ శృణుః సుక్షేత్ర ఉత్తమౌజాశ్చ భూరిశోణశ్చ వీర్యవాన్ః 1
శతానీకో నిమిర్మిత్రో వృషసేనో జయ ద్రథః। భూరి ద్యుమ్నః సువర్మాచ ధర్మపుత్ర మనోః సుతాః ॥ 2
ఆపో మూర్తి ర్హవిష్మాంశ్చ మృతికి శ్చావ్యయ స్తథా। నాభాగః ప్రమితిశ్చైవ సౌరభా ఋషయ స్తథా ॥ 3
ప్రాణాఖ్యాః శతసంఖ్యాశ్చ దేవతానాం గణా స్తథా। భవితా తస్య భవితా శాన్తిరింద్రః ప్రతాపవాన్ ॥ 4
దాయాదా బాంధవా స్తస్యభవిష్యం త్యసురాశ్చయే। తేషాంచ భవితా రాజా వాలీ నామ మహాసురః ॥ 5
ద్యోతయిష్యతి తం విష్ణుర్గదయా భీమవేగయా। దేవాసురేతు సంగ్రామే దేవానాం హిత కామ్యయా ॥ 6
గదా నిపాతాభిహతే సురేంద్రే మహాబలే దేవవరేణ తేన
త్రైలోక్యమేతద్భ వితా సమగ్రం వినష్ట దోషం సురవిప్రజుష్టమ్ ॥ 7

ఇతి శ్రీవిష్ణు ధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
శక్రశాంబరాయణీసంవాదే దశమధర్మపుత్ర మన్వంతర వర్ణనం నామ పంచాశీత్యధిక శతతమోఽధ్యాయః.

శాంబరాయణి యనియె. ధర్ముని కుమారుడగు పదియవమనువు కుమారులు సుక్షేత్రుడు ఉత్తమౌజుడు భూరిశోణుడు శతానీకుడు నిమిమిత్రుడు వృషసేనుడు జయద్రథుడు భూరిద్యుమ్నుడు సువర్మ అనువారు. ఆపోమూర్తి, హవిష్మంతుడు, మృతికి (సత్కృతియని పాఠాంతరము) అవ్యయుడు నాభాగుడు ప్రమితి, సౌరభుడు ననువారు ఆమన్వంతర మందలి సప్తర్షులు ప్రాణులనెడు నూరుమంది దేవతాగణము అప్పుడు శాంతియను ప్రతాపవంతు డింద్రుడగును. అతనికిజ్ఞాతులు బాంధవులు నసురులు. వారికి వాలియను మహాసురుడు రాజగును (వారియనిపాఠాంతరము) విష్ణువు వానిని దేవా సుర సంగ్రామమందు దేవతలకు హితమొనరింప వానిని భయంకర వేగముగల గదచేగూల్చును. అట్లు వానింగూల్చినంత ముల్లోకము దోషమెల్లపోయి దేవతలతోను విప్రులతోను గూడి కలలాడును.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణమందు ప్రథమఖండమున దశమ ధర్మపుత్రమన్వంతర వర్ణనమను
నూట యెనుబది యైదవయధ్యాయము

## నూటఎనుబదియారవ అధ్యాయము - పదునొకండవ మన్వంతరకథ

శాంబరాయణీ: రుద్రపుత్రస్యతేపుత్రాన్ వక్ష్యామ్యేకాదశస్యతు। ధర్మనిత్యాన్ మహాభాగాం స్త్రైలోక్యస్య పరాయణాన్ ॥
సర్వత్రగః సుశర్మాచ సేనానీకః పురోద్ధతః। క్షేమధన్వా దృఢేంద్రశ్చాదర్కః పుండ్రక స్తథా ॥ 2
మనుపుత్రా స్మృతా హ్యేతే ఋషయశ్చ నిబోధమే। హవిష్మాంశ్చ వపుష్మాంశ్చ వరుణాబ్ధిశ్చ నిస్తరః ॥ 3

విష్ణు శ్చైవాగ్ని తేజాశ్చ ఋషయ స్సప్త కీర్తితాః । నిర్మధ్యా రథయ శ్చైవ కామగాశ్చ గణా స్త్రయః ॥ 4
త్రింశ త్త్రింశ త్తథా దేవాః ఏకైకస్మిన్ గణే స్మృతాః । తేషా మిందో వృషోనామ భవిష్యతి మహాబలః ॥ 5
దాయాదా బాంధవాశ్చైవ భవిష్యన్తి సురాశ్చయే । తేషాంతు భవితారాజా దశగ్రీవః ప్రతాపవాన్ ॥ 6
ఘాత యిష్యతి తం విష్ణుః స్త్రైణంరూప ముపాశ్రితః । శూలాగ్రేణ వినిర్భిద్య రణే దేవాసురే తదా ॥ 7
తమవధ్యం దురాధర్షం పురుషాణాం స్వయంభువా । గతం తపః ప్రభావేన విష్ణుస్తం ఘాతయిష్యతి ॥ 8
నీలోత్పలాభం తపనీయ వర్ణం సువృత్త జానూరుయుగం స్వరూపమ్ ।
రూపం స్త్రియాశ్చారు తరం స కృత్వా సురారి ముగ్రం సహసాఽరిహన్తా ॥ 9

ఇతి శ్రీ విష్ణు ధర్మోత్తరే ప్రథమఖండే ఏకాదశ మన్వంతర వర్ణనం నామ
షడశీత్యధిక శతతమోఽధ్యాయః

శాంబరాయణిప్లనియె. పదునొకొండవ మనువు ఆను రుద్రుని పుత్రుల జెప్పెదవినుము. ఆయన పుత్రులు ధర్మనిత్యులు ముల్లోకములకు పరమాశ్రయులు మహానుభావులు వారు సర్వత్రగుడు, సుశర్మ, సేనానీకుడు, పురోద్ధతుడు, క్షేమధన్వుడు దృఢేంద్రుడు, అపర్యుడు పుండ్రకుడు ననువారు. ఇక సప్తర్షులు హవిష్మంతుడు వపుష్మంతుడు వరుణుడు, అర్ధిస్తరుడు విష్ణువు, అగ్నితేజుడు ననువారేడుగురు. నిర్మథ్యులు రథులు(రథిః = ఇకారాంతము)కామగులునను మూడుదేవగణములు. ఒకగణములో ముప్పది మందిపంతున దేవతలుందురు. వారికింద్రుడు వృషుడను నాతడు బలశాలి. ఆయన దాయాదులు బంధువులు సురులు. వారికి రాజు దశగ్రీవుడు. బ్రహ్మచే పురుషులకు నవధ్యుడగు వానిని విష్ణువు స్త్రీరూపము ధరించి దేవాసుర సంగ్రామమందు శూలముచే జంపగలడు. విష్ణువు నల్లగలువవన్నెగలమేను బంగారుమట్లుండు సువృత్తములయిన(గుండ్రమైన)మోకాళ్ల తొడలునుగల చక్కని స్త్రీ రూపముందాల్చి తపః ప్రభావముచే బ్రహ్మవలన పురుషులచే నవధ్యత్వము ఓర్వరాని విక్రమము వరముగా బడసిన యాదేవవైరిని మహోగ్రుని సాహసమున జంపగలడు.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణమందు ప్రథమఖండమున పదునొకండవమనువువర్ణనమను
నూటయెనుబది యారవ యధ్యాయము.

## నూటఎనుబదిఏడవ అధ్యాయము - పండ్రెండవమనువు దక్షపుత్రుని చరిత్ర

మనోస్త్వం దక్షపుత్రస్య ద్వాదశస్యాత్మజాన్ శృణు । దేవవానుపదేవశ్చదేవశ్రేష్ఠో విదూరథః ॥ 1
మిత్రవాన్ మిత్రదేవశ్చ మిత్రసేనశ్చ వీర్యవాన్ । మిత్రబాహుః సువర్చాశ్చ దక్షపుత్ర మనోః సుతాః ॥ 2
సత్తమోద్యోర్ద్యుతి శ్చైవ తపనః సుతపా స్తథా । తపోరతి స్తపస్వీచ ఋషయ స్సప్తకీర్తితాః ॥ 3
సుశర్మాణః సుతపసో హరితా రోహితా స్తథా । సుతారాఖ్యా గణాః పంచ ప్రత్యేకం దశకో గణః ॥ 4
ఋతధామా చ ధర్మాత్మా తేషా మిందః ప్రతాపవాన్ । దాయాదా బాంధవా స్తస్య భవిష్యన్త్యసురా శ్చయే ॥ 5
తేషాం చ భవితా రాజా నరకో నామ నామతః । స్త్రీపుంసోః స త్వవధ్యశ్చ వరదానాత్ స్వయం భువః ॥ 6
హరి ర్నపుంసకో భూత్వా ఘాతయిష్యతి తం తదా । 7
దేవాంతకం కాల సమగ్రభావం మహాసురం క్లీబవపుర్మహాత్మా ।
నిహత్య తం లోక మిదం సమగ్రంభీత్యా విహీనం భగవాన్ స కర్తా ॥ 8

ఇతి శ్రీవిష్ణు ధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
ద్వాదశస్య దక్షపుత్రస్య మనోర్వంశాను కీర్తనం నామ సప్తాశీత్యధిక శతతమోఽధ్యాయః.

శాంబరాయణియనియె. దక్షుని కొడుకు పంద్రెండవమనువు. అతని పుత్రులుదేవవంతుడు ఉపదేవుడు దేవశ్రేష్ఠుడు విదూరథుడు మిత్రదేవుడు మిత్రసేనుడు మిత్రబాహువు సువర్చుకు ననువారు. సత్తముడు ద్యోమ్యోతి, తపనుడు, సుతపుడు, తపోరతి, తపస్వియనువారు సప్తర్షులు సుశర్మలు సుతపసులు హరితులు రోహితులు సుతారకులననునైదు దేవగణములు ఒక్కొక్క గణమందు పదిమంది దేవతలుందురు. ప్రతాపశాలి ధర్మాత్ముడునైన ఋతధాముడు వారి కింద్రుడగును. అతనికి దాయాదులు బంధువులు నసురులు. వారికి రాజు నరకుడు బ్రహ్మవలన నీతడుస్త్రీపురుషుల కవధ్యుడయ్యెను. హరి నపుంసకుడై వానిని జంపగలడు. దేవాంతకుడు కాలునివంటి ప్రభావముగలవాడు మహాసురుడునగు నరకుని హరిక్లీబరూపమునగూల్చి యీయశేషలోకమునకు భగవంతుడభయము నొసంగును.

ఇది శ్రీ విష్ణుధర్మోత్తర మహాపురాణమందు ప్రథమఖండమున పంద్రెండవ మనువు ధర్మపుత్రుడు ఋతధాముని చరిత్రమను నూటయెనుబది ఏడవ యధ్యాయము.

## నూటఎనుబదిఎనిమిదవ అధ్యాయము - త్రయోదశ మనువగు రౌచ్యునికథ

శాంబరాయణీ: త్రియోదశస్య రౌచ్యస్య మనోఃపుత్రాన్నిబోధమే । చిత్రసేనో విచిత్రశ్చ నయోధర్మభృతో ధృతిః ॥ 1
సునేత్రో వృక్షవృద్ధిశ్చ సునయో ధర్మయో దృఢః । రౌచ్యస్యైతే మనోః పుత్రాః శృణుష్వఋషయో మమ ॥ 2
ధృతి మానవ్యయ శ్చైవ నిష్ప్రకోపో నిరుత్సుకః । నిర్మాణ స్తత్వ దర్శీచ దయయా తవకీర్తితాః ॥ 3
సుత్రామాణః సుధర్మాణః శుభ కర్మాణ ఏవచ । ఏతే శక్ర! తదాప్రోక్తాః దేవతానాం గణాస్త్రయః ॥ 4
ఎకైకస్మిన్ గణే దేవా ఏకాదశ తదాశుభాః । దేవేంద్రశ్చ తదా తేషాం భవిష్యతి బృహస్పతిః ॥ 5
దాయాదా బాంధవాస్తస్యయే భవిష్యన్తి వాసవః । టిట్టిభో నామ దుష్టాత్మా తేషాం రాజా భవిష్యతి ॥ 6
తస్యాపి భవితా మృత్యుః దేవదేవా జ్జనార్దనాత్ । మాయూరేణ చరూపేణ సతతం పన్నగాశినా ॥ 7
సతు దేవాసురే యుద్ధే సర్పరూపేణ దుర్మతిః । యుద్ధం కృత్వా నిరుత్సాహాన్ సర్వాన్ దేవగణాం స్తథా ॥ 8
నిష్ప్రయత్నేషు దేవేషు మాయూరం రూపమాశ్రితః । ఘాతయిష్యతి తం దుష్టం దేవదేవో జనార్దనః ॥ 9
మహా కలాపః సశిఖీ మహాత్మా ప్రబుద్ధ నీలోత్పల చారుకంఠః ।
తం దానవం తత్ర రణే ప్రసహ్యహత్వా త్రిలోకీం ముదితాం హి కర్తా ॥ 10

ఇతి శ్రీ విష్ణుధర్మోత్తరే ప్రథమఖండే త్రియోదశరౌచ్యక మన్వంతర వర్ణనోనామ అష్టాశీత్యధిక శతతమోఽధ్యాయః.

శాంబరాయణీ యనియె. రౌచ్యుడనునతడు పదమూడవ మనువు అతని పుత్రులు చిత్రసేనుడు విచిత్రుడు నయుడు ధృతి సునేత్రుడు వృక్షవృద్ధి సునయుడు ధర్మయుడు దృఢుడు ననువారు ఋషులు ధృతిమంతుడు అవ్యయుడు నిష్ప్రకోపుడు నిరుత్సుకుడు నిర్మాణుడు తత్వదర్శియు ననువారు. సుత్రాములు సుధర్ములు శుభకర్ములు ననువారప్పుడు దేవగణములు. ఒక్కొక్క గణమందు పదకొండుమంది పుణ్యాత్ములుందురు. బృహస్పతి వారికింద్రుడగును. అతనికి దాయాదులు బంధువులు నుందురు. దుష్టుడు టిట్టిభుడనువాడు వారికిరాజుఆగును వానికికూడ దేవదేవుడగు జనార్దనునివలన మృత్యువగును. అపుడు విష్ణువు నెమలి రూపముదాల్చి వానినిజంపును. వాడు దేవాసుర సంగ్రామమందు సర్పరూపియై యుద్ధము సేసి దేవతలను నిరుత్సాహులనొనరించును. దేవతలు ప్రయత్నశూన్యులుకాగా మయూర రూపధారియైహరి సర్పరూపుడైనవానింజంపును. పెద్దపురి చక్కనిశిఖ నిండైన నల్లగలువ వన్నెకల మెడయుంగల నెమలి రూపుబూని యాదానవునిజంపి విష్ణువు త్రిలోకములను ఆనందపరచును.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణమందు ప్రథమఖండమున పదుమూడవ మనువు రౌచ్యుని చరిత్రమను నూటయెనుబది యెనిమిదవ యధ్యాయము.

## నూటఎనుబదితొమ్మిదవ అధ్యాయము - చతుర్దశభౌత్యమనువర్ణనము

శాంబరాయణీ: చతుర్దశస్య భౌత్యస్య శృణు ః పుత్రాన్మనోర్మమ । తరంగో భేద భిద్బుధ్న్య స్తరస్వా న్నుగ్రఏవచ ॥ 1
అభిమానీ ప్రవీరశ్చ జిష్ణుః సంక్రందన స్తథా । తేజస్వీ సులభశ్చైవ భౌత్యస్యైతే మనో స్సుతాః ॥ 2
అగ్నీధ్ర శ్చాతిబాహు శ్చ మాగధశ్చ తథా శుచిః । అజితో యుక్తగోఽశక్యో ఋషయస్సప్త కీర్తితాః ॥ 3
చాక్షుషాశ్చ కనిష్ఠాశ్చ పవిత్రా భజిరా స్తథా । వయోవృద్ధా దేవగణాః పంచప్రోక్తాస్తు సప్తకాః ॥ 4
తేషామింద్రః శుచిర్నామ తస్య దాయాద బాంధవాః । యే భవిష్య న్ని భవితా రాజా తేషాం మహాసుఖః ॥ 5
దివ్యం వర్షసహస్రం తు యుద్ధం దేవాసురం తదా । భవిష్యతి మహాఘోరం తస్యాన్తే తం మహాసురమ్ ॥ 6
ఆస్థితం తామసీం మాయాం ఘాతయిష్యతి కేశవః । ఆరూఢం కుంజరం భీమం చరత్పర్వత సన్నిభమ్ ॥ 7
ఉత్థాత పర్వత సమం చక్రేణ మధుసూదనః । రథస్థం తం మహాదైత్యం ఘాతయిష్యతి దుర్మతిమ్ ॥ 8
తస్మిన్ హతే వాసవ దేవశత్రౌ మహాబలే కాల సమప్రభావే ।
త్రైలోక్యమేతద్విరుజం సమన్తాత్ తదా భవిష్యత్యమర ప్రతాపమ్ ॥ 9

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే చతుర్దశ భౌత్య మనువర్ణనంనామ నవాశీత్యధిక శతతమోఽధ్యాయః.

శాంబరాయణియనియె. పదునాల్గవమనువు భౌత్యుడు. ఆయన కొడుకులు తరంగుడు భేదభిత్తు బుధ్న్యుడు తరస్వంతుడు ఉగ్రుడు అభిమాని ప్రవీరుడు జిష్ణువు సంక్రందనుడు తేజస్వి సులభుడు ననువారు. అగ్నీధ్రుడు అతిబాహువు మాగధుడు శుచి అజితుడు యుక్తగుడు అశక్యుడు ననువారు సప్తర్షులు. చాక్షుషులు కనిష్ఠులు పవిత్రులు, భజిరులు, వయోవృద్ధులు, ననునైదు దేవ గణములు. వానిలో నేడేసిమంది దేవతలుందురు. వారికింద్రుడు శుచియనువాడు. ఆయనకు దాయాదులు బంధువులు నుందురు. వారికి రాజు మహాసుఖుడు. దేవాసురులకు వేయి దివ్య సంవత్సరములు ఘోరయుద్ధము జరుగును. అందు తామసమాయను బూని యుద్ధముసేయు నామహాసురుని నడచు పర్వతమువంటి కోరాడుపర్వతమువంటి దివ్యకుంజరమెక్కి చని రథమందున్న యా దైత్యుని దుర్మతిని హరిగూల్చును. దేవేంద్రశత్రువు వాసు మహాబలుకు కాలసమప్రభావుడు హతుడైనంత నీ లోకమంతట బాధలు తొలగి యమర ప్రతాపవంతముగాగలదు.

ఇది శ్రీవిష్ణు మహాపురాణమందు ప్రథమఖండమున పదునాల్గవభౌత్యమను వర్ణనమను నూటయెనుబది తొమ్మిదవ యధ్యాయము.

## నూటతొంబదియవ అధ్యాయము - అనేకవిష్ణుప్రాదుర్భావము

శక్రః: అస్మిన్ మన్వంతరే భద్రే గరుడస్య చ సంభవః । మయాదృష్ట మతీతేషు కథం గరుడవాహనః ॥ 1
అసురాన్ ఘాతయామాస భవిష్యేష తథైవచ । గరుడం తు సమారుహ్య ఘాతయిష్యతి తత్కథమ్ ॥ 2
మన్వంతరాంతే సర్వేషాం క్షయో యస్మాత్ప్రకీర్తితః । తస్మా దేతన్మమాచక్ష్వ కుశలాహ్యాసి ధార్మికా ॥ 3
శాంబరాయణీ : దేవానామసురాణాంచ ప్రతిమన్వంతరం యథా । సంభవస్త్రిదశశ్రేష్ఠ ! గంధర్వాణాం తథా స్మృతః ॥ 4
నాగానాం రాక్షసానాంచ యక్షాణా మథ పక్షిణామ్ । సువర్ణానాం తత్ర శక్ర ! ప్రాణినా మప్యశేషతః ॥ 5
సువర్ణానాం ప్రధానస్తు తత్ర మన్వంతరే తదా । సదైవ రాజన్ ! భవతి గరుడః పతతాం వరః ॥ 6

వాహనత్వే తథాతస్య దేవేశస్య ప్రపద్యతే । ప్రాదుర్భావాణ్యథోక్తాని యథా విష్ణోర్మయా తవ ॥ 7
తథైవ తస్యజ్ఞేయాని గరుడస్య మహాత్మనః । దేవాస్తు కృతకర్మాణః శక్ర ! మన్వంతర క్షయే ॥ 8
త్యక్తాధికారా గచ్ఛన్తి పరలోక మితః ప్రభో ! తల్లింగాశ్చ తథా మంత్రా స్తైరేవ సహితాస్సురైః ॥ 9
సమూహశ్చైవ మంత్రాణాం దేవశ్రీ దశపూజితః । శరీరీ బ్రహ్మసదనే సతు నిత్యః ప్రకీర్తితః ॥ 10
యావజ్జీవతి వై బ్రహ్మా సర్వలోక నమస్కృతః । తదా తు పురుషం బ్రహ్మా దేవదేవం ప్రపద్యతే ॥ 11
త్యక్త్వా శరీరం దేవోఽపి పురుషం ప్రతిపద్యతే । పురుషోఽపి మహాస్సృష్టిం మహాభూతగణం తథా ॥ 12
కరోతి తద్వదేవేహ దేవః ప్రాగ్వచ్ఛత క్రతో ! ఏవం సర్వమిదం నిత్యం త్వనిత్యం వా తవేరితమ్ ॥ 13
నాఽసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః । ఉభయోరపి దృష్టోఽన్తస్త్వనయో స్తత్త్వదర్శిభిః ॥ 14
అవినాశితు తద్విద్ధి యేన సర్వమిదం తతమ్ । వినాశ మవ్యయస్యాస్య న కశ్చిత్కర్తు మర్హతి ॥ 15
తస్యాఽవినాశినః శక్ర ! సూక్ష్మస్యాపి మహాత్మనః । ప్రాదుర్భావ సహస్రాణి సమతీతా న్యనేకశః ॥ 16
భూయశ్చైవ భవిష్యన్తి నాత్రకార్యా విచారణా । వైవస్వతేఽస్మిన్ దేవేశ ! యథా మన్వంతరే శుభే ॥ 17
ప్రాదుర్భావాని దృష్టాని మయాతస్య మహాత్మనః । వరాహం వామనం చైవ తథా శక్ర ! త్రివిక్రమమ్ ॥ 18
నారసింహం తథా మాత్స్యం కూర్మం హంసం తథైవచ । నృవరాహం తథా రామం రామం చ సురసత్తమ ! 19
మాంధాతారం పృథుంచైవ కార్తవీర్యార్జునం తథా । ధాతారం చ తథా మిత్రం చాంశు మర్యమణం తథా ॥ 20
పూషణం చ భవన్తం చ వరుణం భగమేవచ । త్వష్టారం చ వివస్వంతం సవితారం తథైవ చ ॥ 21
విష్ణుం చంద్రమసం రుద్రం బ్రహ్మాణం యమమేవచ । హుతాశనం వైశ్రవణం శేషం నాగేశ్వరం తథా ॥ 22
గ్రహముఖ్యం బుధంచైవ ఆపః ఖం పృథివీ తథా । వాయుస్తేజశ్చ దేవేశ ! తథైవాన్యాని వాసవ ! 23
ప్రాదుర్భావ సహస్రాణి తస్యదృష్టాని యానితే । మన్వంతరే ష్వతీతేషు తస్యాఽతీతా న్యనేకశః ॥ 24
భవిష్యన్తి భవిష్యేషు శతశోఽథ సహస్రశః । మన్వంతర మథాసాద్య చైవమేకం తథా తవ ॥ 25
ప్రాదుర్భావ మిదంప్రోక్తం ద్విగుణం ద్విగుణం యతః । ప్రాదుర్భావా స్యశేషేణ వాసుదేవస్య చక్రిణః ॥
కస్సమర్థో భవేద్వక్తు మిహ వర్షశతైరపి. 26
ఏకస్సదేవో భువనస్య గోప్తా పరః పురాణః పురుషోమహాత్మా ,
తస్యాంశ మాత్రం భువనం సమగ్రం భాగాత్త్రయ స్తస్య నవర్ణనీయాః . 27

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయవజ్రసంవాదే అనేకవిష్ణుప్రాదుర్భావ
వర్ణనంనామ నవత్యధిక శతతమోఽధ్యాయః.

ఇంద్రు డిట్లడిగెను : కల్యాణీ! శాంబరాయణీ. ఈ మన్వంతరమందుగదా గరుడుడుదయించుట నేను జూచితిని. అతీత మన్వంతరములందు గరుడవాహనుడెక్కడున్నాడు. గరుడునెక్కి యసురుల లోగడ జంపెను. ముందును జంపగలడంటివి. ఇదెట్లు కుదురును. మన్వంతరము తుద నందరు క్షయింతురని చెప్పబడినదే. నీవు ధార్మికవిషయకుశలవు. కావున నానతిమ్మన శాంబరాయణి యిట్లనెను. ప్రతి మన్వంతరమందును దేవాసురులు గంధర్వులు నాగులు పక్షులు గరుడులు మున్నగు సశేష ప్రాణులు పుట్టుచునే యుండును. సుపర్ణుల కధినాథుడు కూడ యట్లేమన్వంతరమందెల్లపుడు పుట్టుచునేయుండును. ఆయన దేవదేవుడగు విష్ణువునకు వాహనమగుచునేయుండును. అదేవిధముగా విష్ణువుయొక్క యవతారములను నేను నీకు జెప్పితిని. అట్లే మహాత్ముడగు గరుడుని యవతారములు. దేవతలు తమపని నిర్వహించికొని మన్వంతరక్షయమందు స్వాధికారములను విడిచి యట నుండి పరలోకమున కేగుదురు. ఆయా దేవతా లింగములైన మంత్రములు గూడ యా దేవతలతో వారేగుదురు. ఆయా మంత్రముల సమూహ స్వరూ

వుడు దేవతా పూజితుడైన దేవుడు శరీరియై మూర్తిధరించి బ్రహ్మసదన మందుండును. అతడు నిత్యుడని కీర్తింపబడినాడు. సర్వలోకనమస్కృతుడైన బ్రహ్మ జీవించియున్నంతకాలము ఆదేవదేవుడైన పురుషుని బొందియుండును. బ్రహ్మ కాలాంతమందాతడు శరీరము విడిచి యాపురుషుని యందు జేరును. ఇంద్రా! ఆపురుషుడును మహాసృష్టిని మహాభూతగణమును ముంగటి యట్లు మహిమం బదే రూపమున సృష్టించును. ఇట్లే సర్వము నీకు నిత్యము అనిత్యమునుంగా రెండుతెఱగులని నీకు దెల్పితిని. లేనిదాని కునికిలేదు ఉన్నదానికి లేమి లేదు. ఈ రెండింటికిని తుదిచూచినారు. తత్త్వదర్శులైనవారు. దేని చే యెల్లనిండినదది నశింపనిదని యెఱుంగుము. అవ్యయమైన (అవినాశియైన) దీని కెవ్వడును వినాశముం గూర్పజాలడు. ఆయవినాశి వస్తువు సూక్ష్మము. మహాసుభవము ఆ పురుష వాచ్యమైన వస్తువున కనేక సహస్ర ప్రాదుర్భావములైనవి. ఇంకను ముందు కానున్నవి. అందు విమర్శ చేయవగదు. ఈ వైవస్వత మన్వంతర మందో పుణ్యురాల! ఆ మహాత్ముని యవతారము లేను జూచితిని. వరాహము వామనము (త్రివిక్రమమన్నమాట) నారసింహము మాత్స్యము కూర్మము హంసావతారము నరవరాహము రామము (పరశురామము) రామము (దశరథరామము) మాంధాత పృథుచక్రవర్తి కార్తవీర్యార్జునము ధాత (బ్రహ్మ) మిత్ర అంశు, అర్యమ పూష వరుణ భగత్వష్ట వివస్వంతులను సవిత విష్ణువు చంద్రుడు రుద్రుడు బ్రహ్మ యముడు అగ్ని వైశ్రవణుడు (కుబేరుడు) శేషుడు (నాగేంద్రుడు) గ్రహముఖ్యుడైన బుధుడు జలము పృథివి వాయువు తేజస్సు మఱియుంగలవి యన్నియు నా దేవదేవుని పురుషోత్తముని యవతారములే. వాని నెల్ల నేను జూచితిని. అతీత మన్వంతరములందెన్నో గడచినవి, ముందు రానున్నవి. మన్వంతర మొక్కొక్కటి ననుసరించి వాసుదేవునవతారము లెట్టించి రెట్టించి వచించితిని. వంచవీండ్లైన హరి సర్వావతారముల నెవ్వడు వచింప సమర్థుడు? ఆదేవుడొక్కడే భువనగోప్త (లోకరక్షకుడు) పురాణ పురుషుడు మహాత్ముడు. సర్వభువన మాయన యొక్క భాగము మాత్రము. ఆయన తక్కిన మూడు భాగములు వర్ణింప నలవి గానివి.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణమందు ప్రథమఖండమున
విష్ణు ప్రాదుర్భావ విశేషవర్ణనమను నూటతొంబదియవ యధ్యాయము.

## నూటతొంబదిఒకటవ అధ్యాయము - శక్రశాంబరాయణీయ కథ

శక్రః: కేనకర్మ విపాకేన స్వర్గతా త్వం వరాననే: దీర్ఘకాల మిహస్థాఽసి తథాచైవా ప్యనాగతాన్ ॥ 1
కథం మన్వంతరాన్వేత్సి ? తన్మమాచక్ష్వ పృచ్ఛతః । త్వత్సమా దివినైవాన్యా కాచిదస్తి చిరంత నీ॥ 2
ఏకరూపః కథం కర్తా త్వయాదృష్టః సురేశ్వరి : మన్వంతరాణాం జానాసి భవిష్యాణాం తథాగతిమ్ ॥ 3
శాంబరాయణీ: త్రిదివే సప్తమఃకల్పో మమాఽయం త్రిదివేశ్వర : దేవదేవ ప్రసాదేన వసన్త్యా వర్తతేఽనఘ ॥ 4
పరార్ధశ్చ తథాబ్రాహ్మో జనలోకే గతామమ । ఏకరూపా స్తథాకల్పా మయాదృష్టాః సురేశ్వర ! 5
మన్వంతరాణాం జానామి భవిష్యాణాం తథాగతిమ్ । మయా మానుష్య మాసాద్య మాసనక్షత్ర పూజనమ్ ॥ 6
ప్రతిమాసం కృతంవిష్ణో ర్యావజ్జీవం సురేశ్వర : తేనకర్మ విపాకేన త్రిదివే వసతిశ్చిరమ్ ॥ 7
మయేయం సమనుప్రాప్తా దేవదేవ ప్రసాదజా । అస్మాదపి మహాభాగ : బ్రహ్మలోకం నయత్యుత ॥ 8
మార్కండేయః : ఏతదుక్త్వా మహాభాగ: శక్రంసా శాంబరాయణీ। జగామా దర్శనం రాజన్: తత్రైవ సురపూజితా ॥ 9
మాసర్క్షపూజా మధికృత్య విష్ణో ర్మయా తదేవం కథితం సమగ్రమ్ ।
తస్మా త్ప్రయత్నేన నరేంద్రచంద్ర : మాసర్క్షపూజాం ప్రయతేత కర్తుమ్ ॥ 10

శ్రోతవ్యమేతత్ప్రయతేన వజ్ర! పాపాపహం ధర్మ వివృద్ధిదం చ ।
సంవాద మగ్ర్యం త్రిదశేశ్వరస్య సిద్ధాంగనాయాశ్చ పరం పవిత్రమ్ ॥ 11

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయవజ్రసంవాదే శక్ర శాంబరాయణీ
కథానకంనామ ఏకోననవత్యధిక శతతమోఽధ్యాయః.

ఇంద్రుడు నీవే కర్మపరిపాకముచేతనో సుముఖి స్వర్గమున కేగితివి. దీర్ఘ కాలమిక్కడ నుంటివి. అనాగతములయిన మన్వంతరగతుల నీవెట్లు తెలిసికొనుచున్నావు. అడుగుచున్న నాకు నానతిమ్ము. దేవి! నీతో సమురాలింకొకతె చిరంతని (సనాతని) లేనేలేదు. ఓ సురేశ్వరీ! నీకు జగత్కర్త ఏక రూపుడుగనెట్లు గనబడెను? భవిష్యమన్వంతరముల గతినెట్లు ఎరుంగుచున్నావన శాంబయణి యిట్లనియె: ఓ త్రిదివాధీశ్వరా! స్వర్గ మందెప్పుడు నాకు సప్తమ కల్పము జరుగుచున్నది. ఇది దేవదేవుని ప్రసాదమున నైనది. నాకు పరార్ధ కాలము సగము కల్పకాలములన్నియు నేకరూపములయి కనబడినవి. అట్లే భవిష్య మన్వంతరముల గమనమేను తెలిసి కొనుచున్నాను. నేను మనుష్య జన్మమొంది విష్ణుదేవునకు మాసనక్షత్ర పూజ ప్రతి మాసము యావజ్జీవము గావించితిని. ఆ కర్మ విపాకముచే చిరకాలము త్రిదివ (స్వర్గ) నివాసము నాకు దేవదేవుని ప్రసాదమున లభించినది. అది ఇట నుండి నన్ను బ్రహ్మలోకమునకుం గొంపోవును అని ఇంత పలికి ఆ మహానుభావురాలు (శాంబరాయణి) దేవపూజితయై యక్కడనే యంతర్ధాన మందెను. నేను విష్ణువు మాసనక్షత్ర పూజను గురించి సమగ్రముగ వచించితిని. కావుననో నరేంద్రచంద్ర! నీవు కూడ మాస నక్షత్ర పూజ గావింప ప్రయత్నము సేయుము. ఓ వజ్రప్రభూ! ఇది పాపాపహము ధర్మ విపృద్ధిప్రదము త్రిదశేశ్వరునికి సిద్ధాంగనకు జరిగిన పరమోత్తమ సంవాదము పరమ పవిత్రము శ్రద్ధమెయి వినవలసినది.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణమందు ప్రథమఖండమున
శక్ర శాంబరాయణీకథ యను నూటతొంబదియొకటవ యధ్యాయము.

## నూటతొంబదిరెండవ అధ్యాయము - విష్ణు స్తుతి మహిమానువర్ణనము

వజ్రః శ్రుతవానస్మి ధర్మజ్ఞ! దేవవేశ్మోపలేఖనే । ఫలం గదతి తే బ్రహ్మన్ ! శ్రోతు మిచ్ఛామ్యహం పునః ॥ 1
లేపనాదపి యత్స్వర్గ ఫలదంచ యథాభవేత్ । తన్మేకర్మ త్వమాచక్ష్వ సర్వజ్ఞోఽసి భృగూత్తమ ! 2
మార్కండేయః : స్తుతి ర్లఘుతరా తస్యలేపనాదపి యాదవ ! తథా బహుఫలాప్రోక్తా తాం కురుష్వ యదీచ్ఛసి ॥ 3
యే స్తువన్తి మహాదేవం శంఖచక్ర గదాధరమ్ । తేషాం న దుర్లభం కించిదిహాలోకే పరత్రచ ॥ 4
వాసుదేవం స్తువన్ మర్త్యః సర్వపాపం వ్యపోహతి । స్వర్గంచానన్త్య మాప్నోతి నాత్రకార్యా విచారణా ॥ 5
ధర్మార్థీ ప్రాప్నుయా ద్ధర్మ మర్థార్థీ చాప్నుయాద్ధనమ్ । కామాన వాప్నుయాత్కామీ ప్రజార్థీ ప్రాప్నుయాత్ప్రజాః ॥ 6
రోగార్తో ముచ్యతే రోగాద్బద్ధో ముచ్యేత బంధనాత్ । భయాన్ముచ్యేత భీతశ్చ ముచ్యేతాపన్న ఆపదః ॥ 7
దుర్గాణ్యతితరత్యాశు పురుషః పురుషోత్తమమ్ । స్తువన్ మనుజశార్దూల! నాత్రకార్యా విచారణా ॥ 8
తస్మాత్సర్వ ప్రయత్నేన దివ్యైః ఋషికృతైః స్తవైః । స్తూయాన్నరేంద్ర! సతతం దేవదేవం సుభాషితైః ॥ 9
కమలపత్ర శుభామర లోచనం హరి మరిఘ్న మచింత్య పరాక్రమమ్ ।
శరణమేత్య మహాభయ పీడితా భువి భవన్తి నరా భయవర్జితాః ॥ 10

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయవజ్రసంవాదే స్తుతిమాహాత్మ్య
వర్ణనంనామ ద్వినవత్యధిక శతతమోఽధ్యాయః.

మార్కండేయ ప్రభూ! ధర్మజ్ఞ! దేవాలయోపలేపనఫలము నీవానతీయ నేనాలించితిని. బ్రహ్మజ్ఞా! ఇంకనునేను విన గోరెదను లేపనముకంటెను స్వర్గఫలదమైనది మరియేమి పనియో నాకానతిమ్మ. భృగువంశోత్తమా నీవు సర్వజ్ఞుడవు అని వజ్రుడన విని మార్కండేయుడనియె. యాదవా! లేపనముకంటెను నావిష్ణువుయొక్క స్తుతి మిక్కిలి ఫలప్రదమగా పెద్దలచే బలుకబడినది. నీవిష్టపడేదేని యది నీవుసేయుము. శంఖచక్రగదాధారియైన హరినిస్తుతించువారికి లభింపనిదొకటి యిహమందును బరమందుగూడలేదు. మర్త్యుడు వాసుదేవుని స్తుతించి సర్వపాపముల బాయును. ఆనంతస్వర్గముంబొందును. ఇటువిమర్శ సేయ దగదు. పురుషోత్తముని స్తుతించు నాతడు ధర్మముంగోరునేని ధర్మమును అర్థము గోరునేని యర్థమును కామ పురుషార్థము కోరు నేని కామములను సంతానముంగాంచును. రోగి రోగముక్తుండగును. బద్ధుడు బంధముక్తినందును. భయస్థుడు భయమెడలును. ఆపన్ను డాపదలంగడుచును. దుర్గములను దరించును ఇందు విచారణసేయ నవసరములేదు కావున దివ్యస్తుతులచే ఋషి ప్రోక్తములయిన వానిచే సర్వ ప్రయత్నముల చేత సుభాషితములచే (మంచిమాటలచే) దేవ దేవుని కమలలోచనుని శత్రు సంహారణుని ఆచింత్యపరాక్రముని హరిని స్తుతించుచు శరణొంది భువిలో మహాభయపీడనందినవారు భయవివర్జితులగుదురు.

ఇది శ్రీ విష్ణుధర్మోత్తర మహాపురాణమందు ప్రథమఖండమున స్తుతిమహిమాను వర్ణనమను నూటతొంబది రెండవ యధ్యాయము

## నూటతొంబదిమూడవ అధ్యాయము - గంధర్వశాపమోక్షణము

మార్కండేయః : అత్రాఽప్యుదాహరన్తీమ మితిహాసం పురాతనమ్ । స్తుతేన దేవ దేవేన గజేంద్రస్యతు యత్కృతమ్ ॥ 1
పురా వజ్ర మహాబాహో గంధర్వాయో హాహాహూహూ । గీతేః పరస్పరం స్పర్థా చక్రతుస్తౌ పర న్తపః 2
స్పర్ధమానౌ పరం రాజన్! చక్రతుస్తౌ పరస్పరమ్ । ఆవయోః ప్రాశ్నిక స్సాధుః కోఽస్మిన్‌లోకే భవిష్యతి ॥ 3
తయోరథాహుర్గంధర్వా దేవలోఽయం భవిష్యతి । ఏవముక్తౌ తతస్తౌతు నేచ్ఛేతాం దేవలం మునిమ్ ॥ 4
నాఽయంజానాతి గీతస్య విశేషమితి మోహితౌ । తౌ శశాప మహాక్రుద్ధో దేవలః సుమహాతపాః ॥ 5
అవజ్ఞా జానతో యస్మాద్భవద్భ్యాం మమవై కృతా । తస్మాచ్ఛాపం ప్రదాస్యామి యువయోర్దేవగాయనౌః 6
హాహాభవిష్యతి కరీ, హూహూ నక్రోభవిష్యతి । నక్రంచ దేవ దేవేశో గజాకర్షణ తత్పరమ్ ॥ 7
నాగస్తుతస్తు చక్రేణ ద్విధాకర్తాతదాయువామ్ । ఉభౌ స్వం లప్స్యథోరూపం శాపస్యాన్తేతు గాయనౌ ॥ 8
శాపేన తౌ తస్య తతస్తుజాతౌ మయాయథోక్తౌ తవరాజసింహ!
గజస్తుతేనాపి జనార్దనేన సమ్మోచితౌ తౌద్విజ వర్యశాపాత్ ॥ 9

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే గంధర్వయోర్గజ నక్రీ కరణం నామ త్రినవత్యధిక శతతమోధ్యాయః.

మార్కండేయుడిట్లనియె : ఈయెడ పురాతనేతిహాస మొకటి పెద్దలుదాహరింతురు. దేవదేవ వర్ణనము నొక గజేంద్రము సేసి చెందిన విశేషమిది. మున్ను హాహా హూహూ గంధర్వు లిద్దరు మహాపరాక్రములు. ఒక పాటనుగూర్చి పరస్పరము తగవు లాడికొనిరి. మాకు సాధువైన ప్రాశ్నికుడు (తీర్పరి) లోకములో నెవ్వడు గలుగు నన గంధర్వులు ఇదిగో దేవలుండున్నాడనిరి. కాని వారతనినిష్టపడరైరి. వీనికి గీత విశేషము తెలియదని పొరబడిరి. ఆతడు క్రుద్ధుడై తపస్విగావున వారిని మీరు నా సంగతి తెలియక యవమానముసేసినారుకావున మిమ్మిదిగో శపించుచున్నాను, హాహా యనువా డేనుగగును. హూహూ యనువాడు మొసలి కాగలడు. ఏనుగు నాకర్షించు మొసలిని విష్ణువు గజముచే బొగడబడి చక్రముచే రెండుగావించును. అప్పుడు మీరిద్దరు శాపము

చివర స్వరూపమందుదురు. దేవలుని శాపముచే వారిరువురు నే జెప్పినట్లయిరి. విష్ణుని స్తుతించిన యేనుగు శాపవిముక్తి నందెను. మొసలి చక్రాయుధముచే హతమై శాపమోక్షమందెను.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున గంధర్వ శాపమోక్షణమను నూటతొంబదిమూడవ యధ్యాయము.

## నూటతొంబదినాల్గవ అధ్యాయము - గజేంద్ర మోక్షణము

వజ్రః : భగవన్! శ్రోతుమిచ్ఛామి గజేంద్రస్య విమోక్షణమ్ । విస్తరేణ మహాభాగ! శాపాన్నక్రస్య చోభయోః ॥ 1
మార్కండేయః : అస్త్యస్మిన్ శృంగవాన్నామ జంబూద్వీపే కులాచలః ।
మహాధాతు సమున్నద్ధైర్యుతః శృంగైర్నభంకషైః ॥ 2
యస్య శృంగత్రయం మధ్యంభాతి రాజన్! విశేషవత్ । బ్రహ్మార్క సోమనిలయం మనోహారి దివంగతమ్ ॥ 3
తేషా మథైకం సౌవర్ణ మపరం రాజతం మహత్ । సర్వరత్నమయం చైకం మధ్యమం బ్రహ్మణః క్షయమ్ ॥ 4
కాంచనం సూర్యనిలయం రాజతం శశినః క్షయమ్ । త్రికూటం శైలరాజాభం రత్నపక్షద్రుమైర్యుతమ్ ॥ 5
నతత్ కృతఘ్నాః పశ్యన్తిన నృశంసా ననాస్తికాః । నాఽతప్త తపసః కేచిన్నైవ పాపకృతో జనాః ॥ 6
తస్యసానుమతః పృష్ఠేసరో వ్యాకోశ పంకజమ్ । కారండవ సమాకీర్ణం రాజహంసోపశోభితమ్ ॥ 7
సచ్చిత్తమివ గంభీరం సచ్చిత్తమివ నిర్మలమ్ । బహూపయోగ్యం చతథా సతాం నిష్కృతి కృన్నృప ! 8
మీనచ్ఛిన్నాభ్రశకల స్ఫుటకల్హార తారకమ్ । మహాకుముద రాత్రీశం ద్వితీయ మివచాంబరమ్ ॥ 9
ఉత్ఫుల్ల పద్మరజసా మధుపైఃపరి పింజరైః । సమంతాద్వ్యాప్య సత్పద్మం తపనీయ సమైరివ ॥ 10
చ్యుతేన పద్మా ద్రజసా హంసైఃకేసర మంథనైః । వాయునా భ్రామ్యమాణేన దుర్విభావ్యోదకాంబుజమ్ ॥ 11
మహాన్తః పద్మినీ పత్రాః వాయుభ్రస్తాభ్ర శీకరైః । యుక్తా ముక్తాఫలాకారైర్యత్ర భాన్తి సహస్రశః ॥ 12
నృత్యన్తి కమలా యత్ర శఫరీస్ఫురణాహతాః । భ్రమరోద్గీత సంఘోషై రసత్సారసనాదితమ్ ॥ 13
హసన్తమివ హంసౌఘైర్నృత్యంతమివ చోర్మిభిః । ఉద్గీథమివ కుర్వాణం కారండవరవైః శ్శుభైః ॥ 14
మధ్యేత్వగాధం చతుర ప్రతీహారై రివోద్ధతైః । ఉత్సారయంతం కల్లోలై ర్వాయుక్షిప్త ద్రుమోద్భవాన్ ॥ 15
భ్రమరాంతర సంలీన కల్హారకు సుమాక్షిభిః । పశ్యన్త మివ శైలస్య శృంగాణాంతన్మహోచ్ఛ్రయమ్ ॥ 16
యత్రాఽతి శీతలం తోయంలఘుస్వాదు సుధానిభమ్ । అన్యచ్ఛృంగం మనోహారి భృంగనాద నినాదితమ్ ॥ 17

వజ్రుండు గజేంద్రమోక్షణకథ వినవలతునన మార్కండేయుడిట్లు వచింపదొడగె ఈ జంబూద్వీపమందు శృంగవంత మను కులపర్వతమున్నది. అందుమధ్య నింగినొరయు మూడు శిఖరములు మహాధాతు సమున్నద్ధము లుండుటచే దాని కాపేరు వచ్చినది అందునడుమనున్న శిఖరము సర్వరత్నమయ మైనది బ్రహ్మసదనము. బంగారు శిఖరము సూర్యునిది. అందు వెండి శిఖరము చంద్రనిలయము. త్రికూట శైలరాజమట్లు రత్నమయములయిన పార్శ్వద్రుమములతోనున్నది. ఆ త్రికూటమును కృతఘ్నులు నాస్తికులు తపస్సుచేయని వారు పాపాత్ములు గానలేరు. ఆశైలముమీద వికసిత పద్మాకర మొకటిగలదు. కారండవములతోను రాజహంసలతోనది రాజిల్లును. ఆసరస్సు సాధువులచిత్తమట్లు లోతైనది. నిర్మలము సత్పురుషుల కుపకారము మిక్కిలి యుపయుక్తమును మీనములచే (చేపల కదలికలవలన) విభక్తమయిన మేఘఖండములతోను నక్షత్రములవంటి వికసించిన ఎఱ్ఱతామర పూలతో మీనరాశి నక్షత్రపుంజముచే విభక్తమయిన మేఘశకలములనడుమ ప్రస్ఫుటముగా కహ్లారములవంటి (ఎఱ్ఱతామర పూవంటి) నక్షత్రములుగలది శ్లేషాలంకారము పెద్ద పెద్ద తెల్లతామరపూవులనెడి చంద్రబింబములుగలది యై రెండవ యాకాశమాయన్నట్లు ఆ

సరస్సు స్వచ్ఛమై ప్రకాశించుచుండును. వికసించిన తామరపూల పుప్పొడిచే పరిపింజరమయిన (పుప్పొడి రంగుచే నలముకొని) బంగారు తుమ్మెదలా అన్నట్లున్న తుమ్మెద లెల్లెడ వ్యాపింప నింపొసగు పద్మములతో గూడినదై సొంపుగుల్కును తామరపూలలోని కేశరములనట్టిట్లు హంసలు కదల్పగా జారిన పద్మములందలి పుప్పొడిని వాయువట్టిటు చిమ్మ తరి నీరేదో తామర పూవులేవో తెలియరానట్లా కమలాకర మాశ్చర్యమొదవించుచుండెను. పెద్దపెద్ద పద్మినీ పత్రములు (తామరాకులు) వాయువు విదలించిన మేఘములనుండి జారిన వర్షపుతుంపురులచే ముత్యాలతో గూడినవాయన్నట్లా సరస్సున భాసిల్లుచుండెను. చేపలకదలికల వలన తాకిడిపడి తుమ్మెదలగాన ఘోషములతో కమలము లందు నృత్యము సేయుచుండును. భ్రమరగీతములచే కలహంసల కలకలారావములచే తూర్యనాదములు నెరపుచు నృత్యముచేయుచున్నట్లు హంసల గుంపుచే నవ్వుచున్నట్లు కెరటములచే నృత్యము చేయుచున్నట్లు బెగ్గురులకూతలచే బాటపాడుచున్నట్లు నా సరస్సు వింతసొగసుగొల్పుచుండెను. ఉద్ధతులైన ద్వారపాలకుల చేతంబోలె కెరటములచే నడుమ లోతై వాయువుచే కదల్పబడిన వృక్షశాఖలందలి పక్షుల నట్టిట్టు చెదరగొట్టుచున్నదియు లోన తుమ్మెదలు వ్రాలిన ఎఱ్ఱ తామర పూలనెడి కన్నులచే నాపర్వత శృంగములయొక్క యెత్తుం దిలకించుచున్నదియు నట్లున్న సరస్సు నాతడు చూచెను. అందలి నీరు చల్లగ తేలికగ నమృతమట్లు తియ్యనిది తుమ్మెదల ఝుంకారముల బ్రతిధ్వనించు మరియొక శృంగము (శిఖరము) కూడ యక్కడ మనోహరమై యున్నది.

తస్మిన్సరసి దుష్టాత్మా విరూపోఽన్తర్జలేశయః । హూహూర్జగామ గ్రాహత్వం శాపాద్దైవదేవలస్యతు ॥ 18
తస్మిన్నేవ తథాశైలే హాహా గంధర్వసత్తమః । బభూవ యూథపోహస్తీ చలత్పర్వత సన్నిభః ॥ 19
అథ దన్తోజ్జ్వలవపుః కదాచిద్గజయూథపః । ఆజగామ మహీపాలః చోత్ఫుల్ల కమలం సరః ॥ 20
వంశదండైః సకలభైర్వృతశ్చైవ కరేణుభిః । వాసయన్ మదగంధేన తం త్రికూటం మహీధరమ్ ॥ 21
సగజోఽంజన సంకాశోమదా కుంచిత లోచనః । సలీలం పంకజవనే యూథమధ్యగతో వ్రజమ్ ॥ 22
గృహీతస్తేన రౌద్రేణ గ్రాహేణా వ్యక్తమూర్తినా । పశ్యతః సర్వయూథస్య క్రోశతశ్చాతి దారుణమ్ ॥ 23
సచకార మహాయత్న మాత్మనః పరిమోక్షణే । గ్రాహోఽపి యత్న మాతిష్ఠ త్కుంజరాకర్షణే మహాన్ ॥ 24
గ్రాహోఽపి బలినంనాగం నశశాక మహాంభసి । ఆక్రష్టుం నచనాగోఽపి తథాత్మానం విమోక్షితుమ్ ॥ 25
విస్ఫూర్జ్యంచ యథాశక్తి నిక్రుష్యచ మహారవాన్ । వ్యథితః స నిరుద్యోగః పశ్చిమా మాగతో దశామ్ ॥ 26

ఆసరస్సునందు నీటిలో దుష్టుడగు హూహూ గంధర్వుడు రూపువాసి దేవలుని శాపముచే మొసలియై యుండెను. అదే పర్వతమందు హాహానామ గంధర్వోత్తముడు గజయూథపతియై నడచుచున్న పర్వతమట్లు సంచరించుచుండెను. ఆ గజరాజు దంతములచే మిక్కిలి దీపించు నాకృతితో నొకనాడా వికసిత పద్మాకరమునకేగెను. వెదురుకఱ్ఱలం దొండములం గొనియున్న పిల్లయేనుగులతో నాడయేనుగులతో గూడి మదగంధముచే నా త్రికూటగిరిని పరిమళింపజేయుచు నంజనపర్వతమట్లు మదముచే గన్నులు మూతపడ గజసంఘము నడుమనుండి యా పద్మవనమందు సవిలాసముగ నడచుచు నా రౌద్రాకారమయిన కరి యాలోన గనరాకున్న మొసలిచే గజయూథమట్టె చూచుచుండ దారుణముగ నాక్రోశించుచుండ పట్టుపడెను. మొసలి పట్టునుండి తనను విడిపించుకొనుట కెంతేని ప్రయత్నమొనరించెను. మొసలయు నాగరాజును లోనికి దిగుచుట కెంతేని యత్నపడుచుండెను. ఆ పెనునీట నా గ్రాహము బలియైన యా గజరాజును లోనికి లాగజాలదయ్యె. నా గరాజును నట్లే తన నా పట్టునుండి విడిపించుకొనజాలదయ్యె. యథాశక్తి విదళించుకొని పెనగిపెనగి ఘీంకరించుచు వ్యథచెంది చేయునదిలేక యత్నముడిగి యవసానదశకు వచ్చెను.

సతునాగవరః శ్రీమన్నారాయణ పరాయణః । జగామ శరణం విష్ణుం తుష్టావచ పరంతపః ॥ 27
గృహీత్వాస కరాగ్రేణ సరసః కమలోత్తమమ్ । నివేద్యభక్త్యా కృష్ణాయ గజః స్తోత్రముదైరయత్ ॥ 28

గజః : నమోనమః కారణ వామనాయ నారాయణాయాసుర దారణాయ ।
శ్రీశార్ఙ్గచక్రాసి గదాధరాయ నమోఽస్తుతస్మై పురుషోత్తమాయ ॥ 29
ఆద్యాయ వేదనిలయాయ మహోరగాయ సింహాయ దైత్య నిలయాయచతుర్భుజాయ ।
బ్రహ్మేంద్రరుద్రముఖ చారణ సంస్తుతాయ దేవోత్తమాయ వరదాయ నమోఽచ్యుతాయ ॥ 30
నాగేంద్రభోగ శయనాసన సుప్రియాయ గోక్షీరహేమ శుక నీల ఘనోపమాయ ।
పీతాంబరాయ మధుకైటభ నాశనాయ భక్తప్రియాయ వరదీప్త సుదర్శనాయ ॥ 31
నాభి ప్రజాత కమలస్థ చతుర్ముఖాయ క్షీరోదకార్ణవ నికేత యశోధరాయ ।
నానా విచిత్ర ముకుటాంగద భూషణాయ సర్వేశ్వరాయ విజయాయన మోనరాయ ॥ 32
విశ్వాత్మనే పరమకారణ కారణాయ ఫుల్లారవింద విపులాయత లోచనాయ ।
దేవేంద్ర భావన పరీక్షిత పౌరుషాయ యోగీశ్వరాయ విజయాయ నమోవరాయ ॥ 33
లోకాయనాయ త్రిదశాయనాయ బ్రహ్మాయణాయాత్మగుణాయనాయ ।
ధర్మాయణాయైక జనాయనాయ మహావరాహాయ సదా నతోఽస్మి ॥ 34

ఆ గజరాజు నారాయణపరాయణుడై (విష్ణువుకంటె దిక్కులేదని) లోగడ పరమతపస్వి కావున నయ్యెడ విష్ణువును శరణందెను. స్తుతించెనుగూడ. ఆ కొలనిలోనుండి యొక కమలరాజముంగైకొని భక్తితో కృష్ణునికి నివేదించి స్తోత్రము సేసెను.

## గజేంద్రకృత స్తవము

ఒకానొక కారణమున వామనుడైన నారాయణున కసురదారణునకు నమస్కారము. శ్రీ శార్ఙ్గ చక్ర ఖడ్గ గదాధరునకు నా పురుషోత్తమునకు నమస్కారము. ఆద్యునకు వేదసదనునకు మహాసర్పమునకు సింహమునకు సర్వ దైత్యలయకారునకు చతుర్భుజునకు బ్రహ్మేంద్రరుద్రమునిచారణ సంస్తుతునికి దేవోత్తమునకు వరదునికి అచ్యుతునకు నమస్కారము. నాగేంద్రుని పడగలపై శయనించుటకు కూర్చుండుటకు ప్రీతిగొనువానికి ఆవుపాలు బంగారము చిలుక ఆకుపచ్చ నల్లని మేఘమును బోలినవానికి పీతాంబరునికి మదుకైటభ నాశనునికి భక్తప్రియునకు మిక్కిలిగ యుద్దీపించు సుదర్శన చక్రము ధరించువానికి బొడ్డుఃం బొడమిన కమలమందు చతుర్ముఖుండుగల వానికి నానారత్నచిత్రిత కిరీటాంగద భూషణధారికి సర్వేశ్వరునికి విజయునికి నరునికి నమస్కారము. విశ్వస్వరూపుడు పరమకారణములయినవానికి గారణమైనవాడు వికసించిన తామరపూవట్లు సువిశాలములైన కన్నులుకలవాడు దేవేంద్రుని భావమున జరిగిన పరీక్షకందని పౌరుషముకలవానికి యోగీశ్వరునికి పరునికి (శ్రేష్ఠునికి) నమస్కారము. లోకములకు పరమగతియైనవానికి ముక్కోటి దేవతలకు దిక్కయినవానికి బ్రహ్మకు గతియైనవానికి ఆత్మగుణములకు (అహింస సత్యము అస్తేయము) బ్రహ్మచర్యము మొదలవానికి బరమగమ్యస్థానమైనవానికి ధర్మగతికి ఏకైక జనునకు మహావరాహమున కెల్లపుడు వినతుండయ్యెద.

అచిన్త్య మవ్యక్త మనన్తరూపం నారాయణం కారణ మాదిదేవమ్ ।
యుగాన్తశేషం పురుషం పురాణం తం వాసుదేవం శరణం ప్రపద్యే ॥ 35
అదృశ్య మచ్ఛేద్య మనాది మధ్యం మహర్షయో బ్రహ్మనిధిం సురేశమ్ ।
వదన్తియం వై పురుషం సనాతనం తం వాసుదేవం శరణం ప్రపద్యే ॥ 36
య మక్షరం బ్రహ్మవదన్తి సర్వగం నిశమ్యయం మృత్యుముఖాత్ ప్రముచ్యతే ।
త మీశ్వరం దృష్ట మనుత్తమైర్గుణైః పరాయణం విష్ణు ముపైతి శాశ్వతమ్ ॥ 37
కార్యక్రియాకారణ మప్రమేయం హిరణ్యనాభం కనకారవిందమ్ ।
మహాబలం వేదనిధిం సురోత్తమం వ్రజామి విష్ణుం శరణం జనార్దనమ్ ॥ 38

అచింత్యుడు అవ్యక్తుడు అనంతరూపుడు నారాయణుడు కారణమయినవాడు ఆదిదేవుడు యుగాంతములందు శేషించువాడు పురాణపురుషుడునైన యా వాసుదేవుని శరణందెదను. కానరానివాడు భేదింపరానివాడు అనాదిమధ్యుడు బ్రహ్మనిధి (వేదముల గని) సురేశుడునని యెవ్వని మహర్షులు వాకొందురట్టి సనాతన పురుషుని వాసుదేవుని శరణు సొచ్చెద. ఎవ్వని నక్షరమైన బ్రహ్మముగా బలుకుదురు సర్వాంతరుడని యెవ్వనివిని ప్రాణి మృత్యుముఖమునుండి విడివడు నా యీశ్వరు నుత్తముడుణ దర్పితుని నారాయణుని శాశ్వతుని విష్ణువునుబొందుదును. కార్యము క్రియ కారణము తానయైనవానిని అప్రమేయుని హిరణ్యనాభుని కనకారవిందుని (బంగారు తామరపూవు చేతనున్నవానినన్నమాట) మహాబలుని వేదములగనిని సురపరుని విష్ణుని శరణొందుచున్నాను.

విచిత్ర కేయూర మహార్హనిష్కం రత్నోత్తమాలంకృత సర్వగాత్రమ్ ।
పీతాంబరం కాంచన భక్తిచిత్రం మాలాధరం కేశవమభ్యుపైమి ॥ 39
భవోద్భవం వేదవిదాం వరిష్ఠం యోగాత్మనాం సాంఖ్యవిదాం వరిష్ఠం ।
ఆదిత్య చంద్రాశ్వివసుప్రభావం ప్రభుం ప్రపద్యేఽచ్యుత మాత్మ భూతమ్ ॥ 40
శ్రీవత్సాంకం మహాదేవం వేదగుహ్య మనుత్తమ । ప్రపద్యేసూక్ష్మమచలం భక్తానా మభయప్రదమ్ ॥ 41
ప్రభవం సర్వలోకానాం నిర్గుణంచ గుణాత్మనామ్ । ప్రపద్యేముక్తసంగానాం యతీనాం పరమాంగతిమ్ ॥ 42
భగవంతం సురాధ్యక్షమక్షరం పుష్కరేక్షణమ్ । శరణ్యం శరణం భక్త్యాప్రపద్యే బ్రాహ్మణ ప్రియమ్ ॥ 43
బ్రహ్మేదేశం త్రిలోకేశ మాద్యమేక మనామయమ్ । భూతాత్మానం మహాత్మానం ప్రపద్యే మధుసూదనమ్ ॥ 44
క్షేత్రజ్ఞం పురుషం విష్ణుం త్రిగుణాతీత మవ్యయమ్ । నారాయణ మణీయాంసం ప్రపద్యే శరణం హరిమ్ ॥ 45
ఏకాయ లోకతంత్రాయ పరతః పరమాత్మనే । నమస్సహస్ర శిరసే అనన్తాయ మహాత్మనే ॥ 46
వరేణ్య మనఘం దేవ మృషయో వేదపారగాః । కీర్తయన్త్యభవం సర్వే తంప్రపద్యే సనాతనమ్ ॥ 47
నమస్తే పుండరీకాక్షః భక్తానా మభయ ప్రద ! సుబ్రహ్మణ్య నమస్తేఽస్తు త్రాహిమాంశరణాగతిమ్ ॥ 48

మణివిచిత్రములయిన బాహుపులును అమూల్యములయిన నిష్కములుదాల్చి మహోత్తమ రత్నాలంకృత సర్వశరీరుని పీతాంబరుని కాంచనభక్తిచిత్రుని (బంగారు కాసులపేరులు మొదలయినవానివే పింతగొల్పువానిని) వనమాలాధరుని (పద్మాల మాల) కేశవస్వామిని శరణందెద. పుట్టినవానికెల్ల మూలమైనవానిని (భవోద్భవుని) వేదవిద్వరిష్ఠుని యోగసాంఖ్యవిద్వద్వరిష్ఠుని ఆదిత్య చంద్ర - అశ్వినీదేవతా వసువుల ప్రభావమెల్ల తానైనవానిని అందరకాత్మయైనవానిని ప్రభువును శరణందెద. శ్రీవత్సాంకుని మహాదేవుని వేదరహస్యమైనవానిని తనకంటె నుత్తముడింకొకడు లేనివానిని సూక్ష్ముని అచలుని భక్తాభయప్రదాతను శరణందెదను. సర్వలోకకారణుని (పుట్టించువానిని) గుణస్వరూపులతో నిర్గుణుడై యుండువానిని (కేవల నిష్కల జ్ఞానమై యుండువాడన్నమాట) సర్వసంగవిముక్తులకు యతులకును బరమగతియైనవానిని భగవంతుని సురాధ్యక్షుని అక్షరుని పుష్కరేక్షణుని (కమలాక్షుని) శరణ్యుడైనవానిని బ్రాహ్మణప్రియుని శరణొందెద బ్రహ్మకాజ్ఞాపకుడైనవానిని త్రిలోకేశుని ఆద్యుని ఒక్కడైనవానిని అనామయుని భూతములకాత్మయైనవానిని మధుసూదనుని మహాత్ముని శరణందెద. క్షేత్రజ్ఞుని (క్షేత్రమనగా ఉపాధి. శరీరము. అందు సాక్షిభూతుడై కేవలజ్ఞానమైయున్నవాడు క్షేత్రజ్ఞుడు) పురుషుని (పురి + తిష్ఠతీతి పురుషః) ఉపాధులందుండువాడు విష్ణువు (విష్వక్ తిష్ఠతీతి విష్ణుః) సర్వాంతర్యామిని త్రిగుణాతీతుని అవ్యయుని నారాయణుని అణీయాంసుని (అణువుకంటెనణువు సూక్ష్మమైనవానిని) హరిని శరణుసొచ్చెద. ఒక్కడైనవానికి లోకతంత్రునికి (లోకరచనసేయువానికి) పరాత్పరునికి సహస్రశిరస్కునికి అనంతునికి మహాత్మునికి నమస్కారము. వరేణ్యుని శ్రేష్ఠుని (వరణీయుని కోరదగినవానిని) అనఘుని దేవునిగ వేదపారగులగు నెల్ల ఋషులు అభవునిగ (పుట్టుకలేనివానిగ) కీర్తింతురా సనాతనుని శరణొందెద. ఓ పుండరీకాక్ష ! నీకు నమస్కారము. భక్తాభయప్రద నీకు నమస్సు. సుబ్రహ్మణ్యా! నీకు నమస్కారము. శరణాగతుని నన్ను రక్షింపుము.

మార్కండేయః : భక్తిం తస్యతు సంచిన్త్య నాగస్యాఽమోఘ సంస్తవమ్ ।
ప్రీతిమానభవ ద్రాజన్! సద్యశ్చక్ర గదాధరః ॥ 49
సాన్నిధ్యం కల్పయామాస గ్రాహం చక్రేణ మాధవః । మోక్షయామాస సగజం పాశేభ్యః శరణాగతమ్ ॥ 50
సహిదేవలశాపేన హాహా గంధర్వసత్తమః । గజత్వ మభవ త్త్యక్త్వా మోక్షం ప్రాప్య దివంగతః ॥ 51
గ్రాహాద్విముక్తస్సద్యస్తు గజోగంధర్వతాం గతః । గ్రాహో గంధర్వతాం ప్రాప్తోయః కృష్ణేననిపాతితః ॥ 52
తస్యాఽపి దేవలకృతః శాపదోషోఽభవత్పురా ।

అని యిట్లు నుతించు నాగన్న భక్తిని తలంచి అమోఘస్తవుడయిన హరి (స్తుతికర్తమైనవాడు) సంప్రీతుడయ్యెను. రాజా! అప్పుడు చక్రగదాధారియై యా గజేంద్రునికి సాన్నిధ్యముంగల్పించెను. మరియు మాధవుడు చక్రముచే గ్రాహమును పట్టు విడిపించెను. ఏనుగును శరణాగతుని పాశముల నుండి విముక్తుం జేసెను. ఆ గజరాజు మున్ను హాహా గంధర్వశ్రేష్ఠుండు దేవల శాపముచే నయిన గజత్వము విడిచి మోక్షమంది దివమందెను. మొసలి జన్మము బాసి కృష్ణునిచే బడిన మొసలి గంధర్వత్వమందెను. మున్ను వానికిని దేవలుని శాపదోషము తగిలినది.

ప్రీతిమాన్ త్రాయతే విష్ణుః సర్వాస్సంసార సాగరాత్ ॥ 53
క్రుద్ధోఽపి నిఘ్నన్ దేవత్వ మరాతీనాం ప్రయచ్ఛతి । తౌచ స్వంస్వం వపుః ప్రాప్య ప్రణిపత్య జనార్దనమ్ ॥ 54
గంధర్వాధిపతీ శీఘ్రం పరాం నిర్వృతి మాగతౌ । ఇదంచైవ మహాబాహో! పురాదేవోఽభ్యభాషత ॥ 55
దృష్ట్వాముక్తౌ గజగ్రాహౌ భగవాన్ మధుసూదనః । యోఽగ్రహీ న్నాగరాజంచ మాంచైవ ప్రణిధానవాన్ ॥ 56
స్మరిష్యతి సరశ్చేదం యువయోర్మోక్షణం తథా । గుల్మం కీచక వేణూనామిమం శైలవరం తథా ॥ 57
అశ్వత్థం భాస్కరం గంగాం నైమిశారణ్య మేవచ । ప్రయాగం బ్రహ్మతీర్థంచ దండకారణ్య మేవచ ॥ 58
సంస్మరిష్యన్తి యేమర్త్యాః సమ్యక్ శ్రోష్యన్తిచాపియే । నతే దుఃస్వప్న పాపస్య భోక్తారో మత్పరి గ్రహాత్ ॥ 59
సర్వపాపైః విమోక్ష్యన్తి కళ్యాణానాంచ భాగినః । భవిష్యన్తితథా పుణ్యాం గతిం యాస్యన్తి మానవాః ॥ 60
దుస్స్వప్నంచ నృణాంతేషాం సుస్వప్నత్వం ప్రయాస్యతి । కౌర్మ్యం మాత్స్యంచ వారాహం వామనం తార్క్ష్యమేవచ॥ 61
నారసింహం తథారూపం సృష్టిప్రళయ కారకమ్ । ఏతాని ప్రాత రుత్థాయ సంస్మరిష్యన్తియే నరాః ॥ 62
సర్వపాపై ర్విశుద్ధాస్తే యాస్యన్తి పరమాంగతిమ్ । మార్కండేయః : ఏవముక్త్వాతు రాజేంద్ర! దేవ దేవో జనార్దనః ॥
అస్పృశద్గజ గంధర్వం గ్రాహ గంధర్వ మేవచ । తేనస్పృష్టౌతుతౌ సద్యోదివ్య మాల్యాంబరాన్వితౌ ॥ 64
విమానేఽభిమతే ప్రాప్తేజగ్మతు స్త్రిదశాలయమ్ । తత్రదేవ పతిః కృష్ణో మోక్షయిత్వా గజోత్తమమ్ ॥ 65
ఋషిభిః స్తూయమానస్తు గుహ్యైర్వేద పదాక్షరైః । గతస్స భగవాన్ విష్ణు ర్దుర్విజ్ఞేయ గతిర్విభుః ॥ 66
గజేంద్రమోక్షణం దృష్ట్వా సర్వే సేంద్రపురోగమాః । బ్రాహ్మణా నగ్రతః కృత్వా సర్వేప్రాంజలయోఽభవన్ ॥ 67
గజేంద్రమోక్షణం పుణ్యం సర్వపాప విమోచనమ్ । శ్రావయన్ ప్రాతరుత్థాయ సర్వపాపైః ప్రముచ్యతే ॥ 68
శ్రద్ధయాహి యదుశ్రేష్ఠ! స్మృతేన కథితేనచ । గజేంద్ర మోక్షణేనైవ దీర్ఘమాయు రవాప్నుయాత్ ॥ 69
మయాతే కథితం దివ్యం పవిత్రం పాపనాశనమ్ । కీర్తయస్వ! మహాబాహో! మహాదుస్స్వప్న నాశనమ్ ॥ 70
కీర్త్యమానంచ విప్రేభ్యః శృణుః భక్త్యాయథోదితమ్ ॥ 71
వరం వరేణ్యం వర పద్మనాభం నారాయణం పద్మనిధిం సురేశమ్ ।
తం దేవ గుహ్యం పురుషం పురాణం వవందిరే బ్రహ్మవిదాం వరిష్ఠాః ॥ 72
ఏతత్పుణ్యం యదుశ్రేష్ఠ! నరాణాం పాపకర్మిణామ్ । దుస్స్వప్న దర్శనే ఘోరే శ్రుత్వాపాపాత్ప్రముచ్యతే ॥ 73

భక్తిమాన్ పుండరీకాక్షే గజో దుఃఖాద్విమోచితః । తథా త్వమపి రాజేంద్రః ప్రపద్య శరణం హరిమ్ ॥ 74
విముక్తః సర్వపాపేభ్యః ప్రాప్స్యసే పరమాం గతిమ్ ॥ 75

ఇతి శ్రీ విష్ణుధర్మోత్తరే ప్రథమఖండే వజ్రసంవాదే
గజేంద్ర మోక్షణం నామ చతుర్నవత్యధిక శతతమోఽధ్యాయః.

విష్ణువు ప్రీతుడైన యాక్షణమ సంసారసాగరమునుండి కాపాడును. కోపించియు హరి తాను జంపియు శత్రువులకు దేవత్వమిచ్చును. ఆగజరాజు మకరరాజును దమతమ యుపాధులంబడసి జనార్దనున కెరగి గంధర్వాధిపతులైనవారు శీఘ్రముగ పరమనిర్వృతిని (బ్రహ్మానందమును) బొందిరి. శూరాగ్రేసరా! ఈ కథను గజగ్రాహములు ముక్తులగుటచూచి విష్ణువు గజరాజుని నన్ను మిగుల ధ్యానముతో గ్రహించిన యీ వృత్తాంతమును ఈ రెంటి మోక్షము స్మరించువారు ఈ కీచకవేణు గుల్మమును ఈ త్రికూటాద్రిని అశ్వత్థము (రావిచెట్టును) భాస్కరుని గంగను నైమిషారణ్యమును ప్రయాగను బ్రహ్మతీర్థమును దండకారణ్యమును నేమానవులు స్మరింతురు చక్రగవిందురు వారు నాపరిగ్రహమంది నా ఆవలంబమువడసి దుస్స్వప్నమువలని పాపము ననుభవింపరు. సర్వపాప విముక్తులగుదురు. పరమగతి నందుదురు. అని యిట్లు పలికి జనార్దనుడు దేవదేవుడు గజగంధర్వుని గ్రాహ గంధర్వుని స్పృశించెను. స్వామిచే స్పృశింపబడి యాయిద్దరు నప్పుడ దివ్యమాలాంబరధారులై తమ కభిమతమై నచ్చిన విమానము రాగా దానిపై స్వర్గమునకేగిరి. అక్కడ దేవేశుండు కృష్ణుడు గజోత్తముని విడిపించి ఋషులచే రహస్యములైన వేదపదములచే స్తూయమానుడై యా విభువేరికిం దెలియరానిగతి కలవాడై యేగెను. ఇంద్రాది దేవతలు గజేంద్రమోక్షముం జూచి బ్రాహ్మణులను మున్నిడుకొని యందరును బ్రాంజలులైరి. గజేంద్రమోక్షణ కథ యిది సర్వపాప విమోచనము. వేకువను లేచి యిది వినిపించిన నాతడు సర్వపాప ముక్తుడగును. యదువరా! శ్రద్ధతో నీకథను స్మరించినను జెప్పినను దీర్ఘాయుష్మంతుడగును. నేను నీకీ దివ్య కథ పవిత్రము పాపనాశనమును వచించితిని. ఓ మహావీర! మహాదుఃస్వప్ననాశనమైన దీనిని నీవు కీర్తింపుము. విప్రులు కీర్తింప నీవు కీర్తించినట్లు సమగ్రముగ భక్తితో వినుము. వరుడు (శ్రేష్ఠుడు) వరేణ్యుడు వరపద్మనాభుడు నారాయణుడు పద్మనిధి సురేశుడు దేవగుహ్యమైన యాపురాణపురుషుని బ్రహ్మవిద్వరిష్ఠులు వందనములు సేసిరి. యదువర! ఇది పాపకర్ములగు నరులు ఘోరదుఃస్వప్నము వచ్చినపుడీ పుణ్యకథ విని పాపముక్తు లగుదురు. పుండరీకాక్షునందు భక్తికలిగిన ఏనుగు దుఃఖము నుండి ముక్తుడు గావింపబడెను. అట్లే నీవును హరిని శరణంది సర్వపాపవిముక్తుడవై పరమగతినందగలవు.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున గజేంద్రమోక్షణమను నూటతొంబదినాల్గవ యధ్యాయము.

## నూటతొంబదియైదవ అధ్యాయము - విష్ణుపంజరస్తోత్రము

వజ్రః : భగవన్! కీదృశీం రక్షాం సచకార ద్విజోత్తమః । యథా నిర్ధూత వీర్యోఽసౌ నిసరో రజనీచరః ॥ 1
మార్కండేయః : ఏకాగ్ర చిత్తో గోవిందే తజ్జప స్తత్పరాయణః । సర్వదుష్టోప శమనం ప్రవిష్టో విష్ణు పంజరమ్ ॥ 2
వజ్రః - విష్ణు పంజర మిచ్ఛామి శ్రోతుం ధర్మభృతాంవర । సదా సర్వభయేభ్య స్తు రక్షాయా పరమాభవేత్ ॥ 3
మార్కండేయః-త్రిపురం జఘ్నుషః పూర్వం బ్రాహ్మణా విష్ణుపంజరమ్ । శంకరస్య యదుశ్రేష్ఠ! రక్షణాయ నిరూపితమ్ ॥
వాగీశేన తు శుక్రస్య బలం హన్తుం ప్రయాస్యతః । తస్య స్వరూపం వక్ష్యామి తన్నిబోధ మహీపతే ॥ 5

స్వామీ! ఆ ద్విజోత్తముడు చేసిన రక్షయేమి? దాని వలన గదా దుస్తరుడైన యీ రాక్షసుడు చచ్చువడి నాడు. ఆ రక్షా విశేషమేమోతెలుపుమని వజ్రుండడుగ మార్కండేయుడనియె : గోవిందునియందేకాగ్రమనస్కుడై యా గోవిందజపమే సేయుచు నమ్మి సర్వదుష్టోపశమనమైన విష్ణు పంజరము నాతడు (బ్రాహ్మణుడు) ప్రవేశించెనన వజ్రనృపతి విష్ణుపంజర స్తోత్రములు వినగోరెద. అది

సర్వభయముల నుండి రక్షించును గదా! అనతిమ్మన మార్కండేయు డిట్లనియె. మున్ను త్రిపుర సంహారము సేయనున్న శంకరునకు రక్షణకొఱకే విష్ణు పంజరమును బ్రహ్మ నిరూపించెను. బలాసురుని జంప నేగుచున్న శక్రునకు దీనిని బృహస్పతి యుపదేశించెను. రాజా! ఆస్తోత్రస్వరూపము వచించెద నిదెయెఱుంగుము.

విష్ణుః ప్రాచ్యాం స్థిత శ్చక్రీ విష్ణు దక్షిణతో గదీ । ప్రతీచ్యాం శార్ఙ్గ భృద్విష్ణుః దేవః ఖడ్గీ మమోత్తరే ॥ 6
హృషీకేశో వికోణేషు తచ్ఛిద్రేషు జనార్దనః । క్రోడరూపీ హరిర్భూమౌ హన్తుం ప్రేతనిశాచరాన్ ॥ 7
గదా చేయం సహస్రాంశు రుద్వమత్పావ కోల్బణా । రక్షోభూత పిశాచానాం డాకినీనాం చశాతనీ ॥ 8
శార్ఙ్గ విస్ఫూర్జితం చైవ వాసుదేవస్య మద్రిపూన్ । తిర్యఙ్ మనుష్య కూష్మాండ ప్రేతాదీన్ హన్త్వశేషతః ॥ 9
ఖడ్గధారామల జ్యోత్స్నా నిర్ధూతాయే సమాహితాః । తేయాన్తు సౌమ్యతాం సద్యో గరుడేనేవ పన్నగాః ॥ 10
యేకూష్మాండా స్తథాయక్షాః యేదైత్యాయే నిశాచరాః । ప్రేతా వినాయకాః క్రూరా మనుష్యాజంబుకాః ఖగాః ॥ 11
సింహాదయోయే పశవో దందశూకాశ్చ పన్నగాః । సర్వేభవన్తుతే సౌమ్యాః కృష్ణశార్ఙ్గ రవాహతాః । 12
చిత్తవృత్తి హరాయేయే యేజనాః స్మృతి హారకాః । బలౌజసాంచ హన్తారః ఛాయావిభ్రంశకాశ్చయే ॥ 13
యే చోపభోగహర్తారో యేచలక్షణ నాశకాః । కూష్మాండాస్తే ప్రణశ్యన్తు విష్ణుచక్రదయాహతాః ॥ 14
బుద్ధిస్వాస్థ్యం మనస్స్వాస్థ్యం స్వాస్థ్యమైంద్రియకం తథా । మమాఽస్తు దేవదేవస్య వాసుదేవస్య కీర్తనాత్ ॥ 15
పృష్ఠేపురస్తాన్మమ దక్షిణోత్తరే వికోణతశ్చాస్తుజనార్దనోహరిః ।
తమీడ్యమీశాన మనంత విక్రమం జనార్దనం ప్రణిపతితోన సీదతి ॥ 16
యథా పరబ్రహ్మ హరిస్తథా పరం జగత్స్వరూపంచ సఏవ కేశవః ।
సత్యేన తేనాచ్యుత నామకీర్తనాత్ ప్రణాశమేతు త్రివిధం మమాఽశుభమ్ ॥ 17

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
విష్ణుపంజర స్తోత్ర వర్ణనం నామ పంచనవత్యధిక శతతమోఽధ్యాయః.

విష్ణువు చక్రాయుధము దాల్చి తూర్పునను గదదాల్చి దక్షిణమునను శార్ఙ్గమను ధనుస్సుదాల్చి పడమటను నందకమనెడి ఖడ్గము పూని నాకుత్తరమునను హృషీకేశుడు వికోణములందు (మూలలందు) జనార్దనుడు ఆయాదిశాచ్ఛిద్రములందు రూపి హరి ప్రేత నిశాచరులం జంప భూమియందును రక్షయిచ్చుగాక! ఈగద సహస్ర కిరణములూని నిండ నిప్పుల గ్రక్కుచు రక్షోభూత పిశాచ డాకినుల నదలించు గాక. వాసుదేవుని శార్ఙ్గధను ష్టంకారము (విస్ఫురణము) పశుపక్షి మనుష్య కూష్మాండ ప్రేతాదులను నిశ్శేషముగ జంపుగాక! హరియొక్క నందక ఖడ్గధారా నిస్సృతమగు నచ్చపు వెన్నెలచే నాయెడ పగగొనియున్న వారప్పటికప్పుడే గరుడునిచే పామువలె సౌమ్యులగుదురు గాక. కూష్మాండులు యక్షులు దైత్యులు నిశాచరులు ప్రేతలు వినాయకులు క్రూరులగు వారు మనుష్యులు నక్కలు పక్షులు సింహాది పశువులు దందశూకములు (పాములలో నొకరకము) పన్నగములు కృష్ణుని శార్ఙ్గధనుష్టంకారముచే శాంతములగుం గాక! నా చిత్తవృత్తిని జ్ఞాపక శక్తిని హరించినవారు బలమును ఓజస్సును జెఱచినవారు ఛాయావిభ్రంశకులు (కాంతిని జెఱచినవారు) ఉపభోగ సామగ్రిని హరించిన వారు లక్షణముచెఱచినవారు నగు నా కూష్మాండులు విష్ణుచక్ర వేగ హతులై పూర్తిగ నశింతురు గాక! బుద్ధి స్వాస్థ్యము మన స్స్వాస్థ్యము నింద్రియ స్వాస్థ్యము దేవదేవుడగు వాసుదేవుని సంకీర్తనముచే నాకు గల్గుగాక! నా వెనుక ముందు దక్షిణోత్తరములందు మూలలందు జనార్దనుడు హరియుండు గాక! ఆ స్తవనీయుని యీశానునననంతవిక్రముని జనార్దనుని గూర్చి ప్రణతుడైన వాడు దుఃఖమందడు. పరబ్రహ్మమెట్లో హరియునట్లే సర్వజగత్స్వరూపమయిన పరాత్పరుడా కేశవుడే. సత్యమైన యీ పరబహ్మ వస్తువుచే అచింత్య నామ సంకీర్తనము వలన నా త్రివిధ పాపము (కాయిక మానసిక వాచికము) ప్రశమించు గాక!

ఇది శ్రీ విష్ణు ధర్మోత్తర మహాపురాణమందు ప్రథమఖండమున
విష్ణు పంజరస్తోత్ర వర్ణనమను నూటతొంబదియైదవ యధ్యాయము.

# నూటతొంబదియారవ అధ్యాయము - సత్త్వబాధాప్రశమనము

వజ్రః : ఆత్మరక్షా త్వయోక్తామే సర్వబాధా వినాశినీ । కృపాన్వితైః కథం కార్యా పరరక్షా భృగూత్తమః ॥ 1
ఏతన్మే సంశయం ఛింధిత్వం విజ్ఞానమయోనిధిః । వైష్ణవాని రహస్యాని సర్వాణి విదితానితే ॥ 2
మార్కండేయః : స్తోత్రేణానేన ధర్మజ్ఞః కుశాగ్రైర్మార్జయన్ నరమ్ । ఉపస్పృశ్య శుచిః కుర్యాద్రక్షాం పార్థివ సత్తమ
సోపవాసేన సంపూజ్య దేవ దేవం జనార్దనమ్ । అమోఘైషా భవేద్రక్షా కృతానాస్త్యత్ర సంశయః ॥ 4
యథాకథంచిత్కృత్వైనాం నరోమోచయతే రుజః । ఆధివ్యాధి గృహీతానాం రక్షైషా భేషజం పరమ్ ॥ 5
ఓం నమః పరమార్థాయ పురుషాయ మహాత్మనే ॥ 6
అరూపబహురూపాయ వ్యాపినే వరమాత్మనే । నిష్కల్మషాయ శుద్ధాయధ్యాతృ పాపహరాయచ ॥ 7
నమస్కృత్య ప్రవక్ష్యామి యత్తత్సిధ్యతుకేవచ । వరాహ నారసింహాయ వామనాయ మహాత్మనే ॥ 8
వక్ష్యామిత్వాం నమస్కృత్య యత్తత్సిధ్యతు మేవచః । త్రివిక్రమాయ రామాయ వైకుంఠాయ నరాయచ ॥ 9
వక్ష్యామి త్వాం నమస్కృత్య యత్తత్సిధ్యతు మేవచః । 10
వరాహః నరసింహేశ! వామనేశ! త్రివిక్రమః 11
హయగ్రీవేశః సర్వేశః హృషీకేశ! హరాఽశుభమ్ । అపరాజితః చక్రాద్యైశ్చతుర్భిః పరమాయుధైః ॥ 12
అఖండితానుభావైస్త్వం సర్వదుఃఖహరో భవః హరాఽముకస్య దురితం దుష్కృతం దురుపోషితమ్ ॥ 13
మృత్యుబంధాఽతిభయదం దురిష్టస్యచ యత్ఫలమ్ । పరాపధ్యాన సహితం ప్రయుక్తం చాభిచారికమ్ ॥ 14
గరస్పర్శమహారోగప్రయోగం జరయాజర : ఓం నమోవాసుదేవాయ నమః కృష్ణాయ శార్ఙ్గిణే ॥ 15
నమః పుష్కర నేత్రాయ కేశవాయాది చక్రిణే । నమః కమల కింజల్క పీత నిర్మల వాససే ॥ 16
మహాహవరిపుస్కంధ పృష్ఠ చక్రాయ చక్రిణే । దంష్ట్రోద్ధృత క్షితిభృతే త్రయీమూర్తిమతే నమః ॥ 17
మహాయజ్ఞ వరాహాయ శేషభోగోరు శాయినే । తప్తహాటక కేశాయ జ్వాలత్పావక లోచన॥ 18
వజ్రాధిక నఖస్పర్శ దివ్యసింహ నమోఽస్తుతే । కాశ్యపాయాతి హ్రస్వాయ ఋగ్యజు స్సామరూపిణే ॥ 19
తుభ్యం వామన రూపాయ క్రమతే గాం నమోనమః । వరాహాఽశేషదుష్టాని సర్వపాప ఫలానివై ॥ 20
మర్ద మర్దః మహాదంష్ట్రః మర్ద మర్దచ యత్ఫలమ్ । నరసింహః కరాళాస్య! దంతప్రాంతాఽనలోజ్జ్వల! 21
భంజ భంజః నినాదేన దుష్టాన్ భక్తార్తినాశనః । ఋగ్యజుస్సామ గర్భాభిర్వాగ్భి ర్వామనరూపవపధృక్ ॥ 22
ప్రశమం సర్వదుఃఖాని నయైతస్య జనార్దనః ఏకాహ్నికం ద్వ్యాహ్నికంచ తథా త్రిదివసజ్వరమ్ ॥ 23

ఆత్మరక్షను గురించి నీవు తెల్పితివి. ఎదుటివారిపై జాలిగలవారు సర్వబాధావినాశినియైన రక్ష నితరులకెట్లుసేయవలయునో యానతిమ్ము. నీవు జ్ఞాననిధివి. విష్ణుదేవతారహస్యములన్నియు నీకు దెలియునన మార్కండేయుడిట్లనియె : శుచియై యాచమనము సేసి ఎదుటివానిని యీ స్తోత్రముతో కుశాగ్రములతో మార్జనము సేయవలెను. ఉపవాసముండి దేవదేవుని హరిని బూజించి యీ విష్ణుపంజర స్తోత్ర పారాయణము సేసి కుశాగ్రోదకము ప్రోక్షించి చేసిన యీ యంగరక్ష అమోఘము. సంశయములేదు. ఏదో విధముగా నిది సేసి యితర మానవుని వ్యాధులు హరింపవచ్చును. ఆధి=మనోవ్యాధి వ్యాధి = శరీరవ్యాధి గలవారి కిది పరమౌషధము. పరమార్థమైనపురుషునకు మహాత్మునికి అరూపుడై బహురూపుడగువానికి సర్వవ్యాపియైన పరమాత్మకు నమస్కారము. నిష్కల్మషునికి శుద్ధునికి తనను దలచువాని పాపములను హరించువానికి నమస్కరించి నేనేది పలుకుదు నామాట సిద్ధించుగాక. వరాహనరసింహమూర్తికి వామనునకు నమస్కరించి నీతో నేమందు నా నామాట సిద్ధించుగాక. త్రివిక్రమునకు రామునికి వైకుంఠ

నికి నరునికి నీకు మ్రొక్కి నీతో నేమ్రందు నామాట సిద్ధింపుగాక. వరాహ! నరసింహస్వామి వామనేశ త్రివిక్రమ హయగ్రీవేశ సర్వేశ హృషీకేశ యశుభమును హరింపుము. చక్రాది పరమాయుధములు నాల్గింటిచే నపరాజితుడా ఎడతెగని నీ యనుభవములచే (లీలలచే) సర్వదుఃఖహరుడవుగమ్ము. వీనిపాపము వీని యకార్యకరణము దురుపవాస దోషమును దుష్టముగా జేసిన యజ్ఞములవలన గల్గు ఫలము మృత్యుపుబంధము మొదలైనవానిం గూర్చుదానిని పరుని గూర్చి తప్పుడాలోచనలతోగూడ ప్రయోగించిన యాభిచారికమును (చేతబడిని) విషస్పర్శ మహారోగ ప్రయోగమును నో అజరా! = జరింపనివాడా! హా లేనివాడా! జరయ = జరింపజేయుము. హరింపుము అను నర్థముగల యీ శ్లోకములు పారాయణ సేయవలెను. అటుపైని 15వ శ్లోకము మొదలు 22వ శ్లోకము దాక గల స్తోత్ర శ్లోకములు మంత్రరూపములు పఠించవలెను.

చాతుర్థికం తథాత్యుగ్రం తథైవ సతతజ్వరమ్ । దోషోత్థం సన్నిపాతోత్థం తథైవాగంతుకం జ్వరమ్ ॥ 24
శమం నయతు గోవిందశ్ఛిత్వా ఛిత్వాఽస్య వేదనామ్ । నేత్రదుఃఖం శిరోదుఃఖం దుఃఖం చోదర సంభవమ్ ॥ 25
అనుచ్ఛ్వాస మతిశ్వాసం పరితాపం చ వేపథుమ్ । గుద ఘ్రాణాది రోగాంశ్చ కుష్ఠరోగం తథా క్షయమ్ ॥ 26
కామలాదీం స్తథా రోగాన్ ప్రమేహాం శ్చాతిదారుణాన్ । భగంద రాతిసారాంశ్చ ముఖరోగం సవల్గులిమ్ ॥ 27
అశ్మరీ మూత్రకృచ్ఛ్రాంశ్చ రోగా నన్యాంశ్చదారుణాన్ । యేవాత ప్రభవా రోగాయేచపిత్త సముద్భవాః ॥ 28
కఫోద్భవాశ్చ యేకేచిద్యేకేచి త్సాన్ని పాతికాః । ఆగంతవశ్చయేరోగాః లూతా విస్ఫోటకాదయః ॥ 29
తే సర్వే ప్రశమం యాంతు వాసుదేవాఽ పమార్జితాః । విలయం యాన్తుతేసర్వే విష్ణోరుచ్చారణేనచ ॥ 30
క్షయం గచ్ఛన్తుచాఽశేషాస్తే చక్రాభిహతా హరేః । అచ్యుతాఽనన్త గోవింద నామోచ్చారణ భేషజాత్ ॥ 31
నశ్యన్తి సకలారోగాః సత్యం సత్యం వదామ్యహమ్ । స్థావరం జంగమంచైవ కృత్రిమం చాపియద్విషమ్ ॥ 32
దంతోద్భవం నఖభవ మాకాశప్రభవం విషమ్ । లూతాది ప్రభవం యచ్చ విషమత్యంత దుఃఖదమ్ ॥ 33
శమం నయతు తత్సర్వం కీర్తితో హిజనార్దనః । గ్రహాన్ ప్రేతగ్రహాంశ్చైవ తథా చైవార్యకగ్రహాన్ ॥ 34
ముఖమండలికాన్ క్రూరాన్ రేవతీం వృద్ధిరేవతీం । వృద్ధికాఖ్యాన్ గ్రహాం శ్చోగ్రాం స్తథా మాతృగ్రహానపి । 35
బాలస్య విష్ణోశ్చరితం హన్తు బాలగ్రహానిమాన్ । వృద్ధానాం యేగ్రహాః కేచిద్యేచ బాలగ్రహాః క్వచిత్ ॥ 36
నరసింహస్య దృష్ట్యాతే దగ్ధాయేచాపి యేవనే । సటాకరాళ వదనో నరసింహో మహారవః ॥ 37
గ్రహా నశేషాన్నిఃశేషాన్ కరోతు జగతో హితః ॥

వీని సర్వదుఃఖములను పోగొట్టుము. ఏకాహ్నిక ద్వ్యహ్నిక త్ర్యహ్నిక చాతుర్థిక జ్వరములను అత్యుగ్రమైన నిత్య జ్వరమును దోషజన్యము సన్నిపాత జన్యము ఆగంతుకములునైన జ్వరములను ప్రశమింప జేయుము. గోవిందుడు వీని వేదనను ఛేదించియు ఛేదింపకయు శమింపజేయు గాక! నేత్ర దుఃఖము శిరోదుఃఖము ఉదరవ్యాధి ఊపిరాడక పోవుటను అతిశ్వాస రోగమును పరితాపమును వేపథువును (వణకును) గుదఘ్రాణాది రోగములను కుష్ఠరోగమును క్షయను కామలామలను అతి దారుణ ప్రమేహములను భగందరములను అతిసారములను ముఖరోగమును వల్గులివ్యాధిని అశ్మరి మూత్రకృచ్ఛ్రములను (నీరుకట్టు రోగము) వాటి దారుణ వాత పిత్తశ్లేష్మక ఫజములయిన వ్యాధులను సాన్ని పాతిక రోగములను ఆగంతుకములను లూతావిస్ఫోట కాదులగు సాలీడు వలె పోయు దద్దుర్లు పొక్కులు గల స్ఫోటకము సర్వరోగములు వాసుదేవునిచే దుడిచి వేయబడి ప్రశమించు గాక! విష్ణూచ్చారణచే నవి విలయించు గాక! హరి చక్రనిహతమలై యవి నిశ్శేషముగ క్షయించు గాక! అచ్యుతానంత గోవింద నామోచ్చారణ భేషజము వలన సర్వరోగములు నశించును. సత్యము సత్యము నేను జెప్పుచున్నవి. స్థావర జంగమ కృత్రిమ రూప త్రివిధవిషము దంతముల వలన గోళ్ల వలన బుట్టినది ఆకాశమున బొడమినది లూతాదులవలన బుట్టినది యగు మిక్కిలి దుఃఖము గూర్చు విషము నెల్లను జనార్దనుడు సంకీర్తితుడై శమింపజేయు గాక! గ్రహములను ప్రేత గ్రహములను ఆర్యక గ్రహములను ముఖ మండలికములను

గ్రూరములను రేవతిని వృద్ధరేవతిని వృద్ధికములనుపేరుగల రోగములను మాతృగ్రహములను బాలవిష్ణు చరిత్ర మీ బాలగ్రహములను జంపుగాక! వృద్ధుల గ్రహ బాలగ్రహ బాధలను యౌవనమందున్న గ్రహములను నరసింహస్వామి దృష్టిచేనవెల్లి దగ్ధములగుగాక! కేశరముల భయంకరమగు ముఖముగల నరసింహస్వామి ఉద్భటముగ గర్జించువాడు జగద్ధితుడు అశేష గ్రహములను నిశ్శేషములం గావించు గాక!

నరసింహః మహాసింహః జిహ్వాజ్వాలో జ్జ్వలానన! ॥ 38
గ్రహా నశేషాన్ సర్వేశ: ఖాదఖాదాగ్ని లోచన। । యేరోగా యే మహోత్పాతా యద్విషం యేమహాగ్రహాః ॥ 39
యాని చ క్రూర భూతాని గ్రహపీడాశ్చ దారుణాః । శస్త్ర క్షతేషు యేదోషాః జ్వాలా గర్దభి కాదయః ॥ 40
తాని సర్వాణి సర్వాత్మన్ పరమాత్మన్ జనార్దన! । కంచి ద్రూపం సమాస్థాయ వాసుదేవాశు నాశయః ॥ 41
క్షిప్త్వా సుదర్శనం చక్రం జ్వాలామాలా విభీషణమ్ । సర్వదుష్టో పశమనం కురు దేవవరాఽచ్యుత! ॥ 42
సుదర్శనః మహాజ్వాలః ఛిన్ధి ఛిన్ధిచ మారయ । సర్వాణి దుష్టరక్షాంసి క్షపయాఽతి విభీషణ ॥ 43
ప్రాచ్యాం ప్రతీచ్యాంచ దిశి దక్షిణో త్తరత స్తథా । రక్షాం కరోతు సర్వస్మా న్నరసింహః స్వగర్జితైః ॥ 44
భువ్య న్తరిక్షే చదివి పార్శ్వతః పృష్ఠతోఽగ్రతః । రక్షాం కరోతు భగవాన్ బహురూపీ జనార్దనః ॥ 45
యస్మా ద్విష్ణుర్జగత్సర్వం సదేవాసుర మానుషమ్ । తేన సత్యేన దుష్టాని శమ మస్య వ్రజన్తువై ॥ 46
యథా విష్ణు స్మృతౌ సద్యః సంక్షయం యాతి పాతకమ్ । సత్యేన తేన సకలం దుష్టమస్య ప్రశామ్యతు ॥ 47

నరసింహ మహా సింహ! నాలుకయనెడి జ్వాలచే మిగుల వెలుగొందు ముఖము గల వాడా! సర్వేశ అగ్నిలోచన సర్వ గ్రహములను దినుము దినుము. రోగములు మహో త్పాతములు విషము మహాగ్రహములు క్రూరభూతములు దారుణ గ్రహపీడలు శస్త్రములచే నరుక బడినపుడు గలుగు దోషములు జ్వాలాగర్దభికాది క్షుద్ర రోగములవి యెల్ల ఓ సర్వాత్మా! పరమాత్మా జనార్దనా యొక యనిర్వచనీయమైన రూపము దాల్చి ఓ వాసుదేవ! అచ్యుత! దేవవర! అన్నిటిని నశింపజేయుము. జ్వాలామాలాతిభీషణమైన సుదర్శనమును (చక్రమును) విసరి సర్వదుష్టోపశమన మొనరింపుము. ఓ సుదర్శనమా? మహాజ్వాలామయమా నఱకు నఱకు నఱకుము చంపుము. అతివిభీషణమూర్తీ సర్వదుష్ట రక్షస్సులను జంపుము. తూర్పున పడమట దక్షిణమందుత్తర దిశను నరసింహుడు తన గర్జనములచే సర్వోపద్రవములనుండి రక్షసేయుగాక! భూమిపై అంతరిక్షమున నిరు ప్రక్కలను ముందు వెనుకను భగవంతుడు బహురూపియై జనార్దనుడు రక్షను సేయుగాక! సర్వదేవాసుర మానుషమైన జగత్తెల్ల విష్ణువు. గావున యా సత్య స్వరూపునిచే వీని దుష్ట గ్రహాదులు శమించు గాక! విష్ణు స్మరణ మందెట్లు సకల పాప మప్పటి కప్పుడు నశించునో అట్లే సత్యుడైన యా హరిచేత వీని సకల దుష్టము = చెడు (చేతబడి మొదలయిన) ప్రశమించు గాక!

పరమాత్మాయథా విష్ణుర్వేదాన్తేష్వభి గీయతే । తేన సత్యేన సకలం యన్మయోక్తం తథాఽస్తుతత్ ॥ 48
శాన్తిరస్తు శివంచాస్తు ప్రణశ్య త్వసుఖంచ యత్ । వాసుదేవ శరీరోత్థైః కుశైః సంమార్జితో మయా ॥ 49
అపామార్జతి గోవిందో నరో నారాయణ స్తథా । తథాఽస్తు సర్వదుఃఖానాం ప్రశమోవచనాద్ధరేః ॥ 50
శాన్తా స్సమగ్ర రోగాస్తే గ్రహాస్సర్వే విషాణిచ । భూతానిచ ప్రశాన్తాని సంస్మృతే మధు సూదనే ॥ 51
ఏత త్సమస్త రోగేషు సర్వభూత భయేషుచ । అపామార్జనకం శస్త్రం విష్ణు నామాభి మన్త్రితమ్ ॥ 52
శాన్తిరస్తు శివంచాస్తు దుష్టమస్య ప్రశామ్యతు । యదస్య దురితం కించిత్ తత్ క్షిప్తం లవణాంభసి ॥ 53
స్వాస్థ్యమస్య సదైవాఽస్తు హృషీకేశస్య కీర్తనాత్ । యత ఏవాగతం పాపం తత్రైవ ప్రతి గచ్ఛతు ॥ 44
ఏతద్రోగాది పీడాసు జన్తూనాం హితమిచ్ఛతా । విష్ణుభక్తేన కర్తవ్య మపామార్జనకం పరమ్ ॥ 45
అనేన సర్వదుఃఖాని ప్రశమం యాన్త్యసంశయమ్ । సర్వభూత హితార్థాయ కుర్యాత్తస్మాత్స దైవహి ॥ 56

నాద్యంత వంతః కవయః పురాణాః సూక్ష్మా బృహన్తో హ్యనుశాసితారః
సర్వజ్వరాన్ ఘ్నన్తు తవానిరుద్ధ ప్రద్యుమ్న సంకర్షణ వాసుదేవాః ॥ 57
ఏతే కుశా విష్ణుశరీర సంభవా జనార్దనోఽహం స్వయమేవ చాగతః। 58
హతం మయా దుష్టమశేష మస్య స్వస్థో భవత్వేష యథా వచోహరేః ॥ 59

ఇతి శ్రీ విష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
సత్త్వ బాధా ప్రశమనం నామ షణ్ణవత్యధిక శతతమోఽధ్యాయః.

వేదాంతములందు విష్ణువు పరమాత్మయని కీర్తింప బడును. కావున యా సత్య వస్తువుచే నేనస్పృశ దుష్టస్పృష్ట గాక! తాను దేవ శరీరమందుండి బయలు దేరిన కుశలనే సంమార్జనముచేయబడి శాంతి యగుగాక! శివమగుగాక! అసుఖములు శాంతించును. గోవిందుడు నారాయణుడు నరుడు నైన విష్ణువు చేతిలో తుడిచి వేసినట్లు హరి వచనముచే సర్వ దుఃఖోప్రశమన మగుగాక! సర్వ రోగములు గ్రహములు భూతములు సమగ్రముగ మధుసూదన స్మరణము సేసినంత ప్రశాంతించు గాక! ఇటి సర్వ రోగము లందు సర్వవిధ భూత భయము లంద విష్ణునామాభిమంత్రితమైన అపమార్జనమైన (తుడిచి వేయునట్టి) శస్త్రము. (ఆయుధము) శాంతి యగుత శివమగు గాక! వీని చెడు నశించు గాక! వీని పాతకము కొంచెమున్న నది ఉప్పునీటి సముద్ర మందు త్రిమ్మి వేయ బడినది. వీనికి సదా స్వస్థత గల్గుగాక! హృషీకేశ కీర్తనము వలన నెటనుండి పాపము వచ్చినదో యక్కడకే యది తిరిగి పోవుగాక! జీవులకు రోగాది పీడలు వచ్చినపుడు విష్ణుభక్తుడు వాని హితముగోరి మా అపమార్జనమను పరమ రక్ష చేయవలెను. దీనిచే సర్వ దుఃఖములు నిస్సంశయముగ శమించును. అందుకే సర్వభూత హితము కొఱకు రక్ష సేయ వలెను.ఆద్యంతములు లేని కవులు (జ్ఞానులు) పురాణులు (పురాతనులు)బృహద్రూపులు (గొప్పవారు) అనుశాసకులునైన అనిరుద్ధ ప్రద్యుమ్న సంకర్షణ వాసుదేవులు నీ సర్వ జ్వరములను (బాధలను) ఖండింతురుగాక. ఈ కుశలు (దర్భలు) విష్ణు శరీర మందు బుట్టినవి. నేను జనార్దనుడనై స్వయము ముగా వచ్చితిని. వీని దుష్టము(చెడు) నిశ్శేషముగ ని హతమైనది. హరి వచనాను సార మితడు స్వస్థుడగును.

ఇది శ్రీ విష్ణుధర్మోత్తర మహాపురాణమందు ప్రథమఖండమున
సత్త్వబాధా ప్రశమనమను నూటతొంబదియాఱవ యధ్యాయము.

## నూటతొంబదిఏడవ అధ్యాయము - యక్షోత్పత్తి

వజ్రః ఉవాచ: జగత్సృష్టి ప్రసంగేన చోర్వశీ సంభవ స్త్వయా। కథితస్తు మహాభాగ! తత్ప్రసంగేన చాపరాః ॥ 1
కథితా శ్చ కథా బ్రహ్మన్! ధర్మయుక్తా మనోహరాః। విష్ణోర్మాహాత్మ్య సంయుక్తా స్సర్వపాప భయాపహాః ॥ 2
కశ్యపస్య తు యా పత్నీ ఖశానామ్నీ త్వయేరితా। యస్యాః పుత్రౌ మహాత్మానౌ కథితౌ యక్షరాక్షసౌ ॥ 3
తయో రుత్పత్తి మిచ్ఛామి శ్రోతుం వంశం తథైవచ। ప్రస్తుతాం జగదుత్పత్తిం నిఖిలేన ప్రకీర్తయ! 4
మార్కండేయః : రాక్షసం పూర్వసంధ్యాయాం జనయా మాస సా ఖశా। దంష్ట్రాకరాళవదనం పింగళోద్బద్ధ లోచనమ్ ॥
ఆకర్ణదారితాస్యంచ స్థూలనాసాగ్ర ముల్బణమ్। వికచం వికటాటోపం శంకు కర్ణం విభీషణమ్ ॥ 6
తథైవా పర సంధ్యాయాం సైవయక్షం వ్యజాయత। తాదృశేనైవ రూపేణ యాదృశేనైవ రాక్షసమ్ ॥ 7
క్షిణోమి మాతరం యక్షం క్షుభితస్తా మభాషత। రక్షేతి మాతరం తాంతు యక్షంవై రాక్షసోఽబ్రవీత్ ॥ 8
రక్షణా ద్రాక్షసః ప్రోక్తః క్షణాద్యక్షః స ఉచ్యతే। భార్యా బభూవ యక్షస్య దేవరామా కృతస్థలా ॥ 9
యక్షో రాజతనాభాఖ్యః తస్యాస్తస్య సుతః స్మృతః। అనుర్హ్రాదసుతా భార్యా తస్యాసీన్ నృపః గుహ్యకా ॥ 10

వీరో మణి చరశ్చైవ వీరభద్ర స్తథైవచ । తస్యాః పుత్రా వుభౌ ఖ్యాతౌ దేవతుల్యౌ మనీషిణౌ ॥ 11
కకుత్థ్స తనయే భార్యే తయోరాస్తాం నరాధిప । రాజన్! పుణ్యజనీ నామ ప్రథమస్య బభూవ సా ॥ 12
తథా దేవజనీ నామ ద్వితీయస్యాపి యాదవ! తస్యాః పుణ్యజనా యక్షా దేవదేవజనా స్తథా ।
కథితా బహు సాహస్రా మహాబల పరాక్రమాః ॥ 13
శుభై ర్వివాహై ర్న్రుప యక్షవంశైః యక్షాస్తు జాతా బహు శీలయుక్తాః ।
ధర్మస్థితాః సత్యపరా వినీతా మహానుభావా వరదా వరేణ్యాః ॥ 14

ఇతి శ్రీ విష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
యక్షోత్పత్తి ర్నామ సప్తనవత్యధిక శతతమోఽధ్యాయః.

జగత్సృష్టి సందర్భములో నూర్వశీ జననమును తాము సెలవిచ్చిరి. ఆ ప్రసంగమున నింకను పెక్కు కథలు ధర్మ యుక్తములు చక్కనివి బ్రహ్మణ్యుడవగు నీచే వచింప బడినవి. అవన్నియు విష్ణు ప్రభావముతో గూడినవి. సర్వ పాపభయ హరములు. కశ్యపుని భార్య ఖశయను పేరుగల దానిని మీరు చెప్పితిరి. ఆమెకు యక్షుడు రాక్షసుడునను నిద్దరు మహానుభావులు కొడుకులని చెప్పియున్నారు. వారి జన్మ వృత్తాంతమును వంశమును వినగోరెదను. ప్రకృత జగదుత్పత్తిని సమగ్రముగ వర్ణింపుడని వజ్రుండడుగగా మార్కండేయు డిట్లనియె - ఆ ఖశ పూర్వ (ప్రాతః) సంధ్య యందు రాక్షసునిం గనెను. వాడు కోరలతో భయంకరమైన ముఖము గలవాడు. ఎఱ్ఱని మిడిగ్రుడ్లు కలవాడు. చెవులదాక నోరు తెఱచి కొనువాడు. స్థూలమైన ముక్కు పుటములు గలవాడు. జుట్టు విరబోసికొని వికటాటోపియై శంకుకర్ణుడై భయంకరుడై పుట్టెను. అట్లే అపర (సాయం) సంధ్య యందు యక్షుని గన్నది. రాక్షసుని రూపమట్లే వాని రూపు నుండెను. ఆ యక్షుడు క్షుభితుడై తల్లిని క్షిణోమి=విసరివైచెదననెను. అమ్మను క్షమింపు మని యా యక్షునిం గూర్చి రాక్షసుడు పలికెను. రక్షణము చేయుటవలన రాక్షసుడు క్షణధాతువు నర్థము వలన యక్షుడు నని వారిద్దరు పేర్కొనబడిరి. యక్షునికి దేవాంగన కృతస్థల భార్యయయ్యెను. వారి కొడుకు రాజతనాభుడను యక్షుడు. వానిభార్య గుహ్యక అనుర్హ్రాదుని కూతురు. ఆమె కొడుకులు వీరుడైన మణిచరుడు వీరభద్రుడు ననబడువారు. వారు దేవతుల్యులు బుద్ధిశాలురు. వారికి భార్యలు కకుత్థ్సుని కూతుండ్రు. మొదటి వాని భార్య పుణ్యజని. రెండవ వాని భార్య దేవజని. వారి సంతతి పుణ్య జనులు దేవజనులు నను వారు. పెక్కు వేల మంది మహాబల పరాక్రములు. శుభ వివాహితులైన యక్షుల వంశీయులచే బహుశీల వంతులెందరో యక్షులు జనించిరి. అందరు ధర్మస్థితులు సత్యపరులు వినయవంతులు మహానుభావులు. వరదులు వరేణ్యులునై యుండిరి.

ఇది శ్రీ విష్ణుధర్మోత్తర మహాపురాణమందు ప్రథమఖండమున
యక్షోత్పత్తియను నూటతొంబదియేడవ యధ్యాయము.

## నూటతొంబదిఎనిమిదవ అధ్యాయము - హేతివంశ వర్ణనము

అజః షండః పిశాచౌద్వౌ భూపాల కపిశా సుతౌ । పిశాచీ బ్రహ్మధానాఖ్యా తత్రాజస్య సుతా మతా ॥ 1
పిశాచీ యాతుధానాఖ్యా షండస్య తనయా మతా । అజశ్చ రాజ షండశ్చ నిశీథే క్షుధితావుభౌ ॥ 2
బహిర్భృత్యైతు సహితౌ దృష్ట వన్తౌ నరేశ్వర! రాక్షసం క్షుధితాకారం పతంతం క్షుధితం నిశి ॥ 3
గృహీతః స పిశాచాభ్యాం క్షుధితాభ్యాం యదాబలీ । పృష్ట స్స తాభ్యాం యత్నేన దృష్ట్వా తస్య తదా బలమ్ ॥ 4
జగాద భూమిప శ్రేష్ఠః చోభయో ర్జన్మ కారణమ్ । జన్మ కర్మచ తౌ తస్య శ్రుత్వా పిశిత భోజనౌ ॥ 5

దదతుః కన్యకే తస్య రాక్షసస్య నరాశినః । భార్యా ద్వయస్య వంశౌ ద్వౌ రాక్షసస్య ప్రకీర్తితౌ ॥ 6
బ్రహ్మధానాన్వయే తస్య బ్రహ్మధానా నిశాచరాః । యాతుధానాన్వయే తస్య యాతుధానాః ప్రకీర్తితాః ॥ 7

మార్కండేయుడిట్లు చెప్పదొడంగెను : కపిశ కొడుకులు అజుడు షండుడు నను వారిద్దరు పిశాచులు. అజుని కూతురు బ్రహ్మధాన యనునది పిశాచి. యాతుధానయను పిశాచి షండునికూతురు. అజుడు షండుడు నొక రేయి మిక్కిలి యాకలిగొనిరి. ఇద్దరుంగలిసి వెలికేగి యా రాత్రి క్షుధితాకారుడై (ఆకలి రూపై) మీదబడు నొక రాక్షసుని క్షుధితుడనువానిం జూచిరి. వాడు బలశాలి. పిశాచు లిద్దరిచే బట్టుకొనబడి వాని బలముచూచి నీవెవ్వడవని ప్రశ్నింపబడెను. ఓ రాజేంద్రా! వాడా యిద్దరకు తన జన్మ కారణము చెప్పెను. వాని జన్మకారణము విని యా పిశితాశనులు (మాంసభక్షకులు = రాక్షసులు) ఆ నరభక్షకుని కిద్దర కన్యల నిచ్చిరి. ఆ రాక్షసుని కా భార్య లిద్దరివలనగలిగిన వంశములు రెండు. బ్రహ్మధాన యొక్క వంశమువారు బ్రహ్మధానులను రాక్షసులు. యాతుధాన యొక్క వంశమువారు యాతుధానులని పిలువబడిరి.

బ్రహ్మధానాన్వయే జాతానాదౌ వక్ష్యామి రాక్షసాన్ । యజ్ఞహా నిర్ధని క్షేపా బ్రహ్మపూతోఽథ నిష్ప్రవాన్ ॥ 8
శ్వాన కృత్కుంతలః సర్పో బ్రహ్మధానాత్మజాః స్మృతాః । తేషా మన్వయ సంభూతాః శతశోఽథ సహస్రశః ॥ 9
శ్లేష్మాతక వనస్థానాః కథితా బ్రహ్మరాక్షసాః । హేతిః ప్రహేతి రుగ్రశ్చ పౌరుషాదో వధ స్తథా ॥ 10
విద్యుత్ స్ఫూర్జశ్చ వాతశ్చ నసో వ్యాఘ్ర స్తథైవచ । సుసకృచ్చ కరాలశ్చ యాతుధానాత్మజా దశ ॥ 11
సూర్యస్యాను చరా హ్యేతే సహతేన భ్రమన్తి వై । తేషామన్వయ సంభూతా యాతుధానాః ప్రకీర్తితాః ॥ 12
హేతి ప్రహేతి వంశౌ ద్వౌ తవ వక్ష్యామి యాదవః । హేతి పుత్రః స్మృతో లంకుర్యస్య సాల కటంకటాః ॥ 13
సంధ్యాసుతా స్మృతా భార్యాసుకేశ స్తత్సుతః స్మృతః । మాలీ సుమాలీ చతథా మాల్యవాంశ్చ మహాబలః ॥ 14
సుకేశ తనయా హ్యేతే దేవాసుర భయం కరాః । తపసా త్రైస్సమారాధ్య దేవ దేవం జనార్దనమ్ ॥ 15
వీర్య మప్రతిమం ప్రాప్తం లంకాచైవ మహాపురీ । సుమాలి తనయా తత్ర కైకసీ నామ రాక్షసీ ॥ 16
భార్యా విశ్రవసః పుత్రోయస్యా రావణ సంజ్ఞకః । త్రిలోక విజయీతస్య రావణస్య దురాత్మనః ॥ 17
సుమాలీ వసునాయుద్ధే ధరేణ వినిపాతితః । మాలీచ దేవ దేవేన కేశవేన నిపాతితః ॥ 18

బ్రహ్మధాన వంశ జాతులయిన రాక్షసులం దొలుత జెప్పెద. యజ్ఞహులు (యజ్ఞధ్వంసకులు) నిర్ధనిక్షేపునైన బ్రహ్మపూతుడు నిష్ప్రవంతుడు శ్వానకృత్తు కుంతలుడు సర్పుడను బ్రహ్మధాన పుత్రులు. వారి వంశీయులు పంచల వేలు పుట్టిరి. శ్లేష్మాతక వనస్థానులు బ్రహ్మరాక్షసులని చెప్పబడిరి. హేతి ప్రహేతి ఉగ్రుడు పౌరుషాదుడు వధుడు విద్యుత్‌స్ఫూర్జుడు వాతుడు నసుడు వ్యాఘ్రుడు సుసకృత్ కరాలుడు ననువారు యాతుధాన పుత్రులు పదిమంది. వీరు సూర్యానుచరులు. సూర్యునితోకూడ తిరుగుచుందురు. వారి వంశీయులు యాతుధానులని పేరందిరి. హేతి ప్రహేతి వంశములు రెంటిని నీకిక తెల్పెద. హేతి కొడుకు లంకుడు. వాని పరంపర సాలకంటకటు లనబడిరి. సంధ్యాసుత వాని భార్య. ఆమె కొడుకు సుకేశుడు. మాలి సుమాలి మహాబలుడగు మాల్యవంతుడు సుకేశుని కొడుకులు దేవాసుర భయంకరులు. వారు తపస్సుచే దేవదేవుని జనార్దనునారాధించి అప్రతిమ వీర్యము బడసిరి. లంకానగరముంగూడ పొందిరి సుమాలి కూతురు కైకసి యను రాక్షసి విశ్రవసుని భార్యయయ్యె. ఆమె కొడుకు రావణుడు. ఆతడు త్రిలోకవిజయి. ఆ దురాత్ముడు రావణునికి వసువుతో జరిగిన యుద్ధములో సుమాలి ధరునిచే గూల్పబడెను. మాలి యనువాడు విష్ణునిచే నిహతుడయ్యెను.

మాల్యవాం స్తత్ర వర్షాత్మా జీవత్యద్యాపి యాదవః । శ్రావితౌ భ్రాతరౌ యేన పురా దేవరణోత్సుకౌ ॥ 19
హితం ధర్మ్యం శుభంవాక్యం నచతౌ తస్య చక్రతుః । తేనతౌ నిధనం ప్రాప్తౌ రాక్షసౌ సమరద్వయే ॥ 20

సంశ్రావితస్తేన తథైవ వాక్యం సరావణో నామ విరోధకాలే ।
ఉల్లంఘ్య వాక్యం నిధనం జగామ ధర్మేస్థిత స్యాప్రతిమ ప్రభావః ॥ 21

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
హేతివంశ వర్ణనం నామ అష్టనవత్యధిక శతతమోఽధ్యాయః

మాల్యవంతుడు పర్వస్వరూపుడై యిప్పుడును బ్రతికియున్నాడు. వాని సోదరులు దేవతలతో ఘోర సుత్సాహపడినారని యింతమున్ను వినిపించితిని. వారు మాల్యవంతుని యొక్క హితము ధర్మము శుభమునైన మాటప్రకారము చేసినవారుగారు. అందుచే వారు రెండు రణములందు మరణించిరి. ఆవిధముగానే మాల్యవంతుడు రావణునికిని విరోధసమయమున హితము సెప్పెను గాని ఆసమానప్రభావుడతడును నా ధర్మప్రర్తనుని మాట వినిపించుకొనక మరణమందెను.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున హేతివంశవర్ణనమను నూటతొంబదియెనిమిదవ యధ్యాయము.

## నూటతొంబదితొమ్మిదవ అధ్యాయము - చ్యవనజననము

మార్కండేయః : ప్రహేతి తనయో రాజన్! పులోమానామ విశ్రుతః ।
క్రోధదృష్ట్యాతు యశ్శీఘ్రం చ్యవనేన వినాశితః । 1
వజ్రః : చ్యవనేన కిమర్థం వై పులోమా రాక్షసో హతః । కథం చభృగు శార్దూల తన్మమాచక్ష్వ పృచ్ఛతః ॥ 2
మార్కండేయః : పులోమ్నోదానవేంద్రస్య ద్వేకన్యే భువి విశ్రుతే । పులోమా భృగవేదత్తా శచీదత్తాచ వాసవే ॥ 3
కన్యాభావే రుదన్తీతు కదాచిద్భృగు నందనః । పులోమా ముక్తవాన్ రాజన్! పులోమా దానవేశ్వరః ॥ 4
హేరక్షః కన్యకా మేతాం గృహీష్వ రుదతీం బలాత్ । ఏతస్మిన్నేవ కాలేతు పులోమ్నో భవనాఽజిరే ॥ 5
ఛిద్రాన్వేషీ దురాచారః పులోమా స వ్యతిష్ఠత । అనుసృత్యచ జగ్రాహ తాంకన్యాం చారులోచనామ్ ॥ 6
నిర్భర్త్స్య తందురాచారం పులోమా దానవోత్తమః । కాలేన ప్రదదౌ కన్యాం భృగవే తాం సుమధ్యమామ్ ॥ 7
అన్తర్వత్నీంతు రహితాం భృగుణా తా మనిన్దితామ్ । అగ్నిహోత్రగతాం దృష్ట్వా పులో మాఽగ్నిమథాబ్రవీత్ ॥ 8
పౌలోమీ యది పత్నీర్వా సేయం పావకశంసమే । తా మగ్ని రబ్రవీత్తస్య సేయం పత్నీ భృగోశ్శుభా ॥ 9
ఏవమగ్నేః భృగోః శ్రుత్వా తాం జహారసరాక్షసః । తస్యాం తు దృశ్యమానాయాం గర్భః కుక్షేః తదా చ్యుతః ॥ 10
చ్యవనా చ్చ్యవనో నామ బభూవ స మహాతపాః । దృష్టమాత్రస్తు తేనాఽసౌ పులోమా భస్మసాద్గతః ॥ 11
పులోమాశ్రునిపాతేన నదీజాతా వధూవరా । వహ్నిశ్చ సర్వభక్షత్వం భృగుశాపాదుపాగతః ॥ 12
హుతాశనస్తు సంక్రుద్ధ శ్శాపం ప్రాప్యద్విజోత్తమాత్ । లోకకార్యరతి ర్బ్రహ్మా స్వయం వచన మబ్రవీత్ ॥ 13
వహ్నే! తవార్చిభిః స్పృష్టం శుచి సర్వం భవిష్యతి । శుచిభూతం తతః పశ్చాద్భక్షయిష్యత్య సంశయమ్ ॥ 14
ఏతత్తవోక్తం చ్యవనస్య జన్మ నాశస్తథా రాక్షస పుంగవస్య ।
వహ్నేశ్శుచిత్వం చతథార్చిషాంవై వంశం పులోమోఽథ నిబోధ రాజన్! 15

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్ర సంవాదే
చ్యవనోత్పత్తి వర్ణనం నామ నవనవత్యధికశతతమోఽధ్యాయః.

మార్కండేయుడు చెప్పదొడంగెను. ప్రహేతికొడుకు పులోముడు. ప్రసిద్ధుడు. చ్యవనమహర్షి క్రోధదృష్టికి గురియై నశించెనన వజ్రనృపతి యా కథతెలుపుమన మార్కండేయుడిట్లనియె. పులోముడను దానవపతి కిద్దరు కూతుండ్రు జగత్ప్రసిద్ధలు.

అందు పులోమ భృగుమహర్షికి శచి యింద్రునికి నీయబడిరి. కన్యగా నున్నపుడొకతరి నేడ్చుచున్న పులోమనుజూచి దానవపతి పులోముడు ఓ రక్షస్సూ! ఈ యేడ్చుచున్న కన్యను బలిమిమై గొనిపొమ్మనియె. ఇదేసమయమున పులోమునింట దురాచారుడొకడు పొరపాటును వెదకుచుండెను. అట్లనుసరించుచునే దురాచారుని బెదిరించి యాదానవుడు ఆ సుందరిని పట్టుకొనెను. కొంత కాలమునకామెను భృగువునకిచ్చెను. ఆమె గర్భవతికాగా భృగువులేనపుడు అగ్నిహోత్రసన్నిధినున్న యా పవిత్రురాలిని జూచి యగ్నితో నిట్లనియె. ఇది నాకూతురు పౌలోమియేనా? ఓ పావక ! నాకుదెల్పుమన నగ్ని యీమెయే యిపుడు భృగువు భార్యయైనవని చెప్పెను. ఈమాటవిని యా రాక్షసుడామెనెత్తికొని పోయెను. చూచుచుండగనే నంత యామెగర్భమందున్న శిశువు కడుపులోనుండి చ్యుతుడయ్యెను. అందువలన మహాతపస్వి యతడు చ్యవనుడని పేరొందెను. అతడుచూచినంతనే పులోముడు భస్మమయ్యెను. ఆటుపై పులోమ కంటనీరుగురియ నది నదియయ్యెను. భృగుశాపముచే నగ్ని సర్వభక్షకుడయ్యెను. హుతాశనుడు అగ్ని యాభృగుడను నుత్తమ బ్రాహ్మణునివలన శాపముపొంది కోపమునొందెను. ఆయననుగని బ్రహ్మ లోకకార్యము జరుగవలెనను నాసక్తితో నో వహ్నీ ! నీ జ్వాలలచే స్పృశింపబడినదెల్ల శుచియగును. శుచిభూతమైన దానినాతరువాత నీవు భక్షింతువు. దాన సందేహమక్కర లేదనెను. పులోమ రాక్షసుని నాశనము చ్యవనుని జననము అగ్నిజ్వాలలయొక్క శుచిత్వము నీకుదెల్పితిని. ఇక పులోముని వంశమును వినుము.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తరమహాపురాణము ప్రథమఖండమున చ్యవనజననమను నూటతొంబదితొమ్మిదవ అధ్యాయము.

## రెండువందల యధ్యాయము - ప్రహేతివంశ కీర్తనము

మార్కండేయః : పులోమ్నస్తనయః శ్రీమాన్ మధుర్నామ నిశాచరః ।
వినిష్కృష్య స్వకాచ్ఛూలా చ్ఛూలం ప్రాదా ద్వృషధ్వజః ॥ 1
తపసా తోషితోయస్య సపుత్రస్య మహాత్మనః । త్రైలోక్య విజయాసక్తేతేన రాజేంద్రః రావణే ॥ 2
దీక్షితే మేఘనాదేచ తథాయాతే నికుంభిలామ్ । అంతర్జలగతే వీరే తథైవచ విభీషణే ॥ 3
నిద్రావశగతే రాజన్ః కుంభకర్ణే సురద్విషి । మాలిన స్తనయా తేన రావణస్య స్వసా హృతా ॥ 4
కుంభీనసీ మహాభాగా రూపద్రవిణ సంయుతా । యస్యా మస్య సుతా జజ్ఞే లవణోనామ రాక్షసః ॥ 5
యేనశూల ప్రభావేణ మాంధాతా వినిపాతితః । న తస్య పుత్రో భార్యా వా బభూవాతి దురాత్మనః ॥ 6
ప్రాణినాం పురుషాద్యానాం సహస్రైర్దశభిర్నృపః ఆహార మాహ్నికం తస్య భవత్యాదరికస్య తు ॥ 7
రామాజ్ఞయా తస్య బభూవ రాజన్ః రామానుజో మృత్యురదీనసత్వః ।
శత్రుఘ్ననామా భువనస్య వీరో మహాంతరస్థో హరి రప్రమేయః ॥ 8

ఇతి శ్రీవిష్ణు ధర్మోత్తరే ప్రథమఖండే ప్రహేతి వంశాను కీర్తనం నామ ద్విశతతమోఽధ్యాయః.

మార్కండేయుడనియె. పులోముని కొడుకు మధువను రాక్షసుడు. శివుడు తనశూలమునుండి యింకొకశూలమును ఆకర్షించి వానికిచ్చెను. వాడును వానికుమారుడును చేసిన తపస్సునకు సంతోషించి యిదియిచ్చెను. రావణుడు ముల్లోకములం గెలువనుండ మేఘనాథుడు యజ్ఞదీక్షతో నికుంభిలా గుహలోనుండ వీరుడగు విభీషణుడు నీటిలోపలనుండ కుంభకర్ణుడు నిద్రవో నుండ నామధుడు రావణుని చెల్లెలు మాలియొక్క కూతురును కుంభీనసి యనుసుందరిని హరించెను. ఆమెయందు వీనికి లవణాసురుడు పుట్టెను. వాడు శూలముగొని మాంధాతను గూల్చెను. ఆ దుష్టునికి భార్యలేదు. పుత్రుడునులేడు. వాడు (బొదరికుడు) పొట్టచేతబట్టుకొనిపోయి (మిక్కిలి ఆకలిగొని) పదివేలమంది ప్రాణులను పురుషాదులను జంపి పగటిభోజనము చేయుచుండెను. రాముని యనుమతింగొని శత్రుఘ్నుడు సాక్షాద్విష్ణువు నంశమైనవాడు భువనైకవీరుడు వానిపాలిటికి మృత్యువయ్యెను.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తరమహాపురాణము ప్రథమఖండమున ప్రహేతివంశకీర్తనమను రెండువందల అధ్యాయము.

## రెండువందలఒకటవ అధ్యాయము - శైలూషవంశ వర్ణనము

మార్కండేయః : యక్షేన రాక్షసేజాతే తతఃకాలేన కేనచిత్ । ఏషా సుషావ గంధర్వం శైలూష మితి విశ్రుతమ్ ॥ 1
కోట్యస్తిస్రస్తు పుత్రాణాం తస్యాఽఽసన్ సుదురాత్మనః । ఏతస్మిన్నేవ కాలేతు విసృష్టాసు ప్రజాసుచ ॥ 2
బ్రహ్మాదిదేశ రాజ్యాని జాత్యాం జాత్యాం యథాక్రమమ్ । గంధర్వాణామధిపతిం చక్రేచిత్రరథం తథా ॥ 3
శైలూష పుత్రా గంధర్వా సంఘశః కృత నిశ్చయాః । శాసనేనైవ తిష్ఠన్తి తస్యచిత్రరథస్యతు ॥ 4
సింధోరుభయ కూలేషు దేశ ముత్సాద్య తే తదా । హత్వాచ మనుజాం స్తత్ర నివస న్తి గతవ్యథాః ॥ 5
ఉత్సాదయన్తో రాష్ట్రాణి రాజ్ఞాం విప్రియ కారకాః । తాన్శశాప స గంధర్వ రాజశ్చిత్రరథః ప్రభుః ॥ 6
అధర్మనితాః సర్వే మానుషా ద్వధ మాప్స్యథ! 7
శాపేన తస్యా ప్రతిమేన రాజన్! గంధర్వరాజాతి బలస్య సంఖ్యే ।
బభూవ మృత్యుర్భరతస్తుతేషాం దేహా న్తరస్థో హరి ర ప్రమేయః ॥ 8

ఇతి శ్రీవిష్ణుధర్మో త్తరే ప్రథమఖండే శైలూషవంశ వర్ణనం నామ ఏకాధికద్విశతతమోఽధ్యాయః.

మార్కండేయుడనియె. అవ్వల యక్షునివలన రాక్షసుడు కలిగినతరువాత కొంతకాలమున కికుంభీనసి శైలూషుడను గంధర్వుంగనెను. ఆదుష్టునకు మూడుకోట్లమంది పుత్రులుగల్గిరి. ఇదేసమయమున బ్రహ్మ ప్రజాసృష్టిచేసి యొక్కొక్కజాతి కొక్కొక్క రాజ్యము నిర్దేశించెను. గంధర్వులకు చిత్రరథుని రాజుంజేసెను. శైలూషుని కొడుకులు సంఘములుగావచ్చి యా చిత్ర రథుని శాసనమునందుండ నిశ్చయించుకొనిరి. వారు సింధునది కిరుతీరములందలి మనుజులంజంపి యా దేశమునందు నివసింప జొచ్చిరి. అక్కడి రాజుల కప్రియముసేసి రాష్ట్రముల పాడుచేసిరి. చిత్రరథుడు వారిని అధర్మనిరతులు కావున మీరు మనుష్యుని వలన వధింపబడుదురుగాక యని శపించెను. విష్ణువు నంశమై దేహముధరించిన భరతుడు వారిపాలిటికి మృత్యువయ్యెను.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తరమహాపురాణము ప్రథమఖండమున శైలూషవంశ వర్ణనమను రెండువందలయొకటవ అధ్యాయము.

## రెండువందలరెండవ అధ్యాయము - భరతప్రస్థానము

వజ్రః : శైలూష పుత్రా గంధర్వా భరతేన కథం హతాః । కిమర్థం తు మహాభాగః తన్మమాచక్ష్వ పృచ్ఛతః ॥ 1
మార్కండేయః: అయోధ్యాయా మయోధ్యాయాం రామే దశరథాత్మజే । కైకేయాధిపతిః శ్రీమాన్ యుధాజిన్నామ పార్థివః ॥
రామాయ ప్రేషయామాస దూతం భరత మాతులః । వృద్ధం పురోహితం గార్గ్యం యేన కార్యేణ తచ్ఛృణు ! 3
సింధో రుభయ కూలేషు రామ దేశో మనోహరః । హత్వా రణే మనుష్యేంద్రాన్ గంధర్వై ర్వినివేశితః ॥ 4
గంధర్వాస్తే చ రాజేంద్ర! రాజ్ఞాం విప్రియ కారకాః । లక్ష్మణం భరతం వాపి శత్రుఘ్న మథవా నృప ! 5
విసర్జ యిత్వా గంధర్వాన్ తాన్వినాశయ రాఘవ ! । రాజానో నిర్భయా స్సన్తు దేశాస్తు తథా తవ ॥ 6
దూతస్య వచనం శ్రుత్వా చింతయామాస రాఘవః । మేఘనాద వధే కర్మ లక్ష్మణేన మహత్ కృతమ్ ॥ 7
శత్రుఘ్నేన కృతం కర్మ లవణం చ వినిఘ్నతా । ప్రేషయిష్యామి భరతం గంధర్వస్య చ నిగ్రహే ॥ 8
ఇత్యేవం మనసి ధ్యాత్వా రామో భరత మబ్రవీత్ । గచ్ఛ గార్గ్యం పురస్కృత్య వత్సరాజ గృహం స్వయమ్ ॥ 9
మాతులేన సమాయుక్తః కైకయేంద్రగృహే తతః । జహి శైలూష తనయాన్ గంధర్వాన్ పాప నిశ్చయాన్ ॥ 10

ఏవముక్తస్స ధర్మాత్మా భరతో భ్రాతృవత్సలః । రామస్య పాదౌ శిరసా చాభివంద్య కృతాంజలిః । 11
గృహం గత్వా చకారాథ సర్వం ప్రాస్థానికం విధిమ్ ॥

వజ్రన్నపతి శైలూష పుత్రులగు గంధర్వులు భరతునిచే నెందుల కెట్లు హతులైరి తెల్పుమన మార్కండేయు డిట్లనియె. అయోధ్య (యుద్ధముసేసి గెలువరానిది) యగు నయోధ్యయందు దశరథకుమారుడైన రాముడుండగా కైకేయదేశాధిపతి శ్రీమంతుడు యుధాజిత్తు అను రాజు భరతుని మేనమామ రామునిదరికి వృద్ధుడైన పురోహితుని గార్గ్యుని దూతగాబంపెను. ఆ పంపిన పని వినుము. రామా! సింధువున కిరుప్రక్కలందు మనోహరమైన దేశమున్నది. మనుష్య రాజులం జంపి గంధర్వులు దాని స్వాధీనముంచు కొన్నారు. ఆ గంధర్వులు రాజులకు బాధ గల్గించుచున్నారు. లక్ష్మణుని భరతుని శత్రుఘ్నుని గాని పంపి రాఘవా! ఆ గంధర్వులను నశింప జేయుము. ఆ రాజులు నిర్భయులగుదురుగాక! ఆ దేశము నీదియు నగుగాక! అను దూతమాట విని రామచంద్రప్రభు వాలోచించెను. మేఘనాథుని (ఇంద్రజిత్తును) జంపుటలో లక్ష్మణుడు పెద్దపని సేసెను. రావణాసురవధలో శత్రుఘ్నుడు గొప్ప కార్యము నిర్వర్తించెను. గంధర్వ నిగ్రహమునకు భరతునంపెదను. అని మనసులో ధ్యానముసేసి రాముడు భరతునితో నిట్లనెను. వత్సా! భరతా! గార్గ్యునితో రాజగృహమున కేగి మామయ్యతో గలిసి కైకయేంద్ర మందిరము నుండి యాపై జనిపాపనిశ్చయులైన శైలూషసుతుల గంధర్వులం గూల్పుము. అన విని యా ధర్మాత్ముడు భ్రాతృవత్సలుడు భరతుడు రామపాదములం దలమోపి మ్రొక్కి సెలవొగ్గి తన సౌధమున కేగి ప్రాస్థానిక మంగళము సర్వము నొనరించెను.

ఓషధీనాం కషాయేణ తదోత్ప్లావిత విగ్రహః ॥ 12
గౌర సర్షప కల్కేన ప్రసాదిత శిరోరుహః । తీర్థ సారస నాదేయైః సలిలైశ్చ స సాగరైః 13
చందన స్రావ సంమిశ్రైః కుంకుమ క్షోద సంయుతైః । సర్వౌషధి స మాయుక్తైఃసర్వగంధ సమన్వితైః ॥ 14
మంత్రపూతై ర్మహాతేజాః సస్నౌ రాఘవ వర్ధనః । శంఖ భేరీ నినాదేన పణవానాం స్వనేనచ ॥ 15
ఆనకానాంచ శబ్దేన నిస్వనేన చ వందినాం । సూత మాగధ శబ్దేన జయకారై స్తథైవచ ॥ 16
తుష్టువుః స్నానకాలే తం స్తవై ర్మంగల పాఠకాః ; తథోపతస్థు ర్గీతేన గంధర్వాప్సరసాం గణాః ॥ 17

అనేక మూలికల కషాయముల నొడలికిం బూసికొని తెల్ల ఆవాలముద్ద తలకుం బూసికొని తీర్థముల సరస్సులు పుణ్య నదులయు నుదకములతో సముద్రోదకములతో చందన ద్రవముతో కుంకుమపూవు చూర్ణముతో సర్వౌషధులతో సర్వగంధ పరిమళములతోడి మంత్ర పూతములైన జలములతో నా మహాతేజస్వి మంగళ స్నానము సేసెను. శంఖ భేరీపణవానక వాద్యములు మ్రోయ వందిమాగధసూతాదులు మంగళపాఠములు జయజయ నినాదములు నెఱపుచు నా మహానుభావుని స్నాన సమయమున స్తోత్ర పాఠముల స్తుతించిరి. అట్లె గంధర్వాప్సరోగణములు పాటలు పాడుచు సేవింపవచ్చిరి.

స్నాతః స భరతో లక్ష్మ్యా యువ రాజాభి రూపయా । విలిప్తః చారు సర్వాంగః చందనేన సుగంధినా ॥ 18
అహతాంబర సంవీతః శ్వేత మాల్య విభూషణః । కుండలీ సాంగదీ మౌళీ సర్వ రత్న విభూషితః ॥ 19
అంతస్థః పూజయా మాస దేవదేవం త్రివిక్రమమ్ । గంధ మాల్య నమస్కార ధూపదీపాది కర్మణా ॥ 20
పూజ యిత్వా జగన్నాథ ముపతస్థే హుతాశనమ్ । సుహుతం బ్రాహ్మణేంద్రేణ రాఘవానాం పురోధసా ॥ 21
గోభిర్వస్త్రైర్హిరణ్యైశ్చ తురంగ కరి పుంగవైః । మోదకైః సఫలైః ర్దధ్నా గంధై ర్మాల్యై స్తథాక్షతైః ॥ 22
స్వస్తి వాద్యాం స్తదా విప్రాన్ మహాత్మా భూరిదక్షిణః । వ్యాఘ్ర చర్మోత్తరే రమ్యే సూప విష్టో వరాసనే ॥ 23
ఆయుధా నంతరం చక్రే ధ్వజ చ్ఛత్రాభి పూజనమ్ । స్వస్తికాన్ వర్ధమానాంశ్చ నంద్యా వర్తాం స్తథైవచ ॥ 24
నద్యః కాంచన విన్యస్తాః శంఖః సత్కమలాంజనమ్ । పూర్ణ కుంభం గజ మదం దూర్వాః సార్ద్రంచ గోమయమ్ ॥ 25

రత్నా నాదాయ బిల్వం చ చాపమాదాయ సత్వరః । సశరం రాఘవ శ్రేష్ఠః పద ద్వాత్రింశకం యయౌ ॥ 26
శ్రేష్ఠ మశ్వం సుచంద్రాభం హేమ భాండ పరిచ్ఛదమ్ । ఆరుహ్య నిర్యయౌ శ్రీమాన్ జయ కారాభి పూజితః ॥ 27
పౌర జానపదా మాత్యైః వాద్య ఘోషేణ భూరిణా । హ్రాదేన గజఘంటానాం బృంహితేన పునః పునః ॥ 28
హ్రేషితేన తురంగాణాం నరాణాం క్ష్వేడితేనచ । ద్విజ పుణ్యాహ ఘోషేణ ప్రయాతో భూరిదక్షిణః ॥ 29

భరతుడు మంగళస్నానముసేసి యువరాజలక్ష్మీవైభవముతో మేనెల్ల సుగంధము చక్కగా బూసికొని మడుపు దోవతులు దాల్చి తెల్లని మాల లలంకరించికొని కుండలములు భుజకీర్తులు కిరీటము సర్వరత్నభూషణములు దాల్చి గృహమునందున్న దేవ దేవుని త్రివిక్రముని గంధమాల్య నమస్కార ధూపదీపాదులచే పూజించెను ఆమీద రాఘవుల పురోహితుడగు బ్రాహ్మణుడు వేల్పు నగ్ని కుపస్థానముసేసెను. గోవులు వస్త్రములు బంగారపు కాసులు గుఱ్ఱములు గజశ్రేష్ఠములు మోదకములు (లడ్డులు) పండ్లు గంధమాల్యములు అక్షతలు మొదలగు మంగళపదార్థములచే భూరిదక్షిణలిచ్చి విప్రులం బూజించి, వ్యాఘ్రచర్మముపైన పరచిన శుభాసనమునందు గూర్చుండి యాయుధములం బూజించిన మీద ధ్వజచ్ఛత్రములను బూజించి పూర్ణకుంభములలో రకాలు స్వస్తి కములు వర్ధమానములు (మూకుళ్ళు) నంద్యావర్తములను కాంచనకుంభములందు బవిత్ర నదీజలముల శంఖము కమలాంజనము పూర్ణకుంభము గజమదము దూర్వలు (గరిక) తడిగోమయమును రత్నములను బిల్వము బాణములతో ధనువును జేకొని సత్వరుడై ముప్పదిరెండడుగులు నడచెను. ఆమీద చంద్రునట్లు శోభించు బంగారుకుంభాలంకృతమైన జీనుతోడి శ్రేష్ఠమైన గుఱ్ఱము నధిష్ఠించి శ్రీమంతుడతడు జయజయ నాదములచే బూజింపబడుచు పౌరజానపదమంత్రులతో వాద్యములు మ్రోయ ఏనుగుల గంటల సడితో మరిమరి వినవచ్చు గజ బృంహితములతో, ఉత్తమాశ్వముల సకిలింపులతో నరులయొక్క (పరివారభటవర్గముయొక్క) క్ష్వేడితము లతో (ఉత్సాహముతో జేయు శబ్దములతో) ద్విజులు సేయు పుణ్యాహవాచనఘోషముతో నా భూరిదక్షిణుడైన (అనేక యజ్ఞములు చేసిన) భరతుడు జైత్రయాత్ర వెడలెను.

భరతస్య ప్రయాణేతు దేవాః శక్ర పురోగమాః । ముముచుః పుష్ప వర్షాణి వాచ ఊచుః శుభా స్తథా ॥ 30
ఏష విగ్రహ వాన్ ధర్మః ఏష సత్యవతాం వరః । ఏష వీర్యవతాం శ్రేష్ఠో రూపేణాఽ ప్రతిమో భువి ॥ 31
అనేన యత్కృతం కర్మ రామే వన ముపాగతే । న తస్య కర్తా లోకేఽస్మిన్ దివివా విద్యతే క్వచిత్ ॥ 32
అనేన రాజ్యం సంత్యక్తం గృహందగ్ధ మివాగ్నినా । అనేన దుఃఖ శయ్యాసు శయితం సు మహాత్మనా ॥ 33
నిత్య మాసన్న భోగేన జటా వల్కల ధారిణా । ఫల మూలాశినా ఽనేన రామరాజ్యం హి పాలితమ్ ॥ 34
శృణ్వన్ సువాక్యాని సురేరితాని రామానుజో రామగృహం జగామ ।
శూరాఽఽర్య విద్వ త్పురుషోపకీర్ణం రత్నైర్యథాసాగర మప్రమేయమ్ ॥ 35

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే భరత ప్రస్థాన వర్ణనం నామ ద్వ్యాధిక ద్విశత తమోఽధ్యాయః.

భరతుని ప్రయాణమందు శక్రాది దేవతలు పూలవానలం గురియించి శుభవచనములు పల్కిరి. వారి వచనము లివి : ఇతడు రూపుగొన్న ధర్మము. ఇతడు సత్యవంతులలో మేటి. ఇతడు వీర్యవంతులలో శ్రేష్ఠుడు. రూపముచే నవని మరి సాటిలేని వాడు. రాముడు వనవాసమునకేగినపుడీతడు సేసినపని సేయువాడీలోకమందు మరియొకడులేడు. ఇతడు రాజ్యము ద్యజించెను ఇల్లు పాడువెట్టెను. ఈమహానుభావుడు కటికనేల శయనించెను. భోగములరచేతనున్నను నిత్యము జటావల్కములు ధరించి పండ్లు దుంపలు దిని రామరాజ్యము పాలించెను. ఇటు వేల్పులు పలుకు వాక్యములాలించుచు రామానుజుడు రామగృహమునకేగెను. ఆ గృహము రత్నములతో సాగరమట్లు శూరులు ఆర్యులు (పెద్దలు పూజ్యులు) విద్వాంసులతో సమ్మర్దమై యుండెను.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున భరతప్రస్థానవర్ణనము రెండువందలరెండవ యధ్యాయము.

## రెండువందలమూడవయధ్యాయము - భరతానుయాత్రిక వర్ణనము

మార్కండేయః : గృహాత్ ప్రయాతే భరతే ప్రస్థానార్థిని యాదవః ప్రాగేవ లక్ష్మణం రామో నిత్యోద్యుక్త మభాషత ॥
అనుయానం కుమారస్య భరతస్య మహాత్మనః । ప్రేషయాఽశ్వ సహస్రాణాం శతాని త్రీణి రాఘవ! 2
దశదంతి సహస్రాణి రథానాం షడ్ గుణానిచ । కోట్యః పంచ పదాతీనాం సమరేష్వనివర్తినామ్ ॥ 3
ధనాధ్యక్షా స్తథావత్స మనుగచ్ఛన్తు లక్ష్మణః గోరథైశ్చ తథా పుష్టైర్గోభి రుష్ట్రై స్తథైవచ ॥ 4
వ్యాయతైః పురుషైరశ్వైర్గర్దభైశ్చ తథా వరైః । వస్త్రరూప్య సువర్ణానాం మణీ నామపి భాగశః ॥ 5
విసర్గాయ కుమారస్య పరిపూర్ణా యథా సుఖమ్ । బ్రాహ్మణాః కథయా ముఖ్యా స్తథైవ నటనర్తకాః ॥ 6
గీతే నృత్తే తథాలాస్యే ప్రవీణాశ్చ వరాంగనాః । ప్రాస్థాని కాశ్చయేకేచి త్వాన విక్రయిణశ్చయే ॥ 7
రూపాజీవాశ్చ వణిజో నానా పణ్యోప జీవినః । నానా రూపము పాదాయ బహు పణ్యం ప్రజన్తువై ॥ 8
విషవైద్యా శ్శల్య వైద్యాఃతథా కాయ చికిత్సకాః । కర్మాంతికాః స్థపతయో మార్గిణో వృక్షరోపకాః ॥ 9
కూపకారాః సుధాకారాః వంశకర్మకృత స్తథా । వారిక్కారాశ్చ యేకేచిత్ కర్మకా రాశ్చ శోభనాః ॥ 10
పరికర్మకృతశ్చైవ తథా వస్త్రోప జీవినః : మాయూరికా స్తైత్తిరికా శ్చేతకా భేదకాశ్చయే ॥ 11
రంజకా దంత కారాశ్చ తథా దంతోప జీవినః । ఏరండ వేత్రకారాశ్చవట కారాశ్చ శోభనాః ॥ 12
ఆరకూటకృతశ్చైవ తామ్రకూటా స్తథైవచ । భూర్జకూటాః ఖడ్గకారాః గుడసీధు ప్రపాచకాః ॥ 13
ఔరభ్రికాః మాహిషకాస్తున్న వాయాశ్చ లక్ష్మణః । యేచాభిష్టావకాః కేచిత్సూత మాగధ వందినః ॥ 14
చైల నిర్ణేజకాశ్చైవ చర్మకారా స్తథైవచ । అంగార కారాశ్చతథా లుబ్ధకా యేచ ధీవరాః ॥ 15
కబంధ ధారిణోయేచ యేచ కాష్ఠ ప్రపాటకాః । వస్త్రసీవన సక్తాశ్చ గృహకారాశ్చ యేనరాః ॥ 16
కుంభకారాశ్చ యేకేచి చ్ఛక్రశువర్ధకినశ్చయే : లేఖకా గణకాయేచ తథా తండుల కారకాః ॥ 17
సక్తుకారాశ్చ యేకేచి చ్ఛాక పణ్యోపజీవినః । తైలికా గాంధికాశ్చైవ తీర్థ సంశుద్ధి కారకాః ॥ 18
చిత్రకర్మవిదోయేచ యేచ లాంగూలికాజనాః । సూతాః పౌరోగవాశ్చైవ సౌవిదల్లాశ్చ లక్ష్మణః ॥ 19
గోపా వనచరాయేచ నదీతీర విచారణాః । గోసంఘై ర్మహిషీ సంఘై స్తేఽనుయాన్తు యథాసుఖమ్ ॥ 20
శ్రేణీ మహత్తరాయేచ గ్రామఘోష మహత్తరాః । తథైవాటవికాయేచ యేచ శైలవిచారిణః ॥ 21
సౌమిత్రేః సర్వ ఏవైతే సుభృతాశ్చ సుపూజితాః । అనుయాన్తు కుమారం మేభరతం భ్రాతృవత్సలమ్ ॥ 22
ఇత్యేవ ముక్తస్సతు తాన్సమస్తా నాజ్ఞాపయామాస నరేంద్రవాక్యాత్ ।
ఆమంత్ర్య రామంశిరసాచసర్వే వినిర్యయుస్తే నగరాత్ ప్రహృష్టాః ॥ 23

ఇది శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
అనుయాత్రిక వర్ణనం నామ త్ర్యధిక ద్విశతతమోఽధ్యాయః.

మార్కండేయుడిట్లనియె. విజయప్రస్థానమెంచి భరతుడు గృహమువెడలు నంతమున్న రాముడు నిత్యోద్యుక్తుడైయున్న (రామచంద్రుని నాజ్ఞసేయ నిరంతరము సన్నద్ధుడైయుండు) లక్ష్మణుని మహాత్ముడగు భరతకుమారుని కనుయానము సేయ వలెనని పలికెను. ఆ వెంబడింపవలసినవి పదివేలయేనుగులు అరువదివేల రథములు అని వెనుదిరుగని పదికోట్లమంది కాల్బలము ధనాధ్యక్షులు నీవత్సననుగమింపవలెననియె. మరియు పుష్టములయిన యెద్దంబూన్చిన బండ్లు. ఒంటెలు గుఱ్ఱాలు గార్దభములు

నరులును మోయు బండ్లను భరతకుమారునివెంట నేగవలయును. వస్త్రములు రూప్యములు (వెండి) సువర్ణములు మణులు దానముసేయునిమిత్తమనుపుము. లక్ష్మణా! భరతయశః కథలుసెప్పు బ్రాహ్మణశ్రేష్ఠులు నటులు నర్తకులు పాటలో నాటలో లాస్యములో ప్రవీణులైన యలివేణులు ప్రాస్థానికులయిన పానవిక్రయులు రూపాజీవలైన విలాసినులు (భోగవనితలన్నమాట) నానావస్తువ్యాపారముసేయు వణిజులు నానావిధమైన పణ్యసమృద్ధిని (సమృద్ధసామగ్రులను) గొని వెంబడింపుదురు గాక! విషవైద్యులు శల్యవైద్యులు శరీరచికిత్సకులు కర్మాంతికులు (ఇనుము మొదలయిన పనులుచేయు కమ్మరులు) స్థపతులు (శిల్పులు) మార్గిణులు (దారిబాగుసేయువారు) వృక్షరోపకులు (చెట్లునాటువారు) కూపకారులు (నూతులుత్రవ్వువారు) సుధాకారులు (వెల్లవేయువారు) వంశకర్మకరులు (వెదురుపనులుసేయువారు మేదరులన్నమాట) వాణిక్కారులు శోభనులైన కూర్చకారులు పరికర్మ (అలంకరణ) కరులు బట్టలునేయువారు మాయూరికులు తైత్తిరికులు చేతకులు భేదపులు రంజకులు దంతకారులు దంతోపజీవులు ఏరండ వేత్రకారులు కటకారులు (చాపలల్లువారు) ఆరకూటకరులు (ఇత్తడి పనివాండ్లు) తామ్రకూటులు (రాగిపనివాండ్రు) భూర్జకూటులు ఖడ్గకరులు (కత్తులు తయారుసేయువారు) గుడసీధు ప్రపాదకులు (బెల్లపుకల్లు కాచువారు) ఔరభ్రకులు మాహిషకులు తున్నవాయులు (నేతగాండ్రు) అభిష్టావకులు (పాటలుపాడి స్తుతించువారు) సూత వంధిమాగధులు చైలనిర్ణేజకులు బట్టలకు రంగు వేయువారు (అద్దకాల పనివాండ్రు) చర్మకారులు అంగారకారులు లుబ్ధకులు (బోయలు) ధీవరులు చేపలుపట్టువాండ్రు (పల్లెవాండ్రు) కబంధధారులు కాష్ఠప్రపాటకులు (కట్టెలుగొట్టువాండ్రు) వస్త్రసీవనసక్తులు (బట్టలుకుట్టువారు, దర్జీలు) గృహకారులు (ఇండ్లుకట్టువారు) కుంభకారులు (కమ్మరులు) శ్మశ్రువర్ధకులు (గడ్డపుపని చేయువారు) లేఖకులు (వ్రాతకారులు, గుమాస్తాలు) గణకులు (లెక్కగాండ్రు) తండులకారకులు (బియ్యముదంపువారు) సక్తుకారులు (పేలపిండి పగ్గెరాలు చేయువారు) కూరలమ్మువాండ్రు తైలికులు (తెలుకలవాండ్రు) గ్రాంథికులు తీర్థసంశుద్ధికారకులు (రేవులనూడ్చి బాగుసేయువారు) చిత్రకర్మవిదులు (చిత్రకరులు) లాంగూలికులు సూతులు పౌరోగవులు సౌవిదల్లులు గోపులు వనచరులు నదీతీరచరులు నీ మొదలుగనందరు మనచే బక్కగ పోషింపబడుదురు. లెస్సగా సత్కరింపబడినవారు వీరందరు. సౌమిత్రీ! భ్రాతృవత్సలుడైన భరతునివెంట ఆలమందలతో గేదెలమందలతో సుఖముగ నేగవలయును. అని యిట్లు రామునిచే నానతీయబడి యా సార్వభౌము వాక్యానుసారమయ్యందరను భరతుడాజ్ఞాపించెను. శిరమువంచి నమస్కరించి రాముని సెలవుగైకొని యయ్యందరు నానందభరితులై నగరము వెడలిరి.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తరమహాపురాణము ప్రథమఖండమున భరతానుయాత్రిక వర్ణనము రెండువందలమూడవ అధ్యాయము.

## రెండువందలనాల్గవ అధ్యాయము - భరత ప్రస్థానము

మార్కండేయః : ఏతస్మిన్నేవ కాలేతు రామః శుశ్రావ తన్మహత్ । శంఖవాద్య రవోన్మిశ్రం భరతస్యానుయాత్రికమ్ ॥
రాజద్వారముపాగత్య భరతోఽపి మహాయశాః । పద్భ్యాం జగామ రాజాన మవతీర్య తురంగమాత్ ॥ 2
స దదర్శ తదా రామం రత్నసింహాసన స్థితమ్ । అనులిప్తం పరార్ధ్యేన చందనేన సుగంధినా ॥ 3
సూక్ష్మం వసానం వసనం సర్వాభరణ భూషితమ్ । తేజసా భాస్కరాకారం సౌందర్యేణోడుపోపమమ్ ॥ 4
క్షమయా పృథివీతుల్యం క్రోధే కాలానలోపమమ్ । బృహస్పతిసమం బుద్ధ్యా విష్ణుతుల్యం పరాక్రమే ॥ 5
సత్యేదానేఽప్యనౌపమ్యం దమే శీలేచ రాఘవమ్ । పురోహితై రమాత్యైశ్చ యుతం ప్రకృతిభి స్తథా ॥ 6
దృష్ట్వా తం భరతః శ్రీమాన్ జగామ శిరసా మహీమ్ । భరతం యువరాజానం రామాయ విదితాత్మనే ॥ 7
న్యవేదయత ధర్మాత్మా ప్రతీహారః సలక్ష్మణం । ఉత్థాయ కంఠే జగ్రాహ రామోఽపి భరతం తదా ॥ 8

మూర్ధ్నిచైన ముపాఘ్రాయ ఆదిదేశాస్య చాసనమ్ । భరతంతు సుఖాసీనం రామోవచన మబ్రవీత్ ॥ 9

మార్కండేయుడనియె : ఇదేసమయమందు శంఖవాద్యాదులతో మిశ్రమైన భరతుని యనుయాత్రికుల పెనుసందడిని రాముడాలించెను. భరతుడును రాజద్వారమున కేతెంచి గుఱ్ఱము దిగి పాదచారియై రాజుదరికేగెను. అతడయ్యెడ రత్నసింహాసనమందున్న రాముని దర్శించెను ఘుమఘుమలాడు గడువిలువైన గంధముపూసికొని మిక్కిలి జిలుగైన వసనములం దాల్చి సర్వాభరణ భూషితుడై తేజమున భాస్కరుని రూపై యందమున నుడురాజు నెనయై ఓర్పున పృథివికీడై కోపమున కాలానలుడట్లై బుద్ధిచే బృహస్పతికి సరియై పరాక్రమమందు విష్ణువు సమమై సత్యమందు దానమందు దమమందు (ఇంద్రియనిగ్రహమందు) శీలమందు సాటిలేకున్న రాఘవుని పురోహితులతో మంత్రులతో బ్రకృతులతో బేరోలగమైయున్న ప్రభువును శ్రీమంతుడు భరతుడు చూచి తలతో నిలనంటి మ్రొక్కెను. యువరాజు భరతుని లక్ష్మణునితో వచ్చినవానిని నాత్మవిదుడగు రామునికి ప్రతీహారుడెరింగించెను. రామచంద్రుడును లేచి భరతునపుడు కంఠముగొని కౌగలించెను. శిరముమూర్కొనెను. కూర్చుండ నాసనము నూపెను. సుఖాసీనుండై నంత భరతునితో రాముడిట్లనియె.

గంధర్వ పుత్రాంస్తాన్‌హత్వా కర్తవ్యం నగర ద్వయమ్ సింధోరుభయ పార్శ్వేతు పుత్రయో రుభయోః కృతే ॥ 10
అభిషిచ్య తదా వత్స! పుత్రౌ నగరయోస్తయోః । యుధాజితి పరీధాయ క్షిప్రమాగన్తు మర్హసి ॥ 11
త్వయా వినా నరవ్యాఘ్ర! నాహం జీవితు ముత్సహే । క్షత్రధర్మం పురస్కృత్య తత్ర త్వం ప్రేషితో మయా ॥ 12
సత్వం గచ్ఛ! మహాభాగ! మాతేకాలాత్యయో భవేత్ । స్వస్త్యస్తు తేంతరిక్షేభ్యః పార్థివేభ్యశ్చ గచ్ఛతః ॥ 13
దివ్యేభ్యశ్చైవ భూతేభ్యః సమరే చతథాఽనఘః । 14
స్వాం స్వాం దిశ మధిష్ఠాయ దిక్పాలా దీప్తతేజసః । పాలయన్తు సదా తుభ్యం దీప్త విగ్రహధారిణః ॥ 15
బ్రహ్మావిష్ణుశ్చ రుద్రశ్చ సాధ్యాశ్చ సమరుద్గణాః । ఆదిత్యా వసవోరుద్రాః అశ్వినౌచ భిషగ్వరౌ ॥ 16
భృగవోంగిరసశ్చైవ కాలస్యావయవాస్తథా । సరితస్సాగరాః శైలాః సముద్రాశ్చ సరాంసిచ ॥ 17
దైత్యదానవ గంధర్వాః పిశాచోరగ, రాక్షసాః । దేవ పత్న్యస్తథా సర్వాః దేవమాతర ఏవచ ॥ 18
శస్త్రాణ్యస్త్రాణి శాస్త్రాణి మంగళాయ భవన్తుతే । విజయం దీర్ఘమాయుశ్చ భోగాంశ్చాన్యాన్ దిశన్తుతే ॥ 19

గంధర్వపుత్రులం జంపి సింధునదికి నిరువైపుల నీ యిర్వురు కుమారులకు రెండు పురములను నిర్మింపవలయును. వత్సా ! ఆ నగరముల రెండింట కుమారులను బట్టాభిషేకించి యుధాజిత్తున కప్పగించి నీవు వేగమ యిటకు రాదగును. నిను విడిచి నేను జీవింపనొల్లను. క్షత్రధర్మముంబట్టి నిన్నేనటకంపుచున్నాను. మహాభాగ ! నీవటు చనుము. విలంబము సేయవలదు. నీకు నంతరిక్షమందలి భూమియందలి దివమందలి భూతములవలన యుద్ధమందు నీకు శుభమగుగాక ! దిక్పాలురు తమతమ దిక్కులందుండి దీప్తతేజులుద్దీపించు విగ్రహములందాల్చి నీకొరకు రక్షణసేయుదురుగాక! బ్రహ్మ విష్ణువు రుద్రుడు సాధ్యులు మరుత్తులు ఆదిత్యులు వసువులు రుద్రులు దేవవైద్యపరులశ్వినులు కాలావయములయిన భృగులు ఆంగిరసులు సరిత్తులు సాగరములు శైలములు సముద్రములు సరస్సులు దైత్య దానవ గంధర్వులు పిశాచులు నాగులు రాక్షసులు దేవపత్నులందరు దేవమాతలు శస్త్రములస్త్రములు శాస్త్రములు నీ మంగళముకొరకగుంగాక ! విజయము దీర్ఘాయువు భోగములను నీకనుగ్రహింతురుగాక !

ఇతిస్వస్త్యయనం శ్రుత్వా రాజ్ఞా స సముదీరితమ్ । రామస్య పాదౌ శిరసా త్వభివంద్య ధనుర్ధరః ॥ 20
నిర్గత్య రాజభవనా ద్రామాజ్ఞా కల్పితం జగత్ । హిమాద్రికూట సంకాశం చారు దంష్ట్రోజ్వలాననమ్ ॥ 21
మదేన సించమానంచ నృపవేశ్మాజిరం నృపః సమాక్రాంత కటం చాపి పానలుబ్ధ శిలీముఖైః ॥ 22
స్తబ్ధచారు మహాకర్ణం మధుప కృపయైవతు । దీర్ఘాగ్ర మధ్వక్షకృతం కృత శృంగావతంసకం ॥ 23
స్వాసనం వ్యూఢ కుంభంచ తథోదగ్రం మహాబలమ్ । నక్షత్రమాలాం శిరసా ధారయానంతు కాంచనీమ్ ॥ 24

పటుస్వనే తథాఘంటే దర్శనీయే మనోహరే । కుథం విచిత్రరమ్యంచ కోవిదారం మహాధ్వజమ్ ॥ 25
వైజయన్త్యః పతాకాశ్చ కింకిణీజాల మాలితాః । సమారూఢం నయవిదా మహా మాత్రేణ ధీమతా ॥ 26
వైడూర్య దండతీక్ష్ణాగ్ర కాంచనాంకుశధారిణా । జఘనస్థేన చాన్యేన వరతోమర ధారిణా ॥ 27
తథావైజయికైర్మంత్రైః దైవజ్ఞేనాభి మంత్రితమ్ । ఆరురోహ మహాతేజాః జయశబ్దాభినందితః ॥ 28
పూర్ణేందు మండలాకారం రుక్మదండం మనోహరమ్ । ఛత్ర మాదాయ తంప్రేమ్ణాచారురోహ స లక్ష్మణః ॥ 29
చామరౌద్వౌ సమాదాయ చంద్రరశ్మి సమప్రభౌ । ఆరూఢం యోషితో ర్యుగ్మం రూపేణాప్రతిమం భువి ॥ 30
తం సమారుహ్య నాగేంద్రం మదలేఖాభిగామినమ్ । జగామ సహ గార్గ్యేణ రథా రూఢేన యాదవ ! 31
త మన్వయాన్ మహాభాగః చతురంగ మహాబలమ్ । పతాకాధ్వజ సంబాధం కల్పయన్తం వసుంధరామ్ ॥ 32
శ్యేనాః కాకవహాః కంకాః పిశాచా యక్ష రాక్షసాః । యయుః పురస్సరా స్తస్య భరతస్య మహాత్మనః ॥ 33
గంధర్వ పుత్రమాంసానాం లుబ్ధా మాంసోపజీవినః । తూర్యఘోషేణ మహతా వందినాం నిస్స్వనేనచ ॥ 34
వాయునా చానులోమేన సేవ్యమానః సుగంధినా! । మంగళానాంచ ముఖ్యానాం దర్శనా ద్ధృష్టమానసః ॥ 35
నిర్యయౌ రాజమార్గేణ జన సంబాధశాలినా । తేజస్వినాంచ తేజాంసి హృదయానిచ యోషితామ్ ॥ 36
ఆదదానో మహాతేజా నగరాత్స వినిర్యయౌ । క్రోశమాత్రం తతో గత్వా సమేదేశేచ సోదకే ॥ 37
ప్రశ స్తద్రుమ సంకీర్ణే శిబిరం ప్రాజ్ఞ్ని షేవితమ్ । సేనాధ్యక్షైః సునిపుణైః వివేశ భరత స్తదా ॥ 38

అని యిట్లు తేనిచే బలుకబడిన స్వస్త్యయనమును (మంగళాశాసనమును) విని భరతస్వామి రామచరణముల శిరముచే మ్రొక్కి ధనువూని రాజభవనము రామాజ్ఞావశమై యున్న జగమును దాటి హిమగిరిశృంగమట్లున్నది చక్కనిద ంతములతో దీపించు మోముగలది మధుపములపై (మూగు తుమ్మెదలపై) దయగలదట్లు కదల్చుకున్న చక్కని చెవులు గలది తుదిని నిడుదలై మద ఘూర్ణితములైన కన్నులు గలది ఒక శృంగపతంసముగా (శిరోభూషణముగ) దాల్చినది సుపుష్టమైన కుంభస్థలము గలది సుఖముగ కూర్చుండనైనది మహాబలశాలి భయముగొలుపునదియు శిరమున బంగారు నక్షత్రమాలం దాల్చినది (27 బంగారు పూసలుగల మాల యన్నమాట) పెద్దగ ధ్వనించు రెండు చక్కని ఘంటలు మెడలో వ్రేలాడుచున్నది రంగురంగుల రమ్యమైన కుథము = రత్న కంబళి (అంబారిలో గూర్చుండుట కమర్చిన తివాసీ యన్నమాట) కోవిదారధ్వజము = కాంచనవృక్షము చిరుగంటల మాలలతోడి వైజయంతీపతాకల నలంకృతమైనది గజశాస్త్రమెరిగిన బుద్ధిమంతుడు వైడూర్యమణిదండముగల్గి పదునైన యగ్రముతో బంగారు తొడుగుగల యంకుశము ధరించిన మావటీడు పైనెక్కినది వెనుకభాగమున గట్టి తోమరమూని యింకొక మావటీడెక్కి కూర్చున్న దియు, వైజయిక మంత్రములచే దైవజ్ఞుడు (జ్యోతిషికుడు) అభిమంత్రించినదియునగు మహాగజమును మహాతేజస్వి భరతుడు జయ జయ నినాదములచే నభినందితుండగుచు నెక్కెను.

లక్ష్మణుడును సంపూర్ణ చంద్రమండలమువంటిది బంగారుదండముగలది మనోహరమైనదియునగు ఛత్రమునుంగొని (తెల్లగొడుగు) ప్రేమతో లక్ష్మణుడునెక్కెను. చంద్రకిరణములట్టి ప్రభగల రెండుచామరములూని నిరుపమాన సౌందర్యవతు లిద్దరు సుందరీమణులు నా యేనుగెక్కిరి. ఓ యాదవ! మదరేఖననుసరించి నడుచుచున్న యా గజేంద్రమెక్కి రథమునెక్కి యేతెంచుచున్న గార్గ్యునితో (పురోహితుడితో) భరతుండేగెను. చతురంగమహాసైన్యము పతాకాధ్వజ నికరముచే వసుంధరను సమ్మర్దపరచుచు నతనిని వెంబడించెను. శ్యేనములు (డేగలు) కాక వహములు కంకములు పిశాచములు యక్షరాక్షసవర్గములు మాంసలుబ్ధములై గంధర్వపుత్ర మాంసములపై నాసగొని యా మహానుభావుడు భరతుని ముందేగినవి. గొప్ప వాద్యఘోషముచే వందిజనస్వనముచే అనుకూల పరిమళవాయువుచే సేవింపబడుచు సుముఖ్యములైన మంగళపదార్థముల దర్శనమున నానందభరిత మైన మనస్సుతో జనసమ్మర్దమైన రాజమార్గమువెంట భరతుడు విజయయాత్ర వెడలెను. తేజశ్శాలుర తేజస్సులను రమణీమణుల

హృదయములను ఆకర్షించుచు నమ్మహాతేజస్వి నగరమునుండి వెడలెను. అటు క్రోశమాత్రముగడచి ఉదకసమృద్ధము సమము నైన ప్రశస్తవృక్షసంకీర్ణమైన చోట నంతమున్న సునిపుణులైన సేనాధ్యక్షులు విడిదిచేసిన శిబిరము నతడు ప్రవేశించెను.

స ప్రవిశ్య మహాతేజాః శిబిరం స్వం నివేశనమ్ । మంగళాలంభనం కృత్వా వరాసన గతః ప్రభుః ॥ 39
పౌరజాన పదం సర్వం ప్రేషయామాస యాదవః । పరిష్వజ్య తతః పశ్చాల్లక్ష్మణం శుభలక్షణమ్ ॥ 40
మూర్ధ్నిచైన ముపాఘ్రాయ ప్రేషయామాస ధర్మవిత్ । ప్రాయాణంకచ శ్వోభూతే దుందుభిస్తాద్యతాం మమ ॥ 41
దైశికాః పురతో యాన్తు యేచ వృక్షావరోహకాః । ఆజ్ఞాప్య సకలం చైవ శిబిరం చ తథావిధమ్ ॥ 42
అవృక్షేషు తు దేశేషు రోపయన్తు ద్రుమాం జనాః । ద్రుమాః కంటకిన శ్చైవ యేచ మార్గ ప్రరోధకాః 43
ఛిన్దన్తు గత్వా తా నద్య తీక్ష్ణైః శీఘ్రం పరశ్వథైః । తోయ హీనేషు దేశేషు కూపాన్ కుర్వన్తు మే తథా ॥ 44
విషమాంశ్చ తథా దేశాన్ సమాన్ కుర్వన్తు మే పథి । తీరాణి సరితాం చైవ కుర్వన్తు పులినానిచ ॥ 45
న భవే ద్యేన సంఘట్టో జనస్య పథి యాస్యతః । పురః ప్రయాన్తు సైన్యేన విజయే రతివర్ధనాః ॥ 46
నీల శ్చ నక్రదేవ శ్చ వసుమాన్ మునయ స్తథా । మధ్య ప్రయాణే గాంధారో జయనాభో రణోత్కటః ॥ 47
సుశీలః కామపాలశ్చ యాన్తు సైన్యేన దంశితాః ॥ జఘనం కటక స్యాహం పాలయానో యథాసుఖమ్ ॥ 48
సైన్యేన సహ యాస్యామి విజయాయ నృపస్యతు । పశ్యన్తు దైశికాః స్థానం ప్రభూత యవసేంధనమ్ ॥ 49
సోదకంచ సమం యత్ర సేనావాసో భవేన్మమ । ఏవ మాజ్ఞాప్య భరతో విజహార యథాసుఖమ్ ॥ 50
సుష్వా ప చ నిశాం తత్ర ఘర్మ కాలే మనోహరామ్ ॥
సు ప్తస్యసా తత్ర రఘూద్వహస్య పుణ్యాయయా రాత్రి రదీన సత్వా । 51
సంపూర్ణ చంద్రా భరణా ప్రతీతా జ్యేష్ఠస్య మాసస్య రణోత్సుకస్య ॥ 52

ఇతి శ్రీ విష్ణుధర్మోత్తరే మహాపురాణే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
భరత ప్రస్థాన వర్ణనం నామ చతురధిక ద్విశత తమోఽధ్యాయః.

అటు తనశిబిరము నమ్మహాతేజస్వి ప్రవేశించి మంగళాలంభనముసేసి ఉత్తమాసనము నధివసించి యా ప్రభువు పౌరజానపదులను సెలవిచ్చి వెనుకకు అయోధ్యకుబంపెను. అటుపై శుభలక్షణుడైన లక్ష్మణుని శిరము మూర్కొనిబంపెను. రేపు జరుగనైన ప్రయాణసూచనలేమైన దుందుభి మ్రోయింప నాజ్ఞయిచ్చెను. వృక్షముల నాటు దైశికులు (ఆయా ప్రదేశ ముల నెరింగినవారు అందుండువారు) ముందేగుదురుగాకయని తన శిబిరమువారందరకు నాజ్ఞయిచ్చెను. చెట్లు లేనిచోట్ల చెట్లను నాటుడని, దారికభ్యంతరముగూర్చు ముండ్లచెట్లను పదునైన గండ్రగొడ్డళ్ళతో నరకుడని నిర్జలప్రదేశములందు కూపముల ద్రవ్వుడని నాదారిలో విషమములైన (మెట్టపల్లములైయున్న) ప్రదేశములను సమములొనరింపుడని నదీతీరములందలి యిసుకమేటలను సమముసేయుడని యాజ్ఞాపించెను. మరియు దారిలో జనునపుడెవ్వనికిని సంఘట్టము (ఇబ్బంది) కలుగకూడదు. విజయము నందుల్లాసము (నుత్సాహమును) రేకెత్తించువారు సైన్యముతో ముందేగవలయును. నీలుడు నక్రదేవుడు వసుమంతుడు సుతపుడు ముందరుగుదురుగాక. మధ్యప్రయాణమందు గాంధారుడు జయనాభుడు రణోత్కటుడు సుశీలుడు కామపాలుడు సైన్యముతో దంశితులై (రక్షాకవచముచే రక్షయివ్వబడినవారై) నడువవలయు. సైన్యముయొక్క జఘనమును (వెనుకభాగమును) రక్షించుచు నేను సైన్యముతో సుఖముగా రామచంద్రప్రభువు విజయముకొరకు నేనునడతును. దైశికులు (ఆయా ప్రదేశములను నెరిగినవారు చూచువారు) సమృద్ధమైన తృణకాష్ఠజల సమృద్ధిగల స్థానమును నాసేనావాసమునకు జూచెదరుగాక! ఇట్లు భరతుడాజ్ఞాపించి సుఖముగా నటవిహరించెను. ఆ గ్రీష్మకాలమందా చక్కనిరేయి నటనిదిరించెను. నిదిరించిన యారణోత్సుకుని కనుపమలలకాలికి పుణ్యమై (శుభమై) పూర్ణచంద్రాభరణయై జ్యేష్ఠమాసముయొక్క పూర్ణిమానిశి పరమప్రీతి జనకమై జరిగెను.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున భరతప్రస్థాన వర్ణనమను రెండువందలనాల్గవ అధ్యాయము.

# రెండువందలఐదవ అధ్యాయము - భరత ప్రస్థానము

మార్కండేయః - ప్రభాతాయాం తు శర్వర్యాం దుందుభిః సమహన్యత । ప్రయాణికో మహారాజః భరతస్య మహాస్వనః ॥
తస్య శబ్దేన మహతా విబుద్ధః కటకే జనః । అవశ్య కరణీయాని కృత్వా రాజన్ త్వరాన్వితాః ॥ 2
త్వరితా గమనార్థాయ సమాహూయేతరేతరమ్ ॥ పటవేశ్మాని రమ్యాణి సంహర్తు ముపచక్రముః ॥ 3
మహాన్తి సుమనోజ్ఞాని వర్తితోర్ణావృతాని చ । చక్రుస్తాని చ రాజేంద్రః సుఖవాహ్యా న్యయత్నతః ॥ 4
తతస్త్వారోపయాం చక్రుః కరభేషు ఖరేషు చ । గోరథేషు తు ముఖ్యేషు తథా దన్తిషు సత్వరాః ॥ 5
భాండ ముచ్చావచం చైవ శయనాని మృదూనిచ । ఆసనాని చ ముఖ్యాని భాండం యచ్చ మహానసే । 6
పేయంచ యవసం చైవ శస్త్రాణి వివిధాని చ ।కవచాని తురంగాణాం శిల్ప భాండాని యానిచ । 7
ధనంచ వివిధం రాజన్ ! సర్వోప కరణాని చ । ఆరోప్యమాణే భాండేతు కరభాణాం వికృష్యతామ్ ॥ 8
శుశ్రువే తుములః శబ్దః ఖరాణాంచ ఖరః స్వనః । గజానాం యుజ్యమానానాం తురంగాణాం రథైస్సహ ॥ 9
వాద్యానాం హన్యమానానాం శుశ్రువే తుములం స్వనమ్ । నాదేన గజఘంటానాం బృంహితేన చ పార్థివ ! 10
హ్రేషితేన తురంగాణాం బభూవ తుములః స్వనః । ప్రాయాణిక ముపాదాయ తాడయ న్నేవ దుందుభిమ్ ॥ 11
అగ్రే ప్రయాణమాన్ యేన యయౌ దుందుభిభి స్సహ । పణ్యాని చ సమాదాయ వణిజ స్త్వరితా యయుః ॥ 12
గ్రహీ తు కామా శ్చాన్నాని సోదకాని సమానిచ । స్థానాని వరముఖ్యానాం యయు శ్చాగ్రే సరానరాః ॥ 13
మహానసిక ముఖ్యాస్తు త్వరితా శ్చ తథా యయుః । సుఖయానాసు రమ్యాసు తథై వాశ్వతరీషు చ ॥ 14
ఆరోప్య యోషితో జగ్ముః ప్రత్యూషే ముదితా జనాః । ఆరూఢా శ్చాపరా నార్యః సవితానాః కరేణవః ॥ 15
కంచుకోష్ణీషిభి ర్గుప్తా గుప్తా వర్షవరై స్తథా । యయుః ససైన్యా రాజేంద్ర! గీతవాద్యపురస్సరాః ॥ 16
దీనాంధ కృపణాఽనాథాం స్తర్ప యన్త్యో ధనేన తాః । నరేంద్ర యోషితో రాజ్ఞాం దివ్యాలం కారభూషితాః ॥ 17
తదాఽన్యే బద్ధ నిస్త్రింశాః పురుషాశ్చ కలాపినః । ఆదీప్య తృణవేశ్మాని జగ్ము స్త్వరితమానసాః ॥ 18

మార్కండేయుడనియె. తెలవారినంత మహాధ్వనిగల భరతుని ప్రయాణదుందుభి మ్రోయింపబడెను. ఆ సవ్వడికి నగరజనము మేల్కాంచెను. ప్రాతఃకరణీయములు దీర్చికొని ప్రయాణత్వరతో నొండొరులం బిలిచికొని పటకుటీరమునందలి రమ్యములయిన సామగ్రులను సర్దుకొననారంభించిరి. పరచిన చక్కనితివాచీలను సుఖముగా గొంపోవుటకనుకూలముగ జుట్టి కరభములందు (ఒంటెలందు) ఖరములందు ఎడ్లబండ్లను ఏన్గులమీదను నెక్కించిరి. అమూల్యమైన భాండములను (వంటసామగ్రి) మృదువైనశయ్యలను ముఖ్యములైన ఆసనములను పేయమైనది తినదగినది గడ్డి వివిధశస్త్రములు గుఱ్ఱములజీనులు శిల్పభాండ ములను వివిధ ధనమును మార్గసాధనములను ఖరములకు కరభములకెక్కింప నవిలాగికొనిపోవునప్పటి తుములధ్వని వినయ్యెను. కూర్చబడు నేన్గులు గుఱ్ఱములు రథములయొక్కసడి వాయింపబడు వాద్యముల సంకులధ్వని వినబడెను. ఏనుగుల గంటలధ్వని ఘీంకారధ్వని గుఱ్ఱముల సకిలింపులసడి తుములమయ్యెను. ఒకడు ప్రయాణదుందుభి వాయించుచునే యుండెను. ఇంకొకడు దుందుభులతో ముందుప్రయాణము సాగించుచుండెను. వర్తకులు పణ్యములను (వర్తకసామగ్రిని) కొని త్వరితముగ నేగిరి. ఉదకసమృద్ధములు సమములునైన స్థానములను (కొందరు) అగ్రేసరులై వంటవారు మొదలైనవారు సుఖయానములైన రమ్యము లయిన యశ్వతరులందు (కంచరగాడిదలందు) ఉషఃకాలమున నానందభరితమైన యంగనల నెక్కించికొని చనిరి. కొందరుస్త్రీలు చాందనితో (అంబారీతో) నున్న యేనుగులనెక్కి కవచములు తలపాగలుదాల్చిన వర్షవరులచే (అంతఃపురము కావలివారిచే) రక్షణ

యీయబడుచు నేగిరి. నరేంద్రభార్యలు రాజార్హములైన దివ్యాలంకారము లలంకరించికొని సైన్యములతో గీతవాద్యములు ముందు మ్రోయుచుండ దీనులను అంధులను కృపణులను అనాధులను ధనమిచ్చి తృప్తిపరచుచు నేగిరి. మరికొందరు పురుషులొరలతో ఖడ్గములం గట్టుకొని కలాపములూని (పాగాలు శిరస్త్రాణము ధరించి) గడ్డియుళ్ళంటించి సవేగమనస్కులై చనిరి. (తాత్కాలికముగా విడిదిసేయుటకేర్పరచిన పూరిళ్ళన్నమాట)

భరతోఽపి సమారుహ్య శిబికాం రత్నభూషితామ్ । వినిర్యయౌ మహాతేజాః తూర్యఘోష పురస్సరః ॥ 19
శూన్యంచ శిబిరస్థానం గృధ్రమండల సంకులమ్ । బహు క్రవ్యాద సంకీర్ణం క్షణేన సమపద్యత ॥ 20
గజోష్ట్రగర్దభాశ్వానాం శరీరావయవైర్యుతమ్ । భగ్నభాండసమాకీర్ణం శరీరావయవైర్యుతమ్ । 21
బహు క్రవ్యాద సంకీర్ణం కరీషోత్కరసంయుతమ్ । ఖాతైర్మహానస స్థానై ర్దగ్ధ మృత్తికయా యుతైః ॥ 22
సమండ కర్దమోపేతైః మక్షికాసహితైర్యుతమ్ । సంత్యజ్య నిర్యయుః సర్వే భరతస్యతు సైనికాః ॥ 23
ప్రయాణే తస్య సైన్యస్య బలీవర్దాన్ శ్రమాన్వితాన్ । నాగానుత్థాపయామాసు రుపవిష్టాన్ ప్రయత్నతః ॥ 24
కేచి దుష్ట్రపరిత్రస్తాన్ గర్దభేన నిపాతి తాన్ । భాండమారోపయాంచక్రుః భూయఏవ నరోత్తమాః ॥ 25
నద్యుత్తారేషు మహిషాన్ కేచిత్ సూర్యాంశు తాపితాన్ । నిషణ్ణాన్ సహ భారేణ తాడయాంచక్రిరే జనాః ॥ 26
కేచి దశ్వతరాం స్త్రస్తాన్నాగబృంహిత నిస్వనైః । ఆరూఢయోషితో యత్నా జ్జగృహుః నృప! రశ్మిషు ॥ 27
కేచి దశ్వైర్గజత్రస్తైరాక్షిప్తా భువి మానవాః । జాను విశ్రమణార్థాయ వాజిగ్రీవ కృతాంఘ్రయః ॥ 28
తురంగాంశ్చ తదోద్భ్రాంతాన్ స్రస్తచర్మాంశ్చ సాదినః । కేచి దాక్రమ్య వేగేన జగృహు స్తత్ర యాదవ! ॥ 29
విశశ్రము స్తథా కేచిత్! వృక్షచ్ఛాయాసు మానవాః । కేచి చ్చోదక తీరేషు చక్రిరే భోజన క్రియామ్ ॥ 30
కేచి త్సంత్రస్త తురగ సన్నికృష్ట సముత్థితైః । ద్రుతాన్ కాపింజలైర్యత్నా జ్జగృహుస్తాంస్తురంగమాన్ ॥ 31
కేచి త్కటకసంత్రస్తాన్ మృగయూథాన్ ప్రధావతః । వేగేనాక్రమ్య విశిఖైః జఘ్ను ర్యదుకులోద్వహ ॥ 32
కేచిచ్చ యవసం చక్రుః కేచిచ్చక్రు రథేంధనమ్ । తథాఽన్యైః ద్విగుణీ భూతం తథా దుందుభి నిస్వనమ్ ॥ 33
ప్రాయాణికం జహుశ్శీఘ్రం శ్రమం యదుకులోద్వహ! । కేచి దాపణ వీథ్యగ్ర మహావంశ సముచ్ఛ్రితమ్ ॥ 34
సపతాకం నరా దృష్ట్వా ప్రాప్తాఃస్మ ఇతి మేనిరే । చక్రుః కేచిచ్చ ఛందాంసి సహాయానాం పునః పునః ॥ 35
పురోగతానాం రాజేంద్ర! స్థానలబ్ధి చికీర్షయా । కేచిత్పటకుటీం దృష్ట్వా స్వకీయాం త్వరితా యయుః ॥ 36
వర్తితోర్ణాకృతం దృష్ట్వా గృహాం శ్చాన్యే యయు ర్ద్రుతమ్ । కేషాంచిత్తత్ర వేశ్మాని తీర్ణాని నృపసత్తమ! 37
కృతాని క్రియమాణాని దదృశు స్తత్ర మానవాః । ద్రుమై ర్విశ్రామ్య మాణై శ్చ క్రియ మాణై స్తథాకటైః ॥ 38
గృహై రారోప్య మాణైశ్చ పటోర్ణా తృణ సంస్కృతైః శుశుభే తన్మహారాజ! కటకం శుభ కర్మణః ॥ 39

భరతుడును రత్నభూషితమైన శిబికను (పాలకీని) ఎక్కి తూర్యఘోష పురస్సరముగా నేగెను. ఆతడు విడిచివెళ్ళిన గుడారము (శిబిరము) క్షణములో గ్రద్దలగుంపులతో ననేక మాంసాహారి పక్షులతో పేడకుప్పలతో సంకీర్ణమయ్యెను. గాడి ప్రొయ్యిలు త్రవ్వినందున కాలిన మృత్తికతోగూడిన గోతులతో కల్లుతోదడిసిన నీగలుముసురుచున్న రొంపులతోనున్న భరతుని శిబిరమువిడిచి యెల్లసైనికులు ముందుకునడచిరి. సేన ప్రయాణమందు శ్రమకులోనై కూర్చున్న యెడ్లను ఏనుగులను సైనికులు లేవదీసిరి. బెదరిపారిన గర్దభముచే బడగొట్టబడిన యొంటెలమీద మనుష్యులు (భాండమును) సేనాసామగ్రి నెక్కించిరి. నదులు దాటునపుడు ఎండయుడుకునకు గురియైనపుడు పైబరువుతో చచ్చుపడి పడియున్న మహిషములను కొందరు లేచుటకుబాదిరి. ఏనుగుల ఘీంకారములకు బెదరిన స్త్రీలెక్కిన కంచరగాడిదలను పగ్గములుపట్టిలాగి నిలుపజొచ్చిరి. కొందరు జనులు గజములకు బెదరిన

గుఱ్ఱములచే క్రిందబడవేయబడిరి. మోకాళ్ళనొప్పులు తీరుటకు వారు గుఱ్ఱముల మెడలపై కాళ్ళనాడించిరి. కొందరు నీటిపట్టుల తీరములందు భోజనములు గావించిరి. కొందరు బెదరిపారు గుఱ్ఱముల సమీపమందు రేగిన కపింజలములచేత బారిపోవు గుఱ్ఱములను బట్టినిలిపిరి. కొందరు నగరమునకు (నగర జనమునకన్నమాట) జడిసిపారు జంతువులమందల వేగముగ నాక్రమించి బాణములచే బడనేసిరి. కొందరు గడ్డిమోపులు సేకరించిరి. కొందరు వంటకట్టెలనుదెచ్చిరి. కొందరు ప్రస్థానమందుభి ధ్వనిని రెట్టింపుచేసిరి. నిమిషములో ప్రయాణక్రమనుబాసిరి. కొందరు బజారులచివర గడకర్రలెత్తుగా గట్టిన పతాకముంజూచి గమ్యస్థానమునకు వచ్చి నామనుకొనిరి. కొందరు తమకుసహాయులై ముందేగి విడుదులేర్పాటుసేసిన యనుచరులకు ఛందములు (బహుమానములు) సేసిరి. (అనగా వారికిష్టమైన (నజరానా) బహుమానముల విచ్చిరన్నమాట) కొందరు తమకై వేసిన డేరానుజూచి యటకేగిరి. అట కొందరి యిండ్లు తీర్ణములు. (బండ్లమీదనుంచి ఏనుగుల గాడిదలనుండిదింపిన గుడారములు) కొందరికి దయారైయున్నవి. కొందరకపుడు నిర్మితములగుచున్నవి. విశ్రమించుటకనువుగా చెట్లచేత నేర్పరుపబడినవి కొన్ని. పటములచే (వస్త్రములచే) ఉన్నిచే గడ్డిచే పైని గప్పబడినవియుంగా పలురకముల సైనికులతో నటనొక కటకము (నగరము) నిర్మాణమై మిక్కిలి శోభించెను.

శస్త్రేణ సంశోధయతాం భువం భూమిపతే! నృణామ్ । రాజసాక్రాన్తవపుషా మప్రకాశం వపు ర్బభౌ ॥ 40
పార్శ్వ స్థతోయసంపూర్ణ దృతయ శ్చ తథా జనాః । ధావ మానాః ప్రదృశ్యన్తే వర్ధితా గృహశోధనే ॥ 41
అభ్యుక్షయన్తి చాప్యన్యే తృణ వేశ్మానిపార్థివః । తప్తానాం శీతకామానాం దృతి వక్త్రోద్గతై ర్జలైః ॥ 42
అభిశ్రయేణ ధూపేన సమంతా దాకులీకృతమ్ । బభూవ తస్య కటకం నీహారేణేవ సంయుతమ్ ॥ 43
అవరోపితభాండానాం దాంతానాం యదునందనః । పృష్ఠా న్యభ్యుక్షయామాసు ర్గోమయేన జలేనచ ॥ 44
ఖరోష్ట్రి సబలీవర్ద చరణార్థే వినిర్గతమ్ । 45

రాజా ! అట శస్త్రములచే భూశోధనచేయు శరీరములు ధూళిధూసరములై సకతన చూపరులకు వెల్లడికాకుండెను. ఆకట్టిన యిండ్లను జక్కగ నలికి కడిగి యలంకరించుపనిలో నిమగ్నులైన జనులు నీటనిండిన చిరుకాలువల ప్రవాహములు గలవారై వానివెంటబరువెత్తువారునై కానిపించిరి. కొందరు నీరుమళ్ళించిన దృతులముందునుండి (బోదెలముందునుండి) తెచ్చినటిచే గొందరు యెండకుడికి చలుపగోరువారుండు పూరిండ్లందడుపుచుండిరి. ఆభరతుని కటకము (స్కంధావారము) అభిశ్రయధూపము నలువంకల నలముకొని మంచుగప్పినదాయన్నట్లుండెను. బరువులు దింపిన తరువాత ప్రయాణశ్రమ నలసిన యాయా ఒంటెలు గాడిదలు ఎద్దు కంచరగాడిదలు మొదలయిన జంతువులయొక్క పృష్ఠములను చలువకొరకు గోమయముచే బూసి నీళ్ళు చల్లిరి. మేతకొరకు బయలు వెడలిన వేలకొలది జంతువుల మంద భరతుని కటకమందు గాననయ్యెను.

దదృశే బహుసాహస్రం కటకే భరతస్య తు । రథేభ్య స్తురగా నన్యే విముచ్య హయకోవిదాః ॥ 46
అవరోపిత భాండాని సాంత్వయాంచక్రిరే శనైః । సముత్థాయ రజో భౌమం తురంగపరివర్తనైః ॥ 47
ఖ మారురోహ రాజేంద్ర! కపోతారుణ పాండురమ్ । స్థాపయాంచక్రిరే చాన్యే జలస్థానే చ వాజినః ॥ 48
శ్రేణీం చక్రు స్తథై వాన్యే కటచ్ఛాయాసు పార్థివః । వితానాధ స్తథా కేచిత్ స్థాపయాంచక్రిరే హయాన్ ॥ 49
హయేభ్యో యవసం దత్వా కేచి ద్బుభుజిరే జనాః । కటచ్ఛాయా శ్చ నాగానాం చక్రు శ్చాన్యే సహస్రశః 50
వితానాని చ ముఖ్యాని సూర్యతాపప్రశాన్తయే । స్నాతాన్ జలాశయే నాగాన్ లబ్ధతోయాన్ జనాధిప ॥ 51
సంఛన్నాన్ స్వపరీధాన కుంభా న్నిన్యుః స్వ మాలయమ్ । కటకా ద్దూరత శ్చక్రు రాలానం నృప! దంతినామ్ ॥ 52
ఆలానాని మహారాజ! మహావృక్షేషు మానవాః । ఆదాయ గోపిన స్తత్ర కటకాచ్చ విదూరతః ॥ 53
గోసంఘాన్ మహిషీసంఘాన్ చక్రు ర్న్యస్తాన్ యథాసుఖమ్ । కటకేచ తథా నిన్యుఃగోరసాని నరాధిప ! 54
కటకాపణ్యవీథించ సర్వపణ్యవిభూషితామ్ । దదృశుః పురుషా స్తత్ర అయోధ్యా మివ చాపరామ్ ॥ 55

స్థానాని సర్వవైద్యానాం సధ్వజాని నరాధిప । సాగరానిచ దృశ్యన్తే కటకే భరతస్యతు ॥ 56
సేనాధ్యక్షేణ వీరేణ విజయేన మహాత్మనా । కృతం శాస్త్రానుసారేణ స్కంధావార నివేశనమ్ ॥ 57
వివేశ భరతః శ్రీమాన్ చతురంగ బలాన్వితః । అన్వీయమానో వీరాభ్యాం పుత్రాభ్యాం యదునందనః ॥ 58
పుష్కరేణచ వీరేణ తక్షేణ సుమహాత్మనా । బలముఖ్యై స్తథైవాన్యైః సూత మాగధ వందిభిః ॥ 59
శంఖవాదిత్రశబ్దేన పటహానాం స్వనేనచ । భరతస్య గృహద్వార తోరణాన్తిక మాగతాః ॥ 60
బభూవుర్బల ముఖ్యాస్తే దిక్షు యే యదునందనః । సంత్యజ్య మధ్యమాం వీథీం ప్రవేశాయ మహామనాః ॥ 61
వందిభిఃఖ్యాప్యమానాంస్తా న్నామ కర్మావదానతః । శిరః కంపేన భరతః ప్రైరయత్ స్వాన్నివేశనాన్ ॥ 62
బలముఖ్యాన్ వివేశాథ స్వగృహం సర్వబుద్ధిమత్ । ద్వియోజనాధ్వనా శ్రాన్తా భరతస్యతు సైనికాః ॥ 63
వివిశుర్భవనాన్ స్వాన్ స్వాన్ భేజిరే శయనానిచ । ప్రవిశ్య వేశ్మ ప్రవరం భరతోఽపి యథాసుఖమ్ ॥ 64
విజహార మహారాజ! దేవరాజ సమద్యుతిః। క్రమేణానేన ధర్మాత్మా భూమిపాల దినేదినే ॥ 65
సురాంగనా పీనపయోధరస్థ సచ్చందన క్షాళన లబ్ధలక్ష్మీమ్ ।
గ్రీష్మార్కతాపా ద్విగల త్తుషార వివృద్ధ శీతోద పటోత్తరీయామ్ ॥ 66

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
ప్రయాణ వర్ణనం నామ పంచాధిక ద్విశత తమోఽధ్యాయః.

కొందరు మేటి రౌతులు రథములనుండి బరువులను దింపి గుఱ్ఱములను విప్పి వానిని సేదదీర్చిరి. గుఱ్ఱముల గుడులచే పెనుమంటి ధూళి రేగి నెఱుపుతెలుపు కలిసిన పావురమురంగుగొని నింగికెక్కెను. కొందరు గుఱ్ఱములను నీటిపట్టున విడియించిరి. చాపలు గట్టిన నీడలందు శ్రేణినొనరించిరి. అనగా వరుసగా వానిని గట్టివైచిరి. కొందరు వితానముల నీడను (చాందినీల క్రింద) వానిని నిలిపిరి. కొందరు గుఱ్ఱములకు యవసము (గడ్డి) మేత వేసి తాము భుజించిరి. ఏనుగులకు చాపలతో వేలకొలది నీడలేర్పర చిరి. సూర్యునివలని తాపము శాంతింప కొందరు వితానములను (చాందినీలను) ఏర్పరచిరి. మనువులందు స్నానము సేసి తొండముల నీరెక్కించుకొని యేనుగులను, మూతలిడిన తమ బట్టపెట్టెలను దమ బసలకు గొనివచ్చిరి. కటకమునకు దూరముగ నేన్గులకు ఆలానముగ (కట్టురాటగ) పెద్ద వృక్షముల మొదళ్ళ నేర్పరచిరి. పశులకాపరులు ఆలమందలను గేదెల మందలను తోలుకొనిపోయి కటకమునకు దూరముగ వాని నేమంచ కామంద విడదీసి విడియించిరి. గోరసములను (ఆవుపాలు పెరుగు గిన్నె నేయియు నన్నమాట) కటకమునకు గొనివచ్చిరి. అన్ని పణ్యములతో (సరకులతో) నింపుగొలుపు కటకము యొక్క బజారు వీథిని నింకొక యయోధ్యయా యన్నట్లు చూచిరి. ఆభరతుడు విడిదిసేసిన యా కటకమందు వైద్యులెల్లరకు (నరవైద్యులు పశువైద్యులు మొదలైన వారికన్నమాట) నేర్పరచిన స్థానములు ధ్వజములతో (జెండాలతో) ఔషధములతో గానబడుచుండెను. సేనాధ్యక్షుడగు మహానుభావుడు విజయునిచే శాస్త్రానుసారముగ నా స్కంధావార నివేశన మేర్పరుపబడెను. శ్రీమంతుడు భరతుడు చతురంగ బలముతోగూడి వీరులయిన తన పుత్రు లిద్దరిచే ననుగమింపబడి వీరుడయిన పుష్కరునిచే మిక్కిలి మహాత్ముడైన తక్షునితోనా స్కంధావార నివేశమును బ్రవేశించెను. శంఖవాద్యఘోషముతో పటహధ్వనితో నలుదెసల నలుగురైన సేనాధ్యక్షులు భరత గృహ ద్వార తోరణముదరి కేతెంచిరి. భరతుడు గృహప్రవేశమునకు మధ్యవీథిని విడిచి చని వందిమాగధులు వారివారి పేర్లను వారి చరిత్రను పాటలరూపములో ప్రఖ్యాపనము సేయుచుండ శిరఃకంపముచే నాసేనాధ్యక్షులను వారి విడుదులకేగుట కనుమతియిచ్చెను. ఆటుపై సర్వసంపత్సమృద్ధమైన తన గృహముం బ్రవేశించెను. రెండు యోజనములు దారి నడచి యలసిన భరతుని సైనికులు తమతమ భవనములం బ్రవేశించిరి. శయనములందు విశ్రమించిరి. భరతుడు తన గృహశ్రేష్ఠమును యథాసుఖముగ బ్రవేశించి దేవేంద్రసమప్రభుడై యట విహరించెను. ఇదే క్రమమున ధర్మాత్ముడు భరతుడు వెల్కుచునే దేవతాస్త్రీల నిండుపాలిండ్ల యందలి

కల్పతరు పుష్పమాలలయొక్క గంధముయొక్క వాసనముచే నద్భుతశోభ సందినదియు గ్రీష్మార్క తాపమువలన కరిగి జారు మంచుచే పెంపొందిన చలువనింపు నుదకము అనెడి చీరయు పైచీరయుం గల త్రిపథగయైన గంగానది దరిసెను.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున భరతప్రస్థానవర్ణనము రెండువందలయైదవ యధ్యాయము

## రెండువందలఆరవ అధ్యాయము - భరతుని గంగావతరణము

మార్కండేయః : నివేశ మకరోద్రాజన్ః గంగాతీరే సరాఘవః । భరతస్య తదా చక్రుర్గంగాయాం జలమండపాన్ ॥ 1
తథైవ బల ముఖ్యానాం ప్రాధాన్యేన నరాధిపః । సైనికశ్చ జన స్తస్య ప్రాప్య తాం సురనిమ్నగామ్ ॥ 2
సాఫల్యం జన్మనోమేనే తత్యాజ చ తథా క్లమమ్ । సస్నౌ పపౌ వయః కామం హర్షేణ మహతా యుతః ॥ 3
స్నాపయాంచక్రిరే తత్ర తురగాం స్తురగ ప్రియాః। కుంజరాన్ స్నాపయామాసుః మహామాత్రా స్తథైవచ ॥ 4
మజ్జద్భిః బహుసాహస్రైః కుంజరై ర్జాహ్నవీ నదీ । కిరాతవిషయే స్సైవ విరరాజ యథోపలైః ॥ 5
సముత్థిత మహామాత్రాన్ దృష్ట్వాఽభ్యుక్షణఛద్మనా । చిక్రీడు ర్ధృతిభిః కేచి ద్విబిశురా బాహుభి స్తథా ॥ 6
గంగా మాసాద్య సంహృష్టా భరతస్య తు సైనికాః । భరతోఽపి తథా స్నాతః కృతదైవతపూజనః ॥ 7
శ్రాద్ధం చక్రే మహాతేజాః దదౌదానం తదైవ చ । దత్త్వా తత్ర మహాదానా నాజ్ఞాపయతి యాదవః ॥ 8
శిల్పినో మమ కుర్వన్తు కూటాగారాన్ మనోరమాన్ । రాత్రౌ దీపనివేశార్థం శతశోఽథ సహస్రశః ॥ 9
ఆనీయన్తాం తథా నావః సైన్యస్య తరణాయ మే । క్రియన్తాం చర్మ నావశ్చ ప్లవాశ్చ శతశ స్తథా ॥ 10
ఉత్తరం పార మాసాద్య నివేశః క్రియతాం తథా । పరం పారం జనాయాన్తు ఉదయా స్తమయా న్తరే ॥ 11
ఏవ మాజ్ఞాప్య భరతో విజహార యథాసుఖః ।

మార్కండేయుడనియె. రాఘవుడు (భరతుడు) గంగాతీరమందు నివేశమొనరించెను. అప్పుడాతనికి గంగలో జల మండపములు నిర్మించిరి. మరియు నీతని సేనాపతులకును ప్రధానముగ నేర్పాట్లుచేసిరి. ఆ సురనదింజేరి యాతనిసేన జన్మ సాఫల్యమిది యనుకొనెను. శ్రమను బాసెను. మిగులహర్షముతో దృప్తిగ స్నానముసేసెను. ఆ జలముం ద్రావెను. అశ్వప్రియులా నదిలో గుఱ్ఱముల స్నానముసేయించిరి. మావటీంద్రేనుగుల నందోలాడించిరి. వేలకొలదిగ స్నానముసేయు కుంజరములచే నా జాహ్నవీనది కిరాతదేశమందలి పాషాణములతో గూడెనాయన్నట్లు రాజిల్లెను. ఆ యేనుగులమీద లేచినిలుచున్న మావటీంద్రం జూచి వారిపై నీళ్ళుజల్లునెపమున కొందరు వారితో క్రీడించిరి. ఆనదిలో బాహువులతో నీదిరి. భరతసైనికులు గంగంజేరి యానంద భరితులైరి. భరతుడును స్నానమాచరించి దేవతార్చనముసేసి తీర్థశ్రాద్ధము పెట్టెను. దానములుం జేసెను. మహాదానములిచ్చి యిట్లాజ్ఞయిచ్చెను. శిల్పులు దీపములు పెట్టుటకొరకు మనోహరములైన కూటాగారములను వేలకొలది నిర్మింతురుగాక! సైన్యమీ నదిని దాటుటకు దోలుతో నావలుందయారుజేయుడు వందలకొలది తెప్పలుంగావలయును. అవ్వలియొడ్డుసేరి నివేశము (నివాసము) నిర్మింపుడి. సూర్యోదయాస్తమయముల నడుమ నీజను లీవలియొడ్డునకు జేరవలయును. ఇట్లాజ్ఞయిచ్చి భరతుడు సుఖముగా విహరించెను

ప్రసారితకరో రాజన్ సర్వత్రైవ దివాకరః ॥ 12
యయా వదర్శనం తత్ర భరతస్యేవ లజ్జయా । పద్మపత్ర దళాగ్రాభా ప్రతీచీ చాభవత్ క్షణాత్ ॥ 13
ఆదిత్యేఽస్త మనుప్రాప్తే సంధ్యారాగాఽనురంజితా । తతస్తు తమసా వ్యాప్తే న ప్రాజ్ఞాయత కించన ॥ 14
భరతాజ్ఞాకృతాన్ పూర్వం కూటాగారాన్ సదీపకాన్ । ధ్వజమాలా పరిక్షిప్తాంశ్చిక్షిపు ర్జాహ్నవీజలే ॥ 15

సైనికై శ్చ తథా ముఖ్యై ర్భరతస్య పృథక్ పృథక్ । గంగాంభసి పరిక్షిప్తాః దీపవృక్షాః సహస్రశః ॥ 16
సా దీపమాలినీ గంగా తీరద్యోతితవిగ్రహా । జహాస ఫేనజిహ్వేవ గంగాసా గగనప్రియా ॥ 17
జలాంతరాగతై ర్దీప్తైః దీపవృక్షై ర్మనోహరైః । తథా కల్లోలసంక్రాంతై ర్గంగా దీప్తేవ లక్ష్యతే ॥ 18
ఏవం హి క్రీడతాం తత్ర గంగాతీరే తథా నృణాం । రాత్రావే వాంజసా జగ్ము ర్నావో బహు విధానృప ! 19
శశాంక రాజహంసేన దృష్ట్వా ఖ సరసీం జనాః । ఆక్రమ్యమాణాః సుషుపు ర్నిశీథే నిద్రయాన్వితాః ॥ 20
శశాంకోదయ సంసుప్త బలం పద్మవనోపమమ్ । విబోధయామాస తథా దివాకరకరోత్కరమ్ ॥ 21
చక్రుషుస్తే తదా నావః కర్ణధారా యథా స్వకాః । బలం చ సకలం పారం తారయాంచక్రిరే తథా ॥ 22
నావ స్తాం కింకిణీజాలైః పతాకాభి శ్చ రాజితాః । నిన్యు ర్బలం పరం పారం కర్ణధారస్ఫిగాహతాః ॥ 23

దివాకరుడెల్లయెడల కరప్రసారముసేసి ప్రతాపవంతుడు (తేజస్వి) యగు భరతునివలని సిగ్గుచేతంబోలె కనిపింపకుండ పోయెను. క్షణములో నాదిత్యుడస్తమింప బడమటిదిశ సంధ్యారాగరంజితయై తామరపూవువంటి యెఱ్ఱని ప్రభగలదయ్యెను. అవ్వల చీకటిగ్రమ్మ నేమియుం గనిపింపవయ్యెను. ఇంతమున్ను భరతునాజ్ఞచే నేర్పరుపబడిన దీపములతోడి కూటాగారములను పతాకామాలికలెత్తబడినవానిని జాహ్నవీజలములందు వదలిరి. గంగాజలమందు ముఖ్యసైనికులు భరతునికొరకు వేర్వేర వేలకొలది దీపవృక్షములను విరజిమ్మిరి. ఆ గంగానది దీపమాలినియై (మాలాకారములైన దీపములుగలదై) ఇరువంకతీరములందుద్దీపించు మూర్తితో గగనముపైప్రీతిగల జిహ్వ (నాలుకవలె) తెల్లని నురుగనెడి నవ్వుతో నవ్వెను. నీళ్ళలోనికివచ్చి తరంగములందలముకొన్న దీపములచే దీపవృక్షములచే గంగానది యుద్దీపితయైనట్లు కానబడెను. ఇట్లక్కడ గంగాతీరమందు నాజనము క్రీడించుచుండ రాత్రి వేళనే బహువిధములయిన నావలు బరబరసాగినవి. చంద్రుడను రాజహంసతో ఆకాశసరస్సునుచూచి యారాత్రి నిద్రావశులైరి. చంద్రోదయమందు నిదరించినసైన్యము పద్మవనమువలె నుండుటంజూచి (పద్మబంధువుగాన) దినకరుని కరపుంజము మేల్కొలిపెను. అప్పుడు చుక్కానివేయువారు తమతమ నావలనడిపించిరి. సబలమైన (బలిష్ఠమైన) బలమును (సేనను) సకలమును నా నదిం దాటించిరి. చిరుగంటలతో పతాకలతో రాజిల్లు నా నావలు కర్ణధారులయొక్క (చుక్కానివేయువారియొక్క లేదా సరంగులయొక్క) స్ఫిక్ =చుక్కానివేయువారి నడుములతో త్రోయబడినవైనముతో సైన్యము నవ్వలియొడ్డుకుం గొనిపోయినవి.

భాండైః పూర్ణా స్తథా కాశ్చిత్ కాశ్చిత్పూర్ణా జనే నచ । తురంగమై స్తథా పూర్ణా గోఖరోష్ట్రై స్తథా పరాః ॥ 24
కాశ్చి త్సకుంజరా నావో యయుః పారం తదా పరమ్ । తథా పద్మదళాక్షీణాం స్త్రీణాం నావ శ్చ పూరితాః ॥ 25
విమానాభాః ప్రదృశ్యన్తే గంగాంభసి నరేశ్వర! । కర్ణధారవరోపేతా దండిభిః పురుషై ర్వృతాః 26
లోకసంతారణార్థాయ భూయో జగ్ము స్తథా పరాః । చర్మనౌభి స్తథా కేచిత్ ప్లవైః కేచిత్ సుయంత్రితైః ॥ 27
జగ్మురాదాయ భాండాని దృతిభి శ్చ తథా క్వచిత్ । నరైర్దృతి సమారూఢైః కృష్యమాణా స్తురంగమాః ॥ 28
జగ్ముః కేచిత్ పరం పారం బాహుభిః మనుజేశ్వర! । జగ్ము రన్యే పరంపారం సంగృహీతా శ్చ రశ్మిభిః ॥ 29
నౌస్థై రేవ పరై శ్శీఘ్రం తురగా నృప బాహుభిః । మహిషీణాంచ సంఘాని గవాంచ యదునందన ॥ 30
జగ్ముర్గోపాలకై స్సార్ధం పరం పారం చ బాహుభిః । ఉష్ట్ర గర్దభసంఘాని తీర్యమాణాని బాహుభిః ॥ 31
భూయో భూయో న్యవర్తన్త తత్ర రావో మహానభూత్ । తీర్ణస్య తార్యమాణస్య నరస్య యదు నందన ! 32
ఆసీ త్కోలాహలో ఘోరః తీరయో రుభయో రపి ॥

కొన్ని నావలు భాండములతో వర్తకుని సరకులతో (సామగ్రితో) కొన్ని నావలు జనులతో కొన్ని గుఱ్ఱములతో గోవులతో గాడిదలతో ఒంటెలతో నేన్గులతో నిండి పరతీరమునకు జనినవి. అట్లే పద్మదళాక్షుల స్త్రీలతో గంగాజలమందు విమానము లట్లు గానబడినవి. విమానములందలి మెరుపు దీపములు స్త్రీల తామరరేకులవంటి కన్నులవలె మెరయుచుండునని యిది

జ్ఞాపకముచేయుచున్నది. (దీనింబట్టి విమాన నిర్మాణమతి ప్రాచీనమనియుం దెలియనగును) మంచి చుక్కాని జనము గడలు వేయు జనముతోగూడి కొన్ని నావలు సామాన్యజనులను నది దాటించుటకు సిద్ధపరుపబడెను. కొందరు తోలుపడవలతో (పుట్టి యనిదీనికి పేరు) కొందరా తెప్పలతో కొందరు చక్కని యంత్రము లమరుపబడినవానితో భాండములను (సామగ్రిని) ఎక్కించుకొని కేవలము దృతులతో = ఏటిజాలులంబట్టిపోయినవి ప్రవాహానుకూలముగా పోవు పడవలకు గడలు వేయుట తెడ్డువేయుట మొదలయినవవసర ముండవు. ఆవిధముగా గొన్ని పడవలు వెళ్ళెనని యిక్కడ తాత్పర్యము. నీటివాలునంబడిన (దృతిసమారూఢులైన) జనముచే లాగికొనిపోబడి గుఱ్ఱములవ్వలిదరిం జేరినవి. గేదెలు గోవులమందలు బారలుచాచి యీదు జనము పలుపుత్రాళ్ళు పట్టుకొని లాగగా నవ్వలికిం జేరినవి. ఒంటెలు గాడిదల మందలు నీదికొని యేగు జనముచే దాటింపబడుచు మరల మరల వెనుకకు మరలివచ్చి నందున నక్కడ పెద్ద ధ్వని యేర్పడెను. దాటిన దాటనున్న నదుల యొక్క కోలాహలము రెండొడ్డులందు నతిఘోరమయ్యెను.

భరతోఽపిమహా తేజాః స్నాతో హుతహుతాశనః ॥ 33
మత్స్యరూపధరం విష్ణుంపటే సంపూజ్య యాదవ! । స్వస్తి వాచ్యాం స్తతో విప్రాన్ గోభిర్వస్త్రై ర్ధనేనచ ॥ 34
సంపూజ్య జాహ్నవీం దేవీం గంధ మాల్యానులేపనైః । సంపూజయా మాస తదా భూయఏవ ద్విజోత్తమాన్ ॥ 35
గోభి రశ్వై స్తథా నిష్కై ర్వస్త్రై ర్గంధై స్తథైవచ । ఆరురోహ తదా నావం పాండుకంబల సంవృతామ్ ॥ 36
కింకిణీజాలవితతాం పతాకాధ్వజమాలినీమ్ । భరతే తు సమారూఢే కర్ణధారస్సిగాహతా ॥ 38
జగామ సా పరం పారం నౌర్విమానోపమా నృపః సంప్రాప్య సపరం పారం సంపూర్ణకటక స్తథా ॥ 37
దేవీం మహాదేవ జటాతటస్థాం శశాంక సంసర్గ వివృద్ధ శీతామ్ ।
ఉత్తీర్య రాజా భరత స్స చైనాం నిన్యే క్షయం శక్రసమప్రభావః ॥ 39

ఇతి శ్రీవిష్ణు ధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
గంగావతరణ వర్ణనం నామ షడుత్తరద్విశతతమో ధ్యాయః

మహాప్రతాపవంతుడు భరతుడును స్నానము సేసి అగ్నిని వేల్చి మత్స్యావతారుడగు విష్ణువు నొక గద్దెపరచి యందు బూజించి స్వస్తివాచకముతో విప్రులను గోవులతో వస్త్రములతో ధనముతో చక్కగ పూజించి జాహ్నవీదేవిని గంధమాల్యానులేపనములచే పూజించెను. ద్విజులను గోవులు గుఱ్ఱములు నిష్కములు (బంగారు నాణెములు) వస్త్రములు గంధముల నొసంగి పూజించెను. అటుపై తెల్లని కంబళము పరచినదియు, చిరుగంటలతోనున్నదియు పతాకాధ్వజమాలాలంకృతమైనదియునగు నావనెక్కెను. భరతుడెక్కగానే చుక్కాని వేయువాని చేతి చుక్కానిచే నడుపబడి విమానమువంటి యా నావ యవ్వలి యొడ్డున కేగెను. ఆవిధముగా సంపూర్ణ కటకముతో (భరతుని నగరము) అవ్వలిదరిజేరి భరతుడట స్వర్గమందింద్రుడట్లుండెను.

మహాదేవుని జటాతటమందున్నదియు చంద్రుని సంసర్గమున పెంపొందిన చలువగల్లదియునగు నీ గంగానదిని దాటి భరతరాజు దేవేంద్రప్రభావుడు ఈనదిని క్షయము నందించెను. సైన్యసహస్రములతో వెలితివడజేసెను.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున భరతుని గంగావతరణ వర్ణనమను రెండువందలయారవ యధ్యాయము.

## రెండువందలఏడవ అధ్యాయము - భరతుని రాజగృహగమనము

మార్కండేయః : భరతేతు సముత్తీర్ణే గంగాం గగనమేఖలాం । వివేశ కటకిం తస్య త మన్యః కౌరవో నృప! ॥ 1
బలేన చతురంగేణ సముద్రాభేన సంయుతః । ఈశ్వరశ్చ కిరాతానాం దమనోనామ పార్థివః ॥ 2
గంధినాం బహుసాహస్రైః బలైర్యుక్తో వ్యదృశ్యత । యథార్హం పూజయిత్వా తం భరతో ధర్మవత్సలః ॥ 3

ఆససాదార్క తనయాంయమునాం పాపనాశినీమ్ । యమస్య భగినీం పుణ్యాం నీల నీలాం మనోహరామ్ ॥ 4
యత్రక్వచన నద్యాం హి కృత్వా శ్రాద్ధం నరాధిప । అక్షయం ఫల మాప్నోతి నాకపృష్ఠే చ మోదతే ॥ 5
యత్ర కృష్ణచతుర్దశ్యాం ప్రాత స్సంపూజ్య భానుజామ్ । ముచ్యతే పాతకై స్సర్వై ర్నాకలోకం స గచ్ఛతి ॥ 6
అనర్కాభ్యుదితే కాలే మాఘకృష్ణ చతుర్దశీమ్ । యస్యాం స్నాతస్తు సంపూజ్య ధర్మరాజం తిలాంభసా ॥ 7
న దుర్గతి మవాప్నోతి కులంచైవ సముద్ధరేత్ । యత్రక్వచన నద్యాం హి మాఘకృష్ణచతుర్దశీమ్ ॥ 8
నాదేయాంభసి సర్వస్మిన్ స్నాతః పాపైః విముచ్యతే । యమునా తు విశేషేణ యమస్య భగినీతిసా ॥ 9
స్నాతశ్చ యామునే తోయే సంతర్ప్య పితృదేవతాః । న దుర్గతి మవాప్నోతి నాకలోకం చ గచ్ఛతి ॥ 10
తాం సమాసాద్య యమునాం యథా గంగాజలం తథా । విహృత్య భరత స్సద్య దుత్తతార మహానదీమ్ ॥ 11

మార్కండేయు డనియె : ఆకాశ మొడ్డాణమయియున్న గంగను (గంగ త్రిపథగ గావున శివుని జటాజూటమామె శిరస్సు గాను అంతరిక్షము నడుముగాను భూమి పాతాళములు ఊరువులు పాదములుగా నుండుటను భావించి ఆతల్లికి గగనము నడుమున కలంకరించుకొను నొడ్డాణముగను అందలి సూర్య చంద్ర తారా నక్షత్రాదులా యొడ్డాణములందలి రత్నాలుగను దీపించుచున్న వను భావమిట ధ్వనించుచున్నది.) భరతుడు దాటినతరి నాతని కటకమును (స్కంధావారమును) కౌరవుడను నింకొక రాజు సముద్రమట్లున్న చతురంగబలముతో వచ్చిచేరెను. కిరాత రాజు దమనుడన వాడును అనేకవేలమంది గంధులతో గంధి = గర్వితుడు బలగర్వితులయిన కాల్బలముతోనని యిక్కడ తాత్పర్యము కానోపును) భరతునికి గానబడెను. మిత్రబలముగా నీ యిద్దరు చేరిరన్నమాట. ధర్మవత్సలుడగు భరతుడు వారిం దగినరీతి బూజించి పాపనాశిని సూర్యుని కూతురు యముని చెల్లెలు నలుపు నలుపుగా నున్నదియనగు చక్కని యమునానదిని దరిసెను. ఆ నదీతీరమందెక్కడనో యొకచోట శ్రాద్ధముపెట్టిన యాత డక్షయ ఫలమందును. స్వర్గమందానందించును. కృష్ణచతుర్దశినాడు స్నానము సేసి యాయనను బూజించు నాతడు సర్వపాపముక్తుడై నాకలోకమునకేగును. సూర్యోదయము గాకముందు మాఘకృష్ణచతుర్దశినాడందు స్నానము సేసి యమధర్మరాజును తిలోదకముల బూజించు నాతడు దుర్గతిపాలుగాడు. కులము నెల్ల నుద్ధరించును. మాఘకృష్ణచతుర్దశినాడేదేని నదీజలముల స్నానముసేయు నతడు పాపవిముక్తుడగును. యముని చెల్లెలగుట యమునయెడ నదియొక విశేషము. అందు స్నానముసేసి పితృదేవతాతర్పణము సేసినవాడు దుర్గతి నందడు. నాకమునందును. గంగాజలమునట్లా యమునం జేరి భరతుడాచీతి విహరించి యానదిం దాటెను.

సముత్తీర్ణస్య యమునాం భరతస్య మహాత్మనః । వివేశ కటకం రాజా మత్స్యానాం సురథ స్తదా ॥ 12
గోరసేనశ్చ సాల్వానాం శిబీనాంచ ప్రభద్రకః । సతైర్నృపతిభిః సార్ధం కురుక్షేత్ర ముపాయయౌ ॥ 13
యదర్థమేషా చరతి లోకే గాథా పురాతనీ । పాంసవోఽపి కురుక్షేత్రే వాయునా సమమీరితాః ॥ 14
అపి దుష్కృత కర్మాణో నయన్తి పరమాం గతిమ్ । సమన్త పంచకే పుణ్యే యే మృతా మనుజేశ్వరః ॥ 15
తే సర్వే నాక మాసాద్య రాజన్తే దివి దేవవత్ । సన్నితి ర్యత్ర రాజేంద్రః తీర్థం త్రైలోక్యవిశ్రుతమ్ ॥ 16
తీర్థ సన్నయనా దేవ సన్నితిరితి విశ్రుతమ్ । పృథివ్యాం యాని తీర్థాని ఆసముద్రసరాంసిచ ॥ 17
మాసాన్తే సతతం తత్ర నిత్యమాయాన్తి యాదవ! । తత్ర శాద్ధంతు యః కుర్యాత్ రాహుగ్రస్తే దివాకరే ॥ 18
అశ్వమేధశతస్యాగ్రం ఫలం విందతి మానవః । భరతస్తు సమాసాద్య తత్రోవాస సుఖీ తదా ॥ 19
పప్రచ్ఛ బ్రాహ్మణాం స్తత్ర తీర్థ సన్నితి కారణం । పృష్టస్తు భరతేనాథ బ్రాహ్మణస్తు ఘటోదరః ॥ 20
ఉవాచ భరతం తత్ర కథాం పాప ప్రణాశినీమ్ ।

యమునను దాటిన తరువాత భరతుని యొక్క కటకమును మత్స్యదేశాధిపతి సురథుడనురాజు సాల్వాధిపతి గోరసేనుడు శిబిదేశాధీశుడు ప్రభద్రకుడు నను రాజులు మిత్రులై వచ్చి ప్రవేశించిరి. ఆరాజులతో గూడి భరతుడు కురుక్షేత్రమున కేగుదెంచెను. ఈ కురుక్షేత్రమును గూర్చి యీ పురాతనగాధ ప్రచారములో నున్నది. దానిభావ మిది.

"కురుక్షేత్రమందు వాయువుచే నెగయింపబడు పరాగములు (ధూళి) పాపాత్ములనైనను పరమగతికి గొనిపోవును" రాజా ! పుణ్యమైనసమంతపంచకమందు జనిపోయినవారెల్లరు స్వర్గముం జేరి యచట దేవతలట్లు రాజిల్లుదురు. అక్కడనే సన్నీతి యను తీర్థము త్రిలోకప్రసిద్ధమొకటి గలదు, తీర్థముల నన్నిటిని నచట మార్చినది యగుటచేతనే సన్నీతి యను పేరు దానికి ప్రసిద్ధమైనది. పృథివియందున్న సర్వతీర్థములు సముద్రపర్యంతములైన సరస్సులెల్లపుడు ప్రతిమాసము చివర నచ్చటికి వచ్చునుగావున దాని కాపేరువచ్చినది. రాహుగ్రస్తసూర్య గ్రహణకాలమం దక్కడ శ్రాద్ధముపెట్టు నతడశ్వమేథ శతఫలమునందును. భరతుడు అక్కడకువచ్చి సుఖముగ వసించెను. అక్కడి బ్రాహ్మణులను సన్నీతి తీర్థమేర్పడుటకు గారణము నడిగెను. అట్లడుగబడిన ఘటోదరుడను బ్రాహ్మణుడు పాపప్రణాశినియైన యక్కడ జరిగిన కథను వచించెను.

21
ఘటోదరః శక్రే వృత్ర వధాక్రాంతే త్రైలోక్యే దైత్యసాద్గతే ॥ 22
సబ్రహ్మకాస్సురాస్సర్వే విష్ణుం శరణమాయయుః । తానువాచ హరిర్దేవః చ్యవన స్యాత్మ సంభవః ॥ 23
భార్గవో బ్రాహ్మణః శ్రీమాన్ దధీచ ఇతి విశ్రుతః । అస్థిభిః క్రియతాంతస్య దేవేంద్రస్య వరాయుధమ్ ॥ 24
ప్రవిశ్య దేవాం స్తతాహం హన్తా వృత్ర మసంశయమ్ । ఏవముక్తాః సురాస్సర్వే దధీచస్యాశ్రమం యయుః । 25
దదృశుశ్చ మహాభాగం దధీచం తపసాం నిధిమ్ । పూజయిత్వా మహాభాగం తమూచుః సంహతాస్సురాః ॥ 26
త్వదస్థిభిః కరిష్యామో వజ్రం దైత్య నిబర్హణమ్ । అన్యాని చ తథాస్త్రాణి సురకార్యార్థ సిద్ధయే ॥ 27
తత్ర త్వం దేవకార్యార్థం సన్యాసం ద్విజ! రోచయ । ఏవముక్తో దధీచస్తు ప్రత్యువాచ సతాన్సురాన్ ॥ 28
తీర్థయాత్రా ప్రతిజ్ఞాతా సర్వతీర్థేషు వై మయా । తాం తు కృత్వా కరిష్యామి దేహన్యాసం సురోత్తమాః ॥ 29
దేవాః : శక్తస్త్వం సర్వతీర్థానా మాహ్వానే ద్విజపుంగవ । ఇహాద్యైవ సమాయాన్తు సర్వతీర్థాని తేఽనఘ ॥ 30
ఘటోదరః : తేజసాచ త్వదీయేన తథాఽస్మాకంచ భార్గవ । ఏవముక్తస్సురైస్సర్వైస్తీర్థాని సరితస్తథా ॥ 31
సరాంసిచ సముద్రాశ్చ తత్రాజగ్ము ర్నరాధిప! । కామ్యేన మహతా రాజన్! యోగేన పరమేణ చ ॥ 32
స్నాత్వాచ తేషాం సాన్నిధ్యం తత్రస్నాతో ద్విజోత్తమః । తర్పణంచ తథా కృత్వా సురాణాం పితృభి స్సహ ॥ 33
ఉవాచ దేవాం స్తత్రస్థాన్ ఇదంవచన మర్థవత్ । దధీచః : అద్య ప్రభృతి మాసాన్తే భవద్భిః సతతం సురాః ॥ 34
సాన్నిధ్య మిహకర్తవ్యం తీర్థైశ్చైవ యథాగతైః । ఘటోదరః : ఏవముక్తైస్తథేత్యుక్తో దేవైస్తీర్థైశ్చ స త్వథ ॥ 35
త్యక్త్వా దేహం దివం యాతో దధీచః స్వేన తేజసా । విశ్వకర్మా చ తస్యాస్థ్నాం భాగై ర్వజ్ర మథాఽకరోత్ ॥
ఆయుధాని చ దేవానాం తథైవచ పృథక్ పృథక్।

## ఘటోదరుడు సన్నీతి తీర్థ మహిమ సెప్పుట

ఇంద్రుడు వృత్రాసుర వధ యందుండ ముల్లోకములు దైత్యుల వశముకాగా బ్రహ్మతో సురలెల్ల విష్ణువును శరణొంద వచ్చిరి. వారితో హరి, చ్యవనునియాత్మజుడు శ్రీమంతుడు దధీచుడనువాడు భార్గవ వంశ్యుడు బ్రాహ్మణుడు ప్రసిద్ధుడు, ఆ అతని యెముకలతో దేవేంద్రుని కొక యాయుధము గావింపుడు. నేనక్కడ దేవతలలో బ్రవేశించి వృత్రుని సంహరింతును సంశయము లేదనెను. ఇట్లుపలుక వేలుపులెల్ల దధీచాశ్రమమునకేగిరి. ఆ మహాభాగుని తపోనిధిని దర్శించి పూజించి యందరుంగలసి యతనితో నీయెముకలతో దైత్యసంహారకమైన వజ్రమ్ం దయారుసేసెదము. దానితో సురకార్యసిద్ధికి అందీవు దేవకార్యనిమిత్తము సన్యాసమున = దేహత్యాగమున కిష్టపడుమనిరి. దధీచి విని వారితో నేను సర్వతీర్థయాత్ర సేయవలెనని ప్రతినసేసికొంటిని. ఓ సురోత్తములార ! ఆ యాత్రగావించి యప్పుడు దేహన్యాసముం జేసెదనన దేవతలు ఓ ద్విజపుంగవా ! నీవు సర్వతీర్థముల నాహ్వానింప సమర్థుడవు. సర్వతీర్థములును నీయొక్కయు మాయొక్కయు తేజస్సుచే నిక్కడకిపుడే నీకొరకు వచ్చునుగాక ! అనివేల్పులందరు ననగా సర్వతీర్థములు నదులు సరస్సులు సముద్రములు నాతని మహత్తరము పరమమునగు కామ్యయోగమున నటకువచ్చినవి.

వాని సాన్నిధ్యము నెరింగి యా ద్విజోత్తముడందు స్నానము సేసెను దేవ పితృతర్పణములుగూడ సేసి యటనున్న దేవతలతో ఇప్పటినుండి ప్రతిమాసముచివర తామెల్లరు నిచటికేతెంచిన తీర్థములతో పాటిచ్చట సాన్నిధ్యము సేయవలెనని యర్థవంతమగు వచనము పలికెను. అదివిని దేవతలు తీర్థముల నట్లే యన దధీచుడప్పుడు దేహమునువిడిచి తనతేజస్సుతో దివమ్మునకేగెను. విశ్వకర్మ యాయన యస్థిభాగములచే వజ్రముంజేసెను అదేరీతిగ దేవతలు వేర్వేర నాయుధములను గావించెను.

తేచ వజ్రేణ మహతా వృత్రం హత్వా మహాసురమ్ ॥ 36
జఘాన దైత్య ముఖ్యానాం నవతి ర్నవతి స్తథా । తతః ప్రభృతి మాసాన్తే నిత్యమేవ రఘూద్వహ ॥ 37
సాన్నిధ్య మిహ తీర్థానాం దేవతానాం చ కల్పితమ్ ! 38
మార్కండేయః : ఏతచ్ఛ్రుత్వా మహాతేజా దత్వా దానాని రాఘవః ।
యయౌ సైన్యేన మహతా భరతోఽ మర కంటకమ్ । తత్ర విష్ణు పదం ప్రాప్య పూజయిత్వా చ రాఘవః ॥ 39
ఆససాద నదీం గౌరీం పుణ్యాం పాప భయావహామ్ । విశ్వామిత్రాజ్ఞయా రక్షః ప్రవివేశ పురా నృపమ్ ॥ 40
కశాహతేన మార్గస్థం శప్తం భూపాల శక్తినా । సౌదాసం స ప్రవిష్టస్తు భక్షయామాస శక్తినమ్ ॥ 41
తతః పుత్ర శతం రాజన్ వసిష్ఠ స్యైవ సత్వరః । హృతే పుత్రశతే దుఃఖా ద్వసిష్ఠో భగవానృషిః ॥ 42
వివేశ నిమ్నగాం గౌరీం ప్రాణత్యాగచికీర్షయా । విప్రస్య భూపః యాతస్య విద్రుతా సాతదాఽభవత్ ॥ 43
తతః ప్రభృతి లోకేఽస్మిన్ శతద్రురితి శబ్దితా । సర్వపాపప్రశమనీ సర్వకళ్యాణ కారిణీ ॥ 44
స్నాతానాం చ తథా రాజన్ దశధేనుఫల ప్రదా । తాంసమాసాద్య తత్రాపి దత్వాదానం స రాఘవః ॥ 45
ఉత్తీర్య తాం యయౌ తత్ర సా చాంత్యా యత్ర నిమ్నగా । యస్యాం స్నాత్వా విముచ్యంతే సర్వపాపభయైర్నరాః ॥ 46
యస్యాం స్నానా దవాప్నోతి దశగోదానజం ఫలమ్ । ఆషాఢేచ తథా కృత్వా గో సహస్ర ఫలం లభేత్ ॥ 47
గౌరీతోయా ద్వినిర్ముక్తో వసిష్ఠో భగవా నృషిః । పాశబంధభరైర్యస్యాం పపాత సహసా నృపః 48
విపాశశ్చ తథా దేవ్యా వృత్యా తీరే విసర్జితః । శక్తి పుత్రం తతో దృష్ట్వా వసిష్ఠోఽపి పరాశరమ్ ॥ 49
అస్త సన్తాన మిత్యుక్త్వా మరణా ద్వినివర్తత । సా చాంత్యాచ తథా లోకే విపాశే త్యభిధీయతే ॥ 50
విపాశాం చ సముత్తీర్ణే భరతే ధర్మ వత్సలే । వివేశ కటకం తస్య కుణి దేశో మహోదయః ॥ 51
త్రైగర్తో వసుధానశ్చ కులూతాఽధిపతిర్జయః । దాశేరక స్తథా రాజా గోవాశన ఇతి శ్రుతః ॥ 52
ఇరావతీం శీఘ్రగమాం భరతోఽపి తదా యయౌ । దశధేను ఫలం యత్ర స్నాత ఏవ సమశ్నుతే ॥ 53
షష్టితీర్థ సహస్రాణి వహత్యేకా ఇరావతీ । అష్టమ్యాంతు విశేషేణ యత్ర యుజ్యేత రేవతీ ॥ 54
తత్ర దత్వా బహువిధం దానం రఘుకులోద్వహః । ఉత్తీర్య తాం యయౌ శీఘ్రం దేవికాం పావనాశినీమ్ ॥ 55

ఆ వజ్రాయుధముచే సురపతి మహాసురుని వృత్రునిం జంపి దైత్యుల నవతినవతి సంఖ్యాకులను సంహరించెను. ఆదిమొదలు మాసముచివర నో రఘువంశరత్నమా! ఇక్కడ దేవతలయు తీర్థములయు సాన్నిధ్యము కల్పింపబడినది. అదివిని భరతుడు దానములుసేసి మహాసైన్యముతో అమరకటకమునకుం జనెను. అక్కడ విష్ణుపదమును దరిసి పూజించి పాప భయహారిణియగు గౌరీనదింజేరెను. అక్కడ విశ్వామిత్రు నాజ్ఞచే రక్షస్సొకడక్కడ రాజునందు ప్రవేశించెను. ఆ రక్షస్సు మున్ను కొరడాతో దారిలోనున్నాడని శక్తియను మహర్షిం గొట్టగా నాయన శపింపగా రక్షోజన్మముందినవాడు. వాడు సౌదాస నృపతిం బ్రవేశించి శక్తిని దినివైచెను. వశిష్ఠుని నూర్గురుపుత్రులంగూడ వాడుతొందరగ దినివైచెను. వశిష్ఠభగవానుడు మహర్షి పుత్రశతము సమయింపబడ దుఃఖముతో ప్రాణములువిడువనెంచి గౌరీనదిం జొచ్చెను అవ్విప్రుడటు చనినంత నానది పారిపోయెను. ఆదిమొదలానది లోకమందు "శతద్రువు" అనిపిలువబడినది. అది సర్వపాప ప్రశమని సర్వకల్యాణకారిణియై స్నానముసేసిన

వారికి పదిధేనువులు దానముసేసిన ఫలమిచ్చునది యయ్యెను. ఆనదింజేరి యక్కడగూడ రాఘవుడు దానములుసేసి యా నదిందాటి యానది అంత్యానదికేగెను. అక్కడ స్నానముసేసిన సర్వపాప భయములుపోవును. పది గోదానముల పుణ్యమునందును. ఆషాఢ మాసమునందట్లుసేసిన గోసహస్రదానఫలము లభించును. గౌరీనదీజలములందుండి వశిష్ఠభగవానుడు లేచినవాడై పాశములం బంధించుకొని తటాలున నందుదూకెను. ఆ నదీదేవి యాతని పాశములనువిడిచి యొడ్డునందు విడచెను. అంతట నట వశిష్ఠుడును శక్తిపుత్రుడైన పరాశరునింజూచి సంతానమున్నదని పలికి మరణమునుండి వెనుదిరిగెను. ఆ అంత్యానదియు లోకమందు విపాశ యని పిలువబడుచున్నది.

దృష్టమాత్రైవ యా దేవీ సర్వకల్మషనాశనీ । శరీర బహుళాసాతు హరస్య దయితా ఉమా ॥ 56
తత్రాపి దత్వా దానాని పూజయామాస శంకరమ్ । భరతే చాథ తత్రస్థే వివిశుః పంచ పార్థివాః ॥ 57
పార్వతీయా మహారాజః పదాతిగణ సంకులాః । కుమారః శ్రేణిమాన్ శూరో బలబంధుః సుయోధనః । 58
మద్రరాజోఽంశుమాంశ్చైవ తథైవచ మహాబలః । పూజితో మద్రరాజేన శాకలేన నరోత్తమః ॥ 59
త్రిరాత్రముషితః శ్రీమాన్ చంద్రభాగాం నదీం యయౌ । చంద్రాంశు శీతల జలాం సర్వపాప ప్రణాశినీమ్ ॥ 60
బహుతీర్థ సమాయుక్తాం స్నానాత్ సర్వప్రదాం నృణామ్ । విశేషేణ మహారాజః మాఘపుష్య త్రయోదశీమ్ ॥ 61
భరతే తాం సముత్తీర్ణే వివేశ కటకం తతః । ఏతచ్ఛ్రుతం జయః శ్రీమాన్ అభిచారః కృతంజయః ॥ 62
కాశ్మీరకశ్చ ధర్మాత్మా సుబాహురితి విశ్రుతః । ఆససాద సతైస్సార్థం వితస్తాం తు మహానదీమ్ ॥ 63
స్వర్గలోకప్రదాంస్నానే సర్వకల్మషనాశినీమ్ । ప్రోష్ఠపాదస్య మాసస్య శుక్ల పక్షత్రయోదశీమ్ ॥ 64
విశేషేణ మహారాజః పుణ్యాం పరమపావనీమ్ । భరతస్తాం సముత్తీర్య సుదామాం చైవ నిమ్నగామ్ ॥ 65
ఆససాద మహాతేజాః కైకేయాన్ యదునన్దన । బలేన చతురంగేణ యుధాజిత్ కైకయాధిపః ॥ 66
నిర్యయౌ భరతం ప్రాప్తం శ్రుత్వా భరతమాతులః । నాగరాశ్చ తథాముఖ్యా రాజగృహనివాసినః ॥ 67
బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యా యేచ వర్ణవరా జనాః । యానైరుచ్చావచైస్సర్వే నగరాత్తు వినిర్గతాః ॥ 68
వాదిత్రాన్ పురతః కృత్వా గణికాశ్చ వినిర్గతాః । ప్రతి గ్రహ నిమిత్తం తు రాఘవస్య మహాత్మనః ॥ 69

భరతుడు విపాశానదిందాటినంత నతని కటకమును మణిదేశరాజు మహోదయుడు చేరెను. త్రిగర్త దేశాధిపతి వసుధనుడు కులూతాధిపతి జయుడుదాశేరక దేశాధిపతి గోవాశనుడను రాజును నతని కటకమందు ప్రవేశించిరి.

అప్పుడు భరతుడిరావతి నదిని దరిసెను. అనది చాలవేగము గలది అందుస్నానము చేసినవాడు దశగోదానఫలమందును. అరువదివేల తీర్థముల నా నది వహించెను. అష్టమినాడు రేవతీ నక్షత్రము కలిసివచ్చిననటనది చాల విశేషము. అచట పెక్కు విధములగు దానములు సేసి రఘుకులోద్వహుడానదిందాటి పాపనాశిని యైన దేవికానదికేగెను. ఆపుణ్యనది దర్శనమాత్రముననే సర్వపాపముల హరింపగలది. ఆమె యనేక శరీరములుగల హరుని ప్రియురాలగు ఉమాదేవియొక్క యొకానొక మూర్తియే. దేవికానది భరతుడటను స్నానము చేసి దానములిచ్చి శంకరునర్చించెను. అచ్చట భరతుడున్నపుడు పార్వతేయులు (కొండరాజులు) అనేక పదాతి దళములవారు ఐదుగురు 1 కుమారుడు 2 శ్రేణిమంతుడు 3 శూరుడు 4 బలబంధువు 5 సుయోధనుడనువారు భరతుని కటకముంబ్రవేశించిరి. మద్రదేశాధిపతి అంశుమంతుడను నతడు మహాబలశాలి భరతునికి మిత్రుడయ్యెను. మద్రరాజగు శాకలునిచే బూజితుడై భరతుడక్కడ మూడురాత్రులు వసించి చంద్రభాగానదికేగెను. ఆనది చంద్రకిరణ శీతలజల. సర్వపాపహారిణి. బహు తీర్థములతో గూడినది స్నానమాత్రమున సర్వప్రద. మాఘపుష్యత్రయోదశినాడు ఇట చాల విశేషము పుష్య = పుష్యమీ నక్షత్రముతో గల త్రయోదశి) దానినిదాటి ఆమీద భరతుడు సుదామానదినిజేరి కైకయదేశముల కేగెను. చతురంగ బలముతో యుధాజిత్తు

భరతుని మేనమామ భరతుడువచ్చి నాడని విని యెదురేగెను. రాజగృహనివాసులు బ్రహ్మానంద వర్ధనమువారు నాగరులు వాద్యములతో గణికలతో రఘువంశవర్ధనుని ప్రతిగ్రహనిమిత్తము (స్వాగతమిచ్చి స్వీకరించుటకు) మహాయానములతో బయలుదేరిరి.

భరతోఽపి మహాతేజాః స సమేత్య యుధాజితా । అభ్యధావత తత్ప్రీత్యా మాతులం కేకయాధిపమ్ ॥ 70
కంఠే గృహీత్వా భరతం మూర్ధ్న్యుపాఘ్రాయ చాసకృత్ । భరతోఽపి సమాదాయ రాజగేహ ముపాగమత్ ॥ 71
సమే మనోరమే దేశే ప్రభూతయవసేంధనే । శిబిరం భరత శ్చక్రే నగరస్యాఽవిదూరతః ॥ 72
పృథక్ పృథక్ తథా చక్రుః స్కంధావార నివేశనమ్ । మనః ప్రియేషు దేశేషు నానా దేశ్యా నరాధిపాః ॥ 73
కృత్వా నివేశాన్ మనుజేశ్వరాణా మాదిశ్య భోగాన్ సకలాన్ స తేషాం ।
వివేశ నాగేన స మాతులస్య పురం ప్రహృష్టో రఘువంశచంద్రః ॥ 74

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
రాజగృహ గమనం నామ సప్తోత్తర ద్విశత తమోఽధ్యాయః.

భరతుడును మేనమామయను యుధాజిత్తు రాజుదరి కేగెను. అతడు భరతుని కౌగలించుకొని, శిరమునుమూర్కొని రాజగృహము చేర్చెను. నగరసమీపమున సమ ప్రదేశమున సమృద్ధియైన గడ్డి వంటచెరుకుగల చోట భరతుడు శిబిరమును వేయించెను. స్కంధావారనివేశనము వేర్వేర భరతానుయాయులగు నానాదేశాధిపతులు మనఃప్రియముగ వేరువేరు శిబిరములు నేర్పరచుకొనిరి. భరతస్వామి మనుజేశ్వరులకు నివేశనము లేర్పరచి వారికి సకల భోగములుం జరుగనాజ్ఞయిచ్చి హర్షభరితుడైన భరతుడు రఘువంశ చంద్రుడు మేనమామగారి గృహముం బ్రవేశించెను.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున భరతుని రాజగృహగమనమను రెండువందలయేడవ యధ్యాయము.

## రెండువందలఎనిమిదవ అధ్యాయము - భరతుని రాజగృహగమనము

తతః స్వల్ప పరీవారో భరతో ధర్మ వత్సలః ! అభ్యధాయ తతః ప్రీత్యా మాతులః కైకయాధిపః ॥ 1
కంఠే గృహీత్వా భరతం మూర్ధ్న్య పాఘ్రాయ చాఽ సకృత్ । భరతోఽపి సమాదాయ రాజన్ ! గృహముపాగతమ్ ॥
ప్రవివేశ పురం హృష్టో మాతులస్య యుధాజితః । పతాకా ధ్వజ సంబాధం సిక్తం చందనవారిణా ॥ 3
ధూపేనాగురు సారాణాం సమన్తా దాకులీకృతమ్ । కృతోపహారం సర్వత్ర కుసుమైః పంచవర్ణకైః ॥ 4
సర్వపణ్యవిసంయుక్తం సమాలంకృత బాలకం । ఖముల్లిఖద్భిః ప్రాసాదైః శ్వేత మేఘ గణై ర్యుతమ్ ॥ 5
విన్య స్తబలిపూజంచ దేవతాయతనేషు చ । మహావాదిత్రఘోషేణ సమంతాత్ కృత నిస్వనమ్ ॥ 6
పౌరైః దిదృక్షుభిః సర్వై రాకీర్ణాపణ వీథికమ్ । రాజమార్గే మహారాజ! పిండీకృత మహాజనమ్ ॥ 7
రాజమార్గా దపాకృష్ట శూన్య సర్వ నివేశనం । యోషిద్బృంద సమాక్రాంత రాజమార్గ మహాగృహమ్ ॥ 8
ప్రవివేశ పురం శ్రీమాన్ భరతో నాగధూర్గతః । తస్య కామాభవపుషః ప్రవేశే భరతస్య తు ॥ 9
గృహకార్యాణి సంత్యజ్య యయు ర్నార్యో గవాక్షికాన్ । కాశ్చి దర్ధానులిప్తాంగ్యః కాశ్చిదేకాంజి తేక్షణాః ॥ 10
కేశైః సంయమితైః కార్ధైః కాశ్చిదర్ధ నివేశితైః । ఏకస్మిం శ్చరణే కాశ్చిత్ గృహీత్వా కాష్ఠ పాదుకాః ॥ 11
త్వరితాస్తా యయుః నార్యో ద్వితీయే చర్మపాదుకాః । తథా పరాః సమాక్షిప్య పూర్వాక్రాంత గవాక్షకాః ॥ 12
వ్రజ న్తీషు తథాఽన్యాసు కాశ్చిన్నార్యో గవాక్షకాత్ । వేగవత్యో యయుః శీఘ్రం సంత్యక్త్వా చర్మ పాదుకాః ॥ 13
నార్యః స్వవదనై శ్చక్రుః సువక్త్రాం స్తాన్ గవాక్షకాన్ । అర్ధప్రవిష్ట సత్కంబు పాణి వారిజ కుట్మలాః ॥ 14

ద్వితీయ పాణి సందష్ట సమాక్రాంతై ర్యయుః కరైః । నీవీ బంధన విశ్లేష సమాకులిత చేతనాః ॥ 15
యయురేవాఽపరా స్తత్ర పాణి సంశ్లిష్ట నీవయః । కుసుమ ప్రకరం కాశ్చిత్ గూహమానాః శిరోగతైః ॥ 16
యయు రేవాంశుకై ర్దీర్ఘై స్త్వరమాణా గవాక్షకాన్ । సితాసితేన రామాణాం రమణీయేన రాఘవః ॥ 17
యయౌ దృష్టి నిపాతేన రజ్యమాన ఇవాంశుమాన్ । సచకర్ష తదా తాసాం పతితై ర్నేత్ర రశ్మిభిః ॥ 18
హృదయా న్నిగృహీత్వేవ గచ్ఛమాన స్సరాఘవః । సతు దృగ్విషయే యాసాం యాసాం తస్మా త్వరా గతః ॥ 19
న తా బుబుధిరే కాశ్చిత్ క్రియాం చిత్రగతా ఇవ । భరతే దూరయాతేఽపి నిశ్చేష్టాః కాశ్చిదేవ తాః ॥ 20
ఆకృష్టాస్తా యయుః క్షోణీం ప్రేర్యమాణై స్సఖీజనైః । ప్రద్యుమ్నాంశ సముత్పన్నః ప్రద్యుమ్న సమదర్శనః ॥ 21
ఆదాయ తాసాం చేతాంసి యయౌ రాజగృహం ద్రుతమ్ । తస్మిన్ రాజగృహే రాజన్! రాఘవో రాజ మందిరమ్ ॥
ఆససాద మహాతేజాః కైలాస మివ చాపరమ్ । ప్రవిశ్య స గృహం ముఖ్యం ప్రేషయామాస భూభుజమ్ ॥ 23
పానభోజనవాసాంసి సైనికానాంచ యాదవః । ఉవాస ససుఖం తత్ర పూజితశ్చ యుధాజితా ॥ 24
జగామ చాస్తంసవితా జపాపుష్పోత్కరప్రభః ।
జాంబూనదే రత్నసహస్ర చిత్రే సరాజ పుత్రః శయనే విచిత్రే ।
సుష్వాప రాత్రౌ భవనే విచిత్రే నిదాఘరాత్రిం పవనే విచిత్రే ॥ 25

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
భరతస్య రాజగృహ ప్రవేశ వర్ణనం నామ అష్టోత్తర ద్విశతతమోఽధ్యాయః.

మార్కండేయుడనియె : ధర్మప్రియుడగు భరతుడు స్వల్పపరివారముతో నేగెను. కైకయాధిపతి భరతమాతులుడు యుధాజిత్తు భరతుని బిగ్గకౌగలించుకొని పలుమారులు శిరమ్ము మూర్కొని ప్రీతితో నాదరించెను. భరతుడు తన గృహమున రాజుతో యుధాజిత్తు రాజధాని నానందముతోజూడ ప్రవేశించెను. ఆకేకయ రాజనగరము పతాకాధ్వజ సంబాధమై చందనోదకములచే దడుపబడి అగురుసార ధూమములు నలు దెసల ఘుమ ఘుమలాడు చందన పంచవర్ణములయిన పూవులచే నంతట నలంకృతమై సర్వ విధములయినవస్తువులమ్ము బజారులతో నలంకృతమైన బాలురతోగూడి తెల్లని మేఘసముదాయమట్లున్న ప్రాసాదములతోగూడి, దేవాలయములందుంచబడిన బలులతో బూజలతోగూడి మహావాద్య ధ్వనిచే ప్రతిధ్వనించుచు పురసందర్శన కుతూహలురైన పౌరులతో నిండనలముకొనిన బజారువీథులతో రాజమార్గమంచు గుమిగూడిన మహాజనముతో రాచబాటనుండి శూన్యగృహములెల్ల దొలగింపబడినది రాజమార్గమందలి మహాగృహములందు భరతదర్శనమునకై గుమిగూడిన సుందరీబృందముతో గనువిందైన కుంతల రాజధానీ నగరమును గజరాజునెక్కి భరతుడు ప్రవేశించెను. మన్మథుడట్టి యందగాని నాతని పురప్రవేశము నందింటి పనులువదలి పద్మాక్షులు గవాక్షములదరికరిగిరి. అందుకొందరు మేనికి గంధము సగము పూసికొన్నవారు ఒక్క కంటికి కాటుకపెట్టుకొన్నవారు జుట్టు సగము కొప్పుముడిచికొన్నవారు. కొందరు సగము ముడివైచుకొనిరి. కొందరొక కాలికి కర్రపావుకను దొడిగికొని భరతుని జూచునాశతొందరపెట్ట రెండవకాలికి చర్మపావుకలు దొడిగికొన్నవారు అట్లే కొందరంతముందే కిటికీల నాక్రమించికూర్చున్న వారిని కిటికీలదగ్గరకు వెళ్ళుచున్నవారిని లాగిత్రోసి యతివేగముగొని చర్మపాదుకలనువదలి పరువెత్తిరి. ఆగవాక్షములను (గోవు కన్నువలె నమర్చిన కిటికీకి గవాక్షమనిపేరు) తమ ముఖములచే సుముఖములను (శోభనముఖములను) గావించిరి. నలుపు తెలుపునైన సహజమైన తెలుపు కాటుకవలని నలుపుచే రెండు విధములయిన రమణీమణుల దృష్టి ప్రసారముచే రంజితుడైనట్లు తనపై ప్రవాలు వారి నేత్రకాంతులచే రంజితుడై సూర్యునట్లు రంజితుడై యారాజవీథింజనుచు తన హృదయమును నిగ్రహించుకొనుచునే యా రఘు వంశవర్ధనుడా పురవీథిం జనెను. ఏయేరమణీమణుల చూపులగురి నాతడు దవిలెనో యాయా యంగనలు కొందరు చిత్రరుపునం బొమ్మలట్లు కర్తవ్యములను ఇంటిపనులను మరచిరి. భరతుడు దూరమేగ కొందరంగనలునట్లే నిశ్చేష్టలైరి. సఖీజనము ప్రేరేపింప

(భరతుడు దూరమేగెనని తెలుపబడి) కొందరు క్షోణికింజనిరి (మేడ క్రిందికి దిగిరన్నమాట) ప్రద్యుమ్నుని యంశమున నవతరించిన వాడు ప్రద్యుమ్నునితో సమమయినయందము గలవాడునగు భరతుడాపుర సుందరుల డెందముల గొనివేగముగ రాజ గృహమునకుం జనెను. ఆరాజగృహమందతడు రెండవ కైలాసమట్లున్న రాజ సౌధముం బ్రవేశించెను. ముఖ్యగృహమది ప్రవేశించి భూపతిని (యుధాజిత్తును) బంపెను. సైనికులకు పానభోజన వసనాదులనుం బంపించెను. యుధాజిత్తుపూజింప నతడక్కడ సుఖముగా వసించెను. అంతట సూర్యుడు జపాకుసుమ పుంజమట్లు (దాసానిపూవుగుత్తివలె) నెఱ్ఱనికాంతిగొనెను. రత్నసహస్ర చిత్రమై విచిత్రమునై బంగారు తల్పమునందా గ్రీష్మ ఋతు రాత్రి చల్లనిగాలిలో నిదురపోయెను.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున భరతుని రాజగృహ ప్రవేశమను రెండువందల యెనిమిదవయధ్యాయము.

## రెండువందలతొమ్మిదవ అధ్యాయము - యుద్ధప్రసంగము

మార్కండేయః : తస్మిన్ రాత్ర్యవసానే తు భూమిపానాం పృథక్ పృథక్ ।
కటకేష్వభ్యహన్యన్త సంజ్ఞాతూర్యాణి యాదవ ! ॥ 1
బహూనాం బలముఖ్యానాం నానాలింగాని భాగశః । తేషాం కోలాహలః శబ్దో బభూవ గగనంగమః ॥ 2
వివిశు ర్భరతస్యాపి తతః ప్రాబోధికా జనాః । వైణికా గాయనా ముఖ్యా వంశవాద్యవిదశ్చయే ॥ 3
మార్దంగికాః పాణవికాః శంఖ వాదనకాశ్చ యే । రక్తకంఠాః సుమధురా యేచ మంగళపాఠకాః ॥ 4
సూతమాగధ ముఖ్యాశ్చ వందినశ్చ నరాధిప । తుష్టువుర్భరతం వీరం సుఖసుప్తం మహామతిమ్ ॥ 5
సుప్రభాతం సముత్తిష్ఠ! ప్రభాతా రజనీ శుభా । దిక్ప్రాచీ రఘుశార్దూల! వర్తతేఽరుణరంజితా॥ 6
నూనమస్యాం హి వేళాయాం మాతలిః త్రిదశాధిపమ్ । విబోధయతి రాజేంద్ర! సుఖాయ జగతాం విభుమ్ ॥ 7
త్వయి సుప్తే జగత్ సుప్తం విబుద్ధేచ సుఖాన్వితమ్ । తస్మాదుత్తిష్ఠ! లోకానాం శివాయ రఘునందన ! ॥ 8
త్వం హి సర్వగుణారామో యథారామో మహీపతిః । గుణైః శశాంకరశ్మ్యాభైస్త్వయా వై రంజితం జగత్ ॥ 9
అత్యాశ్చర్యం మహాబాహో! యశసా సుసితేన తే । ముఖాన్యరాతిబృందానాం క్రియన్తే మలినాని యత్ ॥ 10
కృపాణధారా పానీయం దృష్ట్వాఽరాతి గణస్తవ । తృష్ణయైవ భవత్యాశు రంజితానిలయో భయాత్ ॥ 11
అక్షోభ్యశ్చాతిగంభీరో భవాన్ రత్నాకరస్తథా । అగ్రాహ్యత్వాత్సముద్రేణ న సమః ప్రతిభాతి నః ॥ 12
సౌమ్యః కలావాన్ లక్ష్మీవాన్ నయనానందకారకః । దోషాకరేణక్షయిణా నౌపమ్యం తే నరాధిప! 13
బాహుభోజ్యాఽతివిస్తీర్ణా సర్వాశ్రయవతీ దృఢా । నౌపమ్యంయాతి తే సమ్యక్ క్షోణీ విన్ధ్యేన కంపినా ॥ 14
యత్తేఽసి తదవశ్యం త్వం దదాసి రిపుసూదన । అవిద్యమానాభీర్దత్తా భవతాఽరిగణే కుతః ॥ 15
నిమేషమపి యో దృష్టః త్వయాపాంగ నిరీక్షణైః । సమగ్ర దృష్ట్యాయం దృష్టో నిత్యమేవేక్షణైః శ్రియః ॥ 16
క్షురపర్యన్తధారేణ చక్రేణారిగణస్య తే । శిరాం స్యపహరత్యాజౌ దేవదేవో జనార్దనః ॥ 17
కపాలమాలీ ఖట్వాంగీ శశాంకకృతభూషణః । వామార్ధదయితాకారః శంకరః శం కరోతు తే ॥ 18
పద్మాసనః పద్మజన్మా సర్వలోకపితామహః । బుద్ధింమేధాం ధృతిం లక్ష్మీం బలంచ విదధాతు తే । 19
నభశ్చరోఽంబుజో దేవో దిగ్వధూకర పూరకః । బ్రహ్మాండమండపే దీపః సుప్రభాతం కరోతు తే ॥ 20
కేశయక్షేశ దేవేశ ప్రేతేశ్వర నిశాచరాః । సర్వదేవ గణైస్సార్ధం సుప్రభాతం దిశన్తుతే ॥ 21
ఋషయ స్సరితశ్శైలాః సాగరశ్చ దిశో దశ । కాలస్యావయవాశ్చైవ సుప్రభాతం దిశన్తు తే ॥ 22
ఇతి శృణ్వన్ గిరం పుణ్యా మేషాం మంగళవాదినామ్ । మహాపుణ్యాహఘోషేణ తత్యాజ శయనం తదా ॥ 23

ఆయవ్యయం స శుశ్రావ లేఖకైర్గణకైస్సహ । వేగోత్సర్గం తతః కృత్వా యయౌ స్నానగృహం శుభమ్ ॥ 24
స్నానారంభం తతశ్చక్రే దంతధావన పూర్వకమ్ । ఉత్సాదితః కషాయేణ బలవద్భిర్నరైస్తదా ॥ 25
సుఖం భద్రాసనాసీనః సూక్ష్మాంబరధరః ప్రభుః । సస్నౌ సవివిధైస్తోయైర్నదీ సాగరజైః శుభైః ॥ 26
కుంభైః సువర్ణ మాహేయైస్తామ్రై రౌప్యమయైస్తథా । శతాధికై ర్మహారాజః సర్వౌషధి సమన్వితైః ॥ 27
క్షీర ప్రవాహ సంయుక్తై ర్మాల్యకంఠైస్సు పూజితైః । ఆవర్జితై ర్మహీపాలః సుస్నాతాఽలంకృతై ర్నరైః ॥ 28
చందన స్రావ సంపూర్ణైః ద్విజమంత్రాను మంత్రితైః । బభార వసనం చారు స్నాన తోయౌఘ సంకులమ్ ॥ 29
శశాంక మండలం పూర్ణం తన్వభ్రైరివ సంవృతమ్ । వాద్యపుణ్యాహఘోషేణ తథా గీతస్వనేనచ ॥ 30
స్నాత్వోపస్పృశ్య విధివత్ పూర్వాం సంధ్యాం సమాహితః । దదర్శ వదనం చారు దర్పణేచాథ సర్పిషి ॥ 31
స సువర్ణే మహారాజః దైవజ్ఞేనాఽభిమంత్రితే । దినేశం తిథి నక్షత్రం తతశ్శుశ్రావ రాఘవః ॥ 32
సాంవత్సరముఖోద్గీర్ణం కలిదుస్స్వప్ననాశనమ్ । చకారాభ్యర్చనం చాథ దేవదేవస్య చక్రిణః ॥ 33
గంధమాల్యనమస్కారధూపదీపాన్నసంపదా । స్తవైర్బలిప్రదానైశ్చ గీతవాద్య స్వనేన చ ॥ 34
సంపూజ్య దేవదేవేశం వివేశాఽగ్నిగృహం శుభమ్ । తత్రాగ్నిం సముపస్థాయ హుతం పూర్వం పురోధసా ॥ 35
దుస్స్వప్ననాశనం కర్మసిద్ధివృద్ధిజయప్రదమ్ । ప్రాగేవ తస్య కృతవాన్ విద్వాన్ నృప పురోహితః ॥ 36
తతస్త్వోపసదే వహ్నౌ భరతః ప్రీతమానసః । శ్రీసూక్తం పౌరుషం సూక్తం జుహావ ప్రయతస్తదా ॥ 37
ఆజ్యేన మంత్రపూతేన విధినా సుసమాహితః । దత్వా పూర్ణాహుతిం చాగ్నౌ కృతజప్యో మహామతిః ॥ 38
ఉదకే నార్చనం చక్రే దేవానాం పితృభి స్సహ । తతస్స నిర్యయౌ తస్మాద్భరతో వహ్నివేశ్మనః ॥ 39

మార్కండేయుడనియె. ఆరేయిచివర రాజుల వేర్వేరు కటకములందు సంజ్ఞాతూర్యములు (ఒకానొకవిషయము గుర్తు సేయుటకు వాయింపబడు వాద్యములు) పెక్కుమంది సేనాధిపతులకు పెక్కువిధములయిన లక్షణములుగలవి వేర్వేర మ్రోగింపబడెను. వాని కోలాహలరవ మాకసమునంటెను. అవ్వల భరతుని మేల్కొలుపు ప్రాబోధికులుగూడ యాయనశిబిరమును ప్రవేశించిరి. వారు వైణికులు గాయకులు వేణువాదన నిపుణులు మార్దంగికులు పణవములు వాయించువారు శంఖములు పట్టువారు బెక్కుమంది యుండిరి. చక్కని కంఠస్వరముగలిగి వారు సుమధురముగా బాడువారునైన మంగళ పాఠకులు సూతవందిమాగధ శ్రేష్ఠులు సుఖసుప్తుడైన వీరుని మతిమంతుని భరతుని స్తుతించిరి. ఓ రఘుశార్దూలా! నీకుసుప్రభాతము మేల్కొనుము. సుశోభన రాత్రియిదె తెలవారినది. తూర్పుదిశ అరుణ (రాగ)రంజితమైనది. రాజేంద్రా! ఇదేవేళయందు మాతలి ఇంద్రు మేల్కొలుపుచుండును. నీవునిదురింప జగము నిదురించును. మేల్కొన మేల్కొనును (సుఖమునందునన్నమాట) అందువలన రఘునందనా! లోకములకు శివము (మంగళము) కలుగ మెళకువగొనుము. నీవు భూపతియగు రాముడట్లు సర్వగుణారాముడవు. శశాంకకిరణము లచ్చమైన చల్లనైన నీగుణములచే జగము రంజితమైనది అత్యద్భుతము మహావీర! మిక్కిలి యచ్చమైన నీయశస్సుచే నరాతి (శత్రు) బృందముల ముఖములు మలినములు. (నల్లనివి) గావింపబడుచున్నవి (తెలుపుచే నలుపగుట యిక్కడ యద్భుతమన్నమాట) నీశత్రుగణము నీకృపాణ (ఖడ్గ) ధారా (అంచు) రూపమైన పానీయముంజూచి దప్పింబోలె భయమువలన వేవేగ రంజితానిలయమగుచున్నది. కలగింపరానివాడు అతిగంభీరుడు (మిగులలోతైనమనస్సుగలవాడు అగాధమైనదియని రెండపయర్థము)నై రత్నాకరుడు గుణరత్ననిధివైన (రత్నాలగనియైనవాడని సముద్రపరమైన రెండవయర్థము (శ్లేష) నీవు అగ్రాహ్యుడ వగుటవలన (మారు గ్రహింపరానివాడగుటవలన) గ్రాహములకు (మొసళ్ళకు) వాసయోగ్యము కానందున నీవు సముద్రునకు సరివాడవుగా మాకు భాసించుట లేదు. నీవు సౌమ్యుడవు (శాంతుడవు) కలావాన్ = కళలు విద్యలు కలవాడు లక్ష్మీవాన్ = ఐశ్వర్యసంపన్నుడవు నయనముల కానందముగూర్చు వాడవును నైనందున నీకు దోషాకరునితో దోషమునకుగని (దోపా = రాత్రిని కరుడు = చేయువాడు చంద్రుడన్న

మాట (నిశాకరుడు) క్షయి = క్షయముగలవాడు (కృష్ణపక్షమందు తగ్గుచుండువాడు) నైనవానితో జంద్రునితో నీకుపోలికలేదు. ఆతడును సౌమ్యుడు = బుధునికుమారుడు కళావాన్ = పదునారుకళలుగలవాడు లక్ష్మీవాన్ = చంద్రే లక్ష్మీః అనుటంబట్టి లక్ష్మీగలవాడు (చెల్లెలుగా లక్ష్మిగలవాడనియుంజెప్పవచ్చును) అయినను నతనికి దోషాకరత్వము క్షయస్వభావము నున్నందున నీకతని పోలిక చెప్పరాదని యిట శ్లేషమూలకమైన వ్యతిరేకాలంకారము బాహుభోజ్యా = బాహులచే బాహుపరాక్రమముచే రాజులకు అనుభవింపదగినది. అతివిస్తీర్ణా = మిగులవిశాలమైనది సర్వాశ్రయవతీ = సర్వులకు ఆశ్రయముకలది (అందరికి నిలుపనీడయైనదన్న మాట) దృఢా = దృఢమైనదియునైన క్షోణి = భూమి వింధ్యేన = వింధ్యపర్వతముచే, కంపితా = కంపింపబడునదై నీకుతెన్నగ (చక్కని) పోలికను పొందకున్నది. నీవు బహుభోజ్యుడవు పెక్కుమంది కనుభవింపదగినవాడవు అతివిస్తీర్ణుడవు కీర్తిచే ప్రతాపాది గుణములచే మిక్కిలివిస్తరించినవాడవు సర్వాశ్రయవంతుడవును అయి ఏశత్రువుచేతను కంపింపబడనివాడవై యున్నందున నీకు భూమితో సామ్యముకుదురుటలేదని యిదియు శ్లేషానుప్రాణిత వ్యతిరేకాలంకారమే. ఓ శత్రుసూదన ! భరతా ! నీకేదిగలదదియవశ్యమిత్తువు. అట్టివాడవునీవు నీకులేనిచేతిని శత్రుకూటమున కిత్తువిదియెట్లు ? ఎందుచేత ? ఒకనిమేషమేని నీ యపాంగవీక్షములచేత (కటాక్షములచేత) చూడబడినయాతడు నిత్యము లక్ష్మియొక్కచూపుల సమగ్రదృష్టిచే చూడబడును. లక్ష్మీపరిపూర్ణకటాక్షములకు పాత్రుడగు నన్నమాట. నీ సగముచూపు లక్ష్మి నిండుచూపునకు సరిపోవుననుటలో నీవు లక్ష్మికంటె గొప్పవాడవను భావమును నిక్కడను వ్యతిరేకాలంకారమే.

నీయొక్క క్షురపర్యంతధారమైన = పదునైన అంచుగల చక్రముచే యుద్ధమందు నీ శత్రుకూటము యొక్క తలలను జనార్దనుడు ఖండించును. పునుకలమాలందాల్చి మంచపుకోడాయుధముగాదాల్చి ఖశాంకములనగా సర్పములు అవి భూషణములుగా దాల్చి సగముమేన ప్రియురాలిం దాల్చి యుండు శంకరుడు నీకు శంకరుడగుగాక. శం = సుఖమును కరుడు = చేయువాడు అగుగాక. పద్మమాసనముగా గలవాడు పద్మమునం బుట్టినవాడు సర్వలోక పితామహుడు నీకు సర్వసమృద్ధిని మేధను ధైర్యమును బలమును నీకు జేకూర్చుగాక! ఆకాశ సంచారి దిశాంగనల హస్తముల నింపువాడు బ్రహ్మాండమండపమందు దీపమైనవాడు(సూర్యుడు) నీకు సుప్రభాతమొనరించుగాక ! కేశ (క = ఉదకములకు ఈశ = ప్రభువైన) వరుణుడు యక్షేశుడు = కుబేరుడు దేవేశ = ఇంద్రుడు ప్రేతేశ్వర = యముడు నిశాచర = రాక్షసుడు (నిర్‌ృతి) సర్వదేవగణములతో నీకు సుప్రభాతమును గూర్తురుగాక ! ఋషులు నదులు పర్వతములు సాగరములు దిక్కులు కాలావయవములు తృటినిమేషము మొదలు యుగములు కల్పములదాకగల కాలావయవములకధిష్ఠానదేవతలు నీకు సుప్రభాతమొనరింతురుగాక! ఈవిధమైన మంగళపాఠకుల మంగళవాక్యము లాలించుచు మహాపుణ్యాహ ఘోషముచే నయ్యెడ భరతుడు తల్పమునుండి లేచెను. లేవగానే లేఖకులు(గుమాస్తాలు)గణకులు వినిపించు నాదాయ వ్యయములనువినెను. వేగోత్సర్గముంగావించికొని స్నానగృహమునకేగెను. దంతధావనముగావించి మంచిబలశాలులైన నరులచే మేనికి కషాయముపూయబడి మర్దనముసేయబడి స్నానారంభముసేసెను. సుఖముగ భద్రాసనమందుగూర్చుండి నీరాక్షవస్త్రముగట్టుకొని వివిధపుణ్యనదుల సాగరముల జలములచే స్నానము సేసెను. సర్వౌషధులతో గూడిన బంగారు రాగి వెండిబిందెలతో శతాధికములు పాలప్రవాహములతో గూడినవి పూలమాలలచే నలంకృతములు చక్కగపూజింపబడినవి నిండ చందనోదకములు గలిపినవి మంత్రపూరితములైనవియు చక్కగతాము స్నానము సేసి అలంకరించుకొన్న నరులచే ఆవర్జితములు = పోయబడిన ఉదకములచే భరతుడు స్నానముచేసెను. స్నానోదకముతో సంకులమైనది (తడిసినది) చిన్నచిన్న మబ్బులతోగూడిన పూర్ణచంద్రమండలమట్లున్న చక్కని జిలుగు వలువను ధరించెను. మంగళవాద్య పుణ్యాఘోషముతో పాటల మధురధ్వనితో స్నానము సేసి యథావిధిగ నుపస్పర్శనము సేసి (నీటితో చక్షురారాదీంద్రియములను స్పృశించి) కుదురుకొని పూర్వసంధ్యవార్చి (ప్రాతః సంధ్యావందనము సేసి) అటుపై మంగళాచారమగుటచే నద్దమందు నవ్వల నేతియందు జ్యోతిషికునిచే నభిమంత్రితమైన బంగారమందు దన చక్కని ముఖమును జూచికొనెను.

అటుపై సాంవత్సరుని (జ్యోతిషికుని) ముఖమున బలుకబడినది కలి దోషమును దుస్స్వప్నములను నశింపజేయు దినేశుని (సూర్యుని) సూర్యసంచారరాశి మొదలయినవానిని తిథిని నక్షత్రమునువినెను. ఆనాటి పంచాంగస్థితిని శ్రవణముసేసెనన్నమాట. అటుపై దేవదేవుడగు విష్ణువునర్చించెను. గంధమాల్య నమస్కార ధూపదీప మృష్టాన్న సంపదచే దేవతార్చనము సేసి అన్ని కాకబలి యిత్యాది వైశ్వదేవవిషయములైన బలులువేసి గీతవాద్య మంగళధ్వనితో హరినిబూజించి యగ్నిశాలం బ్రవేశించెను. అంతమున్నె పురోహితుడు హోమముసేసిన యగ్నికుపస్థానముసెప్పెను. ఆప్రక్రియ దుఃస్వప్ననాశనము సిద్ధి వృద్ధి జయప్రదమునుంగూడ. అంతకుముందే విద్వాంసుడగు రాజపురోహితు డాయగ్నికార్యమును జేసియుండెను. అటుపై నౌపాస నాగ్నియందు సంప్రీతమనస్కుడై మంత్రపూరితమైన ఆజ్యముతో భరతుడు శ్రీసూక్త పురుషసూక్త సంపుటిగా యథావిధి హోమముగావించెను. అగ్నియందు పూర్ణాహుతింగూడ నొసంగి జపముసేసి అటుపై దేవతలకు పితరులకును నుదకముతో తర్పణముసేసెను. అవ్వల నాతడాయగ్ని గృహమును వెడలెను.

నిష్క్రమ్య పూజయామాస బ్రాహ్మణాన్ వసునా తదా । గోభిరశ్వైః సువర్ణేన దధిపుష్పఫలాన్వితైః ॥ 40
మోదకైశ్చ తథా రత్నైర్వస్త్రైశ్చరఘునందనః । పూజితానాం ద్విజేంద్రాణాం భరతేన మహాత్మనా ॥ 41
పుణ్యాహ ఘోష స్త్రిదివం జగామ మధురస్వరః । స పూజయిత్వా విప్రేంద్రాన్ ప్రవిశ్య చ తథా గృహమ్ ॥ 42
నిత్యకర్మ చ కృత్వేదం చందనేన సుగంధినా । సూక్ష్మశుక్లపరీధానో వరధూపేన ధూపితః ॥ 43
ఆభూష్య సర్వగాత్రాణాం భూషణాని రఘూద్వహః । శుక్లం సుగంధి మాల్యం చ స్రజశ్చ వివిధా స్తథా ॥ 44
మంగళాలంభనం కృత్వా నిశ్చక్రామ సభాగృహమ్ ।

అటువెడలి వెలికివచ్చి ధనముతో గోవులతో గుఱ్ఱములతో బంగారముతో పెరుగు పూవులు పండ్లతో మోదకములతో (లడ్డులు) రత్నములతో వస్త్రములతో బ్రాహ్మణులను బూజించెను. భరతపూజితులైన బ్రాహ్మణుల పుణ్యాహఘోషము మధురస్వరపూరితమై త్రిదివమును స్వర్గమునంటెను. అతడట్లు విప్రవరులపూజించి లోగిటం బ్రవేశించి నిత్యకర్మ మొనరించి చక్కని పరిమళము నించు చందనముచే పూయబడి తెల్లని జిలుగువసనముదాల్చి ఘుమఘుమలాడు ధూపముచే ధూపితుడై అన్ని యవయవములను భూషణములం జక్కగ నిండుగ నలంకరించుకొని పరవశించు తెల్లని పూలమాలికను మరియుం బెక్కువిధములయిన పూలమాలలను గైసేసి మంగళాలంభనముసేసి సభామందిరమునకు బయలుదేరెను.

క్లుప్తం శయ్యాసనం తత్ర వరరత్న విభూషితమ్ । 45
మహార్ఘతోరణోపేతం సోత్తర చ్ఛద మృద్ధిమత్ । వితానం చ తథా దత్తం తస్యోపరి మహర్ధిమత్ ॥ 46
ఆసీన మాసనే తస్మిన్ భరతం సత్య సంగరమ్ । ప్రాంశవో బద్ధనిస్త్రింశాః కవచోత్తమభూషితాః ॥ 47
రక్తాంబరధరాః వీరా రరక్షుః పృష్ఠ సంస్థితాః । తథై వోభయపార్శ్వస్థాః పూర్ణ చంద్రనిభాననాః ॥ 48
వారముఖ్యాః సువేశా స్త ముపాసాంచక్రిరే తదా । వాలవ్యజనధారిణ్య స్తాలవృంతకరాః వరాః ॥ 49
తాంబూలభాండధారిణ్యో నీలనీరజలోచనాః । కుండలీ బద్ధనిస్త్రింశో దండపాణిః సువేశవాన్ ॥ 50
ఉవాచ భరతః క్షత్తాభూమివిన్యస్త జానుకః । దిదృక్షవస్తే సంప్రాప్తా బ్రాహ్మణాః సంశయచ్ఛిదః ॥ 51
శ్రేణీమహత్తరా యేచ బలముఖ్యా స్తథైవచ । ప్రవేశ యైనా నిత్యుక్తో ద్వాఃస్థాన్ క్షత్తా తతోఽబ్రవీత్ ॥ 52
బ్రాహ్మణాన్ బలముఖ్యాంశ్చ ప్రవేశయత సత్వరమ్ । ఆశీర్భి రభి నంద్యైనం సంప్రవిష్టా ద్విజోత్తమాః ॥ 53
బృసీషు దంతపీఠేషు వివిశు శ్చ యథాసుఖమ్ । తతస్తు బలముఖ్యానాం నమతాం భరతం తదా ॥ 54
క్షత్తా జగ్రాహ నామాని కంఠా రక్తస్వరాన్వితః ।

అక్కడ శయ్యాసనము చక్కగనమరుపబడినది. అది దివ్యరత్నభూషితము అమూల్యతోరణోపేతము. సర్వసమృద్ధిమంతము. మీద చక్కని పరిచ్ఛదము (తివాసీవంటిది) పరువబడినది. దానిపై వెలలేని చాందినీకట్టబడియుండెను. అట్టి శుభాసనమందుగూర్చున్న సత్యసంగరుడైన భరతుని మిగుల యెత్తైనవారు ఒరలో కత్తులుకట్టుకొన్నవారు ఉత్తమ కవచభూషితులు రక్తాంబరధారులు వీరులు వెనుకనిలుబడి రక్షయిచ్చిరి. వారే అంగరక్షకులనబడువారు. అట్లే స్వామియిరువైపుల నిలువబడి పూర్ణచంద్రబింబాననలు సువేషలు వారాంగనామణులు భరతప్రభువును వాలవ్యజనములు (చామరములు) తాటియాకు విసనకఱ్ఱలుంబూని వీచుచు సేవించిరి. తాంబూల భాండములు (కరండములు) పూని నీలనీరజనేత్రలట నిలిచి కొలిచిరి. అయ్యెడ కుండలములు దాల్చినాడు ఒఱలో ఖడ్గముం గట్టుకొన్నాడు చేత దండమూనినాడు చక్కనివేషము వేసికొన్నాడు నైక్షత్త = ద్వారపాలుడు మోకాళ్ళు భూమినానించి (వినతుడై) బ్రాహ్మణులు సర్వసంశయములం దీర్చువారు తమ దర్శనముగోరి దయసేసినారు. అట్లే శ్రేణీమహత్తరులు = రణరంగమందు ముందువరుసలో నుండువారు సేనాధిపతులును వచ్చియున్నారని ప్రభువునకు విన్నవించెను. ఆజ్ఞగొని క్షత్తద్వారపాలురతో బ్రాహ్మణులు సేనానులను త్వరగ బ్రవేశపెట్టుమనెను. వారట్లుసేసిరి. ప్రవేశింపజేయబడిన ఆ ద్విజోత్తములీతనిని ఆశీర్వచనములచే లోనం బ్రవేశింపబడిరి. వారు దంతమయముల బృసీషు = సుఖముగ గూర్చుండిరి. అటుపై ప్రభువునకు మ్రొక్కుచున్న యా సేనాధిపతుల పేర్లను మధురకంఠస్వరముతో (కంఠారక్తస్వరసహితుడై) వేర్వేరబేర్కొనెను.

తతస్తేషూపవిష్టేషు ద్వారేషు వివృతేషు చ ॥ 55
ప్రవివేశ జన స్సర్వో న న్యవార్యేత కశ్చన । ఏతస్మిన్నేవ కాలేతు శుశ్రువే తుములో ధ్వనిః ॥ 56
భరతం ద్రష్టుకామానాం భూమిపానాం మహాత్మనామ్ । హ్రాదేన గజఘంటానాం బృంహితేన తథైవ చ ॥ 57
హ్రేషితేన తురంగాణాం రథనేమిస్వనేన చ । నామభిః కీర్త్యమానైశ్చ వందిభిః పృథివీక్షితామ్ ॥ 58
శంఖవాదిత్రఘోషేణ పటహానాం స్వనేన చ । ఆజగ్ముర్భరతం ద్రష్టుం నరేంద్రాః ప్రియ దర్శనాః ॥ 59

వారు కూర్చున్నతర్వాత సభామండపద్వారములు తెరచినంతట సర్వజనమందు నిరభ్యంతరముగ బ్రవేశించెను. ఇదే సమయమందు తుముల ధ్వని విననయ్యెను. భరతుని దర్శింపగోరిన మహానుభావుల మెడగంటల సడితో నాగజముల బృంహితములతో (ఘీంకారములతో) జాతిగుఱ్ఱముల సకిలింపులతో రథముల పట్టాల చప్పుడుతో వందిజనము పేర్కొను నాయా సామంత భూపతుల పేర్లతో శంఖవాదిత్రఘోషముతో పటహముల సవ్వడితో నా సభాప్రాంతమున బెను సందడియయ్యెను. నరేంద్రులు ప్రియదర్శనులు భరతదర్శనార్థమేతెంచిరి.

తోరణాదవతీర్యైవ వాహనేభ్యో మహీక్షితః । సర్వే స్వల్ప పరీవారాః వివిశుస్తే సభాం శుభామ్ ॥ 60
శిరఃకంపేన భరతం నమస్కృత్య నివేదితాః । ప్రతీహారేణ దక్షేణ తేన చక్రుర్వరాసనమ్ ॥ 61
సింహాసనస్థాన్ నృపతీన్ భరతస్త్వను రూపయన్ । గిరా పప్రచ్ఛ కుశలం పూజయామాస చాప్యథ ॥ 62
తుష్టువుర్వందినస్తత్ర నానాదేశ్యా న్నరాధిపాన్ । నివేదయన్తః స్తుత్యాస్తే భరతాయ మహాత్మనే ॥ 63
స్తువతాం భరతం తత్ర వందినాం సమహాస్వనః । ప్రాసాదభోగ సంరుద్ధో విపుల స్సమపద్యత ॥ 64
క్ష్మాపాలమౌళిమాణిక్యమరీచివికటోజ్జ్వలమ్ । బాలాతపాంశుచ్ఛురితం బభూవచ సభాగృహమ్ ॥ 65

రాజులు రాజద్వారతోరణముదగ్గరనే వాహనములు దిగి కొలది పరివారమును వెంటగొని యందరు నా సుశోభనమైన సభం బ్రవేశించిరి. భరతునికి మ్రొక్కి దక్షుడైన (సమర్థుడైన) ప్రతిహారునిచే భరతునికి నివేదితులై (పరిచయముచేయబడినవారై) యాతనికి నమస్కరించి, యాతని శిరఃకంపనముచే (వారి రాకను నమస్కారములను స్వీకరించిన సూచనగా ప్రభువు తలంచెనన్నమాట) నట నుత్తమాసనముల నలంకరించిరి. సింహాసనములధిష్ఠించిన నృపాలురను భరతుడు అనురూపించుచు (తాను వారిని గుర్తించినట్లు వారికి దాననుకూలుడైనట్లు సూచించుచు) వారిని కుశలమడిగెను. అటుపై వారిం బూజించెనుగూడ. అక్కడ

వందిమాగధులు భరతుని గొనియాడి స్తుతియైనతర్వాత నానాదేశీయులగు నా నరాధిపతులను మహాత్ముడగు భరతునికి వారివారిని నివేదించిరి. ఆట భరతుని స్తుతించు నా స్తోత్రపాఠకుల కంఠధ్వని యా సభాప్రాసాదముయొక్క భోగములచే (పాము పడగలం బోలు నట్టాలకములచే నిరోధింపబడి మిగుల హెచ్చయ్యెను. క్ష్మాపాలుర కిరీట మాణిక్య కాంతిపుంజముచే మినుమిట్లుగొను లేత యెండయెడచే నా సభామందిరమలముకొనెను.

తత స్స భరతః శ్రీమాన్ విససర్జ నరాధిపాన్ । స్వహస్తద త్తతాంబూలాన్ ప్రతీహార నివేదితాన్ ॥ 66
తతస్సముత్థాయ యయౌ ద్వితీయ గృహ ముత్తమమ్ । తత్ర చక్రే తదా మన్త్రం మాతులేన యుధాజితా ॥ 67
పురోధసా చ గార్గ్యేణ స్వేన కాలవిదా తథా । యుధాజిదువాచ-కాలేత్వమిప్సితే ప్రాప్తో గంధర్వాణాం వధేచ్ఛయా ॥ 68
తత్ర యావ న్న జానన్తి గంధర్వాస్తే త్వదాగమమ్ । అవస్కందేన తానద్య తావ ద్రాత్రౌ జహి ప్రభో! 69
అవస్కందేన నిధనం సుఖం తేషాం భవిష్యతి । 70
కాలవిత్: సుప్తే ప్రమత్తే విశ్వస్తే తథా రాజన్ః శ్రమాన్వితే :
అవతీర్ణే బలే చైవ సరితం వహతీం తథా । రాత్రౌ జాగరణ శ్రాన్తే ఛద్మయుద్ధం విధీయతే ॥ 71
రాత్రౌ విహార శీలాస్తే గంధర్వాః సతతం ప్రభో! నతేఽ వస్కంద మర్హన్తి రాత్రౌ కేకయ నన్దన ॥ 72
విజయశ్చ దివా యుద్ధే భరతస్య ప్రదృశ్యతే ।

ఆవ్వల శ్రీమంతుడు భరతుడు ప్రతీహారుడు వేర్వేర నివేదించినవారిని (పరిచయముసేసినవారిని) తన చేతితో తాంబూలము లొసంగి పంపెను. అటుపైలేచి చక్కని రెండవగృహముం బ్రవేశించెను. అక్కడ మేనమామ యుధాజిత్తుతో కాలజ్ఞుడు (జ్యోతిషికుడు) అయిన పురోహితుడు గార్గ్యునితో నేకాంతమున మంతనము సేసెను. (రహస్యాలోచన సేసెనన్నమాట) అప్పడు యుధాజిత్తిట్లనియె; నీవు గంధర్వ సంహార వాంఛతో ననుకొన్న సమయమునకు వచ్చితివి. ఆ గంధర్వులు నీరాకనెరుంగునంతలోన అవస్కందించి (హఠాదాక్రమణముసేసి) యిప్పుడు ఈరాత్రి ప్రభూ! వారిం గూల్పుము. అవస్కందముచే వారి సంహారము సుఖమగును. అది విని కాలజ్ఞుడు (జ్యోతిషికుడు) నిద్రపోగా ప్రమత్తుడై యుండగా నమ్మియుండగా శ్రమతోనుండగా సేన ప్రవాహమెత్తియున్న నదిలోనికి దిగినపుడు రాత్రి జాగరణముచే నలసియున్నప్పుడు ఛద్మయుద్ధము (మోసపుపోరు) చేయవలెనని విధింపబడియున్నది. ప్రభూ! గంధర్వులు వాండ్రు రాత్రివిహారశీలురు. ఓకైకేయినందనా! అట్టివారు రాత్రివేళ నవస్కందమునకు తగరు. అదిగాక యుద్ధమందు భరతునికి విజయము పగలే కనబడుచున్నదనియె.

గార్గ్యః: ఆదౌ దూతేన కర్తవ్యం గంధర్వాణాం ప్రయోజనమ్ ॥ 73
యథా దేశమిమం త్యక్త్వా ప్రజధ్వం తుహినాచలమ్ । గంధర్వాణాం నివాసస్తు హిమవ త్యచలోత్తమే ॥ 74
పూర్వమేవ కృతస్తేన యేనేదం నిర్మితం జగత్ । స్థానమేత న్మనుష్యాణాం త్యక్తు మర్హథః మాచిరమ్ ॥ 75
తేచ దూతవచః శ్రుత్వా స్థానం దద్యుర్నరాధిప । అసంశయ ముపారుహ్య చైతన్మమ మతం భవేత్ ॥ 76
భరతః: రాఘవా స్సత్యసంధాస్తు కూటయుద్ధం న శిక్షితాః । తస్మా త్తేషాం వధః కార్యః సుయుద్ధేన మయా నృప ॥
గార్గ్యవాక్యం తథా బుద్ధ్వా రోచతేఽతిశయేన మే । ప్రయాతు తేషాం దౌత్యేన గార్గ్య ఏవ మహాయశాః ॥ 78
యుధాజిత్: గచ్ఛ గార్గ్య మహాభాగః గంధర్వాధిపతిం ప్రతి । తం చ శ్రావయ వాక్యాని త్వయోక్తానీహ యానిమే ॥
అక్రియాయాం తథా తేషాం శ్రావయాగ్ర్యాణి మాచిరమ్ । అస్యైవ నామ్నా ధర్మజ్ఞః భరతస్య మహాత్మనః ॥ 80
మార్కండేయః: ఏవ మ స్త్విత్యథోక్తోఽసౌ యయౌ గార్గ్యో మహాయశాః । రథేన కాంచనాంగేన గంధర్వ నగరం ప్రతి ॥

అపుడు గార్గ్యుండు పురోహితుండిట్లనియె. మొదట దూతముఖమున గంధర్వులకు మనరాక ప్రయోజనము కర్తవ్యము నెరింగింపవలయును. ఈ దేశమును విడిచి మీరు హిమాచలమునకు వెళ్ళుడు. అక్కడ గంధర్వుల నివాసమున్నది. ఈ జగ

న్నిర్మాణము సేసిన బ్రహ్మచేతనే యది యేర్పరుపబడియున్నది. ఇది మనుష్యుల స్థానము. దీనిని మీరు శీఘ్రముగ వదలదగుదురు. వారాదూతమాట విని వారు సంశయముపడక మనకే చోటిచ్చెదరు. ఇది నా మతము (తలంపు) అన విని భరతుం డనియె : రాఘవులు (రఘువంశరాజులు) సత్యసంధులు. వారు కూటయుద్ధము శిక్షణ యీయబడినవారుగారు. కావున ఆ గంధర్వ సంహార మును నేను న్యాయయుద్ధముచేతనే చేయదగునది. గార్గ్య వచనము నాబుద్ధికెక్కువ రుచించుచున్నది. మహాయశస్వి వారికడకు దౌత్యముతో గార్గ్యుడే వెళ్ళుంగాక ! అన యుధాజిత్తనియె. మహానుభావ ! గంధర్వరాజు దరికి నీవేగుము. ఇపుడు నీవు చెప్పిన యీ మాటలే యతనికి వినిపింపుము. వారట్లాచరించనపుడు శీఘ్రముగ నీ మహాత్మ్యము భరతుని మాటలుగ పై మాటలు వారికి వినిపింపుము. అని యిట్లు పలుక బడి గార్గ్యుండు మహాయశస్వి దౌత్యమూని బంగారురథముపై గంధర్వనగరములగూర్చి చనెను.

గతే పురోహితే గార్గ్యే భరతోఽపి మహాయశాః : హస్తిపృష్ఠే రథే చాశ్వే శస్త్రే శాస్త్రే తథైవచ ॥ 82
వ్యాయామం చ తథా చక్రే నియుద్ధేచ యదూత్తమః ఉత్సారిత స్తథా పద్భ్యాం ధావద్భిః కుశలై ర్జనైః ॥ 83
స్నాత్వై స్సంపూజితో విష్ణుం విధివత్ సాత్వతోత్తమైః । నమ స్కృత్య తథై వాగ్నిం హుతం సుష్ఠు పురోధసా ॥ 84
తథా భుక్తవతాం శ్రుత్వా పూజితానాం ద్విజన్మనామ్ : పుణ్యాహఘోషం వి త్తేన భూమిపాలః విసర్జ్య తాన్ ॥ 85
పరార్ధ్య చంగనాక్తాంగ స్తనుచారుసింతాంబరః । సర్వాలంకరణోపేతః స్రగ్వీధూపేన ధూపితః ॥ 86
ఆసీన స్త్వాసనే దివ్యే బుభుజే స్వజనై ర్వృతః । మాతులస్య మహార్హాణి శుచీని గుణవ న్తిచ ॥ 87
అపరీక్షితపూర్వాణి పురుషై రాప్తకారిభిః । నరపక్షి మృగాణాంతు లింగై ర్వ్యహ్నా తథైవచ ॥ 88
భక్ష్యం భోజ్యంచ లేహ్యంచ పేయం చోష్యం తథై వచ । పాత్రేషు రుక్మరౌప్యేషు తథా మణిమయేషుచ ॥ 89
భుక్త్వాన్నం గీత శబ్దేన చాప్తైః కతిపయైస్సహ । తతో పస్పృశ్య ధర్మాత్మా దంతధావన పూర్వకమ్ ॥ 90
చక్రస్య శయనం భేజే వామ పార్శ్వేన శ తుహా । ఇతిహాసం సశుశ్రావ తత్రస్థః పురుషోత్తమః ॥ 91
తత స్స శయనం త్వక్త్వా శాస్త్రాభ్యాసం మహా యశాః । చకార రఘు శార్దూలః సతాం మార్గమను వ్రజన్ ॥ 92

గార్గ్యుండు పురోహితుడటునన మహాయశస్వి భరతుడు గజపృష్ఠమున (గజారోహణము) అశ్వమునందు శస్త్రమందు యుద్ధశాస్త్రమునందు బాహుయుద్ధమందు వ్యాయామము సేయబూనెను. పాదములంబరువులెత్తు కుశలురైన జనములచే తరుమ బడెను. విష్ణుభక్త శిరోమణులచే స్నానముచేసి విష్ణువు పూజింపబడెను. పురోహితుడగ్నిని నమస్కరించి చక్కగవేల్చెను. అట్లే భోజనములుసేసి పూజలందుకొనిన ధనమిచ్చి పంపబడిన ద్విజుల పుణ్యాహఘోషముమువిని అత్యుత్తమ చందనముపూసికొని చక్కని తెలిమడుపులందాల్చి యెల్లతొడవులుతొడి పూలమాలలు గైనేసి దూపధూపితుడై దివ్యాసనమందు కూర్చుండి తనజనముతో భోజనముసేసెను. మేనమామగారిడిన వెలగలవి శుచియైనవి గుణముకలవి ఆప్తకారులచే నరులు పక్షు మృగములయొక్క చిహ్నము లతో నగ్నియందు ముందుపరీక్షింపబడనివియునైన భక్ష్య భోజ్య లేహ్య పేయ చోష్యములనున యైదువిధములయిన యాహారము లను బంగారు వెండిపాత్రలందు మణిపాత్రములందును వడ్డింపబడినవానిని పాటలుపాడుచుండ వినుచు పరిమితులైన యాప్తులతో గూడ భరతుడారగించి దంతధావనము మున్నుగా నుపస్పర్శనముసేసి (ఆచమించి శుద్ధిచేసికొనుటయన్నమాట) ఎడమవైపుకొరిగి చక్ర (చక్రముయొక్క) శయనముంబొందెను. పురుషోత్తము డాతడటనుండి యితిహాసమువినెను. అవ్వల పాన్పువిడిచి సత్పురు షుల మార్గమంటి శాస్త్రాభ్యాసముసేసెను.

ఏత స్మిన్నేవ కాలేతు సహ గార్గ్యో యుధాజితా । వివేశ భరతం ద్రష్టుం రథరేణు పరిప్లుతః ॥ 93
సుఖాసీన శ్చ భరతం వాక్యమేత త్తతోఽబ్రవీత్ । గార్గ్యః । తతోవాక్యాని సర్వాణి శైలూషశ్రా వితోమయా ॥ 94
నతాని తస్య రోచ న్తే సంగ్రామ స్తస్య రోచతే । భరతేన సమాగమ్య శ్వోభూతే ద్విజ పుంగవ ॥ 95

భరతం నాశయిష్యామి నీహారం చంద్రమా యథా । ఇత్యుక్త్వా సతు మాం రాజా ప్రేషయామాస సత్వరః ॥ 96
ఆహ్వాన దుందుభి స్తత్ర నిష్క్రాన్తే మయి చాహతః । ఏతత్ జ్ఞాత్వా స యుద్ధాయ ప్రాతః సజ్జోభవేత్తవ ॥ 97

ఇదేవేళ గార్గ్యుండు రథపరాగము గ్రమ్ముకొని యుధాజిత్తుతో భరతుని దర్శింప నట ప్రవేశించెను. సుఖాసనముండి భరతునితో నిట్లువలికెను. నామాటలన్నియు శైలూషునకు (గంధర్వునకు) వినిపించితిని. అవి వానికి రుచింపలేదు. యుద్ధము వాని కిష్టమగుచున్నది. భరతునితో గడిసి రేపు చంద్రుడుమంచునట్లు నేను భరతుని నశింపజేసెదను. ఇట్లని యా రాజు నన్ను వెంటనే పంపివేసెను. నేను నిష్క్రమించినదేతడవుగ యట ఆహ్వాన దుందుభి మ్రోయింపబడెను. (యుద్ధమునకు పిలుపుగా నది మ్రోగినదన్నమాట) ఇదివిని యాతడుదయమంద నీతోడియుద్ధమునకు సన్నద్ధుడైనాడు.

మార్కండేయః : ఇతి గార్గ్యవచః శ్రుత్వాభరతో గార్గ్య మబ్రవీత్ ।
గచ్ఛ! శీఘ్రం గృహం బ్రహ్మన్! శ్రాన్తోరథబలాధ్వతః ॥ 98
అహ మాజ్ఞాపయిష్యామి సర్వం సాంగ్రామికం విధిమ్ । ఏతావ దుక్త్వా విజయం సేనాధ్యక్ష మథాఽబ్రవీత్ ॥ 99
మమోష్ట్రి వాహిభి శ్శీఘ్రం శిబిరేషు మహీక్షితామ్ । యోధా నాజ్ఞాపయ త్వద్య శ్వోభూతాయరణాయవై ॥ 100
యుద్ధావధానికం సర్వం కర్తవ్యం చ తథా త్వయా । ఏవమాజ్ఞాప్య నాగానాం తురంగాణాం తథైవచ ॥ 101
ప్రత్యవేక్షాం తతః కృత్వా సంధ్యా మన్వాస్య పశ్చిమామ్ । రహోగత స్స శుశ్రావ నరాణాం గూఢ భాషితమ్ ॥ 102
ఆరురోహ తదా శ్రుత్వా ప్రాసాదం హిమ పాండురమ్ । కైలాస శిఖరాకారం నిర్వాతం రజనీ ముఖే ॥ 103
తత స్తు సైనికః కశ్చిత్ శిబిరే భరతస్య తు । తలం తలే నాభ్యహనత్ పవనార్థం యదృచ్ఛయా ॥ 104
తతస్తు సైనికైః సర్వైస్తల తాలైర్మహా స్వనమ్ । చక్రిరే పురుషవ్యాఘ్ర! తస్మిన్కాలే దివం గతమ్ ॥ 105
ప్రవవౌచ తదానీతో వాయుర్మనుజ పుంగవ! । ఏతస్మిన్నేవ కాలేతు మద్రరాజ స్తదాంశు మాన్ ॥ 106
ప్రాసాదవర మారూఢో జ్ఞాతవాన్ భరతం తదా । దీపాలోకేన లక్ష్మ్యాచ ప్రాసాదస్య వివృద్ధయా ॥ 107
సజగామ తదారాజా ప్రహసన్ సైనికం జనమ్ ।

గార్గ్యుని యిమ్మాటలువిని భరతుడు గార్గ్యునితో బ్రహ్మణ్య! రథప్రయాణమున నలసితివి. శీఘ్రమ గృహమ్మరుగుము. సర్వసాంగ్రామిక విధిని నేనాజ్ఞాపింతును. అని యింతదాక పలికి సేనాధ్యక్షుని విజయునింగని యిట్లనియె. రేపుజరుగు యుద్ధమునకు నా యొంటెల మీది రౌతులద్వారా శిబిరమ్ములందున్న రాజులకు వెంటనే యాజ్ఞయిమ్ము, యుద్ధ నిమిత్తముగ జ్ఞప్తి చేసికొని సిద్ధము సేయవలసిన కర్తవ్యమంత నీవు సేయుమని యాజ్ఞాపించి ఏనుగుల గుఱ్ఱములను పర్యవేక్షించి పశ్చిమసంధ్యవార్చి (సాయం సంధ్యావందనముసేసి) ఏకాంతమున నుండి రహస్య గూఢచారుల రహస్య భాషణములు వినెను. అదివిని మంచువలె నచ్చము తెల్లనైన పాసాదమెక్కెను. అది కైలాసశిఖరమట్లున్నది, అందు రజనీముఖమందు (రేయి మొదట) వాయువు వీచలేదు. అంతట భరతశిబిరమందున్న యొక సైనికుడు గాలికొరకరచేతి నరచేతిని గొట్టెను. అవ్వల సైనికులందరు నట్లుసేసిరి. దాన నక్కడ పెనుసవ్వడియయ్యెను. అచప్పుడాకాశమంటెను. ఓ మనుజేశ్వర! అప్పుడు దాన రప్పింపబడిన వాయువు వీచెను. ఇదే సమయమందు మద్రదేశాధిపతి యంశుమంతుడు ప్రాసాదమెక్కి భరతు నటనున్నవానిం దెలిసికొనెను. దీపము వెలుతురుచే పెంపొందిన ప్రాసాద శోభచే భరతు నట గుర్తించి నవ్వుచు సైనికజనముతో నిట్లనియె.

భరతస్య ప్రదాస్యామి యుక్త్యైవ బల దర్శనమ్ ॥ 108
తృణ ముష్టి ముపాదీప్య సర్వోఽపి కటకే జనః । పాణా వాదాయ ముదితః క్ష్వేడాశబ్దం కరోతువై ॥ 109
పార్థివేనైవ ముక్తేతు కటకే తస్యధీమతః । సోల్కా హస్తో జన స్సర్వఃక్షణేన సమపద్యత ॥ 110
శిబిరం మద్రరాజస్య ద్వితీయ మివ చాంబరమ్ । బభూవ తారకాచిత్ర ముల్కాహస్తై స్తదా నరైః ॥ 111

తద్బలౌఘ మపర్యన్తం సోల్కాహస్తైర్జనై ర్వృతమ్ । దృష్ట్వా జగామ ధర్మాత్మా పరాం ప్రీతిం రఘూ ద్వహః ॥
క్ష్వేడాః కిలకిలా శ్చైవ శ్రుత్వా హర్ష ముపాగతః । తస్మిన్ ప్రశాన్తే జ్వలనే మందీభూతేచ నిస్స్వనే ॥ 113
అభ్యహన్యన్త భూపానాం శిబిరేషు పృథక్ పృథక్ । సంజ్ఞా తూర్యాణి రమ్యాణి నానా లింగాని చాప్యథ ॥ 114
సుబహూని మహారాజ! తేన కోలాహలం మహత్ । బభూవ ప్రీతి జననం భరతస్య మహాత్మనః ॥ 115

ఇప్పుడు భరతునికి సైన్య ప్రదర్శనముయుక్తితో జేసెద. ఈ కటక మందున్న జనమందరు గుప్పెడు గడ్డికొని వెలిగించి చేతగొని సంబరమున (క్ష్వేడ) అట్టహాసము (కోలాహలము) గావింపుడు. అనవిని యా బుద్ధిమంతుని మాట విని కటక మందలి జనము ఉల్కాహస్తులై (కొరవులుచేబూని) క్షణములో నటకు సిద్ధమైరి. ఉల్కాహస్తులైన యానరులచే మద్రరాజు శిబిరము తారకా చిత్రమైన రెండవ యాకాశమట్లుండెను. అంతులేని ఆతని సైన్యముల్కాహస్తులైన జనులతో నావరింప బడుట చూచి భరతుడు పరమప్రీతి నందెను. క్ష్వేడములు కిలకిలా రావములు విని హర్షము బొందెను. ఆ యగ్ని సాంతనముకాగా యా సవ్వడి మందగింప ఆయా రాజుల శిబిరము లందు వేర్వేర రమ్యములయిన సంజ్ఞాతూర్యములు నానావిధ లింగములు (పెక్కుగుర్తులు గలవి) వాయింప బడెను. దానిచే నో మహారాజా పెద్ద కోలాహలమయ్యెను. మహాత్ముడు భరతుని కది ప్రీతి గలిగించెను.

మంత్రయిత్వా తతః శ్రీమాన్ క్షణమాత్రం యుధాజితా । తేనైవ సహ భుక్త్వా చ సుష్వాప శయనోత్తమే ॥ 116
హిమావదాతే వరమాల్యచిత్రే వితాన కాధో విహితే మనోజ్ఞే ।
సుష్వాప రాత్రిం స మహానుభావో భోగీంద్ర భోగే మధుజిద్యథైవ ॥ 117

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
యుద్ధప్రసంగ వర్ణనం నామ నవోత్తర ద్విశతమోఽధ్యాయః

అవ్వల శ్రీమంతుడు ఆతడు యుధాజిత్తుతో నాలోచనసేసి అతనితోనే విందారగించి హంసతూలికా తల్పమందు శయనించెను. వీణావేణు మధుర రవముచే మధురములయిన మేల్కొలుపు పాటలచే దని వొందుచు మంచు వలె తెల్లనిది చక్కని మాల్యములచే చిత్రమయినది వితానముల క్రింద నేర్పరుప బడిన మనోజ్ఞమైన పాన్పునందు మధువైరి. భోగీంద్ర భోగమందట్లు భరతుడు నిదురవోయెను.

ఇది శ్రీ విష్ణుధర్మోత్తర మహాపురాణమందు ప్రథమఖండమున
భరతయుద్ధ ప్రసంగమను రెండువందలతొమ్మిదవ యధ్యాయము.

## రెండువందలపదవ అధ్యాయము - గంధర్వక్షోభ వర్ణనము

మార్కండేయః : ఆహ్వాస దుందుభిం శ్రుత్వా శైలూష తనయా స్తతః । ఆసేదుః పార్థివం సర్వే శైలూషం తం సమాగతాః ॥
నముచిః కామపాలశ్చ గవేషణ సుదర్శనౌ । వీరబాహుః సుబాహుశ్చ వాయువేగ సువర్చసౌ ॥ 2
నికుంభః కుంభ నా మా చ బలాకో బలక స్తథా । హరికేశో మహౌజా శ్చ సూర్యరశ్మిః ప్రభంకరః ॥ 3
బృందారకో జ్యోతిషికో దృఢస్యు రపరా జితః । కుముదః కుముదా పీడో వసునాథః సులోచనః ॥ 4
చంద్రాపీడో గదీ మౌళీ కిన్నరోఽజగరో రుహః । కేసరీ వరవాణశ్చ భాను రాభావహో రయిః ॥ 5
ఏకలవ్యో విశాలశ్చ కలవింకః కలాప్రియః । భీమనాదో మహానాదో వాసుకిః పనసో గదః ॥ 6
చంద్రవర్మా మహావర్మా వసుసేనోఽగ్ని జాదకః । ఏతే చాన్యేచ గంధర్వాః శైలూషస్య సుతాః ప్రభో ॥ 7
దివ్య మాల్యాంబరధరాః దివ్యచందన భూషితాః । ఆసనేషు మహార్హేషు సభాయాం వివిశు స్తథా ॥ 8

శైలూషస్య సుతైర్గుప్తా సభాసౌ రత్నచిత్రితా । రరాజ తారకా చిత్రా నిశేవ నృప! శారదీ ॥ 9

మార్కండేయుడనియె ఆహ్వాన దుందుభిని విని శైలూషుని కొడుకులా గంధర్వునిం జేరి నముచికామపాలుడుగవేషణుడు సుదర్శనుడు వీరబాహువు వాయువేగుడు సువర్చుడు నికుంభుడు కుంభుడు బలాకుడు బలకుడు హరికేశుడు మహౌజుడు సూర్యరశ్మి ప్రభంకరుడు బృందారకుడు జ్యోతిషికుడు దృఢశ్యుడు అపరాజితుడు కుముదాపీడుడు వసునాథుడు సులోచనుడు చంద్రాపీడుడు గది మౌళి కిన్నరుడు అజగరుడు రహుడు కేసరి వరవాణుడు భానువు ఆభావహుడు రయి ఏకలవ్యుడు విశాలుడు కలవింకుడు కలాప్రియుడు భీమనాదుడు మహానాదుడు వాసుకి పనసుడు గద్యుడు చంద్రవర్మ మహావర్మ వసుషేణుడు అగ్రజాదనుడు నను వీరు మఱి యితరులు దివ్య మాల్యాంబరధారులై దివ్య చందన లిప్తులై మహార్హములైన యాసనములందు గూర్చుండిరి. తారకలచే చిత్రమైన శరత్కాల రాత్రివలె శైలూషుని కొడుకులచే రత్న చిత్రితమైన యాసభ రాజిల్లెను.

తేషాం సముప విష్టానాం శైలూష స్తా నథా ఽబ్రవీత్ । గార్గ్యస్య వచనం సర్వ మనుమానం తథా స్వకమ్ ॥ 10
తేఽభియోగం తదాశ్రుత్వా మానుషాన్ మనుజేశ్వర! । చక్రుర్నానా విధా శ్చేష్టాః మన్యునా క్రోధచేతసః ॥ 11
గంధర్వరాజ పుత్రాస్తే క్రోధా దశ్రు ప్రవర్షిణః । రేజుర్యు గాంత మేఘాభా అచిరాభా స దృగ్దృశా ॥ 12
బభార నముచి ర్వక్త్రం క్రోధ రాగాను రంజితమ్ । దిక్సౌమ్యేవ దిశాదాహం మహాసంగ్రామ సూచకమ్ ॥ 13
కామపాల లలాటస్థా త్రిశిఖా భ్రుకుటీ బభౌ । త్రిభిః ప్రపాతై ర్గంగేవ నిపతన్తీ హిమాచలమ్ ॥ 14
కృష్ణే స శుక్ల పర్యన్తే క్రోధరాగాను రంజితే । కుముదా పీడ నేత్రేతు సంధ్యా తామ్రే బభూవతుః ॥ 15
క్రోధాక్రాన్తేన వపుషా కుముదః కుముద ప్రభః । రక్తోత్పల నిభాకారః క్షణేన సమపద్యత ॥ 16
చంద్రాపీడ ముఖం చారు క్రోధ ధూమ్రాను కారితమ్ । బభార రూపం తస్వభ్ర సంభృతస్య నిశాభృతః ॥ 17
క్రోధ నిశ్వాస ధూమేన భానో ర్వక్త్ర మథా వృతమ్ । బభూవ భానో స్సదృశ ముపరాగే యదూత్తమ ॥ 18
కరనిష్పేష సంజాత ధూమధూమ్ర ముఖాం గకః : అన్వర్థనా మతా మాప తస్మిన్ కాలే సుదర్శనః ॥ 19

అందరునుపవిష్టులై యుండ శైలూషుడు వారితో నిట్లనియె గార్గ్యునివచనమును తమవైపు ననుమానించిన విషయమును (ఊహలను) తమమనుష్యులయెడ జరుపనున్న అభియోగమును (శత్రుకృతమైన యెదిరింపును) విని క్రోధచిత్తులై యీసుచే నానా విధ చేష్టలు నొనరించిరి. వారు కోపముచే కన్నుల నీరుగురిసి కనుచూపులు మెరపులట్లు మెరయ యుగాంతకాల మేఘములట్లు విజృంభించిరి నముచి కోపముచే సౌమ్యదిక్కు (ప్రశాంతమైనదిక్కు) మహాసంగ్రామ సూచకమయిన దిశాదాహమునటు లెరుపెక్కిన మొగముంబూనెను. కామపాలుని నదుటనున్న మూడుకొనలుదేరిన కనుబొమలముడి మూడు ప్రపాతములచే హిమాలయముపైబడు గంగవలె భాసించెను. అంతట తెలుపై నల్లని కనుపాపలతోడి నేత్రముల క్రోధముచే నెరుపెక్కి కుముదా పీడుని కన్నులు సంధ్యారాగమట్లయ్యెను కుముదుడనువాడు కుముదమట్లు (కల్లగలువయట్లు) నల్లనైనవాడు క్షణములో క్రోధాక్రాంతమైన శరీరముతో నెఱ్ఱతామరపూవట్లయ్యెను. చంద్రాపీడుని ముఖముకోపధూమానుకారితమై చిరుమబ్బులలుముకొన్న చంద్రుని రూపువహించెను. కోప నిశ్వాసధూమముచే భానుని మొగము గ్రహణ సమయమందలి భాను బింబముంబోలెను. రెండుచేతులచే నొరయించుటచే పుట్టిన పొగచే ధూమమైన (పొగనలుపుగొన్న) ముఖము శరీరముగల సుదర్శను డత్తరి సార్థకనాముడయ్యెను. సులభముగా జూడనైన వాడయ్యెనన్నమాట (పొగగ్రమ్మినయగ్నిని జూచుట సులభమైనట్లు సహజ క్రోధ దుర్దర్శనుడైన వాడప్పుడలమిన తాత్కాలికమయిన పొగచే దర్శనీయుడయ్యెనని భావము)

గవేషణ ప్రవేగేన వహ్నిర్గర్భో జ్జ్వాలాత్మనా । తారాభి వర్షణేనైవ సూచితో భూపతిక్షయః ॥ 20
వీరబాహు భుజాఘాత రత్న నిష్పేష రేణునా । విజృంభిత మథాస్థానే క్రోధేనేవ వపుష్మతా ॥ 21
సుబాహు బాహు నిష్పేషో బభూవాశని నిస్స్వనః । నిర్ఘాత ఇవ గంభీరో రాజ్ఞాం నిధన సూచకః ॥ 22

వాయువేగ మహావేగ చరణోల్లిఖితా క్షితిః । విదద్రే పృథివీపాల వినాశ భయశంసినీ ॥ 23
ఆయాసజాత సంస్వేద పులకోద్గమ భూషితమ్ । సువర్చా ధారయా మాస లలాట తట పట్టకమ్ ॥ 24
ప్రస్విన్న గాత్ర సంక్రాంత కాంచన స్తంభ పింగళః । బభూవ కుంభనాభస్తు క్రోధో విగ్రహవానివ ॥ 25
సువిని స్సృత రోమాగ్ని జ్వాలా కేసర మాలినా । నృసింహ వపుషశ్చక్రే రవిణానుకృతి ర్హరేః ॥ 26
ప్రస్విన్న గాత్ర సంక్రాంత సర్వగంధర్వ మండలః । విశ్వరూపధరంమౌళిః ప్రజహాస జనార్దనమ్ ॥ 27
గంధర్వ రాజ పుత్రాస్తే మన్యునా హృతచేతసః । తదా బభూవు ర్భూపాలః సర్వఏవ విశేషతః ॥ 28
ఇత్థం సుతానాం ప్రసమీక్ష్య కోపం సంస్మృత్య వాక్యాని పురోహితస్య ।
జగామ మన్యుం సుతరాం సరాజా సందష్ట దంతచ్ఛద భీమ వక్త్రః ॥ 29

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
గంధర్వ సభాక్షోభవర్ణనం నామ దశోత్తర ద్విశతతమోఽధ్యాయః

నిప్పు నడిమి మంటవోలె నుద్దీపించు మేనుగల గవేషణుడనువాని మహావేగముచే చుక్కలు గురిసినట్లయి రాజు వినాశము సూచింపబడెను. వీరబాహుని జబ్బల చఱపుచే వాని బాహులందలి భుజకీర్తులందున్న రత్నాలు పిండిపిండియై రాలిన రేణువుచే నసమయమందు మూర్తీభవించి కోపము విజృంభించినట్లయ్యెను. సుబాహుని బాహు నిష్పేషమున (బాహువుల క్రోధ నిమిత్తమైన రాపిడిచే) పిడుగులుపడిన సడి యేర్పడెను. అది అతి గంభీరమైన నిర్ఘాతమై రాజనాశన సూచకమయ్యెను. వాయువేగుడనువాని మహావేగముగల చరణములచే గట్టిగ రాయబడిన నేల రాజనాశన భయసూచకమై దద్దరిల్లిపోయెను. సువర్చుడను వాడాయాసముచే బొడమిన చెమటచే పులకలచే సొంపారు లలాట పట్టికంబూనెను. కుంభనాభుడు చెమటెక్కిన మేనియందు సంక్రమించిన బంగారు స్తంభమువంటి పింగళవర్ణముతో మూర్తీభవించిన క్రోధమాయన్నట్లుండెను. రవి యను నాతడు మిక్కిలిగ వెడలిన రోమకూపాగ్ని జ్వాలల కేసరముల యొక్క (మిణుగురుల యొక్క నిప్పురవ్వల యొక్క) వరుసలం బూని నృసింహావతారుడైన హరి పోలిక నొనరించెను. మౌలుడనువాడు చెమటెక్కిన శరీరమంచు సంక్రాంతమైన (ప్రతిబింబించిన) సర్వగంధర్వ మండలముతో విశ్వరూప ధరుడైన జనార్దనుని బరిహసించెను. ఆ గంధర్వరాజు కొడుకులందరు నెక్కువగ మన్యువుచే (క్రోధముచే) మతులుపోయినట్లయిరి. తన తనయుల కోపముంగిని పురోహితుడగు గార్గ్యుని మాటలు జ్ఞప్తిసేసికొని గంధర్వరాజు శైలూషుడు పండ్లు పటపటలాడించి దానిచే నతిభయంకరముఖుడై మిక్కిలి క్రోధముం దాల్చెను.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున గంధర్వసభాక్షోభవర్ణనమను రెండువందలపదియవ యధ్యాయము.

## రెండువందలపదునొకండవ అధ్యాయము - గంధర్వ గర్జనము

మార్కండేయః : దృష్ట్వా గంధర్వరాజస్య క్రోధే నాకులితం మనః ।
తమూచు ర్నృప! గంధర్వాః స్వబాహుబల దర్పితాః ॥ 1
అపరాజితః : సర్వ మాలభతే రాజన్! అశోకః శూరబాహుషు । తస్మా చ్ఛౌర్యేణ నిధనం రఘూణాం మమ రోచతే ॥ 2
నికుంభః : యోఽయం మన్యుః సముద్భూతః కాకుత్స్థాన్ ప్రతి మేప్రభో ।
అవినాశి జగత్ కృత్స్నం వినాశం సముపేష్యతి ॥ 3
కిన్నరః : యాలక్ష్మీరనులిప్తాంగీ వైరిశోణిత కుంకుమైః । కాంతాపి సరసాం ప్రీతిం నసాధత్తే మనస్వినామ్ ॥ 4
వసునాథః : కృపాణ ధారా విధ్వస్త శత్రుసంఘ సముద్భవా ।

న యాశ్రీః కిం తయా కార్యం రాజన్! సత్వవతాం నృణామ్ ॥ 5
అజగరః : అజితారి గణోపాత్త సంపదో భూషణ క్రియా । విపద్వరీయసీ తాభిర్యా న సంప ద్విభూషణా ॥ 6
రుహః : శోభన్తే కర్కశాః శూరాః స్తనా ఇవ సమున్నతాః । శూరాణాంచ స్తనానాంచ పరావజ్ఞా కరీరతిః ॥ 7
కేశః : తేజస్వినా మభ్యుదయం వందనీయం జగత్త్రయే । యథా భాస్కర ముద్యన్తం జన స్సర్వోఽభినందతి ॥ 8
వరవాణః : సత్త్వాధి కస్య సింహస్య లీలోన్మథిత పాదపాః । నశక్తాః పురతః స్థాతుం శైల కూటోపమాః గజాః ॥ 9
ఆభావహః : నజాతుశమనం యస్య తేజస్తేజసి తేజసామ్ । వృథా జాతేన కింతేన మాతు ర్వార్ధక్య కారిణా ॥ 10
ఏకలవ్యః : నామ్ని సంకీర్తితే యస్య నభవంత్యరయో భయాత్ । వివర్ణ వదనచ్ఛాయాః కా దయా తస్య జీవనే ॥ 11
విశాలః : లక్ష్మి సంగమ లుబ్ధానాం శూరాణాంచ రణోద్భవా । కీర్తి ర్భవతి సైవాశు సంయోగ కరణా సఖీ ॥ 12
కలిప్రియః : రిపు రక్త పరా సిక్తా రిపుస్త్రీ నేత్ర వారిణా । నయస్య సించితా కీర్తిః కాస్పృహా తస్య జీవనే ॥ 13
భీమనాదః : తేజసైవ సమాక్రాన్త సమస్త భువనో రవిః । కరోతి పదవిన్యాసం సర్వేషా మేవ మూర్ధసు ॥ 14
మహాదర్పః : శత్రు మస్తక విన్యస్త పదక్రమ విలాసినీ । కవిదత్త కరాలంబా కీర్తి ర్యాతు దివం తవ ॥ 15
వాసుకిః : మాయా నిహతమాతంగ మధ్య ద్వీప విహారితామ్ । క్షితిం భిత్త్వాఽవిశత్ కన్యా కీర్తితో వసుధాతలమ్ ॥ 16
పనసః : హతారిలక్ష్మి సంయోగ వికస ద్వదనస్యతే । ప్రయాతు త్వరితా కీర్తిః క్రోధనేవ దిశోదశ ॥ 17
గదః : సతోయ తో యదాకారైర్నాగై ర్దాన ప్రవర్షిభిః । ఆక్రాన్త దిఙ్ముఖే యుద్ధేవిద్యుత్త్వం మేకరోత్వసిః ॥ 18
మహానాదః : మదీయ సింహ నాదేన విత్రాసిత గజా కులమ్ । బలం నిపాత యారీణాంశరైః సన్నత పర్వభిః ॥ 19
వసుః : గజాశ్వరథ పాదాత చరణో ల్లిఖితం రజః । ద్రష్టాసి ప్రశమం యాతం పరిత స్త్వరి శోణితైః ॥ 20
బృందారకః : గజకుంభ సముద్రస్థ ముక్తాఫల వికాసిషు । తిష్ఠత్సు రాజన్! ఖడ్గేషు కస్సహేత పరాభవమ్ ॥ 21
జ్యోతిషికః కాపిశ భ్రూలతా భంగ కుటిల ద్వయ కోటిషు । విద్యమానేషు చాపేషుక స్స హేత పరాభవమ్ ॥ 22
దృఢస్యుః : రాజన్! తీక్ష్ణాః సన్తియస్య విశిఖాః పంచమానినః । కిమన్యై స్తస్య కర్తవ్యం పక్ష పాతిభి రాహవే ॥ 23
చంద్రాపీడః : కిమాయుధైః సత్వవతాం చారు దోర్దండ శాలినామ్ । సద్యః సంజాత మన్యూనాం యుద్ధ వ్యాక్షేప కారకైః ॥
గద్యః : ఖడ్గా స్తిష్ఠంతు మే తుచ్ఛాః భుక్త భంగాట్ట హాసినః । ఏక దోర్దండ శేషోఽపి కస్సహేత పరాభవమ్ ॥ 25
కలవింకః : మద్బాహు మందర క్షుబ్ధవైరి సైన్య మహార్ణవాత్ । భుంక్ష్వ లక్ష్మీం సముత్పన్నాం చిరాయ జగతీ పతే! ॥
గజః : కిమాయుధై స్సత్వవతాం సుపుంసాంచ కిమాయుధైః । అరాతి శస్త్రాణ్యే తేషా మన్యేషా మఫలాని హి ॥ 27
బలకః : దుర్బలోత్థాత శక్రేభ దశనాభి హతే హరౌ । మయాఽద్య సురరాడస్తు భవాన్ త్రిభువనేశ్వరః ॥ 28
ప్రనష్ట దేవతా పూజం బలహీనం సుదుర్దశమ్ । మయా కృత మథాఽద్యాస్తు త్రైలోక్యమపి సుప్రభో! ॥ 29
హరికః : కీనాశ మహిషేణాఽద్య హరస్య వృషభేణ తు । అయోధ్యాం వాహయిష్యామి శేషాహే ర్లాంగలేనచ ॥ 30
మహోదరః : నిరస్త యమ మార్తండే మయాలోకే చరాచరే । యమస్య మహిషం పశ్య క్రమన్తం సూర్య వాజిషు ॥
సూర్యః : నిశ్శేష దేవతా సంఘే మయా లోకత్రయే కృతే । దుర్గాసింహ వినిర్భిన్నం పశ్యాద్య మఘవద్గజమ్ ॥ 32
ప్రభసః : నిరస్తాంబు పిపాసేన సమాకృష్ట ధనేశ్వరాః । ప్రణమన్తు తవాద్యైవ దేవ సంఘాః హత-త్విషః ॥ 33
భద్రకః : స్కంద శంకర శూన్యేఽస్మిన్ మయా త్రిభువనే కృతే । శిఖీ సంభక్షయత్వద్య శర్వాభరణ పన్నగాన్ ॥ 34
మార్కండేయః : క్రోధాంధకార కలుషీ కృత చారు వక్త్రాన్ గంధర్వ రాజ తనయాన్ ప్రసమీక్షమాణః ।
జగాద రాజాన మదీన సత్త్వో నారాయణాఖ్యస్తు తదాపురోధాః ॥

ఇతి శ్రీ విష్ణు ధర్మోత్తరే ప్రథమఖండే గంధర్వ గర్జనం నామ
ఏకాదశోత్తర ద్విశతతమోఽధ్యాయః.

మార్కండేయుడనియె. గంధర్వరాజుమనస్సు కోపముచే వ్యాకులమగుటచూచి గంధర్వులు తమ బాహుబలముచే గర్వితులై యిట్లు పలుకజొచ్చిరి. అందు అపరాజితుడనునతడు రాజా ! శూరుల బాహువులుండగా శోకింపవలదు సర్వము చక్కబడునని రఘువులతో యుద్ధము నాకిష్టమనియె. నికుంభుడు ప్రభూ ! కకుత్స్థవంశీయులయెడ నాకుగలిగిన పగవలన నశింపని జగమెల్ల నశింపగలదనియె. కిన్నరుడు వైరుల రక్తకుంకుమ లలదుకొనక విజయలక్ష్మి పొందునట్టి ప్రీతిని మనస్వులు (దృఢమనస్వులు) అగువారి భార్యకూడ నింతసరసమైన (అనురాగభరితమైన) యానందమునందజాలదనియె వసునాభుడు ఖడ్గధారలం ధ్వంసమైన శత్రుకూటమునుండిపుట్టిన శ్రీ = సిరి సిరికాని అట్లుకాని శ్రీవిలాసముతో సత్వవంతులయిన మానవులకేమిపని ? ఏమియుపయోగము ! అజగరుండనియె. ఓడింపబడని శత్రుగణముయొక్క సమీపమునందున్న సంపదచే తానలంకరించుకొనుటకంటె విపత్తు గొప్పది. అట్లుగాక శత్రులం గెలిచి గైకొనినసంపద నిజమైన యలంకారము. రుహుడనియె. శూరులు కర్కశులై స్తనములవలె సమున్నతులై శోభింతురు. శూరులకు కుచములకును పరులనవమానించుటయందే యభిలాష. కేశుడనియె. ముల్లోకములందు తేజశ్శాలురయొక్క అభ్యుదయము (అభివృద్ధి) వందనీయము. ఉదయించు భాస్కరు నెల్లజనమభినందించును వరవాణుడనియె. బలాధికుని ముందు సింహముముందు నవలీలగ మహావృక్షములంగూల్చు పర్వతకూటములంబోలిన యేనుగులు నిలువసమర్థములుగావు. అభావహుడనియె. ఎవ్వని తేజమునందు (ప్రతాపమునందు) తేజస్వులయొక్క తేజస్సు శమింపదో అట్టి వ్యర్థజన్మునివలన యొక్కతల్లికి ముదిమిగూర్చువాడు (తల్లి యౌవనముపాలి కాధారమయినవాడు) ఎందులకు బుట్టినట్టు ? (వానిజన్మము వ్యర్థమన్నమాట) ఏకలవ్యుండు ఎవనిపేరు చెప్పినంతన హడలిపోయి శత్రువులు శాంతిదొరగి విన్ననైనమొగములుకారో అట్టివాని బ్రతుకువిషయమున దయయేమిటకు ? విశాలుడనియె. లక్ష్మిసంగమమందాశగల శూరులకు యుద్ధముచేగలుగు నాకీర్తియే ఆయిద్దరకు సమావేశముచేయు సఖియగును. కలిప్రియుడు ఎవనికీర్తి శత్రువుల రక్తముంద్రావునదై శత్రుభార్యలకన్నీళ్ళచే దడుపబడినదికాదో అట్టిజీవితమునుగూర్చిన స్పృహ = అపేక్ష యెందులకనెను. భీమనాదుడు తేజస్సుచేతనే సమస్తభువనములను ఆక్రమించినవాడుగావుననే సూర్యుడందరి నడినెత్తినిమీద విన్యాసముచేయుచున్నాడు. మహాధర్ముడు శత్రువుల నడినెత్తినుంపబడిన నడుగువెట్టి విలసించు నీకీర్తి కవులచే జేయూత యీయబడినదై దివమ్మునకరుగుగాక ! యనియె. వాసుకి నీచే గూల్చబడిన ఏనుగులనెడి మధ్య ద్వీపముచేత జీల్చబడిన భూమిని భేదించుకొని కీర్తికన్య వసుధాతలమునందు ప్రవేశించుననియె. పనసుడు నీచే నిహతులైన శత్రువులయొక్క రాజ్యలక్ష్మి సమావేశము పొందుటచే వికాసమందిన నీ మఖముం జూచి నీ రాజ్యలక్ష్మికి సపత్నియట్లున్న నీ కీర్తి తొందరగ కలహాంతరిత నాయికవోలె పదిదెసలు జనుంగాక యనియె. భర్త యన్య కాంతా సంగముసేసి తనయెడ వికృతుడైనతరి నీర్ష్యాకషాయితయైన స్త్రీని ఖండిత నాయిక యందురు. అట్టి యనుభవము రాజ్యలక్ష్మికి కీర్తికాంతకు నీయెడ గల్గుచున్నదని చమత్కారము. విజయలక్ష్మియు దిగంత విశ్రాంత కీర్తియు నేకకాలమున నీకు లభించునని యిట తాత్పర్యము. గదుడు ; నీటితో గూడిన మేఘములం బోలిన యేనుగులు మదము వర్షించుచు నలుదిక్కుల నాక్రమించు నీయుద్ధమందు నాచేతికత్తి మెరపుదీగ యగుగాక ! యనియె. మహానాదుడు నా సింహగర్జనముచే బెదరి పారు నేన్గులచే వ్యాకులమయిన శత్రుసేనను చక్కగవంగు కణుపులుగల (చెప్పినట్లువిను) నీబాణములచే గూల్చుమనియె. వసువనువాడు చతురంగసేనల పాదములచే రేగిన ధూళి నల్లడల శాత్రవుల రక్తధారలచే నణగింపబడుటను నీవు చూడకున్నావనియె. బృందారకుడు నీ ఖడ్గములు గజ కుంభస్థలములను సముద్రమందున్న ముత్యాలయందుద్దీపించుచుండు నీ వైభవము సూచి యాపరాభవము నెవ్వడు సహింపగలడనియె. జ్యోతిషికురు కపిశ వర్ణముగల రెండు భ్రూలతలట్లిరువైపుల నగ్రములు (వింటికొనలు) కుటిలములగుచుండ (వంపుదిరుగ) నీ ధనుస్సు వైభవము సూచి యా యవమానము శత్రు వెవ్వడు సైరించుననియె. దృఢస్యుడు ఎవ్వనికి మిక్కిలి పదునెక్కిన పంచబాణములున్నవి అట్టి నీకు పక్షపాతులైన (రెక్కలతోగూడి పైబడునట్టి యని శ్లేష) యితర బాణములతో బనియేమి ? యనె. చంద్రాపీడుడు చక్కని బాహుదండములుగల బలశాలుర కప్పటికప్పుడు పుట్టిన కోపముగలవారికి యుద్ధరంగమందదాయిదాయను విక్షేపము (చికాకు) గల్పించు నితరాయుధములతో బనియేమి ? యనియె. శత్రు

నిగ్రహమందు నీ బాహుబలమే చాలును. నీకాయుధములతో నవసరమేలేదన్నమాట. గద్యుడు ఓటమి ననుభవించి యట్టహాసము సేయు నాపనికిమాలిన ఖడ్గము లవియన్నియు నట్లుండనీ, అవి యెందులకు నా యేకైక భుజదండ మదిశేషించినను జాలు. అది గనియే శత్రువు పరాభవము సహించుననియే. అనగా నీ అశ్వమందు భటులలో నొక్కడనైన నేను బాణములతోగాక బాహువులతో ప్రచండయుద్ధముసేయ నీ భటుని నన్ను జూచి శత్రువెవ్వడా యవమానము నోర్వలేడని భావము.

కలవింకుడు : నాబాహువను మందర పర్వతముచే గలుపబడిన శత్రుసేనా మహార్ణవమునుండి యుదయించిన లక్ష్మినో జగత్పతీ! నీవను భవింపుమనియె. గజుడు, సత్వశాలుర కాయుధముతో బనేమి (చేతగాని వాండ్రకు) నాయుధములతోనేమిపని, ఇందొకటికి శత్రువులశస్త్రములే శస్త్రములు రెండవవారికి (చేతగానివారికికు పురుషులకు) అవి నిష్ఫలములనియె. బలకుడు నేను వీర సైన్యముచే పెరికివేయబడిన దేవేంద్రగజముయొక్క (ఐరావతము నింద్రుని వాహనముయొక్క) దంతముచే నాచే శత్రువుగూల్పబడు నప్పుడు నీవు గంధర్వరాజా! నీవు ఓ ప్రభూత్తమ త్రైలోక్యము దేవతా పూజలు పోయి దేవతలకిచ్చు బలులు శూన్యమై మిక్కిలి దుర్దశకు పాత్రముల జేసెదనుగాక యనియె భరతునికి యుద్ధమున త్రిభువనములు క్షోభించునట్లు సేసెదనని భావము. హరీకుడు యముని వాహనమయిన దున్నపోతుతో హరివాహనమైన వృషభముతో శేషుని లాంగలముతో (హలాయుధముతో) అయోధ్యను శత్రురాజధానిని ఇక్కడకు మోయించి తెచ్చెదననియె మహోదరుడు మయుడను సూర్యుడు. నిరసింపబడ (అస్తంగతుడు గావింప) యముని వాహనమైన దున్నపోతు సూర్యుని గుఱ్ఱములందు తానుగలిసి నడచు నిదె చూడుమనియె. నేనుముల్లోకములకు దేవతా సంఘము మిగులకుండ దుర్గయొక్క సింహమిదిగోచూడు ఇంద్రుని యేనుగును (ఐరావతమును) జీల్చుననియె. ప్రభసుడు మంచినీళ్లైన ద్రావకుండ కుబేరునీడ్చికొనిరాగా దేవతా సంఘము శత్రువుల నీవు గూల్చిన కతన నీకు ప్రణతులగుదురుగాక యనియె. భద్రకుడనియె ఈ త్రిలోకమును నేనుస్కందుడు శంకరుడు లేకుండ చేయగా నెమలి శివునియాభరణమైన సర్పమును దినుగాక! క్రోధాంధకారముచే మలినములు గావింపబడిన చక్కని ముఖములు గల కొందరు రాజతనయులవంక జక్కగజూచుచు ప్రచండ సత్త్వుడగు నాడాయనుడను పురోహితుడు ప్రభువు నకిట్లనియె.

ఇది శ్రీ విష్ణు ధర్మోత్తర మహాపురాణమందు ప్రథమఖండమున
గంధర్వ గర్జనమను రెండువందల పదకొండవ అధ్యాయము.

## రెండువందల పన్రెండవ అధ్యాయము - నాడాయనానుశాసనము

నాడాయనః : ఏకయాద్వే వినిశ్చిత్య త్రీన్ చతుర్భి ర్వశీకురు । పంచజిత్వా విజిత్వా షట్ సప్తహిత్వా సుఖీభవః ॥ 1

ఏకయా ప్రజ్ఞయా రాజన్ ! కార్యాఽకార్యద్వయం నరః । వినిశ్చిత్యా తు యఃకుర్యాత్ కార్యంతత్ర స పండితః ॥ 2

మధ్యస్థం యదివామిత్రం శత్రుంవా కార్యగౌరవాత్ । జ్ఞాత్వా దేశంచ కాలంచ హ్యుపాయై రభ్యుపక్రమేత్ ॥ 3

సామభేద ప్రదానాశ్చ ఉపాయాః పరికీర్తితాః । ఉపాయశ్చ చతుర్థోఽత్ర దండ స్త్వగతికా గతిః ॥ 4

పంచేంద్రియ జయోయేన కృతఆజౌ జిగీషణా । త్రిలోక విజయం తస్య న దూరే ప్రతిభాతిమే ॥ 5

పంచేంద్రియ జయంకృత్వా గుణషట్క ముపాశ్రయేత్ । బుద్ధ్వా బలాబలం సమ్యగాత్మన శ్చాపరస్య చ ॥ 6

రాజదోషాః పరిత్యక్తా యేనసప్త నరాధిప । సిద్ధిం తస్య సమాయాన్తి యథాకాలం గుణాః నృప ॥ 7

మృగయాయాన ముఖ్యాశ్చ స్త్రియశ్చ పురుషాః గిరః । అర్థసం దూషణం చైవదండపారుష్య మేవచ ॥ 8

రాజదోషైః పరిత్యక్తాః రాఘవా స్తత్ర పార్థివః । గుణాశ్రయ విభాగజ్ఞా విగ్రహస్తైర్న రోచతే ॥ 9

భరతేన వయం సామ్నా బలేమహతి తిష్ఠతా । ప్రథమం సముపాక్రాన్తం తదేవ తవ రోచతామ్ ॥ 10

భరతస్య వయంసామ్నా యదిగచ్ఛేమ పర్వతమ్ । హితం తస్మా న్మహాభాగ ! సకులస్య తవాఽనఘ ! ॥ 11
త్వయా కృత్వా సముచ్ఛేదం రాజ్ఞాం జననివాసినామ్ । అకారణా న్మహద్వైరం కృతం భూపతిభి స్సహ ॥ 12
జనే నివాసా దస్మాకం కేవలం లఘుతాభవేత్ । మానుష్యై స్సంగమశ్చైవ వి గహాశ్చ పునః పునః ॥ 13
న కృషి ర్నచవాణిజ్యం జనోఽస్మాకం ప్రయోజనమ్ । తేవయం సజనాం భూమిం త్యక్త్వా యామ శిలోచ్చయమ్ ॥
అపేక్ష్య దేశకాలౌచ సంధిం విగ్రహ మేవచ । ఫలంచ బుద్ధ్వా యఃకుర్యాత్ సరాజన్ ! పండితో నరః ॥ 15

ఒక దానిచే (ప్రజ్ఞ-తెలివిచే) రెంటిని కార్యము చేయదగినది అకార్యము = చేయగూడనిది యగుపనులను నిశ్చయించి (అద్భుత పుట్టుము) మూడింటిని = ముల్లోకములను నాల్గింట = సామ దాన భేద దండములను నాల్గుపాయములచే వశము చేసికొనుము. ఐదింటిని ఇంద్రియము లైదింటిని జయించి, ఆరింటిని (గుణషట్కమును) సంధి విగ్రహ యాన ఆసన ద్వైధీభావ సమాశ్రయము లను రాజ గుణముల నారింటిని విజయముసేసి యేడింటిని సప్తరాజ దోషములను అనగా వేట పానము స్త్రీలు పురుషలు మాటలు అర్థదూషణము దండపారుష్యము నను రాజదోషముల నేడింటిని విడిచి సుఖివగుము. రఘువంశ రాజులందరు నిట్లు వర్తించిరి. వారు గుణములకు సంబంధించిన విచక్షణ తెలిసినవారు. వారితో బోరు రుచింపదు. మహా బలిష్ఠుడైయున్న భరతునితో మనము సామముతో ప్రవర్తించుటమేలు. నీవును దొలుతనట్లే ప్రారంభమును సేసితివి. అదేయిప్పుడును నీకభిమతమగుగాక! ఆదినీకు నీ కాలమునకును హితమైన పనియగును. జనులతోగూడి వసించు రాజులను నీవుచ్ఛేదముసేసి వారితో అకారణమైన మహా వైరము తెచ్చికొంటివి. నిరంతరము జనముతోగూడి వసించుటవలన మనము తేలికయై పోవుదుము. మనుష్యులతో గలిసియుండుట మరి మరి వారితో తగవుపడుట రాజునకుచితముగాదు. వ్యవసాయముగాదు వ్యాపారముగాదు మనకు జనమే ప్రయోజనము. వారేమనకు బాగుగ నుపకరించువారన్నమాట అట్టి మనము జనులతోడి భూమిని విడిచి పర్వతములకు బోదము. దేశకాలముల నుపేక్షించి కోరి గమనించి సందినిని విగ్రహమును (యుద్ధమును) ఫలమును దెలిసి వర్తించు నరుడు పండితుడు.

భూమిర్హిరణ్యం మిత్రంచ త్రివిధం విగ్రహాస్పదమ్ । స్వయంగేహో యదస్మాకం మేరుః కనక పర్వతః ॥ 16
హిరణ్యేన తదాకార్యం న నోఽస్తి రిపుసూదన ! । కృషిర్నాఽస్తి యతోఽస్మాకం తతోభూర్నిష్ప్రయోజనా ॥ 17
తస్మాద్భరత మన్విచ్ఛ మిత్రంనామ్నా నరాధిప ! । మిత్రం రఘుకులం కృత్వా నివాసస్తు హిమాచలే ॥ 18
అదృశ్యం దేవసైన్యానాం సుఖం చిర మవాప్నుహి । న మానుషోఽయ మిత్యేవం భరతం మన్తు మర్హసి ॥ 19
దుష్టానాం నిగ్రహార్థాయ చతుర్మూర్తి ర్జనార్దనః । జాతో రఘుకులే రాజన్ ! పుత్రో దశరథస్య తు ॥ 20
అంశేన వాసుదేవస్య జాతో రామో మహాయశాః । సంకర్షణస్య చాంశేన లక్ష్మణః పరవీరహా ॥ 21
ప్రద్యుమ్నస్య తథాంశేన భరతో ధర్మవత్సలః । అనిరుద్ధస్య చాంశేన శత్రుఘ్నః సు మహాబలః ॥ 22
తత్ర రాఘవ సింహేన రామేణా క్లిష్ట కర్మణా । రావణోఽభి హతః సంఖ్యే సర్వసత్త్వ భయంకరః ॥ 23
మేఘనాదో నిరస్తశ్చ సంగ్రామే లక్ష్మణేన చ । శత్రుఘ్నేన నిరస్తశ్చ లవణో దుష్టరాక్షసః ॥ 24
మన్యే విశిష్టభావత్వం భరతస్య మహాత్మనః । యేన మాలీ హతఃపూర్వం లంకావాసీ స రాక్షసః ॥ 25
స ఏష భరతో నిష్ఠురస్తి తేతు రణంగమః । హితేస్థితో యస్సతతం సురాణాం దైత్యేన్ద్ర నాశాయ నివిష్టబుద్ధిః ।
తేనాఽప్రమేయేణ జనార్దనేన సమం వ్రజస్వాశు మహాఽనుభావ ! ॥ 26

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే నాడాయనవాక్యే శైలూషం ప్రతినాడాయనానుశాసన
వర్ణనంనామ ద్వాదశోత్తర ద్విశతతమోఽధ్యాయః ॥

భూమి బంగారము మిత్రము నను మూడు పదార్థములు తగవునకు స్థానములు. మనకు కనక పర్వతము (మేరువు) తనంత మనలను దనవారిగా గ్రహించినది అందుచే మనకు బంగారముతో బనిలేదు. మనకు కృషి (వ్యవసాయము) లేదు గాన

మనకు భూమియుపయోగములేదు. అందుచే మనకు కావలసినది మిత్రమేకావున నీవు భరతుని సామముచే నీమిత్రుని నొనరించుకొనుము. రఘుకులము నీ మిత్రముంగావించుకొని హిమాలయమందు నివాసము నేర్పరచుకొనుము. దేవసైన్యములకు అదృశ్యమై చిరకాలము సుఖమందుము. ఈభరతుడు మనుష్యుడని యనుకొనవగదు. దుష్ట శిక్షణమునకు జనార్దనుడు. (విష్ణువు) నలురూపులై రఘుకులమందు దశరథునికిం బుట్టినాడు. మహాయశస్వి రాముడు వాసుదేవాంశమున జనించినాడు. సంకర్షణాంశమున లక్ష్మణుడు బుట్టినాడు. ధర్మవత్సలుడు భరతుడు ప్రద్యుమ్నాంశమున మిక్కిలి బలశాలి శత్రుఘ్నుడు అనిరుద్ధ సంశమున జనించినారు. అందు రఘుసింహుడు రామునిచే సర్వసత్త్వ భయంకరుడగు రావణుడనిం గూల్పబడెను. లక్ష్మణునిచే మేఘనాదుడు హతుడైనాడు. శత్రుఘ్నునిచే లవణకుమారుడు కూలినాడు. మహాత్ముడగు భరతుని వైశిష్యమును లంతావాసియైన మాలి మున్ను హతుడగుటంబట్టి నేనూహించుచున్నాను. ఆ యీ భరతుడు నీకు యుద్ధాగతుడై యున్నాడు. సురలకు హితము సేయంబూని దైత్యనాశనముచేయు తలంపుగొని యితడీరంగమున ప్రవేశించినాడు. ఓమహానుభావ! గంధర్వప్రభూ! నీవా భరతునితో సాక్షాజ్జనార్దనునితో సామము సంధిని చేసికొనుము.

ఇది శ్రీ విష్ణు ధర్మోత్తర మహాపురాణమందు ప్రథమఖండమున నాడాయనానుశాసనమను రెండువందల పండ్రెండవ యధ్యాయము

## రెండువందలపదమూడవఅధ్యాయము - అగస్త్యమహిమానువర్ణనము

శైలూష ఉవాచ :- సుమాలీ విష్ణునా పూర్వం కథం యుద్ధే నిపాతితః । ఏతన్మే సంశయం ఛింధి! శ్రూయతే స మహాబలః ॥

నాడాయనః:- కథేయం రాజశార్దూల ! పురాగస్త్యేన ధీమతా । రామాయ కథితా వీర ! తాం మే నిగదతః శృణు ! ॥ 2

పురా వినిహతే వృత్రే దైత్యా విగతనాయకాః। అబ్దుర్గం సాగరంకృత్వా రాత్రౌ నిఘ్నన్తి వై ప్రజాః ॥ 3

సురైస్సర్వైః స్సమాగమ్య తథాయం న పరైర్వధమ్ । సముద్రోదక పానాయ అగస్త్యశ్చో దితస్తథా ॥ 4

దేవకర్మ ప్రముదిత స్తదాగస్త్య మునిర్నృప ! । పీత్వా చకార రాజేంద్ర ! నిస్తోయం సలిలాశయమ్ ॥ 5

దేవైశ్చ నిహతాదైత్యా నిస్తోయే సలిలాశయే । తతః కదాచి ద్వింధ్యస్తు జగాదార్కనిశాకరౌ ॥ 6

మేరుం త్యక్త్వా మహాభాగౌ మమ యాత ప్రదక్షిణామ్ । ఊచతు స్తౌ తదావింధ్య మావయోస్తు వశంగిరే ! ॥ 7

తేన పంథాః కృతోఽస్మాకం యేనేదం నిర్మితం జగత్ । ఏతచ్ఛ్రుత్వా తు వింధ్యస్తు తప స్తప్త్వా పితామహాత్ ॥ 8

ఇషుపాత మథోచ్ఛ్రాయం ప్రత్యహం సమవాప్తవాన్ । తతః కతిపయాహేన దిశమావృత్య దక్షిణామ్ ॥ 9

ఆవృత్య తస్థావన్థానం దివాకర నిశాభృతోః । తతోఽన్ధ మభవత్ సర్వో భూలోకః పార్థివోత్తమ ! ॥ 10

శైలూషుడనియె : మున్ను విష్ణువుచే సుమాలి యెట్లుగూలెనో యీ నా సంశయము వారింపు మా సుమాలి మహాబలశాలి యని విన్నానన నాడాయనుం డిట్లనియె : ఓరాజశార్దూల ! మున్నీ కథ నగస్త్యమహర్షి రామునికిం జెప్పె నది నే జెప్పెద వినుము. మున్ను వృత్రాసురు డణ్గిన తరువాత దైత్యులు నాయకుడు లేనివారై సముద్రమును జలదుర్గముంగావించికొని యటనుండి రాత్రులందు ప్రజలను సంహరించుచుండిరి. సురలంచరతో నాలోచించి వీడెవ్వరికిం జావడని సముద్రమంద్రావుట కగస్త్యుం బ్రేరేపించిరి. దేవకార్యమని సంతోషించి యగస్త్యమహర్షి యుదకమెల్ల నాపోశనముపట్టి సముద్రమును నిర్జలముం గావించెను. ఆ నీరు లేని కడలిలో దేవతలు రాక్షసులం జంపిరి. అవ్వల వింధ్యుడు సూర్యచంద్రులతో నొకతరి మీరు మేరువును విడిచి నాకు ప్రదక్షిణము సేయుడన వారప్పుడు వింధ్యునితో నిది మా వశములో లేదు. ఈ జగన్నిర్మాణము సేసినవానిచేతనే మాకీ దారి యేర్పరుపబడినదనిరి. అది విని వింధ్యుడు తపస్సుచేసి బ్రహ్మ వలన ప్రతిదినము బాణము విసరినం తను నెత్తున కెదుగు వరమందెను. అంత కొన్నిరోజులలో దక్షిణదిశ నావరించి సూర్య చంద్రుల మార్గము నడ్డగించి నిలువబడెను. దాన భూలోక మంధకార బంధురమయ్యెను.

ప్రేరితో దేవవాక్యేన తతోఽగస్త్యో మహాతపాః । గత్వోవాచ తదా వింధ్యం తీర్థయాత్రాం కరోమ్యహమ్ ॥ 11
మత్కృతే హ్రస్వతాం గచ్ఛయేన యాస్యామ్యహం సుఖీ । జ్ఞాత్వా తపఃప్రభావం తు సోఽగస్త్యస్య మహాగిరిః ॥ 12
జగామ హ్రస్వతాం శీఘ్రమగస్త్యోఽపి తదా యయౌ । దక్షిణాశాం పరిత్యజ్య న యావ దహ మాగతః ॥ 13
సపుత్ర దార స్తావత్త్వం హ్రస్వఏవ భవాఽచల ః ఏవముక్త్వా స వింధ్యంతు సదారాపత్య బాంధవమ్ ॥ 14
జగామ దక్షిణా మాశాం త మువాచ పితామహః । దేవకార్యం మహద్బ్రహ్మన్ ః త్వయాకృత మిదం శుభమ్ ॥ 15
తస్మాత్ స్థానం చతే దద్మి వైశ్వానర పథాద్బహిః । దివ్యదేహో భవాంస్తత్ర విమాన వరమాస్థితః ॥ 16
దక్షిణాం భూషయ దిశమస్తోదయ సమన్వితః । ప్రసాదమంభసాం శైత్యం నిర్విషత్వం తవోదయే ॥ 17
భవిష్యత్యమల ప్రజ్ఞః మత్ప్రసాదాత్త వైవతు । శరత్సముదితో భూత్వా వసన్తేఽస్తమయం వ్రజః ॥ 18
ప్రాకామ్యయుక్తాశ్చ తథా సమగ్రాం వసుధాం చర । ప్రధానమూర్తి ర్యావత్త్వం సదారాపత్య బాంధవః ॥ 19
నాక్రమిష్యతి వై వింధ్యం తావద్వింధ్యాచలః స్థితః । ప్రాకామ్యమూర్తి యుక్తేతు యత్రక్వచన సంస్థితే ॥ 20
త్వయి వింధ్యో మహాశైలో వృద్ధింనస గమిష్యతి । ఇల్వలశ్చాపి దుర్మేధాః భ్రాత్రావై మేషరూపిణా ॥ 21
యదాభోజ యతే విప్రాన్ భుక్తవత్సు ద్విజాతిషు । కుక్షిభేదంతు వాతాపీ కృత్త్వా నిర్గచ్ఛతే పునః ॥ 22
ఏవం వినిఘ్నత స్తస్య బ్రాహ్మణాన్యత్త్వయా కృతమ్ । శరణంతేన తుష్టోఽస్మి వింధ్య సంస్తంభనేనచ ॥ 23
శరత్సమయ మాసాద్య యస్మాద్విప్ర నవోదయే । పూజాం త్వ మాప్స్యసేలోకే మత్ప్రసాదా ద్విజోత్తమ ః ॥ 24
యేచ త్వాం పూజయిష్యన్తి గంధమాల్య ఫలాక్షతైః । దధికాంచన రత్నైశ్చ పరమాన్నేన భూరిణా ॥ 25
పూర్ణకుంభైః సకూష్మాండైః ఛత్రోపానహ యష్టిభిః ః ధేన్వా వృషేణ భక్ష్యైశ్చ వాసోభిః కనకేనచ ॥ 26
సంవత్సరంచ త్యాగేన ఫలస్యైకస్య చావ్యథ । పూజనైః బ్రాహ్మణేంద్రాణాం త్వత్కర్మ సంకీర్తనైః ॥ 27
తే ప్రాప్స్యన్తి సదా పుత్రాన్ ధన మారోగ్యమేవచ । ఆయురగ్ర్యం తథాలోకే శత్రుభి శ్చాపరాజయమ్ ॥ 28
సౌభాగ్యంవిపులాన్ కామాన్ ధర్మవృద్ధిం తథైవచ । ఏవముక్త్వా స భగవాన్ తత్రైవాంత రధీయత ॥ 29

మహాతపస్వి దేవవాక్యముచే ప్రేరితుడై వింధ్యగిరికేగి నేను దీర్ఘయాత్రలు సేయుచున్నాను. నాకొరకు నీవు పొట్టివాడవు గమ్ము. దాన నేను సుఖముగ నేగెదననెను. అమ్మహాముని ప్రభావమెరిగి వింధ్యగిరి వంగెను. ఆయన సుఖముగా నవ్వలి కేగెను. మరియు నా గిరితో నేను దక్షిణ దిశను వీడివచ్చుదాక భార్యాపుత్రులతో నీవిట్లే పొట్టివాడవై యుండుమన నతడట్లే యుండెను. అవ్వల బ్రహ్మ దక్షిణదిశకేగి యమ్మహామునితో బ్రహ్మణ్య! నీవు దేవతలపనియిది చాలపెద్దదినిర్వహించితివి. అందుచే నీకు వైశ్వానర మార్గముకంటెను మీదిస్థానమిచ్చెదను. దివ్యశరీరివై నీవు విమానమందు గూర్చుండి ఉదయాస్తమయములతో గూడి దక్షిణ దిక్కునలంకరింపుము. నీయుదయమునందు జలములు ప్రసన్నత్వము విషరాహిత్యమును కలుగును. పరిశుద్ధజ్ఞానసంపన్న నాయొక్కయు ననుగ్రహమువలన నీజలశుద్ధిగల్గును. శరదృతువున నుదయించి వసంతఋతువున నీవస్తమింపుము. అప్పుడష్టసిద్ధులలో నొకటైన ప్రాకామ్య సిద్ధితోగూడి సర్వవసుధం జరింపుము. నీవు దార పుత్ర బంధువులతోగూడి ప్రధానమూర్తివై యుండుము· నీవున్నంత కాలము వింధ్యపర్వతము పెరుగదు. ఇల్వలుడు దుర్బుద్ధి మేకరూపుగొని తమ్మునితో విప్రులకు భోజనము పెట్టినప్పుడు మాంసము రూపముననున్న వాతాపి నీవురమ్మనగానే వారి కడుపులం జీల్చుకొని వచ్చును. ఇట్లనేకులు విప్రులు చనిపోయినంత వారికి నీవు శరణమిచ్చి యావాతాపిం జీర్ణము చేసికొందువు. అందుచే నేను సంతుష్టుడ నయ్యెదను. ఇపుడు నీచేసిన వింధ్యపర్వత స్థంభనముచే గూడ నేను ప్రీతి చెందితిని. శరదృతువురాగానే నీ నూతనోదయ మగును గావున అప్పుడు నీవు నా ప్రసాదముచే లోకమందందరి పూజలందుకొందువు. ఎవ్వరు నిన్ను గంధమాల్యాక్షతలచే పండ్లచే పెరుగు బంగారము రత్నములచే సమృద్ధమైన పరమాన్నముచే గుమ్మడికాయలతోడి పూర్ణకుంభములచే ఛత్రపాదుకాదులచే ధేనువు వృషభముచే భక్ష్యములచే వస్త్రములచే సువర్ణముచే

నిన్ను బూజింతురో, ఒక్క సంవత్సర మొకానొక పండు తినమని త్యజించి అర్చింతురో నీ యద్భుతచరిత్రను కీర్తించి బ్రాహ్మణుల బూజింతురో వారు నిత్యము పుత్రపౌత్ర ధనధాన్యాయురారోగ్యముల దులతూగుదురు. శత్రువులవలన బరాజయమెరుగరు. సౌభాగ్య మును విపుల కామములను ధర్మవృద్ధిని బొందుదురు. ఇట్లు పలికి భగవంతుడు బ్రహ్మ యటనే యంతర్ధానమందెను.

ఆససాద తథాస్థానం అగస్త్యోఽపి మహాతపాః । యేనక్రతు శతైరిష్టం తపస్తప్తం తథాత్మనః ॥ 30
తేన స్వతపసా సృష్టా లోపాముద్రా ప్రియంవదా । విదర్భరాజ తనయా ధర్మపత్నీ తథాత్మనః ॥ 31
దృఢస్యు స్తనయ స్తస్య తపస్వీచ మహాతపాః । ప్రముచు ర్మ్ముచు శ్చైవ తస్ముచుశ్చ మహాతపాః ॥ 32
స్వస్త్యాత్రేయ స్తథా విద్వాన్ తస్యశిష్యో మహాత్మనః । అభేద్యం కవచం దత్తం తథాఽక్షయ్యే మహేషుధీ ॥ 33
రామ లక్ష్మణయో స్తేన ధనుషీ చ మహాబలే । ఘోరేణాప్యథ సంయుక్తః సచ వైష్ణవ తేజసా ॥ 34
కర్మణాం కీర్తనం యస్య నరో వర్ష శతై రపి । కర్తుం శక్తో న సహితే ప్రాకామ్యేచైవ రావణే ॥ 35
అయోధ్యాం రాఘవం ద్రష్టుం జగామ త్వరితో మునిః । త మాగత మభిప్రేక్ష్య పూజయా మాస రాఘవః ॥ 36
పాద్యార్ఘ్యా చమనీ యాద్యైః సర్వైః రాజ్య నివేదనైః । సంపూజిత స్తదా తేన తత్ర చక్రే కథాః శుభాః ॥ 37
తతః కథాన్తే కస్మింశ్చిత్ తమపృచ్ఛత్తు రాఘవః । విష్ణునా మాలినిధనం తేనోక్తం తస్య తచ్ఛృణు ॥ 38
యదుక్త వాన్ రాఘవ నన్దనస్య చంద్రార్క వహ్ని ప్రతిమ ప్రభావః ।
రక్షోగణేశస్య వధం సుఘోరం మునిర్మహాత్మా తదిదం నిబోధ ॥ 39

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
నాడాయన వాక్యే శైలూషం ప్రతి నాడాయనోక్తాఽగస్త్య మాహాత్మ్య వర్ణనో నామ త్రయోదశోత్తరద్విశతతమోఽధ్యాయః.

అట్లగస్త్యుండు స్థానముం బడసి నూరు క్రతువులు సేసెను. మహాతపస్సు గావించెను. ఆ స్వీయ తపస్సు చేతనే లోపాముద్ర ప్రియభాషిణి సృష్టింపబడెను. అమె విదర్భరాజు కూతురయి జన్మించెను. అగస్త్యునికి ధర్మపత్ని యయ్యెను. ఆ యగస్త్యమహర్షికి తపస్వియయిన దృఢస్యుడు తనయుడుచయించెను. ప్రముచుడు ముముచుడు తన్ముచుడు నను కొడుకులుదయించిరి. ఆ మహాత్మునికి శిష్యుడు విద్వాంసుడు (జ్ఞాని) స్వస్త్యాత్రేయుడు. ఆమహానుభావు డగస్త్యుడు రామలక్ష్మణుల కభేద్య కవచమును అక్షయ్య తూణీరములను (తరుగని అమ్ములపొదుల) మహాబలముగల ధనుస్సుల నొసంగెను. ఆతడు ఘోరమైన విష్ణుతేజస్సుతో గూడియుండెను. ఆయన చేసిన పనులను నూరేండ్లైనను నరుడు కీర్తింపజాలడు. ఆయన ప్రాకామ్యసిద్ధిలో రావణుని సైరింపక త్వరితుడై యమ్ముని రామచంద్రప్రభుపుంజూడ నయోధ్యకుం జనెను. అటు సనుదెంచిన యమ్మహర్షిని రాముడు పాద్యార్ఘ్యాచమనీయాద్యుపచారములచే రాజ్యనివేదనములచేతను బూజించెను. అట్లు పూజితుడై యాయన శుభకథా ప్రస్తావనము సేసెను. ఒక కథ చివర రాముడా మహర్షిని విష్ణువుచే మాలి వధ వృత్తాంతము తెలుపుమన నాతడు తెల్పెను. అగస్త్యులు చంద్రార్క వహ్ని సమాన ప్రభావుడు రాఘవనందనునికి రక్షోగణాధీశుడగు మాలి వధ నతిఘోరమైనదాని నెట్లెరింగించెనో అయ్యది యిదెతెలిసికొనుమ.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండము నాడాయన ప్రసంగమందు అగస్త్యమహిమవర్ణనమను
రెండువందల పదమూడవ యధ్యాయము.

## రెండువందలపదునాల్గవ అధ్యాయము - సముద్రవర్ణనము

అగస్త్యః : మాలీ సుమాలీ రాజేంద్ర! మాల్యవాంశ్చ రణోత్కటః । లంకా దుర్గ మథా సాద్య చిత్రమూషః పరస్పరమ్ ॥
మాలీ సుమాలీ దుర్వృత్తౌ పీడయన్తౌ చ దేవతాః । వార్యమాణావపి సదా తేన మాల్యవతా నృప ! 2

తయోర్భీతైః సురై ర్బ్రహ్మా జ్ఞాపితః సంప్రయోజనమ్ । బ్రహ్మణా సహితై ర్గత్వా జ్ఞాపిత స్త్రిపురాంతకః ॥ 3
బ్రహ్మేశ సహితా దేవా విష్ణుం శరణ మీయుషః । జగ్ము ర్లవణ తోయస్థం విజ్ఞాపయితు మచ్యుతమ్ ॥ 4
దదృశు శ్చ రఘుశ్రేష్ఠ! సముద్రం పీత మంభసామ్ । ఊర్మివర్గైః ప్రనృత్యద్భిః వర్ధంత మివ వాయునా ॥ 5
హసన్త మివ ఫేనౌఘైః స్ఖలన్తం కందరాసు చ । అపార మివ గర్జన్తం నానా యాదో గణావృతమ్ ॥ 6
వీచి హస్తైః ప్రచలితై రాహ్వయాన మివా వరాన్ । ఫేనా వత్యః ప్రకీర్ణా శ్చ సంహతాశ్చ సముచ్ఛ్రితాః ॥ 7
ఊర్మయ శ్చాస్య దృశ్యన్తే చలన్త ఇవ పర్వతాః । తిమింగిలాః కచ్ఛపాశ్చ తథా తిమి తిమింగిలాః ॥ 8
మకరా శ్చాపి దృశ్యన్తే జలే మగ్నా ఇవాద్రయః । శంఖానాం చ సహస్రాణి మగ్నా న్యప్సు సమంతతః ॥ 9
దృశ్యన్తే స్మ యథా రాత్రౌ తారా స్తన్వాభ్ర సంవృతాః । క్వచి త్సుప్తః క్వచి ద్గర్జన్ క్వచిత్ ఘూర్ణన్ క్వచిత్ స్ఖలన్ ॥
క్షీబోపమం తం దదృశుః సముద్రం త్రి దశాధి పాః । క్వచి శ్చావాసితైః దైత్యైః క్వచిద్దైత్యారిణా తథా ॥ 11
క్వచిచ్చ భుజగై ర్భీమైః మహా గాంభీర్య సంయుతమ్ । విష్ణో ర్వరాహ వపుషా విక్షోభిత జలావిలమ్ ॥ 12
అనాసాదిత బాధంచ వర్షాణాం శతపత్రిణా । తేన దేవాతి దేవేన విష్ణునా ప్రభవిష్ణునా ॥ 13
నిత్య మన్తర సంస్థేన నిర్మలీ కృత విగ్రహమ్ । శక్ర వజ్ర భయ త్రస్య మాన శైలశతా కులమ్ ॥ 14
విద్రుమాంబర మాప్లుష్ట స దృశాకార విద్రుమమ్ । పూర్ణ చంద్ర కలంకస్య క్షాళనేప్సు రివోద్ధతైః ॥ 15
ఖ మాక్ర మతి కల్లోలైః పౌర్ణమాసీషు య స్సదా । అసంఖ్యాతం తరంగౌఘైః సంక్రాంత శశి మండలమ్ ॥ 16
హసన్తం వాఽ న్తరిక్షస్య శ్రియ మేవేందు ధారిణః । దిగ్భాగ దాన కాలేషు యుక్త శ్చందన వారిణా ॥
సుప్యతేచ యథా యత్ర సతతం దాన వారిణా 17
తమ న్త రిక్ష ప్రతిమం విశాల లోలోర్మి మాలాకుల దిగ్వి భాగమ్ ।
సముద్ర మాసాద్య దివౌక స స్త మాతస్థు రుగ్రం తపసోగ్ర సత్వాః ॥ 18

ఇతి శ్రీ విష్ణు ధర్మోత్తరే ప్రథమఖండే సముద్ర వర్ణనం నామ చతుర్దశోత్తర ద్విశతతమోఽధ్యాయః.

అగస్త్యులనిరి. రణోద్ధతులు మాలి సుమాలి మాల్యవంతుడు లంకాదుర్గముంజేరి యోంఢ'రులు గలిసియుండిరి. ఆయునికి అతి చిత్రము. మాలి సుమాలియు దుర్మత్తులై దేవతల పీడించుచుండిరి. మాల్యవంతుడు వారించుచున్నను మానరైరి. వారికి జడిసి దేవతలు బ్రహ్మకు కార్యప్రయోజన మెరింగించిరి. వారు బ్రహ్మతోనేగి త్రిపురాంతకునికి నివేదించిరి. బ్రహ్మను శివునిగూడి లవణ సముద్రమందున్న విష్ణువునకు విన్నపము సేయనేగిరి. అట నా సముద్రమును జూచిరి.

## సముద్రవర్ణనము

ఆసముద్రము తరంగవేగముచే నృత్యము సేయుచున్నట్లు గంతులు వేయుచున్నట్లు నురుగులతో నవ్వుచున్నట్లు పర్వతముల చరియలనుండి జారుచున్నట్లు అపారమై గర్జించుచున్నట్లు నానాజల జంతుగణములతోగూడి, చలించు తరంగమాలను హస్తముల దేవతలం బిలుచు చున్నట్లు గాననయ్యెను. నురుగులు గ్రమ్మి చిమ్ముకొనుచు కలిసికొనుచు మీదికి లేచుచున్న యందలి కెరటములు కదలుచున్న పర్వతములట్లు గనబడెను. తిమింగములు తాబేళ్లు తిమంగలములు మొసళ్ళును నీటందేలు పర్వతములట్లు కానవచ్చెను. వేలకొలది శంఖములు నీటందేలి రాత్రి చిఱుమబ్బుల గూడిన తారలట్లు (నక్షత్రములట్లు) కానవచ్చుచుండెను. ఒకచోట నిదిరించి, ఒకచో గర్జించుచు నొకచో ఘూర్ణించుచు నొకచో సకిలించుచు (తొట్రుపడుచు క్షీబునివలెనున్న బక్క చిక్కిన వాడట్లున్న) యా సముద్రుని దేవాధిపతులు చూచిరి. ఒకచో నావాసముగొన్న దైత్యులు, ఒక్కచో దైత్యాదులు (దేవతలు) ఒకచో భయంకరులగు పన్నగులనుగూడి మిగులలోతుగల్గి వరాహరూపియగువిష్ణువుచే గలుపబడిననీటితో జెదరి చెదరి శతపత్రియైన(చక్రాయుధుడైన)ప్రభవిష్ణువైన (జగత్కారణమైన) విష్ణువుచే వర్షపర్వతముల బాధనొందనిదై నిత్యము తనలోనున్నయావిష్ణువుచే నిర్మలినముగావింప బడిన

మూర్తితో ఇంద్రుని వజ్రాయుధము వలన భయమునంజడియు వందలకొలది పర్వతములతో నలముకొన్నదై పవడములంబరముగా దాల్చి పూర్ణిమలందు పూర్ణచంద్రునిలోనికళంకమును గడిగివేయగోరినట్లు ద్ధతములై నకల్లోలములతో నాకసమాక్రమించుచున్నదై అసంఖ్యాకములై తరంగసంఘములచే శశిమండలము నాక్రమించునదై ఆయాదిశలకు భాగమునిచ్చు తరి నా చందనోదకముతోగూడి చంద్రధారియైన యంతరిక్షము యొక్క శోభను పరిహసించుచున్నదై యాకసమట్లు విరివియై విశాల విలోల తరంగమాలాకుల దిగ్విభాగమైయున్న సముద్రముం దరిసి తపస్సుచే నత్యుగ్రమైన బల సంపన్నులు దివౌకసులట జేరినిలిచిరి.

ఇది శ్రీవిష్ణు ధర్మోత్తర మహాపురాణమందు ప్రథమఖండమందు శైలూషునితో
నాడాయనుని ప్రసంగమందు సముద్ర వర్ణనమను రెండువందలపదునాల్గవ యధ్యాయము

## రెండువందల పదునైదవ అధ్యాయము - దేవప్రయాణవర్ణనము

అగస్త్యః : తపసా తోషితో దేవై ర్దేవదేవో జనార్దనః । మహోదవాసం సంత్యజ్య సురాణాం దర్శనం దదౌ ॥ 1
తే చ తం విబుధారిఘ్నం ధరణీపాత పాంశులైః । జానుపాణి లలాటాంతైః ప్రణేముర్ముదితా వయమ్ ॥ 2
తుష్టువు శ్చ తథా వాగ్భిరథోచుః స్వప్రయోజనం । వధార్థం దేవదేవస్య సుకేశ తనయాన్ ప్రతి ॥ 3
ప్రతిజజ్ఞే తదా తేషాం దేవో మాలి వధం హరిః । యూయం సుమాలి నిధనే శక్తాఃస్థ సురసత్తమాః ॥ 4
మాల్యవాన వ్యవధ్యోఽసౌ సతతంధర్మవత్సలః । ఏవముక్త్వా తత స్తార్క్ష్యమాహ్వాయామాస కేశవః ॥ 5
తమారు రోహ సర్వాత్మా కాంచనం వినతాసుతమ్ । శంఖచక్ర గదాపద్మ లాంఛితో మధుసూదనః ॥ 6
అతసీ కుసుమశ్యామః కాంచనే ఖగమేస్థితః । శ్రియ మూహే సతోయస్య తోయదస్య స విద్యుతః ॥ 7
కిరీట కౌస్తుభధరం వరభూషణ భూషితమ్ । విహంగ వరమారూఢ మనుజగ్ము ర్దివౌకసః ॥ 8
సుధావదాత సత్వక్షైః వితతాంబర ధావిభిః । హంసై స్తమన్వయా ద్బ్రహ్మ జటామండల దుర్దశః ॥ 9
చంద్రరశ్మి ప్రతీకాశ నిబిడాంగ కకుద్మికః । హర స్తృతీయ నేత్రార్చి ర్విదారిత నభోయయౌ ॥ 10
మహేంద్రనేత్ర సంకాశ కలాపాటోప రోధినా । స్కందస్త మన్వయౌ తస్మా న్మయూరేణ షడాననః ॥ 11
వినాయకాన్ కర్తుమనాః రాక్షసేంద్రాన్ వినాయకః । వాయుమండల మారూఢః ప్రయయా వను మాధవమ్ ॥ 12
వహ్ని జ్వాలావళీ పుంజ సమకేసర మాలినా । సింహేనాను యయౌ దేవీ భద్రకాళీ జనార్దనమ్ ॥ 13
వరస్త్రీ కుచ సంకాశ కుంభై రావణ పృష్ఠగః । కిరీటీ వజ్రపాణి స్త మన్వయౌ త్రిదశాధిపః ॥ 14
వహ్ని స్త మన్వయౌ దేవం శుకయానేన పార్థివ ! । సేంద్ర గోప గణాకీర్ణ శాద్వలస్థల శోభినా ॥ 15
గిరికూట సమాకారం శృంగ భూషిత మస్తకమ్ । వైవస్వతోఽపి మహిష మారుహ్యానుయయౌ హరిమ్ ॥ 16
శంకు కర్ణో మహాగ్రీవో వరేభ స్కంధ సంస్థితః । పశ్చా దను యయౌ దేవం విరూపాక్షో మహాబలః ॥ 17
మహాయానేన రమ్యేణ మనో మారుత రంహసా । వరుణోఽను యయౌ పశ్చాత్ స్నిగ్ధ వైడూర్యసన్నిభః ॥ 18
మనశ్శీఘ్రగతి ర్దేవో వాయుమండల మధ్యగః। వాయుశ్చాను యయౌ పశ్చాద్వాయు పూర్ణ శుభాంశుకః ॥ 19
ధనదో నరయానేన సర్వరత్నో జ్జ్వలాత్మనా । గోవింద మను వవ్రాజ శ్రియా పరమయా యుతః ॥ 20
సప్తాశ్వ మేక చక్రంచ రథ మారుహ్య భానుమాన్ । తదైవాను యయౌ దేవప్రభా మండల దుర్దృశః ॥ 21
చంద్ర శ్చండ ప్రభాకారో దశభి స్తు రగోత్తమైః । మనోజవేన చ తథా రథేనాను యయౌ హరిమ్ ॥ 22
తురంగ వరమారుహ్య భాస్కర ప్రతిమాకృతిః । తమన్వయౌ తదా రాజన్ ! ప్రచండో రవి నందనః ॥ 23

చతుర్భిః కుంజరై ర్యుక్తం రథ మాస్థాయ సత్వరా । త మన్వయౌ ధరాదేవీ దేవం త్రిదశ పూజితమ్ ॥ 24
సంకల్ప రథ మారుహ్య వ్యవసాయ పురస్సరః । మనోరథే నాను యయౌ కామదేవోఽపి కేశవమ్ ॥ 25
పుష్పేషో రపి యస్యాజ్ఞాం బిభర్తి సకలం జగత్ । అనాలస్యం సమారూఢా తథా దేవీ సరస్వతీ ॥ 26
అన్వయౌ పుండరీకాక్షం శరణాగత వత్సలమ్ । భౌమజ్ఞ జీవ శుక్రాశ్చ రాహుః కేతుః శనైశ్చరః ॥ 27
వాజియుక్తైః రథైః శీఘ్ర మన్వయుః పురుషోత్తమమ్ । దేవాశ్చైకోన పంచాశ న్మరుతః చారుమండలాః ॥ 28
అను జగ్ముః సురాః కృష్ణం వాయుమండల మధ్యగాః । అనుజగ్ము స్త మాదిత్యాః రథైః కాంచన సుప్రభైః ॥ 29
వసవోంగిరసః సాధ్యా విశ్వేదేవా స్తథాశ్వినౌ । భృగవ శ్చాశ్వసంయుక్తైః రథై స్తం దేవ మన్వయుః ॥ 30
రుద్రాశ్చాను యయుః దేవం బలోదగ్రైః కకుద్మిభిః । తథైవాన్యే బలోదగ్రాః దేవా దేవాను యాయినః ॥ 31
గర్దభైః శింశుమారైశ్చ మహోష్ట్రై ర్మహి షోరగైః । సింహ వ్యాఘ్ర తరక్ష్వృక్ష గజవానర మర్కటైః ॥ 32
చమరైః సృమరైశ్చైవ గోధా మార్జార శల్లకైః । వివిధైః పక్షియా నైశ్చతేఽను జగ్ము ర్జనార్దనమ్ ॥ 33
సిద్ధమార్గేణ సిద్ధాశ్చ ప్రయయు ర్మునయ స్తథా । స్తువన్తః పుండరీకాక్షం దేవసంఘ భయాపహమ్ ॥ 34
గీతవాద్యైః సుమధురై స్సేవమానా జనార్దనమ్ । ప్రహృష్టాః ప్రయయు స్తత్ర గంధర్వాప్సరసాంగణాః ॥ 35

అగస్త్యులనిరి : దేవతలు సేసిన తపస్సుచే హరి సంతుష్టుడై సముద్రవాసమును విడిచి వారికి గానవచ్చెను. వారును సురారి సంహారుని నవనిం జాగిలవడుటచే ధూళిగలిసిన మోకాళ్ళ అరచేతుల లలాటములతో హర్షముతో మ్రొక్కిరి. దేవవాక్కులచే(వేదములచే) స్తుతించిరి. తాము వచ్చిన ప్రయోజనము సుకేశ తనయ సంహారమని దేవదేవుని నివేదించిరికూడ. అప్పుడు హరి మాలి వధ సేయుదునని వారికి ప్రతిజ్ఞసేసెను. మీరు సుమాలివధ విషయములో శక్తులు గండు. మరి మాల్యవంతుడో ధర్మవత్సలుడు ఇత డవధ్యుడు. అని పలికి హరి గరుడునిం బిలిపించెను. సర్వాత్ముడా విష్ణువు స్వర్ణమూర్తియైన యా వినతాసుతునధిష్ఠించెను. శంఖ చక్ర గదా పద్మములూని అవిసెపూపట్లు శ్యామలుడై యా బంగారుపక్షిపై గూర్చుండి మెరపుతో గూడిన జలముతోడి జలదము యొక్క శోభను దాల్చెను. కిరీటము కౌస్తుభమణిని యమూల్యభూషణములను దాల్చి విహంగవరమధిష్ఠించిన యా స్వామిని వేలుపు లనుగమించిరి. అమృతమటచ్చపు తెల్లనైన రెక్కలతో విశాలాకాశమున బరువెత్తు హంసలతో నా విష్ణువును జటామండలములచే గనశక్యముగానివాడై బ్రహ్మ దర్శించెను. చంద్రకిరణసదృశమైన నిబిడమైన (ఒత్తైన పుష్టియైన) మేనితోడి వృషభముపైనెక్కిన వాడై మూడవ కంటి వెలుగుచే నాకసముం జీల్చుకొని హరుడా హరివెంటం జనియె. దేవేంద్రుని వేయికన్నులతో నీడైన పింఛెము యొక్క యాటోపముచే దూసికొనిపోవు మయూరమునెక్కి స్కందుడు కుమారస్వామి షణ్ముఖుడు విష్ణువును వెంబడించెను. రాక్షస స్వాములను వినాయకులను గావింప వినాయకుడు వాయుమండలారూఢుడై మాధవు వెంట నేగెను. అగ్నిజ్వాలావళీ పుంజముతో నీడైన కేసరములతోడి (జూలుతోడి) సింహముతో (సింహవాహన) భద్రకాళి జనార్దనునివెంటనరిగెను. వరాంగనల కుచముల వంటి కుంభస్థలముగల యైరావతగజమెక్కి కిరీటముదాల్చి వజ్రముచేబూని త్రిదశాధిపతి యా జగత్పతి ననుచరించెను. రాజా! వహ్ని చిలుకవాహనమెక్కి నాదేవు ననుసరించెను. వైవస్వతుండు (యముడు) అరుద్రపురుగుల గమితో నలముకొన్న పచ్చిక బయలట్లు శోభించునది గిరిశిఖరసమాకారమైనది కొమ్ములతో రాణించు మస్తకముగలది యగు మహిషమునెక్కి హరివెంట నేగెను. పెద్దమెడ శంఖములు చెవులందుగల (నిర్‌ృతి) విరూపాక్షుడు గజస్కంధ మధిష్ఠించి యాదేవుననుసరించెను. మనోజవము వాయువేగమునైన మహాయానమెక్కి హరివెంట స్నిగ్ధ వైడూర్యవర్ణుడైన వరుణుడేగెను. మనోవేగియై వాయుమండల మధ్యమందుండి వాయువులతోగూడిన చక్కని వలువదాల్చి వాయుభగవానుడావెంటజనెను. ధనదుడు (కుబేరుడు) సర్వరత్నోజ్జ్వలమైన నరవాహనమెక్కి పరమశ్రీ సంపన్నుడై గోవిందునను వ్రజన మొనరించెను. ఏడు గుఱ్ఱములు నొక్క చక్రమునుంగల యరదమెక్కి భానుమంతుడు (సూర్యుడు) ప్రభామండలముచే నీక్షింపవలనుగాక యాదేవునననుసరించెను. చంద్రుడు తీవ్రప్రభను (వేడిని) వారించుచు

పది గుఱ్ఱములు పూన్చిన మనోజనమైన రథమెక్కి హరిని వెంబడించెను. శని (సూర్యకుమారుడు) మంచి గుఱ్ఱమెక్కి భాస్కరుని వంటి రూపుగల్గి ప్రచండుడై హరిననుగమించెను. భూమి నాల్గేనుగులబూన్చిన రథమెక్కి త్వరతో దేవపూజితుని విష్ణువు వెంబడించెను. కామదేవుడు (మనసిజుడు మన్మథుడు సంకల్పమను రథమెక్కి (మనోరథముతో) సర్వ ప్రయత్న పురస్సరముగా హృషీకేశు వెంటజనెను. జగత్తు కుసుమధన్వుని యాజ్ఞను దలదాల్చును. సరస్వతి అనాలస్యమను తేరెక్కి శరణాగతవత్సలుని పుండరీకాక్షు ననుసరించెను.

తపస్సత్యం క్షమాదానం వ్రతాని వివిధాని చ । యజ్ఞాంగాని చ సర్వాణి కాలస్యావయవాః సథా ॥ 36
సంవత్సరా స్తథా మాసా పక్షా చ కరణై స్సహ । యుగా యన ముహూర్తాశ్చ శాస్త్రాణి వివిధాని చ ॥ 37
మూర్తిమన్తి తథాఽస్త్రాణి శస్త్రాణి చ జగత్పతేః । సముద్ర పక్షి తద్ద్వీప శాఖినాం విగ్రహాణి చ ॥ 38
వర్షాణాం చ శరీరాణి పితౄణాంచ తథా గణాః । నక్షత్రాణి దిశ శ్చైవ విదిశ శ్చ మహీ పతే ॥ 39
దేవా వనస్పతి శ్చైవ యా శ్చలోకస్య మాతరః । దేవదైత్య గణా యేచ తథా పితృగణాశ్చయే ॥ 40
గంధర్వ యక్ష నాగానాం గణా యేచ నరేశ్వరః । ఘోరా వ్యాధి గణా శ్చైవ కాలపాశైః సుదారుణైః ॥ 41
మృత్యుర్దండః స్తథా క్రోధో జరాచ మనుజేశ్వరః । అన్వయుః పుండరీకాక్షం రక్షోగణ వధైషిణమ్ ॥ 42
జయశ్రీ రగ్రత స్తస్య ప్రయాతి రఘునందన! । సరిత శ్చ తథా యానైః సర్వలోకస్య మాతరః ॥ 43
మకరేణ యయౌ గంగా కాళిన్దీ కచ్ఛపేన తు । సారసేనాపి సరయూః శింశు మారేణ గోమతీ ॥ 44
గోదావరీ చ ఖడ్గేన మయూరేణ సరస్వతీ । కకుద్మినా శతద్రుశ్చ విపాశా తురగేణచ ॥ 45
చంద్రభాగా చ సింహేన దంతినే రావతీ తథా । సింధు ర్వ్యాఘ్రేణ మత్స్యేన వితస్తాచ తథా యయౌ ॥ 46
దేవికా చైవ హంసేన పురుషేణచ గండకీ । మహిషేణ పయోష్ణీ చ కావేరీ వృష భేణ తు ॥ 47
హిరణ్వతీ సుపర్ణేన చక్రేణే క్షుమతీ నదీ । భుజగేన చ పర్ణాశా వరాహేణ చ కౌశికీ ॥ 48
వేదస్మృతి ర్మయూరేణ సారంగేణ చ నర్మదా । జీవజీవక మారూఢా సీతాప్యియయౌ నదీ ॥ 49
హ్రాదినీ చ సరోరూఢా స్సృమరేణచ పావనీ । శశకేనాపి లౌహిత్యా నదీ సింధు ర్గజేన చ ॥ 50
ఉరభ్రేణ తథా చక్షుః సీతా చాజేన రాఘవ ః గౌతమీ కుక్కుటేనాపి చాషేణచ దృషద్వతీ ॥ 51
స్వైః స్వైః యానైః తథై వాన్యాః ప్రయయుర్నిమ్నగా హరిమ్ । దేవాను యాత్రా ఘోషేణ వాదిత్రాణాం రవేణ చ ॥
స్తూయ మానో ద్విజాగ్ర్యై శ్చ ప్రయయౌ కమలేక్షణః । తద్బలోద్యమ పర్యంతం దేవగంధర్వ సంకులమ్ ॥ 53
ఆతపత్రైః పతాకాభిః స్వచిహ్నై శ్చ విరాజితమ్ । 54
కింకిణీ శత సంఘోషం ప్రయయౌ వనుకేశవమ్ రశ్మ్యుత్కరై ర్దేవ విభూషణానాం । ప్రదీప్యమానం కనకాది చిత్రమ్
బలం యయౌ తత్త్రిదశోత్తమానాం నారాయణే నా ప్రతి మేన గుప్తమ్ ॥ 55

ఇతి శ్రీ విష్ణుధర్మోత్తరే ప్రథమఖండే దేవ ప్రయాణ వర్ణనంనామ
పంచ దశోత్తర ద్విశత తమోఽధ్యాయః.

తపస్సత్య క్షమాదాన వివిధవ్రతములు అన్ని యజ్ఞాంగములుకా లావయవములు సంవత్సరములు మాసములు పక్షములు రెండు కరణములు యుగములు అయనములు ముహూర్తములు వివిధ శస్త్రములు అస్త్రములు శాస్త్రములు సముద్రమార్గములు అందలి ద్వీపములు వృక్షములు వర్షములు (వర్షపర్వతములు) పితృగణములు నక్షత్రములు దిశలు (మూలలు) దిక్పాలురు వివస్వతులు లోకమాతలు దేవదైత్యపితృగణములు గంధర్వ యక్షనాగగణములు ఘోరవ్యాధిగణములు మూర్తిందాల్చి దారుణ కాలపాశములతో మృత్యుదండము (క్రోధము జరముదిమి) రక్షోగణ సంహారము సేయగోరు విష్ణువును వెంబడించెను. భరతా! ఆయనకు

జయలక్ష్మి ఆయన ముందునడిచెను నదులు సర్వలోకమాతలు తమతమ వాహనములెక్కిచనెను గంగ మకరవాహనమై కాలింది తాబేలునెక్కి సతయూనది సారసమునెక్కి (బెగ్గురుపక్షిని) గోమతి శిశుమారముపై గోదావరి ఖడ్గమృగవాహనయై సరస్వతి నెమలి శతద్రువు వృషభమును విపాశ గుఱ్ఱమును చంద్రభాగ సింహమును ఇరావతి దంతిని (ఏనుగును) సింధువు పెద్దపులిని వితస్త మత్స్యమును దేవికానది హంసను గండకి పురుషుని పయోష్ణి దున్నను కావేరివృషభము హిరణ్వతి గసుకుని ఇక్షుమతి చక్రవాకమును పర్ణాశానది సర్పమును కౌశికి వరాహమును వేదస్మృతి నెమలిని నర్మద లేడిని సీతానది (జీవంజీవమును) చకోరమును నెక్కిచనెను. హ్రాదిని సరోరూఢా= నరారూఢా = నరవాహనమెక్కి యనిపాఠాంతరము. పావని స్మరమృగమును లోహిత్యానది శశకమును (కుందేటిని) సింధువు ఏనుగును చక్షువు ఉరభ్రమును సీతమేకను గౌతమి కుక్కుటమును (కోడిని) దృషద్వతి చాషమును మరియుంగల పుణ్యనదులు తదితర వాహనములనెక్కి హరివెంట జనిరి. దేవతల వెంబడించు సందడితో దేవవాద్య రకములతో ద్విజోత్తములు స్తుతింప కమలలోచనుడు జైత్రయాత్ర వెడలెను. గొడుగులు పతాకలు వారివారి చిహ్నలతో విరాజిల్లుచు చిఱుగంటల ఘోషములతో దేవ గంధర్వ సంకులమైన బలగము హరివెంటనడచెను, దేవతలుదాల్చి భూషణముల కాంతులతో నుద్దీపించుచు కనక మణి ప్రముఖ ప్రభలచే చిత్రవిచిత్రమై దేవతా శ్రేష్ఠులబలము అసామాన్యడగు నారాయణునిచే గుప్తమై (రక్షింపబడుచు) యొసిగెను.

ఇది శ్రీవిష్ణు ధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమందు
దేవ ప్రయాణవర్ణనమును రెండువందల పదునైదవ యధ్యాయము

## రెండువందలపదునారవ అధ్యాయము - రాక్షససేనాప్రస్థానవర్ణనము

అగస్త్యః :- దేవతానాం సముద్యోగం శ్రుత్వా మాలి సుమాలినౌ । చక్రతుః పృతనాం ఘోరాం త్రిదశై ర్యుద్ధకాంక్షిణౌ ॥
తౌ క్రుద్ధౌ భ్రాతరౌ శ్రీమాన్ మాల్యవాన్ వాక్యమబ్రవీత్ । ఆశ్రయస్త్రి దశేంద్రాణాం సర్వాత్మా మధుసూదనః ॥ 2
తేన యుద్ధం నకర్తవ్యం సతుపూజ్యో జగత్పతిః । అగ్రేతు ప్రణిపాతేన తం యజామో జగత్పతిమ్ ॥ 3
ప్రణిపాత ప్రసన్నోహి కామాన్ దాస్యతి కేశవః । విష్ణుర్హి మలినే చిత్తే త్వస్మాకం నృప ః దుర్జయః ॥ 4
జీవేమ సుచిరం కాలం స్థిత్వా దేవస్య శాసనే । ప్రసీద ః రాజన్ ! మా యుద్ధం వ్రజ ః దేవేన విష్ణునా ॥ 5
యక్షాణాం రాక్షసానాంచ కురుశ్రేయ స్తథా త్మనః । ఏతదుక్తం హితం భ్రాత్రా రురుచే న చ తస్య తత్ ॥ 6
మహతా చ ససైన్యేన ప్రయయౌ యేన కేశవః । త మన్వయౌ మహాతేజాః సుమాలీ రాక్షసాధిపః ॥ 7
పితృతుల్య శ్చ సాధూనాం జ్యేష్ఠభ్రాతా గురుర్మతః । ఆదౌ వాచ్యం హితం తస్యకార్యం తదను చేష్టితమ్ ॥ 8
ఏతాం వృద్ధిం సమాస్థాయ నిర్యాతో మాల్యవానపి । తే రాక్షసా సహ భ్రాత్రా భీమనేత్రాగ్ని భూషణాః ॥ 9
కోటీశతేన ముఖ్యానాం రాక్షసానాం వినిర్గతాః । నానావిధోగ్ర వసనాః నానా ప్రహరణాయుధాః ॥ 10
నానా వాదిత్ర ఘోషేణ ప్రయతా రాక్షసాధిపాః । నానా ప్రకారై ర్వివిధైః ప్రాణిభి ర్బలవత్తరైః ॥ 11
వాహనైః ప్రయయు ర్ఘోరాః రాక్షసాస్త్రి దశాధిపమ్ । గచ్ఛత స్తు బలౌఘస్య తదా తస్యోత్తరాం దిశమ్ ॥
బభూవాఽభి ముఖం ఘోరం వనం త్రిదశపాలితమ్ ॥ 12
హిమాచల స్యోత్తర దిగ్విభాగే స్వస్థే బలే తౌ పురుషౌ ప్రవీర ః
జయార్థ మభ్యుద్యత చాప దండౌ ప్రచక్రతు ర్యుద్ధ మదీన సత్త్వౌ ॥ 13

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే శైలూషం ప్రతినాడాయనాఽనుశాసనే
రాక్షససేనానిర్యాణ వర్ణనంనామ షోడశోత్తర ద్విశతతమోఽధ్యాయః ॥

అగస్త్యులనిరి. దేవతల యుద్ధోద్యమము విని కుపితులై సోదరులు మాలి సుమాలులు జయకాంక్షతో దేవతలతో యుద్ధమునకుం దలపడిరి. వారిని గని మాల్యవంతుడు సర్వాత్మకుడైన మధుసూదనుడు సురేంద్రుల కాశ్రయము. ఆయనతో పోరాడరాదు. అజగత్పతి యాతడు పూజనీయుడు. ఆయనముందు సాష్టాంగపడి యాస్వామిని జయింతము హరి ప్రణిపాత ప్రసన్నుడు. (ప్రణతులగు వారియెడ ననుగ్రహము సూపువాడు) అభీష్టముల నిచ్చును. విష్ణువుమన మలినమైన చిత్తమునందున్నాడు. దుర్జయుడు ఆదేవుని యాజ్ఞకు గట్టుపడి మనము చిరంజీవులమగుదము. రాజా! నీవు ప్రసన్నుడవగుము. విష్ణునితో బోరుసకు బోకుము. యక్షులకు రాక్షసులకు నావిధముగా శ్రేయస్సుకూర్చుమనియె. తమ్ముడు సెప్పిన యీమాట మాలికి రుచింపలేదు. పెద్ద సేనతో హరిపైకి నడచెను. మహాతేజస్వి (ప్రతాపవంతుడగు) రాక్షసరాజు సుమాలియు వానిని వెంబడించెను. జ్యేష్ఠభ్రాత పితృతుల్యుడు గురువు నని చెప్పబడినదిగదా! తొలుత హితవు చెప్పవలెను. అన్వల వాని చేసినయట్లు చేయవలెను. అను నీతలంపును (నీతిని) ఆధారముగా గైకొని మాల్యవంతుడును మాలిని యుద్ధమున కనుసరించెను. వారందరు భయంకర నేత్రాగ్ని భూషణులై యన్నతో వందకోట్ల రాక్షస ముఖ్యులతో వెడలి నానావిధోగ్రవస్త్రధారులై నానాప్రహరణాయుధములును నానాయుద్ధవాద్య ఘోషముతో నారాక్షసాధిపతులు నానాప్రకారములైన బలవత్తరములైన పెక్కు ప్రాణులతో వాహనములతో నతి ఘోరులై దేవాధీశ్వరుడగు హరిపైకి నడచిరి. అటుత్తరదిశగా నరుగునా సైన్యములకు దేవతల పాలనములో నున్న వనమొకటి అభిముఖ మయ్యెను ఎదురయ్యెను. సైన్యము హిమాలయము నుత్తర దిగ్విభాగమున స్వస్థమై నిలువ నా పీఠులదీన సత్త్వులు జయము గోరి ధనుర్దండము లూని యుద్ధము సేయజొచ్చిరి.

ఇది శ్రీ విష్ణు ధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమునందు
రాక్షససేనా ప్రస్థాన వర్ణనమను రెండువందల పదునారవ యధ్యాయము

## రెండువందలపదునేడవ అధ్యాయము - మాలిరాక్షస వధ

తతః ప్రావర్తత రణం స్వస్థయో ర్బలయో స్తయోః । నానా ప్రహరణో దగ్ర భుజయో ర్జయ మిచ్ఛతోః ॥ 1
తదా బలాభ్రసంఛన్నే గగనే ఖడ్గ విద్యుతి । తస్మిన్నేవ క్షణే జాతో భానుమాన్ నృప విద్యుతిః ॥ 2
చలత్ఖడ్గ లతా విద్యుత్సము ద్యోతిత విగ్రహాత్ । రక్తవృష్టిః పపాతో ర్వ్యాం బలమేఘాను విగ్రహాత్ ॥ 3
తతః శోణిత వర్షేణ సిచ్యమానే మహీతలే । గ్రావ వృష్టి ర్మహత్యాసీ చ్ఛాదితం భూతలం యయా ॥ 4
ఆసీ దగమ్యా వసుధా శోణి తౌఘ పరిప్లుతా । రజస్వలేవ యువతి స్తథా తత్ర నరాధిప ॥ 5
స్ఫురమాణా విదృశ్యన్తే బాహవ శ్చందనోక్షితాః । ఖడ్గ ప్రహార పతితాః పంచ శీర్షా ఇవోరగాః ॥ 6
ముఖాని దంత పూరాణి తథా సరుధిరాణి చ । (విరేజు ర్దాడి మానీవ పాక ప్రస్ఫురితాని వా ॥ 7
నిపతద్భి స్తథా ఛత్రై శ్చామరై ర్వ్యజనై స్తథా । విచ్ఛిన్న వాహనాం గైశ్చ ఖ మాసీత్సంకులం తథా) ॥ 8
కిరీటైః కుండలై ర్హారైః కేయూరై రంగదై స్తథా । పాత్యమానైః ఖ మభవ ద్రశ్మి పుంజ విరాజితమ్ ॥ 9
క్షురప్ర విని కృత్తాని రుధిరాక్తే మహీతలే । లుఠన్తి నాగహస్తాని భోగి భోగ నిభానిచ ॥ 10
అదృష్ట్వా పతితానీహ శిరాంసి వసుధాతలే । హత్వా వంశాన్ ఖ మాజగ్ము రన్వేషన్త ఇవాసవః ॥ 11
శరీరై ర్భూతలం ప్రాప్తా దివం ప్రాప్తాః శరీరి భిః । అన్తరిక్షే వినిహితా లోకత్రయ జిగీషవః ॥ 12
ఛిన్న రాక్షస మూర్ధానో దళ ద్రుధిర బిందవః । న్యపత న్నుత్తరా దేవ శ్యేనై రుపహృతాశయాత్ ॥ 13
శ్యేనానాం భ్రమతాం తత్ర రాక్షసామిష లిప్సయా । బభూవ స దృశం రూపం శీర్షాణాం భ్రమతాం తథా ॥ 14
నికృత్తాంగ నిపాతేన పతితా బహవ స్తథా । సుషుపు ర్గాం సమాలింగ్య క్రవ్యాదా రుధిరావిలాః ॥ 15

జడుపున సుఖముగానక వేర్వేర నందరును బాతాళమును జేరిరి. దేవపూజగొని విష్ణువు దేవతలను స్వస్థులంజేసి యంచరయచూచు చుండ నక్కడ నంతర్ధానమందెను. శూన్యమైపోయినలంక కుబేరునకీయబడినది. అది రావణునిచే బలాత్కారముగ లాగికొన బడినది. నీవు రావణునింజంపి దానిని విభీషణునకిచ్చితివి. నీవు రాక్షసవధకై యవని నవతరించితివి. నీచే మున్ను గూలిన మాతలసంకటులు పౌలస్త్యులు రాక్షసులు వారేయిపుడు నీచేగూలిరి. రాక్షసులంజంపువాడు హరికంటె మరిలేడు. నిన్నుజూచితిని. నీతో మాట్లాడితిని. అని వచ్చినదారి నగస్త్యులు చనిరి.

నారాయణః : ఏవ ముక్త్వా తతోఽగస్త్యో యథాగత మరిందమః । తస్మా ద్యుద్ధం నమే రాజన్ ! అద్యవై తవ రోచతే ॥
ఉత్సాహ శక్త్యా సంపన్నో మంత్ర శక్త్యాచ రాఘవ । ప్రభు శక్త్యా తథా యుక్తో దేవ శక్త్యా తథైవచ ॥ 10
సాధు సాధ్యేషు కార్యేషు కః కుర్యా ద్విగ్రహం బుధః । కేవలం కోప మాస్థాయ విగ్రహం నృప దోషదమ్ ॥ 11
కామ క్రోధౌ జితౌ యేన తేనాత్మా విజిత స్తథా । యేనాత్మా విజిత స్తేన విజితేయం వసుంధరా ॥ 12
రాజ్ఞోఽ విజిత చిత్తస్య పరచక్ర జయః కుతః : న చక్రస్య జయం కర్తుం శక్నోత్య విజితేంద్రియః ॥ 13
నాఽ వజ్ఞా కస్య చిత్కార్యా బలోవా బహుమన్యతే । నిత్యం లోకే హి దృశ్యన్తే శక్తేభ్యః శక్తి మత్తరాః ॥ 14
యథా శక్తి చికీర్షన్తి యథా శక్తి చ కుర్వతే । న కంచి దవ మన్యన్తే నరాః పండిత బుద్ధయః ॥ 15
ద్వా విమౌ కంటకౌ తీక్ష్ణౌ శరీర పరి శోషణౌ । యశ్చాఽ ధనః కామయతే యశ్చ కుప్యత్య నీశ్వరః ॥ 16
ద్వావిమౌ పురుషౌ లోకే స్వర్గ స్యోపరి తిష్ఠతః । ప్రభుశ్చ క్షమయా యుక్తో దరిద్రశ్చ ప్రదానవాన్ ॥ 17
కః కుర్యా ద్దుర్బలే క్రోధం స్వభావా దేవ నిర్జితే । బల వత్యపి కః క్రోధం కుర్యా త్ప్రాణ హరం నరః ॥ 18
అపహార పరివృత్తస్య కోపస్తే జస్వితోచ్యతే । యస్మా త్తస్మా ద్బుధైః కోపః కోపం కృత్వా వినిర్జితః ॥ 19
త్రివిధం నరక స్యేదం ద్వారం నాశన మాత్మనః । కామః క్రోధ స్తథా లోభ స్తస్మా దేత త్త్రయం త్యజేత ॥ 20
అనుబంధం చ సంప్రేక్ష్య విపాకం చైవ కర్మణామ్ । ఉత్థాన మాత్మన శ్చైవ తతః కర్మ సమాచరేత ॥ 21
నరాజ్యం లబ్ధమి త్యేవం వర్తితవ్యం చ సాంప్రతమ్ । శ్రియం హ్యవినయో హన్తి జరా రూప మి వోత్తమమ్ ॥ 22
త్యక్త్వా జనపదే వాసం యాహి రాజన్ః హిమాచలమ్ । అవిషహ్య తమః హత్వా రావణం లోకరావణమ్ ॥
లంకాం త్యక్త్వా ధనాధ్యక్షః పశ్యకైలాస మాశ్రితమ్ ॥ 23
నరావణో రాఘవ సాయకార్తః త్యక్త్వా శ్రియం భూమివతే విపన్నః ।
ధనాధిపోఽ ద్యాపి విశాల కీర్తిః కరోతి రాజ్యం క్షణదా చరాణామ్ ॥ 24

ఇతి శ్రీ విష్ణుధర్మోత్తరే ప్రథమఖండే రాక్షస పాతాళ ప్రవేశ వర్ణనం నామ అష్టాదశోత్తర ద్విశత తమోఽధ్యాయః.

నారాయణుడనియె. రాజా! అగస్త్యుడిట్లుచెప్పివెళ్ళెను. కావున నీవు యుద్ధముసేయుట నాయభిమతముగాదు. రాఘవుడుత్సాహ శక్తి మంత్రశక్తియుం ప్రభుశక్తియుంగల్గియున్నాడు. ఆపైని దేవశక్తియుంగలవాడు. తెలిసినవాడు సులభసాధ్యములయిన పనులందు విగ్రహము (పేచీ) నెవ్వడు కొనితెచ్చుకొనును. కేవల కోపముచే తగవులాట రాజదోషప్రదము. కామక్రోధములంగెలిచినవా డాత్మను (మనస్సును) గెలిచినవాడే. ఆత్మవిజయముచేసినవాడే యెల్లవసుమతిం నెల్లజయించును. చిత్తముం గెలువనివానికి శత్రుచక్ర జయ మెక్కడిది? విజితేంద్రియుడుగానివాడు చక్రజయము (రాజ్యచక్రముం) సేయలేడు. బలవంతుడైన నెవ్వని బరాభవింపరాదు. అందు వలన నందరిచేత దాను బహుమానితుడగును(గౌరవింపబడును)లోకమందు శక్తిమంతులను మించిన శక్తిమంతులు గనబడుదురుగదా! తమ శక్తికి దగినట్లు చేయనెంతురు. శక్తికి దగినట్లు సేయుదురు. జ్ఞానము తెలిసిన వాండ్రెవ్వరి నవమానము చేయనెంచరు. శరీరము శోషింపజేయు కరకుముండ్లివిరెండు. నిర్ధనుడై కోరికలు గోరువాడు అసమర్థుడై క్రోధమూనువాను (అప్రయోజ కునికి అహంకారమెక్కువయని లోకములో వాడుక) స్వర్గముపై నుండువారీయిద్దరు. ప్రభువై క్షమ (ఓరిమి) గలవాడు దరిద్రుడై

దానగుణముగలవాడు. వాడు నిజముగనే యోడిపోయియున్న దుర్బలునిపై నెవ్వడు కినుకనూపును? అట్లే తనకు ప్రాణాంతకముగా నున్న ప్రబలుపై నెవ్వడు కోపముంజూపును? ఎదుటివాని క్రోధము పోగొట్టువానికోపము తేజస్విత్వము (ప్రతాపము) అనిపించు కొనును. కావున బుధులు (తెలిసినవారు పండితులు) కోపించి కోపమునుగెలిచిరి. నరకద్వారము ఆత్మనాశకము. అది మూడు విధములు. కామము క్రోధము లోభము ననునీ మూడును. కావున దీనిందప్పికొని తిరుగవలయును. కర్మానుబంధమును కర్మ విపాకమును జక్కగ గనిపెట్టి తన ఉత్థానమును (ఉన్నత దశను) గూడ నెరిగి యాపైని పని నారంభింపవలెను. ఇప్పుడు రాజ్యము చేజిక్కినది మనకేమని ప్రవర్తింపరాదు. ఎగిరిపడరాదు. అట్టి యెగిరిపాటు ముదిమి ముచ్చటమైన రూపును చెరచినట్లు శ్రీని (సంపదను) జెరచును. రాజా! పల్లెపట్టు విడచి లేదా జనప్రదేశమువిడిచి హిమాచలమునకుం జనుము. ముల్లోకముల లోకములకు రావణుని (ఏడ్పించువానిని) చంపి లంకనువిడిచి కైలాసముంజేరిన ధనాధ్యక్షుని కుబేరునింజూడుము. ఆ రావణుడో రాఘవబాణములగూలి సంపదనుబాసి విపన్నుడైనాడు. నేటికినికుబేరుడు విశాలకీర్తియై నిశాచరుల (రాక్షసుల) రాజ్యమునేలుచున్నాడు.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తరమహాపురాణము ప్రథమఖండమున రాక్షసపాతాళవర్ణనమను రెండువందలపదునెనిమిదవ అధ్యాయము.

## రెండువందల పందొమ్మిదవ అధ్యాయము - కుబేరాఖ్యానము

శైలూషః: కథం వైశ్రవణే దత్తా పురాలంకా ద్విజోత్తమ! । కథం చాప హృతా తస్య రావణేన మహాత్మనా । 1
చరితం రావణస్యాహం శ్రోతు మిచ్ఛామి తత్త్వతః । త్రైలోక్యం విజితం యేన తపసా పౌరుషేణ చ ॥ 2
నాడాయనః: బ్రహ్మణో మానసః పుత్రః పులస్త్యో విదిత స్తథా । తస్యా సీ ద్విశ్రవా నామ పుత్ర స్త్రైలోక్య విశ్రుతః ॥ 3
పౌత్రీ బృహస్పతేః పత్నీ భరద్వాజసుతా శుభా । బభూవ తస్య రాజేంద్రః నామ్నా వై దేవ వర్ణినీ ॥ 4
తస్యాం స జనయా మాస పుత్రం వైశ్రవణం ప్రభుమ్ । ఆరాధిత స్సుతపసా ప్రాదా త్తస్య పితామహః ॥ 5
యక్షేశత్వం ధనేశత్వం లోక పాలత్వ మేవ చ । పుష్పకం చ తథా యానం కామగం కామరూపిణమ్ ॥ 6
పుత్రం లబ్ధవరం రాజన్! విశ్రవా అభ్యభాషత । త్రికూటే పర్వత శ్రేష్ఠే నిర్మితా విశ్వ కర్మణా । 7
లంకా నామ పురీ రమ్యా దేవరాజ కృతే పురా । హృత్వా తాం దేవరాజస్య సుకేశ తనయైః పురా ॥ 8
అయాసితా మహారాజ! తేషాం జ్యేష్ఠం తు మాలినమ్ । నిపాత్య వాసుదేవేన తేతు విద్రావితా స్తతః ॥ 9
పాతాల తల మాశ్రిత్య తే వసన్తీహ నిర్భయాః ॥ 10
తాం త్వం లంకాం సమాసాద్య వసయక్ష సమన్వితః । ధర్మేణ పాలయన్ రాజ్యం సతతం రాక్షసేశ్వర । 11
ధర్మే తే దీయతాం బుద్ధిః సర్వావస్థస్య సర్వదా । ధర్మా దర్థశ్చ కామశ్చ ధర్మమూల మిదం జగత్ ॥ 12
శ్రుత్వా పితు ర్వాక్య మదీన సత్త్వో లంకాం సమాసాద్య ధనాధి నాథః ।
ధర్మేణ లోకం సతు రంజయానః చకార రాజ్యం క్షణదా చరాణామ్ ॥ 13

ఇతి శ్రీ విష్ణుధర్మోత్తరే ప్రథమఖండే శైలూషం ప్రతి నాడాయనాను శాసనే లంకా కథాయాం వైశ్రవణాఖ్యాన వర్ణనం నామ ఏకోన వింశ త్యుత్తర ద్విశత తమోఽధ్యాయః.

శైలూషుడు ఓవిప్రోత్తమ! కుబేరుని మున్నులంకకెట్లీయబడెను. అది రావణునిచే నెట్లపహరింపబడెను? రావణుని కథ యథార్థము నేను వినవలయును. అతడు తపస్సుచే పౌరుషముచే ముల్లోకములు గెలిచినవాడుగదా! యన నాడాయనుడిట్లు చెప్ప దొడంగెను. బ్రహ్మమానస పుత్రుడు పులస్త్యుడన ప్రసిద్ధుడు. వానికొడుకు విశ్రవసుడు. త్రిజగత్ప్రసిద్ధుడు. వాని పౌత్రి (కొడుకు కుమారుల కూతురు) భరద్వాజునికూతురు దేవవర్ణినియను పేరిది యావిశ్రవసుని భార్య. ఆమె యందాతడు వైశ్రవణుడను ప్రభువు

గనెను. అతడు తపసుచేనారాధింప పితామహుడు బ్రహ్మ యక్షాధిపత్యము ధనాధిపత్యము లోకపాలకత్వమును నొసంగెను. కామరూపము కామగమునైన పుష్పకమను యానముంగూడయిచ్చెను. అట్లు వరలాభమొందిన కొడుకుంగని విశ్రవసుడు త్రికూట పర్వతరాజమందు విశ్వకర్మ యింద్రునికై నిర్మించిన రమ్యమైన లంకాపురిగలదు. ఇంద్రుని యాపురము దానిని సుకేశ తనయుతో గూడనరిగి హరింపబడికష్టాలపాలు సేయబడినది. వారిలో జ్యేష్ఠుడగు మాలిని విష్ణువుచే గూలనేయించెను. అవ్వల దరుమబడిన యా రాక్షసులు పాతాళమందు నిర్భయులైయున్నారు నీవాలంకకేగి యక్షులతో యటవసింపుము. రాజ్యమును సధర్మముగ బాలింపుము. ఏయవస్థలో నున్నను నీయొక్క బుద్ధినేవేళ నైన ధర్మమునందుంపుము. ధర్మమువలన అర్థము కామముగల్గును. ఈ జగము ధర్మమూలము. తండ్రిమాటవిని ధనాధినాథుడు లంకంజేరి ధర్మముచే లోకమును రంజింపజేయుచు రాక్షసులరాజ్యమునుపాలించెను.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమ ఖండమున
లంక కథయందు కుబేరాఖ్యానమను రెండువందల పందొమ్మిదవ యధ్యాయము.

## రెండువందలఇరువదియవ అధ్యాయము - రావణవరప్రాప్తి

నాడాయనః : ఏతస్మిన్నేవ కాలేతు సుమాలీ వసుధా తలమ్ । చచా రాదాయ తనయాం కైకసీం నామ నామతః ॥ 1
చరన్ స వసుధాంస్ఫీతాం దదర్శాథ నరాధిపమ్ । పుష్పకం యాన మారూఢం శ్రియా పరమ యా యుతమ్ ॥ 2
తం దృష్ట్వా కైకసీం వాక్యం చోవాచ రజనీ చరః । పుత్రి! ప్రదాన కాలస్తే న కశ్చిత్త్వాం వృణోతి మామ్ ॥ 3
అప్రార్థిత ప్రదానం చ ధర్షణా భయ శంకయా । న కరోమి విశాలాక్షి! తవార్థం వరవర్ణిని ! 4
కష్టం కన్యా పితృత్వం హి నరాణాం మాన కాంక్షిణామ్ । ధ్రువం కన్యా పితృత్వం హి శక్రస్యాపి ప్రధర్షణమ్ ॥ 5
మాతుఃకులం పితృకులం యత్ర కన్యా ప్రదీయతే । కులత్రయం సంశయితం కన్యాం కృత్వేహ తిష్ఠతి ॥ 6
తేనాఽహం త్వాం న దాస్యామి సా త్వం గచ్ఛ స్వయంశుభే ! । భర్తారం వరయస్వాఽఽశు మునిం విశ్రవసం విభుమ్ ॥
యత స్సోఽయం ధనాధ్యక్షః శ్రియా పరమయా యుతః । తాదృశం తనయం తస్మా జ్జన యిష్యసి భామిని ! 8

నాడాయనుడనియె. ఇదేకాలమున సుమాలి కైకసియను తనకూతురింగొని భూమండలమెల్ల దిరిగెను. అప్పుడు పుష్పక విమానమెక్కి పరశోభతో దీపించు నరపతింగాంచెను. అతనింజూచి కైకసితో అమ్మాయీ! నీకు కన్యాదాన సమయము వచ్చినది. నిన్నిమ్మని నన్నెవ్వడుం గోరుటలేదు. కోరనివానికిచ్చుటవలన నేదేని ఘర్షణ (వివాద) లేదా ధర్షణ కాదనియనునేమోయను భయము వలననేను నోవిశాలనయన! నిన్నెవ్వరికి నీయజాలకున్నాను. అభిమానధనులకు (మానకాంక్షులకు) కన్యాపితృత్వము (ఆడపిల్లకు తండ్రియగుట) కష్టమైనది. అది దేవేంద్రునికైనను జుగుప్సగూర్చునదే. తల్లివంక తండ్రివంక వారినిదానమిచ్చిన (మెట్టిన) యింటివారు ముగ్గురి కులములను కన్య సంశయగ్రస్తులనుజేసి యిట నిలుపబడును. ఆమెనిచ్చినచోటు సరియైనదిగాదేని యందువల్ల ననేక దుస్సంఘటనలామెలో నేర్పడి యామె వెనుకనున్న పుట్టింటి యిరువంకలవారి ప్రతిష్ఠ మంచిదా చెడ్డదాయను సందేహమునకు గురిచేయునన్నమాట. అందుచే నేను నిన్నెవ్వరికి నీయకూరుకొనుచున్నాను. కావున నీవు కల్యాణి! నీయంత నీకనువైన భర్తను వరింపుము. అందులకు త్వరగా నీవు విశ్రవస ప్రభువను ముని నాశ్రయింపుము. ఇతడు ధనపతి పరమశ్రీసంపన్నుడు కావున నదే లక్షణములుగల తనయుని గనగలడు. అని పలికెను.

జగామ కైకసీ రాజన్! తతో విశ్రవసం మునిమ్ । రౌద్రే ముహూర్తే సంప్రాప్తే సంధ్యాయాం నృప సత్తమ! 9
సాఽభి వంద్య తతః పాదౌ తస్య విశ్రవసో మునేః । బభూవ పురత స్తస్వీ వ్రీడ మానేవ లజ్జయా ॥ 10
ఉవాచ తాం మునిః ప్రహ్వాం కైకసీం చారు హాసినీమ్ । విజ్ఞాత స్త్వదభిప్రాయో మయాఽద్య వరవర్ణిని ! 11

పుత్రార్థం త్వమనుప్రాప్తా మత్సమీప మనిన్దితే ! రౌద్రే కాలే యథాప్రాప్తా తా దృశం జనయిష్యసి ॥ 12
ఏవ ముక్త్వా త్యథోక్తా సా తత్రోవాస సుఖం తదా । తతః కాలేన సాపుత్రం జనయామాస భామినీ ॥ 13
దశాస్యం వింశతి భుజం ఏక దేహం మహాబలమ్ । నామ యస్య పితా చక్రే దశగ్రీవేతి బుద్ధిమాన్ ॥ 14
తతో ద్వితీయం తనయం మహాకాయం సుషావ సా । కుంభకర్ణేతి తస్యాపి నామ చక్రే తదా పితా ॥ 15
తత్ర శూర్పణఖాం కన్యాం జనయామాస సా తదా । తతః కదాచి త్సా పుత్రం కైకసీ జ్యేష్ఠ మబ్రవీత్ ॥ 16
దర్శయన్తీ ధనాధ్యక్షం స్వప్రీడేవ పరం తప । పశ్య స్వీయాగ్రజస్యాస్య శ్రియం భ్రాతుర్దశానన ! 17
సత్వం యత్న మథాస్థాయ భవ వైశ్రవణోపమః । ఏవముక్తస్తు గోకర్ణం ప్రయయౌ భ్రాతృభి స్సహ ॥ 18
శీర్ణపర్ణాశన స్తత్ర చకార సుమహ త్తపః । పూర్ణేవర్ష సహస్రే తు శిరశ్ఛిత్వా దశాననః ॥ 19
జుహా వాగ్నౌ మహాభాగ ! ఏకైకం తపసా కృశః । గ్రీష్మే పంచ తపా భూత్వా వర్షాస్వాకాశ శాయికః ॥ 20
ఆర్ద్రవాసాశ్చ శిశిరే కుంభకర్ణోఽ వ్యత వ్యత । విభీషణ స్తతఃకాలే షష్ఠేషష్ఠే ఫలాశనః ॥ 21
పరిచర్యాం తదా తేషాం చక్రేశూర్పణఖా స్వసా । దశవర్ష సహస్రాంతే తదా కాలే దశాననః ॥ 22
దశమం మస్తకం వహ్నౌ జుహూషతి యదా ప్రభో! । తతస్తం దేశమాగమ్య బ్రహ్మావచన మబ్రవీత్ ॥ 23

కైకసియామీదట విశ్రవసుని సమీపించెను. ఆమెయేగిన సమయము రౌద్రముహూర్తము. సంధ్యాసమయము. విశ్రవసముని పాదములకు మ్రొక్కి సిగ్గుతో దలవంచి యాయెదుట నిలువబడెను. అమ్మని వినయవినమ్రురాలైన కైకసిం జిరునవ్వు నెమ్మోముదానిం జూచి, చూడగనే నాకు నీతలపవగాహనమైనది. ఓసుందరి ! నాకొడుకునకై నాదరికి నీవు వచ్చితివి ఇది రౌద్రకాలము. ఇందువచ్చితివిగావు ఆలాటి కొడుకునే రౌద్రమూర్తిని నీవు గందువు. సరే ! ఇట్లేయగుంగాకయన నామె యక్కడ సుఖముగా నివసించెను. అవలగొంతకాలమున కామె కొడుకుంగనెను. వాడు పదిమొగములవాడు. ఇరువది భుజములు ఒకటేదేహము పెద్దబలముగలవాడు. తండ్రిబుద్ధిమంతుడు వానికి దశగ్రీవుడను పేరుపెట్టెను. అవ్వల నామెరెండవ కొడుకును పెద్దశరీరము గలవానిని బ్రసవించెను. తండ్రివానికి కుంభకర్ణుడను పేరుపెట్టెను. అక్కడ నామె శూర్పణఖయను నాడుశిశువుంగనెను. అటుపై నొకతఱినామె పెద్దకొడుకుంగని కుబేరుని జూపి సిగ్గుపడినట్లై దశానన! చూడు మీయన్న యీతని సంపదను గనర! నీవును యత్నము గొని వైశ్రవణుని వంటివాడవగుమనియె. ఇట్లేయగుగాక! యని తమ్ములతో దశముఖుడు గోకర్ణమునకేగెను. అక్కడ రాలిన యాకులందిని గొప్పతపస్సుచేసెను. వేయేండ్లుముగియదనతలనతికి యగ్నియందువేల్చెను. ఇట్లొక్కొక్కటిగ తపఃకృశుడై హోమము సేసెను. గ్రీష్మమందు పంచాగ్నిమధ్యమందుండి వర్షర్తువులం దారుబయట శయనించుచు, శిశిరర్తువునందడి బట్టలతో దపము చేసెను. కుంభకర్ణుడు నదేతీరుసతపించెను. కుంభకర్ణుడును నారుమాసముల కొకమారు పండ్లుతినుచు తపముగావించెను. వారికి చెల్లెలు శూర్పణఖ పరిచర్యగావించెను. పదివేలేండ్ల చివర దశాననుడు దశమశిరస్సునగ్నియందువేల్చెను. అంతబ్రహ్మ యచ్చోటికేతెంచి యిటుపలికెను.

బ్రహ్మ : వరం వరయః భద్రంతే పరితుష్టోఽస్మి పుత్రకః । తపసా తేసుతప్తేన సత్త్వేన విపులేనచ ॥ 24
నాడాయనః : దేవాదీని సభూతాని కీర్తయామాస రాక్షసః । సర్వాణ్యేవా విశేషేణ వర్జయిత్వాతు మానుషమ్ ॥ 25
సంకీర్త్య తేభ్యోఽవధ్యత్వం వరయామాస భూమిపః । త్రైలోక్య విషయం చైవ తచ్చతస్య దదౌ ప్రభుః ॥ 26
ఛన్దయిత్వా వరేణాఽథ దశగ్రీవం నిశాచరమ్ । న్యస్య సరస్వతీం వక్త్రే కుంభకర్ణం స రాక్షసమ్ ॥ 27
వరేణ ఛందయామాస తదాగత్య విభీషణమ్ । సవవ్రే నిత్యకాలంతు మతిం ధర్మేసనాతనీమ్ ॥ 28
తేన తస్య తదా తుష్టః త్వమరత్వం దదౌ ప్రభుః । వరేణ ఛందయిత్వా తాన్ బ్రహ్మాస్వభవనం గతః ॥ 29

నీకు భద్రంబగుగాక! వరముకోరుము. పుత్రక! నీతపస్సుచే నీ విపుల సత్త్వముచే నేను పరితుష్టుడనైతిననియె. అప్పుడా రాక్షసుడు మనుష్యనొక్కని విడిచిదేవాది సర్వభూతములను బేర్కొని వారివలన నవధ్యుడనగు వరము గానలయుననియె. వానికి ప్రభువావరమిచ్చి త్రైలోక్య విజయమునుగూడ వరముగనొసంగెను ఇట్లురావణుని వరముచే ఛందింపజేసి (స్వచ్ఛందముగా నడుగజేసియన్నమాట) సరస్వతిని వానిమోముననిలిపి కుంభకర్ణరాక్షసుని వరముకోరుమని విభీషణునట్లేకోరుమనియె. అతడు నిత్యము తనబుద్ధి ధర్మమునందుండగోరెను. దాన విధాత సంతోషించి యతని కమరత్వము గూడ యొసగెను అవ్వల బ్రహ్మ తనభవనమున కేగెను.

వరల బ్ధం దశగ్రీవం జ్ఞాత్వా రక్షోగణ స్తథా । పాతాలాత్తు వినిష్క్రమ్య మహారాజ్యేఽ భ్యషేచయత్ ॥ 30
సతు రాజ్యం తదా లబ్ధ్వా ప్రేషయామాస రాక్షసాన్ । కుబేరాయ తదాదూతం ప్రహ స్తం నామ నామతః ॥ 31
రాక్షసానా మధీ వాసో లంకేయం నిర్మితా పురా । తాం త్యజ త్వం ధనాధ్యక్ష ! సామ్నైవ మమ మా చిరమ్ ॥ 32
పహ స్త వచనం శ్రుత్వా ధనా ధ్యక్షో మహా మతిః । దశగ్రీవం వరోన్మ త్తం జ్ఞాత్వా తత్యాజ తాంపురీమ్ ॥ 33
కైలాసం పర్వతం గత్వా తదా చక్రే పురీం శుభామ్ । అలకాం నామ రాజేంద్ర ! యత్రాఽఽస్తే స సుఖీసదా ॥ 34
దశగ్రీవో మహారాజ ! త్రిలోక విజయం తథా । చక్రేలంకా మథా సాద్య వరదానాత్ స్వయంభువః॥ 35
మందోదరీం నామ భార్యాం తదా లేభే మయాత్మజామ్ । తస్యాం స జనయా మాస మేఘనాదం తథా సుతమ్ ॥ 36
త్రిలోక విజయీ శ్రీమాన్ దేవ బ్రాహ్మణ కంటకః । నిహత స్సతు కాలేన విష్ణునా నరరూపిణా ॥ 37
రాఘవేణ మహారాజ ! రామేణా క్లిష్ట కర్మణా । లంకాం త్యక్త్వా ధనాధ్యక్షః కైలాసే పర్వతోత్తమే । 38
అద్యాపి పాలయ న్నాస్తే రాజ్యం నిహత కంటకమ్।
తస్మా త్త్వమపి రాజేంద్ర ! త్యక్త్వా దేశ మిమం స్వయమ్ । హిమ వంత మథాసాద్య వస ! వైశ్రవణోపమః । 39
తస్మా న్న కార్యం భరతేన వైరం మహాబలాస్త్రా రఘవః ప్రతీతాః ।
ప్రసీద ! జీవన్తు సుపుత్ర పౌత్రాః పుత్రా స్త వేమే తుహినాద్రి సంస్థాః ॥ 40

ఇతి శ్రీ విష్ణు ధర్మోత్తరే ప్రథమాఖండే రావణ వర ప్రాప్తి వర్ణనం నామ
వింశత్యుత్తర ద్విశత తమోఽధ్యాయః.

రక్షోగణము వరలాభమందినట్లు దశకంఠునిందెలిసి పాతాళమునవెడలి రాక్షససామ్రాజ్యమందువాని నభిషేకించెను. అతడయ్యెడ రాజ్యముంబడసి కుబేరునికి ప్రహస్తుకు దూతగ ఈలంక రాక్షసుల నివాసముగ మున్ను నిర్మింపబడినది ఓధనాధ్యక్ష! దానిని మంచిగా నాకు వెంటనేవిడుము అని కబురంపెను. ప్రహస్తునిమాటవిని బుద్ధిశాలి ధనదుడు దశవదనుడు వరములచే వెఱ్ఱెత్తి యున్నట్లెరింగి యాలంకాపురిని వదలివేసెను కైలాసపురికేగి యక్కడ నొక్కని పురము నొనరించుకొనెను. అది అలకానగరము. అందతడెల్లపుడు సుఖియైవసించెను. మహారాజా! దశగ్రీవుడు త్రైలోక్య విజయము సేసి శ్రీమంతుడై దేవ బ్రాహ్మణకంటకు డయ్యెను. కాలక్రమమున నతడు మానవ రూపుడైన విష్ణువుచే గూలెను. వానింగూల్చిన విష్ణువు రాఘవుడు రామచంద్ర ప్రభువు. పుణ్యకర్ముడు. కుబేరుడు లంకనువిడిచి పర్వతరాజమగు కైలాసమందిప్పుడును నిష్కంటకమైన రాజ్యమును నేలుచున్నాడు. కావున నీవును నీప్రదేశమువిడిచి హిమవంతముంజేరి కుబేరునట్లట వసింపుము అందువలన నీవు భరతునితో వైరము పెట్టుకొనకుము రఘువులు మహాబలాస్త్రసంపన్నులని ప్రతీతులు (ప్రసిద్ధులు) ఈ నీకొడుకులు కొడుకులతో మనుమలతో తుహినాద్రియందు హాయిగ బ్రతుకుదురుగాక !

ఇది శ్రీ విష్ణుధర్మోత్తర మహాపురాణమున ప్రథమఖండమందు
రావణవరప్రాప్తి వర్ణనము రెండువందలయిరువదవ యధ్యాయము

## రెండువందల ఇరువదిఒకటవ అధ్యాయము-రావణత్రైలోక విజయము

శైలూషః : శ్రోతు మిచ్ఛా మ్యహం తస్య దశగ్రీవస్య రక్షసః । త్రిలోక విజయం బ్రహ్మన్ ! తత్రమే సంశయో మహాన్ ॥

నాడాయనః : వరప్రదానా త్సంమత్తో దశగ్రీవో నిశాచరః । దేవగంధర్వ దైత్యానాం నాగేంద్రోరగ రక్షసామ్ ॥ 2

ఆక్రమ్యాక్రమ్య రత్నాని స జహార తదా బలాత్ । పత్న్యశ్చ రాజ శార్దూల ! తదా మహితర స్త్వథా ॥ 3

నరేంద్రాన్ ధర్మ సంయుక్తాన్ బ్రాహ్మణాంశ్చ జిఘాంసతి , అయోధ్యా వాసినం వీర మనరణ్యం చ జఘ్నివాన్ ॥ 4

సంగ్రామే నిహత స్తేన దశగ్రీవం స శప్తవాన్ । ఉత్పత్స్యతికులే నీచ పురుషో మమ వీర్యవాన్ ॥ 5

య స్తవాదాస్యతి ప్రాణాన్ సమరే సమరప్రియః యుయుధే చ తథా రాజ్ఞా మాంధాత్రా రణశాలినా ॥ 6

తత్రైనం వారయామాస నారదో మునిసత్తమః । మయూరస్య తతో యజ్ఞే భక్షయామాస వై ద్విజాన్ ॥ 7

ఇంద్రో మయూరరూపేణ తస్మాద్యజ్ఞా దపాక్రమత్ । మయూరస్య వరం ప్రాదాత్ మేఘే వర్షతి సర్వదా ॥ 8

గమిష్య స్యతులాం ప్రీతిం మమ నేత్ర గణాకృతిమ్ । ధారయిష్యసి లోకేఽస్మిన్ కలాపం సుమనోహరమ్ ॥ 9

కృకలాసస్య రూపేణ ధనాధ్యక్షోఽ ప్యపాక్రమత్ ।వర్ణం తస్య సువర్ణాభం సద్రవ్యం చ తథా శిరః ॥ 10

ప్రాదా ద్వర మమే యాత్మా రాజరాజోపి దానవ ! వరుణశ్చ తదా రాజన్ ! హంసరూపేణ నిర్గతః ॥ 11

హంసస్య చ వరం ప్రాదాత్ తోయే రతి మవాప్స్యసి । వర్ణత శ్చంద్రర శ్మ్యాభో భవిష్యసి తథైవ చ ॥ 12

యమో వాయస రూపేణ తస్మా ద్యజ్ఞా దపాక్రమత్ । వాయసస్య వరం ప్రాదాత్ అమరత్వం వినా వధాత్ ॥ 13

యుష్మ ద్దత్తేన చాన్నేన ఘోరామ ద్విషయే స్థితాః । పరాం తృప్తిం గమిష్యన్తి తదా పుణ్యేన యోక్ష్యసే ॥ 14

వక్ష్యధ్వం బలిదాతౄణాం దిగ్దేశ గత చేష్టితైః । శుభాఽశుభం మనుష్యాణాం తత్రాతిథ్యం భవిష్యతి ॥ 15

వజ్ర తుండాశ్చ యే కాకాః ఘోరా మద్విషయే స్థితాః । బలి పిండాశ్చ దాతౄణాం భవిష్యన్తి తత శ్శివమ్ ॥ 16

శైలూషుడు దశకంఠరాక్షసుని త్రిలోకవిజయ వృత్తాంతము వినవలయునన నాడాయనుడు వచింపనొడగెను. వరప్రదానముచే మదించి దేవ గంధర్వ దైత్య నాగేంద్రోరగ రక్షస్సులయొక్క రత్నములను (ఏయేజాతులందేవి శ్రేష్ఠవస్తువులో వానిని) బలిమై పలుమారులు పైకొని పైకొని లాగికొనెను. వారి పెండ్లాలను చక్కనివారిం గూతుళ్లను గాజేసెను. ధర్మరతులయిన నరేంద్రులను బ్రాహ్మణులను హింసించెను. అయోధ్యావాసియైన వీరుని అనరణ్యునింజంపెను. అతడు నాకులమందు వీర్యవంతుడు పురుషుడుదయింపగలడు. ఓరి నీచుడా! సమరప్రియ! అతడు నీప్రాణములను లాగికొనగలడు. అట్లే యారాక్షసరాజు రణదక్షుడైన మాంధాతతో బోరెను. అక్కడ నారదుడు వీనిని వారించెను. మయూరుని (మరుత్తునియని పాఠాంతరము) యజ్ఞమందు ద్విజులను దినివేసెను. ఇంద్రుడు నెమలిరూపున నాయజ్ఞమునుండి పారెను. అప్పుడతడు నెమలికి మేఘమువర్షించునపుడు నసామాన్య ప్రీతి నందెదవు. నాకన్నులు వేయింటి యాకారముగల మిగుల చక్కని పింఛెముంబూనెదవను వరమిచ్చెను. తొండరూపున ధనపతి పారిపోయెను. ఆతొండకు బంగారు రంగుగల రూపమును దలనొసంగెను. వరుణుడుహంసరూపుగొని వెడలెను. అందుచేహంసకు నీటిపై నపేక్ష వరమిచ్చెను మఱియు చంద్రకిరణములట్లు తెల్లగా నుండగలవనియె. యముడు కాకిరూపుగొని యాయజ్ఞమునుండి పారెను ఎవరును జంపనంతవరకు నీవమరమై యుందువు (చావవని) వరమిచ్చెను. నీకు బెట్టినయన్నముచే నాదేశమందున్న ఘోరపాపులు జీవులు పరమ తృప్తినందుదురు. అప్పుడు నీవు పుణ్యముం బొందెదవు. నీవు నీకు బలిపెట్టు మానవులకు ఆయా దిక్కునందాయా ప్రదేశమందు నీచేసిన చేష్టలంబట్టి శుభాశుభముల నెరింగింతువు. అందుచేత నీకక్కడ నాతిథ్యమీయబడును. నాలోకమందు వజ్రతుండములతి ఘోరములు గలవవి బలిపిండములు బలియిచ్చిన పిండములు దినునవి కాగలవు. అందువలన పిండదాతలకు శుభము గల్గును.

మరుత్త యజ్ఞే విత్రాసం జనయిత్వా దివౌకసామ్ । బభ్రామ వసుధాం రాజా రాక్షసానాం ప్రతాప వాన్ ॥ 17
దదర్శ స తదా కన్యాం తపస్యన్తీం మహత్తపః । రూపేణాప్రతిమాంలోకే యౌవనే ప్రథమే స్థితామ్ ॥ 18
దశగ్రీవః స పప్రచ్ఛ తాం కన్యాం లోక సుందరీమ్ । కాత్వం కి మర్థం సుశ్రోణి! చాస్థితా యౌవనే తపః ॥ 19
శ్రుత్వా తస్య తు సా కన్యా సత్యం వచన మబ్రవీత్ । బృహస్పతి సుతో విద్వాన్ పితా మమ కుశధ్వజః ॥ 20
వేదాభ్యాస ప్రవృత్తస్య తస్యాహం నృప బాంధవా । సుతాఽ పరా సముత్పన్నా తత్పత్న్యా విదితా తథా ॥ 21
నామ్నా వేదవతీ త్యేవం ఖ్యాతా లోకేషు రాక్షస! విష్ణో ర్మయే యం దా తవ్యా తస్యాసీన్మే పితుర్మతిః ॥ 22
మద్యాచనా నిరస్తేన దైత్య నాథేన శంభునా । పితా మమ హతో రాత్రౌ త మాలింగ్య విభావసుమ్ ॥ 23
ప్రవిష్టా జనయిత్రీ మే యథాఽహం విధృతా చిరమ్ । స్వర్గస్థస్య పితుః కామం సాహం సత్య మభీప్సతీ ॥ 24
ఆరాధయామి తపసా పత్యర్థం మధుసూదనమ్ । తతస్తా మబ్రవీ ద్రక్షో మా త్వం క్లేశే మతిం కృథాః ॥ 25
భవస్వ! మే వరారోహే! భార్యా త్రైలోక్య సుందరీ । రూపస్య వయస శ్చైవ నాఽనురూపం తప స్తవ ॥ 26
త్వాం కృత్వోపరతో మన్యే రూపం కృత్వా స విశ్వకృత్ । న హి రూపోపమా త్వన్యా తథాఽస్తి సదృశీ యతః ॥ 27
సంపూర్ణ కాంతిమ త్సౌమ్యం వదనం తే వరాననే! సకలంకేన చంద్రేణ కథ మౌపమ్య మర్హతి ॥ 28
భవ! భూషణజాతానాం భూషణం త్వం శుచిస్మితే! వృణుష్వ! మాం వరారోహే! పతిత్వే వర వర్ణిని! 29

రావణుడు మరుతుని యజ్ఞమందు దేవతలకు పెనుభీతి పుట్టించి ప్రతాపశీలి యతిడెల్ల మేదినిపై స్వేచ్ఛా విహారముసేసెను. అప్పుడు మహా తపస్సుచేయుచున్న అప్రతిమాన సౌందర్యవతి నొక్కకన్యం దొలిజవ్వన మందున్న దానిం జూచెను. దశగ్రీవు డామెను నీవెవ్వతవు లేఁజవ్వనమున నెందులకు దపమూనితివి. అని యడుగ నాలోకసుందరి విని నిజముం బలికెను. మాతండ్రి బృహస్పతి కొడుకు కుశధ్వజుడు. తెలిసినవాడు వేదాభ్యాసముసేయు నతనికి రాజబంధువు నింకొక కూతురనై పుట్టితిని. ఆయన భార్య నన్నాయన కూతురునని గ్రహింపబడితిని. వేదవతియనుపేరనేను లోకములందు ప్రఖ్యాతిగంటిని. ఈమె విష్ణువున కీయదగినదను నూహ మాతండ్రికి గల్గినది. నన్నడిగి కాదనిపించుకొన్న దైత్యపతి శంభుడనువానిచే మాతండ్రి యొకరేయిం జంపబడెను. ఆయనం గౌగలించి నన్ను బెంచినమా తల్లి యగ్ని ప్రవేశము సేసినది (సహగమనము సేసినది) ఆ నేను స్వర్గస్థుడైన మాతండ్రి కోరికను నిజము నొనరింప గోరుచు తపస్సుచే మధుసూదనుని పతియగుట కారాధించుచున్నాను. అంతట నారక్షస్సు వలదు వలదు నీవీ క్లేశమునందు మనసుంపకు త్రైలోక్య సుందరి వీవు నాకు భార్యవగుము. నీరూపమునకు నీయీడునకు (లేజవ్వనమునకు) తపస్సు నీకనురూపము గాదు. నిన్ను జేసి విశ్వకర్త మేటిరూపము సేయుటను విరమించినాడని యెంతును. నీపోలికరూపుగలది మరియొకతె యికలేనందున నాకీయూహగల్గినది. ఓవరానన! నీముఖము సువర్ణకాంతి మంతము సౌమ్యము. కలంకముతోనున్న చంద్రునితోడి సామ్యమున కని యెట్లు తగును? తెలినవ్వులదాన! నాభూషణము లయిన యందటికి నీవు భూషణమవగుము. ఓవరవర్ణిని! వరారోహా! నన్ను పతిగా వరింపుము.

ఆక్రమ్యాక్రమ్య లోకస్య ప్రధానాయా మయా హృతాః । స్త్రియః కురుష్వ! సర్వాసాం తాసాం స్వామ్య మనిందితే!
జటా మాలాఽజినధరీ త్వ మేవం రతి వర్ధినీ । న జానే మండనాం ప్రాప్య కథం భీరు! భవిష్యసి ॥ 31
రూపేణ వయసా లక్ష్మ్యా తథైవ గుణ సంపదా! విక్రమే మే వరారోహే! న సమో హి జనార్దనః ॥ 32
జన్మ తస్య న జానన్తి పరేభ్యో యే పరే జనాః । తేన త్వ మకులీనేన కిం కరిష్యసి సుందరి! 33
అనింద్రం లోక మిచ్ఛన్తీ సురాణాం హితకామ్యయా । హతాయేనాను వృత్రేన యోషి త్కావ్యారణిః పురా ॥ 34
పురాణా యే జగత్యస్మిన్ తేభ్యః పూర్వతరాశ్చయే । తేభ్యో ఽప్యతి పురాణం తం భర్తారం కథ మిచ్ఛసి? ॥ 35
బ్రహ్మణో వరదానేన యస్త్వవధ్యో దివౌకసామ్ । తే దైత్య నాథాః సబలా శ్ఛద్మనా తేన ఘాతితాః ॥ 36

అధ్యాపితౌ విశాలాక్షౌ దారకౌ ప్రియదర్శనౌ । ఆగాయతాం తతస్తౌతు రామయజ్ఞే కుమారకౌ ॥ 53
రామస్య చరితం కృత్స్నం రామస్య పురతః స్థితౌ । తస్మాత్కావ్యాత్తు విజ్ఞాయ పుత్రౌ తౌ ప్రియ దర్శనౌ ॥ 54
యజ్ఞే తాం చ తథాభూతామానయామాస సత్వరః । ఉవాచ చ వరారోహే ప్రత్యయం కురు మే శుభే ॥ 55
రామస్య వచనం శ్రుత్వా సీతా వచన మబ్రవీత్ । యథాఽహం రాఘవా దన్యం మనసాపి న కామయే ॥ 56
తేన సత్యేన మేదేవీ వివరం సంప్రయచ్ఛతు । ఏతస్మిన్నేవ కాలేతు భువం భిత్వా సముత్థితమ్ ॥ 57
ధృతం సింహాసనం నాగైః తత్రైనా ముపవేశయత్ । స్వయం వసుమతీ దేవీ పాతాలం సా తతో గతా ॥ 58
అవిచ్ఛిన్నేన పతతా పుష్పవర్షేణ పార్థివః తస్యాం భూమి ప్రవిష్టాయాం రాఘవం క్రోధ సంయుతమ్ ॥ 59

ఆమె నీచే శంకింపబడినదాన నేనగ్నిం బ్రవేశింతును. నీచావునకై యేనయోనిజనయ్యెదను. అని చితిపేర్చికొని జాతవేదుని యందు (వేదములకు జన్మస్థానమైన యగ్నియందు) బ్రవేశించెను. తిరిగి మహాత్ముడు జనకునకు సీతయై యవతరించెను. యజ్ఞభూమిని దున్నుచుండ నా సాధ్వి అయోనిజయై యవతరించెను. తపస్సుచేత రాముని సాక్షాద్విష్ణువును భర్తనుగా బొందెను. ఆమె నిమిత్తముననే రామునిచే రావణుడీల్గెను. అవ్వల దశకంఠునింట నున్నదని లోకాపవాదకు బెదరి రాముడు గర్భవతియైయున్న యా సీతామహాసాధ్విని వదలిపెట్టెను. వాల్మీకాశ్రమమందాతల్లి యిర్వురను బిడ్డలంగనెను. కుశుడు లవుడునను నాయిద్దరకు వాల్మీకి మహర్షి జాతకర్మాదులు నిర్వర్తించెను. ఆ మహాభాగు లామహర్షితో వేదాధ్యయనము సేవింపబడిరి. ఆ శిశువులాయనచేతనే ధనుర్వేదమందుగూడ పారంగతులు గావింపబడిరి. వాల్మీకి శుభదమైన రామచరితము (రామాయణము) చేసి యా విశాలనయనుల బాలురు పరమసుందరులను జదివించెను. అవ్వల నాపిల్లలు రామునియజ్ఞమందు రామునెదుటనిలచి సమగ్రముగ నా రామచరితముం బాడిరి. ఆ కావ్యమువలన రాముడా చక్కనివారు తనపుత్రులని యెరింగి యయ్యజ్ఞమందారీతినున్న యామెను (సీతను) సత్వరమ రావించెను. ఆరమణింగని కల్యాణి! నాకు ప్రత్యయము (నమ్మకమునువైన) శోధనంజేయమనెను. రాముని పలుకువిని సీత, నేను రాఘవుని కంచె నింకొకని మనసుచేతనైన కోరనిదాననేని యా నిజముచే నాకు దేవి (భూదేవి) వివరమును (సొరంగమును) ఇచ్చుగాక! అనెను. ఇదేసమయమున భూమింపగిలించుకొని మీదికివచ్చిన నాగులచే వహింపబడిన సింహాసనమందు వారిచే నామె యెక్కించుకొని వసుమతి స్వయముగా పాతాళమునకేగెను. అయ్యెడ నెడతెఱపిలేకుండ పూలవాన గురియుచుండ నా జగజ్జనని భూమిలో బ్రవేశింప కినుకతోనున్న రామచంద్రప్రభువును సర్వలోకవంద్యుడగు బ్రహ్మ సాంత్వనపఱచెను.

సాంత్వయామాస వై బ్రహ్మా సర్వలోక నమస్కృతః । రామోఽపి కృత్వా సౌవర్ణీం సీతాం పత్నీం యశస్వినీమ్ ॥ 60
ఈజే యజ్ఞై ర్బహువిధైః సహభ్రాతృభి రచ్యుతః । నాపద్భయం సవిధవా నచ వ్యాళకృతం భయమ్ ॥ 61
నచ వ్యాధి కృతం కించి ద్రామే రాజ్యం ప్రశాసతి । ఆ జాను బాహు ర్ధర్మాత్మా సింహస్కంధో నరేశ్వరః 62
పృథ్వీం ససాగరాం రామో ధర్మేణా న్వశిషత్ప్రభుః । దేవాశ్చ ఋషయశ్చైవ గంధర్వాప్సరసాం గణాః ॥ 63
యక్షా శ్చ భూతాని తథా కిం నరాశ్చైవ రాక్షసాః । మానుష్యాణాం దర్శనం తే సౌమ్యా స్సంతో యయు స్సదా ॥ 64
యదర్థమేషా చరతి గాథా లోకే పురాతనీ । ఆజానుబాహు సింహాస్యః కంబుగ్రీవో మహాబలః ॥ 65
సర్వభూత శరణ్యశ్చ విష్ణుర్మానుష్యతాం గతః । సత్యవా నన్నృశంసశ్చ జాతో భక్తజన ప్రియః ॥ 66
ధృతియుక్తో దయాశీలో ధర్మయుక్తో జితేంద్రియః । మితవాగపి కార్యేషు వక్తా వాచస్పతే స్సమః ॥ 67
వీర్యవా న్నచవీర్యేణ మహతా తేన విస్మితః । తేజసా భాస్కర సమః క్షమయా పృథివీసమః ॥ 68
మహేశ్వర సమః క్రోధే నీతా వుశనసా సమః । ఏవం సర్వేషు భూతేషు గుణై ర్దాశరథి ర్బభౌ ॥ 69
వర్ణానా మాశ్రమాణాంచ న సాంకర్యం నృపోత్తమే । ధర్మిష్ఠాశ్చ జనా స్సర్వే రామే రాజ్యం ప్రశాసతి ॥ 70
నిర్దస్యు రభవల్లోకో నానర్థః కించి దస్పృశత్ । నాకాల వర్షీ పర్జన్యః సర్వ సస్యధరా ధరా ।

జనానురాగశ్చ మహాన్ రామస్య విదితాత్మనః ॥ 71
న తే క్షమంతేన నరేంద్ర చంద్ర! వైరం మహాత్మా సతు లోక పూజ్యః ।
తస్యాఽస్త్ర వేగస్య రణేచ వేగం సోఢుం న శక్తాః త్రిదశాః స శక్రాః ॥ 72

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే రావణస్య భూలోక విజయ వర్ణనంనామ ఏకవింశత్యుత్తర ద్విశతతమోఽధ్యాయః.

రాముడు నవ్వల బంగారు సీతం గావించికొని తమ్ములతో బహువిధములగు యజ్ఞములాచరించెను. ఆ రామప్రభువు రాజ్యమందాపదృయము లేమ విధవలు లేరు. ఘాతుక మృగ భయము లేదు. రాముడు పాలించుచుండ వ్యాధిభయమించుకేని లేదు. ఆజానుబాహువు సింహస్కంధుడు ధర్మమూర్తి రామనరపాలుడు సర్వసముద్ర పర్యంతమైన పృథ్విని ధర్మముతో శాసించెను. దేవతలు ఋషులు గంధర్వాప్సరోగణములు యక్షులు భూతములు కిన్నరులు రాక్షసులు సౌమ్యులై ప్రసన్నమూర్తులై యయ్యెడ మానవులకు దర్శనమిచ్చిరి. తన్నిమిత్తముగనే లోకమందీ పురాతనగాథ వ్యాప్తికివచ్చినది ఆజానుబాహువు సింహముఖుడు కంబుకంఠుడు (శంఖమువోలిన కంఠముగలవాడు) మహాబలశాలి సర్వభూత శరణ్యుడు (దిక్కు) నై విష్ణువు మనుష్యావతారమెత్తినాడు. సత్యవంతుడు సర్వజనప్రసంశనీయుడు భక్తజన ప్రియుడు ధృతియుక్తుడు (ధైర్యశాలి) దయాశీలుడు ధర్మయుక్తుడు జితేంద్రియుడు మితభాషి కార్యములందు బృహస్పతింబోలినవక్త వీర్యవంతుడు తన వీర్యాతిశయమున దాను వింతపడడు. తేజస్సుచే భాస్కరునికి సముడు క్షమచే (ఓరిమిచే) భూదేవింబోలినవాడు. క్రోధమునందు మహేశ్వర సముడు నీతిలో శుక్రునికి సముడు ఇట్టి గుణములతో సర్వభూతములందును దాశరథి మిగుల తేజరిల్లెను. రాముడు నృపోత్తముడు పాలించుచుండ వర్ణముల కాశ్రమములకు సాంకర్యములేదు. సర్వజనులును ధర్మనిష్ఠులే. రాముడు రాజ్యమును శాసించుచుండ లోకము నిర్దస్యువయ్యెను. (దొంగలుబందిపోటులులేనిదయ్యెను) అనర్థము (కీడు) ఏకొంచెమెవ్వరినిస్పృశించదు. మేఘుడకాలమున వర్షింపడు. ధర సర్వసస్యధర. ఆత్మజ్ఞుడయిన రామునియెడ జనానురాగ మింతింతగాదు. ఆయనతో నో నరేంద్రచంద్ర! మహాత్మునితో నీకు వైరము తగదు. అతడు లోక పూజ్యుడు. ఇంద్రునితోనెల్ల దేవతలు ననిలో నాతని యస్త్ర వేగముయొక్క వేగము నోర్వలేరు.

ఇది శ్రీవిష్ణు ధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున
శైలూషుని గూర్చి నాడాయనుడు చెప్పిన రావణ భూలోకవిజయమను రెండువందల యిరువదియొక్క యధ్యాయము.

## రెండువందలఇరువదిరెండవ అధ్యాయము - స్వర్గవిజయము

శైలూషః : వహ్నిం ప్రవిష్టాం సంప్రేక్ష్య తదా వేదవతీం ద్విజ ! కిం చకార మహాతేజాః దశగ్రీవః ప్రతాపవాన్ ॥ 1
నాడాయనః : జగామ స తదా లంకాం పూజ్యమానో నిశాచరైః ।
తత్రస్థం ప్రేరయామాస దూతం ధనపతిః స్వయమ్ ॥ 2
అకార్యా ద్విని వర్తస్వ సురైస్తే చింత్యతే వధః । దూతస్య వచనం శ్రుత్వా దూతం హత్వా నిశాచరః ॥ 3
గత్వా విజిగ్యే ధనదం విజహారాస్య పుష్పకమ్ । పుష్పకేన విమానేన కైలాసంస తదా యయౌ ॥ 4
పుష్పకస్య గతిం రుద్ధాం తత్ర వీక్ష్య నిశాచరః । దదర్శ శైల శృంగస్థం నందినం వానరాకృతిమ్ ॥ 5
తం దృష్ట్వా ముముచే హాసం నందీ తం శప్తవాం స్తతః । గిరా వశ్మిన్ దశగ్రీవ స్స్వయం క్రీడతి శంకరః ॥ 6
విమానేన యదా తస్య సమీప ముపయాస్యసి । కరోషి చా పహాస్యం మాం తస్మా చ్ఛప్స్యామ్యహం తవ ॥ 7
మద్వక్త్ర సదృశా ఘోరాః పులహస్య ప్రజాపతేః । ఉత్పత్స్యన్తి కులే భీమాః క్షయార్థం వానరా స్తవ ॥ 8
శ్రుత్వైవం నందినో వాక్యం స కైలాసం త్రిలోచనమ్ । నేతు కామ స్తదా లంకాం భుజాన్ చిక్షేప పర్వతే ॥ 9

పౌలస్త్య భుజ సంక్షుబ్ధ కైలాస చలితాసనా । జగ్రాహ నిర్భరం కంఠే తదోమా త్రిపురాన్తకమ్ ॥ 10
తతో గర్జన్ మహాదేవో దేవానాం ప్రవరో హరః । పాదాంగుష్ఠేన తం శైలం పీడయామాస లీలయా ॥ 11
రక్షసా తేన రోషాచ్చ భుజానాం రుజయా తథా । ముక్తో విరావః సుమహాన్ త్రైలోక్యం యేన రావితమ్ ॥ 12
మేనిరే వక్త్రనిష్పేషం తస్యా మాత్యా యుగక్షయమ్ । ఆసనేభ్యః ప్రచలితా దేవాః శక్రపురోగమాః ॥ 13
తేన శబ్దేన విత్రస్తా సుతరాం పర్వతాత్మజా । హరస్యాలింగనం చక్రే భయ లోలేక్షణా భృశమ్ ॥ 14
అకృత్రిమా లింగన జాం ప్రీతిం ప్రాప్య తదా హరః । ముక్త్వా చాస్య భుజాన్ రాజన్ ! ప్రాహ వాక్యం దశాననమ్ ॥

శైలూషుడు అగ్నిప్రవేశముసేసిన వేదవతింజూచి రావణుడేమిసేసె నానతిమ్మన నాడాయనుడిట్లనియె. రాక్షసులు పూజింప నారావణుడు లంకకేగెను. వానింగూర్చి కుబేరుడు బంపెను. నీవుతప్పుపని మానుము దేవతలు నిన్నుజంపు నాలోచనలో నున్నారని తెల్పుమని దూతను బంపెను. ఆ నిశాచరుడు వానిమాటవిని వానింజంపి వెళ్లి కుబేరునిగెల్చి వాని పుష్పకమును లాగికొనెను. అప్పుడా విమానమెక్కి కైలాసమునకుంజనెను. అక్కడ పుష్పకవిమానము నడక కుంటుపడుట గని కైలాస శిఖరముపై వామ నాకారముననున్న నందినిజూచెను. రావణుండు నందిని పెద్దగానవ్వి పరిహాసముసేసెను. అంతటనంది ఈ కైలాసగిరిపై శంకరుడు విహరించుచున్నాడు. ఈ విమానముపై నాయనదరికేగెదవేని నీవునన్ను బరిహాస పాత్రునింజేసెదవు. అందుచే నిన్ను శపించు చున్నాను నా మొగమువంటి మొగముగలవారు ఘోరులు పులహ ప్రజాపతి కులమందు బుట్టనున్నారు భయంకరమూర్తులువారు నీనాశమునకు గారణమగుదురు అన విని దశాననుడు కైలాసముతోగూడ త్రినేత్రుని లంకకుం గొనిపోవ నా గిరిపై బాహువుల విసరెను. రావణ భుజములంగదలి యూగిన కైలాసమందునా గూర్చున్న పీఠము గదలిపోయి యుమాదేవి త్రిపురాంతకముం గట్టిగ బట్టుకొనెను. అంతనమ్మహా దేవుడు దేవ ప్రవరుడు గర్జించుచు విలాసముగ దన పాదము బొటనవ్రేల నాకొండనదిమెను. రావణుడు రోషముచే భుజములకు గలిగినబాధచే ముల్లోకములు ప్రతిధ్వనింపం బెల్లుగ నార్చెను వానిమంత్రులు రావణుని పదిమొగములు పిండియైనవని యుగప్రళయము గాబోలుననుకొనిరి. ఇంద్రాది దేవతలాసనములందుండి కదలి పోయిరి. ఆసడిచే పార్వతి మిక్కిలి జడిసిపోయి బెదరుచూపులం బరమశివుని గౌగలించుకొనెను. అంతట హరుండామెయకృత్రిమ స్వయం గ్రహాశ్లేషమున మిక్కిలి మురిసి యామె భుజముల విడిచి దశముఖునితో నిట్లనియె.

ప్రీతోఽస్మి తవ వీర్యైశ్చ శౌండీర్యైశ్చ దశానన ! యస్మాద రాక్షసో రావ స్త్వయా ముక్తో భయంకరః ॥ 16
తస్మాత్త్వం రావణో నామ భవిష్యసి జగత్త్రయే । తతః ప్రభృతి రాజేంద్ర రావణో లోకరావణః ॥ 17
శాత కుంభ మయం లింగం దేవదేవస్య శూలినః । సంపూజయతి రాజేంద్ర ! నిత్యం శ్రద్ధాసమన్వితః ॥ 18
యత్ర యత్ర యథా యాతి తత్ర తత్రాస్య పార్థివ ! సౌవర్ణం తస్య దేవస్య లింగం తదను నీయతే ॥ 19
తతస్తు రావణో రాజా యయౌ సంయమనీం పురీమ్ । యుయుధే కాలపాశేభ్యో యాగైశ్చ సహ మృత్యునా ॥ 20
జిత్వా పితృగణాం శ్చైవ మోక్షయిత్వాచ నారకాన్ । యమేన యుయుధే సార్ధం క్రోధా ద్వైవస్వత స్తతః ॥ 21
హన్తు మిచ్ఛన్ మహీపాల ! దండాస్త్రేణ నిశాచరమ్ । వారయామాస తం బ్రహ్మా వాక్యం చేద ముచాచహ ॥ 22
అమోఘ స్తవ దండోఽయ మవధ్య శ్చైవ రావణః । ఏకస్మి న్నపి నిష్క్రాన్తే భూయా మన్వృత వాగహమ్ ॥ 23
పితామహ వచః శ్రుత్వా దేవ స్సోఽన్తర్దధే తతః । రావణ స్సహసైన్యేన యయౌ కైలాస పర్వతమ్ ॥ 24
ఉవాస శర్వరీం తత్ర యోద్ధుకామో దివాలయైః । సతు చంద్రోదయే రాత్రౌ భ్రాతృ పుత్రాభిసారికామ్ ॥ 25
దదర్శ రంభాం రాజంతీం మేఘస్యేవ శతహ్రదామ్ । అకామాం కామ సంతప్తో విధ్వంస్య సురయోషితమ్ ॥ 26
అద్యప్రభృతి మూర్ధాతే శతధా తు గమిష్యతి । ప్రభాత సమయే గత్వా సురసద్మ స రాక్షసః ॥ 27
మేఘనాదేన సహితః కుంభకర్ణేన సంయుతః । దేవానాం కదనం చక్రే తథాన్యై రాక్షసోత్తమైః ॥ 28

తస్మిన్ రణముఖే ఘోరే సావిత్రేణ తదా ఽనఘ ! సుమాలీ నిహతః సంఖ్యే రావణస్యార్యకో బలాత్ ॥ 29
అజేయాన్ రాక్షసాన్ జ్ఞాత్వా పులోమా నామ దానవః । జయన్తమింద్రతనయం దౌహిత్రం స్వం రణాజిరాత్ ॥ 30
రక్షార్థ మనయచ్ఛ్రీమాన్ స్వగృహం వసుధాతలే । అపశ్యమానం పుత్రం స్వం శక్రం త్రిభువనేశ్వరమ్ ॥ 31
బబంధ మేఘనాదస్తు బ్రహ్మ లబ్ధవరః శనైః । అనయచ్చ తథా లంకాం తతో దేవః పితామహః ॥ 32
గత్వా తం మోచయామాస శక్రం త్రిభువనేశ్వరమ్ । మేఘనాదస్య చాస్త్రాణి మాయాశ్చ వివిధా స్తథా ॥ 33
అమరత్వం తదా ప్రాదాత్ వహ్ని కర్మాంతరం వినా । నామ చక్రే తదా చాస్య శక్రజిత్త్వం భవిష్యసి ॥ 34
మేఘనాదం సాన్త్వయిత్వా మోచయిత్వా శతక్రతుమ్ । ఉవాచ భగవాన్ బ్రహ్మ దేవం దశశతేక్షణమ్ ॥ 35
గౌతమస్య ప్రియా భార్యా మనసా నిర్మితా మయా । రూపేణా ప్రతిమా శక్ర ! త్వయా విధ్వంసితా యదా ॥ 36
తదా గౌతమ శాపేన విఫలత్వం గతః స్వయమ్ । దేవైః కృత స్త్వం సంభూయ శేష స్తంభః పురందర ! 37
అహల్యాచ తదా శప్తా గౌతమేన మహాత్మనా । అదృశ్యా సర్వభూతానాం విచరిష్యసి దుఃఖితా ॥ 38
పరదార రత శ్చాసౌ ద్వే పాపే సమవాప్స్యతి । తేన శాపేన సంయోగా పరదారైశ్చ వాసవ ! 39
బంధనం తత్త్వయా ప్రాప్తం తస్య పాపస్య కర్మణః । ఫలా త్రిభువన శ్రేష్ఠ ! సమరేషు పరాజయమ్ ॥ 40
తస్మాద్ధర్మేణ ధర్మజ్ఞ ! పాలయస్వ జగత్త్రియమ్ । ధర్మో ధారయతే లోకాన్ యతో ధర్మ స్తతో జయః ॥ 41
గతే స్వలోకం భువన ప్రధానే । పద్మోద్భవే దానవ పూగ హర్తా ।
త్రివిష్టపం ప్రాప్య శశాస రాజ్యం మహానుభావ స్త్రిదశాధినాథః ॥ 42

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమ ఖండే స్వర్గవిజయోనామ ద్వివింశత్యుత్తర ద్విశతతమోఽధ్యాయః.

దశానన! నీ వీర్యమునకు శౌండీర్యమునకు ప్రీతుడనైతిని నీవు పెద్దగనార్చితివి (పెద్ద రావము నొనర్చితివి) కావున ముల్లోకములు నీవు రావణుండని పేరొందెదవనెను. ఆదిమొదలు రావణుడు లోక రావణుడై (లోకముల గోలపెట్టించువాడై) దేవ దేవుని స్వర్ణలింగమును నిత్యము శ్రద్ధతో జక్కగ బూజించు చుండెను. అతడెట కెటకు బోవు నటకటకా సువర్ణలింగమును గొని పోవు చుండెను. అవ్వల రావణ ప్రభువు సంయమనీపురికి (యమపురికి) జని కాలపాశముల వలని బంధనములతో మృత్యువుతో బోరాడెను. అందు పితృగణములంగెలిచి నరకవాసులను ముక్తులంజేయించి యమునితోగూడ పోరెను. అంతవైవస్వతుండు (యముడు రవికుమారుడు) దండాస్త్రముచే నానిశాచరుం గూల్పనెంచెను. ఆయనను బ్రహ్మ వారించి నీదండమిదియమోఘము అవధ్యుము. రావణుం డొక్కడు గడతేరినయెడలనే నన్నృతవచనుడ నగుదుననియె. పితామహుని మాటవిని యముడంతర్ధానమయ్యెను. రావణుడు సేనతో కైలాసమునకేగి యొకరేయి యక్కడ దేవతలతో దలపడంగోరినిలిచెను. చంద్రోదయమై యారాత్రి తన అన్నదమ్ములకొడుకులతో (దేవతలతో) నభిసరించి (అభిసారికానాయికయై) చను రంభను మేఘమందలి మెఱుపునట్లున్న దానిని జూచెను. ఆమెతనను వలవకున్నం బలిమిమై చెఱచి ఆమె నేటనుండి నీతల నూరువ్రక్కలగునని శపింపబడి ప్రభాతమందు సురసదనమునకేగి యారక్కసుడు ఇంద్రజిత్తుతో కుంభకర్ణునితోగలిసి దేవతలతో యుద్ధముసేసెను. ఆరణమందు ఘోరుడైన రావణుని బిడ్డ సుమాలి (సావిత్రునిచే) యమునిచే గూలెను. రాక్షసులజేయులని తెలిసి పులోముడను దానవుడు డింద్రతనయుని జయంతుని తన దౌహిత్రుని (కూతురుకొడుకును) కాపాడుకొన రణభూమినుండి యవనినున్న స్వగృహమునకుం గొనిపోయెను. తన కొడుకు గానరాక బెంబేలువడు నింద్రుని మేఘనాదుడు (ఇంద్రజిత్తు) బ్రహ్మవరము లందినవాడు బంధించెను. లంకకుంగొనిపోయెను గూడ. అప్పుడు బ్రహ్మయేగి త్రిభువనేశ్వరు నాయింద్రుని విడిపించెను. అప్పుడు బ్రహ్మ యా యింద్రజిత్తున కస్త్రములను పెక్కువిధములగు మాయలను అమరత్వమును నొసంగెను. కాని యమరత్వము (చావులేకపోవుట) అగ్నికర్మాంతరమునందప్పయితర సమయములందే యనుగ్రహించెను. (అందుచేతనే నికుంభిలా హోమముననే యితడు మరణించెను) మరియు వీనికి ఇంద్రజిత్తు అనుపేరుపెట్టెను.

మేఘనాదుని నెమ్మదిపరచి శతక్రతుని విడిపించి బ్రహ్మ వేయి కన్నులవానిని (ఇంద్రుని) గని గౌతముని ప్రియభార్య నేను మనసుచే సృజించినది అప్రతిమాన రూపవతిని నీవెప్పుడు చెఱితువో అప్పుడు గౌతముడిచ్చిన శాపముచే నీయంత విఫలుడవై (వృషణములు పోయినవాడవై) దేవతలందరుగూడి చేసిన చేతచేనీవు స్తంభావశిష్టుడవుగగావింప బడుదువు (పురుషలింగమాత్రావశిష్టుడ వగుదువన్నమాట అయ్యెడ గౌతమునిచే శపింపబడి యహల్య దుఃఖితయై సర్వభూతములకు నదృశ్యయగును. (కానరాకుండును) పరదారరతుడైనందున రెండు పాతకముల నందితివి. ఒకటి ఇంద్రజిద్బాణ బంధము. రెండవది యుద్ధములందు బరాజయము. అందుచే ధర్మ మెరిగిన నీవు భువన త్రయమును ధర్మముచే బాలింపుము ధర్మము లోకములంధరించును రక్షించును (ధర్మము విశ్వజగత్ప్రతి ష్ఠాకారణము) ఎట ధర్మమో అట జయము. అని బ్రహ్మపలికెను పద్మభువువన ప్రధానుడుసన దానవ సంఘ సంహారకుడింద్రుడు త్రివిష్టపరాజ మునుబొంది త్రిదశులకు (ముక్కోటి దేవతలకు) ప్రభువై రాజ్యమును శాసించెను.

ఇది శ్రీవిష్ణు ధర్మోత్తర మహాపురాణమున ప్రథమఖండమున

రావణస్వర్గ విజయమను రెండువందల ఇరువదిరెండవ యధ్యాయము

## రెండువందల ఇరువదిమూడవ అధ్యాయము - రావణవిజయ ప్రసంగము

శైలూషః : పాతాళ విజయం తస్య రావణస్య మహాత్మనః । శ్రోతు మిచ్ఛామి తత్త్వేన తత్ర కౌతూహలం హిమే ॥ 1
నాడాయనః : తతస్సగత్వా పాతాళం యుయుధే దైత్యసత్తమైః । కాలఖంజై ర్మహాభాగైః కాలకేయైశ్చ దారుణైః ॥ 2
నివాత కవచైశ్చైవ సంవత్సర మతంద్రితః । పతిం శూర్పణఖాయాస్తు విద్యుజ్జిహ్వంతు దానవమ్ ॥ 3
అజా వక్త్రివత స్తత్ర జఘాన రణగర్వితమ్ । తత్రాగమ్య తదా బ్రహ్మ నివాత కవచైస్సహ ॥ 4
చకార సఖ్యం సర్వాత్మా దశగ్రీవస్య రక్షసః । తతస్తు యుయుధే నాగై ర్ఘోర రూపైర్విషోల్బణైః ॥ 5
వశీకృత్వా తతోనాగాన్ వరుణస్య పురం యయౌ । బ్రహ్మలోకగతే రాజన్ః వరుణే సుమహాత్మని ॥ 6
పుష్కరః ప్రదదౌ యుద్ధం రావణస్య దురాత్మనః । వరుణస్య సుతః శ్రీమాన్ జామాతా బలిన స్తథా ॥ 7
సోమపుత్ర్యా మహారాజః జ్యోత్స్నయా యః స్వయం వృతః । అర్థశాస్త్రం విజానాతి యస్సమగ్రం మహాయశాః ॥ 8
అస్త్రగ్రామం సమగ్రంచ తథా శస్త్రాణ్య నేకశః । రూపదాక్షిణ్య లావణ్య ధర్మచర్యైస్సమన్వితే ॥ 9
బలేశౌర్యే తథా దానే తుల్యోయస్య నవిద్యతే । భ్రాతృభి ర్భ్రాతృ పుత్రైశ్చ సైన్యేన మహతా యథా ॥ 10
దత్వా యుద్ధం మహా ఘోరం సాంత్వయామాస రాక్షసమ్ ।తత స్స నగరం జిత్వా వరుణం స మహాబలమ్ ॥ 11
సైన్యైః విశ్రవసః పుత్రో మానుష్యం పునరాగతః । కిష్కింధాం స తతో గత్వా పురీం వానరపాలితామ్ ॥ 12
పప్రచ్ఛ వానరాంశ్చైవ క్వాసౌ వాలీ మహాబలః । తం జగాద మహా తేజా తారోగహన గోచరః ॥ 13
కిం స్యాత్తే వాలినా కార్యం తన్మమాచక్ష్వ పృచ్ఛతః ।
రావణః : యుద్ధాతిథ్య మహం తస్మాత్ ప్రార్థయామి వలీముఖాత్ ॥ 14
బలవాన్ శ్రూయతే రాజా జిజ్ఞాసా తస్యమే బలే । తారః : జిజ్ఞాసితో యదా వాలీ త్వత్తోఽన్యై ర్బలవత్తరైః ॥ 15
నిహతాః శతశస్తేన త్వత్తో వీర్య బలాధికాః । ఇదానీ మేవ నిహతో దుందుభి స్తేన రాక్షసః ॥ 16
ప్రవిశ్య వివరం ఘోరం మాయావీ తేన ఘాతితః । బిలే ప్రవిష్టస్య తదా రాజన్ ః సంవత్సరం గతమ్ ॥ 17
సుగ్రీవేణ తదా తస్య ద్వారం పిహితమాత్మనా । స తు సంవత్సరస్యాన్తే హత్వా మాయావినం రణే ॥ 18

దదర్శ రాజన్ ! సుగ్రీవం కిష్కింథాయాం తదాఽనుజమ్ । స్వపత్న్యా రుమయా సార్ధం వాలి పత్న్యాచ తారయా ॥
క్రీడమానం యథా శక్రం క్రోధస్య వశ మన్వగాత్ । రుమాం తారాం తథా హత్వా తేన నిర్వాసిత స్త్వసౌ ॥ 20
నిర్వాసితేతు సుగ్రీవే పశ్చాత్తాప సమన్వితః । హన్తు కామస్తు సుగ్రీవం వాలీ పర్యచర న్మహీమ్ ॥ 21
తదా వాలి భయ త్రస్తః సుగ్రీవోఽపి పలాయితః । న స లేభే సదా త్రాణం తదా సస్మార రాక్షసమ్ ॥ 22
——జ్ఞ శాపం రాజేంద్ర ! వాలినం స తథా స్వయమ్ । హత్వాతు దుందుభిం వాలీ పాదాంగుష్ఠేన యోజయత్ ॥ 23
చిక్షేప రాక్షస శ్రేష్ఠం మతంగస్యా శ్రమం ప్రతి । మతంగస్యాశ్రమం దృష్ట్వా రుధిరేణ సమన్వితమ్ ॥ 24
శశాప వాలినం రోషాత్ తస్యాఽస్మిన్ మే తపోవనే । సద్యః ప్రవిష్ట మాత్రస్య జీవితం న భవిష్యతి ॥ 25
అగమ్యం వాలినో జ్ఞాత్వా మతంగస్య మహద్వనమ్ । చతుర్భిః సచివైః సార్ధం సుగ్రీవ స్తముపాశ్రితః ॥ 26
నలేన రాజన్ ! నీలేన తారేణ చ హనూమతా । హనుమాన్ సచివ స్తస్య దేవానా మపి నిర్భయః ॥ 27
జాతమాత్రస్తుయో బాల్యే వీక్ష్య సూర్యం ఖ మాప్లుతః । భక్ష్యార్థీ తస్య పార్శ్వస్థం రాహుం దృష్ట్వా నిశాచరమ్ ॥ 28
సూర్య ముత్సృజ్య భక్ష్యార్థీ తదా రాహుం ప్రదుద్రువే । రాహు ర్జగామ శరణం భయా ద్భీతం చ వాసవమ్ ॥ 29
తస్యాను ప్రయయా వేవ సతు బాలో మహాబలః । స దదర్శ మహాకాయం తదా శక్రస్య ద న్తినమ్ ॥ 30
తం ప్రదుద్రావ భక్ష్యార్థీ సశక్రం కుంజరోత్తమమ్ । ప్రాహర త్త్వరయా వజ్రం తత స్తస్య సురాధిపః ॥ 31
తస్య వజ్ర ప్రహారేణ వామో హను రభజ్యత । హనుమా నితి తేనాస్య నామ చక్రే పితామహః ॥ 32
క్రుద్ధం చ జగతాం వాయుం సాంత్వయిత్వా పితామహః । వరేణ ఛందయామాస హనూమ న్తం మహాబలమ్ ॥ 33
సర్వైః దేవ గణైస్సార్ధం లోకానాం హిత కామ్యయా । అజరాఽమరతాం తస్య అజేయత్వం తథా రణే ॥ 34
ప్రదదుః దేవతా స్సర్వే బలం చా ప్రతిమం తథా । స్వయం భగవతా తస్య సూర్యేణ సుమహాత్మనా ॥ 35

శైలూషుడు రావణుని పాతాళ విజయవృత్తాంతమును వినగోరెదనన నాడాయనుఁడనియె. అటుపై నతడు పాతాళమేగి దైత్యవరులతో బోరెను. కాలఖంజులు కాలకేయులు నివాతకవచులునను దారుణులయిన దైత్యులతో యుద్ధమొనరించెను. తన శూర్పణఖ మగని విద్యుజ్జిహ్వుని మేకమొగముగలవాని నక్కడచంపెను. అప్పుడటకు బ్రహ్మవచ్చి నివాతకవచులకు రావణునికిని స్నేహమునేర్పరచెను. అవ్వల దశకంఠుడు విషపూర్ణులగు నాగులతో రణము గావించెను. నాగులను వశమొనరించుకొని వరుణ పురమేగెను. అత్తరి వరుణుడు బ్రహ్మలోకమునకుజన నక్కడ పుష్కరుడు రావణునితో దలపడెను. ఆతడు వరుణునికొడుకు. బలశాలి. బలికల్లుడు. సోమునికూతురు జ్యోత్స్నచే నాతడు స్వయంవరింపబడెను. ఆ పుష్కరుడు పూర్తిగ అర్థశాస్త్రమెరుంగును. సమగ్రముగ నస్త్రగ్రామముం దెలిసినవాడు. రూపము దాక్షిణ్యము లావణ్యము ధర్మాచరణమునందు బలమున శౌర్యమున దానమునందు నాతని సముడులేడు. సోదరులతో వారికొడుకులతో మహాసేనతోగూడి రాక్షసరాజునకు పోరొసంగి వానిని మంచి చేసికొనెను. నగరము వరుణుని జయించినతరువాత సైన్యములతో మనుజలోకమునకు దిరిగివచ్చెను. అటుపై నతడు కిష్కింధకేగి వాలి యెక్కడనని వానరులనడిగెను. కిష్కింధ ప్రాంతారణ్యములందుండు తారుడను వానరుడు వాలితో నీకేమిపని యదినాకు దెలుపుమనియె. వానికి రావణుడు యుద్ధాతిథ్యమా వానరుని ప్రార్థించుచున్నాను. మంచి బలశాలి విన్నాను. ఆబలమేపాటిదో తెలియగోరెదను అనవిని తారుడు నీకంటె బలవత్తరు లెందరిచేతనో తెలియగోరి వందలకొలది నీకంటె వీర్యవంతులు మొనగాండ్రు వానిచే గూలినారు. ఇపుడే వానిచే దుందుభి హతుడైనాడు. ఘోరమైన భూవివరముంజొచ్చి మాయావి నాడు రావణునిచే మడిసెను. ఆబిలమునందు బ్రవేశించిన తరువాత నొక్కసంవత్సరము గడచెను. సుగ్రీవుడికనన్నరాడని యా బిలద్వారమును గప్పివేసెను. వాలి సంవత్సరముతుది యా మాయావిం దుందుభింగూల్చి యాబిలమువెడలివచ్చి కిష్కింధయందు దమ్మునిపరున్న రుమతో వాలి భార్య తారతో గ్రీడించుచుండ నింద్రునింబోలినవానిం జూచెను. అప్పుడు రుమను తారను దానుహరించి సుగ్రీవుని వెడలనడచెను.

సుగ్రీవుడు వెడలిపోవ బశ్చాత్తాపముగొని వానింజంపనెంచి మహీమండలమెల్ల దిరిగెను. వానికిజడిసి సుగ్రీవుడు పారిపోయి రక్షణ లభింపక యప్పుడు రాక్షసుని దుందుభిని వాలికి మతంగశాపము విషయము జ్ఞప్తిసేసికొనిదుందుభినిగూల్చి వాలి వానిని కాలితొటన వేల మతంగాశ్రమమువైపు విసరెను. అయ్యాశ్రమము వానిరక్తముచే దడియుటగని యమ్ముని రోషముగొని యీ మహారణ్యమం దిక్కడ యడుగిడిన యాక్షణము ప్రాణముండదని శాపమిచ్చెను. వాలికది యగమ్యమనితెలిసి తననల్గురు మంత్రులతో సుగ్రీవుడా మతంగాశ్రమము నాశ్రయించెను. ఆ సచివులు నలుడు నీలుడు తారుడు హనుమంతుడును. ఆయన మంత్రి హనుమంతుడు దేవతల కేని భయపడడు. పుట్టగనే యతడు భక్షించుటకేదేని వస్తువుంగోరి సూర్యునింగని నింగికెగరెను. ఆ సూర్యుని పార్శ్వమందున్న నిశాచరుని రాహువుంజూచి సూర్యునివిడిచి యారాహువుపైకి బరువిడెను. రాహువు జడిసిపోయి యింద్రుని శరణందెను. మహాబలుడు వాయుజుడు వానిని వెంబడించెను. అటనతడు దేవేంద్రుని వాహనము నైరావత గజముంగని దానిందినగోరి దానిపైకి బరువెత్త నా బాలునింద్రుడు వజ్రమునం గొట్టెను. ఆ వజ్రముదెబ్బకాపిల్లవాని దవడ(హనువు)పగిలెను అందుచే నతనికి బ్రహ్మ హనుమంతుడను పేరుపెట్టెను. (వజ్రాయుధము దెబ్బకుగూడ నాగిన ప్రశస్తమైన హనువు గలవాడుగావున హనుమంతుడను పేరు నిర్వచింపబడినది) అప్పుడు తన కుమారు నింద్రుడు గొట్టెనని వాయువు కోపింప నావాయుదేవుని పితామహుండు బ్రతిమాలి హనుమంతు నభీష్టవరము కోరు కొమ్మనియె. అతడు సర్వదేవతలతో బ్రహ్మలోక హితము కొఱకా హనుమంతునికి అజరామరత్వమును అజేయత్వమును వరమొసంగెను. దేవతలెల్లరు సూర్యభగవానుడును నతనికి ప్రతిమానబల మనుగ్రహించిరి.

ఇది శ్రీవిష్ణు ధర్మోత్తర మహాపురాణమున రావణ విజయప్రసంగమున
వాలి సుగ్రీవ చరిత్రమను రెండువందల యిరువది మూడవ యధ్యాయము

## రెండువందల ఇరువదియైదవ అధ్యాయము - త్రిపురదహనము

వినాయకం తు తుష్టావ తతః శంభు స్త్రిలోక ధృక్ । పురాణాం సంగమార్థాయ అవిద్యే నేతి మానద ! 1
శంకరః : నమస్యామి మహాబాహుం దేవదేవం గణేశ్వరమ్ । హస్తి వక్త్రం మహాకాయం వ్యాఘ్ర చర్మాంబర ఛదమ్ 2
చంద్ర రశ్మి ప్రతీకాశం చారుదంష్ట్రం జ్వలాననమ్ । భక్తానాం విఘ్న శమనం సురాద్యం పార్వతీసుతమ్ ॥ 3
పరశ్వథధరం వీర మక్షమాలా విభూషితమ్ । బ్రహ్మణ్యం వరదం సౌమ్యం విఘ్నానాం పతి మూర్జితమ్ ॥ 4
పీనాస్యం లంబజఠరం హార భారార్పితో దరమ్ । అష్టమీ చ చతుర్థీచ వృతా యేన చతుర్దశీ ॥ 5
కుల్మాషోత్ల్కోపికా పూపై ర్మోదకై రోదనేన చ । పూజయన్తి జనా లోకే ధూప మాల్యాను లేపనైః ॥ 6
స్వస్తి వాచనకై శ్చైవ తేషాం నాస్తీహ దుర్లభమ్ । పుత్రార్థీ లభతే పుత్రాన్ ధనార్థీ ధనముత్తమమ్ ॥ 7
వ్యాధిత శ్చ తథా రోగ్యం బద్ధో ముచ్యేత బంధనాత్ । త్వాంతు సంపూజయిత్వా వై వరదం కామ రూపిణమ్ ॥ 8
ఇష్టాన్ కామా నవాప్నోతి నాత్ర కార్యా విచారణా । య శ్చాధీతే స్తవ మిమం తవ నిత్యం గణేశ్వర! 9
తస్యాఽపి సర్వకామానాం సదా దాతా భవిష్యసి । నాడాయనః- ఇత్యేవ సం స్తుతః శ్రీమాన్ శంకరేణ వినాయకః ॥ 10
ఏకస్థాన గతం చక్రే వినావిఘ్నం పురత్రయమ్ । ఏకస్థం త్రిపురం విష్ణుః శరాగ్రస్థో ధను శ్చ్యుతః ॥
శంకర ప్రేరితః శీఘ్రం తదా చక్రే స భస్మసాత్ ॥ 11
పురత్రయే దేవ వరేణ తేన వినిర్మితే ఽ భూ జ్జగతాం ప్రహర్షః ।
జగ్ము స్తదా దేవగణాః ప్రహృష్టాః స్థానాని రాజేంద్ర ! తథా స్వకాని ॥ 12

ఇతి శ్రీ విష్ణుధర్మోత్తరే ప్రథమఖండే శైలూషం ప్రతి నాడాయన వాక్యే
త్రిపురదాహ వర్ణనం నామ పంచ వింశత్యుత్తర ద్విశత తమోఽధ్యాయః.

---

* మూలములో 223 వ అధ్యాయము పూర్తిగా లేదు. 224 వ అధ్యాయము అసలే లేదు.

త్రిలోకధారి శంభుడు పురముల కలయికకు వినాయకునిస్తుతించెను. మహాబాహుడు దేవదేవుడునగు వినాయకుని మ్రొక్కెదను. గజముఖుని మహాకాయుని వ్యాఘ్రచర్మముపైగప్పుకొనువానిని చంద్రకాంతియట్లచ్ఛము తెల్లనైన వానిని చక్కని దంతములతో రాజిల్లు మొగముగలవానిని భక్తుల విఘ్నముల హరించు వానిని దేవతలకు జ్యేష్ఠుని (తొలివేల్పును) పార్వతీసుతుని పరశ్వథధారిని వీరుని అక్షమాల నలంకరించుకొను వానిని బ్రహ్మణ్యుని వరదుని సౌమ్యుని విఘ్నపతిని ఊర్జితుని నిండుగ పుష్టిగనున్న మోము వానిని వ్రేలాడు బొజ్జవానిని హారముల బరువునమాగు నుదరముగలవానిని అష్టమి చవితి చతుర్దశియనను తిథులను దనవిగా నెంచి కొన్న యాస్వామిని ఆనాడు కుల్మాష తోత్కోపికలతో నప్పములతో మోదకములతో (ఉండ్రాళ్లతో నివేదించుటచే ధూపదీపాద్యుప చారములచే స్వస్తివాచనములతో బూజించు జనులకు లభింపని దేదియులేదు. పుత్రార్థులు పుత్రులను ధనార్థులు ధనమును బొందుదురు. వ్యాధిగ్రస్తు డారోగ్యవంతుడగును. బంధమందున్నవాడు బంధముక్తుడగును. నిన్ను వరదుని కామరూపుని బూజించిన వార భీష్టములంబడయుదురు. ఇక్కడ విమర్శింప నక్కరలేదు. ఈ స్తవముం జదివినాతనికి సర్వకామ ప్రదాత అని యిట్లు శంకరునిచే వినాయకుడు సంస్తుతుండై గణేశుండు విఘ్నములేకుండ మూడుపురములనొకచో గుమికూడినవిగావించెను. విష్ణువు ధనుస్సునందె క్కిడి విడువబడిన శివబాణము చివరనుండెను. అబాణము శంకర ప్రేరితమై శీఘ్రముగ పురత్రయముం భస్మము సేసెను దేవవందు వినాయకుడు మూడు పురముల నొక్కచో జేర్చినంత జగమ్ములానంద భరితములైనవి. అప్పుడు దేవగణములు హర్షముతో దమ స్థానములకుం జనిరి.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున త్రిపురదహన వర్ణనమను రెండువందల యిరువదియైదవ అధ్యాయము

## రెండువందలఇరువదిఆరవ అధ్యాయము - అంధకాసురనిగ్రహము

నాడాయనః- తస్యైవ దేవదేవస్య శృణు కర్మేద ముత్తమమ్ । ఆసీ ద్దైంత్యోంధకో నామ భిన్నాంజన చయోపమః ॥ 1
తపసా మహతా యుక్త స్త్వవధ్యశ్చ దివౌకసామ్ । స కదాచి న్మహా దేవం పార్వత్యా సహితం ప్రభుమ్ ॥ 2
క్రీడమానం తదా దృష్ట్వా హర్తుం దేవీం ప్రచక్రమే । తస్య యుద్ధం తదా ఘోర మభవ త్సహ శంభునా ॥ 3
రుద్రో వర్ణ వినిర్భేదే రుధిరా దంధకస్య తు । అంధకాశ్చ సముత్పన్నాః శతశోఽథ సహస్రశః ॥ 4
తేషాంచ దార్యమాణానాం రుధిరా దపరే పునః । బభూవురంధకా ఘోరా యై ర్వ్యాప్త మఖిలం జగత్ ॥ 5
ఏవం మాయావినం దృష్ట్వా దేవదేవ స్తథాఽంధకమ్ । 6
పానార్థ మంధకాస్రస్య ససృజే మాతర స్తథా । మాహేశ్వరీం తథా బ్రాహ్మీం కౌబేరీం చానలీం తథా ॥ 7
సౌపర్ణీ మథ వాయవ్యాం శాక్రీం వై నైరృతీం తథా । సౌరీం సౌమ్యాం శివాం దూతీం చాముండా మథ వారుణీమ్ ॥ 8
వారాహీం నారసింహీం చ వైష్ణ వీంచ లలత్థికామ్ । శతానందాం భగానందాం పిచ్ఛిలాం భగ మాలినీమ్ ॥ 9
బలామతి బలాం రక్తాం సురభీం ముఖ ముండికామ్ । మాతృ నందాం సునందాంచ బిడాలీం శాకునీం తథా ॥ 10
రేవతీంచ మహారక్తాం తథైవ పిలిపిచ్ఛికామ్ । జయాంచ విజయాం చైవ జయన్తీం చాపరాజితామ్ ॥ 11
కాళీం చైవ మహాకాళీం కాలదూతీం తథైవ చ । సుభగాం దుర్భగాం చైవ కరాళీం దేహనీం తథా ॥ 12
అదితించ దితిం చైవ మాలినీం మృత్యు మేవ చ । కర్ణమోటీం తథా యామ్యాం ఉలూకీం చ ఘటోదరీమ్ ॥ 13
కపాలీం వజ్ర హస్తాం చ పిశాచీం రాక్షసీం తథా । భు ర్యుండీం హాంకురీం చండాం శైవాంచ కటకాం తథా ॥ 14
ఘంటాం సులోచనాం ధూమ్రామేక వాలీం కపాలినీమ్ । విశాలాం దష్టికాం శ్యామాం త్రిజటీం కుకుహూాం తథా ॥ 15
వినాయకీం చ వైతాళీ మున్మత్తాం శుభనాం తథా । సిద్ధించ లేలిహానాంచ కేకరాం గర్దభీం తథా ॥ 16

తర్కటీం బహుపుత్రాంచ ప్రేతయానాం విటం పురామ్ । క్రౌంచీం సూకరముఖీంచ వితతాం సరమాం దనుమ్ ॥ 17
ఉపారంభాం పినాకాంచ లలితాం చిత్రరూపిణీం । స్కంధాకారాం వషట్ స్వాహాం ధృతిం జ్యేష్ఠాంకపర్దనీమ్ ॥ 18
మాయా విచిత్ర రూపాంచ కామ రూపాం వశంగమామ్ । స్వకంబలాం సింజికాం చ మహానాసాం మహాముఖీమ్ ॥ 19
కౌమారీం రోచనాం భీమాం సదా హాసాం మదోద్ధతామ్ । ఆరక్తాక్షీం కాల కర్ణీం భర్తృకర్ణీం మహాస్వనీమ్ ॥ 20
కేశినీం శిఖినీం లంబాం పింగాక్షీం లోహితా ముఖీమ్ । ఘంటారవాం చ దంష్ట్రాలాం లోచనాం కాచజంఘికామ్ ॥ 21
గోకర్ణికాం గోముఖికాం మహాగ్రీవాం మహా ముఖీమ్ । ఉల్కాముఖీం ధూమ్ర శిఖాం కవనాం పరికంపితామ్ ॥ 22
మోహినీం కుండినీం త్వేడాం నిర్భయాం బాహుశాలినీమ్ । శూర్ప కర్ణీం తథైకాక్షీం విశోకాం నందినీం రుచిమ్ ॥ 23
జ్యోత్స్నాముఖీం వరపురాం నికుంభాం రక్తకంపనామ్ । అవికారాం మహాచిత్రాం చిత్రసేనాం మనోరమామ్ ॥ 24
సుదర్శనాం హరత్పాపాం మాతంగీం లంబమేఖలాం । సుబాలాం బాల తర్కాీం ప్రేమోదాం లాంగలావతీమ్ ॥ 25
చిత్తాం విత్తాం జడాం కోణాం శాంతికాం భసితాశనీమ్ । లంబస్తనీం లంబ ఘంటాం వినతాం వామచూడినీమ్ ॥ 26
స్వలతిం దీర్ఘకేశీంచ సులతా సుందరీ సమా । అధోముఖీ కటుముఖీ క్రోధనీ వసు వాశినీ ॥ 27
విరావిణీ వత్సరుతా మాషా భాజన శాలినీ । కుటుంబికా శుక్తికా చ చండికా బలమోహినీ ॥ 28
మాంసాన్య హాసినీ లంబా గోవిధారీ సమాగధీ । ఏతా శ్చాన్యాః స దేవేంద్ర! సస్పృజే మాతరస్తదా ॥ 29

నాడాయనుడు ఆమహాదేవుని యుత్తమచరితమిదె వినుము మున్నంధకుడను రాక్షసుడుండెను. నూరిన కాటుకవలె కాఱునలుపు మేనివాడు. తపఃప్రభావముచే దేవతల కవధ్యుడై యుండెను. ఒకపుడు పార్వతితో వినోదించుచున్న యీశ్వరుంగని పార్వతిని హరింప నుద్యమించెను. అపుడు వానికి శంభువుతో ఘోరరణమయ్యెను. అంధకునిరక్తమువలన రుద్రునిమేనిరంగు మార్పుసెందినంత వందలువేలంధకులు పుట్టిరి. వారిహరుడు చీల్ప మరియునట్లె యా రక్తమునుండి పెక్కుమంది యంధకులు పుట్టిరి. వారిచే జగమెల్లనిండెను. ఇట్లు మాయావి నారక్కసుంగని వాని రక్తము ద్రావుటకు మాతృదేవతల సృష్టించెను. వారు మాహేశ్వరి బ్రహ్మ మొదలయినవారు. వారిపేర్లు 7 వశ్లోకమునుంచి 29శ్లో మూలములో సులభముగా తెలియుచున్నవి. అందుచే ననువాదమందు చేర్పబడలేదు.

అంధకానాం మహాఘోరం పపుస్త ద్రుధిరం తదా । తతోంధకా స్సృజా సర్వాః పరాం తృప్తి ముపాగతాః ॥ 30
తాస్తు తృప్తాః సు సంభూతాః భూయ ఏవాంధకా స్సృజా । అర్దితో య్యై ర్మహాదేవః శూల ముద్గర పట్టిశైః ॥ 31
తత స్స శంకరో దేవ స్త్వంధకైః వ్యాకులీ వృతః । జగామ శరణం దేవం వాసుదేవ మజం విభుమ్ ॥ 32
తతస్తు భగవాన్ విష్ణుః సృష్టవాన్ శుష్కరేవతీమ్ । సా పపౌ సత్వరం తేషా మంధకానా మసృక్ క్షణాత్ ॥ 33
యథా యథా చ రుధిరం పిబత్యంధక సంభవమ్ । తథా తథా ఒధికం దేవీ సం శుష్యతి జనాధిప ! 34
పీయ మానే తదా తేషాం అంధకానాం తథా ఒసృజి । అంధకాస్తు క్షయంనీతాః సర్వేతే త్రిపురాఒరిణా ॥ 35
మూలాంధకం తు విక్రమ్య తదా సర్వత్ర లోక కృత్ । చకార వేగాన్ శూలాగ్రే తదా తుష్టావ శంకరమ్ ॥ 36
అంధకః సు మహావీర్యః తస్య తుష్టోఒ భవ ద్భవః । సామీప్యం ప్రదదౌ నిత్యం గణేశత్వం తథై వచ ॥ 37

ఆమాతృదేవత లంధకుల రక్తమును ద్రావిరి. దానివలనవారు పరమతృప్తినందిరి. అయినను నంధకుని రక్తమునుండి యంధకోత్పత్తియాగలేదు. అవ్వలగూడ యంధకులచే వ్యాకులపెట్టబడి శంకరుడు అజుని ప్రభువును వాసుదేవుని శరణందెను. విష్ణువపుడు శుష్కరేవతియను శక్తిం బుట్టించెను. ఆమె క్షణములో నాయంధకుల రుధిరమును ద్రావివైచెను. ఆమెయా రక్తముం ద్రావిన కొలది చిక్కిపోదొడగెను. అంధకులుమాత్రము శుష్కరేవతి త్రావిన తర్వాత సులభముగా వారిని త్రిపురారి నాశమందిం

చెను. మూలాంధకునిపై లోకకర్త రుద్రుడు విజృంభించి వానిందన శూలమునం గ్రుచ్చిపట్టెను మహావీర్యుడంధకాసురుడప్పుడు శంకరునిస్తుతించెను. దాన శంకరుడు సంతుష్టుడై వాని తన సాన్నిధ్యమును గణాధి పత్యమును నొసంగెను.

తతో మాతృగణాః సర్వే శంకరం వాక్య మబ్రువన్ । భగవన్! భక్షయిష్యామః సదేవాఽసుర మానుషమ్॥ 38
త్వ త్ప్రసాదా జ్జగత్సర్వం తదనుజ్ఞాతు మర్హసి । శంకరః- భవతీభిః ప్రజా స్సర్వాః రక్షణీయాః న సంశయః ॥ 39
తస్మా ద్ఘోరా దభిప్రాయా న్మనః శీఘ్రం నివర్త్య తామ్ । నారాయణః- ఇత్యేవం శంకరేణోక్తం త్వనాదృత్య వచస్తుతాః ॥
క్షోభయా మాసు రవ్యగ్రా స్త్రైలోక్యం స చరా చరమ్ । త్రైలోక్యే భక్ష్యమాణే తు తదా మాతృగణై ర్నవైః ॥ 41
నృసింహమూర్తిం దేవం చ ప్రదధ్యౌ భగవాన్ శివః । అనాది నిధనం దేవం సర్వలోక భవో ద్భవమ్ ॥ 42
దైత్యేంద్ర వక్షో రుధిర ప్రోక్షితోరు మహాననం । విద్యు జ్జిహ్వం మహాదంష్ట్రం స్ఫుట కేసర సంకటమ్ ॥ 43
కల్పాంత మారుత క్షుబ్ధ సప్తార్ణవ మహాస్వనమ్ । వజ్రాగ్ర తీక్ష్ణ నఖర మాకర్ణా ద్దారితా ననమ్ ॥ 44
మేరు శైల ప్రతీకాశ ముదయార్క సమేక్షణమ్ । హిమాద్రి శిఖరాకారం చారు దంష్ట్రో జ్జ్వలాననమ్ ॥ 45
ఖ వినిసృత రోమాగ్ని జ్వాలా కేసర మాలినమ్ । బద్ధాం గదం సుముకుటం చారుకేయూర భూషణమ్ ॥ 46
శ్రోణి సూత్రేణ మహతా కాంచనేన విరాజితమ్ । నీలోత్పల దళ శ్యామం వాసోయుగ విభూషితమ్ ॥ 47
తేజసా క్రాంత సకల బ్రహ్మాండాంతర మండపమ్ । సాదర భ్రామ్య మాణానాం హుత హవ్య ఘనార్చిషామ్ ॥ 48
ఆవర్తై స్సదృశా కారైః సంయుక్తం దేవలోమజైః । సర్వ పుష్ప విచిత్రాంచ ధారయానం మహాస్రజమ్ ॥ 49
స ధ్యాత మాత్రో భగవాన్ ప్రదదౌ తస్య దర్శనమ్ । యాదృశేనైన రూపేణ ధ్యాతో రుద్రేణ భక్తితః ॥ 50
తాదృశే నైవ రూపేణ దుర్ని రీక్ష్యేణ దైవతైః । ప్రణిపత్యతు దేవేశం తదా తుష్టావ శంకరః ॥ 51

అవ్వల మాతృగణములంబికావల్లభునితో భగవంతుడా! నీయను గ్రహముచే సదేవాసుర మానుషమైన యెల్లజగముం భక్షింపగలము. అది నీవనుమతింప నగునననియె శంకరుడు మీచే సర్వప్రజలు రక్షణీయులు అందువలన నీ ఘోరమైన నీతలంపు నుండి శీఘ్రమ నీవుమఱలుమన వారాపరమేశ్వరుడన్నది ద్రోసిపుచ్చి వెనుదివక చరాచర జగత్త్రయమెల్ల సంక్షోభింప జేసిరి. త్రిభువనము లీక్రొత్త మాతృగణములచే భక్షింపబడుచుండ శివుడనాది నిధను సర్వలోకకారణుని నృసింహమూర్తియైన విష్ణువుం ధ్యానించెను.

## నరసింహమూర్తి వర్ణనము

దైత్యేంద్రుడగు హిరణ్యకశిపు యురముంజీల్చ జిమ్ముకొన్న రక్తముగారు మహానఖములు మెఱపుంబోలిన నాలుక పెద్ద కోరలు నిక్కిన జూలుచే పరమసంకటరూపము కల్పాంత తీవ్రవాయు సంక్షుబ్ధ సప్తసముద్రధ్వనిం బోలినగర్జనము వజ్రమునంచు వలె పదునైనగోళ్లు చెవులదాక విస్తరించిన ముఖము మేరుపర్వతమట్టి మూర్తిఉదయ భానుడట్టిని కళ్లు హిమాద్రిశిఖరమంతెత్తయిన యాకారము మెఱుగారుపెను కోరలు నింగినలముకొన్న రోమాగ్ని మంటలు చెరగు జూలుంబూని అంగదములుపూని చక్కని కేయూరములలంకరించుకొని బంగారపు మొలత్రాడు గైసేసి నల్లగలువంబోని శ్యామల వర్ణముగొని కట్టుపుట్టముత్తరముందాల్చి సకల బ్రహ్మాండాంతరమండలమున నిండుకొన్న తేజస్సుదోయం హవిర్భాగములందుకొను నాదరముతో నూరక భ్రమించు హోమాగ్ని జ్వాలావర్తములతో సమానాకారములైన శరీర రోమకళతో గూడికొని అన్నిరకాల పూవులచే రంగురంగులు గొన్నపెద్ద, పూలమాలను ధరించి యా ఉగ్రనరసింహమూర్తి యీశ్వరుడు ధ్యానించిన మాత్రాన భక్తితో రుద్రుడేలాటి రూపమున ధ్యానించెనో సరిగా వేల్పులకు జూడవశముగాని యదేరూపముతో దర్శనమొసంగెను. శంకరుడును నాదేవేశుని మ్రొక్కి యిట్లు స్తుతించెను.

శంకరః- నమస్తేఽస్తు జగన్నాథ! నరసింహ వపుర్ధర ! దైత్య నాథాఽస్థి సంపూర్ణః నఖ శుక్తి విరాజితః 52
తదస్రకణ సంలగ్న హేమ పింగళ విగ్రహ ।మేరోః స పద్మరాగస్య శోభాం ధత్సే జగద్గురో ॥ 53

కల్పాంతాం భోద నిర్ఘోష ! సూర్యకోటి సమప్రభ ! సహస్ర యమ సంక్రోధ సహస్రేంద్ర పరాక్రమ ! 54
సహస్రధనద స్ఫీత ! సహస్ర వరుణాత్మక ! సహస్ర కాల చరిత సహస్ర నియతేంద్రియ ! 55
సహస్రభూమి సద్ధైర్య ! సహస్రా స న్త మూర్తిమత్ ! సహస్ర చంద్ర ప్రతిమ ! సహస్ర హరి విక్రమ ! 56
సహస్ర రుద్ర తేజస్క ! సహస్ర బ్రహ్మ సంస్తుత ! సహస్ర వాయువేగోగ్ర ! సహస్ర జ్యోతి రీక్షణ ! 57
సహస్ర యంత్ర మథన ! సహస్రాఽఽబాధ మోచన ! అంధకస్య వినాశాయ సృష్టా యా మాతరో మయా ॥ 58
అనాదృత్య తు మద్వాక్యం భక్షయం త్యశ్చ తాః ప్రజాః । కృత్వా తా శ్చ నశక్తో ఽహం సంహన్తు మపరాజిత ! 59
స్వయం కృత్వా కథం తా సాం వినాశమపి రోచయే ।
నారాయణః : ఏవము క్తస్సరుద్రేణ నారసింహ వపుర్ధరః ॥ 60
ససర్జ దేవీం జిహ్వాతః తదా వాగీశ్వరీం హరిః । హృదయా చ్చ తథా మాయాం గుహ్యాచ్చ భగమాలినీమ్ ॥ 61
అస్థిభ్యశ్చ తథా కాలీ సృష్టా పూర్వం మహాత్మనా । యయా త్రదుధిరం పీత మంధకానాం మహాత్మనామ్ ॥ 62
యా తస్మిన్ కథితా లోకే నామతః శుష్క రేవతీ। ద్వా త్రింశ న్మాతరః సృష్టాగా త్రేభ్య శ్చక్రిణా తతః ॥ 63
తాసాం నామాని వక్ష్యామి తానిమే గదతః శృణు! । సర్వక్లిష్టా మహా భాగా కంఠ కర్ణీ తథైవ చ ॥ 64
త్రైలోక్య మోహినీ పుణ్యా సర్వ సత్త్వ వశం కరీ । తథా చ చక్రహృదయా పంచమా వ్యోమ చారిణీ ॥ 65
శంఖినీ లేఖినీ చైవ కాల సంకర్షిణీ తథా । ఇతి దేవ్యష్టకం రాజన్! వాగీశ్యను చరం స్మృతమ్ ॥ 66
అజితా సూక్ష్మ హృదయా వృ ఖా వేశాఽ శ్మదర్శనా । నృసింహ భైరవా చిల్లా గరు త్పక్ష హృదానయా ॥ 67
భగమాలి న్యను చరా ఇత్యష్టౌ నృపమాతరః । ఆకర్షణీ చ భారూటీ తథై వోత్తర మాలికా ॥ 68
జ్వాలా ముఖీ భీషణికా కామధేనుశ్చ బాలికా । తథా పద్మకరా రాజన్ ! రేవత్యను చరాః స్మృతాః ॥ 69
అష్టౌ మహాబలాః సర్వాః దేవగాత్ర సముద్భవాః । త్రైలోక్య సృష్టి సంహార సమర్థాః సర్వదేవతాః ॥ 70

నమస్కారము జగన్నాథ! నరసింహావతారధర! దైత్యనాథుడగు హిరణ్యకశిపు నెముకలు ప్రేవులు నిండ దాల్చినప్రభూ! ముత్తెపు చిప్పలంబోలు నఖములందీపించు దొర! వానిర క్తకణములంటిన మేలిమి బంగారు నెఱుపురంగునం జెలంగుమేనివాడ! పద్మ రాగమణులతోడి మేరువుయొక్క (బంగారుకొండయొక్క) శోభంగాల్చి యున్నావు జగద్గురూ! కల్పాంతమేఘ నిర్ఘోష! కోటి సూర్య ప్రభ! వేయి మంది యములకోప మొక్కడవ దాల్చితివి. వేయిమంది కుబేరు సంపద నీయంద రూపొందినది. సహస్రవరుణ స్వరూప! సహస్రకాల చరిత్ర వేయిమంది జితేంద్రియులయేకైకస్వరూప మీవయైయున్నావు. క్షమాసహస్ర క్షమాశాలి! (వేయి భూదేవతల యోరిమిగలవాడా!) సహస్రానంతమూర్తి (వేయిమంది ఆదిశేషుల స్వరూపమయినవాడన్నమాట) వేయిమంది చంద్రు లట్లు దీపించు వాడ! వేయిమంది హరులయొక్క విక్రమము వేయిమంది రుద్రులతేజస్సుగలవాడ! సహస్రబ్రహ్మరూప సహస్ర వాయువేగ మహోగ్ర! సహస్రజ్యోతిరీక్షణ సహస్రయంత్రమథన! సహస్రాబాధమోచన! నీకు వందనము. అంధకుం జంపనేను మాతృశక్తుల సృజించితిని. వారునామాటకాదని ప్రజలం దినివేయుచున్నారు. సృజించినది నేనైనను వారిని సంహరింపలేకున్నాను ఓఅపరాజిత! నేనుచేసివారి నేనే చంప నెట్లిష్టపడుదును? అనవిని నరసింహమూర్తి విష్ణువపుడు తన నాలుకనుండి వాగీశ్వరిం బుట్టిం చెను. హృదయమునుండి మాయను గుహ్యమునుండి భగమాలిని యెముకలనుండి కాళినింతమున్న సృజించెను. ఆమెయే అంధకుల రక్త ముంద్రావినది. శుష్కరేవతి యామెయే. అవ్వల చక్రితన గాత్రములనుండి(శరీరములనుండి)ముప్పదిరెండు మాతృశక్తులను సృజిం చెను వారి పేర్వేర బేర్కొందు నిదె వినుము.

వారి పేర్లు సర్వక్లిష్టమొదలు కాలసంకర్షిణిదాక యెనమండుగురు వాగీశి ననుచరించువారు. అజితమొదలెనమండుగురు భగమాలినీశక్తియనుచారిణులు. అకర్షిణి మొదలెనమండుగురు రేవతీశక్తియను చారిణులు. నాలుగష్టగణములివి మొత్తము ముప్పదియిద్దరు నృసింహశరీరమునుండి పుట్టినవారు. వీరందరు త్రైలోక్య సృష్టి సంహారములు సేయగలవారు.

తాః సృష్ట మాత్రా దేవేన క్రుద్ధా మాతృ గణ స్యతు । ప్రధావితా మహారాజ ! క్రోధ విస్ఫూర్జి తే క్షణాః ॥ 71
అవిషహ్యతమం తాసాం దృష్ట్వా తేజః సుదారుణమ్ । భయేన శరణం ప్రాప్తాః దేవేశం పూర్వమాతరః ॥ 72
శరణార్థ మను ప్రాప్తాః నృసింహో వాక్య మబ్రవీత్ । నరసింహః- యథా మనుష్యాః పశవః పాలయన్తి వరాననాః ॥ 73
యజన్తి తై శ్చ పశుభిః తథా వై దేవతా గణాన్ । భవత్య శ్చ తథా లోకాన్ పాలయన్తు మయేరితాః ॥ 74
మనుజై శ్చ తథా దేవం యజధ్వం త్రిపురాన్తకమ్ । యే చ మాం సంస్మరన్తీ హ తేచ రక్ష్యాః సదా నరాః ॥ 75
బలికర్మ కరిష్య న్తి యుష్మాకం యే సదానరాః । సర్వకామ ప్రదాస్తేషాం భవిష్యధ్వం తథై వచ ॥ 76
తత్సాధ నాదికం యేచ కరిష్యంతి హరే రితమ్ । తేచ రక్ష్యా సదాలోకే రక్షితవ్యం చ శాసనమ్ ॥ 77
రౌద్రాం చైవ పరాం మూర్తిం మహాదేవః ప్రదాస్యతి । యుష్మ ఖ్యం సమయాసార్థం తేనసార్థం వరస్యథ ! 78
మయా మాతృ గణః సృష్టః యోఽయం విగత సాధ్వసః । ఏష నిత్యం విశాలాక్ష్యో మయైవ సహ రంస్యతి ॥ 79
మయా సార్థం తథా పూజాం వీరేభ్యశ్చైవలప్స్యసి । పృథక్ చ పూజితో లోకే సర్వాన్ కామాన్ ప్రదాస్యతి ॥ 80
షష్ఠ్యాం సంపూజయి ష్యన్తి యేతు పుత్రార్థినో జనాః । తేషాం పుత్ర ప్రదా దేవీ భవిష్యతి న సంశయః ॥ 81
నాడాయనః- ఏతావ దుక్త్వా భగవాన్ సహ మాతృ గణేనచ । జ్వాలా మాలా కులవపుః తత్రై వాంత రధీయత ॥ 82
సమాతృ వర్గోఽపి హ రస్య మూర్తిం సదాయజన్ తిష్ఠతి తత్సమీపే ।
దేవేశ్వర స్యాపి నృసింహ మూర్తేః పూజాం విధత్తే త్రిపురాంతకారీ ॥ 83

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే అంధకజయ వర్ణనం నామ
షడ్వింశ త్యుత్తర ద్విశత తమోఽధ్యాయః.

దేవునిచే సృష్టింపబడిన మాత్రన గుపితలై కన్నుల నిప్పులురాలం బరువులెత్త నారంభించిరి. వారిమిగుల యవిషహ్యమైన దారుణమైన తేజస్సుగని యంతమున్ను సృష్టింపబడిన మాతృశక్తులు భయమంది నృసింహస్వామిని శరణందిరి. స్వామి వారింగని యిట్లనియె. మనుష్యులు పశువులను గాచికొని వానిచే దేవతాగణమును యజించుతరి (యజ్ఞములు సేయునప్పుడన్నమాట) నామాట ననుసరించి మీరులోకములను బాలింపుడు. మనుజులతో మీరును త్రిపురాంతకుని శంకరుని యజింపుడు. నన్ను స్మరించు వారిని గూడ మీరు రక్షింపవలయును. మీకై బలికర్మమొనరించు నరులకు మీరు సర్వాభీష్టముల నిండు విష్ణువు సెప్పిన యా సాధనము సేసిన వారిని రక్షింపవలెను. వారి శాసనమునుగూడ మీరు పాటింపుడు. మహేశ్వరుడు మీకు రౌద్రమైన యాకారము నిచ్చెను. ఆయననునాతో ఆయనతోనన్ను సేవింపుడు. (హరిహరులను మమ్మభేదదృష్టితో నారాధింపుడన్నమాట)నేనుసృజించిన యా మాతృగణము భయమనునదిలేక నాతోడనే క్రీడింపగలదు. ఓవిశాలాక్షి! ఇది నాతోబాటు వీరులవలన (శాక్తోపాసకులకు వీరులను పేరు ప్రసిద్ధము) పూజనందును. వేరుగా పూజింపబడియు సర్వాభీష్టములీగలదు. పుత్రార్థులై షష్ఠిరేపతిం బూజించినవారికామె పుత్రుల నీయగలదు. సంశయములేదు. అనియిట్లు నృసింహస్వామి పలికి మాతృగణముతోగూడ జ్వాలామాలాకుల విగ్రహుండై యటనే యంతర్ధానమందెను. ఆమాతృగణము గూడ హరమూర్తిని యజించుచు తత్సమీపమందే యుండును. దేవేశ్వరుడగు నరసింహ మూర్తిని త్రిపురాంతకుడారాధించును.

ఇది శ్రీవిష్ణు ధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున
అంధకాసుర నిగ్రహమను రెండువందల యిరువది యారవ యధ్యాయము

## రెండువందల ఇరువదిఏడవ అధ్యాయము - మాతృబాధాచికిత్స

శైలూషః : మాతృదోష ప్రశమనా న్మహేశ్వర ముఖో దితాన్ । ప్రయోగాన్ శ్రోతు మిచ్ఛామి వదతస్తే ద్విజోత్తమ ॥
నాడాయనః : చోచకం తు వచాకృష్టం బ్రహ్మభూత జటే శుభే । కాలమంజా హరిద్రే ద్వే యవచూర్ణ విమిశ్రితమ్ ॥ 2
ఉద్వర్తన మిదం ప్రోక్తం మాతృదోష వినాశనమ్ । అరిష్టారిష్ట పత్రాణి తాలజీర కయో స్తథా ॥ 3
శింశిపా మలకీ బిల్వ కపిత్థానాం తథైవ చ । బహుకారత్వ చం పూర్వాం తథైవ చ పునర్నవామ్ ॥ 4
భార్గీక్వాథ మిదంస్నానం మాతృదోష వినాశనమ్ । అరిష్టకం తథాబిల్వం పద్మాక్షం ఫలినీ ఫలమ్ ॥ 5
వచాకుష్టం చ ముస్తంచ వాలకం రజనీ ద్వయమ్ । చందనం కుంకుమం చైవ నాగదానం చ రోచనా ॥ 6
ఏతాని సర్వాణ్యాహత్య పూర్ణకుంభే వినిక్షిపేత్ । స్నాన మేతత్ ప్రయోక్తవ్యం మాతృదోష వినాశనమ్ ॥ 7
కుసుమైః పంచవర్ణైస్తు ధూపైః నిర్యాసజై స్తథా । కుంకుమాగురు కర్పూర చందనై శ్చ మనోరమైః ॥ 8
దీపై ర్భక్ష్యైః తథా క్షీరైః కుల్మాషోల్లో పికా గుడైః । పాయసై ర్మధు సం మిశ్రైః పలనే నోదకేన చ ॥ 9
బలిః సువిహితో రాజన్ ! మాతృదోష వినాశనమ్ । దూర్వా ప్రవాళ మంజిష్ఠా నాగరం నాగకేసరమ్ ॥ 10
రోచనా కుంకుమం చైవ చందనం చ తథా వచా । విలేపన మిదం శ్రేష్ఠం మాతృదోష వినాశనమ్ ॥ 11
గజాశ్వ కపి వారాహ నఖాని చ ఘృతం తథా । శ్రేష్ఠోఽయం కథితో ధూపో మాతృదోష వినాశనః ॥ 12
సిద్ధం ఘృతం చాప్యథ పంచగవ్యం పురాణ మశ్నన్తిహి యే నరేంద్ర !
తేషాం భయం నైవ హి మాతృజాతం భావ్యం కదాచి ద్గ్రహ సంభవం వా ॥ 13

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మాతృబాధాప్రతిషేధోనామ సప్తవింశత్యుత్తర ద్విశతతమోఽధ్యాయః.

నాడాయను డనియె. మాతృ దోష ప్రశమనములైన యోగములను మహేశ్వరుని ముఖము నుండి వచ్చిన వానిని విన గోరుదునన నాడాయనుడిట్లనియె. చోచకము వచ కుష్ఠము బ్రహ్మభూత జటలు కాలమంజు రెండు హరిద్రలు = మాని పసపు కస్తూరి పసపు నను వానిలో యవచూర్ణము కలిపిన నలుగు బిండితో నలుగు పెట్టుట వలన మాతృ దోషము హరించును. అరిష్టము అరిష్ట పత్రములు తాళము జీరకము = జీలకర్ర శింశిప ఆమలకిపెద్ద ఉసిరిక బిల్వ = మారేడు వెలగ బహుకారత్వక్కు- పూర్వ- వునర్నవ = గల్జేరు భార్గీక్వాథ మను నిద్దాన నలుగుపెట్టి స్నానము సేసిన మాతృదోష వినాశమగును. అరిష్టము మారేడు పద్మాక్షము ఫలినీఫలము వచ = వస కుష్ఠ = ముస్తము = తుంగముస్త వాలకము రెండు రజనులు (రజనీద్వయము) చందనము కుంకుమము= కుంకుమపువ్వు నాగదానము = రోచన ఇవియన్నియు కలిపి పూర్ణకుంభమందు నానవేయవలెను. ఆ జలముతోడి స్నానము మాతృ దోష వారకము. పంచవర్ణకుసుమములతో నిర్యాసజములైన ధూపములచే (గుగ్గులు మొదలయినవాని (దశాంగముకూడ చేర్చ వచ్చును) కుంకుమపువ్వు అగురు కర్పూర చందనములతో దీపములతో భక్ష్యములతో పాలతో కుల్మాషోల్లోపికలతో బెల్లముతో తేనెకలిపిన పాయసములతో పలలముతో = మాంసముతో ఓదనముతో = అన్నముతోడి చక్కగ గూర్చినబలి మాతృదోషహరము. దూర్వలు = గరిక ప్రవాల= పవడములు మంజిష్ఠి నాగరము = నాగకేసరము రోచన = గోరోచనము? కుంకుమపువ్వు చందనము వస వీనితోడి విలేపనము (గంధపుపూత) మాతృదోషహరము శ్రేష్ఠము. ఏనుగు గుఱ్ఱము కోడి పంది యనువీని గోళ్లు నెయ్యి (ఆవు నెయ్యి) ధూపమువేసిన మాతృదోష నాశనము. సిద్ధఘృతమును పంచగవ్యమును నిలువ యున్నవానిని దిన్నవారికి మాతృదోష గ్రహదోషములు నెన్నడును గలుగనేకలుగవు.

ఇది శ్రీవిష్ణు ధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున
మాతృబాధా చికిత్సయను రెండువందల యిరువదియేడవ యధ్యాయము.

# రెండువందల ఇరువదిఎనిమిదవ అధ్యాయము - కృత్తికాపూజావిధి

నాడాయనః : తస్య దేవాది దేవస్య ప్రభావ మపరంశృణు ! । కథ్యమానం మయా రాజన్ ! సర్వకల్మష నాశనమ్ ॥
శంకరః పార్వతీ చైవ స్పర్ధమానౌ పరస్పరమ్ । చక్రతు ర్మైథునం రాజన్ ! సాగ్రం వర్షశతం కిల ॥ 2
తయో రన్యతరస్యాసీ ద్యదా నైవ పరాజయః । తతస్తు దేవతా ఖిన్నాః పరస్పర మథాఽబ్రువన్ ॥ 3
అత్రోత్పత్స్యతి యో గర్భ స్త్రైలోక్యం సచరాచరమ్ । తేజసా మోహితం తస్య భవిష్యతి న సంశయః ॥ 4
తస్మా త్త్వ మత్ర ప్రవిశ ! దేవ దేవ ! హుతాశన ! । ఏవముక్త స్తదా వహ్నిః ప్రవివేశ సురోత్తమమ్ ॥ 5
తం దృష్ట్వా సంభ్రమా దేవ సముత్త స్థౌ త్రిలోచనః । తేజోభిః క్షుభితం తత్ర వహ్నేరాస్య మథాఽవిశత్ ॥ 6
శశాప పార్వతీదేవీ భార్యాసు స్వాసు దేవతాః । నైవా వాప్స్యథ పుత్రాన్వై మత్క్రోధ కలుషీ కృతాః ॥ 7
హుతాశనోఽపి శర్వస్య దహ్యమానో హి తేజసా । తత్యాజ గర్భం గంగాయాం సాపికాలేన కేనచిత్ ॥ 8
తత్యాజ పర్వతే శ్వేతే గర్భం వహ్ని సమప్రభమ్ । తేన జాతేన సంవృత్తం సౌవర్ణం శ్వేత పర్వతమ్ ॥ 9
సువర్ణ రేతస స్తస్య శంకరస్య చ తేజసా । దదృశుః కృత్తికా బాలం సంత్యక్తం తత్ర గంగయా ॥ 10
స్తనాని ప్రదదు స్తస్య కృపయా రాజ సత్తమ ! షడానన స్తదా భూత్వా షణ్ణామేవ స్తనం పపౌ ॥ 11
తాసాం క్షీరేణ ధర్మాత్మా వివృద్ధ శ్చారు తేజసా । కృత్తికానాం వరం ప్రాదా ద్యత్త ద్వక్ష్యామి తే నృప ! ॥ 12
నాడాయనః : యదా చంద్ర సమాయోగం గమిష్యథ శుభాననాః । తదా పూజాం కరిష్యంతి భవతీనాం తు యే నరాః ॥
వహ్నే శ్చంద్ర మస శ్చైవ వరుణస్య తథా మమ । గంధమాల్యై స్తథా పుష్పైః ధూపై ర్దీపై స్తథైవచ ॥ 14
గంధోదకేన పుణ్యేన లాజాభి ర్మధునా సహ । అపూపైః పరమాన్నేన దధ్నా గవ్యేన చాప్యథ ॥ 15

ఆదేవాదిదేవు ప్రభావమింకొకటి వినుము. ఇది సర్వకల్మషహరము. పార్వతీశంకరులు పరస్పరస్పర్ధతో నూరేండ్లు మిథున కర్మ మాచరించిరి. అందే యొకరికిని యోటమి గల్గలేదు. అందుచే దేవతలు ఖిన్నులై యొండొరులతో నీ సనాతనదంపతుల సమావేశమందు గలుగుగర్భము తేజస్సుచే చరాచర జగమ్ములనెల్ల మోహితమగును (మూర్ఛనందును) కావున నోహుతాశన! (అగ్నీ) దేవోత్తము నివేశోనం బ్రవేశింపుమన నాతడట ప్రవేశించెను. ఆపలుం బాని త్రిలోచనుడు తొట్రుపడిలేచెను. అప్పుడు శివ వీర్యము (శివతేజస్సు) సంక్షోభించి వహ్ని మోమునందుబడెను. పార్వతీదేవి కోపముగొని నాకినుకచే గలుషితలై ఇటుపై దేవతలు తమ భార్యలందు పుత్రసంతానము గనే కనరుగాక యని శాపమిచ్చెను హుతాశనుండును శర్వుని (శివుని) తేజమునం దహింపబడి గంగయందు గర్భమును విడిచెను. అగంగాదేవియునదిసైపలేక అగ్నిసమ ప్రభమైన యాగర్భమును శ్వేత పర్వతమందు విడిచెను. సువర్ణరేతస్కుడైన యా శంకరుని తేజస్సుచే (వీర్యముచే) నట గంగాదేవిచే పరిత్యక్తుడైన యొక శిశువును గృత్తికలు చూచిరి. ఆపాపనికి వారందరు జాలిగొని పాల్గుడిపిరి. ఆబాలుకారు ముఖములందాల్చి యా యారుగురిచను గుడిచెను. వారి స్తన్యముచే నా ధర్మమూర్తి చక్కని తేజమ్మునం బెంపొంది యా స్వామి కృత్తికలకు వరము ప్రసాదించెను. అది సెప్పెద వినుడు.

కుల్మాషైః సఫలై ర్భక్ష్యైః మోదకైః పానకై స్తథా । ప్రాప్స్య న్త్యభిమతాన్ కామా నిహలోకే పరత్ర చ । 16
నక్తాశన స్తథా భూత్వా యుష్మత్పూజా పరాయణః । క్రీడిత్వా సుచిరం నాకే మానుష్యే తు భవిష్యతి ॥ 17
రూపాన్వితః సత్యపరో దయావాన్ ధర్మే స్థితఃసన్ బహుభృత్య యుక్తః ।
కులేన శీలేన సమన్విత శ్చ నారీ విశేషాత్ సుభగా భవిత్రీ ॥ 18

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే కృత్తికాపూజావిధిర్నామ అష్టావింశత్యుత్తర ద్విశతతమోఽధ్యాయః॥

ఓశుభవదనలార! మీరు చంద్రునితోడి యోగము (కలయిక) పొందినతటి (కార్తికమాసమందు) మీకు మీరేకాదు అగ్నికి చంద్రునికి వరుణునికిని గంధపుష్ప మాల్యాదులు ధూప దీపనైవేద్యాదులతో గంధోదకముతో పేలాలతో తేనెతో అపూపములతో (అప్పములతో) పరమాన్నము ఆవు పెరుగు కుల్మాషములతో పండ్లు భక్ష్యములు మోదకములు (బూరెలు ఉండ్రాళ్ళు) పానకములతో బూజగావింతు పుణాత్ములు మానవు లిహమందు పరమందును నభీష్టకామములం బొందుదురు. కుల్మాషము = పులికడుగు బొబ్బర్లు గుగ్గిళ్ళు జావ గంజి పులగము ఆపూజ నక్తముండి (పగలుపవసించి రాత్రి భోజనముసేయుట నక్తము, మీ పూజయందు శ్రద్ధగొనిన పురుషుడు స్వర్గమందు క్రీడిఁచి మనుష్యలోకమునం జనించిచక్కని వాఁడై నా భక్తులై దయాధర్మ నిష్ఠులై భృత వర్గము సేవింప రాణించును. కులము శీలముంగలదై స్త్రీ పరమసుందర సౌభాగ్యవతియుం గాలగదు.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున
కృత్తికా పూజావిధియను రెండువందల యిరువది యెనిమిదవ యధ్యాయము.

## రెండువందలఇరువదితొమ్మిదవ అధ్యాయము - అక్షయతృతీయమహిమ

నాడాయనః : తతస్తు ప్రయయౌ గంగా కుమారో యత్ర పావకిః । మయా త్వం జనితః పుత్ర ! తమువాచ సురేశ్వరమ్ ॥
అసహన్త్యా మహాతేజః త్వదీయం పర్వతోత్తమే । మయాస్కంద పరిత్యక్తం తదా గర్భగతం మమ ॥ 2
స్కందః : తస్యా స్తద్వచనం శ్రుత్వా పావకి ర్వాక్య మబ్రవీత్ ।
నాఽహం గృహంతే యాస్యామి శంభుర్మే దైవతం పితా ॥ 3
అనుగ్రహం కరిష్యామి తవాహం నురనిమ్నగే ! । వైశాఖ మాస శుక్లస్య తృతీయా యాం వరాననే ! 4
మానుష్య మవ తీర్ణాసి తదా పూజా మవాప్స్యసి । తస్మి న్నహని య స్స్నానం ఆ చరిష్యతి తే శుభే ! 5
రాజ సూయాశ్వమేధాభ్యాం ఫలేన స తు యోక్ష్యతి । తస్మి న్నహని యః పూజాం యత్ర తత్ర వ్యవస్థితః ॥ 6
గంధ మాల్యోపహారాద్యై ర్ధూప దీపాన్న సంపదా । కర్తా తవ మహాభాగే ! త్వత్తోయస్నానజం ఫలమ్ ॥ 7
ధ్రువ మాప్స్యతి ధర్మజ్ఞే ! నాత్ర కార్యా విచారణా । తస్మి న్నహని యత్కించిత్ ప్రదద్యాచ్ఛ్రద్ధయాన్వితః ॥ 8
అక్షయం తత్ఫలం తస్య భవిష్యతి న సంశయః । అక్షయా సా తిథిర్జ్ఞేయా కృత్తికాభి ర్యుతా యది ॥ 9
భవిష్యతి మహాభాగే ! విశేషేణ ఫలప్రదా। 10
తస్మిన్ దినే యే తవ చారుగాత్రి! పూజాం కరిష్యన్తి తథేరితాంప్రాక్ ।
తే నాకలోకే సుచిరం నిరుష్య లోకాన్ గమిష్యన్తి జలాధిపస్య ॥ 11

ఇతి శ్రీ విష్ణుధర్మోత్తరే ప్రథమఖండే అక్షయ తృతీయా మాహాత్మ్యం
నామ ఏకోన త్రింశదుత్తర ద్విశత తమోఽధ్యాయః.

నాడాయనుండనియె. గంగానది యగ్నిపుత్రుడు కుమారుడున్న తావునకేగి కుమార! నేను నిన్ను గన్నాను. ఓస్కంద! నీ తేజస్సును సైపలేక నాగర్భమును పర్వతశ్రేష్ఠముపై విడిచితిని అనవిని పావకి (పావకుని కుమారుడు) నేను నీయింటికిరాను. నాదైవము శంభువు నాతండ్రి. నీకేనొక యనుగ్రహము సేసెదను వైశాఖశుక్ల తృతీయనాడు నీవు మనుష్యలోకమం దవతరించితివి. కావుననాడు నీవుపూజలందెదవు. నాడెవ్వడు నీయందు స్నానముసేయు నాతడోకల్యాణి! రాజసూయాశ్వమేధములు సేసిన పుణ్యముం బొందును. ఆనాడెక్కడేని నీకు గంధమాల్యోపహారములతో ధూపదీపాన్న సమృద్ధితో బూజసేసినతడు నీలో స్నానముచేసిన ఫలము తప్పక పొందును. ఇటనాలోచవ లవదు. శ్రద్ధతో నానాడేకొంచెము దానము సేసిననది యక్షయమగును. సందేహములేదు కృత్తికా నక్షత్ర

షుతో గూడిన యాతిథి "యక్షయ" యని పిలువబడును. విశేషఫల ప్రదయగును. ఓసుందరగాత్రి! ఆనాడు చెప్పినట్లు పూజచేసిన వారు వారు నాకమందు చిరకాలముండి జలధి పుడగు వరుణుని లోకమేగుదురు.

ఇది శ్రీవిష్ణు ధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున
అక్షయతృతీయా మాహాత్మ్యమను రెండువందల యిరువది తొమ్మిదవ యధ్యాయము

# రెండువందలముప్పదవ అధ్యాయము - స్కందకృతగ్రహానుగ్రహము

నాడాయనః - తతస్తు జాత కర్మాద్యాః క్రియా స్తస్య మహాత్మనః । విశ్వామిత్రస్తు కృతవాన్ మంగళాని తథైవ చ ॥ 1
ఏతస్మి న్నేవ కాలే తు దేవనాథాయ వజ్రిణే । శ్వేత జాత మథా చఖ్యుః కుమారం దీప్త తేజసమ్ ॥ 2
నిధనాయ మతిం చక్రే తదా తస్య పురందరః । దైవతైః పితృభిర్యజ్ఞైః ప్రభు ర్దానవ రాక్షసైః ॥ 3
భూత నాగ పిశాచైశ్చ పితృ గంధర్వ మానుషైః । సంమంత్ర్య నిధనే తస్య సృష్టవాన్ స మహాగ్రహాన్ ॥ 4
దేవదైత్య గ్రహాన్ ఘోరాన్ పితృ దానవ రాక్షసాన్ । యక్ష గంధర్వ నాగానాం నృణాం చ పిశితాశినామ్ ॥ 5
తే గ్రహా బహుసాహస్రాః నానా ప్రహరణోద్యతాః । అభి జగ్ముః శ్వేత గిరిం కుమార వధ కామ్యయా ॥ 6
తే గ్రహా బహు సాహస్రాః గ్రహాంశ్చ శతశశ్శివః । స్కందో గ్రహాన్వై సస్పృజే పూర్వ గ్రహ నిశాచరాన్ ॥ 7
మహాబలాన్ మహా వీర్యాన్ కామగాన్ కామరూపిణః । అనేక శత సాహస్రాన్ నానావేశాన్ మనోజవాన్ ॥ 8
తేషాంప్రధా నాన్ వక్ష్యామి తన్మే నిగదతః శృణు । స్కందో విశాఖశ్చ తథా నైగమేయ స్తథై వచ ॥
భీమో భీమకరః క్రవ్యో నిరతః క్రోశ ఏవచ ॥ 9
క్రవ్యాదోఽథ హవి ర్బుద్ధిః కోటముద్గరికః పృథుః । కాల శ్చాప్య ప కాలశ్చ సిద్ధార్థః పుష్పక స్తథా ॥ 10
పుష్ప మిత్రః కోకిలకః సిద్ధో లంబోదర స్తథా । ఖల్యాః కపోతో లంబోష్ఠః తథా నాయాస ఏవచ ॥ 11
యదండో గృధ్ర నాసాశ్చ గృధ్ర పృత్తుక ఏవ చ । క్షుద్రకః కాల జాలశ్చ కాల స్తత్పురుష స్తథా ॥ 12
విద్యుద్భూతోఽథ సంవర్తో వర్త శ్చావర్త ఏవ చ । శితి కంఠః కపర్దీచ కచ్ఛపః పరికంటకః ॥ 13
పరి ప్రకాశో మత్తశ్చ మాతంగ వసన స్తథా । గదరాక్షః పిశాచ శ్చ వీరనాశో వలీముఖః ॥ 14
మహా భూతశ్చ నందశ్చ సోమానందః ప్రమోదకః . ఆనందో వ్యవసాయ శ్చ నిశ్చయోఽథ పరాక్రమః ॥ 15
జయ శ్చ విజయ శ్చైవ సంజయః కల్ప ఏవ చ । పుష్పదన్తో దంత వక్త్రో హేముండి ర్భీషణ స్తథా ॥ 16
వసు భూతి ర్వసు స్తాత్రితో జీవక స్తాపస స్తథా । వీరబాహు స్సుబాహుశ్చ సుందరో గండ ఏవచ ॥ 17
తండా విచేలా గోదంతః కలశః కలశోచరః । శీర్ష గ్రాహో లలాటస్థో గ్రీవాగ్రా భరతో గ్రహః ॥ 18
పరిలేపక జాత్యంధౌ కరాళః కుంజనామనౌ । అన్యేద్యుకః సతత గః త్రైతీయక చతుర్థకౌ ॥ 19
వ్యరో చకో నేత్రరోగః కాస శ్వాసా నుగ స్తథా । ధూత పాపః పాప హితః పాపాచార స్తథై వచ ॥ 20
కాండో ధనంజయ శ్చైవ శఠో నైష్కృతిక స్తథా । వసుధాతా వసుమనా గౌర శ్శోథో గలగ్రహః ॥ 21
భ్రమ శ్చ చిత్తమో హశ్చ తథా కార్య విఘాతకః । సర్వ కార్య కరశ్చైవ జృంభక శ్చాద్యక స్తథా ॥ 22
ఏతే చాన్యేచ బలినః కామరూపాః విహంగమాః । త్రైలోక్యసృష్టి సంహార స మర్థా వివిధా యుధాః ॥ 23
నానారూపధరా వీరాః నానా వివిధ వాససః । ప్రాదుద్రవన్ గ్రహాన్ ఘోరాన్ పూర్వదేవై ర్వివర్జితాన్ ॥ 24
అవిషహ్య తమాత్మానో గ్రహాః స్కందగ్రహా స్తథా । స్కందం దేవవరం సర్వే తదా శరణ మాగతాః ॥ 25

తాంస్తు వై శరణం ప్రాప్తాన్ స్కందో వచన మబ్రవీత్ ।
స్కందః : శరణం వై ప్రపన్నానాం వరం దాస్యామ్యహం గ్రహాః ॥ 26
వరయధ్వం యథాకామం పూజ్యామే శరణార్థినః । గ్రహాః : భగవన్ ! భక్షయిష్యామః త్వత్ప్రసాదేన మానుషాన్ ॥ 27
ఏతద్వర మభీష్టం నః సర్వేషాం దీప్త విగ్రహ ! స్కందః : దురాచారాం స్తథా లోకే గంధమాల్యాను లేపనే ॥ 28
తేషాం శరీరే రత్యర్థం వసధ్వం నాత్రసంశయః । యే భక్తా స్త్ర్యంబకే దేవే తథాదేవే జనార్దనే ॥ 29
ఆస్తికాన్ శ్రద్దధానాం శ్చ వర్జయధ్వం ప్రయత్నతః । వరార్థమపి సంగృహ్య న్యస్తా వర్మాధిభిః క్రమైః ॥ 30
త్యక్షధ్వం పురుషాన్ శీఘ్రం మమ విజ్ఞాయ శాసనమ్ ।
నాడాయనః : ఏవముక్తా గ్రహాస్సర్వే స్వామ్యే చక్రు స్తదా శిశుమ్ ॥ 31
కుమారం శర్వతనయం మహాబల పరాక్రమమ్ । స్కందేనైవ యథోక్తం తు స్కందం స్కందగ్రహా స్తదా ॥ 32
సమేత్య సర్వే వచన మిదమూచు ర్నరాధిప ! । అస్మాక మపి దేవేశ ! ప్రసాదం కర్తు మర్హసి ॥ 33
ఏవముక్తోఽథ ధర్మాత్మా గ్రహాన్ స్కంద స్త్వభాష థ । యావత్ షోడశ వర్షాణి మానవానాం భవన్త్యత ॥ 34
తా వద్బవన్తో బాధన్తు మనుష్యాణాం తథా ప్రజాః । తత్రాపి బలి కర్మాద్యైః క్షేమం తేషాం కరిష్యథ ॥
తతః పూర్వం గ్రహాణాంతు పూజ్యాలోకే భవిష్యథ ॥ 35
ఏతావ దుక్త్వా భగవాన్ కుమారో దదౌ గ్రహాణామపరం శరీరమ్ ।
దేహాన్ స్వకా న్నాయక ఉగ్ర సత్త్వో లోకస్య రక్షార్థ మతీవ హృష్టః ॥ 36

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే శైలూషం ప్రతి నాడాయనవాక్యే
త్రింశదుత్తర ద్విశతతమోఽధ్యాయః ॥

అవ్వల నా కుమారస్వామికి జాతకర్మాది క్రియలను మహాత్ముడగు విశ్వామిత్రుడొనరించెను. ఈతడి శ్వేతగిరిం జనించిన వాడు దీప్త తేజస్వి కుమారస్వామియని యింద్రుస కెవరో యెఱింగించిరి. పురందరు డది విని యాతనిం బొరిగొన తలంపొనరించెను. దేవతలతో పితరులతో యజ్ఞములతో దానవరాక్షసులతో భూతనాగ పిశాచ గంధర్వ మానుష వర్గముతో నాలోచించి యతడు మహా గ్రహములను సృష్టించెను. అవి దేవగ్రహములు కొన్ని దైత్యగ్రహములు కొన్ని గంధర్వాదిగ్రహములవి పెక్కువేలు. పెక్కు విధములాయుధములూని శ్వేతగిరిం గుమారుని జంపగోరి యేగినవి. శివుడును స్కందుడు గూడ వందల కొలది గ్రహములను నా మున్నుపుట్టిన గ్రహముల పాలిటికి రాక్షసులైన వారిని బలశాలురను వీర్యవంతులను కామసంచారులను కామరూపుల గగన సంచారులను నానావేషములవారిని సృజించెను. అందులో బ్రధానులం బేర్కొనెదను వినుము. స్కందుడు విశాఖుడు నైగమేయుడు మొదలుగవారి పేర్లు 9వ శ్లోకమునుండి 23 శ్లోకమువరకు గలవు. వీరు త్రిలోకసృష్టి సంహార సమర్థులు. వీరందరు పూర్వదేవులు (రాక్షసులు) వదలిన గ్రహములపైకి దూకిరి. అవిషహ్యరూపులయిన గ్రహములు స్కందగ్రహములును నప్పుడు దేవదేవుని స్కందుని శరణందిరి. వారినిగని స్వామి గ్రహములార ! ప్రపన్నులైతిరచో మీకు వరమిచ్చెద. నాకు శరణార్థులు పూజనీయులన గ్రహములు స్వామీ ! నీప్రసాదముచే నా మానుషగ్రహములం దినివేసెదము. ఇదేవరము మాకిమ్మన స్వామి లోకమందు గంధమాల్యానులేపనములు సేసికొన్న దురాచారులయొక్క శరీరమందు మీరు క్రీడార్థముగ వసింపుడు. హరునందు హరియందు భక్తి గల్గి ఆస్తికులను శ్రద్ధావంతులజోలికి మాత్రము పొరబడియేని పోవలదు. వారినాయా శుభకర్మములందు వరములను గ్రహింప నియోగించితిని. నాయానచే నట్టి పురుషులను వదలివేయుడు. అని పలికినంత నా శిశువును (కుమారుని) తమకు స్వామిగా నొనరించుకొనిరి. అప్పుడాస్కందగ్రహములతో స్కందుడు పదునారుసంవత్సరముల వయస్సువరకుగల మనుష్యుల మీరుబాధింపుడు.

అప్పుడుకూడ బలులు మొదలైనవి మీకై చేసినవారికి క్షేమముసేయుడు. అంతకుమున్ను గ్రహములకు మీరుపూజ్యులుకండు. ఇట్లు కుమారస్వామిపలికి గ్రహములకు లోకరక్షణ సేయుకొరకు తనవే వేరొక శరీరములను సంతుష్టుడై యిచ్చెను.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున స్కందకృత గ్రహానుగ్రహమను రెండువందల ముప్పదవ అధ్యాయము.

## రెండువందలముప్పదిఒకటవ అధ్యాయము - గ్రహలక్షణశాంతినిరూపణము

శైలూషః : నృణాం గ్రహగృహీ తానాం లక్షణం కథయాశు మే। ప్రతి షేధం చ ధర్మజ్ఞ! తత్రమే సంశయో మహాన్॥
నాడాయనః దేవర్షి పితృ భూతానాం సతతం చావ మానసాత్।
గురు వృద్ధ ద్విజా చార్య సిద్ధ తాపస మర్దనాత్॥ 2
బలి మంగళ హోమాది నియమా చార వర్జనాత్। వ్రతాధ్యయన ధర్మాది ధ్యానయోగ వ్యతి క్రమాత్॥ 3
గుడా మిష తిల క్షౌద్ర మేధ్యైరు చ్ఛిషి తస్య వా। శ్మశానా యతనాఽభ్యాస విణ్మూత్రో త్సర్జనా దపి॥ 4
రాత్రౌ చతు ష్ప థారణ్య శూన్య వేశ్మ నివేశ నాత్। భోజనా ద్భిన్న భాండేషు తథా మంత్ర ఛలా దపి॥ 5
శ్మశాన చైత్య వృక్షాది మైథునాది నిషేవణాత్। అవమానా దభీ ఘాతా న్మంగళా నా మదర్శనాత్॥ 6
ఈ ర్ష్యయా బంధు శాపాచ్చ రథ్యా వస్కంద సేవనాత్। ఐశ్వర్య నాశా చ్ఛో కాచ్చ దర్పో త్సేకా తిహర్షణాత్॥ 7
నిర్లజ్జ నా స్తి కానాం హి త్రాసి తానాం విశేషతః। గురుభిః సంపరి త్యాగాత్ కా ర్తఘ్న్యా త్సాధు నిందనాత్॥ 8
దుః ఖా త్ప జననాత్ స్త్రీణాం మిథ్యా చైవ ప్రభాషణాత్। తుషకేశ కపాలాస్థి కార్పాసాది ష్వధి ష్ఠితాత్॥ 9
ప్రాణి నాం సుఖ దుఃఖేషు తథా మృతక సూతకే। అత్యర్థ న క్త స్నానేషు గ్రహా గ్రహ్ణన్తి మానవాన్॥ 10
బలై శ్వర్య విసంయోగా ద్దేహ మావిశతి గ్రహః। జీవః కుక్షిం యథాదృశ్యః ప్రవిశన్నైవ దృశ్యతే॥ 11
వన స్పతీ న్వా ఋతవో విజ్ఞేయా శ్చ తథా గ్రహాః। కారణై ర్నవభి ర్దేహం గ్రహో గృహ్ణాతి దేహినామ్॥ 12
రౌద్రస్వభావా ద్ధింసార్థీ రత్యర్థీ బలికాముకః। వి త్తాసార్థీ బలోద్రేకా ద్రౌద్రా త్ప్రిగ్రహికా ద్భయాత్॥ 13
ప్రియకో౽న్యేస మంత్రైశ్చ గ్రహోగృహ్ణాతి మానవాన్। కారణాని తవోక్తాని యద్య ప్యేతాని పార్థివ!॥ 14
తథాపి త్రియ ఏవాత్ర విజ్ఞేయాని విపశ్చితా। తేషా మన్తర్భవ న్త్యేతే యస్మాత్పార్థివ సత్తమ!॥ 15
బలికామస్తు రత్యర్థీ హింసార్థీ చ తథాగ్రహః। అసాధ్యం బలికామంతు కృచ్ఛ్రసాధ్యం రతిగ్రహమ్॥ 16
హంతుకామ మసాధ్యం తు వినా మంత్రబలం మహత్। సాంత్వపూర్వం గ్రహోవిష్టో మధురం యః ప్రజాయతే॥ 17
తత శ్చాంతర మాసాద్య విచిత్రం యాచతే బలిమ్।

శైలూషుడు గ్రహముపట్టిన మనుష్యుల లక్షణము వానికి ప్రతిక్రియల నానతిమ్మన నాడాయనుండనియె. దేవర్షి పితృదేవతలను నిత్యమవమానించినందువలన గురువృద్ధులను ద్విజులను ఆచార్యులను సిద్ధులను దపస్వులను మర్దించుటవలన బలి మంగళ హోమాది నియమాచారములను మానినందునను వ్రతములు అధ్యయనము (వేదములను జదువుట) ధర్మము ధ్యానయోగమును అతిక్రమించుటవలనను బెల్లము మాంసము నువ్వులు తేనె పవిత్రవస్తువుల నెవ్వరికింబెట్టక యెక్కువగ నిలువసేసినందునను శ్మశానమందు ఇంటిదగ్గరగా మూత్ర పురీషములు సేసినందునను రాత్రి చతుష్పథములందు గ్రామములో పెద్దలు మంచిపెద్దలు మాట్లాడుకొనుచు నాల్గుదారుల కూడలియందు కూర్చుండు ప్రదేశము చతుష్పథము. దానికే రచ్చచెట్టు రచ్చబల్ల యని వాడుక పేరు అరణ్యములందు శూన్యగృహమందు నివసించుట పరుండుటవలనను పగిలిన భాండములలో కంచములలో భుజించుటవలన మంత్రములపేర మోసగించుటవలన శ్మశానమందు చైత్యవృక్షముల క్రింద మైథునాదులు సేయుటవలన నితరుల నవమానముసేయుటవలన అభీఘాతమువలన (పైబడి చంపుట కొట్టుటవలన) మంగళ పదార్థములం జూడకపోవుటచేతను ఈర్ష్యచే బంధువులను శపించుటవలన (తిట్టుట

వలన) రథ్యావస్కందులను (దారులుకాచి కొట్టు దొంగలను) జేరుటవలనను ఐశ్వర్యమును నాశనము చేయుటవలన శోకమువలన సిగ్గులేనివారియొక్క నాస్తికులయొక్క వెలివేయబడినవారియొక్క దర్పాతిశయమునుచూచి మిక్కిలి మెచ్చుకొనుటవలన గురువులని త్యాగమువలన (గురువులు పీడు తుచ్ఛుడని వెళ్ళగొట్టుటవలన) కార్తఘ్న్యమువలన (కృతఘ్నతవలన) సాధునిందవలన స్త్రీ మిథ్యా భాషణమువలన ఊక వెంటుకలు పుర్రెలు ఎముకలు దూదిమీద గూర్చుండుటవలన గ్రహావేశము గల్గును. ప్రాణుల సుఖ దుఃఖ సమయములందు మైలలో రాత్రులందెక్కువగా స్నానాలు చేయుటలో మానవులను గ్రహములావేశించి పీడించును. బలము ఐశ్వ ర్యము పూర్తిగ క్షీణించిపోయినపుడు దేహమును గ్రహమావేశించును. జీవుడు తల్లికడుపులో ప్రవేశింపగానే యెట్లు కనపడునో (వేవి శ్మమూలమున) వనస్పతులను (మహావృక్షములను) ఋతువులు ప్రవేశింపగనే చిగిరించుట మొగ్గదొడగుట కాయుట పండుట రాలి పోవుట మొదలగు ఋతుధర్మములు) తెలియనగునో వానిలక్షణములు సోకగానే తెలియుచుండును. గ్రహము దేహుల దేహమును తొమ్మిది కారణములంబట్టి పట్టికొని పీడించును. 1 రౌద్రస్వభావమువలన (కోపమువలన) 2 హింసింపగోరి 3 రతికోరి (రమింప కోరి) 4 బలినిగోరి (ఆహారాదులగోరి) 5 జడిపింపగోరి 6 బలోద్రేకమువలన 7 రౌద్రవృత్తివలన 8 పూర్వజన్మము గలిగిన భయమువలన 9 ఇతరులు చేసిన మంత్రప్రయోగమువలన (చేతబడివలన) గ్రహముపట్టుట జరుగును. నీకికారణములు తొమ్మిది చెప్పితినిగాని యిందు తెలిసినవాడు తెలియవలసినవి మూడే. ఈ మూడింటిలో దక్కిన యారును నంతర్భావమందును బలికామన రతి కామన హింసాకామన అనుమూడే మానవుల నావేశించుటకు గారణములు. బలినిగోరు గ్రహమసాధ్యము. రతినిగోరు గ్రహము శ్రమసాధ్యము. హంతుకామగ్రహము (చంపివేయవలెనను కోరునది) మంత్రబలములేక సాధింప శక్యముగాదు. బలికామన గల గ్రహము మొదట తీయగ ననునయించుచు (మధురముగ) ప్రవేశించును. అపై నవకాశముగొని విచిత్రమయిన బలినడుగుకొనును. ఆ బలులు పానము మాల్యములు (పూలమాలలు) అనులేపములు (గంధాదులు) మొదలైనవేవేని కోరును. గ్రహవైద్యునిం జూచి మ్రొక్కును. ఇవి బలికామ గ్రహలక్షణములు.

పాన మాల్యాను లేపాంశ్చ వైద్యం దృష్ట్వా నమస్యతి ॥ 18
బలికామస్య లింగాని ప్రోక్తా న్యేతాని వై మయా । రమతే నృత్యతి శుచి స్తథా హసతి గాయతి ॥ 19
గంధమాల్యాంబర స్నాన ధూపోద్వర్తన సేవకః । కథా విచిత్రాః కురుతే మధురం సంప్రభాషతే ॥ 20
అలంకృతం చావిశతి వర్జయ త్యనలంకృతమ్ । రతికామస్య రూపాణి జ్ఞేయా న్యేతాని బుద్ధినా ॥ 21
య శ్చావిష్టో విద్రవతి సింహ వ్యాఘ్ర తరక్షుపమ్ । యుద్ధ మారభతే కర్తుం గజాదిభి రథీత వత్ ॥ 22
భృశం తాడయతి స్వాంగం పతత్యగ్నౌ పతంగవత్ । రాజద్వేషాణి కురుతే విజనే రమతేऽధికమ్ ॥ 23
కరోతి మరణోపాయాన్ హంతుం కామార్దితో నరః । లోమహర్షోంగ మాంద్యంచ ఛాయావైకృత్యమేవ చ ॥ 24
అమానుషోత్సాహ బలం విహారాహార చేష్టితమ్ । ద్వౌవా త్రయోవా నేత్రేऽస్య సంపశ్య న్తే కుమారకాః ॥ 25
నిమీలితాక్షితాऽత్యర్థం రక్తాది వమనం తథా । సామాన్య మేత దుద్దిష్టం గృహీతస్య తు లక్షణమ్ ॥ 26

రతి కామగ్రహ లక్షణములు : రమించును నృత్యము సేయును శుచియైయుండును. నవ్వును పాడును గంధము పూమా లలు అంబరములు స్నానములు దూపము ఉద్వర్తనము (తలంటు నలుగు మొదలయినవి) కోరిసేవించును. విచిత్రకథలు సెప్పును తియ్యగ మాటలాడును చక్కగ నలంకరించుకొన్న వానియందావేశించును. అలంకరించుకొననివాని జోలికిపోదు ఇకమారక గ్రహ లక్షణములు మారక గ్రహమావేశించి సింహవ్యాఘ్ర తరక్షుపముల యుద్ధమారంభించును. ఏనుగులతో దలపడును. తన యొడలు తాను గట్టిగా బాదుకొనును. పక్షివలె నగ్నిలో నెగిరి పడును రాగద్వేషములూరక చూపును. విజన ప్రదేశమందెక్కువగ నుండ గోరును. కామార్దితుడై మారక గ్రహవిష్టుడైనవాడు మారణోపాయములను జేయును. మేను పులకరింపు లింగమాంద్యము (శరీరము మొద్దువారుట) ఛాయావైకృత్యము(కాంతితఱుగుట వెలవెలపోవుట) ఆహార విహార చేష్టలందు అమానుషమైన (మానవసామాన్యముగాని)

ఉత్సాహము బలియును. ఈ మారక గ్రహావిష్టుల లక్షణములు మారక గ్రహము పట్టినవాని లక్షణము రెండు మూడు వీని కన్నులం గానిపించును. మిక్కిలి గన్నులు మూసికొనుట రక్తము చొంగశ్లేషము మొదలగు వాని నెక్కువగా గ్రక్కుట ఈలక్షణములు గ్రహ గృహీతులందరికి సమానములే.

ముక్తస్యలక్షణం చాతః ప్రవక్ష్యామి నిబోధత ! భూమౌ వినిపత త్యాశు తథా సంజ్ఞాం ప్రపద్యతే ॥ 27
పరామృశతి కేశాంశ్చ వాసాంస్యాభరణాని చ । శుభాశుభం చాత్మకార్యం పృచ్ఛతి స్మ సుహృజ్జనమ్ ॥ 28
అతః పరం ప్రవక్ష్యామి దేవాది గ్రహలక్షణమ్ । చికిత్సితేన సంయుక్తం తన్నిబోధ జనాధిప ॥ 29
నదీ మాలాఽద్రి శిఖర రుచిః ప్రసాదమేవచ । శుచిశీల సమాచారో జ్ఞేయో దేవగ్రహార్దితః ॥ 30
దేవానాం పూజనం తస్య పుష్ప ధూప ఫలాక్షతైః । గంధ దీప ప్రదానైశ్చ వహ్ని సంతర్పణై స్తథా ॥ 31
గోరసైశ్చ సశాల్యన్నైః బ్రాహ్మణైః స్వస్తివాచనైః । కర్తవ్యం విదుషా నిత్యం తతః సంపద్యతే సుఖీ ॥ 32
ఉచ్ఛిష్టాన్ భైరవా న్రావాన్ విరసం కురుతేఽధికమ్ । తస్మిన్ తథోత్సవాన్ యక్షాన్ వ్రతా నధ్యయనాని చ ॥ 33
బహుశో వటుచాశ్నాతి వస్త్రం పాటయతి స్వకమ్ । అసురగ్రహ దుష్టస్య రూపమేత ద్వినిర్దిశేత్ ॥ 34
దైత్య సంపూజనం తస్య కార్యం మాంససురాఽఽసవైః । రక్తైః పుష్పై ర్ధూపదీపై స్తథా బీజసముద్భవైః ॥ 35
గంధర్వ వాద్య నిర్ఘోషం శ్రుత్వా హృష్టః ప్రనృత్యతి । తీర్థోద్యాన నదీతీర గంధమాల్యాది సేవనాత్ ॥ 36
యథాకామం విచరతి గంధర్వోన్మాదితో నరః । గంధైర్మాల్యైశ్చ వివిధై ర్గీతవాద్యై స్తథైవ చ ॥ 37
గంధర్వపూజనం కార్యం తేన సంపద్యతే సుఖీ ।

ఇక గ్రహముక్తుడైన వాని లక్షణము దెలిపెద తెలిసికొనుము. నేలపై వేగముగబడిపోవును వెంటనే తెలివినొందును జుట్టు సర్దుకొనును కట్టుబట్టలను ఆభరణములను సవరించుకొనును. స్నేహితులను తన శుభము అశుభమునైన కార్యముంగూర్చి యడుగును ఇటుపై దేవాది గ్రహముల లక్షణముల వాని చికిత్సతోగూడ తెలిపెదను రాజా! గ్రహింపుము. నదీతీరము పర్వత శిఖరము ప్రాసాదములమీద రాజసౌధ (దేవసౌధములమీద) తిరుగగోరుచుండును. శుచిశీలుడై (ఆచారవంతుడై) చరించును వాని చికిత్స దేవతలను పుష్పములతో ధూప దీపాదులచే గంధముచే నర్చించుట అగ్ని సంతర్పణములు శాల్యన్నము గోరసములతో (ఆవుపాలు (ఆవుపాలు ఆవు పెరుగు వెన్న నేతులతో) స్వస్తి వాచనము సేయు బ్రాహ్మణులకు సంతర్పణములు సేయుట తెలిసిన వాడివి నిత్యముం గావించిన దేవగ్రహ పీడ నదలి సుఖమందును అసుర గ్రహా విష్టుని చికిత్స:- అసుర గ్రహావిష్టుడు భైరవములు (భయంకరము) పులి త్రేణుపులతోడి విరసముగ పెడబొబ్బలు పెట్టును. వానికి ఉత్సవములు వ్రతములు అధ్యయనములు యక్షము లను చికిత్సలను జేయవలెను. ఆ రాక్షస గ్రహా విష్టుడు మిక్కిలిగ దినును. తన బట్ట చింపుకొనును. మాంసము కల్లు నివేదించి రక్త పుష్పములతో బీజ సముద్భవములైన ధూపదీపములచే వానిని జికిత్సింప వలెను. గంధర్వ వాద్యఘోషము విని గంతులు వేయును. తీర్థము లందలి తోటలలో నదీతీరములలో గంధమాల్యాది సేవనముసేసి గంధర్వగ్రహావిష్టుడు చరించును. గీతవాద్యముల చేతను గంధమాల్యముల చేతను గంధర్వపూజసేసిన సుఖమందును.

నిద్రాళు రలసో దుష్టో దర్వీవత్కురుతే కరౌ ॥ 38
గర్భవాస గుహాసేవీ నరోన్మత్తం విదుర్బుధాః । నాగానాం పూజనంతస్యకార్యం కుల్మాష పర్వభిః ॥ 39
పాయసోల్లోపికాపూపైః పద్మోత్పల బిసై స్తథా । అమత్సరీ మృదుర్వీరః ప్రియ వాగ్బహు భోజనః ॥ 40
పృథు విహ్వల తామ్రాక్షః తథావై గోరసప్రియః । భూతోన్మాద సమావిష్టో లింగైరేతై ర్వినిర్దిశేత్ ॥ 41
కుసుమై ర్బహువర్ణైశ్చ గోరసై ర్వివిధై స్తథా । భూతపూజా తు కర్తవ్యా తేన సంపద్యతే సుఖీ ॥ 42
శూన్యాఽగార శ్మశానాద్రి చతుష్పథ నిషేవకః । రాత్రౌ చరతి చోచ్ఛిష్టః పిశాచో న్మాదితో నరః ॥ 43

పహము. శస్త్రముగాని గోరోచనము గాని మేలిమి బంగారము మణి మౌక్తికము విషము స్వవత్సాగోదానము మథించిన మేక పూర్ణ కుంభము మంత్రములు వీణ చందనము నెమలి రెక్కలు వెండి అమ్ములతో అల్లెత్రాటితోడి విల్లు భల్లాతకములు నల్లజీడి గింజలు సర్పిస్సు (నెయ్యి) గ్రహదీక్ష కొఱకింట నుంచుకొనవలెను. పుష్పములతో ధూపదీపములతో గంధములతో నానావిధ భక్ష్యములతో కుల్మాషములతోడి పూర్ణ కుంభములతో గోరసములతో గంధముతో ధూపముంతో నానా విధాన్నములతో బలి యొనరింప వలెను.

కాయస్థాం జటిలాం వీరాం వయస్థాం నకులీ ద్వయమ్ । జయాం చ విజయాం చైవ మానాం పర్పట కంబరీమ్ ॥ 11
మర్కటీం సూవరీం ఛత్రా మతిఛత్రా పలంకషామ్ । రామాం పూత నకాం కేశీం మారటాం కటుకాం వచామ్ ॥ 12
చౌరకాం విష్ణు దత్తాంచ వృష్టి కాండీం చ చూర్ణయేత్ । పురాణ మేభి ర్విపచేత్ ఘృతం తోయే చతుర్గుణే ॥ 13
మహా పైశాచకం నామ సర్వ గ్రహ నివారణమ్ । రసాంజనం త్రికటుకం మంజిష్ఠా సమనశ్శిలా ॥ 14
సమాని భాగ మాత్రేణ పిష్ట్వా వర్తింతు కారయేత్ । ఛాయా శుష్కాంతు తం కుర్యాత్ అంజనం గ్రహనాశనమ్ ॥ 15
శ్వేత జ్యోతిష్మతీం వ్యోషం వస్త్ర సూత్రేణ వేష్టితమ్ । ఛాయా శుష్కే పునః పిష్టం జ్ఞేయం ప్రశమనం హితమ్ ॥ 16
సంపూజనం దేవగురు ద్విజానాం భక్తిః పరా చక్రగదా ధరస్య ।
యేషాం న తేషాం ప్రభవన్తి దోషాః గ్రహోద్భవాః భూమిపతిప్రధాన ! 17

ఇతి శ్రీ విష్ణుధర్మోత్తరే ప్రథమఖండే గ్రహబాధా ప్రతిషేధోనామ ద్వాత్రింశ దుత్తర
ద్విశతతమోఽధ్యాయః.

కాయస్థ = ఉసిరిక జటిల = జటామాంసిపీ రా = త్రిలింగములలో కర్కాటకేశ్వరి గ్రంథితగరపుచెట్టు క్షీరకాకోలినేలఉ సిరి కూతురుబుడమ అరటి గుమ్మడు కుక్కమేడి వయస్థా = బూరుగ నకులీద్వయము = జటామాంపి చవ్యమను సుగంధద్రవ్యము యేలక ఉసిరిగతి పృతీగ జయ = విజయమాచా నెల్లికూర తక్కెడు చెట్టు కరక్కాయ పర్పటము = కంబరిమూలంలో పర్పట కంబరీ అని సమాసంగా ఏకవస్తువుగాఉంది ఛత్ర = 1. పిన్నసదాప 2. కొత్తిమిరి 3. నేలతాడి మర్కటి = 1. నూగుదోస 2. నూలగొండి 3. తీగ క్రాణుగచెట్టు సూకరీ అతిచ్ఛత్ర పలంకష రామ = చక్రవర్తికూర పూతని = కరక కేవీమారటా = కటుకా వచ = దీనికి ఉగ్రగంధయనియు పేరు వచ = (వస) చౌరక = చరపుష్టి?

విష్ణుదత్తా వృష్టి కాండీ = నల్లనిది అను వీనిని చూర్ణముచేసి నిలువయున్న ఆవునేతిలో వేసినాల్గురెట్లునీళ్ళుపోసి కాచినది మహా పైశాచికమను పేరది సర్వ గ్రహ నివారణము. రసాంజనము త్రికటుకములు (శొంఠి పిప్పలి మిరియాలు) మంజిష్ఠ మనశ్శిల సమముగ గ్రహించి మేక మూత్రముతో నూరి వరల చేసిన ముద్ద గ్రహప్రశమనము. హితము. భక్తితో దేవగురు ద్విజులయొక్క చక్రగదాధరుడైన విష్ణువు యొక్క పూజనెవ్వరు సేయుదురు. వారికి గ్రహదోషము లేవియుం గలుగవు.

ఇది శ్రీ విష్ణుధర్మోత్తరమున మహాపురాణమందు ప్రథమఖండమున గ్రహశాంతి ప్రక్రియా నిరూపణమను
రెండువందలముప్పదిరెండవ అధ్యాయము.

## రెండువందల ముప్పదిమూడవ అధ్యాయము - మహిషాసురవధ

శైలూషః : స్కందస్య శరణం ప్రాప్తాన్ గ్రహాన్ శ్రుత్వా శతక్రతుః । యచ్చకార మహాభాగ తన్మమాచక్ష్వ పృచ్ఛతః ॥
నాడాయనః : స్కందస్య శరణం ప్రాప్తాన్ శ్రుత్వా శతమఖో యయౌ ।
దేవ దేవగణైస్సార్ధం స్కందో యత్ర వ్యవస్థితః ॥ 2
స్కందం దేవేశ్వరో దృష్ట్వా ! దీప్తతేజ స్సమ ద్యుతిమ్ ।
తుష్టావ రాజశార్దూల! ప్రయత స్సుసమాహితః ॥ 3
శక్రః : దేవదేవం నమస్యామి కుమారం వర మచ్యుతమ్ । కార్తికేయం దురారాధ్యం వహ్నితేజః సముద్భవమ్ ॥ 4
ఉమాశంకరజం భీమం గంగయా జఠరే ధృతమ్ । శక్తిహస్తం విశాలాక్షం షణ్ముఖం దీప్త తేజసమ్ ॥ 5

భక్తానుకంపినం దాంతం బ్రహ్మణ్యం వరదం ప్రభుమ్ । కాక పక్ష ధరం శాంతం శిఖండక విభూషితమ్ ॥ 6
రక్తాంబరం మహాబాహుం మయూర వరగామినమ్ । ఘంటాప్రియం గణాధ్యక్షం మహాబల పరాక్రమమ్ ॥ 7
దేవసేనా పతిం దేవం సర్వలోక హి తేప్స యా । షష్ఠ్యాం తు శుక్ల పక్షస్య యేచ త్వాం భౌమవాసరే ॥ 8
కృత్తికా స్వర్చయిష్యన్తి యథాలాభం పృథక్ పృథక్ । న తేషాం దుర్లభం కించిత్ భవిష్యతి సురోత్తమ ! 9
ద్వియోగే ద్విగుణం తేషాం ఫలం స్కంద ! భవిష్యతి । త్రియోగే పూజనం కృత్వా భవతః సురసత్తమ ॥ 10
అక్షయం ఫల మాప్స్యన్తి నాత్ర కార్యా విచారణా । వైశాఖమాసా దారభ్య పంచమ్యాం య ఉపోషితః ॥ 11
భవన్తం పూజయేత్ షష్ఠ్యాం సంవత్సర మతంద్రితః । పుత్రార్థీ లభతే పుత్రాన్ ధనకామో ధనాని చ ॥ 12
మృత శ్చ ప్రాప్నుయా త్స్వర్గం త్వయి తుష్టే హరాత్మజ ! స్తోత్రేణ చ మదీయేన యే స్తోష్యన్తి తవ ప్రభో ! ॥ 13
లోకద్వయేఽపి తే కామాన్ ప్రాప్స్యన్తి మనసేప్సితాన్ । స్కందః : పితామే దైవతం శక్ర ! మహాదేవః ప్రతాపవాన్ ॥
తస్యాజ్ఞయా కరిష్యామి యన్మాం వక్ష్యతి వాసవ ! । నాడాయనః : తతః ప్రాదురభూత్తత్ర దేవదేవ స్త్రిలోచనః ॥ 15
అభ్యషించ త్కుమారం చ బ్రహ్మణా సహితః ప్రభుః । సేనాపత్యేన దేవానాం సోఽభిషిక్త స్సదా ప్రభో ! ॥ 16
జఘాన మహిషం నామ దానవం దేవ కంటకమ్ । మహిషేన సమాన్ వీర్యే జఘానాయుతశోఽపరాన్ ॥ 17
బహుత్వా ద్దానవాన్ వీరః స్కందః పర బలార్దనః । యదా హంతుం న శక్నోతి తదా దేవ స్త్రిలోచనః ॥ 18
జఘాన మనసా తత్ర తతః శూల వరాయుధః । జఘాన దానవా నన్యాన్ శతశోఽథ సహస్రశః ॥ 19
భక్తానుకంపీ భగవాన్ త్రినేత్రో దేవారి సంఘాన్ వినిపాత్య సంఘే ।
కృత్వా త్రిలోకీం చ తదా ప్రహృష్టాం జగామ కైలాసగిరిం మహాత్మా ॥ 20

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మహిషవధోనామ త్రయస్త్రింశదుత్తర ద్విశతతమోఽధ్యాయః ॥

స్కందుని శరణొందిన గ్రహముల వార్తవిని శతక్రతువు (ఇంద్రుడు) ఏమిచేసె నానతిమ్మని శైలూమండడుగ నాడాయనుడనియె స్కందుని శరణందిన గ్రహములవార్తవిని దేవగణము శతమున్న చోటికేగి తేజోమూర్తియైయున్న యాకుమార స్వామిని నియమవంతుడై స్తుతించెను కృత్తికా కుమారుని అగ్నితేజస్సువలన బుట్టిన వాని ఉమాశంకర సంభవుని గంగ కడుపులో ధరింపబడిన వానిని శక్తిహస్తుని భక్తాను గ్రహకరుని బ్రహ్మణ్యుని వరదుని జునపాయి ధరించిన వారు నెమలిపురిం గై సేసిన వానిని రక్తవస్త్రధారిని ఆజుమోములవానిని మయూరవాహనుని ఘంటాప్రియుని గణాధీశుని దేవసేనాపతిని కార్తికశుక్ల షష్ఠి మంగళ వారము నిన్నెవరర్చింతురు వారికి దుర్లభమైన దేకొంచెము లేదు. త్రియోగమందు (కార్తిక మాసము శుద్ధ షష్ఠితిది మంగళవారము కలిసి వచ్చుట త్రియోగము) షణ్ముఖుని పూజించిన వారికిఫల రెట్టింపు గల్గును. వైశాఖ మాసము మొదలు కొని పంచమినాడుపవాస ముండి షష్ఠినాడు నిన్నొక సంవత్సరము పూజించిన పుత్రధనార్థుల కవితప్పక లభించును. అతడు స్వర్గమునందును. ఈస్తోత్రముచే నిన్ను స్తుతించు వారిహముందు పరమందు కోరినవెల్ల బడయుదురు. అని ఇంద్రుడన కుమారస్వామి నాకంద్రి శంకరుడే నాకు దైవము. నీవిపుడేమంటి వదియెల్ల మాతండ్రిమాన నొనరించెదననియె. అనినంతనే త్రిలోచనుడు సాక్షాత్కరించి బ్రహ్మతోగూడి కుమారుని దేవ సేనాధీశ్వరునిగా నభిషేకించెను. అభిషిక్తుడై స్వామి దేవకంటకుని మహిషాసురుని గూల్చెను వానితో సమబలులైన వాని యను యాయుల నసురుల వేలమందిని సంహరించెను. కుమారు డెవ్వరిని జంపలేక పోయె వారిని త్రిలోచనుడు సంకల్ప మాత్రమున శూల ముచే సంహరించెను. భక్తాను కంపి భగవంతుడు త్రినయనుడు దేవారి కూటముల గూల్చి ముల్లోకము నానందభరితముం జేసి కైలాస గిరికేగెను.

ఇది శ్రీ విష్ణుధర్మోత్తర మహాపురాణమందు ప్రథమఖండమున మహిషాసురవధయను
రెండువందలముప్పదిమూడవ అధ్యాయము.

## రెండువందల ముప్పదినాల్గవ అధ్యాయము - శివకృతయజ్ఞ ధ్వంసనము

నాడాయనః : తస్యైవ దేవదేవస్య ప్రభావ మపరం శృణు । యస్తుకామైః సురైః పూర్వం యజ్ఞే భాగో న కల్పితః ॥ 1
యదా రాజన్ ! త్రినేత్రస్య తదా క్రుద్ధేన శంభునా । యజ్ఞవాటం తతో గత్వా దేవా విత్రాసితా బలాత్ ॥ 2
పురోడాశం భక్షయిత్వా పూష్ణో దంతా నశాతయత్ । భగస్య నయనం వామం బభంజ పరవీరహా ॥ 3
క్రుద్ధం దృష్ట్వా మహాదేవం మృగరూపధర స్తదా । ప్రాద్రవ త్సహసా యజ్ఞో నర నారాయణాశ్రమమ్ ॥ 4
తమన్వయౌ మహాతేజా బాణచాపధరో హరః । యజ్ఞానుసారిణం ప్రాప్తం హరం బాణ ధనుర్ధరమ్ ॥ 5
నారాయణ స్తు తం చక్రే విహ్వలం కంఠపీడనాత్ । విహ్వలే తు మహాదేవే యజ్ఞో దివ మథాశ్రితః ॥ 6
హరోఽపి లబ్ధసంజ్ఞ స్త మన్వయౌ దివి సత్వరః । న శశాక మృగం వేద్ధుం యదా ధర్మశ్చ తేజసా ॥ 7
తతస్తం బోధయామాస బ్రహ్మా శుభ చతుర్ముఖః । భగస్య పూర్ణం చ తదా ప్రసాద మకరోత్ పునః ॥ 8
యజ్ఞస్య చాభయం దత్వా క్రీడయాఽ న్వేతి తం పునః । తారా మృగశ్చ గగనే మహాదేవానుగః సదా ॥ 9
దృశ్యతే స మహాభాగః రాత్రౌ గగన భూషణః ॥ 10
క్రుద్ధేన రుద్రేణ సురా నిరస్తాః స్వస్థాః ప్రసన్నేన కృతాశ్చ భూయః ।
తస్మాత్ప్రసన్నాస్తు భవాయ లోకే క్రుద్ధశ్చ లోకాంతకరః ప్రవిష్టః ॥ 11

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే యజ్ఞవిధ్వంసనంనామ చతుస్త్రింశదుత్తర ద్విశతతమోఽధ్యాయః ॥

నాడాయనుడు శివప్రభావమింకొకటి వినుము. దేవతలు యజ్ఞసంకల్పముసేసి మున్ను శివుని యజ్ఞభాగమీయరైరి. దానం గోపించి యజ్ఞవాటమునకేగి దేవతలను హడలగొట్టెను. పురోడాశముం దనకుదాన తినివేసి భగుని పండ్లూడగొట్టెను. మహేశ్వరుడుగ్రుడగుటగని లేడిరూపూని యజ్ఞపురుషుడు నరనారాయణాశ్రమమునకు బారిపోయెను. హరుడమ్ములు విల్లుంగొని వానిని వెనుదరిమెను. యజ్ఞమును వెంబడించి తరుము హరునిగని నారాయణుడు శ్రీకంఠుని కంఠము పిసికి విహ్వలుం జేసెను. అతడు డిల్లవోజూచి యజ్ఞమూర్తి దివంబునకుం జనెను. శంకరుడు తెలివివచ్చి యా యజ్ఞమును స్వర్గమున వెనుదరిమెను కాని యా మృగమును గొట్టజాలడయ్యెను. అప్పుడు బ్రహ్మ శివునికిం దెలియజెప్పి యా చతుర్ముఖుడు భగునియెడ సంపూర్ణానుగ్రహము సూపెను. యజ్ఞమునకు నభయమిచ్చి యా లేడితో నాడుకొనుచు వెంబడించెను. ఆ లేడి నక్షత్రరూపమున నాకాశమందు మహేశ్వరుడు వెంబడించుచున్నట్లు చుక్కల గుంపుగా గానిపించును. రుద్రుడు కోపముతో సురలం గెంటివేసెను. మరల నా శంకరుడే ప్రసన్నుడై వారిని స్వస్థులనుం జేసెను.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తరమహాపురాణము ప్రథమఖండమున శివకృత యజ్ఞవిధ్వంసనమను
రెండువందల ముప్పదినాల్గవ యధ్యాయము.

## రెండువందల ముప్పదిఐదవ అధ్యాయము - దక్షాధ్వరధ్వంసనము

నాడాయనః : తస్యైవ దేవదేవస్య ప్రభావ మపరం శృణు ః । తేన విధ్వంసితో యజ్ఞో యదా దక్షస్య ధీమతః ॥ 1
దక్షస్య యజమానస్య గంగాద్వారే పురా ప్రభోః అనాహ్వానే చ శర్వస్య దేవీ ప్రకుపితాఽ భవత్ ॥ 2
దేవ్యాః ప్రకోపాచ్చ తథా క్రుద్ధః శూలధర స్తదా । వీరభద్రేతి విఖ్యాతం క్రోధజం సృష్టవాన్ గణమ్ ॥ 3

భద్రకాళీ స్వకాద్దేహా త్సృష్టవత్యథ పార్వతీ । గణై రనుగతో రాజన్ ః వీరభద్రో మహాయశాః ॥ 4
భద్రకాళీ తథా గత్వా దక్షయజ్ఞ మశాతయత్ । విధ్వస్య మానం యజ్ఞం తు పార్వత్యా సహిత శ్శివః ॥ 5
దృష్టవాం స్తత్ర రాజేంద్ర! భద్ర కర్ణేశ్వరః స్థితః । విధ్వస్యమానే యజ్ఞే తు దక్షో వచన మబ్రవీత్ ॥ 6
వీరభద్రం మహాభాగం భద్రకాళీం తథైవ చ । కౌ భవన్తా విహ ప్రాప్తౌ మమ యజ్ఞోపఘాతకౌ ॥ 7
వీరభద్రః : క్రుద్ధేన శంకరేణావాం భాగస్యాపరికల్పనాత్ । యజ్ఞవిధ్వంసనార్థాయ ప్రేషితౌ తే పరంతపౌ ॥ 8
భద్రకర్ణేశ్వరం శర్వం గచ్ఛ శీఘ్రం ప్రసాదయ ః నాడాయనః : వీరభద్రవచః శ్రుత్వా గత్వా తుష్టావ శంకరమ్ ॥ 9
అశ్వమేధ సహస్రాగ్ర్యం ఫలం లేభే త్రిలోచనాత్ । త్రిలోచన స్తదా తుష్టో వీరభద్ర మభాషత ॥ 10

శూలియొక్క యింకొక ప్రభావమిది వినుమని నాడాయనుడు తెలుపం దొడంగెను. దక్షుడు యజమానుడై గంగా ద్వారమందు యజ్ఞముసేసి యందు పార్వతి నాహ్వానింపకున్నంత నామె కోపించెను. ఆమె కోపింప శూలియుం గోపించి వీరభద్ర మను పేరందిన గణమును పార్వతి తన మేనినుండి భద్రకాళి యను పేరందిన శక్తిని సృజించిరి. భద్రకాళి సని దక్షయజ్ఞమును ధ్వంసము సేసెను. అక్కడ భద్రకర్ణేశ్వరుడను పేరుతో శివుడు పార్వతితో నేగి యా ధ్వంసమగుచున్న దక్షయజ్ఞముం జూచెను. అపుడు దక్షుడు మహాభాగుడగు వీరభద్రుని భద్రకాళింగని మీరెవరిక్కడికి యజ్ఞఘాత చేయవచ్చినారని యడుగ వీరభద్రుడు కుపితుడైన శంకరునిచే పరికల్పితులము మేమిర్వురము. నీ యజ్ఞ నాశనమునకే పంపబడినారము. నీవుపోయి భద్రకర్ణేశ్వరుని శర్వుని శీఘ్రముగ శరణందుమనెను. వీరభద్రుని పలుకులాలించి యతడు శంకరుని స్తుతించి యా త్రినేత్రుని వలన వేయి అశ్వ మేధముల ఫలముపొందెను. హరుడు సంతుష్టుడై వీరభద్రుసింగని యిట్లనియె.

యత్రస్థేన త్వయా యజ్ఞో దక్షస్యాద్య వినాశితః । తత్ర స్థానే తు సతతం సాన్నిధ్యం త్వం కరిష్యసి ॥ 11
పూజాం చ విపులాం తత్ర ప్రాప్స్యసే మత్ప్రసాదజాం । యేచ త్వాం పూజయిష్యన్తి వీరభద్ర గణేశ్వరః ॥ 12
తే నాకపృష్ఠం యాస్యన్తి నాత్ర కార్యా విచారణా । దక్షేణ చ సమాహూతా భద్రకర్ణేశ్వరే త్వయా ॥ 13
సరస్వతీ మహాభాగా ప్రవిష్టా జాహ్నవీ జలమ్ । సంగమే చ తయో స్స్నాత్వా పూజాం మమ కరిష్యతి ॥ 14
యః పుమాన్ స గణేశత్వం మమ ప్రాప్స్య త్యసంశయమ్ । గంగాద్వారం కుశావర్తం బిల్వకం నీలపర్వతమ్ ॥ 15
తథా కనఖలం తీర్థం సర్వపాపప్రమోచనమ్ । భవిష్యతి మహాభాగ! తథైవ చ మనోహరమ్ ॥ 16
ప్రజాపతే ర్యజ్ఞ భువం సమాసాద్య యత స్తతః । మోక్ష్యతే పాతకం సర్వం త్రిదివం చ గమిష్యతి ॥ 17
భూయిష్ఠ ముద్ధృతాత్పుణ్యం తస్మా త్ప్రస్రవణోదకమ్ । తస్మాదపి తథా పుణ్యం సారసం పరికీర్తితమ్ ॥ 18
సారసాన్నై ర్ఝరంపుణ్యం నాదేయమపి నైర్ఝరాత్ । తస్మాదపి చ గాంగేయం తదిహాఽపి విశేషతః ॥
సర్వత్ర దుర్లభా గంగా త్రిషు స్థానేషు దుర్లభా ॥ 19
గంగాద్వారే ప్రయాగేచ గంగా సాగర సంగమే । గంగాద్వారే కుశావర్తే బిల్వకే నీలపర్వతే ॥ 20
స్నాత్వా కనఖలే తీర్థే న పునర్జన్మభా గ్భవేత్ । తీర్థపంచక మేతద్ధి యత్రైవ గణనాయకః ॥ 21
తత్ర సన్నిహితో బ్రహ్మా తత్రాహం తత్ర కేశవః । తత్ర దేవగణా స్సర్వే ఋషయశ్చ తపోధనాః ॥ 22
తత్సమీపే చ తే స్థానం త్విదం దత్తం మయా తవ । తత్ర త్వం సతతం వత్స! లోకా త్పూజా మవాప్స్యసి ॥ 23
ఏవముక్త్వా మహాతేజాః వీరభద్రం మహేశ్వరః । ఉవాచ వచనం దేవో భద్రకాళీం మహేశ్వరః ॥ 24

నీవెక్కడనిలిచి దక్షయజ్ఞముం జెరచితివో యక్కడనే నీవు సన్నిధిసేయుము. నా యనుగ్రహమున నక్కడ నందరి వలనం బూజవడయుము. నిన్ను బూజించువారు స్వర్గమధిష్ఠింతురు. ఈ భద్రకర్ణేశ్వరమందు దక్షుడు పిలువగా వచ్చిన సరస్వతి జాహ్నవీజలమందు జొచ్చెను. ఆ గంగా సరస్వతీ సంగమ తీర్థమందు స్నానముసేసి నాపూజచేసినతడు నాగణములకధీశుడగును.

గంగాద్వారము కుశావర్తము బిల్వకము నీలపర్వతము కనఖల తీర్థము సర్వపాపహరములు మనోహరములు నగును. దక్ష ప్రజాపతి యజ్ఞభూమిం దరిసినతడు పాపమువాసి త్రిదివమునకేగును. భూమిలోనుండి పైకిరావింపబడిన దానికంటెను ప్రస్రవణోదకము కొండచరియలనుండి జారిన జలము అంతకంటె కొండమీదనుండి పడునిర్ఝరములు=కొండవాగుల నీరును దానికంటె నదీజలము, దానికంటె గంగాజలము దానికంటె సిక్కడి గంగోదకము నొకదాని నొకటి మించిన పుణ్యతీర్థములు గంగ యన్నియెడల దుర్లభ గంగాద్వారము ప్రయాగ గంగా సాగరసంగమము నను మూడు స్థానములందలి గంగ దుర్లభ గంగాద్వారము ప్రయాగ గంగాసాగర సంగమము గంగాద్వారములు కుశావర్తము బిల్వకము నీలపర్వతము కనఖలతీర్థము నను నీ తీర్థములందు స్నానముచేసిన పునర్జన్మముండదు. ఈ తీర్థపంచకమునందు గణనాయకుడుండును. అక్కడ బ్రహ్మ నేను విష్ణువు నుందుము. అక్కడ సర్వ దేవగణములు తపోధనులు ఋషులు నుందురు. ఆ సమీపమంద నీకే స్థానమిచ్చితిని. వత్సా! వీరభద్ర నీవచట వసించి లోకమువలన పూజనందుదువు. ఇట్లు నా మహేశ్వరుడు వీరభద్రునితోనని భద్రకాళింగూర్చి యిట్లుపలికెను.

మహేశ్వరః : నమోఽస్తుతే మహాభాగే వరదే! కామరూపిణి! । అష్టాదశభుజే స్వస్తి శూలముద్గరధారిణి ॥ 25
పీతకౌశేయవసనే! శశాంక సదృశాననే! నీలోత్పలదళశ్యామే! గజకుంభోపమస్తని! 26
వరదే! చారు సర్వాంగి! సర్వాభరణ భూషితే। కమండలుధరే! దేవి! దేవారి బలనాశిని! 27
అదితి శ్చ దితిశ్చైవ వనితా సిద్ధిరేవచ। రాత్రి ర్నిద్రా ప్రభా కాన్తి ర్బుద్ధి ర్లక్ష్మీః సరస్వతీ! ॥ 28
ధృతిః కీర్తిః స్వధా స్వాహా త్వమేవ వర వర్ణినీ! త్వాం జనాః పూజయిష్యంతి సర్వకామ ప్రదాం శుభామ్ ॥ 29
నవమ్యాం శుక్లపక్షస్య లోకాత్ పూజా మవాప్స్యసి। నవమ్యాం పూజయిష్యన్తి యే త్వాం సమ్య గుపోషితాః ॥ 30
తేషాం త్వం కామ్యదా సౌమ్యే! భవిష్యసి న సంశయః। కందరేషుచ శైలానాం వనానాం గహనేషు చ ॥ 31
రంస్యసే త్వం విశాలాక్షి! తదా పూజా మవాప్స్యసి। యే చ త్వాం మత్ప్రభావజ్ఞాః పూజయిష్యన్తి మానవాః ॥ 32
న తేషాం దుర్లభం కించిత్ ఇహలోకే పరత్ర చ। యే చేదం మత్కృతం స్తోత్ర మభిధాస్యన్తి భక్తితః ॥ 33
తే సర్వే భయనిర్ముక్తాః భవిష్యన్తి న సంశయః। నాడాయనః ఏతావ దుక్త్వా వచనం తత్రైవాన్త రధీయత ॥ 34
దక్షోఽపిచ వరం లబ్ధ్వా ముదంలేభే త్రిలోచనాత్ ॥
ఏవం ప్రభావో వరదః స దేవో భక్తానుకంపీ జగతో నివాసః।
తస్యాస్య వక్తుం నృపవర్య! తస్య గుణాన్ ప్రవక్తుం సకలా హి శక్తిః ॥ 35

ఇతి శ్రీ విష్ణుధర్మోత్తరే ప్రథమఖండే దక్షయజ్ఞ విధ్వంసో నామ పంచ త్రింశ దుత్తర ద్వి శతతమోఽధ్యాయః.

మహేశ్వరకృత భద్రకాళీస్తుతి.

నీకు నమస్కారము మహాభాగ! కామరూపిణి. పదునెనిమిది భుజములుగొని శూలము ముద్గరముందాల్చి పసుపుపచ్చని చీరదాల్చి చంద్రునివంటి నెమ్మోముతో నల్లగలువ రేకులవలె చామనచాయ దానవై గజకుంభ సమాన కుచకుంభములతో వరదవై సర్వాంగసుందరివై సర్వాభరణభూషితవై కమండలువూని దేవరిపు నాశినివై యున్న నీకు వందనములు. అదితి దితి సిద్ధి రాత్రి నిద్ర ప్రభ కాంతి బుద్ధి లక్ష్మి సరస్వతి ధృతి కీర్తి స్వధ స్వాహనను వీరందరు నీవే. నిన్ను జనులు శుక్ల నవమినాడు పూజింతురు నవమినాడుపవసించి నిన్ను పూజించు వారికి నీవు సర్వకామ ప్రదాత్రివగుము. పర్వత కందరములందు అడవులలో గహనప్రదేశములందు నీవు విహరింప గుతూహలపడుదువు. పూజలందుదువు. ఓ విశాలాక్షి! నిన్ను నా ప్రభావమెరింగి పూజించు మానవులకు దుర్లభ మేకొంచెమును నిహమందు పరమందు నుండదు. ఈ నా చేసిన నీస్తోత్రమును భక్తితో పఠించు వార్లెల్లభయముల వలని ముక్తినందుదురు. సంశయములేదు. ఇంతదనుక పలికి యీశ్వరుడక్కడనే మరుగయ్యెను. దక్షుడు నట్లు వరమంది ముద మందెను. జగన్నివాసుడు కైలాసవాసుడిట్టి ప్రభావమువాడు. ఈయన గుణములు వర్ణింప నెవ్వరికి శక్తిగలదు?

ఇది శ్రీవిష్ణుధర్మోత్తరమహాపురాణము ప్రథమఖండమున దక్షయజ్ఞధ్వంసమను రెండువందలముప్పదియైదవ అధ్యాయము.

# రెండువందల ముప్పదియారవ అధ్యాయము - దండధర(కాల)దండనము

నాడాయనః : ప్రభావ మపరం తస్య శృణుః దేవస్య శూలినః । యథా విమోక్షిత స్తేన శ్వేతో మృత్యువశం గతః ॥ 1
శ్వేతో నామ మహాతేజాః ఋషిః పరమధార్మికః । పూజయామాస సతతం లింగం త్రిపుర ఘాతినః ॥ 2
తస్య పూజా ప్రసక్తస్య కదాచిత్ పృథివీపతే ! । ఆజగామ తముద్దేశం కాలః పరమ దారుణః ॥ ॥ 3
రక్త వృత్త త్రినయనః సర్ప వృశ్చిక రోమవాన్ । దంష్ట్రి కరాళో వికటః చూర్ణితాంజనసప్రభః ॥ 4
రక్తవాసా మహాకాయః సర్వాభరణ భూషితః । పాశహస్త స్తథా భ్యేత్య శ్వేతే పాశ మథా సృజత్ ॥ 5
కంఠార్పితేన పాశేన శ్వేతః కాల మథా బ్రవీత్ । క్షణమాత్రం ప్రతీక్షస్వ మమ త్రిభువనాంతక ! 6
నివర్తయా మ్యహం యావత్ పూజనం మన్మథ ద్విషః । తమబ్రవీత్తతః కాలః ప్రహసన్ వసుధాధిప ! 7

నాడాయనుడనియె : పరమేశ్వరునింకొక ప్రభావము వినుము. శివునిచే మున్ను శ్వేతుడను నాతడు మృత్యువుబారినుండి ముక్తుడయ్యెను శ్వేతుడొకమహర్షి. పరమధార్మికుడు మహాతేజస్వి త్రిపురాంతకుని లింగము నిత్యము పూజించెను. రాజా! ఒకతటి లింగపూజా ప్రసక్తినుండ పరమదారుణుడు కాలుడటకు వచ్చెను. ఆయన ఎఱ్ఱని గుండ్రని కన్నులవాడు పాములు తేళ్ళునాతని రోమములు. కోఱలతో భయంకరుడు. వికటుడు నూరిన కాటుక వలె కారుచలువువాడు. ఎఱ్ఱని వస్త్రములుదాల్చినాడు మహాకాయుడు సర్వము లాభరణములు చేతిలో పాశము ఇట్లు వచ్చి శ్వేతునిపై పాశము విసరెను. కుత్తుకం దగిలిన పాశముతో శ్వేతుడు కాలునితో నిట్లనియె. ఓత్రిభువనాంతక! నేను మన్మథాంతకుని పూజసేసికొందును. అందాక ఒక్క క్షణమాత్రము ప్రతీక్షింపుము. అన విని కాలుగల్లన నవ్వుచు నాతనితో నిట్లనియె.

న శ్రుతం తు త్వయా మన్యే వృద్ధానాం శ్వేత ! జల్పితమ్ । శ్వః కార్య మద్య కుర్వీత పూర్వాహ్ణే చా పరాహ్ణికమ్ ॥
న హి ప్రతీక్షతే మృత్యుః కృతంవా స్యా న్న వా కృతమ్ । గర్భేవాఽ పృథ బాల్యేవా యౌవనే వార్ధకేఽ పివా ॥
ఆయుష్యే కర్మణి క్షీణే లోకోఽయం నీయతే మయా । నౌషధాని న మంత్రా శ్చ న హోమో న పున ర్జపః ॥ 10
త్రాయన్తి మృత్యునో పేతం జరయా వాపి మానవమ్ । బహూనీంద్ర సహస్రాణి పితామహశతాని చ ॥ 11
మయా నీతాని కర్తవ్యో నాత్ర మన్యు స్త్వయాఽనఘ ! । విధత్సే పూజనం యస్య మహాదేవస్య శూలినః ॥ 12
దేహన్యాసం స బహుధా మయావై శ్వేత ! కారితః । స్వయం ప్రభు ర్నచైవాహం కర్మాయత్తా మతి ర్మమ॥ 13
కర్మణాం హి తథా నాశం నాస్తి భూతస్య కస్య చిత్ । కర్మమార్గానుసారేణ ధాత్రాఽహం సంప్రచోదితః ॥ 14
నయామి సర్వ మాక్రమ్య త్రైలోక్యం సచరా చరమ్ । ఏవముక్త స్తు కాలేన నీయమాన స్త్రిలోచనమ్ ॥ 15
జగామ సర్వభావేన శరణం భక్తవత్సలమ్ ।

శ్వేతా! వృద్ధుల జల్పనము (భాషణము) నీవు వినలేదుకాబోలు. అదేమి? రేపటి పని యిప్పుడే చేయవలెను. అపరాహ్ణ కృత్యము పూర్వాహ్ణమంద యొనరింపవలెను చేసిన చేయవలసినదానికి మృత్యువు నిరీక్షింపడు కడుపుతో లేదా బాల్యములో యౌవన మున ముదిమినిగాని ఆయుష్యము కర్మమును క్షీణముగాగానే నాచే జీవుడు గొంపోబడును. ఔషధములుగావు మంత్రములుగావు హోమముగాదు జపముగాదు మరెదియు మృత్యువు గూడినవానిని ముదిమిపైకొన్నవానిని రక్షింపలేవు పెక్కువేలకొలది యింద్రులు నూర్లకొలది బ్రహ్మలు నాచే గొంపోబడిరి. ఓపుణ్యాత్ముడ! ఇందునీవు కోపముసేయకు. నీవే శూలికి మహాదేవునికి పూజచేయుదువా దేవుడు నాచే బహుపర్యాయములు దేహము వదలింపబడినాడు నేనును స్వయం ప్రభువునుగాను నాబుద్ధి కర్మాధీనము ఏజీవుని కర్మములకు నాశములేదుగదా! కర్మమార్గాను సారముగనే ధాతచే నేను ప్రేరితుడను సచరాచర త్రైలోక్యమునేను బైబడి లాగికొని పోవుదును. అనియిట్లు కాలదేవత పలికి గొంపోవుచుండ సర్వభావముతో శ్వేతుడు భక్తవత్సలు శరణందెను.

శ్వేతే తు శరణం ప్రాప్తే లింగస్య త్రిపురాన్తకః ॥ 16
భూత భవ్య భవిష్యద్భిః ప్రాదుర్భావైస్తు శార్ఙ్గిణః । ఆత్మనః కవచం కృత్వా కృతరక్షో మహేశ్వరః ॥ 17
భిత్వా లింగం సముత్తస్థౌ క్రోధవిస్ఫారితేక్షణః । తృతీయలోచనజ్వాలా ప్రకాశిత జగత్త్రయః ॥ 18
దృష్టమాత్ర స్తదా తస్య కాలో జజ్వాల తేజసా । న శాన్తో భస్మ భూత శ్చ సర్వ భూతవిధి గ్రహః ॥ 19

శ్వేతుడు లింగము శరణొంద త్రిపురారి శార్ఙ్గియొక్క (విష్ణువుయొక్క) ముందటి రాబోవు నవతారములతో దనకు కవచము సేసికొని దాన రక్షసేయబడి క్రోధవిస్ఫారితనయనుడై మూడవకంటి మంటలం జగములు మూడింటిని వెలిగించుచు లింగము భేదించుకొని లేచినిలువబడెను అతడు కనబడిన మాత్రన నాతేజస్సుచే కాలుడు జ్వలించిపోయెను. అతడు సర్వభూతములపాలివిధి గ్రహమునైన యాతడ భస్మమయిపోయెను.

శ్వేతస్య దత్వా సామీప్యం గణేశత్వం తథైవచ । కృత్వా విధిగ్రహం కాలం తత్రైవాఽన్త రధీయత ॥ 20
తతః ప్రభృతి రాజేన్ద్ర ! కాలస్య కలయన్ ప్రజామ్ । న కైశ్చి ద్దృశ్యతే లోకే విదేహ త్వా జ్జగత్త్రయే ॥ 21
శైలూషః : వైష్ణవం కవచం బ్రహ్మన్! సర్వ బాధానివారణమ్ । త్వత్తోఽహం శ్రోతు మిచ్ఛామి తత్రమే సంశయో మహాన్ ॥
నాడాయనః : అదృశ్య మేత త్పరమం పవిత్రం పూర్వేరితం కల్మషనాశనంచ ।
దుఃఖాపహం తే కవచం బ్రవీమి రక్షా కృతా యేన మహేశ్వరేణ ॥ 23

ఇతి శ్రీ విష్ణుధర్మోత్తరే ప్రథమఖండే కాలదారణో నామ షట్త్రింశదుత్తర ద్విశతతమోఽధ్యాయః.

కాలాంతకుడు పరమశివుడు శ్వేతునకు దనసామీప్యమనుగ్రహించి గణేశత్వమిచ్చి కాలువిధిగ్రహుని (దైవగ్రహీతుని) గావించి యటనే యంతర్ధానమయ్యెను అదిమొదలు రాజేంద్ర! కాలు ప్రజలను కలయించుచు (అంత మొందించుచు) విదేహుడగుటవలన దేహము పోవుటచే నెవ్వరికి గనరా కున్నాడు. అనవిని శైలూషరాజు బ్రహ్మణ్యా! సర్వబాధానివారణము వైష్ణవకవచమును నీవలన వినగోరెదను ఆకవచ ప్రభావమునెడ నాకెంతేని సంశయముగలదన నాడాయనుడు మహేశ్వరుడుగూడ రక్షచేసికొనిన యావిష్ణుకవచము అదృశ్యప్రభావము. పరమపవిత్రము పూర్వోక్తము కల్మషనాశనము దుఃఖహరము నీకది వచించెదను.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణమందు ప్రథమఖండమున దండధర (కాల) దండనమను
రెండుపందల ముప్పదియాఱవ అధ్యాయము.

## రెండువందల ముప్పదియేడవ అధ్యాయము - విష్ణుకవచము

మహేశ్వరః : ప్రణమ్యాఽజర మీశాన మజం నిత్య మనామయమ్ । దేవం సర్వేశ్వరం విష్ణుం సర్వవ్యాపిన మవ్యయమ్ ॥
బ్రజామ్యహం ప్రతిసరం నమస్కృత్య జనార్దనమ్ । అమోఘ మప్రతిహతం సర్వదుష్టనివారణమ్ ॥ 2
విష్ణు ర్మమాగ్రతః పాతు కృష్ణో రక్షతు పృష్ఠతః । హరి ర్మే రక్షతు శిరో హృదయం చ జనార్దనః ॥ 3
మనో మమ హృషీకేశో జిహ్వాం రక్షతు కేశవః । పాతు నేత్రే వాసుదేవః శ్రోత్రే సంకర్షణ స్తథా ॥ 4
ప్రద్యుమ్నః పాతు మే ఘ్రాణం అనిరుద్ధో ముఖం మమ । వనమాలీ గలం పాతు శ్రీవత్సో రక్షతాత్పురః ।
పార్శ్వం తు పాతుమే చక్రం వామం దైత్య విదారణమ్ ॥ 5
దక్షిణం తు గదా దేవీ సర్వాసురనివారిణీ । ఉదరం ముసలీ పాతు ! పృష్ఠం పాతు చ లాంగలీ ॥ 6
ఊరూ రక్షతు శార్ఙ్గీ మే జంఘే రక్షతు చర్మకీ । పాణీ రక్షతు శంఖీ చ పాదౌ మే చరణా వుభౌ ॥ 7
వరాహో రక్షతు జలే విషమేషు చ వామనః । అటవ్యాం నరసింహస్తు సర్వతః పాతు కేశవః ॥ 8

హిరణ్య గర్భో భగవాన్ హిరణ్యం మే ప్రయచ్ఛతు ।। సాంఖ్యాచార్యస్తు కపిలో ధాతు సామ్యం కరోతు మే ॥ 9
శ్వేతద్వీప నివాసీ చ శ్వేతద్వీపం నయ త్వజః । సర్వాన్ శత్రూన్ సూదయతు మధుకైటభ సూదనః ॥ 10
వికర్షతు సదా విష్ణుః కిల్బిషం మమ విగ్రహాత్ । హంసో మత్స్యః తథా కూర్మః పాతు మాం సర్వతో దిశమ్ ॥ 11
త్రివిక్రమస్తు మే దేవః సర్వాన్ పాశా న్నికృంతతు ।। నరనారాయణో దేవో వృద్ధిం పాలయ తాం మమ ॥ 12
శేషోఽశేషామలజ్ఞానః కరో త్వజ్ఞాన నాశనమ్ । బడబాముఖో నాశయతు కల్మాషం య స్మయా కృతమ్ ॥ 13
విద్యాం దదాతు పరమా మశ్వమూర్ధా మమ ప్రభుః । దత్తాత్రేయః పాలయతు సపుత్ర పశు బాంధవమ్ ॥ 14
సర్వాన్రోగా న్నాశయతు రామః పరశునా మమ । రక్షోఘ్నో మే దాశరథిః పాతు నిత్యం మహాభుజః ॥ 15
రిపూన్ హలేన మే హన్యా ద్రామో యాదవ నందనః । ప్రలంబ కేశి చాణూర పూతనా కంస నాశనః ॥ 16
కృష్ణో యో బాలభావేన స మే కామాన్ ప్రయచ్ఛతు । అంధకారం తమో ఘోరం పురుషం కృష్ణ పింగళమ్ ॥ 17
పశ్యామి భయ సంతప్తః పాశహ స్త మివాంతకమ్ । తతోఽహం పుండరీకాక్ష మచ్యుతం శరణం గతః ॥ 18
యోగీశ మతిరూపస్థం శుభ శీతాంశు నిర్మలమ్ । ధన్యోఽహం విజయీ నిత్యం యస్య మే భగవాన్ హరిః ॥ 19

మహేశ్వరుడనియె : ప్రణమిల్లి అజరుని ఈశానుని అజుని నిత్యుని అనామయుని దేవుని సర్వేశ్వరుని విష్ణువును సర్వ వ్యాపిని అవ్యయుని జనార్దనుని నమస్కరించి అమోఘము అప్రతిహతము సర్వదుఃఖ నివారణము నగు విష్ణువుయొక్క ప్రతిసరమును దొడుగుకొనుచున్నాను. విష్ణువు నాముందు రక్షించుత కృష్ణుడు వెనుక రక్షించుత హరినా శిరస్సును రక్షించుత జనార్దనుండు శిరస్సును హృదయమును గాపాడుత హృషీకేశుడు (ఇంద్రియముల నాయకుడు) నామనస్సును కేశవుడు నాజిహ్వను (నాలుకను) రక్షించుత వాసు దేవుడు నేత్రములను సంకర్షణుడు నాకర్ణములను రక్షించుత ప్రద్యుమ్నుడు నాఘ్రాణమును (ముక్కును) అనిరుద్ధుడు నాముఖమును వనమాలి నాగళమును శ్రీవత్సుడు నాముందును గాపాడుగాక ! చక్రము నా యెడమ రక్షయిచ్చుత నా సర్వాసుర విదారిణిగదాదేవి నా కుడివైపు కాపాడుత సుమాలి (వనమాలి) ఉదరమును గాపాడుత లాంగలి (నాగలియాయుధమైనవాడు) నావెనుక బ్రోచుత శార్ఙ్గి (శార్ఙ్గమనువిల్లు ధరించువాడు) నా చర్మమయములైన పిక్కలం గాపాడుత శంఖి (శంఖధారి) నాయిరు చేతులను పాశములను చరణములను (సంచారయోగ్యములను) రక్షించుత గరుడధ్వజుడు సర్వకార్యార్థసిద్ధికొఱకు నాకు రక్షయిచ్చుత వరాహమూర్తినీటిలో విషమములందు వామనుడు అడవిలో నరసింహుడు నన్ని యెడ కేశవుడు గాపాడుంగాక హిరణ్యగర్భుడు (కడుపు బంగారమైనవాడు) భగవంతునాకు హిరణ్యమును (వ్యుత్పత్తి) ఇచ్చుగాక సాంఖ్యాచార్యుడు కపిలుడు నా శరీర ధాతువులను సమముగా నొనరించుగాక శ్వేతద్వీపనివాసి నన్ను శ్వేతద్వీపమునకుం జేకొనిపోవుగాక మధుకైటభ సూదనుడు నా సర్వశత్రువులను సూదించుత (చంపుగాక) విష్ణువు నా శరీరమునుండి కిల్బిషమును వికర్షించుగాక (లాగివేయుత) హంసుడు మత్స్యమూర్తి కూర్మమూర్తి నన్నన్నిదిశలం గాపాడుత త్రివిక్రమదేవుడు నా సర్వపాశములం ద్రెంచుత నరనారాయణమూర్తి నా బుద్ధిని పాలించుగాక శేషుడు వినిర్మల జ్ఞానశేషుడు నా అజ్ఞానవినాశన మొనరించుత బడబాముఖుడు నేజేసిన కల్మషమును నశింపజేయుత. అశ్వమూర్ధుడు (హయగ్రీవుడు) ప్రభువు నాకు విద్యనిచ్చుత దత్తాత్రేయుడు నాసపుత్రపశుబాంధవముగ నన్నేలుత రాముడు పరశువుచే గండ్రగొడ్డలిచే) నా సర్వరోగములను నశింపజేయుగాక రక్షోఘ్నుడు (రాక్షసులంగొట్టినవాడు) దాశరథి మహాభుజుడు రాముడు నిత్యము నన్ను గాపాడుగాక యాదవకుమారుడు బలరాముడు నా శత్రువులను నాగలిచే హతమార్చుత. బాల్యమున ప్రలంబకేశి చాణూరపూతనా కంస నాశనుడు కృష్ణుడు నాకామములను (కోరికలను) ఒసంగుత. అంధకారము కాఱుచీకటి కృష్ణ పింగళమూర్తి (నలుపుజేగురురంగు గలిసిన వర్ణము) యున్నై పాశముచేబూనిన యంతకుని భయసంతప్తుడనై చూచుచున్నాను. అందు వలననే పుండరీకాక్షునచ్యుతుని శరణందితిని. యోగీశుని అతిరూపస్థుని (రూపాతీతుని నిరూపుని) చక్కని శీతాంశునట్లు నిర్మలుని శరణొంది నాడను నేను ధన్యుడను నాకునిత్యము విజయియై భగవానుడున్నాడు.

స్మృత్వా నారాయణం దేవం సర్వోపద్రవ నాశనమ్ । వైష్ణవం కవచం బద్ధ్వా విచరామి మహీ తలే ॥ 20
అప్రధృష్యోఽస్మి భూతానాం సర్వ విష్ణు మయోహ్యహమ్ । స్మరణా ద్దేవదేవస్య విష్ణో రమిత తేజసః ॥ 21
సిద్ధి ర్భవతు మే నిత్యం తథా మంత్ర ఉదాహృతః । యోమాం పశ్యతి చక్షుర్భ్యాం యంచ పశ్యామి చక్షుషా ॥ 22
సర్వాసాం సమదృష్టీనాం విష్ణు ర్బధ్నాతు చక్షుషా । వాసుదేవస్య యచ్చక్రం తస్య చక్రస్య యే అరాః ॥ 23
తేచ ఛిన్దన్తు మే పాపం మా మే హింసన్తు హింసకాః । రాక్షసేషు పిశాచేషు కాంతారే ష్వటవీషు చ ॥ 24
వివాదే రాజమార్గేషు ద్యూతేషు కలహేషు చ । నదీ సంతరణే ఘోరే సంప్రాప్తే ప్రాణ సంశయే ॥ 25
అగ్నిచోర నిపాతే చ సర్వగ్రహ నివారణే । విద్యు త్సర్ప విషోద్యోగే ఖా తోదే రిపు సంకటే ॥ 26
తథ్య మేత జ్జపే న్నిత్యం శారీరే భయ ఆగతే । అయం భగవతో మంత్రో మంత్రాణాం పరమో మహాన్ ॥ 27
విఖ్యాతం కవచం గుహ్యం సర్వపాప ప్రణాశనమ్ । స్వ మాయాకృత నిర్మాణం కల్పాంత గ్రహ లోపకృత్ ॥ 28

సర్వోపద్రవనాశనుని నారాయణ దేవుని దలచికొని విష్ణుకవచముంగట్టికొని మహీతలమందు జరింతును దాన భూతముల కప్రధృష్యుడనయ్యెదను నేను సర్వవిష్ణు మయుడను అమిత తేజస్విని దేవదేవుని విష్ణువుని స్మరించుటవలన నాకెప్పడు నుదాహృత మంత్రము (ఈవిష్ణుకవచము) సిద్ధించుగాక! ఎవ్వడు కన్నుల నన్ను జూచును నేను కంటనెవ్వనిం జూతును తన దృష్టితో విష్ణువా యెల్లదృష్టులనను సర్వసమదృష్టులతో ననుసంధించుగాక వాసుదేవుని చక్రముదాని అరలు (కన్నులు) అంచులు నా పాపమును త్రెంచుగాక నాహింసకులను హింసించుత రాక్షసులం పిశాచముల కాంతారములంగారడవుల వివాదముల రాజమార్గములందు జూదములం గలహములందు నదులుదాటునపుడు ఘోరమైన ప్రాణసంకటము ప్రాప్తించినపుడు అగ్నిచౌరనిపాతమందు నిపాతము ప్రమాదము సర్వగ్రహనివారణమందు విద్యుత్సర్ప విషస్పర్శయందు (నీటినుండి గుండములందు) బావులు నూతుల బడినపుడు శత్రుసంకటమందు శరీరమున భయమువచ్చినపుడు నిక్కమిది (తప్పక) నిత్యము జపింపవలయును ఇది భగవంతుని మంత్రము. మంత్రములకెల్ల పరమమంత్రము చాల గొప్పది. విష్ణుకవచమను ఖ్యాతిగన్నది. సర్వపాపహరము విష్ణువుతనమాయాశక్తిచే నిర్మించినది. కల్పాంత గృహలోప మొనరించును ప్రళయకాలబీభత్సము దోపనీదన్నమాట అనాద్యము జగద్బీజమది. తచ్ఛబ్దార్థము అగు పద్మనాభ నీకు నమస్కారము.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణమందు ప్రథమఖండమున శ్రీవిష్ణుకవచమను
రెండుపందల ముప్పదియేడవ అధ్యాయము.

ఓం కాలాయ స్వాహా ॥ ఓం కాలపురుషాయ స్వాహా ॥ ఓం ప్రచండాయ స్వాహా ॥ ఓం ప్రచండ పురుషాయ స్వాహా ॥ ఓం సర్వాయ స్వాహా ॥ ఓం సర్వ సర్వాయ స్వాహా ॥ ఓం నమో భువనేశాయ త్రిలోక ధామ్నే ఇతి టిపి రిటి స్వాహా ॥ ఓం ఉత్తమేన అఘేతు మే వాయుతు మే యే సత్వాః పాపానుచారాః తేషాం దైత్య దానవ యక్ష రాక్షస భూతప్రేత పిశాచ కూష్మాండా ఉపస్మా రోన్మాదన జ్వరాణాం ఏకాహిక ద్వితీయక తార్తీయక చాతుర్థిక మౌహూర్తిక దినజ్వర రాత్రిజ్వర సతతజ్వర సంధ్యాజ్వర సర్వజ్వరాదీనా ముత్సాదన లూతాకీటక కంటక కట పూతనా భుజగ స్థావర విష విషమ విషాదీనా మిదం శరీరం మమాఽ ప్రధృష్యం భవతు ఓం సుకారే ప్రకరోత్కటక వికట దంష్ట్రి పూర్వతో రక్ష! ఓం హైం హైం హైం హైం దినకర సహస్ర కాన్త సమోగ్ర తేజః పశ్చిమతో రక్ష రక్ష ! ॥ ఓం నిరినిరి ప్రదీప్త జ్వలన జ్వాలాకాల మహాకపిల జటిల ఉత్తరతో రక్ష ! ఓం చిలిచిలి మిలిమిలి చేవడి గౌరి గాంధారి విషో హని విషం మాం మోహయతు స్వాహా ॥ దక్షిణతో రక్ష ! మా మముకస్య సర్వభూత భయోపద్రవేభ్యః స్వాహా ॥ జయతి విజయదానం జాయతాం రిపుపుర హాస నున నధ్యతే భయహృదయ

భయదోభయే భయం దిశతు మమాయ ముదార మచ్యుతః ॥ యదుదర మఖిలం విశన్తి రశ్మయః ॥
ఆద్యన్త వన్తః కవయః పురాణాః సూక్ష్మా బృహన్తో హ్యనుశాసితారః ।
సర్వ జ్వరాన్ ఘ్నన్తు మమా నిరుద్ధ ప్రద్యుమ్న సంకర్షణ వాసుదేవాః ॥

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే విష్ణుకవచమ్‌నామ సప్తత్రింశదుత్తర ద్విశతతమోఽధ్యాయః ॥

## రెండువందల ముప్పదిఏనిమిదవ అధ్యాయము - బలిరావణసమాగమము

వజ్రః- శ్రుత్వా కాలాంగ దహనం బ్రాహ్మణేన స మీరితమ్ । కిం పప్రచ్ఛ తదా బ్రహ్మన్ ! శైలూషో మృత్యుచోదితః ॥
మార్కండేయః- శ్రుత్వా కాలాంగ దహనం బ్రాహ్మణేనస మీరితమ్ । రావణస్యైవ చరితం భూయః పప్రచ్ఛ తం తదా ॥
శైలూషః- చరిత స్యావశేషం యద్దశ గ్రీవస్య రక్షసః । త దహం శ్రోతు మిచ్ఛామి తత్రమే సం శయో మహాన్ ॥
నాడాయనః- తతోఽ స్య నగరం భూయః పరి చక్రామ రావణః । సదదర్శ తదా తత్ర ప్రాసాదం సర్వకాంచనమ్ ॥
ముక్తా జాల పరిక్షిప్తం తథా విద్రుమ తోరణమ్ । గారుడేన చ రక్తేన సమన్తా త్కృత వేదికమ్ ॥ 5
వైడూర్య రుచిర స్తంభం పద్మరాగ ప్రభోజ్జ్వలమ్ । ఇంద్రనీల ప్రభాచ్ఛన్నం నిర్వ్యూహ శత శోభితమ్ ॥ 6
మహాభువన సంబాధం మహోద్యాన విభూషితమ్ । సుఖారోహణ సోపానం దీర్ఘికా శత సంకులమ్ ॥ 7
సర్వర్తు కుసుమైః వృక్షైః సమన్తా దుపశోభితమ్ । సర్వాసన యుతం రమ్యం మహేంద్ర భవనాధికమ్ ॥ 8
తంతు దృష్ట్వా గృహంరాజప్రహస్తం వాక్య మబ్రవీత్ । ప్రహస్త ! శీఘ్రం జానీహి ! కస్యేదం భవనోత్తమమ్ ॥ 9
ఏవముక్తః ప్రహస్తస్తు ప్రవివేశ గృహోత్తమమ్ ।

వజ్రనృపతి బ్రాహ్మణుని వలన నాడాయనుని కాలాంగదహనము (యముని శరీరదహనకథ) విని శైలూషుడు (గంధర్వ రాజు) మృత్యుచోదితుడై మఱియే మడిగెనుడువుమన మార్కండేయు డిట్లనియె. విప్రునివలన నీకథవిని రావణచరిత్ర నాలించి శైలూషుడు దశగ్రీవుని కడమ చరిత్రను వినగోరెదనన నాడాయనుం డిట్లనియె. అవ్వల నితని నగరము జుట్టుదిరిగి (కుబేరనగరమును) అక్కడ సర్వ స్వర్ణమయమైన యొక ప్రాసాదముం జూచెను. అందు ముత్యాల జాలరు లంకరింపబడి వేలుచున్నవి. పవడపు స్తంభములు ఎఱ్ఱని గారుడమణులు తాపిన వేదిక లెటు చూచినను వైడూర్యములు పొదిగిన స్తంభములు ఇంద్రనీల పద్మరాగ ప్రభాపుంజ మంజుల మా సౌధము వందల కొలది నిర్వ్యూహములచే (వాకిళ్ళు-ద్వారములచే) మహాభవన సమ్మర్దము. మహోద్యాన విభూషితము. చాల సుఖముగ నెక్కదగిన మెట్లుగలది. వందల కొలది దిగుడు బావులు గలది. సర్వర్తుకుసుమములైన తరువులతో నెల్లెడ సొంపుగుల్కుచున్నది. సర్వవిధరమ్యాసనము. దేవేంద్రభవనము మించినది. ఆ గృహముంగని రావణుడు ప్రహస్తమంత్రితో ఇది యెవ్వని భవన రాజమో శీఘ్రముగ తెలిసికొనుమన ప్రహస్తుడా గృహములో బ్రవేశించెను.

సంప్రాప్తాయాం చ కక్షాయాం భిన్నాంజనచయోపమమ్ ॥ 10
సర్వాభరణ సంవీతం సర్వలక్షణ లక్షితమ్ । గృహీత్వా లోహముసలం ద్వారదేశే వ్యవస్థితమ్ ॥ 11
దదర్శ పురుషం భీమం జ్వాలా మండల దుర్దశమ్ । తం తు దృష్ట్వా తథా భూతం స వివేశ దశాననః ॥ 12
సమాప్తాయాం కక్షాయాం స దదర్శ త మేవహి । తమువాచ మహాతేజాః నిశాచర గణేశ్వరః ॥ 13
యుద్ధార్థ్యహ మను ప్రాప్తో యుద్ధాతిథ్యం ప్రయచ్ఛమే । అథవా తస్య శంస ! త్వం గృహే యోఽ స్మిన్ వ్యవస్థితః ॥
తతో రాక్షసరాజస్య పురుషో వాక్య మబ్రవీత్ । తిష్ఠ త్యస్మిన్ గృహేరాజా దానవానాం బలిర్బలీ ॥ 15
తేన చేద్యోత్స్యసే వీర !ప్రవిశేదం గృహోత్తమమ్ । యోద్ధుం నార్హసి తేన త్వం స మహాత్మా మహాబలః ॥ 16

బ్రహ్మణ్య శ్చ శరణ్య శ్చ శూర స్సత్య పరాక్రమః వీరో బహుగుణో పేతో బలవాన్ దృఢవిక్రమః ।
బాలార్క ఇవ తేజస్వీ సమరేష్వని వర్తకః ॥ 17
ప్రియంవదః సంవిభాగీ గూఢ సాక్ష్యాయ తత్పరః। ఏవముక్తో దశగ్రీవః ప్రవివేశ గృహోత్తమమ్ ॥ 18
అథ సందర్శనా దేవ బలినా సు మహాత్మనా । శీఘ్ర ముత్సంగ మారోప్య పృష్ట స్స్వాగమనం తతః ॥ 19
తస్యో వాచ మహాతేజాః రావణో రాక్షసాధిపః । శ్రుతం మయా మహాభాగ ! బద్ధ స్త్వం కిల విష్ణునా ॥ 20

అతడు తొలి వాకిటికిరాగా నూరిన కాటుకవలెనున్న సర్వాభరణములు దాల్చిన సర్వలక్షణ లక్షితుడైన యొకనిని ఇనుప రోకలి పట్టుకొని ద్వారమందున్న భయంకరునినొక్క నరుని జ్వాలా మండలముచే దుర్నిరీక్ష్యుని జూచి దశకంఠుడాకక్ష్యం బ్రవేశించెను. ఆ వాకిలి తుదిని మరల నా పురుషునే చూచెను. నిశాచర గణేశ్వరుడు మహాతేజస్వి వానింగని యుద్ధము కోరివచ్చితిని. నాకు యుద్ధాతిథ్యమిమ్ము లేదా చెప్పు మీ యింటిలోనున్న వానిని. అవ్వల నా పురుషుడ రాక్షస రాజుతో దానవరాజు బలియైన బలి యీ యింట నున్నాడు. ఓ వీరుడ ! వానితో బోరగలవేని యీ యింట బ్రవేశింపుము. అతనితో నీవు పోర నర్హుడవుగావు. అతడు మహాత్ముడు మహాబలుడు బ్రహ్మణ్యుడు శరణ్యుడు శూరుడు సత్యపరాక్రముడు వీరుడు బహుగుణ సంపన్నుడు బలవంతుడు దృఢవిక్రముడు మధుర ప్రియ వచనుడు పురుషార్థములను సమవిభాగము చేసి యనుభవించువాడు లేదావిచక్షణశీలుడు గూఢసాక్ష్య తత్పరుడు. (రహస్య మంత్రాలోచన పరుడన్నమాట) ఇట్లుబలుక విని రాక్షసుల ఱేడాలోనం బ్రవేశించె. ప్రవేశించి మహానుభావ ! విన్నాను నీవు విష్ణువుచే గట్టబడినట్లు నేనునీ బంధ మోచనముగావింప సమర్థుడను సంశయము వలదు. అనిన బలి నవ్వి యిట్లనియె.

సోఽహం మోచయితుం శక్తో బంధనా త్త్వాం న సంశయః । ఏవముక్త స్తతో హాసం బలి ర్ముక్త్వేద మబ్రవీత్ ॥ 21
ఏతేమేకుండలే దివ్యే మహారత్నో పశోభితే । అనయోరేక మానీయ చాత్రోపవిశః మాచిరమ్ ॥ 22
అత్రోపవిష్టస్య చ తే వ్యాఖ్యాస్యే విష్ణు విక్రమమ్ । ఏవముక్తో దశగ్రీవః కుండలా నయనే తతః ॥ 23
చకార పరమం యత్నం న శశాకచ శత్రు హా । యదా చలయితుం స్థానా న్న శశాక స కుండలమ్ ॥ 24
ప్రస్విన్న సర్వగాత్రస్తు సందష్ట దశన చ్ఛదః । భ్రుకుటీ సంకట ముఖః పరం విస్మయ మాగతః ॥ 25
ఉత్సంగే తదవస్థే తు బలిః కృత్వేద మబ్రవీత్ ।

ఇదిగో నా కుండలములివి. దివ్యములు అమూల్యరత్న శోభితములు. ఇందొకటి గొనితెచ్చి యక్కడ గూర్చుండుము. ఆలసింపకు. ఇక్కడ నీవుపవేశించిన తర్వాత నీకు విష్ణు విక్రమము చెప్పెదను. అనవిని దశగ్రీవుడు కుండలముంగొనిరానెంతేని యత్నము సేసెను. కాని తేజాలడయ్యెను. అతడు కుండలమునున్నతా వందు కదల్పనైన జేతగానివాడై యయ్యెడ నొడ లెల్ల ముచ్చెమటలు వోసి పెదవులు గొరికికొని కనుబొమ్మలు ముడివడిన మొగముతో మిక్కిలి యాశ్చర్యపడెను. ఆ యవస్థలో బలి వానిందన తొడపై నునిచికొని యిట్లనియె.

హిరణ్యకశిపుర్నామాఽ భవన్మే ప్రపితా మహః ॥ 26
యదా బభూవ తస్యేమే కుండలే వై బభూవతుః । ఏతాభ్యాం కుండలాభ్యాంతు సోఽభూ త్పూర్వం విభూషితః ॥ 27
ఊరో రారోప్య నఖరైః కరై స్తేన విదారితః । కథ మద్య మహాభాగం తం త్వం జేతుం వ్యవస్యసి ॥ 28
స ఏవ పురుషః శ్యామో ద్వారి తిష్ఠతి నిత్యశః । ఏతేన దానవేంద్రా శ్చ తథాన్యే బల దర్పితాః ॥ 29
వశం నీతా బలవతా పూర్వపూర్వ తరాశ్చ యే । బద్ధశ్చాహ మనేనైవ కాలోఽయం దురతి క్రమః ॥ 30
క ఏనం పురుషం లోకే వంచ యిష్యతి రాక్షసః । లోక త్రయస్య సర్వస్వ కర్తా హర్తా తథైవ చ ॥ 31
సంహర త్యేష భూతాని స్థావరాణి చరాణి చ । పున శ్చ సృజతే సర్వ మనాద్యన్తో మహేశ్వరః ॥ 32
ఇష్టం చైవ హుతంచైవ తపస్తప్తం తథైవ చ । సర్వస్యేవహి లోకేశో ధా తా గోప్తా న సంశయః ॥ 33

సర్వదేవ మయశ్చైవ సర్వభూత మయ స్తథా । సర్వలోక మయశ్చైవ సర్వజ్ఞాన మయ స్తథా ॥ 34
సర్వరూపీ మహారూపీ మహాబాలో మహాభుజః । స్మృత్వా స్తుత్వా తథేష్ట్వాచ సర్వ మస్మా దవాప్నుయాత్ ॥ 35
ఏతచ్ఛ్రుత్వా చ వచనం రావణో నిర్యయౌ తదా । న చ తం పురుషం తత్ర ద దర్శ రజనీచరః ॥ 36
సమేత్య రక్షోఽధి పతిః సహాయః చచార భూయః పృథివీం సమగ్రామ్ ।
న చాప్యసౌ కశ్చి దపశ్యతాఽన్యం లోకేషు ధీరం త్రిదశారి ముఖ్యః ॥ 37

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే బలిరావణ సమాగమోనామ అష్టత్రింశదుత్తర ద్విశతతమోఽధ్యాయః ॥

మా తాత పితామహుడు హిరణ్యకశిపుడనుపేరి వాడుండెను. ఈ కుండలములాతనికి జెందియుండెను. వీనిని నతడు సింగారించుకొనువాడు. సీవన్నావే యాతడు (విష్ణువు) ఆతనిందన తొడలపై నెక్కించుకొని గోళ్లచే జీల్చె. అట్టి మహాభాగుని నీ వెట్లు గెలువ సమకట్టితివి? ఆతడే నల్లని యా పురుషుడే ద్వారమందు నిత్యముండును. బలవంతుడు వీనిచే బలదర్పితులు దానవేంద్రులు పెక్కురు స్వాధీనముసేసికొనబడిరి. ముందటి వారంతకు ముందటి వారెందరో లొంగిపోయినారు. వీనిచేతనే నేను బంధింప బడినాను. కాలము గడుప శక్యముగానిది. రాక్షస! ఈ మగవాని నెవ్వడు లోకమందు వంచింప గలవాడు. ముల్లోకముల కితడు కర్త హర్తయును చరాచర భూతముల నీతడు సంహరించును. మఱల సృజించు వీనికాది లేదు. తుదలేదు. మహేశ్వరుడీతడు. ఇష్టము (యజ్ఞములాచరించుట) హుతముహోమములు సేయుట తపస్సు తపించుటయు నను నీ యంతకు నితడు ధాతయు (చేయువాడు) గోప్తయును (రక్షించువాడును) సంశయములేదు. సర్వదేవమయు డీతడు సర్వభూతమయుడును సర్వలోకమయుడు సర్వజ్ఞానమయుడు, సర్వరూపిమహారూపి మహాబలుడు మహాభుజుడు. ఇతనిం దలచికొని స్తుతించి యజించి సర్వము నీతనివలన బొందవలయును. అని విని రావణుడప్పుడు వెళ్లిపోయెను. నిశాచరుడతడా పురుషునచ్చట గానకపోయెను. రక్షోధిపతి వెనుకకువచ్చి సహాయుడై సమగ్ర పృథివిందిఱుగాడి మరియొక్క ధీరు నెవ్వనిం (దనతో బోరగల వానిని) గన డయ్యెను.

ఇది శ్రీ విష్ణుధర్మోత్తరమహాపురాణము ప్రథమఖండమున బలిరావణ సమాగమమను
రెండువందల ముప్పదియెనిమిదవ అధ్యాయము.

## రెండువందలముప్పదితొమ్మిదవ అధ్యాయము - రావణునికి మహాపురుషదర్శనము

నాడాయనః : స కదాచి న్మహీం సర్వాం విచరన్ ధనదానుజః । పశ్చిమే సాగరద్వీపే దదర్శ పురుషం శుభమ్ ॥ 1
జాంబూనద సమప్రఖ్యం జ్వలితానల సుప్రభమ్ ।విశ్వరూప ధరం దేవం వరదం కామ రూపిణమ్ ॥ 2
ధర్మ స్తస్య తపశ్చైవ జగతః సిద్ధి హేతుకే । ఊరూ చాశ్రిత్య తస్థాతే మన్మథః శిశ్న మాశ్రితః ॥ 3
విశ్వేదేవాః కటీభాగే మరుతో బస్తిశీర్షకే । పాదయోశ్చ ధరాదేవీ పిశాచాశ్చ నఖాశ్రితాః ॥ 4
మధ్యేఽష్టౌ వసవ స్తస్య సముద్రాః కుక్షిమాశ్రితాః । పార్శ్వేషు చ దిశ స్సర్వాః పర్వ సంధిషు మారుతః ॥ 5
పితర శ్చాశ్రితాః పృష్ఠే హృదయే చ పితామహః । గోదానాని పవిత్రాణి భూమిదానాని యాని చ ॥ 6
సు పర్ణస్య చ దానాని యక్ష లోమాన్త రాణి చ । అస్థిభాగేషు శైలాశ్చ శిరాసు సరిత స్తథా ॥ 7
మణి వక్షోఽభవ త్తస్య శరీరే ద్యౌ రవస్థితా । కృకాటికాయాం సంధ్యా శ్చ తలవాహాశ్చ యే ఘనాః ॥ 8
బాహూ ధాతా విధాతా చ భగః పూషా తథా కరౌ । నాగా ఘోరవిషాః సర్వే కరజేషు వ్యవస్థితాః ॥ 9
అగ్ని రాస్య మభూ త్తస్య స్కంధౌ రుద్రై రధిష్ఠితౌ । దన్తా మాస రవ శ్చైవ దంష్ట్రా స్తస్య తు వత్సరః ॥ 10
నాసాయాం చా ప్యమావాస్యా తచ్ఛిద్రేషు చ వాసరాః । గ్రీవా తస్యాఽభవ ద్వేదీ వాణీ చాథ సరస్వతీ ॥ 11

నాసత్యౌ శ్రవణౌ చోభౌ నేత్రే శశి దివాకరౌ । వేదాంగాని చ యజ్ఞాశ్చ తారా రూపాణి యాని చ ॥ 12
ఏతాని నరరూపస్య తస్య దేహాశ్రితాని వై । తేనాతి కాయాని తదా రాక్షసః పాణి పీడితః ॥ 13
ముమూర్ఛ సచివా శ్చాస్యా పలాయన్త దిశోదశ । ఋగ్వేద ప్రతిమః శ్రేష్ఠః పద్మమాలా విభూషితః ॥ 14
క్రమేణ చ వివేశాథ పాతాలం గిరి సన్నిభః ।

నాడాయనుడనియె. కుబేరుని తమ్ముడారావణుడు సర్వభూమిం జరించుచు బంగారపురంగు మేనిచాయ జ్వలించు నగ్నిం బోలిన ప్రభయు గల్గి కామరూపియై విశ్వరూపధరుడైన స్వామిని వరదునిగాంచెను. ఆ మహాపురుషుని ధర్మము తపస్సు జగత్ప్రతిష్ఠకు కారణములైనవి యాయన యూరువుల నాశ్రయించి యుండెను. మన్మథుడు లింగమందుండెను. విశ్వేదేవులు నడుమున మరుత్తులు బొత్తికడుపున భూదేవి పాదములందు పిశాచులు గోళ్ళయందు నడుమునందష్టవసువులు సముద్రములు కడుపున ప్రక్కలం దెల్లదిశలు సర్వసంధులందు వాయువు పృష్ఠమందు పితరులు హృదయమందు బ్రహ్మ గో భూహిరణ్య దానములు యకృల్లోమాంతరములందు అస్థిభాగములందు పర్వతులు (శిరలు) నాడులందు నదులు రొమ్మున మణులు శరీరమందు అంతరిక్షము కృకాటికయందు సంధ్యలు తలవాహములందు మేఘములు ధాత విధాత బాహువులుగ భగుడు పూషుడు కరములుగ నఖములందు ఘోర విషసర్పము లుండెను అగ్ని ముఖము మూపులు రుద్రులు. మాసములు ఋతువులు దంతములు సంవత్సరము దంష్ట్రి (కోర) నాసికయంద మావాస్య ముకురంధ్రములందు దినములు మెడ వేరెక వాణి సరస్వతి చెవులశ్వినీదేవతలు కన్నులు చంద్ర సూర్యులు వేదాంగములు యజ్ఞములు కంటిగ్రుడ్లుగను నుండెను. అట్టి మహాకాయునిచేత చేయిపట్టుకొని మెలిపెట్టబడి రావణుడు మూర్ఛపడెను. వాని మంత్రులు పారిపోయిరి. ఋగ్వేదసమానుడాతడు పెద్ద కొండవలెనున్నవాడు పద్మమాలాభూషితుడు క్రమముగ నేగి పాతాళముం బ్రవేశించెను.

ఉత్థాయచ దశగ్రీవ శ్చా హూయ సచివ త్రయమ్ ॥ 15
క్వగతః సహసా బ్రూత ప్రహస్త శుక సారణాః । ఏవముక్తే రాక్షసేంద్రే రాక్షసా స్త మథాఽబ్రువన్ ॥ 16
ప్రవిష్టః స నరోఽత్రైవ దేవ దానవ దర్పహా । తలేన తేనైవ తతః ప్రవివేశ నిశాచరః ॥ 17
ఏక ఏవ మహాతేజాః వరదానాత్ స్వయం భువః । ప్రవిశ్య దదృశే తత్ర సర్వాభరణ భూషితాన్ ॥ 18

దశకంఠుడు మూర్ఛనుండి తెలివిగొని లేచి ప్రహస్త శుక సారణుల ముగ్గుర నాతడెటువోయెనని యడిగెను. దేవదానవ దర్పహరుడానరుడిక్కడనే భూతలముం బ్రవేశించెనన నిశాచరుడు దానునట ప్రవేశించెను. బ్రహ్మ వరబలమున నొక్కడే యటుచని సర్వాభరణ భూషితు నా పురుషుని జూచెను.

నిత్యోత్సవాన్ శాంత భయాన్ నిష్కలాన్ పావక ప్రభాన్ । చతుర్భుజాన్ మహారూపాన్ శ్రీవత్స కృత లాంఛనాన్ ॥
ఏకరూప ధరాన్ సర్వాన్ రక్తమాల్యాను లేపనాన్ । రాగద్వేష వినిర్ముక్తాన్ సర్వశక్తీన్ జగత్ప్రభూన్ ॥ 20
నృత్యేన గీతవాద్యేన సేవమానాన్ జనార్దనమ్ । మానుష్యం పూజనం కృత్వా దేవదేవస్య చక్రిణః ॥ 21
సమీపం స మనుప్రాప్తా స్తస్యైవ పరమేష్ఠినః । దృష్టాః కోట్యః సహస్రాణాం దృష్ట్వా చ రజనీ చరః ॥ 22
ఊర్ధ్వ రోమా తత స్తస్మా ద్దేశా ద్దేశ మపాసరత్ । జగామ దదృశేఽప్యత్రా ప్యనౌపమ్య గుణం గృహమ్ ॥ 23

అక్కడ నిత్యోత్సవులై నిర్భయులై నిష్కాములై యావక కాంతిగల్గి నాల్గుభుజములు శ్రీవత్స చిహ్నము మహారూపము గల్గి యందరు నొకేరూపువారై రక్త మాల్యానులేపనులై రాగద్వేషములులేక సర్వశక్తులు గలవారై జగములకు బ్రభువులైయున్న వారిం గనెను. వారు నృత్యముచేయుచు గీతవాద్యములు మేళవించుచు జనార్దనుని సేవించుచుండిరి. చక్రాయుధుని మానవమూర్తిగా బూజించుచు నాయన సామీప్యమునయ్యందరు పొందిరి వారు వేలువేలు కోట్లమంది యటగనబడిరి. వారింజూచి రాక్షసుడ మేని రోమములు నిగ్గుడ నటనుండి తొలగిపోయెను. ఆ సమీపమున ననుపమానమైన యొక గృహముం జూచెను,

దదర్శ చ తదా తత్ర పురుషం శయనే స్థితమ్ । పాండురేణ మహార్షేణ శయనా సన వాససా ॥ 24
శేతే స పురుష వ్యాఘ్రః పావకేనా వ గుంఠితః । దివ్యగంధాను లిప్తాంగో దివ్యాభరణ భూషితః ॥ 25
దివ్యాంబరధరా సాధ్వీ త్రైలోక్య స్యైక భూషణమ్ । వాలవ్యజన హస్తావై రూపేణా ప్రతిమాభువి ॥ 26
పాదా వుత్సంగ ఆరోప్య తస్యదేవస్య చక్రిణః । జి ఘృక్షుః సహసా సాధ్వీం రాక్షసేభ్యోఽ పతద్బలాత్ ॥ 27
అవ గుంఠన మాత్రం వై దృష్టం తేన మహాత్మనః । జహాసోచ్చై స్తదా దేవో దృష్ట్వాతం రాక్షసేశ్వరమ్ ॥ 28
తేజసా సతు దేవస్య రావణో లోక రావణః । కృన్త మూలో యథాశాఖీ నిపపాత మహీతలే ॥ 29
పతితం రాక్షసేంద్రం తం దేవో వచన మబ్రవీత్ । ఉత్తిష్ఠ మరణం నాస్తి సాంప్రతం తే నిశాచర ! ॥ 30
ప్రజాపతి వరో రక్షో యేన జీవసి సాంప్రతమ్ । త మబ్రవీ త్తదా రాజా రాక్షసానాం తు విహ్వలః ॥ 31
కో భవాన్ శయనే శేతే యుగా న్తాఽ నల సన్నిభః । ఏవముక్తః స తేనాథ ప్రత్యువాచ నిశాచరమ్ ॥ 32
కింతే మయా దశగ్రీవ ! వధ్యోఽసి నచిరా న్మమ । ఏవ మేవ చ మృత్యుస్తే భవిష్యతి దశానన ! ॥ 33
యాం జిఘృక్షసి మోహా త్త్వం భూయశ్చైనాం హరిష్యసి । మానుష్య మహ మాసాద్య త్వాం వధిష్యామి రావణ ! ॥ 34
అస్యాః కృతే విశాలాక్ష్యాః సాంప్రతం గచ్ఛ రాక్షస । శ్రుత్వై త ద్వచనం దేవా ద్రావణో వాక్య మబ్రవీత్ ॥ 35
నాస్తి ధన్యతరో లోకే మ్మయా లోకత్రయే విభా । త్వద్ధస్తా న్మరణం యస్యభవిష్యతి జగత్ప్రభో ! ॥ 36
యశస్యం శ్లాఘనీయంచ త్వద్ధస్తా న్మరణం మమ । అథాస్య గాత్రే సంపశ్య ద్రావణో భీమ విక్రమః ॥ 37
త్రైలోక్యం సకలం రాజన్ ! విశ్వరూప ధరస్య తు । దృష్ట్వైత ద్రావణో రాజన్ ! విస్మయో త్ఫుల్ల లోచనః ॥ 38
బహు మేనే తథాత్మానం నిర్జగామ తథైవ చ । దేవ దేవాభ్యను జ్ఞాతః స జగామ తదా గృహమ్ ॥ 39
తస్య దేవో వధార్థాయ చతుర్మూర్తి ర్జనార్దనః । మానుష్య మాగతం రాజన్ ! తేన మా విగ్రహం కృథాః ॥ 40
రామో జనార్దనః సాక్షాత్ సీతా లక్ష్మీ స్తథైవ చ । తథా భరత శత్రుఘ్నౌ లక్ష్మణోఽపి మహాయశాః ॥ 41
విష్ణోర్భాగా స్తథా జ్ఞేయాః విష్ణుతుల్య పరాక్రమాః । శత్రుఘ్నేన మహత్ కర్మ లవణస్య వధేకృతమ్
తస్మా ద భ్యధికం మన్యే భరతం ధర్మవత్సలమ్ ॥
న దేవ సంఘైర్మనుజై ర్నయక్షైః । న రాక్షసైః నాగవరై ర్నదైత్యైః ।
రణే విజేతుం రఘవస్తు శక్యాః యేషాం స నాథో హరి ర ప్రమేయః ॥ 43

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే రావణస్య మహాపురుషదర్శనంనామ
ఏకోన చత్వారింశ త్తమోఽధ్యాయః ॥

అప్పుడక్కడను తల్పమందున్న యా పురుషుంజూచెను. అందు పరువబడిన దుప్పటి చాల విలువైనది అచ్చము తెల్లనిది. ఆ పురుషశ్రేష్ఠుడు నిప్పుంగప్పుకొని యట శయనించును ఆతడు దివ్యగంధములు పూసికొన్నాడు. దివ్య భూషణములు దొడిగికొన్నాడు. త్రిభువన భూషణమైన యొక సాధ్వి దివ్యమైన చీరదాల్చి వింజామర చేబూని యట రూపమందామెకు మరి సాటిలేదు. ఆయన పాదములు నొడిలో నుంచుకొని యున్నది.

ఆ సాధ్విం జంపనెంచి రాక్షసుడు తటాలున దూకెను. అప్పుడా మహాత్మునిపై యగ్నిరూపమయిన కప్పువస్త్రము మాత్రమారాక్షసునికి గనబడెను. ఆరాక్షసేశ్వరునిగని స్వామి బిగ్గరగా నవ్వెను. ఆ స్వామి తేజస్సుచే రావణు మొదలునరకిన వృక్షమట్లు నేలంగూలెను. వానింజూచి హరి నిశాచర ! లెమ్ము నీకిప్పుడు చావులేదు. బ్రహ్మ వరమున నీవిప్పుడు బ్రతికిపోయితి వనెను. రాక్షసరాజు బెంబేలుపడి పాన్పున బరున్న నీవెవ్వడవు ? ప్రళయాగ్ని నున్నావని యడిగెను. శ్రీహరి వానికిట్లు బదులు పలికెను. దశగ్రీవ ! నీకు నాతో నేమిపని ? అచిరకాలములో నాచే వధింపబడనున్నావు. మృత్యువీతీరుననే నీకుగానున్నది. నీవి

శైలూషుడు శత్రుఘ్నుడు సేసిన లవణవధనుగూర్చి వినగోరెదనన నాడాయనుడు పలికెను. రాజా! దాశరథి శ్రీరాముడు ఆయోధ్యయైన = యుద్ధముచేసి స్వాధీనము సేసికొనశక్యముగాని అయోధ్యయందున్న కొలదికాలమునకు వేడుకనించు వసంతమున ఎక్కువవేడి చలి లేనందున సర్వప్రాణులకును నింపుగూర్చుతటి చక్కగపూచిన తరువులందు మూగి ఝంకారములు సేయు తుమ్మెదలతో కోకిల కూతలతో చెట్లుచక్కగ చిగిరించినవేళ సూర్యకిరణములు సుఖస్పర్శములయినప్పుడు ధరాతలమెల్లజక్కగ సింగారించుకొన్నప్పుడు తీయమామిడి చెట్లకొమ్మలపైనున్న కోకిలలు కూయుచున్న సమయమందు ప్రవాసమేగిన జనులు దారి మరలి గృహోన్ముఖులయిరి. మన్మథవర్ధనమైన కాలముగనుక వియోగముసైపలేక యిండ్లకు మరలుచుండిరన్నమాట) తుమ్మెదలు వ్రాలిన తీయమామిడి పూగుత్తులు కాముని పేరుపేరు చెక్కిన కామబాణములట్లు శోభించి కామినీకాముకులకు రతివర్ధనములయ్యెను. వాయు వెల్లెడల దాక్షిణ్యమును వెల్లడించుచుండెను. అనగా నీగాలి దక్షిణదిశనుండి వచ్చుమలయమారుతమని గుర్తింపవీలుగా మందముగా సువాసనల జిమ్ముచు చల్లనై వీచుచుండెనన్నమాట. అదిగాక వాయువు దక్షిణ నాయకత్వమును వెల్లడించుకొనుచుండెనని రెండవఅర్థము ఆయర్థములో పెక్కుమంది నాయికలందు హెచ్చుతగ్గులు లేకుండ యందరియందు సమానానురాగ హావభావాదులను ప్రదర్శించు నాయకుడు దక్షిణనాయకుడు గావున నీవసంత ఋతువులో లేచు మలయమారుతమందరికిని సమముగ నానందకరమైయుండెననిభావము. మంద మారుతముచే రాల్పబడిన పువ్వులతో యవాంకురములతో నింపుగుల్కుచు ప్రవహించు నదివలె శ్వేదపంక్తి (జిల్లేడుచెట్లగుంపు మిగుల సొంపుగలిగెను వనరాజులు పంక్తులు) (వనములవరుసలు) నలుగడల మధునిచే వసంతునిచే గౌగలింపబడి వికసించి పలాశములతో మోదుగపూలతో దమంతదాము ప్రకటమైన (స్పష్టమైన) రాగమును ఎరుపును రక్తిమను బూనినవి. ఇక్కడ రెండవయర్థములు వనపంక్తియను నాయికలు వసంతుడను నాయకునిచే గౌగలింపబడి తమంతతాము ప్రౌఢనాయికలట్లు యనురక్తిని (అనురాగమును) ప్రణయమును ప్రదర్శించెను. మందవాయు (విసరి) పూలతో నాకులతో (పత్రితో) పూజింపబడి మహీ (భూ) దేవత పచ్చికలతోగూడి రాత్రియందు మబ్బులేని యాకాశముయొక్క సొంపును ధరించెను. పచ్చికబయళ్ళు నీలాకాశమట్లున్నవి. రాత్రులందు మలయమందపవనము విసరి రాలినపువ్వులు భూదేవి పూజాకుసుమములట్లున్నవి. అక్కడ పూజచేయువాడు వాయువయ్యెననియట చమత్కారము. ఓగంధర్వోత్తమ! అప్పుడే యానిమృదువుగ నంభారవములుసేయు లేగదూడలయొక్క మందలచే గోశాలలందలి శోభ మిక్కిలిగ నుండెను. అంభారవములు సేయుచు తురతుర నడుగులువేయుచు లేగలపై నుత్సుకములై (ముచ్చటగొన్నవై) సంజవేళ నావులాగోష్ఠములం ప్రవేశించుచుండెను. తోకలెత్తి తల్లులచనుగుడుచు నాగోవులు వానిమేనులు నాకుచుండ గోపకుల కదిజూడముచ్చట యగుచుండెను. కామినులయొక్క (స్త్రీలయొక్క) కరపల్లవములు పుష్పోచ్చయము సేయుచుండ (పూలు గోయుచుండ) నక్కడిచివుళ్ళతో నవి పోలియుండుటచే కాముకులంగనల యరచేతులం గుర్తింపలేకుండిరి. వారి మృదువైన యెఱ్ఱనైన చేతులు తరువుల తీగల చివురుటాకులు నొకే పోలికనున్నవని చమత్కారము. చిరుగాలికి కదలుతీగలు వసంతఋతు కోకిల సంగీతమును తుమ్మెదలరొదయను వీణను నాలించి (మే) నట్లువలె నృత్యముగావించినవి.

ఇది శ్రీ విష్ణుధర్మోత్తర మహాపురాణమందు ప్రథమఖండమున అయోధ్యావసంత వర్ణనమను
రెండువందలనలుబదియవ యధ్యాయము.

## రెండువందల నలుబది ఒకటవ అధ్యాయము - గ్రీష్మవర్ణనము

నాడాయనః : వర్తమానే తదా గ్రీష్మే వికసన్మల్లికా కులే । నివృత్త పాంథ సంచారే సంతప్త సికతోత్కరే ॥ 1

ప్రవుల్ల దాడిమాక్రాన్తే జ్వలితాభవనాన్తరే । చారు చంపక పుష్పాఢ్య వనరాజి విరాజితే ॥ 2

పాటలా పుష్ప సంలీన ద్విరేఫ గణమండితే । సంతప్త మహిషీ కోడ లుఠ త్పంకజ భూషణే ॥ 3

నిపతన్ మత్త మాతంగ ప్రస్ఫుర త్కుంభ నిర్గతా। ముక్తాఫలై ర్ణహాసోర్వీ శూరా లింగననిర్వృతా ॥ 16
హత కుంజర దంతాగ్ర వినగ్నాంగా స్తురంగమాః । ఆ సేదుః సుచిరే ణోర్వీం నభసీవ గతా సవః ॥ 17
సంప్రాప్త రుధిరాం భూమిం రక్తాస్యాస్తు నిశాచరాః । యయు శ్శరీరై ర్నిహతాః సమరే రుధిర ప్రియాః ॥ 18
వర్తమానే తథా భీమే యుద్ధే భీరు భయంకరే । లోకపాల శరవ్రాత నిర్భిన్నా రజనీచరాః ॥ 19
దుద్రువు ర్భయ సంవిగ్నా స్తదా రామ దిశోదిశ । విప్రద్రుతం బలం దృష్ట్వా రాక్షసానాం దివౌకసైః ॥ 20
సుమాలి ర్మాల్యవ ద్గుప్తో మాలీ దేవానథా బ్రవీత్ ।

అగస్త్యులనిరి. స్వసములై యున్న యాదేవరాక్షస బలములకు నానా విధాయుధోగ్రభుజులై జయముగోరి పోరువారి పెద్ద రణమయ్యెను. అపుడు సైన్యమను మబ్బులు గ్రమ్మిగగన మెల్ల కత్తులుమెఱపులట్లు మెరయు నాక్షణమందు భానుమంతుడు (సహస్ర కిరణుడు) విశేషద్యుతి మంతుడయ్యెను. చలించు ఖడ్గలతలనెడి విద్యుల్లతలచే నుద్యోతించు సేనయనెడి మేఘముయొక్క విగ్రహము నుండి (ఆకృతినుండి) యవనిపై రక్తవర్షము గురిసెను. రక్తవర్షముచే దడిసిన మేదినీతలమునందు భూతలమెల్ల గప్పుడునట్లు పెను రాళ్ల వర్షముపడెను. రక్తప్రవాహములందడిసి రజస్వలయైన వసితవోలె నగమ్యమయ్యెను. (బహిష్ఠమైన స్త్రీ ముట్టరానిదగుట ప్రసిద్ధము) యోధుల బాహువులు లోగడ చందనము పూసికొన్నవి ఖడ్గ ప్రహారములం వెగిపడి యైదుతలలపాములట్లు రణభూమిం దీపించుచుండెను. వారి మొగములు రక్తములతోడి పలువరుసలు వంటకుపయోగించు దానిమ్మపండ్లట్లు భాసించినవి. తెగికూలు గొడుగులు చామరములు చామరములతో తెగిపడిన వాహనాంగములతో నాకసము సంకులమయ్యెను. కూల్పబడు కిరీటములు కుండలములు హారములు కేయూరములు జాజుబందులు (అంగదములు) భుజకీర్తులతో నాకసము కిరణపుంజములతో రంజిల్లెను. కత్తులం దెగి ఏనుగుతొండములు పాముపడగలంబోలె రక్తము మడువుగట్టిన పుడమిపై దొరలాడుచున్నవి. ఇక్కడ నేలపై బడిన తలలం గానక కూలిన భటుల ప్రాణములు వంశములంగూర్చి వెదుకబోయెనాయన్నట్లాకసమున కరుగుదెంచినవి. నడిమింట నిహతులైన వీరుల శరీరములు భూతలముం బొందినవి. శరీరులు (జీవులు) దివముంబొందిరి. ఈవిధముగా వారు లోకత్రయముం గెలువగోరిన వారట్లు తోచిరి. తెగిన రాక్షసులమస్తకములు రక్తపు జుక్కలం రాలుచుండ పడినచోటునుండి దేగలెత్తికొనిపోవ నుత్తర దెసగా క్రిందబడిపోయినవి రాక్షసుల మాంసము పీకికొని దినగోరి యచట నెగురు దేగలకును తెగిపడుచున్న భటుల తలలకును సామ్యమేర్పడెను. అంగములు తెగిపడుటచే రక్తపుమడువులందడిసి క్రవ్యాదులు (పచ్చిమాంసము దిను రాక్షసులు) పెక్కుమంది యయ్యెడంబడి పుడమిం గౌగలించుకొని (పెద్ద) నిదురవోయిరి. శూరుల గౌగలింతలం మిక్కిలి తనివందినదివోలె కూలిపడు మదపు టేనుగుల బిట్టదరు కుంభస్థలమునుండి చెదరిపడు ముత్యాలతో నవని నవ్వుచుండెను. (ఒక శృంగార నాయికవలె నుండెనన్నమాట) యోధులు విరిచిన దంతములకొనలు మేనంగ్రుచ్చికొన్న గుఱ్ఱములు ప్రాణములువాసి చాలసేపటికి నభోమాసమందట్లవనింబడినవి. రక్తముఖులయిన రాక్షసులనిలో శరీరముతెగి రుధిర ప్రియులై (రక్తదాహముతోనట్లు) రక్తసిక్తమైన భూమింబొందిరి. పిరికివాండ్ర కతిభయంకరమైన యుద్ధమట్లు జరుగుచుండ లోకపాలుర బాణములదెగిన రాక్షసులు జడిసిపోయి పదిదెసలకుంబారిపోయిరి. దేవతల ధాకకు బెదరిపారు రాక్షససేనంగని సుమాలియు మాలియు మాల్యవంతునిచే (గుప్తుడు) రక్షితుడయ్యెను. అటుపై మాలి దేవతలపైకి పర్విడెను.

కిరఖ్చరౌషై ర్విమలై శ్శైలధౌతై శ్శిలాశితైః ॥ 21
సానుజేన రణేముక్త్వా శరవృష్టి ర్దురాసదా । సంఛాదయా మాస దిశః ప్రదిశ శ్చ దివౌకసామ్ ॥ 22
యథాశక్తి శరవ్రాతాన్ వారయన్తోఽపి దేవతాః । రాక్షసేంద్ర శరై ర్భిన్నాః కేశవంశరణం యయుః ॥ 23
స నివార్య తదా సర్వం దేవసైన్యం పతత్రిణా । ప్రత్యుద్యయౌ యుధో యోధాన్ ధనుషా సపతత్రిణా ॥ 24
ఏతస్మిన్నేవ కాలేతు రక్షసాం పీన వక్షసామ్ । వినివృత్తం బలం సర్వ మమరైః సమరోత్సుకమ్ ॥ 25

త ద్బలం సకలం చక్రే శరైః శార్ఙ్గ ప్రచోదితైః । ఛాదయా మాస సమరం గోభి స్సూర్య ఇవానిశమ్ ॥ 26
నానా ప్రహరణోదగ్ర గర్జమానో జనార్దనమ్ । సంఛాదయాస తదా సర్వైః ప్రహరణోత్కరైః ॥ 27
సంఛాద్యమానై స్తైర్ఘోరైః కేశవో రజనీచరైః । జహార శీర్షాణి తదా తేషాం సన్నత పర్వభిః ॥ 28
రథ నీడే ధనుర్న్యస్య మాలీ రాక్షస పుంగవః । సువర్ణం తాడయామాస గదయా భీమవేగయా ॥ 29
గదా ప్రహారాభిహత స్తార్క్ష్యః పరపురంజయః పరాఙ్ముఖం రణా చ్చక్రే వేదనార్తో జనార్దనమ్ ॥ 30
పరాఙ్ముఖే తదా తార్క్ష్యే పరివృత్తాననో హరిః । శీర్షం జహార చక్రేణ రాక్షసేంద్రస్య మాలినః ॥ 31
సకుండలం చారుకిరీట జుష్టం నిశాచరే శస్య శిరః పృథివ్యామ్ ।
నిపాతితం వీక్ష్య ముదాన్వితాస్తా నార్యో బభూవు స్త్రిదశోత్తమానామ్ ॥ 32

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే శైలూషంప్రతి నాడాయనానుశాసనే మాలి రాక్షసవధ వర్ణనంనామ సప్తదశోత్తర ద్విశతతమోఽధ్యాయః ॥

నూనెరాచి మెరుగు పదునుపెట్టబడిన రాళ్ళనుగూడ జీల్చగల బాణములచే దమ్మునితోగూడ యని యందు శరవర్షముగురిసి దేవతల దిక్కులను మూలలను గప్పివైచెను. వేల్పులు యథాశక్తిగ బాణజాలమును వారించియు రాక్షసేంద్రుని యలుగులం దెగి నారాయణుని శరణందిరి. ఆయన యయ్యెడ దేవసేన నాగుడని వారించి గరుడునెక్కి ధనువెత్తి యెదురు సనెను. ఇదే సమయమున బలిసిన రొమ్ములుగల రాక్షసులసేన యుద్ధోత్సుకమైనది దేవతలచే మరలింపబడెను. దానినెల్ల శార్ఙ్గ ధనుర్ముక్తములచే బాణములచే కిరణములచే సూర్యుడట్లు గప్పవడజేసెను. నానావిధాయుధములూనియుదగ్రముగ గర్జించుచు రాక్షసులు హరిం గప్పిరి. అట్లు రాక్షసులచే గ్రమ్మబడి సన్నతపర్వములైన బాణములచే హరి వారితలలు డుల్లనేసెను. రాక్షసపతి మాలి యరదము మొగసాల విల్లుంచి గదయెత్తి సుపర్ణునిం గొట్టెను. గదాభిఘాతము దిని గరుడుండు వేదనకు సుడిసి యుద్ధమునుండి పెడమొగము వెట్టెను. అయ్యెడ తార్క్ష్యుండు పరాఙ్ముఖుడయినంత మోమువెనుకకుద్రిప్పి హరి రాక్షసరాజగు మాలి శిరస్సును జక్రముచేదెగనేసెను. కుండలములతో చక్కని కిరీటముతో గూడిన యా నిశాచరేశ్వరుని తల యిలకుంబడగొట్టుటచూచి గూడి వేల్పుముదితలు ముదమునంగూడిరి.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమ ఖండమున మాలివధవర్ణనమను నూటపదునేడవ యధ్యాయము.

## రెండువందలపదునెనిమిదవ అధ్యాయము - రాక్షసపాతాళప్రవేశము

అగస్త్యః : హతే మాలిని దేవేన సాన్త్వితః పక్షిరా డసౌ ః జహార పక్షవాతేన నివృత్తో రక్షసాంబలమ్ ॥ 1
తే తార్క్ష్య పక్ష వాతేన శుష్కపర్ణ చయో యథా । ద్రుతా రాక్షస శార్దూలా స్తదా రామ దిశో దశ ॥ 2
అవింద మాథా స్తే శర్మ వాసుదేవ భయార్దితాః । పాతాల తల మాసేదుః సర్వ ఏవ పృథక్ పృథక్ ॥ 3
త్రిదశాన్ సాంత్వయి త్వా చ విష్ణు స్త్రి దశ పూజితః । అన్తర్ధానం యయౌ తత్ర సర్వేషా మేవ పశ్యతామ్ ॥ 4
లంకాఽపి శూన్యా రాజేంద్ర! దత్తా వైశ్రవణాయసా । స్వయం విశ్రవస స్తస్య రావణేన హృతా బలాత్ ॥ 5
విభీషణా య సా దత్తా త్వయా హత్వా చ రావణమ్ । రామ విష్ణుః సముత్పన్న స్త్వం వధాయేహ రక్షసామ్ ॥ 6
త్వయైవ యుద్ధే నిహతా యే తు మాతుల సంకటాః । పౌలస్త్య రాక్షసా యేతు తేహతాః సాంప్రతంత్వయా ॥ 7
హన్తా న విద్యతే రామః రక్షసాం కేశవం వినా । దృష్టోఽస్మి భాషిత శ్చేతి ప్రయయౌ స యథాగతమ్ ॥ 8

అగస్త్యులనిరి. మాలి కూలినతరువాత హరి కుశలప్రశ్నముచేసి యాదరించినతర్వాత మరలివెళ్ళి గరుత్మంతుడు తన రెక్కలగాలిచే రాక్షససైన్యమును బారగొట్టెను. వారు రెక్కలగాలికి ఎండుటాకులట్లెగిరిపోయిరి. పదిదిశలకుంబారి విష్ణువువలని

పార్వతోత్తుంగ మాతంగ విలోడిత జలాశయే । స్వాదు గావచ సలిలే నీహారావృత పర్వతే ॥ 4
కర్పూర చందనా ర్ద్రాంగ్యో మృణాల వలయాః ప్రియాః । రమయన్తి ప్రియాన్ యత్ర వనమాలా కృతస్రజః ॥ 5
సేవ్యా శ్చంద్రాంశవో యత్ర కామినాం కామవర్ధనాః । రమణీయ ప్రదోషాశ్చ సుతరాం యత్ర రాత్రయః ॥ 6
రాత్ర్యన్తే శీతలాన్ వాతాన్ కుసుమాశయ గంధినః । సమాఘ్రాయాభిజాయన్తే కామినస్తు రిరంసవః ॥ 7
రాత్రయః శీఘ్రగామిన్యో దివసా మందగామినః । మిథునోపగమాద్భానోః సంప్రతప్తాః భృశంకరాః ॥ 8
విలీన హిమ తోయేషు ఫేనపుంజ సమాకులాః । అత్యర్థ శీతా స్సరిత స్తథా హైమేన పర్వతాః ॥ 9
తథా బహుల నిర్యాస సురభీ కృత చందనైః । వర్ధయన్తి తథా కామం కామినీనాంతు కాముకాః ॥ 10
రత్యంతర సముత్పన్న మాయాసశ్రమజం జలం । కర్పూర.రజసా యత్ర నాశయన్తి స్మ కామినః ॥ 11
యస్మి న్నిదాఘే సలిలామవృక్షే విభూషణాఢ్యే నృప ! వత్సరస్య ।
దిదృక్షవస్తం రఘు బృందముఖ్యం తదా ప్రయాతా మునయ స్త్వయోధ్యామ్ ॥ 12

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే అయోధ్యాదర్శనే గ్రీష్మవర్ణనంనామ
ఏకచత్వారింశ దధిక ద్విశతతమోఽధ్యాయః ।

ఆ విధముగ గ్రీష్మర్తువు ప్రవర్తింప మల్లికలు చక్కగ వికసింప బాటసారులు సంచారములు మాని మిటల ఇసుకమేటలు గనగన గాలుచుండ దానిమ్మపూలు చక్కగ వికసింప లోగిళ్లు వేడిమిచేనలముకొన చక్కని సంపెంగపూలం బూదోటలు విరాజిల్లుచుండ పాటల కుసుమములపై వ్రాలిన తుమ్మెదల గుంపుతో నింపొదవ ఎండకు క్రాగిన గేదెల మూపులందు తామర పూల సింగారము గొని పర్వతములట్లెత్తైన యేనుగులచే మడుగులు కలచబడ నీరుతేరి తియ్యదనమొంద మంచుగవిసిన గిరిపై కర్పూరము చందనములు నలదినమేనులతో చలువకై తామరతూండ్లు బాహువులకు జుట్టుకొని వనమాలలతో (పద్మమాలలతో) నలంకరించుకొన్న పూలమాలలతో ముత్యాల రత్నాల పేరులతో బ్రియురాండ్రు ప్రియుల రమింప (ఆనందింప) జేయుచుండిరి . అక్కడ అట కాముకులకు కామవర్ధనములైన చంద్రకిరణములు సేవ్యములగుచుండెను. అక్కడి ప్రదోషములు రాత్రులును మిక్కిలి రమణీయములై యుండెను. కాముకులు రాత్రి తుదిజామున పూల నెత్తావులం మిగుల పరిమళించుచు చల్లని వాయువులం బీల్చి పునారతి కుతూహలులౌచుందురు. అపుడు శీఘ్రగమనమును రేపవళ్ళు మందగమనము సేయుచుండెను. (వసంతర్తువులో వేసవి రాత్రి ప్రొద్దు తక్కువ పగటి ప్రొద్దెక్కువ యన్నమాట.) భానుడు మిథునోపగముడగుటచే నాయన కరములు = కిరణములు మిక్కిలి వేడెక్కును. వసంతము గాన మిథున రాశిలో సూర్యుడున్నాడన్నమాట. నదులు మంచు గఱగి జాలెత్తిన నీటి పఱుగుల నురుగుల గమి మిగుల వ్యాకులములై నదులు పర్వతములు మిగుల జలువలం గ్రమ్ముకొని యుండెను. యెండ వేడిమికి నిండ బూసికొన్న పెక్కు పరిమళ వస్తువులచే (కలపములచే) మిక్కిలి పరిమళించు గంధపు పూతలచే కాముకుల కామినులు మోహమును బెంపొందించు చుండిరి. రతిలో బుట్టిన యాయాసముచే నిండ గ్రమ్మిన కామినీజనము శ్రమజలమును (చెమటను) కాముకులు పచ్చకప్పురపు పొడులుపైజల్లి యుపశమింప జేయుచుండిరి. నిండ సఫలములయిన మామిడిచెట్లు కను పండువు సేయుచుండ సంవత్సరమునకు ఆభరణ ప్రాయమైన యవ్వసంత మందు రఘునందన బృందముఖ్యుని సందర్శనమునకు మునులయోధ్యకుం జనిరి.

ఇది శ్రీ విష్ణుధర్మోత్తర మహాపురాణమందు ప్రథమఖండమున గ్రీష్మవర్ణనమను
రెండువందలనలుబదియొకటవ అధ్యాయము.

# రెండువందల నలుబదిరెండవ అధ్యాయము - రామానుశాసనము

నాడాయనః : తత స్సభాగతం రామం ద్వాఃస్థో వచన మబ్రవీత్ ।ద్వారి తిష్ఠన్తి మునయో యమునాతీరవాసినః ॥ 1
భార్గవం తు పురస్కృత్య చ్యవనం దీప్త తేజసమ్ । మహానుభావా వరదాః తపసా దగ్ధ కిల్బిషాః ॥ 2
ద్వాః స్థాత్తు వచనం శ్రుత్వా తదా రామః పురోధసా । సహిత స్త్వరయా ద్రష్టుం తాపసాన్ తాన్ వినిర్గతః ॥ 3
సోఽభిగమ్య మహాతేజాః ఋషిసంఘాన్ తపస్వినః । అభివాద్య ప్రణమ్యైతాన్ పురస్కృత్య తదా గృహమ్ ॥ 4
ప్రావేశయ త్తతస్తేషాం పాద్యార్ఘ్యా చమనా దికమ్ । ఆసనం మధువర్కం చ తథా రాజ్యం న్యవేదయత్ ॥ 5
ప్రతిగృహ్యా తు తే సర్వే రాజ్యం తస్మై పునర్దదుః । తద్వచ్చ తీర్థ తోయాని ఫలాని వివిధాని చ ॥ 6
ప్రతిగృహ్యా చ రామస్తాన్ పృష్ట్వా కుశల మవ్యయమ్ । పప్రచ్ఛతాన్ మహాభాగః తతస్త్వాగమన క్రియామ్ ॥ 7
రామస్య వచనం శ్రుత్వా చ్యవనో వాక్య మబ్రవీత్ । రాక్షసో లవణో నామ రాజన్ ! మధువనే వసన్ ॥ 8
లోకాన్ తాపయతే సర్వాన్ తస్య యత్నం వధే కురు ! । దశప్రాణి సహస్రాణి చాహార స్తస్య నైత్యికః ॥ 9
వధార్థం భరతం తస్య శత్రుఘ్నం సహ లక్ష్మణమ్ । సమాదిశ ! మహాభాగ ! లోకాస్సన్తు నిరామయాః ॥ 10
తథా మధువనే స్ఫీతే దేశం రామ ! నివేశయ ! । నగరీ శ్చ యథా పుణ్యాం లోకానాం హితకామ్యయా ॥ 11
త్వయా సభాజ్యో రక్ష్యాశ్చ మునిసంఘాః మహామతే ! । ఏవముక్త స్తదా రామ శ్చిన్తయామాస ధర్మవిత్ ॥ 12

నాడాయనుడు శైలూషుని కిట్లనియె. పేరోలగమున్న రామభద్రునితో ద్వారపాలకుడు యమునాతీరవాసులు మునులు ద్వారమందున్నారు. భార్గవ వంశభూషణుని మహాతేజస్విని చ్యవనుని మున్నిడుకొని యేతెంచినారు. మహానుభావులు వరదులు తపస్సు చేసి పాపములం దహించినారన విని రాముడు పురోహితునితో తొందరగా నా తాపసులం దర్శింప బయలుదేరెను. వారిందరిని నమస్కరించి సదనిం జాగిలి మ్రొక్కి వారిని ముందిడుకొని గృహముం బ్రవేశింపజేసెను. వారికి పాద్యార్ఘ్య మాచమనాదికము ఆసనము మధుపర్కము మొదలగు నుపచారములన్నియును నెరపి రాజ్యమును నివేదించెను. (ఈరాజ్యము మీదని సమర్పించెనన్న మాట. వారదాని స్వీకరించి యందరుందిరిగి రాజునకిచ్చిరి. మఱియుం దాముగొనివచ్చిన తీర్థోదకములను పలువిధములు పండ్లను సమర్పించిరి. రాముడు వానింగైకొని వారిని తరుగని వారి కుశలమడిగి యా మహానుభావులను రాకనుగూర్చి ప్రశ్నించెను. రాముని పలుకాలించి చ్యవనమహర్షి పలుకదొడంగెను.

రాక్షసుడు లవణుడనువాడు ప్రభూ ! మధువనమందు వసించుచు సర్వలోకములం దహింపజేయుచున్నాడు. వానివధకు యత్న మొనరింపుము. నిత్యము పదివేలప్రాణులు వానికాహారము. వానింజంప భరతుని శత్రుఘ్నుని లక్ష్మణునితో నాజ్ఞయిమ్ము. లోకములు నిరుపద్రవములగుంగాక ! మధువనము సువిశాలము. అందు దేశమును (రాష్ట్రమును) నెలకొల్పుము. లోకహితముకోరి రమ్యమైనరాజధానినటనేర్పరుపుము. నీచేగౌరవింప రక్షింపబడవలసినవారు మునిసంఘములవారు అనవినిధర్మజ్ఞుడురాముడాలోచించెను.

లక్ష్మణేన మహత్కర్మ కృతం నివసతా వనే । రాజ్యం పాలయతా కర్మ భరతేన మహ త్కృతమ్ ॥ 13
శత్రుఘ్నం ప్రేరయా మ్యద్య లవణస్య వధేప్సయా । ఇత్యేవం చిన్తయిత్వా తు రామః శత్రుఘ్న మబ్రవీత్ ॥ 14
మునీం శ్చైతాన్ పురస్కృత్య గచ్ఛ శత్రుఘ్న ! మాచిరమ్ । ఘాతయస్వ దురాచారం లవణం పాప కారిణమ్ ॥ 15
ఘాతయిత్వాచ లవణం జనాం స్తత్ర నివేశయ ! ।నగరీ చ తథా తత్ర త్వయా కార్యా మనోరమా ॥ 16

అరణ్యమున నివసించుచున్న లక్ష్మణుని చేతను రాజ్యమును పాలించుచున్న భరతుని చేతను గొప్ప కృత్యమొనరింప బడెను. లవణాసురుని చంపుటకై శత్రుఘ్నుని పురిగొల్పెదను. అని ఆలోచించి రామచంద్రుడు శత్రుఘ్నునితో నిట్లు పలికెను. "శత్రుఘ్నా ! ఈ మునుల ముందిడుకొని శీఘ్రముగ నీవువెళ్ళి దురాచారుడ పాపకారియు నగు లవణాసురుని చంపి జనుల నచట ప్రవేశపెట్టుము. అచట మనోహరమగు నొకపట్టణమచట నిర్మింపుము.

తస్యాం వస ! మహాభాగ ! పాలయన్ త్వం వసుంధరామ్ । తత్రాహ మభిషేక్ష్యామి రాజ్యే త్వా మృషిభి స్సహ ॥ 17
ఏతావ దుక్త్వా రామ స్తద్వాక్యం ఋషి గణాన్వితమ్ । అభిషేకేన దివ్యేన యోజయామాస తం తదా ॥ 18
ఉవాచ చ మహాతేజాః భ్రాతరం దీప్త తేజసమ్ । ఇమా న్యశ్వ సహస్రాణి చత్వారి భవతోఽనఘ ! ॥ 19
రథానాం ద్వే సహస్రేచ ద్విపో త్తమ శతం తథా । అయుతం చ పదాతీనాం సువర్ణస్యచ సంచయమ్ ॥ 20
అన్తరాపణ వీథ్యశ్చ నానాపణ్యోప శోభితాః । ఆదాయ గచ్ఛ శత్రుఘ్న ! పర్యాప్త బలవాహనః ॥ 21
బలం చ సుభృతం వీర ! తుష్ట పుష్ట మనుద్ధతమ్ । వశం చ సాంత్వదానాభ్యాం కురుష్వ ! రఘునందన ! ॥ 22
న హ్యర్థా స్తత్ర తిష్ఠన్తి న మిత్రాణి న బాంధవాః । సుప్రీతో భృత్య వర్గస్తు యత్ర తిష్ఠతి రాఘవ ! ॥ 23
సత్వం దుష్టజనాకీర్ణాం సంస్థాప్య మహతీం చమూమ్ । ఏక ఏవ ధనుష్పాణిః యోధయేథాః మధోస్సుతమ్ ॥ 24
యథాచ త్వాం న జానాతి గచ్ఛ తం యుద్ధకాంక్షితమ్ । లవణస్స మధోః పుత్ర స్తథా నిశ్శంకనో వ్రజ ! ॥ 25
ఆఖ్యాతో న చ తస్యాస్తి కశ్చి న్మృత్యు భయాన్వితః । దర్శనం యోఽభి గచ్ఛేత హన్యతే లవణేన సః ॥ 26
మాహేశ్వరేణ శూలేన వియుక్తం మృగయా గతమ్ । ద్వార మావృత్య లవణం యుధ్యస్వ రఘునందన ॥ 27
మాహేశ్వర మమోఘం తు శూలం చ పరివర్జితమ్ । గృహాణేమం శరం వత్స ! సర్వాయుధ వినాశనమ్ ॥ 28
అనేన లవణం యుద్ధే ఘాతయిష్యస్య సంశయమ్ । గచ్ఛత్వం ! గ్రీష్మ శేషేణ లవణస్య జిఘాంసయా ॥ 29
కాలే తథా ప్రావృషి సంప్రవృత్తే వివృద్ధ తోయాసు సరిద్వరాసు ।
మద్దత్త బాణేన నిశాచరస్య వ్యసుం క్షితౌ పాతయః తస్య దేహమ్ ॥ 30

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే లవణవధే శత్రుఘ్నం ప్రతి రామానుశాసనంనామ ద్విచత్వారింశదుత్తర ద్విశతతమోఽధ్యాయః ॥

భూమిని పాలించుచు నీవచట నుండుము. ఈఋషులతోగూడ నిన్నచట నభిషేకింతును." అనిపలికి రాముడు ఋషులతో గూడ ఆ శత్రుఘ్నునికి దివ్యాభిషేకమునరించెను. మరియు నిట్లనెను. ఈ నాలుగువేల గుఱ్ఱములను, రెండువేల రథములు, నూరు గజములు పదివేలమంది పదాతులు హేమసముదాయము నానావిధ విక్రేయవస్తు శోభితములగు అంగడి వీథులను, తగినంత సేనను, వాహనములను తీసికొనిపొమ్ము. రఘునందనా ! ఆసేనను చక్కగ పోషించుచు లాలనపాలనలచే విధేయతగలదానినిగ నొనర్పుము. ఓ రాఘవా ! సేవకజనము సంతుష్టితో నున్నతావునకు బంధువులుగాని, మిత్రులుగాని అర్థములుగాని చేరవు. కావున సంతుష్టులైన జనముతోనిండిన గొప్ప సేనల గూర్చుకొని ధనుష్పాణివై లవణాసురునితో యుద్ధముచేయుము. మధుసుతుడగు లవణాసురుడు యుద్ధేచ్ఛతో నీవువచ్చినట్లు తెలియకుండునట్లు నిర్భయముగ వెళ్ళుము. మృత్యుభయము గలవాడెవ్వడు వానికంటబడిననుసరే; లవణుడు వానిని చంపివేయును. మాహేశ్వర శూలరహితుడై వేటకరిగిన లవణుని ద్వారమునాపరించి యుద్ధము చేయుము. అమోఘమగు మాహేశ్వర శూలమును వదలి నాయనా ! సర్వాయుధ వినాశకమగు నీ బాణమును నీవు తీసికొనుము. ఈ బాణముతో నీవు నిస్సంశయముగ లవణుని చంపెదవు. ఈ గ్రీష్మ కాలాంతమున లవణుని చంపు గోరికతో నీవు బయలుదేరుము. వర్షాకాలము రాగానే నదులన్నియు పుష్కల జలసమృద్ధములుకాగా నేనిచ్చిన యీ బాణముతో విగత ప్రాణుడైన యా రాక్షసుని దేహమును భూమిపై పడవేయుము !

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున లవణాసురవధ విషయమై శత్రుఘ్నునిగూర్చి రామానుశాసనమను రెండువందల నలుబదిరెండవ అధ్యాయము.

## రెండువందల నలుబదిమూడవ అధ్యాయము - వర్షర్తువర్ణనము

రామః - సంప్రాప్య ప్రావృషం వత్స! భీమతోయదనిస్స్వనామ్ । నిషిద్ధపాంథ సంచారాం విద్యుత్ క్షుభితతోయదామ్ ॥
మేఘైస్తోయ భరానమ్రైః స్థగితార్క నిశాకరామ్ । ప్రవర్షణ జలాఘాత వికాసిత సరోరుహామ్ ॥ 2
యస్యాం ఘనవరత్రాసా త్పీనోత్కంపి పయోధరాః । కుర్వన్త్యా లింగనం కాంతాః కాన్తానాం మనసః ప్రియమ్ ॥ 3
భూమిర్నవతృణచ్ఛన్నా శక్రగోపాద్య భూషితా । భీమౌఘ నాదవిస్తీర్ణా ఫేనవత్యశ్చ నిమ్నగాః ॥ 4
సతోయ తోయదా క్రాన్తం స్నిగ్ధ నీలం నభస్తలమ్ । బలాకాః శోభయన్తి స్మ శారదం తారకా ఇవ ॥ 5
ఘనా ఘనాగమారూఢా ధృతవాసవ కార్ముకాః । తోయౌఘ బాణ ధారాభిః ప్రవవర్షుః మహీతలమ్ ॥ 6
ధారా కదంబవకుళ కుటజార్జున శోభితాః । పక్వజంబ్వామ్రశాలిన్యో వనరాజ్యో మనోహరాః ॥ 7
నిదాఘతాపసంతప్తా నవతోయ సముక్షితా । మహీ విసృజతే యస్యాం గంధమాల్యగుణం స్వకమ్ ॥ 8
గర్జమానేషు మేఘేషు మృదంగధ్వని సన్నిభమ్ । అస్యాం మయూరా నృత్యన్తి వికస త్సత్కలాపినః ॥ 9
సమీరణేన మృదునా నున్నాః ఖేచ పయోధరాః । మహిష్యశ్చ విసర్పన్తి పయఃపూర్ణ పయోధరాః ॥ 10
ప్రత్యూషే సంచరన్తీనాం మహిషీణాం తదా సమమ్ । ఘంటానినాదో మధురః శ్రూయతే తృణగహ్వరే ॥ 11
స్థలయః కృష్ణసారంగనేత్రైరనిమిషైరివ । యస్యాం పశ్యన్తి శత్రుఘ్నః జలపూర్ణమహీతలమ్ ॥ 12
మేఘపాతేన హృద్యేన పృషతోత్కరశాలినా । కామిన్యః కామినాం సార్ధం త్యాజితా రఘునందన! ॥ 13
అపారగమ్యాః సరితో రాజానో గతవిగ్రహాః । బలాహకగణ ఛత్రా ద్యౌస్తథైవ సవిగ్రహా ॥ 14
ననిర్వృత సుఖోద్వాహ కామ్యా కామ్యక్రియా మహీ । ప్రహృష్ట పౌరానుగతైః సంవత్సరపురోహితైః ॥ 15
వ్యగ్రాభవన్తి రాజానః శక్రయష్టి ప్రవేశనే । శైలైర్నవ తృణచ్ఛన్నైః తథా నీలాభ్రశేఖరైః ॥ 16
కాంతి మద్భిర్విశేషేణ విరాజతి వసుంధరా ।
తాం ప్రావృషం ప్రాప్యనదత్ పయోద ప్రనర్తితాశేష శిఖండి బృందామ్। 17
ద్వారం సమాశ్రిత్య మధోస్తనూజం ధనుర్ధరస్త్వం జహి రాజపుత్ర ॥ 18

ఇతి శ్రీవిష్ణు ధర్మోత్తరే ప్రథమఖండే ప్రావృడ్ వర్ణనం నామ
త్రిచత్వారింశ దుత్తర ద్విశత తమోఽధ్యాయః ॥

రాముడనియె. భయంకరమైన మేఘముల యురుములతో మెరపులతో నదరిపారు మేఘములతో జలభరితములై నజలధరములచే సూర్యచంద్రులు గప్పుపడ కుంభవృష్టిపలని జలఘాతమువల తేకుతేకు విడిపోయిన తామరపూలతో బాటసారుల స్వేచ్ఛాసంచారముల కభ్యంతరమై వర్షర్తువు వచ్చినది. మేఘముల నురుములకుజడిసి పీనోన్నత కుచభరలైన బింబాధరలు మనఃప్రియముగ ప్రియులందమంతగౌగలించుకొనుచున్నారు. భూమి లేబచ్చికలం గ్రమ్ముకొని ఆర్ద్రపురుగులు మున్నగువానిచే సొగసుకొన్నది. నదులు చటుల ప్రవాహ నిర్ఘోషభీషణములై పరుగులిడుచు నుఱుగులం గ్రక్కుచున్నవి. జలముతోడి జలదములలముకొన జిగినించునీలిమం గగనతలమును బలాకములు (బెగ్గురు పక్షులు) శరదృతువందలి యాక సమును తారకలట్లు శోభింపజేయుచున్నవి. జలప్రవాహధారల నవనిపై గురియుచున్నవి. ధారాపాతముగ గురియు కడిమిపూలు పొగడలు కుటజములు మోదుగపూలతో సొంపుగొని పండిననేరేడుపండ్లతో వనపంక్తిపూలు మనోహరములగుచున్నవి. గ్రీష్మతాపముననుడికి నవాంబువులందడిసి పుడమితనకు సహజమైన గంధమాల్యగుణముంబొడసూపుచున్నది. మేఘములు మృదంగనాదానువాదముగ నురుముచుండ నీమేదినిపైనెమిళులు పురివిచ్చివిచ్చలవిడినృత్యములారంభించినవి. నింగినల్లనిపిమగాలిచే త్రోయబడి పయోధరములు (మబ్బులు) పాలచే బొదుగులునిండిన గేదెలు నల్గడల సంచరించుచున్నవి. వేకువం

దిరుగు గేదెల మెడగంటల పెనుసడి గడ్డివాములందు మధురముగ వినబడుచున్నవి. స్థలులు (ఎత్తైనచోట్లు) తెప్పవాలని నల్లజింకల కన్నులతో (అనిమిషులతో = దేవతలతోడంబోలెయని శ్లేష) జలపూర్ణమైన ధరణీతలముం జూచుచున్నవి. మింటనుండు దేవతలు మేదినింగల శోభను ముచ్చటగొని దిలకించునట్లు ఉన్నతస్థలులు ఎత్తైనప్రదేశములు అనగా అక్కడనున్న జలముక్రింది జలపూర్ణమైన యవనీతలమును ముచ్చటగొని తెప్పవాల్పక దిలకించుచున్నారనిభావము. తుంపరలురలగురియు మనోహరమైన వానగురియుమబ్బుల గ్రమ్ముదలచే కామినులు కాముకులగుంపునుండి యెడముసేయబడిరి. నదులవ్వలిదరికిం జన వీలుగామి (దాటరాకుండుటంజేసి) రాజులు పోరుమానిరి. బలాకాపక్షులు బెగ్గురుపక్షులగుంపనెడి గొడుగువేసికొని దివి రూపుగొని ఒకనాయికవోలె జూడముచ్చటైనది. ఆనందభరితులైనపౌరులువెంబడింప సంవత్సరమను పురోహితులతో భూమి (నాయిక) పరిపూర్ణతృప్తి సుఖమునిచ్చిన ఉద్వాహముచేత (ఉద్గత నదీప్రవాహ వైభవముచేననిశ్లేష) కోరవలసిన కోరరాని క్రియగలదై మైమరచినది. అనగా పురోహితులు వివాహవిధిబవరింప పౌరులు వెంబడింప క్రొత్తగ నుద్వాహమైన పెండ్లియైన పెండ్లికూతురూరేగుచు నిదికావలెను, ఇదివలదను విచక్షణమరచి మైమరచి యెనలేని సుఖమందునట్లు భూమి నదీప్రవాహములతో నెనలేని తృప్తినందినదని భావము. రాజులు ఇంద్రయష్టిప్రకాశమునందు కొందరున్నారు. ఇది రాజులు వర్షాకాలములోజేయు నుత్సవముకాబోలు! లేబచ్చికల నల్లనిమబ్బులు గ్రమ్మకొని శిరస్త్రాణములట్లు గొడుగులట్లు పైనలుముకొని కాంతిమంతములైన శైలములతో వసుంధరమిక్కిలిరాజిల్లుచు మేఘములురుమ నెమిళులగుంపులెల్ల మిగులనర్తింపనింపగు నావర్షర్తుంబొంది శత్రుఘ్న! నీవుధనువూని వానిగడప మెట్టి (ద్వారమాక్రమించి) మధునికొడుకగు లవణాసురు నీవు సంహరింపుము.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తరమహాపురాణము ప్రథమఖండమున వర్షర్తువర్ణనము రెండువందలనలుబదిమూడవ అధ్యాయము.

## రెండువందల నలుబదినాల్గవ అధ్యాయము - శరద్వర్ణనము

రామః - హత్వా ప్రావృషి తం పాపం యమునాతీరగోచరః । నయః త్వం శారదం కాలం యావత్సుప్తో జనార్దనః ॥ 1
రమణీయతరా యత్రనద్యః ప్రకట సైకతాః । సుస్వాదు శీతసలిలా స్సారసై రుపశోభితాః ॥ 2
బాలార్క సదృశైః పద్మైః పద్మిన్యో యత్రభూషితాః । సరసాం విమలం యత్రతోయం మధురశీతలమ్ ॥ 3
వరస్త్రీనయనాకార చారుపత్రవిభూషణైః । పశ్యతీవోత్పలై ర్వ్యోమ ఉత్పలిన్యః సునిర్మలమ్ ॥ 4
నభస్సరసి విస్తీర్ణే తారానుగుణ చిత్రితే । శోభతేచ నిశీథేషు హంసవ ద్విచరన్ శశీ ॥ 5
ఆదధానో మహచ్చాపం సందధానశ్చ దృశ్యతే । యావత్సంపూర ఇత్యేవ బాణైర్వ్యాపితలం శరత్ ॥ 6
జాతీకుసుమ హృద్యాసు బంధుజీవో జ్జ్వలాసుచ । మనః ప్రసాద మాయాతి హృద్యాసు వనరాజిషు ॥ 7
పక్వ సస్యా వసుమతీ పరాం ధారయతి శ్రియమ్ । కలవింకాః ప్రహృష్టాశ్చపక్వకేదార పంక్తిషు ॥ 8
నిమ్నగాః కాశవసనాః చక్రవాక యుగస్తనాః । సారసారావ హాసిన్యః సుతరాం రతి వర్ధనాః ॥ 9
హంసై స్సంఘట్టనోపేత కల్హార రజసోత్కరైః । సరాంసి దుర్విభావ్యాని కుశలై రపి మానవైః ॥ 10
పాండు రాభ్ర కృతన్యాసాః సర్వఏవ శిలోచ్చయాః । శ్రియం విడంబయన్తీవ తుషారాద్రేః సముజ్జ్వలామ్ ॥ 11
శరత్ ప్రభూతోత్పలచారుపద్మాం విపక్వకేదార విభూషితోర్వీమ్ ।
నీత్వాతతః ప్రాప్య హిమస్యకాలం కార్యస్త్వయా పత్తన సన్నివేశః ॥ 12

ఇతి శ్రీ విష్ణు ధర్మోత్తరే ప్రథమఖండే శత్రుఘ్నం ప్రతి రామానుశాసనే శరద్వర్ణనంనామ
చతుశ్చత్వారింశదుత్తర ద్విశతతమోధ్యాయః ॥

గాముడనియె. శత్రుఘ్న ! వర్షర్తువున నీవా పాపిని లవణాసురుంజంపి, యమునాతీరమునందు హరి నిదిరించు నంతకు శరత్కాలమట గడపుము. ఆ ఋతువునందు నదులిసుకతిన్నెలు బయలుపడి మిక్కిలి రుచిగల నీరముతో, సారసములతో (తామర పూవులతో) శోభగొనును. అందు పద్మినులు (తామరతీగలు-పద్మినీజాతి స్త్రీలనియుశ్లేష) బాలసూర్యుని వంటివై (ఎఱ్ఱనివై) పూవులం సింగారించు కొనును. అపుడు సరస్సులోని నీరు స్వచ్ఛముగ (తేటగ) తియ్యగ చల్లగ నుండును. కలుపూదీగలు సుందరీ మణుల కందొవంబోని రేకుల లలంకారముగ గొన్న కలువపూలచే వినిర్మలాకాశము వంక జూచుచున్నవాయన్నట్లింపు గొల్పు చుండును. తారలచే(చుక్కలచే) చక్కగ (అనుగుణముగ) చిత్రితమై (రంగురంగులీనునదై) విస్తీర్ణమై (విశాలమై) యున్నయాకస మను సరస్సునందు రాయంచవోలె నడిరేల సంచరించుచు శోభించుచుండును. శరత్తు (ఒకయోధుడట్లు) మహాధనుస్సును (ఇంద్రధనుస్సును) చేబట్టుచున్న బూరించుచున్నట్లు (ఎక్కిడుచున్నట్లు) గానవచ్చు బాణములచే (రెల్లుపూలచే) జగమెల్ల నింపు చున్నాడు. జాజిపూవులచే మనోహరములై మంకెనపూలచే (ఇవి ఎఱ్ఱనివి) మెఱయునున్నవినై మనోహరము లగుచున్న వన పంక్తులందు మనస్సు ప్రసన్నతం గాంచుచున్నది. వసుమతి పంటకు పచ్చిన సస్యములతో పరమైశ్వర్యము (శోభను) బూని నది, పంట పొలములందు కలవింక పక్షులు మిక్కిలి హర్షమందుచున్నవి. చక్రవాకముల జంటలను జనుగవం గులుకుచు రెల్లుపూల చీరం దాల్చి నదులు (నాయికలనిధ్వని) సారసారవహాసినులై హంస ధ్వనులతో హంసలట్లచ్చపు తెలినవ్వుతో గూడి వలపూ రించుచున్నవి. (హంస పలుకులట్టి పలుకులతో హంసలట్లచ్చమైన నవ్వులతో ననిశ్లేష) మిక్కిలి రతివర్ధనులగుచున్నవి. ముచ్చటలు నించుచున్నవి. వలపులూరించు చున్నవని నాయికాపరమైన శ్లేషార్థము. తెల్లని హంసలతో, హంసల రెక్కల సంఘట్టనము నొందిన ఎఱ్ఱదామరపూల పరాగపుంజములతో సరస్సులు నిపుణులైన వారికిగూడ యూహింపరానివిగా నున్నవి. ఇవి తెలుపో ఎఱుపోతెలియరా కున్నవనిభావము. (అదిగాక రజస్వలలో కారో తెలెయరాకున్నదనిధ్వని) ఎల్లెడ పర్వతములు తెలిమబ్బులచే నిరవుకొని మంచుగొండ యొక్క సముజ్జ్వలశోభం దులకించుచున్నవి. శరత్కాలమందు చక్కగ నిండుగొన్న కలువలు చక్కని తామరపూలు గలిగి పండిన పంట పొలములతో నలంకృతమైన వసుంధరతో శరదృతువు నీవు జరిపి యవ్వల హేమంత కాలము నొంది పట్టణ సన్నివేశమును గావింపుము.

ఇది శ్రీ విష్ణుధర్మోత్తర మహాపురాణమందు ప్రథమఖండమందు శరద్వర్ణనమను
రెండువందలనలుబదినాల్గవ యధ్యాయము.

## రెండువందలనలుబదిఐదవ అధ్యాయము - హేమంతవర్ణనము

రామః - ప్రబుద్ధేపుండరీకాక్షే హేమన్తే వైష్ణవే ఋతౌ । కార్యః పురనివేశస్తే తథా జనపదస్యవా ॥ 1
పక్వనారంగ సుభగే నీహారావృత నిమ్నగే । ప్రలూన ధాన్య కేదారే గత తుందశిలీముఖే ॥ 2
కృతసంగ్రహణే కాలే ప్రవృత్తనృప విగ్రహే । విపంక వసుధే రమ్యే స్వాదుశీతజలాశయే ॥ 3
విశాలా యత్ర యామిన్యః సుతరాంసురతక్షమాః । భృశం మనోహరా యూనాం పీడితా లింగనక్షమాః ॥ 4
యత్ర శీతాపదేశేన మానినీభి రపి స్వయమ్ । క్రియతే త్యక్తమానాభిః ప్రియకంఠగ్రహోత్సవః ॥ 5
సుఖోష్ణోదక గాంధర్వ రమ్య ప్రస్రవణోదకే । ప్రరూఢ పవనోద్ధూతే కాలే నీలధరాతలే ॥ 6
వాసోద్గమన సంరుద్ధ దుర్విభావ్య నదీతటే । సారసారావ విజ్ఞేయే కాలేకామి జనప్రియే ॥ 7
యత్రేక్షుపీడ యన్త్రాణాం యష్ట్యః పురుషచోదితాః । భాగ్యానీవ మనుష్యాణా మున్నమన్తి నమన్తిచ ॥ 8
కృతాగ్రాయణ పూజాశ్చ హుతహవ్యాః ద్విజాతయః । యత్ర ప్రవేశ హృష్టాశ్చ తథా యత్రచ కర్షకాః ॥ 9

గృహేషుచ సుఖోష్ణేషు గవాం నిశ్వాస మారుతైః । స్వాధ్యాయ ఘోషో విప్రాణాం నృణాం యత్ర సుఖావహః ॥
సితాభిః పచ్యమానాభిః క్రియమాణైస్తథా గుడైః । రమ్య స్సుశీతలః కాలః ప్రాణి ప్రియ హుతాశనః ॥ 11
విచరన్తి నరాయత్ర గురుప్రావరణాంబరాః । కుంకుమే నాను లిప్తాంగా ధనినః ప్రియదర్శినః ॥ 12
అశ్వాయామక్షమేకాలే యత్రయూనాం విశేషతః । మృగయా దయితా వత్స! మందరశ్మౌ దివాకరే ॥ 13
రోహితాశన పుష్టానాం సాధునారంగ వాసితమ్ । మహిషీణాంతు మథితం గంధవర్ణ రసాన్వితమ్ ॥ 14
ఇక్షవశ్చ విదార్యాశ్చ తథైవమూలకానిచ । రసవన్తివిశేషేణ యత్ర పిష్ట కృతానిచ ॥ 15
ప్రవృత్తమేఖలాబంధ వివాహాది క్రియేజనే । ప్రబుద్ధే పుండరీకాక్షే ప్రవృత్తేయజ్ఞసంగరే । 16
కాలేప్రహృష్టాశ్వ కరీంద్రముఖ్యే కార్యాత్వయా రాఘవ వాస్తుపూజా ।
ఆరంభణీయం నగరస్యకర్మ శివాయ సర్వస్యజనస్యవత్స! ॥ 17

ఇతి శ్రీ విష్ణుధర్మోత్తరే ప్రథమఖండే శత్రుఘ్నం ప్రతిరామస ముపదేశే హేమన్త వర్ణనం నామ
పంచచత్వారింశదుత్తర ద్విశతతమోఽధ్యాయః ॥

రాముడనియె: శత్రుఘ్న! హేమంతఋతువు విష్ణుదేవతాకమైనది. (వైష్ణవ మనబడును) పుండరీకాక్షు డప్పుడు మేల్కొనును.కాగా నీవు నగరమందుగాని గ్రామమందుగాని వసింపవలయును. ఆ ఋతువు పండిన నారింజపండ్లతో జక్కగనుండి నదులు మంచుగప్పికొనియుండును. పొలములందు ధాన్యము రాలుచుండును. వరిచేలు నూర్చుటకు సమయమన్నమాట. పంటల నిండ్లకు సంగ్రహించుకొనితెచ్చు కాలమది. రాజుల యుద్ధారంభసమయము భూమి బురద యెండి చక్కగానుండును. తియ్యని చల్లని జలసమృద్ధిగలది. రాత్రిప్రొద్దెక్కువ. స్త్రీలు మిక్కిలి రతిక్షమలు యువకుల కెంతేని గూర్చువారు. గాఢాలింగనక్షమలు. చలినెపమున మానినులు (గుట్టు మిగుల లజ్జ) చిత్తసమున్నతిగలవారుగూడ మానము విడిచి తమంతతాము ప్రియవల్లభుల కంఠముల బిగ్గగౌగలించుకొను వేడుకలొనరింతురు. స్వయంగృహాశ్లేష సుఖోత్సవోత్సాహులయ్యెదరు. సుఖకరమైన వేడిమి మాత్రమే కల్గి కలకల నినాద మధురములై నీటిబుగ్గలం బొంగు జలములం జలిగాలులు బెక్కుగ వీచుతఱి నేలయెల్ల సల్లబడిన చలిచే నిల్లువెడలి వెలుపలికి జనలేమిని నదియొడ్డుమీట తలపునకేనిరాని పుండువంటి చలిలో సారసారావమున బెగ్గురు పక్షుల కూతలంబట్టి మాత్రమే తెలియనయిన కామిజనప్రియమైన చలికాలమున చెఱకుగానుగలకు సంబంధించిన ఎడ్ల నదలించి తోలుటకు రైతులుపయోగించు ములు గర్రలు మానవులభాగ్యములట్లు (అదృష్టములట్లు) మీదికెగయుచుందిగుచుండును. (అద్భుతవర్ణనము !!)ద్విజులు ఆగ్రాయణపూజచేసి (ఆగ్రయణేష్టిచేసి దేవతాప్రీతిగ హోమములుసేయుతఱి క్రొత్తపంట వచ్చినప్పుడుదేవతలకు హవిర్భాగములిచ్చుటకు జేయబడునిష్టిని ఆగ్రయణేష్టియందురు ) కర్షకులు పొలములను విడిచి గోవుల నిశ్వాస వాయువులచే సుఖోష్ణములైన తమ యిలువాకిండ్లం బ్రవేశించి హర్షింతురు. విపుల స్వాధ్యాయ ఘోషమంచఱకు హాయిగూర్చును. మార్గశిర పౌష పుష్యమాసములు హేమంత ఋతువుగాన అప్పుడు బెల్లమువంటలో పంచదారమువంటలో నగ్నిసామీప్యమువలనగల్గు వెచ్చదనమును కొనిప్రాణు లగ్నిప్రియులగుచుందురు. [అందఱకప్రియమైన యగ్నిని ప్రియమునొనరించు కాలమిదియను నీచలికాల ప్రశంసయు నద్భుతముగా నున్నది.] అందు జనులు బరువైన కంబళీలు మొదలగున బరువైన ప్రావరణములను గప్పుకొని దట్టమైన వస్త్రములు ధరించి కుంకుమపూవు మేనికి బూసి కొని (కుంకుమ పూవుపూత వలన శరీరము వేడెక్కును.) ధనికులు చూడ ముచ్చటగ చరించు చుందురు. గుఱ్ఱములకది వ్యాయామ కాలము. (గుఱ్ఱములు పరిశ్రమను బాగుగ సహించు సమయము) కావున సూర్య రశ్మి మందముగ నున్నందున యువకుల కందు వేట మిగుల యిష్టమగును. చేపలు తెగతిని పుష్టినొందిన వారికి మంచి నారింజ పండ్లరసముచే బరిమిళితమైన సువాసనతో నచ్చపు తెలుపు రంగుతో గూడిన గేదెవెన్న చెఱకులు విదారులు మూలకములు రుచికరమైన పిండితోచేసిన వంటకములు ప్రీతి నింపుచుండెను.

జరుగనగు శుభముహూర్తముల కది కాలము గావున ఉపనయన వివాహాది శుభకార్యములారంభమగును. హరిమేల్కొని నందున యజ్ఞముల కది సమయము. ఏనుగులు గుఱ్ఱములు మిగుల హర్షభరితమైన యీ హేమంతము నందు నీవు వాస్తు పూజ గావింపదగును. సర్వజనమంగళము కొఱకది రాజధానీనగరమందు నీ వారంభము సేయుము.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తరమహాపురాణము ప్రథమఖండమున శత్రుఘ్ననిగూర్చిన రామానుశాసనమను రెండువందలనలుబదియైదవ అధ్యాయము.

## రెండువందల నలుబదియారవ అధ్యాయము - శత్రుఘ్నప్రస్థానము

రామఉవాచ : తతస్తు శైశిరే ప్రాప్తే కాలేతపన వల్లభే । హిమాలీ పటలచ్ఛన్న దుర్విభావ్య దిశాముఖే ॥ 1
సుపక్వమాతులుంగాఢ్య వనరాజి సుగంధి ని । ప్రఫుల్ల వృత్త కుసుమ చారురాగోజ్జ్వల త్విషి ॥ 2
హిమప్రయాత సంజాత సర్వరత్న తృణోల్బణే । అత్యర్థ శీత కుసుమే కుంకుమాగురు వల్లభే ॥ 3
కామిన్యః కుంకుమార్ద్రాంగ్యః పీనోన్నత పయోధరాః । ఆలింగనేన కాంతానాం యత్ర శీత భయాపహాః ॥ 4
పుష్పితైరతసీ వాటైర్నీల నీరజ నిర్మలైః । పూర్ణతోయాశయాశంకా జాయతే సుధియామపి ॥ 5
మాఘ్యకుందక పుష్పాఢ్యా వనరాజ్యో మనోహరాః । సుశీర్ణ పర్ణసరలా నమేరుక విభూషణాః ॥ 6
సంత్యక్త్వా దక్షిణామాశాం వ్రజమానే తథోత్తరామ్ । సూర్యే ముమోచ పవనం నిఃశ్వాసమివ దక్షిణా ॥ 7
రమ్యాశ్చ గంధమంజర్యః శోభయన్తి వనస్థలీః । మన్మథస్య శరాః కాంతా కామి మన్మథ వర్ధనాః ॥ 8
హయానాం మధురః శబ్దః శ్రూయతే దశనోద్భవః । శబ్దోయవభుజాంయత్ర స్వామినాం రతివర్ధనః ॥ 9
నిర్మలానాంతు సరసాం వినివిష్టా జలేచరాః । బ్రువంతో మధురం పాంథా జనయంతి పరాం ముదమ్ ॥ 10
జనయంతి పరాంప్రీతిం కామినీనాంతు కాముకాః । యత్రమేధ్యైర్నవైర్వత్స మాతులుంగాధి వాసితైః ॥ 11
వాపీకూప తడాగేషు హ్రదప్రస్రవణేచషు । యత్రకాలే రటంత్యాపః కంపయంత్యః పురీంమహత్ ॥ 12

రామఁడనియె. శిశిరఋతువు వెచ్చదనమునకు ప్రియమై మంచు దట్టముగ గురిసి కప్పువడి దిక్కులు దోచకున్నతఱి నిండ బండిన మాతులుంగ ఫలములచే సమృద్ధములై వనపంక్తులు సువాసనలు నించుచుండ బాగుగవికసించిన పూగుత్తులచే యొఱపు దీపించు వెలుగుగొని చలివోయి చక్కగ మొలచిన చెంగలి పచ్చికలచే సమృద్ధమై మిక్కిలి చలువనించు పువ్వులతో కుంకుమ పువ్వు అగురు మొదలైన వేడినిచ్చు ద్రవ్యములపై ప్రీతిగలుగుచుండ కుంకుమపూవు కలపములందుకొని పీనోన్నత పయోధరలైన కామినులు కాంతలం గౌగలించుకొని, చలిబాధవారించుచుండపూసిన చీకటినీలనీరజ కుసుమ నిర్మలములయినయతసీ వనములచే స్వచ్ఛములయిన పూచిన యిఱుగుడుచేపప్రమానికాబోలునను సంశయముగల్గించుచుండ మాఘమాసమందు నిండుపూయు మొల్ల పువ్వులతో నిండుకొని వనపంక్తులగును. మనోహరములగును. ఆకులుబొత్తిగారాలిన సరలద్రుమములతో నమేరుపృక్షభూషణములై సొంపుగొననా శిశిరఋతువందు సూర్యుడు దక్షిణదిశనువదలి యుత్తరదిశ కేగుచుండ(నాయకుడన్యాంగనాసంగుడౌట వెలిసి యీర్ష్యాకషాయితయగు నాయికవలె) దక్షిణ దిశ నిట్టూర్పు పుచ్చెనన్నట్లు దక్షిణ వాయువులు(మలయవాయువులు)వీచుటారంభమగును. సుగంధకుసుమ మంజరులతిరమ్యములై వనస్థలులను శోభిల్లంజేయును. కాములై పుష్పబాణుని బాణములు పువ్వులతి సుందరములగును. గుఱ్ఱముల పలువరస వెడలు సకిలింపుల సడి లెస్సగ వినబడును. (శిశిరము అశ్వములకు ఋతుకాలమన్న మాట.) అది యవభోజనము సేయు (సన్న వరి ధాన్య విశేషములలో యవ లొకటి) ప్రభువులకురతి (కామ) వర్ధన మగుచుండును. అచ్చము తేరిన సరస్సులందు జొచ్చి యట్టిట్టు షికారు సేయుచుఒండొరులు మధురముగ ముచ్చట లాడుకొనుచు పాంథులు కామినీ కాముకులకు పరమహర్షముం గూర్చుచుందురు. రుచికరమైన క్రొత్త

మాతులుంగ ఫలముల అధివాసనముచేత (పండ్లురాలి యారసము జలములలో కలియుటచేత) వాపేకూపటాకములు మడువులు బుగ్గల లోని పొంగిన నీరు దరినున్న పురమును కంపింప జేయునంతగా ధ్వని సేయు చుండును.

తస్మిం స్త్వం శిశిరేకాలే కృత్వా గృహవరే స్వకే । ప్రావేశయతు విధినా శిల్పి భిర్యంత్ర నిర్మితైః ॥ 13
ధర్మేణ పాలయన్ క్షోణీం వస రాజీవలోచన । హృదికార్య స్త్వయా ధర్మో నిత్యమేవ నరోత్తమ ॥ 14
ఉత్తిష్ఠ శీఘ్రం విజయాయ గచ్ఛ దీప్తాం శ్రియం ప్రాప్నుహి రాజపుత్ర ।
రక్షంతు దేవా స్తవ సర్వకాం పదం విధత్స్వారి గణస్య మూర్ధ్ని ॥ 15

ఇతి శ్రీ విష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే శైలూషంప్రతి నాడాయనవాక్యేషు శత్రుఘ్నంప్రతి రామానుశాసనేలవణం ప్రతి శత్రుఘ్నప్రస్థానంనామ షట్చత్వారింశదుత్తర ద్విశతతమోఽధ్యాయః ॥

అట్టిశిశిరఋతు సమయమందు నీవు యంత్ర నిర్మాణ దక్షులైన శిల్పులచే వారు నిర్మించిన గృహమందు యథా విధిగ గృహప్రవేశోత్సవము గావింప బడుదువు గాక. ధర్మముచే నీక్షోణిం చాలించుచునట వసింపుము. ఎల్లతటి నీ హృదయమందు ధర్మమును నిలుపు కొనవలయును. లే లెమ్ము శీఘ్రముగ విజయమునకు జనుము. మిగుల దీపించు సిరులందుము. రాజకుమారా ? శత్రుఘ్న ! దేవతలు నిన్నే వేళ రక్షింతురు గాక. అరిగణము నడినెత్తి నీ పాదముంపుము.

ఇది శ్రీ విష్ణుధర్మోత్తర మహాపురాణమందు ప్రథమఖండమున శత్రుఘ్నునింగూర్చిన రామానుశాసనమను రెండువందలనలుబదియాఱవ అధ్యాయము.

## రెండువందల నలుబదిఏడవ అధ్యాయము - లవణాసురవధ

నాడాయన ఉవాచ : ఇతి రామవచః శ్రుత్వాబాఢముక్త్వాస సత్వరః । అభివాద్య వసిష్ఠస్యపాదౌ రామస్య చాప్యథ ॥ 1
పురస్కృత్య మహాభాగాన్ భార్గవ ప్రముఖానృషీన్ । యథోక్తసైన్యానుగతః ప్రయయౌభీమవిక్రమః ॥ 2
వాల్మీకేరాశ్రమం ప్రాప్య తామువాసతదానిశామ్ । పూజయిత్వాతువాల్మీకి మృషిణా ప్రతి పూజితః ॥ 3
యస్మిన్నహని శత్రుఘ్నో వాల్మీకేరాశ్రమంగతః । ఉభౌ ప్రసూతౌతస యౌతస్మిన్నే వాహ్నిజానకీ ॥ 4
సీతా ప్రసవసంహృష్టం క్రమేణరఘునందనః । నిదాఘశేషేణనదీముత్తతార స సూర్యజామ్ ॥ 5
శిబిరం సమవస్థాప్య యథావ ద్యమునాతటే । ఏక ఏవధనుష్పాణిః ప్రవివేశమధోర్వనమ్ ॥ 6
ప్రవిశ్యచ యుధాతత్ర లవణస్యనివేశనమ్ । తస్థౌద్వారమథాశ్రిత్య వీరోవితతకార్ముకః ॥ 7
ఏతస్మిన్నేవకాలేతు మృగాన్హత్వాసహస్రశః । బహునామ్మృగ భారేణ సదదర్శమధోః సుతమ్ ॥ 8
వృత్తాక్షముత్కటం భీమందంతోత్కృత్తోత్తరచ్ఛదమ్ । దంష్ట్రాకరాలవదనందంతి వత్పరుషచ్ఛవిమ్ ॥ 9

నాడాయనుడనియె. రామచంద్రప్రభువు పలుకువిని బాఢమ్మని (మంచిది- బాగున్నది- సరేయని) శత్రుఘ్నుడు తొందరగ వశిష్ఠుల పాదములకు రామచరణములకును మ్రొక్కి భార్గవ ప్రముఖులైన పరశురామాదులైన ఋషులను మున్నిడుకొని భీమపరాక్రముడాతడింతమున్న దెల్పిన సేనలతో వాల్మీక్యాశ్రమము సేరి యారాత్రి యటనుండెను. అమ్మునిం బూజించి యాయనచే ప్రతిపూజ గొనెను. ఆతడయ్యాశ్రమముం జేరినాడ జానకి యిరువురు కుమారులం గనియెను. సీతామహాదేవి ప్రసవవార్తవిని హర్షభరితుడై రఘునందనుడు క్రమముగంజని గ్రీష్మఋతువు తుదను యమునానదిం దాటెను. యమునాతటమున శిబిరమువేయించికొని తానొక్కడ ధనుష్పాణియై మధునివనముం బ్రవేశించెను. అందొక యోధునితో లవణునింట బ్రవేశించి కార్ముకమెక్కిడి యా వీరుడు ద్వారముకడ నిలువబడెను. ఇదేవేళ వేలకొలది మృగములంజంపి పెద్ద బరువెత్తుకొన్న మధుసుతుని లవణుని జూచెను వాని

గ్రుడ్లు గిఱ్ఱున దిరుగుచుండెను. ఉత్కటములు = కటములు = కణతలు అదరుచుండెను. భయంకరుడుగా నున్నాడు. పైపెదవిం బండ్లం గరచుకొనుచుండెను. ముఖము కోరలం గరాళమై (భయంకరమై) యున్నది. ఏనుగట్టొడలిజిగి కరకుదేరియున్నది.

సతుదృష్ట్వైవశత్రుఘ్నముదాచ పరుషంబహు । విప్రధావత దుష్టాత్మా శత్రుఘ్నవధకామ్యయా ॥ 10
త్యక్త్వామృగసహస్రాణి ద్రుమవిక్షేపతత్పరః । ద్రుమవృష్టింసుఘోరాంతాం లవణేన విసర్జితామ్ ॥ 11
చిచ్ఛేదబాణైః సౌమిత్రిః శతశోఽథసహస్రశః । ఛిన్నేద్రుమ మహావర్షే లవణః శత్రుతాపనః ॥ 12
జఘానసురశత్రుఘ్నం శత్రుఘ్నం ముష్టినాభృశం । ముష్టిప్రహార నిశ్చేష్టం శత్రుఘ్నం లవణ స్తదా ॥ 13
నజగ్రాహచతచ్ఛూలం మృత్యుపాశవశంగతః । ప్రవేశయామాస గృహం మృగసంఘా ననేకశః ॥ 14

వాడు చూడగనే శత్రుఘ్నునింగని కడు పెటుకుగ మాట్లాడి యతనిం జంపం పైనున్న వేలకొలది మృగముల బరువున ననింబడవైచి బరువిడి చెట్లుపెరికి విసరబూనెను. ఆ ఘోరతర తరువర్షమును సౌమిత్రివందలు వేలబాణములచే నరకివైచెను. చెట్లు తెగినంత నా రక్కసుడు సురశత్రుఘ్నుని శత్రుఘ్నుని పిడికిటం గట్టిగ గ్రుద్దెను. ఆగ్రుద్దునకు నిశ్చేష్టుడైన శత్రుఘ్నుంగని లవణుడు ఆ శూలమును (తనకు శివుడు మున్ననుగ్రహించినదాని) మృత్యుపాశవశుండగుటచే జేపట్టడయ్యె. తా జంపితెచ్చిన జంతువుల ననేకముల నింటిలోనికిం జేర్చెను.

ఏతస్మిన్నేవ కాలేతు లబ్ధసంజ్ఞస్సరాఘవః । వితత్య కార్ముకంతస్థౌద్వారమావృత్య వేశ్మనః ॥ 15
తతఃపాదపవర్షేణచ్ఛాదయంతం నిశాచరమ్ । చకారవిము ఖంబాణైశ్ఛిత్త్వా ఛిత్త్వా మహీరుహాన్ ॥ 16
రామద త్తంతతో బాణంసంధాయ వరకార్ముకే । నిర్బిభేద మహాతేజా లవణం రఘు నందనః ॥ 17
సంధీయమానే బాణేతు త్రస్తం త్రిభువనంతదా । ఆశ్వాసయామాస విభుర్బ్రహ్మా కమలసంభవః ॥ 18
తేనబాణప్రహారేణనిర్భిన్న హృదయః క్షితౌ । వ్యసుః పపాతమేదిన్యాం శైలో వజ్రహతోయథా ॥ 19
తస్మిన్నిపతితే భూమౌ దైత్యేదేవ భయంకరే । త్రైలోక్యం విగతాతంకం క్షణేన సమపద్యత ॥ 20

ఇదేసమయమున రాఘవుడు మూర్ఛదేరి విల్లెక్కిడి యా రక్కసుని గృహద్వారమందు నిలబడెను. అవ్వల చెట్లను వర్షించి తననుం గప్పివైచుచున్న యన్నిశాచరుని బాణములచే జెట్లను నఱికి నఱికి విముఖుం జేసెను. తన మేలివింట రాముడిచ్చిన బాణమును సంధించి యా మహాప్రతాపశాలి శత్రుఘ్నుడు లవణునిం జీల్చివైచెను. అయ్యెడ నా రామబాణము సంధించినయెడ త్రిభువనముం జడిసిపోయెను. బ్రహ్మ కమలభవుడు దాని నాశ్వాసించెను ఆ బాణపుదెబ్బచే వాడు గుండెపగిలి ప్రాణముపోయి క్షితిపైవజ్రహతమైనకొండయట్లు నేలంబడెను దేవభయంకరుడు వాడుపడిపోవ ముల్లోకము క్షణములో ఆతంకము (బెదరు) వాసెను.

తంచదేశమథాజగ్ముః సురాస్సబ్రహ్మకా స్తథా । పూజితాస్తేన వీరేణశత్రుఘ్నం వాక్యమబ్రువన్ ॥ 21
దేవాఊచుః ; వరం వరయశత్రుఘ్న యత్తే మనసికాంక్షితమ్ । అపనీతం త్వయాస్మాకం భయం శూలవరాయుధాత్ ॥
త్వయాతు నిహతే తస్మిన్లవణే పాపరాక్షసే । పశ్య శూలవరం యాంతమేనంశార్వం విహాయసా ॥ 23
శత్రుఘ్న ఉవాచ : అస్మిన్దేశే కరిష్యామి పురం రామాజ్ఞయా త్వహమ్ ।
మాసేనసమాప్యతాం శీఘ్రం వరమేతత్ప్రదీయతామ్ ॥ 24
దేవాఉవాచ : నిష్పత్తిం యాస్యతేధీర స్థిరాచైవ భవిష్యతి । పురాచరమణీయాచమథురా నామతః శుభా ॥ 25
నాడాయన ఉవాచ : ఏవముక్త్వాసురాః సర్వే జగ్మున్నాకమతంద్రితాః ।

అచ్చటికి బ్రహ్మతో వేల్పులరుదెంచిరి. ఆవీరునిచే బూజితులై శత్రుఘ్న ! నీమనసునగల కోరిక వరముం గోరుము మాకు శూలాయుధమువలని భయము నీవు పోజేసితివి. నీచే లవణుండు హతుడుకాగానే అల్లదె చూడుము. శూలమది యాకసమువెంట. శివునింజేరినదన శత్రుఘ్నుడు ఈ ప్రదేశమందు రామాజ్ఞచే నేను పురనిర్మాణము సేసెదను. ఆపని యీనెలలో శీఘ్రముగ సమాప్తి

గాపలయును. ఈవరము నాకు దయసేయుడని దేవతలు ధీరాగ్రేసర ! నిర్మాణము పూర్తియగును. అది సుస్థిరముగూడ కాగలదు. ఆదిపరమమంగళ సుందరము పుణ్యమునయి 'మధుర' యనుపేరం బరగును. అనిపలికి యేత్రోటుపాటులేక వారు నాకమునకేగిరి.

ఆజగామసతందేశం సైన్యేనచ్యవనః నహ ॥ 26
సంవర్ధయిత్వా శత్రుఘ్నం జగామాశ్రమ మంజసా । సర్వంరామవచశ్చక్రే శత్రుఘ్నో౽పిమహాయశాః ॥ 27
కృత్వాపురీ నివేశంచ గృహప్రావేశనం తథా । ఉషిత్వా ద్వాదశసమాః సంప్రాప్తే సురకర్మణి ॥ 28
జగామ భ్రాతరం ద్రష్టుం వాల్మీకే రాశ్రమం పునః । తత్రశుశ్రావ ధర్మాత్మాశు భాంరామకథాం కృతామ్ ॥ 29
వాల్మీకి నాప్రహృష్టేన గీయమానాంకుశీలవైః । తత్రోష్య రజనీమేకాం రామం దృష్ట్వాతథై వచ ॥ 30
తత్రోష్య పంచ రాత్రంచ భూయోరామ విసర్జితః । మధురాయాంచ వసుధాం పాలయామాస ధర్మవిత్ ॥ 31
ఏవం విధః సశత్రుఘ్నో భరతో౽వ్యధిక స్తతః । మాతేన విగ్రహంగచ్ఛభరతేన మహాత్మనా ॥
అజేయా రఘవో యేషాం సహాయా వానరో త్తమాః ॥ 32
సుగ్రీవ నీలాంగద వాయుపుత్ర సుషేణమైంద ద్వివిద ప్రధానాః ।
మహాబలాః పర్వతమాత్రకాయాః సురాసురై ర్యుద్ధగతా అజేయాః ॥ 33

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే శైలూషంప్రతి నాడాయన వాక్యేషు లవణవధో నామస ప్తత్వారిం శచదు త్తరద్విశతతమో౽ధ్యాయః ॥

ఆ ప్రదేశనమునకు చ్యవనుడు సైన్యముతోవచ్చి శత్రుఘ్నునికి జయాశీస్సులిచ్చి వెంటనే యాశ్రమమునకేగెను. రాముని మాటనెల్ల నొనరించి మహాయశస్వి శత్రుఘ్నుడట మధురాపురీ నివేశముగావించి గృహప్రవేశమొనరించి యందు బండ్రెండేండ్లు వసించి దేవకార్యమొకటి గలుగ తిరిగి వాల్మీక్యాశ్రమమున కన్నగారిం దర్శింపనేగెను. అక్కడ ధర్మాత్ముండతడు రామకథను వాల్మీకికృతమైనదానిని (రామాయణమును) కుశలవులచే గానముసేయబడినదానిని వినెను. ఒక్కరేయి యటనుండి మరల రాముం జూచి అక్కడ పంచరాత్రము వసించి మరల రాముడుపంప మధురయందుండి ధర్మవిదుడాతడు వసుధం బాలించెను. శత్రుఘ్నుడాతడీలాటివాడు. అంతకంటె నధికుడు భరతుడు. ఆమ్మహాత్మునితో నీవు తగవు వడకుము. వానరులు సహాయులుగానున్న రఘువులజయ్యులు. సుగ్రీవ నీలాంగద వాయుపుత్ర సుషేణ మైంద ద్వివిద ప్రధానులు మహాబలులు. పర్వతాకారులు సురాసురుల తోడి పోరులందేని జయింప శక్యముగానివారు.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తరమహాపురాణము ప్రథమఖండమున లవణాసురవధయను రెండువందలనలుబదియేడవఅధ్యాయము.

## రెండువందల నలుబదిఎనిమిదవ అధ్యాయము - పులహ వంశానుకీర్తనము

శైలూషఉవాచ : పులహస్య ప్రజాసర్గం శ్రోతుమిచ్ఛామి తత్త్వతః । యస్య వంశే సముత్పన్నా వానరా బలదర్పితాః ॥
నాడాయన ఉవాచ : మృగాచ మృగమందాచ హరిస్తామ్రా తథా ఇరా । భూతాచ కపిశా దంష్ట్రా సురసా సరమా తథా ॥
కశ్యపో జనయామాస క్రోధాత్తు దశకన్యకాః । కశ్యపేన చ తా దత్తాః పులహాయ మహాత్మనే ॥ 3
ప్రజాస్తాసాం ప్రవక్ష్యామి సర్వాసాం త్వం నిబోధమే । మృగయాస్తు మృగా జాతా హరిణైణాః శశా స్తథా ॥ 4
రురవః పృషతశ్చైవ న్యంకవః శశకా స్తథా । సృమరా మృగమందాయా గవయా మహిషా స్తథా ॥ 5
చమరోష్ట్రా వరాహాశ్చ ఖడ్గా గౌరఖరా స్తథా । హర్యాశ్చ వానరాజాతా గోలాంగూలాః సకింనరాః ॥ 6
మండూకా నకులాశ్చైవ యేచాప్యన్యే బిలేశయాః । పంచకన్యాశ్చ తామ్రాయాః పత్న్యస్తా వరుణస్య చ ॥ 7

ప్రాదాద్ధర్మ భృతాంశ్రేష్ఠః పులహస్తపసాంనిధిః । శ్యేనీభాసీతథా క్రౌంచీ ధృతరాష్ట్రీ శుకీతథా ॥ 8
శ్యేనీతు జనయామాస పుత్రం సంపాతినం తథా । జటాయుషం చ రాజానం గృధ్రాణాం బలవత్తరమ్ ॥ 9
సంపాతీ జనయామాసశ్యేన గృధ్రవటాం స్తథా । భాసీపుత్రాః స్మృతాభాసాః క్రౌంచాః క్రౌంచీసుతాః స్మృతాః ॥ 10
ధృతరాష్ట్రీ సుతాహంసా ధార్తరాష్ట్రా స్తథైవచ । చక్రవాకముఖాశ్చాన్యే తథాయే జలచారిణః ॥ 11
శుకీపుత్రాః శుకాజ్ఞేయాః పక్షిణశ్చాపి కీర్తితాః । కశ్యపస్యతు యా పత్నీ ఇరానామ ప్రకీర్తితా ॥ 12
కుంజరం జనయామాస సురకార్యోద్యతం సదా । భూతా పుత్రా స్తథా భూతా మహాదేవ మనువ్రతాః ॥ 13
ఉపవీరో లూఖలికా ఆస్యకర్ణా కుషండికా । పాంసవః పాణి పాత్రాశ్చ చైతన్యాని పునస్తథా ॥ 14
సూచీముఖాః శోషణికాః కులాన్యేతాని షోడశ । కులేష్వేతే షజాయంతే నానాకార విచేష్టితాః ॥ 15
నిష్కుటేషు ప్రతోళీషు చత్వరేషు గుహాసుచ । తేషాం ప్రాదాత్తదా స్థానమందర్ధాన ప్రతాపితాః ॥ 16
అణిమాలఘి మాప్రాప్తి ర్యత్రకామావసాయితా । దంష్ట్రీ పుత్రా స్తథాలోకే దంష్ట్రిణోయే ప్రకీర్తితాః ॥ 17
సరమాయా స్తథా సర్పాః కీటజాత్యశ్చ సర్వశః । శ్యామశ్చధవళశ్చైవ సారమేయౌతథా శునౌ ॥ 18
యమస్యానుచరౌ తౌచమహాబల పరాక్రమౌ । ఇతిక్రోధాదుహితౄణాం ప్రజాతిః కీర్తితామయా ॥ 19
కశ్యపస్యతుయా పత్నీసురభిర్నామ విశ్రుతా । కనీయసంచశూద్రాణాంతస్యా సీద్దుహితృద్వయమ్ ॥ 20
రోహిణీచైవ భద్రంతే గంధర్వీచ మహీపతే । పులహాయైవ తేదత్తే కశ్యపేనమహాత్మనా ॥ 21
సురూపాహేమరూపాచ సర్వకామదుఘాతథా । రోహిణ్యాంజన యామాసపులహః సమహాతపాః ॥ 22
బ్రహ్మచర్య వ్రతాస్తాస్తుధేనవోదశకీర్తితాః । మానసీతు ప్రజాతాసాం యథాసంఖ్యేన మేశృణు ॥ 23
గావశ్చైవ మహిష్యశ్చ అజాశ్చైవావయ స్తథా । గంధర్వీజన యామాసతురగాన్వాతరంహసః ॥ 24
గరుడీచ మయూరీచద్వేతుకన్యే మనోరమే । పులహేనతు తేదత్తే గరుడాయ మహాత్మనే ॥ 25
గరుడీజన యామాససుపర్ణాన్భీమ విక్రమాన్ । మయూరీజన యామాసమయూరా ద్యాన్విహంగమాన్ ॥ 26
గరుడాన్వయసంభూతాః సర్వే పన్నగభోజినః । పక్షిణస్తు త్వయాజ్ఞేయాః సువర్ణాన్గరుడా శృణు ॥ 27
సువర్ణచూడోనాగశ్చ దారుణ శ్చాడతుండకః । అనిలశ్చానల శ్చైవ విశాలాక్షోఽథకుండలీ ॥ 28
కర్కశోర్ధ్వజవిష్కంభీ వినతో వామన స్తథా । వాతవేగోనిశాచక్షుర్ని మిషోఽనిమిష స్తథా ॥ 29
త్రివారస్సప్త వారశ్చ వాల్మీకిర్ద్వీ పుకి స్తథా । దైత్యద్వీపస్సరిద్ద్వీపః సారసః పద్మకేతనః ॥ 30
సుముఖశ్చిత్రకే తుశ్చచిత్ర బర్హ స్తథానఘ । మేఘః సత్కుముదో దక్షః సర్వభుక్కామ భోజనః ॥ 31
గురుభారః కపోతశ్చ పూర్వ నేత్రశ్చిరాతకః । విష్ణుగంధః కుమారశ్చ పరిబర్హో హర స్తథా ॥ 32
అశ్వాంబరో మధుపర్కశ్చ హేమవర్ణ స్తథైవచ । మలయోమాతరిశ్వాచ నిశాకరదివాకరౌ ॥ 33
ఏతేప్రదేశ మాత్రేణ మయోక్తా గరుడాత్మజాః । కులమేతత్సు పర్ణానాం ధన్యానాం నృపసత్తమ ॥ 34
సర్వఏతేశ్రియా యుక్తాః సర్వేశ్రీవత్సలక్షణాః । కులమేతద్ధిశైలూష శ్లాఘ్యం విష్ణు పరిగ్రహమ్ ॥ 35
దైవతంవిష్ణురేతేషాం విష్ణురేవ పరాయణమ్ । హృదితేషాం సదావిష్ణుర్విష్ణుషాం పరాగతిః ॥ 36
ఏతత్తవోక్తం పులహస్య వంశం పుత్రైః సుతాభిశ్చ సమన్వితం యత్ ।
వంశేతుసర్వోత్తమ వీర్యయుక్తా జాతాః ఖగేంద్రా హరయశ్చ వీరాః ॥ 37

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే మార్కండేయ వజ్రసంవాదే శైలూషం ప్రతి నాడాయన వాక్యేషు
పులహవంశాను కీర్తనం నామాష్టచత్వారింశ దుత్తర ద్విశతతమోఽధ్యాయః ॥

శైలూషుండు పులహుని వంశము. బలదర్పితులైన వానరులుదయించినది వినవలతునన నాడాయనుడిట్లనియె. కశ్యపుడు మృగయయనునామె మొదలు సరమయను దానిదాక పదిమంది కూతుండ్రను కోపమునుండి కనెను. అతడు వారిని పులహునకిచ్చెను. వారిసంతానము నీవెరుంగుమని పేర్వేర వారిసంతానమెల్ల వినిపించెను. చివర వీరందరు శ్రీయుక్తులు శ్రీవత్సలాంఛనులు విష్ణుసమాశ్రయులు. వీరు విష్ణు పరిగ్రహులు. విష్ణువుచే రక్షింపబడినవీరికి విష్ణువే పరమగతి. వీరిహృదయముందెల్లవేళల విష్ణువుండును. ఈ పులహవంశమందు వానరులు వీరులు జనించిరి. కేవలము పేర్లుగావున నవి మూలమునం దెలియనగునని వివరింపలేదు.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తరమహాపురాణము ప్రథమఖండమున పులహవంశానుకీర్తనమను రెండువందలనలుబదియెనిమిదవ అధ్యాయము.

## రెండువందలనలుబదితొమ్మిదవ అధ్యాయము - ప్రతిసమూహరాజకీర్తనము

వజ్రఉవాచ : కథా ప్రసంగైర్బహుభిర్భవతామమ కీర్తితమ్ । సంభవం సర్వభూతానాం సర్వకల్మషనాశనమ్ ॥ 1
తేషాం వికారేష్వాచక్ష్వ రాజానోమమ భార్గవ । పాలయంతిద్విజశ్రేష్ఠ సకలం యేజగత్త్రియమ్ ॥ 2
మార్కండేయ ఉవాచ : ఏవం ప్రజాసుసృష్టాసు స్వయమేవపి తామహః । 3
ఓషధీనాం ద్విజాతీనాం నక్షత్రాణాంత థైవచ । యజ్ఞానాం తపసాంచైవ సోమం రాజ్యేఽభిషేచయత్ ॥ 4
ప్రజాపతీనాం సర్వేషాం దక్షం ప్రాచేత సంతథా । వలీముఖానాం సర్వేషామృక్షాణాంధూమ్ర ఏవచ॥ 5
మనః సర్వేంద్రియాణాంచ సురస్త్రీణాంచమన్మథమ్ । ప్రహ్లాదం సర్వదైత్యానాం పితౄణాంచ తథాయమమ్ ॥ 6
అపాంతువరుణం రాజ్యేతథైవ జలవాసినామ్ । యక్షాణాం రాక్షసానాంచ పార్థివానాంధనస్యచ ॥ 7
పుత్రం విశ్రవసోజ్యేష్ఠం కుబేరం నరవాహనమ్ । విప్రచిత్తించ రాజానందాన నానాం మహాబలమ్ ॥ 8
సర్వభూత పిశాచానాం గిరీశంశూలపాణినమ్ । శైలానాం హిమవంతంచ నిమ్నగానాంచ లావణమ్ ॥ 9
భారతం సర్వవర్షాణాం ద్వీపానామథ మధ్యమమ్ । స్వాదూదకం సముద్రాణామశ్వత్థం సర్వశాఖినామ్ ॥ 10
కర్మణాంవ్యవసాయంచ మేరుం నర్వశిలాభృతామ్ । గంధర్వాణాం చిత్రరథం గరుడంచ పతత్త్రిణామ్ ॥ 11
ఉచ్చైఃశ్రవసమ శ్వానాం గోవృషంచ తథాగవామ్ । సువర్ణం సర్వరత్నానామౌషధీనాం తథాయవమ్ ॥ 12
సత్యలోకంచ లోకానాం పాతాళానాం రసాతలమ్ । శాస్త్రాణాంచయజుర్వేదం సర్వేషామవిశేషతః । 13
గాయత్రీం సర్వమంత్రాణాంఛందసాంచ యదూత్తమ । మృగాణామథశార్దూలం పన్నగానాంచ తక్షకమ్ ॥ 14
ఐరావతం గజేంద్రాణాం ధర్మం సర్వసుఖస్యచ । వాసుకిం సర్వనాగానామృషీణాంచ తథా భృగుమ్ ॥ 15
విద్యాధరాణాం సర్వేషాం తథాదేవం సరస్వతీమ్ । ఉత్పాతానాం తథారాహుం గ్రహాణాంచ దివాకరమ్ ॥ 16
కాలస్యావయవం చైవకాలం సంవత్సరం తథా । వ్యాధీనాంచ జ్వరం రాజ్యేనృణామర్క నిశాకరౌ ॥ 17
అభిషిక్తో నరేంద్రేంద్ర బ్రహ్మణాస్వయమేవహి । భారతేఽస్మిన్పురావర్షే ప్రాప్తేవైవ స్వతేంతరే ॥ 18
తస్మాదద్యా పిచత యోరంశ జాతాశ్చపార్థివాః । తతోఽభిషిక్తో దేవానాం రాజ్యేదేవః శతక్రతుః ॥ 19
సంభూయరాజభిః సర్వైస్త్రైలోక్యపతి రూర్జితః ॥
వజ్రఉవాచ : రాజ్యేఽభిషిక్తః సకథం మహాత్మా సంభూయసర్వైస్త్రి దశారిహర్తా ।
ఏతన్మమాచక్ష్వ భృగుప్రధాన! భక్తిర్మమేయం త్రిదశేంద్రశత్రౌ ॥ 20

ఇతి శ్రీవిష్ణు ధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదేశైలూషంప్రతి నాడాయన వాక్యే ప్రతిసమూహే రాజకీర్తనం నామైకోనపంచాశ దుత్తరద్వి శతతమోఽధ్యాయః ॥

వజ్రుండు ప్రసంగవశమున సర్వభూత సంభవమును నీవుతెల్పితివి. వారివారి వికారములందు (వికృతులందు) తరువాత బుట్టిన రాజులు జగత్త్రయపాలకులగూర్చి తెలుపుమన మార్కండేయుడిట్లనియె. ఆ యా సంఘములో నధినాయకునిగా నొక్కొక్కని సృష్టికర్త బ్రహ్మ యభిషేకించెను. ఓషధులు ద్విజులు నక్షత్రములు యజ్ఞములు తపస్సులకు సోముని రాజ్యాభిషిక్తుంజేసెను. ప్రజాపతులకు ప్రాచేతసుడైన దక్షుని తెల్లని వలీముఖులకు ధూమ్రునిమనస్సు మరి యన్నియింద్రియములకు దేవతాస్త్రీలకు మన్మథుని దైత్యులకు ప్రహ్లాదుని పితరులకు యముని జలములకు జలవాసులకు వరుణుని యక్ష రాక్షసులకు రాజులకు ధనమునకు విశ్రవస్సు పెద్దకొడుకును నరవాహనుని కుబేరుని దానవులకు విప్రచిత్తిని సర్వభూత పిశాచములకు శూలపాణియైన గిరీశుని (శంకరుని) శైలములకు హిమవంతుని వర్షములకు భారతవర్షమును ద్వీపములకు మధ్యద్వీపమును (జంబూద్వీపమన్నమట) సముద్రములకు స్వాదూదక సముద్రమును (మంచినీటి సముద్రము) చెట్లకు (అశ్వత్థమును) రావిని కర్మములకు వ్యవసాయమును (కృషినా ? లేక ప్రయత్నమునా ?) నదులకు లవణసముద్రమును సర్వశిలాధరములకు మేరువును గంధర్వులకు చిత్రరథుని పక్షులకు గరుడుని గుఱ్ఱములకు ఉచ్చైశ్రవమును గోవులకు గోవృషమును (వృషభమును) అన్నిరత్నములకు సువర్ణమును ఓషధులకు యవధాన్యమును లోకములకు (బ్రహ్మ) సత్యలోకమును పాతాళములకు రసాతలమును సర్వశాస్త్రములకు యజుర్వేదమును సర్వమంత్రములకు ఛందస్సులకు గాయత్రీమంత్రమును గాయత్రీ ఛందస్సును మృగములకు శార్దూలమును పన్నగములకు తక్షకుని గజేంద్రములకు ఐరావతమును సర్వసుఖములకు ధర్మమును సర్వనాగులకు వాసుకిని ఋషులకు భృగువును విద్యాధరులందరకు సరస్వతీదేవిని ఉత్పాతములకు రాహువును గ్రహములకు సూర్యుని కాలమునకు కాలావయవమైనసంవత్సరమును వ్యాధులకు జ్వరమును సూర్య చంద్రులను మానవర్యామందు స్వయముగా బ్రహ్మ యభిషేకించెను. ఈ భారతవర్షమందు వైవస్వత మన్వంతరముగాగా చంద్ర సూర్యులీమానవులకు ప్రభువులు గావించబడిరి. అందుచే నేటికిని వారియంశలంబుట్టినవారు సూర్య చంద్ర వంశములంబుట్టినవారు రాజులయినారు. అప్పుల దేవరాజ్యమందు శతక్రతుని (నూరుయజ్ఞములు సేసినవానిని) ఇంద్రునభిషేకించెను. ఆయన త్రైలోకాధిపతిగా రాజులందరిచేత నభిషిక్తుడయ్యెను. అనవిని వజ్రుండు భృగుముఖ్యా ! ఇంద్రునందు నాకు భక్తిగలదు. ఆయనకుదేవరాజప్పట్టాభిషేకము జరిగిన విశేషమునానతిమ్ము.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తరమహాపురాణము ప్రథమఖండమున ప్రతిసమూహరాజకీర్తనమను రెండువందలనలుబదితొమ్మిదవఅధ్యాయము.

## రెండువందల ఏబదియవ అధ్యాయము - దేవేంద్ర పట్టాభిషేకము

మార్కండేయఉవాచ : సుమేరౌ పర్వతశ్రేష్ఠే నానారత్నోజ్జ్వలత్విషి । ప్రజాపతి రథాదాయ రాజసంఘాన్ ప్రకీర్తితాన్ ॥
అభ్యషించత దేవానాం రాజ్యే కశ్యపనందనమ్ । తేజస్వినమథా దిత్యం జజ్ఞే నిర్ధూతకల్మషమ్ ॥ 2
తస్యాభిషేకే ప్రదదౌ విశ్వకర్మా మనోహరమ్ । రత్నోజ్జ్వలం భద్రపీఠం కామరూపధరం శుభమ్ ॥ 3
అత్రైవ ముపదిశ్యాథ స్వయం బ్రహ్మా జగద్గురుః । అభ్యషించత దేవానామాధిపత్యే జగద్గురుమ్ ॥ 4
బ్రహ్మావిష్ణుశ్చ శంభుశ్చ సాధ్యాశ్చ సమరుద్గణాః । ఆదిత్యావసవోరుద్రా విశ్వేదేవామరుద్గణాః ॥ 5
భృగవోఽంగిరసః సాధ్యా అశ్వినౌచభిషగ్వరౌ । ఋషయశ్చమహాభాగా స్త్రైకాల్యామలదర్శినః ॥ 6
యాని తోయాన్యుపాదాయ సముద్రాః సరితస్తథా । సరాంసిచ సతీర్థాని గంధర్వాప్సరసస్తథా ॥ 7
తస్యేందు మండలాకారం ఛత్రం జగ్రాహ కేశవః । శ్వేతౌచ వాలవ్యజనౌ తథాచంద్రదివాకరౌ ॥ 8
భృంగారం యాదసాంభర్తా దండం దండధరః ప్రభుః । మేనకాచైవరంభాచ తాలవృంతౌ మనోహరౌ ॥ 9
విధివచ్ఛుహావాగ్నౌ దేవాచార్యోబృహస్పతిః ।

మార్కండేయుడనియె : పర్వత రాజమగు సుమేరువు నానా రత్నకాంతి భరితము ప్రజాపతి యింతమున్ను పేర్కొన్న రాజ సమూహమును వెంటగొని దేవతల రాజ్యమందుండి కాశ్యపనందనుని తేజశ్శాలిని ఆదిత్యు నభిషేకించెను. అప్పుడు విశ్వ

కర్మ చక్కని రత్నమయ సింహాసనమును కామరూపధరమైన. దాని నొసంగెను ఇచట నిట్లు దెలియజెప్పి జగద్గురువు బ్రహ్మ స్వయముగ దేవాధి పత్యమందు శతక్రతునభిషేకించెను. త్రిమూర్తులు సాధ్యులుమరుత్తులు వసురుద్రాదిత్య మరుద్గణములు విశ్వే దేవులు భృగువులు అంగిరసులు అశ్వినీ దేవతలు వైద్యశ్రేష్ఠులు త్రికాలదర్శనులు ఋషులు పవిత్రాభిషేక జలములంగొని పుణ్య నదులు సముద్రములు సర్వ తీర్థములతో సరస్సులు గంధర్వాప్సరసలు నటకువచ్చిరి విష్ణుమూర్తి చంద్ర మండలాకారమైన శ్వేతచ్ఛత్రమా పట్టెను. సూర్య చంద్రులు తెల్లని తాలవ్యజనములు గొని వీచిరి. యాదః పతి (జలాధీశుడు) వరుణుడు భృంగారము (ఒకానొక పాత్ర విశేషమును) పట్టుకొనెను. మేనక రంభ తాళవృంతములు (తాటాకు విసనకఱ్ఱలు) గైకొని విసరిరి. దేవ గురువు (బృహస్పతి, యథావిధిగ నగ్నిని వేల్చెను.

తత స్తస్యదదౌ ప్రీత్యావాహనార్థే మదోత్కటమ్ ॥ 10
ఐరావణం చతుర్దంతం నాగంచ పులహః స్వయమ్ । పులహః స్వసుతం ప్రాదాచ్ఛ్వేతం తురగమేవచ ॥ 11
తురగాణాంసహస్రంచ హరీణాం వాతరం హసామ్ । శ్రియాదత్తం తతః ప్రీత్యా రథవాహనముత్తమమ్ ॥ 12
తమగ్నిర్యోజయామాసకాంచనేన రథేనచ । ఇంద్రాయుధ సవర్ణాభిః పతాకాభిరనంతరమ్ ॥ 13
వాయుస్తంయోజయామాస ధ్వజంనాగేనశంకరః । బబంధముకుటం తస్య స్వయంబ్రహ్మాజగద్గురుః ॥ 14
ఉపానహౌదదౌతస్య విరూపాక్ష స్తథానఘ । ఖడ్గశ్చ విమలోదత్తస్తస్య శుక్రేణయాదవ ॥ 15
చందనానిచ ముఖ్యాని గంధాని విలిధానిచ । హిమాలయః స్వయంతస్య ప్రాదాల్లోక గురుర్గురుః ॥ 16
రత్నాని సువిచిత్రాణి సముద్రః స్వయమేవహి । దదుశ్చఋతవస్తస్య పుష్పాణిచ ఫలానిచ ॥ 17
ననృతు ర్దేవగంధర్వా జగుశ్చాప్సరసాంగణాః । హృష్టంప్రముదితంచాసీ త్త్రైలోక్యం సచరాచరమ్ ॥ 18
సర్వగంధాను పాదాయ సురభిర్మారుతోవవౌ ।

అటుపై నతనికి వాహనముగా మదించిన ఐరావతమును నాల్గు దంతములుగలదాని పులహుడు స్వయముగా నొసగెను. ఆయన తన బిడ్డయైన తెల్లని గుఱ్ఱములను ఉచ్చైశ్శ్రవమును బహుమాన మిచ్చెను. వాయువేగములయిన వేయి జాతి గుఱ్ఱములనుగూడ యిచ్చెను. శ్రీ మహాలక్ష్మి ప్రీతితో నుత్తమ రథవాహనము నొసంగెను. అగ్ని యా రథమును బంగారు రథముతో జోడించెను. ఇంద్రాయుధముతో సమములయిన పతాకలతో వాయువలంకరించెను. శంకరుడు జెండాపై నాగు సర్పము నలంకరించెను. బ్రహ్మ స్వయముగ కిరీటము పెట్టెను విరూపాక్షుడు పాదరక్షల నిచ్చెను. శుక్రుడు మెఱుగైన కత్తినిచ్చెను. చందనాది సుగంధద్రవ్యములన హిమగిరి స్వయముగ నొసంగెను. సముద్రుడు విచిత్రరత్న బహూకరణముసేసెను. ఋతువు పూవులుం బండ్లును గానుక పెట్టెను. దేవగంధర్వులు పాడిరి. అప్సరస లాడిరి. చరాచర జగమెల్లహర్షభరిత మయ్యెను. వాయువుసర్వసువాసనలం గొని వీచెను

మహతా చవరౌఘేనతర్పయిత్వా బృహస్పతిమ్ ॥ 19
వరౌఘైస్తర్పయామాస సర్వానేవద్విజోత్తమాన్ । సప్తాహం మానసీం సిద్ధిం ప్రాదాత్సర్వేషు జంతుషు ॥ 20
వ్యాధిమృత్యు జరాశోక వినివృత్తయా । సప్తాహం నరకస్థానాం నైవసర్వాశ్చయాతనాః ॥ 21
సర్వముదిమేతవాసీ త్త్రైలోక్యంస చరాచరమ్ । కిరిటీశ్వాను విష్టాంగః కుండలోత్తమ భూషితః ॥ 22
కౌశేయవసనస్తత్ర శ్వేతమాల్యవిభూషణః । శ్రియందధార సోమస్య శ్వేతస్థస్యశతక్రతుః ॥ 23
భద్రాసనగతంశక్రం ప్రణేముః సర్వదేవతాః । భ్యాప్య మానోమహారాజ తదా దేవేనదండినా ॥ 24
ఋషయస్తు పుష్పవన్తంచ గంధర్వాప్సరసస్తథా । మంగళాలంభనంచక్రే తతఃశక్రః సురారిహా ॥ 25
పూర్ణకుంభంను మనసోరత్నాన్యాజ్యం తథాదధి । ఫరాని శ్రీఫలంచైవ ఉద్భూతానివ సుంధరా ॥ 26
స్వస్తికాంశ్చ చిరాంశ్చైవ నంద్యావర్తాంశ్చకాంచనమ్ । కాంచనోల్లిఖితాశ్చైవ యాశ్చముఖ్యాః సరిద్వరాః ॥ 27

ఉద్గానంతథా దూర్వాందర్పణంచాజ్యమేవచ । ధర్మః సత్యంచశీలంచ బలంచ యదునందన ! ॥ 28
ఉపాసంత మహాభాగం సశరీరాః శతక్రతుమ్ । కాంతిర్లక్ష్మీర్ధృతిశ్శ్రద్ధా పుష్టిర్మేధాక్రియామతిః ॥ 29
బుద్ధిర్లజ్జావపుః శాంతిరనసూయా తథైవచ । ఉపాసంతతదా దేవంసర్వ రాజేశ్వరం విభుమ్ ॥ 30
తతోవవందే పితరం మాతరం శంకరం హరిమ్ । బ్రహ్మాణం వరదం సౌమ్యమృషీంశ్చ యదునందన ॥ 31

గొప్ప వరములనేకములచే నాచార్యుని బృహస్పతిని సర్వ ద్విజవరులను నింద్రుడు సత్కరించెను. (బహుమానములను పీఠములని యిక్కడ పేర్కొనినట్లున్నది.) సర్వ జంతువులకు నేడు రోజులు మానసీ సిద్ధి నిచ్చెను. వ్యాధి మృత్యు జరా శోకములు లేక జగత్రయమునాపట్టాభిషేక సమయమందేడురోజులు సుఖభరితములైనవి. నరకవాసులకాయేడురోజులు నేయాతనలు లేకుండెను. సర్వ భువనములానందపడినవి. కిరీటముపెట్టికొని సుగంధములు బూసికొని అమూల్యరత్నకుండలములుదాల్చి పట్టువలువలంగట్టుకొని తెల్లని పూవులంగైసేసి శ్వేతపర్వత మందుండు చంద్రుని శోభనువహించి యింద్రుడు భద్రాసనమధిష్ఠించెను. సింహాసగతుడగు నింద్రుని సర్వ దేవతలు మ్రొక్కిరి. ఆయాదేవతలను వేర్వేర పేర్కొని ప్రభువునకు దంఢధారియైన యొకవేల్పును నివేదించెను. ఋషులు గంధర్వాప్సరసలు నా వేల్పుదొరను స్తుతించిరి. అప్పుడు శక్రుడు పూర్ణకుంభము సుమదసములు = పువ్వులు రత్నములు గోఘృతమును ఆలపెఱుగు పండ్లు శ్రీ ఫలములు= మారేడు పండ్లు మొదలయిన మంగళ వస్తువులను దర్శించడానికి మరి పెక్కు రీతుల మంగళాలంబవము సేసెను. బంగారపు రేకులందు వ్రాసినస్వస్తిక నంద్యావర్తాది శుభముద్రలను ముఖ్య పుణ్యనదులను గరిక అద్దము ఆజ్యము మొదలయిన మంగళ పదార్థములను సేవించెను. ధర్మము సత్యము శీలము బలము శుభలక్షణములు రూపుదాల్చి (శరీరములై) సర్వరాజేశ్వరునుపాసించెను. అటుపై తండ్రిని, తల్లిని శంకరుని హరిని వరదుడు సౌమ్యుడయిన బ్రహ్మను ఋషులను దేవేంద్రుడు మ్రొక్కెను.

తతోహరిశ్చశక్రేణ సతుమాతలి యంత్రిణా । వినాశయామాసరణె దేవతానామరాతయః ॥ 32
పాలయామాస సకలం తథైవచజగత్త్రియమ్ । శక్రాభిషేక చరితంకథతం యదునందన ॥ 33
శ్రోతవ్యమభిషేకంతు యాత్రాకాలేషుచాప్యథ । గృహప్రవేశేవైవాహ్యే పుణ్యాహేషు పరేషుచ ॥ 34
ఏతత్పవిత్రం మంగల్యం ధన్యం శ్రుతిసుఖావహమ్ । పాప్మాలక్ష్మీ ప్రశమనం దుఃస్వప్న కిల్బిషాపహమ్ ॥ 35
పుణ్యాహకాలేషు నరేంద్రచంద్ర శ్రుత్వాభిషేకం బలసూదనస్య ।
ధర్మార్థకామాన్పురుపాలభంతే వ్యాధిప్రణా శంచయశ స్తథాగ్ర్యమ్ ॥ 36

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
శక్రాభిషేకోనామ పంచాశదుత్తర ద్విశతతమోఽధ్యాయః ॥

ఇంద్రుడవ్వల మాతలి సారథిగా శుక్రుని రథముగాగొని దేవశత్రువులను రణమునంగూల్చెను. భువనత్రయముంగావించెను యదుకుమార! ఇది ఇంద్రాభిషేక కథ చెప్పితిని. యాత్రాసమయములందు గృహప్రవేశమందు వివాహములందు పుణ్యాహములందు నిది పారాయణము సేయవలసినది. ఇది పవిత్రము మంగళ్యము (మంగళ కరము) ధన్యము వీనులకు విందైనది పాపమును అలక్ష్మిని తొలగించునది. దుస్స్వప్న దోషహరము. పుణ్యదినములందును ఇంద్రాభిషేక మిది. ధర్మార్థ కామ పురుషార్థములను పురుషులు (జనులు) పొందుదురు. దీన వ్యాధులు నశించును. సర్వాధికయశస్సు గల్గును.

ఇది శ్రీ విష్ణుధర్మోత్తర మహాపురాణమందు ప్రథమఖండమున దేవేంద్ర పట్టాభిషేకమను
రెండువందలయేబదియవ యధ్యాయము.

# రెండువందల యేఁబదియొకటవ అధ్యాయము-గజలక్షణములు

వజ్రఉవాచ : పులహస్య ప్రజాసర్గం శ్రుత్వాగంధర్వరాట్ తదా । పప్రచ్ఛకింతదా భూయస్తత్ర నాడాయనం ద్విజమ్ ॥
శ్రోత్రామృతం కథయతోనందస్యా పితవానఘ। త్వంహిజ్ఞాన నిధిర్విప్రైః ప్రోచ్యసే వేదపారగైః ॥ 2
మార్కండేయ ఉవాచ : పులహాస్య ప్రజాసర్గం శ్రుత్వాగంధర్వ సత్తమః ।
భూయః పప్రచ్ఛతం విప్రః గజోత్పత్తిం సవిస్తరమ్ ॥ 3
శైలూష ఉవాచ : కుంజరాణాం సముత్పత్తిం శ్రోతుమిచ్ఛామి విస్తరాత్ ।
కుంజరాహి మహాభాగభృశంచ దయితా మమ ॥ 4
నాడాయన ఉవాచ : యదాప్రసూతామార్తండ మదితిర్భాస్కరా ఽరణిః ॥ 5
తదా తదండ ముత్పాద్య దృష్టవాన్కశ్యపః స్వయమ్ । తేజోఽధికత్వాదండస్థం నాపశ్యత యదాశిశుమ్ ॥ 6
ఉవాచదేవ్యా అండేఽస్మిన్కిమసౌ బాలకోమృతః । తతః సభాసః సకలం తేజసాభాసయ జ్జగత్ ॥ 7
తేసమార్తాండ తాఽథాస్య కథితాద్విజ సత్తమైః । తతస్త్వండ కపాలే ద్వేగృహీత్వాతుప్రజాపతిః ॥ 8
పృథక్పృథగవస్థాప్య రథంతర మగాయత । మంద్రః ప్రవేశయామాస ఇరామాస్తే ప్రజేప్సయా ॥ 9
ఉదరే పులహాంతేన జనయామాస సా గజాన్ । అష్టౌ మహాబలాన్నాగాం స్తేషాన్నామానిమే శృణు ॥ 10
ఐరావణ స్తథా పద్మః పుష్పదంతశ్చనామనః । సప్రతీకోంజనో నీలః కుముదశ్చ మతంగజాః ॥ 11
శక్రాద్యానాం దిగీశానాం యథా సంఖ్యేన వాహనాః । చత్వారోజాతయస్తేషా మేకైక స్యాస్వయే స్మృతాః ॥ 12
భద్రామందామృగాశ్చైవ సంకీర్ణాచజనాధిప! । భద్రాశ్రేష్ఠాభ వేత్తాసాం మందా మధ్యా కనీయసీ ॥ 13
మృగాజ్ఞేయాచ బాహుల్యాత్సంకీర్ణా పార్థివోత్తమ ! ।

వజ్రుడు పలికెను-పులహస్యుని ప్రజాసృష్టిని గంధర్వరాజగు శైలూషుండు నాడాయనుని మరి యేమడిగెను. శ్రవణామృతముగ నీవు పలుకుచున్నావు. జ్ఞాననిధివని వేదపారగులు విప్రులు నిన్ను గొనియాడుదురు. మార్కండేయుడు అనెను. పులహుని ప్రజాసృష్టిని శైలూషుడు గజములన నాకిష్టము గజముల యుత్పత్తింగూర్చితెలుపుమన నాడాయనుడిట్లనియె. భాస్కరునిగన్న యదితి సూర్యునిగన్నప్పుడు ఆ యండమును (గ్రుడ్డును) కశ్యపుడు జూచి తేజస్సు మిక్కిలిగానున్నందున యందలి శిశువును గానలేదయ్యె. ఇందున్న శిశువు మరణించెనాయని సంశయించెను అవ్వల నాశిశువు సకలలోకమును దనతేజస్సుచే వెలుగొందజేసెను. అందువలన ద్విజోత్తము లీశిశువునకుమార్తాండుడను పేరుపెట్టిరి. (మృతమయినదా యని యనుకొన్న అండమునుండి పుట్టినవాడు మార్తాండుడను నిర్వచనముచెప్పబడినది. అవ్వల బ్రహ్మ యాయండముయొక్క రెండుకపాలములను వేర్వేరుగానుంచి రథంతర సామగానముచేసెను. శని ఆ రెండుకాపాలములను ఇరాదేవికి సంతానము కలుగవలెనని యామెలో బ్రవేశింపజేసెను. పులహుడప్పుడామె యుదరమునుండి యెనిమిది మహాబలముగల యేనుగులం బుట్టించెను. వానిపేరు ఐరావతము పద్మము పుష్పదంతము వామనము సుప్రతీకము అంజనము నీలము కుముదము. అవి దిక్పాలురకు వరుసగా వాహనములయ్యెను. ఒక్కొక్క కుటుంబములో భద్ర-మంద-మృగ-సంకీర్ణ అనెడి నాల్గేసిజాతులు పుట్టినవి. అందులో భద్ర అత్యుత్తమజాతి. మంద మధ్యజాతి. అధమజాతి మృగ. అనేకజాతుల కలయిక నాల్గవది.

భద్రమంద్రమృగాణాంచ తథావక్ష్యామి లక్షణమ్ ॥ 14
సంకీర్ణానాంచ సంకీర్ణం లక్షణం భవితాతథా । గూఢోష్ఠమస్తకః స్వక్షః పృథ్వాయత ముఖాంగుళిః ॥ 15
ఉద్యగశ్చోగ్ర సత్త్వశ్చసమసాధ్యో మహాకరీ । తామ్రతాల్వీక్షణః స్నిగ్ధః సహిష్ణుః స్వాసన స్తథా ॥ 16

అన్వర్థవేదీ బలవాన్భద్రో జ్ఞేయో మతంగజః । గంభీరవేదీనిః శంకస్తీక్ష్ణ సాధ్యో మహోదరః ॥ 17
దీర్ఘమేఢ్రాంగుళిశ్చైవ సువిభక్త శిరోధరః । స్థిరః కచబలస్థూలో దీర్ఘబాలధి పుష్కరః ॥ 18
హర్యక్షః సూక్ష్మనాభిశ్చ మందో జ్ఞేయో మతంగజః । హ్రస్వః శుష్కావటు హనుర్భీరుర్బహ్వాశన స్తథా ॥ 19
హ్రస్వో ప్తనఖీ దుర్మేధా యూథస్యామచర స్తథా । దీర్ఘజిహ్వా విషాణశ్చ దీర్ఘకక్షాసన స్తథా ॥ 20
క్లేశాక్షమశ్చ దీర్ఘాశీమృగో జ్ఞేయో మతంగజః । సంకీర్ణలక్షణో నాగః సంకీర్ణశ్చ నిగద్యతే ॥ 21

భద్రాది గజముల లక్షణములు: భద్రగజము పుష్టిగా పెసవులు మస్తకము (కుంభస్థలము) చక్కని కన్నులు లావు పొడవుగల తొండము గలిగి ఎత్తె ఎక్కువ సత్తువగలదై సమసాధ్యమై ఎఱ్ఱని తాలువులు గన్నులు నిగనిగలాడ మేను సమానముగల్గి సుఖముగ కూర్చుండుటకనువైన వీపుగల్గి శుభవేదియై (అంకుశముతో గట్టిగా పొడవనపసరములేకుండగనే మావటివాని భావము ప్రకారమున్నది) బలశాలియై యుండును.

మందజాతి యేనుగు: గంభీరవేది (అంకుశముతో గట్టిగా గొట్టినంగాని పోనిది) సందేహపడనిది. తీక్ష్ణసాధ్యము. పెద్ద కడుపుగలది దీర్ఘమేఢ్రము తొండిముగలది బాగుగ విప్పారినమెడ గలది స్థిరమైనది కచబలస్థూలము పొడవైన తోక తొండము గలది. సింహము కండ్లు సూక్ష్మనాభి గలది. మృగజాతి యేనుగు పొట్టిది. అవటువు = పెడతల హనువులు = దవడలు శుష్కములయి యుండు బెదరుగొడ్డు. తిండిపోతు పొట్టెలు చించుకొనిపోయిన గోళ్లగలది. దుష్బుద్ధి గజయూథముతోగాని (ఏనుగుల మందతోగాని) విడిగా దిరుగదు. పొడవైన నాలుక దంతములు గలది. పొడవైన కక్షము- ఆసనముగలది. క్లేశమునకోర్చుకొననిది దీర్ఘకాలము దినునదియును ఇక పైలక్షణములు కలగాపులగములై యున్న యేనుగు సంకీర్ణజాతికి చెందును.

అతః పరం ప్రవక్ష్యామి గజానాంతే వనాష్టకమ్ । హిమవత్ప్రయాగతౌహిత్య గంగామధ్యే మహద్వనమ్ ॥ 22
ప్రాచ్యా మైరావణస్యోక్తం వనం యత్ర మతంగజాః । కించిత్కమలవర్ణాభా శ్చపలాః పృథు మస్తకాః ॥ 23
కునఖా రూపవంతశ్చ తథా మంద మదా గజాః । ఉన్మత్త గంగాత్త్రిపురీదశార్ణం మేకలా స్తథా ॥ 24
తేషాం మధ్యే కరూషాఖ్యం వనం పద్మస్య కీర్తితమ్ । హ్రస్వాశ్చండా స్తథా శ్యామాః శీఘ్రోదగ్ర మహాస్వనాః ॥ 25
సూక్ష్మబిందు చితా స్తత్ర భవంత్య త్యర్థ వేదినః । బిల్వశైలం వేత్రవతీ దశార్ణం చ మహాగిరిమ్ ॥ 26
తేషాం దశార్ణకం మధ్యే పుష్పదంతస్య కాననమ్ । సకృత్త్ర జఘనశ్యామా. సూక్ష్మబిందు విచిత్రతాః ॥ 27
స్థూలహస్త శిరోగ్రీవా స్తత్రజాతా మతంగజాః । పారియాత్రక వైదేశ్య నర్మదా బ్రహ్మ వర్ధనం ॥ 28
వామనస్య వనంమధ్యే తేషాంవై మార్గరేయకమ్ । సుప్రమాణాశ్చ మధ్యాక్షాః శీఘ్రగాశ్చ సువిగ్రహాః ॥ 29
కరేణు నామధేయాశ్చ తత్రోక్తాశ్చ సుగంధినః । వింధ్య సహ్యాత్కలానాంచ దక్షిణస్యార్ణవస్యచ ॥ 30
వనంచమధ్యే కాలేశం సుప్రతీకస్యకీర్తితమ్ । చాపవంశా నృతనభాః పీనహ్రస్వశిరోధరాః ॥ 31
తనుత్వగుత్తరాదీర్ఘా పద్మాభా స్తత్ర దంతినః । సేవాదేశః సముద్రస్య ప్రేమహారంచ నర్మదా ॥ 32
తేషాం మధ్యేంజ నాఖ్యస్య వనంఖల్వ పరాంతకమ్ । పీనాయత విషాణాస్యా మహాకాయాబలాధికాః ॥ 33
రక్తతాల్వోష్ఠ జిహ్వాశ్చ జాయంతేతత్ర దంతినః । కుశస్థలీ మహీపాల! అనంత్యర్బుద నర్మదాః ॥ 34
తేషాంమధ్యేతు సౌరాష్ట్రం వనంనీలస్య కీర్తితం । తస్యవంశేతు జాయంతే చండాశ్చైవాల్ప దేహకాః ॥ 35
సూక్ష్మరూక్షత్వచో వ్యాలా స్తథా శిక్షాత్యజాగజాః । హిమవత్కా లికాసింధకురు జాంగలమేవచ ॥ 36
తేషాం పంచనదం మధ్యేకుముదస్య మహద్వనమ్ । స్ఫుటితాగ్రద్విజా స్తత్రజాయంతే మలవిద్విషః ॥ 37
దానశీలాశ్చ భూతాశ్య దుర్విధేయాశ్చ వారణాః ॥ 38

ఏతత్తవోక్తంతు మతం గజానాం కులాష్టకంచైవ వనాష్టకంచ ।
అతః పరం కింకథయామి తుభ్యం తన్మేవద స్వాయత లోహితాక్ష! ॥ 37

ఇతి శ్రీవిష్ణు ధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే శైలూషం ప్రతినాడాయన వాక్యేషు గజోత్పత్తిర్నామైకపంచా శదుత్తర ద్విశతతమోఽధ్యాయః ॥

ఏనుగులుండు వనములెనిమిది తెలిపెద- హిమవంతము ప్రయాగ లేహిత్య (లేహిత్యనది యనగా శోణానది) గంగానదీ మధ్యప్రదేశమందు తూర్పు పెద్ద యడవియున్నది. అది ఐరావతవనమనబడును. అక్కడి యేనుగులు కొలది తామరపూవు రంగు గలవి. చపలములు పెద్ద మస్తకములు కునఖములు (పుప్పిగోళ్ళు) గలవి అందముగా నుండును. మదము తక్కువ. ఉన్మతగంగ మును త్రిపురి దశార్ణము మేకలము నను దేశములనడుమ కరూషమను పేరి వనమున్నది. అది పద్మజాతి యేనుగులుండునది పొట్టివి కోపస్వభావము శ్యామవర్ణము గలవి, దీర్ఘముగ గట్టిగ ఘీంకరించునవి సూక్ష్మబిందువులు (పుట్టుమచ్చలు) గలవి అర్ధవేదులునైనవి పద్మజాతిగజములు. పుష్పదంతజాతి యేనుగులు బిల్వశైలములు నేత్రవతి దశార్ణము మహాగిరియను చోట్ల నుండును. అందులో దశార్ణకము పుష్పదంతజాతి యేనుగుల వనము.

పుష్పదంతజాతి యేనుగులు : జఘనములు (పిరుదులు) మిక్కిలి గుండ్రములుగ నుండును. చిన్న బిందువులు గలవి. లావైన తొండము శిరస్సు మెడయు గలవి. వామనజాతి యేనుగులుండు ప్రదేశములు పారియాత్రకము వైదేశ్యము నర్మదాతీరము బ్రహ్మవర్ధనమును, వానినడుమనున్న మార్గరేణుకమను వనము వామనజాతి యేనుగులవి. ఇక సుప్రతీకజాతి యేనుగులు మిక్కిలి పెద్దవి. నడిమికంటివి శీఘ్రగమనముగలవి. చక్కని ఆకారముగలవి. కరేణువులను పేరివి. సుగంధముగలవి. వింధ్య సహ్య ఉత్కల దక్షిణసముద్రతీరములు వాని నివాసములు. అందులో నడుమది "కాలేశ" మనునది వానివనము.

అంజనజాతి యేనుగులు: చాపవంశావృత నఖములు : బొద్దుగా హ్రస్వముగానున్న మెడలు పలుచని చర్మముగలవి పొడ వైనవి తామరపూవు రంగుగలవి. సముద్రప్రాంతము ప్రేమహారము నర్మదాతీరము అంజనజాతి గజముల స్థానములు. వానివనము అపరాంతకయ. లావుగ పొడవుగల దంతములుగల్గి మహాకాయములయి బలాధికములయి ఎఱ్ఱని లోదవడలు పెదవులు గలవి నీల జాతి యేనుగులు, కుశస్థలి అవంతి (ఉజ్జయిని) అర్బుదము నర్మద వాని సంచరించు ప్రదేశములు వాని వనము సౌరాష్ట్రము. ఆ నీలముయొక్క వంగడమునకు చేరినవి. చండములు (కోపావేశముగలవి) చిన్న దేహములుగలవి. పలుచని కరకైన శరీరములు తోకలు గలవి. శిక్షకులొంగనివి.

కుముదజాతి యేనుగులు : హిమవంతము కాలికా సింధు కురుజాంగలములవి సంచరించు తావులు. వానిలో దున్న పంచనదము వానివనము. అక్కడ పగిలిన దంతాగ్రములు గలవి మలమొప్పనివి. మదభరితములు అవి శిక్షణకు లొంగవు. మొత్తమీ యెనిమిది కులములు యెనిమిదివనములను నీకు దెల్పితిని. ఈమీద నీకేమి వచింతుందెలుపుమనియె.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున గజోత్పత్తి-
గజలక్షణనిరూపణమను రెండువందల యేబదియొకటవ యధ్యాయము.

## రెండువందల యేబదిరెండవ అధ్యాయము - వానరోత్పత్తి

శైలూష ఉవాచ : విస్తరేణ సమాచక్ష్వ వానరాణాంతు సంభవమ్ । అలంకృతఇ వాభాతియైర్వంశః పులహస్యచ ॥
నాడాయనఉవాచ : కాశ్యపేయీ హరిర్నామ యాభార్యా పులహస్యచ । పులహాత్ జన యామాసశ్వేతం నామవవీముఖమ్॥
శ్వేతస్తదోర్ధ్వ దృష్టించ జనయామాసవానరమ్ । ఊర్ధ్వదృష్టిస్తథా వ్యాఘ్రం వ్యాఘ్ర్యశ్చశరభరతథా ॥ 3

శరభశ్చతథా ర్క్షంచ సింహమృక్షశ్చవానరమ్ । ఋక్షీచ జనయామాస ఋక్షాంశ్చైవ జనాధిప! ॥ 4
వానరాంశ్చ మహాకాయాన్ శతశోఽథసహస్రశః । యేషామన్వయసంభూతా దేవపుత్రా మహాబలాః ॥ 5
ఉత్పన్నా రామసాహాయ్యే రావణస్యవధైషిణః । ఋక్షస్య భగినీఋక్షీ ప్రజాపతి సుతామభౌ ॥ 6
ధూమ్రంచ జాంబవంతంచ జనయామాస ఋక్షజౌ । జాంబవాన్ జనయామాస మార్జార భీమ విక్రమమ్ ॥ 7
మార్జారస్యచ మార్జారాః కులేజాతా మహాబలాః । ఋక్షస్య వానరేంద్రస్య దుహితాం మానసీం స్వయమ్ ॥ 8
దదౌప్రజాపతిః శ్రీమాన్ రూపయౌవన సంయుతామ్ । కామయామాసతాం శక్ర స్తతోవాలి రజాయత ॥ 9
తుమేవ కామభూమాస భాస్కరః స్వయమేవతు । సుగ్రీవంజన యామాస భాస్కరాత్సాసు మధ్యమా ॥ 10
తత్రవానర రాజోఽభూద్వాలిర్వి క్రాంతపౌరుషః । యస్తురామేణనిహతస్సు గ్రీవ స్త్వ భిషేచితః ॥ 11
తస్యాసన్వశగాః సర్వే వానరాదేవయోనయః । వాలిపుత్రోఽంగదో నామ హనుమాన్వాయునందనః ॥ 12
నీలోవహ్నిసుతః శ్రీమాన్ విశ్వకర్మ సుతోనలః । ధర్మపుత్రః సుషేణశ్చ ఋషభోగరుడాత్మజః ॥ 13
ద్వావశ్వినసుతౌవీరౌ మైందోద్వివిదఏవచ । ధూమ్రశ్చ జాంబవాంశ్చైవ వేగదర్శీచ వానరః ॥ 14
మృత్యోః పుత్రామహావీర్యా మృత్యుల్యపరాక్రమాః । గజోగవాక్షోగవయః శరభోగంధమాదనః ॥ 15
యమస్యతనయాః పంచగోలాంగూలామహాఽబలాః । శ్వేతోజ్యోతిర్ముఖశ్చాన్యో భాస్కరస్యాత్మజా వుభౌ ॥ 16
వరుణస్యావరః పుత్రో హేమకూటః ప్రతాపవాన్ । దేవపుత్రా స్తథైవాన్యే ఋషగోపుచ్ఛవానరాః ॥ 17
శతసాహస్రయూథానాం రాజ్యానోభీమవిక్రమాః । హిమవన్మేరునిలయాః శ్వేతనీలనివాసినః ॥ 18
శృంగవన్మాల్యవద్వింధ్య ఋషవంతనివాసినః । యే వసంతిసదా సహ్యేఋషభేగంధమాదనే ॥ 19
సాగరానూప పర్యంతే తథాద్వీపేషు సప్తసు । బ్రహ్మణ్యా బలవంతశ్చ శూరాధర్మ పరాయణాః ॥ 20
నీతిశాస్త్రేషు కుశలాః సర్వశాస్త్ర విశారదాః । సునీతాః సత్త్వంవతశ్చ దృప్తానీతిగృహే రతాః ॥ 21
సంఖ్యాయోరామ భద్రస్య రావణస్యవధైషిణః । హస్తివానర సంగ్రామే పురా రుధిరకర్దమే ॥ 22
గిరికూటనిభా నాగా విజితా యైః సహస్రశః । సహాయా రామభద్రస్య తే వీరా భరతస్యచ ॥ 23
మాగచ్ఛసంయుగం తస్మాద్భరతేన మహాత్మనా ॥
సర్వాస్త్రవిజ్ఞాన విశారదేన సంగ్రామశౌండేన జితేంద్రియేన ।
ధీర్మాచ్ఛరామస్య పరాయణెన శక్రాధికే నత్వతిపౌరుషేణ ॥ 24

ఇతి శ్రీ విష్ణు ధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే శైలూషం ప్రతి నాడాయనవాక్యేషు వానరోత్పత్తి ర్నామద్విపంచాశదుత్తర ద్విశతతమోఽధ్యాయః ॥

శైలూషుడు మతంగజముల సంభవము గూర్చి విస్తరముగ నానతిమ్ము వానిచే పులస్త్యుని వంశము భూషణములు పెట్టి కొన్నట్లు రాణించుచున్నదన నాడాయను డిట్లనియె: కశ్యపుని కూతురు హరియను నామె పులహుని కూతురు. ఆమె శ్వేతుదను వానరునిం గన్నది. శ్వేతుడూర్ధ్వ దృష్టిని గనియె. వానికి వ్యాఘ్రుడు వానికి శరభుడు వానిర్క్ష్యుడు వానికి సింహుడుం బుట్టిరి. ఋక్షి (ఋక్షిని చెల్లెలు) ఋక్షులను వానరులను గనియె. వారు మహాకాయులు. వందలు వేలుగ జనించిరి. వారి వంశమందు దేవ కుమారులు మహాబలులు పుట్టిరి. వారు రామ సహాయులై రావణవధం గోరిరి ఋక్షుని చెల్లెలు ఋక్ష ప్రజాపతి సములగు ధూమ్రుని జాంబవంతునిం గనెను. జాంబవంతుడు మార్జారుని అతడు మార్జాలులను మహాబలశాలురగనెను. ప్రజాపతి తన మానస పుత్రిని రూపయౌవనసంపన్నురాలిని ఋక్షుని కొసంగెను. ఆమె నింద్రుడు కామించెను. దాన వాలి పుట్టెను. ఆమెనే భాస్కరుడు తనంత గామించెను. భాస్కరునియెడ మనసుగొని యా సుందరి సుగ్రీవునిం గనెను. వారిలో వాలి. విక్రమించి పౌరుషముగొని

సేనానాం భజ్యమానానాం సైన్యఖండై ర్బలీయసామ్ । భూయశ్చావర్త మానానాం శుశ్రువేతుములః స్వనః ॥ 11
చిత్రాణాంచధ్వజానాంచ పతాకానాంచ భూభుజః । అదృశ్యత సమాసిక్తం రుధిరం రణమూర్ధని ॥ 12
స్వభ్రేతదామహారాజ రజోమేఘే క్షయంగతే । నిర్మలాసుతతోదిక్షు ప్రావర్తతమ హారణమ్ ॥ 13
తథా ప్రవృత్తే సంగ్రామే దేవగంధర్వ దానవైః । సిద్ధైర్విద్యాధరైశ్చైవ ముని సంఘైః సమం తతః ॥ 14
ఆవృతం సహసావ్యోమ వజ్రయుద్ధకుతూహలైః । వ్యదృశ్యంత విమానాని తేషాం ఖేవిమలాన్యపి ॥ 15
కింకిణీ శతఘుష్టాని పతాకాశోభితానిచ । శుభం గంధమథాదాయ సురభిర్మారుతోవవౌ ॥ 16
పపాత పుష్పవర్షంచ యోధానాం తత్రమూర్ధని । తథా ప్రవృత్తే తుములే క్ష్వేడితోత్కృష్టనాదితే ॥ 17
పదాతయస్తదా జఘ్నుః పదాతీనిచ సంయుగే । ఖడ్గధారానికృత్తానాం పదాతీనాం పదాతిభిః ॥ 18
ద్విధా కృతాని గాత్రాణి నిపతంతి మహీతలే । గృహీత్వా ఖడ్గపాతాని రేజుః కేచిచ్చవర్మిణః ॥ 19
ఖడ్గముద్ధరతాం తేషాం చిచ్ఛి దుర్నృపవిగ్రహాన్ । కేచిద్గదా వినిర్భిన్నమస్తకాగదిభిః క్షితౌ ॥ 20
పతితా స్తత్ర దృశ్యంతే రణే శతసహస్రశః । భగ్నా సిశేషనిక్షేప నిహతారాతయస్తథా ॥ 21
సింహనాద రవాంశ్చ క్రుః పరసైన్య విదారణాన్ । కేశేష్వన్యోన్య మాకృష్య ఖడ్గైఃకే చిత్పరస్పరమ్ ॥ 22
ఆసేదుర్వ సుధాం కృత్వా గతప్రాణా స్తథా పరే । పృష్ఠ విన్యస్త వర్మాణః సన్నద్ధాంస్తురగాం స్తథా ॥ 23
కృత్వా విపాదాన్స మరే నిజఘ్నుః సాదినాంగణమ్ । ఆరుహ్య వర్మిణః కేచిద్వే గాచ్ఛత్రు రణాన్రణే ॥ 24
సారథీన్వి గత ప్రాణాం శ్చక్రు ర్యుద్ధ విశా రదాః । చిచ్ఛి దుర్వారణేంద్రాణాం కరాన్కే చిత్ప దాతినః ॥ 25

బలశాలుర సైన్యఖండములచే చంపబడు మూకలయొక్కయు పోరికి మఱియుం దిఱుగుపడుచున్న మూకల యొక్కయు ధ్వని సంకులమై వినవయ్యెను. ఆకసమందు రజోమేఘము విరిసి దిక్కులు నిర్మలములయినంత మహాయుద్ధమారంభమయ్యెను. అప్పుడాకాశము యుద్ధముగన వేడుకగొన్న దేవగంధర్వదానవసిద్ధ విద్యాధరముని సంఘములతో గ్రమ్ముకొనెను. వారివారి స్వచ్ఛములై విమానములు గగనమందు గనిపించినవి. అవి చిరుగంటలతో పతాకలతో శోభించునవి అంతటవాయువు శుభవాసనలం బరిమళించుచు వీచెను యోధులపై పుష్పవృష్టిగురిసెను. సింహనాదములతో పెనుబొబ్బలతో సంకుల సమర మారంభమయినంత కాల్బలము కాల్బలములంగొట్టినవి వారి ఖడ్గధారచే రెండుగ తెగిన మేనులు మెండుగనేలపై బడెను. కొందరు కవచులు కత్తివేటులం గొనియును కత్తులనెత్తజూచువారి దేహములం ద్రెంచిరి. గదాధరులచే గదానిర్భిన్నమస్తకులై నేలగూలిన యోధులు వందలు వేలునటగనిపించిరి. తెగినకత్తియవశేషముల విసరి యరివర్గముల నరకిన వీరులారణమందరి సైన్యవిదారణములైన సింహనాదము లొనరించిరి. జుట్టుజుట్టుపట్టి వంచి యొండొరులు కత్తుల నఱకికొని ప్రాణములుపోయి నేలకొరగిరి. పిఱుదలకుదొడగులు తొడిగికొని యుద్ధసన్నద్ధములైన గుఱ్ఱములను పాదశూన్యములం జేసి (పాదములునరకి) యాశ్వికగణముంగూల్చిరి. (ఆశ్వికులనగా గుఱ్ఱములెక్కి యుద్ధము చేయువారు)

కేచి ద్దశన విన్యస్త పాదాశ్చా రురుహు ర్గజాన్ ।సాదినశ్చ తథా కేచి ద్విశిర స్కాన్రణాజిరే ॥ 26

కొందఱు కవచధారులు శత్రువుల రథములెక్కి సారథుల ప్రాణముల గొనిరి. కొందరు కాల్బలము యేన్గుల తొండముల నఱకిరి. కొందరు వీరులు గజముల దంతములపై నడుగు లానించి పైకెక్కి మావటింద్రను శిరోహీనులం జేసిరి.

చక్రుః పదాతి నోద్ధృతాః ఖడ్గై రాకాశసం నిభైః । కేచిచ్ఛ సా దినః ప్రాసైః పంచ సప్త తథా శరాన్ ॥ 27
శ్రేణీ కృతాన్వై బిభిదు శ్శిక్షయా రణకో విదాః । కేచిచ్ఛా ర్ఙ్గధను ర్న్యస్త బాణజాలా కులీకృతాన్ ॥ 28
పదా తీన్స మరే చ క్రుర్వ్యాయువే గైస్తు రంగమైః ॥ సాదిన శ్చ తథై వాన్యే సాది భిః సహ సంగతాః ॥ 29
దర్శ యంతో రణే భిక్షాంచ క్రుర్యుద్ధ మనేకధా । కేచిత్పా శాగ్ర నిర్భిన్న హతసారథి నాయకాః ॥ 30

వినేదు రుచ్చైస్స హసా సింహనా దానునిః స్వనాన్ । కుంజరై రాకు లీకృత్య హయ యాన విశారదాః ॥ 31
విపుచ్ఛ హస్తాన్స మరే చక్రుః సాది గణాన్రణే । నిహతంచ శరవ్రాతైః పాదాతం బహుధారణే ॥ 32
రథి భిర్భాతి భూ పాల కమలోత్కర సం నిభమ్ । తురగా స్తురగా రోహా రథిభిర్వి నిపాతితాః ॥ 33
అవప్లుర్వ సుధాంతత్ర శతశోఽథ సహ స్రశః । రథినాం రథిభిః సార్ధం యుద్ధమా సీత్సు దారుణమ్ ॥ 33
బాణతోమరపాతైశ్చ గదాకంపన ముద్గరైః । రథినాంచ మహాయుద్ధ మాసీత్కుంజర ధూర్గతైః ॥ 35

పదాతిజన మాకాశ మచ్చముగమెరుగుదేరిన కత్తులచేతను మావటీంద్రుడు ప్రాసములచే (ఇనుప గుదియలచేతను) శత్రువులు తమపై విసరిన బాణముల నొక్కొక్క దాని నైదు నేడు తునుకలుగా నరకి వేయుచుండిరి. రణనిపుణులు గుంపులు గుంపులుగా గూర్పబడిన తాము వడసిన శిక్షణా నైపుణ్యముచే శార్ఙ్గధనుస్సు నందు విష్ణువుచే నెక్కు పెట్టబడిన బాణ పరం పరచే వ్యాకుల పరుపబడిన వారికి (గంధర్వులకు సహాయముగా వచ్చిన రాక్షసులను పగులనడచిరి కొందరాశ్వికులు (సాదులు) పదాతి వర్గము తోను గలిసి వాయువేగములయిన శత్రువుల గుఱ్ఱములతోను గుఱ్ఱపు రౌతులు శత్రువుల గుఱ్ఱపు రౌతులతోను గలిసి యుద్ధము సేసిరి. కొందరు గుఱ్ఱపు కళ్లెముల త్రాళ్లతో సారథి శ్రేష్ఠులను గొట్టి పెల్లుగ సింహగర్జనములు సేసిరి. హయ యాన విశారదులు గుఱ్ఱపు స్వారీలో నిపుణులైన యాశ్వికగణము వారు కుంజరములను చెదర గొట్టి తోకలు తొండములు తెగిన వానిం గావించిరి. బాణములచే పదాతి గణము రథికులతో బహుతెఱగుల హతమైర క్తమయమై కమలముల ప్రోవువలె భాసించెను హయములు హయా రోహులు రథికులచే గూల్పబడి వందలు వేలుగా నవనిం గ్రమ్మిరి. రథికులు రథికులు సేసిన యుద్ధము బాణతో మరపాతములతో గదాకంపన ముద్గరాయుధములతోసుదారుణ మయ్యెను.

ప్రాసబాణ మహాపాత దుర్నిరీక్ష్యం సమంతతః । నిహతం బహుపాదాతం కుంజరైర్బలదర్పితైః ॥ 36
రణేనృపతి శార్దూల వినికీర్ణం సహస్రధా । సాదినాం సతురంగాణాం సుమహత్కదనం కృతమ్ ॥ 37
మహామాత్ర ప్రముదితైః కుంజరైర్బల దర్పితైః । ఆక్రమ్యరథబృందాని చూర్ణితాని తురంగమైః ॥ 38
వ్యదృశ్యంత మహారాజ విప్రకీర్ణాని భూతలే । ఏవం మధ్యాహ్న సమయే తీక్ష్ణంత పతిభాస్కరే ॥ 39
బభూవాకుల సంగ్రామం ఘోరం రుధిరకర్దమం । రథాశ్వకుంజరైః సార్ధం పత్తయశ్చ సమాగతాః ॥ 40
కుంజరాశ్చ మహాకాయా పత్త్యశ్వరథినస్తథా । పత్తిభిశ్చపదాతీనాం సాదినాం సహసాదిభిః ॥ 41
రథినాం రథిభిర్యుద్ధం కుంజరాణాంచ కుంజరైః । బభూవరాజం స్తుములే సంగ్రామే శోణితోదకే ॥ 42
శూరాణాం రణలుబ్ధానామమర్షాక్రాంత చేతసామ్ । పత్తినా నిహతః సాదీ గజేన నిహతో నరః ॥ 43
రథేన నిహతోనాగః క్వచిదాసీదఘాతితః । హతాః పదాతిభిశ్చాన్యే వ్యదృశ్యంతరణాజిరే ॥ 44
పదాతి రథనాగాశ్చసాదిభిర్వినిపాతితాః । రథనాగహయా యుద్ధే నిహతాశ్చపదాతిభిః ॥ 45
నరేణచ హతోహస్తీ శూరేణ కృతబుద్ధినా । సాదినాచ హతోహస్తీ సాదీచైవ పదాతినా ॥ 46
రథినాచ హతః పత్తిః పత్తినాచ హతోరథీ । రథినా నిహతః సాదీ సంగ్రామే లోమహర్షణే ॥ 47
రేణునాచ దిశోవ్యాప్తా స్తుములే భృశసంకులే । వ్యరాజంత మహారాజ సమరే గతజీవితాః ॥ 48
పతతాం బాణ జాలానాం ధనుషాంచైవ కూజతామ్ । ముద్గరాణాం భుశుండీ నాం తో మరాణాం తథై వచ ॥ 49
పట్టి శానాంచ ఋష్టీనాం క్షేపణా నాంచ యాదవ । అయో గుడానాంప్రాసానాం చర్మణా మథ వర్మణామ్ ॥ 50
అనిశం శ్రూయతే శబ్దో ఘోరస్తస్మి న్రణాజిరే । హయై శ్చ విగతా రోహైర్ధావ మానై రిత స్తతః ॥ 51
భగ్నైషాకూబ రాక్షై శ్చ రథై ర్విగత నాయకైః । భిన్న దంతై శ్చ మాతం గైర్భిన్న కుంభ ఘటాసనైః ॥ 52
లతా వేష్టి తవృక్షాభై శ్శోభాంయాతి రణాజిరమ్ । కుంజరైర్వి గతా రోహైస్త్రాసితై ర్ద్రుతధ న్విభిః ॥ 53

మర్ద్య మానాని సైన్యాని శతశోఽథ సహస్రశః । భిన్నాన్సు దంతైః పురుషాన్దంతా సక్తాం స్తథా గజాః ॥ 54
వహ్య మానాన్య రాజంత కర్ణవ్య జనవీ జితాః । లగ్నాంత్ర జాలైర్ధ శనైర్దం తినః పర్వతో పమాః ॥ 55
లతా వేష్టిత వృక్షాభైః శోభయంతి రణా జిరమ్ । తస్మింస్తథా విధేరౌద్రే సంగ్రామే ఘోర దర్శనే ॥ 56
నరాశ్వానా గరు ధిరైర్విస్రసుః శోణితాపగాః । ఖడ్గ మీనా రాజహంస మహాచ్ఛత్ర విరాజితాః ॥ 57
మహా ఫేనౌఘ వత్యశ్చ భీతానాం భయ వర్ధనాః । తాస్త రంతి తదాయోధాః శూరాజయ ధనైషిణః ॥ 58
రాజన్వాహన నౌభిస్తే వ్యవసాయ పరస్పరాః । ఛిన్నానిస్వాని గాత్రాణి న జానంతి రణే పరైః ॥ 59
తత్ర శూరా మహా భాగాస్త్వ మర్షాక్రాంత చేతసః । ఆయుధ క్షయ మాసాద్య ముష్టి యుద్ధాని చక్రిరే ॥ 60
కేశాకేశి తథాకే చిద్దం తాదం తినఖానఖి । చక్రు ర్యుద్ధం మహారాజ బ్రహ్మ లోక జిగీషవః ॥ 61
క్రందంతోఽన్యే పితౄన్పుత్రాన్భ్రాతౄనన్యే పితా మహాన్ ॥ మాతులాన్ భాగినేయాంశ్చ స్యాలాన్సం బంధిన స్తథా ॥
పితృవ్యానార్య కానన్యే దౌహిత్రా న పరే తథా । ధా వంత్యన్యే పతంత్యన్యే గర్జంత్యన్యే జిగీషయా ॥ 63
స్వనంత్యన్యే పతంత్యన్యే మ్రియంతే చాపరేతథా । శోచంత్యన్యే తథా బంధూన్శోచ్యాస్త్వన్యేతుబంధుభిః ॥ 64
యాచంతేఽన్యే మహారాజ తృష్ణార్తాశ్చ తథా జలమ్ । వాహనేషు సమారోప్యనీయంతేఽన్యేచ బంధుభిః ॥ 65
శిబిరాయ మహారాజ శతశోఽథ సహస్రశః । అన్యేసంవృత్యచాత్మానం భీతాజగ్మురుపహ్వరమ్ ॥ 66
జలార్థమన్యేచనరా బాంధవైశ్చ ప్రచోదితాః । ఆగమ్య దృష్ట్వాచమృతం భాండం భంక్త్వా విచుక్రుశుః ॥ 67
హతబంధు మనాదృత్య స్వామికార్యైకతత్పరాః । పరానభిముఖానేవ తత్రా యుధ్యంత మానవాః ॥ 68
యుధ్యతామేవ తేషాంతు శతశోఽథ సహస్రశః । ఉత్థితాని గణేయాని కబంధాని మహీపతే ॥ 69
కశ్చిన్ననర్త సమరే కబంధస్తు ధనుర్ధరః । గదాపాణి స్తథైవాన్యః ఖడ్గ చర్మధరోఽపరః ॥ 70
పరశ్వథధరః కశ్చిత్ప్రాసపాణి స్తథాఽపరః । నృత్యత్కబంధభూయిష్ఠే దేవదుందుభినాదితే ॥ 71
ప్రవర్తమానే సంగ్రామే శూరాణాం స్వర్గలోకదే । వ్యదృశ్యంత మహారాజ పిశాచా ఘోరదర్శనాః ॥ 72
రాక్షసాశ్చమహాకాయాః క్రవ్యాదాశ్చ తథాపరే । జగామచాస్తం సవితా తదారక్తవపుర్ధరః ॥
సంగ్రామాత్సర్వ యోధానాం పీత్వేవ రుధిరం కరైః ॥ 73
తతోఽస్త శైలం భగవత్యథార్కే గతే జపాపుష్ప కదంబకాభే ।
సేనాద్వయం తచ్ఛిబిరాయయాతం కృత్వాఽవరోహం పరబాణపాతమ్ ॥ 74

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే సంకులయుద్ధోనామ
షష్ఠ్యుత్తర ద్విశతతమోఽధ్యాయః

ప్రాసములు బాణములయొక్కయు పాతములచేతను అంతట చూడనలవికానిదిగ నుండెను. అనేకులు కాలిబంట్లు ఏనుగులచే త్రొక్కబడి హతులైరి. బాణతోమర పాతములతోను గదాకంపనములతోను రథము లకు గజసైనికులతో గొప్పయుద్ధము జరిగెను. గుఱ్ఱపురౌతులసేన బహుముఖముల వ్యాపించెను. బలదర్పితములయిన యేనుగులచేతను గుఱ్ఱములచేతను రథ సముదాయములు చూర్ణితములై భూతలముపై చెల్లాచెదురుగ పడినవై చూడనయ్యెను. పదాతులు పదాతుల తోను గుఱ్ఱపు రౌతులు రౌతులతోను రథికులు రథికులతోను గ జ ము లు గజములతోను తలబడినవి. మధ్యాహ్నకాలమున సూర్యుడు తీవ్రముగ ప్రకాశించుచుండగా రణరంగమంతయు రక్త పంకముతో నాకులిత మయ్యెను. చతురంగబలమిట్లు రణలుబ్ధమైన అమర్షావిష్ట చిత్తమై ఘోరరణము సల్పుచుండగా దిక్కులెల్ల ధూళి ధూసరితములయ్యెను. రణాంగణమున నిరంతరము ప్రయోగింప బడుచున్న వివిధాయుధముల సందడి మహాభయంకరమయ్యెను. భగ్నములైన రథములు ఆరోహశూన్యములగు గజములు మున్నగు

వానితో రణాంగణము బీభత్సమైయొప్పు చుండెను. నరాశ్వగజాదిరక్తనదులు ఖడ్గములనెడి మీనములతోను ఛత్రములనెడి రాజహంసలతోను, యోధుల శిరస్సులనెడి పాషాణములతోను కేశములనెడి శైవాలములతోను పిరికివారలకు భయము గొల్పుచుండగా జయధనమును గోరిన యోధశూరులు వాహనములనెడి నౌకలతో దాటుచున్నవారై యుద్ధమునందు శత్రువులచే తమశరీరములను ఖండించు చున్నను గుర్తించుటలేదు. ఆయుధములెల్ల శూన్యముకాగా ముష్టియుద్ధముల జేయదొడంగిరి. ఇట్లేకేశాకేశి, దంతాదంతి, నఖానఖి యుద్ధములను, బ్రహ్మలోక జిగీషతో జేయుచుండిరి. కొందరు, పుత్రులను, తండ్రులను, తాతలను, మేనమామలను, మేనల్లులను, భావమరదులను వియ్యంకులను, పిలుచుచున్నారు. కొందరు అరచుచున్నారు. కొందరు పరుగెత్తుచున్నారు. కొందరు పడుచున్నారు, కొందరు పరుగెత్తుచున్నారు, కొందరు చచ్చుచున్నారు, కొందరు బంధువుల కొరకు శోకించుచున్నారు, కొందరు దప్పికతో జలమును యాచించుచున్నారు. ఇట్లు యుద్ధములుచేయుచు ఖండితములైన మొండెములు నాట్యముచేయుచుండెను. ఆయుధపాణులైన మొండెములు వివిధముల చేష్టలు చేయుచుండెను. దేవదుందుభులు మ్రోయుచుండెను. ఇట్లు ఘోరసమరము జరుగుచుండగా సూర్యుడు తనకిరణ కరములతో సర్వయోధుల రక్తముల ద్రావియోయన నస్తగిరికేగెను.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర ప్రథమ ఖండమున సంకులయుద్ధమను రెండువందలయరువదవ అధ్యాయము

## రెండువందల అరువదియొకటవ అధ్యాయము - ద్వంద్వయుద్ధవర్ణనము

నిశావసానే గంధర్వాః కృత్వా వ్యూహం సుదుర్జయమ్ । సంప్రతీక్ష్యన్త భరతమాయాంతం రణకోవిదమ్ ॥ 1
భరతోఽపిచ రాత్ర్యంతే వజ్రవ్యూహేన దంశితః । ఆససాద మహత్సైన్యం గంధర్వాణాం సుదుర్జయమ్ ॥ 2
తతః ప్రవవృతే యుద్ధం యమరాష్ట్ర వివర్ధనమ్ । దేవాసుర సమప్రఖ్యం త్రైలోక్యభయకారకమ్ ॥ 3
పత్తీనాం పత్తిభిః సార్ధం సాదినాంచైవసాదిభిః । రథినాం రథిభిశ్చైవ కుంజరాణాంచ కుంజరైః ॥ 4
భాషతాం నామ గోత్రాణి శూరాణాంచైవ గర్జతామ్ । ధనుషాం కూజతాంచైవ శబ్దః సమభవత్తదా ॥ 5
తతః ప్రవృత్తే సంగ్రామే భారతిః పుష్కరోరణే । ఆససాద విశాలాక్షం గంధర్వం రణగర్వితమ్ ॥ 6
తక్షశ్చ భారతిః శ్రీమాన్యు యుధే వీరబాహునా । సేనానీర్విజయః శ్రీమాన్నముచిశ్చతమాగతః ॥ 7
భూమన్యుః కారకః శ్రీమాన్కామపాలేనసంగతః । కిరాతరాజో దమన శ్చంద్రా పీడేన సంగతః ॥ 8
ప్రభద్రకేణ శిబినా తథైవాజికరోరణే । మహోదయః సునిర్దేశో హరికేశేన సంగతః ॥ 9
త్రైగర్తో వసుదానశ్చ సూర్యరశ్మిశ్చ సంగతౌ । గంధర్వః కుముదా పీడః కులూతాధిపతిర్జయః ॥ 10
చక్రతుస్తుములం యుద్ధం దేవాసుర సమం తదా । దాశేరక స్తథా రాజా యవనోవాశనః పరః ॥ 11
ఏకలవ్యశ్చ సంగ్రామే తేనాసీత్సుమహాత్మనా । కుముదః శోణిమా శూరో బలబంధుః సుయోధనః ॥ 12
గంధర్వైః పంచభిః పంచ పార్వతీయాః సమాగతాః । బలాకాబలకా భ్యాంతు గదినా మౌళినా తథా ॥ 13
కుముదేనతు వీరేణ సదసీష్వ నివర్తినా । మద్రరాజోంశుమా న్నామ చతుర్భిః సంగతోరణే ॥ 14
భీమనాద మహానాద వసుషేణ గజాకరైః । దార్వః శ్రుతం జనః శ్రీమాన్ అభిమానః కృతం జయః ॥ 15
యుద్ధంతౌ చక్రతుర్ఘోరం సహితౌ చంద్రవర్మణా । కాశ్మీరకః సుబాహుశ్చ గంధర్వేణ సుబాహునా ॥ 16
చకారతుములం యుద్ధం భీరూణాం భయవర్ధనమ్ । భరతస్యా పరే యోధా గంధర్వై ర్భీమవిక్రమైః ॥ 17
సమాగతా స్తథా యుద్ధే శతశోఽథ సహస్రశః । భరతశ్చ మహాతేజాః శైలూషేణ సమాగతః ॥ 18
చకార తుములం యుద్ధం సర్వభూత భయంకరమ్ । పర్వతాభేన నాగేన త్రిధా ప్రస్రవతా మదమ్ ॥ 19

బాధమానమరీ న్సంఖ్యే మహేంద్రమివదానవాన్ । విశాలోవారయామాస రథేనాభ్యేత్య పుష్కరమ్ ॥ 20
బాణౌఘేన రణేభిత్వా వేగం పుష్కర దంతినః । పుష్కరం తాడయామాసనారాచైర్బహుభి స్తదా ॥ 21

మార్కండేయుడనియె: రేఖుతుడ గంధర్వులు జయింపరాని వ్యూహముబన్నిరి భరతుడు వజ్రవ్యూహమునజిక్కి మహా సైన్యమును జేరెను. అంతటయమ రాష్ట్రవివర్ధనమైన (యముని రాజ్యమును సమ్మర్దపరచునది) యుద్ధమారంభమయ్యెను. అది దేవాసుర సంగ్రామమువంటిది. పదాతివర్గము పదాతివర్గముతో ఆశ్వికు లాశ్వికులతో రథికులు రథికులతో నేనుగు లేనుగులతో దలపడి పోరిరి. నామగోత్రములు పేర్కొనుచుగర్జించు చున్నవీర భటులయొక్కయు కూతలిడుచున్న ధనుస్సులయొక్క ధ్వనియట నుద్రిక్తమయ్యెను అందు భరతపక్షమువాడు పుష్కరుడు రణగర్వితుని విశాలాక్షుడను గంధర్వు నెదిరించెను. భరతపక్షమువాడు తక్షుడువీరబాహునితో దలపడెను. సేనానివిజయుడు సముచితముగ నాతనికి బాసటయైరి. భూమన్యువు కురువంశమువాడు కానుపాలునితో గూడెను. కిరాతరాజు దమనుడును చంద్రాపీడునితో గూడిరి. ఆజికరుడు ప్రభద్రకునితో శిబితో మహోదయుడు మునికేశుడు హరికేశునితో గూడెను త్రైగర్తుడు (త్రిగర్తదేశాధిపతి) వసుదానుడు సూర్యరశ్మియుం దలపడిరి. గంధర్వుడుకు ముదాపీడుడు కులూతాధిపతి జయుడును దేవాసురసమ మయినసంకులయుద్ధ మొనర్చిరి దాశేరదేశాధిపతియవనుడునైన వాశనుడు ఏకలవ్యుడును బోరిరి. కుముదుడు శోణిమ శూయడు బలబంధుడు సుయోధనుడను నైదుగురు గంధర్వులతో కొండరాజు లైదుగురు డీకొనిరి. బలకుడు ఆబలకుడు గదాధారి మౌలి కుముదుడు నను నల్వురతో నంశుమంతు డెదిరించిరి. భీమనాదమహానాద వసుషేణ గజాకరులతో దార్వుడు శ్రుతంజయుడు అభిమానుడు కృతంజయుడు నెదిరించిరి. చంద్రవర్మతో కాశ్మీరకుడు సుబాహువుం బోరిరి. భరతుని యితరయోధులు గంధర్వులును వంచలువేలు సమావేశమై తలబడిరి. భరతుడు శైలూషువికెదురుసని సంకుల సమరమొనరించెను. నడగొండవలెనున్నది మూడుదారుల మదము స్రవించునదియు నింద్రుడు దానవులనట్లు శత్రువులందెగ బాధించునదియునగు పుష్కరునితో విశాలుడు రథమెక్కివచ్చి యెదిరించెను. (వరయామాసఅనియున్నది) పుష్కరుడు ఏనుగునెక్కి యుద్ధముచేయువాడుగాని ఏన్గుకాదు. అతడు బాణజాలముచే పుష్కరుని వేగ ముంగొట్టి పెక్కు బాణములచే వాని యేనుగుం గొట్టెను.

రిపుభిస్తాడ్యమానస్తు భారతిర్భీమ విక్రమః । వవర్ష శరసంఘాతైర్విశాలం సేనయాసహ ॥ 22
పుష్కరస్య విశాలో ఽథమధ్యే చిచ్ఛేదకార్ముకమ్ । ఛిన్నధన్వా విశాలస్య సజఘానాథసారథిమ్ ॥ 23
ఆక్రమ్య యోధయామాస విశాలస్య మహారథమ్ । యదా రణే మహారాజ పుష్కరస్య రథోత్తమమ్ ॥ 24
హంతుంసరథ ముత్సృజ్య విశాలోఽపిమహీపతేః । గదయా యోధయామాస పుష్కరస్యచ వారణమ్ ॥ 25
పుష్కరోఽపి గదాపాణి ర్విశాలాభిముఖం యయౌ । గదాభిస్తౌ తతోవీరౌ పరస్పర జిగీషయా ॥ 26
సర్వ దక్షిణత స్తత్ర మండలాని విచేరతుః । ప్రజహ్రాతు స్తథాన్యోన్యమన్యోన్య స్యవధైషిణౌ ॥ 27
పుష్కరేణ రణే యోగా ద్విశాలస్య గదా హతా । ముమోచ పావకం తీక్ష్ణం సస్ఫులింగం మహీపతే ॥ 28
విశాలేనతతో యుద్ధే గదయా పుష్కరోహతః । హిమవత్సంనికాశస్తు నచచాల పదాత్పదమ్ ॥ 29
పుష్కరేణ మహారాజ విశాలోగదయాహతః । తతః శైలూష వచనా న్మహామాత్ర ప్రచోదితమ్ ॥ 30
ఆరురోహ మహానాగం విశాలో రణ దర్పితః । ఆరురోహ రథం శ్రీమాన్గంధర్వస్యచ పుష్కరః ॥ 31
తావేకరథమారూఢౌ తదా రాజేంద్ర పుష్కరౌ । నిజఘ్నతుర్విశాలస్య సంగ్రామే వరవారణమ్ ॥ 32
యస్యావర్జితనాగస్య కుంజరాన్ని పతిష్యతః । చిచ్ఛేదాథ విశాలస్య శిరోజ్వలిత కుండలమ్ ॥ 33
హత్వా విశాలం సంగ్రామే రథమారుహ్యచాపరమ్ । ఛాదయామాస తత్సైన్యం గంధర్వాణాంశరోత్కరైః ॥ 34
విశాలం నిహతం దృష్ట్వా రుహః పరమకోపనః । సాదీ జఘాన ప్రాసేన గాంధారం రణగర్వితమ్ ॥ 35
తస్య చిచ్ఛేద గాంధారః సప్రాసంతు భుజద్వయమ్ । శిరశ్చస శిరస్త్రాణం క్షురప్రేణ మహీపతే ॥ 36

శత్రువులచే గొట్టబడి భారతి (భరతసేనలోనివాడు) పుష్కరుడు విశాలుని బాణములం గొట్టెను. విశాలుడు పుష్కరుని విల్లు నడిమికి ఖండించెను. ధనువుతెగి యతడు విశాలుని సారథిం గొట్టెను. వానిరథమాక్రమించి విశాలుడు రథమును వదలివేసి పుష్కరుని గుఱ్ఱములం డీకొనెను. పుష్కరుడును గదగొని విశాలునికెదురునడచెను. వారిద్దరు గదాయుద్ధము నారంభించిరి. ఇరువురుం గుడియెడమగా మండల భ్రమణము సేసిరి. ఒకరినొకరు చంపుకొనపలెనని డీకొనిరి. దైవయోగమున విశాలుని గదను పుష్కరుడు నరకెను. నరుకువడిన యాగద మిణుగురులతో నిప్పులం జెరవెను. అంత విశాలుడు పుష్కరుని గదచే గొట్టెను. హిమాలయపర్వతమట్లున్న యతడు గడుగుసం జలించి గదగొని విశాలుం గొట్టెను. ఆపైని విశాలుడు శైలూషునాన మావటీడు నడుపుకొనివచ్చిన మహాగజమెక్కెను పుష్కరుడు శైలూష గంధర్వుని రథమెక్కెను. అట్లుయ్యిద్దరు నొక రథమెక్కి విశాలుని గజేంద్రముంగొట్టిరి. అది లొంగిపోవ దానిపైనుండి పడిపోవుచున్న విశాలునికుండ లోజ్జ్వలమైన శిరస్సు పుష్కరుడు ఛేదించెను. విశాలుంజంపి వేరు రథమెక్కి గంధర్వ సైన్యమును బాణములచే గప్పివేసెను. రుహుండనువాడు విశాలుడు హతుడగుటచూచి పరమ కోపనుడై అశ్వారూఢుడై చని గాంధారుని ప్రాసాయుధముచే గొట్టెను. గాంధారుడా విశాలుని ప్రాసాయుధముతోడి భుజమును నరకెను. క్షురప్రమను నాయుధముచే బొమిడికముతోడి వాని శిరస్సును నరకెను.

తక్షో రథేణ శుభ్రేణ కింకిణీజాలమాలినా । ఆససాద మహాబాహుం వీరబాహుం రణాజిరే ॥ 37
ఏకచ్ఛాయ ఇవాకాశ స్తయోరాసీచ్ఛరోత్కరైః । నవాతి పవన స్తత్ర న విభ్రాజతి భాస్కరః ॥ 38
తక్షః సపుంఖమాకృష్యబాణం భాస్కర సప్రభమ్ । ఓచ్ఛేద సారథే స్తస్య శిరోజ్వలితకుండలమ్ ॥ 39
నిర్యంతృణా రథేనాసౌ సమరాదపవాహితః । తస్మిన్రణాజిరాన్నీతే తక్షం కుంజర ధూర్గతః ॥ 40
అజగామ మహారాజ గంధర్వస్తు సుదర్శనః । తస్యాపతితమాత్రస్య శరేణ నతపర్వణా ॥ 41
చిచ్ఛేదనాగమూర్ధానం భారతిర్భీమవిక్రమః । సేనానీర్విజయః శ్రీమాన్నముచిశ్చ సమాగతౌ ॥ 42
సారథిం తురగాన్కేతు మదృశ్యం చక్రతుః శరైః । అన్యోన్యస్య మహారాజ సమరే భీమవిక్రమౌ ॥ 43
చతుర్భిః సాయకైర్హత్వా నముచేః సతురంగమాన్ । పంచమేన శిరః కాయా జ్జహారరథసారథేః ॥ 44
నముచిర్విరథః ఖడ్గమాదాయ పరవీరహా । జగామాభిముఖస్తూర్ణం సేనాపతిమరిందమ ॥ 45
వేగేనా పతత స్తస్య చక్రమాదాయ భాస్వరమ్ । వివృత్తాక్షస్తు చిచ్ఛేద తస్య మూర్ధాన మంజసా ॥ 46

అటుపై తక్షుడు కింకిణీజాలమాలాభిరామమైన తెల్లనిరథమెక్కి మహాబాహువగు వీరబాహు నెదుర్కొనెను. ఆ యిర్వుర బాణములచే నాకాశమేకచ్ఛాయమైనట్లుండెను. (ఒకేరంగున నున్నట్లు కనిపించెనన్నమాట) ఆచట గాలియాడదు. రవి వెలుగడయ్యె. తక్షుడు భాస్కరప్రభమైన బాణమును సపుంఖమును (రెక్కలతోడి దానిని) ఆకర్షించి వాని సారథియొక్క కుండలోద్దీప్తమైన శిరమును ఖండించెను, సారథిలేని వీనిరథముతో నాతడు రణరంగమునుండి తరలింపబడెను. అతడట్లు గొనిపోబడినంత కుంజర మెక్కి సుదర్శనుడను గంధర్వుడు తక్షునిపైకి వచ్చెను. అతడట్లు పైబడినదే తడవుగ తీక్ష్ణశరముచే అవక్రవిక్రముడు భారతి (భరతయోధుడు) ఏనుగు తలను నరకెను. సేనాని విజయుడు నముచియుం గలిసివచ్చి శరములచే సారథిని గుఱ్ఱములను కేతువును గానరాకుండజేసిరి. అతడు నాల్గు బాణములచే నముచి గుఱ్ఱములం జంపి యైదవదాన సారథి శిరము బడవేసెను. నముచి విరథుడై కత్తిచేకొని సేనాపతి కెదురు నడచెను. వేగమునం బైబడుచున్న గ్రుడ్లు తిరుగుడువడు వాని శిరస్సును వెలుగొందు చక్రముంగొని ఛేదించెను.

భూమన్యుః కామపాలశ్చచక్రతుర్యుద్ధ ముత్తమమ్ । యథా దేవాసురే యుద్ధే బలశక్రౌ మహాబలౌ ॥ 47
తావుభౌ కుంజరారూఢౌ పరస్పర వధైషిణౌ । తోమరైశ్చక్రతుర్యుద్ధం సూర్యాంశు సదృశప్రభైః ॥ 48
యుధ్యతామేవ తేషాంతు భూమన్యుర్వరవారణః । పార్శ్వే జఘాన దంతాభ్యాం కామపాలస్యవారణమ్ ॥ 49

సహితస్తేన నాగేన కృత్వారావం భయానకమ్ ॥ 50
ఆసీత్పరాఙ్ముఖో యుద్ధే వర్తమానః స్వకం బలమ్ । కామపాలం రణేజిత్వా భూమన్యుర్భీమవిక్రమః ॥ 51
గంధర్వసేనాం సహసా జఘాన నిశితైః శరైః । కిరాతరాజో దమన శ్చంద్రాపీడశ్చ సంగతౌ ॥ 52
చక్రతుస్తుములం యుద్ధం సమరేరథ ధూర్గతౌ । చంద్రాపీడ శరవ్రాత నిహతౌ పార్ష్ణిసారథీ ॥ 53
కిరాతరాజ స్తురగాణాం స్వయం రశ్మిగ్రాహకోఽభవత్ । వివ్యాధసశరవ్రాతై శ్చంద్రాపీడం రణే తదా ॥ 54
చంద్రాపీడ శరవ్రాతైః కృతా పీడో రణాజిరే । జఘాన తురగాం స్తస్య దమనస్య మహీపతేః ॥ 55
శక్త్యా వేగాచ్చ వివ్యాధ తదాతం భీమవిక్రమమ్ । శక్త్యావి భిన్నహృదయః పపాతవసుధాతలే ॥ 56
జఘాన భారతం సైన్యం చంద్రాపీడో ఽపిసాయకైః । ఆరోప్య స్వరథం వీరం మధుమాన్దమనం తథా ॥ 57

భూమన్యువు కామపాలుడు నటపోరిరి. బలుడు బలారి దేవాసురసంగ్రామమందట్లా యిద్దరు నొకరినొకరు చంపవలెనని యేన్గులెక్కి సూర్యాంశుని భముతైన తోమరములం (బల్లెములచే) బొడిచికొనిరి. వారట్లు పోరుచుండగనే భూమన్యుడనువారణము దంతములచే కామపాలుని యేనుగుయొక్క పార్శ్వములం గ్రుమ్మెను దానితోగూడ కామపాలుడు తాను భయంకరముగ నార్చి తన బలమును మరలించుకొని పెడమొగము పెట్టెను భూమన్యునట్లు కామపాలు డోడించి గంధర్వసేనను నిశితబాణములంగొట్టెను. కిరాతరాజు దమనుడు చంద్రాపీడుకుంగలిసి తుములయుద్ధము సేసిరి చంద్రాపీడుని శరములచే పార్ష్ణి సారథులుగూల కిరాతరాజు స్వయముగా గుఱ్ఱముల పగ్గములంబట్టెను (తానేసారథియయ్యెనన్నమాట) చంద్రాపీడుని శరములం గొట్టెను. చంద్రాపీడ శర సంచయముచే కృతాపీడుడై దమనుడు వాని గుఱ్ఱములంగొట్టెను. ఆమీద శక్తియను నాయుధముతో వానింగొట్టెను. శక్తిచే గుండె బ్రద్దలైకూలెను చంద్రాపీడుడు భారతసైన్యమును హతమార్చెను. కూలినయాదమనుని మధుమంతుడు తన యరదమెక్కించికొని మహౌషధులను (మూలికను) వాడి విరుజుని (బాధలులేని వానిని) అవ్రణుని = కఱకులులేని వానిని జేసెను.

చకార విరుజం శీఘ్రమ వ్రణంచ మహౌషధైః । యుయుధేచ నికుంభేన మత్స్యరాట్ సరథ స్తథా ॥ 58
రథ స్థితౌ మహావీరౌ వరచాప మహాకరౌ । అన్యోఽన్యం శరవర్షేన ఛాదయేతాంఘనావివ ॥ 59
సురథస్తు నికుంభస్య శరేణశతపర్వణా । చాపమృష్టౌ ప్రచిచ్ఛేద భుజందండం తథాహవే ॥ 60
నికుంభోఽపి ప్రచిచ్ఛేద సురథస్యతుకార్ముకమ్ । తావన్యే ధనుషీ సజ్యేకృత్వా వీరౌ పరస్పరమ్ ॥ 61
ఛాదయేతాం తథాఽన్యోన్యం వీరౌ సాయకవృష్టిభిః । అన్యోఽన్యస్య హయాన్హత్వా చిచ్ఛేద ధనుషీ తతః ॥ 62
హయాన్రథాభ్యాం కాలస్య నిర్జిత్యా వశమోజసా । ధనుషోమధ్యభాగేతు అన్యోన్యస్యన్య కృంతతామ్ ॥ 63
విరథా వసి యుద్ధాయ చక్రతుర్యత్నము త్తమమ్ । ఆదాయ విపులం చర్మ శతచంద్రంచ భాస్వరమ్ ॥ 64
ఆదధాతే ఖడ్గవరావన్యోఽన్య వధ కాంక్షిణౌ । ఖడ్గమాకాశ సదృశ మన్యోన్యం ప్రవిజఘ్నతుః ॥ 65
మండలాని విచిత్రాణి గత ప్రత్యా గతానిచ । కైశికానిచ మార్గాణి దర్శయామాసతు స్తదా ॥ 66
భ్రాంతము ద్భ్రాంతమావిద్ధమాప్లుతం విస్రుతం స్రుతమ్ । సంపాతం సముదీర్ణంచ ఖడ్గ చర్మ విదారణమ్ ॥ 67
ఈక్షితృప్రీతి జననం యుద్ధమాసీ త్తయో స్తదా । కృత్వాతౌ సుచిరం యుద్ధం పరస్పర రణే హతౌ ॥ 68
జగ్మతుర్వసుధాం వేగాత్ శక్రచాపసమావుభౌ । తతః స్వరథమారోప్య సురథో రథి నర్దనః ॥ 69
తస్మాద్దేశా దపోవాహ్య సర్వసైన్యస్య పశ్యతః ।

అప్పుడు మత్స్యరాజు రథమెక్కి నికుంభునితో బోరెను. ఆ ఇర్వురువీరులు వరచాపధరులై యొండొరులను శరవర్ష ములంగప్పికొనిరి సురథుడు శరముచే నికుంభుని భుజదండమును ధనుస్సుపట్టిన పిడికిటం గొట్టెను. నికుంభుడును సురథుని ధనుస్సను నరకెను. వారిద్దరు వేరువిండ్లుకొని యెక్కిడి శరవర్షములచే నొకరి నొకరుగప్పికొనిరి. ఒండొరుల గుఱ్ఱ

ములను ధనుస్సులం బడనేసికొనిరి. రథములనుండి గుఱ్ఱములను విడిపడంజేసి వింటినడిమినిద్దరు విరుగనేసిరి. అటుపై నిద్దరు విరథులై ఖడ్గయుద్ధమునకుంబూనిరి. విపులమైన చర్మముతో నూరుచంద్ర బింబములట్లుదీపించు యాకాశమట్లుపదనెక్కి నిర్మలములయిన కత్తులంగొని కొట్టుకొనిరి. మండలములు గిరునదిరుగుట విచిత్రములైన గత ప్రత్యాగతములు = దూరముగా వెళ్లినట్టు వెళ్లితటాలున మఱలికొనుట కైశికాని = జుట్టుజుట్టుపట్టుకొని నేలకువంచుట మొదలయిన మార్గములను = వస్తాదులు ఖడ్గయుద్ధములో జూపు చిత్ర చిత్ర ప్రక్రియలను ప్రదర్శించిరి. అట్లే భ్రాంతము ఉద్భ్రాంతము ఆవిద్ధము ఆప్లుతము విసృతము సృతము సంపాతము సముదీర్ణము కత్తులయొక్కయు వర్మములయొక్క = కవచములయొక్క విదారణము ఖండనము నను పలురకములయిన ఖడ్గ యుద్ధ విన్యాసములతో వారి యుద్ధము చూపరులకు భ్రీతిజనకమయ్యెను. ఇట్లు చిరకాలము పరస్పరము గొట్టుకొని యిద్దరునతి వేగమున నింద్రధనుసులట్లుభూమికొఱగిరి. అంతట సురథుడు మహారథి వారిందనరథమెక్కించికొని సేనయెల్ల జూచుచుండ నా చోటునుండి తరలించెను.

నికుంభేచాథ సమరే సురథేన తదా రుషా ॥ 70
గోవాసనేన సాల్వేన త్వరమాణస్సమాగతః । బాణ జాలేన సమరే చక్రుర్యుద్ధం సుభైరవమ్ ॥ 71
తావుభౌరథగౌవీరౌరేజతుర్దివ్యధన్వినౌ । తతక్షతుః శరవ్రాతైస్తదాన్యోన్యం తథాన్వితౌ ॥ 72
అన్యోన్యస్య హయాన్హత్వాచ్ఛిత్వాచ ధనుషీ తథా । విరథౌ చక్రతుర్యుద్ధం గదాభిరితరేతరమ్ ॥ 73
విచేరతుస్తౌ సంగ్రామే గదా హస్తౌ మదోద్ధతౌ । వాసితార్థే వనే మత్తౌ కుంజరావివయూథపౌ ॥ 74
సుచిరంతౌ తదాయుద్ధం కృత్వావ్యాయామకర్షితౌ । ప్రహారవర సంతప్తౌ జగ్మతుర్వసుధాతలమ్ ॥ 75
విహ్వలౌ రథయోః కృత్వా నీతౌతౌ స్వస్వసైనికైః । విరుజౌచ కృతౌ భూయో రణశీర్షముపాగతౌ ॥ 76
ప్రభద్రకశ్చ సంగ్రామంచకారాజగరేణహ । ఈక్షితౄప్రీతి జననం శరసంఛాదితాంబరమ్ ॥ 77
సుముఖేవర్తమానస్య తదా రాజా ప్రభద్రకః । చిచ్ఛేదాజ గరస్యాజౌ శిరోజ్వలిత కుండలమ్ ॥ 78
మహోదయః కుణిర్దేశో హరికేశస్య సంయుగే । గజేన పోథయామాస సురథం సరథ సారథిమ్ ॥ 79
హతాశ్వరథ కుత్స్నజ్యగదయా సుదృఢం రణే । హరికేశం మహా బాహుం చకారగతజీవితమ్ ॥ 80

నికుంభుడు సురథుడునట్లనింగూలినంత గోవాసనుడు సాల్వుడునుంగదిసి భైరవమైన పోరుసల్పిరి. అయ్యిద్దరు దివ్య ధనుర్ధరులై రథములందుద్దీపించుచు నొండొరులు శరవ్రాతములం మేనులం జెక్కికొనిరి. ఒక రొకరి గుఱ్ఱములం గూల్చికొని విండ్లు నరకికొని విరథులై గదాయుద్ధమును గావించిరి. అందుమదోత్తుద్ధలయ్యిద్దరు యూథపములు (గజఘటానాయకములు) రెండు మదపుటేనుగులు అడవిలో వాసితార్థము = క్రుమ్ముకొన్నట్లు క్రుమ్ముకొని మిగుల యలసటకులోగి దెబ్బలకు మిగులతపించి నేలబడిరి. గ్రుడ్లుతేలవేసిన యాయిద్దరును నిరురథముల పైకెక్కించి వారివారి సైనికుల తీసికొనిపోయి చికిత్సలుచేయ తిరిగి రణతలమున కేతెంచిరి ప్రభద్రకుడు అజగరునితో దలపడి ప్రేక్షకులకు భ్రీతిగలుగ యమ్ములనింగియెల్ల గ్రమ్ముకొనంజోరిరి. ఎదుటబడిన యజగరుని కుండలోజ్జ్వలమైన శిరస్సును ప్రభద్రకనృపతి నరకెను. మహోదయుడు హరికేశుని దేశమువాడు కుణి సురథుని రథముతో సారథితో నేనుగుచేత ద్రొక్కించెను. ఆపైని గదవిసరి హరికేశునింజంపెను.

త్రైగర్తో వసుధానశ్చ సూర్య రశ్మిశ్చ సంగతౌ । చక్రతుస్తుములం యుద్ధం బలిశక్రౌ వివాపరౌ ॥ 81
కృత్వాతౌ సుచిరం యుద్ధం పరస్పరస మాహతౌ । విచేతసౌరథోపస్థే నిషేదతురరిందమౌ ॥ 82
విసంజ్ఞౌతు తదా నీతౌ సారథిభ్యాం రణాజిరాత్ । గంధర్వః కుముదాపీడః కులూతాధిపతి ర్జయః ॥ 83
చక్రతుస్తుములం యుద్ధం దేవాసుర సమం తదా । అన్యోన్యస్య హయాన్హత్వా ఛిత్వా చధనుషీదృఢే ॥ 84
ఖడ్గయుద్ధం చిరంకృత్వాచ్ఛిన్నఖడ్గౌ పరస్పరమ్ । నియుద్ధం చక్రతుర్వీరౌ బాహుద్రవిణశాలినౌ ॥ 85

నియుద్ధస్యావసానేతు కులూతాధిపతిం జయమ్ । గంధర్వః కుముదా పీడోనిష్పిపేషమహీతలే ॥ 86
తతఃఖడ్గం రయాద్గృహ్య శిరశ్ఛేత్తుం సముద్యతః । నృశంసం తం సమాలోచ్య సేనాపతి మరిందమ ॥ 87
విజయ స్తస్య మూర్ధానం పాతయామాస భూతలే । దాశేరక స్తథా రాజా యశ్చగోవాశనోశనః ॥ 88
ఏకలవ్యస్య సంగ్రామం త్వైరాసీత్సుమహాత్మనః । తస్యైకలవ్య స్తురగాన్జఘానాథ శిలీముఖైః । 89
గదయా ఘాత యామాస సచతస్యతురంగమాన్ । తయోర్విరథయో ర్భృత్యైరుపనీతా తురంగమౌ । 90
పృష్ఠతశ్చతథారూఢౌ వరప్రాసధరావుభౌ । ప్రాసవిభ్రామణోత్క్షేప పరివర్తవివర్తనౌ ॥ 91
చక్రతుస్తుములం యుద్ధం చిత్రం లఘుచసుష్ఠుచ । మండలాని విచిత్రాణి తయోశ్చేరు స్తురంగమాః ॥ 92
ఈక్షితృప్రీతి జననం చిరం కృత్వా తతోరణమ్ । అన్యోన్య వేగాభిహతా పేతతుస్సతురంగమౌ ॥ 93
భృత్యైశ్చరథ మారోప్య సమరాదపవాహితౌ ।

అటుపై త్రిగర్తదేశాధిపతి వసుదానుడు సూర్యరశ్మియుంగూడి తలబడి రెండవబలి యింద్రుడన్నట్లు తుములయుద్ధము సేసిరి. చిరకాలము కొట్టుకొని మూర్ఛవోయి తేరిమొగసాలల గూలబడి రణరంగమునుండి గొంపోబడిరి. కుముదాపీడగంధర్వుడు కులూతాధిపతి జయుడు దేవాసుర సమమైన సమరమొనర్చిరి. ఒకరొకరి గుఱ్ఱములను ధనుస్సులను నఱకికొని చిరకాలము ఖడ్గ యుద్ధముసేసి కత్తులంద్రెంచుకొని బాహు సంపన్నులై యవ్వీరులు నియుద్ధము (బాహుయుద్ధము) సేసిరి. తుదకు కుముదాపీడుడు కులూతదేశపతిని జయుని నేలంబడవేసికాలఁజాచెను. ఆపై కత్తిగొని తలనరుకంబోవ వాడతిసీచుడని ఆలోచించి విజయుడాసేనాధిపతి తల నవనిం ద్రొల్లనేసెను. ఏకలవ్యునికి దాశేరకపతి గోవాశనోశనునితో రణమయ్యెను. ఏకలవ్యుడు వాని హయములనమ్ములం గూల్చ వాడు గదతో నేకలవ్యుని యశ్వములం గొట్టెను. అట్లు విరథులైన వారిద్దరికి భృత్యులు గుఱ్ఱములం గొనివచ్చిరి. ఇద్దరు ప్రాసాయుధములాని వానిపైకెక్కి వానిం జడిపించుట పైకెత్తుట సవ్యాప సవ్యములుగ పరివర్తన వివర్తనములుసేయుట మున్నగు పలురకములయిన ప్రయోగరీతులందుముల యుద్ధమతి చిత్రముగ అతిలఘువుగ అతిసుష్ఠుగ (శాస్త్రీయముగ) గావించిరి. వారి గుఱ్ఱములు విచిత్రమండలములం బరిభ్రమించెను. చూపరులకు జూడముచ్చటగ రణముసేసి యొండొరుల వేగమున కిర్వురుం గుఱ్ఱములతోబాటు పడిపోయిరి. వారిని భృత్యులు రథమెక్కించి సమరభూమించలగించిరి.

కుమారః శ్రేణిమాఞ్శూరో బలబంధుః సుయోధనః ॥ 94
గంధర్వైః పంచభిః పంచ పర్వతీయాః సమాగతాః । బలాకాబలకాభ్యాంతు గదినామౌళినాతథా ॥ 95
కుముదేనచ వీరేణ సమరేష్వనివర్తినా । చతుర్భిః సాయకైస్తీక్ష్ణైః కుమారో బలదర్పితః ॥ 96
హయాంశ్చకార నిర్జీవాన్ బలాకస్య మహాత్మనః । హతాశ్వరథముత్సృజ్య బలాకాభ్రాతురంజసా ॥ 97
ఆరురోహరథం శ్రీమద్బలాకస్య సుసంయుతమ్ తావేకరథమారూఢౌ భ్రాతరౌ సమరప్రియౌ ॥ 98
ఛాదయామాస విశిఖైః కుమారో బలదర్పితః । బలాకస్తు కుమారస్య మధ్యే చిచ్ఛేద కార్ముకమ్ ॥ 99
సచ్ఛిన్నధన్వా వేగేన గదామాదాయ వేగవాన్ । తామాదాయ జఘానాథ బలాకం సమరప్రియమ్ ॥ 100
బలాకం నిహతం దృష్ట్వా రోషాదశ్రు నివర్తయన్ । కుమారం ప్రతిచిక్షేప బలాకశ్చైవతోమరమ్ ॥ 101
తోమరేణచ నిర్భిన్నో రథోపస్థ ఉపావిశత్ । తం విసంజ్ఞమథోవాహసారథిర్హయయానవిత్ ॥ 102
శ్రోణిమానథ సంక్రుద్ధో బలకస్య తదారణే । క్షురపర్యంతధారేణ చక్రేణాపహరచ్ఛిరః ॥ 103
నిపాతితోఽథ తత్రైవ శూరేణ గదయాగదీ । తం నిహత్య తదా శూరో మౌలినః సారథింరణే ॥ 104
గదయాపోథయామాసమేరుగౌరవయా తదా । కుముదస్య జఘానాథ గదయాసతురంగమాన్ ॥ 105
హతాశ్వం రథ ముత్సృజ్య కుముదో గదినో రథమ్ । ఆరురోహ తదా శీఘ్రం ఖడ్గబాణ ధనుర్ధరః ॥ 106

రథా రూఢస్య తస్యాథ బలకశ్చ మహారథః । జఘాన చతురో వాహాం శ్చతుర్భిస్సాయకై స్తదా ॥ 107
జహార పంచమేనాథ శిర స్తస్య సకుండలమ్ । సారథింతు రథా త్తస్మాన్మౌలినో రథము త్తమమ్ ॥ 108
హతసారథినం పూర్వ మారురోహ మహారణే । మౌలీయుద్ధాయ తస్థౌచ మహాబలపరాక్రమః ॥ 109
ఆరుహ్య సరథం దివ్యం కింకిణీ జాలనాదితమ్ । తతః సమౌళిన్యాక్రాంతః సుయోధన రథో రణే ॥ 110
అవాకిరదమే యాత్మా శరైః సన్నత పర్వభిః । సుయోధనోఽపి విక్రమ్య మౌళినం మౌళి భూషితమ్ ॥ 111
జహారసశిరస్త్రాణం శిరో జ్వలిత కుండలమ్ । మద్ర రాజోంశుమాన్నా మచతుర్భిః సాయకోత్తమైః ॥ 112
భీమనాద మహానాద వసుమేషరుజాకరైః । చత్వారస్తే మహారాజమద్రరాజస్య సాయకైః ॥ 113
నిజఘ్నుశ్చతురోవాహాన్సారథించ తథా రణే । అంశుమా న్రథముత్సృజ్య గదామాదాయ వీర్యవాన్ ॥ 114
జఘాన చతురోవాహాన్భీమనాదస్య సంయుగే । సారథిం పోథ యామాస మహానాద రథాం స్తథా ॥ 115
గతాశ్వం రథ ముత్సృజ్య గదా వేగేన యాదవ । మహోదయస్యతం నాగం పోథయామాస వీర్యవాన్ ॥ 116
సారథిర్భీమనాదస్య మహానాద రథం యయౌ । భీమనాదంచ గదయా నిజఘానాథ మద్రరాట్ ॥ 117
సమద్రరాజో గదయా సమరే తాడితో భృశమ్ । జగామ త్రిదివం రాజం స్త్యక్త్వా దేహం రణ ప్రియః ॥ 118

కుమారుడు శ్రేణిమంతుడు శూరుడు బలబంధుడు సుయోధనుడు నను నైదుగురు గంధర్వులతో నైదుగురు పార్వతీయులు కొండరాజులు దలపడిరి. బలాకుడు అబలకుడు గది మౌలి కుముదుడు నను పేరివారాకొండరాజులు. కుమారుడు నాల్గమ్ములం బలాకుని గుఱ్ఱములం జంపెను. అతడురథమువిడిచి బలాకుడు తమ్ముడబలకుని తేరెక్కెను. ఇద్దర నేకరథారూఢులైనవారిని కుమారుడమ్ములంగప్పి వేసెను. కుమారుడు గదగొని బలాకునిగొట్టెను. అన్నగూలుటగని కంటనీర్వొట్టుచు రోషముతో బలకుడు తోమరమును గుమారునిపైకి విసరెను. దానమేనువగిలి యతడు రథముమోసల నొఱగెను. విసంజ్ఞుడయిన యాతనిని వాని సారథి హయయానవిత్ = అశ్వరథ సారథ్యము లెస్సగ దెలిసినవాడు రణరంగముం దప్పించెను. ఆమీద శ్రేణిమంతుడు క్రుద్ధుడైక్షుర పర్యంతధారమైన ( ) చక్రముచే బలకునితలం దెగనేసెను. ఆ శ్రేణిమంతునిచేతనే గదచేత గదియుంగూల్పబడెను. వానిం జంపి యాశూరుడు మౌలియొక్క సారథింగూల్చెను. ఆగదమేరుపర్వతమంత బరువైనది. దాననా పైనికుముదుని గుఱ్ఱములం గొట్టెను. కుముదుడు రథమువిడిచి ఖడ్గబాణధనుర్ధారియై గదియొక్క రథమెక్కెను. బలకుడపుడు రథమెక్కినవాని నాల్గుగుఱ్ఱములను నాల్గుసాయకములంగూల్చి యెదపదాన సకుండలమైన శిరమును హరించెను. వానిసారథింగూడ గూల్చెను. ఆపై సారథివోయిన మౌలియొక్కరథమును బలకుడెక్కెను. ఆపై మౌలియు కింకిణీజాల నాదితమైన దివ్యరథమెక్కి యుద్ధసన్నద్ధుడయ్యెను. మౌళి యప్పుడు సుయోధను రథమెక్కి సన్నతపర్వములయిన బాణములచే ముంచెత్తెను. సుయోధనుడు విక్రమించి మౌలి భూషితుని (మౌలి = యుద్ధ వీరులు రాల్చు శిరస్త్రాణము బొమిడిక మనబడును.) మౌలియను వానిపై విక్రమించి శిరస్త్రాణముతోడి వాని కుండలోజ్జ్వలమైన తలనరికెను. ఆ మీద మద్రదేశ రాజగు అంశుమంతుని భీమనాదము మహానాదము వసు మేషము రుజాకరము నను వానిచే నాల్గు గుఱ్ఱములను సారథిని మద్రరాజు గూల్చెను. అంశుమంతుడు రథము వదలి గదగొని భీమనాదుని నాల్గు గుఱ్ఱములం నాల్గుబాణముల గొట్టెను. సారథిం రథమునుం గూల్చెను. గుఱ్ఱములులేని తేఱువదలి గదావేగముచే మహానాదుని యేన్గును జంపెను. భీమనాదుని సారథి మహానాదుని రథమునకేగెను. మద్రరాజు భీమనాదుని గదగూల్చెను. మద్రరాజు దేహమువాసి స్వర్గమున కేగెను.

మహానాదోఽపి సమరే సాయకైర్లోమవాహిభిః । బిభేదమద్రరాజానం శతశోఽథ సహస్రశః ॥ 119
సబాధ్యమానో నా రాచైర్మహానాద భుజచ్యుతైః । ఆరురోహ రథం శీఘ్రం వసుషేణస్య సత్వరః ॥ 120
రథమారుహ్య వేగేన గదయా భీమవేగయా । చకారయుద్ధే నిర్జీవం వసుషేణం సమర ప్రియమ్ ॥ 121

అవరుహ్య రథా త్తస్మా ద్గదయా భీమవేగయా । గజాకరస్యతురగాన్ సారథిం చాహనచ్ఛృశమ్ ॥ 122
హతేషుతేషు రాజేంద్ర తదావీరోగజాకరః । రథంతంతు సమారుహ్య భూయ ఏవతదంశుమాన్ ॥ 123
చకారయుద్ధే నిర్జీవం గాంధర్వంతం గజాకరమ్ । ఉత్ప్లుత్య తురగా త్తస్మా న్మహానాద రథంగతః ॥ 124
గదయాపోథయామాస మహానాదం తదా రణే । రోష దీర్ఘాంకుశం కృత్వా కుంజరం భరతాజ్ఞయా ॥ 125
ఆరుహ్య నిజఘానాథగంధర్వాన్ శతశో రణే । దార్వః శ్రుతం జయః శ్రీమానాభిసారః కృతంజయః ॥ 126
యుద్ధంతౌ చక్రతుర్వీరౌ సహితౌ చంద్రవర్మణా । చంద్రవర్మా మహాతేజాః శ్రుతంజయరథా ద్ధ్వజమ్ ॥ 127
శరేణ పాతయామాస వటవృక్ష మివోచ్ఛ్రితమ్ । శ్రుతం జయోపి సంక్రుద్ధ శ్చంద్రవర్మకరస్థితమ్ ॥ 128
ద్విధాచకార తీక్ష్ణేన సాయకేన మహద్ధనుః । తంభిన్న ధనుషం వీరం శరైః సంనత పర్వభిః ॥ 129
ద్విధా చకార సమరే పార్వతీయః కృతంజయః । చంద్రవర్మా సమాదాయ తతః శక్తిం సుదారుణమ్ ॥ 130
బిభేద సమరే రాజన్రాజానం తం కృతంజయమ్। సవిభిన్న స్తయా శక్త్యా రథోపస్థ ఉపావిశత్ ॥ 131
తం విసంజ్ఞ మపోవాహ సంగ్రామాదథసారథిః । కృతంజయం మహారాజ రణేదృష్ట్వా విచేతసమ్ ॥ 132
సకుండలం సముకుటం చారుచంద్ర సమప్రభమ్ । శిరశ్చిచ్ఛేద తీక్ష్ణేన సాయకేనమహాత్మనా ॥ 133
సమరేయతమానస్య సుభృశం చంద్రవర్మణా । కాశ్మీరకః సుబాహుశ్చ గంధర్వేణ సుబాహునా ॥ 134
చకార తుములం యుద్ధం భీరూణాం భయవర్ధనం । ఉభౌతౌ తరుణౌ వీరా వుభౌ సమరదుర్మదౌ ॥ 135
దర్శనీయావుభౌ వీరావుభౌ బాణ ధనుర్ధరౌ । తావుభౌ సదృశౌ వీర్యే శంబరామర రాజయోః ॥ 136
ఉభౌ ప్రకారైశ్చలితౌ తథోభౌ దృఢవిక్రమౌ ।చిచ్ఛిదుస్తే తథాన్యోన్యం ధ్వజచ్ఛత్రే నరాధిప ॥ 137
అన్యోన్యస్య హయాన్హత్వా తథోభౌ పార్ష్ణి సారథీ । అన్యోన్యం ధనుషీ ఛ్చిత్వా సుదృఢే సమరప్రియే ॥ 138
కృతే ప్రతికృతంచైవ కుర్వాణౌ భీమవిక్రమౌ । విరథా వసి యుద్ధాయ చక్రతుర్యత్నము త్తమమ్ ॥ 139
అసియుద్ధం చిరం కృత్వా ఖడ్గమావిధ్య సత్వరః । పాతయామాస మూర్ధానం గంధర్వస్య నరాధిప ॥ 140
ఆరురోహ రథం చాన్యం సుశీఘ్రం భరతాజ్ఞయా । తత్రారూఢస్స గంధర్వాన్ జఘాన శతశో రణే ॥ 141

మహానాదుడును తెక్కులుగల బాణములచే మద్రరాజుంగొట్టెను. అతడు వసుషేణుని యరదమెక్కి భీమవేగమైన గదచే వసుషేణుని గత జీవితుం జేసెను. మరియు నా రథము దిగి గదతో గజాకరుని తురగములను సారథినిం జావమోదెను. వారు సావ గజాకరుడను వీరుడు వచ్చెను. రథమెక్కి తిఱిగి యంశుమంతుడును నా గజాకరుడను గంధర్వుని నిర్జీవుం జేసెను. తానెక్కిన గుఱ్ఱమునుండి దూకి గదతో మహానాదుని రథమెక్కి వానింగడతేర్చెను. రోషదీర్ఘాంకుశము పూని భరతాజ్ఞచే నేనుగెక్కి వందలకొలది గంధర్వులంగొట్టెను. దార్వుడు దర్వదేశమువాడన్నమాట శ్రుతంజయుడు ఆభిసారుడు(అభిసారదేశమువాడు) శ్రీమంతుడునగు కృతంజయుడుచంద్రవర్మతో రణము సేసిరి. చంద్రవర్మ శ్రుతంజయుని రథమునుండిమఱ్ఱిచెట్టంతయెత్తైనధ్వజముం బడనేసెను. శ్రుతంజయుడును క్రుద్ధుడై చంద్రవర్మ చేతిలో నున్న మహాధనుస్సును పదునైన బాణముచే రెండుగావించెను. పార్వతీయుడు కృతంజయుడును ధనుస్సు తెగినవానింగూడ శరములంగప్పెను. చంద్రవర్మ సుదారుణమైనశక్తియను యాయుధముచే రాజగు కృతంజయుని గొట్టెను. అతడు శక్తి విభిన్నుడైరరథము మోసలనుపవేశించెను. (కూర్చుండెను) తెలివి తప్పిన వానిని వాని సారథి రణమునుండి తరలించి కుండలములతో ముకుటముతోగూడి చక్కని చంద్రబింబ సదృశమైన చంద్రవర్మ శిరస్సును ఛేదించెను. కాశ్మీరకుడను సుబాహువు (వీరుడు) సుబాహు వను గంధర్వునితో సంకుల సమరము సేసెను. ఆయిద్దరు తరుణులు (వయస్సులో నున్నారు) కదన దుర్మదులు అందగాండ్రు ధనుర్ధరులు. శంబరునికి నింద్రునికి సమానులు. నానావిధ యుద్ధప్రకారములచే చలితులు. (దూకువారు) దృఢ విక్రములు. వారొకరొకరి ధ్వజములను చక్రములను నఱికికొనిరి. గుఱ్ఱములం గూల్చికొనిరి. పార్ష్ణి సారథులం జంపుకొనిరి.

పార్ష్ణి = మడమల కడనంగరక్షకుడుగా నుండువాడు - ధనుస్సుల విరుచుకొనిరి. చేతకెదురుచేత చేసికొనిరి. (దెబ్బకెదురుదెబ్బ కొట్టుకొనిరి.) విరథులై ఖడ్గయుద్ధమునకు బూనిరి. చిరకాలమసియుద్ధముసేసి కత్తిలాగికొని గంధర్వునితలను బడనేసెను. భరతాజ్ఞచే వేఱొక రథమెక్కి వందలకొలది గంధర్వులం గొట్టెను.

ఏతస్మిన్నంతరే క్రుద్ధః శైలూషః ససహాయవాన్ । చకార యుధి నిర్జీవాన్ నర నాగ తురంగమాన్ ॥ 142
బభూవ భారతీ సేనా శైలూషేణోపమర్దితా । నిదాఘే పుష్పశ బల ద్విరదేనేవ పద్మినీ ॥ 143
ఏతస్మిన్భారతే సైన్యే కశ్చిదాసీ న్మహారథః । ప్రత్యుద్యయౌ యః సమరే శైలూషం రణకర్కశమ్ ॥ 144
శైలూష శరసంపాతరుద్ధగోకుండలే రవౌ । నప్రాజ్ఞాయత రాజేంద్ర తదా కించిద్రణాజిరే ॥ 145
అశ్రూయత మహాఞ్ఛబ్దస్తాలానాం పతతా మివ । నరనాగాశ్వ కాయేభ్యో విసస్రుః శోణితాపగాః ॥ 146
ఏవంతు భారతం సైన్యం కాల్యమాన మిత స్తతః । శైలూషేణ మహారాజ భరతం శరణం యయౌ ॥ 147
భరతోఽపి మహాతేజా దృష్ట్వా శైలూష మాగతమ్ । ప్రత్యుద్యయౌ రథేనాజౌకింకిణీజాలమాలినా ॥ 148
తతస్తౌ చక్రతుర్యుద్ధం ఘోరరూపం భయానకమ్ । త్రైలోక్య విజయాసక్తౌ యథోభౌ బలివాసవౌ ॥ 149

:- శైలూష రణారంభము :-

ఈ లోన శైలూషుండు క్రుద్ధుడై నరులను కరులను హరులను నిర్జీవులం జేసెను. అప్పుడు శైలూష సమార్దితమై భారతీసేన (భరతుని యొక్క సేన) గ్రీష్మ మందు బూలరంగు చెఱచు ద్విరదముచేత పద్మిని వోలె (తామర లతవలె) నయ్యెను. ఈ భారత సైన్యమందున్న వాడు మహారథుడొక్కడు రణకర్కశుడైన శైలూషుని పైకెత్తిచనెను. శైలూషుని శరసంపాతముచే రవి కిరణ మండల మడ్డగింపబడి యయ్యెడ రణాంగణ మందేమియిం గనరాదయ్యెనను. తాడి చెట్లు గూలుచున్న పెద్దచప్పుడు విననయ్యెను. నరకుంజర తురంగ మాంగములనుండి రక్త నదులు జాలెత్తెను. ఇట్లు శైలూషునిచే వ్యాకులముగా బడుచున్న సైన్యము భరతుని శరణొందెను. మహాతేజస్వి భరతుడును శైలూషుని రాకంగని యనిలో కింజకిణీజాలమాలాభి రామమైన తేజెక్కి యెదురుగనెను. అవ్వలి నా యిద్దరు త్రైలోక్య విజయా సక్తులై పోరుకొనిన బలివాసవులట్లు ఘోరరూపమైన భయానకమైన యుద్ధము గావించిరి.

గంధర్వరాట్తతః క్రుద్ధః సింహవద్వినద న్విభుః । భరతస్య రథం తూర్ణం శరవర్షై రవాకిరత్ ॥ 150
క్రమేణ సరథ స్తస్య సహయః సహసారథిః । శరవర్షేణ మహతా సంఛన్నో న ప్రకాశితః ॥ 151
యుధాజిత్స్వల్ప సంభ్రాంతో ధైర్యమాసాద్య వీర్యవాన్ । చోదయామాసతానశ్వాన్ విభుగ్నా న్నిపుసాయకైః ॥ 152
భరతోఽథధనుర్గృహ్య దివ్యం జలద నిస్స్వనమ్ । శైలూషస్య ద్విధాచక్రే క్షురప్రేణ మహద్ధనుః ॥ 153
గంధర్వశ్ఛిన్నధన్వాస పునరన్యన్మహద్ధనుః । నిమేషాంతరమాత్రేణ సజ్జం చక్రే మహాబలః ॥ 154
విచకర్షతతోదోర్భ్యాం చిక్షేపచ తతః శరాన్ । అథాస్యతదపి క్రుద్ధశ్చిచ్ఛేద భరతో ధనుః ॥ 155
తస్యతత్పూజ యామాస లాఘవం త్రిదశాధిపః । శైలూషోఽపి తతః క్రుద్ధః ప్రగృహ్యాన్యన్మహద్ధనుః ॥ 156
ముమోచ సమరే బాణాన్ భరతస్య రథం ప్రతి । యుధాజి న్మాతుల స్తస్య సహయానేన లాఘవమ్ ॥ 157
దర్శయామాస సమరే మోఘాన్కుర్వన్శరవ్రజాన్ । తురగా శ్చోద్యమానాస్తే మండలానీవ బభ్రముః ॥ 158
యథా యథా శర వ్రాతా మోఘాయా న్తి మహీతలమ్ । భరతోఽపి మహాతేజా మండలీకృత కార్ముకః ॥ 159
వీరకేతుం శరవ్రాతై ర్వ్యాథ రణమూర్ధని । తాడితం సారథిం దృష్ట్వా వీరకేతుం తథా సుతమ్ । 160
గంధర్వస్తాడయామాస సాయకైస్తు యుధాజితమ్ । యుధాజితి మహాబాహౌ సమరే భృశవిక్షతే ॥ 161
చిచ్ఛేదక్షత్రం బాణేన శైలూషస్యతు రాఘవః । ద్వితీయేనతు బాణేనలసంతంధ్వజ ముచ్ఛ్రితమ్ ॥ 162
తృతీయేన ధనుర్ముష్టౌ తథా జలదనిఃస్వనమ్ । సచ్ఛిన్నధన్వా వేగేన శక్తిమాదాయ సత్వరః ॥ 163

యా జనము నెల్ల నోదార్చెను. శైలూషునికి వాని కొడుకులచే యథావిధి సంస్కారము సేయించెను. వారు వానికి కాష్ఠము పేర్చి వారి కొడుకులకు సర్వయోధులకు చందనా గురుకాలీయకాదికాష్ఠములచే గంధములచే తైలములచే నేతిచే బ్రజ్వలింపజేసి వారందరికి సంస్కారమొనరించి నగరమునకేగిరి. గంధర్వరాజు శైలూషుడు చివరిదశలో జెప్పినమాటననుసరించి గంధర్వమహాజనమెల్ల నాడా యనునిమున్నిడుకొని గంధమాదనమునకుంజనిరి. చిత్రరథాజ్ఞతో గంధర్వులు రామ పర్వతముపై నివేశనమొనరించియాతనిచేపాలితులై యటసుఖముగా వసించిరి. అక్కడగూడ శైలూషుని పౌత్రుడా జనమునకు ప్రభువై భరతునిమాటంబట్టి వారి సంరక్షణము సేసెను.

ఇది శ్రీ విష్ణుధర్మోత్తరమహాపురాణమందు ప్రథమఖండమున గంధర్వస్త్రీ విలాప మను రెండువందలఅరువదియెనిమిదవ అధ్యాయము.

## రెండువందల అరువదితొమ్మిదవ అధ్యాయము - శ్రీరామచంద్ర భరతసమాగమము

మార్కండేయః- అ థా షా ఢస్య మాసస్య శుక్ల పక్షావ సానికమ్ ॥
ఉత్సవం త్రిదశేం ద్రాణాం సమా ప్తం దిన పంచకం ॥ 1
క్షీరోద శేష శయనే భగవాన్ మధుసూదనః । యోగ నిద్రాం తథా భేజే లోకానాం హితకామ్యయా ॥ 2
భరతోఽ ప్యుత్సవం కృత్వా పూజయిత్వా జనార్దనమ్ । మహీదానం తథా కృత్వా నక్తా శీ దినపంచకమ్ ॥ 3
చాతు ర్మాస్యే నివృత్తే చ మధుమాంసస్య భక్షణాత్ । విసర్జయా మాస గృహాత్ పూజయిత్వా మహీపతీన్ ॥ 4
ఉక్త్వా బహువిధైః సాంత్వైః పరిష్వజ్య సుపీడితమ్ । గంధర్వ నగరా వాప్తై ర్విభజ్య ధన సంచయైః ॥ 5
సంపూజ్య వర్షారా త్రౌ తు స్వకీయం సైనికం జనమ్ । సంమంత్ర్య ప్రేషయా మాస సోత్కంఠం దయితాజనే॥ 6
ప్రేషయి త్వా జనం ప్రాయాత్ కించి చ్ఛేష స్వసైనికైః । ఉవాస మాతుల గృహే భరతో దేవ రాజవత్ ॥ 7
అవసచ్చతురో మాసాన్ ప్రీత్యా రాఘవసత్తమః । తతః కా ర్తిక మాసస్య శుక్ల పక్షావ సానికమ్ ॥ 8
ఉత్సవం విపులం చక్రే సంప్రాప్య దిన పంచకమ్ । ప్రబోధం దేవదేవస్య త్రిదశానాం మహోత్సవే ॥ 9
తేషు దత్త్వా మహాదానం కార్తిక్యాంచ విశేషతః । పూజయిత్వా జగన్నాథం శంఖ చక్ర గదాధరమ్ ॥ 10
శుభేదినే సు నక్షత్రే పూజయిత్వా ద్విజోత్తమాన్ । సాంవత్సరం పురస్కృత్య స్థపతీం శ్చ స రాఘవః ॥ 11
సింధో రుభయ పార్శ్వే తు స చకార పురద్వయమ్ । పుష్కరం పుష్కరావత్యాం తక్షం తక్షశిలాం ప్రతి ॥ 12
ఆరంభం పురయోః కృత్వా సోఽభిషిచ్య సుతావుభౌ । పురద్వయే మహారాజ! విధివ ద్భూరి దక్షిణః ॥ 13
పుష్కరే పుష్కరం పుత్రం తథా తక్షంచ యాదవ!

మార్కండేయుడనియె. అవ్వల నాషాఢ శుక్లపక్షముచి వర జరుగనగు దేవతలమహోత్సవ మైదురోజులుజరిగి పూర్తియయ్యెను. పాల్కడలిలో శేషతల్పశాయి భగవంతుడు మధుసూదనుడు లోకహితము నెంచి యోగనిద్రం జెందెను. భరతుడును నుత్సవముసేసి యవ్విష్ణువుం బూజించి భూదానము సేసి యైదు నాళ్లు నుపవసించి చాతుర్మాస్యమందు మధుమాంస భక్షణము మాని యుండి సహాయ భూతులై వచ్చిన రాజులందరిని బూజించి పంపి వేసెను. ఆ పంపునపుడు బహు విధములైన సాంత్వన వచనములు పలికి తనతోడి యుద్ధమున మిగుల బాధలందిన వారిం గౌగలించుకొని గంధర్వ నగరము నుండి తెచ్చిన ధనరాసులను విభజించి వారికిచ్చి వర్షర్తు రాత్రి తన సైనిక జనములను బూజించి యాలోచన నెఱపి తనకై యుబలాటపడు నంతఃపుర జనమునకు సందేశము పంపెను. పంపి తన సైనికులు కొలది మందితో మాతుల గృహమందు దేవేంద్రునట్లు నివసించెను. అటనమితప్రీతితో నాల్గు మాసములుండెను. కార్తికము రాగ శుక్ల పక్షావ సానికమైన (కార్తిక పూర్ణిమం జరుగ దగిన) మహోత్సవము నైదురోజులు జరిపించెను. అది దేవదేవుని ప్రబోధసమయము (మేల్కొను సమయము) దేవతల కది మహోత్సవము. అందు మహాదానములిచ్చి జగన్నాథు శంఖ చక్రగదా ధరునర్చించి శుభనక్షత్ర శుభదిన మందు ద్విజోత్తములం బూజించి సాంవత్సరుని (జ్యోతిషికుని) పురస్కరించి కొని స్థపతులను

(శిల్పులను) బూజించి సముద్రము రెండు పార్శ్వములందు పురములను నిర్మింప జేసెను. పుష్కరావతియను దానం బుష్కరుని, తక్షశిలయందు తక్షుని తన కుమారులను నగరారంభము చేసిన తరువాత పట్టాభిషిక్తులం గావిఅచెను.

పురద్వయే సమాకీర్ణే వణిగ్భి ర్బ్రాహ్మణై స్తథా ॥ 14
శిల్పి భిశ్చ మహారాజః నానా శిల్పోప జీవిభిః । గృహపుత్ర సమాకీర్ణే దేవాయతన భూషణే ॥ 15
ప్రతిష్ఠి తే తదా రాజ్యే పుత్రయో ర్భరత స్తదా । ధన రత్నా ఽ శ్వ నాగైశ్చ విభజ్య తనయా వుభౌ ॥ 19
యుధాజితి పరీదాయ గతే సంవత్సరే తథా । అతీతే కార్తికే మాసే నక్షత్రేతు గుణాన్వితే ॥ 17
జగామ భరతః శ్రీమాన్ రామం ద్రష్టుం నరాధిప । సోఽను యాతః సుతైర్వీరో మాతులేన యుధాజితా ॥ 18
తీరే స్వధామ్న స్తౌ పుత్రౌ మాతులంతు యుధాజితమ్ । విసర్జయామాస గృహాన్ పరిష్వజ్య చ పీడితమ్ ॥ 19

ఆ రెండు రాజధానులు వర్తకులతో బ్రాహ్మణులతో శిల్పులతో నానా శిల్పోద్యోగులతో దేవతా గృహములతో సుప్రతిష్ఠమైన రాజ్యమందు ధన రత్న హయనాగములతో విభాగము గావించి పుత్రులిద్దఱిని యుధాజిత్తుని సంరక్షణ మందప్పగించి జ్యోతిష్కుడు నవిన తర్వాత కార్తికము గడువ శుభమాసమందు శుభ నక్షత్రమందు శ్రీ మంతుడు భరతుడు శ్రీరామచంద్రుం దర్శింపనేగెను. కొడుకులు మేనమామ యుధాజిత్తు నతనిననుగమించిరి. తన యింటి నుండి నదీతీరమునకు వచ్చిన తరువాత తన కొడుకులను యుధాజిత్తును గౌగలించుకొని బాష్పనయనుడై వారి గృహములకు బంపించెను.

భరతః స్వాశునయనో బలేన చతురంగిణా । స్తోకేన కాంచనాంగేన రథేన చ తథా యయౌ ॥ 20
సంరుధ్యచ రథాంస్తేతు గచ్ఛన్తం భరతం తదా । దదృశుః దీన మనసః కించిదాగత విభ్రమాః ॥ 21
ముహుర్ముహుః పరావృత్య భరతః కథమప్యగాత్ । పరస్పర మపశ్యన్తః త్వరా వన్త స్తథా గతాః ॥ 22
భరతోఽపి తథా దేశాన్ సరాంసి సరిత స్తథా । గ్రామ పత్తన సంగాద్యాన్ వ్యతిక్రమ్య పురీం యయౌ ॥ 23
అథా ససాద చాయోధ్యాం దీర్ఘకాల ప్రవాసకః । ప్రవిశ్య నగరం తత్ర పతాకాధ్వజ సంకులమ్ ॥ 24
సుధా వదాత భవనం సిక్తం చందన వారిణా । కృతం రామాజ్ఞయా సర్వం పూజితామర బాలకమ్ ॥ 25
నిర్యయౌ పురత స్తస్య చతురంగ బలాన్వితః । రామాజ్ఞయా మహాతేజాః నాగరై స్సహ లక్ష్మణః ॥ 26

అవ్వల నల్పాల్పమైన చతురంగ బలముంగొని కాంచనాంగమైన రథముపై కొడుకులు మేనమామయు రథమెక్కి చన భరతుడు దీన మనస్కుడై (దిగులుగొని) ఇంచుకగ వచ్చిన తొట్రుపాటున మాటిమాటికి వారి వంక వెనుదిరిగి చూచుచు నెట్లో ముందునకు జనెను. వారును నితడును నొండొరుల వంక జూచికొనుచు నాపైని కనుమఱుగైనంత వారు ముందునకుసాగిరి. భరతుడును దేశములు సరస్సులు నదులు గ్రామపత్తన నదీసంగమాది ప్రదేశములం గడచి పురికరిగెను. దీర్ఘకాల ప్రవాసము సేసిన యతడయోధ్య నగరముం బ్రవేశించి పతాకాధ్వజ సంకులము సున్నము వెల్లల వేసిన భవనములతో చందనోదకములం దడుపడుచు రామాజ్ఞచే దేవతారాధనములెల్లెడ జరుపబడియున్న యారాజధానిం బ్రవేశించెను. రామచంద్ర ప్రభువుముందు చతురంగ బలములతో రామాజ్ఞచే నాగరులతో (పుర ప్రజలతో) లక్ష్మణుడు ముందుజనెను,

భరతం లక్ష్మణో దృష్ట్వా చిరకాల ప్రవాసకమ్ । అభ్యవాదయత ప్రీత్యా శిరః కృత్వా మహీతలే ॥ 27
భరతో మూర్ధ్న్యుపాఘ్రాయ సంపరిష్వజ్య పీడితమ్ । సర్వత్ర కుశల ప్రశ్నం తత్ర కృత్వా యథావిధి ॥ 28
యథార్హం పూజయామాస జనం నగరవాసినమ్ । కుశల ప్రశ్న యోగేన స్మిత పూర్వాభి భాషిణా ॥ 29
సతేన జన బృందేన పూజ్యమానో ముహుర్ముహుః । వివేశ నగరం శ్రీమాన్ భరతో నాగధూర్గతః ॥ 30
విమాన హర్మ్య ప్రాసాద గవాక్షక గతేన తు । స్త్రీజనేన మహాతేజాః వీక్ష్యమాణస్తు సస్పృహమ్ ॥ 31
ఆససాద మహాతేజాః నరేంద్ర ద్వారమాయతమ్ । తత్ర వాదిత్ర నాదోఽ భూన్మహా న్కలకల స్తథా ॥ 32
రాజద్వార మథాసాద్య సోఽవరుహ్య గజోత్తమాత్ । ఆదాయ లక్ష్మణం పాణౌ ప్రవివేశ తదా సభామ్ ॥ 33

తత్ర సింహాసనే రామం సదదర్శ మహాభుజమ్ । చందనే నాను లిప్తాంగం సర్వాభరణ భూషితమ్ ॥ 34
సంపూర్ణ చంద్రవదనం నీలోత్పల దళేక్షణమ్ । దృష్ట్వైవ రామం భరతః కృత్వా భూమిగతం శిరః ॥ 35
నిపపాత మహాతేజాః లక్ష్మణేన విశేషతః । రామోఽపి భరతం దృష్ట్వా సముత్థాప్య మహాభుజమ్ ॥ 36
జగ్రాహ పీడితం కంఠే మూర్ధ్న్యుపాఘ్రాయ చాసకృత్ । ఆదిదేశా సనం తస్య పృష్ట్వా కుశల మవ్యయమ్ ॥ 37
నివేద్య రత్న ముఖ్యాని గంధర్వాణాం సరాఘవః । రామాయ ధర్మ నిత్యాయ యథా భేజే వరాసనమ్ ॥ 38
పృష్ట స్స రామేణ నివేదయిత్వా వృత్తం యథావత్ పురుష ప్రవీరః ।
విసర్జిత స్తేన గృహాయ గత్వా సంపూజయామాస తదా స విష్ణుమ్ ॥ 39
స్వప్నే తథో వాస స రామపాదౌ చాసాద్య వీరః సమరేష్వజేయః ।
రామోఽపి రాజ్యం సహితం తు తేన చకార సమ్యఙ్ నిహతారి పక్షః ॥ 40
తత శ్చతుర్థే పరి వత్సరే తు । శుశ్రావ రామః పురయోః ప్రతాపమ్ ॥ 41
కృత్వా సుతాభ్యాం భరతస్య విష్ణోః । ముదంచ లేభే పరమాం ప్రహృష్టః ॥ 42
ఏషోఽద్య ప్రోక్తో విజయో మయాతే రణాజిరే రాఘవ నందనస్య ।
శ్రోతవ్య మేత న్నియమేన పుంసా విజ్ఞాన ధర్మార్థ యశోఽభిరామమ్ ॥ 43

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
శ్రీరామచంద్ర భరత సమాగమో నామ ఏకోనసప్తత్యుత్తర ద్విశతతమోఽధ్యాయః.

లక్ష్మణ స్వామి చిరకాల ప్రవాసము చేసి వచ్చిన భరతుంజూచి ప్రీతి శిరస్సు ధాత్రికి వచ్చి యభివందనము సేసెను. భరతుడు తమ్ముని శిరము మూర్కొని గాఢముగ గౌగిలించుకొని యన్నిటం గుశలప్రశ్నముయథావిధిగ సేసి యథార్హముగ నగర వాసి జనమును బూజించి కుశల ప్రశ్నములతో చిఱునవ్వు మున్నుగ పలుకరించి యా జన బృందము మఱిమఱి సేయు పూజలంద కొని గజముపై గూర్చుండి చని అయోధ్యా నగర ప్రవేశము గావించెను విమాన హర్మ్య ప్రాసాదములందు గవాక్షము లందు గ్రమ్ముకొని స్త్రీ జనము సాభిలాషముగ వీక్షింప నమ్మహా తేజస్వి సువిస్తృతమైన రాజద్వారముం దరిసెను. అక్కడ మంగళ వాద్య కలకలము పెద్దగ నయ్యెను. రాజద్వారములం దరిసి భద్ర గజముం దిగి లక్ష్మణుని చేతం జేకొని యప్పుడు సభలో బ్రవేశించెను. అక్కడ నతడు సింహాసనమందు మహాభుజుని రాముని జూచెను. చందనము నొడలెల్ల పూయబడి సర్వాభరణ భూషితుడై సంపూర్ణ చంద్రవదనుడైన నల్లగలువం బోలిన కన్నులతో నున్న యా ప్రభువునుచేరి భరతుడవనిపై దలవంచి యట వ్రాలెను. లక్ష్మణుడు నట్లగావించెను. రాముడును భరతునిం జూచి యమ్మహాభుజుని పైకి లేపి కంఠముగొని గట్టిగ గౌగలించెను. పలుమారులు శిరమ్ము మూర్కొని కుశల మడిగి యా తమ్ముని కాసనము సూపెను. భరతుడు గంధర్వులం గెల్చి తాదెచ్చిన యాయా రత్నముఖ్యములని (మేలైన వస్తువులనేక విధములయిన వానిని) ధర్మనిత్యుడగు రామునికి నివేదించి యుత్తమాసన మధిష్ఠించెను. పురుష ప్రవీరుడు రఘువీరుడు. భరతుడు రాముడడుగ జరిగినదెల్ల వినిపించి యా యన్నచే బంపబడిన గృహమున కేగి యప్పుడు విష్ణువుం బూజించెను. బొంది సమరములందజయ్యుడైన వీరుడు భరతుడు రామపాదములను మేలుకువలోనే కాదు స్వప్నమందును సందర్శించు చుండెను. శ్రీ రామ చంద్ర ప్రభువును నాతనితో శత్రుల నెల్ల నిగ్రహించి రాజ్యము సేసెను.

అవ్వల నాల్గవ పరివత్సర మందు శ్రీరాముడు ఆ యిద్దఱు కొడుకుల వలన సాక్షాద్విష్ణువైన భరతుని కొడుకువలన నా రెండు పురముల ప్రతాపమును వినెను. విని ప్రహృష్టుడై పరమానందమందెను. వజ్రనృపతీ ! ఈ రాఘవనందనుడగు భరతుని యొక్క రణాంగణ విజయ వృత్తము నేను నీకు వచించితిని. మానవుడు విజ్ఞాన ధర్మార్థము యశోభిరామమైన యాకథ నియమముతో వినవలసినది.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణము ప్రథమఖండమున మార్కండేయ వజ్రసంవాదమునందు
శ్రీ రామచంద్ర భరత సమాగమమను రెండువందలయఱువదితొమ్మిదవ అధ్యాయము.

రఘు ప్రవీరోఽపి రణే మఘోనః శత్రుం నిహత్వా వరదాన యుక్తమ్ ।
విరాజమానో యశసా పరేణ జగామ రాజన్! స్వపురం ప్రహృష్టః ॥ 64

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
శైలూషవధో నామ షట్షష్ట్యుత్తర ద్విశత తమోఽధ్యాయః.

తండ్రి హతుడగుటచూచి వానికొడుకు భరతునిపై బాణములు కురిపించెను. వాని ప్రచండరణ కౌశలముంగని రఘూద్వహుడు కాలాస్త్రమును ప్రయోగించెను. అందుండి వేలకొలది యస్త్ర శస్త్రములు వెలువడి ముప్పదికోట్ల గంధర్వసైన్యమును హత మార్చెను. అది హతమైన శుభవాయువులువీచెను. భరతునిపై పూలవాన గురిసెను. దిక్కులు తెలివొందెను. భయమువాసెను. అంతట సహస్రాక్షుండు దేవతలతో విమానముపైవచ్చి ధర్మరతుడైన భరతునితో పితామహు వరబలముచే జావని వాని నీ దేవబ్రాహ్మణ కంటకునిజంపితివి. వరమిచ్చెదనడుగుమన నీవు సర్వదేవతాప్రభుఁడవు. ఈజగత్తునీది. నీయాజ్ఞను భంగపరచువారలకు మరణము తప్పదు. నావంటివాడు నిమిత్తమాత్రుడు. బ్రహ్మవ్రాసిన విధాతమునెవ్వడు తప్పింపగలడు? నాపై ప్రసన్నుడవేని సముద్రమిరువైపుల రెండుపురములనునిర్మింతును. ఆ ప్రదేశ మీవరకు గంధర్వులపాలన నున్నది. నాకుమారుల కాపురమును రాజధానులగును. ఇట్లేయగునని వరమిచ్చియింద్రుడు స్వర్గమునకేగెను. అప్పుడు చిత్రరథుడను గంధర్వముఖ్యుడు నాయాజ్ఞ గంధర్వులుగూలిరి. దేవబ్రాహ్మణ కంటకుడు గూలినంత నాహృదయశల్యమువాసినది. నిన్నుగారవించి నేను స్వర్గమునకేగెదనన భరతుడిక నీ మిగిలిన యీజనమును స్త్రీజనమును పాలింపుము. విశేషించి నిర్భయముగాన దీనింగావింపుము. అందరకును గంధమాదనమందు స్థానమున్నది. నీవాంద్రటకు జని నీయాన బాలింతురు. అనవిని యిట్లుసేయుదునని చిత్రరథుడు భరతుం గట్టిగ గౌగలించికొని త్రిదివంబునకేగెను. భరతుడింద్ర శత్రువులనిట్లు పరిమార్చి వరముపడసి కీర్తిశాలియై స్వపురమున కానంద భరితుడైయేగెను

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణమందు ప్రథమఖండమున శైలూషవధయను రెండువందల యరువదియారవ అధ్యాయము.

## రెండువందల అరువదిఏడవ అధ్యాయము - రణభూమివర్ణనము

మార్కండేయః : ఆదిత్యేఽస్త మనుప్రాప్తే సంధ్యాకాలే సుదారుణే । నివర్తయామాస రథం యుధాజిద్భరతస్య చ ॥
నివర్తయానశ్చ రథం భరతం వాక్య మబ్రవీత్ । సంగ్రామ మేదినీం పశ్య! స్వకృతాం రఘునందన! ॥ 2
గంధర్వాంగ సమాకీర్ణాం హతకుంజర భూషణామ్ । తురంగమ గణా కీర్ణాం వరాయుధ ధరాం ధరామ్ ॥ 3
సంపూర్ణ చంద్ర ప్రతిమై ర్దష్టోష్ఠైః చారుకుండలైః । భ్రుకుటీ తట దుష్ప్రేక్ష్యైర్మ స్తకైర్భాతి మేదినీ ॥ 4
పంచ శీర్షోరగా కారైః వరాంగద విభూషణైః । బాహుభి ర్భాతి శూరాణాం వసుధా వసుధాఽధిపః 5
పద్మపత్ర దళాకారైః గంధర్వాణాం తథా వరైః । భాతి సాయక విచ్ఛిన్నైః స పద్మేవ వసుంధరా ॥ 6
హస్తి హస్త సమాకారైః గంధర్వాణాం తథా కరైః । విభాతి వసుధాకీర్ణా వర చందన భూషితైః ॥ 7
త్వ దేక శర నిర్భిన్నైః గండశైలోపమై ర్గజైః । ఉద్భ్రాన్త జీవితైః పశ్య! వినికీర్ణం ధరాతలమ్ ॥ 8
ఆవిష్కృత రదైశ్చాశ్వై ర్వివృతాక్షై స్తథైవచ । పతితై రావృతాం పశ్య! తురంగై ర్మేదినీం రణే ॥ 9
ఆతపత్రై శ్శశాంకాభై శ్చామరై శ్చ విరాజితామ్ । యోక్త్రైః ఖలీనైః పల్యాణైః కుథాభిః కింబుభి స్తథా ॥ 10
కేశైర్దండై స్తథా చాపైః ప్రాసైః ఖడ్గైః పరశ్వథైః । శరై ర్నానా ప్రకారైశ్చ నానా నామాంకితైః శుభైః ॥ 11
ముకుటై రంగదై ర్హారైః కుండలై రపిశోభితా । రఘునాథ భువం పశ్య! కారుణ్యేపి మనోహరామ్ ॥ 12
గంధర్వాన్ భక్ష్యమాణాంశ్చ క్రవ్యాద్భిర్మృగ పక్షిభిః । పశ్య! త్వం చారుసర్వాంగం సర్వాభరణ భూషితమ్ ॥ 13

ఆకృష్యమాణం నిమ్నేషు క్రవ్యాద్భిః కుణవద్రణే । గాత్రైశ్చలద్భి ర్దృశ్యన్తే జీవన్తైరివ పార్థివః 14

మార్కండేయుడనియె. ఆదిత్యుడస్తమింప సుదారుణమై సంధ్యవేళకాగా యుధాజిత్తు భరతుని రథమును మరలించెను. మరలించుచు భరతుంగని మేనమామ యిట్లనియె. రఘునందన నీవు సేసిన యీ యుద్ధభూమింగనుము. ఎట జూచిన గంధర్వుల శరీరములే కూలిన యేనుగులే గుఱ్ఱములే చెల్లచెదరైన యాయుధములు పెదవులు గఱచుకొని కుండలములతో కనుబొమ లల్లేముడివడియున్న తలలతో పాములట్లున్న యంగదములతోడి బాహువులతో నీరణభూమి విలసిల్లుచున్నది. తామరరేకులట్టివీరిహస్తములతో పద్మాలంకృతమైనట్లున్నది యీ వసుంధర. నీయొక్కని బాణములనేయిన్ని యేనుగులుకూలి పెనుగొండలట్లిక్కడ పడియున్నవి. పళ్లువెలివెట్టి కనుగ్రుడ్లు తిరుగుడుపడి కూలిన గుఱ్ఱములు చంద్రునట్టి గొడుగులు చామరములు తెగి పడియున్నవి. కళ్లెములు ఖలీనములు పల్యాణములు కుథలు శంఖములు జూలు తెగిన గుఱ్ఱములతో-దండములు విండ్లు ప్రాసములు కత్తులు కటార్లు మున్నగు నాయుధములతో నీభూమి చిమ్ముకొని యున్నది. ఈరణరంగము సర్వాంగ సుందరము సర్వాభరణ భూషితమునై యున్నది చూడుము.

సన్నిధానంతు యోధానాం వివృతం కరపంకజమ్ । ధనుర్గ్రాహ జ్ఞాత కిణం భక్షితేన పతత్రిభిః ॥ 15
అర్ధసంభక్షితై ర్వక్త్రై స్తథా సంపూర్ణ భక్షితైః । దుర్వృత్తాన్ పశ్య గంధర్వాన్‌శాపాదివ! మహీక్షితామ్ ॥ 16
అనాగసాం నరేంద్రాణాం గంధర్వైర్యత్పురా కృతమ్ । భూయస్తదేవ సమరే గంధర్వాణాం త్వయా కృతమ్ ॥
రణాజిరే పిశాచానాం గంధర్వాన్ పశ్య ! రాఘవ ! 17
యక్షాణాం రాక్షసానాంచ శతశోఽథ సహస్రశః । గంధర్వ మాంస లుబ్ధానాం సతతం క్షతజాశినామ్ ॥ 18
సముద్రదారా స్సంప్రాప్తాః క్రవ్యాదాఃక్షుధితా భృశం । త్వయైతేషాం పరా తృప్తిః వృతాద్య రణమూర్ధని ॥ 19
నానా విధాని రూపాణి పశ్య ! క్రవ్య భుజాం రణే । కేచిత్ స్థూలాః కృశాః కేచిత్ ప్రాంశవో లఘవోఽ పరే ॥ 20
లంబ భ్రూజఠరాః కేచిత్ తథా చిపిటనాసికాః । వృత్తాక్షాః కేకరాక్షాశ్చ దంతురాః సువిభీషణాః ॥ 21
తథా చైవోర్ధ్వరోమాణో మహాదంష్ట్రా మహాముఖాః । పురస్తాత్ పార్శ్వయో ర్ఘోరాః పశ్చా దంగదయోః పరే ॥ 22
నానా విధానాం సత్వానాం సదృశైశ్చ తథా ననైః । నానావేషధరా రౌద్రా నానా వికృత దర్శనాః ॥ 23
సింహ చర్మాంబర ధరాః వ్యాఘ్ర చర్మాంబరా స్తథా । ఆహూయన్తే దశన్త్యన్యే హరన్త్యన్యేఽ సృగుత్తమమ్ ॥ 24
అన్యే స్కంధం సమారోప్య మాంసం రక్తం తదాగమన్ । రక్తాపగాసు క్రీడన్తి త్వత్కృతాసు యథా సుఖమ్ ॥
స్నపయన్తి రుధిరై శ్చాఽన్యే పాయయన్తి పరేఽ సృజమ్ । రక్తం కృత్వా కపోలేషు కృత్వోత్సంగే పునః పునః ॥
భార్యాభిశ్చ సహైవాన్యే పిబన్తి రుధిరం రణే । పాయయన్తి తథైవాఽన్యే రామా రామానుజా స్వయమ్ ॥ 27
భార్యా కరధృతే ష్వన్యే కపాలేషపి బన్త్య సృక్ । కౌంజరేషు కపాలేషు పిబన్త్యన్యే ఽ సృగుల్బణాః । 28
శిశూన్ స్కంధగతాన్ కృత్వా తృప్తా నృత్యన్తి చాపరే । హస్త మాదాయ పత్నీనాం నృత్యన్త్యన్యే తథైవచ ॥ 29
నృత్యన్త్యన్యే హసన్త్యన్యే వికృతైశ్చ తథా కరైః । గాయన్త్యన్యే స్వపన్త్యన్యే కలహాయన్తి చాపరే ॥ 30
కుణ పాంశ్చ తథైవాఽన్యే త్యజన్త్యన్యే మహీతలే । అన్యాం శ్చా దాతు మిచ్ఛన్తి గృహ్ణన్తి చ తథా ఽ పరాన్ ॥ 31
కుర్వన్తి కలహాం శ్చాన్యే కుణపార్థాయ కుత్సితాః । ఉత్కృత్య మాంసా న్యశ్నన్తి కేచిద్గాత్రైర్విభూషితాః ॥ 32
భుక్త్వా చాస్థీని మజ్జాశ్చ కేచి దశ్నన్తి రాఘవ ! । భరతస్య ప్రసాదేన తృప్తాఃస్మ ఇతి చాపరే ॥ 33
పరస్పరం చ భాషన్తే పరం హర్షము పాగతాః । నిత్యం భవతు రాజ్ఞాంచ యుద్ధం వైరం నృశంసతా ॥ 34
బలం సహాయాః పుష్టిశ్చ యేన తృప్యామహే వయం । ఏవ మేతే వదన్త శ్చ స్వరై శ్చ వివిధై ర్గణః ॥ 35
రథం తథాఽన్యే వీక్షన్తే సస్నేహా భృశ దుర్దృశాః । ఏవం స భరతః శ్రీమాన్ మాతులేన ప్రదర్శితమ్ ॥ 36

పశ్యన్ రణాజిరం ప్రాయా ద్యేన రాజగృహం పునః । సోఽ పశ్య న్నగరా భ్యాశే వాయవ్యాస్త్ర విమోహితమ్ ॥ 37

మాంసముదిను రాబందులు మొదలైనవి పీకికొని పల్లములకు లాగికొని పోగదలుచున్న నీ శరీరములతో నీనేల నీజనము బ్రతికియున్నారా? యనిపించుచున్నది బాణములు పెక్కు పేర్లు చెక్కబడినవి యెటజూచినం దెగిపడియున్నవి. నరుకువడిన యోధుల చేతులంటికొని తినుచున్నవి చూడు మీపులుగులను. నిరపరాధుల నెందరనో రాజుల మట్టుపెట్టిన యీ గంధర్వులు తొల్లి సేసిన పాపము యొక్క ఫలానుభవమునకు నీవు కారణమైనాడవు. మాంసలుబ్ధులై యక్ష రాక్షస పిశాచములు పీకికొని సగము కొన్ని, సిండగొన్ని తిన్న యీ కుణపములతో నీరణభూమి యెంతవికారముగనున్నదో గనుగొనుము, ఈ కూలిన మానవులు కొందరు స్థూలురు. కొందరు బక్కచిక్కినారు ఉన్నతులు పొట్టివాండ్రు కనుబొమలు కడుపులు వ్రేలాడవేసినారు. ఇరువైపుల తెగి బాజుబందులు భుజకీర్తులు పడియున్నవి. నానాజంతువులంబోలియున్నవి మొగములు. వేషములు పెక్కులు వికారదర్శనులు సింహము పులి తోళ్లగట్టుకొన్నారు. రౌద్రులు భూతప్రేతపిశాచము లొండొరులం బిల్చికొనుచున్నవి. కొరకుచున్నవి నవ్వుచున్నవి మంచి వెచ్చని రక్తమును ద్రాగుచున్నవి త్రాగించుచున్నవి స్త్రీ పిశాచములు యక్షరాక్షసవర్గము పుర్రెలలో రక్తమునింపి పురుష పిశాచములచే త్రాగించుచున్నవి. ఏనుగుకపాలములనిండ నింపి రక్తముందెగ త్రాగుచున్నవి. శిశువులం భుజములపై నెక్కించుకొని నృత్యము సేయుచున్నవి. భార్యలచేయి చేతంబట్టుకొని నర్తనము సేయుచున్నవి. వికారముగ నవ్వుచున్నవి కుణపములకై కుమ్ములాడుచున్నవి. పీకిపీకినంజుడు నంజుచున్నవి అస్థిమజ్జారసధాతువులందెగదిని యిది భరతస్వామి ప్రసాదమని తృప్తికొని గంతులు వేయుచున్నవి ఒండొరులకుం జెప్పుచున్నవి. నిత్యమును రాజులకు యుద్ధములగుగాక! మనకడుపులునిండుగాక యనుచున్నవి. వివిధములగు అరుపులు కూతలు పెట్టుచున్నవి. కూలిన రథములోనికి పైకినెగిరి చూచుచున్నవి.

సైన్యంతత్పార్థి వేంద్రాణాం వ్రజన్తం సమరా దిమమ్ । దృష్ట్వా తే భరతం సర్వే రణ రేణు సముక్షితమ్ ॥ 38
సంగ్రామే జయినం వీర మభ్యనందన్త పార్థివాః । స సమేత్య మహాభాగైః పరిష్వజ్య చ పార్థివాన్ ॥
సాంత్వయిత్వాచ ధర్మాత్మా శిబిరాణి వ్యసర్జయత్ ॥ 39
తత స్స తాం మాతుల రాజధానీం ప్రహృష్ట యోధార్యజనాభిరామామ్ ।
వివేశ రాత్రౌ రఘువంశనాథః సంస్తూయమానః స్తుతిభిర్నృసింహైః ॥ 40

ఇతి శ్రీ విష్ణుధర్మోత్తరే ప్రథమఖండే రణభూమి వర్ణనం నామ సప్త షష్ట్యుత్తర ద్విశతతమోఽధ్యాయః.

ఇట్లు మాతులుడు చూపిన రణరంగణముం గనుచు రాజగృహమునకు జనెను. ఆ నగర ప్రాంతమున వాయవ్యాస్త్రమున నెగిరిపడి మూర్ఛపడి తెలివివచ్చిన గంధర్వ సైనికులను రాజులను భరతుడు సూచెను. వారును రణభూమిగ్రమ్మిన భరతునిం జయమంది మరలిన వీరునిగని అభినందించిరి. వారితో నతండును గూడికొని వారింగౌగలించుకొని యాధర్మ ప్రభువువారి ననునయించి వారివారి శిబిరములకంపెను. అవ్వల నత్యానంద భరితులైన యోధులతో ఆర్యులతో (పూజ్యులు పెద్దలునైన వారితో) నతిరమ్యమయిన మేనమామగారి రాజధాని నారాత్రి మహానుభావులచే గొనియాడబడుచు రఘువంశనాథు డతడు ప్రవేశించెను.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణమున ప్రథమఖండమున రణభూమివర్ణనమను రెండువందల యరువది యేడవ యధ్యాయము

## రెండువందల అరువదిఎనిమిదవ అధ్యాయము - గంధర్వస్త్రీవిలాపము

తస్యాం రాత్ర్యాం వ్యతీ తాయాం గంధర్వ నగరాజ్ఞనాః । గంధర్వ పుత్ర దారా శ్చ రాజపత్న్య స్తథైవచ ॥ 1
రణాజిరంతు సంప్రాప్య రురుదుర్భృశదుఃఖితాః! అహో కృతాన్తో బలవాన్ యేన నోఽబల దర్పితాః ॥ 2
అజేయాః సురసంఘానాం సంగ్రామే వినిపాతితాః । నా తి భారోఽ స్తి దైవస్య నాఽ శక్యం తస్య విద్యతే ॥ 3
యేన నాగాయుత ప్రాణా గంధర్వ తనయా హతాః । తేపురా శయనీయేషు పరార్ధ్యేషు మదోత్కటాః ॥ 4
న నిద్రా మభిగచ్ఛన్తి శేరతే తేఽద్య భూతలే । తాళవృంతాని లై ర్యేతు వరస్త్రీభిశ్చ వీజితాః ॥ 5
వీజ్యన్తే పతితా స్తేఽద్య గృధ్ర వత్త్రై ర్మహీతలే । పరార్ధ్య చందనాక్తాంగా యే విరేజు స్సమాగతాః ॥ 6

నరాజన్తే ఽద్య తే సర్వే శోణితాక్తా మహీతలే । ఆ లింగ్య సుషుపుః పూర్వం వరోరు జఘనాః స్త్రియః ॥ 7
యే తే ఽద్య భూమి మాలింగ్య దుఃఖశయ్యాసు శేరతే । హా రాజన్ ! దేవ దర్పఘ్న ! హా రాజన్ ! భృత్య వత్సల!
హా రాజన్ ! చారు సర్వాంగ ! హా రాజన్ ! సుత వత్సల ! । బాహు చ్ఛాయాముపాశ్రిత్య వయం తస్య జనేశ్వర !
నిర్భయాః దేవ దైత్యా నాం నివత్స్యామో యథా సుఖమ్ । సంపూర్ణ చంద్ర వదనం పుత్ర కోటిభి రావృతమ్ ॥ 10
విషమస్థ మితో దృష్ట్వా యాస్యామో యమ సాదనమ్ । సభాస్థం త్వా మపశ్యన్తో యాస్యామో యమసాదనమ్ ॥ 11
ఏవం జనేతు శోకార్తే కరుణం విలప త్యథ ! । గంధర్వ రాజ పుత్రాణాం పత్న్యస్తాః సుమనోహరాః ॥ 12
తతస్తా దుఃఖ శోకార్తాః కారుణ్యే మహతి స్థితాః ।

మార్కండేయుడనియె. ఆరాత్రి గడచి గంధర్వనగరమునుండి జనులు గంధర్వుల భార్యలు కొడుకులును రాజభార్యలును రణాంగణమునకువచ్చి మిగుల దుఃఖించి యేడ్చిరి. ఆహా! కృతాంతు డెంత బలవంతుడు బలగర్వితులు సురలకేని అజేయులైన మావారందరు గూల్పబడినారు దైవమునకు మిక్కిలి బరువులేదు చేతగాని పనిలేదు. వేలకొలది యేనుగుల ప్రాణములు గంధర్వ కుమారులను గూల్చినాడు ఇంతమున్ను హంసతూలికాతల్పములందేని నిదురపట్టక కొట్టుకొనుమతోద్ధతు లీకటికనేల నిద్రవోయి నారు. ఎవ్వరు సుందరస్త్రీలు తాళవృంతములూని వీపబడినవారిప్పుడు గూలిగ్రద్దలరెక్కలచే వీవబడుచున్నారు. మంచి గంధములు మేనులబూసికొని యింతమున్ను సొంపుగులిక్కిరి వారిపుడు రక్తముపూసికొని నేలంబడినారు చక్కని యూరువులు విశాల జఘనములునుంగల యంగనలం గౌగలించికొని నిదురించిన వారిపుడు భూమిం గౌగలించుకొని దుఃఖశయ్యలం బడుకొన్నారు. అయ్యో అయ్యో పలు రాజుల దేవతల దర్పమణచినవాడ! భృత్యులయెడ వాత్సల్యముగలవాడ! సూతవత్సల ఎవ్వని బాహువులనీడ నేమింక దేవదైత్యులకు జడియక హాయిగ బ్రతుకుదుము. అయ్యయ్యో! సర్వాంగసుందర! ప్రభూ! సూతవత్సల నిండుచందురుని బోలు నెమ్మొగము గ్రద్దరెక్కల యాకలంగప్పవడినది. ఈ విషమస్థితిచూచి మేమింక యమమందిరమునకు బోవుచున్నాము. కొలువుదీరి కూర్చుండు నిన్ను జూడక యమునింటికేగవలసినవారమైనాము. ఇట్లు జనులెల్ల శోకార్తులై యేడ్చిరి. గంధర్వ కుమారుల భార్యలు మిక్కిలి యందగత్తెలు శోకార్తలై యేడ్చి పరమదయనీయస్థితికివచ్చిరి.

భర్తారం శిరసా హీనం కాచిద్బాహువినాకృతమ్ ॥ 13
ద్విధా కృతం తథైవాన్యా కాచి త్క్రవ్యాద భక్షితమ్ । దృష్ట్వా రురోద దుఃఖార్తా కాచిన్నాసాదయత్యపి ॥ 15
కుణపేషు స్ఖలంత్యస్తాః బభ్రము స్తత్ర దుఃఖితాః । ఉరాంసి పాణి భిర్ఘ్నంత్యో లూనయంత్య శ్శిరో రుహాన్ ॥ 15
నావాప యాసాం భవనే పురా సూర్యోఽపి దర్శనమ్ । దుఃఖితా ముక్తకేశాస్తాః జనస్సర్వోఽపి పశ్యతి ॥ 16
పతన్త్యు పరి భర్తౄ ణాం సమాలింగంతి చాపరాః । రుదన్త్యన్యా స్తథా రాజన్ ! ఉత్కృత్య మధురస్వరాః ॥ 17
రుదన్తీనాం తథా తాసాం రాజపత్న్యస్సు దుఃఖితాః । రురుదుః కరుణం రాజన్ ! విప్రకీర్ణ శిరోరుహాః ॥ 18
హా కాన్త ! హా మహారాజ, హా మహాజన వల్లభ । హా సురేశ్వర దర్పఘ్న ! హా శశాంక నిభానన ॥ 19
హే భర్తః ! కేన తే బుద్ధిః మరణం ప్రతి గాహితా । హా రాజన్! త్వ మిమాం భూమిం సమాలింగ్య ప్రియామివ ॥ 20
వసుధాం ప్రియ బాహుభ్యాం సమాజే కింన లజ్జసే । కిం శేషే పురతోఽ స్మాకం విశేషేణ రజస్వలామ్ ॥ 21
ఖే చర స్థోఽశి తే రాజన్ ! సతతం వసుధా ప్రియా । నాడాయన వచ స్తద్ధి త్వయా ఽనర్థాయ న శ్రుతమ్ ॥ 22
ప్రియా తే యద్య పి మహీ తథాఽ వ్యస్మాసు పార్థివ ! యుక్తం హి కర్తుం దాక్షిణ్యం యత స్త్వం సత్కులోద్భవః ॥
అతర్కిత ప్రయాణేన త్వయాస్మ పరి పీడితాః । వాఙ్మాత్రేణ కురుష్వాఽ స్మాన్ సాంత్వనం రిపు సూదన ! 24
రాజ్ఞోన యుక్తం శయనం వివృతే వసుధాతలే । తస్మా దుత్తిష్ఠ !రాజేన్ద్ర! శయనం భజ ! మాచిరమ్ ॥ 25
నున్నా వయం మహారాజ ! మదనేన మదేన చ । కంతే ను కం గ్రహీ ష్యామ స్త్వయా హీనా జనేశ్వర ! 26

కృతాన్తో బలవాన్ రాజన్! యేనా కృష్యాద్య నీయసే ! నాడాయనస్య వచనం త్వయా యది కృతం భవేత్ ॥ 27
నాఽ భవిష్య ద్వియోగస్తు త్వయా ఽస్మాకం జనాధిప! నిశ్చేష్టాంగః కథం। త్వద్య రాజన్ః స్వపిషి భూతలే ॥ 28
ఉత్థాయ వీర! చాస్మాకం పరిష్వజ్య న చుంబసే ః విజిత్య సమరే వీరాన్ హత్వాచ వసుధాఽధి పాన్ ॥ 29
కథ మేకేన యుద్ధేత్వం మానుషేణ నిపాతితః । క్వతేవ పుః క్వతే తేజః క్వతేలక్ష్మీః క్వతే బలమ్ ॥ 30
క్వతే తద్విమలం ఛత్రం క్వచతే వరచామరమ్ । క్వ తత్పీఠం చ శృంగారం క్వచతే తనయా విభో ॥ 31
క్వసా వీతా క్వసాలక్ష్మీః క్వచతే వరవందినః । వర చామర ధారిణ్యః క్వచతాః పరమాంగనాః ॥ 32
అద్యైవ స్మ స్త్వయా హీనాః అద్యైవ స్పృహయా మహే । అద్యైవ స్మరణీయ స్త్వం గతోఽసి జనవల్లభ ః 33
నూనం కాన్తతరః స్వర్గే రాజేన్ద్ర! ః ప్రమదాజనః । యత్త్యక్త్వా స్వజనం తస్య రతి ర్వృద్ధాత్రయా ఽనఘ ॥ 35
స్వచ్ఛంద చారిణా కేనమతిః శూర నిషేవితా । త్వయా ప్రార్థయతా లోకే యుద్ధశ్రద్ధా వివర్ధితా ॥ 34
వల్లభస్య జనస్యాఽస్యలాలితస్య త్వయా తథా । దీర్ఘ ప్రయాణే కర్తవ్యో వాఙ్మాత్రేణాఽ వ్యను గ్రహః ॥ 36
విసర్జయః జనం రాజన్ః క్రీడామ స్సహితాస్త్వయా । ఉద్యానేషు విచిత్రేషు వనే షూప వనే షు చ ॥ 37
వయ మీర్ష్యాం నకురుమః సర్వలోకస్య పశ్యతః । వజ్రసార మిదం నూనం హృదయం సుదృఢం కృతమ్ ॥ 38
గతాసు మపి దృష్ట్వా త్వాం శతధా యన్న దీర్యతే । కర్పూర చందనా ర్ద్రాంగః మహార్హ శయనో చితః 39
విరాజసే న రాజేన్ద్ర! రుధిరాక్తో మహీతలే । క్వతే భిన్న ఘటా నాగా స్తురంగాః క్వచతే గజాః ॥ 40
క్వతే యోధా గతా రాజన్ః శక్రవిస్పర్ధినో రణే సైన్యే మహతి తిష్ఠంతం ఖడ్గబాణ ధనుర్ధరమ్ ॥ 41
కథం త్వామనయ ద్రాజన్ః పరలోకాయ రాఘవః । కృతాంత సమదృష్ట్వైవ వేపథుస్తే జనే శ్వర ః 42
స కథం మానుషేణాద్య సంగ్రామే వినిపాతితః । తద్వయం కిం కరిష్యామో నిరాశా స్తవ జీవితే ॥ 43
నమేఽస్తి కల్పో దృష్టిర్వామే నసో ర్దృష్టి సంగతిః । ఏవం విలపమానా స్తాః శైలూష స్యతు యోషి తః ॥ 44
ఆలింగ్యా లింగ్య తం రాజన్ః నిపతన్తి మహీతలే । శిరాంసి చ వినిఘ్నన్తితాడయన్తి భుజాం స్తథా ॥ 45
పశ్యన్తి భూయ స్తం వీరం భూమావు త్క్రాన్త జీవితమ్ । దృష్ట్వా భూయ శ్చ నిః సంజ్ఞా నిపతన్తి మహీతలే ॥ 46
తాసాం రోదన శబ్దేన సమాక్రాంతం మహీతలమ్ । తాసా మాశ్వాసనం చక్రే విద్వాన్నాడా యనో ద్విజః ॥ 47
ఏతస్మి న్నేవ కాలేతు తందేశ మవరాజితః । గంధర్వేంద్రః సమభ్యాగా ద్భరతేన ప్రచోదితః ॥ 48
స తత్స్నాన మథా భ్యేత్య జనం సర్వం యథా విధి । ఆశ్వాస యా మాస తదా రాజా చిత్రరథః శనైః ॥ 49
సత్కారం లంభ యా మాస శైలూషం తనయైస్సహ । రాజ్ఞా చిత్రరథేనాథ గంధర్వాస్తే ప్రచోదితాః ॥ 50
రాజ్ఞ శ్చకు శ్చితాం కాష్ఠైః సుశుష్కై ర్బహు భి స్తదా । పుత్రాణా మస్య సర్వేషాం యోధానా మప్యశేషతః ॥
చందనా గురుకాష్ఠైస్తే తథా కాలీయకస్యతు ॥ 51
చితాం గంధైశ్చ తైలైశ్చ ప్రజ్వాల్య చ ఘృతేన తే । సంస్కారయిత్వా తాన్ సర్వాన్ నగరాయ వవ్రజుః ॥ 52
గంధర్వరాజ వచసా తత స్సర్వో మహాజనః । నాడాయనం పురస్కృత్య ప్రయయౌ గంధ మాదనమ్ ॥ 53
నివేశం కృతవాం స్తత్ర రామ పర్వత రోధసి । కృత్వా నివేశనం తత్ర సర్వే చిత్ర రథాజ్ఞయా ॥
సుఖ మూషు ర్మహా రాజ పాల్యా మానామహాత్మనా ॥ 54
బభూవ తత్రాపి పుర ప్రధానే శై లూష పౌత్రస్తు జనస్య రాజన్ః ।
గంధర్వ రాజస్తు చకార తస్య సంరక్షణం రాఘవ ముఖ్య వాక్యాత్ ॥ 55

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే గంధర్వస్త్రీ విలాపో నామ అష్ట షష్ట్యుత్తర ద్విశతతమోధ్యాయః.

ఒక్కతె తల తెగి మొండెమైనవాని నింకొకతె బాహువులు తెగిపోయినవానిని రెండుతునకలయిన వాని వేరొకతె గ్రద్దలు రాబందులు పీకితొని తినువాని నింకొకతెయుం జూచి హోరుమని యేడ్చిరి. ఒకతె చూడలేక దరికే రాలేదయ్యో. మరికొందరా కుణపముల గుట్టలం దొక్కికొని దొర్లుటువడుచు పరిభ్రమించిరి. చేతుల రొమ్ములం బాదుకొనుచు జుట్టు పీకుకొనుచు ఎండకన్నెరుగని యంతఃపుర స్త్రీలు జుట్టు విరబోసికొని యందరుచూడ నేడ్చిరి. కొందరు భర్తలపై పడిరి. కొందరు కౌగలించుకొనిరి. కొందరు గొంతెత్తి మధురస్వరలయిన యా గంధర్వకాంతలు పెల్లుగనేడ్చిరి. హా కాంత హా మహారాజ హా మహాజనవల్లభ సురేశ్వర దర్పభంజన! చంద్రనిభానన! మగడా! నీ బుద్ధిని చావువంక ద్రిప్పినదెవరు? హా! రాజా! ప్రేయసినట్లే నేలం గౌగలించుకొంటివే! ఓ ప్రియ వల్లభ! బాహుష్షలతో ఇట్లీయవనిం గౌగలించుకొనుటకు సిగ్గుపడవేమి? ఈ ధరణి రజస్వలగదా! (ధూళిగ్రమ్మినదియని శ్లేష) పరుండుట ఛీ ఛీ! మా యెదుటనేనా యీపని చేయుట! ఖేచరుడవయ్యు (గగనసంవాసి-దేవతామూర్తి) నీకెల్లతరి నీధాత్రిపైననే మోహమా? పాపము! నాడాయనుడు చెప్పినాడు. కాని యీ కష్టము కనిపెట్టుకొనియున్నందున నీవది వినిపించుకొనవైతివి. నీ కీ ధారుణి ప్రియురాలైన కానిమ్ము! అయినను నీవు సత్కులప్రసూతుడవు గావున మాయెడగూడ దాక్షిణ్యము సూప న్యాయముగదా! (దాక్షిణ్యము = దక్షిణనాయకత్వము — అనేకమంది నాయకులున్న నందరియందు సమప్రీతి సూపువాడు దక్షిణ నాయకుడు) అనుకొని యీ నీ ప్రయాణముచే (స్వర్గయాత్రచే) మేము కష్టాలపాలుగావింపబడినాము. ఓ శత్రునాశన! మాటమాత్రమునసేని మమ్మాదార్పుము. బట్టబయల రాజు పడక యిది బాగుండదు. కావున లేలెమ్ము. జాగుసేయకు. తల్పమందు పరుండుము. మేము మదనునిచే (మన్మథునిచే) మదముచేతను గూడ (యౌవన సౌందర్యాది మదముచేత) ప్రేరితలము. నిన్ను బాసి యెవ్వని కంఠగ్రహణ మొనరింతుము? కృతాంతుడు (సర్వ జీవుల నంతము సేయువాడు) బలవంతుడు ప్రభూ! నిన్ను లాగికొని యముడు పోయినాడు. నాడాయనుని మాట నీవు వినిపించుకొని యుంటివేని నీతోడి వియోగము నీకిది వచ్చెడిది కాదు. అయ్యో! మేను కదలక నేల నీవు నిదురించితివి. లేచి ఓ వీర! మమ్ము కౌగలించి ముద్దువెట్టుకొనవా? సమరమందు వీరులంగెలిచి వసుధాధిపతులం గూల్చియు నీ వొక్కనిచే ఒక్క మానవమాత్రునిచే నెట్లు పడితివి. నీ మేనెక్కడ. నీ తేజస్సెక్కడ (తేజస్సు = ప్రతాపము). ఆ నీ సిరి యెక్కడ? నీ బలమెక్కడ? నీయా శ్వేతచ్ఛత్ర మేమైనది? నీయా చామర మెందున్నది? ఆ పీఠ మేదీ? ఆ శృంగారమేది? నీ కొడుకు లెక్కడ? ఆ విలాసమేది? ఆ లక్ష్మీకళయేదీ? ఆ వందిమాగధు లతిశ్రేష్ఠులేమైరి? నీకు జామరములు వీచు నాపరమరమణీయ మూర్తులారమణులేరి? ఇప్పుడే నీకెడ బడితిమి: ఇప్పుడే నీకై మోహపడుచుంటిమి. ఇప్పుడే మాకు స్మరణీయుడవై పోయితివి. మాకు వల్లభుడవు సరియే. కాని సర్వజన వల్లభుడవు నీవు. స్వర్గ మందలి కాంతాజనము కాంత తరము కాబోలు! కాదేని నీ జనముం బాసి నీవా జనమునకై యేల (ప్రీతి) ముచ్చట బడుదువు? స్వేచ్ఛా సంచారివి గదా నీవు (సర్వ స్వతంత్రుడవు) నీ వేల యీ బుద్ధి (తలపు) గొంటివి. ఎవ్వని ప్రార్థనముచే నీకీ యుద్ధముపై శ్రద్ధ పెరిగినది? నీచే లాలింపబడ నీ కత్యంత ప్రియమైన యీ జనమునకు నీయీ దీర్ఘ ప్రయాణమందు జేయవలసిన దేమో మాటమాత్రమైన యనుగ్రహమైన నీవు చేయవలసినది. మా జనమును విడిచి రాజా! మేముద్యానములందు విచిత్ర వనములందు నుపవనములందును నీతో మేమాడు కొందుము. ఎల్లలోకము గనుగొన్ననించు కేని యీర్ష్య గొనము. నిశ్చయముగ మా గుండెలు వజ్రసారములు (వజ్రమంత) దృఢములయియుండును. అటులేగాని ప్రాణముల వాసిన నిన్ను జూచియు నూరు వ్రక్కలు గావలసినవి గాలేదు. కర్పూర చంద నార్ద్ర శరీర! హంసతూలికాతల్పశయన రక్తమునందడిసి పుడమిపై సొంపుదటిగి యున్నావు. ఘటల విడి (బెదరి మందం దప్పి చెదరి) నీ యేనుగు లెటువోయినవి. తురంగము లెక్కడ? గజములెట? ఇంద్రునికి బ్రతి స్పర్ధులైన నీయోధు లెటువోయిరి? మహాసైన్యమందు నిలిచిన ఖడ్గబాణములు దాల్చి నిన్ను రాఘవుడెట్లు పరలోకమందించెను? యముని సమదృష్టి చేతనే నీకువణకు పుట్ట వలసినది. అట్టి నీ విపుడు మనుష్య మాత్రునిచే సంగ్రామ మందీల్గితివి. అందుచే నీవారమైన మేమిపుడు జీవితముపై నిరాశులమైనా మేమి చేయుదుము? నమేస్తి కల్పో దృష్టిర్వా మేన సోర్ధృష్టి సంగతిః అని యిట్లు విలపించి శైలూషుని స్త్రీలు వానిం గౌగలించి కౌగలించి యవని తలమున బడిపోయిరి. తలలు బాదుకొనిరి జీవితము లేచిపోయిన యతని నూరక చూచు చుండిరి. చూచిచూచి మూర్ఛపడిరి. ధరణితల మెల్ల రోదన శబ్దముచే నిండిపోయెను. తెలిసిన ద్విజుడు గాన నాడాయనుడు వారినోదార్చెను. ఇదే సమయమున భరతుని ప్రేరణచే గంధర్వరాజు(చిత్రరథుడు)ఆచోటికివచ్చి

వివ్యాధ భరతం వీరం భుజే వామే నరాధిప । ప్రహారవర భిన్నస్య భరతస్య మహాత్మనః ॥ 164
కరాత్పపాత వేగేన చాపశ్చాపధరస్యచ । అథాన్యద్ధనురాదాయ భరతో రఘునందనః ॥ 165
శరైరనేక సాహస్రై ర్గంధర్వం తమవాకిరత్ ! పాతయామాసచ తథా కవచం రత్నభూషితమ్ ॥ 166
ఆపదం పరమాం ప్రాప్తః శైలూషో ఒప్యథ సత్వరః । ఆగ్నేయమస్త్రం చిక్షేప భరతం ప్రతివీర్యవాన్ ॥ 167
వారుణేన తదస్త్రంతు శమయామాస రాఘవః । వాయవ్య మస్త్రం శైలూష స్తదా చిక్షేప పార్థివ ॥ 168
శైలాస్త్రేణాథ భరతః శమయామాస తత్పునః । శైలాస్త్ర మథ చిక్షేప గంధర్వ నృపతి స్తథా ॥ 169
వజ్రేణాస్త్రేన తత్క్రుద్ధః శమయామాస రాఘవః । ఉత్ససర్జ తతో రాజా బ్రహ్మాస్త్రం ప్రాణ సంశయే ॥ 170
కాకుత్స్థః శమయామాస బ్రహ్మాస్త్రేణైవతత్తదా । అస్త్రయుద్ధే వ్యతిక్రాంతే క్రోధాదా రక్తలోచనః ॥ 171
జఘాన చతురో వాహాన్భరతస్యస సాయకైః । వీరకేతోశ్చ చిచ్ఛేద శిరోజ్వలిత కుండలమ్ ॥ 172
తస్యరాజ్ఞశ్చ చిచ్ఛేద ముకుటం రత్నభూషితమ్ ఉవాచ భరత శ్రేష్ఠః శైలూషంప్రహ సంస్తదా ॥ 173
కృతకర్మారణశ్రాంతో గచ్ఛాద్యస్వంనివేశనమ్ । తత్రగత్వా తతోయాతః పర్వతం గంధమాదనమ్ ॥ 174
అన్యథా శ్వో నమే జీవన్గంతాసిరణ మూర్ధని । అస్తంచ సవితాయాతి కృతకర్మా దినక్షయే ॥ 175
వయంచ శిబిరాయైవ గమిష్యామో జనాధిప । ఏతావదుక్త్వా శైలూషం చో త్సృజ్య భరత స్తదా ॥ 176
గంధర్వ రాజో ఒథ గృహంప్రవిశ్య నిశ్చిత్య కార్యం మరణాయ బుద్ధిమ్ ।
కృత్వా రణాయైవ మనశ్చకార రాత్రిం తథోవాహ గృహేనరేంద్రః ॥ 177

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
ద్వంద్వయుద్ధ వర్ణనం నామైక షష్ట్యుత్తరద్విశతతమో ఒధ్యాయః.

అంతట క్రుద్ధుడై గంధర్వరాజు సింహమట్లూర బొబ్బరించుచు భరతుని యరదము బాణవర్షమును గురిపించెను. దానిచే క్రమముగా నాతని రథము గుఱ్ఱములతో సారథితో నా రథము గప్పువడి కనరాదయ్యెను. యుధాజిత్తు (యుధాజిత్తుగదా) తొట్రువడక ధైర్యవంతుడు వీర్యవంతుడునుం గాన నెదిరియలుగులం గుంటువడిన యా యశ్వములం ద్రోలెను. అవ్వల భరతుడు మేఘ మురుముంబోలె మ్రోయి దివ్య చాపముంజేకొని క్షురప్రమును సంధించి శైలూషుని మహాధనువును రెండు గానొనరించెను. గంధర్వుడు ధనువు తెగిన నిమిషముననే తెప్పపాటుననే, మరియింకొక ధనువు నెక్కిడెను. బాహువులం బాగుగ నాకర్షించి శరములను విస రెను. అంతట భరతుడు కుపితుడై యా వింటిని నరకెను. ఆతని యాలాఘవమును త్రిదశాధిపతి పూజించెను. అంత శైలూషుండును క్రుద్ధుడై యింకొక విల్లుంగొని భరతు నరదముపై శరములను వదలెను. ఆతని మేనమామ యుధాజిత్తు ఆతని దథముతోడనయుండి యెదిరి శర పరంపరను వమ్మొనరించి తన లాఘవమును (చురుకు నను) జూపించెను ఆతనిచే జోద్యమానములై యా గుఱ్ఱ మును మండలములనట్లు పరిభ్రమించెను సూటి గానేగుచున్నను వానివేగమున చూపరులకు సుడిగుండములట్లు గిఱ్ఱున దిఱుగుచున్నవా యన్నట్లు గానిపించె నన్నమాట. బాణపరంపర బెండువడి పుడమిం బడుకొలది భరతుడును గడుసువడు వింటితో (నిరంతర సంధాన ముచే నిలుపుగొనక మండలము దిరుగు ధనుస్సుతో) నలుగులను విసరి వీరకేతువును నొవ్వం గొట్టెను. గంధర్వుడు (రాజు) తన తన యుడు తన సారథియునైన వీరకేతుడు దెబ్బదినుట గని యుధాజిత్తు నమ్ములం గొట్టెను. మహాబాహువు యుధాజిత్తు సమరమందు మిక్కిలిగ దెబ్బతినుటజూచి రాఘవుడు శైలూష ఛత్రముల బడవేసెను. రెండవ బాణమున దేజరిల్లు నున్నతమైన ధ్వజముం గొట్టెను. మూడవశరమున జలదమట్లుండు గుప్పిటం బట్టిన చోట ధనువుం గొట్టెను. పెద్దదెబ్బతిన్న మహానుభావుని భరతుని చేతినుండి జారి చాపము క్రింద పడెను. అటుపై వేరొకవిల్లంది రఘునందనుడు వేలకొలది శరములం గంధర్వునిపై జిమ్మెను. రత్నభూషితమైన వాని కవచముం బడనేసెను. శైలూషుడును పరమాపదనంది పడిగొని భరతునిపై ఆగ్నేయాస్త్రముల విసరెను. రాఘవుడు వారుణాస్త్ర

మునం దానిని శమింప జేసెను. అతడు వాయవ్యమును విసరెను. భరతుడు శైలాస్త్రమునం దాని వారించెను. గంధర్వరాజు శైలాస్త్రము వదలెను. క్రుద్ధుడై భరతుడు వజ్రాస్త్రముచే దానిని నడంచెను. గంధర్వరాజు ప్రాణసంశయమొంది యప్పుడు బ్రహ్మాస్త్రమును బ్రయోగించెను. కాకుత్థ్సుడు దానిని బ్రహ్మాస్త్రమునచే శమింపజేసెను. ఇట్టస్త్రయుద్ధము జరిగినమీదట కోపమున కండ్లెఱ్ఱబడి శైలూషుడు నాల్గుశరముల భరతుని నాల్గు తురంగముల గొట్టెను కుండలోజ్జ్వలమైన వీరకేతువు శిరముంచేదించెను. భరతుని రత్నకిరీటముం ఛేదించెను. అప్పుడు భరత శ్రేష్ఠుడు నవ్వుచు శైలూషునితో, పెద్ద పనిచేసినాడవు. యుద్ధమున నలసితివి. ఇప్పుడు నీయింటికి బొమ్ము. అటవోయి గంధమాదన పర్వతమున కరుగుము. అటుగాదేని రణతలమున రేపు నా నుండి బ్రతికి పోలేవు. సూర్యుడు తన పని దానిర్వహించి పగటి తుద నస్తంగతుడగు చున్నాడు. రాజా మేమును శిబిరమునకే యేగెదము. అని పలికి శైలూషుని విడిచి అయ్యెడ భరతుడు విహారమొనరించి శిబిరానకే యరిగెను. గంధర్వపతియు నిలుసొచ్చి కార్యనిశ్చయము సేసి మరణము తప్పదని యుద్ధమునకే మనస్సుకావించి రాత్రి గృహమంద గడిపెను.

ఇది శ్రీ విష్ణుధర్మోత్తరమున మహాపురాణమందు ప్రథమఖండమున గంధర్వయుద్ధ వర్ణనమను రెండువందలఅరువదియొకటవ అధ్యాయము.

## రెండువందల అరువదిరెండవ అధ్యాయము - తృతీయదివసయుద్ధము

తతోరజన్యాంవ్యుష్టాయాం మరణే కృతనిశ్చయః । సన్నహ్యత వినా వ్యూహం భరతం ప్రత్యుదైక్షత ॥ 1
భరతోऽపి మహాతేజాః కృతపూర్వాహ్ణికక్రియః । నిర్గమ్యనగరాత్సర్వాన్పార్థివా నిదమబ్రవీత్ ॥ 2
గంధర్వైర్భవతాం యుద్ధం మమ బుద్ధ్యా నరోచతే । ఏక ఏవ సమర్థోऽహం యుష్మాకం తేజసా నృపాః ॥ 3
హంతుం గంధర్వ సైన్యం తద్భవద్భిః పరిపీడితమ్ । యుధ్యమానా భవంతశ్చ రక్షితవ్యా మయా రణే ॥ 4
సకళత్రాం స్తతో భూపానేతాఞ్ఛక్నో మిఘాతితుమ్ । భవతామార్జవం యుద్ధే గంధర్వాః కూటయోధినః ॥ 5
అద్యతాన్పాయకై స్సర్వాన్దివ్యాస్త్ర ప్రతిమంత్రితైః । ఘాతయిష్యామి భూపాలాం స్తదనుజ్ఞాతు మర్హథ ॥ 6
భరతేనైవముక్తాస్తు రాజానోవాక్య మబ్రువన్ । త్వయా కళత్ర మస్మాకం రక్ష్యం స్వామి న్ప్రయత్నతః ॥ 7
భవతో రక్షణం కార్యం సమస్తైర్వసుధాధిపైః । పత్రచ్ఛేదం ఫలచ్ఛేదే వృక్షః శాఖావకర్తనే ॥ 8
భూయో వృద్ధి మవాప్నోతి మూలచ్ఛేదే వినశ్యతి । తేవయం భవతాం వీర్యం జానంతోऽపి రఘూద్వహ ॥ 9
నైకం సంత్యక్తు మిచ్ఛామో భవంతం రణ మూర్ధని । ఏకైకస్య తథాస్మాకం గంధర్వాణాం మహద్బలమ్ ॥ 10
వయం రణేహి పర్యాప్తాః కిం పున స్తవ పార్థివ । కింతు భృత్యేషు తిష్ఠత్సుస్వామినో గర్హితం రణమ్ ॥ 11
తేవయం ఘాతయిష్యామో గంధర్వానద్య సత్వరమ్ । ఏవముక్తో మహాతేజాః భరతో నృపసత్తమైః ॥ 12
వారయామాస సాంత్వేన తతస్తు వసుధాధిపాన్ । శాపితాఃస్థ మమప్రాణైః రాజ్ఞో రామస్య చాప్యథ ॥ 13
అద్యైవ వినివర్తధ్వం సంగ్రామాత్ పృథివీక్షితః । సంయతైశ్చ మహద్యుద్ధం పశ్యద్భి ర్మమ పార్థివైః ॥ 14
ఇత్యేవముక్తాః కృచ్ఛ్రేణ రణం ముక్త్వా నరాధిపాః । ఏకా నస్థాః సుసన్నద్ధాః దదృశు స్తన్మహద్రణమ్ ॥ 15
ఏకస్యచ బహూనాంచ యమరాష్ట్రవివర్ధనమ్ ।

మార్కండేయు డనియె: శైలూషుండవల మరణము నిశ్చయముగొని రాత్రిగడచి వ్యూహము లేకుండ యుద్ధసన్నద్ధుడయ్యెను. మహాప్రతాపశాలి భరతుడును పూర్వాహ్ణిక క్రియలు సలిపి నగరము వెలుపడి రాజులతో నిట్లనియె. మీరులేకుండ గంధర్వులతో బోరు నా బుద్ధి కిష్టముగాదు. మీ తేజస్సుచే (ప్రతాపమూత గొని) మీరంత వరకు వేధించిన గంధర్వ సైన్యమును

నేనొక్కడనే పరిమార్పసమర్థుడను. యుద్ధమునందు మిమ్ములనుగూడ నేను రక్షింప వలసి యున్నది. అందువలన కలత్రముతోగూడ రాజులను హతమార్పగలను. యుద్ధములో మీరార్జవము సూపువారు. ముక్కుకుసూటిగా ధర్మయుద్ధము సేయువారు మీరు. గంధర్వులు కూటయోధులు మాయా యుద్ధము సేయువాండ్రు. ఇక్కడ నేను వారందరిని మంత్ర సంధానము సేయబడిన దివ్యాస్త్రములచే గూల్తును. అనవిని రాజులు స్వామి నీవుమాకలత్రమును రక్షింప వలసిన వాడవు ఎల్లరాజులము మేము నిన్ను రక్షించుకొనవలసిన వారము. ఆకులు కోసినను పండ్లుగోసినను గొమ్మలు నరికినను వృక్షమింకను బెంపొందును గాని మూలచ్ఛేదము సేసినచో నశించును. రఘునాథ! నీ వీర్య మేమెఱిగిన వారమే యైనను సమరతలమున నిన్నొంటరిగ వదలుటకిచ్చగింపము. మాలో నొక్కొక్కరికి గంధర్వ బలము చాలును. మాలో నే యొక్కడేని గంధర్వ సైన్యముం బరిమార్ప గలడని భావము. మేమనిలో జాలుదుము నీకేమి పని! అదిగాక భృత్యులుండగా ప్రభువు యుద్ధము సేయుట గర్హితము మేమిప్పుడు గంధర్వుల గూల్తుమన విని భరతుడు భూపతులను నయంబున నట్లుగాదని వారించెను. రామచంద్రుని నా ప్రాణములు తోడుగా బలుకు చున్నాను. ఇప్పుడు మీరు రణము నుండి మఱలుడు. గంధర్వులతోడి నా యుద్ధమును జూచు చుండుడన కడుకష్టము మీద రణము విడిచి రాజులు సన్నద్ధులగుచునే యేకాంత మందుండి యొక్కడు పెక్కు మందితో దలపడి చేయు మహా యుద్ధమును యమరాష్ట్ర వివర్ధనమైన దానిం దిలకించిరి.

రథేన కాంచనాంగేన కింకిణీ జాల మాలినా ॥ 16
యుధాజితా గృహీతేన సతోయాంబుదచారిణా । చంచ ద్బహు పతాకేన కోవిదార ధ్వజేన చ ॥ 17
ఆససాద రణే యక్షాన్ గంధర్వాన్ రణ కర్కశాన్ । శరైః సంఛాదయామాస గభస్తిభి రివాంశుమాన్ ॥ 18
ఏతస్మి న్నేవ కాలేచ సహసా గగనచ్యుతా । ఉల్కా పపాత మధ్యేన భిత్వా సూర్యస్య మండలమ్ ॥ 19
ఆసీద్ఘోరో మహీ కంపః శైలూషాంగ విదారణః । ఆదిత్యమండలే రాజన్! కబంధ శ్చాప్య దృశ్యత ॥ 20
వవర్ష న తదా దేవో గంధర్వాన్ రక్తవృష్టిభిః । గంధర్వాణాంచ దీప్తాయాం ది శ్యవాశ న్త పక్షిణః ॥ 21
మృగాశ్చ ఘోరా రాజేంద్ర! శివాశ్చాశివనిస్వనాః । ప్రతిలోమ స్తథైవాసీ ద్వాయుస్తేషాం సు శంకకృత్ ॥ 22
న్యలీయత తథా గృధ్రః శైలూషస్యధ్వజాగ్రతః । సమే పథి నిరాబాధే ప్రస్ఖలన్త స్తురంగమాః ॥ 28

కాంచనాంగము కింకిణీజాల మాలాలంకృతము యుధాజిత్తు చేబట్టినదానిని క్రొక్కారు మేఘమట్లు చరించుదానిని పెక్కు పతాకలెగురుచుండ కోవిదారధ్వజాలంకృతమై యున్న యరదయొక్క రణకర్కశులైన యక్షగంధర్వుల కెదురు నడచెను. కిరణములచే భానుడట్లు వారిం భరతుడు శరములచే గప్పివైచెను. ఇదే సమయమున గగనము నుండి సూర్యమండలము భేదించుకొని తటాలున నుల్క=కొఱవి పడెను. ఘోరమైన భూకంపమయ్యెను. అది శైలూషుని శరీర విదారణమైతోచెను. సూర్యమండలమందు తలలేని మొండెముగానబడెను. గంధర్వులపై దేవుడు రక్తవర్షము గోరెను. గంధర్వులున్నవైపు (ఆదిక్కుల) మండుచున్నట్లయ్యె. పక్షులు వికృతముగ నార్చినవి. ఘోర మృగములు నక్కలును నఱచినవి. వాండ్రకు ప్రతిలోమముగ ఎదురుగాలి హోరుమని వీచెను. శైలూషునిటెక్కెముపై గ్రద్దవాలెను. ఏయెగుడుదిగుడులేని సమతలమున యేబాధలేనిచోట వాని గుఱ్ఱములు తడబడినవి.

శతపత్రాశ్చ చాపాశ్చ హంసాశ్చైవ ప్రదక్షిణమ్ । భరతస్య తదా చక్రుః సవ్యో బాహు రథాఽస్ఫురత్ ॥ 24
దృష్ట్వా నిమిత్తాంస్తు శుభాన్ యుధాజిత్సమహాయశాః । చోదయామాస తురగాన్ గంధర్వాణాం చమూంప్రతి ॥ 25
భరతోఽపి శరవ్రాతైః ఘాతయామాస వాహినీమ్ । గంధర్వాణా ముదీర్ణానాం ఘోరైః శతసహస్రశః ॥ 26
వధ్యమానాస్తు గంధర్వా భరతేన మహాత్మనా । తమేవాభిముఖా జగ్ముః శలభాః పావకం యథా ॥ 27
తేషా మావతతామేవ శరై స్సన్నత పర్వభిః । పాతయామాస శీర్షాణి భరతో వాహినీపతిః ॥ 28
భరతం కోష్ఠకీ కృత్వా గంధర్వాస్సు మహారథాః । వవర్షు రాయుధై స్తీక్ష్ణై ర్మేఘావృష్ట్యేవ పర్వతమ్ ॥ 29

తాన్యాయుధాని ముఖ్యాని గంధర్వై ర్భరత స్తదా । చిచ్ఛేద రాజ న్నారాచై ర్గంధర్వాంశ్చావధీద్బలీ ॥ 30
మ స్తకాన్ సశిరస్త్రాణాన్ బాహూనపిచ సాంగదాన్ । హ స్తి హస్తోపమా నోరూం శ్చిచ్ఛేద భరతో రణే ॥ 31
నాఽ వధానం న సంధానం న ముంచంతం చ సాయకాన్ । దదర్శ భరతం కశ్చి ల్లాఘవా ద్రణమూర్ధని ॥ 32
కేవలం దృశ్యతే యుద్ధే గంధర్వాణాం మహాచమూః । దహ్యమానా శరవ్రాతైః యుగాంతాగ్నిరివ జ్వలన్ ॥ 33
బాణగోచర మాయాతాన్ భరతస్య వినిష్కృతః । శాత్రవాన్ సాయకై స్తీక్ష్ణైః జగామా స్తం దివాకరః ॥ 34

రణే జయం ప్రాప్య తతో నివృత్తః సమాగత శ్చాపి నరేంద్రముఖ్యైః ।
ప్రాయాన్ మహాత్మా శిబిరాయ రాజన్ । సంస్తూయమాన స్త్రిదశ ద్విజేంద్రైః ॥ 35

ఇతి శ్రీ విష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే తృతీయ దివస యుద్ధ వర్ణనం నామ ద్విషష్ట్యుత్తర ద్విశతతమోఽధ్యాయః

భరతుని శతపత్రములు = చాషములు = హంసలు ప్రదక్షిణ మొనరించెను. కుడిబాహువదిరెను. ఆశుభనిమి త్తములను జూచి యుధాజిత్తు గంధర్వసైన్యము పైకి గుఱ్ఱములను తోలెను. భరతుడు శరపరంపరచే నెదిరిసేనం జెండాడెను. అయ్యెడ వందలు వేలుగ గంధర్వులార్చిరి. భరతుచే హతులగుచుంగూడ గంధర్వులు మిడుతలగ్నిపైనట్లాతని కెదురుసనిరి. వారటుసని పైపడుచుండగనే భరతుండు శరములచే వారితలలం బడనేసెను. మహారథులు గంధర్వులు భరతునొక (యిరుకున) మూలం జిక్కువడజేసి యతని తీక్ష్ణాయుధముల జడివానచే మేఘము పర్వతమునట్లు ముంచెత్తిరి. ఆయలుగుల నఱకి భరతుడు గంధర్వులం గూడ నరకెను. వారిమ స్తకములను బొమిడికములతో బాహుపురులతోడి బాహువులను ఏనుగుతొండములట్టి వారితొడలను నరికివైచెను. లాఘవము మెఱసి భరతుడు బాణముల ననుసంధించుటను వదులుటను నేని యేయొక్కడుం జూచినవాడు లేడు. అయ్యుద్ధమందు గేవలము గంధర్వమహాసేన బాణముచే ప్రళయకాలాగ్ని యట్లు ప్రజ్వలించు బాణాగ్నికి దహింపబడుచు మాత్రమే కనిపించెను. బాణము గురింబడిన వారిం బడినట్లురుల భరతుడు గూల్చుచుండ దినకరుడ స్తమించెను. ఆపోరిలో గెలుపుకొని యట మరలి నరేంద్రవరులతో గలిసికొని భరతుడు దేవతలు ద్విజేంద్రులు స్తుతింప శిబిరమునకేగెను.

ఇది శ్రీవిష్ణు ధర్మోత్తర మహాపురాణమున ప్రథమఖండమున తృతీయ దివసయుద్ధ వర్ణనము రెండువందల యరువది రెండవ అధ్యాయము.

## రెండువందల అరువదిమూడవ అధ్యాయము - చతుర్థ దివసయుద్ధవర్ణనము

మార్కండేయః- చతుర్థేఽహని సంప్రాప్తే కృత పూర్వాహ్ణ క్రియః । శైలూషస్తు వినిష్క్రమ్య గంధర్వా నిదమబ్రవీత్ ॥
యోధయధ్వం రణే సర్వే భరతం రిపు మాగతమ్ । అహం మధ్యే ప్రవేక్ష్యామి భరతస్య బలార్ణవమ్ ॥ 2
తత్ర తాన్ ఘాతయిష్యామి భరతస్యాను యాయినః । ఏతదు క్తే తథే త్యుక్త్వా సంప్రతీక్షన్త రాఘవమ్ ॥ 3
భరతోఽపి మహాతేజాః రథేనై కేన దృశ్యతే । భరత స్యాను సైన్యంచ భూభుజాం సమపద్యత ॥ 4
త త్సైన్యం ప్రావిశ ద్ఘోరం శైలూషో రణ దర్పితం । చకార కదనం తత్ర నరవారణ వాజినామ్ ॥ 5
గంధర్వ సైన్యే చ తథా భరతోఽపి శరోత్కరైః । చకార కదనం ఘోరం వైశ్వానర సమప్రభైః ॥ 6
రాజానం కోష్ఠకే కృత్వా శైలూషం వివిధైశ్శరైః । ఛాదయామాసు రవ్యగ్రా మేఘా ఇవ మహీధరమ్ ॥ 7
గోవాసనస్తు స ప్తత్యా చిచ్ఛేద సమరే శరైః, ద్విజిహ్వశ్చ త్రిస ప్తత్యా రాజా దాశేరకస్తు యః ॥ 8
సుబాహు స్తం చతుష్షష్ట్యా దశభి స్తం సుయోధనః । కుమార స్స ప్త స ప్తత్యా శ్రేణిమాన్ దశభి స్త్రిభిః ॥ 9

శూరః షష్ట్యా చ నిర్భిద్య బలబంధుః శ తేన చ । ద్వావింశత్యా తత స్తక్షః పుష్కరో నవభి శ్శరైః ॥ 10
శతేన విజయ శ్చైనం జయో జిత్వా త్రిభి శ్శరైః । ప్రత్య విధ్యత తాన్ సర్వాన్ శైలూషో దశభి శ్శరైః ॥ 11
నృత్యన్నివ రథో పస్థే మహాబల పరాక్రమః । ధను శ్చిచ్ఛేద భల్లేన సుబాహోః సుమహాత్మనః ॥ 12
హయాం శ్చ కార నిర్జీవాం స్తథై వాంశు మతోన్నృప ! పద్మంరథస్థం చిచ్ఛేద చిహ్నం గోవాస నస్యతు ॥ 13
సుయోధన రథాత్ క్షిప్రం పాతయా మాస సారథిమ్ । బలబంధో స్తథా ఛత్రం పాతయా మాస యాదవ ! 14
తథాఽన్యాన్ వి సు ఖాం శ్చక్రే శరైః స్సన్నత పర్వభిః । తత స్తస్య క్షురప్రేణ ధను శ్చి చ్ఛేద పుష్కరః ॥ 15
అథాఽన్యం చాప మాదాయ పుష్కరస్య రణే రుషా । చకార తురగాన్ సర్వాన్ నిర్జీవాన్ సమరప్రియః ॥ 16
పుష్కర శ్చ సమారుహ్య తక్షస్య రథ ముత్తమమ్ । వవర్ష శర వర్షేణ శైలూషం రణ మూర్ధని ॥ 17
శైలూషోఽపి జఘానా శ్వాన్ గథా త్తక్షస్య యాదవ ! విరథౌ తౌ గదాపాణీ భ్రాతరౌ యుద్ధ దుర్మదౌ ॥ 18
శైలూషేణ సమారూఢౌ గదా హస్తౌ తరస్వినౌ । అభ్యాశే భ్రాతరౌ దృష్ట్వా జగామాఽ దర్శనం తతః ॥ 19
మాయావీ స తు గంధర్వో రథముత్సృజ్య యాదవ ! శూన్యం దృష్ట్వా రథోపస్థం విలక్షౌ భ్రాతరౌ తదా ॥ 20
ఆదిత్యే ఽ స్త మను ప్రాప్తే విని వృత్తౌ రణా జిరాత్ ।
భరతోఽపి తథా కృత్వా గంధర్వాణాం మహాహవమ్ । న్యవర్తత మహారాజః సంధ్యా కాలే రణాజిరాత్ ॥ 21
గత్వైవ రాజన్ ! సచ రాజవేశ్మ తత్రోష్య రాత్రిం రఘువంశనాథః ।
నిశావసానే పునరేవబుద్ధ శ్చ కార యుద్ధం సహితోన్నృ వీరైః ॥

ఇతి శ్రీ విష్ణు ధర్మోత్తరే ప్రథమఖండే చతుర్థ దివస యుద్ధ వర్ణనం నామ
త్రిషష్ట్యుత్తర ద్విశతతమోఽధ్యాయః.

మార్కండేయుడనియె. నాల్గవరోజున శైలూషుడు పూర్వాహ్ణము నందలి క్రియలు జరిపికొని వెలికివచ్చి గంధర్వులంగని యిట్లనియె. మీరు భరతునితో నందరుం గలిసికొని పోరుడు. నేను సేనాసముద్రము రణమధ్యమందు ప్రవేశించి భరతుని యనుయాయులను గూల్చెదననియె. వారు భరతుని నెదురుకొన నెదురు చూచిరి. భరతు డొక్క రథమునెక్కి యెదుట గనబడెను. ఆయన వెంట రాజసైన్యములు నడచెను. శైలూషుడు ఘోరమైన సేనను జూచి చతురంగ బలములతో దలపడెను. మేఘములు పర్వతముల నట్లు గ్రమ్మి భరత బలములు శైలూషునొక మూలకుదరిమి శర వర్షము గురిపించిరి. గోవాసనుడు డెబ్బది ద్విజిహ్వుడు (దాశేరకుడు) సుబాహువఱువదినాల్గు సుయోధనుడు పది కుమారుడు డెబ్బదియేడు శ్రేణిమంతుడు ముప్పది శూరుడరువది బలబంధువు నూరు తక్షు డిరువదిరెండు పుష్కరుడు తొమ్మిది విజయుడు నూరు జయుడు మూడు శైలూషుడు పదియును బాణముల భరత సైన్యముం గొట్టిరి. తేఱు మొగసాల (ముందు) నృత్యము సేయుచున్నట్లుండి భల్లముచే (ఈటె) సుబాహువు ధనువుం ద్రెంచెను. అంశుమంతుని గుఱ్ఱములం గూల్చెను. గోవాసనుని రథమందున్న పద్మము గుర్తును గొట్టివేసెను. సుయోధన సారథింబడ ద్రోసెను. బలబంధుని గొడుగు పడ వేసెను. మరియుంగల యోధులను బెడిమొగము పెట్టించెను. పుష్కరుడా మీద వాని ధనుస్సు ఛేదించెను బలబంధు డింకొక విల్లు గొని పుష్కరుని గుఱ్ఱములం గత ప్రాణములం బొనరించెను. పుష్కరుడు తక్షుని రథమెక్కి శైలూషునిపైనమ్ముల జడివానగురియించెను. శైలూషుడు పుష్కరుని తేరి గుఱ్ఱములం గూల్చెను. ఇద్దరును విరథులై గదలుగొనిన తక్ష పుష్కరులను సయ్యన్నదమ్ములపై శైలూషు డెక్కెను. ఎక్కినంతలోనే మాయమయ్యెను. మాయావి వాడదృశ్యు డగుట చూచి వారిద్దరు వెఱగుపడి సూర్యాస్తమయ మయినంతట రణరంగము నుండి మఱలి పోయిరి. భరతుకును నవ్విధమున గంధర్వులతో మహారణము సేసి సంధ్యా సమయమైనదని యట నుండి వెనుదిరిగెను. రాజ శిబిరమున కేగి యతడారేయి నటనుండి వేకువ లేచి నర వీరులతో గూడ యుద్ధము సేసెను.

ఇది శ్రీ విష్ణుధర్మోత్తర మహాపురాణమందు ప్రథమఖండమున చతుర్థదివసయుద్ధవర్ణనమను
రెండువందల యరువదిమూడవ అధ్యాయము.

# రెండువందలఅరువదినాల్గవ అధ్యాయము - పంచమదివసయుద్ధవర్ణనము

మార్కండేయః- తతోఽహ్ని పంచమే ప్రాప్తే భరతో యుద్ధ దుర్మదః ।
కల్యముత్థాయ రాజేంద్ర ! కృత పూర్వాహ్ణిక క్రియః ॥ 1
జగామ హన్తుం గంధర్వాన్ బలముత్సృజ్య పృష్ఠతః । శైలూషోఽపి రణం త్యక్త్వా నరేంద్ర నిధనేచ్ఛయా ॥ 2
జగామైక రథేనైవ రణకర్మ విశారదః । తయోరాసీ న్మహాఘోరః సంప్రహార స్సుదారుణః ॥ 3
దేవాసుర రణ ప్రఖ్యః సూర్య స్యోదయనం ప్రతి । తయోస్తు యుధ్యతో రాజన్ గంధర్వాణాం బలార్ణవమ్ ॥ 4
ఛాదయా మాస భరతః శరై స్సన్నత పర్వభిః । తచ్చ రాజ్ఞా ముదీర్ణానాం బలం సాగర సన్నిభమ్ ॥ 5
ఛాదయా మాస గంధర్వః శరై రాశీ విషో పమైః । బలమేఘే వినిర్యాతే శర వృష్టి సుదారుణే ॥ 6
ధారయేతాం మహారాజ ! శైలూష భరతా వుభౌ । అన్తరిక్షే శరవ్రాతాం శ్చిచ్ఛిదతు రరిం దమౌ ॥ 7
సైన్యయో శ్చ తథా చక్రుః కదనం ఘోర దర్శనమ్ । తయోశ్చా పచ్యుతై ర్బాణైః నిపాతి త హయద్విపైః ॥ 8
రణే విస్రసు ర్భూపాల ! స్రవంత్యో రక్త నిమ్నగాః । వహన్త్యో నరదేహాని యక్షరాక్షస సేవితాః ॥ 9
తాభ్యాం ముక్తైః శరవ్రాతై ర్గగనే సూర్యరశ్మయః । న ప్రాకాశంత రాజేంద్ర ! ఏకచ్ఛాయే నభఃస్థలే ॥
సైనికాన్ ఘాత యన్తౌ తౌ రక్షమాణౌ చ సారథీ ॥ 10
ఛిందమానౌ రణే వీరౌ పరముక్తాం స్తథా యుధాన్ । జనయా మా సతు ర్వీరౌ సురాణా మపి విస్మయమ్ ॥ 11
తద్యుద్ధం పూజయా మాస పుష్ప వర్షేణ వాసవః । తౌ ప్రబుద్ధౌ దినం సర్వం వరివాణ ధనుర్ధరౌ ॥ 12
నాసీ దేకతర స్యాపి రణే తస్మిన్ పరాజయః । తతోఽస్తం భగవ త్యర్కే ప్రయాతే పృథివీ పతేః
పరస్పర స్యాను మతే శిబిరాయైవ జగ్మతుః ॥ 13
అథోష్య రాత్రిం గృహ యోః ప్రవిష్టౌ రాత్ర్యన్త మాసాద్య తదా రణాయ ।
భూయో మహేంద్రోపమః సంప్రయాతౌ ప్రహర్ష యన్తౌ స్వబలాని వీరౌ ॥ 14

ఇతి శ్రీ విష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
భరత శైలూషయుద్ధే పంచమ దివస యుద్ధ వర్ణనం నామ చతుష్షష్ట్యుత్తర ద్విశతతమోఽధ్యాయః.

మార్కండేయుడనియె. అయిదవరోజున భరతుడు వేకువనేలేచి ప్రాతరనుష్ఠానముగావించి గంధర్వులపైకి చనెను. అయ్యిర్వురకు దారుణసమరమయ్యెను. భరతుడు తీవ్రబాణములగురియ గంధర్వుడును సర్పములట్టి యలుగులను విసరెను. నింగినే యా బాణములను ద్రెంచిరి. ఘోర సమరమున రక్తపుటేరు ప్రవహించెను. అందనేకనరశరీరములు దేలిపోయెను. ఆవిసిరిన బాణములచే సూర్యరశ్మి గప్పుపడిపోయెను. సైనికులనొకవంక గూల్చుచు సారథుల నొకవంక గాపాడుకొనుచు నరివిముక్త శరవ్రాతమును శత్రుకవచములంజెండాడుచు నిద్దరు నొకరి కొకరు దీసిపోని మహారణమునొనరించిరి. అదిచూచి వేల్పులుంగూడ యచ్చెరువు వడిరి. వాసవుడా సంగరమును బూలవానం బూజించెను. అంతట రవిగుంక గ్రుంకిరి యిద్దరుల యనుమతితో శిబిరములకుం జనిరి. రేయితుద మరల తమతమ బలములం బ్రహర్షింపజేయుచు ననికి నడచిరి.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణమందు ప్రథమఖండమున పంచమదివసయుద్ధవర్ణనమను
రెండువందలయరువది నాల్గవ యధ్యాయము

## రెండువందల అరువదిఐదవ అధ్యాయము - షష్ఠదివసయుద్ధము

మార్కండేయః- తతస్తు షష్ఠే సంప్రాప్తే దివసేభూరి దక్షిణే । చక్రతు స్సమరం వీరౌ శైలూష భరతౌ వృభౌ ॥ 1
ససైన్యౌ పృథివీ పాల! శరై రాశీ విషోపమైః । శైలూషేణ సమాసక్తో భరతో వాహినీ పతిః ॥ 2
సూర్యరశ్మేశ్శరేణా జౌ శిరశ్చిచ్ఛేద శత్రుహా । సూర్య రశ్మిం రణే హత్వా ఏకలవ్యం మహారథమ్ ॥ 3
శరేణ పాతయా మాస రథోపస్థా దరిందమమ్ । గంధర్వ నృపతి ర్దృష్ట్వా ప్రధానౌ తౌసుతౌహతౌ ॥ 4
శక్త్యా బిభేద విజయం తథా చక్రేణ పుష్కరమ్ । తోమరేణ తథా తక్షం గదయా చ సుయోధనమ్ ॥ 5
వివిశుస్తే రథో పస్థం విసంజ్ఞాః సర్వ ఏవతు । నియంతృభి శ్చ సమరా త్సర్వ ఏవా౽పవాహితాః ॥ 6
తతస్తు భరతః క్రుద్ధ శ్చతుర్భి స్తస్య సాయకైః । చకార యుధి నిర్జీవాం స్తు ర గాశ్చైవ యాదవ ! 7
చకార చ శరవ్రాతై ర్విముఖీ కృత విక్రమమ్ । తతోధైర్యేణ సంధార్య శరవేగం మహాత్మనః ॥ 8
ఆరురోహ రథం శీఘ్రం సుసన్నద్ధో మహాబలః । రథ మారుహ్య వివ్యాథ శరేణానత పర్వణా ॥ 9
భరతో హృదయే గాఢం ముమోహ స చ తాడితః । ఏతస్మి న్నంతరే ముక్తో హాహాకార స్సురాసురైః ॥ 10
అప్రహృష్టైః ప్రహృష్టై శ్చ విమూఢే రఘునందనే । హాహాకారేణ మహతా లబ్ధ సంజ్ఞః స రాఘవః ॥ 11
ఆకృష్య బలవచ్చాపం శైలూషస్య మహద్ధనుః । ద్విధా చకార రాజేంద్ర ! శైలూషం చాహనద్ భృశమ్ ॥ 12
స చ్ఛిన్న ధన్వా వేగేన గదా మాదాయ సత్వరః । ప్రేషయా మాస ధర్మజ్ఞ! భరతస్య మహాత్మనః ॥ 13
ఆపతం తీం గదాం దృష్ట్వా భరతో రణమూర్ధని । ద్విధా చకార చక్రేణ సర్వ సైన్యస్య పశ్యతః ॥ 14
తత స్స పరిఘం శీఘ్రం చిక్షేప భరతం ప్రతి । తమా పత న్తం చిచ్ఛేద చతుర్భి స్సాయకైర్దృఢమ్ ॥ 15
తతో౽ న్యద్ధను రాదాయ సాయకా నేక వింశతిం । చిక్షేప స మహారాజ! భరతస్య రథం ప్రతి ॥ 16
ఛిత్వా తాన్ భరతః సర్వాన వధీ త్తస్య సారథిమ్ । తథా చ చతురో వాహాన నయద్యమ సాదనమ్ ॥ 17
శైలూషం విరథం దృష్ట్వా గంధర్వాణాం మహాచమూః । వవర్షాయుధ వర్షేణ మేఘో వృష్ట్యేవ పర్వతమ్ ॥ 18
సమోహ యిత్వా భరతం మోక్షయా మాస పార్థివ! । మోక్షయిత్వాచ రాజానం గతే ౽ స్తం రవి మండలే ॥ 19
కృత్వా వహారం తుగతః శిబిరాయ నరాధిపః ॥ 20
హత్వా రథే నాగరథా౽శ్వ యోధాన్ సంప్రాప్య మధ్యే నిశితైః పృషత్కైః ।
రఘుప్రవీరో౽పి గృహాయి యాతః । సంపూజ్య మానో భువి మాన వేంద్రైః ॥ 21

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ శైలూష భరతయుద్ధే షష్ఠయుద్ధ
దివసోనామ పంచషష్ట్యుత్తర ద్విశతతమో౽ధ్యాయః.

మార్కండేయుడనియె. ఆఱవరోజు రాగానే భరతశైలూషులు తీవ్రవరణముగావించిరి. శైలూషునితోడి పోరులో భరతుడు సూర్యరశ్మియను గంధర్వు శిరము నరికెను. అటుపై నేకలవ్యుం గూల్చెను. గంధర్వుల రాజట్లు తనయిర్వురు కొడుకులు మడియుటగని విజయుని శక్తిచే చక్రముచే బుష్కరునిం తోమరముతో తక్షుని గదచే సుయోధనునింగూల్చెను. వారందఱు తెలివిదప్పి రథము ముందఱనొఱగిరి. రథసారథులు వారిని రణభూమినుండి తలగించిరి. భరతుడపుడుగ్రుడై శైలూషుని నాల్గుగుఱ్ఱములం జంపెను. శరజాలమున శత్రువును జచ్చువడంజేసెను. అప్పుడు ధైర్యము గొని భరతుని బాణవేగము నోర్చుకొని గంధర్వపతి రథమెక్కి బాణము విసరెను. హృదయమున తగిలి భరతుడు మూర్ఛవోయెను. ఈ యెడ సురాసురులు హాహాకారములు సేసిరి.

భరతుడు మూర్ఛనొందగ దిగులు పడిన సంతోషపడిన యిరువంకల హాహాకారములచే భరతుడు తెలివికొని రాఘవుడు ధనువు బలము కొలది నాకర్షించి శైలూషుని విల్లును దునిమి వానిం గట్టిగ గొట్టెను. ధనువు తెగి వాడు గదంగొని భరతునిపైకి విసరెను. పైబడు నా గదంగని భరతుడు చక్రముచే దానిని రెండుగ ద్రుంచెను. అపై నతడు పరిఘయను నాయుధము విసర రఘునందనుడు నాల్గమ్ముల దాని వమ్మొనరించెను. ఆపై వేయువింటి నందుకొని యిరువదియొక్క బాణములను భరత రథముపైకి విసరెను. వానిం ద్రెంచి వాని సారథిని భరతుడు గూల్చెను. వాని రథాశ్వములను యమనిలయమున కంపెను. శైలూషుని విరథుంగాగనుగొని గంధర్వసేన పర్వతముపై మేఘమట్లు శరవర్షము గురిసెను. భరతుడయ్యెడ మూర్ఛఁబోవ నతని వదలించికొని గంధర్వుడు మరలెను. సూర్యుడస్తమించెను. గంధర్వుడు తన శిబిరమునకుంజనెను. రఘు ప్రవీరుడును మానవేంద్రుల మన్ననలందుకొనుచు తననివాసమునకుం జనియె.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణమందు ప్రథమఖండమున షష్ఠదివస యుద్ధవర్ణనమను
రెండువందల అరువదిఐదవ అధ్యాయము

## రెండువందల అరువదిఆరవ అధ్యాయము - శైలూషవధ

తతస్తు సప్తమే ప్రాప్తే దివసే యుద్ధ దుర్మదౌ । సమీయతు ర్మహాత్మానౌ శైలూష భరతా వుభౌ ॥ 1
తతస్తు భరతః ప్రాహ శైలూషం యుద్ధ దుర్మదమ్ । ఆవయోః ప్రస్తుతం సైన్యం కిమేతై స్సైనికై ర్మృతైః ॥ 2
నివారయస్వ సైన్యంస్త్వం వారయిష్యా మ్యహం స్వకమ్ । ఆవయో ర్ద్వైరథం యుద్ధం పశ్యన్తు వసుధాధిపాః ॥ 3
త్వదీయాః సైనికా యే చ సురనాథాః సహామరైః । హతే మయి మదీయంతు సైన్యం కామం ప్రయుధ్యతామ్ ॥ 4
సంగ్రామం వా కరోత్వాజౌ త్వదీయంతు హతేత్వయి । ఏవముక్త స్తథే త్యుక్త్వావారయా మాస సైనికాన్ ॥ 5
గంధర్వరాట్ సశైలూషో భరతోఽపి తథా స్వకాన్ । తతః ప్రవవృతే యుద్ధం తయోర్దేవా సురోపమమ్ ॥ 6
పశ్యతాం సర్వ సైన్యానాం దేవానామపి పశ్యతామ్ । శరజాలేన మహతా ఛాదితార్క కరే రణే ॥ 7
తతక్షతుస్తా వన్యోన్యం శరైః సన్నత పర్వభిః । పరస్పర శరాఘాత విసరచ్ఛోణితోక్షితా ॥ 8
విరేజతు స్తౌ రాజేంద్ర! పుష్పితా వివ కింశుకౌ । ఉభౌ మహారథౌ వీరౌ చోభౌ విశ్రుత పౌరుషౌ ॥ 9
తథోభౌ వరధానుష్కౌ చోభౌ సమర దుర్మదౌ । కాంచనాంగ రథస్థౌతౌ చోభౌ సద్ధ్వజ శోభితౌ ॥ 10
వీజ్యమానౌ తథైవోభౌ యోధాభ్యాం వరచామరైః । ఛత్రయోస్తౌ తదా ధస్తాచ్ఛుశుభాతే మహారథౌ ॥ 11
ఉభౌ వస్త్ర ప్రతాపేన చక్రతు స్తుములం రణమ్ । అస్త్రయుద్ధం చిరం కృత్వా శరయుద్ధం ప్రచక్రతుః ॥ 12
శరయుద్ధే వ్యతిక్రాన్తే అస్త్రయుద్ధం పునః పునః । ఏవంతౌ దివసం కృత్వా యుద్ధం సంశ్రాన్తవాహనౌ ॥ 13
రోపయన్తౌ శ్రమంరాజన్! సమరేషు జిత శ్రమౌ । తతో గంధర్వరాజస్తు లంబమానే దివాకరే ॥ 14
చకార తామసీం మాయాం యయాంధ మభవజ్జగత్ । అంధకారే తతో జాతే వాచోఽశ్రూయన్త దారుణాః ॥ 15
భరతో హన్యతాం శీఘ్రం భక్ష్యతాం పాత్యతాం తథా । అభ్యవర్తన్త భరతం సర్పవృశ్చిక కర్కటాః ॥ 16
మర్కటా వానరా ఘోరాః సృగాలాః ద్వీపిన స్తథా । సింహవ్యాఘ్ర వరాహాశ్చ క్రవ్యాదా యేచ జాతయః ॥ 17
అర్ద్యమాన స్స ధర్మాత్మా భరతస్తై స్సుదుర్ముఖైః । సౌరేణాస్త్రేణ తాం మాయాం బభంజ పరవీరహా ॥ 18
తతస్తు మహతీం మాయాం స చకార మహాభుజః । ఉత్తస్థౌ సుమహాన్ మేఘ శ్ఛాదయిత్వా నభ స్తలమ్ ॥ 19
ప్రవవర్షచ ఘోరాణి శస్త్రజాలా న్యనే కశః । నారాచా నర్ధనారాచాం స్తథైవ చషకాననాన్ ॥ 20
వత్సదంతాం స్తథా వల్లాన్ కర్ణినాలీక గోముఖాన్ । క్షురప్రా నర్ధచంద్రాంశ్చ వరాహ వదనాం స్తథా ॥ 21

గదాభుశుండీః ప్రాసాంశ్చ భిండిపాలాన్ పరశ్వథాన్ । హుడాన్ గుడాన్సలగుడాన్ చక్రఖడ్గాం స్తథా పరాన్ ॥ 22
ఏతా నన్యాంశ్చ వివిధాన్ వవర్ష పరమాయుధాన్ । పతద్భి రాయుధై ర్ఘోరైర్బాధ్యమాన స్సరాఘవః ॥ 23
వాయవ్యాస్త్రేణ తాం మాయాం నాశయామాస శత్రుహా । తతో బభూవ రాజేంద్ర! గంధర్వః పర్వతో మహాన్ ॥ 24
క్షరత్ ప్రస్రవణో ఘోరః శిఖరైశ్చ సముచ్ఛ్రితైః । మాయాం తాం పార్వతీం శ్రీమాన్ వజ్రాస్త్రేణ రఘూద్వహః ॥
నాశయామాస రాజేంద్ర! సర్వసైన్యస్య పశ్యతః । హన్యమానాసు మాయాసు రూపాంశ్చక్రే సుదారుణాన్ ॥ 26
యక్షాణాం రాక్షసానాంచ పిశాచానాం పతత్రిణామ్ । సింహవ్యాఘ్ర తరక్షూణాం కుంజరాణాం తథైవచ ॥ 27
బభంజ తస్యమాయాస్తాః దివ్యాస్త్రైర్భరతో రుషా । హన్యమానాసు మాయాసు లాఘవాద్భరతం రణే ॥ 28
మోహయామాస రాజేంద్ర! శైలూషో రణదర్పితః । భరతోఽపి ధనుష్కోట్యాం శరాగ్రేచ నిలీయతే ॥ 29
ధ్వజాగ్రేచ రథాగ్రేచ తురగాగ్రే పునః పునః । సాయకాన్ భారతాన్ శైఘ్ర్యా ద్ధ్వంసయామాస యాదవః 30
రాఘవా స్తుతుషు స్తస్య దేవ దైత్యాశ్చ సంఘశః । అసురా ముముచు ర్ఘోర మట్టహాసం సుదారుణమ్ ॥ 39
దైత్యానా మట్టహాసేన భరతః కుపితో భృశమ్ । నారాయణాస్త్రం సంయోజ్య శరేణానతపర్వణా ॥ 32
ఇయేష హన్తుం తం క్రోధా ద్గంధర్వం రణగర్వితమ్ । అస్త్రం తత్సంహృతం జ్ఞాత్వా జగామ స్వం రథం త్వరన్ ॥
ఇయేష హన్తుం తం చాస్త్రం రుద్రాస్త్రేణతు దారుణమ్ । ఏతస్మిన్నేవకాలే తు ముమోచ భరత శ్శరమ్ ॥ 34
కాలానల సమ ప్రఖ్యం సుపుంఖం సఫలం తథా । రాజితం వైనతేయస్య పక్షైః శత్రు వినాశనమ్ ॥ 35
హత్వా రుద్రాస్త్ర వేగంతు రథస్థస్య మహీపతేః । బిభేద హృదయం రాజన్‌ః వర్మ భిత్వాఽథ కాంచనమ్ ॥ 36
రాజ్ఞశ్చ హృదయం భిత్త్వా భిత్త్వాచ వసుధాతలమ్ । స్నాత్వా రసాతలాంభస్సుతూర్ణం పున రపాగమత్ ॥ 37
గంధర్వరాజో ఽభి హతః శరేణా న త పర్వణా । రథనీడే ధను స్త్యక్త్వా మమార పరవీరహా ॥ 38

మార్కండేయుడనియె. సప్తమదివస యుద్ధమందు భరతుడును శైలూషుండును గదిసిరి. భరతుడు శైలూషునితో మనకు సేన లెందలకు? నాసైన్యమును నేను వారింతును. నీసైన్యమును నీవు నాపుము. మనమిద్దరమే రథములనుండిదిగి పోరుదము. మన రణవినోదమును రాజులెల్లరును మన సైన్యములును మీవ దేవతలును వినోదము దర్శింతురుగాక! నేను హతుడైన తర్వాత నా సైన్యము నీసైన్యముగాని పోరుగాక! అనినంత శైలూషుకు తనసేనను నిలిపివేసెను. భరతుడునట్లసేసి యిర్వురుందలపడిరి. బాణములను విసరికొనిరి. రక్తములందడిసి పూసిన కింశుకములట్లుండిరి. శస్త్రములు (మంత్రానుసంధితము) అస్త్రములు (అమంత్రకము) నెడనెడ మార్చుచు ననిసేసిరి. గంధర్వుడు సూర్యాస్తమయమైనంత చీకటిలో మాయాయుద్ధమారంభించెను. దానిచే లోకము నంధకారము గ్రమ్మెను. అపుడు భరతుని జంపుము. భక్షింపుము గూల్చుమను దారుణములైన కేకలు వినవచ్చెను. తేళ్లు పీతలును కోతులు కొండముచ్చులు నక్కలు పులులు సింహవ్యాఘ్ర వరాహములు ఘాతుకమృగములు భరతునిపై గురిసినవి. సౌరాస్త్రము చేవానిని గూల్చి యాతామసమాయాంధకారమును బటాపంచలు సేసెను. అంతపెద్దమబ్బుపట్టెను. అటుపైగంధర్వరాజు ఘోరములయిన శస్త్రములను నారాచములు అర్ధ నారాచములు చషకముఖములు వత్సదంతములు బల్లములు కర్ణి నాలీక గోముఖములను క్షురప్రములు అర్ధచంద్రములు వరాహవదనములు గదలు భుశుండి ప్రాసము భిండిపాలము పరశ్వథము హుడము గుడము లగుడము చక్రములు మఱిపెక్కింటి నుపయోగించి భరతుపై వేధించెను. భరతుడు వాని మాయను వాయవ్యాస్త్రముచే నశింపజేసెను. ఆమీద శైలూషుడొక పర్వతమయి మీదినుండి కొండవాగులను గురిసెను. ఆపార్వతీమాయను శ్రీమంతుడు భరతుడు వజ్రాయుధముచే హరించెను మాయను హరింపవాడు దారుణ రూపప్రదర్శనము సేసెను. యక్షరాక్షసపిశాచ పక్షి సింహవ్యాఘ్రగజాది రూపములగు నామాయారూపములను భరతుడు దివ్యాస్త్రములచే హతమొనర్చెను. ఆపై గంధర్వ మాయచే నతడు వింటికొప్పున శరాగ్రమున ధ్వజముపై రథముమీద గుఱ్ఱముపై మరిమరి యెట జూచిన నట లీనుడై చేసినయుద్ధముం దిలకించి భరతసైన్యములు సురాసురులును ఆశ్చర్య

చకితులై యతనిని గొనియాడిరి. అసురులట్టహాసములుసేసిరి. దానమరియు మిక్కిలి కుపితుడై రాఘవుడు నారాయణాస్త్రము నను సంధించి ప్రయోగించెను. అది సంహృతమగుటెరిగి రథమెక్కి రుద్రాస్త్రమును ప్రయోగించెను. అది కాలాగ్నియట్లు జ్వలించెను. సుపుంఖము సఫలమునై గరుడుని తెక్కలతోగూడియుండెను. అది రథమెక్కిన శైలూషుని బంగారపు కవచమును ప్రద్దలుసేసి వాని గుండెలు పగిల్చి భూమిలో జొచ్చి పాతాళోదకములందు స్నానముసేసి తిరిగియమ్ములపొదిలోనికి వచ్చెను. గంధర్వపతి యిట్లు హతుడై ప్రాణములు వాసి విల్లు జారవిడిచి రథముమోసలం ప్రాణములు విడిచెను.

పితరం నిహతం దృష్ట్వా శైలూష తనయా రణే । క్రోధ దుఃఖ పరీతాస్తే భరతం రణ కర్కశమ్ ॥ 39
వివ్యధు ర్నృపతిశ్రేష్ఠ! బాణై రాశీ విషోపమైః । ఆయుధై ర్వివిధాకారై స్తదా తేవై రణాజిరే ॥ 40
మాయాశ్చ వివిధా శ్చక్రు ర్భరతస్య విపత్తయే । అంతరిక్షంచ తై ర్వ్యాప్తం నానాహేతి ప్రవర్షిభిః ॥ 41
అస్త్రైశ్చ కేచి ద్భరతం ప్రవవర్షుః మహారథాః । భూరి భావాత్స యోధానాం మహాస్త్రాణాం మహాబలాత్ ॥ 42
ప్రతాపా దస్త్రజాలానాం సంశయం పరమంగతాః । కాలాస్త్ర మథ సాంవ ర్తం ముమోచ భరత స్తదా ॥ 43
తస్మా దస్త్రా త్సహస్రాణి శస్త్రాణాం నిర్యయు స్తదా । గంధర్వ సైన్యం సకల మస్త్రైస్తైః ప్రత్యహన్యత ॥ 44
శస్త్రైః కేచిత్ విశిరసః కృత్వా గంధర్వ సత్తమాః । వివాహాశ్చ కృతాః కేచిత్ కేచిద్రాజన్ ద్విధా కృతాః ॥ 45
కేచిద్విబాహవశ్చైవ కేచి ద్వ్యంగాశ్చ యాదవ! గంధర్వాణాంచ తాః కోట్య స్తిస్రః సంగ్రామ శాలినామ్ ॥ 46
క్షణే నాస్త్ర ప్రపాతేన భరతేన నిపాతితాః । గంధర్వసైన్యే నిహతే ప్రవవు ర్మారుతాః శివాః ॥ 47
పుష్పవర్షం పపాతాऽథ భరతస్యతు మూర్ధని । దిశశ్చ నిర్మలీ భూతా దేవానాం విగతం భయమ్ ॥ 48
తతో దేవ స్సహస్రాక్షః సర్వై స్సురగణై స్సమమ్ । విమానస్థో బభాషేదం భరతం ధర్మవత్సలమ్ ॥ 49
ఇంద్రః : పితామహ వరో ద్రేకా దవధ్యం దేవతా గణైః । హతవానసి శైలూషం దేవబ్రాహ్మణ కంటకమ్ ॥ 50
యస్మా త్తస్మా ద్వరం మత్తో గృహాణ రఘునందన ।
మార్కండేయః : శతక్రతో ర్నిశమ్యైత ద్భరతో వాక్య మబ్రవీత్ ॥ 51
భరతః : త్వమీశః సర్వ దేవానాం తవేదం సకలం జగత్ । అచిరేణైవ మరణం త్వదాజ్ఞా భంగకారిణామ్ ॥ 52
భవతీహ సదాలోకే నిమిత్తం మద్విధో జనః । ప్రజాపతి కృతం భేదం కో మోక్తుం జగతి క్షమః ॥ 53
వరశ్చయదిమే దేయః త్వయాదేవ ప్రదీయతామ్ । సింధోరుభయ కూలేషు కరిష్యామి పురద్వయమ్ ॥ 54
గంధర్వ రక్షితే దేశే పుత్రయోరుభయోః కృతే । నివేశం తద వాప్నోతు ప్రసాదేన శతక్రతో ॥ 55
మార్కండేయః : ఏవమస్త్వి త్యథోక్త్వైవ స్వర్లోకం వాసవో యయౌ । వాసవేతు గతే నాకం రాజా చిత్రరథ స్తతః ॥
గంధర్వాణాం మహాతేజాః భరతం వాక్యమబ్రవీత్ ।
చిత్రరథః : గంధర్వా నిహతా వీరా మదాజ్ఞా భంగకారిణః ॥ 57
త్వయాతే ధర్మనిత్యేన దేవ బ్రాహ్మణ కంటకాః । తన్మే సముద్ధృతం శల్యం దేవానాంచ ప్రియం కృతమ్ ॥ 58
తస్మా త్సభాజయిత్వా త్వాం యాస్యామిత్రిదివం పునః ।
మార్కండేయః : భరత స్తమువాచాథ గంధర్వా నిహతా మయా ॥ 59
తత ఏనంజనం తేషాం స్త్రియశ్చ పరిపాలయ । గంధర్వాః పరిపాల్యాస్తే తేషాం త్వం పరిపాలకః ॥ 60
మదీయేనానురోధేన విశేషా త్కర్తు మర్హసి । సర్వేషాం చ తథా స్థానం పర్వతే గంధమాదనే ॥ 61
పయాతా స్తవ తత్రస్థాః పాలయిష్యన్తి శాసనమ్ । ఏవం కరిష్య ఇత్యుక్త్వా పరిష్వజ్యచ పీడితమ్ ॥ 62
సర్వజ్ఞం భరతం శ్రీమాన్ గంధర్వస్త్రిదివం యయౌ ॥ 63

తతశ్చవానరాః సర్వే శక్రగౌరవయంత్రితాః । సంన్యవర్తంత సంగ్రామాత్ప్రహ్వాః ప్రాంజలయః స్థితాః ॥ 31
త్యక్తయుధాన్రణే జఘ్నుర్వానరాన్కుంజరా స్తథా । క్రుద్ధస్తేషాంమహేంద్రస్తు వజ్రేణ శతపర్వణా ॥ 32
పక్షాంశ్చిచ్ఛేద నాగానాం నిహతాయైర్వ పీముఖాః । భిన్న పక్షాంస్తదానాగా న్వాహనార్థంమహీతలే ॥ 33
ప్రదదౌలోమ పాదాయ తదాంగేశాయ పార్థివ । లోమపాదోఽపిన్నృపతి స్తదా తేషాంచికిత్సితమ్ । 34
శిక్షాం స్వస్త్యయనం చైవ చక్రీసూత్రనిబంధనమ్ । తతః ప్రభృతి లోకేఽస్మిన్వాహ నత్వంగతాగజాః ॥ 35
గుర్వీణీభిర్వ నస్థాభిఃకరిణీభిర్గజనేశ్వర । వనే వివర్ధితా వంశాః కుంజదాణాం పునః పునః ॥ 36
వనేష్వ పితదా జాతావిపక్షాః కుంజరోత్తమాః । భిన్న పక్షేషు జాతేషు ప్రభావేణ శతక్రతోః ॥ 37
వానరాశ్చజయం లబ్ధ్వా ప్రణిపత్య పురందరమ్ । స్థానానిజగ్ముః స్వాన్యేవరాజ్ఞా ఋక్షేణ పూజితాః ॥ 38
ఏవం విధైర భూత్తేషాం వానరాణాంతు కుంజరైః । యుద్ధమాసీన్మహా ఘోరం విజితాయత్రకుంజరాః ॥ 39
వానరాశ్చమహాభాగా కుంజరేంద్ర ప్రమర్దనాః । దైవయోగేన విజితేభరతాఽపియదృచ్ఛయా ।
క్షిప్రమేవోద్ధరిష్యంతిత్వాం సమేత్య సబాంధవమ్ ॥ 40
తస్మాన్నయుద్ధం మమరోచేతేతే రఘూద్వహేనా ప్రతిమేన రాజన్ ।
నయాత్మనా చప్రతిపూరుషేణ ధర్మాభిరామేణ జనప్రియేణ ॥ 41

ఇది శ్రీవిష్ణు ధర్మోత్తర ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే శైలూషం ప్రతి నాడాయన వాక్యే
గజవానర యుద్ధవర్ణనంనామ త్రిపంచశ దుత్తర ద్విశతతమోఽధ్యాయః ॥

గజవానర సంక్షయమైన సమర మా విధముగ సాగ సచ్చోటికింద్రుడు వచ్చెను. వచ్చి యా యిర్వురును వారించెను. అంతట వానరులందరు శక్రునిపై గల గౌరమునకు లోబడి రణము నుండి మరలిరి. వినతులై దోసి లొగ్గి నిలుపబడిరి. రణమునందు పోరులుమానిన వానరులను మదేభములుపైబడి క్రుమ్మినవి. అప్పుడింద్రుడు క్రుద్ధుడై నూరంచులు గల వజ్రముచే వానరముల౦ జంపిన యా యేణుగుల పక్షములను నరికివేసెను. (అప్పుడేనుగులకు ఱెక్కలుండె నన్నమాట.) ఱెక్కలు దెగిన యేనుగుల నపనీ తలమందలి అంగదేరాధిమతి లోమపాదున కిచ్చెను. ఆ రాజు ఆ గజముల చికిత్సతమును గజశిక్షను జేసి సూత్ర నిబంధనమైన స్వస్త్యయనము మంగళాచరణము గావించెను. అదిమొదలీలోకమున గజములు వాహనములయ్యెను. వనములందున్న గుర్విణులయిన కరిణులచే (మాలొందిన ఏనుగులచే) మరిమరి గజకంసముఅభివృద్ధి నొందింపబడెను. ఇంద్రప్రభావముచే ఱెక్కలుత్రెంపబడినవి. అప్పటి నుండియే గజములరణ్యములందు ఱెక్కలు లేనివై జనించినవి. అంచట్లు వానరములు కుంజరేంద్రముల మర్దించి తాము గెలుపొంది ఒక వేళ దైవ యోగమున భరతుః మీచే గెలువ బడెనేని తమంతతాము యాక్షణవచ్చి సబాంధవము నిన్నున్మారింప గలరు. అందుచే రాజా! న్యాయమూర్తి ధర్మాభిరాముడు జనప్రియుడును ఆ ప్రతి మానుడైన రఘూద్వహునితో నీయుద్ధము నా కభిమతము గాదు.

ఇది శ్రీ విష్ణుధర్మోత్తర మహాపురాణమందు ప్రథమఖండమున కుంజరవానర సంగ్రామమను
రెండువందలయేబదిమూడవ అధ్యాయము.

## రెండువందల ఏబదినాల్గవ అధ్యాయము - గంధర్వ ప్రేషణము

శైలూషఉవాచ : శ్రుతమేతన్మయా సర్వం యత్త్వయోక్తం పునః పునః ।
ప్రణిపాత మహంకర్తుంన శక్తోభరతాయతు ॥ 2
ఉద్యచ్ఛేదేవ ననమేదుద్యమశ్చైవ పౌరుషమ్ । అద్యసర్వ నిరుద్యోగం వనమే చేహకస్యచిత్ ॥ 2

అతిక్లేశేనయేఽర్థాఃస్యుర్ధర్మ స్యాతి క్రమేణచ । అరేర్వా ప్రణిపాతేన మాస్మ తేషు మనఃకృథాః ॥ 3
ఆజ్ఞాఫలం యదా రాజ్యం ప్రణిపత్యతదావరమ్ । కింనోరాజ్యేన కర్తవ్యం సామాన్యజన ధర్మిణా ॥ 4
ప్రణిపత్య నరః శత్రుం మానీ శౌండీర్య వర్జితః । కథంశక్నోత్యవస్థాతుం భార్యాదృగ్విషయేష్వపి ॥ 5
అరేర్వా ప్రణిపాతస్య సంగ్రామేమరణస్యచ । యదంతరంతద్భవతి బ్రహ్మహత్యాశ్వమేధయోః ॥ 6
మార్కండేయఉవాచ : శైలూషవచనం శ్రుత్వా తదానాడాయనోద్విజః ।
జగామ స్వగృహాయైవ హతంమత్వాజనేశ్వరమ్ ॥ 7
నాడాయనేతదాయాతే రాజాగంధర్వ సత్తమాన్ । సమాహూయాబ్రవీ త్కాంశ్చిత్కాంశ్చి త్తత్ర కృతాంజలీన్ ॥ 8
అవజ్ఞాయనరః శత్రుంక్షి ప్రమేవవినశ్యతి ।
తస్మాత్కార్య మవజ్ఞానంనకదా చిదరాతిషు । కేచిదయోధ్యాంగచ్ఛన్తు గంధర్వాబలదర్పితాః ॥ 9
ఆనయంతుస్త్రియః శీఘ్రం తత్రగత్వాచమాయయా । యేముఖ్యాః సైనికాస్తస్య భరతస్యసమత్విషః ॥ 10
సైనికానాంస్త్రి యస్తేషాంకృత్వా ప్రముఖతో రణమ్ । ఏవం విమనసాంతేషాం కర్తాస్మి కదనం మహత్ ॥ 11
ఘాతయిష్యామి భరతం హతసైన్య మనంతరమ్ । శిబిరంచాపరే యాన్తు భరతస్య సువిద్విషః ॥ 12
నిఘ్నన్తుయోధాన్యం సుప్తానాత్రౌ తత్రసహస్రశః । హతసైన్యం హనిష్యామి తతోఽహంభరతం రణే ॥ 13
రాజ్ఞోగృహంత థైవాన్యే ప్రవిశంతుమహాబలాః । నిఘ్నంతు తత్రసంసు ప్తాన్సైనికాంస్తు యుధాజితః ॥ 14
హతసైన్యం హనిష్యామి భరతం సయుధాజితమ్ । అదృశ్యైర్మాయయా గత్వాగంధర్వైర్బలదర్పితైః ॥ 15
యథోక్తమే తత్కర్తవ్యం వచనం మమసత్వరైః ।

శైలూషుడనియె. మఱల మఱల నీవు సెప్పినదది యెల్ల విన్నాను. భరతునకు ప్రణిపాతము సేయుటకు నేను శక్తుడను గాను. కష్టము మూసుకొని యుద్యమింపవలసినదే దండము పెట్టగూడదు. ఉద్యమమనగా పౌరుషము. ఇపుడు సర్వనిరుద్యోగముగ (చేతులు ముడిచికొని) నేనెవ్వనికిని దండము పెట్టను. అతి క్లేశముచేత ధర్మాతిక్రమణము చేత శత్రువుని కాళ్ళమీద పడుటచేత ప్రయోజనములు కలుగును (కలుగుగాక). వానిపై మనసుంపకుము. రాజ్యము ఆజ్ఞాఫలము. శాసించిపొందవలసినదెపుడైనదో (అడుకొనవలసినది గాదన్నమాట) అపుడు శత్రునకు ప్రణమిల్లి (పాదాలమీదబడి) చేకొన్నదియా సామాన్యజనధర్మముగల ఆ రాజ్యముతో మనమేమి చేయవలయును? అభిమానవంతుడు శౌండీర్యము విడిచి (శౌర్యము విడిచి) శత్రువునకు మ్రొక్కి మానవుడు కట్టుకొన్న పెండ్లాము దృష్టి లక్ష్యములందేని యెట్లు నిలువ శక్తుడగును. (సాధారణముగ మానినులు తేజశ్శాలిని ప్రతాపవంతుని ఎక్కువగ నాదరింపవలతురు. తేజోహీనుని దద్దమ్మను ధర్మపత్నియేని యీసడించునది దుస్సహమన్నమాట) శత్రువునెడ విధేయతకు రణమందు చావునకు నెంతయంతరమో (ఎడమో) బ్రహ్మహత్యకు అశ్వమేధమునకంత యంతరమున్నది. శైలూషునివచనమాలించి ద్విజుడు నాడాయనుడు భరతుని గడతేరినవాడయనుకొని తన యింటికే చనెను అకడట్లేగ గంధర్వపతి గంధర్వోత్తములం బిలిపించికృతాంజలులైన కొందఱింగొందఱిం గూర్చి యిట్లు పలికెను. మానవుడు శత్రువును అవమానించి యాక్షణము నశించును. అందువలన పగతుర యెడ నెన్నడు పరాభవము సేయరాదు. కొందఱయోధ్యకేగుడు. బలదర్పితులు మీరటకేగి శీఘ్రము మాయచేసి యచటి స్త్రీలను చెరపట్టి కొనిరండు ఆభరతుని యొక్క సేనానాయకులతనితో సమతేజస్వులెవరో వారిస్త్రీలను సైనికులయెదుటబడి పోరొనరించి లాగికొనిరండు. ఇందుచే మతిచెడిన వారితో నేను పెనుకదనము సేసెదను. సైన్యము హతమారిన తరువాత భరతుని నే జంపెదను. వేఱ కొందరు భరతునిశిబిరమునకువెళ్ళుడు. అట్లేరేయినిద్రలోనున్న యోధులను వేలమందినిజంపుడు. సైన్యమీల్గిన భరతునాపైననేనసనిం జంపెదను. అట్లే మఱికొందఱు మహాబలశాలులు రాజగృహముంజొరబారుడు. అక్కడ నిద్రవోవుచున్న యుధాజిత్తు సైనికుల హతమార్చుడు. సైన్యము హతమైన భరతుని యుధాజిత్తుతోగూడ నేలగూల్చెదను. గంధర్వులు బలదర్పితు లదృశ్యులై యీచెప్పిన నామాట సత్వరము కావింపవలయును.

ఏవముక్తాస్తు గంధర్వాః ప్రణిపత్య మహీపతిమ్ ॥ 16
రాజాజ్ఞాం శిరసాగృహ్య జగ్ముస్త్వరిత విక్రమాః । దినశేషేణ సంప్రాప్య యథోద్దిష్టం మహీక్షితా ॥ 17
వ్యచేష్టన్ని శిరాజేంద్రియథాజ్ఞప్తం చికీర్షవః । విసర్జ యిత్వాగంధర్వాన్ శైలూషోఽప్యథసత్వరః ॥ 18
ఆజ్ఞాపయత సైన్యానిశ్వోయుద్ధమితి పార్థివ । జగామచాస్తం సవితా కమలాని విశీలయన్ ॥ 19
ఛాదితేతమసాలోకే ప్రవృత్తా యామినీతథా ॥
గంధర్వరాజోఽపితదా విజహ్రే స్త్రీభిఃసహాంతః పురమేత్య సాకమ్ ।
గంధర్వ పుత్రాశ్చతథా విజహ్రుః శ్వోయుద్ధమిత్యేవ వివృద్ధ దర్పాః ॥ 20

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే గంధర్వ ప్రేషణం నామ
చతుష్పంచాశదుత్తర ద్విశతతమోఽధ్యాయః

ఇట్లానతీబడి గంధర్వులు మహీపతికి బ్రణమిల్లి రాజాజ్ఞను శిరసావహించి త్వరిత విక్రములై దినశేషమునకు (ప్రొద్దు గుంకునంతకు) రాజుద్దేశించిన చోటుచేరి రాజునాజ్ఞను నిర్వహింప పనిబూనిరి శైలూషుడును గంధర్వులంబంపి వెంటనే రేపు యుద్ధమని సేనల కానయిచ్చెను. రవి కమలములను వాడించుచు నస్తంగతుడయ్యెను. చీకటిగ్రమ్మ రాత్రి ప్రవర్తించెను. ఆప్పుడు గంధర్వ రాజును నంతఃపురమున కేతెంచి యంగనలతో విహరించెను. గంధర్వ కుమారులును రేపయుద్ధమని దర్పముప్పొంగ నటవిహరించిరి.

ఇది గంధర్వప్రేషణమను రెండువందల యేబది నాల్గవ యధ్యాయము.

## రెండువందల నలుబదిఐదవ అధ్యాయము - విరహిణీవర్ణనము-అద్భుత ఘట్టము !

మార్కండేయఉవాచ : ఆజ్ఞప్తాయేత్వయోధ్యాయాం గంధర్వాస్తేన భూభుజా ॥
అయోధ్యాంతే సమాసేదుర్ని శీథేలఘు విక్రమాః ॥ 1
మాయాచ్ఛన్నశరీరాశ్చ విచేరుస్తే మహీపతే । అయోధ్యాయా మహారాజ పరాంచ దదృశుః శ్రియమ్ ॥ 2
శశాంక కరశుభ్రాణి బహుభౌమాని యాదవ । దదృశుర్గృహముఖ్యాని శతశోఽథ సహస్రశః ॥ 3
సర్వరత్నోపపన్నాని శయనాసనవంతిచ । సువర్ణదామ చిత్రాణి ముక్తాజాల చితానిచ॥ 4
ప్రజ్వలద్భిర్మహా దీపైర్దీపితాని సమంతతః । బహుమాల్యాని ముఖ్యాని దీపోద్గారేణ పార్థివ ॥ 5
ప్రవిష్టా గృహముఖ్యేషు దదృశుస్తేషు మానవాన్ । చందనాగురుదిగ్ధాంగాన్ సర్వాభరణ భూషితాన్ ॥ 6
క్రీడమానాన్సహస్త్రీభిర్ది విదేవగణానివ । భరతానుగతానాంచ సైనికానాం గృహేషుచ ॥ 7
స్త్రీణాంభర్తృ విహీనానాం దదృశుర్బాలచేష్టితమ్ । కాచిన్నలతే భేశయనే నిద్రాముద్భ్రాంతలోచనా ॥ 8
ఆకులంశయనంచక్రే కాచిద్భూయో వివర్తనైః । మృణాల శయనేకాచిత్ కదళీపర్ణసంస్తరే ॥ 9
చందనం ధంద్రపాదేషు మృణాళవలయేషుచ । కామాగ్ని నాశాశక్తేషు కాచిచ్చక్రేతథా రుషమ్ ॥ 10
అశ్రుధారాని పతితాః కామాగ్ని పరిదీపితే । అంబరీషేతథా నాశం కస్యాశ్చిద్యాతి వక్షసి ॥ 11
కాచిన్మ మోహశయనే వర్ణయంతీ సఖీజనే। లబ్ధనిద్రాతదా దైవాత్ కాంత సంభోగజంసుఖమ్ ॥ 12
తాలవృంతాని లైఃశితై ర్వీజ్యమానా సఖీజనైః । దహ్యతాభ్యధికం కాచిత్స్వనిః శ్వాసవినిః సృతైః ॥ 13
స్వప్నే ఽపికాంత సంయోగ కారిణీహి సఖీమమ । దైవాన్మయిహతానిద్రా సాపికాచిదభాషత ॥ 14

కేయూరస్థాన సంప్రాప్తావ రాంగదవిభూషణా । కామక్షామవపుః కాచిజ్జగామ సఖిశోచ్యతామ్ ॥ 15
దత్త ధ్యానతయాకాంతే శోచ్య మానా సఖీజనైః । అవిజ్ఞానా త్తథాకా చిన్నా భాషత సఖీజనమ్ ॥ 16
చిత్ర భిత్తి గతం కాంతం కాచిచ్చాని మిషేక్షణా । బభూవ చిత్రన్యస్తేవ పశ్యంతీ విగతక్రియా ॥ 17

మార్కండేయుడనియె ఆరాజయోధ్యకు పంపిన గంధర్వులు తేలికనెగిరి యర్ధరాత్రి ప్రచ్ఛన్న మాయా శరీరులై చరించి అయోధ్యాపుర సౌందర్యముం జూచిరి. అందు లోగిళ్లు చంద్రకిరణ సమానములు తెల్లనివి. పెక్కు వాకిండ్లుగలవి. పందలు వేలు. సర్వరత్న సమృద్ధములు. ఇక్కడ రత్నములు మణులనవచ్చును. అదికాక యా యా వస్తువులలో మేలిరకములు గోరత్నము అశ్వరత్నము భార్యారత్నము పుత్రరత్నము లిత్యాదులనుగావచ్చును. చక్కని శయనములు (తల్పములు-పానుపులు సోఫాలు) మొదలయిన యాసనములుగలవి. బంగారు జాలరులు ముత్యాల పేరులతో నింపుగొన్నవి చక్కనివి దీపములచే నెల్లెడ వెలుగందినవి. దీపోద్గారముచే బహుళములయిన దీపమాలికలందలంకరింపబడెను. పాదరసపు బుడ్లు అమరించినందున వానియందు దీప కాంతులు ప్రసారమయి చూడముచ్చటగొల్పుచుండె నన్నమాట. ప్రతిష్ఠా గృహశ్రేష్ఠములందుమసలు జనులు చందనాగురులిప్తాంగులు సర్వాభరభూషితులు రమణీమణులంగూడి చదరంగము మొదలయిన వాడుచు స్వర్గపురమందు దేవగణములట్లు విలసించుచుండిరి. భరతువెంబడిం జనిన సైనికుల యిండ్లలో భర్తలు దరిలేని భామినులయొక్క (ప్రోషిత భర్తృకలయొక్క) హావభావములను దిలకించిరి. ఒకతె తల్పమందు వ్రాలి బెదరు చూపుల జూచుచు నిదురవోదయ్యె. ఒకతెలవ నిద్రపట్టక యట్టిట్టు దొరలి దొరలి పానుపు చెదరిపోజేసెను. ఒక భామిని తామరతూండ్ల పక్కపైని యరటాకుల సెజ్జపైపరుండి కుములుచు చందనము చంద్రకిరణములు తామరతూటి చుట్టలునుం గామాగ్నినార్పజాలవైనంత వానిపై రోషపడెను. జడిగా కన్నీరు కురిసి కామాగ్నింగ్రాగిన బొమ్మసంబడి కాలినమంగలముపైనట్లింకిపోవు చుండెను. ఒక ముగ్ధ దైవికముగ యించుక నిద్రపట్టి యందనుభవించిన కాంతుని సంభోగ సుఖమును సఖీజనమునకు వర్ణించి చెప్పుచు తల్పమున మూర్ఛపోయెను. ఒక సుందరి సఖీజనము తాటాకు విసనకర్రల చేగొని విసరుచుండ తన వేడినిట్టూర్పులచే దానంతముందుకంటె మిక్కిలిగ వేగింపబడెను. ఒక విరహిణి కలలోనైన నావల్లభుని సంగతింగూర్చుచుండెడిది నానెచ్చెలి యానిద్రనుగూడ దైవము మాయముసేసినాడు. అంగదములు కేయూరములు పెట్టుకొనిచోటికి వచ్చినంతగా కామవశమున మిక్కిలి చిక్కిపోయిన మేనితో నొక కామిని చెలిమికత్తె లారాటపడవలసిన దైనది. కాంతునదేపనిగ తలపోయుచు మైమరచి సఖురాండ్రలమటింప వలసినదైయుండి వారుపడు నారాట మించుకైన తెలియక వారితో నేమియుం బలుకకుండెను. ఒక కొమ్మ యెదుట చిత్తరువునందున్న కాంతుని తెప్పలిడక చూచుచు చిత్తరువునం బొమ్మవలె నిశ్చేష్టయయ్యెను.

ఇతి గంధర్వ ముఖ్యానాం పశ్యతాం రజనీముఖే । నాసీత్స్త్రీ హరణే శక్తిః ప్రభావా ద్రాఘ వస్యచ ॥ 18
హితేచ్ఛు రాసాం సయదా నివిష్టో దేవేశ్వరశ్చ క్రధరో నృరూపీ ।
తతః ప్రభావో నబభూవ తేషాం హర్తుంస్త్రి యశ్చారు శశాంక వక్త్రాః ॥ 19

ఇతి శ్రీ విష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే విరహిణీ వర్ణనంనామ
పంచ పంచాశదుత్తరద్విశతతమోఽధ్యాయః.

ఆ రేయి తొలిజామున నీవిధముగ నున్న అయోధ్యా నగరాంగనలం గనునా గంధర్వ వీరులకు జాలిచేతను రాఘవుల ప్రభావము చేతనుగూడ యాయబలలహరించికొనిపోగల శక్తి లేక పోయెను. ఈ అయోధ్యా పురవాసులకు మేలుగోరి దేవాధినాథుడు చక్రధరుడు నరరూపమున నెప్పుడవతరించెను దాననా గంధర్వులకు పరమ సుందర చంద్రబింబాననా బృందమును హరించుకొనిపోవు ప్రభావము లేదయ్యెను.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణమందు ప్రథమఖండమున విరహిణీవర్ణనమను రెండుపందల యేబదియైదవ అధ్యాయము.

# రెండువందల ఏబదియారవ అధ్యాయము - విరహివర్ణనము

మార్కండేయ ఉవాచ:- గంధర్వాః కటకంకే చిద్వి విశుర్భ రతస్యతు ।
పురస్కృత్య నృప స్యాజ్ఞాంసై నికానాం వధేప్సవః ॥ 1
మాయాచ్ఛన్న శరీరాస్తే దదృశుర్ని శిచే ష్టితమ్ । ప్రాతః సమరకా మానాం కాంతో త్కంఠితచే తసామ్ ॥ 2
మనోరథమ థారూఢః కశ్చి త్ప్రాణేశ్వరీం వ్రజన్ । నలేభే శయనే నిద్రాం కల్యే రణస ముత్సుకః ॥ 3
కశ్చిచ్చంద్ర కరస్పర్శాత్ విశేషపరి పీడితః । దదర్శ చంద్రం దివ్యాక్షి ప్రియా వదననిర్జి తమ్ ॥ 4
కశ్చిచ్చ చింత యన్నేవం ప్రియాం ప్రాణధనేశ్వరీమ్ । ఉత్తాన శయనం చక్రే తారకాగణ కందివి ॥ 5
పశ్యన్నా నిష్కృతం దిశ్యం పత్రచ్ఛేదం విసర్జితమ్ । ప్రియయా స్వకృతం కశ్చిన్ముదా న యతి శర్వరీమ్ ॥ 6
నిర్వే దేనాతి రమ్యేణ దహ్యతే చంద్రరశ్మిభిః । కశ్చిద్వి హీన స్తన్వంగ్యా శయనీయేఽపి ఖిద్యతే ॥ 7
స్వప్నోపలబ్ధ తన్వంగీ సమాగమ మనోరథః । సుప్తోఽను మితో గంధర్వైః కశ్చిద్దో మాంచ సంభవాత్ ॥ 8
ప్రియాం సంప్రేషితాం ప్రేష్య సమాలా పపరాయణః । నవేద కశ్చిద్దా జేంద్ర గతామపి విభా వరీమ్ ॥ 9
జ్వలం తమ నిశం కశ్చిచ్ఛరీరే విరహా నలమ్ । సహసాశ మయా మాస ధ్యాయంశ్చ ద్రముఖీం ప్రియామ్ ॥ 10
శ్యామాం వికంచు కాంతన్వీం యూనాం ప్రాణా పహారిణీమ్ । ప్రియాంచ ఖడ్గ యష్టిం చ కశ్చిత్స్మ రతి సూత్సుకః ॥
సగుణాంతను మధ్యాంచ నవకాంచన భూషణామ్ । సస్మార దయితాం కశ్చిచ్చాప యష్టిం తథై వచ ॥ 12
విచింతా నపి గంధర్వా భరతస్య చసైని కాన్ । నశేకు రాధర్ష యితుం భరతస్య సమాశ్రయాత్ ॥ 13
అన్యేఽపి యేదేవ వర స్య విష్ణోః స్మరంతి నిత్యం యదునాథ పాదౌ ।
గంధర్వ యక్షాసుర రాక్షసే భ్యో భయం నతేషాం భవతీ హ కించిత్ ॥ 14

ఇతి శ్రీ విష్ణుధర్మో త్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే విరహివర్ణనం నామ షట్పంచా శదు త్తర ద్విశతతమోధ్యాయః.

మార్కండేయుడనియె. తమరాజు నాజ్ఞనుబట్టి కొందరు గంధర్వులు సైనికులం జంపగోరి భరతుని కటకముం బ్రవేశించిరి మాయచే నెరికిం గనపడకుండ మరునాడుదయమే సమరము సేయగోరి రాత్రివేళ దమ ప్రియురాండ్రపై దవిలిన మనస్సుతో నాసైనికులు చేయు చేష్టలంజూచిరి. ఒక సైనికుడు మనోరథములను రథమెక్కి ప్రాణేశ్వరి వంక నేగుచు వేకువనే రణముసేయ నుత్సుకుడై యారేయి నిదురపోడయ్యె. ఒక యోధుడు చంద్రకిరణములు సోకి యెక్కువ బాధగొని తన విశాలనయన వదన సౌందర్యమున కోడిపోవు చంద్రుని జూచుచుండెను. ఇంకొకడు తన ప్రాణధనేశ్వరిం దలచికొనుచునే నింగింజుక్కల లెక్కించుచు వెల్లగిల పరుండెను. మరొకడు ప్రియురాలి కెడబడి (యొకవిధముగా) మిగుల ముచ్చటైన నిర్వేదముతో (బాధతో) చంద్రకిరణములచే దహింపబడుచున్నాడు. మెత్తని పాన్పునంగూడ ఖేదబడుచున్నాడు. కలలో లభించిన రమణీమణితోడి సమాగమము ముచ్చటవడి యొకడుపరుండి మేనుగగుర్పొడువనదిచూచి గంధర్వులచే నితడు ప్రియోత్కంఠితుడైనాడని ననుమానింప బడుచుండెను. తనకడకు బంపబడగా వచ్చిన ప్రియురాలింగని ముచ్చటలాడు వేడుకందవిలిరేయి గడచినదనియే (తెల్లవారినదని) యెఱుగడయ్యె. ఒకడు తన మేనిపై ననిశము జ్వలించుచున్న విరహాగ్నినాచంద్రాననం దన ప్రాణేశ్వరింధ్యానించుచుం దటాలునశమింపజేసి కొనెను. శ్యామను = నిండుజవ్వనిని వికంచుకాం = తొడిగివిప్పుకొన్న దానిని యువకుల ప్రాణములం గొల్లగొనునది తన్వని (సుకుమారమృదుశరీరము) తన ప్రాణప్రియను కత్తినింగూడ యొకసారి యుత్సుకుడై ఒక వీరుడు జ్ఞప్తి సేసికొనుచుండెను (అనగా ఆలాటి సుందరి జవ్వ

నిందలచియా పొందులేకపోయెనను నిర్వేదముతో తన బ్రతుకెంచుకని యదేసమయములో ప్రాణములకు దెగించి కత్తిని జ్ఞప్తి చేసికొన్నాడని యర్థము. ఇది మన్మథదశలో పదియవ మరణదశను సూచించుచున్నది) ఇంతేకాక; శ్యామాం = శ్యామలవర్ణనము గలది వికంచుకాం = యొఱనుండితీసినది; తన్వీం = పలుచనిది (చుఱకత్తియన్నమాట) యోధయువకుల ప్రాణములందీయునది. అని ఖడ్గపరమైనశ్లేష-దీనిద్వారా విరహమందు తన ప్రియరాలు తనకు చురకత్తివోలె బాధాకరమైనదని యుపమాలంకారధ్వని తన మేనిపై నంటిన ప్రియురాలి పత్రచ్ఛేదమును పచ్చబొట్టు మొదలగు శృంగారరేఖలను రతివేళతనమేనిపై నంటుకొని ముద్రపడిన దానిని పొరపాటున దాను తుడుచుకొనిన దానిని జూచికొనుట నారేయి యానందముతో గడపెను. ఇంకొకయోధుడు సగుణాం = గుణవంతురాలు తనుమధ్యాం = సన్నని నడుముగలది నవకాంచన భూషణాం = వినూతన సువర్ణాభరణను తనప్రాణసుందరిని, అదేవిధముగ (శ్లేష) సగుణాం = నారితోగూడినది తనుమధ్యాం = నడుమసన్న ముగనున్నది. కాంచనభూషణాం-బంగారు తొడుగుగల చాపయష్టిని ధనుర్దండమును విండిని ఏకరూపమున స్మరించెను. శ్లేషాలంకారము ఇట్లు పరధ్యానములోనున్న వారింగూడ భరతసైనికులను భరతుని సమాశ్రయము వలన (రఘువీరుని యండనున్నారుగావున) గంధర్వులు బెదరింపజాలకపోయిరి. ఓరాక్షస ప్రభూః మఱియు నెవ్వరేని దేవ దేవుడు విష్ణువుయొక్క పాదములను నిరంతరము స్మరింతురు వారికి గంధర్వ యక్షాసుర రాక్షసుల వలన నిక్కడ భయము గల్గదు.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణమందు ప్రథమఖండమున విరహవర్ణనమను రెండువందల యేబదియారవ అధ్యాయము.

## రెండువందల ఏబదియేడవ అధ్యాయము - నిశోపభోగవర్ణనము

మార్కండేయ ఉవాచ - అథరాజ గృహాఖ్యంతు నగరం యే విసర్జితాః ।
గంధర్వా దదృశు స్తత్ర పుర శ్రియ మనుత్తమామ్ ॥ 1
చంద్రసా పత్న్య భూతాని గృహముఖ్యాని సర్వశః । దదృశుర్బహు రత్నాని బహు ధాన్య ధనానిచ॥ 2
పురోద్యానాని రమ్యాణి దదృశుశ్చ సమంతతః । అలంకృతాని వాపీ భి ర్ద్రుమషం డైశ్చ యాదవ ॥ 3
ఉద్యానేషు విచిత్రేషు నర ముఖ్యానుగా మినామ్ । పశ్యంతి తత్ర సంఘాని గంధర్వాః పానపాయినామ్ ॥ 4
వల్ల కీనాం నినాదేన గీతేన మధురేణచ । ఏకతామి వసం యాతం చారు షట్పదశింజితమ్ ॥ 5
వేశ్యా శ్చైవో పనృత్యంతి క్వ చి త్త త్రచ కాముకాన్ । క్వచిత్సా భరణాః సుప్తాః కాంతైః సహమ దోత్కటాః ॥ 6
సుప్తానాం నరనారీణాం గంధర్వా స్తత్రచేష్టితమ్ । దదృశుర్బహుదారాణాం మాయాచ్ఛాదిత విగ్రహాః ॥ 7
గాయంత్యన్యేరు దంత్యన్యే హసంత్యన్యే తథైవచ । ఆశ్లిష్యంతి తథైవాన్యే మదమత్తాః పరస్పరమ్ ॥ 8
భాషంతే కేచిదవ్యక్తం విహ్వలార్తాః పదే పదే । శయనే భ్రమమాణైశ్చ క్వచిదస్థితదృష్టయః ॥ 9
కామినీ స్కంధ విన్యస్త బాహవశ్చ తథా పరే । కలహం చక్రిరే చాన్యేస్తువంత్యన్యే నిరర్థకమ్ ॥ 10
స్థలమాన పదాయాంతి స్థానం హృద్యనవస్థితమ్ । ఆహ్వయంతి గణాన్కేచి త్ప్రణమంతి తథాపరే ॥ 11
ఏవం సర్వజనాకీర్ణే నగరే గీతనాదితే । దదృశు ర్గృహ ముఖ్యేషు నరనారీ విచేష్టితమ్ ॥ 12

మార్కండేయు డనియె. రాజగృహమను నగరమునకు బంపబడిన గంధర్వులక్కడ పరమోత్తమనగర సౌందర్యముం జూచిరి. అక్కడ గృహరాజము లంతట చంద్రునికిసపత్నములు (సాటివి) బహురత్నములు బహు ధనధాన్యములు పురోద్యానములెల్లడ పరమ రమ్యములు బావులతో తరుషండములతో నలంకృతములు. ఆ విచిత్రోద్యానములందు నరోత్తములను వెంటజను వారి (ననుచరులయొక్క) సంఘముల మద్య పానము సేసిన వారిని వారుగనిరి. చక్కని తుమ్మెద ఝుంకారము వీణధ్వనితో

మధుర గీతముతో (శ్రుతిగలిసినట్లు) ఏకమైనట్లుండెను. అక్కడ కాముకులముండొక చోట వేశ్యలు నృత్యముసేయుచున్నారు ఒకచోట మదోత్కటలై యాభరణములతోడనే కాంతులతో నిద్రవోవుచుండిరి. గంధర్వులు తమరూపములను మాయంగప్పుకొని బహుదారులయిన = అనేకమంది భార్యలుగల పురుషులయొక్క అనేకులకు భార్యలయినవారి స్త్రీలయొక్క శృంగారచేష్టలను. దిలకించిరి. కొందరు పాడుచున్నారు. కొందరు రోదించుచున్నారు కొందరునవ్వుచున్నారు. మదమత్తులై యుండొరులం గౌగలిం చుకొనుచున్నారు. పదము పదమున (క్షణ క్షణము) కామవివశులై కొందఱవ్యక్త సంభాషణము లొనరించుచున్నారు. బెదరుచూపులం గొందరు తల్పముల ందట్టిట్లు దొరలుచున్నారు. కామినుల కంఠములంబాహువుదగిలించి (కంఠాశ్లేషముసేయుచు) కొందరు వృథాకలహమాడుచున్నారు. కొందరూఱక పొగడుచున్నారు కొందఱడుగులు దడబడ (పడుచు లేచుచు) అనికోనిచోటికేగుచున్నారు కొందరు గుంపులను బిలుచుచున్నారు కొందరు ప్రణమిల్లుచున్నారు. ఇట్లు సర్వజన సమ్మర్దము గీతప్రతిధ్వనితమునైననగరమందు మహాభవనములందు నరనారీ చేష్టితమునిట్లు చూచిరి.

సంచోద్యమానా దూతీభి స్త్వరాకృత మృజాః స్త్రియః । యాంతి కాంతా సుసంభ్రాన్తా మదపాన సముత్సుకాః ॥ 13
వపుఃకాశ్చి త్ప్రియైఃసార్ధం పానం మదసమీరణం । పాయ యంత్యః పరాః కాంతాన్ భోజయంత్యపరాః ప్రియాన్ ॥
ప్రాసాదేషు విచిత్రేషు తథా వాతాయనేషుచ । రతిశ్రాంతా స్తథా సుప్తాః కాశ్చిత్కాంతైః సహస్త్రియః ॥ 15
కాచిద్గౌరీ ప్రియం శ్యామమాలింగ్య శయనే స్థితా । ఉత్పల స్రగివాభాతియుక్తా జాతి స్రజాసహ ॥ 16
గౌరీగౌర సమాశ్లిష్టా కాచిదాభాతిసుందరీ । ఆలింగితా చంద్రకరై శ్చంద్రకాంతశిలా యథా ॥ 17
శ్యామాశ్యామ సమాశ్లిష్టా కాచిదాభాతి పార్థివ ! పయోదపంక్తిర్గగనే యథా పార్థివసోదకా ॥ 18
అలీకసుప్తమ ప్రౌఢా కాచిచ్చుంబయతే ప్రియమ్ । ప్రియేణ గాఢ మాశ్లిష్టా విలక్ష ముదితాఽభవత్ ॥ 19
కాచిచ్చవనితా ప్రౌఢా కర్పూరరజసా స్వయమ్ । అవాకిరతి కాంతాంగం రతిస్వేద పరిప్లుతమ్ ॥ 20
పశ్యేమాం తారకాం చంద్రోహ్యంకే నాలింగ్య తిష్ఠతి । ఇత్యాహదయితం కాచిత్ప్రౌఢారతిసుఖార్థినీ ॥ 21
కాచిదూరుపరామర్శాద్విదిత్వా సురతార్థినీ । కాంతే నాలింగితా గాఢం ముదితే నరిరంసునా ॥ 22
కాంతేన కాచిద్దష్టౌష్ఠీ చుంబనాయార్పితేముఖే । నయాస్యేతవవిశ్వా సంభూయశ్చే దన్యథాకృథాః ॥ 23
కాచిత్ప్రసుప్తా కాంతేన పరామృష్టారతార్థినీ । కాంత మాలింగితాత్యర్థం త్యక్త నిద్రాస సంభ్రమా ॥ 24

దూతికలు ప్రేరేప పురుషులు స్నానాదులు తొందరగ సేసి మదపాన సముత్సుకులై సంభ్రమమున కాంతల యెడకు జను చున్నారు. కొందరు మదవతులు ప్రియులతో మత్తుమాటలాడుచు (లేదామదభరిత (మంద) వాయువులు వీచుచుండ) పానము సేయు చున్నారు. కొందరుప్రియలం ద్రాగించుచున్నారు భోజనములు సేయించుచున్నారు విచిత్రప్రాసాదములందు వాతాయనములందు కిటికీలందు రతిశ్రాంతలై స్త్రీలు కాంతులతో నిదురవోవుచున్నారు. ఒక గౌరి గౌరవర్ణఖ భవర్ణయైనస్త్రీ శ్యాముడైన ప్రియుని (నల్లని వానిని) పాన్పుపై కౌగిలించికొని జాజిపూలమాలతో గూడిన నల్లగలువపూల మాలవలె భాసించెను. అట్లే గౌరియొకతె గౌరశరీరుని నాయ కుని గౌగలించికొని చంద్రకిరణములతోడి చంద్రకాంతమణివోలెదీపించెను. శ్యామయొకతె శ్యామలమూర్తి నాలింగనముసేసి నింగిని సజలజలదపంక్తివోలె రంజిల్లెను. దొంగనిద్రవోవుప్రియునొక అప్రౌఢ (మధ్యమనాయిక) ముద్దువెట్టెను. ఆ ప్రియుడుగాఢా లింగనముసేయ విలక్షముదితయయ్యెను. మైమరపుగలుగునంతగ నానందపడెను. ఒక్క ప్రౌఢాంగన రతి వలనిచెమటందడిసిన కాంతునిమేనిపై కప్పురము వెదజల్లినది. రతిసుఖముకోరి యొకప్రౌఢ చూడుచూడు; ఇదిగో చంద్రుడీతారకను (చక్కనిచుక్కను) అంకముచే = తొడలతో గౌగలించుకొనుచు (అంకము = చంద్రుని కళంకమని శ్లేష) నిలిచినాడు ఒకతె తొడలురాయుచు తాను సురతార్థినియైయున్నట్లు గ్రహించి ముదమందిన రతిక్రీడార్థియైన వల్లభునిచే బిగ్గ గౌగలించుకొనబడెను. ఒకతె ముద్దుపెట్టుటకు తన మొగమందీయ ప్రియుడు పెదవి కొఱుక నింకొకమారింకొక తీరునం జేసితివేని నిన్ను నమ్మనని బెదరించెను. (నేనుముద్దిడనీవు

ముద్దిడుట సబబుకాని సబబుతప్పి యింకొక్కతీరున ననగా పెదవి కొఱికితివి నీవు విశ్వాస పాత్రుడవుగావని వలపుగినుకం దెప్పినదని భావము) ఒక సుందరి నిద్రవోయి ప్రియునిచే లేపబడి రత్యర్థినిగావున తాను సంభ్రమముతో (తొట్రుపడుచు) నిద్రవీడి సుందరుని గట్టిగగౌగలించికొలెను.

ఇత్యేవమపి విశ్వస్తా న్సైనికాంస్తాన్యుధాజితః । హర్తుం నశేకుర్గంధర్వా భరతస్యసమాశ్రయాత్ ॥ 25
ఏషాంపురా సన్నిహితః సవిష్ణుర్మహానుభావో రఘువంశగోప్తా ।
తేషాంపురే నాస్తి భయం నరేంద్ర గంధర్వయక్షాసుర పన్నగే భ్యః ॥ 26

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయవజ్రసంవాదే నిశోపభోగవర్ణనోనామ
సప్తపంచాశదుత్తర ద్విశతతమోఽధ్యాయః.

ఈ విధముగ విశ్వసించి యుద్ధమిప్పుడు లేదని నమ్మకముతో పరామరికనున్నను యుధాజిత్తు భరతునాశ్రయించిన కతన నా సైనికులను గంధర్వులు హరింపలేరైరి. మహానుభావుడు విష్ణువు రఘువంశరక్షకుడై యెవరి పురమందు (శరీరమందు) సన్నిహితుడై యుండును వారిపురమందు శ్లేషగంధర్వయక్షా సురపన్నగులవలన భయముండదు.

ఇది శ్రీవిష్ణుధర్మోత్తర మహాపురాణమందు ప్రథమఖండమందు నిశోపభోగ వర్ణనమను
రెండువందల యేబది యేడవ యధ్యాయము

## రెండువందల యేబదిఎనిమిదవ అధ్యాయము - గంధర్వసైన్యప్రస్థానము

మార్కండేయ ఉవాచ : అయోధ్యాత స్తదాభ్యేత్య గంధర్వాః శిబిరాత్తథా ।
తథారాజగృహాత్సర్వే శైలూషాయ న్యవేదయన్ ॥ 1
నవిగ్రహ కథా తత్ర నరక్షా కాచిదీదృశీ । కేవలంతు ప్రభావేణ రామస్య భరతస్యచ ॥ 2
నాస్మాభిః కిం కృతం రాజన్ ప్రహర్తుం క్వచిదిత్యపి ; యత్తత్ర శేషం కర్తవ్యం తత్కరోతు మహీపతిః ॥ 3
ఏవముక్తః సగంధర్వై ర్యామినీ విగమే తదా । యోగయోగ మతి క్షిప్రమాజ్ఞాపయత సత్వరః ॥ 4
భేరీసాం నాహికీచైవ తతః శీఘ్రమహన్యత । యస్యాః శబ్దేన గంధర్వా రాజద్వార ముపాగతాః ॥ 5
గజవారేణ మహతా తురగాణాం బలేనచ । రథైశ్చ మేఘసంనాదైః పత్తిభిశ్చమదోత్కటైః ॥ 6
క్ష్వేడితా స్ఫోటితరవైః శంఖ భేరీ నినాదితైః । హ్రాదేనగజ ఘంటానాం గజానాంచైవ బృంహితైః ॥ 7
హేషితైస్తురగాణాంతు బభూవతుములం మహత్ ।

మార్కండేయుడనియె : అప్పుడయోధ్యనుండి శిబిరమునుండి రాజగృహమునుండియు గంధర్వులు శైలూషునికి నివేదించిరి. అక్కడయుద్ధముమాటలేదు, ఈలాటి రక్షయు (రక్షణకార్యక్రమమును) లేదు. కేవలము రామునియొక్క భరతుని యొక్క యుంప్రభావము రాజా! అయోధ్యను ముట్టడింప నెక్కడనేని మాచేత జరుపబడనిదటు మిగిలియున్న పని ప్రభువు గావించుగాక! యని గంధర్వులు పలుక తెలవారినంత భరతుడు యోగయోగునికి మిక్కిలి తొందర యుద్ధసన్నాహభేరి మ్రోయింపుమని యానయిచ్చెను. ఇచ్చినదే తడవది వాయింపబడెను. ఆసడి వినుచే తడవుగ గంధర్వులు పెద్ద గజవారముతో నశ్వబలముతో మేఘములురిమినట్టి సడిగల రథములతో పదాతివర్గముతో వీరాలాపములతో అస్ఫోటితరవములతో, (జబ్బలు చఱచినప్పటిధ్వనితో శంఖ భేరీనినాదములతో గజఘంటాధ్వనితో నేనుగు బృంహితములతో గుఱ్ఱముల సకిలింపులతో నయ్యెడతుములధ్వని యయ్యెను.

శైలూషోఽపి తదా స్నాత్వా హుత్వాగ్నిం ద్విజపూజనమ్ ॥ 8
కృత్వా వినిర్యయౌ శ్రీమాన్ వరచందన భూషితః । మౌలీ వపుష్మాన్సం నద్ధః స్రగ్వీరు చిరభూషణః ॥ 9

ఆమపాత్ర ప్రతీకాశైస్తురగైర్యోజితం రథమ్ । ఆరురోహ మహాతేజా విమానం సుకృతీయథా ॥ 10
యథోక్తస్య రథస్యాసీత్పురోరణ విశారదః । నరకేతురితిఖ్యాతస్త్రిషులోకేషువిశ్రుతః ॥ 11
కేతౌతస్యరథేభాతి వసంతో మూర్తి మాన్కృతః । తతఃససహసైన్యేన నిర్యయౌ నగరాద్బహిః 12
వ్యూహంచ సర్వతో భద్రం సమాధాయబలంతథా । కృత్వా ప్రత్యైక్షత తదాభరతాగమనంరుషా ॥ 13
సైన్యేన మహతా రాజన్ భాస్కరస్యోదయం ప్రతి । 14
ఆత్తాయుధాఃక్ష్వేడిత శంఖనాదై రానంద యంతః సుహృదాంమనాంసి ।
గంధర్వ ముఖ్యారణచండవేగాః ప్రతీక్షమాణా భరతస్యతస్థుః ॥ 15

ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే
గంధర్వసైన్య వర్ణనంనామాష్టపంచాశదుత్తరద్విశతతమోఽధ్యాయః ॥

శైలూషుడును స్నానముసేసి, యగ్నినివేల్చి ద్విజులబూజించి మంచిగంధము పూసికొని కిరీటము పెట్టికొని సన్నద్ధుడై పూలమాలలువైచికొని రుచిర భూషణుడై ఆమపాత్రమట్లు (మట్టికడవబోలిన) నల్లని గుఱ్ఱములు పూన్చిన రథమును పుణ్యవంతుడు విమానమునట్లెక్కి దండయాత్రకు వెడలెను. ఆరథమునకుముందు రణవిశారదుడు నరకేతువనుపేర త్రిలోకప్రసిద్ధుడుండెను. అతని జెండాపై వసంతుడురూపుగొని దీపించును. అట్లతడు నగరమువెలికి సేనలతోజని సర్వతో భద్రమను వ్యూహముంబన్ని సైన్యము నందు నిలిపి రోషముగొని భరతాగమమునకై ప్రతీక్షించెను (ఎదురుసూచెను) మహాసైన్యముతో సూర్యోదయమగుసరికి ఆయుధములు పూని క్ష్వేడితములతో (అట్టహాసములతో) గర్జనములతో సుహృచ్చిత్తముల మిత్రుల మనస్సులను ఆనందపఱచుచు రణప్రచండ వేగులయిన గంధర్వవీరులు భరతునికై యెదురు సూచుచునిలువబడిరి.

ఇది గంధర్వ సైన్యప్రస్థానమను రెండువందలయేబది ఎనిమిదవ అధ్యాయము

## రెండువందల యేబదితొమ్మిదవ అధ్యాయము - భరతసైన్యప్రస్థానము

మార్కండేయ ఉవాచ: విబుద్ధా యామినీ శేషే సర్వ ఏవ మహీక్షితః ।నిర్యయుర్నగరాకారై రథైః సంగ్రామలాలసాః ॥
బలేన చ తురంగేణ నానా వాదిత్ర వాదినా । వందిభిః స్తూయమానా శ్చ వంద్య మానాశ్చ సైనికైః ॥ 2
పృథ క్పృథక్స ముద్ధానగర ద్వార మాగతాః । కృత్వా చావశ్య కం సర్వం భరతోఽపి మహాయశాః ॥ 3
రథేన కాంచనాంగేన నిర్యయౌ నగరాద్బహిః । యంతా రథస్య తస్యాసీత్ యుథాజిన్మాతులః స్వయమ్ ॥ 4
విరరాజ ధ్వజం తస్యకో విదార మహాద్రుమమ్ ! సతేన రథముఖ్యేన బహిర్నిర్గత్య పార్థివః ॥ 5
సమేత్య పార్థివైః సర్వైః పూజ యిత్వా చతాన్నృపాన్ । వజ్రం కృత్వా మహావ్యూహం ప్రయ యౌలఘు విక్రమః ॥
ప్రయాణే తస్య సైన్య స్య కంపం తీవ వసుంధరా । శబ్దేన మహతా తస్య దీర్య తే చ న భస్తలమ్ ॥ 7
బభూవర జసై వాన్యః నిశాకాలః సుదారుణః । నృపాభరణ మాణిక్య తేజ సాభు విరాజితా ॥ 8
రజోఽంధ కారేఽపి చమూః స్వాప్రయాతియథా సుఖం । సగత్వా దూర మధ్వానం సూర్యస్యోదయనం ప్రతి ॥ 9
ఆ ససాద మహాసైన్యం గంధర్వాణాం దురత్యయమ్ । 10
తౌసైన్య తోయౌఘ మహాదురంతౌ సంహారనాగా వివతుల్య రూపౌ ।
బలార్ణ వౌగాధ మథ ప్రహారం ప్రచక్ర తుర్మన్యు వశాను యాతౌ ॥ 11

ఇతి శ్రీ విష్ణుధర్మోత్తరే ప్రథమఖండే మార్కండేయ వజ్రసంవాదే భరతసైన్య
నిర్యాణంనామైకోన షష్ట్యుత్తర ద్వి శతత మోఽధ్యాయః.

మార్కండేయుడనియె:- రేయి తుదిజామున నెల్ల మహీపతులు మేల్కాని సంగ్రామ లాలసులై నగరములంతలైయున్న రథములెక్కి చతురంగ బలముతో నానావాద్య ఘోషములతో వందిమాగధులు పొగడ సైనికులు మ్రొక్క వేర్వేర బాగ సన్నద్ధులై నగర ద్వారమునకు వచ్చిరి. భరతుండును ప్రస్థానావశ్యకమైన మంగళాచారాది సర్వమునొనరించి కాంచనమయ రథమెక్కి నగరము వెలికి వెడలెను. భరత మాతులుడు యుధాజిత్తు స్వయముగ సారథ్యము చేసెను. ఆతనికోవిదారధ్వజము సొంపుగ విలసిల్లెను. అతడా రథముపై వెలికి బయలువెడలి రాజులందరినిం గలిసికొని అందరినిం దానుబూజించి వజ్రవ్యూహముం బన్నికొని యేగెను. అతని ప్రయాణమందు భూకంప మయినట్లుతోచెను. అతని యాత్రాసన్నాహధ్వని కాకసము బ్రద్దలగునట్లుండెను. ధూళిచేతనే సుదారుణమైన యింకొక నిశాకాల మేర్పడెను. రాజాభరణ మాణిక్య కాంతులచే భూమి వెలుగొంది ఆ రజోంధకార మందుగూడ సేన హాయిగ ముందునకు సాగెను. అతడు కడుదూరము దారిగడచి సూర్యోదయమగునంతకు దుస్తరమైన గంధర్వుల మహాసైన్యమును దరిసెను.

ఇది శ్రీ విష్ణుధర్మోత్తర మహాపురాణమందు ప్రథమఖండమున భరతసైన్య ప్రస్థానమను
రెండువందలయేబదితొమ్మిదవ అధ్యాయము.

## రెండువందల అరువదియవ అధ్యాయము - సంకులయుద్ధవర్ణనము

మార్కండేయ ఉవాచ : తతః ప్రవవృతే యుద్ధం తుములంలోమహర్షణమ్ ।
శూరాణాం హర్షజననం భీతానాంభయవర్ధనమ్ ॥ 1
సేనా వినిర్గమే తత్ర రజసాచ్ఛాదితం జగత్ । న ప్రజ్ఞాయత రాజేంద్ర కించిదేవసమంతతః ॥ 2
కూజతాం ధనుషాం శబ్దః శ్రూయతే తుములోమహాన్ । శంఖభేరీ నినాదశ్చ కుంజరాణాంచ బృంహితమ్ ॥ 3
హయానాం హ్రేషమాణానాం శూరాణాంచైవ గర్జతామ్ । శస్త్రాణాంపాత్యమానానాం యోధానాం కవచేష్వపి ॥ 4
తిష్ఠతిష్ఠనమే జీవన్ గంతాసి రణమూర్ధని ॥ 5
స్థితోఽస్మి ప్రహరస్వేతి కింనజానాతిమాంభవాన్ ॥ 6
ప్రహరస్వతథా ఛింధిభింధి పాతయ మాచిరమ్ ॥ ఏవమాదీని వాక్యాని శ్రూయంతే రణమూర్ధని ॥ 7
తథాతుముల సంగ్రామే వర్తమానే సుదారుణే । ప్రశశామ రజోభౌమ ముత్థితం రణశోణితైః ॥ 8
పూర్వోత్థితేన రజసా మేఘేనేవనభస్తలమ్ । వ్యాప్తం తద్విరజస్కేన తదారాజన్రణాంగణే ॥ 9
తతో యుయుధిరే వీరాః పశ్యమానాః పరస్పరమ్ । గోత్రాపదాననామాని కీర్తయంతః పునః పునః ॥ 10

అపైని యొదలుజలదరింపజేయుచు శూరుల కానందమును పిరికివాండ్రకు జడుపునించునదియునైన పోరికలనారంభమయ్యెను. అటసేనలు తరలుతరి జగము పెనుధూళింగ్రమ్ముకొనెను ఏకొంచెముందెలియబడదయ్యెను. పెనుకూతలిడువిండ్ల పెద్దరొద సంకులమై వినవచ్చెను శంఖభేరీ నినాదము ఏనుగుల బృంహితము గుఱ్ఱముల సకిలింపులు శూరుల సింహగర్జనములు యోధుల యినుప కవచములపైకి విసరివేయబడు శస్త్రములయొక్కసడి నిలునిలు నేనుబ్రతికియుండగా రణస్థలింగడచిపోలేవు నిలువబడితి నేమాత్రము కొట్టెద వోకొట్టు తమరు నన్నెఱుగరా? కొట్టుత్రెంచు పగిలించు త్వరగ దెబ్బదీయుమను నీలాటి మాటలా యుద్ధరంగమందు వినవయ్యెను అవిధముగా సుదారుణ సంకులయుద్ధ మారంభముగాగానే యయ్యెనింగురిసిన రక్తములచే నటరేగిన పెనుధూళి యణగిపోయెను. ఇంతమున్ను లేచిన రజస్సుచే (దూళిచే) గగనతలియు మబ్బుచేతంబోలె నలముకొనెను. అవిధముగా విరజస్కమైన (ధూళిలేని) యారణాంగణమందు వీరులొండురులం జక్కగ జూచుచు గోత్రములు తమయింతముందటి యశః కథలను మఱిమఱి గుర్తించుకొనుచు ప్రస్తుతించికొనుచు యుద్ధముసేసిరి.

వానరులకు రాజయ్యెను. అతడు రామునిచే హతుడయ్యె. సుగ్రీవు డభిషిక్తుం డయ్యెను. దేవతల వలన జనించిన వానరులా సుగ్రీవుని వశం వదులయిరి. వాని కొడుకంగదుడు. వాయుసూనుడు హనుమానుడు. అగ్నిసుతుడు నీలుడు, విశ్వకర్మ కొడుకు నలుడు, ధర్ముని (యముని) కుమారుడు సుషేణుడు గరుడు నాత్మజుాడు ఋషభుడు. అశ్వినీ దేవులిద్దరి కొడుకు లిద్దరు వీరులు మైందుడుద్వివిదుడును. ధూమ్రుడు జాంబవంతుడు వేగదర్శియను వానరులు మృత్యువుయొక్క (ధర్మునియొక్క) కొడుకులు మహావీరులు మృత్యువుతోడి పరాక్రమము గలవారు. గజుడు గదాక్షుడు గవయుడు శరభుడు గంధమాదనుడు నను గోలాంగూలురు (వానరులు) యముని కుమారులు. మహాబలశాలురు శ్వేతుడు జ్యోతిర్ముఖుడును భాస్కరుని కొడుకు లిద్దరు వరునిని కవగొట్టుకొడుకు. హేమకూటుడు ప్రతాపశాలి దేవతల కుమారులింకనెందరో ఋక్షగోపుచ్ఛులు వందల వేలు కపియూధాధి పతులు. భయంకర విక్రములు. ఇందరు హిమగిరి మేరువు శ్వేతము నీలము. శృంగవంపము మాల్య వంతము వింధ్య, ఋక్షవంతమునను పర్వతములందుండేవారు. సహ్య ఋషభ గంధమాదన పర్వతములందు సప్తద్వీపములందు నుండు వారు వీరందరు బ్రాహ్మణులు బలవంతులు శూరులు ధర్మపరాయనులు. నీతిశాస్త్ర కుశలురు (వినయశీలురు) సత్త్వ వంతులు దృష్టులు నీతిగ్రహణాభిలాషులు. రామభద్రునికి సహాయులు రావణునిపథాసక్తులు వీరు మునుపు హస్తివానర సంగ్రామమందు రక్తపు నదుసున గిరిశిఖరములట్టి నాగులను వేలమందిని జయించిరి. వారు రామభద్రునికి భరతునికి సహాయములయి యున్నారు అందువలన మహాత్ముడగు భరతులతో సర్వాసవిజ్ఞాన విశారదునితో సంగ్రామ శౌండునితో జతేంద్రియునితో నీవు తలపడడము. అతడు ధర్మముచే రాముని కధీనుడై యున్నాడు. ఇంద్రు మించినాడు. అమితపౌరుషశాలి.

ఇది శ్రీ విష్ణుధర్మోత్తర మహాపురాణమందు ప్రథమఖండమున వానర వంశోత్పత్తివర్ణనమను
రెండువందలయేబదిరెండవ అధ్యాయము.

## రెండువందల ఏబదిమూడవ అధ్యాయము - గజవానరయుద్ధ వర్ణనము

శైలూషఉవాచ : కింనిమిత్త మభూద్వైరం వానరాణాంతుకుంజరైః కీదృశంచా భవద్యుద్ధంతన్మమాచక్ష్వ పృచ్ఛతః ॥

నాడాయనఉవాచ : వనాష్టకం కరందాణాం యన్మయోక్తం పురాతవ ।
తదుక్తం భారతాద్వర్షా ద్భాగస్యతే నవమస్యచ ॥ 2
ద్వీపేషు రాజన్సర్వేషు వర్షేషుచ పృథక్ పృథక్ । వనేషు నివసంత్యేతే కరీంద్రా వానరాస్తథా ॥ 3
రక్షంతివానరాస్తత్ర కాననేషుచ శాఖినః । పాతయంతి ద్రుమాన్నాగా పీలయైవజనాధిప ॥ 4
ద్రుమేషు పాత్యమానేషు కుంజరాణాంతరస్వినామ్ । వానరాః కదనంచక్రుః క్రోధావిష్టాః పునః పునః ॥ 5
హన్య మానేషు నాగేషు కరీంద్రాశ్చపవీముఖాన్ । పాతయంతి మహారాజ శతశోఽథసహస్రశః ॥ 6
ఏవం ప్రవృద్ధేవైరేతు వానరైః కుంజరైస్తథా । రాజ్ఞేనివేదితాంగ త్వాఋక్షైః రావణయోస్తథా ॥ 7
తతస్తౌ పార్థివౌ క్రుద్ధౌ చక్రతుర్యత్న ముత్తమమ్ । వానరాస్తు మహాకాయా వీరాః పరమరంహసః ॥ 8
ఋక్షాశ్చైవ సగోపుచ్ఛాః కిష్కింధాం పునరాగతాః । ఐరావణాజ్ఞయానాగాః సపక్షాః పర్వతోత్తమాః ॥ 9
ప్రాచ్యాం వనమథా జగ్ముః సర్వతః పృధివీపతే । బలార్ణవావు భౌతుభ్యాక్రోధావిష్టౌ పరస్పరమ్ ॥ 10
అంతర్వేదింతదాతౌతు జగ్మతుర్బలదర్పితౌ । తతః ప్రావర్తతరణం ఘోరరూపం భయానకమ్ ॥ 11
భూమౌచైవాంతరిక్షేచ నాగానాం సహవానరైః । ద్రుమప్రహారాభిహతాః కుంజరావాన రోత్తమైః ॥ 12
పతంతోగగనాద్భూమించాలయం తిముహుర్మహషిః । ఖురేషువాన రంగృహ్య ద్వానాగౌగగనేతథా ॥ 13

పాతయంతిమహా రాజభింధంతి దశనైస్తథా । మమంథుర వరేపాదై ర్దేహేనాతాడ యంస్తథా ॥ 14
వృక్షాన్కరై రథోన్మూల్య చుక్షుభుర్యేనవానరాః । ఐరావణేన నిహతాః కోటిశస్తత్రవానరాః ॥ 15
పద్మేన సుప్రతీకేన వామనేనాంజనేనచ । కుముదేనచనీలేన పుష్పదంతేనచాప్యథ ॥ 16
తేషామన్వయ సంభూతైస్తథై వాన్యైశ్చ కుంజరైః । భద్రేణచాథమందేన మృగేణచ మహీపతే ॥ 17
భద్రమందేణ మిశ్రేణసార్వభౌమేన వేధసా । రాజ్ఞాసుమనసారాజం స్తథైవచ సువర్చసా ॥ 18
వలాహకేన మత్తేన భీమేనేందీవరేణచ । హేమకూటేన కూటేన శంఖేన నిషధేనచ ॥ 19
శ్వేతేనరాజనర్త్తేన కాంచనేనాంగ సుప్రజ । విరూపాక్షేణ చోగ్రేణ షద్దంతేనాసితేనచ ॥ 20
చతుర్దంతేన యక్షేణరక్షసా భీమమాలినా । ఋక్షేణ వానరేంద్రేణ కోటేశః కుంజరాహతాః ॥ 21
శరభేణగవాక్షేణ తథాకనకబింధునా । ఋక్షరాజేన ధూమ్రేణ తథా జాంబవతాన్నృప ॥ 22
సుషేణ దధివక్త్రాభ్యాం తథా కేసరిణారణే । రణచండేనవీరేణ వానరేంద్రేణజానునా ॥ 23
తథా శతబలిర్యశ్చతే నాపికదనం కృతమ్ । పనసేనవిశాతేన గజేన గవయేనచ ॥ 24
హేమకూటేన విభునాభాను రోమ్ణానిశాభృతా । గంధమాదన నామ్నాచ విజయేన జయేనచ ॥ 25
కుముదేనాథ పద్మేన కనకాక్షేణ శంభునా । ఇత్యేవంద్రుశ్య మానేషు వానరేషు గజేషుచ ॥ 26
చచాలమేదినీ రాజంస్తస్మిన్కాలేముహుర్ముహుః । ఖస్థైర్భూస్థైశ్చ విక్రాంతైర్వానరైః కుంజరైస్తథా ॥ 27
హతైశ్చహన్య మానైశ్చ ఘోరమాయోధనంబభౌ । శరీరైర్యత్ర సంరుద్ధాః స్రవంతోరుధిరాపగాః ॥ 28

శైలూషుడేనిమిత్తమున కపి కుంజరములకు ఘోరయ్యే నది యెట్లయ్యే నాకు వచింపుమన నాడాయనుండనియె గజేంద్ర నివాస వనములెనిమిదని యింతమున్ను దెలిపితిని. అదంతయు భారతవర్షమందు తొమ్మిదవ భాగమైయున్నది. అన్నిద్వీపములందు అన్నివర్షములందు వేర్వేర నీ కపీంద్రులు కరీంద్రులను నా యా వనములందు వసించుచున్నారు. ఆందడవులలోని చెట్లన వానరములు గాపాడుచుండును. కుంజరము లవలీలగ గూల్చుచుండును. అట్లు చెట్లగూల్చుచుండ వానరములు కోపావేశముచెంది వానితో యుద్ధ మొనర్చుచుండెను. ఇట్లారెండుజాతులకు ఘోరకదనము ప్రవృద్ధమైనంత వానరములు చని తమరాజగు ఋక్షునికి కుంజరములరిగి తమరాజగు నైరావణునకు జెప్పుకొనిరి. దాన నాయిద్దరు రాజులు కుపితులై పెద్ద ప్రయత్నము గావించిరి. మహాకాయులు వానరములు వీరులు మహావేగులు ఋక్షములు (ఎలుగుబంట్లు) గోపుచ్ఛములతో కిష్కింధకు మరలివచ్చిరి. ఐరావణాజ్ఞచే దమపక్షముతో దూర్పునందున్న వనముకుంజనెను. ఇట్లాయుభయ బలసముద్రములు పరస్పర క్రోధావేశమంది సంక్షోభించి బలదర్పితు లయ్యుద్ధరు నంతర్వేదికిం జనిరి. అటుపై భూమిపై నంతరిక్షమున కుంజర వానరముల కతిభయంకరమైన సంగరమారంభమయ్యెను. వానరులచే నేనుగులు తరువులం గొట్టబడి కూలుచు నెడనెడ భూమిం గంపింప జేసినవి. రెండేనుగులు పాదము దెక్కల నొకవానరము నెత్తి నింగికెగరవేయుచు గోరలచే జీల్చెను. కొన్ని పాదములచే నేలరాచినవి. దేహములం గెట్టినవి. తొండములం జెట్లం బెరకి పైబడి బాదినవి. అంతట కపులు సంక్షోభించినవి. ఐరావణుడెందరినో కోట్లకొలది కోతులం గూల్చెను. అట్లే కడమ వానరరాజులేద్వురు నంతులేని కపిసంఘముల హతమార్చెను. వారి కాలమునకుచెందిన భద్రాది కుగిజరయూధపతులు ధూమ్ర జాంశవ తుషేణ దధిముఖ కేసరు రణచండాదులగు ఋక్ష వానర సైన్యాధిపతులు కలియబడి ప్రచండ కదనమొనరించిరి. అప్పుడు భూమి మటిమటి కంపించెను. స్నస్థులై భూమిపైనిలిచిన విక్రమ వంతులను వానరములతో కుంజరములతోడను చచ్చిన చంపబడుచున్న వారిచేతను నా రణమతి ఘోరమయ్యెను. ఆ యిరుపక్షములవారి శరీరముల నుండి జాల్వారి రక్త నదులు ప్రవహించెను.

వానరాణాంగజానాంచ మహాశైలోపమైర్నృప । తస్మింస్తథా విధేయుద్ధే గజవానర సంక్షయే ॥ 29
ఆజగామాథతం దేశం స్వయం దేవః శ్శతక్రతుః । అభ్యేత్య వారయామాసవానరాంశ్చైవ కుంజరాన్ ॥ 30